# పరిచయము

పండితకవిశిరోమణులును, శతావధానులును, దివ్యవాణీసంపాదకులునైన శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రుల వారి కృతివతంసమునకు నేను బరిచయము వ్రాయఁబూనుట దివాకరునిఁ గరదీపికతోఁ జూపుటవోలెఁ బరిహాసాస్పదముగా నుండునని యెఱింగియు నాయెడఁగల వాత్సల్యవిశేషమున శ్రీవారు కావించిన యాజ్ఞ దురుల్లంఘ్యమగుటచే నీసాహసమునకుఁ గడఁగితిని. నిజమునకుఁ బాండిత్యకవిత్వాద్వైతరాజ్యపట్టభద్రులైన శ్రీశాస్త్రులవారికావ్యమున కెవ్వరైనఁ బరిచయము వ్రాయవలసిన యక్కఱయే వ్యర్థము. మఱియక్కఱమాలిన యీపని యేల చేయుచుంటినన భక్తిరసబంధురమైన యీమహాపురాణమును జదువఁగాఁగలిగిన యానందపారవశ్యముచేత కార్యాచరణమున నధికారానధికారముల నరయఁజాలమి పరవశులకుఁ బ్రకృతిసిద్ధలక్షణము గదా !

ఈగర్గభాగవతము సంస్కృతమున గర్గమునికృతమైనమహాపురాణమున కాంధ్రీకరణము. తెలుఁగున మువ్విధములైన పరివర్తనప్రకారములు కలవు. అందు మార్పుచేర్పులతోఁగూడినకవిత్రయమువారిపద్ధతిని గథానువాదమనియు, నాతిస్వతంత్రమును నాతిమూలమునైన శ్రీనాథుని పద్ధతిని భావానువాదమనియు, మూలాతిసన్నిహితమైన యాధునికుల నాటకానువాదపద్ధతిని బదానువాదమనియుఁ జేర్కొనవచ్చును. శ్రీశాస్త్రులవారియనువాద మీమూఁడింటిలో నడిమిపద్ధతి నవలంబించి సరసమనోహరముగా సాగిపోయినది. కావ్యమును జదువుచున్నప్పుడు సర్వథా యిది స్వతంత్రరచనయే యనిపించునుగాని యనువాదమేమో యనుశంక గొలుపదు. మూలమును సంపూర్ణస్వాయత్తమొనరించుకొని యిట్లు మధురమధురముగా రచన సాగించుట యనన్యసాధారణమైన శ్రీశాస్త్రుల వారి ప్రతిభావైశిష్ట్యమునకుఁ దార్కాణ.

నవఖండమండితమైన యీభాగవత ప్రపంచమున కాదిని గర్గభాగవత మాహాత్మ్యమును నంతమున నశ్వమేధఖండమును జేర్పఁబడినవి. వ్యాసరచితమైన విష్ణుభాగవతమునందలి దశమస్కంధములోని వస్తువే యీగర్గభాగవతమున మొదటి నాలుగైదు ఖండములలో విస్తరింపఁబడియున్నది. కృష్ణసంహృతులైన రాక్షసుల పూర్వజన్మవృత్తాంతములన్నియు నిందు లెస్సగా వివరింపఁబడినవి. ఇందలిచివరి మూఁడు ఖండములలోఁగల కథయు నేతత్కథాసౌధమునకు మూలస్తంభమని చెప్పఁదగిన రాధికావృత్తాంతమును గొంత నూతనములైనవి. రాధాదేవి వృత్తాంతము వ్యాసరచితమైన భాగవతమున లేనేలేదు. తరువాత భక్తులు రాధాకృష్ణుల ప్రణయవృత్తాంతమును వస్తువుగా గ్రహించి శృంగారరసవారాన్నిధులని చెప్పఁదగిన మంజుల కావ్యముల నెన్నింటినో రచించియుండిరి. ఆ ప్రణయముయొక్క ర

మహాస్థలి గర్భభాగస్థితమున రసాదంచితముగాఁ బ్రపంచింపఁబడియున్నది. శ్రీకృష్ణ బాలక్రీడా వర్ణన పూర్ణములైన గోలోక బృందావన ఖండములను దివ్య ప్రణయభాసితమైన యీకథ యింతింతనరానివన్నె చేకూర్చుచున్నది.

మథురా ఖండమునందలి కథ గోవర్ధనోద్ధరణావృత్తాంతము, మాధుర్య ఖండము, గోపికా శ్రీకృష్ణుల మధురశృంగారముతోఁ గూడి ఖండశర్కరవోలె నాస్వాదించువారలందఱి జన్మలలరించుచు నామసార్థక్యము వహించుచున్నది. ఇందు భక్తిభావపరాకాష్ఠ నొంది శ్రీకృష్ణుని హృదయపూర్వకముగాఁ బ్రేమించిన పలువురు గోపికల యుపాఖ్యానములు వర్ణింపఁబడియున్నవి. గోపికా కృష్ణుల ప్రణయమును గూర్చి యిచ్చట నొక్కమాట చెప్పెదను. అది స్త్రీ పుంససంయోగోద్భవమును దుచ్ఛకామప్రేరితమును శారీరకసౌఖ్యస్పృహాసాధనమునగు నీచశృంగారము కాదు. అది మోక్షకామమునకు సంబంధించినది. భరతముని నాట్యశాస్త్రమున.

ధర్మకామోఽర్థకామశ్చ మోక్షకామ స్తథైవచ
స్త్రీ పుంసయో స్తు సంయోగో యః కామః సతు సంస్కృతః

అని నాలుగు పురుషార్థములకును సంబంధించిన కామమును వర్ణించెను. మహాభారతాశ్వమేధ పర్వములోఁ గాముఁడు తన్నుఁ గూర్చి చెప్పుకొనిన యీక్రింది శ్లోకమును బరికించినచో నీ విషయము మఱింత స్పష్టముగా గోచరించును.

యో మాం ప్రయతతే హన్తుం మోక్ష మాస్థాయ పండితః
తస్య మోక్షరతిస్థస్య నృత్యామి చ హసామిచ

మోక్షము నుద్దేశించి నన్నుఁ జంపుటకు యత్నించు పండితునకుఁ గూడ రతి లేకపోలేదు. అది మోక్ష సంబంధియైనది. అందుచే నట్టి వానిని జూచి నేను నవ్వుచు నాట్యముచేయుచుందునని యీశ్లోకము నందలి యర్థము. ఈ మోక్షరతియే భరతుఁడు చెప్పిన మోక్షకామము. దీనికి సంబంధించిన శృంగారమునకును లౌకికమైన శృంగారమునకును స్వర్గమర్త్యములకున్నంత యంతరమున్నది. బ్రహ్మభావనతోఁ దుల్యమని చెప్పఁదగిన యీ మోక్షరతిస్థాయికమైన శృంగారమే భక్తి శృంగారము లేక మధుర (ఉజ్జ్వల) భక్తియని చెప్పఁబడుచున్నది. ఇది స్త్రీలకును భగవంతునికినినడుమ కంటె బురుషులకును భగవంతునికి నడుమ నున్నప్పుడెంతో నిర్మలమై భాసించును. చైతన్యాదులిట్టి భావముతోడనే భగవంతుని ధ్యానించి మోక్షసామ్రాజ్యమును జూఱగొనియుండిరి. మాధుర్య ఖండమున దివ్యమైన యిట్టి మధురభక్తి ప్రత్యుపాఖ్యానమునందును బరిపూర్ణమై ప్రకాశించుచున్నది.

కంసప్రేరితుఁడైన యక్రూరుఁడు కృష్ణబలరాములను మధురానగరమునకుఁ గొనిపోవుటయు, గోపికలవిరహావేదనయుఁ, గృష్ణుఁ డుద్ధవునిచే ముందుగా గోపికలకు

సందేశమునుబంపుటయు మధురాఖండమునందలికథాభాగములు మధుసూదనసరస్వతీ భక్తిరసాయనమునఁ బేర్కొన్న పదునొకండు భూమికలలోఁ దుదివాని నధిరోహించిన వారగుటచే గోపికలు శ్రీకృష్ణు విరహము నొక్కక్షణకాలమైన సహింపలేని స్థితిలో నుండిరి. భక్తిభావ పూరితములైన యీ వేతలు ప్రణయతత్త్వ మెంచు ద్వారకా ఖండమున జరాసంధుఁడు ద్వారకపై దండెత్తుటయు, శ్రీకృష్ణ బలరాముల వివాహములును, దీర్థ మాహాత్మ్యములును వర్ణింపఁబడినవి. ఇందలి రుక్మిణీపరిణయఘట్టము భాగవతమునందలి దానివలెనే సరసమనోహరమై యలరారుచున్నది. ఇవి సర్వవిధములఁ బోతరాజు రచనకీడై శ్రీశాస్త్రులవారి కవితా పాకల్యమును సహస్రవిధములఁ జాటుచున్నది. "మూర్తంబెల్లిక విగ్రహంబుగదినెన్" "ధరణీదేవుఁడు సాగెనోపథమునన్ దైవాత్మనో" మున్నగునందలి పద్యములు కొన్ని పోతన్నగారి పద్యములను స్మృతిపథమునకుఁ దెచ్చుచున్నవి.

ఉగ్రసేనుఁడు రాజసూయముచేయు సందర్భమునఁ బ్రద్యుమ్నుఁడు నానాదేశముల రాజుల జయించి వచ్చుట విశ్వజిత్ఖండమున వర్ణింపఁబడినది. బలభద్రఖండమున రేవతీ బలరాముల వివాహమును, రేవతీ పూర్వజన్మ వృత్తాంతమును వివరింపఁబడినవి. వ్యాసుఁడుగ్రసేనునకుఁ బరమార్థవిషయములను బోధించుటమున్నగు విజ్ఞాస విషయములతోఁ గూడి విజ్ఞానఖండము సార్థకాభిఖ్య మగుచున్నది.

దశమమైనయశ్వమేధఖండమునఁ బారిజాతాపహరణవృత్తాంతమును ఉగ్రసేనుఁ డశ్వమేధయాగక్రియాచరణదీక్షితుఁడై మేధ్యాశ్వమును విడువ ననిరుద్ధకుమారుఁడు దానివెంటనంటి పలుదేశములరాజుల జయించి సవిజయుఁడై తిరిగివచ్చుటయు,రమణీయముగా వర్ణింపఁబడినవి. ఇందలి జైత్రయాత్రయు విశ్వజిత్ఖండమునందలి విజయయాత్రయు జైమిని భారతమునందలి యశ్వమేధవృత్తాంతమునకు వన్నెలుదీర్చుచున్నవి.

ఈగర్గభాగవతమునఁ బ్రసక్తానుప్రసక్తిగాఁ బెక్కువాఖ్యానములు వక్కాణింపఁబడినవి. అవియన్నియుఁ బ్రసన్నమైన కథాకథనముతోడను,ఔచితీగర్భితములైన కథాసన్నివేశములతోడనుగూడ పఠితల కానందపారవశ్యము కలిగించుటలో సందేహము లేదు. బృందావనఖండమునందలి రాధాగోపదేవులసంభాషణమును మధురాఖండమునం దక్రూరుఁడు బలరామకృష్ణుల మధురానగరమునకుఁ గొనివచ్చిన వృత్తాంతమును, ఉద్ధవసందేశఘట్టమును. రుక్మిణీకల్యాణవర్ణనమును గంభీరభావశేవధులై శ్రీశాస్త్రులవారి కవితాప్రతిభ కెత్తిన వైజయంతికలుగా నలరారుచున్నవి. గోపదేవి రాధను బరీక్షించుటకై శ్రీకృష్ణునినిరసించుచుఁ బల్కినపల్కులు కాళిదాసుని కుమారసంభవమునందలి కపటబ్రహ్మచారిసంభాషణమునకుఁ బ్రతిరూపముగా నున్నవి. అక్రూరుఁడు యమునలో బలరామకృష్ణుల దర్శించినఘట్టము వ్యంగ

నై భావోపేతమై అక్రూరుని నిరుపమాన భక్తికిని అప్పయ్యశాస్త్రులవారి రసవద్రచనా పాటవమునకును నిదర్శనముగా నున్నది. ఉద్ధవ సందేశఘట్ట మొకసిద్ధసుధా ప్రవాహము. అం దోలలాడినపఠితల మానసములు కావ్యాంతరపఠనవై ముఖ్యము ప్రదర్శించినచో విస్మయించుట వలసిన యక్కఱయుండదు.

శ్రీ శాస్త్రులవారి కవితాశైలిని గూర్చి యొండురెండు మాటలు చెప్పి యింక విరమించెదను. గ్రంథమునం దాద్యంతము సరళ సుందరమైన పురాణశైలి తాండవించుచున్నది. అరకిక్షతి కాని యనన్వయక్లిష్టత కాని యెచ్చటను గానరాదు. ఊహించిన భావమును సుస్పష్టరేఖతోఁ దీర్చి దిద్దుట యందు శాస్త్రులవారు కృతహస్తులు. పద్యములన్నియు రసమునకువోలె ధారాశుద్ధికిని నిలయములై యెచ్చటను గుంటువడక చదివినకొలందిఁ జవులూరించుచున్నవి. అనవసరమైన శబ్దాడంబరము లేక యలంతి యలంతి మాటలతోఁ గూడి కావ్యమంతయు సర్వజనసుబోధమై భక్తిసుధారసమును గ్రోలనెంచు యాంధ్రు లందఱికిని నాప్యాయత చేకూర్చుచున్నది. శ్రీ శాస్త్రులవారు తత్సమపదములతోవలెనే యచ్చ తెలుఁగు పదములతోఁగూడ నిండియుండు పద్యము లనేకములు వ్రాసి తదుభయశైలీవిరచనపై దక్షతను ప్రకటించియున్నారు. 128 వ పుటలోని "తేఁటుల దాఁటు నెక్కుడుల, దేనియలొల్కెడి మోవి, బంగరున్ మీఱెడిమెల్ల" లను పద్యమువంటి తెనుఁగు పదముల కూర్పుతోఁ గూడిన పద్యముక్తామణులీకావ్యవారాశి నెచ్చటఁజూచిన నచ్చటనే తోఁచి ముచ్చట గొల్పుచున్నవి. సరళమైన సంస్కృతాక్షరరచన కీనుట్టమైన చక్కని దృష్టాంతమే యగును. శ్రీశాస్త్రులవా రలంకారములకై యెచ్చటను బ్రయత్నము చేయరు. అయ్యు శ్రవణపేయములైన శబ్దాలంకారము లప్రయత్నముగా జాలువాఱి యచ్చటచ్చటఁ బద్యముల కసన్యసామాన్యమైన సొంపు చేకూర్చుచున్నవి. (పుట 131 లలితయు రాధఁజేరి" ఇట్టుల చెప్పఁగా సారసిజేక్షణఁడున్) 205 వపుటలోని సీసము (అభ్రచయంబులో) నందలి క్రమాలంకార మత్యంత సుందరముగా నున్నది. 256 వ పుటలోని "కమలేశుఁ గనఁగట్టికన్నులు కన్నులే" వంటి పద్యములు పోతనగారిశైలిని బుడికిపుచ్చుకొనుచున్నవి. జాతీయ పదము లీకావ్యమున "సింధుగల విందువలేను" సందేహములేక "యొందెందు నెద్దచూచిన నందందే" చూపట్టుచు నానందము చేకూర్చుచున్న వి. 293 వపుటయందలి "నాయనుఁ దేవకీపతికి" అనుపద్యమునందలి "అబ్బాయికిమాకుమారునికి భద్రమె" యను ప్రయోగమెంతయు ముద్దులొల్కుచునందుని వాత్సల్యపూరిత హృదయమును నొక్కుమ్మడి గ్రుమ్మరించుచున్నది. ఇట్లీకావ్యమంతయు శ్రీశాస్త్రులవారిప్రతిభాపాండిత్యముల కాలవాలమై వారు చిరకాలము కావించిన కవితాతపస్సునకుఁ గ్రముఫలమై యొప్పారుచున్నది. ఈవిధముగా నెంతవ్రాసినను శ్రీశాస్త్రుల వారి కవితాకళకు

సమగ్రవర్ణనము కాఁజాలదు. ఇంకను నేదో వ్రాయఁగడంగి నా యసమర్థతను వెలి బుచ్చుకొనక యీకావ్యమునందలి రసము నాస్వాదించి యానందించు భాగ్యమును సహృదయులైన పాఠకోత్తములకే విడిచి యింతతో విరమించుచున్నాను.

ఇట్లు
దివాకర్ల వేంకటావధాని
ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్రభాషోపన్యాసకుఁడు.

హైద్రాబాదు
3-1-1954

శుభమస్తు శ్రీరస్తు అవిఘ్నమస్తు

శ్రీ శివాయగురవేనమః

# గర్గభాగవత పీఠిక

గర్గభాగవతమునకు మూలము సంస్కృతమున గర్గసంహిత- వివిధపురాణాదులయందు విచ్ఛిన్న మౌక్తికములవలె పడియున్న ధర్మ విశేషములను సోదాహరణముగ నుపాఖ్యానములతో కూర్చి రచించిన మౌక్తికహారములవంటి గ్రంథరాజములను సంహితలందురు. శైవధర్మములను సూత సంహిత క్రోడీకరించి తెల్పు విధముగా వైష్ణవ ధర్మములను గర్గ సంహిత క్రోడీకరించి తెల్పుచున్నది. ఇట్టి గ్రంథములు లోకశ్రేయస్సునకు హమ్యసవియునగుటచే సంహితలనబడుట యుచితమే. భారత భాగవతము లందును హరివంశాదులయందును ఆయా సందర్భములయందు ప్రసంగవశమున వర్ణింపబడిన శ్రీకృష్ణచరితము లీగ్రంథమందొక్కచో పొందుపఱుపబడినవి. అచ్చటచ్చట కలుగు సందేహములకు వ్యాఖ్యానరూపమున సమాధానములీయబడినవి. రాధామాధవుల ఉపాసనావిశేషములు నిచట సంగ్రహింపబడినవి. కనుక నీగ్రంథరాజము కృష్ణభక్తుల కొక కామధేనువు,

ఆంధ్రమున శ్రీకృష్ణచరితమును వర్ణించుగ్రంథములలో. పోతనార్యుని లేఖిని నుండి అమృతప్రవాహములొలికించిన శ్రీమదాంధ్రమహాభాగవత ముత్తమము యినది. విశ్వజనీనమైనది. అట్టిగ్రంథమునకు వ్యాఖ్యానరూపమగు నీగ్రంథమునకును గర్గభాగవతమని నామకరణమొనర్చుట భావ్యమని ఆంధ్రీకర్త తలచి యుండును.

నామమునుబట్టియే ఈగ్రంథము గర్గప్రణీతమని తెలియుచున్నది. గర్గమహర్షి శ్రీకృష్ణభగవానునకు పురోహితుడు, గురువు, భక్తుడునై శ్రీకృష్ణభగవానుడు శ్రీమహావిష్ణుని పరిపూర్ణావతారమని గ్రహించి యతనిలీలలను ప్రభావములను కన్నులార గాంచి యానందించిన మహాత్ముడు. కనుకనే యతనికి శ్రీకృష్ణచరితముల నెన్నిటిని విన్నను తృప్తికలుగలేదు. పరిపూర్ణముగ భగవానునిచరితముల సంగ్రహించి రచించి ప్రకటించి తనజన్మమును సార్థకమొనరించుకొనవలయునని కోరిక పొడమినది. నారదునిచే సూత్రప్రాయముగ తాను వినిన శ్రీరాధారమణ లీలావిలాసములు మోక్షపదంబులని గ్రహించి నారదప్రేరితుడై గర్గమహర్షి గర్గాచలంబున చిరకాలంబు తపంబొనరించి నిశ్చలస్వాంతముననను దివ్యదర్శనంబునను తాను వినినవియు కనినవియు యథార్థంబులునగు శ్రీకృష్ణలీలల నారదబహుళాశ్వసంవాదరూపంబున సంగ్రహించి గర్గసంహితయనుపేర రచించి పవిత్రతమమగు నైమిశారణ్యమున శౌనకమహర్షికిం బ్రకటించెనట.

## నాయకుఁ డుత్తమశ్లోకుఁడగుట—

గుణము లాత్మాశ్రయములు. గుణములులేక గుణియు లేఁడు. గుణిలేక గుణములు నుండవు. గుణగుణు లన్యోన్యాశ్రయములు. సద్గుణముల వర్ణించునప్పుడు గుణియగు నాయకవర్ణన మనివార్యము. అట్టినాయకు డుత్తమశ్లోకుఁడయినచో కవికిని కావ్యమునకును శ్రోతలకును శ్రేయోబాహుళ్యము కల్గును. కనుకనే కావ్యమున కుత్తమశ్లోకుండు నాయకుఁడుగా లభించుట బంగారమునకు పరిమళ మబ్బుట వంటిదని పూర్వాలంకారికు లనిరి. పరిపూర్ణతమావతరుడగు శ్రీకృష్ణభగవానుఁడు నాయకుఁడగుటచేతనే గర్గసంహిత చిరస్థాయి అయినది.

కావ్యప్రయోజనము లెన్నియున్నను కాంతాసమ్మితోపదేశమే దాని పరమప్రయోజనము. కాంతసమ్మితోపదేశమను పదముచేతనే కావ్యమందు రసవికాసము, ధర్మోపదేశము, తత్తదుచిత భాగముల పొంది యుండవలయునని తెలియుచున్నది. రసోన్మీలనమునకు కవిప్రతిభావిశేషములును ధర్మోపదేశమునకు నాయకగుణ విశేషములును తోడ్పడును. కవి తనప్రతిభావిశేషమున వర్ణించిన రసవిశేషము నాయకపాత్రగుణవిశేషములకు తగినదై యున్నప్పుడే శోభించును. అట్లుకానిచో నాయకుని గుణశీలాది వర్ణనమునకో రసమునకో భంగముకల్గును.

## పురాణ గ్రంథముల విశిష్టత—

ఉత్తమ పాత్రమును సృష్టించుట తదుచితరసము నున్మీలించుట అనునవి కవిప్రతిభావిశేషములకు నికషోపలములని తేలినది. అట్టి ప్రయత్నమున కృతార్థుడైన యాతడే కవి. ఆతడే మహర్షి ఆతడే ధన్యుడు. మహర్షులగు వ్యాసవాల్మీకాదులిట్టి ప్రయత్నమున కృతార్థులైరి. వారు తీర్చిదిద్దిన పాత్రములే ధర్మజుడు, రాముడు, మొదలగునవి. తత్తదుచిత రసభావాదులతో శోభిల్లు ప్రబంధ విశేషములే భారత రామాయణాదులు. అట్టి ప్రయత్నమున కృతార్థప్రాయములగుటచేతనే తద్గ్రంథముల చిరస్థాయిత.

## రామాదులు చారిత్రక పాత్రములే—

ఇంత మాత్రమున ధర్మజుడు శ్రీరాముడు మొదలగు పాత్రములు కవికల్పితములనియు చారిత్రకములుకావనియు సందేహింపరాదు. చారిత్రకములగు నాపాత్రములనే సారస్వతమున నెంత సమర్థతతో చిత్రింపకల్గిరా! అనియే మన వింత. కవి యసమర్థుడయినచో బ్రహ్మసృష్టిని వికృత మొనర్చును. సమర్థుడైనచో నాసృష్టినే అవికలముగ చిత్రించును. సమర్థతముడగుచో నాసృష్టికే మెఱుగులు దిద్దును. ధర్మజుడు రాముడు మొదలగు చారిత్రక పాత్రములకు మెఱుగులు దిద్దుటచేతనే

గదా ఆ పాత్రములు శాశ్వతములు నాకవులులోకమున నాదర్శప్రాయములై సుప్రతిష్ఠితములునై యున్నవి. ఇట్టి సృష్టిఅనితరసాధ్యమని తలచియే విమర్శకులు "ఏకో భూన్నలినాత్ పరశ్చ పులినాత్ వల్మీకత శ్చాపరః" అనివ్యాసవాల్మీకాదులకు జోహారు లర్పించియున్నారు.

## శ్రీ కృష్ణ పాత్రము—లోకోత్తరము.

ధర్మజరామాది పాత్రము లాయాకవుల దృక్పథముతో చూచువారికి ఆదర్శప్రాయములైనను, తద్భిన్నదృక్పథముతో చూచువారికి పరిపూర్ణ చిత్రణముగ కన్పింపవు. రసోచిత పాత్రమును పాత్రోచితరసమునుసృష్టించుటయే చరితార్థతయగునేని సర్వరసోచితపాత్రమును, తత్పాత్రోచిత సర్వరసములను సృష్టించిన కవి తానెంతగ కృతార్థతకాంచునో! "ఒక మాటయు ఒక బాణము ఒక భార్యయు రాముని బిరుదమగుట లోకోత్తరవిషయము. దీనిచే నతడు సత్యసంధుడనియు నేకవీరుడనియు నేకపత్నీవ్రతుడనియు నతని సద్గుణములు ప్రకటితములగుచున్నవి. అట్టిపాత్రములకు తగినట్లుగా శృంగారవీరముల వర్ణింపవచ్చునుగాని రామునియందు శ్రీకృష్ణునియందువలె దక్షిణ నాయకత్వ ప్రయుక్త శృంగారమునుగాని, మిత్రులతో పరిహాసములాడుచు నసత్యములపల్కుచు విహరించు హాస్యరసమునుగాని వర్ణింప నెంచినకవి కృతార్థుడుకాజాలడుగదా! అటులనే ధర్మజుని రౌద్రమునుగాని అసత్యవచనప్రయుక్త హాస్యమునుగాని వర్ణింపతలచిన కవియు కృతార్థుడుకాజాలడు. కాని శ్రీకృష్ణుని పాత్ర మట్టిదికాదు. కవులపాలిటి కల్పవృక్షము. సర్వరసములను వర్షించును. కవికి సామర్థ్యముండవలయునే కాని శ్రీకృష్ణునియందు పదునాఱువేల భార్యలతో వర్ణించినది వర్ణింపకుండశృంగారమును వర్ణించియు నాతడు బ్రహ్మచారియని నిరూపింపవచ్చును. సర్వసంపదలతో తులతూగుచున్నను మహాజ్ఞానియనియు విరక్తుడనియు నిరూపింపగలడు. ఏకవీరుడై కంసాదుల సంహరించినట్లుగాని పిరికిపందయై కాలయవనున కోడి పలుమారులు పాఱినట్లుగానివర్ణింపఁగలడు,భీష్మునిపై నుఱుకునప్పటిరౌద్రమువలెనేగీతోపదేశసమయమందలి శాంతము నతనియందు శోభించును, మన్నుతినునప్పటి భీభత్సమేకాక శిఖిపింఛధారియై వేణువు నూదునప్పటి శృంగారమును శోభించును. గోవర్ధనధారియగునప్పటి యద్భుతమును యాదవకులనాశమందలి కరుణములును శ్రీకృష్ణపాత్రమున కలంకారములే—రసములు తమ పరస్పర వైరుధ్యముల పరిహరించి మున్యాశ్రమముల విరుద్ధసత్వములవలె శ్రీకృష్ణ పాత్రమున పరస్పరపోషణమున శోభిల్లుచున్నవి. రసములేకాదు గుణాగుణములునతనిని సోదరభావము నలంకరించుచున్నవి. ఇట్లు రసములును గుణములును పరస్పర విరోధమును పరిత్యజించి శోభిల్లవలయుననిన శ్రీకృష్ణుడు గుణాతీతుఁడై యుండవలయును. అట్టివాడే సిద్ధుడు కనుకనే శ్రీకృష్ణచరితలు కృష్ణలీలలందురు. సిద్ధులకును రససిద్ధులకునుగూడ నీపాత్ర

అద్భుతమును కూర్చెను. సారస్వత దృష్టితో చూచిన నిది యొక అపూర్వసృష్టి. కనుకనే ఆసేతుహిమాచలపర్యంతము సర్వసారస్వతములయందును శ్రీకృష్ణభగవానున కున్నవ్యాప్తి తదితరులకు లేదు.

చారిత్రికదృష్టితో పరిశీలించినను శ్రీకృష్ణభగవానుఁడొకయద్భుతవ్యక్తియే. పరశురాము డొకమహావీరుడు. కాని కోపిష్ఠుడు. శ్రీరాముడును మహావీరుడే. ధార్మికుడును ధీరుడును. బలరాముడును వీరుడే కాని ధీరోద్ధతుడు. బుద్ధభగవానుడు దయామయుడు. వ్యాసుడు. విజ్ఞాననిధి. వాల్మీకి, కవి. దత్తాత్రేయు డొక జ్ఞాని. ఘేరండాదులు మహాయోగులు. పరమేశ్వరునికళ వీరియం దొక్కవిధము గనే ప్రసరించినది. ఆవిధముగనే వారు లోకసేవచేసి యట్టివీరులుగనే ప్రసిద్ధిచెందిరి. శ్రీకృష్ణభగవాను డట్లుకాక వీరుడు, ధీరుడు, దయామయుడు, విజ్ఞాననిధి, జ్ఞాని, యోగి. ఇట్లు పలువిధముల నతనియందు పరమేశ్వరకళ ప్రసరించుటచేతనే యతడు పరిపూర్ణతమావతారుడని ప్రసిద్ధి. ఇట్టి వివిధ విజ్ఞానములం దాతనికి ప్రవేశమేకాక పరిపూర్ణతయు కలదు, కనుకనే అట్టి మహామహు లందఱికిని ఆచార్యస్థాన మలంకరించెను. అంతియేకాక ఆయా ప్రభావముల నాచరణయందునిచి చూపెను. పరీక్షిత్తును జీవింపచేయుట సాందీపునిపుత్రులను లోకాంతరమునుండి తెచ్చుట గోవర్ధనము నెత్తి యాదవుల రక్షించుట కంసాదిమహావీరుల సంహరించుట పారిజాతమును భూలోకమునకు తెచ్చుట కుచేలునకు సంపదలిచ్చుట మొదలగునవి భగవానుని ప్రభావమునకు నిదర్శనములు, కౌరవులితో రాయబారములు నడుపుటచేతను సమయోచితముగ పాండవులకుపాయముల తెల్పుటచేతను ఇతని రాజనీతిజ్ఞత వ్యక్తమగు చున్నది, గీతోపదేశము అర్జునునకేకాకలోకమంతటికిని నేటికిని నిశ్శ్రేయససిద్ధిని కూర్చుచున్నది. ఇట్లు పలుశాఖలలో నతిలోకప్రభావిశేషములఁ బ్రకటించినవ్యక్తి వేరొండు కాన్పింపదు. అట్టి మహామహుని పూర్ణపురుషుడనుటలో నతిశయోక్తియేమి ?

## భాగవతము—గర్గభాగవతము—

ఇట్టి మహాపురుషగుణ వర్ణనముచేతనే వ్యాసభగవానుని పురాణములన్నిటిలోను భాగవతము పూజ్యతమమైనది. ఆగ్రంథమునకు వ్యాఖ్యాన స్వరూపమగుట చేతనే గర్గసంహిత ప్రసిద్ధకెక్కినది. కాని భాగవత మొక స్వతంత్ర మతప్రతిపాదకము. గర్గసంహిత వ్యాఖ్యాన ప్రతిపాదకము. భాగవతము రసనిధానము. గర్గసంహిత విజ్ఞాననిధానము. కనుక స్వతంత్ర గ్రంథ స్వరూపమున భాగవతమెంతటి యుత్కృష్టతమమో వ్యాఖ్యాన స్వరూపమున గర్గసంహితయునట్టిదే-మూలగ్రంథ మందలిగుణ విశేషములు భాగవతమునకును వ్యాఖ్యాన మందలి గుణ విశేషములు గర్గసంహితకును గలవు. దేనివిలువ దానిదే.

## అవతారమనగా—

శ్రీకృష్ణభగవానుడు పరిపూర్ణతమావతారమనుచుంటిమి. అవతారమననేమి? అని తెలుప వలెను. విశ్వమున నిగూఢముగానున్న శక్తివిశేషము వ్యక్తియం దభివ్యక్తమై లోకక్షేమమును కాపాడునో అట్టి వ్యక్తి నవతారమందురు. మేధ అనున దొక శక్తి. అది విశ్వమున నిత్యముగా నున్నది. వ్యాసభగవానునియం దీశక్తి అభివ్యక్తమై పురాణాది నిర్మాణముచే లోకకల్యాణమును చేకూర్చినది. కనుక వ్యాసు డొకయవతారము. వ్యాసభగవానుని పుట్టుకకు పూర్వమును మేధకలదు. వ్యాసభగవానుడంతర్ధానము నొందినను మేధ నశింపలేదు. కనుక మేధ నిత్యమైనది ఈమేధయే నాటికిని నేటికిని మన యందందరియందును పరిమితముగ నున్నది. కనుక ఇది విశ్వవ్యాప్తమైనది. మనయందు పరిమితముగనున్న ఈ మేధాశక్తి శ్రీవ్యాసభగవానునియం దపరిమితమై లోకమునకు కల్యాణమును మన కాతనియం దాచార్య భావమును కూర్చినది. వ్యాసభగవానునియం దీమేధాశక్తి యభివ్యక్తమైనంతగా తక్కినవియగు శౌర్యాదిశక్తు లభివ్యక్తములు కాలేదు కనుక నతడు పూర్ణావతారముకాడు. ఇట్లనే అర్జునునియందు పరాక్రమశక్తియు భీమునియందు బలశక్తియు ధర్మజునియందు సత్యవాదిత్వ శక్తియు నభివ్యక్తములగుటచే అమానవిషయములలో వారు వీరవర్యులైరి. ఆశక్తు లట్లభివ్యక్తములు కాకున్నచో వారును మనవంటివారే. కనుకనే అంత్యకాలమున నర్జునుడు తనగాండీవమును తానే మోయలేని స్థితి సంభవించినది. శక్తి అర్జునునియం దభివ్యక్తమై ఘనకార్యముల సాధించి అవసానమున నాశక్తితత్త్వమున లీనమైనది. అర్జునుడు శక్తికి దాసుడైనాడు. కాని శక్తి అర్జునునకుదాసి కాలేదు. కనుక నర్జునుడు నరావతారమేకాని పూర్ణావతారము కాలేడు. కంసాదులయందు బలపరాక్రమము లధికముగ గోచరించుచున్నవి. అదియు పరమేశ్వరుని శక్తియే. కనుకనే భగవానుడు గీతలలో

> "యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
> తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్ ॥"

అని చెప్పినాడు. కాని ఆశక్తి లోక కల్యాణమునకు కాక స్వార్థమున కుపయోగపడినది. కనుక కంసు డొకయవతారముకాదు.

## కృష్ణావతారము—పరిపూర్ణతమము—

శ్రీకృష్ణభగవానుడు వ్యాసునివలె మేధాదులలో నేయొక్క శక్తియో మాత్రమే కలవాడునుకాడు. అర్జునునివలె నాశక్తికి దాసుడును కాడు. కంసునివలె శక్తులను స్వార్థమున కుపయోగించువాడును కాడు. అతనియం దనంతశక్తు లపరిమితముగ కలవు. ఆశక్తుల నతడు ఆవశ్యకతను బట్టి తన స్వాధీన మందుంచు

కోన కలదు. దాని నతను స్వార్థమునకు కాక లోకకల్యాణమున కుపయోగించును. కనుక శ్రీకృష్ణభగవానుడు పూర్ణతమావతారుడు.

ఇట్లయినచోనే శ్రీకృష్ణభగవానుడు సర్వశక్తుల నాకర్షించి తనయందే నిలుపుకొనినచో నాతని కాలమున తక్కినవారందఱును శక్తివిహీనులగుచు నిర్వీర్యులై యుండరా? అగుకాక. అట్టి కృష్ణభగవానుడేల యాదవసంహారమును చూచి వ్యాధునిచే కాలధర్మము నొందెనను శంకలు వొడమును,

విశాలమగు పృథివిపై కొంతభాగమునకు గట్లు వేసికొని ఆ భాగమును తన పొలమని వ్యవహరించుచు సేద్యము చేసికొని జీవించు కృషీవలునివలె జీవుడును అనంతమగు శక్తిలో నొక కొంతభాగమున కహంకారముచే నావరణము కల్పించుకొని యాశక్తిభాగము తనదని తలచుచు జీవయాత్ర సాగించును. అట్టిజీవుల శక్తులు పరిమితములు. కనుకనే జీవులు కించిజ్జ్ఞులు పరిమితశక్తులు శక్తికి దాసులేకాని స్వాములుకారు. శ్రీకృష్ణాదిజ్ఞాను లహంకారమును జయించిరి. వారి దృష్టిలో విశ్వమందంతటను అద్వైతభావనయే. అందువలన వారు సర్వజ్ఞులు. వారిశక్తు లపరిమితములు. అందువలన వారు పరిమితశక్తులవలె భాసించుచున్నను అవసరమైనప్పుడు లోకాంతరమునుండి గాని విశ్వమంతటి నుండిగానికావలసినంతశక్తి నాకర్షించి కార్యమును సాధింపకలరు. అట్లాకర్షింపబడినశక్తియు తాను విశ్వవ్యాప్తమయ్యు సాధకునియందు సంక్రమించి కార్యమును సాధించెను. బాలుడగు కృష్ణుడు గోవర్ధనము నెత్తుటయే దీనికి తార్కాణము. గోవర్ధనము నెత్తుటకు చాలినంతటి బలశక్తి నాకర్షించెననియు భావము. ఆవశ్యకత తీరినంతనే మిగిలిన శక్తిని పరిత్యజించెననియు భావము.

## పరిపూర్ణతములు—పరాహంతాభావన—

అహంకార మతని వశవర్తియై యుండుట చేతనే అతనికి బంధువులయందు మమకారముగాని శత్రువులయందు విరోధముకాని యథార్థమునకు లేవు. కాగా లోకమందు జీవాను గుణములగు ఫలముల నొసగుటకే తా నీశరీరమును ధరించితినని యతని కర్తవ్య మతికి తెలియును. కనుకనే అభిమన్యుని చావునకును యాదవకులనాశమునకు ననుమతించెను. పారిజాతాపహరణమున సత్యాప్రీణనమున కల్గిన యానందము కాని యాదవకులనాశమున కల్గిన దుఃఖముకాని అతని అభినయములే! ఇట్టిస్థితినే పద్మపత్రాంభస్స్థితి యందురు. ఇట్లభినివేశము లేక యొనర్చు చరితములే లీలలు. ఇట్టిలీలల బ్రదర్శించు వారిలో శ్రేష్ఠతముడగుటచేతనే భగవానుడు జగన్నాటక సూత్రధారుడు. కనుకనే భగవానుడు,

“ నమేపార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన

అని గీతలలో తన యవతార రహస్యమును వెల్లడించెను.

పై నిదర్శనముల వలన విశ్వమంతటిని వ్యాపించినదియు నిత్యమైనదియు ననంత ముఖ ప్రసారముకలదియు నగు నొకశక్తి కలదనియు దాని కాశ్రయము బ్రహ్మమనియు దాని ప్రసార ఫలితములు ప్రపంచమం దభివ్యక్తములగుననియు, దాని నాకర్షించి లోకక్షేమమున కుపయోగించువ్యక్తి యవతార పురుషుడనియు నాకర్షణలోని తారతమ్యములవలన నవతార భేదము లేర్పడుననియు తేలుచున్నది. ఇట్టి యవతారములలో సృష్టికి తోడ్పడు శక్తులుగలవ్యక్తులు బ్రహ్మదేవుని యవతారములనియు స్థితికితోడ్పడుశక్తులుకల వ్యక్తులు విష్ణ్వవతారములనియు సంహారమునకు తోడ్పడుశక్తికల వ్యక్తులు రుద్రావతారములనియు ప్రతీతి.

"యదా యదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం"

అను గీతావాక్యముచే నిట్టి యవతారములకు పరిగణనము లేదనియు త్రికాలములందు నిట్టి యవతారములు సంభవించుననియు ఆయాకార్యములను సాధించినంతనే ఆయావ్యక్తులు ఆయామూర్తులందును ఆయాశక్తులు శక్తితత్వమునందును లీనమగుచుండుననియు అవతార రహస్యము తేలుచున్నది.

ఈ ఆశయమున కనుగుణముగనే ఈ క్రింది యభియుక్తవచనములును కన్పించుచున్నవి.

"నిత్యైవ సా జగన్మూర్తిః తయా సర్వమిదం తతం
తథాపి త త్సముత్పత్తిః బహుధా ... ... ...
దేవానాం కార్యసిద్ధ్యర్థం ఆవిర్భవతి సా యదా
ఉత్పన్నేతి తదా లోకే సా నిత్యా ప్యభిధీయతే"

(జగత్స్వరూపమగు నాశక్తి నిత్యము. ఆశక్తిచే ఈవిశ్వమంతయు వ్యాప్తమైయున్నది. ఐనను ఉత్పత్తి వినాశములులేని యాశక్తి బహువిధములుగా నవతరించినదని ప్రతీతి లభ్యమగుచున్నది. దేవతల కార్యసిద్ధికై యాశక్తి ఎప్పు డభివ్యక్తమగునో అప్పుడే యాశక్తి ఉత్పన్నమైనదని వ్యవహరింపబడుచున్నది.)

శక్తి సృష్టికి కాని సంహారమునకు గాని విషయము కాదనియు అది ఒకస్థితి నుండి వేరొకస్థితికి మారుచుండుననియు నాధునిక విజ్ఞానశాస్త్రవేత్తల వచనములును పై ఆశయముల కుపస్కారకముగ నున్నవి.

## ఉపాసనము—

ఈ విధముగ భగవచ్ఛక్తి నాకర్షించు ప్రయత్నమే ఉపాసనము. ఉపాసనము నిట్టిశక్తుల నాకర్షించిన నవి లోకకల్యాణమునకుపకరింపవలయునన్న శమదమాది సంపత్తి యావశ్యకము. లేకున్న ఉపాసనమువలన లోకకల్యాణముకన్న ప్రళయమే బహుళముగ సంభవింపవచ్చును. కనుకనే సాధకునకు శమదమాది సంపత్తి లేనిదే అధికారితయు లేదందురు. కనుక అధికారిత నార్జించి సక్రమముగ నుపాసన మొన ర్చినవ్యక్తులెల్లరును అవతారపురుషులు కావచ్చును. నిరోధము లెవ్వియులేవు. కాని కాలవ్యవధిని కాని ఇయత్తను కాని ఎవ్వరును నిరూపింపలేరు. అది ఆయా వ్యక్తులనుబట్టియు శక్తులను బట్టియు మారుచుండును. ఇదియే బ్రహ్మద్వార మపావృతమనుట.

పరిపూర్ణత కొందఱికేనను నియమముగాని లోకాంతరముననేయను నియమముగాని లేనందుననే భూమిపై పూర్ణపురుషులు జన్మించుట యసంభవముకాదని ఆర్యులు విశ్వసించిరి. "సామగ్ర్య విధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః" అనినకాళిదాసు సహితము 'ప్రాయేణ' అనువచనముచే పై సిద్ధాంతమునకు సమ్మతి చూపి తనప్రతిపాదనమునకు నిర్దుష్టత కల్పించుకొనెను,

## ప్రాచ్యసారస్వతము—ఆదర్శపాత్రసృష్టి—

పై యాశయమునకు నిదర్శనముగ శ్రీకృష్ణాదిపూర్ణ పురుషులు లభించుచుండుటచేతనే ప్రాచ్యసారస్వతములో నాయకగుణశీలాదిచిత్రణమున అన్వయముఖముననే పూర్ణపురుషవర్ణనమునకు బ్రయత్నములు కన్పించుచున్నవి. కనుకనే రామాయణమున 'కోన్వస్మిన్ సాంప్రతంలోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్'—మొదలగు వాక్యములచే పరిపూర్ణగుణగరిష్ఠుడగు వ్యక్తి యెవ్వడను ప్రశ్నమునకు సమాధానముగ సకలకల్యాణగుణగరిష్ఠుడును శ్రీమన్నారాయణావతారమునగు శ్రీరామునియవతారవర్ణనము వాల్మీకి యొనర్చినాడు. ఇట్టికల్యాణగుణగరిష్ఠుడగు నాయకుని గుణశ్రవణము శ్రోతలమనస్సులందును తా మట్టివారముకావలయునని కోరికను ప్రయత్నమును ఉత్సాహమును కల్పించుచు నైరాశ్యమును నిస్స్పృహను తొలగించును. కనుకనే మనకావ్యలక్షణమున కావ్యములు మంగళాదులుగను మంగళమధ్యములుగను మంగళాంతములుగ నుండవలయునను నియమ మేర్పరుపబడినది. అందువలననే మనకావ్యములందు వ్యతిరేకముఖమునకాక అన్వయముఖముననే నీతి గఱపబడుచున్నది. అందువలననే మనలో విషాదాంతగాథలు గగనకుసుమములైనవి. మనమతప్రభావము మనసారస్వతముపై నిట్లభివ్యక్తమగుచున్నది,

## మతము—సారస్వతము:—

పాశ్చాత్యులలో నిట్టిసిద్ధాంతములు ప్రచురముగ లేనందున నేకాభోలు వారిసారస్వతము నేతద్విరుద్ధమార్గము పట్టినది. "మానవుడు పాపి. గురుదైవతానుగ్రహముచే నతనికి పుణ్యలోకములు కల్గును" అని వారిసిద్ధాంతమగుటచే పాశ్చాత్యకవులు మానవునిలోని అసమగ్రతను తన్మూలమున నతనిపతనమును అట్టిపతనమును వారించుటకు వారు జాగ్రత్త నవలంబింపవలయునని హెచ్చరించుటను వర్ణించుటయం దధికశ్రద్ధ చూపజొచ్చిరి. అందువలన వారిసారస్వతములో నాయకునిపొరబాటువలన కల్గిన పతనమును చిత్రించుచు విషాదాంతములు వెల్వడినవి.

## అవతారవిశేషములు—

సకలకల్యాణగుణగరిష్ఠుడగు భగవానునికళ భూమిపై ప్రసరించి యొకవ్యక్తిచే లోకకల్యాణమునకై ఘనకార్యముల నొనర్చుట యవతరణమనినచో ఆకళయొక్కగాని ఆవ్యక్తియొక్కగాని ఆఘనకార్యములయొక్కగాని తారతమ్యములచే నవతారభేదము లేర్పడుటసహజమే. అవతారములు "అంశములనియు అంశాంశములనియు ఆవేశములనియు నాలుతెఱంగులుగానుండు"నట.

అందు బ్రహ్మాదులు పూర్ణతమునియంశంబున నవతరించిరట. బ్రహ్మ సృష్టికర్త. విష్ణువు స్థితికర్త. రుద్రుడు సంహారకర్త. సృష్టిస్థితిసంహారములు పూర్ణముయొక్క అంశలు. ఆయంశలకర్తలగుటచే బ్రహ్మవిష్ణురుద్రులు పూర్ణతముని అంశావతారములట.

అంశావతారులగు త్రిమూర్తులకు తోడ్పడుటకై సృష్టింపబడినవారు మరీచ్యాదులు- అంశలకుతోడ్పడుటకై యవతరించినవారు అంశాంశావతారులట.

జన్మముచే లోకోత్తరశక్తివిశేషములులేక యొకానొకసమయమున ఆవేశవిశేషముచే లోకోత్తరకార్యముల నాధించుశక్తి నాకర్షించినవా రావేశావతారములట. పరశురాము డొకసామాన్యఋషికుమారుడుగనే జన్మించి జమదగ్ని యన్యాయమరణముచే కోపించెను. కోపవిశేషముచే నతనియందు పరాక్రమవిశేష మావిర్భవించినది. తన్మూలమున సకలదుష్టక్షత్రియులను సంహారించెను. ఇట్టిది ఆవేశావతారము.

కపిలకూర్మాదులు కళావతారములట. కపిలునియందు పరమేశ్వరునికళ ప్రసరించినందున నతనికి తత్త్వము గోచరించినది. సాంఖ్యశాస్త్రమును నిర్మించెను. కూర్మమున నాకళ ప్రసరించినందున నధికబలము చేకూరినది. సముద్రమథనసమ

సనకసనందాదులచే శప్తులై భూమిపై జన్మించిన శ్రీవిష్ణుని ద్వారపాలకుల ప్రథమజన్మమే హిరణ్యాక్షహిరణ్యకశిపులు. అందలి హిరణ్యకశిపుని సంహరించుట మిక్కిలి కష్టతమ'మగుట' పూర్ణతముని సర్వాంతర్యామిచైత్యము. ప్రహ్లాదరక్షణకై సర్వత్ర విష్ణువునుచూపుటకై సర్వత్రజాగృతి నొందియుండెను. అట్టి చైత్యప్రాదుర్భావమగుటచే నృసింహ రూపము పూర్ణావతారమట. శ్వేతద్వీపాధిపతియగు హరియు నిట్లే సకలస్థితిహేతువగుటచే పూర్ణావతారమట.

ఒక్క శ్వేతద్వీపమునకేకాక సకలభువనంబులకును నాయకుండై అత్యుత్కృష్టధామంబగు గోలోకంబున నుండు పూర్ణతముడు శ్రీకృష్ణుడై" యవతరిల్లె. ఇట్లుద్భవిల్లిన ఇతనిప్రజ్ఞ బహుముఖముగా ప్రసరించినందున శ్రీకృష్ణభగవానుడు పూర్ణతముఁడు. కనుక శ్రీకృష్ణభగవానుడు సకలభువనవ్యాపిచైతన్యవిశేషమనికాని, సకలభువనవ్యాపిచైతన్యవిశేషశక్తులను శ్రీకృష్ణభగవానుడు తన యుపాసనావిశేషమున స్వాధీన మొనర్చుకొని తాదాత్మ్యత పొందెననిగాని, భావము.

## విష్ణువైవిధ్యము.

ఇచట గమనింపతగినవిశేష మొండు గలదు. అవతారరూపమైన విష్ణువు శ్వేతద్వీపాధిపతియగువిష్ణువు, గోలోకాధిపతియగువిష్ణువు, అనిఉత్తరోత్తరము చైతన్యవిశేషముత్తమోత్తమమని తేలుచున్నది. ఇటులనే శైవులయందునురుద్రుడు, శివుడు, సదాశివుడు, అని ఉత్తరోత్తర ముత్తమోత్తమముగ పేర్కొనబడియున్నవి. అనగా నామరూపవిరహితమగు చైత్యమునకే గుణాంతర్భూతమైనదానికంటె గుణాతీతమైనదే ఉత్తమమనియు భావము. దానినే శైవులును వైష్ణవులును భిన్ననామరూపములతో నుపాసించుచున్నారనియు తేలుచున్నది.

గర్గసంహితలో గోలోకఖండమున త్రిమూర్తులు గోలోకమున పరమాత్మను దర్శించుటకేగి రనియు నందలిద్వారపాలకులు వీరిని నిరోధించి "మీారేద్రుహిణాం డవినేతలయ్య" అనిప్రశ్నింప వారు "అండములెన్నియుండినవా అయ్యవియెవ్వోయెఱుంగ"మని ప్రత్యుత్తరమిచ్చినట్లు నొకయుపాఖ్యానముకలదు. ఈయుపాఖ్యానమునకూడ గుణాంతర్భూతలోకముకంటె గుణాతీతలోకమును దానికంటె సకలబ్రహ్మాండవ్యాపి చైతన్యలోకములు నుత్తరోత్తర ముత్తమోత్తమములని తెల్పుచున్నది. కనుకగోలోకము సకలబ్రహ్మాండమూల చైతన్యధామమని తేలుచున్నది. శైవులకైలాసము శాక్తులమణిద్వీపములు నిట్టివే.

## శ్రీకృష్ణుడు—గోపికలు—

శ్రీకృష్ణభగవానుడు సకలబ్రహ్మాండమూలచైతన్యమైనట్లే గోలోక మతని ధామమైనట్లే రాధ యతని శక్తి. కనుకనే రాధ శక్తులలో ఉత్తమోత్తమ యని

సారాంశము. అట్టి చైతన్యము, చైతన్యాధారము, శక్తియు, నగు శ్రీకృష్ణ, గోలోక, రాధ, లెన్నరి కుపాస్యులు కారు! కాగా ఇజ్ఞాలవివాదము నామరూపకల్పన యందు మాత్రమేకదా !

"ధరణీమె సత్యభామయను దక్షిణ లక్ష్మిణ సత్యబృందయుక్
విరజకళిందజాదియు క్షితయమెభద్రయువోషనాశక్ర
త్సురనది మిత్రవిందయు విశుద్ధమృడానియు జాంబవంతుకూ
తురుగజసంతురింకనల తోయ్యలులందిటు సంతుగద్గెశీ"

అని చెప్పుటచే వివిధశక్తులు శ్రీకృష్ణభగవానుని భార్యలైరి. అటులనే గోలోకాధిపతియొక్క బంధుమిత్రపరివారాములును గోపగోపికా రూపంబున జన్మించిరి. శ్రుతులునుగోపికారూపమున జన్మించినవట. శ్రుతుల తాత్పర్యముపూర్ణ పురుష ప్రతిపాదనమున నేకదా! జానకీస్వయంవరమున శ్రీరామ సౌందర్య దర్శనముచే నుత్కంఠితలగు మైథిలనారులును గోపికలైరి. ధ్యానవిశేషముచే పరమాత్ముని సమాధియందు ధారణ నొనర్పయత్నించు ఋషులును గోపికలై జన్మించి పరమాత్మునిసాక్షాత్కారము నందిరట "ఇదియే కామోత్కంఠత గోపికల్" అనువాక్యము యొక్క తాత్పర్యము. అష్టాంగయోగమునకును దుర్లభుడగు పరమాత్ముని కామమున పొందిన గోపికలు ధన్యులు. ఇట్టియోగమునే మధురభావ మందురు. ఈవిచిత్ర యోగమునకు స్రష్టలు గోపికలు. శ్రీకృష్ణలీలలయందిట్టిపరమార్థ మిమిడియుండ శ్రీకృష్ణభగవానుడు జారుడనియు చోరుడనియు దూషించుట అజ్ఞానముననో అసూయననో కానోపును. "నిస్త్రైగుణ్యేపథి విచరతాంకోవిధిఃకోనిషేధః" అనికదా అభియుక్తోక్తి. మహాకవులప్రయోగమూలమున నేర్పడిన వ్యాకరణము వారిప్రయోగములకు దోష మాపాదించుటకుకాక, తదితరకవులకు మార్గదర్శకత్వమునకైనటుల మహాత్ములచరితలవలన నేర్పడిన ధర్మశాస్త్రము వారినడవడుల దోష మాపాదించుటచేకాక తద్భిన్నులప్రవర్తనల సరిదిద్దుటచేతనే కృతార్థత నొందును. కనుకనే "వేదోధర్మమూలం" "తద్విదాంచస్మృతిశీలే" "దృష్టోధర్మవ్యతిక్రమః సాహసంచ పూర్వేషాం" అనుసూత్రములచే మహాత్ముల సదాచారములు గ్రాహ్యములనియు వారి ధర్మవ్యతిక్రమ మందలి తత్వ మన్వేషణీయమేకాని ఆచరణీయముకాదనియు ధర్మశాస్త్రములు పల్కుచున్నవి. కనుకనే మనమును శ్రీకృష్ణునివలె గోపీలోలురమైసంచరించిన సంచరింపగలమేమో కాని "మేముబ్రహ్మచారుల"మని ప్రతిజ్ఞ పూని పరీక్షితులను పునరుజ్జీవింపనేరముకదా !

ఈ విధముగా నానందనిలయమగు గోలోకము బృందావనరూపమున భూమిపై నవతరించి, యుత్తమక్షేత్రమై భగవానునిలీలల మనకు జ్ఞప్తినొనర్చుచు మానవులకు ప్రబోధకమును తారకమునైనది.

## సూక్ష్మతమశక్తులు ధ్యానసాధ్యములు—

ఆహారము నమలిజీర్ణించుకొనిననే పుష్టినొసగుచున్నది. రసము జిహ్వేంద్రియస్పర్శముననే తుష్టి నొసగుచున్నది. పుష్పసుగంధము ఘ్రాణేంద్రియసంసర్గముచేతనే ఆనంద మొసగుచున్నది. మంజులగానము శ్రవణముచేతనే తన్మయ మొనర్చుచున్నది. అటులనే సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమములగు, పరమేశ్వరుని కళావిశేషములు ధ్యానముచేతనే, మనయందు సంక్రమించును. వానికి క్రియాప్రసక్తి అత్యావశ్యకముకాదు. కనుకనే పరమేశ్వరుని కళావిశేషముల లీనమొనర్చుకొనుటకు వివిధయోగములు వెలువడినవి.

## పురాణములు—భక్తి.

ఏయోగమునకైనను మిక్కిలిసహకరించునది, భక్తియోగము. భక్తియోగమునకు అధికనియమములుకాని నిరోధములుకాని లేవు. కనుక పరమేశ్వరప్రణిధానమునకు భక్తియోగము సులభోపాయము. అట్టిభక్తియోగముయొక్క ప్రధానాంగములైన స్మరణ శ్రవణ గుణ కీర్తనములకు పురాణములయందు వర్ణింపబడిన పరమేశ్వర గుణవర్ణనము మిక్కిలిసహకరించును. అందును శ్రీకృష్ణలీలలు మిక్కిలి ఆకర్షకములు. కనుకనే శౌనకాదులు పురాణశ్రవణాసక్తులు. అట్టిప్రయోజనమును నిర్వహించుటకే గర్గసంహిత నారదునిచే బహులాశ్వునకును గర్గమహర్షిచే శౌనకునకు నుపదేశింపబడినది. సర్గప్రతిసర్గాది వర్ణనములతోగూడియుండుటచే నిదియు నొక పురాణము. ఇందు ముఖ్యముగా నాయాయోధులయొక్క పూర్వజన్మవృత్తాంతములును వారికి కల్గిన శాపములును ఆశాపములకు కారణములును శ్రీభగవానునివలన ఆయాశాపముల కెట్లు మోచనముకల్గినదియు విపులముగా వర్ణింపబడియున్నవి. ఇట్టి వృత్తాంతములు మిక్కిలి దుర్లభములు. అపూర్వములును. ఇట్టి వర్ణనములచేతనే ముఖ్యముగా నీగ్రంథము భాగవతమునకు వ్యాఖ్యానరూపమై యున్నది. ఇట్టి వృత్తాంతము లనంతముగానుండుటచే పఠించి గ్రహింపతగినవేకాని ఇచట నుటంకింపతగినవికావు. యమునా పంచాంగము తులసీ మాహాత్మ్యముఏకాదశీవ్రత విధానము మొదలగు విషయవిశేషములీగ్రంథమున కలంకారములు.

## శ్రీకృష్ణాష్టమి—

శ్రీకృష్ణభగవానుడు శ్రావణబహుళాష్టమినాడు జన్మించినట్లు మన వ్యవహారముండ గర్గసంహితయందు భాద్రపదబహుళాష్టమియని కన్పించుచున్నది. అటులనే బలభద్రజన్మమందును మాసభేదము కన్పించుచున్నది. చూడుడు.

ఐదుగ్రహములుచ్చస్థితినలరుచుండఁ
దులను స్వాత్యను బుధవారకలితమైన
భాద్రపదశుద్ధ షష్ఠినిఁబట్టిబవలు
కులవధూమణి యానామెబలునిఁగనియె-గోలో— ౩౧౫

అర్ధరాత్రంబునందిందుడభ్యుదయము
సెందినను గనుచీకటి జెలఁగహర్ష
యోగబుధవార రోహిణీ యుక్తమైన
భాద్ర కృష్ణాష్టమిఁ వృషభంబునందు
( దేవకీదేవియందు కృష్ణదేవవిభుఁడు పుట్టె ) గోలో— ౩౮౬

ఈ వైషమ్యమున కొక కారణము కలదు. మన దేశమందు చాంద్రమానమనియు సౌరమానమనియు బార్హస్పత్యమానమనియు మూడుమానములు కలవు. అందు వింధ్యకు ఉత్తరమున బార్హస్పత్యమానము శేషాచలమునకు దక్షిణమున సౌరమానము మధ్యదేశమున చాంద్రమానము. సూర్యచంద్రుల అంతరమును తెల్పు తిథి దేశమంతటికిని ఒక్కటైనను సూర్యచంద్రాదులరాశిప్రవేశమున నేర్పడు మాసనామములు మాత్రము మారుచుండును. మనకు కార్తీక మాసము దాటిన పిదప ద్రావిడులకార్తీకమాసము ప్రారంభమగుట గనుచున్నాము. అటులనే బార్హస్పత్యమానమున శ్రీకృష్ణుడు జనించినదినము భాద్రపదమాసమై యుండనోపు! అయినను మాసనామ భేదమే కాని యథార్థమునకు కాలభేదము కల్గదు కదా!

## గర్గభాగవతము నందలి విషయము—

గర్గభాగవతమున గోలోకఖండము 2 బృందావనఖండము 3 గిరిరాజఖండము 4 మాధుర్యఖండము 5 మధురాఖండము 6 ద్వారకాఖండము 7 విశ్వజిత్ఖండము 8 బలభద్రఖండము 9 విజ్ఞానఖండము 10 అశ్వమేధఖండము అని పదిఖండములు కలవు. మొదట నిదియు విశ్వమువలెనే నవఖండాత్మకముగానుండి పిమ్మట భారతమునకు హరివంశమువలె పదవఖండము చేరినట్లున్నది.

ఇందు గోలోకఖండమున దేవతలచేఁ బ్రార్థితుడై సపరివారముగ శ్రీకృష్ణభగవానుడు భూమిపై నవతరించుట వర్ణింపఁబడినది. బృందావనఖండముననతనిబృందావనలీలలు వర్ణింపబడినవి. గిరిరాజఖండముగోవర్ధనోద్ధారకథాప్రతిపాదకము. మధురాఖండమందలికథ శ్రీకృష్ణబలరాములు మధురానగరముచేరి కంసునికువలయాపీడమును మల్లురను కంసాదులను సంహరించుట. రుక్మిణీకల్యాణాదులు ద్వారకాఖండమున కలవు. విశ్వజిత్ఖండమునఁ బ్రద్యుమ్నుడు దిగ్విజయ మొనర్చుటయు నుగ్రసే

నుచు రాజసూయ మొనర్చుటయుఁ బ్రస్తావింబడినది. బలరామావతారరహస్యము బలభద్రఖండమున కలదు. విజ్ఞానఖండమున భక్తియోగవర్ణనము ఉపాసనావిశేషములును వర్ణింపబడినవి. అశ్వమేధఖండమున ఉగ్రసేనునియశ్వమేధమును తదంగముగ ననిరుద్ధుడు యజ్ఞాశ్వరక్షణకై దేశదేశములు జయించుటయు వర్ణింపబడినవి కాని శ్రీకృష్ణావతార సమాప్తివర్ణన మిందెందును కన్పడదు.

## ఆంధ్రీకరణము—

ఇట్టియుద్గ్రంథము బ్రహ్మశ్రీ వేదమూర్తులగు చివుకుల అప్పయ్యశాస్త్రిగారిచే నాంధ్రీకరింపబడినది. ఆంధ్రీకరణావశ్యతనుగూర్చి ఆంధ్రీకర్త ఇట్లు నుడివియున్నారు. "ఇద్దానియం దితరగ్రంథంబులయందు లేని పెక్కుమనోహరనూతనవిషయంబులుండుట, శ్రీరాధాకృష్ణ గోపికలనుగూర్చిసంశయంబులందీర్చి సంతోషంబుగూర్చు సద్భావంబులు సెలంగుట, ఇదివరకెవ్వరు దీని నాంధ్రీకరింపకయుండుట'' మొదలగు కారణములచే నిదియాంధ్రీకరింపబడినదట- ఇట్టి అపూర్వవిజ్ఞానముకల ఈ గ్రంథముతో నాంధ్రభాష నలంకరించి పారస్వతసేవసేయుటయే ఆంధ్రీకర్త ప్రధానాశయము. కవినను నహంకారముగాని తన కవితాశిల్పమునుచూపవలయునను కోరికగాని ఆంధ్రీకరణముద్దేశములుకావు. కనుకనే పోతనార్యుని ఆంధ్రీకరణముతో పోల్చుటతగదు. కాని మిక్కిలి సరళము సుబోధమునగు శైలి గ్రంథ మందంతటను కన్పించుచున్నది. వెఱ్ఱిమొఱ్ఱి సందేహములతో కృష్ణావతారమును విమర్శించువారి కీగ్రంథము తగిన సమాధాన మిచ్చును. జిజ్ఞాసువులకును వివిధసందేహముల తీర్చును. ఇట్టి కార్యముల సాధించుటకు తగినట్లే ఈగ్రంథము మిక్కిలిసుబోధమై ధర్మశ్రద్ధను శ్రీకృష్ణావతార రహస్యములను అక్షరాస్యులకుసయిత మందిచ్చుచున్నది. వైదికమత ప్రచారావశ్యకత కల్గిన యీకాలమున నిట్టి గ్రంథములకును ఇట్టి గ్రంథకర్తలకును వేనవేలకు బహుళావశ్యకత కలదు. ఈ దృష్టితో గ్రంథమును రచించి శ్రీరాధారమణున కంకితమిచ్చిన ఈకవిజన్మ సార్థకము.

## ఆంధ్రీకరణావశ్యకత—

నేటికాలమున భారతీయులదృక్పథములో కొంతమార్పు కల్గినది. దానికి పాశ్చాత్యనాగరకతాప్రభావము కారణము. ఈమార్పు మత రాజకీయ సాంఘికరంగము లన్నింటియందును కన్పించుచున్నది. పాశ్చాత్య విద్యార్జనముననే జీవితము గడచినందున ప్రాచ్యవిజ్ఞాన స్వరూపము సుగోచరమగుటలేదు. జీవితసర్వస్వము నంతటిని ధారవోసినను గోచరముగాని భారతీయాగాధవిజ్ఞానములోని మహాత్మ్యము అప్రయత్నముగ జనసామాన్యమున కందదుగదా! దీనికితోడు మన దృక్పథములో పరముకంటె ఇహమే ముఖ్యమైనది. అందువలన మనమతసిద్ధాంతములు బ్రదుకు

తెలుపున కొంక శాఖవారు కల్పించినవని తోచుటయు సంభవించుచున్నది. కనుకనే ప్రాతవన్నియును నీరసములనియు క్రొత్తవన్నియును సరసములనియు సిద్ధాంతీకరింపబడుచున్నయవి. ఇందువలన ప్రాచీన సిద్ధాంతములను పరిశీలింపకయే తెలిసికొనకయే ఖండించుతలంపుతో వితండవాదములు చెలరేగుచున్నవి.

సారస్వతమునందును ఇట్టివిప్లవమే చెలరేగినది. మిక్కిలి ప్రతిభావంతులగు కవులునయితము నవ్యతాసమున్మీలనాసక్తితో క్రొత్త త్రోవలను త్రొక్కిరి. క్రొత్త పాత్రలను సృష్టించిరి. ప్రాతపాత్రములతో పరిహాసములాడుచు ప్రహసనముల రచించిరి. ఉత్తమకవి బిరుదముల పొందిరి. కాని కొలదికాలములోనే వారి నవ్యతయు త్రుప్పుపట్టినది. కనుకనే వివేకవంతులగు మరికొందఱు ప్రతిభాశాలురు వెనుకకుతిరిగి ప్రాచీనపురాణరచనలతో ప్రాచీనపాత్రముల వర్ణనమునకే తమలేఖని నుపయోగించి కృతార్థులగుచున్నారు.

మనయాంధ్రీకర్త ఇట్టి విప్లవప్రవాహములో కొట్టికొనిపోలేదు. ప్రవాహమున కెదురీది గర్గసంహిత నాంధ్రీకరించిరి. ఈగ్రంథమున కొకనాడు క్రొత్తదనము గాని వేఱొకనాడు ప్రాతదనముకాని లేదు.

నేటికాలమున ముఖ్యముగా నాధునికులవిమర్శములకు లక్ష్యమైన పాత్రము శ్రీకృష్ణభగవానుడు. సాధకుని విమర్శించుదృష్టితో సిద్ధుని విమర్శించుటచే నీయనుపపత్తి కల్గినది. అట్టి విమర్శములకు చాలవఱకు జిజ్ఞాసువునకీగ్రంథమున సమాధానములు లభించును. సనాతనధర్మనిరతులగు శ్రీశాస్త్రిగారిదృష్టి ఈ గ్రంథముపైఁ బడుట కిదియే ముఖ్యకారణము.

## ఆంధ్రీకరణవార్త—

భారతదేశమునకు రాజకీయస్వాతంత్ర్యము లభించినది. ఆర్థిక స్వాతంత్ర్యమున కిపుడొకయత్నము జరుగుచున్నది. సంస్కృతి స్వాతంత్ర్యమున కొకయత్నమావశ్యకమై యున్నది. తగినకాలమువచ్చిననే కాని ఏయత్నము ఫలింపదు. నేటి సనాతన ధార్మికులయత్నము సంస్కృతి స్వాతంత్ర్యమునకే. అట్టిభవిష్యన్మహాసంగ్రామమున వీరు వీరకంకణమును కట్టవలసియున్నది. ఇట్టి అభిప్రాయములకు చెందినవారు శ్రీశాస్త్రిగారు. వారు లోకులపూజలకుగాని నిందలకుగాని వశులుగాక తమ యుద్యమమును సాగించుచున్నారు. "దివ్యవాణీ"పత్రికానిర్వహణ మిందుల కొకతార్కాణము. ఇట్టి ఆశయములుకలవారికి భాగవతమునకు వ్యాఖ్యానరూపమగు నీగ్రంథము దృగ్గోచరముకాకపోదు. సంస్కృతాంధ్రములయందలి సాహిత్యసంపద సనాతన ధర్మమందలియాసక్తి ప్రాచీనవిజ్ఞాన పరిజ్ఞాన మందలి పరిషక్వత ఆస్తికత మొదలగుశక్తులీయాంధ్రీకరణ సంకల్పమునకు తోడ్పడినవి.

ఆస్థయు స్వాస్థయు కల వీరి మేధాశక్తి సిద్ధిబుద్ధులతో కూడిన వైనాయకశక్తివలె ప్రకాశించినది. గర్గసంహితాంధ్రీకరణము గ్రంథరూపమును ధరించినది.

## ఆంధ్రీకరణ పద్ధతి—

ఆంధ్రీకరణపద్ధతియు నన్నయాదులమార్గమునే పట్టినది. రసవంతములగు ఘట్టములు కల్గుపట్టున గ్రంథమునుఁ బెంచియు తద్భిన్నస్థలముల గుదించియు గర్గసంహిత యాంధ్రీకరింపబడినది. కాని ధర్మోపదేశబుద్ధిప్రధానమగుటచే నాయాఘట్టములు యథాతథముగనే యనువదింపఁబడినవి. సహస్రనామములు మొదలగునవి ఆద్యంతనామములతో క్లప్తపఱచబడినవి.

## శైలిమొదలగు విషయములు—

జీవత్కృతుల గ్రంథములలోని గుణదోషములు విమర్శించుట మిక్కిలి పేశలసన్నివేశము. అయినను ఇంతటి గ్రంథమునుండి మిక్కిలికొలఁదిగ పద్యములనుదాహరించి మిగిలినవిషయముల విమర్శనము పాఠకులకే వదలుట మంచిది. కాన శైలి మొదలగువానిలోని గుణములు కొలదిగ నుదాహరింపబడుచున్నవి.

## చక్కనిశైలి—

కృతిచే స్మృతిచే ద్యుతిచే గతిచే కరుణాకటాక్షకలితస్థితిచే
మతిచే నుతిచే సతి శ్రీపతివలె భాసిల్లె తీవు భామామణిరో

బృందా— ౩౮౦

ధనముకంటె తనువు, తనువుకంటె మానము నంతకంటె మిత్రకార్యము ముఖ్యములని చెప్పుటలో శైలిలోనిసరళత—

ధనమునొసంగి దేహమునుదప్పక యొప్పుగఁ బ్రోవనొనుద
త్తనువునునిచ్చిమానముయథావిధిరక్షకొనర్పనొనుద
ద్ధనతనుమానముల్ మిగులదానమొనర్చిసుమిత్రకార్యమె
గ్గునబడకుండఁ గాఁచి యనుకూలముగా నెరవేర్పనొ గదా!

బృందా— ౩౯౭

## అంత్యప్రాసము—

గోలోకనాథధాత్రీపాలుఁ గరుణాలవాలుస్వర్ణసుచేలుఁ
బాలుఁ బుధనుతసద్గుణజాలుఁ లీలావిలోలుఁ శపియింపకుమా!

బృందా— ४०౯

ఈయంత్య ప్రాసము కరుణాద్యోతకముగా నున్నది.

## మనోహర వర్ణనములు—

చిలుకలముద్దుపల్కులును జిందమునందముమీఱుపక్షు ద
మ్ములకెనయైనకన్గవయు బుణ్యసుధాకరతుల్యవక్త్రమున్
దళితశిలాడుమించునలె దద్దవలెంగెడిమేను జెళ్కుకు
ల్కులుగలరాధికాంగనను గోఁకక చేరి వచించి రిట్టులన్

బృందా— ౨౯౮

తేఁటులదాటునెక్కురులు దేనియలొల్కెడిమోవి, బంగరున్
మీఱెడిపల్వ లజ్జములమించుకనుంగవ నిండుచందురున్
మాఱెడి నవ్వునెమ్మొగము మల్లియమొగ్గలగేరు దంతముల్
వాటపుచూపులుం గలిగి వాడలరుంగద ముద్దుగుమ్మరో !

బృం— ౩౦౦

ప్రేమ మనోవికారమగు ప్రేమ గృహస్థశుభప్రదంబగున్
బ్రేమయె సృష్టిమూలమగు బ్రేమయె పోషణముఖ్యహేతువౌ
బ్రేమ వినాశకంబగును బ్రేమయె ధర్మనిదానమయ్యెడిన్
బ్రేమయె సర్వవశ్యమగు బ్రేమను మించిన లాతియున్నదే

బృం— ౩౩౧

ఏపీడు తులసిచే నెసగియుండగలేదొ
ఏడుగావది వట్టిబీడుగాని.

బృం— ౩౪౮

ఈ మొదలగు రచనలు పోతనప్రభావమును సూచించుచున్నవి. ప్రాచీన కవులశైలి అలంకారసంఘటన, వర్ణనమార్గము రసపోషణవిధానము గుణములిం దనంతముగా కన్పించుచున్నవి. కాని ప్రాచీనకవులలోని ప్రౌఢిమ మాత్రము యథాతథముగనిందు సంక్రమించలేదు. నేటి కాలమునకు అందునను ముఖ్యముగా మత ప్రచారోద్దేశ్యములుగల గ్రంథములకు ప్రౌఢతకంటె సరళతయే ఉపయోగకరమగును. ఈ గ్రంథమం దచ్చటచ్చట వ్యాకరణాది దోషములును గోచరించవచ్చును. వానినే ప్రధానముగా నన్వేషించుట బురోభాగుల కృత్యము.

## పద్యములపోకడ—

పోతనార్యుని యందలి ప్రతిస్పర్థిత్వముచేకాక భక్తివిశేషముచేతనే ఆంధ్రీకరణము ప్రారంభమైనందున పోతనార్యుని యనుకరణము లచ్చటచ్చట గోచరించుచున్నవి. ముఖ్యముగా రుక్మిణీకల్యాణ ఘట్టము దీనికుదాహరణము.

ఇటులనే సీసపద్యరచన యందును పోతనార్యుని కనుకరణములు కన్పించుచున్నవి. ముఖ్యముగా బృందావనఖండమిందుల కుదాహరణము. సందర్భానుగుణముగ వివిధ వృత్తములును గ్రంథమున చేర్చబడినవి, అందు ముఖ్యముగా స్రగ్విణీ॥ లాలి శ్రీమాధవా లాలి దేవస్తుతా లాలి కేళీప్రియా లాలి గోపీప్రియా లాలి నారాయణా లాలి స్మేరాననా "లాలి కృష్ణాహ్వయా లాలి నందాత్మజా" అన్నచో స్రగ్విణీ వృత్తము జోలపాటకుతగినది చక్కగా సందర్భోచితముగా కూర్చబడినది. ఈవృత్తమునే కొలదిమార్పుతో.

లాలి శ్రీమాధవాలాలి లాలి దేవస్తుతాలాలి
లాలి కేళీప్రియాలాలి లాలి గోపీప్రియాలాలి
లాలి నారాయణాలాలి లాలి స్మేరాననాలాలి
లాలి కృష్ణాహ్వయాలాలి లాలి నందాత్మజాలాలి

వేరొకలాలిపదమును చేర్చినచో సందర్భమునకు తగిన చక్కని లాలిపాటయగును. ఇటులనే శబ్దాలంకారాదులకును శయ్యకును ధ్వనిపాకాదులకును వివిధోదాహరణములు కలవుకాని గ్రంథమే చేతనుండి చదువబోవువారికీ రుచులు వర్ణించుట తినబోవుచు రుచులెంచుటవంటిది.

## ఉపసంహారము—

ఇందు విజ్ఞానఖండము భక్తియోగరహస్యముల చాటుచున్నది. అందలికొలది పద్యరత్నము లుదాహార్యములు.

స్మరణకీర్తన శ్రవణ సచ్చరణ సేవ
నార్చన వినతి స్నేహ దాస్యాత్మదాన
ములననవి నెల్లు నీ భక్తి గలుగువాడు
ధాత్రిలో దుర్లభుడుగాడె? దలచిచూడ.

యాదవనాథ యీ నవవిధాత్మకభక్తిని గన్నవారు ప్ర
దహ్లాదశుకుల్ పరీక్షితుడు నబ్జజయున్ బృథునామధేయస
మ్మోదియు గాందినీసుతుడవోఘబలానిలసూతి పార్థుడున్
యాదవవర్యు డుద్ధవుడు నట్టిబలప్రభు డావ్రజాంగనల్.

భక్తి నవవిధములనియు పశ్చిత్తాపములందు కుజారణములనియు భావము.

భయమునఁ బ్రియమునఁనో యు
బ్రియమునఁనో మనము హరిని బెట్టిన వారల్
జయయుతులగుచుఁ దప్పక త
న్మయతను జెందంగగలరు మానవనాథా

చెలిమిని నందయశోదాదులు వసుదేవప్రభృతియను పార్శ్వవరే
ణ్యులు కామంబున గోపీజలజాక్షులు బొందిరట్టిజలజాతాక్షున్.

ఎట్టిస్థాయిభావముచేతనైనను పరమేశ్వరుని పొందవచ్చుననుట. విజ్ఞానఖండమున నింకను వేదాంతరహస్యము లనేకములు కలవు అయ్యది సర్వథా పఠనీయము,

ఇట్టియార్ష గ్రంథమున కుపోద్ఘాతముగ కొలదివచనములు రచించుటలో ఆర్ష గ్రంథాదరమే అజ్ఞుడగు నన్ను ప్రేరేచినది. దాని కవకాశ మిచ్చినందుల కాంధ్రీకర్తకు కృతజ్ఞుడను.

నరసరావుపేట
విజయ కార్తీక బహుళ దశమి
సోమవారము

తూములూరు
శివరామకృష్ణమూర్తి శాస్త్రి

ఓం తత్సత్

# అభిమతము

సాహిత్యాచార్య, సాహిత్య సమ్రాట్, కవీంద్ర,

శ్రీ శివశంకర స్వామివారు

౧

గర్గభాగవతము అష్టాదశ పురాణాంతర్గతము కాదు. ఉపపురాణములలో గూడ దీనిపేరు కానరాదు. దేవీభాగవతము అష్టాదశ మహాపురాణములలోని దని చాలమంది విశ్వాసము. భాగవతమే వానిలోనిదని కొలదిమంది నమ్మకము. బోపదేవుడు భాగవతము రచించెననువాదము పరాస్త మయినది.

కృష్ణద్వైపాయన వ్యాసుడు మూడుగ్రంథములు 'జయము', 'హరివంశము', 'భాగవతము' అనునవి రచించె ననియు, అందు 'జయము' కాలక్రమమున మహాభారతముగా మారె ననియు, 'హరివంశము' ఖిల మయిన దనియు, భాగవతము మాత్రము మిగిలి యున్న దనియు విమర్శకుల విశ్వాసము.

నారదుడు తొలుత కృష్ణద్వైపాయను నుద్బోధించి భాగవతము వ్రాయించె నట. అనంతరము కొంతకాలమునకు ఆభాగవతము మరగుపడునట్లు గర్గభాగవతమును రచింప జేసె నట. కృష్ణభక్తివివర్ధనకరముగా ౧౨,౦౦౦ శ్లోకములలో ఈ గ్రంథమును గర్గుడు నిర్మించెను.

దీనిని బట్టి చూడ, ౧౮,౦౦౦ గ్రంథముగా నున్న భాగవతము భారముగ నున్న దనియు, కేవలకృష్ణచరిత్రము కాక వివిధవిషయములతో నిండియున్న దనియు, కృష్ణభక్తిపూరితుల ప్రబోధమువలన గర్గుడు నిజనామముతో భాగవతము రచించె నని యూహింపవచ్చును.

వ్యాసభాగవతములో రాధానామమే కానరాదు. బ్రహ్మవైవర్త పురాణములో తొలుత ఆమెపేరు కానవచ్చును. ఈ గర్గభాగవతములో రాధాదేవిప్రసక్తి విశేషముగా నున్నది.

జయదేవ కవి రాధను నాయికను జేసి గీత గోవింద కృతిని గానముచేసెను. విద్యాపతి కవి మైథిలీ భాషలో రాధావర్ణనము విరివిగా జేసినారు. వంగ భాషలో చండీదాస మహాకవి రాధాతత్త్వమును బహుముఖముల ప్రదర్శించినాడు. శ్రీ చైతన్య మహాప్రభువు రాధాభావనతో తన్మయత్వము నొందుచుండెడివాడు. చైతన్య మతానుయాయులవలన రాధాప్రశస్తి ప్రపంచమున వ్యాప్త మయినది.

వైకుంఠముతో తృప్తి చెందని భక్తులు గోలోకమును భావించినారు. గోస్వాములు (గుసాయి, గోసాయిలు) రాధాకృష్ణులను సమముగా పూజించినారు. చైతన్య పరంపర రాధవైపు మొగ్గ చూపినది. భక్తిలో మధురభావమునకు ప్రాధాన్యము హెచ్చినది.

౩

మహాకవి చిప్పకుల అప్పయ్యశాస్త్రులవారు గర్గభాగవతమును బహుకాలముక్రిందటనే ఆంధ్రీకరించి ప్రకటించినారు. ఇది ద్వితీయముద్రణ మగుట ముదావహము. శాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో, బహుశాస్త్రములలో ఆరితేరినవారు, బహుగ్రంథ రచయితలు. మీదు కవిత్వపటుత్వము కలవారగుటచే ఈ గ్రంథము అనువాదమువలె నుండక స్వతంత్రగ్రంథముగా సరసముగా నున్నది. శాస్త్రిగారు ప్రామాణిక కవులగుటచే ప్రసిద్ధపదప్రయోగమే విరివిగా చేసినారు. ఈ గ్రంథము ద్రాక్షాపాకముతో ఆస్వాదయోగ్యమై యున్నది.

మాతృకలో ౧౨,౦౦౦ శ్లోకములలో నిబద్ధమయిన గర్గభాగవతము ఆంధ్రమున రమారమి ౬,౦౦౦ గద్యపద్యములలో నిమిడినది. శాస్త్రిగారు గద్యములను విశేషముగా కాక కొలదిగనే యుపయోగించినారు.

ఆంధ్ర కావ్యములలో ప్రసిద్ధముగా బహుళముగా నుపయోగించు ఉత్పల చంపకాదులే కాక ఈగర్గభాగవతమున స్రగ్విణీ ఉత్సాహ, విద్యున్మాలా, సుముఖి సుగంధి ప్రముఖ గేయవృత్తములను, పంచచామర, మత్తకోకిల, తరల, భుజంగప్రయాత, మాలిని, పృథ్వి, మానిని, కవిరాజవిరాజిత, మహాస్రగ్ధరాదులను రచించుటచే శాస్త్రిగారి వృత్తనిర్వహణచాతురి ద్యోతిత మగుచున్నది. ఛందోవైవిధ్యము, సరళగమనము కలిగిన యీకోశమును పౌరాణికులు శ్రవ్యముగా పాడి సభ్యులను సమ్మోహమానసులను జేయుట సముచితము.

ఇతి శమ్ !

సాహితీ సమితి
1-1-1954

శివ శంకర స్వామి

# కవిపండితాభిప్రాయములు

సుప్రసిద్ధ విద్వత్కవిచంద్రులగు బ్రహ్మశ్రీ శతావధాని చెళ్లపిళ్ళ వేంకట శాస్త్రులవారు.

కడియము 8-11-26

ప్రాచీనకవుల శైలిగలిగి నిర్దుష్టమై మనోజ్ఞముగా నున్నయది. సర్వదా భగవంతుఁడు మీకిట్టి మహోత్కృష్ట గ్రంథ రచనకుఁ బ్రోత్సాహకుఁడై యశోభివృద్ధికరుఁడగుఁగాక.

కావ్యస్మృతి తీర్థేత్యాది బిరుదాంకితులును రామాయణ బ్రహ్మాండపురాణాద్యనేకగ్రంథకర్తలునగు కళాప్రపూర్ణ బ్ర॥ జనమంచి శేషాద్రిశర్మగారు.

మహాకవిశిరోమణీ !

కడప 7-11-1926

తమరుపంచిన శ్రీగర్గభాగవతము చేరినది. దానింగాంచి కరముహర్షించితిని. పట్టుపలంబూని యేఁబదితావులఁ బఠించితి. శ్రీకృష్ణదివ్యచరితామృతమును గ్రోలి పరమానంద భరితస్వాంతుఁడనైతిని. మీ యీకవిత్వము గంగాప్రవాహమువలె మనోజ్ఞముగ శైలి సులభతరమై సర్వజన సుబోధముగానున్నది. పద్యములు సరసజన హృద్యములై పోతనకవుల కవిత్వమునుబోలి పవిత్రమై నిర్మలమై సేవింపఁ దగియున్నవి. ఈకాలమున నిట్టి సద్గ్రంథముల నందును బురాణముల వ్రాయువారరుదుగ నున్నవారు. పరమభక్తిం బాటించి యీమహోత్తర పురాణగాథలం దెనిఁగించి యుత్తమశ్లోకులరైతిరి పరిశీలించిచూడ మీరు ప్రాచీనకవుల పఙ్క్తిలో వ్రాయఁదగినవారని త్రికరణశుద్ధిగా వచించుచున్నవాఁడను. శ్రీకృష్ణపరమాత్మకృతిఁ దెనిఁగించి పరమేశ్వరాంకితమొనర్చి మీజన్మమును సార్థకముగఁ జేసికొంటిరి. మిమ్ముల నుదాహరణముగాఁ గొని కవులిట్టి సద్గ్రంథముల విరచింతురుగాక. ఈ పురాణరత్నము మీయశస్సును దశదిశలనింపి తెలుఁగు భాషకు విఖ్యాతిం గూర్చి తానలరుచు మిమ్ముల నలరింపఁ జేయునుగాక. భగవంతుఁడు శ్రీకృష్ణపరమాత్మ కరుణానిధి మీకాయురారోగ్యములఁ బ్రసాదించి యిట్టి గ్రంథరత్నముల నింకను జేయు బుద్ధిఁ బుట్టించి మిమ్ముఁ గాపాడుఁగాకయని సాంద్రభక్తిని శ్రీపరాత్పరుం బ్రార్థించుచున్నవాఁడను. కవిలోకము మీకు "మహాకవిశిరోమణి" యని బిరుదము నొసంగి గారవించుఁగాక.

ఈబిరుదము జనగాం పౌరపండిత మహాసభలోఁగూడ దృఢపఱుపఁబడి యొసఁగఁబడినది.

అష్టావధాని ఆల్లాని జగన్నాథశాస్త్రి బి. ఎ. ఎల్. టి. రాజాస్ హైస్కూల్ హెడ్‌మాస్టర్ వేంకటగిరికోట. 10-12-26

1. శ్రీమాతయు సురనేతయు । కామేశ్వరి యంబ యిష్టకామములిడుతన్
శ్రీమచ్చివుకుల కులాబ్ధి । సోమున కప్పయ్యశాస్త్రి శుభనామునకున్ ॥

2. సమ్మతి నంబ గర్గనుత సారకవిత్వ కుశత్వ సంపదా
ఢ్యమ్మనుతమ్మనున్ జివుకులాబ్ధి భవాప్పయ పూర్ణచంద్రభా
గ్యమ్మును నాంధ్రవాక్ప్రియద మాభరణమ్మను గర్గసంహితా
ఖ్యమ్మగు గర్గభాగవత మారవితారయశమ్ము శమ్మిడన్.

3. వినుమా శుకవిజ్ఞానం । బున బోతనభాగవతము ముదమిడుచుండన్
గనుమీ శుకవిజ్ఞానం । బున నూతనభాగవతము ముదమిడుగాదే ॥

4. ఆర్యా! మీదగు గోపికావిరహ రాధాకృష్ణ వైవాహ మా
ధుర్యంబుల్ ఖలదైత్యనాశచయ ప్రద్యుమ్నాఖిలాశా జయ
క్రౌర్యంబుల్ బ్రతిఖండ మిక్కువిభమై రాజిల్ల శృంగార స
ద్వీర్యంబుల్లస్మరియింపఁ జేయవె బుధుల్వేవేగ నప్పయ్యనిన్

5. భాగవతకవినాథ! మీపాదములకు । నబ్ధిరాజునకిడెదు నర్ఘ్యంబుమాడ్కి
బద్యపంచకమిదె భక్తి వ్రాసిపంపి । నాడ సన్మిత్రమగు జగన్నాథశాస్త్రి ॥

చెన్నపురాంధ్ర ప్రభుత్వాస్థానకవులును, కవిసార్వభౌమేత్యాది బిరుదాంచితులును, శ్రీకృష్ణభారతేత్యాద్యుద్గ్రంథప్రణేతలునగు శ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రుల వారు.

రాజమండ్రి
5-2-54

బ్రll శ్రీll చివుకుల అప్పయశాస్త్రిగారు రచించిన శ్రీ గర్గభాగవతము, అందినది. కొంత కొంత భాగము జదివితిని, అందలికవిత్వము నిర్దుష్టమై మనోహరముగా నున్నది. అందువ్యాసకృతమని వ్యవహరింపబడు భాగవతములోలేని అనేక మహావిషయములు పేర్కొనబడియున్నవి. రాధాదులవృత్తాంతములు విపులముగా వ్రాయబడియున్నవి. అవియన్నియు లోకమునకు ముఖ్యముగా దెలియదగినవి. శ్రీశాస్త్రిగారీ మాహాత్మ్యాదులను వ్రాయుటలో మిక్కిలి శ్రమచేసి పరిశీలించి వ్రాసియున్నారనియు, ఇందనేక విషయములు లోకము గ్రహింపవలసియున్నదనియు, వారికవిత్వమెక్కడను చ్యుతసంస్కారాదులకు లోనుగాక శాస్త్రీయముగానున్నదనియు, మనవిచేయుచున్నాను. ఇదియుద్గ్రంథమని చెప్పుటకుసంశయింపనక్కఅలేదు.

అవధానిశిరోమణీత్యాది బిరుదాంచితులును, సుప్రసిద్ధపండితకవి వరేణ్యులు నగు శ్రీ కాశీకృష్ణాచార్యుల వారు. గుంటూరు

మహాశయా ! తే॥ 15-1-54

భవదాంధ్రీకృతమగు గర్గభాగవతమును, జూచి అక్కడక్కడ కొన్ని ఘట్టముల పద్యముల జదివియానందించితిని. పద్యములఅల్లిక అతుకులేనిదై మనోహరముగనున్నది. శైలిమృదుమధురము. పండితులును పామరులును ఆనందింపదగిఆంధ్రలోకమునకు మిగుల నుపకారకమైయున్నది. ఈకాలమున ధర్మమూలమగు వేదహృదయము నెఱుంగుట కష్టసాధ్యము. అందుచేతనే వేదవితరణముతో తృప్తిజెందక శ్రీవ్యాసభగవానుఁడు అష్టాదశ మహాపురాణములను, వేదోపబృంహణార్థమొనర్చెను.

ఇతిహాసపురాణాభ్యాం— వేదంసముపబృంహయేత్ అను ప్రమాణముచే పయివిషయములుస్థిరపడును, ఆపురాణములు సంస్కృతభాషలోనుంటచే అనభ్యస్తసంస్కృతుల కుపకారకములుకాజాలవు. పురాణములలో నొకటియగు గర్గభాగవతమును మీరాంధ్రీకరించి ఆంధ్రలోకమునకు మహోపకారమొనర్చితిరి. ఇటులనే ఆంధ్రీకరింపబడని పురాణముల నాంధ్రీకరించుచు ఆంధ్రలోకమునకందిచ్చుచు దీర్ఘాయురారోగ్యయోగ భాగ్యములతో చిరకాలము మనెదరుగాత- అని హయగ్రీవుని బ్రార్థించుచుంటిని—



హైదరాబాదు నిజాంకళాశాలా సంస్కృతాంధ్ర ప్రధానోపన్యాసకులును సంస్కృతాంధ్రకవితా ప్రవీణులునగు శ్రీ జి. లక్ష్మీకాంతయ్య ఎం. ఏ. గారు.

హైద్రాబాద్

ఆర్యా, పండితకవివర్యా ! 30-1-54

తా మతి వాత్సల్యముతో నాకొసగియున్న శ్రీ గర్గభాగవతము నామూలచూడముగాఁజదివి యమందానందము నొందితిని. కలిప్రభావప్రసృతి విశేషముగాగల యిక్కాలముననిట్టి భక్తితత్త్వ ప్రతిపాద కోద్గ్రంథానవతరణమున కవసరమెంతయుగలదు. రసవద్గ్రంథ మాంధ్రులకు గల్పమహీరుహము. తమరు సర్వదా వంద్యులు.

కృతి ప్రశంసయందు శ్రీ గర్గసంహితావ్యాయేతిహాసమును దాము తెలిగించియున్నట్లు తెలిపియున్నారు. కాని పాఠకులకిమ్మహాగ్రంధమొక స్వతంత్రకృతి వలె, దోఁచుచున్నదనుట నిక్కము.

శ్రీ గర్గభాగవతము సంబంధి గద్యపద్య భాగము లత్యంత సామర్థ్యముతో వ్రాయబడి యనర్గళధారతో ప్రసాదగుణముతో ద్రాక్షాపాకముతో సముచితలోకోక్తి భాషీయపదఘటనాకౌశల్యముతో నలరారుచున్నది.

తమ కృతి యందలి యను ప్రాసాదులు పాఠకులను శ్రీ పోతనార్యుని శైలిని స్మృతికి దెచ్చుచు అభినవపోతనార్య బిరుదమునకుం దమకుంగల యర్హతను ప్రకటించుచు ఇంతకుమున్న తమకు లభించియున్న మహాకవిశిరోమణి, యనుబిరుద మన్వర్థమొనర్చుచున్నదని వ్రాయుటకు సంతసము.

---

మైసూరు మహారాజాకళాశాలలో నాంధ్రోపన్యాసకులుగా నుండిన వారును, తిరుపతి ప్రాచ్యకళాశాలలో మ్యూజిక్ రీడరులును, సుప్రసిద్ధ విమర్శకులు నగు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు

తిరుపతి
5-12-1954

ఆర్యా!

తాము దయతో పంపిన గర్గభాగవతమును జాబును చేరినవి. తమ ప్రణయ గౌరవములకు ధన్యవాదములు.

గ్రంథమును అవకాశముచాలక అందందు చదివితిని. భాషాంతరీకరణము చాల మట్టుకు పోతనగారి వరవడిలో ధారావాహిగా సాగినది. ఇంత గొప్పగ్రంథమును ఒకశైలిలో రచించు దీక్ష ప్రశంసార్హము. శ్రీ భాగవతమునలేనిపలు విషయములు ఈ గర్గసంహితమూలమున ఆంధ్రులెఱుఁగునట్లు శ్రీ అప్పయ్యశాస్త్రి గారుచేసినారు. ఆపెద్దఋణమాంధ్రులు నీగరానిది. వారికి దీర్ఘాయురారోగ్యాది భాగ్యములను శ్రీ శ్రీనివాసుఁడనుగ్రహింప మా ప్రార్థన.

---

ఆంధ్రయూనివర్సిటీ ఆంధ్రోపన్యాసకులుగా నుండినవారును, అభినవవాగనుశాసనేత్యాది బిరుదవిరాజితులును బహుగ్రంథ రచయితలును,సుప్రసిద్ధ విమర్శకులు నగు శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రుల వారు.

ధవళేశ్వరము
1-1-54

బ్రహ్మ శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రిగారాంధ్రీకరించిన గర్గభాగవతములోని కొన్ని ఘట్టములు చదివితిని. ఉపపురాణములావిర్భవించుకాలమునందుదయించిన మహాగ్రంథములలో గర్గసంహితయొకటి. హరివంశ విష్ణుపురాణాదులందు వర్ణింపబడిన శ్రీకృష్ణమహాత్మ్యమే యిందును వర్ణించబడినదిగాని బృందా

వన మధురగా, ద్వారకాఖండాదులు కొన్నిట భగవచ్చరితవర్ణనముల నవసరత లేక పోలేదు. అవిగాక యెందఱెన్నిరీతుల వర్ణించినను శ్రీకృష్ణకథకు పునరుక్తి లేదు గదా. శ్రీ శాస్త్రిగారు శ్రీకృష్ణభక్తితో గురుతరదీక్షతో, హృద్యమధురశయ్యను రచించిన యీ మహాశ్రవ్యకావ్య మాధునిక పురాణసారస్వత సందర్భశ్రేణికి జెంది విద్వదాదరపాత్రమై వెలయఁగలదని యాశించుచున్నాను.



మహబూబుకళాశాలాంధ్ర ప్రధానోపాధ్యాయులును, బహుప్రబంధ గ్రంథ రచయితలును, శిరోమణీత్యాది బిరుదాంచితులును, నగు శ్రీ సన్నిధానం సూర్య నారాయణశాస్త్రి బి. ఒ. యల్. గారు. సికింద్రాబాదు

23-1-54

శ్రీమహాకవిశిరోమణి చెళ్ళపిళ్ల అప్పయ్యశాస్త్రిగారు రచించిన గర్గభాగవతమును రమారమి ముప్పది మూడేండ్ల క్రిందట వారు లనటఁజదివి వినిపింపవింటిని. ఈనాఁడు గ్రంథమునందలి పెక్కుభాగములను జదివితిని.

శాస్త్రిగారు లబ్ధప్రతిష్ఠులు. వారికి గ్రంథగౌరవముగా నా యభిప్రాయమక్కఱ లేదు. నాబోంట్ల గ్రంథములను వారు దమ పత్రికలో విమర్శించుచునేయుందురు. అయినను నా యందు గౌరవముచేవారు నన్నడిగిన పుడెట్లు కాదనగలను ?

ఇది పురాణకావ్యము. పురాణకావ్యములన్నియు కథారచనా ప్రధానములుగా నుండును. అచ్చటచ్చట మాత్రము రసవద్ఘట్టములుండును చక్కని శైలిలో కథను సాగించుటయే కవికౌశలము.

శ్రీశాస్త్రిగారి యీ రచనము కమ్మెచ్చున నాఁగఁదీసినట్లు సాఁగిపోయినది. గ్రంథమంతయు ద్రాక్షాపాకమున నడచినది. శాస్త్రిగారు సనాతనమతోద్ధారకు లగుటచే సనాతనకావ్యసంప్రదాయముననే నడిచినది.

మనము శ్రీమద్భాగవతమునే యెఱుఁగుదుము. గర్గభాగవతమును గుఱించి యెఱుఁగము. శ్రీమద్భాగవతమును రచించిన పోతనవలెనె గర్గభాగవతమును రచించి అభినవపోతనయనదగ్గ కీర్తినార్జించిన శాస్త్రిగారి నభినందించుచున్నాను.



విద్వత్కవిసార్వభౌమ, అభినవపండితరాజ, విద్యావాచస్పతి, విద్వత్కవిరత్న, మహామహోపాధ్యాయ, కులపతి, కవిరత్న వైయాకరణకేసరి- ధర్మోపన్యాసకేసరీత్యాదిబిరుదాంకితులగు శ్రీ పుల్యఉమామహేశ్వరశాస్త్రి గారు.

ముంగండ అగ్రహారము

20-1-54

మహాశయా !

తాముదయతో నంపిన శ్రీమదాన్ధ్ర గర్గభాగవతగ్రన్థరత్నమందినది. తమయీ గ్రన్థము నాయా ఘట్టములలో వివేచన దృష్టితో విలోకించితిని.

శ్రీ సంస్కృతాన్ధ్రోభయ భాషలలోను ప్రాచీనకవిపుంగవులవలె దామొనర్చిన బహుతరపరిశ్రమయిచటి గద్యపద్యములలో సమగ్రముగ వెల్లడియగుచున్నది. మరియు ననర్గలధారాశుద్ధితో నాయారసానుగుణవర్ణనాంశములలో నుపయోగించబడిన శబ్దజాలమేమి వర్ణనవిశేషములేమి యలంకార సంఘటనలేమి సహృదయహృదయములనాకర్షించుటలో నయస్కాన్తసూచీన్యాయము ననుకరించినవి.

ఆన్ధ్రకవిలోకచన్ద్రమా- ఈగ్రన్థరత్నమునందలివిశేషము పూతనాదిపూర్వజన్మ వృత్తాన్తముల నెచ్చటికచ్చట నిరూపించుటయు, గ్రన్థాన్తరావర్ణితమన్మథదిగ్విజయాది బహులవిశిష్టకథలను విపులీకరించి నిరూపించుటయు, మానవవిజ్ఞేయానేకాపూర్వాంశములను వెదజల్లుటయు, గ్రన్థాన్తరాగతార్థతను వ్యక్తీకరించుచు నవశ్యపఠనీయతనుద్బోధించుచున్నది- మీరచనాశైలి మృదుమధుర గంభీరమై ప్రతివృత్తమున నాయా రసములను స్రవింపజేయుటలో మీకుగల మహాకవిశిరోమణి పదము నన్వర్థమొనర్చుచున్నది. విస్తరించ నేల- మీయీగ్రన్థరత్నము సర్వాంశములలోను మీదివ్యవాణ్యాధిపత్యము నుద్భాసింపజేయుచు నాకేగాక యాన్ధ్రవిద్వత్కవిలోకమున కంతకు నమితానందమునొడగూర్చుచు నాన్ధ్రదేశమునంతనాత్మీయప్రతిభామయూఖజాలముచే శాశ్వతముగ ప్రకాశింపజేయునని విశ్వసించుచుంటిని.

ఇట్టిసద్గ్రన్థములను రచియించుచు సత్కీర్తిచన్ద్రికచే నాన్ధ్రదేశమునుల్లసింపజేయగోరుచుంటిని- ఇతిశమ్—



సంస్కృతాంధ్ర భాషా సేవకులును, మహోన్నత న్యాయస్థాన సుప్రసిద్ధ న్యాయవాదులును, నగు శ్రీ బుఱ్ఱా సుబ్బారాయుడు ఎం. ఎ. బి. యల్. గారు.

మహాభూపాల్ మంజిల్
జాంబాగు హైద్రాబాద్
19-2-54

శ్రీ చివుకుల అప్పయ్య శాస్త్రిగారు సనాతన పద్ధతి నవలంబించు ఆధునిక కవిపుంగవులు. కనుక నేవీరిగర్గభాగవతము సంస్కృతాంధ్రపదములతో సమ మిశ్రితమై వర్ణనాదులయందు నన్నయ పోకడలను తలపించుచున్నది. అట్లయ్యు శ్రీకృష్ణుఁడు ధనుర్భంగము గావించుట మొదలగునింకలిచిన్న చిన్నకథలను పరిశీలించినచో అధునాతన పద్ధతుల పైరచింపబడిన ఖండకావ్యసంపుటియా యున్నట్లున్నది. విషయము కృష్ణచరితమును వివరించు చరిత్రగాగనబడినను అయ్యది భాగవతమునందువలె భక్తియందె పర్యవసితమై భాగవతమునకు నాటిగానున్నది.

ఇట్టి యుత్కృష్ట గ్రంథమును రచించిన శాస్త్రిగారు ధన్యులు. పాఠకలోకము దీనిని ఉచిత రీతిని గౌరవించునని ఆశించుచున్నాను.



చారిత్రక పరిశోధకులును, నైజాంకాలేజి ఆంధ్రోపన్యాసకులుగానుండిన వారును, బహుగ్రంథ నిర్మాతలును, వాగ్మి శేఖరులునునగు శ్రీ ఆచార్యకురుగంటి సీతారామయ్య, ఎం. ఎ. గారు.

హైద్రాబాద్
89/3 బ్లాక్ నాంపల్లి
9-2-54

తాము దయతో నిచ్చిన గర్గభాగవత మహాపురాణమును మిక్కిలి శ్రద్ధతో చదివితిని. ఇది యిప్పటికి రచించిన యే యితర పురాణమునకెందును తీసిపోదనుట నిక్కువము. శైలియనర్ఘము. కథాకథన పద్ధతి మిక్కిలి ప్రశంసనీయము. ఒక్కొకచో శ్రీమదాంధ్ర భాగవతముయొక్క పోకడలు కానవచ్చుచున్నవి. ఉదాహరణముగా గిరిరాజఖండమందలి దధిహరణ లీలలోఁగనుగొననగును. తాము రచించిన యీ మహాపురాణమాంధ్ర సాహిత్యమున నొకయుగ్రస్థానమలంకరించుననుటలో నెట్టి సందియమునులేదు. ఆంధ్రసరస్వతి కొకయమూల్యాభరణమును సంతరించితిరి. ముఖ్యముగా నిందలి వచనములు భారత భాగవతరామాయణములలోని వానితోఁ దులదూఁగుచున్నవి. పురాణప్రబంధశైలులును తగుచోటులఁగానవగును. తమధర్మసేవాకార్యములలో నే తద్గ్రంధరచనము మకుటాయమానమైనది. సాహిత్యధర్మములను రెంటిని ఏకకార్యముతో సాధించితిరి. మీరింకను సాహిత్య సేవచేయ పరమేశ్వరుడు మీకు దీర్ఘాయువునిచ్చుగాకయని ప్రార్థించుచున్నాను.

ఉస్మానియా యూనివర్సిటీ ఆంధ్రశాఖాధ్యక్షులుగ నుండినవారును, సరస కవితా చాతురీధురీణులును, వివిధ విద్వద్గ్రంథకర్తలునగు ఆచార్య శ్రీరాయప్రోలు సుబ్బారావుగారు.

సికింద్రాబాదు
8-౭-54

శ్రీ ర వ్యా త్

జ్యోతిర్మయమగు శబ్ద
శ్వేతారణ్యమున మానుషీహృన్మథి తా
కూతి నరసి పాడిన వా
చాతీర్థుల సాహితీ సృజన కగు జయముల్

గర్గ మహామునివృషభుని
వర్గళవాచావిధేయరసవత్ భగవత్
సర్గముల నాంధ్ర భాషా
మార్గములన్ మెలపితివి సమర్థముగ కవీ!

నవనీతచౌర్యమో, యా
దవీదుకూలాపహరణ ధౌర్త్యమొ, శరదు
త్సవరాసలాలనమొ, భా
గవతము! రుచియింపదేది? కవికంఠరుతిన్

రాధా దివ్య చరిత్రను
ధారాధారావీచికలను తడిసిన యదుకాం
తాధేనువత్సచేతో
వీధులు రాగిల్ల పల్లవింపవెటు కవీ!

అవతారములన్ కృష్ణుని
యవతారం, బుభయచారితార్థ్యంబుగ వె
ల్లివిరిసె, భాసించె తదీ
యవిశ్వతోముఖమహత్వ, మప్పయశాస్త్రీ

వస్తువు గోపాలకథా
నిస్తుల వీరాకలావినీతము, శృంగా
రస్తవ, మది తెనుగున వి
న్యస్తము కావించినాడ వమృతోక్తి, కవీ

మా తెనుగుతోఁట సంస్కృత
చూతంబులు మొలిచినట్లు సుఖముగఁ బెరిగెన్
ప్రీతి పులకింప శుకపిక
జాతకపాయకలకంఠశైలి ధ్వనింపన్

శ్రీ పరమేశ్వరాయనమః

# మనవి

సరసులారా

ఈ గర్గభాగవతము బహుకాలము క్రిందటనే ప్రచురించియుంటిని. ప్రథమ ముద్రణప్రతులువేయియు నతికాలములోనే ధార్మిక, భక్త, పౌరాణిక, భాషాభిమానుల సాదరాభిమానములవలనవ్యాప్తిం జెందినవి. అవ్వారికి నాకృతజ్ఞతాపూర్వకధన్యవాదములు.

వెనువెంటనే దీని ద్వితీయ ముద్రణము వేయింపఁజాలక చిరకాలము నుండి యీ గ్రంథముకై నిరీక్షించుచుండిన వారికాశాభంగము గల్గించినందులకు విచారించుచున్నాను. అయినను శ్రీ రాధాకృష్ణభగవానుని యపారకృపనునేఁటికి దాని ద్వితీయ ముద్రణము వేయఁజాలినందుల కానందించుచున్నాను. ఈ ముద్రణమునందివఱకుఁగల నవఖండములేకాక అశ్వమేధఖండము, అను మఱియొకఖండము జతపరచితిని. మఱియుఁ బూజ్యులు, సమకాలికులు, ప్రసిద్ధ విద్వత్కవులు, విమర్శకులు, మిత్రులునైన మహోదయుల యభిప్రాయములను జేర్చి కృతార్థుఁడనైతినని తలఁచుచున్నాను. ఈ గ్రంథమందు ప్రధానములగు శ్రీరాధా, కృష్ణ, గోపికా దీతివృత్తాదుల తత్వమించుక నిటవ్యక్తపఱుపబడుచున్నది.

**రాధ**— శ్లో॥ అనయారాధ్యతేకృష్ణో । భగవాన్ హరిరీశ్వరః
లీలయా రసవాహిన్యా । తేనరాధాప్రకీర్తితా॥

శ్లో॥ రాధికాపి పరాశక్తిః । కృష్ణేచానందరూపిణీ
నిత్యా చ నిత్యసత్యాస్మిన్ । స్వాధారేపురుషోత్తమే॥ (బృహద్బ్రహ్మసంహిత.)

శ్లో॥ రమయాంతురకారస్యా । దాకారేఽస్యాదిగోపికా
ధకారోధరయాహిస్యా । దాకారోవిరజానదీ॥

అనెడి ప్రమాణములను బట్టి కొందఱు తలచినట్లు శ్రీకృష్ణునకుమేనత్తయు, నుంపుడుకత్తెయు గాక కేవలము పరాశక్తి, త్రిగుణాత్మిక, శ్రీకృష్ణ భక్తి స్వరూపిణి, యనియెఱుంగబడుచున్నది.

**శ్రీకృష్ణుఁడు**— శ్లో॥ కృషి ర్భూవాచక శ్శబ్దో । న శ్చానందవిధాయకః
సదానందసమావేశః । కృష్ణ ఇత్యభిధీయతే॥

శ్లో॥ సచ్చిదానందరూపాయ । కృష్ణాయాఽక్లిష్టకారిణే
నమో వేదాంతవేద్యాయ । బ్రహ్మణే పరమాత్మనే॥ (బృహద్బ్రహ్మసంహిత.)

శ్లో॥ సద్యఃప్రాణిపవిత్రాణి । జగతాం మంగళాని చ
కకారః కమలాకాంతః । ఋకారో రామ ఇత్యపి॥

శ్లో॥ షకారః షడ్గుణపతిః । శ్వేతద్వీపనివాసకృత్
ణకారో నారసింహోయ । మకారోహ్యక్షరోగ్నిభుక్

శ్లో॥ విసర్గా చ తథాహ్యేతౌ । నరనారాయణావృషీ
సంప్రలీనాశ్చషట్పూర్ణా । యస్మిన్ శబ్దే మహామునీ

శ్లో॥ పరిపూర్ణతమః సాక్షాత్ శ్రీకృష్ణః ప్రకీర్తితః
శుక్లో రక్తస్తథా పీతో నీలో౽స్య యుగాంతరే॥ (గర్గసంహితగో.అ.౧౫.)

అని చెప్పఁబడినది. దీని సాంప్రదాయికతను జూచిన విశేషము కాఁగలదు.

శ్లో॥ శేషో నాగో భవేద్రామః కృష్ణో బ్రహ్మైవ శాశ్వతం॥ అథర్వణీకృష్ణోపనిషత్తు.

అనెడి ప్రమాణ బాహుళ్యమును బట్టి శ్రీకృష్ణుడు జారచోరాదులలో జేరని మహాత్ముడనియు, పరాత్పరుండనియు, భక్తవత్సలుండనియు వ్యూహావతారుండనియు, పరిపూర్ణతముండగు భగవానుడనియు తెలియుచున్నది.

గోపికలు:- "గో" అనగా ఇంద్రియములు, ఇంద్రియంబులను వశపరచుకొనినవారలు గోప్యులనియు "గోపికలనియుఁ గాఁగలరు. అనగా జితేంద్రియులనియర్థము. ఆ జితేంద్రియులే మునులు. ఈ మునులు శ్రీరామచంద్రవామనావతారంబులను బరాత్పరుం డెత్తినపుడు ప్రార్థించి వరంబులం గైకొని గోపికలుగాఁబుట్టి తమ మనోరథంబులం దీర్చుకొనియున్నవారు. కాన వారు కామాంధులగు గొల్లతలు కారు. ఈ యభిప్రాయంబులను నాథర్వణీ కృష్ణోపనిషదాదులును, బ్రహ్మవైవర్తాది మహాపురాణంబులును, విశదీకరించినవి.

ఇంక తెలుంగగోపవాటీగ్రంథంబును సమగ్రంబుగా జదువుదురుగాక.

నాకోరికను మన్నించి బహుకార్యాసక్తులైయుండియు నిద్దానిలోని ముద్రణ స్ఖాలిత్య ప్రమాదములను సవరించుటయేకాక పీఠిక వ్రాసిపంపిన నర్సారావుపేట కళాశాలాంధ్రోపన్యాసకులగు శ్రీ తూములూరి శివరామకృష్ణమూర్తిశాస్త్రి బి.ఓ.యల్.ఎం.ఎ. గారికిని, పరిచయము వ్రాసిన ఉస్మానియా యూనివర్సిటీ ప్రొఫెసరు శ్రీ దివాకర్ల వెంకటావధాని ఎం.ఎ. గారికిని, అభిమతాభిప్రాయములను వ్రాసిపంపిన సాహిత్యాచార్య సాహిత్య సమ్రాట్, కవీంద్రేత్యాది బిరుదాంచితులగు శ్రీ శివశంకరస్వామి (తెల్లావఝుల శివశంకర శాస్త్రి) ప్రభృతి కవిపండిత ప్రకాండులకు వాత్సల్య పూర్వక వందన సహస్రంబుల నర్పించుచున్నాఁడను.

ఇద్దాని ముద్రణ సమయమందు నేననారోగ్యముగా నుండుటయు, గార్యాంతరముచే గ్రామాంతరమందుండుటయు నిందు నెఱసులు దొరలుటకుఁ గారణములైనవి. ఇట్టివానిని నీగ్రంథాంతమందున సవరించి ముద్రింపించితిని. ఇంక మిగిలియున్నచో వానిని గూడ సవరించుకొనుచుఁ బఠింపఁ బ్రార్థితులు.

శా॥ ఏరెట్లన్నను నీకృతిం గుఱిచి శ్రీ ♦ కృష్ణార్చనాలోలురుల్
ధీరుల్ దీనదయాళురున్ రసికులున్ ♦ ధీమంతులున్ భూమిలో
లేరే? చూడరె? మెచ్చరే? యిఁకను జా ♦ లింబొంది నాకేటికా
శ్రీరాధారమణుండు పూర్ణదయ హా ♦ ర్థించున్ గదా యెట్టులేన్.

క॥ ఎందాఁక సూర్యుఁడుండునొ, యెందాఁక సుధాకరుండు ♦ నెసఁగునొ తారా
బృందంబెందాఁకను దివిఁ, జెందునొ యందాఁక నిది వ ♦ సించుత భువిలోన్

9-2-54
సికింద్రాబాదు

సుజనవిధేయుఁడు.
చివుకుల అప్పయ్యశాస్త్రి

# విషయసూచి

## —♦ బృందావన ఖండము. ♦—

## —♦ గిరిరాజ ఖండము ♦—

—♦ మాధుర్య ఖండము ♦—



—♦ మధురా ఖండము ♦—

విషయము. పుట.



—♦ ద్వా ర కా ఖ ం డ ము ♦—

—♦ విశ్వజిత్ఖండము ♦—

## —♦ బలభద్ర ఖండము ♦—

సమాప్తము.





గ్రంథకర్త : చివుకుల అప్పయ్యశాస్త్రి.

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః.

# శ్రీ గర్గ భాగవత మాహాత్మ్యము



గరుడధ్వజ కులగురు
నాగమ సర్వార్థవేది నవ్యయ మహిమున్
యోగీశవంద్య చరణుని
శ్రీ గర్గాచార్య కవిని సేవింతు మదిన్. ౧

శా॥ బోధోద్ధార ధురీణ! మౌనితిలకా! పూర్వుల్ పురాణంబులన్
బోధింపన్ జెవులార వింటి మఘనిర్మూలంబునుం గంటి మా
రాధా మాధవ సత్కథాగ్రథిత గర్గప్రౌఢ సత్సంహితా
సాధిష్ఠత్వ మహత్వ సత్వ రచనాసామర్థ్యముల్ దెల్పవే! ౨

ఉ॥ ఈవిధి శౌనకుం డడుగ నిద్ధ పురాణ పరాయణుండు వే
దావళితత్త్వనిర్ణయమహాత్ముఁడు సూతుఁడు మౌనిరాజసం
భావిత గర్గ సంహిత ప్రభావము నారదుచేత వింటి మున్
భావములందు నాటునటు బల్కెఁద మీరిపు డాలకింపుఁడీ! ౩

వ॥ తొల్లి విమలంబును వివిధవిధఫలపుష్పవిరాజితంబును నగు కైలాస
శిఖరంబునందు సాంద్రంబగు నొక్క వటభూరుహాధఃప్రదేశంబునఁ బ్రేక్షకమనోభి
రామంబగు నొండుమండపమున యక్షరక్షస్సిద్ధసాధ్యకిన్నరకింపురుష నిషేవితుండై
సహస్రప్రభల వెలుంగుచు లోకశంకరుండగు శంకరుండు సింహాసనాసీనుండగుట
శర్వాణి యవలోకించి నిజమనోరథమును మనోనాయకునకు నివేదించుకొనఁదలంచి
సర్వమంగళసంపన్నురాలై సమీపించి సన్నుతించి సాంజలియై యిట్లనియె. ౪

చ॥ సతతము నేదొ ధ్యానమును సల్పుదు రేలకొ? దాని నిశ్చయ
స్థితి, జని కర్మమర్మములఁ జెప్పుఁడు విష్ణుసహస్రనామముల్
శ్రుతపడెఁ దొల్లి యిప్డల యశోదకిశోరుని పూతజీవితం
బతులముగా వచించుటకుఁ బ్రార్థనచేసితిఁ బ్రాణనాయకా! ౫

వ॥ అన విని శర్వుండు శర్వాణి కిట్లనియె. ౬

గీ॥ సర్వమంగళ! రాధేశు సచ్చరిత్ర. గర్గసంహితయందునఁ గ్రాలుచుండె
ననఁగ నగజాసతీమణి తనదువిభుని, తోడఁ దిరిగియు నిట్లు మాటాడఁదొడఁగె.

చ॥ కలవుగదా పురాణములు గావ్యములుం మఱి సంహితాదులుం
గలవుగదా త్రివేదములు గాఁ గలునుగా నితిహాస సంచయం
బులు నివియెల్లఁ బేర్కొనుట యొక్కమూలను సమంచెడి గర్గసంహితన్
దలఁచితి వేలకో? యది వినంగఁ గుతూహల ముప్పతిల్లెడిన్. ౮

చ॥ ఇదియును గాక గర్గకవి యీకృతి నెవ్వరిబోధఁ జేసెనో
ముదమొదవించు శ్రీహరి యమోఘవిలాసము లెట్లు నింపెనో?
యిది వినినట్టివారు సుఖ మెట్టి ఫలంబుల నొందనుందురో?
యిదివఱ కేరు దీని విని వృద్ధినిఁ జెందిరొ? వీనిఁ దెల్పుఁడీ! ౯

చ॥ ఇటులఁ బ్రియావచస్సుల గిరీశుఁడు వించుఁ బ్రసన్నచిత్తుఁడై
పటువిబుధప్రకాశిత సభన్ గని దారుణ పాప తాప సం
కట హార శౌరిరాధల ప్రకర్ష మహత్త్వను గర్గసంహితో
త్కట మహిమంబుఁ బల్కెడను దత్పరతన్ వినుమా! యుమాసమా! ౧౦

వ॥ తొల్లి భగవానుఁడగు హరి స్వచరిత్రంబుఁ బ్రచురింప, బ్రహ్మదేవునిచేఁ బ్రార్థితుండై భూతలంబున కరిగి, యరసి, రాధాదేవికిఁ జెప్పి, గోలోకంబునకుఁజన నచట ననంతునిచే వందితుండై యాతని వేఁడికోలుమీఁదఁ బవిత్రంబగు తన చరిత్రంబు సంపూర్ణంబుగా శేషున కుపదేశించె. అంత నా యనంతుం డా యనంత శయానుజీవితంబు విరించికిని, విరించి ధర్మునకును, ధర్ముఁడు దనకుమారులకు నుప దేశించుచు వచ్చిరి. పిమ్మటఁ దత్కథాసుధను నరుఁడు గ్రోలి నారాయణునకును, నారాయణుఁడు భగవత్సేవాపరతంత్రుండగు నారదమహర్షికి నుపదేశించె. అంత నా మహర్షి త్రికాలజ్ఞుండగు గర్గాచార్యునకు భక్తనిక్షేపంబును, బరమజ్ఞానమాని తంబునగు శ్రీకృష్ణ చరితంబుఁ జెప్ప, నా గర్గుఁ డందలి మహిమం బాలోకించి, యుపదేశకుండగు నారదమహర్షిని హర్షోత్కర్షమనస్వియగుచు, సన్మానింప, సంత సించి, యా నారదుండు గర్గున కిట్లనియె. ౧౧

ఉ॥ దోస మొకింత లేనిదియు స్తుత్య మభీష్టద మవ్యయం బనా
యాస సుఖప్రదంబు గమలాక్షు పదాంబుజ భక్తిదంబునై
వాసినిఁగన్న కృష్ణభగవానుని కీర్తిని సంగ్రహించి నీ
కీ సమయంబు నందు వచియించితి విస్తర మిద్ది సల్పుమా! ౧౨

చ॥ విరివిని సల్పినట్టియిన విశ్వమునం దిదియే ప్రసిద్ధికిన్
సరగున వచ్చుకై వడిని శక్తికొలంది నొనర్తు వ్యాసుఁడీ
వరకు మదాజ్ఞచేత నల భాగవతంబును సల్పె దానికిన్
మరుగున నుంచి నీ కృతియె మా బహులాశ్వునకున్ వచించెదన్. ౧౩

చ॥ అనవుడు గర్గమౌని వినయావనతుండయి వీనులారగా
విని మునినాథ! మీ నుడులు విశ్వహితంబులె కాని మాకు నం
దని వటులైన మీయు దయ దాల్చితిరేని రచించెదన్ జుమీ
యనవుడు నారదుండు ముద మందెను డెందమునందుఁ బార్వతీ! ౧౪

వ॥ అంత దేవర్షియగు నారదుండు సంతోషావేశంబున వీణెతంతియుల సవరించుచు, శబ్దించుచు, నాడుచుఁ, బాడుచు, యోగీశబృందారకబృందవందితుండై బ్రహ్మలోకంబున కరిగె. గర్గాచార్యుండును గర్గనామంబునం బరగు నొక్క యచలంబున నిశ్చలస్వాంతంబున నారదోపదేశంబున విన్నవియుఁ దాను గన్నవియు, నింక నెన్నెన్నియో తెన్నుల నెన్నియున్న యా వెన్నుని మహిమంబులను, విచిత్రచరిత్రంబులను, నారద బహులాశ్వ సంవాదంబున నిరూపించుచు, శ్రీకృష్ణభక్తి వివర్ధనకరంబగు నొక్క శాస్త్రంబు ద్వాదశ సహస్ర శ్లోకపరిమితంబుగా రచించియుండె. అంత దానికి గర్గసంహితయను నామంబు ప్రసిద్ధంబయ్యె. ౧౫

ఉ॥ ఈ కృతి విన్నమాత్రమున స్వేష్టము లెల్ల ఫలించు నిక్కమీ
వాకున కొక్క సత్కథను బల్కెదఁ గల్కిరో! వజ్రపుత్రుఁడున్
బ్రాకట జీవితుండు ప్రతిబాహుఁడు మాలిని నాగ నాలితో
శ్రీ కర కృష్ణ పాలిత పురిన్ మధురన్ నివసించె నయ్యెడన్. ౧౬

ఉ॥ సంతతి లేమిఁ జింతలఁ గృశత్వమునందుచు సంతుకై తపో
వంతులకున్ సువర్ణ పశు వస్త్ర ధరా ప్రభృతిప్రదానముల్
సాంతప నాశ్వమేధముఖ సర్వమఖంబులఁ జేసియున్ మన
శ్చింత యొకింతయున్ విడక చిక్కుచు నిట్లు విచార మొందెడిన్. ౧౭

మ॥ ధనమా లోపము లేకపోయె నిఁక మా దాంపత్య సంబంధమా
యనుకూలంబు బలంబు నత్యధికమే యారోగ్యమా యోగ్యమే
ఘనరాజ్యంబు నయాన్వితంబు గొఱతల్ గాన్పింప వెచ్చోటఁ ద
త్తనయా భావమె భావశల్యమయి చింతావార్ధి నన్ ముంచెడిన్. ౧౮

చ॥ పితరులు తర్పణోదకము బెగ్గిలి కోష్ణముగా గ్రహించి భూ
పతి ప్రతిబాహు పిమ్మటను బాలుఁ డొకండును లేకపోవుటన్
గతు లిఁక మాకు లేవనుచుఁ గన్నుల నీరును నించుచుందు రా
స్థితిఁ గని యూరకుండ వలసెన్ మఱి యేమి యొనర్తు దైవమా! ౧౯

చ॥ తురగము లున్న నేమి బహు దుందుభి బృందము లున్న నేమి చి
త్రరథము లున్న నేమి ధనరాశులు యోధులు నున్న నేమి ధీ
వరసచివుల్ పురోహితులుబంధువులున్ గవు లున్న నేమి నే
ర్పరితన మున్న నేమి యొకబాలుడు నాకు జనింపనప్పుడున్.

ఉ॥ దేవమహర్షి సంతతి పితౄణము లన్నిఁటిఁ దీర్చి వేయు మ
జీవిక సార్థకంబని వచింపఁగ నైహికపారమార్థిక
శ్రావితసౌఖ్యముల్ గడన సల్పితినంచుఁదలంప స్వార్జిత
శ్రీ విభవంబు మంచిదని చెప్పఁగ నర్హుఁడు పుత్రవంతుఁడే. ౨౧

ఉ॥ వ్యాకరణంబునన్ గిరయు బోధమదంబునఁ గుంజరంబు రా
కాకువలాప్తుచేత నిశ కంజనికాయము చేఁ దటాకముల్
వ్యాకరణ శ్రుతిస్మృతినయాదివిదగ్రణులన్ సభాస్థలం
బాకస మభ్రిపం క్తిని వరాత్మజుచేఁ గులమొప్పు నెప్పుడున్. ౨౨

ఉ॥ సంతతిలేని గేహమును జన్మము వ్యర్థములౌటఁ బ్రాజ్ఞుఁ డా
సంతును వృద్ధిఁ జేసికొని సౌఖ్యములన్ గననౌనటంచు నిం
తింతనరానిచింతలను నేడ్చెడి నాప్రతిబాహు భూవరుం
డంత స్వకీయమూర్ధజచయార్జునతన్ గని యాశ వీడెడిన్. ౨౩

తే॥ భార్యతోడుత నిట్టులఁ బ్రబలదుఃఖ, మొందుచుండిన ప్రతిబాహు నొక్కనాఁడు
మధురయందున శాండిల్యమౌని వేడ్కఁ,జూడ నేతెంచె గిరిజ! విశుద్ధచరిత!

చ॥ మునిపతిరాకఁ గన్గొనుచు ముందుగ లేచి, నమస్కరించి, య
ర్చనల ననేకముల్ సలిపి రంజిలజేయ మునీశ్వరుండు నె
మ్మనమునఁ గౌతుకంబు గని మానవనాథ! కుటుంబరాష్ట్ర పా
లనములఁ జక్కనుంటివె? సలక్షణ సౌఖ్యము లబ్బుచున్న వే? ౨౪

చ॥ అని యడుగంగ తేఁడు సకలార్థవిదగ్రణి! పూర్వజన్మ సం
ప్రణిహిత దోషలబ్ధనిజబాధ యనిర్వచనీయమయ్యె నే
మని వచియింతు? రాష్ట్రమున నన్వయమందునఁ బట్టణంబునం
దున సుఖముండినట్టులుగఁ దోఁపదు మీరిది గుర్తెఱుంగరే? ౨౫

చ॥ మన ప్రతిబాహుపిమ్మట సమంజసపాలనఁ జేయువాఁ డొకం
డు నిచట లేఁడటం చెదఁగడున్ వెతనందుచునుండ్రి నాప్రజల్
కనులకుఁ బండువౌ సుతుఁడు గన్పడుగా యని నాదు భార్య నే
నును బిత్రుదేవతల్ సతము నొచ్చెదు మేమి యొనర్తుఁ? జొత్తెటన్. ౨౬

ఉ॥ నాగతి యిట్టులుండె దయ నాపయిఁ గూర్చుచు దివ్యదృష్టిచే
బాగుగఁ జూచి పుత్రుఁగను భాగ్యము నాకొనఁ గూడఁజేయుఁడీ!
యోగికులావతంస! విన నువ్విళులూరుచు నుంటి నింక నా
యోగ మెటుల్ ఘటించునది యొప్పుగఁ జెప్పుఁ డనన్ మహేశ్వరీ! ౨౭

క॥ నావుడు శాండిల్యుండును, భూవర ! బహుళప్రదానముల మును వీరల్
గావించియుంటి రందునఁ, దానకభావార్ధసిద్ధి దనరక పోయెన్.

ఉ॥ ఐన శుభప్రదంబును మహామహిమోత్తము ముత్కటవ్యథా
దీనహృదబ్జమిత్రమును దివ్యకథామృతపూరితంబు సం
తానఫలప్రదం బహితదారుణమా నల గర్గసంహితన్
మానినిమాలినిం గలిసి మంచితనంబున నాలకింపుమా ! ౩౦

చ॥ ధనమును గోరు వారలును ధర్మముఁ గోరెడివారు విద్యలా
ర్జన నొనరించువారు చెఱసాలలనుండి విముక్తిఁ గోరువా
రును గులదీపకాత్మజసురూపముఁ గాంచఁదలంచువార లీ
ఘనమగు గర్గసంహితను గర్ణములార వినంగనౌ విభూ ! ౩౧

చ॥ క్రతువులు సత్రయాగములు గాశి గయామధురా ప్రయాగ తీ
ర్థతతిగమంబులన్ గలుగు ధన్యతకంటెను గర్గసంహితా
కృతి వినుటన్ లభించు కృతకృత్యత నుత్యము గాన దీనిఁ బం
డితుఁడును బామరుండను గడించి వినందగు నెన్నిభంగులన్. ౩౨

చ॥ సతులును బిన్నపెద్దలును సర్వకులంబులవారుగూడ స
న్మతిఁ బఠియింపవచ్చును వినందగు నట్లొనరింప వారని
ర్మితియును వేళలే దిది యమేయపురాతన జన్మపుణ్యసం
తతి లభియించుఁగాని పెఱదారులఁ జిక్కదు నిక్కమేలికా ! ౩౩

ఉ॥ పాపు లవైష్ణవుల్ జగదబాంధవులున్ గురుభక్తిహీనులున్
దోపిడికాండ్రు నాస్తికులు ధూర్తులు గర్వులు గర్గసంహితా
ప్రాపణమం దనర్హు లిఁకఁ బ్రాణు లనిత్యము లౌటచేత జే
సేపని యెట్టులైనా యిపు డియ్యది వించు సుపుత్రుఁ గాంచుమా! ౩౪

చ॥ భవనము శుద్ధిసల్పి బహువర్ణవిచిత్రిత రంగవల్లులన్
బ్రవణాతత్రోడఁ బెట్టుచు శుభప్రదమా కదళీవిభాసుర
ప్రవిమల మండపంబున సుపల్లవపంచకవారిపూర్ణమై
భవయుతకుంభ ముంచి గజవక్త్రున కర్చలఁదొల్తఁ జేయుమా ! ౩౫

ఉ॥ నమ్మి నవగ్రహంబుల కనంతరమందునఁ బూజసల్పి శ్రా
వ్యమ్మగు గర్గసంహితను భక్తిని నర్చ లొనర్చి స్వీయదా
ర్థ్యమ్మకొలంది దక్షిణగ హైమమొ వెండినొ వక్తకిచ్చి యో
గ్యమ్మగు తద్ఘటంబున సుఖంబిడు శ్రీఫలముంచనౌ విభూ ! ౩౬

ఉ॥ అంతట భక్ష్యభోజ్య పరమాన్న ఘృతాధిక లేహ్యచోష్యముల్
శాంతి మహోపవేశనము సల్పుచుఁ దత్తలనీరజంబు ల
త్యంతము బూజజేసియు శుభార్తిక మిచ్చి ప్రదక్షిణంబు లా
యంతిమవాసరంబున నసర్గళ కీర్తి నొనర్పవో ప్రభూ! ౩౭.

సీ॥ పండిత పుత్రుఁడై భారతకథలని, ముసలమ్మ కథలను మూల్గువాని
శ్రీరంగనీకులఁ జెప్పుచు దొమ్మతి, గుడిసెలలో దూరు కొంటెవాని
దబ్బఱ నొరులను దబ్బిబ్బు నొనరించి, లిబ్బులగాఁజేయు లేకివాని
వైష్ణవుఁడనటంచు విష్ణుమిత్రుండైన, శివు సహస్రనామము దూషించువాని

తే॥ కామకోపాదివైరి షట్కంబువలనఁ, బరగువానిని హేతువాదములను
జేయు వానిని వక్తగఁ జేయరాదు, గానఁ బొరపాటుపడకుమీ కార్యమందు.

చ॥ హేతువాదియై జనుల కార్తిని గూర్పఁగ గర్గసంహితా
పఠనము భంగపాటులఁ బల్కెడు యత్న మొనర్చువాఁడు దా
జఠరము బెద్దదై మడియు సందియ మిందున లేమి నెవ్వఁడేన్
శఠహతహీనుఁడౌచు గురు శౌరులభక్తిని నుండగా దగున్. ౩౯

చ॥ పరమగు బ్రహ్మచర్యవిధి వర్తిలి ప్రత్యహ మేకభుక్తమున్
జొరవగఁ జేసియేని పరిశుద్ధహవిష్యము కందమూలమో
పెరుగో ఫలంబో పూరికలో పిండియో భక్ష్యములే గ్రసించుచున్
ధరను బరుండి తొమ్మిది దినంబులఁదాఁక వినంగనౌ గథన్. ౪౦.

చ॥ ఎవఁడు సమస్తశాస్త్రచణుఁ డెవ్వఁడు సద్గురు వంశ సంభవుం
డెవఁడు కృపాకరుండు మఱి యెవ్వఁడు మాధవ భక్తిపూరితుం
డెవఁ డనుమాన వారకుడు నెవ్వఁ డుదారుఁడు సాధుబోధనా
వివరణదక్షుఁ డెవ్వఁడు వివేకి యతండె ప్రవక్త యయ్యెడిన్. ౪౧.

ఉ॥ ఉక్తవిధిన్ బ్రవక్తను నియుక్తుని జేసిన మీఁదటన్ యథా
శక్తిగ వేఁడి బాడబులఁ జక్కని ద్వాదశవర్ణ మంత్రమున్
యుక్తజపంబు సల్పి సకలోత్కట విఘ్నము లంతరింపఁగా
రక్తి స్వమిత్ర బంధువులు రా నొనరించి గ్రహింపనౌఁ గథన్. ౪౨

వ॥ అంత నయ్యాచార్య వర్యుచేఁ బ్రత్యవరోధ విహీనంబుగాఁ బ్రత్యహంబు మూఁడు జాములు గర్గసంహితను నొకఖండంబుచొప్పునఁ బ్రాగల్భ్యగళంబునఁ జెప్పింపనగు, ఈ నిర్ణీత యామత్రయ కాలంబున లఘుశంకాది కృత్యంబుల నిర్వర్తించి పాణిపాదముఖ ప్రక్షాళనంబు లాచరించుటకుఁగా నెక్కడ నేనిఁ గథాంతమం దాపించి రెండుమారు లావాచకునకు విశ్రాంతి నీయందగు, ఇట్లు సక్రమంబుగాఁ

పారాయణంబుఁ జేయించుచుఁ దొమ్మిదవ దినంబున నవమంబగు విజ్ఞానఖండంబున గర్గసంహితా గ్రంథంబు నావాహనాది షోడశోపచారంబులఁ బూజించి పిమ్మట నాథుబోధనా చతుష్ఖండకు చవ్వోర్ధనుగూడ శ్రద్ధమెయి నర్పింపనగు, కథావిశ్రాంతమంబైనతటి విష్ణు భక్తి పరాయణులగు స్త్రీపురుష జనంబులతోఁగూడఁ గాంస్యశంఖ మృదంగాదిసమన్వితంబుగా నలుగడల నాట్యంబు సలుపుచు జయజయధ్వానంబులతో భగవన్నామ సంకీర్తనంబు సేయందగు. అనంతరంబునం దా గర్గసంహితాకృతి స్వర్ణ సింహాసనంబుందుంచి, సదక్షిణగా నాచార్యున కర్పింపఁదగు. ఇట్లాచరించినవా రైహిక సౌఖ్యం బనుభవించి, యంతిమంబున శ్రీహరిం బొందుదురు. ఇక్కలియుగంబున నిదియే చక్కని సులభోపాయంబై యఘనిర్మూలకంబై యనంత సుఖ ప్రదంబై యలరారుచున్నయది. ఇట్టి గర్గసంహితా శ్రవణంబుకంటె భుక్తిముక్తి ప్రదంబగు నన్యం బేమియున్నదని వినవలతుమో వచింపుమని ప్రతిబాహుభూవరు నడుగ నతఁ డవనతశిరస్కుఁడై ప్రసన్నుండగుచు శాండిల్యమహర్షి కిట్లనియె. ౮౩

ఉ॥ కంటిని మిమ్ము నిమ్మెయిని గన్నుల పండువగా మునీశ్వరా!
వింటిని సంహితామహిమ వీనుల విందుగఁ బాపనాశమున్
గంటిని మీరు సెప్పిన ప్రకారము కార్యములన్ ఘటింప నే
నుంటిని నన్ సపుత్రుఁగ నెటో యొనరింపు మటంచు వేఁడెదన్. ౮౪

తే॥ అంత శాండిల్యమౌనియు నభిమతించి, సర్వమంగళప్రదగర్గ సంహితాకృ
తిన్ బ్రబోధింపఁగాఁబ్రయత్నించి యమున,గట్టునన్ మండపముఁగట్టెఁగ్రమవిధిని.

ఆ॥ అవల మధురయందు నమరిన జను లది
యాలకించి యచటి కరుగుదెంచి
రంత తేఁడును పఠనాద్యంతముల బ్రాహ్మ
ణులకు నన్నదానములను జేసి. ౮౫

తే॥ హస్తి రథ హయ డింగరా నర్ఘ్యమణి సు
వర్ణ గో ధనరాశులఁ బరమ భక్తి
నల్ల శాండిల్యముని కిడె నంత మునియు
గర్గసంహితా కృతిఁ జెప్పి కౌతుకమున. ౮౬

తే॥ ఆ సమయమందె నీకుఁ బల్కాడినట్టి, హరి సహస్రనామంబుల నధిక కరుణఁ
జెప్పె తేడంతమున ముని సెప్పినటుల, భువన మోహను శ్రీకృష్ణు బుద్ధినిల్పి.

మ॥ మురళీగాన మనోహరా! విబుధసంపూజ్యా! జగన్మోహనా!
కరుణా భూషణ! దైత్యశోషణ! జగ త్కల్యాణ కృత్త్రాణ! యో
దరహాసాంచిత పూర్ణ చంద్ర సుముఖా! ధారాధరాభ ప్రభా!
దరచక్రాది ధరా! నగేంద్ర ధర! రాధామాధవా! భూధవా! ౮౭

మ॥ అని ప్రార్థించి నమస్కృతుల్ సలుపఁగా నా దేవదేవుండు వం
శిని వేత్రంబును దాల్చి పీతపటముల్ సెల్వారఁగాఁ గోటిమా
రనిభుండై యనుకంపతో నగుచు నా రాధా సతింగూడి యా
తని ప్రోలన్ దెసలున్ వెలుంగఁదగె నాస్థన్ నేత్రపర్వంబుగాన్. ౫౦

వ॥ ఇట్లు ప్రాదుర్భవించిన జగన్మోహనాకారుండగు శ్రీకృష్ణుని శాండిల్య
మహర్షియుఁ, బ్రతిబాహుభూపతియుఁ, బట్టమహిషి యగు మాలినియుఁ గాంచి,
ప్రత్యుత్థానం బొనరించి, నమస్కరించి, యిట్లని వినుతించిరి. ౫౧

సీ॥ శ్రీవత్సలాంఛనా! శ్రీ గజపోషకా!, శ్రీ గళమిత్ర! చక్రీ! జోహారు
గోలోకనాయకా! గోపలీలాన్వితా!, వైకుంఠలోకాధిపా! జోహారు
దేవర్షి వందితా! దివ్యరూపాంచితా!, గిరిరాజ పతి మనోహర! జోహారు
బృందావనవిహార! బృందారక వ్రాతరక్షక! రాధేశ్వరా! జోహారు

తే॥ నందనందన! నారాయణా! జోహారు
దానవాంతక! మానవోత్తమ! జోహారు
సచ్చిదానంద! యింద్రానుజా! జోహారు
కృష్ణ! రోచిష్ణు! జిష్ణు! హరీ! జోహారు. ౫౨

శా॥ నీవే దిక్కని నిన్ను గొల్చితినుమీ! నీచేత నాప్రాణముల్
గావంగావలెనయ్య నీకయి నమస్కారాలు నీనుండియే,
యీవిశ్వంబు జనించుఁ, బెర్గు, దరుగున్ నీకేదసాధ్యంబగున్
నా విశ్వాసము నీపయిం గుదిరె కృష్ణా భక్త సంరక్షణా! ౫౩

ఉ॥ అంతట శ్రోతలెల్ల హరికైదుపదుల్ బొనరించి శ్రీపతీ!
సాంతము మాదు తప్పులను జక్కఁగ మన్నన సేయుచున్ సుధీ
మంతుని వంశకర్త సుకుమారుఁ గుమారుని జేని కిచ్చి మా
కంతములేని బత్తి తమయందున నుండ ననుగ్రహింపుమా! ౫౪

చ॥ గిరిజ! యిటుల్ నుతింపఁ గని కృష్ణుఁ డఖండఘనస్వరంబునన్
వరముని! పౌరులార! బహుభక్తిని నిప్డు మదీయవాక్యముల్
సరిగ వినుండు! గర్గకృతసంహిత కామచతుష్టయప్రదం
బరిహరణంబు విన్నఁ దమ యర్థితవాంఛ ఫలించి తీరెడిన్. ౫౫

చ॥ ఎవరెవ రెట్టి కోరికల నేరియు గోరియు గర్గసంహితా
శ్రవణము నాచరించెదరొ సంశయ మింతయు లేనియట్టు ల
య్యవియవి వారివారికిని హత్తునుగా యని కోర్కె లిచ్చి మా
ధవుఁడు నదృశ్యుఁ డయ్యెను ముదంబును నందరు బొందిరో యుమా! ౫౬

క॥ మునివరశాండిల్యుండును, ఘనమధురాబ్రాహ్మణులకు గౌరవఫక్కిన్
ధనమిడి ప్రత్యేకముగా జననాయకు నూజడించి చనియె మృడానీ! ౫౭

ఉ॥ మాలినిమానినీమణి సమంజసభూషణకమ్రియై విభున్
లీలలసోలి చూలు నవలీలఁగఁ బొందియు నూతికాల మం
దోలి సుపుత్త్రుఁ గాంచె నిజయుక్తకృతిప్రతతిన్ జనేశుఁడున్
మేలని యిచ్చెఁ బాపలకు మేదినిగోగజహేమవస్త్రముల్. ౫౮

తే॥ ప్రాజ్ఞుడై వజ్రనాభ సుబాహువనఁగ, నామకరణంబు సల్పి యనంతరమునఁ
బారితోషిక మతనికిఁ గోరినటుల, సిసువు సంతృప్తుఁజేసి తా నిట్లు తలఁచె.

ఉ॥ వేసిన సత్రముల్ప్రపలు వేసిన వాపితటాకకూపముల్
జేసిన యజ్ఞయాగములు జేసిన గోధనభూమిదానముల్
జేసిన దేవపూజలు ఫలించి యొకమ్మడి సిల్గుఁజెందు నా
కీసమయంబునన్ దనయుఁ జేర్పఁడ సల్పుటఁ గంటి ధన్యతన్. ౬౦

క॥ ఏవంవిధముదితుండై, భూవరుఁడా గర్గమౌనిబోధితగాథా
శ్రావితసౌఖ్యములందుచు, శ్రీవిభుగోలోకమునకుఁ జివరన్ జేరెన్. ౬౧

చ॥ ధనగృహరాజ్యపుత్రవనితాసుయశస్సుకృతప్రభావవా
హనపరమార్థముల్ గలుగు నట్లు రచించును గర్గసంహితా
మననమటంచుఁ బార్వతి కుమాపతి పల్కియు మిన్నకుండుటన్
గని ముని లూరకుండుటయుఁ గాంచి యపర్ణ వచించె నిట్టులన్. ౬౨

సీ॥ గంగాధరా! శౌరిగాథాసమన్వితగర్గసంహిత బలుకంగవలయు
నావుడు శ్రీగళుఁ డావిష్ణుచరితంబు సర్వంబు వినిపించి, సంతసించి
గౌరిరో! కలియందు గంగకుఁ గుడివైపు, రెండు క్రోశములం దఖండితముగఁ
బెంపువహించెడి బిల్వకేశవనానఁ జెందిన శ్రీకరసిద్ధపీఠ
తే॥ మందు గోలోకవైష్ణవబృందసహితవౌచు శ్రీభాగవతసంహితాదికోశ
ములను విందువటంచుఁ దా నిలుపుదలను సల్పె నీయితిహాసంబు శౌనకుండ!

చ॥ గిరిజ ప్రసన్నురాలగుచుఁ గృష్ణకథార్థిని యయ్యెఁ దత్కలిన్
సురనదియామ్యభాగమున సొంపుదలిర్చెడి సిద్ధపీఠ మం
దరుదుగ సర్వమంగళ యటంచు వచింప సురూపమొంది శ్రీ
హరికథలన్ వినన్ జననమందును శౌనక! మానినాయకా! ౬౪

క॥ ఇది వినిపించిన విన్నను, జదివించినఁ జదువువారి సర్వార్థంబుల్
గొదకొనుఁ బాపములన్నియు, సదమదమౌ విష్ణుపదము జక్కఁగఁ జిక్కున్.

గద్య. ఇది శ్రీచివుకుల అప్పయ్యశాస్త్రి ప్రణీతంబును, సమ్మోహనతంత్రాం
తర్యాతంబును నగు శ్రీగర్గసంహితా మాహాత్మ్యంబు సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ రాధాకృష్ణ పరబ్రహ్మణే నమః.

# శ్రీ గర్గభాగవతము



## ఇష్టదేవతాస్తుతి.

లావణ్యసుధాసముద్రవిలసచ్ఛ్రీమంతు నామ్నాయవీ
థీలోకోత్తరసంచరిష్ణు విబుధధ్యేయాత్ము గంగాకరున్
వ్యాళేంద్రాంచితదేహు విష్ణునిఁ బరబ్రహ్మంబు గోపాలకున్
లీలామానుషరూపు శంకరుని నే నిత్యంబు సేవించెదన్.

ఉ॥ ఐదుపమల్ బొనర్చెద నఘావళిభేదికి నంతరాయవి
చ్ఛేదికి వేదవేదికి విచిత్రతరోందురరాజసాదికిన్
మోదకఖాదికిన్ ద్రుహిణభూతపతిప్రముఖప్రశంసనా
మోదికి సుప్రసాదికిఁ గుబుద్ధినిషూదికి సాధువాదికిన్॥ ౨

ఉ॥ తోయరుహాసనుండు నఘతూలధనంజయుఁ డుత్తమశ్రుతి
ధ్యేయుఁ డనాదివేదమయుఁ డీశుఁ డుదారుఁడు ధీరుఁడున్ జగ
ద్గేయుఁడు భారతీవిభుఁడు దేవమునీంద్రనుతుండు బ్రహ్మ దీ
ర్ఘాయువు సత్కళాప్రతిభ నచ్ఛయశంబు నొసంగి ప్రోచుతన్. ౩

చ॥ జ్వలనుఁడు పాచకుండు రవిచంద్రులు వస్తుసుసాధకుల్ మునీ
శు లతిథు లద్రి వంటయిలు శుద్ధసురాపగ తోయదాత్రి వే
ల్పులమొనకాఁడు కార్యపరిపూర్ణవిచారకుఁ డన్నపూర్ణ దా
నలలనగాఁగ విందుల ఘనంబుగఁ జేయు మహేశుఁ డోముతన్. ౪

ఉ॥ శంకర! భక్తితత్పరవశంకర! నిర్జితధర్మదూరదు
స్సంకర! సర్వలోకపృథుశంకర! దర్పకదర్పశైలనా
శంకర! జిష్ణువిష్ణుముఖసన్నుతిపాత్రసుధాంశుశేఖరా!
సంకటముల్ హరించి ననుఁ జల్లనిచూపులఁ జూడుమా! కృపన్. ౫

శా॥ అమ్మా! కొల్చెద గర్గభాగవత మీ హస్తంబునన్ బూని యాం
ధ్రమ్మున్ సల్పు ననల్పయత్నమున నే దైవాఱుచుంటిన్ సుశ
బ్దమ్ముల్ బల్కుమ! మద్రసాగ్రగతవై! బ్రాహ్మీ! కృపాంభోనిధీ!
సమ్మోదావృతభారతీ! భగవతీ! సంగీతరంగన్మతీ! ౬

శా॥ అంబా! సర్వసుపర్వనాథచతురాస్యాంభోజకాసారకా
దంబా! యంబుజ కీరపుస్తకసముద్యన్మాలికాంచత్కరా
లంబా! తుంబురునారదాదిమునిసంశ్లాఘార్హవీణాకళా
లంబా! సంబర మింబుగా నిడి వచశ్శ్లాఘ్యున్ ననున్ సల్పవే. ౭

శా॥ పూతా! నీచెయి దమ్మినున్న పటికంపుం జాలమాలన్ నఖ
వ్రాతోత్సర్పిప్రచయప్రభిన్నమును గీరం బాస్థగాఁ జూచి సం
జాతామోదమనోగతిన్ గరకబీజభ్రాంతిఁ జంచూపుట
స్ఫాతిన్ లాగ నదల్చునట్టి దరహాసంబెప్డు నన్ బ్రోచుతన్. ౮

ఉ॥ దుర్గమమార్గవర్గయుత తుంగతుషారశిలోచ్చయాత్మజా!
దుర్గతదుర్గతి స్థితివిదూరకృతి ప్రథితాష్టమూర్తిసం
సర్గ! విచిత్రసర్వవిధసర్గనిదాన! సువర్ణదుర్గ! నా
కర్గళహీనసత్కవిత యబ్బునటుల్ బొనరింపుమా! దయన్. ౯

ఉ॥ రాణిని మామమామతొలిరాణిని బోషితదేవతాసుర
శ్రేణిని నారదాది మునిసేవ్యమనోహరవాణి సైకత
శ్రోణిని భృంగవేణిని ద్రిశుద్ధిగ శ్రద్ధనుగొల్తు నిత్యక
ల్యాణము బచ్చతోరణము సర్థమనారతమొంది యబ్బగాన్. ౧౦

ఉ॥ ఏకలికిన్ వరించి హరి యిద్ధనరోత్తముఁడయ్యె మన్మథుం
డేకమలాక్షికిన్ గలిగి యెల్లెడ రూపసియయ్యె దూష్యదో
షాకరుఁడేమెతోడగుట స్తవ్యసుధాకరుఁడయ్యె వార్థిర
త్నాకరమయ్యె దేనిఁగన నట్టి హరిప్రియ నన్నుఁ బ్రోచుతన్. ౧౧

—[ సంస్కృత కవీంద్ర స్తుతి. ]—

ఉ॥ నాకనివాసినిత్యనుతనారదబోధితు డై కళానిధి
శ్రీకరుణాతిరేకమునఁ జిత్రకవిత్వము "మానిషాద" సు
శ్లోకముఖానఁబుట్ట రఘుశూరచరిత్రము వ్రాసినట్టి వా
ల్మీకిమహర్షి కాదికవిమిశ్రులకే నొరిగల్ బొనర్చెదన్. ౧

చ॥ నవనవభావభావితము నైగమసూక్తినియుక్త మద్భుత
ప్రవిలసితంబు సత్పురుషపావనజీవితజీవితంబుఁ బా
పవిషలతాలవిత్రమును భద్రనదీనదచిత్రచిత్రితం
బు వినుతమౌ పురాణతతిఁ బూనిక వ్రాసిన వ్యాసుఁ గొల్చెదన్. ౨

చ॥ కవనము జాహ్నవీఝరముకైవడిఁ బాఱ నుతింతు గర్గునిన్
గవివరకాళిదాసుని జగద్గురుశంకరు బాణ దండి భా
రవి జయదేవ శూద్రక ధరావిభుభోజుల రాజశేఖరున్
గవిభవభూతి మల్హణునిఁ గల్హణ బిల్హణ జల్హణాదులన్ ౩

## —♦ ఆంధ్రమహాకవి ప్రార్థనము. ♦—

ఉ॥ మోదముతోడ మ్రొక్కెదను ముద్గలగోత్రజు నన్నయార్యు మా
వైదికవంశదీపకు నపారతపోధను విస్తృతాష్టభా
షావయితున్ సుమత్యమరసద్గురునిన్ నిగమార్థవేది నాం
ధ్రాదికవీంద్రు భారతమహాగమసత్కృతిసంవిధానునిన్. ౧

ఉ॥ కక్కురితిన్ బదంబులను గైకొనకుండఁ దెనుంగుబాసలోఁ
జిక్కిన శబ్దజాలము సుశీలురు మెచ్చఁగ సేకరించి పే
రెక్కిన భారతంబు బదునేనుకృతుల్ రచియించి కైతకున్
దిక్కన వన్నెకెక్కుకవితిక్కన కేను నమస్కరించెదన్. ౨

ఉ॥ కన్నులనీరు నీరధిగఁ గాఱ్చుసరస్వతిఁ గాంచి "యమ్మరో
బన్నపడంగనేల"యని భాగవతాహ్వయకోశరాజమా
పన్నదయాళురామునకు భక్తిని నంకితమిచ్చి యామె యా
పన్నతఁ బాపినట్టి కవిబమ్మెరపోతన కేను మ్రొక్కెదన్. ౩

మ॥ వినుతింతున్ ఘనశంభుదాసకవినిన్ భీమన్న సోమన్నఁ గే
తన శ్రీనాథుని మారనాఖ్యుఁ గవితాధన్యాత్ముఁ బెద్దన్నఁ ది
మ్మన సూరన్నల రామరాజకవినిన్ మల్లన్న శ్రీకృష్ణరా
యనరేంద్రున్ మఱిఁ బ్రస్తుతాంధ్రకవితావ్యాపారపారీణులన్. ౪

## —: కవివంశానుక్రమణిక. :—

తే॥ దేవదేవ! రాధాకృష్ణ! యీవసుధను, నీకుఁ దెలియని దెయ్యది నీరజాక్ష!
యైన నాచరితంబు నీ వవధరింపు, మాత్మనుతియని యెంచక యబ్జనాభ! ౧

సీ॥ విద్వదగ్రణియు భారద్వాజగోత్రుండు, నారాయణాఖ్యుండు నాదు తాత
గీతాధ్యయనకృతి పూతచరిత్రుఁడైన, కామయ్యసూరి నా కన్నతండ్రి
సకలసాధ్వీమణి సంస్తవమెంతయు, గనిన కోటమ్మ నా కన్నతల్లి
విధిగుండికాతటప్రథితమా నందిపా, డ్గ్రామోత్తమంబు నాకన్నచోటు
తే॥ చివుకులయని గృహాఖ్యయుఁజెలఁగు కృష్ణ! యిద్ది ననుఁగని యైదేడు లేగువఱకుఁ
బెంచినట్టివారల కులవృత్తి మింక, దత్తుఁగైకొన్నవారి వృత్తాంతము విను. ౨

సీ॥ చివుకులకులవార్ధి శీతకరాప్పయ, నామకబుధుఁడు పితామహుండు
స్కంధత్రయాత్మకజ్యోతిషధీరసుబ్రహ్మణ్యవిబుధుండు వరజనకుఁడు
దానధర్మప్రియానూనాచరణరత,మైన లక్ష్మీదేవి యమలజనని
ధరఁ జిరప్రూరు సీతారామనామక, వ్యాకరణజ్ఞుండు పరమగురుఁడు

తే॥ గోత్ర మరయ భారద్వాజగోత్రమె సుమి, వాసమెన్నఁగ హైదరాబాదుపరిస
రాంచితంబును ధార్మికప్రాంచితంబు వరమునైన శికిందరాబాదుపురము. ౩

తే॥ పిదప నర్తెంచుకొని బహుప్రీతిఁ గనెడి
లక్ష్మిదేవమ్మ దయతోడ లలితరీతిఁ
జెరిగి ప్రాక్తనార్జితపుణ్యవిధిని ధనము
విద్దె బుద్ధియు యశమబ్బఁ దద్దనుంటి. ౪

ఆ॥ తత్పరంబునందు ధారాకులోద్భవ, నన్నపూర్ణఁ బెండ్లియాడియుంటి
నామెగొంతకాల మగుడు గౌరినిఁ గొల్వ, దివికిఁ గదలిచేరె తిరిగి నేను. ౫

క॥ ఇంకొలు వెంకటసుబ్బయ వెంకమ్మలమనుమరాలు వినుతచరితయుక్
వెంకటపయ్రశ్రీరుక్మిణిపంకజనేత్రలకు పుత్రి వరమతి దుర్గక్. ౬

తే॥ ప్రీతిఁ జేపట్టియుంటిని వేదవిధిగ, రాధికాకృష్ణకరుణచే రమణమాకు
పుత్రియొక్కతె మాకిప్డు పుట్టియుండె, నవని నామె రాధాలక్ష్మియనఁగ నెగడు.

సీ॥ దర్శనదర్పణ, తద్వేదవేదాంగచంద్రికా, వేంకటేశ్వరవినుతులు,
బాలనీతి, పురాణ, వర్ణవ్యవస్థా, రథాంగధూత, వివాహతత్వములును
షోడశసంస్కార, శుభలక్ష్మినరసింహనుతి, నీతికల్పకపత్రితతియు, మఱి
సృష్టిస్థితిలయాఖ్యకృతియును పెద్దవి చిన్నవి దగినట్లు చేసియుంటి
తే॥ గాని నామనంబున దృష్టి గాంచలేక యైహికాముష్మికసుఖంబు లమర జేయు
నట్టికృతి యేది యున్నదో యనుచు నేను సంతతమునిన్ను ధ్యానించు సమయమందు.

## —[ ప్రకృత కృతి ప్రశంస. ]—

సీ॥ నిత్యమై మానిసంస్తుత్యమై శ్రీకృష్ణనుత్యసద్వృత్తనౌన్నత్య మగుచు
గేయమై పండితజ్ఞేయమై సజ్జనధ్యేయమై దీనాళిదేయమగుచు
స్వాద్యమై విరచితపద్యమై యదువీరవిద్యానవద్యతా హృద్యమగుచు
శ్రావ్యమై విబుధసంసేవ్యమై నవరసభావ్యమై ముఖ్యసత్కావ్యమగుచు

తే॥ వేదతుల్యంబునయి జగద్వాదితమగుచు గర్గమునికృతమైనట్టి గర్గసంహి
తాహ్వయేతిహాసము దెల్గునందు లేక చెలఁగె సంస్కృతమందని చెవికి సోఁక.

ఆ॥ ఎలమి నేను దొలుత నిష్టదేవాచార్యజనకసుకవినుతులసల్పి నా భ
వంబు సార్థకముగ భక్తితో నీ కంకితముగఁ గృతిరచింపఁ దలఁచి కడఁగి. ౨

తే॥ జనకుఁ డాత్మజుఁ గైకొని సర్వకళల, శోభజెందెడి చంద్రునిఁ జూపఁజూచి
జనక! యదిదెమ్ము తెమ్మనియనెడిబాలు, భావమునుబోలుచిత్రభావంబుతోడ.

మ॥ కని యాకబ్బముఁ దెల్గుసేయ మదిలోఁ గౌతూహలం బంది భ
క్తిని వాణీకృపఁగోరి తోఁచినటులన్ దెల్గింప నేనుంటిఁ గా
వున నీవీకృతియందు నిల్చి దయఁ దప్పుల్ వాపి యొప్పుల్ సదా
తనరంజేయ నమస్కరించెదను రాధాకృష్ణ! కృష్ణప్రియా! ౪

శ్రీ కృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ గర్గ భాగవతము

## గోలోక ఖండము



రమణీ మనోహర విశేషమనోజ్ఞ పదారవిందముల్
శారదఫుల్లపద్మరుచిసామ్యములున్ మునిభృంగజుష్టముల్
నీరజ వజ్ర చిహ్నముఖ నిస్తులముల్ నిజభక్తతాపసం
హారకముల్ సువర్ణచరణాంగద భూషితముల్ నుతించెదన్. ౧

చ॥ ఎవని ముఖాంబుజంబున వరేక్షురసాధిక రుచ్యమాద్యమున్
దివిజమనోజ్ఞమై వెడలు దివ్యసుధన్ గడుపారఁగ్రోలి సం
స్తవము బుధుల్ పొనర్తు రలసాత్యవతేయుఁడు విష్ణురూపుఁడున్
బ్రవిమలబాదరాశ్రమనివాసుఁడు నాకృతి దిద్ది ప్రోవుతన్. ౨

### శ్రీ గర్గాచార్యుండు నైమిశారణ్యమున కేతెంచుట.

క॥ ఒండొకవేళను యోగా, ర్కుండతి తేజస్వి, జ్ఞానికులతిలకుఁడు గ
ర్గుండల నైమిశవనమున, నుండెడి శౌనకునిజూడ నొగి నేతెంచెన్. 3

తే॥ శౌనకుండును వచ్చిన శాంతిదాంతిసంతతానందభరితుండు సర్వవిదుఁడు
నైన మునివరుఁగనిలేచి యధికభక్తినర్ఘ్యలన్ సల్పిమునియు క్తుఁడగుచుమ్రొక్కి-

చ॥ అలఘు చరిత్ర! మాయెడకు నక్కటికంబున మీరు వచ్చుటల్
సులభమె? యార్యచర్య! గృహిశ్శోకము మాన్పదె! ధ్వాంతమూడ్చు త
మ్మిలచెలికంటె లోని పరిపూర్ణతమంబును బాపదే! యహా!
పలుకఁగఁజాల నిందలి ప్రభావము లెల్ల మునీంద్రచంద్రమా! ౪

వ॥ పండితప్రకాండులు బహుభంగుల వర్ణించుచుండు బ్రహ్మాండనాయకా
వతారంబులం గూర్చి నా సందేహంబులు తీరునట్లుగా విశదీకరింపుఁడని సవినయం
బుగా, సానందంబుగా నడుగ సంతసించి, యా గర్గాచార్యుం డతని కిట్లనియె. ౬

ఉ॥ ఓ యమలాత్మ! వింటి నిపు డుత్తమతద్భగవత్ప్రశంసలన్
బాయక యిద్ద ఱ్ఱోతలకు వాచక పృచ్ఛక లేఖకాళికిన్
శ్రేయము గూర్చు నిందులకుఁ జెప్పెద నే నితిహాసమొండు నే
దేయెడ విన్నమాత్రమున నెల్లయఘంబులఁ బాపఁ జాలునో.

—: బహులాశ్వుఁడు నారదమునిని సత్కరించి, ప్రశ్నించుట. :—

చ॥ తొలుతఁ బ్రతాపవంతుఁడు విధూతమదుండును గృష్ణభక్తిస
ల్లలితుఁడు శాంతమూర్తి బహులాశ్వుఁడు నా మిథిలాధినాయకుం
డలరు సతండు పుష్కరసమాగతనారదమౌనిఁ గాంచి పూ
జల నొనరించి పీఠము నొసంగి కృతాంజలియౌచు నిట్లనెన్.

చ॥ ప్రకృతిపరుం డనాది భగవంతుఁడు బూరుషుఁడున్ మహాత్ముఁడున్
సకలహృదంతరస్థుఁడయి సన్నుతిఁ జెందినవాఁడు పాంచభౌ
తికతను బొందె నెందుల కుదీర్ణచరిత్ర! దయాపయోనిధీ!
సకలము దెల్పుమా యనఁగ సమ్మతి నారదుఁ డిట్లు చెప్పెడిన్. ౯

—: నారదుండు బహులాశ్వునకుఁ భగవదవతారంబులం గూర్చి తెలుపుట. :—

చ॥ నటుఁడు స్వలీల మోహము గనంజనఁ డన్యుఁడనంచు నెంచఁబోఁ
డటులఁ బరాత్పరుండు స్వకళాతిశయమ్మున వేదసాధు గో
పటలధరామరావన మవారిగఁ గోరుచు జన్మమెత్తు ను
త్కట మదిలాతివారు గని తల్లడమొందుదురయ్య భూవరా! ౧౦

చ॥ అనవుడు మేదినీశుఁడు మహామునిl! సజ్జనరక్షణార్థమై
నెనరున నెన్నిమాఱు లటు నీరజలోచనుఁ డెత్తె జన్మముల్
వినుటకు నుంటిఁ గాన దయ వీనుల విందుగఁ దెల్పుమన్న నా
జనకున కబ్జయోనిజుఁడు చక్క వచింపఁగడంగె నిట్టులన్. ౧౧

వ॥ శ్రీహరి సాధుసంరక్షణార్థంబై యెత్తిన యవతారంబు లంశంబులనియు, నంశాంశంబులనియు, నావేశంబులనియు, గళలనియుఁ, బూర్ణంబులనియు, బూర్ణతమంబులనియు నాఱు తెఱంగులుగా నుండునని యింతకుమున్నె వ్యాసాదులు నిర్ధారించియుండిరి. ఆయవతారంబు లెత్తినవా రెవరెవరన? అంశములవలన బ్రహ్మాదులును, నంశాంశములవలన మరీచ్యాదులును, నావేశములవలన భార్గవాదులును, గళలవలనఁ గపిలకూర్మాదులును, బూర్ణమువలన శ్రీనృసింహుండును, శ్వేతద్వీపాధిపతియగు హరియు, వైకుంఠుండును, యజ్ఞుండును, నరనారాయణులును బూర్ణతమము వలన సకలభువననాయకుండై యత్యుత్కృష్టధామంబగు గోలోకంబున విరాజిల్లు శ్రీకృష్ణుండు నుద్భవిల్లిరని చెప్పంబడు, కార్యాధికారు లంశావతారులనియుఁ, దత్కా

ర్యాధికారుల యాజ్ఞలకుఁ లోఁబడి తోడ్పడువా రంశాంశావతారులనియుఁ, బర మాత్మ పెఱవారి యంతఃకరణంబులం జొచ్చి యగణ్యంబులును, మాన్యగణ్యంబు లునునగు పుణ్యకర్మంబుల నిర్వర్తింపఁ జేసి నిర్గమించినవాఁ డావేశావతారుం డనియుఁ, బ్రతియుగంబున ధర్మచ్యుతి యగుచున్నప్పుడెల్ల నారసి తద్ధర్మ బుద్ధరించి చనినవాఁడు కళావతారుండనియు, జతుర్వ్యక్తులును, నవరసములును, బహుబలం బులునుగల కార్యంబు లెవనియందు శోభిల్లుచుండునో యట్టివాఁడు పూర్ణావతారుం డనియు, సర్వచరాచర తేజోరాశి దేదీప్యమానంబగు స్వతేజంబునం గలియ వెలుంగునో యట్టి పరంధాముండు పరిపూర్ణతమావతారుండనియు నెఱుంగునది.

క॥ అరయఁగ శ్రీకృష్ణుండే, పరిపూర్ణతముండు లాఁతివారలుగారా
హరి యొకకార్యము సేయఁగఁ, నరుదెంచి యనేకకృతుల నక్కుఱఁజేసెన్. ౧౩

చ॥ ఎవఁడు పరాత్పరుండొ పురుషేశ్వరుఁ డెవ్వఁడొ పూర్ణుఁ డెవ్వఁడో
యెవఁడు పురాణుఁడో మఱిఁ బరేశుఁ డెవం డలవాని నాస్వయం
భవు నల సద్గుణాకరు నమూల్యకృపాకరు నామహాత్ము నా
పవిమలు నాపరాత్పరుని భక్తిఁ గడున్ శరణంబు వేఁడెదన్. ౧౪

ఉ॥ శౌనక! తాఁడు నారదవచస్సుల నిట్టుల వించు మోదబా
ష్పానమితాక్షులన్ దుడిచి యామునికిట్లను శ్రీరమేశుఁ డ
న్యూనతమావతారమును నొందుట యేలకొ యట్టి ద్వారకా
ఖ్యానగరంబునన్ భరతఖండమునన్ విలసిల్లు టేలకో. ౧౫

ఉ॥ ఆకమలాక్షుఁ డెట్లొ యిల కాగతుఁ డయ్యెను గాక వాని గో
లోకచమత్కృతుల్ సుజనలోకహితార్భకలీలల య్యసం
ఖ్యాకములైన కార్యములు గౌరవభాజన జీవితంబు నీ
నాకు విన్ బ్రియంబలరు నారద! చెప్పుము తప్పకుండఁగాన్. ౧౬

ఆ॥ నూరుపుట్టువులను భూరిపుణ్యక్షేత్ర, పర్యటనతపముల భక్తిసలుపు
మానవుండు సుజనమైత్రిని బొందెడిఁ, నతఁడె ముక్తికర్హుఁడగును దలఁప.

ఉ॥ ఎన్నడు బోసికొందుఁ జెవిఁ గృష్ణకథామృతచారుధార లిం
కెన్నడు జూతునో సురమునీశ్వర బాడబదుర్లభాద్యు నిం
కెన్న డొనర్తునో సరసిజేక్షణదాసపదాబ్జసేవ నిం
కెన్నడు బాయునో కలుషవృద్ధినిబద్ధమదీయపద్ధతుల్. ౧౭

వ॥ అని నానావిధంబుల నువ్విళ్ళూరు నా జనకాపరనామకబహులాశ్వ రాజేంద్రుంగని నారదమునీంద్రుం డిట్లనియె.

ఉ॥ ఇష్టుఁడు భక్తవత్సలుఁడు కృష్ణుఁడు నీకిట దర్శనంబిడన్
గష్టపుటంచు నెంచక సుఖంబుగ రాఁగలఁ డందునన్ మనో
భీష్టముదీరు ధన్యతయు వే ఘటియించును విప్రదేవుఁడున్
విష్టపనాథుఁడైన హరి విశ్రుతు నిన్నుఁ దలంచు ద్వారకన్. ౨౦

ఉ॥ భూవరవర్య! మీ సుకృతముల్ బహుళంబులు గావె యెవ్వరే
నీవిధి నాపరాత్పరుని యెన్నికకందిరె? యమ్మచెల్ల! యే
మీ! విబుధాళిభాగ్యదశ యెన్నట ధాతకు వానితాత కా
శీవిషనాయకాగ్రిణికిఁ జెల్లునె? యెన్నటికేనిఁ జాగురే. ౨౧

ఉ॥ నాకును బొందియున్ బ్రణుతిపాత్రుఁ బవిత్రచరిత్రుఁ గృష్ణునిన్
వాకొనఁడేనిఁ దన్నరుఁడు పాత్రమునందిడియున్న యన్నమున్
జేకొననట్టివానివలె సిద్ధము జేసినముక్తినిచ్చెనన్
గైకొని యెక్కనట్టి జనుకైవడి వీఁజిడియై నశించెడిన్ ౨౨

చ॥ క్రమముగ మాధవాగమనకారణమాడెద నీ వరాహక
ల్పమునను తొల్లిఁ గాశ్యపి ఖలప్రభుదానవదైత్యనారభా
రము దలఁదాల్పలేమిని శరణ్యములేమిని గుంది గోస్వరూ
పమమర దేహమున్ వణఁక బ్రహ్మసమీపము జేరి భక్తితో. ౨౩

చ॥ కని వినుతించి మ్రొక్కులిడఁగంజజుఁ డాయమ నాదరించి యే
మని యిటు లిందుఁ జొచ్చితివొ యద్ది వచింపుమ భూసతీమణీ!
యనవుడు తద్వసుంధర కరాంబుజముల్ ముకుళించి గద్గద
స్వనమున దాను బొందు బహుబాధలఁ జక్కఁగ విన్నవించుడున్ ౨౪

చ॥ విని యతఁ డమ్మరో! వగపు వీడుము శక్తికొలంది సాయమే
నొనరుతునమ్మ! రమ్మని సుధోదనపంక్తి సమేతుఁడై త్రిలో
చను సహకారిగాఁ గొనుచుఁ జక్రిగృహంబును భక్తసన్నుతం
బును ననవద్య మవ్యయము ముక్తిదమొంది తదంతరంబునన్ ౨౫

చ॥ సిరిచెలినిన్ జతుర్భుజు సుశీలునిగాంచి నమస్కరించి రా
కరహిని విన్నపింప విని కంజదళాక్షుఁడు భీత ధాతృశం
కరముఖదేవరాజిఁ దమకంబునఁ గన్గొని యూఱడించి ఖే
చరవరులార! నానుడులు శాంతముతో విని యాచరింపుఁడీ. ౨౬

మ॥ గణనాతీతవిలాసలోలుభుని సాక్షాత్సర్వసంపూర్ణునిన్
బ్రణవాకారు స్వయంభువున్ భృతబహుబ్రహ్మాండు శ్రీకృష్ణునిన్
దృణరీతిన్ గని వీడినన్ బనులు యత్నించిత్తు గావందునన్
బ్రణుతంబున్ విశదంబు నవ్యయము నా స్వామిస్థలం బొందుఁడీ. ౨౭

వ॥ అని విని సర్వసుపర్వపరీవృతుండగు విరించనుండు విష్ణువున కిట్లనియె.

శా॥ స్వామీ! మీరలుగాక యన్యవిభులస్మద్దృష్టిలో లేర? యే
మేమీ! మిమ్ములమించు పూర్ణతముఁ డున్నే! యున్న నవ్వానిదా
ధామం బెచ్చట? నెట్టివాతనిచరిత్రల్ ప్రేమతోఁ దెల్పఁగా
మేమిమ్మాడ్కి నుతించుచుంటి మన లక్ష్మీనాయకుం డయ్యెడన్. ౨౯

—[ బ్రహ్మదేవుండు దేవ వాసుదేవసహితంబుగా గోలోకంబున కేగుట. ]—

వ॥ బృందారక బృందపరీవృతుండగు శతానందున కానందంబు ఘటిల్ల సకల బ్రహ్మాండశిఖరంబున కూర్ధ్వభాగంబున విలసిల్లు తద్గోలోకమార్గంబు జూపించి, తోడురా నవ్విరించిగాంచి మేలుమేలనియెంచి, తలపంకించి యా తెన్నున నడచుచు శ్రీవామన వామపద ప్రదేశినీనఖంబున విభిన్నంబైన బ్రహ్మాండాగ్రి భాగంబును, బ్రహ్మరసమయంబునగుబిలంబునందు జలద్వారమార్గంబునుండి బయలువెడలు సురానీకంబును, నధోభాగంబునఁగూఁకటిమూఁగయను పక్కివలెఁజక్కనై వెల్గుభూనభోగోళంబులును, మఱియు నజ్జలంబునం దింద్రాయనఫలంబులకరణి నిటులటులఁ దొరలుచుండు లెక్కకుఁ జిక్కని బ్రహ్మాండంబులను గాంచి భీతుఁడైన వానితీరున విస్మితుఁడగుచుఁ గోట్లకొలందియోజనంబులదాటి యట భర్మవినిర్మితంబులగు రమ్యహర్మ్యంబులతోడను, నభేద్యంబులగు ప్రాకారంబులతోడను, విరాజిల్లు నెనిమిదిపట్టణంబులం జొచ్చి యిచ్చమెచ్చి యవి గడవఁ జని ముందట.

—♦ గోలోక వర్ణనము. ♦—

సీ॥ హారనీహారసాంబొట్టహాసైరావణక్షీరధవళవర్ణంబుతోడ
స్నానాగతప్రజాసంఘసంరక్షణోద్గతకరనిభతరంగములతోడ
జ్వరకఫవాతాదిసకలరోగనివారకస్వచ్ఛరుచ్యోదకంబుతోడ
ధగధగద్గితరత్నప్రభా సంతానబంధురసోపానపటలితోడ

తే॥ సకలకళ్యాణసూచకశకునిమధుర, కలకలంబులతోడుతఁ జెలఁగుచుండు
విరజయనఁ నదిదరిఁజేరి వింతలెన్నొ, నయనపర్వముగాఁ గని నడిచె నవల. ౩౧

తే॥ కోటిసూర్య నిభంబు నకుంఠితంబు, నగు మహర్లోకమునుబొంది యాస్థగనులు
మిఱులుగాఁగని హరియాజ్ఞ సరసిజజుఁడు, దన్మహాముద్రమొక్కి వినుతించె దానిలోన

శా॥ శాంతాకార మనోహరంబు బుధసంస్తవ్యంబు ధామంబు ని
శ్చింతన్ గన్గొని దానియందున మహాశేషున్ సహస్రాస్యు శ్రీ
మంతున్ దీర్ఘ మృణాలతుల్యధవళున్ మాన్యున్విలోకించి ధీ
మంతుల్ ధాతృముఖాదినిర్జరు లసామాన్యంబుగా మ్రొక్కుచున్. 33

సీ॥ సకలచరాచరసంభవస్థితిలయహేతుభూతులనుంచియిక్క-యెద్ది
స్వర్గాదినాయకశక్రాదిదిక్పతి, కామప్రియంబైన ధామమెద్ది
వాతాంబుపర్ణాశనాశ్రిత సంసారమునిరాజ హృద్గమ్య మూలమెద్ది
మాయామనోబుద్ధి మమకారచిత్త మహత్తత్త్వవికృతి సంహారమెద్ది

తే॥ యఖిల మాన్యుల కీశ్వరుం డనఁగ నెద్ది లోకనుతమయ్యె నద్ది గోలోకమనఁగఁ
జెల్లుచుండు మహాలోక మల్లశేషు పృథుతరోత్సంగమందు వీక్షించి మఱియు.

మ॥ అరరే! యిట్టి హిరణ్యరత్నమయ గేహద్వారబంధంబు ల
య్యరె! యీరుచ్యజలాన్వితహ్రదము లాహా! యీయదృచ్ఛావిహా
రరహస్స్థానము లౌర! యీమణిగణప్రాప్తోరుపణ్యంబు ల
బ్బురమీ గోవ్రజసంపదల్ వనము లీ పుణ్యల్ ప్రశంస్యల్ బళీ. ౩౫

చ॥ ఇటుల నుతించి వేల్పులురహిన్ మొగసాలను జేరునంతలో
జటులవిలాసమన్మథులు శ్యామశరీరులు కృష్ణపార్షదుల్
దటుకున వచ్చి నిల్వఁడు కుతంత్రము మానుఁడు మానుడుల్ వినుం
డిటుల మమున్ శరించి యెటకేగఁదలంచితి రీరలియ్యెడన్. ౩౬

ఉ॥ ఎవ్వరు మీరు! మీదు కులమెయ్యది? యెట్టిది మీచరిత్ర? మీ
రివ్విధిఁ బైనముఁగసలుప నేమిగతంబెది మీప్రదేశ మీ
దవ్వననుండు గోపదవిదండకువచ్చుట కేమి కారణం
బొవ్వనొ? వీని కుత్తరము లొయ్యన మాకిడి లోని కేగుఁడీ. ౩౭

ఉ॥ నావుడు దేవతల్ విని ఘనప్రతిభోన్నతులార! మాది యా
దేవకులంబు నాకము స్వదేశము వీరలు బ్రహ్మవిష్ణు దు
ర్గావిభు లేము వాసవముఖత్రిదివేశుల మొందు కోర్కెతో
శ్రీవనమాలిదర్శనము జేయగవచ్చితిమయ్య నావుడున్. ౩౮

ఉ॥ మానులు ద్వారపాలకులు మాధవపార్షదులానిలింపవా
ర్తానివహంబెఱింగియుఁ బరంబగు నంతిపురంబు సొచ్చి గో
స్థానవిభున్ గుఱించి సురసంగతిఁదెల్పఁ దదాజ్ఞనొందు చం
ద్రానన, రమ్యపీతపరిధానము వేత్రము దాల్చి పెల్చనన్ ౩౯

ఉ॥ వచ్చి యమర్త్యులన్ గని కృపామతి నిట్లనె వేల్పులార! మీ
రెచ్చటనుండి నిచ్చటికి నెందుల కాగతులైతి రింక మీ
యిచ్చను నచ్చులేక చెపుఁడే ద్రుహిణాండవినేతలయ్య వా
క్రుచ్చుఁడు ముచ్చటించెద ముకుందున కన్నఁ దదాదితేయులున్ ౪౦

ఉ॥ అండము లెన్నియుండినవొ యయ్యవి యెవ్వా యెఱుంగ మొందు బ్రి
హ్మాండ మిదే యెఱుంగుదు మహో! భవదుక్తిచయంబు చిత్రమై
యుండెడి నండ మన్య మిఁకనుండదటంచు దలంతుమమ్మ! యో
యండజయాన! చంద్రముఖి! యంచు సురల్ నుడువంగ నామెయున్ ౪౧

శా॥ ధాతా! యండము లిందుఁ గోట్లకొలఁదిన్ దైవాఱు నిద్దాని నే
భాతిఁ మీరు మెలంగుచుంద్రటు ప్రతిబ్రహ్మాండమందున్ సుర
వ్రాతంబుండును వేఱువేఱుగ సిజగ్రామాది నామంబులన్
జాతిన్ దెల్పఁగలేక స్థాణుగతి నీచాయన్ జనం డెవ్వఁడున్ ౪౨

ఉ॥ దోమలు మేడిపండులను దొల్లుచు నన్యమెఱుంగజాలన
ట్లేమియు నొక్కయండమునె యారలెఱింగి వసింత్రుకాని యిం
కేమియు గుర్తెఱుంగరుగ యిట్లు గృహంబును వీడకుందు రే
మీమతివోయెనో ముదిమి మేకొనెనో యిది మంచిరీతియో ౪౩

చ॥ అని యుపహాస్యమున్ సలుప నాయమరుల్విని మానమూనుటన్
గని హరి, వారి భీతులుగ గాంచి యిటుల్వచియించె భూవరా!
ఘనుఁడను బృశ్నిగర్భుఁ డెటఁ గ్రాలెనొ యద్ది త్రివిక్రమావతా
రనఖరభిన్నమహా నల వరస్థలినుండుము మందయానరో. ౪౪

ఉ॥ ఈవిధి నిందిరావిభుఁడు హృద్యముగాఁ బలుకంగ నల్ల రా
జీవదళాక్షి వించతనిఁ జేరి నుతించియు లోనికేగి రా
ధావిభునాజ్ఞఁ గొంచుఁ ద్వరితంబుగ గ్రమ్మఱ వచ్చి యట్టి లే
ఖావళి కద్ది దెల్పి చనె నాత్రిదశుల్ జనిరయ్య లోనికిన్. ౪౫

ఉ॥ నాకులు గాంచి రంతట ననశ్వరకల్పలతాప్రకృష్ట గో
లోకము ధూతదేవరిపులోకము వర్థితరాధికాధవా
లోక మధఃకృతత్రిదశలోకము రక్షితగోపగోపికా
లోకము నాకమున్ విహితలోకసుగమ్యమనోజ్ఞలోకమున్ ౪౬

వ॥ వెండియు,

శా॥ సౌందర్యోజ్జ్వలితుల్ త్రిమూర్తిముఖు లస్వప్నుల్ విలోకించి రా
నందస్యందివిదూరదేశభవరత్నస్నిగ్ధసోపానస
త్సందోహాన్వితతీరభాసుర యదృచ్ఛాయానవిభ్రాజితన్
బృందిష్ఠోర్మిమనోహరన్ వరనదిన్ గృష్ణన్ గళిందాత్మజన్ ౪౭

మ॥ వరబృందావనపట్టణోన్నతవిశేషాసంపల్లక్ష్మీస్ఫీలా
సరుచుల్ చిత్రపతత్త్రినైకవిధసుశ్రావ్యస్వనంబుల్ మనో
హరరంభానటనారికేళఖదిరామ్రాదిద్రుమంబుల్ మహా
త్తరగోవర్ధనపర్వతంబు గని యాధామంబునన్ వేడ్కతో. ౪౮

ఉ॥ కాంచిరి సౌధవీథులను గాంచిరి భాసురరాసమండలుల్
గాంచిరి నూత్నరత్నకనకద్యుతిరాజితచంద్రశాలలన్
గాంచిరి పేయతోయపరికల్పితకూపతటాకఖాతముల్
గాంచి రభేద్యవప్రపరిఖావరణచ్ఛదకూటవాటముల్ ౪౯

చ॥ పులినములందు మందగతి భూషితశీతలవాతపోతము
ల్లలితఘుమాయమానకమలప్రకరస్థపరాగసౌరభం
బులఁ బలుమాఱుఁ దాల్చి యమోఘవిధంబున వీవఁగా సుఖం
బులఁ గనుచుండువారిఁ గని మోదము జెంది రమర్త్యులంతటన్ ౫౦.

శా॥ ప్రాకారాజిరభేద్యభాసురపృథుద్వాత్రింశదారామగా
ఢాకీర్ణం బరుణాశ్మరోచ్చబహుపాద్వ్యాప్తంబు సప్తప్రకా
రాకల్పోజ్జ్వలపద్మరాగసహితం బజ్జోపమాకుంజ మా
లోకించెన్ సురలోకమెల్ల నల గోలోకంబునన్ బిమ్మటన్ ౫౧.

క॥ మిక్కిలి చక్కని కాంతుల నిక్కెడి నిడుటెక్కియముల నెక్కొని కడు మ
త్తెక్కిన శుకపికబర్హుల వాక్కులుగల పూలయిండ్ల బాటలు గనియున్ ౫౨

ఉ॥ శారదకోటిపూర్ణశశిసామ్యమనోజ్ఞలు దారహారమం
జీరలలంతికాంగదవిచిత్రశిరోమణిబాలసూర్య వి
స్ఫారిత కర్ణికాంచితలు భామినులామణి చత్వరాళి శృం
గారితవక్త్రముల్ గనుచు గంతులు వేయుట జూచి యంతటన్ ౫౩.

సీ॥ సింగారముంగాఱు బంగారు రంగారు శృంగాలఁజాల వెలుంగునవియు
హారహీర పటీర శారద తారేశ గౌరాద్రి ధవళిమ మీఱునవియు
బాపాలచాలును దాపాలమోలినిఁ గూలుఁపజాలు పాల్గ్రోలు నవియు
జిన్నారి పొన్నారి శింజినీ కింకిణీ ఘంటాది భూషలు గలుగునవియు
తే॥ శోభనాకారములచేత సొంపుజెందునవియుఁ బీతపుచ్ఛములచే నలరునవియు
గుణవయశ్శీలములచేతఁ గొమరుమిగిలినవియు నగు గోవులచ్చట నమరుచుంట..

చ॥ నలుపునఁ గొన్నియావు లరుణంబునఁ గొన్నియు ధూమ్రమమందుఁ గో
కిలరుచిఁ గొన్ని తామ్రపుజిగిన్ మఱి పీతమునందుఁ గొన్నియున్
జెలఁగుచు లేడిపిల్లవలెఁ జెచ్చెర దాట్లిడు లేగలొప్పుతో
య్యాలుల కరాంకముల్ గలిగి యంబుధివోలెఁ బయస్సు లిచ్చుటల్. ౫౫

తే॥ మఱియు గోగణములయం దమందగతిని నిడుపుగొంతులఁ గొమ్ములనీటుగల్గి
ధర్మభారంబుమోయుచుఁ దద్దనిటులనటులఁదిరుగాడు నాఁబోతులచటఁగనిరె.

ఉ॥ ఈహను వేత్రివంశుల ధరించి తదంబుజనేత్రసామ్యస
మ్మోహనులైన గోపకులు మోహనరాగగణంబునన్ జగ
న్మోహనకృష్ణలీలల వినోదముగాఁ గొనియాడి ధేనుసం
దోహముఁ గాచుటన్ గనిరి దోషవిదూరులు వేల్పులో విభూ ౫౯

తే॥ ఇట్లు కుంజము వీక్షించి యెంతొ మ్రొక్కి దానిలోనికిఁజని బహుళైజసము స
హస్రపత్రాంచితంబును నైన యంబుజంబుజూచి తదూర్ధ్వభాగంబునందు

ఆ॥ తనరు షోడశదళ ఘనవనజంబును గన్నులారఁ గాంచి కౌతుకంబు
బొంది దానిమీఁదఁ బొలుపారునష్టపత్రియుతదివ్యతామరసముపైన.

ఉ॥ కౌస్తుభశోభితంబులు నఖండము లద్భుతకాంతికాంతముల్
ప్రస్తుతమానినుత్యములు ప్రాక్తనపాప వినాశకంబులున్
నిస్తులముల్ బరంబులును నిర్మలమౌ నిడుమూఁడుమెట్లతో
శస్తినిబొందు గద్దియను జక్కఁగఁ గన్గొని దానియందునన్. ౬౦

సీ॥ ఒకవంక సకలంకవికచాంబుజేక్షణశ్రీదామముఖగోపసేవ లలర
నొకచాయ మోహినీయువతీ ప్రభృత్యష్టమహిళలు వ్యజనచామరల వీవ
నొకదండఁ బండితప్రకరంబు "లోంస్వస్తి" యని వేదలపితంబులను బఠింప
నొకదెసఁ బార్షదు లుజ్జ్వలయష్టులన్ ధరియించి వే బరాబరులుసేయ

తే॥ వెండియొండెడ నితరాండవృత్తమంత విన్నవింపఁగ వచ్చిన విభులు వెలుఁగఁ
గోటిచంద్రోపమచ్ఛత్ర కోటు లుపరిభాగమందునఁ బూజ్యులు బట్టియుండ. ౬౧

సీ॥ నీలమేఘశరీరు నీరజలోచను నిఖిలాండనాయకు నిత్యు నుత్యు
మకుటకుండలహారమాణవకావాపకోర్మికాశృంఖలాయుక్తు శక్తు
శ్రీవత్సలాంఛను స్మితపూర్వభాషిని శ్రీనివాసునిఁ బీతచేలు బాలు
నాజానుబాహునిఁ దేజోవిరాజితు గమలనాభుని వంశకలితు లలితు.

తే॥ దకుు స్వచ్ఛందకుంచితదక్షిణాంఘ్రికలితు సవిధస్థరాధికాలలితవామ
బాహువేష్టితనిజగాత్రుఁ బద్మనేత్రుఁ గనిరి నేత్రపర్వంబుగా జనకరాజ.

మ॥ కని యానందసముద్రిమగ్నమగు లోకవ్యూహముం బోలెఁ దా
మును హర్షాంబుసమేతనేత్రిలగుచున్ మూర్ధంబుతో లేఖులా
ఘను బృందావనభాసురున్ నరహరిన్ గారుణ్యరత్నాకరున్
వినుతుల్జేసి నమస్కృతుల్ సలిపిరో పృథ్వీపతీ! నావుడున్ ౬౩

క॥ అయ్యా! దేవతలిట్టుల నయ్యంబుజనాభుఁ గాంచి యామీఁదన్ వా
రెయ్యది సల్పిరొ కరుణను నిమ్మెయి వచియింప మిమ్ము నేనర్థింతున్ ౬౪

వ॥ అని యడుగంగ నారదుండా జనకనరేంద్రున కిట్లనియె. ౬౫.

శా॥ కంఠేకాలహిరణ్యగర్భముఖలేఖప్రష్ఠు లీక్షింప వై
కుంఠుం డష్టభుజోజ్జ్వలద్ధరి, జగత్కోటీశకృష్ణాకృతిన్
శుంఠస్తోమము భీతినిం గనఁగ సుశ్లోకుల్ ముదంబంద ని
ష్కుంఠీభూతము లీనమయ్యెను సుమీ క్షోణీంద్రచూడామణీ! ౬౬.

తే॥ కోటిసూర్య నిభుండు నకుంఠితబలుఁ డమలచరితుండు నధికదయామయుండు
నగు నృసింహుండు నను దెంచి యట్టి కృష్ణులోన నిశ్శేషరీతిని లీనమయ్యె.

వ॥ వెండియు సహస్రభుజపరిశోభితుండై సిరిని గూడి నిజాయుధంబులన్ ధరించి పార్షదసహితంబుగా లక్షాశ్వంబులం బూన్చిన తెల్లని తేరునెక్కి చనుదెంచిన వాఁడును, శ్వేతద్వీపాధిపతియునగు శ్రీహరియు, నసంఖ్యాకంబులగు వానరానీకంబులు సుట్టుముట్టి కొలువ భరతలక్ష్మణశత్రుఘ్నులను భ్రాతృవరులతోడంగూడి సీతాసహితుండై దశకోటిసూర్యప్రతీకాశంబులగు చామరంబుల తోడను, లక్ష ధ్వజంబులతోడను, లక్ష చక్రంబుల తోడను, లక్షోత్తుంగ తురంగంబుల తోడను, మేలిమిబంగారున వెలుంగు కలశంబులతోడను విరాజిల్లు దివ్యరథంబెక్కి, విల్లమ్ములం దాల్చిన పూర్ణావతారుండును, బుండరీకాక్షుండును నగు శ్రీరామచంద్రుండును, ప్రలయకాలాభీలంబులగు నగ్నిశిఖలవలె జాజ్జ్వల్యమానంబగు దేహంబుగలవాఁడును దక్షిణానామసతీసమేతుండును, సురేశ్వరుండును, జ్యోతిర్మయ రథారోహకుండును నగు యజ్ఞుండును, విద్యుల్లతావిద్యోతితంబులగు జటాజూటంబులు గలవాఁడును, జతుర్భుజుండును, వ్యూఢోరస్కుండును, మునివేషధారియు, మునిజనవినుతుండును, నగు నరనారాయణుండును, ననువీర లపార తేజఃపుంజంబున రంజిల్లువాఁడును, నీలమేఘశరీరుండు నగు నాశ్రీకృష్ణునిదివ్యతేజంబున లీనంబగుట నమరులు వీక్షించి, యాతనిఁ బూర్ణతమావతారుండనియు, ననన్యసామాన్యుండనియు గుర్తెఱింగి హర్షభయాశ్చర్యబద్ధబుద్ధులై కేలుమోడ్పులనుసంధించుచు నిట్లు వినుతించిరి.

### బ్రహ్మాది దేవతలు శ్రీకృష్ణుని స్తుతించుట.

శా॥ రాధానాథుఁ మహానుభావుఁ బరిపూర్ణస్వామినిన్ యజ్ఞునిన్
గోధామేశు స్వయంభువున్ బరమునిన్ గోవర్ధనాద్రీశ్వరున్
సాధువ్రాత మునీంద్రపోషణరతున్ సత్యున్ మహాత్మున్ సమ
స్తాధారాద్యునిఁ గృష్ణు మ్రొక్కెదము సాష్టాంగంబుగా భక్తితో ౬౭

చ॥ సతిసుతబాంధవప్రభృతిసర్వుల వీడి జలానిలాశన
వ్రతులయి కాననంబులఁ బ్రవర్తిలుచున్ దపమాచరించు యో
గితతి నినున్ మహాత్మునిగఁ గీర్తన సేయును భక్తపంక్తి సా
కృతిగఁ దలంచు మేము నుతియింతు మనన్యమహాపరాత్మగా. ౨౦

చ॥ ఘను లనుమానహేతువుల గాని ప్రయుక్తులగాని స్ఫోటవా
దనియతిగాని యింకొకపథంబునఁగాని యొకప్పుడేని ని
న్గనుఁగొనఁజాలకుండిరి సనాతనుఁ గారణకారణున్ నిరం
జనుఁ బరు నిర్వికారుని వెసన్ శరణంబిడఁ గొల్తు మియ్యెడన్ ౨౧

ఉ॥ కొందఱు కర్మరూపమని కొందఱు యోగమటంచు వెండియున్
గొందఱు కాలమంచు మఱిఁగొందఱు బ్రహ్మమటంచుఁ గర్తయం
చందురు కొందఱీనుడుల కందని సర్వజగత్పతిన్ నినున్
జెందితి మిత్తఱిన్ శరణుఁజెందితి మందఱమేము హర్షమున్ ౨౨

చ॥ ఎవరు శుభంబు లిచ్చు నమరేడితతావకపాదపద్మయు
గ్మవిహితసేవలన్ విడిచి కాశి గయా ముఖతీర్థయాత్రలన్
సవనతపఃప్రదానముల సల్పుదురో యలవారు విజ్ఞతా
వ్యవహితులై కృతార్థతను నందరు శ్రీకర గోకులేశ్వరా. ౨౩

చ॥ సకలమనోవిహారివయి సర్వజగచ్ఛలదర్థసాక్షివై
సకలనిలింపయోగికులసన్నుతరూపుఁడవై పరాత్మవై
ప్రకటితరీతి నీవిట విరాజిలుచుండఁగ నల్పబుద్ధులన్
వికటులమైన మేమొక ప్రవృత్తి మెదల్పఁగలార మే ప్రభూ! ౨౪

శా॥ శ్రీరాధాలలనాలలామహృదయ శ్రీచంద్రహారోజ్జ్వలా!
మారాకారవిరాజమానమహితా మానాయకా! గోపికా
చారుప్రేక్షణజీవహారరుచిరా సత్యస్వరూపా! విప
ద్భారాపన్నుల మమ్ము నెమ్మిఁగనరావా? దేవ! రక్షింపవా! ౨౫

ఉ॥ గోపితతిప్రభూ! చతురగోపకవేషవిహారలీల! బృం
దావనపాలకా! నిగమధర్మనిదాన! దయాపయోనిధీ!
దేవవిభూ! యరంబునను తీరనివంతలఁగుందు నీ యిలా
దేవిని ధర్మధారిణి నుదీర్ణచరిత్రను జూచి కావుమా. ౨౬

క॥ ఈకరణిని సురలందఱు శ్రీకృష్ణుని వేఁడ రమ్యజీమూతోక్తిన్
గోకులనాథుండాహరి నాకులఁ గని యిట్లు పలికె నరవర వినుతా.

—♦ శ్రీకృష్ణుండు దేవతలకుచితోక్తులాడుట. ♦—

ఉ॥ వింటిని మీచరిత్రము వివేచనజేసి వచించుచుంటి నీ
వెంటనె పోయి మీసతులు వేన్కాన యాదవవంశమందు ని
ష్కంటకులై జనింపుఁడది గన్గొని మీకృతిఁదీర్ప భూవ్యథల్
గెంటఁగ నేను బుట్టెదను గీర్తితతద్యదువంశమందునన్. ౭౮

ఉ॥ నావచనంబులే శ్రుతులు నాదు ముఖంబు ధరామరోత్కరం
బావులు నాశరీరము మహాత్ములు సాధులు నాదుప్రాణముల్
దేవతలైన మీరలును దివ్యనుదంగము లయ్యలార! యో
దేవతలార! యేగుఁడటు దీర్చెదు సేయుఁడు సెప్పినట్టులన్. ౭౯

చ॥ క్రతువుల జాతిరీతులను గారుణికత్వము ధర్మపద్ధతుల్
హతమొనరించు దుర్మతుల నంతముజేయఁగ శిష్టసంఘము
న్నతిఁగనఁజేయ ధర్మము ఘనంబుగ నిల్పుటకున్ స్వయంబుగాఁ
బ్రతియుగమందుఁ బుట్టెదను బంతము దాల్చితి నింపుఁ జెల్చనన్ ౮౦

ఉ॥ ఇట్టులఁ బల్కి స్వేశు జగదీశుఁ గనుంగొను రాధ! యాపిరుల్
గిట్టెడి మాడ్కి దావమునఁ గీడులు మూడిన తీఁగవోలె ని
ట్టిట్టనరాని గోడొదవ నీక్షణయుగ్మమునందు వెచ్చనీ
రుట్టిపడంగ మేనుగగుర్పొందఁగ మూర్ఛితయౌచు నిట్లనెన్ ౮౧

—♦ శ్రీ రాధాకృష్ణ సంవాదము. ♦—

ఉ॥ ప్రాణపతీ! యిలాభరముఁ బాపఁగఁ బుట్టెదనంచు దేవతా
శ్రేణికిఁ జెప్పియుంటి వదిసెల్లును నాగతిఁ గూర్చి లేశమీ
వాణినిఁ బల్కరైతిరిది భర్తల కృత్యమె? మిమ్ముఁబాసి నా
ప్రాణము లుండఁజాలవని బాగుగ నమ్ముఁడు నెమ్మనమ్మునన్. ౮౨

ఉ॥ ఇత్తఱి నాదు కోర్కె వచియించితి లక్ష్యముసేయకుండ మీ
చిత్తము వచ్చినట్టుల నిసీ! యని రోయుచుఁ బోవునప్డు మ
చ్చిత్తగతాశయంబు మఱిఁ జెప్పెద మీయెడబాటునన్ గడున్
దత్తఱమొందు నాయొడలు దగ్గను గప్పురమింకునట్లనన్. ౮౩

శా॥ ఆర్యా! యెంతటి మాటలాడితివె? నిన్నా! పీడి నేనేగుటల్
ధైర్యంబున్విడకుండ నానుడులు దాత్పర్యంబుతో విన్మ నీ
కార్యంబుల్ నెఱవేర్తు భూభరముఁబోకార్తున్ వ్యథన్ మానుమా
"భార్యామూల మిదం గృహ"మ్మనెడి పూర్వన్యాయ మాలింపవే. ౮౪

వ॥ అని శ్రీకృష్ణుండు పలుక విని రాధాదేవి కిట్లనియె. ౭౫

మ॥ ఎట నానందకరావనీరుహాలసద్బృందావనంబుండదో
యెట గోవర్ధనశైలముక్కెలఁగదో యెచ్చోట నానామయో
త్కటభైషజ్యజలప్రియుక్తయమునాధారల్ ప్రవర్తిల్లవో
యట కేరానుగ వచ్చినన్ సుఖమునా కావంతయున్ లేదుగా. ౭౬

చ॥ అని యన నాలకించి హరియాస్థను స్వస్థలినుండి దివ్యమా
నెనుబదినాల్గు క్రోసులను నింపగు భూమిని గోప్రవర్ధనం
బను గిరినిన్ గళిందజను నంపి సతిన్ దనుపంగ బ్రహ్మయున్
గని పలుమాఱు మ్రొక్కి నయగారముగాఁ బలుకాడె నిట్టులన్ ౭౭

ఉ॥ దిక్కెది లేనివారలకు దిక్కగ నెక్కొనియున్న శ్రీహరీ!
యెక్కడ నెట్టిపేరును వహించి జనింతువొ నీవు? వెండియే
నెక్కడ యీయమర్త్యులెట నెట్టి యభిఖ్యలఁ బుట్టనౌనొ నీ
విక్కతఁ జక్కఁగాఁ దెలుపుమీ యన నక్కమలాక్షుఁ డిట్లనెన్ ౭౮

మ॥ పరమేష్ఠీ! చెవియొగ్గి సావధిగ నా వాక్యంబులాలింపు మేఁ
బరిపూర్ణంబుగ దేవకీరమణికిన్ బ్రాదుర్భవింతున్ సతీ
వరయా రోహిణియందుఁ నాకళయె యుత్పన్నంబగున్ బిమ్మట
న్సిరియున్ రుక్మిణి నాగభీష్మునకు జన్మించున్ జుమీ వెండియున్. ౭౯

చ॥ ధరణియె సత్యభామయగు దక్షిణ లక్ష్మణ సత్యబృందయున్
విరజ కళిందజానదియు వ్రీడయె భద్రయు దోషనాశకృ
త్సురనది మిత్రవిందయు విశుద్ధమృడానియు జాంబవంతుకూఁ
తురుగ జనింతు రింక నలతొయ్యలు లందిటు సంతుగల్గెడిన్. ౮౦

తే॥ తొలుత రుక్మిణికిమరుఁడు ప్రద్యుమ్నుఁడనఁగ నవతరించును ననిరుద్ధుఁడనఁగ నతని
కవతరింతువు నీవిందు నజమజలను జెందవలఁదింక వినుము నేఁజెప్పు నుడులు.

వ॥ సుచంద్రనామకుండు వృషభాను నామంబుతోఁ బుట్టి కళావతీ నామాంతరకీర్తిసతీమతల్లి కను వరించి, యామెయందు రాధయను పేరంబరగు పరమేశ్వరిం గనంగలఁడు. ద్రోణుండను వసువును నందుండన జన్మించి భూదేవియగు యశోదను బెండ్లాడి విరాజిల్లు.

ఉ॥ ఆ సమయంబునందు శిరమందునఁ బింఛములల్లలాడ సా
వాసము సేయు గోపికలు భక్తిని రక్తిని యుక్తవేషలై
వాసిగఁ జుట్టుముట్ట ఘనువర్ణపు మేను వెలుంగఁ బీతస
ద్వాసముఁ గట్టి గోష్ఠమున వంశినిఁ బాడుచొౌన ర్తురాసముల్. ౮౩

సీ॥ నాళీకసంభవా! నావ్రజమందునఁ గలిగెడి సంగతుల్గాంచుమయ్య
నందునిగీమున సుందరశ్రీదాముఁడనువాఁడు ప్రియుఁడయి యలరునయ్య
యుపనందగృహముల నూర్జితయశుఁడగు సుబలుఁడు సఖుఁడయి ప్రబలునయ్య
నవనందగృహముల నరకేశవాంశజ స్తోకనామకుఁడు మిత్రుఁడగునయ్య

తే॥ మఱియు షడ్వృషభానుసద్మంబులందు సఖులుగానుండ్రు ప్రస్థ, తేజస్వి, దేవ
లును, విశాల,వరూథపులును, ఋషభుఁడు, ననెడివారలు సర్వకళ్యాణయుతులు.

చ॥ అనవుడు హర్ష మొంది విధియ త్తఱిఁ గ్రమ్మఱ నిట్లు పల్కెనో
యి నిఖిలవేదదైవతపతీ! వృషభానుఁడెవండొ నందుఁడే
యనఘుఁడొ వారిలక్షణము నానవనందుల వారిలక్షణం
బును నుపనందలక్షణముఁ బూర్తిగఁ జెప్పఁగ మిమ్ము వేఁడెదన్ ౯౭

వ॥ అనవుడు భగవంతుండు సంతోషించి, యెవఁడు తొమ్మిదిలక్షల యావు
లకు విభుండగునో వాఁడు నందుండనియు, నైదులక్షల గోవ్రల కధిపతియైనవాఁడు
పనందుండనియు, బదిలక్షల ధేనువులకుఁ బ్రభుండైనవాఁడు వృషభానుండనియు,
గోటిసురభుల కధినాథుండైనవాఁడు నందరాజనియు, నేఁబదిలక్షల నైచికులకువిభుం
డైనవాఁడు వృషభానువరుండనియుఁ జెప్పంబడు. సుచంద్రద్రోణులను నిరువురుమా
త్రమే గోపరాజులుగా నావ్రజమందు జనింపఁగలరనియు, శతరాకాసుధాకరధవళిమఁ
బురణించు శుభ్రవస్త్రంబులందాల్చి యగణ్య లావణ్య తారుణ్యసంపన్నలై విలసిల్లు
గోపవిలాసినుల శతయూథంబులు ప్రవర్తిల్లగలవనియు గుర్తెఱుంగుమన నాలించి,
యవ్విరించి శ్రీకృష్ణున కిట్లనియె. ౯౮

తే॥ భువనకారణకారణ! పుణ్యపురుష! దీనరక్షక! దేవ! యో దేవదేవ
డెందమందునఁ గరుణను బొందుపరచి యూథలక్షణమెఱిఁగింపు మోపరేశ.

తే॥ అనఁగ వెన్నుఁడుపూర్తిగా నవధరించి యంబుజాసన! పదికోటులర్బుదమగు
నట్టి పదియర్బుదంబులెయగును యూథమిటులఁబల్కెరి సర్వమునీంద్రులయ్య.

వ॥ అందునఁ గొందఱు మందయానలు బృందావనపాలికలుగను, గొందఱు
మద్ద్వారపాలికలుగను, గొందఱు పార్షదలుగను, గొందఱు శయ్యోపకారిణులుగను
గొందఱు సుందరులు కుంజనికుంజపుంజంబు నిర్మించువారుగను, గొందఱు గోలోక
వాసినులుగను, గొందఱు గోవర్ధనంబున నుండువారుగను, గొందఱు శృంగారకారి
ణులుగను, గొందఱు మానులయొక్కయు, యోగులయొక్కయు నాశ్రమంబుల
నివసించువారుగను నుందురని యెఱుంగుము. ౯౯

మ॥ మఱి గంగా మధుమాధవీ సులలితా మాయా విశాఖా రమా
విరజా శ్రీయమునా హ్వయాష్టవర సాధ్వీషోడశౌఘంబుల
ద్దిర! మేల్మేలన నేత్రపర్వమగు ద్వాత్రింశత్సఖీయూథము
ల్వఱలంగాఁ గలవట్టి నావ్రజమునన్ బ్రాహ్మీపతీ! వెండియున్ ౧౦౦

వ॥ శ్రుతిరూపలయు, మునిరూపలయు, యజ్ఞసీతారూపలయు, బుళిందాంగ
నలయు, నయోధ్యావాసినులయు, మైథిలలయు, గోసలలయు, వెండియుఁ దొల్లి
యుగంబుల నాచే నెవరెవరు వరంబులం జెందియుండిరో యవ్వారలయు యూథం
బులు ప్రవర్తిల్లఁగలవని యెఱుంగు మన నాతమ్మిచూలి తమ్మికంటి కిట్లనియె. ౧౦౧

తే॥ విశ్వకారణకారణ! వీరలెల్లరేమిపుణ్యమొనర్చిరో యెట్టివరము
లొందిరో దుర్లభంబు నానందకరము నైన మీవ్రజమందెటు సమరఁగలరొ.

వ॥ విశదీకరింపుమని వేడ మాధవుండు వాణీధవున కిట్లనియె. ౧౦౩

## శ్రుతిరూప గోపికల వృత్తాంతము.

క॥ శ్వేతద్వీపమునందునఁ బూతశ్రుతులెల్ల హరినిఁ బుణ్యప్రవచో
వ్రాతమునన్ బ్రార్థింపఁగ శ్వేతద్వీపేశహరి వచించె నిట్టుల్. ౧౦౪

ఉ॥ డెందమునన్ ముదంబును గడిందిగఁ బొందితి నెట్టిసందియం
బిందున లేదుగాన వరమిచ్చెదఁ గోరుఁడు మీమనోరథం
బొందుఁడు కాలయాపనము నూరక చేయకుఁడేఁ బ్రసన్నతన్
జెందిన నేరికైన నతిశీఘ్రముగా ఫలసిద్ధిగాదొకో ౧౦౫

చ॥ సకరుణ నిట్లుఁ దెల్ప శ్రుతిసంతతి సంతసమొంది శ్రీహరీ!
ప్రకృతిపరంబు నవ్యయము వాగ్హృదగోచరమద్వయంబు ని
ర్వికృతము చిత్స్వరూపము వివేకినుతంబును నైన మీ జగం
బకలుషరీతిఁ జూప మిముఁ బ్రార్థన జేసితి మేము భక్తితో. ౧౦౬

చ॥ అనవుడు నాజనార్దనుఁ డనన్యము హర్షదమౌ స్వలోకమున్
గనుఁగొనఁ జేయఁగా శ్రుతినికాయముజూచి ముదంబుబొంది యం
దునఁ దిలకించి నిర్మలినతోయసుపూరిత హంసనిస్వన
ఘనయమునన్ మణిప్రకర నాగరికోభయతీరరాజితన్ ౧౦౭

ఉ॥ ఆవలఁ గౌతుకప్రదము నాయతకుంజ విరాజితంబు వాం
ఛావళిదాగయుక్తము నిరామయమున్ ఋతుషట్కవర్తి సౌ
ఖ్యావహ మద్భుతోరుపరిఖావళిసౌధసమేతమైన బృం
దావనకాననంబుఁగని తత్పరమందునఁ గన్నులారఁగా. ౧౦౮

తే॥ రత్నధాతుమయము శ్రీకరంబు వివిధ విహగమండలయుక్తంబు విమలవారి
పూర్ణనిర్ఝరకందరభూషితంబు నైన గోవర్ధనముగాంచె నచట నవల. ౧౦౯

శా॥ నానారాసరసాన్వితంబు బుధమాన్యంబైన తద్గోపికా
స్థానంబందుఁ గిశోరమూర్తియయి తద్దైత్యారి దైవాఱ "మీ
కానందంబుగ నాదులోకమిదె ప్రత్యక్షంబుగాఁ జూపితిన్
న్గానన్ మీమదిఁ గోర్కెలున్న యెడలన్ నాసన్నిధిన్ బల్కుఁడీ." ౧౧౦

వ॥ అని శ్రీహరి యడుగ శ్రుతులవధరించి కౌతుకకంకణప్రాంకితలోచనలగుచు నా శ్రుతివిశ్రుతున కిట్లనియె. ౧౧౧

చ॥ మనసిజకోటి సుందరతమాకృతిరూపునుగన్న నీపయిన్
మనములునిల్చె మన్మథుఁడు మమ్ముల నూరక వేపుచుండెఁ గా
వున నెటు నీదులోకమునఁ బుణ్యులు కామినులౌచు సౌఖ్యముల్
గనిరటు మేము స్త్రీలమయి కాంతు ననంతసుఖంబులో హరీ! ౧౧౨

మ॥ శ్రుతులిట్టు ల్యాచియింప శ్రీహరి జెవుల్ జొప్పించి యాలించి యో
శ్రుతులారా! భవదీయవాంఛ కెదియున్ సోమింపరాదాయె స
మ్మతమయ్యెన్ వ్రజమందు వ్రేతలుగ జన్మంబెత్తుఁడీ! నైజయో
గ్యత సారస్వతకల్పమైనతఱి నాగామిస్వయంభూస్థితిన్ ౧౧౩

ఉ॥ ఆవసుధాలసన్మథురయందున నందముగల్గి వెల్గు బృం
దావనమందుఁ జెన్నలరు తాదృశమామకరాసమండలిన్
నేవిధిగాఁ జెలంగియు ననింద్యవిధంబున జారరీతి మీ
భావమెఱింగి మైత్రి మిముఁ బావనులన్ బొనరింతు నెంతయున్ ౧౧౪

తే॥ ఇటులఁ దెలిదీవిహారినైన యేను కరుణ వరమొసంగితి దానిచే వారు గోపి
కలుగ జన్మింతు రన్యగోపులనుగూర్చి విస్తరంబుగఁబల్కెద వినుము నలువ.

తే॥ అట్టి త్రేతాయుగంబున నాదితేయరక్షణార్థము రాక్షసశిక్షణార్థ
మేనుబుట్టితి శూరత నినకులాబ్ధిసోముఁడును దాశరథియగు రాముఁడనఁగ

## మైథిలాదినారీ వృత్తాంతము.

ఉ॥ అట్టులఁబుట్టి జానకి స్వయంవరమున్ గననేగి యీశు వి
ల్పట్టుచు ఫెళ్ళనన్ విఱిచి పార్థివు లబ్బురమొంద సీతఁ జే
పట్టి మనోజమూర్తినయి వర్తిల శ్రీమిథిలాపురంధ్రు లి
ట్టిట్టనరాని మోహమున నెంతయుఁజూచి రమర్త్యనాయకా. ౧౧౫

ఉ॥ అంతట వారు ప్రేముడిని నారఘురాముని ప్రోలఁజేరి యే
కాంతమునన్ "మహాత్మ! పతిగాఁదగి ప్రోవుమనంగ జానకీ
కాంతుఁడు దీని ద్వాపరయుగంబు గతించెడి వేళఁ బుణ్యమ
త్యంతమొనర్చి వ్రేతలయి యావ్రజమందు జనించి పొందుఁడీ. ౧౧౬

ఉ॥ ఆ మిథిలాపురంధ్రులకు నట్లు వరంబు దయాళుఁడైన శ్రీ
రాముఁడొసంగి యాపరశురాముని గర్వము బల్మిఁగోసలా
ఖ్యామహితస్వదేశగతియందు నడంచియు వచ్చుచుండఁ ద
ద్భామినులాతనిన్ నయనపర్వముగాఁగని యెంచి రిట్టులన్ ౧౧౭

శా॥ ఆ జాబిల్లిని గేరుచుండు మొగమా యాజానుబాహుద్వయం
బా జాళ్వాజిగిమీఱుదువ్వలువ లా వ్యాహారమాధుర్యమా
తేజం బా కరుణాళుతాగరిమ యాధీరత్వసత్వంబులా
సౌజన్యంబు నుతింపనోపుదురె యోచంద్రాస్యలారా! పరుల్ ౧_౨౦

చ॥ ఇటులఁ బరస్పరమ్మొదల నింతులు చింతనమాచరించి యు
త్కటమగు మోహమొంది పతిగా వరియింపఁగ రాముఁడొప్పి తా
నిటు నొడివెన్ వ్రజంబున నహీనపవిత్రత మీరు గోపికా
పటలిగఁ బుట్టుఁడీ యపు డవారిగ దీర్తును మీయభీష్టముల్. ౧_౨౧

తే॥ కోసలాంగనలకు నిటు గోర్కు లిచ్చి సేనముంగల నడువంగ సీతగూడి
వడి నయోధ్యాపురమునకు వచ్చె నచటఁ గలసతుల్ వానిఁగని తమిఁగనిరి సొమ్మ

వ॥ అంతఁ గొంత తడవునకు నాయయోధ్యానివాసినులగు విలాసినులు మూర్ఛఁ దేఱి సరయూనదీతీరంబు జేరి యా రామచంద్రుని మనంబుల నిల్పి తపం బొనరించు సమయంబున "మానినులారా! యమునాతటినీతటవిరాజమానబృందావనాంకస్థగోకులంబున మీరు గోపికలుగా జన్మించుఁడు. అత్తఱి నీ సీతారాముండును దత్స్థలంబున వెలింగి మీయభీష్టములం దీర్పంగలఁడు విచారంబుమానుఁడను" నాకాశవాణి శ్రుతముగా నవ్వారలలరిరి. అంత శ్రీరాముండును నిజజనకుని యాజ్ఞ నౌదలఁ దాల్చి మాతృబంధ్వమాత్యమిత్రభృత్యాది సర్వజనంబులను సకలసుఖంబులను విడిచి నిర్జనంబును భయంకరంబునగు దండకారణ్యంబునకు సీతా సౌమిత్రి సమేతుండై చనె. ౧౧_౨

ఉ॥ అత్తఱి లక్ష్మణుండు విలువాస్త్రమునన్ గొని వెంటనంటి జా
గ్రత్తగఁ గాచుచుండ రఘురాముఁడు జానకితోడఁ గూడి క
న్నొత్తక నిశ్చలాత్మఁదపియించి జపించి నుతించి కాంచఁద
న్వృత్తిని గోరు దండకవనస్థమునీంద్రుల పాలికిం జనెన్ ౧_౨౩

ఉ॥ ఆసమయంబునందు మునులందఱు స్వీయసమాధిఁ గన్నయా
భాసురవాసుఁడా మకుటభాసితమస్తకుఁడా ప్రశస్త సీ
తాసుదతీశుఁడా దశరథప్రభు పుత్త్రకుఁడయ్యు నట్లు మా
ర్వేసముతోడ వచ్చుటను వింతఁగజూచి తలంచిరీవిధిన్ ౧_౨౪

చ॥ మురళిని వేత్రమున్ విడి యపూర్వతరాకృతి వచ్చె టేలకో
యరుదగుఁ గారణంబెదియొ ? యక్కట ! యంచు సమాధినుండి స
త్వరగతిలేచి మ్రొక్కి పలుభంగుల వేడఁగ రాముఁడున్ దయా
కరుఁడయి కాంచి యేవరము గావలెనో మునులార తెల్పుఁడీ. ౧_౨౫

—♦ మునిరూపాది గోపికల పూర్వచరిత్రము. ♦—

చ॥ అనవుడు వీనులార విని యామునులందఱు రామభూమ! నీ
దు నుడుల కిప్పుడంతసముతో నిటుపల్కుచునుంటిమయ్య! నీ
కొనరిన పూతసీతవలె నొయ్యన మమ్మును స్త్రీలఁజేసి మా
కనుపమ సౌఖ్యముల్ గలుగు నట్టులొనర్పుమటంచు నావుడున్ ౧౨౬.

ఉ॥ రాముఁడు వారికోరికఁ బరాకునుపీడి గ్రహించి యోముని
స్తోమలలాములార! బహుదుర్ఘట మిద్దియె ప్రార్థ్యమైనచో
నీమెయి లక్ష్మణాకృతి ధరించి వసించెద నొప్పరేని మీ
రామతిలుండు ద్వాపరయుగాంతమునందున గోకులంబునన్ ౧౨౭.

ఉ॥ అత్తఱి మీయభీప్సితములన్ని ఫలించును గాని యిప్డు కిం
చిత్తు ఫలింపవేలయన? సీతనుపీడి మఱొక్కనాతినిన్
జిత్తమునం దలంపమని చెప్పితిఁబై విధి నిట్లుపల్కి లో
కోత్తరమైన పంచవటినొందె నతండు సుపర్వనాయకా! ౧౨౮

తే॥ అంతఁ దత్ప్రాంతమందున నలరుచుండు పర్ణశాలఁబ్రవేశించి వనమునందు
సంచరించెడి రాముఁ గామించికాంచు నాపుళిందవాసినులగు నతివలెల్ల

తే॥ మదనపీడితలై రామపదరజంబు నుత్తమాంగంబులందుంచి యుసురువిడువ
నుద్యమింపఁగ శ్రీరాముఁ డుత్తముండు వర్ణియై వారిదరిఁజేరి పరమకరుణ.

తే॥ పడఁతులార! మీరిప్పుడు ప్రాణములను వృథగ వీడకుఁడీ మనోరథము ద్వాప
రాంతమందునఁ బృందావనాఖ్యనలరు వనమునందున సంసిద్ధిబడయఁగలరు

ఉ॥ శంకలవీడి పల్కియిటు చక్కఁదిరోహితుఁడయ్యె నంతటన్
గొంకక రామరాజు కపికోటియుతుండయి రావణాది దు
స్సంకరులన్ జయించి నిజసాధ్విని బుష్పక మెక్కఁజేసి భూ
శంకరుఁడై యయోధ్యకు వెసన్ జనుదెంచెను హంసవాహనా ౧౩౨

తే॥ అట్టులేతెంచి మించి పట్టాభిషిక్తుఁడయి సుఖంబులఁ బొందుచా యవనితనయఁ
బంపె నడవికి లోకాపవాదమున నె యెంతవారికేన్ సంసృతి వంతలిడును.

చ॥ క్రతువులఁ జేయ రామునకుఁ గౌతుకమెప్డెపుడున్ జనించెనో
శ్రుతిహితఫక్కినప్డపుడు చొక్కపుబంగరుబొమ్మ తత్సతీ
ప్రతికృతిగాఁ జెలంగ నవి బాధముగానగుచుండె నంత నా
ప్రతికృతులూపిరుల్ గలిగి రామునిగీమున హెచ్చె నోవిధీ ౧౩౪

క॥ హెచ్చిన ప్రతికృతు లచ్చటముచ్చటగా వెల్గు రామమూర్తినిఁ గనితా
ర్మెచ్చిక సంభోగింపఁగ నిచ్చను వాంఛించి చెంత కేగె నతండున్ ౧౩౫

క॥ వచ్చిన ప్రతికృతులను గని నిచ్చయముగ మీదుకోర్కె నే దీర్పఁజుమీ
నెచ్చెలులారా! యనివాక్రుచ్చెను దరువాత నవ్వి గుయ్యిడెనిట్టుల్ ౧౩౬

క॥ రామా! సీతారామా! మేమాక్రతుకాలములను మెలఁగుచుఁ బూర్తిన్
బ్రేముడి నల్పగ లేదా! యీమెయిమాకోర్కె దీర్ప 'విడియుచితంబే.

వ॥ అన విని శ్రీరామచంద్రుం డిట్లనియె, ౧౩౭

చ॥ ప్రతికృతులార! మీనుడులు బాగుగనున్నవి సత్యమైన ని
ట్టితరిని నామనంబునకు తేవగలేదిది సీతతోడనే
వ్రతముధరించియుంటిఁ బరభామ గ్రహింపను రాజయోగినై
యతులవరంబు ద్వాపరయుగాంతమునన్ వ్రజమందుఁ దీర్చెదన్ ౧౩౮

తే॥ అట్టి శ్రీరామునానతి నటుల నవియు గోపికలుగజన్మించు నకుంఠితముగ
మఱియు నితర గోపికలను గుఱిచినేను విస్తరించెద వినుమయ్య వేల్పుపెద్ద.

వ॥ రమావైకుంఠలోకమున నివసించు విలాసినులును, శ్వేతద్వీపంబుననున్న యన్నులును, నూర్ధ్వవైకుంఠంబుననుండు నువిదలును, నజితపాదాశ్రితాంగనలును, శ్రీలోకాచలవాసినులగు స్త్రీజనంబులును, సముద్రనిర్గత శ్రీలక్ష్మి సఖురాండ్రును, దివ్యలను పేరంబరగు మానినులును, నదివ్యలనునామంబునఁ జెలంగు చేడియలును, సత్వరజస్తమోగుణవృత్తులు గల సతులును, వివిధవిధంబుల నలిపిన యఖండపుణ్యాంబులవలన భూమియందు గోపికలుగా జన్మింతురు. మఱియు రుచియనువాని కుమారుండును, మదంశసంభూతుండును, సుందరుండును, స్వర్గాధిపతియునగు యజ్ఞునింగాంచి కామించి దేవలమునివాక్యంబున హిమవత్పర్వతమం దచలభక్తితోఁ దపంబుగావించిన దేవకాంతలును, బృందావనంబున కనతిదూరంబున విరాజమానంబగు నావ్రజమందు గోపికలుగా జన్మింపంగలరు. వెండియు భూమియందుండు నోషధులు సాక్షాత్కరించిన ధన్వంతరి దేవుం డంతర్హితుండగుట వీక్షించి, భరతఖండంబున నిష్ప్రయోజకులమైతిమని మిగుల దుఃఖించి, స్త్రీరూపంబులం ధరించి, యాదేవుని నెమ్మనంబునందు నిల్పి, నిజమనోరథసిద్ధియగునందాఁక నాలుగుయుగంబులు గడుచునంతవఱకుఁ దపంబొనరింప నద్దేవుండు మెచ్చి, సాక్షాత్కరించి వరంబులం గోరుండని ప్రసన్నవదనంబుతోఁ బలుక వార లమ్మహాత్మున కిట్లనిరి. ౧౪౧

తే॥ దేవదేవ! నీరూపము దివ్యమయ్య మాకుఁబతివౌచు సుకమిడి మనుపుమయ్య
యనఁగ నద్దేవుఁడద్దానినవధరించి తిరిగి వచియించె నిట్లోషధీసతులకు. ౧౪౨

తే॥ ద్వాపరాంతమునందున వల్లరులుగ బృందకావని జన్మించి యీరలున్న
రాస కేళులఁ మీతోడరమణమెలఁగి వాంఛలనుదీర్తునని దయన్ బల్కెదాన.

తే॥ అచలభక్తిసంయుక్తభాగ్యవతులైన వారు బృందావనంబునఁ జారుగోపి
కలుగ జన్మింపఁగలరోయి కమలజాత! యంచు వాచించి మఱీ వచియించెనిట్లు

క॥ జాలంధరపురిఁ జెలఁగెడి, హేలావతులట్టి హరిని బృందాపతినిఁ
లీలంగనుఁగొని యీహరి యేలీలనొ భర్తయైన నింపగు మాకున్. ౧౪౫

క॥ అని యెదఁదలఁచెడివారికి వినఁబడె నిట్లభ్రవాణి బృందావిభునిఁ
వినుతుల్ సేయుఁడు బృందావనమున జనియింపుఁడపుడు ఫలమగు మీకున్.

చ॥ మఱియు సముద్రకన్యకలు మత్స్యశరీరినిఁగాంచి మోహసా
గరమున మున్గి యీహరి నఖండముగాఁ గొనియాడ నాతఁడా
దరమున వారి కోర్కెలిడెఁ దద్వరరీతిని బృందకాటవిఁ
గరముగ వారు గోపికలుగా జనియింపఁగలారు పద్మజా! ౧౪౭

ఉ॥ చండపరాక్రముం డఖిలశత్రునిషూదనపండితుండు ను
ద్దండవదాన్యుండును వదాన్యుఁడునౌ పృథుభూభుజుండు బ్ర
హ్మాండవిభుత్వదీపిత మదంశమునన్ జనియించి కామముల్
దండిగఁ బిండనుండెఁ వసుధాసురభీమణియందు నత్తఱిన్. ౧౪౮

తే॥ దివ్యనావిభుఁ బర్హిష్మతీపురంబునందుఁబొందిన సుందరీబృందమెలమి
గాంచి మోహించి యాయతి కడకునేగి భక్తిఁబ్రణమిల్లి యిట్టులఁ బలికెనయ్యా.

పంచచామరము.

మహామునీ! యనుగ్రహంబు మాపయిన్ ఘటించి యీ
మహానుభావుఁడైన రాజు మాకునెట్లు భర్తయై
విహారమార కేళిపాళి విశ్వసించియుండునో
జిహాసఁ జేయకుండమీరు చెప్పుడయ్య! యిత్తఱిన్. ౧౫౦

చ॥ అన విని యత్రిపత్కెనిటు లంగనలార! ధరిత్రికామగో
వున సకలేప్సితంబులను బూర్తిగఁ బిండుచునుండుఁడిట్లరం
బున నొనరించినన్ భవదమూల్యమనోరథముల్ వసుంధరా
వనిత ఘటించు నమ్ముఁడిటు వ్యాజమొకింతయు నేని లేదిఁకన్. ౧౫౧

ఉ॥ మానినుడిన్ సతుల్ విని స్వమానసపాత్రముతోడ ధారణీ
ధేనువునం దభీష్టములఁ దేఁకువఁ బిండిరి దానిచేతఁ ద
న్మానినులెల్ల వ్రేతలుగ మద్వ్రజమందు జనింతురి కామసే
నానిహితాప్సరోంగనలు నాథునిగాఁ గమలాక్షుఁ గోరుచున్. ౧౫౨

ఉ॥ శ్రీయుతగంధమాదనముఁ జేరి ప్రసిద్ధుని మానినాథు నా
రాయణుఁ గాంచి మోహము గరంబుగఁ బొంది మహాత్మ! భర్తవై
యీయెడ సాఁకుమన్న నతఁడీరు వ్రజస్థలమందు వ్రేతలై
హాయిగఁ బుట్టుఁ డట్టియెడ నందఱ వాంఛలఁ దీర్తునంచనెన్. ౧౫౩

వ॥ అంత. ౧౫౪

చ॥ సుతలనివాసినుల్సతులు సుందరవామనమూర్తిఁ గాంచి మో
హితలయి నాథుఁడౌటకు నహీనముగాఁ గొనియాడ నాతఁడా
సతుల మనోరథంబునకు సమ్మతిఁజూపఁగ నాగకన్య ల
వ్వితమున భర్తృకాములయి వేఁడి యనంతునిఁ దత్కృపన్ భువిన్. ౧౫౫

క॥ బృందావనరాజమునన్ సుందరులౌ గోపికలుగ శోభిల్లి మహా
నందముఁ బొందుచు వాంఛాబృందము జెందంగఁగలరు విశ్వస్రష్టా! ౧౫౬

వ॥ వెండియుఁ గశ్యపుండను మహర్షి, వసుదేవుండన, నదితియను సతీమతల్లి దేవకీదేవియనఁ, ద్రోణనామకవసువు, శూరుండన, ధరుండనువసువు దేవకుండన, వసునామకవసు వుద్ధవుండన, దక్షుండు. దయానిధియగు నక్రూరుండనఁ, గుబేరుండు హృదీకుండన, వరుణుండు కృతవర్మయనఁ, బ్రాచీనబర్హి గదుండన, మరుతుం డుగ్రసేనుండన, జన్మింతురు. ౧౫౭

తే॥ అట్టియుగ్రసేనాఖ్యునే నఖిలరాజ్యమునకు మూర్ధాభిషిక్తుఁగా నొనరఁజేసి
సర్వవిధముల సర్వదా చల్లనైన చూపుఁ జూపుచుఁ గాపాడుచున్ వసింతు.

వ॥ మఱియు నంబరీషుండను రాజు యుయుధానుండనఁ, బరమభాగవతోత్తముండగు ప్రహ్లాదుండు సాత్యకియన, క్షీరసముద్రుండు శంతనుండన, ద్రోణనామక వసువు భీష్ముండన. దివోదాసుండు శల్యుండన, ఖద్యోతాంశసంజనితభగుండు ధృతరాష్ట్రుండనఁ, బూషుండనువాఁడు పాండుండన, ధర్ముండు యుధిష్ఠిరుండన. బవనుండు భీమసేనుండన. స్వాయంభువమను వర్జునుండన, శతరూపయను రమణి సుభద్రయన, సూర్యుండు కర్ణుండన, నాశ్వినేయులు నకులసహదేవులన, బ్రహ్మ బాహ్లికుండన, వైశ్వానరుండు ద్రోణాచార్యుండనఁ, గలి దుర్యోధనుండన, జద్రుం డభిమన్యుండన, శివుం డశ్వత్థామయనం బరఁగి భూతలంబున, జన్మింపగలరు. ఇట్లు యదువులయుఁ గౌరవులయుఁ దక్కుంగలవారలయు కులంబులందు స్వాంశంబులతో స్వస్త్రీసాకంబుగా నాయానతిం బుట్టంగలరు. గోకులంబున రమాంశగలిగి జన్మించు గోపికలు పదాఱువేలకు మించి చెలంగుదురని యెఱుంగుమనిచెప్పి యోగమాయం గాంచి యీకరణి నాజ్ఞాపించె. ౧౫౯

## —♦ కృష్ణుండు యోగమాయను నియోగించుట. ♦—

చ॥ చతురత దేవకీలలన సప్తమగర్భము సంగ్రహించి గో
పతియగు నందు గోష్ఠమున బాహుబలుండగు కంసుభీతిచే
ద్రుతగతిఁ బోయియున్న యలరోహిణి నా వసుదేవపత్నియం
దతుకనొనర్చి నందసతియైన యశోదకు నీవు పుట్టుమా. ౧౬౦

ఉ॥ శ్రీపతి యోగమాయకిటు సెప్పఁట దేవగణంబుతోడ బ్రా
హ్మీపతి యాలకించి కమలేశునకున్ నతిసల్పి భూమిసం
తాపమడంచి సాత్త్వలపితంబుల; నద్భుతకాంతిసంతతిన్
దీపితమా స్వధామమును దేవత లారతులెత్తఁగాఁ జనెన్. ౧౬౧

క॥ ధరణీనాయక! కృష్ణుఁడు పరిపూర్ణతమావతారభగవంతుండీ
ధరఁ గంసాదినరేంద్రని, కరపథకై పుట్టునయ్య గమనింపు మిటుల్. ౧౬౨

చ॥ తనువున నెన్నిలోమములు దాల్చియున్నవొ యన్నినాలుకల్
గొని విబుధుల్ నుతించినను గోపతియా హరిసద్గుణంబులం
దున నొకదాని నెన్నినటు దోఁపక వారలశక్తిదోఁచు నిం
గిని విహగంబు లాత్మగతిఁ గేరుచు నాకడఁదాఁక నట్లనన్. ౧౬౩

ఉ॥ భూరమణుం డిటుల్ పలికె భూసుర! క్రోలితిఁ ద్వద్వచోమృతం
బీరిటఁ గంసవీరుఁడని యేరినొ పేర్కొనియుంటి రాతఁడే
యారవసించు నెవ్వఁడతఁ డుత్తముఁడో యధముండొ పూర్వబ్రం
దారకుఁడో యమర్త్యుఁడొ యథాస్థితిఁదెల్పుఁడనన్ మునీంద్రుఁడున్. ౧౬౪

కంస పూర్వజన్మ వర్ణనము.

చ॥ నరపతి! తొల్లి వార్ధిమథనంబున దుష్టుఁడు కాలనేమిక
ర్బురుఁడలచక్రితో సమరమున్ బొనరించి హతుండుగా నిశా
చరగురువైన భార్గవుఁడు స్వప్రతిభన్ బ్రతికించె వానినిన్
మరల నతండు యుద్ధమును మాధవుతో నొనరింప నెంచుచున్. ౧౬౫

క॥ మందారాచలసవిధం, బందరవిందజునిఁగూర్చి యబ్దశతక మా
నందవ దూర్వారసమే, సందియములులేక క్రోలి సలిపెన్ దపమున్. ౧౬౬

వ॥ అంత నవ్వాణీకాంతుం డాతనితపంబునకుమెచ్చి తత్సమీపంబునకువచ్చి
యిట్లు వాక్రుచ్చె. ౧౬౭

చ॥ తపమునుమెచ్చి వచ్చితిని దానవనాయక! నీమనోరథం
బిపుడు వచింపుమన్న నతఁడెందఱు దేవత లీప్రపంచమం
దపరిమితర్ధిష్ఠులయి యచ్యుతుఁడే శరణీయుఁడంచు నో
రుపున నుతింతు రట్టియమరుల్ ననుఁజంపనియట్లు చేయుమా. ౧౬౮

చ॥ వరమిది యిమ్మనంగ నలబ్రహ్మయు దుర్లభమిద్దియిప్డు క
ర్బుర! మఱియొక్క జన్మమునఁ బొందెద వియ్యది నిక్కమయ్య సం
బరమున నుండుమయ్య యనిపల్కెను బిమ్మట వాఁడు తద్వచ
స్సరణిని నుగ్రసేనునకు జానుగఁబుట్టెను గంసనాముఁడై. ౧౬౯

వ॥ అంత నక్కంసుండు. ౧౭౦

ఉ॥ పిల్లతనంబునుండిఁ బెఱపిల్లలఁదిట్టుచుఁ గొట్టి నెట్టుచున్
మల్లులతోడఁబోరుఁ బలుమాఱొనరించుచుఁ గ్రీడలాడి రం
జిల్లెడివేళ దిగ్జయముసేయ జరాత్మజమాగధేశ్వరుం
డుల్లసమాడుచున్ యమున యొడ్డునవేసి గుడారు వీరుఁడై. ౧౨౧

తే॥ అట్టికంసునితోఁగయ్య మాడఁదొడఁగె నింతలోనా జరాసుతునకుసొంతమగుచు
వేయియేన్గులబలమున విస్తరిలిన కువలయాపీడమనుకరి కొ్రవ్విమిగుల. ౧౨౨

తే॥ గొలుసులన్నియుఁదెగటార్చి కొంపలెల్లఁగూలఁద్రోయుచుశిబిరముల్ గోలుపఱచి
గిరితటంబులఁబడఁద్రోసి సరభసమునఁ గంసుడొనరించు నాజికిఁ గదలిజేరె.

శా॥ శుండాలంబిటుసొచ్చి ఘీంకృతుల దిక్షోభంబు గావించి వే
తుండంబెత్తి రథాశ్వమత్తకరులన్ దూలించి జృంభించి దో
ర్దండాఖండుల జెట్టిజట్టులను బాఱంద్రోలఁ గంసుండు త
చ్ఛుండాదండముఁ బట్టి మట్టె ధరణిన్ శూరాగ్రణుల్ మెచ్చఁగా. ౧౨౪

ఉ॥ క్రమ్మఱ భూమినుండి నల కంసుఁడు దానిఁ గరమ్ములన్ లఘు
త్వమ్మునఁనెత్తి యూపిరులు వ్యత్యయమొందఁగఁ ద్రిప్పి త్రిప్పి యం
తమ్మునఁ దజ్జరాసుతు నదభ్రవరూధినిపైన నూఱుక్రో
శమ్ములు దాఁటునట్టుల వెసన్ విసరెన్ గసి వాసి భాసిలన్. ౧౨౫

ఉ॥ గంధగజమ్ము సీవితముగాఁ బడవేయుటఁజూచి తజ్జరా
సంధుఁడహో! యిదేమి బల సంపదఁ బెంపునుతింపశక్యమే!
బంధువులందుఁగాని పరపార్థివులందునఁగాని స్నేహసం
బంధజనాళిఁగాని యిటు బాధబలిష్ఠునిఁగాంచలే దహో. ౧౨౬

చ॥ పరధనముల్ హరించితినిఁ బార్థివులందఱ రూపుమాపితిన్
గురుకవివిప్రమాను లనుకూలురుగా వసియింపఁ జేసితిన్
నరసురఖేచరప్రకరనాశమొనర్చితిఁ జక్రవర్తినై।
ధరణినినేలుచుంటి నిటుదార్ఢ్యనిచేయఁగలేదు నేనెటన్. ౧౨౭

ఉ॥ ద్రవ్యము రూపముం గులము దక్షవిపక్షవిమర్దనక్రియా
భవ్యబలంబు మాన్యత యపారయశంబును సాహసంబు సం
భావ్యముగావసించుటను బాధముదంబు ఘటిల్లె వీని మ
ద్భవ్యసుతాద్వయం బిడి వివాహితుఁ జేసెదనంచు నెంచితాన్. ౧౨౮

తే॥ హస్తిలక్షయర్బుదము హయంబు లయుత
దాసురాంఢ్రద్రిలక్షరథంబు లొసఁగి
ప్రస్తుతుండైన కంసభూపాలమణికి
నస్తిఁబ్రాస్తిని నొసఁగెఁ బ్రశస్తరీతి. ౧౨౯

వ॥ అంత. ౧౩౦

—♦ కంసుకు దిగ్విజయం బొనర్చుట. ♦—

తే॥ ద్వంద్వయుద్ధంబునందతిధన్యుఁడైన కంసుఁడేకాకియై భుజకాండపటిమ
రమ్యమాహిష్మతీపుర రాజమునకు నరిగెఁదత్పుర పాలకు లడలనెదల. ౧౮౧

సీ॥ చాణూర,ముష్టిక, శల,కూట,తోశల, నామకనర వరనందనులను
మల్లతల్లజుల సామంబునఁజీరి యోగండలారా! రంగు కదనమునకు
విజయమొందిన మీకుభృత్యుఁడనౌదునే విజయమొందినమీరు భృత్యులగుదు.
రిందులకొప్పిన నీపురప్రముఖులముంగల రూఢిగాఁ బోరుజరుగు

తే॥ ననెడిపణమునుదెల్పెను ననలవార లేము వీనికినొప్పితి మింకఁ గంస!
చేయవలసినకృత్యముల్ చేసి నీవు లెమ్ము భండనభూమికి రమ్మనంగ.

ఉ॥ పోరునకాతఁ డొప్పికొని ముందుగ మొగ్గరమందు ద్రొగ్గు చా
ణూరునిఁబట్టి నేలపయి నొవ్వఁగఁ గొట్టిన ముష్టికుండు బ
ల్పౌరుషమొంది యాదవకులప్రభు ముష్టులఁదాఁక నాతఁడుగ్
శూరత నొక్క గ్రుద్దునకె సొమ్మసిలన్ బ్రహరించె వానినిన్ ౧౮౩

చ॥ అదిగని కూటమల్లుఁడు మహారుష రా యదువీరుఁడాతనిన్
బదముల రెండుఁబట్టి ధరపైఁ బ్రహరింపఁగఁగాంచి తెక్కులన్
జదుముచు వచ్చినట్టి శలు స్కంధమునన్ గ్రహియించి యెన్నియో
కదుములు గట్టఁద్రోసి వడిఁ గ్రిమ్మఱఁబట్టుచు నెట్టె నంతటన్ ౧౮౪

ఉ॥ మల్లుఁడు తోశలుండు నభిమానముగాఁజని పోరఁ గంసుఁడ
భ్యుల్లస మొంది తద్దనుజు నూరుయుగంబును జేతితోడ శో
షిల్లగఁ బట్టి నెట్టియుఁగసిన్ బదియామడ లేగఁ ద్రోసి వే
మల్లలితోక్తి దాసులగు మల్లుల వారలఁగూడి పోఁడిమిన్ ౧౮౫

తే॥ చని ప్రవర్షణాద్రికి నందు సంచరించు ద్వివిదనామకవానరవీరుఁ గాంచి
కదనమాడరమ్మనఁగ నాకపియు నిరువదెనిమిదిదినముల్ వానితోననియొనర్చె.

చ॥ మదమున నొక్క భూధర మమాంతముగాఁగొని కంసుపైన నా
యదనున వేయ నాతఁడల యద్రిగ్రహించి కపీశువృత్తి వే
సదమదమొందవైవఁ గపి చక్కనిముష్టులఁ గంసుఁగ్రుమ్మి యా
చదలున కేగ తేఁడు రభసమ్మున వెంటనెపట్టి కూల్పఁగా ౧౮౭

చ॥ ద్వివిదుఁడు తత్ప్రహారమున విస్మృతిఁజెంది కృశించి శల్యమా
త్రవపువుగల్గి యాగనని తత్క్షణమందున దాసుఁడయ్యె నా
యవసరమందు; నంతనలయాదవవీరుఁడు ఋశ్యమూకనా
మవనికి నేగి కేశియను మానవభక్షకుఁ డొక్కఁడుండఁగా ౧౮౮

ఉ॥ వాని, హయస్వరూపుని, నపారఘనస్వనుఁ జూచి ముష్టులన్
బూనికఁ గ్రుమ్మి లోఁచి తరుపుంజమనోజ్ఞమహేంద్రశైలము
న్మానసవేగసామ్యగమనంబునఁ జేరి సులీల నూఱుమా
ళ్లానగ మూఁడఁగాఁ బెఱికి యట్టిటులన్ బడవైచె నందునన్ ౧౪౯

ఉ॥ ఆమెయిఁ గాంచెఁ గంసవిభుఁడాప్రిలయాతిభయంకరోజ్జ్వల
ద్ధామనిధిన్ సమస్తవసుధావిభుకంఠవిలుంఠనక్రియో
ద్దామయశోలసత్పరశుధారణధైర్యమనోభిరామునిన్
రామునిఁ గోపరక్తముఖు బ్రాహ్మణవంశపయోబ్ధిసోమునిన్ ౧౫౦

ఉ॥ కాంచి శిరంబునన్ గరయుగంబు లగించి యతండు మ్రొక్కి ధ్యా
నించి ప్రదక్షిణంబుల ననేకములన్ బొనరించి కాళ్ళపైఁ
గించను గాంచకుండఁ బడఁగిన్క వెలింగెడి భార్గవుండు శాం
తించి కొలందిఁగా నతని ధీరునిఁజూచి యిటుల్వచించెడిన్ ౧౫౧

ఉ॥ మానవకీటకాధముఁడ! మర్కటడింభక! దోమవోలె నీ
వీనగమందు నైతివని యిమ్మెయి నెమ్మనమందు నమ్ముమా!
మానిని, క్షత్రియుండ, ననమానుఁడనంచుఁ దలంచితేమొ యే
దీ నిమిషంబునందున మదిష్టవిధంబున నాచరింపుమా ౧౫౨

చ॥ ధనువిది లక్షభారకలితంబును దత్త్రిపురాహవంబునం
దున దనుజారి శంభునకుఁ దోడుగ నిచ్చిన దర్ధవంతమున్
ఘనమును క్షత్రియాళివధకై శివుఁడాదృతినాకు నిచ్చియుం
డిన దిపుడెక్కుపెట్టుమ! త్రుటిన్ మఱిఁ జంపెద లేనిచో నరున్ ౧౫౩

ఉ॥ తూర్ణముగా యదూత్తముఁడు ధూతనృపాన్వయ భార్గవోక్తులన్
గర్ణములారఁగా విని సుఖంబుగ డంబగు సప్తతారకో
ద్వర్ణితచాపముం గొని యథావిధి జూపఱు నబ్రమొంద నా
కర్ణములాగి టంకృతినికాయమొనర్చెను నూఱుమాళ్లొగిన్ ౧౫౪

ఉ॥ గుండెలు బ్రద్దలయ్యె ఘనకోటులుపాటున మ్రోసె నట్టిబ్ర
హ్మాండము గూడ సప్తబిలసార్ధముగాఁ గడుమాఱుమ్రోఁగె భూ
మండలమందుఁ దారకలు మండగ రాలెను దిగ్గజంబులున్
దండిని వీడి తల్లడిలెఁ దచ్ఛరటంకృతి సల్పుపట్టులన్ ౧౫౫

ఉ॥ అంతటఁ గంసుఁ డాశరము నచ్చటనుంచి మహానుభావ! నే
నెంతటివాఁడ క్షత్రియుఁడ నింతయుఁగా నిఁక దైత్యుఁడన్ జుమీ
స్వాంతమునందు శాంతమును జక్కఁగఁ బొందుఁడి! దాసదాసుఁడన్
జింత దొలంగ సేవలను జేసెదఁ దప్పక నన్నుఁ బ్రోవుఁడీ ౧౫౬

చ॥ అనుచు నమస్కరింపఁగ మహోగ్రహపూరితజాంబవంతుం డూర్జితుఁడైన
వినుచుఁ బ్రసన్నచిత్తుఁడయి వీర్యసమంచితవచ్చరంబు నా
తనికి నొసంగి ధైర్యమును దార్ఢ్యముఁగల్గిన వైష్ణవంబు దీ
నినిగొను మిద్ది దద్దయును నీయరులన్ జరిమార్చునో బలీ! ౧౯౮

తే॥ కాని యిమ్మహాచాప మేఘనుఁడు పుడకవిఱిచినట్టుల విఱుచు నావీరవరుఁడె
నిన్ను యుద్ధరంగంబున మన్ను జేయఁగలఁడటంచు నెఱుంగుమో యలఘువీర!

చ॥ అటుపయిఁ గంసుఁడాబుధున కొఁదలమొ్రక్కి యనంతరంబునన్
జటులమదోన్మదుండగుచు సప్తసముద్రవృతావనీస్థలిన్
దిటముగ వీరుఁడై తిరిగి దీకొనువారలు లేనియట్టులు
త్కటముగ సల్పి భూపతుల కప్పములన్ గయికొంచు నావలన్ ౧౯౯

చ॥ జలనిధితీర మేగి యట సప్పము బోలిన రూపుతోడ బు
స్సలఁ బలుమాఱు గొట్టుచుఁ బ్రజాతతి కెంతయు భీతిగొల్పుచున్
జెలఁగు నఘాసురున్ గనియుఁ జేతగ్రహించి యసృక్కులొల్కఁగా
నిలపయిఁగొట్టి దండగ ధరించి గళంబున లోఁచి వానినిన్ ౨౦౦

తే॥ వింతఁ దూర్పున వంగదేశాంతరములఁ బుంగవాకారమునను్న పూర్వదివిజుఁ
డౌ నరిష్టునితోడుత నని యొనర్చి హస్తిహస్తిత్తోఁగలిసి పోరాడినటుల.

చ॥ మలను నరిష్టరాక్షసుఁడమందగతిన్ బెకలించి కొమ్ములన్
బలుఁడగు కంసరాజుతలపైఁబడఁద్రేయఁగ వెంటనే యతం
డలమలఁగొంచరిష్టుశిరమందున వైచి బలిష్ఠముష్టితో
నిలఁబడవైచి రక్కసు జయించి వడిన్ జనె నుత్తరాశకున్ ౨౦౨

తే॥ అందుఁ బ్రాగ్జ్యోతిషాఖ్యతో నలరుపురికి నేగి నరకాసురాహ్వాయు నిద్ధబలుని
దైత్యుఁగనుఁగొని తనదు యథార్థభావములను దెలుపంగ వాంఛించి పలికెనిట్లు

ఉ॥ ఓనరకాహ్వాయా! వినుము యుద్ధముఁగోరుచు వచ్చియుంటి నో
దానవనాయకా! సమితిదానముఁ జేయుమ! శౌర్యమొందునీ
పూనిక నేఁ బరాజయముఁ బొందిన దాసుఁడ నౌదు నొండె నీ
కేని పరాజయంబయిన నీవును దాసుఁడ వౌదు వింతటన్ ౨౦౪

క॥ ఇరువురు శపథమునిట్టులఁ గరముగ నేర్పఱచుకొని యఖండరణంబున్
హరి హరిఁబోరెడి సరణిని సరభసమునఁ జేసి రమరచయము నుతింపన్

చ॥ జనకనరేంద్ర! యీవఱ కసాధ్యబలుండగు నాపరాలంబుతో
నని మొనఁగంసభూమివిభుఁ డాగి యెదిర్చిన యట్టు లిప్పుడీ
దనుజుని మల్లయుద్ధమునఁ దాఁకి ధరన్ బడవేసి కొమ్మలన్
గొని యలవానివీలును నకుంఠితరీతిని బాఱవేయఁగా ౨౦౬

ఉ॥ ధేనుకదైత్యుఁడాగ్రహము దేఁకువ హెచ్చఁగఁ దద్యదుప్రభున్
బూనికఁబట్టి ధాత్రిపయిఁ బొర్లునటుల్ పడఁద్రోయ నాతఁడా
దానవు వందయామడలు దాఁటగ నెట్టి ద్రఢిష్ఠముష్టులన్
వానినిఁ జూర్ణమౌనటు లవారిగఁగొట్టె ననంతరంబునన్ ౨౦౭

తే॥ బలితృణావర్త దైత్యుఁడు భౌమునాజ్ఞ యుద్ధసన్నద్ధుఁడై కంసునొడిసిపట్టి
యంబరంబున కేగియు నచట లక్షయోజనంబులపైనని యొనరఁజేసె ౨౦౮

ఉ॥ అంత ననంతమైన బలమందిన కంసవిభుండు వానిఁ ద
త్ప్రాంతమునుండి భూతలముపైఁబడులాగున నోట రక్తమ
త్యంతముగ్రక్కునట్టుల రయంబునఁద్రోయ బకుండుగాంచి బ
ల్పంతముతోఁగ్రసించుట కవారణపద్ధతి నేగె నంతటన్. ౨౦౯

చ॥ కులిశసమానముష్టి యదుకుంజరుఁడా బకదైత్యవీరునిన్
సులువుగఁగూల్చె నాతఁడును శూరత రేఁపఁగ లేచి వారిదం
బులవలెఁగాఱులార్చి తెలుపుంగలఱెక్కలు గల్గి వానినిన్
బులుఁగునుబోలెఁ బైకెగసి పొట్టనుబెట్టుకొనెన్ గుటుక్కునన్. ౨౧౦

ఉ॥ కంసుఁడు బాహ్యమేగుటకుఁ గర్బురకంఠముఁబట్టి నెట్టనన్
హింసనొనర్చె దాని కతఁడేత్తెఱఁజూపఁగలేక క్రిక్కునా
యంసలుఁడా బకున్ ధరను నాగ్రహవృత్తినిఁ ద్రోసి దేవతా
శంసితరీతిఁగొంచుఁ బలుసాపలు ద్రిప్పి జయించెఁ బిమ్మటన్ ౨౧౧

క॥ ఆతని చెలియలు పూతన భీతినివిడి రణముసేయ వే చనుదేరన్
భూతలపతి నగి నే నెట నాతులతో ననికి దిగను నమ్ముమ యమ్మా! ౨౧౨

చ॥ అదియునుగాక యట్టిబకుఁడన్నయె నాకగుఁగాన నీవు నిం
పొదవఁగఁదోడఁబుట్టువయి యొప్పగనుండుమటంచుఁబల్కె ని
య్యది విని శక్తిఁగన్న వసుధాత్మజుఁడౌ నరకాసురుండు త
త్త్రిదశవినాశకృత్యమున ధీరునిఁ గంసుని వేఁడెఁ దోడుగాన్. ౨౧౩

చ॥ అనవుడు నాతఁడొప్పి జితులైన ప్రలంబముఖాసురేశ్వరుల్
దనుఁగొలువంగ శంబరునిధామముఁ జేరి స్వకీయభావమా
తనికెఱుఁగంగఁ జెప్పె నల దానవనాథుఁడు శంబరుండు దా
ఘనబలుఁడయ్యుఁ గంసుని నకారణరీతిని ఢీకొనం డహో ౨౧౪

చ॥ మఱియును గంసుతోడ ననుమానము మానుచు నట్టి శంబరుం
డఱిముఱి నేస్తముల్ స్వకసఖాన్వితుఁడై యొనరించె దానికా
నెఱసరి సంతసించి మదనిస్తులుఁడౌచుఁ ద్రిశృంగశృంగమం
దిఱికిన వ్యోమపుణ్యాజను నీక్షణఁజేసి మహాగ్రహంబునన్ ౨౧౫

చ॥ పదములఁదన్ని నిద్దురను బాసి యతండును రక్తనేత్రుఁడై
గదయెది దెమ్ము తెమ్మనుచుఁ గంసుని హింసనొనర్చి క్రుద్ధులన్
యదుకులనాథుఁ డద్దిగని యా! యని ముష్టులఁ గుర్వఁగఁజేయఁ బూ
ర్వదివిజుఁ డాయదుప్రభుఁ గరంబు బలంబున గుద్దెఁ గద్దయున్ ౨౧౬

చ॥ ఇటులఁ బరస్పరమ్ము రణమెంతయు ఘోరముగాఁ గచాకచిన్
దిటముగ సల్పిరంతఁ దుద ధీరతఁ గంసుఁడు వ్యోమదైత్యుని
త్కటముగఁ బట్టి కొట్టి తనదాసునిగా నొనరించుకొంచుఁ దా
నటుపయి నేగుచుండుసమయంబున నేనరుగంగ మ్రొక్కియున్ ౨౧౭

శా॥ దేవా! యుద్ధముజేయ నిచ్చఁగల దేధీరుఁ బ్రశంసింతువో
యేవీరుఁ గెలువంగఁ బొమ్మనెదవో యేమాడ్కిఁ జేయింతువో
మీవాణీవిధి లక్ష్యమందునిచి యామేడంబు నేఁజేసి మీ
భావంబుఁ నెఱవేర్తుఁగాన దయతోఁ బల్కుండగున్ నారదా! ౨౧౮

మ॥ అనఁగా నాతని కిట్లు చెప్పితిని సత్యానందకృత్యాస్తులన్
దనుజా! జిత్వర బాణదైత్యవిభుతోఁ దట్టాడి మట్టాడుమా
చనుమా! పట్టును బట్టుమా! యశము నా చంద్రార్కమానట్లుగాఁ
గనుమా! హర్షము గూర్చుమా! మిగుల వేగంబే జయంబొందుమా!

వ॥ జనకనరేంద్ర! యంత నల సాహసధైర్యసమేత నేతయున్
దనభుజవిక్రమక్రమముఁ దద్దఁదలంచి మదించి మించి యా
ఘనబలుఁడైన బాణుఁడు ప్రిటిఁ గయ్యమునన్ దునుమాడివత్తు నే
నని శపథంబొనర్చుచుఁ బ్రియాణముసల్పి క్రమక్రమంబుగాన్ ౨౨౦

ఉ॥ శోణితనామపట్టణము శూరులు మెచ్చఁగఁ జొచ్చెనంత నా
బాణుఁడు కంసురాకయును పద్దును బెద్దలచేతవించు గీ
ర్వాణమదప్రహారకుఁ డవార్యమహాసురనాథుఁడైన యా
బాణునిఁ గూర్చి యాకరణిఁ బగ్గెనొనర్చెనె? నెగ్గునే? యిటన్ ౨౨౧

ఉ॥ హుమ్మని రక్తనేత్రుఁడయి యుర్వరమూరెడు గ్రుంగ నాగలో
కమ్ముననుండు వారలును గంపము జెందఁగ భూమిమీఁద దా
ర్ఢ్యమ్ముకొలంది నొక్కహతి దక్కొనికొట్టి ఘనంబుమాడ్కి నా
దమ్మొనరించి "కంసుఁడ! మ్రతంబుగఁ గ్రుంగిన దీని నెత్తుమా ౨౨౨

చ॥ అనవుడుఁ దక్షిణంబున నె హస్తి యదృచ్ఛఁగరంబుఁ గొన్నమా
డ్కిని యదువీరవర్యుఁడు వడిఁ ధర హస్తములన్ గ్రహించి పై
కనువుగనెత్తె, నత్తఱి మహాద్రులు గూలె రసాతలంబులే
డును వెసఁ బైకిలేచెను గడున్ జలియించెను దిగ్గజంబులున్ ౨౨౩

చ॥ తదుపరిఁ గంసుతో రణముఁ దాల్మినొనర్పఁగనుండు బాణు నా
యదనునఁగాంచి యీశుఁడు రయంబునవచ్చి "బలిష్ఠ! బాణ! నీ
కిది సమయంబుగాదు మఱి యుద్ధబలుండగువాఁడు కృష్ణుచే
సదమదమొందు నన్యులకు సాధ్యుఁడుగాఁడని విశ్వసింపుమా ౧౨౪

చ॥ మఱియును భార్గవుండు నసమంబును వైష్ణవమైన యస్త్రముణ్।
వరము నొసంగె నీతనికి వైరము నానుడి మానుమా" యటం
చిరువురకెంతయో చెలిమి యేర్పడ నేర్పుగసల్పె నంత సం
బరమునఁ గంసభూవరుఁడు పశ్చిమదిక్కునకేగెఁ గ్రక్కునణ్ ౧౨౫

చ॥ అటుపయిఁగంసుఁడాదెస మహాసురుఁడొక్కఁడు వత్సరూపము
త్కటముగఁ బొందియుండెనని కర్ణములారఁగ నాఁకించితాఁ
బటురయమొప్ప జేరి నరభక్షకునాతనిఁ గాంచి వానితోఁ
జటులరణంబొనర్చి యవసానమునందు నమందశక్తితో. ౧౨౬

ఉ॥ వాలముపట్టి నేలపయి వత్సనిశాచరు బాఁది యంత త
చ్ఛైలము వెంటనే తన వశంబొనరించి తురుష్కభూమిలో ।
నూలుకొనంగఁగాలయవనుండను దైత్యుఁడొకండు గాఁలె నం
చోలిఁజెవిణ్ బడణ్ వడి మహోద్ధతపద్ధతిఁజొచ్చెఁ దత్స్థలిణ్. ౧౨౭

తే॥ కాలయవనుండు నాచేతఁ గంసురాక విని యమాత్యులతోఁడుత విజనదేశ
మందు యోజించి యాజియం దతనిఁగూల్చి జయముగాంచెద నేనని జనకరాజ!

సీ॥ చూర్ణీకృతాఖండశూరతాభూషితారాతులైయొప్పు పాదాతికులును
ఖండీకృతారాతిమండలశుండాలమండలులైన వేదండములును
న్యక్కృతాదభ్రాభ్రనవ్యగంభీరనినాదంబులౌ మహార్విన్నాదములును
ధిక్కృతసూర్యాశ్వదివ్యమనోవాయుధాటీయుతంబులౌ ఘోటములును

తే॥ బృథులరథములు సెలఁగఁగ వీరవీర కాలయవనుం డధఃకృతఘనవిమాన
యాన మెక్కియెక్కువ్మడి నరులయెదల గాలమైతాఁక రణభేరిగీలుకొలిపి.

శా॥ రక్తిణ్ యుక్తిని వాహినీపతులఁ జేరంబిల్చి ఘోరాహవో
ద్యుక్తుల్ గండు క్రియాకలాపములఁ బ్రత్యూహంబు లేకుండఁగా
యుక్తంబౌనటులాచరింపుఁడని యిట్లుత్సాహముంగొల్పి తా
రక్తశ్మశ్రుగదాధరుండయి సమిద్రింగంబుఁ జొచ్చెన్వడిన్ ౧౩౦

శా॥ కంసుం డాతని వానిసేనఁగని నిష్కారుణ్యభావంబునన్
ధ్వంసంబున్ బొనరింప నెంచి రిపుదోర్దండక్షితిప్రక్రియా
సంసిద్ధిప్రథితప్రధానగద లక్షౌభారయుక్తన్ సుధీ
సంసత్తుల్ గొనియాడఁ జేతఁగొని యా సంగ్రామరంగంబునన్ ౧౩౧

చ॥ గిరగిరఁ ద్రిప్పి వానిపయిఁ గీఁచన వేసియు సింహనాదమే
ర్తెఱ గరువంబునన్ సలిపె దిగ్గజముల్ చలియింప ఖేచరో
త్కరము భయంపడన్ ఘన వకావకలై పగులన్ గిరుల్ వడన్
శరధిసమూహమింక రిపుసైన్య మనస్సపు దైన్యమొందఁగా ౨౩౨

ఉ॥ వెంటనె దంటయా యవనవీరుఁడు మీఁదికి వచ్చెత్తద్దనన్
గెంటుటకై మహాప్రలయకీలితదండసముజ్జ్వలద్గదన్
గంటగిలంగ వేసె నిది, కంసగదాయుధమున్, బరస్పరం
బంటుచు దంటపో రతిశయమ్ముగ సల్పెను మింటమంటలన్ ౨౩౩

తే॥ ఎట్టకేలకు రెండును గొట్టినట్టి పిండివలెనయ్యె నంతఁ గంసుండు కాల
యవను నవనిపైఁబడ వేసి హస్తములను బట్టికొట్టుచు జీవచ్ఛవంబొనర్చి

తే॥ బాణవర్షంబు గురిసెడివాని సేనఁ గాంచి గదతోడఁ జూర్ణముగాఁగఁ గొట్టి
యశ్వరథగజవీరుల హతమొనర్చి ఘనముచాడ్పున గర్జించె జనకరాజ!

క॥ అంతట భయపడి మ్లేచ్ఛు లనంతముగాఁ జింతనొంది యని విడివడి నే
పొంతలకో పరుగిడ వాఁడంతయుఁగని మిన్నకుండె నాఁగనటంచున్ ౨౩౬

సీ॥ ప్రలయార్కబింబంబువలె జిగిగలవాఁడు గంబాలవలెఁ దొడల్ గలుగువాఁడు
గగనంబుఁ బోలిన కౌనుగల్గినవాఁడు కమలాభనేత్రముల్ గ్రాలువాఁడు
వాటమౌ పెద్దకవాటముక్రియ ఱొమ్ములరువాఁడు హారముల్ వఱలువాఁడు
నాఁబోఁతుమూఁపుల యందమొందినమూఁపు లమరువాఁడు కిరీటమలరువాఁడు

తే॥ రక్తవర్ణము లసితవస్త్రములునిడుపుఁగూకటుల్ గలుగువాఁడును గుండలములు
బద్మమాలయుఁ గలవాఁడు బలుఁడునైన కంసుఁడంతటఁ గడుఁగండకావరమున

వ॥ శత్రువుల కభేద్యంబగు వర్మంబుదాల్చి గదాముద్గరతోమరభిండివాల ఖడ్గంబులను ధనుర్బాణంబులను నాజానుబాహువులన్ ధరించి. పీనాంసంబుపై దూణీరంబునిచి, జరామరణరహితులగు నమరుల నోడింపఁదలంచి తనచేఁబూర్వజితులైన చాణూర, ముష్టి, కారిష్ట, శల, తోశల, కేశి, ప్రలంబ, బక, ద్వివిద, తృణావ, ర్తాఘకూట, నరక, బాణ, శంబర, వ్యోమ, ధేనుక, వత్సాసురులు దన్నుఁ జుట్టుముట్టి కొలువ ననుచరులు జయజయధ్వానంబు లొనర్పఁ బటహఢక్కాకాహళాది వివిధ వాద్యశబ్దంబులు దిక్కులుపిక్కటిల్లి మాఱుమ్రోయ రణభేరిమ్రోఁగించి, సమరోత్సాహసంపన్నుండై స్వీయచమూ సమూహంబులకు సేనానులను నియమించి, యుత్సేకించి ముక్కంటి నెక్కసక్కెయమాడు రౌద్రాకారమ్ముతోదండెత్తి వేల్పులకునికిపట్టగు నమరావతీపురంబుసొచ్చి యిచ్చమెచ్చియుండ. ౨౩౭

ఉ॥ శక్రుఁడుగాంచివజ్రిముఖశస్త్రములన్ గొని దాఁడిచేసె భూ
చక్రము గిర్గిరందిరుగ సాగరముల్ గలఁగంగఁ, దమ్ముఁడౌ
చక్రియు సంతసింప రిపుసైన్యము దైన్యముఁ బొందుచుండ ని
ర్వక్రపరాక్రమక్రమవిభాసుర దేవగణంబు వెంటరాన్ ౨౩౯

ఉ॥ వీరులు వీరలిర్వురును విగ్రహముల్ బొనరింపసాఁగి దు
ర్వారభయంకరంబులగు బాణకృపాణగదాది శస్త్రసం
భారములన్ బరస్పర మవారిగఁబోరియు దొమ్మియుద్ధముల్
నేరుపుతోడ ఘోరముగ నేఁడమినాడఁగ సల్పిరో విభూ! ౨౪౦

ఉ॥ ఒండొరు లిట్లు శౌర్యమున యుద్ధమొనర్చెడి కాలమందుఁ గో
దండశరంబులన్ దమము దండిగఁ గ్రమ్మఁగఁ దేరునెక్కి యా
ఖండలుఁడుద్ధతిన్ మెఱుపుకై నడివెల్గు శతారమాపవిన్
గండునిఁగంసునిం దునుమఁగాఁబడవైచెను మెచ్చఁ బ్రేక్షకుల్. ౨౪౧

ఉ॥ జృంభితదేవరాజుపయి శీఘ్రగతిన్ బరికించి కంసుఁడు
త్తంభితకోపుఁడౌచు నరిదారణదారుణ ముద్గరంబునన్
జంభవిభేదివజ్రము వెసన్ జెడి నంచులు మొక్కవోయి యి
క్కుంభినిఁగూలునట్టుల నకుంఠితరీతి నొనర్చనింద్రుఁడున్. ౨౪౨

శా॥ ఆలోకించి మహోగ్రహోగ్రుఁడయి యయ్యాలంబునన్ ఖడ్గముం
గేలందాలిచి కంసశీర్షముపయిం గీలించి భీమారవం
బోలిన్ సల్పఁగ మాలతోమదకరేణూత్తంసముం గొట్టు నా
లీలన్ మాటి యలక్ష్యమయ్యె నది హాళిన్ గంసుఁడాపట్టునన్. ౨౪౩

చ॥ తడయక లక్షభారగురుతాదృఢతావిదితాష్టధాతు యు
క్తడమరకార్యకారిగదఁదాల్చి పురందరుమీఁదవైవ నా
తఁడుగనిదానిఁగైకొని ద్రుతంబునఁగ్రమ్మఱ దైత్యవీరుపై
నిడెఁదనరౌతుమాతలి యహీనరుషన్ జనుదెంచి తోడుగాన్. ౨౪౪

చ॥ అలుకను గంసుఁడాత్మపరిఘాయుధమొంది మహేంద్రు మూఁపుపై
బలిమినిగొట్టఁ దోనఁగడపట్టె క్షణంబతఁడా మరుద్గణం
బులు గని గృధ్రపక్షయుతముల్ బహుదీధితిదీప్తబాణముల్
లలిఁగొని కంసుఁగప్పె జడులన్ మొగులర్కునిఁ గప్పుచొప్పునన్. ౨౪౫

ఉ॥ బాణుఁడు వేయిపాణుల నపారముగా విలునొత్తి యామరు
చ్ఛ్రేణుల బాణజాలములఁ జెండుట నావసురుద్రసూర్య గీ
ర్వాణబలిష్ఠులట్టికని పౌరుషమూని యనేకరీతులన్
బాణములన్నిటిన్ బఱపి బాణుని త్రాణ నణంగఁజేయుటల్. ౨౪౬

ఉ॥ కాంచి మదించి మించి నరకత్రివశారిప్రలంబరాక్షసా
ద్యంచితుఁడై ఘనారవము నట్టులబొబ్బలు నెట్టవేల్పులా
లించి సమీకరంగమున లీలనుమూర్ఖను వ్రాలిరట్టి వ
జ్రాంచితుఁడప్పైలేచి యధికాగ్రహనిగ్రహబద్ధచిత్తుఁడై. ౨౪౭

తే॥ పాటితాఖండశాత్రవపాటనంబు రమ్యవిగ్రహభాసురైరావతంబు
గంసదైత్యుని రణమునఁ హింసఁజేయ నంకుశాస్ఫాలనంబున నంప నదియు.

చ॥ కదనముసొచ్చి తుండమును గైకొని ఫూత్కృతులఁ బొనర్చి దు
ర్మదమును గ్రక్కుచిట్లటుల మాటికిమాటికి ఘంటికాధ్వనుల్
రొదనొనరింప మంచుమలరూఢినిఁబోలి చరించి కంసునిన్
బదములఁగూల్ప నాతఁడనివార్యబలోద్ధతశౌర్యధుర్యుఁడై, ౨౪౮

సీ॥ సిందూరఘనసారచందనకస్తూరిగోరోచనావాసనారుచిరము
జంద్రికామల్లికాశంకరశరదిందురజతాద్రివర్ణవిభ్రాజితంబు
శృంఖలాఘంటికాశ్రేణినిర్గతకర్ణపేయనినాదసంవేష్టితంబు
నభ్రగంగాప్రవాహాంబుధిభవనాదసమధికఘీంకారసంయుతంబు

తే॥ ప్రబలసంపన్నమగు రమ్యరత్నకంబళాన్వితంబునునగు నల యభ్రముపతి
దంతసంతానముంబట్టి తనపిడికిటఁగొట్టి యింద్రునిరెండవ గ్రుద్దుగ్రుద్దె.

ఉ॥ దేవవిభుండు కంసనిహతిన్ గడుదవ్వునఁగూలె నట్టి యై
రావత మూరుపర్వముల వ్రాలుచువ్యాకులమొంది కర్మమున్
జేవదలిర్ప లేచియుఁగసిన్ రదనంబులఁగొట్టి కంసుని
న్జైవడి లక్షయామడలు నెట్టెను మేలు! బళీ! బళి! యనన్. ౨౫౧

చ॥ పడినను వజ్రకాయుఁడగు వాఁడిసుమంతవిచారమొంది యా
పిడుగువితానఁజొచ్చి యని బెబ్బులికై వడిఁ గింకతోడ బ
ల్గడుసుగనున్న యాకరినిఁ గట్టిగఁబట్టి రణాంగణంబునన్
బడునటుసల్పి పిండిగతిఁ బండ్లనొనర్చియుఁ జెండెఁదొండమున్. ౨౫౨

కం॥ అంతటనైరావతమున్ వంతన్ గడుఁగుంది వైరివరులనుదోడ్తో
నంతముసేయుచు ననివిడి శ్రాంతిన్ గొన స్వర్గమేగె సరభసవృత్తిన్. ౨౫౩

ఉ॥ ఆపయిఁగుంద వైరులు మహాబలులర్ఘురె! యంచు నెంచ సం
తాపముపీడ నెచ్చెలులు ధైర్యము స్వీయజనంబుపొందఁ ద
చ్ఛాపమువైష్ణవంబుగొని జ్యానుఘటించుచు నెక్కుపెట్టి బ
ల్దాపుల వేల్పుమూఁకల విఘాతమొనర్చెను గంసుఁడంతటన్. ౨౫౪

ఉ॥ కొందఱు వేల్పులాజివిడి కుందుచుఁ బాఱిరి కాల్గొలందిగాఁ
గొందఱు ముక్తచూడులయి కూలిరి తాళఁగలేక కొందఱున్
సందులగొందులన్ దరుల చాటునమాటున నక్కి రక్కిలిన్
గొందఱు ముక్తకచ్ఛులయి గోల్పడి రాత్మ మహత్త్వమానముల్. ౧౫౫

ఉ॥ ఈరహినిన్ బరాజయము నెంతయుఁ బొందియు బాఱుచుండు బృం
దారకులన్ గనుంగొనుచుఁ దద్యదువీరుఁడు వారిగద్దియన్
జారుతరాతపత్రములు సత్వరితంబుగ లాఁగికొంచు దే
వారులు వెంటనంట మధురాహ్వయపట్టణ మొందె నోవిభూ! ౧౫౬

వ॥ అని జనకునకు నారదమహర్షి వచించెనని శ్రీగర్గాచార్యుండు శౌనకునకుపదేశించి వెండియు నిట్లని చెప్పదొడంగె. హరిభక్తియుక్తుండును, మిథిలాధినాథుండునగు బహులాశ్వుండు సురర్షివర్యుండగు నారదునింగాంచి స్వామీ! మీసందర్శనంబున నాజన్మంబు చరితార్థంబయ్యె. నాకులం బనాకులంబై యమలంబగు యశంబునుగాంచి లోకనుతంబయ్యె. మీనుడుల నాకల్మషంబులు నశించినవయ్యె. దుర్జనుండేని శ్రీకృష్ణభక్తులగు భవాదృశుల సందర్శనంబున నఘనిర్మూలకుండై సజ్జనుండగునని యొక్కమొగిఁ బెద్దలు వక్కాణింతురుగాదె! మఱియుఁ దత్కంసాది దుష్టవధార్థంబెత్తినశ్రీకృష్ణుండారాధాదేవితోఁగూడియాగోకులంబునజన్మించి యేయేక్రీడల నెట్లెట్లొనరించెనో యెవరినెవరి ధన్యాత్ములంగావించెనో యాతెఱంగంతయు వినవలతుఁగావున వినిచి తాపత్రయనిర్మూలనం బొనరింపవే యని ప్రార్థింప నమ్మౌనీంద్రుం డారాజేంద్రుతో నిట్లనియె. ౧౫౭

ఉ॥ శ్రీకమలేశభక్తుఁడు సుశీలుఁడునౌ నిమి యేకులంబు న
వ్యాకులముం బొనర్చి చరితార్థమొనర్చెనొ శ్రద్ధతోడ నీ
వేకులమందుఁ బుట్టి కడువృద్ధిని జెందఁగ సల్పియుంటివో
యాకులమిత్తఱిన్ హరికథామృతధారల ముక్తిఁ జెందదే. ౧౫౮

మ॥ ఘనరక్షఃకులనాథకంసవధకే కాకుండ శిష్టావనం
బునుసల్పన్ జనిఁగాంచు కృష్ణుని మహాపూతంబులున్ బాపనా
శనకృచ్ఛీలములున్ శుభప్రదములున్ శ్రావ్యంబులౌ లీలలన్
వినుమయ్యా! మిథిలాధినాథ! జనకా! విష్ణ్వంఘ్రిబద్ధాత్మతోన్. ౧౫౯

## —♦ రాధావతార వర్ణనము. ♦—

మ॥ దివిఁగప్పన్ ఘనముల్ నభస్సితఘనా ధృగ్వారయుక్తోడురా
డ్దివసంబందుఁ బవల్ జనించెను మహాతేజోవిశేషంబు యో
గ్యవిధిన్ దద్వృషభానుభార్య కల రాధాభిఖ్యముఖ్యంబుగా
నవలంబించి కళిందజాతటనికుంజాసన్న గేహంబునన్. ౧౬౦

చ॥ దెసలుప్రసన్నతంగనెను దేవగణంబులు సల్లెఁబుష్పముల్
బసదనమొందు సుందరులు బాటలుపాడిరి కమ్మతెమ్మెరల్
విసరెనువాసనల్ దగ దివిన్ గ్రహతారకలున్ వెలింగె నా
నిసువుజనించునత్తఱి ననిర్వచనీయమహత్త్వమేర్పడన్. ౨౬౧

ఉ॥ ఈసుముహూర్తమందు జనినెత్తిన కోటిశరత్సుధాకరో
ద్భాసురపుత్త్రికన్ గని యథావిధిగాఁ దలిదండ్రులెంతో సం
తోసముబొంది దక్షిణలతోడుత గోవుల రెండులక్షలన్
భూసురవర్యసంతతికి మ్రొక్కియొసంగిరి బాఢభక్తితోన్. ౨౬౨

ఉ॥ దేవమునీంద్రదుర్లభయు దివ్యయుఁబూజ్యయుఁ గోటిజన్మసం
భావితపుణ్యలభ్యయు నపారమహోద్యుతిభాసమానరా
ధావిదితాఢ్యశ్రీసముదితప్రణయోత్తమ్యపలాలితాంగియా
శ్రీవృషభానుపుత్త్రిఁగని చెంది రమందముదంబు దేవతల్. ౨౬౩

ఉ॥ మేలిమిజాళువాహారాయలుమీఱి సువాసనతోడఁగూడి తా
రాలమెఱుంగుఁబొంది మగరాలవిలాసముమ్రోసి వెల్గు ను
య్యాలనురాధికాశిశువు హాయిఁబరుండఁగఁబెట్టి నెచ్చెలుల్
జోలలఁబాడిరానిసువు శుక్లసుధాంశునిఁబోలి హెచ్చెడిన్. ౨౬౪

తే॥ నవ్యరాసమండలమండనాయమానరాధికాదేవి వృషభానురమ్యవసతి
దీపపుంజంబుమాదిరిదివ్యచంద్రికవలెవెల్గించి వెల్గు నల్గడలఁగడిఁది. ౨౬౫

తే॥ అట్టిశ్రీకృష్ణుమెడయందు హారవిధిని గ్రాలియుండెడి నుత్కృష్టరాధ నేను
భక్తితోడుత వేమఱుభావమందు ధ్యానమొనరించి తిరిగెద ధాత్రిలోన. ౨౬౬

వ॥ అన విని రాజేంద్రుండు మునీంద్రునితో నిట్లనియె. ౨౬౭

తే॥ ఏమియావృషభాను నదృష్టగరిమ! యేమియాతనిజాతకం బేమిదశయొ!
కాని యంతటిరాధను గనుటకొఱకు నేమొనర్చెనో! నాకది యెఱుఁగఁజెపుమ!

మ॥ అనినన్ నారదుఁడాలకించి ధరణీంద్రా! తొల్లిజన్మంబునం
దు నృగుండన్ వసుధాతలేంద్రునకుఁ బుత్త్రుండై మహాభాగుఁడై
ఘనుఁడై సర్వనరేంద్రనాథుఁడయి శ్రీకాంతాంశసంభూతుఁడై
తనరెన్ నిర్జితకామరూపుఁడయి యిద్ధాత్రిన్ సుచంద్రుండనన్. ౨౬౯

వ॥ ఇట్టి సుచంద్రుండనువానికిఁ బితృదేవతలు తమ మానసంబున జన్మించిన
వారును, నతిమనోహరరూపిణులునునగు కళావతి, రత్నమాల. మేనకయను కొమరి
తలందుఁ గళావతియనుదానిని సాలంకారగావిధ్యుక్తముగా దానంబొనర్చిరి.పిమ్మట
రత్నమాలను విదేహాధినాథునకును, మేనకను హిమవంతుని కొసంగి వివాహంబు
విధివిధానంబుగా నొనర్చిరి. అంత వారిలో రత్నమాలకు సీతయు, మేనకకుఁ బార్వ

తియు నుద్భవిల్లిరి. వీరల చరిత్రంబులు పురాణంబులందుఁ బ్రసిద్ధంబులైయుండు. ఇఁక సుచంద్రుండనువాఁడు కళావతీసహితుండై గోమతీ తీరంబుననుండు వనంబున దివ్యంబులగు పండ్రెండువత్సరంబులు బ్రహ్మనుగూర్చి తపంబొనరింప నప్పరమేష్ఠి మెచ్చి యాతనిదరిఁజొచ్చి వరంబు వేఁడుమనిన నతండాలించి తనవెన్నునఁ బెరిగిన వల్మీకంబును దొలఁగించుకొనుచు నిర్మలదృష్టితో నద్దేవదేవుంగనుగొని ప్రణమిల్లి యల్లన నిట్లుప్రార్థించె. ౨౨౦

తే॥ నీదుదర్శనమబ్బుట నేను దేవదేవ!ధన్యతఁజెందితి దివ్యమగుచుఁ
బరముకంటెనుబరమయివఱలుచుండుమోక్షమొసఁగుమునాకిదేముఖ్యవరము.

మ॥ అనిప్రార్థింపఁగ నాకళావతియు దుఃఖాంభోధినిర్మగ్నయై
కనుమో దేవ! నమస్కృతుల్ గొనుము! నాకష్టంబు మాయింపుమా
యనుమానంబును మానుమా! యెడద నీయాలాపమాలింపుమా!
కనఁగాస్త్రీలకు భర్తయేదుగడయై క్రాలున్ గదా యోవిధీ! ౨౨౧

చ॥ తనపతికంటె వేఱొకటి దైవము సాధ్వులకెందు లేదటం
చు నిఖిలశాస్త్రముల్ వలుకుసూవె! దయన్ బతికీవు మోక్షమి
చ్చిననొకదానినౌదు మఱి జీవితనాయకు వీడి యెట్లు జీ
వనమొనరింతుఁ? గాన విడు పట్టును, శాపమునిత్తు లేనిచోన్ ౨౨౩

ఉ॥ నావుడు బ్రహ్మ దద్దరిలి నాతిరొ! పూతచరిత్రివౌటచే
నె వెఱపొందుచుంటి నిఁక నేను వచించినమాట సత్యమౌఁ
గావున నీవునుందివికిఁ గాంతునిగూడియె యేఁగుమమ్మ! సౌ
ఖ్యావహమార్గమొంది మనుమమ్మ! క్రిమమ్మిగఁ గాలమేగినన్ ౨౨౪

తే॥ ద్వాపరాంతమునన్ మీరు దంపతులుగ భరతఖండమునందునఁ బరిఢవిల్లు
గంగయమునల నడుమను గ్రాలుచుండు భూమియందునఁ దప్పక పుట్టఁగలరు.

తే॥ అంత మీకలరాధికయనుఁగుబిడ్డయగుచు నెప్పుడుపుట్టునో యపుడుమీరు
మోక్షమందంగనుండ్రిఁక మూల్గకమ్మ యనుచు నోదార్చె నావల నావరమున

తే॥ శ్రీభలందననృపతికిఁ జిన్నిబిడ్డయై కలావతి కాన్యకుబ్జాహ్వయపురి
యజ్ఞకుండసముద్భవయై యపూర్వభవ్యరూపముతోడుతఁ బ్రభవమయ్యె.

క॥ అంత సుచంద్రుఁడు పూర్వో దంతజ్ఞానంబుతో మదనతుల్యుఁడు ధీ
మంతుఁడు గోపవరుండుగఁ బంతుగ సురభానునింటఁ బ్రభవంబయ్యెన్ ౨౨౫

క॥ ఆతఁడు వృషభానుండని భూతలమున ఖ్యాతికెక్కి పొలుపారఁగఁ బ్ర
జ్ఞాతిశయుండగు నందుఁడు చేతంబునఁదలఁచి చూచి చివరకు వేడ్కన్ ౨౨౬

క॥ తొలిబామునందుఁ జెలఁగిన తెలివిగల కళావతీసతీతిలకంబున్
బలుఁడగు నాతనికిడి ప్రాఁబలుకులు వచియించినటు వివాహమొనర్చెన్

తే॥ పదపడిఁ గళావతీవృషభానువరులు దశశతయశీతి నఖిలసౌఖ్యములఁ గనుచుఁ
గోపురముఁ జేయుచుండిరీ కథనువినిన జనులు స్వర్గపదంబునఁ దనరఁగలరు.

ఉ॥ శ్రీమధురాపురాన యదుశేఖరులందఱు శూరుసానతిన్
బ్రహ్మమహితద్విజాగ్రణిని గర్గుఁ బురోహితుఁగా నొనర్చి బ
ల్ప్రేమిడిఁజూచి రొక్కయెడ వేదవిదుండగు నాతఁడెంతొ గా
రాముగఁజేరె నట్టి మధురానగరీశుని రమ్యహర్మ్యముల్ ౫౭౨

వ॥ సకలజనమనోభిరామంబగు నాసౌధమందున నవరత్నఖచితంబులై నయన పర్వముగావించు హాటకకవాటంబులుగలిగి, చేఁగలమొకంబులచేతుల యాక్షేపంబులఁ దాకుళ్ళఁజెందు తేఁటులపాటల నీటువొంది యవిచ్ఛిన్నంబుగాఁ బ్రశస్తహస్తి గండస్థలంబులనుండి స్రవించుమదంబునఁ జల్లనై సువాసితంబును, నానామండన మండితంబును, నఖండంబునై వెలుంగు నొండుమండపంబునఁ బరపురరథరథ్యరథిక వినాశకరణసమర్థంబులగు కరితురగరథపతాకంబులతో శతృవుల కభేద్యంబులగు తనుత్రాణంబులందాల్చి నిల్చి పగతుఱ రూపుమాపఁజాలుభటవర్యులు జయజయ నినాదంబులు సలుప, నిర్వక్రపరాక్రములగు దేవకాక్రూర కంసాదివీరులు నల్గడలఁ బరివేష్టించి కొలువఁ బరిజనంబులు ఛత్రచామరంబులంగేలంబూని యుభయపార్శ్వంబులందు నిలువ, నభఃపీఠంబున విరాజిల్లు తరణికరణి, సర్వార్థప్రదాతయగు చింతామణిపైఁదనరారు సురపతిసరణిని, సింహాసనంబునఁజెలంగు యదువిభుండును, నిగ్రహానుగ్రహసమర్థుండును నగు నుగ్రసేనుండు తనచెంగటకేతెంచు నాబ్రహ్మవాది వర్యుని ౫౭౩

ఉ॥ కాంచుచుఁ గన్నులారఁ దన గద్దెను డిగ్గన డిగ్గి శీర్షముల్
వంచి నమస్కరించి యదువర్యులఁగూడి తదంఘ్రియుగ్మమ
ర్చించి సుభద్రపీఠిని వసింపనొనర్చి స్తవంబు భక్తిఁగా
వించి నతోత్తమాంగుఁడయి వేఱగుపీఠినిఁ దాఁజెలంగఁగాన్ ౫౭౪

## —♦ దేవకీవసుదేవవివాహవర్ణనము ♦—

ఉ॥ గర్గబుధోత్తముండు గని కౌతుకమొంది ప్రియంబుతోఁజతు
ర్వర్గమొసంగు దీవనల బాగుగఁజేసి యదూత్తమా ! భవ
ద్వర్గమునందు సేమమొకొ ? పాడియుఁ బంటయుఁ జక్కనున్నవే ?
దుర్గమముల్ సుఖంబులొకొ ? తోషణమొందుచునుందురే ! ప్రజల్ ౫౭౫

చ॥ అని సుఖమడ్గి తత్సవిధమందు వసించిన దేవకాఖ్యుని
న్గని వినుమోయి దేవక ! యనంతను నారయ యాదవాన్వయం
బున వసుదేవుఁబోలిన సుబుద్ధి మఱొక్కఁడు లేఁడు గాన నీ
తనయను నాదుమాటవిని తప్పలికీవిడి పెండ్లిసేయుమా ! ౫౭౬

వ॥ అనవుడు నాతండు సరియనియొప్పి స్వజనహితసహితంబుగా దేవకీ వసుదేవులకు వివాహంబు శాస్త్రవిహితంబుగా నొనర్చి దాసీసహస్రంబును, హయ నియుతంబును, గజాయుతంబును, గోలక్షద్వయంబును, రథనియుతంబును బారిబర్హం బుగా సమర్పించి, భేరీమృదంగఢక్కావీణావేణుగోముఖాదినానావాద్యంబులు శ్రావ్యంబుగా మ్రోఁగుచుండ నల్లునితోఁ దన కూఁతును బయనంబుసేసి సర్వాలం కృతంబగు నరదంబు రప్పించి దానిపైఁ దన్మిథునంబు నెక్కించి యనుపుచుండుతఱిం గంసుఁడు తన చెలియలయుల్లంబు సంతసిల్లంజేయఁ దద్రథంబధిరోహించి రథ్యంబుల రశ్మలంబట్టి వినోదంబుగా నడుపుచున్నంత.

ఉ॥ అంబరవాణి, యీమె కను నష్టమగర్భము నిన్నుఁ జంపు స
త్యంబిపుడీవు మిక్కిలి ద్రుతంబున మావులఁబట్టి త్రోలుచున్
సంబరమొందుచుంటివిఁక స్వాంతమునం బరికింపుమా! యటం
చింబుగఁ బల్కెఁ గంసునకు నేత్రైఱ నయ్యాదివించు నాతఁడున్ ౨౮౮

ఉ॥ చెట్టలఁగూడువాఁడగుటఁ జెల్లెలటంచనకుండఁ గొప్పనుం
బట్టుచు వాఁడివాలుఁగొని భావమునన్ దయవీడి చంపమో
పెట్టుటఁగాంచి పార్షదులు భీతినిజెందిరి కుందిరందఱున్
గట్టడికర్మ్రమంచనిరి గౌరవభాజనులెల్ల రయ్యెడన్ ౨౮౯

మ॥ వసుదేవుం డల కంసుఁబట్టికొని బావా! భోజవంశంబునున్
బసఁగాఁ జేసిడివాఁడవై బలుఁడవై బాణాఘభౌమాదులన్
గసిమై నల్పి సుకీర్తిచే నలరి శ్లాఘ్యప్రక్రియాకారివై
స్వసయౌ నీమెను బట్టి కొట్టుటిది సౌజన్యంబె? మాన్యంబొకో? ౨౯౦

చ॥ అదియునుగాక నాకిపుడె హాయిగఁ బెండిలిసల్పి యీవిధిన్
సదమదముంబొనర్చెడి విచారణఁజేయుట గూడదయ్యా! నీ
యెద దయఁ బూనవయ్యా! శుభమెంతయు నీకు ఘటించు నీమెపై
మదమును జూపకయ్యా! యభిమానము మానకుమయ్యా! యియ్యెడన్ ౨౯౧

ఉ॥ చిన్నది సుందరీమణి సుశీలయుఁగావున వీడుమంచు నె
న్నెన్నియొ తెన్నులన్ వినయమెంతయుఁదోఁప వచింప నాతఁడా
యన్నిటి నాలకింపక దయారహితుండయి యామెఁ జంపఁగా
నున్నఁ గడంగి క్రమ్మఱను యుక్తవిధిన్ వసుదేవుఁ డిట్లనెన్ ౨౯౨

ఉ॥ చక్కని యుక్కడీఁడ! నినుఁ జంపెడి దష్టమగర్భమేకదా
చక్కఁగనున్న దొక్కనుడి సాంతముగా విని యద్ది చేయుమా!
యిక్కమలాక్షి యర్భకుల నెప్పటికప్పుడె తెచ్చియిచ్చెదన్
నెక్కొని చంపుమా! భయము నెట్టుమ! చెల్లెలిఁబ్రోవుమా! దయన్

ఉ॥ నావుడుఁ గంసవీరుఁడును నాకు భయంబిఁక లేదటంచుఁ దా
నావసుదేవసూక్తి విని యాత్మగృహంబునకేగె భీతచా
దేవకితోడఁగూడి వసుదేవుఁడుగూడ స్వధామమొందె భీ
త్యావృతమానసుండయి ధరాధిపమౌళిమణీ! సుధీనిధీ! ౨౯౭

తే॥ అట్టులాకంసుఁ డిలుసేరి యస్త్రశస్త్ర ధరులఁబదివేల జోదులఁ దక్షణమునఁ
బంప వారలు వసుదేవ భవనమొంది ముట్టడించిరి పరుగిడి పోవకుండ.

వ॥ అంత గొంతకాలమగుడు వసుదేవుండు వరుసగా దేవకియం దెనుమండ్రు
గురు కుమారులను, సనాతనియగు యోగమాయాపుత్రికను గాంచె. దీని విష
యమంతయు విశదీకరించెద వినుమని యిట్లనియె.

ఉ॥ ఆదినిఁ గీర్తిమంతుఁడను నర్భకునొక్కనిఁగాంచి కొం చతం
డాదను గంసుమ్రోల నిడ నాతఁడు గన్గొని యిచ్చమెచ్చి యో
యాదవ! వీఁడు నన్నడఁపఁ డష్టమగర్భముఁద్రుంతుఁ గాన వే
మోదముతోడఁ వీనిఁగొనిపొమ్మనిచెప్పె విదేహనాయకా! ౨౯౮

క॥ అంతట వసుదేవుండును సంతసపడి కొమరుఁగూడి చని స్వగృహమునన్
వింతలుగద! యరయఁగ దుశ్చింతకవాక్యంబులంచుఁ జెలఁగుచు నుండెన్

ఉ॥ అత్తఱిఁ గంసవీరవరుఁ డభ్రిపథంబున వచ్చునాకు నా
యత్తముసేసి యర్ఘ్యము పదాబ్జయుగంబున కర్చసల్పి యో
సత్తమ! దేవభావమును సత్వరమే వచియింపుమన్న నేఁ
జిత్తము హర్షమొందునటుసెప్పితి నాతనికిట్టులో విభూ! ౨౯౯

తే॥ దేవతలు దేవకీముఖ్యదివ్యసతులు దేవులెల్లరు తద్వసుదేవముఖులు
నష్టవసువులు నందాదు లట్టి బుక్కులెల్ల గోపికలై యుండి రిలను గంస 300

చ॥ మఱి వృషభాను నామముఖమాన్యులు వేల్పులు నట్టి దేవకీ
తరుణికి నేడుగర్భములు దైవవశంబునఁగల్గు నాయనం
తరమున నష్టమం బమరి తప్పక నిన్వధియించునంచు ని
ర్జరులని రద్ది నీకిపుడు చక్కఁగఁజెప్పితి గుర్తెఱుంగుమా! 30౧

చ॥ ఇటుల మదాశయంబు నిడి యేగితి దానిని విన్న కంసుఁడు
త్కటమగు కోపమొంది యదుకాండము నంతయుఁ జంపఁబంతమున్
దిటముగఁబట్టి యట్టి వసుదేవుని దేవకి బంధనంబునం
దటమట జెంద సంకెలల హస్తములన్ దగిలించి యుంచియున్ 30౨

ఉ॥ దేవకి పెద్దబిడ్డఁగొని తీక్ష్ణతరంబుగ నొండుబండపైఁ
జేవనుగొట్టె నిట్టులనె చిత్తమునందలి విష్ణుభీతి నా
దేవకి పుత్రషట్కము వధించెఁ గ్రమంబుగ నుగ్రసేనధా
త్రీవరుఁడిద్దివించు వసుదేవుని రక్షణసేయుపూన్కితోన్ 303

ఉ॥ ఆగ్రహావహ్నిమండ సభయందువసించిన శత్రుపుత్రుదు
ష్టాగ్రణిఁ గంసవీరుఁ గనులారఁగనుంగొని యడ్డగింప నా
యుగ్రబలుం డెదుర్కొనుచు నుద్ధతిఁజూపఁగ నుగ్రసేనయో
ధాగ్రణు లుగ్రశస్త్రముల నంది యవక్రపరాక్రమంబునన్ ౩౦౬

ఉ॥ కాచి స్వకీయసైన్యములఁ గాల్చిరి కంసునిసేనఁ దక్షితిన్
జూచిన కంసవీరు లరిశూరబలంబుల మాయఁజేయఁగా
లేచి మహాస్త్రశస్త్రముల లీలఁగ వేయఁదొడంగి రంతటన్
ద్రోచుకొనం గడంగిరి యదుప్రవరుల్ మఱిఁ గంసయోధులున్ ౩౦౭

తే॥ ద్వారదేశమునందు నుభయులసైన్యములును బోరాడె నాశుగములఁగ దారు
లను బరస్పరజయకాంక్ష దనరెనందు జనులు పదివేలు మడిసిరి శక్తిలేక

తే॥ అంత నాకంసవీరుఁ డయ్యాహవమునఁ దండ్రిసేనలఁ గనుఁగొని తత్క్షణమున
రోషరోహితమూర్తియై రుద్రమూర్తి వైరిమత్తేభహరిగదఁబట్టి కొట్ట

ఉ॥ కొందఱుభిన్నపాదులును గొందఱు భిన్నలలాటకుల్ మఱిం
గొందఱు భిన్నకంఠులును గొందఱధోముఖు లూర్ధ్వగాత్రులున్
గొందఱు వీతవస్త్రులయి కూలిరిగొందఱు బాఱిరందునన్
గొందఱు నెత్తురుం గ్రక్కిరిఁ గొందఱు మూర్ఛితులైరి వెండియున్. ౩౦౮

ఉ॥ కాయములందుగాయములఁ గాఁజెడినెత్తున నిండె నుగ్రసే
నాయతసేన, చూప అహహా! యనిచింతిలి రంతఁగంసుఁడున్
బాయకయుగ్రసేనవిభుఁబట్టుచు గద్దియనుండి యీడ్చి యా
సాయముసేయువారిని వెసన్ జెఱఁబెట్టెను ద్రాళ్ళఁగట్టుచున్. ౩౦౯

ఆ॥ మఱియుఁగంసవిభుఁడు మధుశూరసేనదేశములగడనఁజేసి స్వర్ణపీఠి
నెక్కిమిగులనిక్కి చెల్లయాదవులను బాధపెట్టుచేలెఁ బార్థివేంద్ర. ౩౧౦

తే॥ యదువరులు వానిహింసల కాగలేక దేశకాలపాత్రములిటఁ దికమకలుగ
నుండెననియెంచి దూరమందున్న స్వీయబంధుగృహముల కేగి రిప్పట్టునందు.

## ♦ బలరామావతార వర్ణనము. ♦

తే॥ దేవకీసతి కేడవదివ్యగర్భ మధికహర్షశోకములతో నతిశయింప
యోగమాయదానినిగొని యుక్తరీతి రోహిణీకుక్షిఁగూర్చె నిరూఢశక్తి.

తే॥ అంత మధురాపురీ ప్రజలరరె! యేమి! దేవకీగర్భ మేమయ్యె దివ్యశక్తి
నెటకుఁబోయెనో? యేవిధి యెఱుకపడదు చిత్రమయ్యెడినని లలిఁ జెప్పుకొనిరి.

తే॥ అవల రోహిణిగర్భిణి యైదుదినములైన పిమ్మట దేవకీమానవతియు
నందమందిర మెంతయు నాణెమైన ప్రభల వెలుఁగంగ భవ్యమా వ్రజమునందు.

తే॥ ఐదుగ్రహములుచ్చస్థితి నలరుచుండఁ దులను స్వాత్యుడుబుధవారకలితమైన
భాద్రపదశుద్ధషష్ఠినిఁ బట్టపవలు కులవధూమణియగునామె బలునిఁగనెను.

ఉ॥ వేల్పులు పూలగుత్తులను వెల్లిగఁజల్లిరి వాదిదోత్కరం
బల్పతుషారముంగురిసె నంతట నందుఁడు బిడ్డకుఁ బ్రియా
జల్పితజాతకర్మమును సల్పి ధరామరపంక్తికాల న
స్వల్పముగానొసంగి హితబాంధవగోపుల గౌరవించియున్. ౩౦౬

ఉ॥ గాయకవర్యులున్ మిగుల గానమొనర్పఁగఁ జేసెనప్డు ద్వై
పాయనదేవరాతగురువర్యవసిష్ఠులు నేను దేవలుం
డాయెడకేగి సత్కృతులనంది ముదంబును బొందియుండ ద్వై
పాయనుతోడ నందుఁ డతిభక్తిగరంబుల మోడ్చియిట్లనెన్. ౩౦౭

శా॥ ఆర్యా! సుందరుఁడైనబాలకుఁడు పంచాహంబులన్ బుట్టెనీ
యార్యాణిన్ బరికింపఁ జిత్రములలో నత్యద్భుతంబయ్యెనీ
కార్యంబెచ్చటనైనఁజూచితివె యోకారుణ్యరత్నాకరా!
స్థైర్యంబున్ గలిగింపవే! మఱియు నా సందేహముం బాపవే! ౩౦౮

చ॥ అనియడుగన్ బ్రసన్నుఁడయి వ్యాసుఁడునందునకిట్లుచెప్పె వీఁ
డనుపమసుందరుం డహికులాధిపుఁడే బలియౌచు దేవకీ
వనితనుజేరియుండ హరిపంపునసొంపుగ యోగమాయ గై
కొని యల రోహిణీలలనఁ గూర్చెను నెవ్వరెఱుంగనట్లుగాన్. ౩౦౯

ఉ॥ నంద! భవన్నికేతనమునన్ గనియుంటివి వీనినయ్యరే!
యిందుదివాకరేంద్రముఖు లిద్ధమునుల్ గనఁజాలిరే! మఱే
మందుము నీదుభాగ్యము నహో! యతనింగన వచ్చియుంటిమే
మిందుల కిప్పుడాశిశువు నేర్పడఁజూపుము! కోర్కెఁదీర్పుమా. ౩౧౦

మ॥ అనినన్ నందుఁడు వానిఁజూపఁదమి నావ్యాసాదులుంగాంచి చి
ద్ఘనరూపాయనమోస్తుతే భగవతే కంసోత్కటారాతయే
ఘననీలాంబరధారిణే సలిలజాకర్ణాంతనేత్రాయ నం
దనిశాంతాతరభాసురాయ గురవే ధర్మజ్ఞనేత్రే నమః ౩౧౧

పంచచామరము.

బలీ! హలీ! ధరాధరా! యపారధైర్యసాహసా!
ప్రలంబఘాతకా! సురాసురప్రధానవిక్రమా!
కలాలవాల! గౌరవర్ణకమ్రరూపమోహనా!
సులక్షణోజ్జ్వలద్ఘనా! యశోమతీసుతాగ్రజా! ౩౧౨

సీ॥ నీవ జేయుండవు నీవె ధ్యేయుండవు దుర్జనలోకైకభర్జనుండ!
కూపకర్ణారివి కుంభాండవైరివో తీర్థయాత్రాసక్త దివ్యచరిత!
బిల్వలారివినీవ ద్వివిదారివీవ యో హస్తినాపురకర్షణాతిచతుర!
నీవెపూర్ణుండవు నీలాంబరుండవు భీమదుర్యోధన విభుగురువర!

తే॥ రుక్మిధేనుకకూటవిరోధివీవె దేవదేవుండవీవె యో రేవతీశ!
రౌహిణేయుండవీవె పరాత్పరుండ వీవె మావందనములొంది కావుమయ్య!

చ॥ జయజయ కామపాల! యదుసంతతిసాగరజాతచంద్రమా!
జయజయ దేవకీతనయ! సత్యదయాశుచిసార మేదురా!
జయజయ నిర్మలాత్మ! వ్రజసంభవగోజనగోపికాప్రియా!
రయమునఁగాంచి రామ! బలరామ! దయన్ మము రక్షసేయుమా!

తే॥ ఇదిపఠించిన మానవులెల్ల పాపములను ద్రోసి యష్టైశ్వర్యములను బొంది
హరిపదంబుఁగాంచెదరంచు వ్యాసముఖులు నతులఁజేసి సరస్వతీ నదికిఁజనిరి.

## —♦ శ్రీకృష్ణజనన కథాప్రారంభము. ♦—

క॥ మతిఁబరిపూర్ణతముండును బురుషోత్తముఁడైనకృష్ణమూర్తి జగచ్ఛం
కరుఁడయి వసుదేవమనస్సరసీరుహమందుఁజొచ్చె జనకన రేంద్రా! ౩౨౬

తే॥ అదిమొదలుకొని వసుదేవుఁడర్క చంద్రవహ్నులనుమించు తేజున వఱలి యింద్రు
తీరునవెల్గెనార! యా దేవకియును హరినిగర్భంబునన్దాల్చె హర్షమతిని.

తే॥ తాల్చినదిమొదల్కొని యట్టితన్వి మేఘమందుఁజంచలకైవడి నాలయమున
వెలుఁగఁదొడఁగెనాకంసుండు గలయఁజూచి యడలుకొనియనుకొనెఁదనయాత్మనిట్లు.

సీ॥ లేదు నిస్సత్త్వత లేదు ఖేదము లేదు కడుపునొప్పి యొకరులు లేవె
తొంటిపీడయులేదు తోఁపకయుండుట లేదెట్టిచెట్టల వాదులేదె
యన్నముపైరోఁత నందుచుండుటలేదు చిక్కిపోవుటలేదు చీడలేదె
గృహకృత్యములనొండు గ్రేణిసేయుటలేదు మంచినడవడియు మానలేదె

తే॥ అశుచిలేదింతచింతయు నందలేదు నాదునిర్బంధమున్నిడలే దయారె!
యిలను గర్భిణులెందఱో కలరుగాని యిట్టిగర్భిణినెచ్చోట నేను సూడ. ౩౨౭

ఉ॥ అంచితకాంతిసంయుత శుభాంగిని దేవకిఁ గూర్చినాతఁడ
ల్లించి కటా! కటా! యకట! యేనికఁదక్కనటంచు నెంతొ చిం
తించి భయాకలుండగుచు దేవకి! నన్నువధించుగర్భమే
తెంచెను గానఁబుట్టగ వధింతునటం చనె నాకతాయయై. ౩౩౦

చ॥ పలికియటుల్ యదుపప్రభుఁడు భ్రష్టమనంబున నింటికేఁ జనా
వలమురితాలు పెట్టు సనుఁబట్టివధించునొ యంచుదిక్కులన్
గలయఁగఁజూచు నూఁచుఁదలఁ; గాఁగును వాఁగును గ్రొవ్వ నవ్వ మా
సలఁబలుమాఱుమవ్వ నిఁకఁజచ్చితి నీహరిచేతనంచనున్. ౩౩౧

తే॥ అట్టివేళను గంగాధరాబ్జయోనిముఖనిలింపులు నేమును మునులఁగూడి
వచ్చి వసుదేవుచెఱసాల పైనినిల్చి పుట్టఁబోయెడి శ్రీకృష్ణమూర్తి కెఱఁగి.

సీ॥ స్వప్నాద్యవస్థలన్ సల్పఁగారణుఁడయ్యు నొంటెడగాక యే యుండునెవఁడు
యోగీంద్రులకు జిక్కకుండియు భక్తజనతతికింజిక్కు సుకృతి యెవండు
పంచభూతంబులన్ బరిఢవిల్లఁగఁజేసి యవ్వానినడిపెడి నధికుఁడెవఁడు
స్థావరజంగమసకలసృష్టికి మూలకందమై సుఖముగాఁ గ్రాలునెవఁడు
తే॥ మాదృశామర్త్యులందఱ మనుచునెవఁడు దుష్టశిక్షకుఁడెవ్వఁడు శిష్టరక్ష
కుండు నెవఁడగు నీవెగాదొక్కొ! నిన్ను సన్నుతినిసల్పఁగలమొకో శరణుశరణు.

తే॥ వీతిహోత్రునియందున విస్ఫులింగ
గణము సారరానికై వడిఁ గ్రతుభుజులును
ఋషులు రాజులు మహదాదు లెవనియందుఁ
జొరఁగ వీల్గాదొ యానీకు శరణులివిగొ ౩౩౪

చ॥ బలుల బలుండవై సుజనవశ్యుఁడవై యుపకారకారివై
యిలకు విభుండవై శ్రుతుల కింతయుఁజిక్కనివాఁడవై మహా
ప్రలయమునన్ వెలుంగు భగవంతుఁడవై పరిపూర్ణమూర్తివై
చెలఁగెడినిన్నె దేశరణు సెందితిమో వసుదేవనందనా! ౩౩౫

## స్రగ్విణీవృత్తము.

రాధికావల్లభా! రమ్యరూపాన్వితా! సాధుబృందారతా! సత్యశౌచాయతా
గోధనాధీశ్వరా! గోపవేషోన్నతా! శ్రీధరానాయకా! చిత్తజాతాత్మజా.

తే॥ ఆదిమధ్యాంతరహిత! యోయప్రమేయ! నిత్యశుద్ధబుద్ధావ్యయ నిర్వికల్ప
నిర్గుణానందఘనమూర్తి! నిన్నుమేము శరణుసెందితి మయ్యదే శరణు శరణు.

వ॥ మఱియు గతాగతంబులగు కల్పంబులందును, యుగంబులందును, మన్వంతరంబులందును నంశాంశాంశకలావేశపూర్ణ పరిపూర్ణావతారంబులం గల్పించి జగంబు సృజించి యందుఁ గర్తవై భర్తవై హర్తవై చెలంగి పరిపూర్ణతమావతారంబెత్తి దుష్టశిక్షణంబును శిష్టరక్షణంబునొనర్ప బద్ధకంకణుండవై శ్రీకృష్ణనామంబునం బెరుగఁబోవు నీకు మేమొనర్చిన నమస్కారంబుల మేలెంచి మాపయి దయనించి గ్రహించి యధర్మమడంచి ధర్మంబుద్ధరింపుమని ప్రార్థించి వెండియు.

ఉ॥ మ్రొక్కెదమేము నీదుపదముల్ దలఁదాల్తుము పాదధూళి సొం
పెక్కిన విగ్రహంబునెద నెప్పుడు సంస్మరియింతు మాఖ్యయున్
జక్కఁగనుచ్చరించెదము సత్వరమే దయచేసి మార్తురన్
దుక్కొనరింపుమయ్య ; హరి! తోయజపత్రవిశాలలోచనా ! ౩౩౯

తే॥ ఇట్లు ప్రణుతించి బ్రహ్మాదులిద్ధమునులఁగూడి ముదమునహరిఁ గొనియాడుచాత్మ
గేహములకేగిరంత శ్రీకృష్ణమూర్తి జననమందెడి సమయము దనరె నపుడు.

## శ్రీకృష్ణావతార ఘట్టము.

చ॥ దెసలు ప్రసన్నతంగనెను దేజముదాల్చె నభంబు భూమియున్
బసదనమొందె సంద్రము లభంగురలీలను బొంగెఁదారకల్
మిసమిసలాడె వాహిను లమేయముగాఁ బ్రవహించె వేడ్కతోఁ
బసులు పయస్సులన్ బిదికెఁ బద్మములున్ వికసించె వెండియున్. ౩౪౧

సీ॥ పరిమళంబునుగూడి బాధలఁబోఁగొట్టు మలయవాతమువీచె మందగతిని
జింతలఁబోఁద్రోచి చెవులకు నింపుగా గాయకుల్ పాడిరి క్రమరీతి
గాసిఁదొలంగించి కర్ణపేయముగాఁగ శారికాదులు గూసె సౌఖ్యదశను
భేరీమృదంగాది వివిధతూర్యంబులు మ్రోయఁగాఁదొడఁగెఁ బ్రమోదవిధిని

తే॥ వాసనావాసితంబగు పౌష్పరజము వ్యాప్తిసెందుచునుండె నపారసరణిఁ
దేంట్లు బాటలుపాడెను దివ్యఫక్కి జలధరంబులు వర్షించె స్వల్పరీతి

ఉ॥ దేవగణంబు పూవులను దివ్యముగా వెదచల్లె వగ్రజుల్
భావములన్ భయంబువిడి వహ్నుల వ్రేల్చి ముదంబుసెందిరా
పావకుఁడున్ మహోజ్జ్వలత భాసిలెఁ బౌరులుఁ, బల్లెవాండ్రు, సౌ
ఖ్యావహమార్గముంగనిరి హర్షముఁజెందిరి సుందరీమణుల్ ౩౪౩

క॥ ఆడిరి రంభాదులు దమిఁబాడిరి తత్కిన్నరులును బహువిధనుతులన్
వేఁడిరి చారణసిద్ధులు గూడిరి గంధర్వజనులు గొనియాడుటకై ౩౪౪

తే॥ జయజయారావముల్ సల్ప సర్వజనులు, మునులు దీవెనలంజేసి మురియుచుండ
యాదవేంద్రులునభయులై యలరుచుండఁ బారిజాతాదికుసుమముల్ పైనివ్రాల

తే॥ అర్ధరాత్రంబునందిందుఁ డభ్యుదయము సెందినను గనుచీఁకటి జెలఁగహర్ష
యోగ, బుధవార, రోహిణీయుక్తమైన భాద్రకృష్ణాష్టమిన్ వృషభంబునందు

ఆ॥ అరణియందు నగ్నికరణిని దేవకీదేవియందుఁ గృష్ణదేవవిభుఁడు
పుట్టె మంచివారిమోములు వికసింప వికటులమొగములును వెల్లఁబాఱ

సీ॥ చిత్రములగు నెల్లు శ్రీవత్సవాళితోఁ గమనీయతారహారములతోడఁ
బంగరుబురడించు పట్టుపుట్టముతోడ సరసనాదమనోజ్ఞముకళితోడఁ
గనదగ్నినిభముతో కంకణంబులతోడ మించుసుహాసియించు కాంచితోడఁ
తే॥ బరిఢవద్భుతమంజీరబాహుదములతోడ బాలప్రభాకరతుల్యమకుట
కుండలములతో నల్లముంగురులఁ జెలఁగు మొగముతో నొప్పుచుండెడిముద్దుకృష్ణు
చ॥ సరసిజపత్రనేత్రు ఘనసామ్యమనోహరరూపునిన్ మహా
దురదుచిఘాతసంతమసు దోర్బలుఁ గోటిమనోజమోహను
స్సురుచిరపత్రిమండితు ఘనుఁగ బరిపూర్ణతమావతారు శ్రీ
హరినిఁ, బరాత్పరున్, సుతుఁగ నానకదుందుభి సూచి వేడ్కతోన్ ౩౯౯
తే॥ అట్టి పురుటింటిలోపల నగ్రిజులకు నిచ్చనిడె లక్షగోవుల నెడదనడలు
విడిచి యాదివ్యపుత్రుని విశ్వమయుగ నెఱిఁగి బద్ధకరుండయి యిటుల వేఁడె.

—♦ దేవకీవసు దేవు లావిర్భవించిన శ్రీకృష్ణుని వినుతించుట. ♦—

సీ॥ వాస్తవంబున నీవు వఱలుదువొకఁడవై ప్రకృతిగుణంబున బహుళమైతి
వఖిలలోకములకు నాదికర్తవై భర్తవై హర్తవై ప్రబలుచుందు
వట్లయ్యు దేహవర్ణాదుల స్ఫటికంబు బోలె నేమంటక క్రాలుచుందు
వాకాశ, విశ్వంభరాంత, ర్బహిస్సులఁ గర్మసాక్షివియాచుఁ గడలుకొందు
తే॥ వవనిభారముఁ దీర్పంగ నలరితీవు పూరుషోత్తముఁడవునాకుఁ బుత్రుఁడవుగఁ
బుట్టియుంటివి ధన్యతఁబొందినాఁడఁ గంసభయమునుమాన్పి నన్గావుమయ్య
చ॥ అని వసుదేవుఁడావిధిని నాపరిపూర్ణతమావతారుఁ గృ
ష్ణునిఁ గొనియాడి మ్రొక్కిడఁజూచి పరాత్మయటంచెఱింగినం
తనె యల దేవకీసతి ముదంబునఁ జేతుల బాలకృష్ణునిఁ
గొని తమి ముద్దువెట్టుకొని కోమలసూక్తుల వేఁడె నిట్టులన్ ౩౫౦
శా॥ వైకుంఠా! గరుడధ్వజా! సురవరా! భక్తాబ్జమిత్రోదయా!
లోకగ్రామణి! పూరుషోత్తమ! హరీ! లుంటాకఘోరాంతకా!
శ్రీకృష్ణా! యదునందనా! యదువరా! సేవించెదన్గాన నే
నాకంసప్రభుభీతివీడి కుతుకంబందంగ రక్షింపుమా! ౩౫౩
క॥ అనవుడు భగవంతుండల్లననగి తలిదండ్రులన్ సులక్షణయుతుఁడై
కనుఁగొని కరుణామతి నిటు ఘనముగ వాక్రిచ్చె నమృతఘటితమృదూక్తిన్
మ॥ జననీ! పృశ్నియనంగ సాధ్వివయి ప్రాగ్జన్మంబునందుంటివో
జనకా! శ్రీ సుతపాఖ్యఁబొందియుఁ దనూజాతార్థివై యుంటి వీ
వును, నీయమ్మయు, బ్రహ్మయాజ్ఞఁ దపమున్ భక్త్యంబువుల్ వీడి శ్ర
ద్ధను మన్వంతరమాచరించితిరిసూ! తాదాత్మ్యభావంబునన్ ౩౫౫

ఉ॥ అంతట నేఁ బ్రసన్నతను నందుచు మీదరి కేగుదెంచి మీ
స్వాంతగతేప్సితంబులను సత్వరమే వచియింపుఁడన్న ని
శ్చింత భవాదృశాత్మజునిఁ జెందెడి భాగ్యముగల్గఁజేయవే!
సంతసమాను మాకన నొసంగితిఁదద్వరమేను బిమ్మటన్ ౩౫౬

చ॥ కమలభవుండు దంపతులుగా మిముఁగూర్చెను దద్వరంబునన్
గ్రమముగ మత్సమాత్మజుఁడు గాఁదగునంచుఁదలంచి యెల్లెడన్
నెమకితిఁగాని యెచ్చటను నేను గనుంగొనలేక మీకునం
తిమమున విశ్రుతుండన నతిప్రమదంబునఁ బుట్టితిన్ జుమీ ౩౫౭

చ॥ మఱుసటి జాముఁనం దదితిమానిని నా మఱిఁ గశ్యపుండనన్
వఱలెడి మీకుఁబుట్టితిని వామననామముతోడ నిప్డిటుల్
దిరిగి జనించితిన్ గనుకఁ దెప్పున నన్గొనిపోయి నందమం
దిరమున నుంచి యందుఁగల దివ్యశిశుంగొని యిందుఁజేరుమా! ౩౫౮

చ॥ అని వచియించి దేవకియు నానకదుందుభి కన్నులారఁగాఁ
గనుఁగొనుచుండఁగా నతఁడు గందువుఁదీరుగ మాఱిపోయె నం
త నతఁడు నాశిశుంగొనుచుఁ దర్లఁదలంచెను నాయశోదకు
న్దనయఁగ యోగమాయ జననంబును జెందెను గోకులంబునన్ ౩౫౯

సీ॥ ఆతఁడడ్డంబుగా నాబిడ్డఁగైకొని యల్లనల్లన నడుగులిడుచు
యోగమాయాశక్తి నుక్కుబీగంబులు నర్గళశృంఖల లట్టెయూడ
దిట్టమౌ తలుపులు దెరువంగఁబడఁ గడు మాటాడులోకంబు మాటమఱఁగఁ
గావలివారలు గాఢనిద్రనుజెంద నంధకారంబులు నంతరింప

తే॥ వేయిమొగములచిలువయు వెంటనంటి దీర్ఘ ఫణములఁగృష్ణుపైఁ దెరచిపట్టి
వానపడకుండఁ గావంగ భయదయమున బాట తనమధ్యమంబునఁ బరఁగనిడఁగ

వ॥ నందునివ్రజంబునకుం గ్రమంబుగాఁజేరి గాఢనిద్రింబోయిన వ్రేలను దిలకించుచు హరి యోగమాయాప్రభావంబున నడ్డుపాటులేక యశోదశయ్యకడకుం జని తన కొమరునిం బరుండఁబెట్టి, యందున్నఁ జిన్నిపాపను గ్రహించి, యటనుండి వెడలి యమునందాటి, నిజ కారాగృహంబునకువచ్చి, యా బిడ్డను దన సతీమణి కిచ్చి యినుపగొలుసులం దనకాళ్లకుఁదగిలించుకొని యేమియు నెఱుంగనివాని కరణిఁ గుదురుపడి బెదరుగలవాని పోలికను నదరుచు గంభీరచిత్తంబున నుండె. ఆ రేయి గాఢనిద్రంజెందిన యశోదకు వసుదేవుం డానల్లనయ్యను బరుండఁబెట్టుటయుఁ దన బిడ్డను గొనియేగుటయుఁ దెలియకుండెనని యెఱుంగుము. ౩౬౧

చ॥ ఇఁకఁ జెఱసాలలోన నిసువేడ్చెడి సవ్వడి నాలకించి ర
క్షకులు ద్రుతంబునన్ జనియుఁ గంసుని కయ్యది సెప్ప నాతఁడున్
దికమకఁబొంది కారఁగల దేవకిబిడ్డను లాగఁబోవఁగా
స్వకరము నడ్డువెట్టి తన భ్రాతకునిట్లనె నామె దీనయై ౩౬౨

శా॥ అన్నా! చంపకుమన్న! యీసుతను నీ కాయుష్య, మారోగ్య, మ
త్యున్నత్వైంబును గల్గుఁగాన విడు నాకాత్మోద్భవుల్లేరు నీ
కన్నన్ దీనివలన్ భయంబు గలదే నీకన్నెనన్ మఱిన్నన్నునో
యన్నా! ప్రోవుము నీకుఁజేసెదను సాష్టాంగ ప్రణామంబులన్ 363

తే॥ అకట నవమాసములు మోసి యఖిలకష్టములనుబడి నేను గనినట్టి పుత్రవరుల
నార్వురను జంపియుంటివోయన్న! నీకుఁ గీడుసేయనియీకన్నెఁ గృపనుగనుమ!

ఉ॥ కన్నులనుండి నీర్విడిచి కన్నియ చిన్నది యన్నమిన్న యా
పన్నయనౌ కుమారికను బాహులఁగప్పి నిజాగ్రజన్ముఁ నె
న్నెన్నెదొ తెన్నులన్ వినయమెంతయుఁ దోఁపఁగ వేఁడు దేవకిన్
దన్నుచు నావలందఱిమె దైత్యవరుండగు కంసుఁడక్కటా! 364

తే॥ దేవకీదేవి యిటుఁగంసు దిగులుతోడఁ గడుపు గడ్డముఁగాళ్లను గరయుగంబుఁ
బట్టుకొని ప్రతిమాల నాచెట్ట, నెట్టి పట్టుపట్టి యాబిడ్డను బట్టి యీడ్చె

ఉ॥ దుష్టుఁడు యాదవాధముఁడు తుంటరులన్ బలుదంట మేదినీ
కష్టకృతిప్రదాయకుఁ డకారణవైరసమార్జకుం డఘ
స్పష్టుఁడు కంసుఁడట్టి చివపట్టిని గాళ్ళనుబట్టి బండపై
నష్టముసేయఁ గొట్టుచు ఘనంబుగ నెట్టుడు యోగమాయయున్ 365

ఉ॥ కంసుని పీడి పై కెగసి కాంతిమదాయుధముల్ ధరించి ద్వి
ధ్వంసకృతిప్రశస్తశతపత్ర సహస్ర తురంగ సంగతం
బంసలపార్శ్వదావృతము నచ్ఛముఁ జామరయుక్తమౌ రథో
త్తంసము నెక్కి యష్టభుజదండములొంది శతార్కభాసయై 366

చ॥ ఘనరవమొప్ప నిట్లనియెఁ గంస! నిను న్వధియింప నింతకున్
మును పె పరేశ్వరుండు నఘమూలవినాశకుఁడైన కృష్ణుఁడే
జననముఁ నెందె వ్యర్థముగ శక్తియొకింతయు లేని దీనులన్
గని వెతఁబెట్టుచుంటి విది గౌరవకృత్యమె? వీరనుత్యమే? 367

తే॥ యోగమాయ కంసునికిట్లు యుక్తరీతిఁ జెప్పి వింధ్యాచలమ్మునఁ జేరి యచట
బహుళనామంబులన్ బొందివఱలుచుండెనోయిబహులాశ్వభూవరా!యుచితచరిత!

ఉ॥ పిమ్మట నుగ్రసేనజుఁడు విస్మితుఁడై యల యోగమాయవా
క్యమ్ములచాలుఁగాంచి చెఱఁగ్రాలెడివారల వీడి వారి పా
దమ్ములబ్రాలి పాపుఁడను దప్పుడువాఁడను, బాపకర్ముఁడన్
మిమ్ము నయారె! యింపున నమిత్రుఁడనై వెతఁబెట్టితిం గదా 368

మ॥ భగినీ! మన్మథరూపులైన సుతులన్ బల్మాఱునేఁజంపి ని
న్నగచాట్లం గడుఁబెట్టియుంటి దయ నమ్మా! నన్ను మన్నింపుమా!
పొగరుంబట్టనివాఁడనైతి ఖలసంబుద్ధుండనైతిం జుమీ
వగపుంజెందక కష్టమోర్చి యెటో బావా! నన్ను రక్షింపుమా! 369

ఉ॥ కాలము ముంచుఁ బ్రాణులను గాలమె తేల్చెడిఁ బ్రాణిరాశి నా
కాల మెవండెఱుంగు? ఘనకాండము నిశ్చలమైన గాలికిన్
దూలెడిలీలఁగాలగతి దుష్టుఁడనై వెలిపల్కు నమ్మి మి
మ్మేలిఁగఁ గష్టపెట్టితిని నోర్చెదు, తీర్చెదు నాదు తప్పులన్ ౩౭౩

ఉ॥ "అష్టమగర్భమిట్టి నిను నంతమొనర్చునటంచు" మిన్ను సు
స్పష్టముగా వచించె నది సత్యముగాక చెలంగె నిప్పుడీ
యష్టమగర్భమో యబలయై జనియించెను యోగమాయ నన్
నష్టముసేయువాఁడు జననంబును జెందె నటంచు వాకొనెన్ ౩౭౪

ఉ॥ వాఁడెటనుండెనో మఱియు వాడెటులుండెనొ నాకునెప్పుడే
కీడులుమూడునో యెవరు గేకిసలన్ ననుఁగొట్టనుందురో
జాడనెఱుంగనైతి నెటు సంచరణంబొనరింతుఁ గొల్తు నా
పోఁడిమినూడఁగొట్టకుఁడు ప్రోవుఁడు సోదరి! సోదరీపతీ? ౩౭౫

తే॥ ఉగ్రసేనజుఁడిట్లేడ్చి యుచితరీతి, దేవకీవసుదేవుల దిగులువాపి
యెఱఁగి యంతట నిలుసేరెఁ గృష్ణునమ్మ వారికే శుభమెట్లు సేకూరదయ్య?

చ॥ పదపడిఁ గంసవీరుఁడు ప్రభాతమునందున మేలుకాంచి దు
ర్మదమున నాప్రలంబముఖరాక్షసులన్ బిలిపించి యోగమా
య దెలిపినట్టి వాక్యముల నన్నిఁటి వారికిఁజెప్పి పిల్లలన్
సదమదముంబొనర్పుఁడు రసాతలమందుఁ గసాయివారలై ౩౭౭

వ॥ అని కట్టిదంబుగా నాజ్ఞాపింప నా చెట్టలు విని దేవా! నీవు దేవాసుర ద్వంద్వయుద్ధంబందుఁ బేరెక్కి యుక్కుమిగిలి ధనుష్టంకారంబొనరింప నన్నిలింపులు సైతము గంపంబుసెంది కాల్కొలందిఁ బాఱరే! ఇఁక బాలురవలననా మనకు భయంబు గలుగునది? ముఖ్యంబుగా నీకు వైరియగు నమ్మహాశేషికి గో, విప్ర, సాధు, శ్రుతి. ధర్మాదులు, తనువులై యుండు. అవ్వానియందే యాతండుద్భవిల్లుం గానఁ దద్వధోపాయంబాలోచించి యానతిమ్మనివిన్నవించుకొన నయ్యాగ్రసేనియు యోజించి యందుల కురరీకరించె. అంత నాదేవానాంప్రియు లత్యుత్సాహంబుతో వెడలి నలుగడలఁ దిరిగి తిరిగి పుర. గ్రామ, జనపద, వన. వనధులఁ, దత్తత్కాలోచితంబుగాఁ గామరూపధరులై సర్వంబు లాఖువులరంధ్రంబులం దూరుమాడ్కిఁజొచ్చి చొచ్చి, చూచిచూచి పశు, పక్షి, మృగ, నరసమూహంబులందలి తల్లిచనుఁబాలు వీడఁజాలనివియై, మనోహరంబుగానుండు లేఁగలను, గ్రుడ్లను, బసికూనలను, బిడ్డలను భూతబేతాళురంబోలి చంపఁదొడంగి క్రమక్రమంబుగా నిర్వీర్యులగుచు సంచరించుచుండిరి. అంత నాఁవ్రజంబునందు. ౩౭౮

—♦ నందుండు పుత్రోత్సవంబు జేయుట. ♦—

సీ॥ నందుఁడు వఱువాత నందనోత్సవమును జరుపంగఁదలఁచి భూసురులఁబిలిచెఁ
బిలిచి తత్పదపద్మములకు షోడశవిధులను బూజలర్పి భక్తిఁ దనర సలిపె
సలిపియు లక్షగోవులను దక్షిణలతో ధాన్యముతోఁగూడ దానమిచ్చె
నిచ్చి వారొనరించు నీప్సితార్థంబులఁ గలిగించు దీవెనల్ దలను గొనియెఁ

తే॥ గొనియు భేరీమృదంగాదినినదముఖల
దిశలమ్రోఁగ సువాసినుల్ దివ్యభక్తి
మంగళారతులెత్త నమందగతిని
జాతకర్మంబు నొనరించె జనక! మఱియు. ౩౪౯

చ॥ తిల గుడ తైల తూల ఘృత దివ్యమణీ ధరణీ సువర్ణ వ
స్త్రలవణ సప్తధాన్య ఫలదానములన్ వసుధాతలామరేం
ద్రులకు విధేయుఁడై యొసఁగి తోఁచినరీతిని బైని దక్షిణల్
బలుమఱునిచ్చె నందుఁ డనవద్యసుతోత్సవబద్ధచిత్తుఁడై. ౩౫౦

సీ॥ గాత్రమూలముగాఁగ గాయకుల్ గానంబుఁగావించి రవ్వాణిగానసరణి
క్షౌమవస్త్రముల సింగారంబు గావించి సానివాండ్రాడి రచ్చరలకరణిఁ
గర్ణపర్వమొనర్చు కావ్యముల్ గవులును వ్రాసిరి తద్బాదరాయణిరహి
విజయసూచకములౌ ధ్వజినీపతాకముల్ జెలఁగె నాస్కందుని సేనఁబోలె

తే॥ శంఖ దుందుభి వీణాది సకలవాద్య యంత్రములు గడుమ్రోసె నాయభ్రగతిని
నింద్రజాలంబులన్ జేసి రైంద్రజాలికులల శౌరిపుట్టిన వేడుకలను మఱియు.

సీ॥ సందులగొందులఁ జదుకంబులందునఁ జిమ్మి వాసితవారిఁ జిలుకరించి
పంచలందఱులందు వాఁకిళులందున నలికించి రంగుమ్రుగ్గులనలర్చి
వీథుల వాడల మేడల గోడలఁ జిత్తరువుల్ వ్రాసి చెలువునింపి
మంటప తోలికా మండలప్రాంగణంబుల సర్వవిధములఁ బొల్పుసల్పి

తే॥ దేవతాగారసత్రాదిదివ్యభవనములను దత్తదుచితకృత్యములను వెలయఁ
జేసి బురుజులఁగలశముల్ సెలఁగఁజేసి నందనోత్సవమున్ సల్పె నందుఁడెలమి.

ఉ॥ బంగరుశృంగముల్ బసుపుపచ్చనిపుచ్చముఁ జిత్రధాతులన్
ఖంగునమ్రోఁగుగంటలను గాంతలచేతుల గుర్తులన్ మనో
జ్ఞాంగము రక్తకంబళము లర్హములైన సువర్ణహారముల్
హంగగువత్సముల్ గలిగి యావులురాజిలె నప్పుడచ్చటన్ ౩౫౩

తే॥ అంత వృషభానువర్యుఁడా యవసరమున నందనందనోత్సవమహానందవార్త
విని కళావతీయుక్తుఁడై జనులుగొల్వ సౌరుగారున నెక్కి తత్సదనమొందె.

చ॥ మఱి నవనందవర్యులును మాన్యులు శ్రీవృషభానుపట్టముఁ
ద్ధురు లుపనందులున్ జెలిమితోఁ దిరుగాడెడి భూపవర్యులున్
సరసతరాత్మబంధువులు శాస్త్రపురాణనయప్రవీణతా
విరతయశోదయాఖ్యులును వేసనుదెంచిరి నందుమన్కికిన్ ౩౮౫

సీ॥ ఉత్తమాంగంబుల నుష్ణీషములఁ దాల్చి వానిపై దండల వఱలఁజేసి
పచ్చబొందళ్లములఁ గ్రిచ్చుఱ ధరియించి తొళసిదళంబులన్ దొడవులొంది
పిల్లనఁగ్రోవులఁ జెదవులనులగించి బెత్తములన్ జేతఁ గ్రేళ్ళఁబట్టి
గుఱిజలంగట్టిన క్రొమ్ముడియుంగల్గి నెమ్మలపురులను నెఱయఁగట్టి

తే॥ మోమునందునఁ బొట్టిడి పుత్రకులను గూడి వేడుకతోడుత గోపకులును
జన్మికృష్ణు నుత్సవమును గన్నులారఁ గాంచవచ్చిరి నందు నిక్కకు నరేంద్ర!

క॥ పురమున నుండెడి వారొండొరులును శ్రీనందపుత్రికోత్సవమునకున్
సరగునఁ బోదము రండని సరసముగాఁ జెప్పికొనుచుఁ జని రచ్చటికిన్ ౩౮౭

మ॥ కమనీయాంగదతారహారతరలగ్రైవేయకావాపకా
సమచూడామణిహేమహీరనవవస్త్రక్షౌమచీనాంశుక
ప్రమదారత్నమదేభ గోపృధురథభ్రాజత్తురంగంబులన్
క్రమమొప్పన్ గొని తెచ్చియిచ్చి రతిథుల్ కంజాక్షుపై వేడ్కతోన్ ౩౮౮

తే॥ దధియు క్షీరంబు ఘృతముహస్తములఁబూని కట్టనొక కేలఁగైకొని గళములటుల
నిటులఁద్రిప్పుచు గోపకవృద్ధులింక బాలురేగిరి కృష్ణోత్సవంబుఁజూడ ౩౮౯

ఉ॥ నందుఁడు పుత్రికోత్సవమునంగలరాజుల బంధుపాళి నా
నందముతోడఁగాంచి నయనంబుల బాష్పములొల్క వారికిన్
విందులొనర్చి సత్కృతుల వేమఱుసల్పుచు హాయినుండ వా
రందఱు నందరాజుఁ గొనియాడిరి పాడిరి సంతసంబునన్ ౩౯౦

తే॥ ఓవ్రజేశ్వర! యోనంద! యోగ్యచరిత! ధీరసుకుమారసుకుమారదివ్యదేహుఁ
గనుట ధన్యతగంటిమి కాలకాలములుగనుండెడి నీకోర్కి ముగిసెనేఁడు

చ॥ అనవుడు నందుఁడిట్టులను నర్థవిదగ్రణులార! నాపయిన్
నెనరిడి మీరు వల్కునుడి నిక్కవమే యది మీ యనుగ్రహం
బునను ఘటిల్లె మద్వ్రజముఁ బొందిన గోపులయాజ్ఞఁబూని యే
ననిశము సంచరింతుఁగద యయ్యది మీరలు గుర్తెఱుంగరే ౩౯౨

ఉ॥ అయ్యెడ గోపికల్ వ్రజమునందలి నందసుతోత్సవంబుఁ దా
మొయ్యన నాలకించుచు నోహహో యని యబ్బురమొంది చంకలన్
జయ్యన బొట్టెలంగొని స్వసద్మకృతుల్ విడనాడి గుంపుగా
నెయ్యముతో వ్రజేశ్వరుని నిర్వృతమొందఁ దలంచి నెమ్మదిన్ ౩౯౩

సీ॥ మంజుమంజీరముల్ మంజులధ్వనిసేయఁ గాంచికా ఘంటికల్ ఖంగనంగ
దారహారంబులు దాఁటుమాఁటాడఁగఁ గరకంకణములు గల్ గల్లనంగ
గబ్బిగుబ్బలు పైఁటఁ గ్రాలి పింపిసలాడఁ జెమ్మట నెమ్మేను సెమ్మగిల్లఁ
గుసుమహారంబులు గురులనుండియు వ్రాల గస్తురిచేర్చుక్క కరగుచుండ

తే॥ నూడిపోయెడిచీరల వ్రీడఁబట్టి కొంచుమైడీఁగి మించును మించి వెలుఁగ
నందరాజగోకులమును బొంది దాని సుందరత విచిత్రంబుగాఁజూచియవల.

ఉ॥ ఆ విమలాంగబాలకుని యాస్యమునుండి పదంబులంటఁగా
నావల నల్లయావల యవాదుల నుప్పును నెయ్యినీళులిం
కేవిరియొ దృష్టిదోషము శమింపఁగ మాటికిఁ దీసివేసి బ
ల్దీవనఁజేసి పల్కిరిటు దియ్యఁదనంబున నయ్యశోదకున్ ౩౯౫

ఉ॥ అమ్మ! యశోద! మంగళములబ్బెఁగదమ్మ! సుతుండు నీదుభా
గ్యమ్మునఁ గల్గెనమ్మ! చిరకాలమునుండియు నోచు నోములే
యిమ్మెయిఁ బండెనమ్మ! కృతకృత్యవునైతిగదమ్మ! మాకు మో
దమ్ము ఘటిల్లెనమ్మ! ప్రియవమ్మున పేనిని బెంపుమమ్మరో! ౩౯౬

ఉ॥ ఆపయి నా వధూమణి వరాంగనలార! సుతుండు నాకు మీ
ప్రాపునఁ గల్గెఁగాని యితరక్రియఁగాదిటె నెమ్మిఁజూడుఁడం
చోపికఁబల్కి రోహిణిరో! యోగ్యచరిత్రల వెల్లు వీరికిన్
సాఁపడఁజేసి సత్కృతుల సల్పుమ! యేమియు లోటులేనటుల్ ౩౯౭

చ॥ అనవుడు నట్టి రోహిణియు నచ్ఛచరిత్రిమనోజ్ఞగోపికా
జనుల సుచేలధారిణుల సాఁపడఁజేసి సపర్యలాచరిం
చెను మఱి మర్త్యలోకమున శ్రీహరి నందునకాత్మజాతుఁడై
జననముసెందెనంచు జయశబ్దము లంతట నిండె నావలన్ ౩౯౮

తే॥ గోపికాగోపకులుగూడి కుతుకమతుల వీరి ముప్పురఁబోలిన పెద్దవారు
లేరు లేరని దధి ఘృత క్షీరములను బోయఁదొడఁగిరా వ్రజమంత బురదగాఁగ

చ॥ నరహరి యుత్సవంబును గనన్ బెదదొడ్డలు గొందఱందు వే
యరుగుచు గోఁచులూడఁగని యయ్యవి దోపుచుఁ గ్రిమ్మఁజెమ్మటల్
బొరిఁబొరి రోఁజుచాగుచును బూన్కి మఱిన్ జనసాగి జట్టున
న్జఱజఱ జాఱి యన్యహసనంబున కాస్పదులైరి భూవరా! ౪౦౦

చ॥ మఱియును వందిమాగధులు, మాన్యులు, సూతులు, వేదశాస్త్ర వి
త్సరసులు, నైతిహాసికులు జక్కనిమాటలనాడ నందుఁడున్
గరమరుసంబుబొంది మమకారముతో నవభూషణాంబరో
త్కరకరిగోసహస్రతురగంబుల నిచ్చెను వారి కోలిమై ౪౦౧

తే॥ భుక్తిధనవృద్ధిసంసిద్ధిశక్తులెలమి వాడవాడల నూరూర భవనభవన
ములను సంపూర్ణముగఁగల్గిమూల్గుచుంటనిద్ది కావలయుననుట యెఱుఁగఁబడదు

ఉ॥ బంగరురంగుమైమెఱుఁగు బంగరుబొజ్జయుఁ బైడిపోగులున్
బంగరు పాగయుం గలిగి ప్రాఁబలుకుల్ దన నాల్గుమోములన్
ఖంగునఁ బల్క మేటిపసయి క్రాలుచునుండెడి బ్రహ్మ భార్యతోఁ
బొంగుచు నంచ నెక్కి వ్రజముం జనె వెన్నునిఁజూచు వేడ్కతోన్ ౪౦౩

ఉ॥ ఆతనివెంట నీశుఁడల యాప్రలపోతును నగ్నిమేఁకనున్
వాతము ఖంజనంబునుఁ బ్రభాకరుఁడుం బెదతేరునుం బలా
రాతి మదద్విపంబు యమరాజును దున్నను జంద్రుఁ డిఱ్ఱి షా
ణ్మాతురుఁడుం మయూరము హుటాహుటి నెక్కియు నేగి రిట్టులే ౪౦౪

కవిరాజవిరాజితము.

వరుణుఁడు నక్రము వైశ్రవణుం డనివార్యగతిస్తుతపుష్పకమున్
గురుఁడును గృష్ణముఁ గోడిని సౌమ్యుఁడు గ్రోతిని భౌముఁడు శుక్రుఁడు ను
ద్ధురగవయంబు విధుంతుదుఁ డుష్ట్రముఁ దోయజమిత్రకుమారశనై
శ్చరుఁడును నక్రము జయ్యన నెక్కిరి సాగిరి నందగృహంబునకున్. ౪౦౫

చ॥ సిరియు సుపర్ణు దుర్గయును సింగము నైచికిరూపుఁగన్న యా
స్థిరయు విమానరాజమును దీర్ఘకృపాణముఖాస్త్రయష్టులన్
గరములఁ గొన్నషష్టి శిబికన్ మఱి డోలఁబదార్వురమ్మలున్
మురిపెముతోడ నెక్కి వ్రజమున్ జనసాగిరి మాధవార్థమై ౪౦౬

చ॥ సనకసనందనాదిమునిచంద్రులు, నేను యథార్థ్వపద్ధతి
న్వనజదళాయతాక్షుని గనన్ విధితోడుత గోపగోపికా
జననినదప్రియుక్తమగు సర్వశుభాస్పదనందమందిరం
బునుగని ప్రీతిపూరితసుబుద్ధులఁ జేరితి మో నరేశ్వరా! ౪౦౭

ఉ॥ అందఱమందుఁ జేరి హరి నాపరిపూర్ణతమావతారు గో
విందునిఁగాంచి మ్రొక్కితిమి వేదవచస్సుల వేఁడియుంటి మా
నందు సపర్యలందితి మనర్థము లేగెనటంచు నెంచి యా
నందముఁబొంది క్రిమ్మఱి చనన్ సమకట్టితి మేము మైథిలా! ౪౦౮

తే॥ అంతఁజేగిన తరువాత నందరాజు మధురయందలి వసుదేవవిధముగాంచి
పుత్రకోత్సవముం జెప్ప భూపతియగు కంసునికిఁ గప్పముంగట్టఁ గదలిపోయె

## పూతన కంసప్రేరితయై గోకులంబున కేతెంచుట.

ఉ॥ ఆతరువాతఁ గంసవిభుఁడాహరిజన్మము నాలకించి వే
ఘాతముసేయఁ బూతనను ఘోరముతో ననుపంగ నామహా
భూతము ఘర్ఘరస్వనముఁబోలిన నాదముతోడ ఘోషసం
ఘాతము గ్రామముల్ పురులఁగాంచుచుఁ దిర్గుచు నెట్టకేలకున్ ౪౧౦

సీ॥ కందుకంబులఁబోలు గబ్బిగుబ్బలుపైఁటఁగులుకుచు క్షీరములొలుకుచుండ
నిండుజాబిల్లిని నివ్వెఱఁబడఁజేయు నెమ్మోముకళలచే నెగడుచుండఁ
దామరతూండ్ల విధంబున డంబైన భుజములు భూషలన్ బొల్పుగాంచ
మేలిమిజాళువాలీలనుగ్రాలెడి నెమ్మేను దొడవుల నీటుసెంద

తే॥ మల్లెమొల్లల హసియించు తెల్లపుట్టములనుగట్టి పదాబ్జంబులఁగలుగుకలికి
వోలెనుండెడి రూపంబుబొంది నంద వ్రజముసెందెను శ్రీకృష్ణబాలు దునుమ

వ॥ అంత.

మ॥ రతియో రంభయొ వాణియో శచియొ దుర్గాసాధ్వియో లక్ష్మియో
శతసంఖ్యాకలఁ జూచియుంటి మిటు లస్మద్దృష్టిలో లేరటం
చతిరేకంబుగ మెచ్చి రోహిణి యశోదాద్యంగనల్ లోనిక
ద్భుతరీతిన్ జననెంచు పూతనను జేఁద్రోయంగలే దాపెయున్ ౪౧౩

ఉ॥ రోహిణి నాయశోదను నిరోధమొనర్చి కరంబులన్ జగ
న్మోహనుఁ జిన్నికృష్ణుఁగొని ముద్దిడి స్వీయకుచంబులందు న
వ్యాహతనాశకృద్విషము నక్కజనింపుచు నంకమందు నా
రోహితుఁజేసి స్తన్యము నరుచ్యము నా చినిపాపకిచ్చెఁగా ౪౧౪

చ॥ హరియుఁ బయోధరంబులను నాస్యమునందిడి కృత్రిమంబులో
నరసి పయఃప్రయుక్తవిషమంత నసృగ్ధృతమాంసశల్యా సం
కరముగఁ గ్రోల నాయసురి గర్వమువీడి కుమార ! వీడుమీ
పిరి జనునంచుఁ బాఱినను వీడమిఁ బూతన యంతిమంబునన్ ౪౧౫

చ॥ అచలము లేడునున్ బృథుగుహావళితోడఁ బ్రతిధ్వనింప నీ
యచల చలింప సాగరములన్నియు ఘూర్ణిలుచుండ దిక్ప్రభు
ప్రచయము దల్లడిల్లఁ బలుబాధలఁ గెవ్వునఁ గేకవేసి త
త్ప్రచరితమెల్లఁ దెల్లముగఁగూలె భయంకరరూపయుక్తయై ౪౧౬

ఉ॥ అత్తఱి నాఱుక్రోసులకు నంతరమందునఁ గల్గు చెట్లపై
న్మొత్తము చూర్ణమాయె నలపూతనయొక్క శరీరపాతవం
బత్తరళేక్షణల్ వ్రజమునందలి గోపగణంబు జూచి బ
ల్తత్తరమొంది చిత్తరువులన్ మఱపించుచు నిల్చి రంతటన్ ౪౧౭

ఉ॥ చిన్నతనంబునన్ జెలఁగు శ్రీహరి పూతనపాలు గ్రోలి వే
మన్ననఁ గల్పి సందియము మాయుటకై యెటనేని ప్రాణమొం
డున్నదొ యేమొ యంచు నొడలూరక చూచెడివానిమాడ్కి న
భ్యున్నతి దానిపైని నగుమోమున నెల్లెడ దోఁగి యాడుటన్ ౪౧౮

## —♦ శ్రీకృష్ణ కవచము. ♦—

ఉ॥ గోపులుగాంచి యబ్బురము గూర్మిభయంబులు గల్గుచుండగా
బాపనిలాగి రీవల కుపాత్తతనూజు యశోద రోహిణుల్
బాపురె! యంచు గొం చురముపైనిడి ముద్దుల నాడుచుండగా
గోపికలేగి యచ్చటికి కకుంఠితరక్షనొనర్చి రిట్టులన్ ౪౧౯

తే॥ తొల్త నఘహర కాళిందితోయములను ధేనుపుచ్ఛభ్రమణములన్ ధేనుమూత్ర
గోమయంబుల నాచిన్ని కొడుకు జలకమాడఁజేసిరి దొలిమిన్కు లాడినట్లు

సీ॥ శ్రీకృష్ణుఁడీ నీదు శిరమును గాచుత గళము వైకుంఠుండు గాచుఁగాత
దెలిదీవి ఱేఁడు వీనులను బ్రోచునుగాత ముక్కును యజ్ఞుండు బ్రోచుఁగాత
నరసింహమూర్తి నీ నయనముల్ బ్రోవుత రాముండు నాలుక నోముఁగాత
నరుఁడు. నారాయణుం డను దైన యోష్ఠముల్ ముద్దులకుద్దిగాఁ బ్రోచుఁగాత

తే॥ హరికలాభవసనకాదు లాకపోలములను బ్రోచుత గపిలసన్ముని, చిబుకము
రక్షసేయుత శ్వేతవారాహమూర్తి ముదముతోడుత ఫాలంబు బ్రోచుఁగాత

తే॥ కడుపుఁ గమఠుండు బ్రోవుతఁ గరుణతోడ నాభిఁగావుతనట్టి ధన్వంతరియును
మోహినీదేవి గుహ్యంబుఁ బ్రోవుఁగాత గటినివామనమూర్తియుఁ గాచుఁగాత

తే॥ ఓముతన్ వెన్ను భార్గవరాముఁ డూరువులను బాదరాయణముని ప్రోచుఁగాత
గావుతన్ గాళ్లఁ గల్కి పిక్కలను జంఘములను దయను బ్రోతురుగాత బుద్ధబలులు

తే॥ ఇట్లు శ్రీకృష్ణకవచంబు నెఱిఁగిచదివి సర్వరక్షలఁ జేసిరి చతురమతుల
నిద్ది భగవంతుడావిధి కెలమిఁ జెప్పె నతఁడు శివునకుఁ బల్కఁగా నతఁడు మరల

తే॥ కనికరమున దుర్వాసుఁడన్ మునికినని యె నతఁడు శ్రీయశోదకుఁ జెప్పెనిది యెవండు
నిత్యమును ప్రభాతంబున నిశ్చలమతిఁ జదువునో వాఁడు పాపముల్ జదుపుజనక!

తే॥ అంత రోహిణియున్ యశోదాంగనయును రక్షసేసినపిమ్మట బ్రాహ్మణులకు
వివిధదానములన్ సల్పి పిల్లనికిని బాలుఁద్రాగించి హాయిగా వఱలిరయ్య!

తే॥ అవల నందాది గోపకులా మధురను వీడి తమ టెంకికిన్ దిర్గి వేడ్కఁ జేరఁ
వచ్చుచుండంగఁ బూతనాభయదవపువుఁ బధినిగాంచి కుతూరముల్ వరుసఁ గొనుచు

క॥ రక్కసి యొడలును ముక్కలుముక్కలుగాఁజేసి యమున పొన్నరిదరినిన్
మిక్కిలి చితులను బేర్చుచుఁ జక్కఁగ దహనంబుజేయ సాగిరి పిదపన్ ౪౨౮

ఉ॥ కాలినదానినుండి పొగ కల్మషనాశకమై పవిత్రమై
యేలకికాయలా యగరు నిద్ధలవంగములన్ బటీరముల్
బోలు సువాసనన్ వెడలెఁ బూతన యుత్తమలోకమొంద నా
శ్రీలలనేశుఁడే సలిపెఁ జిత్రమనం జనకుండు నిట్లనెన్ ౪౨౯

—♦ పూతనా పూర్వజన్మ వృత్తాంతము. ♦—

ఉ॥ పూతన, బాలఘాతిని యపూర్వవిషస్తని దుష్టశీల యీ
నాతికి నెట్లు స్వర్గము జనార్దనుఁడిచ్చెను ? బూర్వజన్మమం
దేతలిదండ్రు లీయమకు నెట్టివి దీనిచరిత్ర సర్వమీ
రీతఁజెప్పి చిత్తమును నింపున నింప నతింతు నారదా! ౪౩౦

చ॥ అనవుడు భూతలేంద్ర! యది యాదిమజన్మమునన్ బలిప్రజే
శునిసుత, రత్నమాల యన శోభిలి తండ్రి సదంబునందు వా
మనుఁడనుపేర నొప్పెడి రమాపతినింగని పుత్రమైత్రితోఁ
దనరుచు నిట్టి పుత్రకుఁడు దాఱ్కొనివన్ జనుఁబాల నిత్తుఁగా ౪౩౧

చ॥ అని మదమందునం దలఁచె నాబలి స్వపిత్రియభక్తుఁడౌట నా
తని సుతయంచు వత్సలతఁ దద్వరమాహరి యామె కిచ్చెని
చ్చెనుజుమి యంత నావనిత శ్రీహరిసూక్తిని నావిధానఁ బూ
తన యనుపేర నిద్ధరణి ద్వాపరమేగినమీఁదఁ బుట్టితాన్ ౪౩౨

చ॥ హరిని స్పృశించి స్తన్యమును నట్టులొసంగి నశించి వెంటనే
పరమపదంబుఁ జెందెఁగద పార్థివ! పూతన మోక్షసత్కథా
సరణిని విన్న వ్రాసినను జక్కఁబఠించిన దోషరాశి చె
చ్చెరవిడి తత్త్రివర్గ ఫలసిద్ధులు గల్గును నెట్టివానికిన్ ౪౩౩

వ॥ అని యిత్తెఱంగున శ్రీగర్గాచార్యుండు శౌనకునకు వచింప నతండు పరమానందభరితుండై మహాత్మా! శ్రీకృష్ణ చరితంబు వినిపించి, నా జన్మంబు సఫలంబు గావించితిరి. మఱియు శాంతిదాంతివిశ్రాంతస్వాంతుండును, శ్రీకృష్ణ భక్త శిరోమణియునగు నాబహులాశ్వుం డా నారదమహర్షిం గాంచి యావల నేమని పృచ్ఛించె నది యానతిండని ప్రార్థించుటయు గర్గుం డిట్లనియె ౪౩౪

తే॥ అందులకు జనకుండెద హర్షమొంది "అద్యధన్యోస్మినారద!" యచ్యుతాంఘ్రి
నిహితమతులకు నెట్లదినెగ్గకుండుఁ? జిన్నిపెన్నునికతఁబైనిఁ జెప్పమనుడు

ఉ॥ నారదుఁ డిట్లనెన్ జనకనాయక ! యొక్కదినంబువందు నా
శౌరిభవోడుయుక్తతిథి సంఘటిలంగ యశోద గోపగో
పీరమణీయయై మిగుల వేడుకఁజేయఁదలంచి భూమిబృం
దారకబృందముఖ్ బిలిచి దానములన్ బొనరించి యంతటన్ ౪౩౮

చ॥ సురుచిరమైనరూపమున శోభిలుబాలుని ముద్దుకృష్ణునిన్
బరిమళయుక్తవారుల నవారిగ స్నానమొనర్పఁజేసి త
త్సరసిజనేత్రియుగ్మమునఁ జక్కఁగఁ గాటుకదిద్ది రోహితాం
బరములఁగట్టి బొట్టునిడి బంగరుసొమ్ములఁబెట్టి సొంపుగాన్ ౪౩౯

తే॥ డోలికారత్నమందునఁ బూలపాన్పుపైనిఁ గూర్చుండఁబెట్టఁగ మానవతులు
మంగళారతులెత్తి యభంగభంగిఁ బాటజవళిసిఁ బాటలఁబాడి రవల

—♦ స్రగ్విణీ వృత్తము. ♦—

లాలి శ్రీమాధవా లాలి దేవస్తుతా లాలి కేళీప్రియా లాలి గోపీప్రియా
లాలి నారాయణా లాలిస్మేరాననా లాలి కృష్ణాహ్వయా లాలి నందాత్మజా

చ॥ అని యిటు లాలిజోలలను నందముచందముసెంద సుందరీ
జనములు పాడుటన్ వినుచు సంతసమంది యశోద చిన్నిప
ట్టిని శయనింపఁజేసి తనయింకికి వచ్చినవారి గౌరవం
బును బొనరించుచొందరను బుత్రుని విస్మృతిఁజెందె నయ్యెడన్ ౪౪౦

—♦ బాలకృష్ణుం డుత్కచాద్యసురవధం గావించుట. ♦—

తే॥ అంకకాఁడగు తత్కంసునాజ్ఞ వెడలి గంధవహనిభదేహుఁ డుత్కచసురారి
యొండుబండినిఁ గొనివచ్చి దండిలోడఁ బండినట్టి శ్రీహరిపైనిఁబడియె నపుడు

క॥ హరి యాఁకొనుచును గిదుకుచుఁ గెరలుచును నడుమనడుమఁ గెవ్వునఁ గేకల్
బోరిఁబోరి వేయుచుఁ బొరలుచుఁ జరణంబునుజాచియల్ల శకటముఁదన్నెన్

తే॥ పిదపఁ దద్దతి నాబండి పెళపెళపెళవిఱిగి పాడఱె నందలి సురరిపువును
నీల్గి నెఱిరూపుఁగని హరికెరఁగి గోజగమునకరిగె శతాశ్వరథమును నెక్కి

ఆ॥ ఆముహూర్తమున యశోమతీనందాది గోపగోపికలల కూలినట్టి
బండిరొదనువించు దండినివిడనాడి పనులమాని యటకువచ్చి యరయ

తే॥ అల్ల పిల్లనికడనున్న యర్భకతతి "అందఱము మేముగుమిగూడి యాడుతఱిని
బాలుఁడాఁకొని యేడ్చుచుఁ బదమున నొకబండినిందన్నె" నని చెప్ప వారలువిని

మ॥ అరరే! యీతఁడు మూఁడుమాసములవాఁడై బండి నేడంటితోఁ
జరణంబుల్ గొనితన్నె? వీని హతికే సత్వార్థముల్ వ్యర్థమై
పరగంగా నది నింగికేగి పుడమిన్ బాతంబుగాఁజాలెనా?
యరయన్ బాలకులాడుమాట నిజమేనా! యద్భుతంబయ్యెడిన్ ౨౨౬

ఆ॥ అని విచిత్రమొంది రవలయశోదయుఁ బిల్లవానియేడ్పు వినుచువచ్చి
పాలు గుడువవయ్య గోలఁజేయకుమయ్య యంచు జన్నుఁగుడిపె నవలఁ బ్రేలు

చ॥ చిడిముడిపాటునన్ జెలఁగు చీడలఁబీడలనూడఁగొట్టఁగా
విడిముడినిచ్చి జన్మముల విప్రులచే నొనరింప సల్పి చే
పడెడి పిశాచబాధయును బాడుపడన్ బొనరించిరయ్య! నా
వుడు మునినాథ! పూర్వమలవోకిర యేఁడెటుఁబొందె మోక్షమున్? ౨౨౭

## ఉత్కచాసురపూర్వజన్మ వృత్తాంతము.

చ॥ అని యడుగంగ మౌని ముదమందుచు నిట్లనె నోనరేశ్వరా!
మునుపు హిరణ్యలోచనుని పుత్రకుఁడుత్కచనాముఁడై శుభా
యనమగు లోమశాశ్రమము నర్గి యటన్ గలచెట్లఁ గొట్టవే
సె నదియు లోమశుండుగని ఛీ యని యిట్లు శపించె వానినిన్ ౨౨౮

ఉ॥ దుర్మతి! యుత్కచా! తరుల దుంపలతోడుత నూడఁబీకి నీ
దుర్మదమంతఁ జూపితివి తోడ్తనె దుష్కృతరీతి సర్పముల్
వర్మమువీడున ట్లొడలువాయుచు నీల్గుమనంగ వాఁడు త
న్మర్మము గుర్తెఱిఁగి యల మౌనిపదంబులఁ బ్రాలి యిట్లనెన్ ౨౩౦

తే॥ మౌనిచంద్ర! కృపాసింధు! మాన్యచరిత! నీదువిస్తృతమహిమమున్ నేఱుంగ
నాదుతప్పును మన్నించి నయనములను జల్లఁగాఁజూచి మోక్షమొసంగునాకు

తే॥ పిదపమౌనీంద్రుఁడెదమెచ్చివిధి నెఱింగియుత్కచా! వాయురూపమునొందిచాక్షు
షంబు సనుమీఁద వైవస్వతంబునందు హరిపదస్పర్శమోక్షమ్మునందఁగలవు.

తే॥ అని కరుణతోడఁబల్కెనో యనఘ! సుజనకోప మేకక్షణంబున్నఁ బాపమూడ్చి
యైహికాముష్మికసుఖంబులందఁజేయుఁ గాని పెడదారిఁబోవదో కాశ్యపీశ!

తే॥ ఇట్టి వరమున నుత్కచుం డట్టిరీతి వాయువిగ్రహుఁడై హరిపాదమంటి
పరమధామముఁజెందె నవక్రవిక్రమక్రమా! మీఁది హరికథ మఱియువినుమ!

## బాలకృష్ణుండు తృణావర్తునిం గూల్చుట.

చ॥ ఒకపరి నాయశోద తనయూరువునందున నాటలాడు బా
లకు స్మితవక్త్రు లాలనముల్ బొనరించెడిలోన నట్టి పు
త్రకుఁ డచలేంద్రభారుఁడయి తారసిలన్ వెరవేమిలేక యో
పిక ధరఁబెట్టి భీతిలుచు వీఁడెటు పర్వతభారుఁడయ్యెనో! ౨౩౧

తే॥ ఇలను బాలకులెందఱో కలరుగాని యిట్టిబిడ్డను నేనెప్పుడెందుఁజూడ
ననుచు ముక్కున వ్రేలిడి తనరునంత గంసునాజ్ఞఁదృణావర్తకర్బురుండు

తే॥ నందవ్రజమొంది సుడిగాలి నాల్గుదెసల బిట్టువీచుచుఁ గన్నుల మట్టిఁగొట్టి
జగము నంధకారంబుగాసల్పి ఘోరశబ్దముంజేసి కృష్ణుని సంగ్రహించె

చ॥ ఇటు ఘటికాద్వయంబు గనులింతయు విప్పగరానియట్లు చీఁ
కటులును దుమ్ముగ్రమ్మ సుడిగాలి సెలంగుటఁ గాంచలేక పి
మ్మట వడితో యశోద స్వకుమారుని నెల్లెడఁజూచి చూచి యె
చ్చటఁగనలేక కన్నులను జల్లల నశ్రువులొల్క నివ్వెఱన్ ౧౫౮

ఉ॥ నాయన! కృష్ణ! యేరిభవనంబుననుంటివొ యెట్టులుంటివో
యే యెడ కేఁగితో సుజనులేరయినన్ నినుజూచియుందురే
నాయెడ నిల్వలేవకట! నాగతియెట్లుఁకనంచు నెంతొ వా
పోయియుఁ జూచుచుండె సురభుల్ మృతవత్సముఁగాంచు చాడ్పునన్ ౧౫౯

వ॥ అనంతరంబునందు గోకులంబందలి సుందరీమణులా యశోదారోదనంబు విని యేదియో పుట్టిమున్గెనని యెంచి, పఱతెంచి, యామెవలన హరి వృత్తాంతంబంతయు నాలించి, చింతించి, యోజించి, విచారించుచుండ బ్రహ్మాండనాయకుండగు నబ్బాలకుండును తృణావర్తుండను రక్కసునితో వియన్మండలమందు లక్షయోజనంబులుజని క్రమంబుగా మేరుధరాధరతుల్యభారుండై వాని మూఁపుననుండ నాదుండగీఁడు. ౧౬౦

ఉ॥ మోయఁగలేను వీనినిఁక బొట్టెగదా యని యొప్పియుంటి న
బ్బో! యచలేంద్రమంచు విడఁబోవుట కృష్ణుఁడెఱింగి కంఠమా
హా! యనుచట్టెపట్టుకొన నా యసురుండు నయో! యయో! యయో!
యోయికుమార! నన్నువిడు మూపిరులుంచుమటన్న వెన్నుఁడున్ ౧౬౧

చ॥ మెడ బిగఁబట్టి యాయసురుమింట నెచంపఁగ వానిజ్యోతి య
ప్పుడె ఘనునిన్ దటిత్తువలెఁబొందెఁ దదచ్యుతునందు; నంత దై
త్యుఁడు దివినుండి కృష్ణసహితుండయి తుండెములౌనటుల్ శిలన్
వడిఁబడెఁ దద్ధ్వనిన్ గదలఁబాఱె వసుంధర మ్రోఁగె దిక్కులున్ ౧౬౨

ఆ॥ అంత గోపకాంత లదిగాంచి యరుదెంచి సంతసించి కృష్ణు సంగ్రహించి
యందున్న నందసుందరినిం బిల్చి యెలమితోడనిచ్చి యెంచిరిట్లు ౧౬౩

ఆ॥ పూర్వభవములందుఁ బుణ్యవ్రతంబులఁ జేసినామొ నిజమె చెప్పినామొ
సాధుసేవ, భక్తిసల్పినామో కాని యాశవిడిన వీఁడు హాయిదొరకె

చ॥ అని ముదమొంది గోపసతులమ్మ! యశోద! ప్రమాదముం ద్యజిం
చి నిసువుఁబెంపవమ్మ! పరిశీలనఁజేయఁ గుమారునోరు దూ
పను వెలిబాఱెఁ బ్రత్తిపువు భాతిని గావునఁ బాలనిచ్చి డో
ల నితని నిద్రపుచ్చి పనులన్ మఱిఁజూడుము గూడదాలమ్మున్ ౧౬౪

ఉ॥ ఈవిధినిట్ వచించి తమ యిండ్లకునేగిరి బాలుఁ బోయి గో
పావళి యాలకించి ముదమందెను బిమ్మట సూనునిట్ యశో
దావనజాక్షి యంకమునఁ దారిచియున్ జనుఁబాలనిచ్చి హా
హావృతయాచుఁ గోకఁగొని యశ్రువులద్దుచుఁ జాల జాలితోన్ ౪౬౬

ఉ॥ రోహిణి! దైవమొక్కకొమరున్ దయనిచ్చెను గాని పుత్రసం
దోహము నీయలేదుగద తుష్టినిఁ జెందుదుమన్న పీనికే
సాహసికాపకారములు సర్వముగల్గెడి నెవ్వ ప్రాణసం
దేహమె కాని తిండిఁదిని తేటగనుండఁడె ప్రస్తుతంబునన్ ౪౬౭

ఉ॥ మిత్తిమొగంబునుండివిడి మేదిని కీతఁడువచ్చె నారయన్
జిత్తము దత్తరిల్లెడిని జేయుటకేమియుఁ దోఁపదేదెటన్
జొత్తు నిఁకెందు నుండు? విధిసూడ నదృష్టము కృష్ణుఁడుంట నా
విత్తము, వస్త్రముల్ బ్రతుకు వేశ్మములన్నియు నున్నవయ్యెడిన్ ౪౬౮

ఉ॥ ఈకొడుకే యరిష్టములనేమియుఁ జెందకయున్న-నో ధరా
నాకుల కర్థదానముల నవ్యగృహంబుల దేవతాళికిన్
శ్రీకమలేశ పూజలను జేసెదనమ్మరో! నేను పీనినిన్
గైకొని "అంధయష్టి" వలెఁ గాలము యాపనసేయనుంటిఁగా ౪౬౯

### బ్రాహ్మణులు శ్రీకృష్ణునకు రక్షసేయుట.

చ॥ అని యనునంతలోన ద్విజులందఱు సుందరనందమందిరం
బున కరుదెంచి నందుఁడిడుపూజల నోజ గ్రహించి దీవెనల్
బొనరిచి యయ్య! మీ సుతుఁడు పొందఁ డనర్థము సౌఖ్యసంపదల్
గనుఁ జిరజీవియై యలరుఁ గావునఁ గుందకుఁడంచుఁ బ్రీతితోన్ ౪౭౦

చ॥ నవకుశపల్లవంబులను నవ్యజలంబులఁ గర్గ పేయసం
స్తవముల, వేదసూక్తులను, స్వస్తివచస్సుల, సామగీతులన్
సవము యథావిధిన్ జరిపి చక్కఁగ నగ్నికి నర్చసల్పి మా
ధవునకు రక్షసేసిరిటు దానవిధానవిదగ్రిణీ! గుణీ! ౪౭౧

వ॥ దామోదరుండు చరణంబులను, విష్టరశ్రవుండు జానువులను, శ్రీహరి యూరువులను, శ్రీకృష్ణుండు నాభియు, రాధికాధవుండు కటిభాగంబును, పీతాంబరుం డుదరంబును, బద్మనాభుండు హృదయంబును, మధురానాథుండు ముఖంబును, ద్వారకారమణుం డుత్తమాంగంబును, నసురాంతకుండు పృష్ఠంబును, శ్రీపరాత్పరుండు సర్వప్రదేశంబులను రక్షించుగాకయని యా పాపని దీవించిరి. ౪౭౨

ఉ॥ అంతట నందుఁ డాద్విజుల గోవులులక్షను లక్షవస్త్రముల్
వింతలఁగొల్పు రత్నములు వేయి దశాధికలక్షవిత్త, మ
త్యంతవిధేయుఁడై యొసఁగి యంపి స్వబంధుసుమిత్రలోకముల్
సంతసమొందఁజేసె మణిజాలసువర్ణధనాంబరంబులన్ ౪౭౪

తే॥ అని వచింపఁగ జనకుండు హర్షమొంది నారదా! తృణావర్తుఁ డనశ్వరుఁడగు
హరిని లీనమైపోయెఁ దదాదిమజని నెవ్వఁడై యుండునో యాతఁడెలుఁగఁ జెపుమ

—♦ తృణావర్త పూర్వజన్మవృత్తాంతము. ♦—

చ॥ అనవుడు నారదుండనియె నాతఁడు పాండుధరాధిపుండు య
జ్ఞనిరతుఁ డచ్యుతాంఘ్రిజలజస్థితచిత్తుఁడు ధర్మనిష్ఠుఁడున్
ఘనబలుఁడున్ వదాన్యుఁడుగఁ గ్రాలియు రేవతటంబునందు వే
కనులను గల్గి వేసతులఁ గాముకుఁడై వసియించె నయ్యెడన్ ౪౭౬

తే॥ అటకు దుర్వాసుఁడన్ముని యరుగుదెంచె నప్పుడాతఁడుగనియు సాష్టాంగనతుల
సల్పలే దదిగన్నయా సంయమి గసి మచ్చరీ! యసురుండవై మలయుమిలను

మ॥ అని శాపంబునొసంగ నొచ్చి మదియందా పాండుభూపాలుఁ డో
మునినాథా! భవదీయపాదముల నామూర్ధంబునన్ దాల్తు వే
నను రక్షింపుమటంచు వేఁడ ముని యానారాయణస్పర్శచే
తను మోక్షంబును జెందనుందు వనియెన్ దద్రీతి నా భూపుఁడున్ ౪౭౮

తే॥ ధరఁ దృణావర్తనామకదానవుఁడయి గట్టితనమునఁ దిర్గుచుఁ దుట్టతుదను
నట్టి నందునిపట్టినినంటి యట్లు ముక్తిఁ బొందెను బహులాశ్వభూవరేణ్య!

వ॥ అంత నొక్కనాఁడు యశోదాదేవి. ౪౮౦

సీ॥ కనకమణి ప్రభాకనదురుడోలికారత్నమందుఁ బరుండి క్రాలువాని
దృష్టిదోషముఁ బాపు తిలకంబువానిని జిన్నారి పొన్నారి చిన్నవాని
నంతము లేనట్టి వింతలుగలవానిఁ గాలి వ్రేల్గుడుచుచుఁ గదలువాని
నల్లవానిని జిన్నినగుమోమువానిని గాటుకగలతమ్మి కనులవాని

తే॥ కృష్ణచంద్రుని సూనునిఁ దృష్ణతోడఁ గాంచి తనతొడఁ గూర్చుండఁగా నొనర్చి
పాలనిచ్చి ప్రమోదముఁ జాలఁ జెంద కృష్ణు డావులించుచుఁ జూపె నెల్లజగము

తే॥ అద్దియామెయుఁ గన్గొని యరరె యేమి! బ్రహ్మముఖులైన దేవతల్ వఱలిర హాహ
యర్షురే! విశ్వమంతయు నగపడెడిని ననుచు వింతతోడుతఁ దన కనులమూసి

తే॥ పిల్లఁడెటఁ బోయెనోయను భీతిచేత కనులఁ గ్రమ్మఱఁ దెరచియుఁ గాంచలేక
సొమ్మసిల్లెను నందుని సుదతితపము నలఁతి వర్ణింపఁదరమానె? యవనినాథ!

## యశోదానందుల పూర్వజన్మ వృత్తాంతము.

క॥ అనవుడు నారద! నందుఁడు దనసతితోఁగలిసి యెట్టి తపమొనరించెన్
ఘనుఁడగు శ్రీహరి వారికిఁ దనయుండయి కల్గుటేల తప్పక చెపుమా! ౪౮౪

తే॥ అనఁగ మౌనియునిట్లనె నష్టవసువులందు మేల్బంతియైన ద్రోణాహ్వయుండు
ధరయనెడిభార్యతోఁగూడిహరిని గొల్చుచుండి సుఖముగాదివమేలుచుండెఁగాని

ఉ॥ బిడ్డలులేని కారణము పెల్లుగఁజింతలఁబెట్ట నాతఁడా
గడ్డుపనిన్ నివారణముగా నొనరింపఁదలంచి యాలితో
నడ్డులులేక మందరకులాచలమొంది విరించిఁగూర్చి చే
పడ్డ ఫలానిలాంబువులఁ బర్ణములన్ క్షుధఁదీర్చు చొక్కుడన్ ౪౮౬

ఉ॥ పుట్టలువెట్ట ఘోరతపమున్ బొనరింపఁగ నర్బుదాబ్దముల్
నెట్టన బ్రహ్మవచ్చి యతనింగని ద్రోణ! తపంబుమెచ్చితి
నిట్టవెకాని యేవరము నీవకుగన్ మదినెంచియుంటివో
గట్టిగఁజెప్పి కైకొని సుఖంబునుగాంచుమటన్న ద్రోణుఁడున్ ౪౮౭

చ॥ ధరయను భార్యతోఁ గలిసి తత్క్షణమందున మీఁదిపుట్టలన్
సరగున నెట్టు చావిధికి సాగిలిమ్రొక్కి దయాపయోనిధీ!
సురకులశేఖరా! కరుణఁజూచి జనార్దనుఁడాత్మజుండుగాఁ
బొరయునటుల్ ఘటించి ప్రియపూరితభక్తిని మాకొసంగుమా! ౪౮౮

ఉ॥ ఇయ్యది తప్ప వేఱొకటి యెద్దియువల్దని వేఁడ బ్రహ్మ యో
యయ్య! యలభ్యమౌ వరమునడ్గితి వైన మఱొక్కజన్మమం
దియ్యది సెందనుందువని యేర్పడఁజెప్పి తిరోహితుండుగాఁ
జయ్యన ద్రోణుఁడున్ ధరయు సంతసమందుచు నేగిరింటికిన్ ౪౮౯

తే॥ అంతధరయశోదయనంగ నవనియందు ద్రోణుఁడున్ నందుఁడనఁబుట్టి తుష్టినుండ
బ్రహ్మవాక్యంబు నిజముసల్పగను మధురనుండి వారికి సుతుగ శ్రీశుండుచనియె

చ॥ మధుకముకంటె యుక్తవిధి మాఁగినమామిడిపండుకంటె నా
మధువునకంటె నాచెఱకుమాధురికంటెను ద్రాక్షకంటె నా
మధుసుధకంటెఁ దియ్యనయి మాటికిమాటికిఁ గ్రోలఁజేయు నీ
మధురిపు సత్కథామృతము మంగళదంబయియుంట నాదిలోన్ ౪౯౧

మ॥ హరి శృంగాచలమందు నాకొసఁగె నే నాపైన నద్దాని నా
నరనారాయణమౌనివర్యులకు నానందంబుతోఁజెప్పి యీ
పరి నీకాడి కృతార్థతన్ జెలఁగితిన్ భ్రాజత్ప్రభావోదయా!
మఱి యీ వేమివినంగఁ గోరెదవో? యామాటన్ వెసన్ బల్కుమా! ౪౯౨

క॥ ఏతద్రీతిని నడుగఁగ నేత యలరి కృష్ణుఁడచట నిసువయి యేయే
రీతుల మెలఁగెనొ యాకత నీతఱి ననుకంపను వచియింపు సురర్షీ! ౯౩

తే॥ అనఁగ నారదుఁడిట్లనె నవనినాథ! యట్టి వసుదేవుపంపున నరమున యదు
కులపురోహితుండైన గర్గుండు వ్రజమునకుఁ నందుండు పూజించి సన్నుతించి

—♦ గర్గుండు గోకులంబునకేగి రామకృష్ణులకు నామకరణంబులఁ గావించుట. ♦—

ఉ॥ ఓమునివర్య! నావ్రజమునొందుటచేతఁ బవిత్రమయ్యె నీ
యే మిపుడే కృతార్థులము నీయదువంశము ధన్యమయ్యె మీ
రీమెయినిక్ నా కుమారులకు నీసుకుమారుల కాదరంబునన్
నామములన్ ఘటించి కరుణన్ గృతిగా ననుజేయ వేఁడెదన్ ౯౪

చ॥ అని వినుతింప నామునియు నట్టులెచేసెదనంచు నొప్పి నం
దునిఁగొనిపోయి యొంటరిగ దుర్ణయకంసుఁడు సేయఁబోవుబా
ధను వివరించి యియ్యది మిథస్స్థలమందునఁ జేయనౌనటం
చు నుడివి యాత్రజేసెఁడు, యశోదయు వేడ్కను జూచుచుండఁగాన్ ౯౬

చ॥ తొలుత నవిఘ్నమస్తనుచు ధూర్జటినందనుఁ బూజసల్పి య
వ్వలను నవగ్రహంబులకు భక్తిని నర్చలొనర్చి యట్టి బా
పలకు సమగ్రదక్షిణ లపారముగానిడఁజేసి దేవతా
వలికి నమస్కరించి యిటుపల్కెను నందున కోనరేశ్వరా! ౯౭

ఉ॥ రోహిణి కాంచినట్టి కొమరుండు మునీంద్ర హృదబ్జపంక్తి న
వ్యాహతమౌ విహారము ప్రియంబున సల్పుటచేత, భక్తిస
న్నాహసమేతులన్ నిజగుణంబులతో రమియింపఁజేసి యీ
యైహికపారమార్థికములందు రమించుట, రాముఁడయ్యెడిన్ ౯౮

తే॥ గర్భసంకర్షణమున సంకర్షణుఁడన రేవతికి భర్తయగుటను రేవతీశుఁ
డనఁగ బలశాలులందున నతిశయుండునగుటఁ బట్టియు బలుఁడన నతిశయిల్లు

క॥ నందా! మఱిసుతుపేళ్ళానందంబుగ వినుము శోభనప్రదముల్ ద
ద్బృందారకవందితముల్ సందేహనివారకములు సద్గతిదంబుల్ ౧౦౦

సీ॥ కమలావిభుఁడగుఁగ కారంబుచేతను శ్రీరాముఁడగును బుకారమునను
షడ్గుణయుక్తుఁడౌ స్వచ్ఛసితద్వీపకాంతుండునగును షకారమునను
నారసింహుఁడగు ణ కారంబుచేతను నల యకారంబుచే నగ్నిభుక్కు
నగు విసర్గముచేత నల నరనారాయణాఖ్యమునీంద్రులు నగుదురందు

తే॥ వలనఁ గృష్ణాభిధానమె లలితమౌను గానఁ బెట్టితిని యుగయుగంబులందు
ధవళరక్తపీతరుచులఁ దత్తదుచిత రీతిఁదాల్చుచు జగతి వర్ధిల్లునయ్య! ౧౦౧

చ॥ అదియునుగాక ద్వాపరయుగాంతమునన్ గలియాదికాలమం
దుదయముసెంది కృష్ణతను నొందుటబట్టియుఁ గృష్ణనామమే
కుదిరెడి నీసుపుత్రికకున్ వృషభానుబలాము గీమునం
దొదవిన రాధకున్ బతిగనుంట నితండగు రాధికేశుఁడున్ ౧౦౩

తే॥ వసువులను నింద్రియంబుల వజలు దేవతల మనంబులఁదగుచుఁ బనులను నెల్ల
నాచరించుట వాసుదేవాఖ్యగూడ గలుగు నీ కుఱ్ఱనికి ముందు నిల వ్రజేశ!

ఉ॥ శ్రీకరుణాకరుండును నశేషజగత్పతి శేషశాయి గో
లోకనివాసియైన హరి లోలుఁడై యిట నాత్మజాతుఁడై
నీకుఁ జెలంగెఁ గంసముఖనిర్జరవైరుల రూపుమాప స
ల్లోకముఁబ్రోవ భూభరము లుప్తముగా సలుపంగ; దేవరా! ౧౦౪

ఉ॥ ఆపరమేశు లీలలును నాఖ్యలుజూడఁగ వేదగుహ్యముల్
పాపవినాశకంబులయి భ్రాజిలు నీగృహమందు నాతఁడే
పాపఁడుగా జనించెఁగద! భాగ్యమదేమని సన్నుతింతు నీ
వే పరిపూర్ణధన్యుఁడవు వింతలుగావని యేగె భూవరా! ౧౦౫

—♦ గర్గుండు వృషభానునిదరికరిగి రాధాకృష్ణ ప్రశంసఁజేయుట. ♦—

ఉ॥ నందుఁడునున్ యశోద నిజనందను లీలలఁజూచి చూచి యా
నందముఁబొందుచుండిరల నైష్ఠికగర్గమునీంద్రుఁ డల్ల కా
ళింది తటంబునందున వెలింగెడి నావృషభానుపట్టణం
బొంది చొరంబదాలయము నొయ్యనఁ దద్వృషభానువర్యుఁడున్ ౧౦౬

సీ॥ శ్వేతాతపత్రంబు వేయుటచే నిర్జరేంద్రుఁబోలుచునుండు నిద్ధభోగి
దండంబుఁ బట్టుట ధార్మికవరుఁడైన ధర్మునిఁబోలు నవభ్రితనువు
బ్రహ్మతేజంబును బలముగాఁ బొందుట సూర్యునింబోలెడి నార్యవర్యు
బుస్తకమేఖలాశస్తహస్తుండౌట బ్రహ్మకై పడినుండు బ్రాహ్మణవరు

తే॥ తెల్లపట్టంబులంగట్టి తేజరిల్లుచుంట విష్ణునికై వడి నొప్పుచుండు
గర్గమునివరు భక్తితోఁ గాంచిలేచి మ్రొక్కి గద్దియనిడి పాదపూజసల్పి

ఉ॥ ఉత్తమలోకపర్యటన మర్విని శాంతినిగూర్చి సర్వలో
కోత్తరమై మనుష్యమలమూడ్చి పవిత్రముజేసి తీర్థసంప
పత్తురచించి దివ్యమగు పద్ధతినుండ నొనర్చునట్టి నా
చిత్తగతాఘపుంజములఁ జెండుట చిత్రమె మౌనినాయకా! ౧౦౭

చ॥ మునివర ! నాకు రాధయను ముగ్ధసుపుత్రిక కల్గె దాని నే
ఘనున కొసంగుమన్నఁ దమిఁగా నలవానికి నిచ్చెదన్ జుమీ
యనవుడు తన్మునిప్రవరుఁ డావృషభానునిఁ దోడుకొంచు ని
ర్జనయమునాతటస్థలి సరాసరి జేరి వసించి యిట్లనెన్ ౭౦౯

ఉ॥ ఓ వృషభాను ! గోపకులనుత్తముఁడై భగవంతుఁడై మహా
దేవముఖాది దేవ్రుఁడయి నిత్యజగత్ప్రభుఁడై పరేశుఁడై
గోవిభుఁడై వ్రజాధిపునకుం దనయుండయి వెల్గు కృష్ణుఁడే
యీవనితామతల్లికకు నాత్మవిభుండగునట్లొనర్పుమా ! ౭౧౦

క॥ అందులకతఁ డానందము బొందుచు శ్రీకృష్ణమూర్తి పుట్టఁగనేలా ?
నందుని నందనుఁడై వ్రజమందుండుటయేల ? నుడువుమా! యన మునియున్

మ॥ అవనీభారముఁ దీసి వేయుటకుఁ గంసాదిద్విషద్ధింసకై
సవములొప్పఁగ బ్రహ్మ వేఁడ హరి యాజన్మంబు జెందెన్ దదీ
యవధూరత్నము నీ గృహంబుననె రాధాభిఖ్యతోఁగూడి సం
భవముంబొందెఁ బ్రధానమేయదిగ నావాక్యమ్ము లాలింపుమా ! ౭౧౨

చ॥ అనవుడు బాగుబాగనుచు నావృషభానుఁడు స్వీయభార్యతో
ఘనముగ యోజనల్ సలిపి కాఁగలకార్యముఁగూర్చి మోదబా
ష్పనికరమొల్కఁ గ్రమ్మఱ నపారతపఃఫలధన్యుఁడైన యా
మునివరుతోడ నిట్లనియె మోడ్చి కరంబుల మైథిలేశ్వరా ! ౭౧౩

తే॥ ఈవు సెప్పినరీతి శ్రీకృష్ణమూర్తి కిచ్చి పెండ్లిని నొనరింతు నిద్దినీదు
దయఘటిల్లెను గావునఁ దదుపయమము మీరె చేయుట బాగని కోర మునియు

వ॥ ఈ రాధాకృష్ణ వివాహంబు నిర్వహించి నేను సేయింప సమర్థుండను గాను. మఱియేమంటివేని యమునాధునీతటంబున విలసిల్లు బృందావనంబునకుఁ జెంగటనున్న భాండీరంబను వనంబున నిర్జనంబయి నయనపర్వంబొనర్చు నొక్క ప్రదేశంబున సురాధినాథుండగు నప్పితామహుండే వచ్చి తత్పరిణయంబు జేయించు. మఱియుఁ ద్వద్దుహితను శ్రీకృష్ణార్థాంగిగా గుర్తెఱుంగుము. త్వద్భవిష్యజ్జామాత యగు శ్రీకృష్ణుండు గోలోకంబున నివసించుపరమేశ్వరునిగాఁ దెలిసికొనుము. మీర లెల్లరాలోకంబునుండియె యాగతులై తిరి. ఇదియంతయు నీ రాధాదేవి సంకల్పజనితంబని భావింపుము. ఎవరి దర్శనంబు నరామరమునివరులకు దుర్లభంబై దుర్ఘటంబై యున్నదో యట్టివారు నీ నట్టింట గోపికాగోపసహితులై విరాజిల్లఁ గలరని పలుక నాయూలుమగలు పెల్లుమోదిల్లి శ్రీరాధాకృష్ణ ప్రభావం బెఱింగి క్రమ్మఱ రాధాశబ్ద నిర్వచనంబుసేసి తత్తత్త్వమంతయుఁ దెలిపి కృతార్థులఁ జేయవే యని ప్రార్థించుచు నతండిట్లనియె. ౭౧౫

ఆ॥ రమ రకారమయ్యె రాజిల్లు నాకారమాదిగోపియయ్యె నా ధకార
మా ధరిత్రియయ్యె నాకారమావిరజాభిధానసతియునయ్యె ధీర! ౪౧౭

ఉ॥ ఈవిధి గంధమాదనమహీధరమందున సామవేదపుం
భావమటంచు మాధవుని వక్త్రమునుండియె వింటిఁ గృష్ణుఁడన్
దేవుని తేజ నాలుగగు తెన్నులుగానయి లక్ష్మి భూమి లీ
లా విరజాహ్వయంబులఁ జెలంగి లయించెను రాధలోపలన్ ౪౧౮

తే॥ దానిచే రాధ పరిపూర్ణతమ యగుటను రాధికాకృష్ణుఁడంచు విరతియులేక
శాంతి దాంతి సమేతులౌ శాస్త్రవిదులు జపముసల్పుచునుంద్రు నిశ్చంచలముగ

క॥ రాధాకృష్ణాయనునది బోధపడన్ దలఁచుచున్న పురుషులు శుభముల్
సాధుజనమైత్రిఁగని యా గోధామముఁ జేరఁగలరు కువలయనాథా! ౪౧౯

క॥ అనవుడు నావృషభానుండును జిత్రమువొందియుండు నున్ శ్రీగర్గుం
డును వృషభానుని పూజలఁ గొని నిజధామమున కేగె క్షోణీనాథా! ౪౨౦

తే॥ ఒక్కదినమందు శ్రీనందుఁడొయ్యనొయ్య నాత్మభవునంకమందుంచియాలఁ ద్రోలు
చల్ల యమునానదీతటమందునున్న వాయుకంపితభాండీరవనికిఁ బోయె. ౪౨౧

——♦ నందుండు నందనునింగొని భాండీరవనంబున కేగుట. ♦——

ఉ॥ అత్తఱిఁ గృష్ణునిచ్చ మొగులాకసమున్నెఱిఁగప్పఁ బయ్యరల్
జిత్తము తత్తఱిల్లువటుఁ జెట్టులుగూలెడిరీతి వీవ నం
ధాత్తధరిత్రిగా మఱి మహాభయదంబయి కన్పడంగ నె
ల్లెత్తుచుఁ గుజ్జుఁడేడ్చుట వ్రజేశుఁడు గన్గొని భీతభీతుఁడై ౪౨౨

తే॥ అంకమందలి పుత్రకు నాతురమునఁ బట్టుకొని చిత్తమందునఁ బరమభక్తిఁ
బతితపావను భగవంతుఁ బరమపురుషు నమ్మిశరణుకాంక్షించు కాలమ్ములోన.

ఉ॥ కోటికళానిధిప్రభల గోటనుమీఱెడి తేజగల్గి లా
లాటికిమాస్యమందిడి లలంతికఁ గంకణ,తారహారముల్
హాటకభూషలన్ మెఱసి శ్యామలవస్త్రములన్ ధరించి బ
ల్నీటుగనుండు రాధయను లేమ సమక్షమునందు భాసిలన్ ౪౨౩

చ॥ అదరి యతండు మ్రొక్కిడి యంజలిఁగూరిచి యీకుమారుఁడే
గద యలవిష్ణు పీవితని కాంతలయందున ముఖ్యురాలవై
కుదిరితి గాదె! గర్గముని కుంజరుఁడెంతొ రహస్యమంచు ని
య్యది వచియించె పీనిని మదంకమునుండి గ్రహింపుమమ్మరో! ౪౨౪

ఉ॥ వారిదభీతుఁడై నటుల వ_ర్తిలు వీని గ్రహించి క్రచ్చఱన్
జేరిచి నాగృహంబునకుఁజేసెడి నానతులందుకొమ్ము రా
ధారమణీమణీ! యనఁగఁ దద్వనితామణి యిట్లు పల్కెనో
ధీరవరేణ్య! నీవినుతిఁదృప్తిఘటించుట దాని నొప్పితిన్ ౨౬

ఉ॥ నావుడు నందుఁడీ వటుల నాకుఁ బ్రసన్నతఁబల్కుచున్నచో
భావుకయుష్మదంఘ్రియుగపద్మనిబద్ధసుబుద్ధినిచ్చి భ
క్త్యావళిమైత్రి యెప్పుడగునట్టుల దేవిరో! చేయుమన్న రా
ధావనితాలలామయుఁ "దథా_స్తు"ని యాతని యంకమందునన్ ౨౭

ఉ॥ సూర్యనితీరు వెళ్లెడి యశోదకిశోరుని నాత్మభ_ర్తను
న్నావరితిఁ గొంచు నల నందుఁడుఁగన్గొని మొక్కియేగ భాం
డీరవనాంతరంబునఁ గడింది ప్రియంబునఁజేరి నిశ్చయా
కారముదాల్చి నల్దెసలఁ గాంతులఁబర్వుచునుండునంతలోన్ ౨౮

—♦ శ్రీరాధాకృష్ణులకు వివాహమహోత్సవంబు రహస్యంబుగా జరుగుట. ♦—

శా॥ గోలోకంబుననుండి భూమి యటకున్ గోమేధికాదిప్రభా
హేలాభాసుర హేమరూపమును నెంతేన్ దాల్చి యేతెంచె వీ
చీ లీలోల్లసదర్కపుత్రికనకశ్రీరత్నశోభాంచితో
ద్వేలారోహణసాధముల్ గలిగి దీప్తిన్ జెందె హర్షంబుతోన్ ౨౯

ఉ॥ దేవతరూత్కరంబు వ్రితతివ్రతతుల్ ఫలపుష్పసౌరభో
జ్జీవిత శీతవాతములుఁ జిత్రఖగోద్గతకర్ణపేయ నా
నావిధకూజితంబులు ననంతకళల్ సెలువారమిూఱు బృం
దావన మన్ని తెన్నుల నుతంబయి యచ్చటఁజొచ్చె ముచ్చటన్ ౩౦

తే॥ రత్నశిలలును సెలయేళ్లు గ్రాలిసొగసు నింపుగుహలను బంగరునీటుగలుగు
శిఖరముల్ గల్గి యెల్లెడఁ జిత్రరుచులఁ బర్వి గోవర్ధనాద్రియుఁ బరఁగె నచట.

సీ॥ కాసారదీర్ఘికాఖాతపద్మాకర కూపఘటీయంత్ర దీపితంబు
ప్రాకారకుట్టిమ ప్రాంగణ చత్వర సౌధవీధీ సభాసంయుతంబు
శారికాపరభృత కీరపారావత శ్రీనణపక్షిధ్వని సంగతంబు
హైమపతాకాధ్వజాలంబనోత్సుకబ్యభటవర్యనికరవిభ్రాజితంబు

తే॥ బరిమళత్పుష్పవాసనావాసితంబు మత్తషట్పద ఝుంకృతి మానితంబు
భవ్యవాసంతమాధుర్యభాసురంబుఁ గుశలదంబై నయొండు నికుంజమలరె.

తే॥ అందునాయచ్యుతుండుపీతాంబరములఁదాల్చి కౌస్తుభవంశివేత్రములఁగొనుచు
దివ్యనీలమేఘప్రభన్ దేజరిల్లి మదనకోటిసముఁడయి సమంజసగతి ౩౩

మ॥ విలసద్భూషణవామబాహువున సంక్రీడత్స్మితాస్యంబుతో
లలినారత్నము రాధికన్ గొనుచుఁ దల్లాజాహరిద్రాంబుషృ
త్కలశాలంకృతికుంకుమాక్షతకుశక్షౌమాది వైవాహికా
ర్థలసన్మండపమందుఁ జేరి యలరెన్ దత్సింహపీఠంబునన్ ౫౩౪

క॥ ఇరువురు సింహాసనమున వఱలినతఱి విద్యుదంబువాహములవలెన్
మెఱసిరి పిమ్మట నటకా పరమేష్ఠియునచ్చి మ్రొక్కి ప్రస్తుతించె నిటుల్

ఉత్సాహ॥ హరి! యనాదిమధ్యనిధన యప్రమేయ! యవ్యయా
వరద! పరమ! నిర్వికల్ప! భక్తకల్ప! నాకికే
శ్వర! యగణ్యభువననాథ! చక్రిపాణి! శార్ఙ్గి! నే
శరణు నిన్ను జెందుచుంటిఁ జక్కఁ జూచి ప్రోవుమా ౫౩౬

శా॥ లీలాలోలుఁడవై చెలంగెడితఱిన్ లీలావతీనామయై
గోలోకంబున నీమె యామతిలు వైకుంఠాధినాథుండవై
క్రాలన్ లక్ష్మియనంగనీజనని విభ్రాజిల్లు రాముండవౌ
కాలంబందున నీమె సీతయగు నో కారుణ్యరత్నాకరా! ౫౩౭

క॥ హరివిగ జన్మించిన తఱి నరవిందాలయగఁ బుట్టు యజ్ఞుండనఁగన్
బరఁగుతఱి దక్షిణాఖ్యను వఱలునుగద యీమె భక్తవత్సల! కృష్ణా ౫౩౮

తే॥ నరునిఁగలిసి నారాయణ నామకుఁడవుగాఁగ నీసతీమణి శాంతి నాఁగఛాయ
భాతినిన్ నరహరివియై పరఁగుతఱి రమయన నీమెవనుండు తామరసనేత్ర

సీ॥ ఎప్పుడు బ్రహ్మవై యొసఁగెద వపుడీమె వరఁగుఁడటస్థయా ప్రకృతి కృష్ణ!
యెప్పుడు కాలమై యొసఁగుచుందువో యప్పుడీమె ప్రధానమా నిద్ధచరిత!
యెపుడు శరీరప్రవృద్ధవిరాట్టువో యపుడీమె ధారుణియగును దేవ!
యెపుడు చతుర్విధ స్పృద్ధాంతరాత్మవో యపుడు లక్షణవృత్తియగును తండ్రి!

తే॥ యెపుడుజగదంకురాదిమహేతువై నపృథుమహత్తువై యుందువో యీమెయపుడు
సగుణమాయయై రాధ నాజన్మమొందు నందనందన! సుందరకుందరదన

తే॥ గౌర మేచక కాంతులఁ గలిగిరెండువిధములౌమహత్తును నీవె విశ్వయోని!
మఱియు గోలోకపతివీవె శరణొనర్తు శరణుజేసెద నాయనా! జలజనాభ

మ॥ కరుణాభూషణ! సత్యభాషణ! జగత్కల్యాణ కృత్త్రాణ! నే
ర్పరి వాద్యుండవు కేవలుండవిఁక నీ రాధాసతీరత్నమో
పరయై నిర్వ్యవలేనిదై ప్రకృతియై భాసిల్లు మీరిర్వురి
త్తఱిఁ బెండ్లాడుట లోకసంగ్రహము గాదా! భక్తకల్పద్రుమా! ౫౪౨

తే॥ ఇప్పుడిటమీకుఁ బెండ్లిజేయింప నన్ను బిలిచితిరి లోకవిధి వింతగొలిపె సద్గు
ణాప్రతిమ! "యథారాజా తథాప్రజా"యనియెడి నానుడిగననయ్యె నీరజాక్ష!

ఆ॥ కాన మీ యనుమతి నేను వేదోక్తపద్ధతిని మీకుఁ బెండ్లిఁ గుతుకమతిని
జరుగునట్లు జేయఁ జాలుదునని యల్ల ఘనవివాహవేదిఁ జనియె నవల ౫౪౪

ఉ॥ మంగళవాద్యముల్ శ్రవణమాధురిగా మొరయన్ సరస్వతీ
సంగుఁడభంగురాభరణజాలలసద్వృషభానుపుత్రికా
మంగళకంఠమం దవనిమండలనాటకసూత్రధారిచే
మంగళకార్యకారియగు మంగళసూత్రము గట్టఁజేసియున్ ౫౪౫

చ॥ చని మిథునంబు ముంగలఁ గృశానుని బ్రజ్వలితున్ బొనర్చియిం
ధనఘృతతండులంబుల యథావిధి హోమమొనర్పఁజేసి రా
ఘనుఁ గమలాక్షుఁగైకొని ప్రదక్షిణముల్ దగ సల్పఁజేసి వే
దజ్ఞను నిగమోక్త సప్తపదికార్యముగా నొనరించి పిమ్మటన్ ౫౪౬

చ॥ హరియురమందు రాధకర మాహరి హస్తము రాధబొమ్మనన్
వఱలఁగఁజేసి మంత్రములఁ బాఠమొనర్పఁగసల్పి హారమా
పురుషవరేణ్యు కంఠమునఁ బొల్తుక యాజలజాక్షుఁ డాసతీ
వరగళమందు వేయునటు బల్మిబొనర్చి ముదన్వితాత్ముఁడై ౫౪౭

ఉ॥ దంపతు లట్టివహ్నికిఁ బ్రదక్షిణముల్ మఱిఁజేయఁజేసి బ
ల్సొంపుగనున్న గద్దియను సుస్థితులన్ బొనరించి వారు ధ్యా
నింపఁగ నైదుమంత్రముల నేర్పుగఁజెప్పుచు రాధఁజకిరికే
తంపులులేక తండ్రివలె దానమొనర్చియు నొప్పగించుడున్ ౫౪౮

ఉ॥ మంగళికోళ్ళు గీతముల మాటికిమాటికి శోభఁజెందె దే
వాంగనలాటపాటలను హర్షముసెందిరి దిట్టలైన మా
ర్దంగికపాణివాదులును దాళము వేసిరి మంచిపూల వా
నంగురియించి రంబరమునన్ విబుధుల్ బహులాశ్వభూవరా! ౫౪౯

క॥ అంతట సదయుఁడు రాధాకాంతుఁడు సంతోషమొంది కని యవ్వాణీ
కాంతుఁ దన పురోహితాగ్రిణి సంతసమున నిట్లుపలికె జనకనరేంద్రా!

తే॥ కలుగఁబోవు ననర్థముల్ దెలిపి శ్రుతులు వలుకురీతిని మెలఁగుచు మెలఁగఁజేసి
యైహికాముష్మికసుఖంబులంది యందఁజేయువాఁడె పురోహితుఁడోయి నలువ!

ఆ॥ అట్టివాఁడవీవు హర్షించితిన్ గౌరవ మెటునీకుఁజేయవలెనొ చెప్పుమ
యన్న నతఁడుమొక్కి యచ్యుతా! నీపదపద్మములను దలఁచు భక్తినిమ్ము.

తే॥ కాని మీసలపైనుండు తేనెలవలెఁ జెలఁగు నైహికసుఖములు వలదు వలదు
జన్మమును గోరువారె యాసౌఖ్యములను గోరవలెఁగాని యన్యుండు గోరరాదు

చ॥ అనఁగ రమేశ్వరుండును "తథాస్తు"ని పల్కఁగ బ్రహ్మ వందనం
బునిడి స్వమందిరమునుబొందె ననంతరమందుఁ గుంజమం
దున హరి రాధవెట్టిన చతుర్విధదివ్యమనోహరాన్నముల్
గొని కడుపారఁగాఁ గుడిచి కోడిగమాడుచుఁ వేడ్కఁబోఁడులన్ ౫౫౪

చ॥ తములము రాధకియ్య నలతన్వి గ్రహించి గ్రసింప నాత్రివి
క్రముఁడు కరంబుచేఁ బ్రియకరంబునుబట్టి విహారమందునన్
గ్రమముగఁ జేసె నిర్వురు జొహారముగా సరసోక్తులాడుచున్
దమకముఁబొందు చూచుచును దాఁకుచునుండిరి కృష్ణుఁడావలన్ ౫౫౫

మ॥ వరబృందావననామదైవికవనప్రాబల్యసాఫల్యమ
చ్చెరువొందన్ గని, చూపి మేచకరుచిస్నిగ్ధోర్మికాధోరణీ
సరసధ్వానవిభాసురోరుయమునాసంపత్తినుంగాంచి త
త్తరుణీరత్నము సూడనట్టు లచటన్ తబ్బాటునన్ దాఁగఁగాన్ ౫౫౬

చ॥ ప్రియసతి యిట్లటుల్ వెనుక వృక్షముపై నొకకొమ్మచాటునన్
నియతిగనుండు భర్తఁగని నివ్వెఱపాటున నవ్వి పుట్టమున్
రయమునఁబట్టి లాగికొని క్రమ్మఱఁబెన్మిటిఁగాంచనట్లు ని
ర్భయమున నా నికుంజమునఁ బాఱుచుడాఁగె రహస్స్థలంబునన్ ౫౫౭

చ॥ తదుపరి గృష్ణమూర్తి వనితామణి రాధఁ గళిందపుత్రికా
నదిదరిఁ గుంజమందుఁ గని నవ్వి చెఱంగునుబట్టిలాగి వా
రిదము తటిల్లతన్ మెఱయురీతిఁదమాలము హైమవల్లిచే
గొడకొని వెల్గుమాడ్కిఁ జెలిఁగూడుచు శోభిలె నో మహాప్రభూ! ౫౫౮

శా॥ ఆధిక్యప్రియరాసకేళులను బహ్వానందమానట్లు శ్రీ
రాధాకృష్ణులు సల్పఁగాఁదొడఁగి రాభ్రాజచ్చతుశ్శాలలన్
సౌధాగ్రంబుల శారికాశుకపికశ్రావ్యస్వనాంచద్వనిన్
సాధిష్ఠప్రసవోరుశయ్యలను బృన్దాకాననం బందునన్ ౫౫౯

ఉ॥ అర్థిసమూహకల్పతరువైన రమాపతి రాధతోడ గో
వర్ధనశైలసానువులఁ బల్మఱుఁగ్రీడలఁదేలి సత్కళా
వర్ధితలక్షపత్రయుతపద్మము నెచ్చెలి కేలునుండి లీ
లార్థముగా గ్రహించి యమునాపగ చెంతకుఁబాఱె నవ్వుచున్ ౫౬౦

ఉ॥ అత్తఱి రాధవెంటఁబడి యాహరి పచ్చనిపట్టుపుట్టమున్
బెత్తము వంశిఁగైకొనఁగ వెన్నుఁడుఁజూచి చెలీ! యిదేమి! నీ
చిత్తము భ్రాంతమయ్యెనొకొ? నిబ్బరి నూడఁగ బీక నేనెటన్
జొత్తును నవ్వరొక్కొ ననుఁజూచి జనుల్ దయనిమ్ము వానినిన్ ౫౬౧

చ॥ అన విని యామె యో ప్రియుఁడ! యందముగా నొక దండితామరన్
గొని కరమందుఁ బెట్టుకొనఁ గోడిగమాడుచు నీవు దాని నేఁ
గనని విధిన్ గ్రహించి మఱిఁగాలికొలందిఁగ బాఱుచుంటివే
ఘనమొకొ యిద్ది; గాన నివి కంజమొసంగిన యప్పుడిచ్చెదన్ ౫౬౨

ఉ॥ నావుడు నందపుత్త్రుఁ డలనాతిని గన్గొని కొమ్మ! కొమ్మరో!
యీ వరపద్మమంచు నిడ నింతియు గైకొని వంశి వేత్రముల్
శ్రీవసనంబు నిచ్చియు విశేషముదంబును బొందె హాయిగా
నావనినట్టు లిద్దరు విహారము సేసిరి రాజశేఖరా! ౫౬౩

ఉ॥ శ్రీరమణుండు పిమ్మట నశేషసుఖాకరమై చెలంగు ఖాం
డీరవనంబునందగి కడిందిముదంబున భార్య కెంతొ శృం
గారసుపత్త్రభంగమిడి కన్నులఁగాటుక దిద్ది సొమ్ముల
వ్వారిగఁదొడ్గి పూవులను బాగుగఁగూర్చె ననంతరంబునన్ ౫౬౪

చ॥ కుతుకము జెంది రాధికయుఁ గూర్మిని భర్తకలంకరింపఁగా
యతనముసేయులోన నతఁడాత్మకిశోరత వీడి తోనఁ జి
న్నతనమునొంది భూస్థలిని నాకుచు దొర్లుచుఁ గొట్టికొంచు న
ద్భుతముగ నేడ్వసాగఁగడ పూర్వనిజాకృతిఁ దెల్పుచున్ బ్రభూ! ౫౬౫

చ॥ అదిగని రాధ భీతిపడి యయ్యరె! యెట్లు కిశోరతాకృతిన్
వదలె నెటుల్ శిశుత్వమున వర్తిలె! నీ హరి యోమనోహరా!
వదలితివేల? గోలనుగ ప్రాణములెట్టిఁక నిల్వఁజాలు! నా
బ్రదుకొ భవద్వశంబుగఁగృపన్ ననుఁజూడవె యిద్ది వీడవే! ౫౬౬

చ॥ అని వెతనొందుచుండుసమయంబున నంబరవాణి యోసతీ!
వినుము భవిష్యమందితఁడె పెన్మిటె నీకగుఁగానఁ బూర్తిగా
వనటను మానుమన్న నలభామినియున్ సరియంచు నాహరిన్
గొని యల నందగేహమును గోరికఁజేరి యశోదకిట్లనెన్ ౫౬౭

### — రాధ శిశువైన హరిని తిరిగి గోకులంబునకుఁ జేర్చుట —

క॥ అమ్మా! మును నీపతి పవన మ్మధికమ్ముగనువీవ నాకిడి వీనిన్
నెమ్మదిఁ జూచుచుఁ గ్రమ్మఱ సమ్మదమునఁ జేర్చు నాదు సదనంబునకున్

తే॥ అని నుతింపగ దానికే నభిమతించి నాఁటగోలె గాపాడుచు లోటులేక
తిరిగి తెచ్చితిఁ గొనుము నీదివ్యపుత్త్రుఁ బెట్టుపోఁతల జక్కఁగాఁ బెంపవమ్మ!

చ॥ విని యది యామె హర్షమున బిట్టుకవుంగిలిఁ గొంచు నమ్మ! యీ
దినము శుభప్రదం బెసఁగ దిట్టముగాఁ బొడఁగాంచె నదీయపు
త్రునినిడి వేడ్కఁ గూర్చితి సుతుల్ వినుఁ జేయఁగ శేషుఁడాగునే?
యని బహుపూజలన్ సలిపి యంప స్వగేహముఁ జేరె రాధయున్ ॥౫౭౦

చ॥ ఇటుల రహస్యమై యలరు నీ కమలాపతి సత్కథాస్థితిన్
దిట్టముగ విన్నవారలును దివ్యముగాఁ బఠియించువారు ను
త్కటముగ వ్రాయువారు నిజకల్మషశైలము లెల్లఁ గూల్చి యం
తట హరిధామ మొందుదురు తథ్యము పథ్యము భూవరాగ్రణీ! ॥౫౭౧

## శ్రీకృష్ణ బాలలీల

వ॥ అంత నా వ్రజంబునందా మాయామానుషవిగ్రహులగు రామకృష్ణులు గౌరనీలవర్ణంబుల విరాజిల్లుచు రోహిణీయశోదల పెట్టుపోతల దినక్రమంబున శుక్లకళానిధిపోలె వర్ధిల్లి పదంబులయందలి యందియలు గల్లుగల్లనిమ్రోఁగ దోఁగి యాడుచుఁ దల్లులయంకంబులనధిరోహించి నయనంబుల విలాసములఁ జూపించుచుఁ గ్రీడించుచు నొక్కొక్కమాఱు చూపఱచ్చెరువొంద ఫణంబువిప్పిన నాగసర్పంబు మాడ్కి శిరంబునిక్కించి, భుజపాదంబులఁ బొఱుచు వచ్చుచుఁ బోవుచుఁ జిఱునగవు మొగంబున మొలకలెత్త మనోహరులై వసియించుచు సింగపుఁ గొదమలకై వడి నిర్భయంబుగా బాలలీలలం గావించుచు నీలపీతాంబరంబులం గట్టి కండ్లఁగాటుక మెఱయ నవరత్నఖచితభూషణంబులుఁ బొలుపార ముజ్జగంబుల ముద్దులకుఁ బెన్నుద్దులై తద్దయు వెలుంగు కుమారులను, దల్లులును, గోపికలును గాంచుచు నిజ గృహకృత్యంబుల సైతము మఱచుచు వదలఁజాలక యచ్చటనే నివసించి పెల్లు మోదిల్లుచుండిరి. ఆ నందుండును నిజమందిరంబునందు సింహశాబకసదృశుండును, నందనుండును నగు చిన్నికృష్ణుని లీలలం గాంచుచు నానందించుచుండె. అవల నా యశోదాదేవి దృష్టిదోషంబు బాపఁ గొంపోవుతఱి గోపిక లామెకిట్లనిరి. ॥౫౭౨

ఉ॥ అమ్మ; యశోద! మెప్పుడు త్వదాత్మజునాటలకై గ్రహించి బా
హ్యమ్మున కేగవల్దు సుతుఁడయ్యెను దుగ్ధముఖుండు వీని శీ
ర్షమ్మునఁ గాకపక్షము విరాజిలెడిన్ బయిపండ్లు రెండు నూ
ర్ధ్వమ్మున వీనికుండుటఁ గరంబగు గండము మేనమామకౌ ॥౫౭౩

తే॥ మేనమామయు వీనికి మెలఁగఁడయ్యె గానఁ దోషము వీనికే కలుగుఁగనుక
హాని తొలఁగుటకొఱకయి దానములను భూసురామరగోవేదపూజసలుపు.

చ॥ అనఁగ యశోద, రోహిణియు, నందులకొప్పి సుతోల్లసార్థమై
ధనమణి, సౌరభేయ, వసుధా, ఘృత, వస్త్ర, సువర్ణదానముల్
బొనరిచి దేవ, గో, నిగమభూసుర పూజలసల్పి రాసుతుల్
గొనకొని హేలఁ దప్పటడుగుల్ ధరఁ బెట్టుచు సింహదృష్టితోన్ ॥౫౭౪

తే॥ తద్దసరిసమానులగు శ్రీదామసుబల ముఖసఖులఁగూడి ఖేలనంబుల నొనర్చి
వేడ్క నుద్యానవనముల విమలయమునపులినముల విహారములను సలిపి రవల

ఉ॥ బాలవిలాసహాసముల భామినులెంతయు సంతసంబుతో
నోలునటుల్ వొనర్చి యటుసూచి యిటుల్ సని మిత్రయుక్తుఁడై
పాలను, వెన్న మీఁగడను బాగుగఁ బేరిన జిడ్డుపెర్గు గో
పాలుర యిండ్లఁదూఱుచు సవారిగ శ్రీహరి గ్రోలుచుండెడిన్ ౨౭౮

ఆ॥ ఒక్క దినసమందు నుపనందుసుందరి యగు ప్రభావతి తన యాలయమునఁ
గృష్ణుఁడట్లు తస్కరించుటఁ బలుమారు గనుచుఁ గనలి వ్రజము కడకువడిగ.

## —♦ శ్రీకృష్ణ దధిచౌర్యలీల. ♦—

చ॥ అరిగి యశోద కిట్లనియె నమ్మరొ! నీదయ నాకు నీవలెన్
జెరుఁగును, బాలు వెన్నయును బెల్లుగఁగా నవిపోయ భాండముల్
త్వరఁగొని వచ్చులోన నెటొవచ్చుచు నీకొమరుండు వానినిన్
చిఱునగవొప్పమోమున గ్రసించెను గించను నేనుగాంచఁగాన్ ౨౭౯

ఉ॥ ఇట్టుల నెన్నిమాఱులనొ యాతఁడు చౌర్యముఁజేసెఁగాని వీఁ
డట్టి వ్రజేశ్వరాత్మభవుఁడౌటను నీపయిఁ గూర్మిఁగ్రమ్మజన్
దిట్టుటఁగూడలేదు సుదతీమణిరో! యన నాయశోదయున్
బట్టికి బుద్ధిసెప్పియుఁ బ్రభావతితోడ నిటుల్వచించెడిన్ ౨౮౦

ఉ॥ ఓసి ప్రభావతీ! యిటుల నుత్తమగోవులు కోటియుండెడిన్
నా సదనంబు పాల్పెరుఁగు నవ్యఘృతంబుల మున్గితేలు వీఁ
డే సమయంబునందు నవి యేమియుఁదాకఁడె యెట్లు నీబసర్
మోసముజేసి త్రాగెఁ; నిది! బుద్ధికిఁ దోఁపదుగాని యేమనన్ ౨౮౧

ఉ॥ నీగృహమందు నెంత నవనీతము పాలును బెర్గుపోయెనో
యాగతిఁ దీర్గి నావలన నయ్యవి చయ్యనఁ దీసికొమ్ము బా
గోగుల నీదు పుత్రికుని నోర్చినయట్టుల వీని నోర్చుమా!
నాగలబన్ విడన్ సలిపి నాపయిఁగూర్మిని వీడకుండుమా! ౨౮౨

చ॥ మఱియును నీగృహంబునకు మాకొమరుం డరుదెంచి పొంచి యా
పెరుఁగును బాలు మీఁగడను వెన్ననుదొంగిలి మ్రింగునప్డు ని
ష్కరుణను వాని నీడ్చికొని చయ్యన నాదరి కేగుదెంచినన్
బరికెను దూఱుచుర్ మిగుల బాఁదెద నెట్టెద గుంజఁగట్టెదన్ ౨౮౩

చ॥ అనఁగఁ బ్రభావతీసతియు హర్షముఁజెంది స్వధామమొందె నో
జనకవిభూ! మఱొక్కతఱి సంగడికాండ్రనుగూడి యేపునన్
వనరుహలోచనుం డల ప్రభావతియింటనె దొంగిలింపఁగాఁ
జని తలుపుల్ గవాక్షము లసాధ్యవిధంబున మూసియుండుటన్ ౫౯౪

ఉత్సాహ॥ కంటఁగాంచి నేత్రకాంత్రకైలమీఁదనెక్కి యా
యింటిప్రక్క గోడఁజేరి యెరుసూడకుండ న
ట్టింటదూఁకి యుట్టినున్న యెల్లగోరసంబులన్
గొంటకై కరంబులెత్తఁ గొంచెమేని నందమిన్ ౫౯౫

ఉ॥ ఱోలును వేసి దానిపయి రుంద్రసుపీఠము వైచి దానిపై
బాలురనిల్వఁబెట్టి మఱి వారలపై వడినెక్కి పూర్తిగాఁ
గాలును నెత్తి చేతుల సుకంబుగఁజాఁచిన నందకుంట గో
పాలకబాలకృష్ణుఁడు నపారరుషన్ గని యూఁచి శీర్షమున్ ౫౯౬

ఉ॥ దండముఁగొంచు నుట్టి దృఢతన్ బ్రహరించెను దానిచేత నా
భాండములెల్ల బ్రద్దలయి పాలును పెర్గును వెన్నముద్దలున్
దండిగ ధాత్రిపైఁబడుటఁ దద్ధరియున్ గని యవ్విగ్రోలెఁ ద
ద్భాండరవంబులోఁగల ప్రభావతియున్ విని వచ్చి వెంటనే ౫౯౭

ఉ॥ పాఱెడిబాలురందు హరిపాణిని గట్టిగఁబట్టి భీతి దై
వాఱగ లోచనంబులను బాష్పము లొల్కఁగ నందుమన్కికిన్
జేరిచి నిల్వఁబెట్టి వ్రజశేఖరు ముంగలఁజూచి లజ్జతోఁ
జీరను మోముఁ గప్పికొనె శ్రీహరిచింతిలె స్వాంతమందిటుల్ ౫౯౮

తే॥ ఈమె జెప్పిన నాతల్లి యెఱిఁగియెఱిఁగి నన్నుఁ బడఁదన్నుగాన నేనున్నరూపు
వదలి యీపెకుమామనివలెఁ జెలఁగిన జెడుగులేవని యూహాపుఁజెందియుండె.

ఉ॥ అంతఁ బ్రభావతీవనిత యాగ్రహనిగ్రహబద్ధబుద్ధి గే
హాంతరమందునన్ జెలఁగునట్టి యశోదనుబిల్చి యమ్మరో!
వింతగనున్నదమ్మ! యిది పెర్గుఘటంబులఁ గూలఁగొట్టి తా
నంతయుఁ ద్రాఁగెనమ్మ! యిపుడన్నములోనికిఁగూడ లేనటుల్ ౬౦౦

క॥ మఱియొకపరి నీబుడుతఁడు మఱుదెరువున నేగుదెంచి మాయింటను బా
ల్పెరుగుల. మస్తువు, దినుతఱి నరిగిన నాయత్తనూపి హసియించి చనెన్

క॥ ఇఁక నొకపరిని బెరడున జలకమాడెడి నాదుకడకు లంభించుచు నీ
దుకుమారుం డరుదెంచుచు నకటా! నాకట్టుకోక హరియించి చనెన్ ౬౦౧

ఆ॥ చెప్పరానిపనులఁ జేయఁగారాని సేఁతలను గోకులమునఁ గలకలంబు
గలుగ నీవిధమున సలుపుచుండెనుగదా! యేమిసేయవలెనొ యెఱుఁగఁజెపుమ.

ఉ॥ ఇట్టులఁజేయఁ గాపురము నెట్టులఁజేసెదమమ్మ! యిట్టి యి
క్కట్టులు మీకుఁ గల్గుతఱిఁ గష్టము సౌఖ్యము మీకుఁదోఁచు ని
ష్టెట్టులఁ దోఁచునమ్మ! యిట నేమికఁ నుండగలేము వీఁడునుం
బొట్టియె ? రామరామ! యది వొందగనేరదు పీనియందునన్ ౫౯-౪

చ॥ అనవుడు నాయశోద యధికాగ్రహమొందుచు నోప్రిభావతీ!
గనులను గంతదీసి యిటుఁ గాంచుము నీవు మృషావవాదమున్
నెనరెడపీడి వాడితివె ? నీతనయుండవి తస్కరింప నా
తనయుఁడు సంగ్రహించెనని తంటగఁబల్కుట పాడియేమొకో ? ౫౯-౫

చ॥ అదివిని యాప్రభాపతి ముఖాంబరముం దొలఁగించి పుత్రు ని
ష్పమఁగని యబ్బమొంది యెటువచ్చితి విచ్చటికయ్య యింటికీ
యదనునరమ్మ పోవుదమటఁచుఁ దదర్భకుఁ గొంచు నేగె న
య్యదిగని నందగోపబలులావ్రజవాసులు నవ్విరంతటన్ ౫౯-౬

చ॥ హరి దొలిరూపునన్ జెలఁగి యాయమవోయెడి బాటకడ్డమై
తరుణి! మదంబకింకనిటు తప్పకచెప్పెదవేని నీమనో
హరవరరూపమొంది పరిహాసమొనర్చెద నంచుఁబల్క నా
సరసిజనేత్ర సిగ్గున స్వసద్మముఁజేరెను మైథిలేశ్వరా! ౫౯-౭

తే॥ ఈప్రిభావతి గతివిన్న యెల్లగోపికలును గృష్ణునిఁబట్టక గౌరవముగఁ
జూడసాగిరి క్రమముగా శుక్లచంద్రుఁ బోలికృష్ణుఁడు వృద్ధిని బొందుచుండె.

చ॥ క్రిమముగ వృద్ధిసెందు హరిఁ గంజదళాక్షుని నీలవర్ణునిన్
విమలుని దివ్యవిగ్రహుని వేమఱుఁగాంచుచు నెల్లవ్రేతలుఁ
దమిఁగొని ముద్దువెట్టుకొని ధామములందున నాటపాట లం
దముగ నొనర్పసాగిరి గదా యనిపల్క నరేంద్రుఁ డిట్లనెన్ ౫౯-౮

తే॥ నారదా! నవనందోపనందనామములను షడ్వృషభానుల పూతనామ
ములను మఱివారు సేయుపనులను దెలుప వేఁడుచుంటి ననంగ నావిబుధమౌని

—♦ నారదుఁడు నందోపనందవృషభానులక్షణంబులం దెలుపుట. ♦—

తే॥ రంగవల్లీశ రంగోజి మంగళులన శ్రీశమంగళాయనుఁన శ్రీధరుఁడన
దేవనాయక విమలులన్ దివ్యజనులు భూమి నవనందులననుందు్రి పూతచరిత!

తే॥ సాంబపీఠిహోత్రాగ్ని భుక్కాంతగోపతిశ్రుతశ్రీకర వ్రజ దేవపావ
నులను పేళ్ళతోనుపనందులిలను జెలఁగుచుందురనినీమెఱుంగుమో యుర్వినాథ!

తే॥ మఱిఁ బతంగుఁడు శుక్లుఁడు మార్గదుండు దివ్యవాహనగోపేష్ట్ర దివ్యనీతి
విదులనంగ షడ్వృషభాను లొదవఁగలరు వారికుందు పెత్తనముల వరుసవినుమ

వ॥ శ్యామలాకారమనోహరులై హస్తంబులందు వేత్రంబులం దాల్చి
శ్రీగోలోక నికుంజప్రధానద్వారంబునాశ్రయించి యా శ్రీకృష్ణుని యనుగ్రహంబును
సంపాదించుమహాత్ములు నందులనియు, వంశీబర్హంబులు సెలంగ సర్వాంగసుంద
రులై తన్నికుంజతోరణాంతికంబున విరాజిల్లు గోకోటులను బరిపాలించువా రుపనం
దులనియు, దండపాశంబులం గైకొని తల్లోకద్వారషట్కంబునందుండి తద్దుర్గంబు
లను గాపాడు సమర్థులు వృషభానులనియు నెఱుంగుము. ౬౦౪

చ॥ హరినుడి వారలందఱు రయంబున గోజగముం ద్యజించి యా
ధరకరుదెంచి తద్వ్రజము దాఁకొని వెల్గిరి వారిశక్తి యం
దఱపరకైన నెన్నఁగలమా! యల బ్రహ్మయుఁబల్కఁజాలునే
సురుచిర కృష్ణలీలలను జూచినవారె కృతార్థులో విభూ! ౬౦౫

—♦ శ్రీకృష్ణ మృద్భక్షణ లీల. ♦—

చ॥ నరవర! యొక్కనాఁడు యమునాతటినీతటమందుఁ జేరి త
త్సరసిజపత్రలోచనుఁడు సందియమేమియు లేక మట్టినిన్
బొరిఁబొరిఁ జేతులంగొనుచుఁ బొక్కట నబ్బలిఁజూచి యక్క! శ
ర్కరవలె నిద్దిబొక్కెడవె! క్రమపదార్థము లెన్నోయుండఁగాన్ ౬౦౬

తే॥ చాలుఁ జాలు నిసీయిసీ సరగ రార! సోదరా! యంచుఁబిలిచినఁ జూచియతఁడు
రాక యాకరణిని బొక్క రహినినుంట నెఱిఁగిబలుఁడు యశోదకు నరిగిచెప్పె.

ఆ॥ అంత నల్లముగుద యాత్మజుండింటికి వచ్చినంతవాని పాణిఁబట్టి
పట్టి! యున్కిపట్టు బాసినప్పటినుండి సలుపుపనులు నాకుఁ దెలిసెఁగదర

ఉ॥ అన్నము లేకయా? మనకు నాఁకలిదీర గుడంబు లేకయా?
యెన్నిన కమ్రవస్తువుల నేమియు లేకయ యేలకో యిటుల్
మన్నును దింటివయ్య! మఱుమాటవచింప వబద్ధమన్న నీ
యన్న గనుంగొనెంగదర యాగడమింతఁగ గూడునే సుతా! ౬౦౯

చ॥ అడుగఁగ నిట్టు లట్టికమలాయతలోచనుఁడున్ నిజాంబకే
బుడుతను గాను నాకును బుభుక్షయు లేదు గృహంబునందు ద
ద్గుడముఖక్రమవస్తువులు గూడకపోవుటగాదు కాని మీ
నుడువులబద్ధముల్ గనుము నోటను వాసన యెట్టులున్నదో ౬౧౦

క॥ చెప్పుడుమాటలు సేటును దప్పక తెచ్చునను సామెత నిజంబౌ న
ట్లిప్పుడు ననుఁ బ్రహరింపఁగ నప్పిన్నలు నీకుఁజెప్పిరమ్మా! రమ్మా ౬౧౧

—♦ విశ్వరూప ప్రదర్శనము ♦—

క॥ అని తన మహాద్భుతాస్యంబును జూపఁగ నామె వాని భూధరతటినీ
వనవనధిభువనసురనరదనుజాదిసమేతవక్త్రతామరసంబున్ ౬౧౨

మ॥ కని యూరా! యఖిలార్ణవంబులిపటన్ గన్పట్టె నాపట్టునన్
వనముల్ గన్పడుఁ నాదెసన్ నగములున్ వర్తిల్లు నీవైపునన్
మనుజుల్ దానవరాజులున్ దివిజులున్ మాగోపకుల్ గోవులే
నను నాభర్తయునుంటి మిద్ది నిజమో కావో! యేమాయయో. ౬౧౩

ఉ॥ కాఁడు సుతుండు నాకితఁడు జ్ఞానపరీతపరాత్మ గానిచో
నేఁడు చరాచరప్రవృతవిశ్వముఁ జూపఁగఁజాలునే! యటం
చాడి యథార్థతత్త్వమని యక్కలివాయ విరాగబుద్ధితో
వేఁడు యశోదకన్ గొలిపె వెన్నుఁడు వైష్ణవమాయ భూవరా! ౬౧౪

ఉ॥ గోకులమందుఁ బ్రత్యహము గోపిక లెల్లను లేచి వేకువన్
శ్రీకరకేశవచ్చరితకీర్తులఁ దద్దధిమంథనంబులన్
జాకొనుచుందు రందముగఁ బార్థివ! యొక్కదినంబునన్ యశో
దాకమలాక్షి పాడుచటుఁ దద్దధిఁ ద్రచ్చెడి కాలమందునన్ ౬౧౫

## యమళార్జున మోక్షము.

చ॥ త్వరఁ దన పుత్రుఁడమ్మ! చనుఁబాలిడు వెన్న నొసంగుమంచు నూ
పురములు గల్లుగల్లనఁగఁ బోవుచు గంతులు వేయు చట్టులి
ట్లురుగుచు వచ్చుచున్ నగుచు నార్చుచుఁ జేతులఁజాపి గెంతున
ద్దిరుగుచుఁ గ్రిష్ణజన్ జనుచు నెట్టెను నెట్టన నట్టిమంథనిన్ ౬౧౬

చ॥ పగులఁగఁ ద్రోసి యట్లు వడిఁ బాఱు కుమారునిఁ గాంచి వా
నిగతినిఁ బట్టి యామె జననేర్చిన నాతఁడు చిక్కకుండె దే
వగణమునీంద్రయోగిజనపంక్తికి నెల్ల నలభ్యుఁడైన యా
యగణితదివ్యమూర్తి యొక యంగనకెట్టులఁ జిక్కు భూవరా! ౬౧౭

చ॥ అటు దనతల్లి వెంటఁబడి యక్కలి మిక్కలి బొందుచుండుటన్
దటుకున భక్తవశ్యుఁడగు తద్ధరిఁ గన్గొని చిక్క వేమిరా!
యటమట నన్ను బెట్టినటు లందఱఁ బెట్టుచునుందువంచు ను
త్కటమగు కిన్క రేఁగి సుతుఁ గట్టఁగ ఱోటఁ దలంచి నెమ్మదిన్ ౬౧౮

చ॥ గుణమునఁ గట్ట బొజ్జకది గొంచెము దక్కువగాఁగ లాఁతిదా
గుణమునఁ గట్టినన్ గొఱఁతగూడుట వేఱొకత్రాటఁ గట్టఁగా
నణువు కొఱంతయయ్యె నిటు లన్ని గుణంబులఁ గట్టదయ్యె నా
గుణములదాఁటు చక్రి యెటుఁ గూర్కొన నొప్పెడి నీగుణంబులన్ ౬౧౯

తే॥ అట్టులన్ ద్రాడులన్నియుఁ గట్టి కట్టి విసివినొచ్చెడి తల్లిపై వీక్షణంబు
బఱపి భక్తవత్సలతఁ దద్బంధనంబు స్వయముగాఁ జెందె నోరాజచంద్రవర్యా.

చ॥ అరయఁగ నీప్రసాదము మహాత్ముల కవ్యభిచారబుద్ధిసం
భరిత మహానుభావుల కపారతపఃఫలధన్యమానిరా
డ్వరుల కభిజ్ఞయోగిజనపాళికి శూలికిఁ దమ్మిచూలికిన్
సిరికినిగూడ నెప్పుడును జేకురలేదని గుత్తెఱుంగుమా! ౬౨౧

ఉ॥ అత్తఱి గోపికాలలనలయ్యెడకుం జనుదెంచి యాదిలోఁ
దుత్తుమురైన కుండఁగనితోడనె మిక్కిలి త్రాళ్ళ ఱోటికిన్
గుత్తముగాఁగఁ గట్టఁబడి కొంకుచు జంకుచునున్న వెన్ననిన్
జిత్తము దత్తరిల్లఁగని చెచ్చెరఁ బల్కిరిటుల్ యశోదకున్ ౬౨౨

తే॥ ఓయశోదమ్మ! మాయిండ్లనురక యెపుడు పెరుఁగుకుండల నిట్టులే పెట్లఁగొట్టు
చున్న మేము నీపట్టిని బిన్నవాఁడటంచుఁ దిట్టము కొట్టమో మించుబోఁడి

క॥ లాలనమున దోషంబులు బాలురకుఁ గలుగునని ప్రథవిని నీవీ
లీలను దండించితివో గోల! యితం డెల్లఁబోటి కుఱ్ఱఁడుగాఁడే ౬౨౪

క॥ అదరింపును బెదరింపును కుదిరింపును మంచిబుద్ధి నూర్మినిగానీ
కిదుకుచు నాడెడిబాలుని గదియుచు బ్రహరింపవలదు కాంతామణిరో!

చ॥ పెరుఁగుఘటంబువో యెనని పిల్లని నీవిధిఁ ద్రాళ్ళతోడ ని
ష్కరుణను గట్టియుంటి విడిజాలదె జాలిని మాలి యిట్టులన్
బోరఁబోరఁ గొట్టవత్తు విడివోలునె నీకును జాలుఁజాలులే
సరగఁదొలంగు మన్ననల సాధ్వియుఁబోయెను లోనికంతటన్ ౬౨౬

చ॥ కమలదళేక్షణుండు బహుకాలమునుండియు మద్దిజంటయై
యమునదరిన్ జెలంగుట దయామతిఁ గన్గొని పోయి వాని మ
ధ్యమమున నాయులూఖలము నడ్డముగా మరలించియుండ నా
యమళమహార్జునంబు లిలయం దశనిధ్వనిఁగూలె వేళ్ళతోన్ ౬౨౭

తే॥ అటుల నిర్మూలముగఁబడినట్టి రెండు సాలములనుండిఁ ద్రుటిలోనఁ గీలికీల
లుద్గతంబగుకై వడి నురుచులను సిద్ధులిద్ద ఱుద్గతులైరి సిద్ధిగనుచు ౬౨౮

ఉ॥ శ్రీదయితాంఘ్రియుగ్మగతశేముషి! వారటుబుట్టి యట్టి దా
మోదరుఁడైన బాలునకు మ్రొక్కి శిరంబున దీనరక్షకా!
నీదయ మేము ధన్యులము నేఁటికిఁ బ్రాప్తనమానిశాపమున్
బేదటికంబు బొందెఁగద విశ్వమయుండవుకాక బిడ్డవే ౬౨౯

ఆ॥ ఎట్టిపాపియైన నేవిధంబుననైన నాదికారణుఁడవు నక్షరుఁడవు
నైన నిన్నుఁ దలఁచెనేని దివ్యుండయి పుణ్యగోజగంబుఁ బొందుఁగాదె ౬30

చ॥ ధనజనయౌవనాదిజనితంబగు గర్వము లేశమేనియున్
గననివిధంబు భూసురులఁగాని బుధావళిఁగాని చూచినన్
వినయవిధేయతల్ గలిగి వేమఱు గౌరవమాచరించురీ
తిని మఱి నీ పదాబ్జములఁ దీరనిభక్తి నొసంగుమో హరీ! ౬౩౧

ఉ॥ శ్రీదయితాయ ధూర్జటివిశేషసఖాయ నిరంజనాయ తే
సాదితపూతనాయ ఘనసారమృగీమదవాసితాయ హా
రాదివిభూషితాయ పరిహర్షితమానిజనాయ భూమిదే
వాదికులాశ్రయాయ అమరాదిమసద్గురవే నమోనమః ౬౩౨

చ॥ అని యిటు లారమాధిపతి నగ్గలికన్నుతిసల్పి యుత్తరం
బునఁగల స్వస్థలంబులకుఁ బోయిరి నందుఁడు దొట్టివేలు త
ద్ఘనతరువాత నిస్వనము తత్పవిపాతమటంచుఁ నాస్థలం
బున కరుదెంచి భీతి నలుమూలలఁ గన్గొని యెంతో వింతతోన్ ౬౩౩

క॥ పవియూ పడలేదిటఁ బృథుపవనంబా వీవలేదు బలులెవరిందున్
దవులుచు గొడ్డటనఱికిన నవడియులేదెట్టు లిట్టిశాఖులు వడెనో ౬౩౪

క॥ అని యందఱున్నితెన్నుల ఘనముగ శంకించుచుండుకాలమున నటన్
దవరిన బాలకులందఱు విని యిట్టులఁ జెప్పిరయ్య! పృథ్వీనాథా! ౬౩౫

తే॥ అయ్యలార! యీనందుని యాత్మభవుఁడు వీనిసందున ఱోలును వేగమ సరి
యడ్డముగ ముందుకీడ్వ నీయవనిజములు వడియెసిద్ధయుగంబిందు వెడలిచనియె

ఆ॥ అని వచింపఁ గొందఱాపల్కు లన్నృతంబులనిరి గొందఱు నిజమనిరి సంది
యంబు గొందరంది రంత నందుఁడు నిజనందనుండు చెట్లక్రిందఁబడక

ఉ॥ పోఁడిమినున్నదానికిఁ బ్రమోదముబొందుచు నందయావులన్
దూడలతోడ బాపలకుఁ దొట్రిలకుండ నొసంగి పట్టి క
ట్టూడఁగఁదీయ నట్టి కపటోరుకుమారుఁడు దానువోవు నా
జాడలు వారెఱుంగనటు సల్పెను జూపుల నాటపాటలన్ ౬౩౬

క॥ అనవుడు బహులాశ్వుం డిటులనె నారద! వీరలిరువు రరయగ నెవరో
వనమాలి దర్శనంబెటు దనరెనో వచియింపుమనఁగ దయఁ దన్మునియున్

## — యమళార్జున పూర్వజన్మ వృత్తాంతము. —

వ॥ భూపా! తొల్లిఁ గుబేరుని కుమారులగు నలకూబరమణిగ్రీవు లొక్క
నాఁడు నందనవనంబు జేరి మందాకినీతీరంబున నచ్చరలతోడ నిచ్ఛకువచ్చినయట్లు
విచ్చలవిడిగా విగతవస్త్రులై విహరించుచు, రమించుచు, నాడుచుఁ, బాడుచు
వారుణీమదిరాపానోన్మత్తులై యుండిరి. ఇయ్యెడ నయ్యెడకు దేవలమహర్షి వరే
ణ్యుండు యాదృచ్ఛికంబుగాఁ జనుదెంచె. అట్టిపట్టున వారిరువురు నిజవయోధనబల

రూపంబుల గర్వించి, యమ్మహామునిని లెక్కసేయరైరి. అద్దానిం గన్న నా మహాని
వరుండు మీ రిరువురు దుష్టశీలురై ధనయౌవనమదాంధబంధురులై వృక్షంబులం
బగిది విహరించుచున్నవారు. కానం బెక్కువర్షంబులు జనుదాఁక ననోకహంబులై
యుండి, ద్వాపరాంతంబున యమునాతీరంబున నుండు మహావనసమీపమునందుఁ
బరిపూర్ణతమావతారుండును, గోలోకనాయకుండును, దామోదరుండును నగు శ్రీకృష్ణుం
గాంచి, సంచితపాపవిముక్తులై, మీ యుక్తరూపంబులం బొందగలరని యనుగ్రహించి
చనుడు వారలిద్దఱు ధరణిని ద్రద్రీతి నిరుమద్దులై జన్మించి, తద్గోవిందసుందరపదారవింద
పరిస్పందంబున విగతపాపులై తరుగాకారంబులం ద్యజించి, పూర్వాకారంబులం దాల్చి
యుత్తరదిశయం దలరారు నలకాపురియను నిజస్థానంబునకుం బోయిరని యెఱుంగు
మని చెప్పి వెండియు నిట్లనియె.

—♦ దుర్వాసుండు గోకులంబందలి నందనందనునిం గాంచి మోహంబుజెందుట. ♦—

తే॥ ఒక్కసమయంబునందునన్ యోగివర్యుఁ బరమపరిపూర్ణతముఁ గృష్ణుభక్తవత్స
లునిఁ గనంగ దుర్వాసుఁడన్ మునివరుండు వేగ వ్రజమండలంబున కేగుదెంచి

ఉ॥ అవ్వలఁ బాలురం గలిసి యా యమునాపులినంబులందు బ
ల్జివ్వలఁ జేసి ఖేలనవిచిత్రములన్ బొనరించి పోటిగా
నెవ్వడిఁ బాఱివచ్చి నగి నేలను దొర్లి దిగంబరుండునై
మవ్వపుమాటలాడు చినిమాణవకున్ గని కొంతదవ్వునన్ ౬౮౨

చ॥ కనఁగనఁగా మనంబునను గాఁడితఁడా హరి కాని వీఁడు నం
దునికొడుకై వసించునని తోఁచెడి నిశ్చయకృష్ణుఁడైన చో
గునగునఁ బాఱి బాలకుల కూఁకటిఁ బీకునె? గేలిసేయునే!
యని తమిఁ బొందె నంతఁ గమలాక్షుఁడు తన్మునిచంద్రుఁ బ్రీతితోన్ ౬౮౩

ఉ॥ కాంచి స్వయంబుగాఁ జని సుకంబుగ నామునియంక మొంది యే
తెంచుచుఁ బోవుచున్ నగుచు దివ్యమృగేంద్ర విలోకనంబులన్
మించి మనోహరోక్తుల నమేయముగాఁ బలుకాడి తిర్గితో
తెంచి సమక్షమందు బహుదీప్తులు వెల్వడ నిల్చెనవ్వుచున్ ౬౮౪

ఉ॥ ఆసమయంబునందు నగు నా హరిలోనికిఁ బూజ్యుఁడైన దు
ర్వాసుఁడు శ్వాసమూలమున బ్రాఁతిగఁ బోవుచు నిర్జనాటవీ
భాసితలోకమొందుగని ప్రాప్తమిదెట్టుల నయ్యెనంచు నే
వేసట లేక తద్వనిని విస్మితుఁడై చరియించు వేళఁ దాన్ ౬౮౫

చ॥ అజగరవక్త్రమందుఁ బడి యందున సప్తజగద్బిలాన్వితం
బజిత మధఃప్రపంచమును నంతఁ గనుంగొని దానియందునన్
గజిబిజిగా భ్రమించి తెలిగ్రావముఁ జేరి తపంబుఁ దత్ప్రభున్
భజనము సేయుచున్ సలిపె వత్సరముల్ శతకోటి దాఁటఁగాన్ ౬౮౬

వ॥ అంత నమ్మునికాంతుండు నైమిత్తికప్రలయంబు సంభవించి యఖిలార్ణవంబు లేకముఖంబై యీక్షోణిని ముంచివేయుటంగని యవ్వాని నీదియీఁదివిసివి తదంతంబుగానక స్వప్రతిపత్తి సహస్రయుగంబు లందే వసించి క్రమ్మఱలేచి యజ్జలంబులందుఁ దిరిగి యందు మఱియొక బ్రహ్మాండంబుఁగని సంచరించుచు నొక్క రంధ్రంబునందూఁజి యందలి సృష్టివిచిత్రంబెల్ల నాలోకించి, సంతోషించి, తదగ్రభాగంబున విరాజిల్లు విద్రుహిణాయు వెంతయు భ్రమించుటంగాంచి యందుఁ బ్రవేశించి, శ్రీహరిని ధ్యానించి, తదండంబునుండి నిర్గతుండయి మరల సలిలరాశిం గని యందుఁ బొందుపడియున్న యనేక బ్రహ్మాండంబులనుగాంచి చిత్రపడి యమునాపారంబునేడి తత్పులినంబులను, గోలోక గోవర్ధనంబులను జూచి గో, గోపికా, గోపక. కోటులతో నీటుగానుండెడి నొండువండివికుంజంబునం జేరి. ౬౪౭

ఉ॥ నైకవివాకరద్యుతికదత్ప్రభు వేదిని లక్షపత్రశో
భాకరపద్మమం దలరు పంకజనాభుని రాధికేశు గో
లోకవిభుఁ బ్రపూర్ణతము లోలుపతన్ గని క్రమ్మఱిల్లి యా
శ్రీకమలేశు శ్వాసమునఁ జిత్రముగా వెడలెన్ మహాప్రభూ! ౬౪౮

చ॥ వెలువడి మౌని యట్లతనిఁ బిల్లని దివ్యకళిందజాపగా
లలితవనంబునందుఁ జెలులన్ లలిఁగూడుచు నాడువానిఁ గ
న్నులఁగని యా పరేశుఁగ ననూనముగా మదినెంచి మ్రొక్కులన్
బలుమఱు సల్పి సల్పి భయభక్తులతో నిటు వేఁడె సాంజలిన్ ౬౪౯

## —♦ దుర్వాసుండు వాసుదేవునిం గీర్తించుట. ♦—

మ॥ అనఘా! నిన్ను నలంతివానిఁగ మనంబం దెంచి కాంచంగ నీ
ఘన తేజంబును నీమహామహిమ నీకాయంబు నీసద్గుణం
బును నీసృష్టిచమత్కృతుల్ జగములున్ బూర్ణంబుగా, నాకు నీ
వనుకంపన్ దెలియంగఁ జూపితివిగాదా! భక్తచింతామణీ! ౬౫౦

## క్రౌంచపదవృత్తము.

వారిదకేశా! స్మేరవిలాసా! భవభవభయహర! భవికదహస్తా
హారమనోజ్ఞా! ధీరసులభ్యా! యఖిలసుగుణవిధి! యమృతకరాస్యా!
సారసనేత్రా! భీరుశరణ్యా! సకలభువనధర! జలరుహనాభా
శ్రీరమణీయా! శ్రీరమణీశా! శివసఖ! కరముల శిరమునఁ గూర్తున్ ౬౫౧

తే॥ ఇట్లు శ్రీకృష్ణుఁ గొండాడి ఋషివరుండు బదరికాననమొందె నో పార్థివేంద్ర!
యని జనకునకు నారదముని వచించె నదియె మీకిటుఁ బలికితినవఁగ మఱల

ఉ॥ శౌనకమౌని గర్గమునిసత్తముఁగూర్చి యిటుల్వచించె నో
మౌనివరా! రమేశుకథ మాధురి నీదయఁగ్రోలియుంటి నా
పైని విదేహదేశపరిపాలకుఁడా ఋషివర్యు నారదుక్
బూనిక నేమియడ్గెనన బుద్ధిమదగ్రణి గర్గుఁడిట్లనెన్ ౬౫౩

చ॥ మునివర! శౌనకా! వినుము భూపుఁడు నారదుతోడ భక్తిని
ట్లనియె శుభప్రదంబు సకలాఘపయోధరతీవ్రమారుతం
బునగు నుపేంద్రసచ్చరితముక్ మఱి యా యవతారకృత్యముల్
నెనరు మనంబునందునిచి నీవు వచింపుము మౌనిరాణ్మణీ! ౬౫౪

తే॥ అవలఁ దన్మునివర్యుఁడో యనఘ! తగిన ప్రశ్నమొనరించియుంటివి పాపతాప
ఖండనసమర్థగోలోకఖండమిపుడు వింటివా పైని దత్కథక్ వినుము భక్తి

ఉ॥ దేవ! మహానుభావ! వసుదేవభవా! భవధాతృవంద్య! బృం
దావనరమ్యపర్యటన తత్పర! సత్పురుషాగ్రగణ్య! రా
ధావనితామనోజ్ఞ! దధితక్రపయో నవనీతచోర! యిం
ద్రావరజా! ప్రపూర్ణతమ! యంబుజలోచన! పాపమోచనా! ౬౫౬

మాలినీవృత్తము॥ శ్రుతివిదిత సుకీర్తీ! సూర్యబింబస్థమూర్తీ!
హితవిహిత సమృద్ధా! వృద్ధిసిద్ధిప్రసిద్ధా!
రతిపతివిధితాతా! రాసకేళీ సమేతా!
చతురతరవిలాసా! సచ్చిదానందభాసా!

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవి సుబ్రహ్మణ్య
దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వనిశ్చయ, సుజనవిధేయ,
శ్రీనివాసాపరనామధేయాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతంబందలి గోలోకఖండము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓం తత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీ కృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ గర్గభాగవతము

## బృందావన ఖండము



రామా! హృదయేశ్వర!
నీరజపత్రాయతాక్ష! నిఖిలసురేశా
ధీరసమర్చితపాదా!
ప్రౌఢజ్ఞానరూప! రాధాకృష్ణా! ౧

వ॥ అని యిట్లు చెప్పందొడంగె. భూపా! నందుండొక్కసమయంబందు నవనందుల, నుపనందుల, షడ్వృషభానువులను, సహాయకారులను, మిత్రులను, గష్టసుఖముల యందాఱితేఱిన గోపవృద్ధులను బిలిపించి మహాసభంగావించి, యందు నవ్వారల నుద్దేశించి తన రాష్ట్రంబునంగలుగు పూతనాతృణావర్త శకటాగమనతరుపాతాద్యుపద్రవంబులను వెలిబుచ్చి ప్రతిక్రియల నడుగ నాలకించి యందు దీర్ఘదర్శియగు సన్నందుండను గోపవృద్ధుండు సకలజనమనోహరులగు రామకృష్ణులం గొని తన యంకమందిడి నందున కిట్లనియె. ౨

### సన్నందుండు నందునకు బృందావనంబును వర్ణించి చెప్పుట.

ఉ॥ ఎందున నేయుపద్రవము లేమియునుండవొ యట్టిదేశమున్
జెందినఁగల్గు సౌఖ్యము సుశీలుఁడు నీకొమరుండు వీఁడె మా
యందఱిజీవనంబు సుమి! యర్థము ప్రాణము సమ్మదంబు నీ
నందనుమించియుండవని నమ్ముమ నెమ్మనమందు నందుఁడా! ౩

క॥ అందున మనమందఱమా బృందావనరాజమునకు నిత్తఱిభార్యా
నందనసఖిగృహపరికరబృందముతోఁబోయిన సుఖియింపఁగలముగా ౪

క॥ అనవుడు నందుండిట్లనె ననఘా! యిదియెంతవఱకు నలముకొనెనొ యం
దునఁగల వీళ్ళెట్టివియో ఘనముగ జెప్పంగనిన్నుఁ గాంక్షింతు సుధీ! ౫

చ॥ అవవుడు ప్రాగుదగ్దిశలయందల బర్హిషదంబు దక్షిణం
బున మధురాపురంబును బ్రమోదదశోణపురంబు పశ్చిమం
బునఁదగ నద్దియొప్పు నదిపూర్తిగ నెన్నడినాల్గుకోసులన్
దనరును సార్ధయోజనము తద్విపులం బని పల్కె వెండియున్ ౬

ఉ॥ అంబరచుంబిభర్మమయహర్మ్యములన్ నవరత్నవప్రపీ
తాంబర హైమపణ్యముల నబ్జకువాలయహంసరమ్యవా
యాంబులసత్తటాకముల నందమునొంది ప్రయాగతీర్థ రా
జంబునఁ బూజితంబయి పసన్దగుఁ దన్మధురాపురంబహో ! ౭

ఉ॥ ఆవిధి నొప్పు నామధురయందికలో వనరాజమాచు బృం
దావనమొందు వర్తిలెడిఁ దద్వని సర్వమనోజ్ఞ కృష్ణ లీ
లావసియుందు నందున విహారముఁ జేసెడివారిదైన భా
గ్యావధినిర్ణయింపఁగలమా ! వినుమా ! యటనుండు సౌఖ్యముల్ ౮

క॥ ఇరువదినాలుగుకోసులవఱకును వ్యాపించినట్టి వనములు సంపీ
శ్వర గోవర్ధన నగములు మఱియు బృహత్సానుగిరియుమట్టుకొనె నటన్ ౯

తే॥ మలయమారుతం బాత్మీయమలమువోవ
యమునమీఁదుగ నరుదెంచి హాయిపడుచు
సుమపరిమళంబులం గొని సురతరతులు
విరతులన్ స్వస్థపడునట్లు వీచుచుండు ౧౦

చ॥ మఱియు నికుంజసైకతసమంజసవేదికలుండు వానిలో
సరసులు ప్రేలుప్రేతలు నజస్రము గ్రీడలసల్పుచుంద్రు మీ
రరుసమునన్ విహారముల నందునఁజేయఁగవచ్చుఁ గానఁ జె
చ్చెర నిటనుండి లెంపటకుఁ జేరుఁడు మీఱుఁడు సౌఖ్యపద్ధతిన్ ౧౧

తే॥ పసులకుం గావలసినంత కసవుగలదు జలమొ పీయూషతుల్యమై చెలఁగునచట
నంచు సన్నందుఁడన నతఁడద్దిమెపుడు తీర్థరాట్పూజఁబొందెనో తెలియఁజెపుమ

చ॥ అనవుడు గోపవృద్ధుఁడిటు హర్షముతో వచియించె నో ప్రభూ !
మునుపు నిమిత్తజపత్రిలయమున్ జనుదెంచిన వేళ శంఖుఁడన్
ఘనసురవైరి వేదగణకంటకుఁడై యొకఁడుండు వాఁడు దే
వనికరమున్ బరాజిత మపారముగానొనరించి యేత్తెఱన్ ౧౩

చ॥ జలరుహయోనిలోకము వెసంజని నిద్రను గుఱ్ఱువెట్టు నా
నలువనుగాంచి పూతములు నైతికవైదికలౌకికార్థికో
జ్జ్వలతరసంగతుల్ దెలుపఁజాలిన ప్రాఁబలుకుల్ హరించి త
జ్జలనిధిలోనికిం జనియె సర్వదివౌకసులక్కలింబడన్ ౧౪

ఉ॥ వేల్పులు గుందుచుంట నలవిష్ణువు యజ్ఞవిభుండు గాంచి య
స్వల్పఝషాకృతిన్ జెలఁగి వాసికినెక్కి సముద్రమందు న
స్వల్పవిధంబునం దిరుగు శంఖసురారిని జూచి వానితో
నల్పె సమిత్తు భీతికర శౌర్యధురంధర పూర్ణమూర్తియై ౧౫

చ॥ సరగున వాఁడు స్వభ్రుకుటి సాల భయంబును గొల్ప శూల మా
హరినొసటన్ బడన్ విసరె నంతట నా హరి చక్రధార నూ
ర్పజీయలు దానిఁ జేయ నలరక్కసి యక్కమలాక్షు వక్షమం
దురవడిఁ గొట్టె దానికిని నోర్చి పరాత్పరుఁ డాగ్రహంబునన్ ౧౬

చ॥ గదఁగొని దైత్యుపృష్ఠమునఁ గండలు రాలఁగ మోదియై వ దు
ర్మదసురవైరి వ్రాలి వెతమగ్గి మరల్ పడిలేచి ముష్టితో
నుదుటన గ్రుద్దెఁ జక్రియుఁ గనుంగొని స్వీయసుదర్శనంబునన్
గుదిరిచి వాని గట్టి తలఁ గొట్టె నిలింపులు సంతసింపఁగాన్ ౧౭

తే॥ శంఖసమరూపు నసురు నసాధ్యబలుని శంఖనామకు నిట్టులఁ జదిపి శ్రుతులఁ
గొనుచుఁ గడలిని వెల్వడి కువలయంబు మీఁది కేతెంచె శ్రీహరి మేదినీశ!

ఉ॥ అంతఁ జతుర్ముఖుండు సకలామరసార్థముగాఁ బ్రయాగ స
త్ప్రాంతము జేరి వేదముల బ్రహ్మకొసంగి నవంబుఁ జక్కఁగా
నంత మొనర్చి యావలఁ బ్రయాగుని బిల్చుచుఁ దీర్థరాజుగాఁ
జింతదొఱంగి సంతసముఁ జెందగ జేసెను గోకులేశ్వరా! ౧౯

చ॥ పదపడి తీర్థనేత యొకపక్కఁ గళిందసుపుత్రియున్ మఱొ
క్కదెసను జహ్నుపుత్రికయుఁ గ్రాలి స్వకీయతరంగచామరా
లదరుచుఁ బట్టి వీవఁ దల నక్షయవట్వట మాతపత్రమై
కుదురుగ నుండ భాసిలెడి గోపకనాయక! నందనామకా! ౨౦

ఉ॥ అంతట సర్వతీర్థము లనర్ఘళరీతిఁ బ్రయాగతీర్థరా
ట్ప్రాంతము సేరి జోతములఁ బల్మఱొనర్చి భయానఁ బన్నుల
త్యంతము గట్టి క్రిమ్మఱి గృహంబులకేగెను నంత నట్టి శ్రీ
కాంతుఁడు నిర్జరాన్వితముగా నరిగెన్ దనమన్కికిన్ సుధీ! ౨౧

ఉ॥ ఆసమయంబునందె కలహప్రియుఁడైన సురర్షివర్యుఁ డా
యాసము లేక తత్స్థలికి నాగతుఁడై నుతుఁడౌచు రమ్యసిం
హాసనమందు భాసిలు ప్రయాగునిఁ దీర్థపతిన్ గుఱించి సం
త్రాసముతోడ నిట్లనియె ద్రోణదఘూసమజప్రభూత్తమా! ౨౨

చ॥ ఇలఁగల యెల్లతీర్థము లహీనత మీకుఁ గరంబులిచ్చి ప్రా
జలనొనరించి యిప్పుడిట నాగెను తీర్థవిభుండనై తి వం
చలిరితిఁగాని తన్మధురయందలి తీర్థమొకండురాక మి
మ్మలను దిరస్కృతిన్ సలుపఁబూనుటఁ జింతిలుచుంటి దేవరా! ౨౩

తే॥ అంత నాప్రియాగుండు మహాగ్రహంబుఁ జెంది తీర్థంబులంగూడి శ్రీనివాస
లోకమునకు కేగి వినతు లనేకములను జేసి బద్ధాంజలుఁడయి వచించెనిట్లు

ఉ॥ దేవ! భవద్వయఁ గలిగెఁ దీర్థవిభుత్వముగాని యట్టి బృం
దావనమాది తీర్థములు తద్విధి సీడకురాక బిట్టు న
న్నేవపడెన్ సుమీ యకట! యియ్యది యంతములేనిచింత నా
భావమునందుఁగూర్చెడిని వచ్చితి దీనిని నీకుఁ జెప్పఁగాన్ ౨౪

చ॥ అనవుడు విష్ణుమూర్తి విని యయ్య! ప్రియాగ! ధరాతలంబునన్
దనరెడి సర్వతీర్థములఁ ద్వద్వశముం బొనరించియుంటి నై
కను మధురావ్రజంబులకు నాథుగ నిష్టటియింపలేమ నా
వున నవి యేగుదెంచ విఁకఁబూన్కిని వచ్చిన తోవఁబట్టుమా! ౨౫

చ॥ అల మధురావ్రజంబనఁగ నల్పమటంచుఁదలంచితే మొకో
లలితజగత్త్రయాధికసులక్షణలక్షితమున్ బరమ్మునున్
బ్రలయవిభాసురంబును బ్రిభారుచిరంబయి నాగృహంబుగాఁ
జెలఁగునటంచు నెంచుమని చెప్పఁ బ్రియాగుఁడు విస్మితాత్ముఁడై ౨౬

ఆ॥ మాధవునకు మ్రొక్కి మాధురమండలి కరిగి పూజఁజేసి యాత్మగేహ
మునకుఁబోయె నిద్ది మున్ను భాగర్వంబు మాయఁజేయ నట్లుసేయఁబడియె.

తే॥ అన ప్రజేశుఁడు గోపవృద్ధా! మహాత్మ! యెటుల భాగర్వనాశన మెవనిచేతఁ
జేయఁబడె మునుపయ్యదిఁ జెప్పుమయ్య యనఁగఁ గ్రమ్మఱసన్నందుఁడనియెనిట్లు

—♦ వారాహావతార వర్ణనము. ♦—

తే॥ తొల్లి వారాహకల్పమందున జనార్దనుండు వారాహరూప వినోదుఁడగుచు
నా రసాతలంబున నుండి నవనిఁగోళులంమునందాల్చినిల్పెనో యనఘ! యపుడు

చ॥ వలమురి తాల్పుదంతములపైని వెలింగెడి భూమి యామితో
సలిలపరంపరల్ గడచి సాగెడి తద్భగవంతుఁగూర్చి తాఁ
బలికె నిటుల్ మహాత్మ! నలుప్రక్కలు మిక్కిలి వెక్కసంబుగా
జలములునిండె నన్నికను జక్కఁగ నెక్కడనుంతువో కదా. ౩౦

చ॥ అచల యటు ల్వచింప విని యచ్యుతుఁడాయమకిట్లనెన్ ధరా!
యెచట మహీరుహంబులు ప్రహృష్టములౌనొ ? జలస్థితిద్రుతం
బెచట ఘనంబగునో యచట నేనిను నిల్పెదఁగాన నీవు వృ
క్షచయముఁ జూచుచుండుమనఁ గాశ్యపి గ్రమ్మఱ శంకితాత్మయై. 3౨

చ॥ పురుషవరేణ్య ! స్థానరసమూహము నాకు జనించు నీచరా
చరములమోయ నేనెకడ సంతతముల్ దగియుందు నిప్పుడీ
కరణిని బల్కుచుండుటకుఁ గారణమెయ్యది ? యన్యథాత్రియుల్
వఱలెనటంచుఁ దోఁచెడి నబద్ధమొ సత్యమొ నాకుఁ దెల్పుమా! 33

ఆ॥ అని యడిగెడిలోన నాజలంబులయందు రమ్యవృక్షరాజి రాజిలంగఁ
జూచి ధరణి యిట్లు శ్రీచతుర్భుజుఁగూర్చి మానరహితయగుచు మరల నడిగె.

చ॥ కిసలయపత్రపుష్పఫలకీలితమై సుమనోమనోజ్ఞమై
యెసఁగిన వృక్షసంతతుల నేఁగనుఁగొంటిని నవ్వి యెచ్చటన్
బొసఁగునొ యద్ది దెల్పి మదిఁబొందిన సందియముల్ జనంగ సం
తసము ఘటింపవే యనఁగఁ దత్కిరిరూపుఁడిటు ల్వచించెడిన్ 3౫

తే॥ త్న్మాతల్లిక ! మాధురమండలంబు ముందురాఁగల దయ్యది భూరిలయము
నందునం జెక్కుచెదరక పొందియుండు ముజ్జగంబుల సొంపును మొనసియుండు.

ఆ॥ అదియుగాక నాకు నాకరంబుగ నద్ది యెసఁగు సాటిదానికేది లేద
టంచు నెంచవమ్మ ! యనవుడు బుడమియు బిగువువిడిచి హరికి వినతిజేసె

తే॥ ఇటు ధరాగర్వభంగంబు నెంతొసల్పి గోజగమునుండివచ్చిన క్షోణిఁగూడి
ప్రలయమందున మిక్కిలి ప్రబలుచుంట నద్దియన్నిఁటమించెనో యలఘుచరిత.

మ॥ అనినన్ నందుఁడు వల్కెనిట్టుల మహాత్మా ! శౌరిగాథావిధిన్
వినఁగాఁ జేసితివింక విష్ణుకథలన్ విజ్ఞుండవై యుందు వీ
వని గోవర్ధన నామశైలభవమాహాత్మ్యంబుఁ గాళిందివా
హిని జన్మంబును దన్మహత్తు దయతో నేవేడెదన్ దెల్పగాన్

క॥ అనవుడు నన్నందుండో యనఘా ! యొకతఱిని హస్తినాహ్వాయపురమం
దునఁ బాండువిభున కాశంతనుతనయుఁడు సెప్పినట్లు దద్దవచింతున్. ౪౦

చ॥ పురుషవరుండు నీశుఁడు ప్రపూర్ణతముండు రమావిభుండు నౌ
హరి సుజనావనార్థము ధరాధికభారనివారణార్థముల్
విరసనిరాసనార్థము భువిన్ బ్రభవింపఁదలంచి రాధతో
నరమున భూమికీవరుగుమా ! యని వాకొన నామె యిట్లనెన్. ౪౧

తే॥ ఎచట బృందావనము లేదొ యేస్థలంబునందు నుత్తుంగగోవర్ధనాద్రిలేదొ
యెందుఁ గాళిందినదిలేదొ యందు నేను వాసముం జేయఁజాలనో పరమపురుష !

తే॥ అంత శ్రీకాంతుఁడాక్షణమందు వేడ్కనిలకు నెన్పదినాల్గుకోసులను జెలఁగు
భూమి గోవర్ధనాద్రియుఁ బుణ్యయమున నాత్మనాథామమునుండి తానంపె నవల.

## —♦ గోవర్ధనపర్వత చారిత్రము. ♦—

చ॥ ఎనుబదినాల్గు కోసులను నిర్వదినాల్గు మహావనంబులన్
దనరుచు సర్వవంద్యయయి ధారణి యుద్ధరఁజేరె గోవ్రవ
ర్ధనగిరి ద్రోణశైలకులతన్వికి భారతవర్ష పశ్చిమా
శనుగల శాల్మలిస్థలిని జన్మము నొందెను నందనామకా! ౪౪

తే॥ అట్లు పుట్టిన గోవర్ధనాద్రిపైన విరులవానలఁ గురిసిరి సురలు మేరు
శీతనగరాజములువచ్చి శీర్షములిల సోకఁగా మ్రొక్కి భక్తితోఁ జుట్టివచ్చి.

శా॥ శైలేశా! పరిపూర్ణమాధవ నివాసం బొప్పెముల్ గోపికా
జాలాభీరపరీవృతంబు సురభిస్ఫాతిప్రతీతంబునౌ
గోలోకంబున బృందకాననమునన్ గోవర్ధనాఖ్యన్ గళా
లీలాశోభితశైలరాట్టువయి హాళిన్వెల్గు దీవేకదా! ౪౬

తే॥ మధురబృందావనాంకాయ మహిత సర్వశైలపాలాయ గోలోకమౌళినే పరి
పూర్ణతమలసచ్ఛత్రాయ పూతవిగ్రహాయ గోవర్ధనాయ తుభ్యం నమోస్తు.

చ॥ అని కొనియాడి స్వీయనిలయంబుల కేగెను మీఁద నానగం
బు నిఖిలశైలనాథుఁ డను పూర్ణయశంబును బొందె నొక్కవే
శ నఖిలతీర్థముల్గని పులస్త్యమునీంద్రుఁడు గోవర్ధనా
ద్రి నసితరూపు ద్రోణసుతుఁ బ్రీతినిగన్గొని చొచ్చి యచ్చటన్ ౪౭

సీ॥ అల్లిబిల్లిగనల్లి యుల్లాసములగూర్చు మల్లెలమొల్లెల నెల్లఁజూచి
మొలలోఁతు బెరుఁగుచుఁ దళతళలాడెడు పచ్చికబైళ్ళను హెచ్చుమెచ్చి
తియ్యని నీటిచేఁ జయ్యన జబ్బులన్ దీర్చెడి సెలయేళ్ళతీరుఁగాంచి
చిలుకల వానకోయిలల కోయిలకమ్మ చవిగల్గు పల్కుల నవధరించి

తే॥ మంచిమెకముల సౌరునుగాంచి మిగుల వింతలీనెడి రంగుల నెంతయుఁ గని
మేలుబంగారు చివరలచాలు నోలిఁ బొగడి మేలిడు నిదియని బుద్ధిదలఁచి. ౪౯

చ॥ మఱి యిది జ్ఞానిసత్ఫలము మంగళహేతు వమూల్యరత్నసం
భరితము శ్యామసుందర మపారతపశ్చరణానుకూల మం
చరుదుగ నెంచి తజ్జనకు నండకుఁజేరి తదర్చనానమ
స్సరణి గ్రహించి దీవనలసల్పి యిటుల్వచియించెఁ బ్రీతితోన్ ౫౦

తే॥ ద్రోణ! మలఱేఁడ వీవు గీర్వాణనికరసన్నుతుఁడవు దివ్యౌషధీసంయుతుఁడవు
దారుఁడవు సర్వలోకస్థనారజీవనప్రదాతవు నీవె యనశ్వరుఁడవు ౫౧

ఉ॥ కావున నర్థిఁ గమ్మనిని గాశినివాసుఁడనైన నేనిటుల్
దావకపార్శ్వమొందితిని దత్తన్నితవస్యసి గోప్రవర్ధన
గ్రావవిభుం బెజానపడి కౌతుకముం ఘటియింపుమయ్య! యిం
కేవిధి నేరిచేఁ గోలఁదియే నుపయోగములేమ భూధరా! ౫౨

సీ॥ రంగదభంగతరంగసంగతగంగ విష్ణుపాదోద్భవి వెలుఁగునెచట
మృత్యుంజయుండయి నిత్యశంకరుఁడగు విశ్వేశ్వరుండును వెలయు నెచట
సుందరవదనారవిందుఁడౌ శ్రీబిందుమాధవస్వామియు మలయు నెచట
మూర్తిత్రయపాత్రిజ్యపురాతచిత్రముల్ బురడించువింతలు వొలయునెచట

తే॥ నట్టి పావిష్టుదోషంబు లేనునెచటఁ జరమదశఁ గర్ణమంత్రంబు శంభువలనఁ
గలుగు నెచట నా కాశిఁ ద్విల్లలిత తనయు గోప్రవర్ధనగిరివిభుఁగుమర నిడెద.

చ॥ ఇటు లటనుంచి వల్లరుల వృక్షములం బెనుపొందియున్న త్వ
చ్చటులకుమారుపై దపమునల్పి యభీష్టములొందనుండు న
చ్చట మఱిఁ జుట్టుప్రక్కలను శైలమొకండును లేదు గాన నీ
వటమటఁ జెందకుండ నిడుమా! మఱుమాటల మానుమా యిఁకన్ ౫౩

తే॥ అనుపులస్త్యునిఁ గాంచి ద్రోణాచలపతి
మఱల నిటుపల్కె మునివరా! సరసుఁ బ్రియుని
వీని విడనాడి బ్రతుకను గాని మీదు
శాపభీతి నీతనికి సూచన నొనర్తు.

తే॥ నాయనా! గోపవర్ధనా! నగకులేశ! శుభము దైవవర్గ్యఫలసిద్ధి యభయవృత్తి
గలుగు భారతకర్మభూములకుఁదొరఁగ నీమునీంద్రుని వెనువెంట నేగుమయ్య!

చ॥ అని జనకుండు పల్క నలయద్రివిభుండగు ద్రోణపుత్రుఁడున్
విని యయిదామడల్ గలుగువిస్తృతి యోజనయుగ్మమెత్తు నిం
కనిడివి యెన్మిదామడలు గ్రాలిన నన్నటుఁ గొంచు నేదెసం
జనెదవొ యల్లెపొమ్ము! మునిసత్తమ! యన్నఁ బులస్త్యుఁడిట్లనెన్ ౫౪

పంచచామరము॥ గిరిప్రభూ! బిజాన నాదు కేలపోయి నెక్కినం
గరంబుగా వహించి నిన్నుఁ గాశిచెంతఁ జేర్చెదన్
బరీక్ష జేయుమీవనంగఁ బర్వతేశ్వరుండు సం
బరంబునన్ మఱిన్ వచించె బద్ధశాస్త్రహస్తుఁడై ౫౫

ఉ॥ ధీవర! పోవువేళ నెటదించెదవో యటనుందుఁ గ్రమ్మఱ
న్లేవను నాప్రతిజ్ఞయిది; నీదయవచ్చిన యట్లొనర్పుమా
నావుడు దత్పులస్త్యమునినాథుఁడు శాల్మలినాఁగ దీవిలోఁ
బావితకౌశలస్థలికిఁ బ్రక్కఁగ దించెద డించ మధ్యలోన్ ౫౬

క॥ ఏవంవిధశపథంబుల్ గావింపగఁ శైలవిభుఁడు గన్నీరొల్కన్
వేవినతుల్ జనకునకున్ గావించి పులస్త్యసవ్యకరమున నెక్కెన్ ౬౦

ఉ॥ ఎక్కినతోడ మౌనివరుఁ డేగఁదొడంగెను దిన్నదిన్నగా
నక్కుధరంబు మానసమునందిటు బాటను జింతిలెన్ బళీ
యిక్కడ నల్ల సర్వభువనేశ్వరచక్రి భవిష్యమందునన్
నెక్కొని దాన మాన శిశు నిర్మలకేళులసల్పుఁ గావునన్ ౬౧

ఉ॥ కాంచి కృతార్థతన్ బొరసి కాల్కదలింతును గాని పోవ నం
చెంచి శరీరభారమును నెక్కువగా నొనరించె నంత యో
గాంచితమౌని యాభరము హస్తమునందు సహింపలేక వే
దించి వ్రజంబునందు విరతిన్ గొని విస్మృతినొంది పంతముల్ ౬౨

ఉ॥ శౌచము దీర్చి తానమునుసల్పి మఱిల్ మలఁజేరి యోగిరీ!
లేచి బిఱాన రమ్మని లలిన్ బ్రియమాడుచు లేవ లేవమిన్
జూచి మహత్వసత్వములఁ జూపుచుఁ బూత్రిగ హస్తయుగ్మముల్
జాఁచియు నెత్త నంగుళీముసాగకపోవుట గాంచి ధీరతన్ ౬౩

తే॥ ఓ గిరీంద్రుఁడ! నామాట వేగవినుము లెమ్ము రమ్ము నావెను వెంట లేవమికిని
గారణంబును దెలుపుమా! కదలకుండుకరముభర మొందఁబోకుమా! కఠినహృదయ

చ॥ అన గిరి, తప్పు నాయెడల నల్పము నేని జెలంగ లేదు గా
వున ననుఁ దూలనాడకుము పూర్వపు పంతము జ్ఞప్తిదెచ్చికొ
మ్మన మునివర్యుఁ డాగ్రహమునందుచు నోష్ఠము లల్లలాడఁగాఁ
గనులెఱ్ఱఁగా శరీర మతికంపము నొంద శపించె నిట్టులన్ ౬౪

తే॥ ఓయి గోవర్ధనాచల! యుగ్రుఁడవయి
నామనోరథ భగ్నంబు నాటఁజేసి
యుంటివందునఁ దిలమాత్ర మొయ్యనొయ్య
నొడలు దఱుగంగ క్షీణించుచుండుమయ్య ౬౫

క॥ అంతఁ బులస్త్య మునీంద్రుఁడు చింతన్ శ్రీకాశిపురికిఁ జేరెను గిరిను
వ్వంతగ నంతకునంతకు వంతన్ గృశియించు చుండెవఱలెను నందా! ౬౬

శా॥ రంగత్తుంగతరంగసంగత మహారంహః ప్రవాహోల్లస
ద్గంగావాహిని యెంతదాఁకఁ దగునో గ్రావేశగోవర్ధనో
త్తుంగుండుండునో యంతదాఁకఁ ధర సంస్తుత్య ప్రభావంబులన్
బొంగున్ గాని మఱొక్కరీతి మనునే? భూతుల్విరాజిల్లునే? ౬౭

మ॥ ఇది గోవర్ధనశైలజీవితము నెంతే భక్తితో వ్రాసినన్
జదువన్ బాపములేగుఁ బుణ్యమొదవున్ సందేహమావంతయున్
గుదురన్ లేదని పల్కి త్రిప్పి యమునాకూలంకషాజీవితం
బు దయాళుండయి గోపవృద్ధు వలుకంబూనెన్ విదేహాధిపా! ౬౯

## యమునానదీ చరితము.

ఆ॥వె॥ నంద! యాకళిందనందన, గోలోకమందునుండి శ్రీశునాజ్ఞ నవనిఁ
జేరఁదలఁచి తొలుత ధారణీభర్తకు హరికి మ్రొక్కి యిట్లు ధరణిఁజొచ్చె

తే॥ అందు బ్రహ్మద్రవోద్భవమైనగంగ విరజయన్నది రెండును విలయమొందె
నంద! పరిపూర్ణతమయా కళిందతనయ కృష్ణు ముద్దురాణిగా నెఱుఁగుమయ్య

వ॥ అట్టి యమునాస్రవంతి మహత్తరంబగు వేగంబున విరజాధునీవేగంబు
నధఃకరించి యనేకబ్రహ్మాండంబులం జొచ్చి క్రచ్ఛజ నచ్చటనుండి వెల్వడిభాగీరథీ
నదింజేరి తనవేగంబునం దత్ప్రవాహజవంబును ధిక్కరించుచు వామనవామపాదాం
గుష్ఠనఖభిన్నబ్రహ్మాండమస్తకంబును బ్రహ్మరసమయంబును నగు బిలంబు జొచ్చి
యందలి విష్ణుపదితోఁగూడి యజితంబును దుష్ప్రాప్యంబునై ధ్రువలోకంబున కనతి
దూరంబున నుండు వైకుంఠపురంబుఁ బ్రవేశించి మించి యటనుండి వెడలి బ్రహ్మ
లోకంబునకుం జని, యందునుండి నధోభాగంబున వ్రాలి, వందలకొలఁది బృందార
కుల యందంపుతావులఁ జొచ్చి చొచ్చి, చూచి చూచి, మెచ్చి, చెచ్చెర మేరుశైల
శిఖరాగ్రభాగంబునం బడి, వెల్వడి, తత్ప్రాంతంబుల డంబువహించు ధరాధరంబుల
కూటంబుల నుల్లంఘించి, గండశైలంబుల నతిక్రమించి, తన్మేరు దక్షిణ భాగంబున
కేగ నుద్యమించి, తననుండి సురనిమ్నగను బ్రత్యేకింపనది హిమాలయంబునకరిగె.
తదుపరిఁ దరణితనయాతరంగిణి నయువపర్వంబగు వర్ణంబులం జెన్నుమీఱు కళింద
నామకశిలోచ్చయంబధిరోహించి, కాళిందియనం బరఁగి తత్సానుగండశైలంబులు
చూర్ణీకృతంబులుగాఁ బ్రవహించి, కృష్ణవర్ణంబును నమోఘద్రుతంబును గలిగి
భూఖండంబున నుండు దేశంబులకేగుదెంచి, వానిం బవిత్రీకరించి, ఖాండవ వనంబున
కుం జనుదెంచి యందు గోవిందునాజ్ఞ దివ్యరూపంబు ధరించి, తపంబొనరించి, నిజ
జనకుండగు నినునిచే వినిర్మితంబైన హర్మ్యంబునందు నివాసంబొనరించి కొలఁదికాల
మగుడు మగిడి వ్రజమండలంబు జేరి యందు మంగళాయనంబును, భూమండలమండ
నాయమానంబుననగు మధురాపురంబునకుఁ జేరువనున్న బృందావనంబందలి మహా
వనంబునందుండు రమణీయసైకత ప్రదేశంబునఁ జిత్రంబగు గోపికాయూథంబొండు
నిర్మించుకొని గోకులంబుననున్న శ్రీకృష్ణునితోడి రాసక్రీడకై వసతియొనర్చి యానం
దభాష్పములొల్కఁ బశ్చిమవాహినియై తద్వ్రజమండలంబునకు ముమ్మారుమ్రొక్కి
యందలి దేశంబులను శుద్ధపరచి, తీర్థరాజంబగు ప్రయాగనుబొంది తిరిగి సురనిమ్న

గం గూడి నిలింపులు విరులుఁగురియ సరిత్పతిఁగలిసి యం దనుపమాయినియగు గంగా దేవికి గద్గదవాణితో నిట్లనియె. ౭౨

శా॥ అమ్మా! విష్ణుపదంబునం గలిగి బ్రహ్మాండంబులం బూర్ణపూ
తమ్మొనర్చితి సమస్తలోకనతపాదద్వంద్వవై యీశశే
ఖరమ్మౌళిం దెక్కి యశేషతీర్థమణివై సౌశీల్యసంపన్నవై
యిమ్మాడ్కిన్ జరితార్థవై తివిగదా యీరేడులోకంబులన్ ౭౩

తే॥ అమ్మ! హరిలోకమునకిదే యరుగుచుంటి నవల నీదయవచ్చినయట్టు లేగు
మమ్మ! నానుడులందున నల్పములగు తప్పులున్నను మన్నించి దయనుగనుమ.

మ॥ అనినన్ జాహ్నవి సంతసంబుగని యోయమ్మా! కళిందాత్మజా!
ననుఁ గొండాడుట న్యాయమొక్కొ? హరి మాన్యంబైన వామాంసమం
దున జన్మించి ప్రపూర్ణురాలవయి సంస్తుత్యపవిత్రభావంబులున్
దనరన్ సర్వజగత్పవిత్రవయి తీర్థశ్రేష్ఠవై యుంటివే ౭౫

క॥ మఱిఁ బరిపూర్ణతముండగు హరికిన్ సతివైతివమ్మ! యనఘచరిత్రీ!
యరిగెదఁ బాతాళమునకు నెరసుల క్షమియింపుమమ్మ! నెమ్మిని గనుమా!

తే॥ మనుజఖేచరవరానులు గనఁగరాని నీవు నాకంటఁబడి మఱిఁ బోవుచుంటి
వందులకుఁ గుందెదను మఱి నల్లవ్రజమునందు యూథంబుతో రాసమందుఁగనెద

క॥ ఇటులఁ బరస్పరమొరిగలఁ జటులమ్ముగఁ జేసికొనియు జాహ్నవిదాను
త్కటగతిఁ బాతాళమునకుఁ దటములఁ బోఁద్రోసికొనుచుఁ దరలియు వరుసన్

ఉ॥ భోగవతీ వనస్థలిని భోగవతీవిదితాఖ్యయై మహా
నాగపరీత విస్తృత పినాక శిరంబునఁ జేరి భాసిలన్
సాగెఁ గళిందజానదియు సప్తసముద్రలసజ్జగంబుపై
వేగ ఘనప్రవాహముల విశ్రమమొందక పాఱి పిమ్మటన్ ౭౯

శా॥ లోకాలోకనగంబు స్వర్ణమయమున్ లోకస్తుతంబొంది యా
లోకంబున్ బొనరించి సానుతటముల్లూలంగఁ బెంధాటి స్వ
ర్లోకంబేగి సమస్తలోకముల నాలోకించుచున్ దిర్గి గో
లోకశ్రేష్ఠముఁబొందె సర్వవిబుధు ల్పుష్పంబులన్ జల్లఁగాన్ ౮౦

క॥ ఇది యమునాశుభచరితముఁ జదివిన వ్రాసినను నఘము సదమదమొందున్
గొదకొను పురుషార్థంబులు మదమూడును శాంతమొదవు మాన్యచరిత్రా!

—♦ నందుండు యాదవసహితంబుగా బృందావనంబున కరుగుట. ♦—

క॥ అని సన్నందుఁడు పల్కఁగ విని నందుఁడు దఱచిచూచి బృందావనమున్
జన యత్నించి స్వపురమున జనులకు సాటింపఁజేసె జనకనరేంద్రా! ౮౨

ఉ॥ సారథివీథితో విబుధసంతతితో రథరక్ష్యపంక్తితో
వీరులతో శిశుప్రకరవృద్ధులతో వ్రజగోపగోపికా
వారముతోఁ గుమారబలపంకజనాభులతోడ రోహిణీ
నారి యశోదలం గలిసి సన్యరథంబున నెక్కి చక్కఁగాన్ ౮౩

చ॥ ఘనముగ గాయకోత్కరము గానమొనర్పఁగ శంఖదుందుభి
స్వనములు నొప్ప గోగణము భాసిల స్వస్తివాచనంబులున్
దనరఁగఁ బూజ్యనందవసుధాతలనాథుఁడు బృందకావనం
బున కరిగెన్ మఱిన్ వసనముం బొనరించెను భూతలేశ్వరా! ౮౪

తే॥ మఱియు వృషభానునరుఁడును మహిషితోడ
గజము నెక్కి రాధికను నంకమున నుంచి
గాయకులును మార్దంగికుల్ గమ్రిగతుల
వాద్యమొనరింప బృందకావనముఁ బొందె ౮౫

క॥ నందులు నుపనందులు వేరొందిన వృషభానుపట్కము త్తమగతితోఁ
బొంది పదార్థసహితులయి బృందావనమొందె మిగుల వేడుకతోడన్ ౮౬

చ॥ పిదపఁ బదాఱుక్రోసులను వెల్గుచునుండు ప్రదేశమందునన్
సదన సభా కుటీర వన సౌధ చతుష్పథ రాజవీథులున్
గుదిరిన యేకుద్వారములు గోటలు బేట లగడ్తలున్ శుభ
ప్రదమగు వేయికుంజములు భాసిలఁ బట్టణమొండు గట్టియున్ ౮౭

ఉ॥ అందున నందరాజు ననుయాయులునున్ వృషభాను పట్కమున్
నందులు గోపులందఱు ఘనంబుగ వాసములం బొనర్చి రా
నందుని సుందరాలయమునన్ వృషభాను గృహస్థబాలురం
బొంది యశోద, గోపికలు మోదము సెందఁగ నాడు వేడుకన్ ౮౮

చ॥ చతురులు లోకసమ్మతులు సర్వకళాకరు లప్రమేయు ల
ప్రతిములు దివ్యులున్ బతితపావనులున్ గుసుమాస్త్రరూపులున్
సితరుచినీలవర్ణులు వినీలహరిద్వసనాంచితుల్ జగ
త్పతులగు రామకృష్ణులట ప్రాఁతినిఁ బూనుచుఁ బాశుపాల్యమున్ ౮౯

సీ॥ ప్రొద్దుననే లేచి చద్దిమూటలఁ గొంచుఁ గోడెకాండ్రను వేడ్కఁ గూడుచుండ్రు
కూడి వత్సములెల్ల గుంపులుగాఁ గూర్చి కేల వేత్రములొంది త్రోలుచుండ్రు
త్రోలియు నెట్టన దోషవినాశక యమునాసరిత్తట మరుగుచుందు
రరిగి తత్పులినంబులందున భూషలు గల్లుగల్లని మ్రోయ గంతులిడుదు

తే॥ రిడియు ముచ్చటలాడుచు నెసఁగుచుందు రెసఁగి చద్దులమూటల నెసను విడుతు
రువిడి మక్కువ మెక్కుదురు మఱి మెక్కి వంశివాదనకమ్రులై వఱలుచుండ్రు

## శ్రీకృష్ణుండు వత్సాసురుని వధించుట.

చ॥ ఒకదినమందు నొక్కతఱి నొక్కనిశాటుఁడు కంసుబోధచేఁ
బ్రకటితవత్సరూపమున రామరమేశులు ద్రోలు దూడలన్
సుకముగఁజేరి వత్సముల శోషిలఁజేసియు గోపులంగడున్
దికమకసల్ప వారలగతిస్థితులంగని పాఱి రంతటన్ ౯౧

ఉ॥ వంచకకంసచోదితుఁడు వత్సనిశాటుఁడు దోఁక నెట్టి జా
డించి రమేశుమూఁపున వడిన్ బ్రహరింపఁగఁ దోడిబాలురే
తెంచ జనార్దనుండు గని ధీరత నాతని కాళ్ళఁబట్టి హిం
సించి కపిత్థవృక్షమునఁ జేతులఁ ద్రిప్పుచుఁ బాఱవేయుచున్ ౯౨

ఉ॥ కూలెను నట్టివృక్ష మదికూలియు నన్యకపిత్థభూజముల్
రాలిచె వాని తేజ కమలాపతియందున లీనమయ్యె నా
వేలుపులెల్లఁ బుష్పముల వేమఱుఁ జల్లిరి పిల్లలెల్లరున్
జాలు బళీ! బళీ! యనిరి సంతసమందఱు బొందిరో విభూ! ౯౩

## వత్సాసుర పూర్వజన్మ వృత్తాంతము.

చ॥ పదపడి తేఁడిటుల్ పలికెఁ బంకజనాభకథాప్రవీణ! నా
రదమునివర్య! యీ యసురరాజెవఁడో యలకృష్ణులీనమై
కుదిరె నెటుల్? వచింపుమని కోరఁగ నట్టియమర్త్యమౌని స
మ్మదమున వాని తొల్లికత మానవనాథున కిట్లు వాకొనెన్ ౯౪

చ॥ మురసుతుఁ డాసురుండు గ్రతుభుఘ్నునజేత ప్రమీలనామకుం
డరుసమునన్ వసిష్ఠమునియాశ్రమమొందియు నందినీమహా
సురభినిఁ జూచి కైకొనఁ ద్రిశుద్ధిగనెంచి ధరామరాకృతిన్
వఱలి యొసంగుమద్దియని ప్రార్థనఁజేసెను తన్మునీంద్రునిన్ ౯౫

చ॥ వినిన వసిష్ఠుఁడేదియును వెల్లడిఁజేయకయుంట నల్లనం
దిని గని యోరిదైత్య! కుమతీ! మునిధేనువు నన్ను సంగ్రహిం
ప నిటకువచ్చి మోసమున బాపనివేసము వేసి యాచనన్
బొనరుతువే యిసీ! వెసనుబొమ్మిఁక వత్సవికార మొందుమా! ౯౬

చ॥ అని శపియింప నా యసురుఁడప్పుడు వత్సతఁజెంది మానినం
దినుల నమస్కరించి సుమతిన్ ననురక్షణసేయుమంచుఁ బ్రా
ర్థన మొనరింప నాసురభి ద్వాపరపుందుద బృందకావనం
బున హరిద్రోలు వత్సములఁ బొందిన ముక్తిఘటిల్లు దానవా! ౯౭

తే॥ అనుచుఁ గరుణింపఁదత్ప్రియాలాసురుండు తద్విధిఁ వత్సరూపంబుదాల్చి ద్వాప
రాంతమునఁ దద్వనమునందు నల్లవత్సములనుగలిసి హింసలఁజెంది కలిసెహరిని.

క॥ ఇందునఁ జిత్రము లేదని డెందమునం దెఱుఁగుమయ్య శీవిని నేర్లో
విందునిఁ దలఁతురో వారానందంబునఁ బరమమొందుదు నారవరేణ్యా! ౧౦౨

క॥ సమయాంతరమందున హరి క్రమముగ బలరామమిత్రరాజియుతుండై
ప్రముదిత సురభులఁ ద్రోలుచు యమునారమణీయతటము నరిగిరి పిదపన్

—♦ శ్రీకృష్ణుండు బకాసురుని జయించుట. ♦—

తే॥ అందు వజ్రతుండంబు బృహత్పదములు శ్వేతశైలాభరూపంబుఁ జెలఁగితిరుగు
బకనిశాటుఁ డొక్కండు తత్పద్మనాభుఁగని గుటుక్కునమ్రింగె నిష్కరుణనపుడు

ఉ॥ కాంచిన తోడియర్భకనికాయము భీతి మహాత్ములార ! యీ
వంచకుఁ డెవ్వఁడోకద యపారవికారశరీరియాచు మా
పంచకు వచ్చి మాచెలిని బాలునిఁ గృష్ణునిమ్రింగె నయ్యో! మీ
-ర్గాంచరె ? దిక్కు లేదిచటఁ గారుణికంబున మమ్ముఁ గావరే! ౧౦౩

తే॥ అంచు విలపింపఁగా నిలింపాధిపుండు పిన్నలార ! మీరింతయు వెఱవవలదు
వచ్చుచుంటి నం చఖిలదేవతలఁగూడి సర్వశస్త్రాస్త్రయుక్తుఁడై సరభసమున.

ఉ॥ వచ్చి మహాసురేశ్వరుఁడు బాఢబలిష్ఠుఁడునైన వానిపైఁ
గ్రచ్చఱ వజ్రమున్ విసర రక్కసియున్ బడిలేచి యంతగా
నొచ్చక తిర్గి కొట్టమిఁ గనుంగొనినట్టి పితామహుండు బ
ల్హెచ్చిన బ్రహ్మదండమున నీసునఁగొట్టె ననంతరంబునన్ ౧౦౪

చ॥ పుడమి నతండు తద్గతిని మూర్తముమాత్రము సొమ్మసిల్లి వే
యొడలు విదల్చి పెల్చన సముత్థితుఁడై ఘనసామ్యనిస్వనం
బడలఁగఁజేసి ధిక్క్రియను నావిధిఁ గ్రమ్మఱఁగొట్టకుంట రు
ద్రుఁడు గని స్వత్రిశూలమును రోసముతోఁగొని వేసె వానిపై ౧౦౫

తే॥ తద్గతిఁ బకమొక్కటి దఱుఁగబడిన వాఁడుప్రాణముల్ విడలేదు పవనుఁడద్ది
గాంచి స్వీయాస్త్రముఁ వేయఁగా నతండు గదలికదలనియట్టుల గ్రాలెనవల.

చ॥ యముఁడు ప్రచండదండముఁ దదాసురుపై నిడె నద్ది చండవి
క్రముఁడగు వానిఁ జంపమియె కాక కదుఁ జెడిపోయె నంత న
ర్యముఁడటులన్ హతిన్ గనక హోయిగనుండెడి దైత్యుఁజూచి రో
సముపడి నాటవేసెను వెసన్ బహుశాతశతాశుగంబులన్ ౧౦౬

చ॥ దనుజుఁడు వాని కించుక వెతన్ గనకుండుట కిన్క రేఁగుఁడున్
గనుచుఁ గృపాణమున్ విసరఁగా నలవాని ద్వితీయపక్షమున్
జనియెనుగాని నీల్గఁడదిచంద్రుఁడుగాంచి కసిన్ హిమాస్త్రమా
తనిపయి వేయ శైత్యమునఁ దాళక సొమ్మనుబొంది వెంటనే ౧౦౮

ఉ॥ ఆయసురుండు లేచి తిరుగాడుచునుండుటఁజూచి యగ్ని యా
గ్నేయమహాస్త్రమేయ నలసీచుని నెమ్మెయినున్న రోమము
ల్పోయెనుగాని దమ్మనుఁడు లొంగఁడు నొవ్వఁడెమోమునందు వే
దాయఁడు దూలనాడఁడు గదా! యలదైత్యుఁడదేమి చిత్రమో! ౧౦౯

చ॥ వరుణుఁడు తత్స్థితింగనుచుఁ బాశముతో నలవానిఁగట్టి యా
ధరణిని నీడ్చినప్పటికిఁ దద్బలుఁ డీల్గక గాయమొందఁడే ద
త్సరణినిఁ గాంచి కాళి గదఁ జట్టనఁగైకొని కొట్ట నాతఁడున్
శిరమున గాయమైన మృతిఁ జెందఁ డదెంతటి గట్టియాయువో ౧౧౦

ఆ॥ అవల శక్తిధరుఁడు నరుదెంచి శక్తినా యసురవపుని నఱుకఁ గసినివిసర
నతఁడు గాలుదెగిన మృతినిఁ జెందకయుండి నెల్లవేల్పులఁగని యుల్లమందు

తే॥ ఇట్టు లూరకయున్నచో నింకనన్నుఁ జంపుదురు గావునన్ నాదు శక్తికొంతఁ
జూపనగునని యెంచి తత్సరలలోనఁ జొచ్చి పెనుగాలి కైవడి మచ్చరమున

ఆ॥ రక్తనేత్రుఁడగుచు శక్తియుక్తుండయి నిర్జరులను బట్టి నెట్టికొట్టి
వారు దనదు బాధ బడలేక నింగికి బరుగులెత్తఁ దఱిమి తఱిమి మరల.

చ॥ వరయమునాతటంబునకు వచ్చి హరిద్దశకంబు మ్రోయఁగా
నఱచి చరించుటంగని సురర్షులు బ్రహ్మఋషుల్ మహామునుల్
సురలును బ్రాహ్మణుల్ ప్రథితసూరులు తత్స్థలికేగుదెంచి త
త్సరసిజపత్రనేత్రు హరిసన్నుతిజేసిరి భక్తితోనిటుల్ ౧౧౪

తే॥ దీనరక్షణ తత్పరా! దేవదేవ! వాసుదేవ! కేశవ! శివపరమమిత్ర!
మిత్రజైవాతృకాక్ష! విచిత్రచరిత! భువనమోహన! శ్రీకృష్ణ! పుణ్యపురుష!

తే॥ అయ్యొ! మావిన్నపంబిద్ది యాలకించి మిగుల నీకోసమై యిందు వగచుచిట్టు
లెదురుచూచు నీపిన్నల నీవువచ్చి కరుణఁ గావుమ! నీకగుఁగాత శుభము

వ॥ అంత. ౧౧౭

చ॥ బకవపునందునున్న హరి వారల ప్రార్థనమాదరించి పూ
నికఁ దనదేహమెక్కువగ నేర్పున సల్పఁ దదాసురుండు దా
ళక క్షతకంధరుండయి యిలన్ గమలాపతిఁ గ్రక్కుచొక్కి పా
యక మఱలన్ హరింగొఱక యత్నమొనర్చి మహాగ్రహోగ్రుఁడై ౧౧౮

తే॥ తీవ్రతుండంబు భాసిల్లఁ దీవ్రగతిని జనియె నంతటఁ గృష్ణుఁడా దనుజునిఁగని
వాలముంబట్టి కొట్టుచుఁ గేలనాస గజముఁ గొమ్ములను విఱిచిన కరణి విఱిచె

చ॥ అవల ఖగేశ్వరుండగు బకాసురుఁ డంతము నొందె వేడ్కఁ దే
వవితతి శ్రీహరీ! జయము బాగు భళీ! యను గెల్పుఁ దెల్పు వా
జ్నివహముతోడఁ బుష్పతతిన్ వెదఁజల్లిరి నెచ్చెలుల్ హరిన్
బ్రివణముతోఁ గవుంగిళులఁ బల్మఱుఁ జేసి నుతించిరెంతయున్ ౧౨౦

ఉ॥ మృత్యుముఖంబునుండి యిల కెవ్వరిటుల్ మని వచ్చిరొక్కొ? సం
స్తుత్యుఁడ వీవెయంచు విబుధుల్ గొనియాడెడిలోన దైత్యునా
న్నత్యకళల్ వ్రజాధిపతినందనకృష్ణునిలోన లీనమై
నిత్యతఁ జెందె నంత హరి నెచ్చెలులన్ దగి సంతసంబుతోన్. ౧౨౧

తే॥ రమ్యవత్సముల్ ద్రోలుచు రాగములను మురళితోడఁ బాడుచు ముద్దులొలుక
వసతిఁజనులోనఁ దోడియర్భకులు ముందు జేరియిండ్లకు నలకృష్ణు సేతఁ దెలుప.

తే॥ పౌరులందఱు విస్మితభావులైరి జనక! నావుడు నాలించి సాహసాంక
శౌర్యధనమిథిలేశుఁడు శాంతిదాంతియుక్త నారదమునికొక యుక్తిఁ బలికె.

ఉ॥ దూబఱతిండిపోతగుచుఁ దోయజలోచను మ్రింగి డింకి గా
రాబున కృష్ణులోఁగలిసి రాజిలుచుండెడి వాఁడెవండొ? యా
పోబడి దెల్పుమంచు స్తవముంబొనరింపఁగ మౌనినాయకుం
డాబకదైత్యు పూర్వకథనంతయు జేనికి నిట్లు వాకొనెన్ ౧౨౪

## —♦ బకాసుర పూర్వజన్మ వృత్తాంతము. ♦—

ఉ॥ భూవర! యీబకాసురుఁడు పూర్వపుజన్మమునందునన్ హయ
గ్రీవనిశాటపుత్రకుఁడకృత్యపరాయణుఁ డుత్కలాఖ్యుఁడై
దేవతలన్ జయించి యిటు దెమ్మని కైకొని వారిఛత్రిమా
దేవతలంబు నేలె నొక దివ్యశతాబ్దములర్థవంతుఁడై ౧౨౫

ఉ॥ అల్ల నిశాచరేశుఁడు కళాకరనాకమునందు వీఁకతోఁ
జెల్లుబడిన్ జరించు చొక సింధుపయోనిధి సంగమస్థలం
బల్లన నొక్కనాఁడు జని యందికలోఁగల జాజలాఖ్యు ప
ర్ణోల్ల సదాశ్రమం బరిగి యుద్ధతి మీనులఁ బట్టు కోర్కెతోన్ ౧౨౬

ఆ॥ అందుఁ జెలఁగు మడుఁగునందు గాలము వేసి నిజమనోరథంబు నెఱపడునటు
సల్పుకొనుచునుండ జాజలమౌనియుఁ గాంచి జాలిఁ జెంది కరుణతోడ

క॥ తగుదునని వచ్చి యిచ్చటి కగచాట్లనుబెట్టి వీని హరియించెదవే?
తగదిది. దగదిది నీకో మగవాఁడా వినుము నాదుమాటలఁ బోపో ౧౨౭

క॥ లేరే శూరులు ధీరులు లేరే భూపాలకులును లేరే మల్లుల్
లేరే దుర్మతులిల నీశూరతఁజూపింపఁ జంప ద్రుక్కింపఁగుధీ! ౧౨౯

క॥ ఇతరుల జోలికిఁ బోవక సతతము దగినట్లు గసవు జలములఁగొని స
న్మతివృత్తి నీమడుఁగునన్ బ్రతికెడి నీఝషములడపఁ బాడియెఁజెప్పుమా!

తే॥ అని హితోపదేశముసేయ నట్టిచెట్ట వినియు విననట్లు జెలఁగు చాపనిని విడువ
కుండె నిల దుండగీంద్రకు దండిబుద్ధి యేమిలేనప్డు చెప్పిన నెట్లువచ్చు! ౧౩౧

ఉ॥ జాజలమౌని యంత సురశత్రునిఁగన్గొని యోరిదుష్ట! నీ
తేజువిడక్ బకత్వము నతిత్వరితంబుగఁ జెందుమన్న నా
యోజఁ దదాసురుండు దన యుత్తమతేజము వీడఁ గొంగయై
రాజిలఁజూచి యట్టి మునిరాజును జేరి నమస్కరించుచున్ ౧౩౨

చ॥ మునివర! జాజలా! యెఱుఁగ ద్రొక్కెదఁ దప్పు క్షమింపుమయ్య! మీ
ఘనమగు సంగమం బఖిలకల్మషహారము మిత్రశత్రులం
దున ఘననీచులందు సుఖదుఃఖములందునఁ బొన్నుమన్నులం
దున మిముబోటి యోగులకుఁ దోఁపదు భేదము; గానఁ గావుమా! ౧౩౩

చ॥ మఱియును మీదు దర్శనము మాకు లభించుటబట్టి దోషముల్
దొలఁగెను బుణ్యముల్ గలిగె దుష్కరయోగకృతార్థ! నీదయన్
బరము ఘటిల్లుఁగాదె యిఁక నన్నుభరించుట నీకసాధ్యమే?
సరగునఁ బ్రోవుమా యనుచు సన్నుతులంబొనరించె నంతటన్ ౧౩౪

తే॥ సరిగ షష్టిసహస్రవర్షములఁదాఁకఁ దపముఁజేసిన జాజలతత్త్వవిదుఁడు
గినుక వీడి ప్రసన్నుఁడై దనుజనాయకునకు నిట్టులఁ బలికెనో జనకరాజ!

తే॥ ఇరువదెన్మిదవ యుగమందెసఁగుచుండు ద్వాపరాంతమునందున భరతఖండ
మందు వైవస్వతంబువ నలరు మాథురవ్రజమున బృందావనరాజముందు

ఉ॥ అందల నందనందనుఁడు నాపరిపూర్ణతముండు నట్టి గో
విందుఁడు వత్ససంతతులఁ బ్రీతినిఁ ద్రోలెడివేళ వైరమున్
జెందుచుఁ గృష్ణులోఁగలిసి చెన్నువహింతువు సందియంబిటన్
బొందదు స్వర్ణనేత్రముఖపుణ్యజనుల్ బగఁజేరరే! హరిన్ ౧౩౬

తే॥ అటులఁ బలుకఁగఁ నుత్కలుండిటుల బకతఁజెంది బృందావనంబునఁ జేరి శౌరి
మ్రింగి శత్రుత నార్జించి మృతినిబొంది కలిసె హరిని సన్మైత్రి సత్ఫలదముగద.

## —♦ శ్రీకృష్ణుం డఘాసురునిం బరిమార్చుట. ♦—

క॥ అంతట హరి వత్సము లత్యంతముగాఁ ద్రోలుకొనుచు నాత్మసఖుల్ రాన్
వంతులఁ గాళిందీనది చెంతకు నొకసమయమందుఁ జేరెను జనకా! ౧౩౭

ఉ॥ అత్తఱిఁ బాముఱూపున నఘాసురుఁ డొక్కఁడు క్రోశదీర్ఘుఁడై
యెత్తి మొగంబు నోర్దెఱచి హెచ్చిన శైలము వోలె బాటలో
మత్తతఁ బండె నద్ది గన మాధుర కాననసంచరిష్ణు గో
పోత్తము లెల్లరేగ నల యుక్కిరి డక్కిన మెక్కె గ్రక్కునన్ ౧౪౦

ఉ॥ వారిని రక్షసేయ హరి భ్రాతృయుతుండయి వానిలోనికిన్
జేరఁగఁ దన్నిశాచరులు చెందిరి మోదము గుండెలెల్ల బృం
దారకులార్తనాదములు తత్ప్రియమండలిఁ గ్రాగెనంత ల
క్ష్మీరమణుండు యోచనము జేసి తదాసుర దేహమందునన్ ౧౪౧

తే॥ తన శరీరంబు పెద్దగఁ దద్దఁ జేసి వాని ప్రాణంబు లల్లాడఁ బట్టి తలను
భిన్నముగఁ జేసి స్వజనగోవితతిఁ గూడి వచ్చె నీవల కాదైత్యవరుఁడు నచ్చె

ఆ॥ అంత వాని తేజు హరియందుఁ జంచల ఘనమునందుఁ గలియు కరణిఁ గలిసె
విరులనెల్ల సురలు గురిసిరి నరవరా! యనఁగ నతఁడు మునిని నడిగెనిట్లు

## అఘాసుర పూర్వజన్మ వృత్తాంతము.

ఉ॥ వీఁడెవఁడో కదా యెటుల విష్ణువునందున లీనమయ్యె వీఁ
డేడవసించుఁ బ్రాగ్జనని నెట్టిది వీనిచరిత్ర! శ్రీహరిన్
వేఁడక వైరరూపమున వింతగఁ జొచ్చెను సెల్లబో! యీ
జాడ నెఱుంగఁ గోరితిని సత్వరమే వచియింపు నారదా! ౧౪౪

ఉ॥ ఆవలఁ దన్మునీంద్రుఁ డిటులాడెను భూవర! వీఁడు శంఖుఁడన్
దేవగణారి పుత్త్రకుఁడు దీర్ఘబలుం డఘనామధేయుఁడున్
యావనదర్పితుండు మదనాకృతిభాసురుఁ డన్యనిందకుం
డావిలభావభావితుఁడునై తొలిజన్మమునందునం దగున్ ౧౪౫

క॥ మలయాచలముద నాతం డలఘుతపం బాచరించు నష్టావక్రున్
లులితశరీరిఁ గురూపిని నలయక యొకతఱిని జూచి హాస్యమొనర్చెన్ ౧౪౬

క॥ హీనముఁ బొందిన తన్ముని రోసముతో నోరిదుష్ట! రూఢిగ నీకా
యీసడము నిడెడి సర్పపు వేసము దగుగాతమని శపించెను జనకా! ౧౪౭

చ॥ పదపడి నాతఁ డల్ల మునిపాదములన్ బడి భక్తి వేఁడ స
ద్హృదయుఁ డతండు నెమ్మిఁ గని దేవవిభుండగు కృష్ణుఁ డెప్డు నీ
యుదరమునందునన్ జెలఁగి యుక్కడఁగించునొ యట్టివేళ నీ
వదిర! యనంగ దివ్యమగు నాకృతిఁ జెందెదవోరి యాసురా! ౧౪౮

క॥ స్పష్టముగ నట్లు జెప్పఁగఁ గష్టోరగరూప మతఁడుగని కృష్ణుఁజనా
విష్టవనాథునిఁ గలిసెఁ బ్రవిష్టపవాస్తవ్యులంద పీల్గానివిధిక్ ౧౪౯

తే॥ వత్సబకశంఖదైత్యాఘ వక్త్రిములను జొచ్చి క్రచ్చుఁజ నీవల వచ్చినసిన
కృష్ణుసంగతిఁ గ్రమముగాఁ దృష్టతోడ విని యశోద దిగులుపడి వేగపడుచు

తే॥ నగరవాసుల నందోపనందవరుల నందు వృషభాను గోపకబృందములను
రోహిణిం గళావతిఁ గృతివాహకులను బెద్దలను బిన్నలను బిలిపించి చేర్చి

చ॥ మనవ్రజమందుపద్రవ మమందముగా జనియించెనంచు వే
మనము మనంబునం దలఁచి మంచిదిసౌఖ్యదమంచు నీస్థలం
బున కరుదెంచియుంటి మదివోయిన యట్టులఁదోఁప దిందునన్
గనుక నిఁకేమిసేయవగుఁ గట్టిగ యోజనజేసి చెప్పఁడీ! ౧౫౨

ఉ॥ నాతనయుండొ చంచలుఁ డనారతమాడెడివాఁడు పిల్లలో
యాతత మర్కటాభులు గదా! యిఁక నాడుటొ దూరమందు నా
చేతలొ ప్రాణహారములు సిక్కఁడు వాఁడిఁక నేమొనర్తు మీ
ర్బ్రీతిగఁ గాంచి సత్పదముఁ బల్కుఁడి ప్రేముఁడిఁబట్టిఁబ్రోవుఁడీ. ౧౫౩

చ॥ కొలఁది దినాల క్రిందటను గుత్సితుఁడౌ బకదానవుండు నా
లలితకుమారుఁ జంపఁగ విలక్షణతుండముతోడఁ బైకి రా
నలవిధి వానిఁ దప్పుకొని యాయువుతోఁ దగెనంట! వత్సబా
ధలఁ దొలఁగించుకొంచు నెటొ ధారణిలోమనెనంట! నక్కటా! ౧౫౪

తే॥ మఱి యఘాసురహింసల మాన్పుకొంచు బ్రతికిబ్రతుకనియిట్టులఁ బరఁగెనంట
ప్రతిపదంబున నీరీతి బాధలెల్ల గలుగుచుండఁగ నిచట నేకరణినుందు?

తే॥ ఇదిమొదలు వత్సములఁగావ నేను నాదుకొడుకు వెలుపలకంప నోగోపులార!
యనుచు నేడ్చుయశోదను గనుచు నందుఁ డాశ్వసించియు నిట్టులననియెజనక!

ఉ॥ నెచ్చెలి! గర్గసూక్తుల మునిప్రవరోక్తుల బ్రాహ్మణోక్తులన్
గ్రిచ్చఁజ విస్మృతింబొరయఁ గ్రాలితివో! భ్రమజెందియుంటివో!
హెచ్చిన పిచ్చిజెందితివొ! యేమియొకాని సుతుండు గీడులన్
విచ్చునుగాన దానములఁ బ్రీతినొసంగుము మంగళార్థమై ౧౫౫

చ॥ అనఁగ యశోద పాలులకు నర్థధరానవరత్నదానముల్
బొనరిచి స్వీయభూషణసమూహము సాగ్రిజుఁడైన యాత్మపు
త్రునకిడె లక్షధేనువుల స్థూలవృషాయుతయున్ ద్విలక్షమూ
ల్యనిధివరాన్నరాశు లనర్ఘళరీతినొసంగె నందుఁడున్ ౧౫౬

—♦ శ్రీరామకృష్ణులు పాశుపాల్యం బొనరించుట. ♦—

చ॥ పదపడి గోపకాఞ్జ నవభావజరూపులు బాపతాపదు
ర్మదరహితుల్ మనోహరులు కామరమేశులు పాశుపాల్యముల్
వదలక చక్కఁగా సలుపుపద్ధతినొప్పుచు నీడుజోడునం
గుదిరినవారినింగలిసి గోవులఁ ద్రోలఁగసాగి రంతటన్ ౧౫౯

తే॥ సర్వకల్యాణకరములౌ సౌరభేయులు నిరుప్రక్కల ముంగల వెనుకఁజెలఁగి
నందనందనబలరామ సుందరవదనారవిందముల్ జూచుచు సొరుమీఱె

సీ॥ చిన్నారిపొన్నారి పొన్నులరవలను బన్నినదండలు ప్రభలనీన
నవరంజిచిఱుగజ్జెలందియల్ మొదలైన సొమ్ములఝుంకృతుల్ గ్రమ్ముకొనఁగ
విన్నువాఁకను నంచ వెల్లగుజ్జమ్ముఁ జౌదంతిని మించిన కాంతులలర
బలిసినప్రక్కలు జెలువంపు నడుమును నడవడిరూపును గడలుకొనఁగ

తే॥ రెండుతూములపాలనుబిండఁగలుగు మంచిపొదుఁగు వెలుంగఁగ మలయుచుండు
దొడ్డగిడ్డులు వెన్నునితోడఁగూడి నల్లవలువతాల్పుఁగనుచు నడవఁదొడఁగె

తే॥ అందు నెఱ్ఱనిబొట్టుల నరుణపాదములను బచ్చనితోఁకలఁ బొట్టికొమ్ము
ల మఱిఁ గైలాసనిభశరీరమును గొప్ప కోడెఁనుగల్గు నావులు గొన్నియుండు

చ॥ మఱియును గొన్నిధేనువు లమందఘనద్యుతిభాసురాకృతి
న్వఱలును గొన్నిపాటలమునన్ హరితంబునఁ గొన్నియాలు బం
గరువలె మేరుపర్వతము కైవడిఁ గొన్నియుఁ గొన్నివింతయై
న రుచుల వెల్గుఁ గొన్ని యరుణంబున రాజిలుచుండు వెండియున్ ౧౬౩

తే॥ కపిలవర్ణమునంగొన్ని కపిశవర్ణమందుఁ గొన్నియు నుండును సుందరమగు
గంగడోలునుబొల్పారఁగ్రాలుఁగొన్ని బొడుగుకొమ్ములఁగొన్నియుఁబొల్పుఁగాంచు

తే॥ వక్రశృంగంబులన్ గొన్ని వఱలుహరిణ శృంగసమశృంగములఁగొన్ని చెన్నుమీఱు
గుంభికుంభసమాన కకుదముల బలమునను జెలఁగు నాఁబోతులు దనరునందు

చ॥ అభయముగాఁగ రామహరులావుల గోవులఁ ద్రోలువేళలన్
నభమున సర్వవిష్టపఘనప్రతిభాప్రదులై జగన్మహో
విభులయి రమ్యపంకజకు వేలసతీమణిజీవితేశులై
ప్రభవముగాంచి మించు రవిరాజులభంగి వెలింగిరో విభూ! ౧౬౬

చ॥ ప్రతివనమందునన్ జెలఁగు పచ్చనిపచ్చికబైళ్ళఁజొచ్చి స
మ్మతమున మెక్కి తృప్తిపడి మంచిజలంబునుగ్రోలి స్వీయవ
త్సతతులఁగూడి నిక్కి బలశౌరుల చుట్టునుముట్టి అంకెలన్
సతతము వేయుచున్ బధినిసాగునుగిడ్డులు వెండిగిబ్బలున్ ౧౬౭

వ॥ అంత గోపాలకుండగు శ్రీకృష్ణుం డాత్మసఖుల గూడి యమునాతీరవిభాసురంబును, దాలహింతాలతమాలప్రవాల రసాల సురసాల నక్తమాల నింబజంబు జంబీర కపిద్థాశోక పున్నాగ నారికేళ నాగరంగనీప కదంబ కదళ్యశ్వత్థ బిల్వఖర్జూర భూర్జక్రముక ఖదిర పిచుపిచుల కుందార మందార కోవిదార దేవదారు పలాశప్లక్షాది నానావిధ ఫలవృక్షసమాకీర్ణంబును, మాధవ్యాది సకల లతాసంభృతంబును, మధురాంబుపూరితనిర్ఝరదరీయుత గోవర్ధనాచలేంద్ర విరాజమానంబును, జతుర్వింశదారామపరీవృతంబును, నేత్రపర్వంబును నగు బృందావనంబునకుఁ జొచ్చి యచ్చటఁ జెలంగు శుకపిక శారికాపారావత కోకిల పుంస్కోకిల కోకమరాళ మయూర మత్తమధులిడాది కలనాదంబుల హాయినాలించుచుఁ, బారిజాత పాటల చంపక హరిచందన కుందసౌరభంబుల నాఘ్రాణించుచు మెడవంచనక్కఱలేనియట్లు పెచ్చుపెరిగి యిచ్చనుగలిగించు లేపచ్చికబయిళ్ళనాలందోలుచు రమణీయంబులగు సైకతంబులఁ గ్రీడించుచు మధువనంబునను, దాలవనంబునను, దివ్యకామవనంబునను, గుముద్వనమందును, నందీశ్వరాచలప్రాంతస్థవనంబునను, గుశవనంబునను, లతాజాలసంపన్నంబై దైవాఱు భద్రవనంబునను, లోహార్గళవనంబునను, మఱియుఁ దత్పరిసరస్థితవనోపవనంబులం దెల్లెడలను నేకకాలంబున నొక్కపగిది గోపాలనం బనేకాకృతులందాల్చి యొనరించుచు సాయంకాలమగుడు నాలను మందఁగూర్చి కేలం బెత్తమును, శీర్షంబునం బింఛంబును, విశాలవక్షంబునఁ దారహారములును వెండియుఁ దత్తదవయవోచితాలంకారంబులు దళతళలాడ రాకాపూర్ణేందుసుందరంబును, నిందిరానందసంధాయకంబును, నగు నగుమోమునం జెలువాఱి బింబంబును దినావసానాంచితదినమణిబింబంబును, హసియించు శోణవర్ణంబున వెలుంగు నోష్ఠంబులందు సకలాపశబ్దాబ్రభంజనవంశిని లగించి మించి జగన్మోహనుండై మోహనరాగంబు విరాగులకు సయితం బనురాగంబు గలుగునట్లు పాడుచుఁ గ్రమ్మఱి గోరజంబులాకాశంబునం బర్వ నందరాజవ్రజంబునకు వచ్చుచున్న వృత్తాంతంబు గోపకాంత లెఱింగి యాతురంబున. ౧౬౮

తే॥ గృహమునందలికష్టముల్ గెంటుటకును సంతసంబునుబొందఁగా స్వాంతమందు
మఱువరానట్టి కృష్ణుని మఱలఁజూడ నెంచి హరియున్నచోటికి నేగిరంత

ఉ॥ సందుల నాలఁ ద్రోలుచును సాహసికుండయి సింహదృష్టితో
బందుగులుల్ దమిఁ గనఁగ బాలకరీంద్రవిలాసయానుఁడై
యందముచందమున్గలిగి యట్టిటులన్ దిరుగాడు ముద్దుగో
విందుని నందనందనుని వీక్షణతృప్తిఁగఁగాంచి రాసతుల్ ౧౭౦

ఉ॥ ధేనురజోవిరాజితుఁడు దివ్యఘనద్యుతిభాసురుండు జాంబూనదతారహారమణిభూషితుఁడున్ గనకాంబరుండు వం
శీనినదాంచితుండు సరసీరుహనేత్రుఁడు భూసుఖోరుసం
ధానచణుండు కృష్ణుఁడు సతంబును మాకుఁ బ్రసన్నుఁడయ్యెడన్ ౧౭౧

తే॥ తొలుత శ్రీహరి బుధవారకలితకార్తికసితపక్షాష్టమీతిథిఁ బసులఁ బ్రోవ
గుదురుటంబట్టియయ్యది గోపకాష్టమియని బుధులంద్రుగుణసాంద్ర! మేదినీంద్ర!

చ॥ అమృతముగారు మోముగల యచ్యుతుఁ డొక్కదినంబునందు నే
మమున స్వమిత్రులన్నయును మైత్రిని వెన్కొనఁ దోలు చల్ల గో
సముజముఁ దాలకాననము సన్నిధి కేగెనుగాని దాని మ
ధ్యమమున ధేనుకుం డనెడి దానవుఁ డుండెఁ బ్రచండశక్తితోన్ ౧౨౩

## రామకృష్ణులు ధేనుకాసురుని జంపుట.

చ॥ అల హరిమిత్రులద్దివిని యందునఁ జేరకపోయి రంతటన్
బలి హరియన్నయైన బలభద్రుఁడు రౌద్రము సాహసంబునున్
గలుగఁగ దాసిలోనికి సుకంబుగఁ జేరుచుఁ దాలసత్ఫలం
బులఁ గొనుకోర్కి నెల్లెడలఁ బూర్తిగఁదిర్గి చెలంగి యొక్కెడన్ ౧౨౪

ఉ॥ నల్లనిపట్టుపుట్టముల నాణెముగాఁగటిఁ గట్టి తాళ్ళనుఁ
గొల్లలుగాఁ జెలంగు ఫలకోటులిలంబడ రెండుచేతులన్
బెల్లుగఁబట్టి యూపఁ బృథివీస్థలి నయ్యవిరాల వానిఁ గొం
చ్చల్లసమొంది బొబ్బనిడె నుర్వివణంకఁగ గుండెనీరుగాన్ ౧౨౫

ఉ॥ అంతఁ బతత్ఫలారవము లావనినుండిన కంసమిత్రుఁ డ
త్యంతబలుండు క్రూరుఁడు ఖరాకృతియుక్తుఁడు ధేనుకుండు ఘ
స్రాంతరమందు నిద్రిలు మహాసురుఁ ఢా యనిలేచివించు లో
కాంతకకోపరూపుఁడయి యాబలుఁ గన్గొని దువ్విమీసముల్ ౧౨౬

ఉ॥ చేరుచుఁ బశ్చిమాంఘ్రులను సీరియెదన్ వడిఁగొట్టి సారెకున్
సారెకు గార్ధభస్వనము సల్పుచుఁ బొఱుచుఁ బైకివచ్చుటల్
సీరియుఁగాంచి లీల నొకచే నలదానవపశ్చిమాంఘ్రుల
వ్వారిగఁబట్టి రోసమునఁ బొఱఁగవైచెను దాలశాఖిపై ౧౨౭

చ॥ విసరినవెంటఁ దత్ప్రథుల వృక్షముగూలెను దానిరాపిడిన్
బసచెడి ప్రక్కచెట్టులిల పైఁబడ నద్భుతమయ్యె ధేనుకుం
డసమునఁ దిర్గిలేచి హరిహస్తములంగొని యామడన్ బడన్
విసరె గజంబులాతికరివీఁకను నెట్టినయట్లు భూవరా ! ౧౨౮

చ॥ తదుపరి రౌహిణేయుఁ డలదానవునింగొని త్రిప్పి భూమిపై
సదమదమొందబోఁదె నలసంహతిఁ దద్దనుజుండు శీర్షముం
జదియఁగ సొమ్మసిల్లి తుత్రిటఁజట్టనఁ గ్రిమ్మఱలేచిచూచి దు
ర్మదపరిపూర్తమూర్తియయి మండి మహత్తరతన్మృథంబునన్ ౧౨౯

చ॥ శిరమున నాల్గుకొమ్ములను సృష్టినొనర్చుచు గోపబాలురన్
బోరిఁబోరిఁ గ్రుమ్మి క్రుమ్మి పటుపోకలఁబోయెడువారిఁగాంచి స
త్వరగతి డాయుచున్ బొడిచి బాధలఁబెట్టుచుఁ గొట్టి చట్టనన్
ధరఁబడఁ నెట్టఁగాఁదొడఁగె ధార్మికవర్య! యనంతరంబునన్ ౧౮౦

తే॥ నైకటికులును హరిసఖుల్ నయచణులును దంటలైన సుబలుఁడు శ్రీదాముఁడింక
స్తోకుఁడును నితరులాతని దండగమునుగాంచి పరికరంబులఁగొంచుఁ గదలిరంత

క॥ శ్రీదాముఁడు దండమునన్ బాఁదెను సుబలుండుముష్టి వానిని మొట్టెన్
మోఁదెన్ స్తోకుఁడు ద్రాటను నాదట నంశుండునతని నడుగునఁ దన్నెన్

తే॥ మఱియుఁ దేజస్వినామకోద్ధురబలుండు రహిని నర్ధచంద్రప్రహారముల శాస్త్ర
చోదితంబగు విధమునసలిపి బలిమి వెంటనంటెను మిక్కిలి కంటుతోడ

తే॥ అర్జునుండను గోపకుం డతనిఁ ద్రోసెఁ బాదమున విశాలర్షభబలుఁడు గొట్టె
బంతితోడ వరూథపుఁడతిబలమునఁ దద్దనుజవర్యుఁ బ్రహరించెఁ దత్పరమున

క॥ సావాసంబునఁ జేవను నావెన్నుని మెప్పుఁగాంచి యుండనుగల యా
దేవప్రస్థుండా దుర్భావాన్వితదైత్యు చెంపలన్ వాయించెన్ ౧౮౫

చ॥ పదపడిఁ గృష్ణచంద్రుఁడు నపారబలంబున రెండుచేతులన్
ద్రిదశరిపున్ గ్రహించి సొరిదిన్ బయికెత్తుచు డించి క్రిందికిన్
మదమణగంగఁ ద్రిప్పి పలుమాఱులు నెట్టన గోప్రవర్ధనా
ఖ్యఁదనరు కొండపై విసరెనంతట ధేనుకదానవేంద్రుడున్ ౧౮౬

తే॥ రెండుగడియలు గడఁబట్టి లేచి మఱల మేనుజాడించుకొని హాతిమిళితమైన
మోముఁదుడుచుచుఁబొగరునఁ బూర్ణదీర్ఘ శృంగములఁ గృష్ణుఁగైకొనినింగిజేరె

చ॥ తదుపరి లక్షయామడలు దాఁటినమీఁదట నాతఁడందునన్
గదనము కృష్ణుతోసలుపఁగా నతఁడాతని రెండుచేతుల
న్గదియఁగబట్టి భూమిపయి నాడులు చూర్ణముగాఁగ మూర్ఛిలన్
గొదకొని నెట్టెనంత నలకొంటెయు వెంటనెలేచి కంటునన్ ౧౮౮

ఉ॥ శృంగములన్ హరిన్ బొడిచి చిత్రతరంబుగ గోప్రవర్ధనో
త్తుంగనగంబు మూలములతోడఁ బెకల్చియుఁ గృష్ణునెత్తిపై
ఖంగనవైచెఁ దోడుతనె కంజదళాక్షుఁడు దానిలాగికొం
చంగుగఁ ద్రిగ్గి వానితలయందునఁ ద్రోసెను ధారణీశ్వరా! ౧౮౯

చ॥ మఱల నిశాటుఁడామల సమర్థతఁ గైకొని వేసెఁ గృష్ణుపైఁ
దిరిగి తదబ్జనేత్రుఁడలదివ్యగిరిన్ గొని పూర్వరీతిఁగ
ద్బరశిరమందు వైవ నలపుణ్యజనుండును ద్రిగ్గి కిన్కఁ ద
ద్గిరిఁగొని శౌరిపై విసరి కేరుచు నార్చుచుఁ బాఱి ఱివ్వనన్ ౧౯౦

ఉ॥ హేతిసమస్వశృంగముల నిద్ధబలుల్ బలుఁగ్రుమ్మి పాదసం
ఘాతములన్ హతిన్ సలిపి కంధులు ఘూర్ణిల సర్వనిర్జరుల్
భీతిల భూమిమండలము పెల్లి వశావశలై చెలంగఁ జెం
గూతను వేయ నామునలి కోపపరీతమనస్వియై వెసన్ ౧౯౧

చ॥ గడుసున ధేనుకాసురుని గట్టిగఁ జేతులఁబట్టి భూమిపైఁ
జెడఁబడఁగొట్టి సొమ్మసిలఁజేసి మఱిన్ గొని వజ్రికల్పహా
పిడికిట మొట్ట డమ్మనియె వేల్పులు నందనజాతపుష్పముల్
దడదడఁ జల్లసాగిరిగ ధైర్యపరాక్రమసాహసాంచితా! ౧౯౨

తే॥ మృతకళేబరమందున మేఘమందు మెఱపు నరణిని నగ్ని యాపరునియందు
నఖిలజగములు జనియించునట్టు లొకఁడు వింతగా బైలుదేరి జ్యోత్స్నతోడ.

సీ॥ చామనచాయయుఁ జక్కని పుట్టముల్ పద్మమాలలు చాలఁ బరఁగుచుండ
వేయిచక్రంబుల విరవముల్ దగవేయి ధ్వజములు మిక్కిలి భాసిలంగ
బంగరుసొమ్ముల ప్రభలుమించెడి గొప్పరతనముల్ మిక్కిలి రాజిలంగ
లక్షపార్షదులును లక్షచామరములుఁ బదివేలగుఱ్ఱముల్ వఱలుచుండ

తే॥ దివ్యయోజనవిస్తీర్ణ దేహమొంది స్రగ్వియై మనోయాయియై రౌహిణేయు
హరులకుం బ్రణమిల్లియు నప్పడచట ఘనరథంబెక్కి గోలోకమునకుఁ జనియె

ఉ॥ ఈగతి ధేనుకాసురునిఁ గృష్ణబలుల్ వధియించి తమ్మునా
గోగణగోపకోత్కరమకుంఠితరీతినిఁ బ్రస్తుతింపఁగా
వేగమ వారినింగలిసి వేడుక నిండ్లకుఁజేరసాగిరో
యోగిజనప్రమోదకర యోగ్యచరిత్ర విభూషితప్రభూ! ౧౯౩

క॥ నావుడు జనకుండిటులనె నోవిబుధా! ధేనుకాఖ్యుఁడుత్తమగతి నే
యేవిధిఁజెందెనో తొలిజనిలో వీఁడెవ్వండో దయఁ బలుకుమా! తెలియన్

క॥ అనవుడు నారదముని యిట్లనియెను నోజనకరాజ! యాదిమజని నీ
దనుజుఁడు జరిపిన వృత్తము వినుమా! యనుమానమేల? వినిపింతుఁజుమీ!

## —♦ ధేనుకాసుర పూర్వజన్మ వృత్తాంతము. ♦—

చ॥ ఉలిపి విరోచనాసురకులోద్భవుఁడున్ బలిపుత్రకుండునై
నలిగ వసించు సాహసికనామకుఁడీతఁడు గంధమాదనా
చలమున వాసమున్ సలిపి సమ్మదుఁడై పదివేల లేమల
న్గలిసి మనోజరంగమున నాట్యముసల్పెడికాలమందునన్ ౧౯౪

ఉ॥ భామలనూపురంబులరవంబులు మ్రోయ గుహాంతరంబునన్
నేమముతోడనుండెడి మునిప్రవరుండగు దుర్వాసుఁడు స్వీ
యామితయోగభంగుఁడయి యంఘ్రులఁ బాదుకలన్ ధరించి ని
ర్ధామకృశానురూపమును దాఁకొని యష్టినిఁ గేలఁ బట్టియున్ ౧౯౯

క॥ మీసల మెలియంబెట్టుచు రోసమునన్ వానిడాసి రూక్షోక్తుల నో
వేసరి ! ఖరరూపము నీకీసమయమునందునె ఘటియించుతఁ బలువా !

తే॥ కానిచో నీవు తపమునఁ గ్రాలువాని సన్నుత్యర్థునొనర్తువే నయనములకుఁ
గావరంబెక్కియుండెనే ఖరనిశాట! దుర్వాసుండనియెఱుఁగవే త్రొక్కివిడుతు

క॥ అనవుడు సాహసికుండును విని తన్మునిపాదములను వేవ్రాలి ననున్
వెనరున నా యపరాధములను నోరిచి ప్రోవుమోయిలావిబుధేంద్రా !

ఉ॥ ఈరహిఁ వేఁడ మౌనివరుఁడిట్లనె నాలుగులక్షలేండ్లుగా
భారతవర్షమందలరు పావితమాథురమండలస్థిత
శ్రీరమణీయతాళవనిఁ జెందెడి శౌరిసమేతసీరిత్రోఁ
బోరి నశించి నిక్కముగ ముక్తినిజెందెద వోరియాసురా ! ౨౦౩

తే॥ అటుల ముక్కోపియైన మహాతపస్వి మరల గరుణింప నాదైత్యనరుఁడుగార్ధ
భాకృతింబొంది ధేనుకాహ్వాయముఁదాల్చి యుక్కరులలోన మేటియంచుగ్గడింప

క॥ తాలవనంబునఁ జేరుచుఁ గాలంబును గడుపుచుండి కమలాక్షోక్తిన్
నీలాంబరకరముఖమున నీలిగియటు ముక్తిజెందె నిరవద్యవిభూ ! ౨౦౪

క॥ హరి స్వయముగఁ జంపమికిన్ వరకారణమేది యనినఁ బ్రహ్లాదున కో
"వరచరితా ! నీకులమేతరుణమునన్ జంపననుచు దయవరమిడుచే"

—♦ శ్రీకృష్ణుండు కాళియమర్దనంబుజేయుట. ♦—

చ॥ మఱియొక కాలమందున రమావిభుఁడన్నను రామువీడి త
త్సురభులఁద్రోలుచున్ జెలులతోఁ దగి యట్టి కళిందజాతటం
బరమునఁజొచ్చెఁ దన్నది విషావృతవారులఁగ్రోలి వెంటనే
పరవశతన్ బశుల్ వడియె వ్రాలిరి తద్ధరిమిత్రులద్దరిన్ ౨౦౭

క॥ ఆపుండరీకనేత్రుఁడు గోపాలక గోగణంబు గూలుట గని సం
తాపింపక దయఁబ్రోచెను నాపోఁడిమి విస్తరింతు ననఘా వినుమా ! ౨౦౮

ఉ॥ ఎప్పుడు మిత్రగోప్రతతు లేమియెఱుంగక యందుఁగూలెనో
యప్పుడు శౌరి, వారు గడుపారఁగఁద్రాగిన వారిలో విషం
బొప్పుటగాంచి పుట్టముల నొద్దికఁగట్టుచు నెక్కి నీపమున్
దెప్పునఁ దత్తరంగణినిఁ దేఁకువదూఁకె గుభాలునన్ విభూ ! ౨౦౯

తే॥ తత్పతనమునఁ దన్నద్యుదకముగలతెఁ బాటి నల్లడలందునఁ బర్వె నప్పు
డందుఁగల కాళియాహిగృహంబు నాశనంబుగాఁ దొడంగెను తత్పరంబునందు
ఆ॥ కాళియోరగుండు గనలుచు పంచభోగముల విప్పి విషముఁ గ్రక్కి యక్క
మలనయనుని డాసి యలఘుదంష్ట్రిలతోడఁ గొఱికి బాహువులను నెఱిగఁ గప్పె

ఉ॥ అంత ఘనాఘనాభుఁడు నిజాపఘనంబు ఘనంబొనర్చి య
త్యంతబలంబుతోడ నలవ్యాళముకప్పును ద్రుల్చి కేలఁ బు
చ్ఛాంతముఁబట్టి గిర్గురున నౌర! యహా! యనఁ ద్రిప్పిత్రిప్పి యా
వంతను ద్రొక్కి శాతశతబాణములన్ బఱపెన్ నరేశ్వరా! ౨౧౨

ఉ॥ అవలఁ గాళియుండును భయంబును గొల్పుచుఁ దిర్గి వేఁగి యా
శ్రీవిభు వామహస్తముఁ గసిన్ గ్రహియించె ననంతరంబునం
దావనజేక్షణుండు గుడిహస్తముతోఁ దనుపీడ దానినిన్
జీవనుగొట్టి తార్క్ష్యవలెఁ జేకొని యేఁచుచుఁదోసెఁ దన్నదిన్ ౨౧౩

చ॥ పదపడి తద్భుజంగపతి పంతముతోఁ జనుదెంచి క్రూరమే
శు దరికినేగ నాఘనుఁడు సూచి రయంబున దానివాలమున్
విదిలిచి త్రోసి రోసమున భీమనిశాతశతాశుగంబులన్
గొదకొని వైన నాతఁడును గొంకక క్రిమ్మఱి నమ్మహాత్మునిన్ ౨౧౪

ఉ॥ దాయుచుఁ గోఱలన్ గఱచి ధావనమొత్తెడిలోన నట్టి నా
రాయణమూర్తి పూర్ణబలరాజితుఁడై యల కాళియాహి నా
హా! యనఁ జేతఁబట్టి తనయాయతముష్టిని మొత్తె దానిచే
నా యురగంబు తన్నిమిషమందునఁ దాళక పొందిసొమ్మనున్ ౨౧౫

తే॥ పంచమొగములఁ గ్రిందికివంచి తనకు నభిముఖంబుగఁబడుట బ్రహ్మాండనాయ
కుఁడగుహరి, గాంచి తన్మణికోటిరుచిరఫణములం దెక్కి మురళినిఁబట్టె నంత

ఉ॥ నాటకరంగమం దలరు నర్తకుడై వడివేషమున్ జగ
న్నాటకసూత్రధారి హరి నవ్యవిధంబునఁదాల్చి సుస్వరం
బాట లయల్ సెలంగ విబుధావళి మెచ్చుచుఁ బుష్పవర్షమే
లోటునులేనటుల్ గురియ లోలుభతన్ గడుఁబాడె వంశితోన్ ౨౧౬

చ॥ మరియును మాధవుం డటుల మాధురిగానముఁజేయు పట్టులన్
సురుచిరతాండవోత్సవ వినూత్నమనోజ్ఞమహానటాభుఁడై
స్వరలయరాగయుక్తగతిఁ బాదములల్లన వేసి భోగముల్
చిరమర జేయనచ్చెలువ చెల్వాలు వల్వాల నశ్రులొత్తుచున్ ౨౧౭

## — కాళియపత్నులు శ్రీకృష్ణుని నుతించుట. —

క॥ చని యల హరిపదములఁ బడి వినవే చెవియొగ్గి మాదు విన్నపము దయన్
గనవే చల్లనిచూపునఁ గొనవే మావందనముల గోపాలమణీ! ౨౧౯

క॥ విన్నారము నీమహిమముఁ గన్నారము గన్నులారఁ గరుణాభరణా!
యున్నారము నీకృపకై యన్నారము మమ్ముఁ గావుమని జగదీశా! ౨౨౦

క॥ ఘననిభ! యభయశుభప్రద! వనమాలీ! కనకచేల! వంశీలోలా!
వనజాతపత్రలోచన! వనజాసన మదనజనక! వననిధిశయనా! ౨౨౧

ఉ॥ జిష్ణుముఖామరవ్రతతి సేవ్యపదాంబుజ! యంబుజోదరా!
జిష్ణుముఖస్వబంధుహిత శేఖరపోషక! కౌస్తుభాదిరో
చిష్ణు! యలంకరిష్ణు! బహుచిత్రచరిత్రమనోజ్ఞ! ప్రాజ్ఞ! శ్రీ
కృష్ణ! కృపామతిం గనవె యీవిఁక బ్రోవవె మమ్ము మాపతిన్ ౨౨౨

ఉ॥ చూచితి మాత్రిలోకములఁ జూచితి మేడుసముద్రముల్మఱిన్
జూచితి మేడుకొండలను జూచితి మెల్లధునీవతంసముల్
జూచితి మెల్లచోట్ల జితసూర్యకనద్ద్యుతి! నీవు దప్ప నే
ర్బ్రోచెడివారు లేరు సుమి ప్రోవుమ! మాపతియైన కాళియున్ ౨౨౩

క॥ పతిభిక్ష మాకుఁ బెట్టుచు ద్రుతమున రక్షింపుమయ్య ద్రుహిణాండసమా
హితవిపులోదర! యని సంస్తుతిఁ జేసిరి కాళియుండు సూచి నతుండై ౨౨౪

ఉ॥ పాపుఁడ పాపసంభవుఁడ బాపకృతిప్రచయప్రవీణుఁడన్
బాపమనస్కుఁడన్ దురితవారకతావక దివ్యపాదప
ద్మాపితచిత్తసత్తమచయామితశత్రుఁడనైన నన్నెటో
నీపదపద్మభృంగముగ నెమ్మిని సల్పుము భక్తకల్పమా ౨౨౫

క॥ దీనజనావనతత్పర! నానేరము క్షమించి రక్షణము సేయుము! రా
ధానాయక! యని వేఁడఁగ నానలినాక్షుండు వల్కె ననుకంపనిటుల్ ౨౨౬

తే॥ కాళియాహ్వాయభోగీంద్ర! కౌతుకమున మిత్రపుత్రకళత్ర సమేతుఁడవయి
లెమ్ము రమణకద్వీపంబుఁ బొమ్ము నీకు నెట్టిలోపంబు లేదని యెఱుఁగుమందు

ఉ॥ తత్పతగేంద్రబాధ లటఁ దప్పకకల్గునటంచు నెంచెదో
తత్పరితాపమొందకుము తద్బలి, త్వద్వనితాస్తవోల్ల స
న్మత్పదపద్మలాంఛన సమంచితమంచుఁ దలంచి మెచ్చి యా
పత్పథమందుఁ ద్రోయఁడని భావమునందున నమ్ముమో ఫణీ! ౨౨౭

ఉ॥ అంతటఁ గాళియోరగము నాహరికిన్ గిడిగిల్లోనర్చి వే
కాంతలు బంధువుల్ మొదలుగాఁగలవారలఁగూడి యల్ల ద్వీ
పాంతరమొందె నంత ఫణియందు ముకుందుఁడు సిక్కుకొన్న వృ
త్తాంతమువిన్న నందముఖతద్వ్రజవాసులు సద్విలాసతోన్ ౨౨౯

వ॥ ఆబాలకృష్ణుం డున్న ప్రదేశంబునకరిగి తద్యమునాతరంగిణీ నిర్గతుండై యద్దరిపై పెద్దనిద్దురవోయిన చెలికాండ్రను లేపి ముద్దుమొగమునం జిఱునగవొప్ప నవ్వారితోఁగూడి ముచ్చటాడుచు వచ్చెడి నచ్చిన్ని వెన్నునిం గన్నులపండువగాఁ గాంచి, హర్షించి, కౌఁగిలించి, చుంబించికొనిరి. వెండియు నందుండును, దత్సుందరియుఁ, దమ నందనునకభయశుభవిభవంబులు లాభింపఁ బరమానందంబులో భూబృందారకబృందంబునకు వందనపూర్వకంబుగా ననేకదానంబులొనర్చిరి. అంత నిజవక్షోజంబులం దక్షీణంబుగా క్షీరంబుస్రవింప యశోదాదేవియు, ౨౩౦

చ॥ హరిఁగొని ముద్దువెట్టుకొని హర్షముఁబొందెను నెల్లవేలు న
య్యరగడుహోయిగా విసర నక్కలిఁదీర్చుకొనంగఁ దన్నదీ
పరిసరమందుఁ దామసిని బాగుగనిద్దురవోవసాగిరా
త్మరమణులున్ సుతుల్, సఖులు దమ్ముననుజట్టి శయింప నంతటన్ ౨౩౧

—♦ శ్రీకృష్ణుండు దావాగ్నిపానం బొనర్చుట. ♦—

చ॥ నడినిసి వేణుఘర్షణమునన్ జనియించిన కారుచిచ్చు బ
ల్విడిఁ బ్రలయాగ్నితుల్యమయి పండిన గోపకులన్ దహింప రా
నడలుచుఁ జూచి వారలు నిరాశ్రయులై బలరామయుక్తకృ
ష్ణుఁడుగలచోటికేగి పలుజోతములం బొనరించి భక్తితోన్ ౨౩౨

తే॥ కృష్ణ! శ్రీకృష్ణ! మమ్ములఁ దృష్ణతోడఁ గావుమియ్యదె కార్చిచ్చుకనులుమిఱులు
సెందునట్టుల వచ్చెడిఁ బొందులివిగొ పోవుచున్నవి దేవరా ప్రోవుమయ్య!

చ॥ అనఁగ సరోజలోచనుఁ డఘావళితూలధనంజయుండు జి
ష్ణుఁడు బరాత్పరుండు నరిదారణధీరుఁ డుదారుఁడాదితే
యనుతుఁడునైన కృష్ణుఁడు తదార్తులఁగన్గొని గోపులార! యిం
కను భయమొందఁబోకుఁ డిదిగ్రిచ్చుఱ నార్పెద మూయుఁడీకనుల్ ౨౩౪

తే॥ అనుచుఁ గ్రమముగ దాయుదావాగ్నినోటమ్రింగెనందాదిగోపకుల్ మిగులవింత
నొంది ప్రొద్దునమేల్కాంచి యూరికేగసాగిరో మిథిలేశ్వర! జనకరాజ!

క॥ అని వచియింపఁగ ఱేఁడును విని వింతలఁబొంది మరల విననుత్సాహం
బును జూపుచు నారదమునిఘనునకు వాక్రువ్వఁదొడఁగెఁ గౌతుకమతితోన్

చ॥ ఎవనిపదాబ్జయుగ్మరజ మీపదునాల్గు జగంబులందు జ్ఞా
నవిభవవృద్ధులెన్నొ జననంబుల నెత్తియుఁ జెందలేక మా
నవిరతులైరొ యట్టి చరణంబులె యుత్తజిగాళియూహిపై
నివెలిఁగెఁ జూడఁ దత్క్రియలు నివ్వెఱపాటునుగల్గఁజేయవే ? ౨౩౭

క॥ ఈయురగేంద్రుఁడు ప్రాజ్ఞని నేయేకీతులఁ జెలంగ నెఱిఁగింపుమ ధీ
రా ! యన నాముని యీతఁడు స్వాయంభువకాలగభృగువంశభవుండై

తే॥ వేదశిరుఁడను పేరొంది పెరిగి వింధ్యయనెడి పర్వతరాజంబునందు నెక్కి
నిశ్చలంబుగఁ దపమును నియతితోడ జనులులేనట్టిచోటున సల్పుతఱిని

—♦ కాకభుశుండిముని కథ. ♦—

ఆ॥ తపముఁజేయ నొక్కతబిసి యశ్వశిరస్కుఁడుండునట్టివింధ్య ముచితమంచు
నెంచి యేగుదెంచ నెక్కతంబుననొ పావకసమేక్షణములఁ జఱపి నెఱిఁగ

చ॥ తపమును జేయఁగా నిచటఁ దావుఘటిల్లదు పోయిలేదు నా
దుపలుకులఁ గ్రహించి చను తోడ్తనె వేఱుస్థలంబు నీబృహ
త్తపమునకై కనుంగొనుము తర్లము నిల్వకు మిందనంగ నా
తపసియు నిట్లువాకొనియెఁ దావకృశానుసమాననేత్రుఁడై ౨౪౧

చ॥ ఇది పరమేశుభూమిగద యెవ్వరిపెత్తనమేమిలేదె యిం
దిదినఱకెందఱోమును లహీనతపంబొనరింపరే ? యిటఁ
గుదిరి తపంబునేసలుపు కోర్కినివచ్చితి నింతమాత్రకే
పదరుచు నాపయిఁ బుసలఁబర్వెడి సర్పముమాడ్కి వత్తువే ? ౨౪౨

ఉ॥ వచ్చితి వక్కతంబున సుపర్ణభయంబుఘటింపఁ బాముపై
క్రిచ్చఱఁబొమ్ము పిమ్మట నఖండుఁడు వేదశిరస్కుడోరి ? పె
న్మచ్చరి నీయభీష్ట మసమంజసమించుక కింతఁజేసెదే ?
చొచ్చి క్రియార్థివై యిచట సూటులఁ బోటుల మాటలాడెదే ? ౨౪౩

ఉ॥ కావునఁ గాపుకావనెడి కాకివిగమ్మనె నంత నిద్దరున్
జేవచెడన్ వెతన్బడుచు శ్రీహరిదిక్కని నమ్మియుండ రా
ధావిభుఁడేగుదెంచి యలతాపసులన్గని ప్రీతిపూర్వకో
క్త్యావళి నూఱడించి ముదమందఁగ నిర్వురకిట్లువాకొనెఁ ౨౪౪

ఉ॥ ఏమి పరస్పరంబిటుల నిప్పుడు శాపములిచ్చుకొంటి రా
హా ! మితిమీఱు కోపమునునందుట మానుల కర్హమొకొ ? మీ
రీమెయి శాంతిఁబొందుఁడిఁక నిర్వురు మత్ప్రియభక్తులౌట మీ
సేమముఁగోరి వచ్చితిని జెప్పెడినానుడు లాలకింపుఁడీ ! ౨౪౫

ఉ॥ నానుడి రిత్తసేయ యతనంబునుజేసెదఁగాని భక్తసం
తానవచస్సమూహ మనృతంబుగసల్పను నిద్ది నాప్రతి
జ్ఞానియమంబు మత్పదము జక్కఁగ వేదశిరస్క! సీతలన్
బూనిచి ముక్తిజేసెదను బుల్గులఁజేని భయంబుబాయగాన్ ౨౪౬

ఉ॥ ఆకులమొందఁబోకుమిఁక నశ్వశిరస్క! వినుండు నానుడుల్
గాకత నీవుసెందినను గారుణికంబున జ్ఞానమిత్తుఁ ద
త్పాకవికారకార్యములు గ్రొలవు నీయెడ నయ్యెడన్ మహా
ప్రాకటశుద్ధమత్త్వలిని రాజిలనుందువు నిక్కనంబునూ ౨౪౭

తే॥ ఇట్లు కరుణించి శ్రీహరి యేగె నవల, నశ్వశిరుఁడు నీలాద్రిని నాత్మఘోష
మగుచుజ్ఞానియై రామభక్త్యంచితుఁడయిశ్రద్ధ రామాయణంబును జదువుచుండి

ఆ॥ గరుడుఁ డొక్కయెడనుఁగాంక్షింపఁ దత్పుణ్య పుస్తకభావంబు బోధపరచి
తపముఁజేయసాగెఁ దాదాత్మ్యభావంబుతోడ జనకరాజ! త్రోసిచింత

—♦ కాళియ వ్యాళోపాఖ్యానము. ♦—

తే॥ ఇఁకను వేదశిరోవార్త నీవు వినుమ! రహిని జాక్షుషమన్వంతరంబునందు
నల్ల దక్షప్రజాపతి యాత్మసుతుల బదునొకండ్రను దక్కశ్యపమునికిచ్చె

తే॥ అల్ల వ్రజమందు వసుదేవునాలియగుచు హలిసిఁగనినట్టి రోహిణి, యట్టిసుతల
యందునన్ గద్రువయనంగ నలరి కోట్లకొలఁదిఁ జిలువలన్ గాంచెను గోర్కెదీర

ఆ॥ అట్టి కాద్రవేయులందు హాలాహల కలితములును రత్నలలితములును
నమలపంచశతఫణాంచితములునైన పన్నగములు కొన్ని వజలు మఱియు

తే॥ విషధరములును శతఫణాన్వితములు మణిగణమనోజ్ఞములైననాగములుగొన్ని
గలవు తద్వేదశిరసుఁడీచిలువలందుఁ గాళియాఖ్యను మేటియై క్రాలె నవల

ఆ॥ ఎల్లసర్పములకు నల్లశేషుఁడు నాథుఁడయ్యె నతఁడె యచ్యుతాగ్రజుఁడన
రాముఁడనఁగ రోహిణీమహిళఁ బుట్టె వెండి యింతకుఁ దొలివిషయమువిను

చ॥ ఒకసమయంబునందునఁ బయోరుహనాభుఁడు పద్మనేత్రుఁడున్
బ్రకృతిపరుండు విష్ణుఁ డలపన్నగనాథునిఁగాంచి యిట్లనెన్
సకలజనోపకారముగ సర్వజగత్పృథుభారమున్ దల
న్దికమకలేక మోయుటకు నీవె సమర్థుఁడవో ఫణీశ్వరా! ౨౫౫

తే॥ ఈవు దప్పిన వేఱువారెందులేరు కాన నాయాజ్ఞనిది మోయఁగదఁగుమయ్య!
యంతులేనట్టి బలము నీకలరుటను ననంతుఁడను పేరుగల్గె ఫణాధరేంద్ర!

చ॥ అనవుడు శేషుఁడిట్లనియె నచ్యుత ! నాకిది సంకటంబె మై
నను భవదాజ్ఞ భూభరము నాతలఁ దాలుతుఁగాని యెంతదాఁ
కనో యెటు మోయుదునో; యది యంతయుఁ బూసను గ్రుచ్చినట్లుగాఁ
గనికరముంచి నాకుఁ బలుకఁగ్ నినువేఁడెద లోకనాయకా ! ౨౫౭

ఉ॥ అంత ననంతశాయియు ననంతఫణీశ్వర ! నీవచస్సులన్
జింతదొలంగె సంతసముఁజెందితి నీవిఁక మద్గుణంబు ల
త్యంతముఁదెల్పు పేరుల సహస్రముఖంబుల వేఱువేఱుగా
సంతతముచ్చరించుచు రసాధురమున్ దలమోయుచుండుమా ! ౨౫౮

క॥ ఎప్పుడు నానామములుఁగ్ జప్పగనై పోవునో రసాభరము న్నీ
వప్పుడు వీడుము శేషా ! యొప్పును నీకదియు, నాకు నూరీకృతమా ౨౫౯

వ॥ అంత శేషుం డురరీకరించి తిరిగి శ్రీహరి కిట్లనియె. ౨౬౦

క॥ ఆధేయంబుల కెల్లను నాధారుఁడనగుదుఁగాని యాధారుఁడ నా
నా ధురమున కేధీరుం డాధారుండగు వచింపుమయ్య రమేశా ! ౨౬౧

ఉ॥ నావుడు దేవకీసుతుఁడు నాగకులేశ్వర ! నేను కూర్మమై
చేవను నిన్ను మోసెదను జెందకు మిందున సందియంబునున్
గావునఁ బొమ్మటంచుఁ బలుకఁగ్ భుజగేంద్రుఁడు లేచి భక్తితో
శ్రీవిభు మ్రొక్కి పూజల విశేషముగాఁబొనరించి వెంటనే ౨౬౨

తే॥ లక్షయోజనముల క్రింద లలిని వెలుఁగుచుండు పాతాళలోకంబునొంది బహుళ
భువనమండలభారంబుఁ బూని చేతఁ దలనుబెట్టుకొనెన్ జండబలముతోడ

తే॥ ఆదిశేషుఁడు పాతాళమరిగినపుడు సర్వఫణులు జనుదెంచి సత్వరగతి
బ్రహ్మయాజ్ఞను సేవించి భక్తితోడఁ దత్ఫణీంద్రాజ్ఞఁగొని యోలిఁదరలియచట

వ॥ కొన్ని యతలంబునకుఁ, గొన్ని వితలంబునకునుఁ, గొన్ని సుతలంబున కును, గొన్ని తలాతలంబునకుం, గొన్ని పాతాళంబునకుం, గొన్ని రసాతలంబునకుఁ జనె. అందు రసాతలమందునుండు రమణకద్వీపంబా కాళియాదివ్యాళంబుల కునికిపట్టుగాఁ జెలంగుఁగాదె. వెండియు నేమి వినవలతువో తెల్పుమన నా బహు లాశ్వుండు మునీశ్వరా ! ఇతరసర్పంబులకు లేని భీతి యా రసాతలాంతర్భాత రమ ణక ద్వీపస్థిత కాళియదీర్ఘ పృష్ఠంబున కేలగలిగెనో యానతిండని వేఁడ దేవమునీంద్రుం డా రాజేంద్రునితో నిట్లనియె. ౨౬౫

క॥ గరుడుం డల ద్వీపమునన్ విరివిగ ఫణులుండునంచు విని చని కని యా
యురగంబులఁ బ్రతిదినమును గరుణను విడి కుడువఁదొడఁగెఁ గడుపార సుధీ !

తే॥ స్వార్థపరుఁడయి యటు దమ్ముఁ జంపుచుంటఁ
గాంచి యచ్చటి యెల్లనాగములు గుమిగఁ
జేరి యోజించి యాతని చెంతకేగి
వందనమ్ములఁ గావించి భయముతోడ ౨౬౮

మ॥ గరుడీ! గాలినిమేసి మూలల నెటో కాల్వోన్నమమ్మిట్లు త
త్కరుణాసాగరకృష్ణవాహనమవున్ ధ్వాన్తాత్మభక్తుండవున్
వరకాయుండవు పక్షినాథుఁడవునై బాధించుటల్ నీకుఁ బెం
పరువా? పాడియ? పద్ధియా? సుకృతమా? పల్కంగదే ధీనిధీ! ౨౬౯

తే॥ స్వార్థపరతమిాబోఁటి ధీశాలురకును నున్న-చోనెల్లలోకంబు లొక్కసారి
ధ్వంసమైపోవె కావవే! పరమకరుణ నక్కరణిఁగాని-చోవిను మొక్కమాట.

చ॥ ప్రతిదినమిట్లు మమ్ములను బట్టిగ్రసింపకయున్న మేము స
మ్మతిఁ బ్రతిమాసమందునను మాంసవనస్పతిశోణితాన్నసం
యుతముగ నొక్కసర్పమును నున్కలచాలుగ మీాకు నిత్తు మీా
వితమున నొప్పిప్రోవుమని వేడఁగఁదార్క్ష్యుఁడు వల్కెనిట్టులన్ ౨౭౦

ఉ॥ ఒప్పితిఁగాన మీారలిఁక నున్కలచాలుగ మాసమాసముల్
సర్పముఁగొంచు నాకడకుఁ జిక్కఁగవచ్చిన లెస్సయామతిన్
దప్పిననష్టపూర్తికయి నామది నచ్చినయట్లుమిమ్ము నే
నుప్పన చప్పనల్ గనక యూరక మెక్కెదనంచు నమ్ముఁడీ! ౨౭౧

తే॥ ఇట్టి తీర్మానముభయులు నేర్పడంగఁ జేసికొనిరంత ఫణులును జెప్పినట్టు
లిండ్లచాలుగ బలులిడు చెదలవెఱపు విడిచియుండిరి పిమ్మట వినుముభూప!

తే॥ క్రమముగానిండ్లవరుసను గాళియాహి సద్మమునకట్టి యేర్పాటు సంభవింప
నతఁడు తా మేటి యనినిక్క చందఱివలె బలినిఁగొని యేగకుండె నా పట్టునందు

మ॥ వినతాపుత్రకుఁడట్టి గొప్పబలికై వీక్షించి వీక్షించి క్రి
క్కునఁ గాలోగ్రసమానుఁడై యరిగి యాకుంభీనసశ్రేష్ఠుపై
ఘనపాదంబులు సంచలించునటులన్ గావించె నద్దానికా
యనిలాహారి సహింపలేక పడి మూర్ఛాక్రాంతుఁడై క్రిమ్మఱన్ ౨౭౨

చ॥ తెలివిని లేచి బుస్సలను దీక్ష్ణవిధంబునఁ గొట్టినాల్కలన్
బులుఁగులతేని నాకి తన భోగశతంబును విప్పి కోఱలన్
బలుమఱుఁగంటుతోఁ గఱవఁ బక్షివిభుండును దానిఁబట్టి తె
క్కలఁగడు బాఁది తుండమునఁ గైకొని మేదిని మోఁదె భూధవా! ౨౭౩

చ॥ బరువడిఁ గాళియోరగము పట్టఁగరానిమహోగ్రహంబునన్
గరుడుని నిట్టుల్గవిసి కాననికైవడి తార్క్ష్య నాసికన్
ద్వారగతిత్రోడఁ దప్పకొని తత్పదయుగ్మము నట్టె చుట్టుడున్
బోరిఁబోరిఁబీకి క్ష్వేళమును మోములఁగార్చుచు లాగె ఱెక్కలన్ ౨౮౬

ఆ॥ అపుడు గరుడి ఱెక్కలందు మయూరకనీలకంఠములును నోలిఁబుట్టె
నాశ్వయుజమునందు నాడిపక్షదశమి వాని దర్శనంబు భద్రకరము ౨౮౭

ఉ॥ పిమ్మట వైనతేయుఁ డతిభీకరలోచనుఁడౌచుఁ దీక్ష్ణతుం
డమ్మునఁ గాళియున్ గొని తటాలున నేలను గూలఁగొట్టి దే
హమ్మును జీల్పఁబూనుతఱి నాఫణిగన్గొని యాగసంచుఁ బా
దమ్ముకొలందిఁ బాఱె నల తార్క్ష్యుఁడు సైతము వెంటనంటఁగాన్ ౨౮౮

చ॥ క్రమముగ నాపృదాకు వటుఖండము లేడును గొప్పవైన గ్రా
వములను సాగరంబులను వాఁకల దీవుల దివ్యసప్తలో
కములను జొచ్చిచొచ్చి యటఁగ్రాలెడివారల వేఁడివేఁడి పృ
ష్ఠమున ఖగేశ్వరుం డగుపడంగ భయంబునుబొంది టక్కునన్ ౨౮౯

చ॥ మరల నధోజగంబున కమందగతిన్ జని యేరిఁ గోరినన్
హరిభయమిందుఁ గల్గునని యందఱు నూరకయుంటఁగాంచి యా
పరముఁడు దేవవంద్యుఁడును వ్యాళవిభుండును నైన శేషుఁ డ
గ్గరివినుతించి మ్రొక్కితమిఁ గద్గదవాణిని వేఁడె నిట్టులన్ ౨౯౦

ఉ॥ దోషమదేభకేసరివి తోయజలోచనశయ్య వుర్విసం
తోషకృతిప్రవీణుఁడవు ధూతవిరోధివి సర్పరాజ వో
శేష! ఖగేశ్వరుండిపుడు చెండఁగవచ్చెడిఁ గాళియాఖ్యు న
న్బోషణ మెంతయున్ సలిపి పుణ్యముఁగైకొను మోకృపానిధీ! ౨౯౧

మ॥ అని ప్రార్థింపఁగ శేషుఁడిట్లనియె నోవ్యాళేశ్వరా! నానుడుల్
వినుమా! యిచ్చటఁ జుట్టుపక్కలను నిశ్చితిన్ విడన్ బ్రోవఁగా
మొనకాండ్రెవ్వరు లేరటంచు మదిలో ముమ్మాటికిన్నమ్ము మై
నను నీపై నిదయన్ రహస్యమగు స్థానంబున్ వచింతున్ జుమీ! ౨౯౨

తే॥ మునుపు సౌభరియను మునిఘనుఁ డొకండు
యమునదరినున్న బృందావనాంతరమున
నయుతవత్సరముల్ దాఁటునటుఁ దపము
జలమునందున నిలుచుండి సలుపుచుండె ౨౯౩

ఉ॥ ఆతఱి నజ్జలంబుల ఝషాధిపచర్యను గాంచి మౌని సం
ప్రీతినిబొంది డెందమునఁ బెల్లుగృహస్థ్యప్రహయాళుఁడౌచు మాం
ధాతృసుతాశతంబును యథావిధిఁ జేకొని శ్రీశుసద్దయన్
భూతినిఁబొంది మౌను ముదముంగన హాయిగ నుండెవారితోన్. ౨౮౪

అ॥ అంతఁ గొంతకాలమగుడు తత్సౌభరి మౌనివర్యుఁడచలమానసమునఁ
దపముఁ జేయఁదలఁచి తన్మునాశైవలినికిఁబోయి దాని వనమునందు ౨౮౫

చ॥ తపనునిఁబోలి తేజమునఁ దన్నవబంధవిముక్తికోసమై
తపమొనరింపఁగా నిలిచి తత్ఖగనాథుఁడు స్వచ్ఛనంబులన్
దపతపకొట్టుచుండఁ దనదాఁపున మ్రాలి చరించు సన్మీనా
నపతిని మ్రింగుటన్ ఝషగణంబులు దానికిఁ గుందుచుండుటన్ ౨౮౬

చ॥ కని కడుఁ గ్రుద్ధుఁడై విహగకాంతునిఁ గన్గొని యోరిధూర్త! హా
రినిఁగనవున్ గ్రసించి పరరీతుల జోలికిఁబోని మీననా
థుని వృథ మ్రింగియుంటి విదిదూష్యముగాదొకో? హింస కంసయే?
చనుమిఁక దీని మెట్టితివొ చచ్చెదవంచు శపించె నందునన్ ౨౮౭

చ॥ గరుడుఁడు సొచ్చ నేరఁడటఁ గావునఁ గాళియనాగ! నీవు స
త్వరగతితోడ సార్థసుతభార్యుఁడవై చని తత్కళిందజాం
తరముననుండుమా పిదపఁ దత్ఫణి మూరహి ధైర్యమొప్పఁగా
నురవడిఁబోయి తద్యముననున్కినొనర్చె విదేహనాయకా! ౨౮౮

ఆ॥ ఇటులఁగాళియుఁడు ఖగేంద్రునకాడిన పలుకు నంగవించి భయమెకాక
ప్రాణవిశయమొందెఁ బరికింప "సత్యమేవజయతి" యనుపల్కు వట్టిదగునె?

తే॥ అంతఁ గృష్ణుడు యమునాపగాంతికంబుఁ జొచ్చినప్పుడు తద్దండశూకమదము
నుడిపి కరుణించి యాదీవి నడలులేని వరమొసంగుచుఁ గ్రమ్మఱఁబనిపెజనక!

క॥ కాలియమర్దనకథయిది పాలసులేన్వినిన మిగులఁ బావనులై గో
పాలునిఁజూతురు మఱి భూపాలక! నీవేమి వినఁగ వలతువొ చెపుమా!

చ॥ అటుపయి భూపుఁడిట్లనె సురాళిసుధన్ గడుపారఁ గ్రోలియున్
జటులవిలాసలోలలగు చానలమోవినిఁ గోరునట్లు ము
చ్చటగల తేంట్లు మత్తకరిసంతతిదానముఁ ద్రాగి పద్మమె
చ్చటయని కోరుమాడ్కి హరి సత్కథఁ గోరరె? భక్తులో మునీ! ౨౯౨

ఉ॥ కావున శ్రీరమావిభుని గాథల నింకొక గాథఁ దెల్పవే!
యీవజకీరు రాధయను నింతిఁ దమిన్ శిశువున్ బరేశుఁడౌ
దేవకినందనుంగొని శ్రుతిస్థితపద్ధతిఁ బెండ్లియాడి బృం
దావనిలో విహారమును దద్దయు నొంటిగఁజేయ వెంటనే ౨౯౩

చ॥ హరిదమి నామెత్తో విడువు మూర్తి భవిష్యమునందునీకు నే
వరునిగనుండి రాసములఁ బల్మఱొనర్తునటంచుఁబల్కె నం
చరుసముతో వచించితివె! యావిషయంబుల నానుపూర్విగాఁ
గరముగ నిప్డుసెప్పవె? యకారణకారుణికత్వమేర్పడన్ ౨౯౪

## — శ్రీరాధాకృష్ణ ప్రీతి వర్ణనము —

చ॥ అనవుడు నారదుండు మిథిలావనినాథున కిట్లువాకొనెన్
జనకనరేంద్ర! ప్రశ్నబహుసమ్మతమై శుభదంబు నయ్యెడిన్
ఘనము త్రిలోకదుర్లభముగాదె రమాదయితామనోభిరా
మునికత నీవు విన్మమనముం బెఱపోకలఁ బోవనీకయే ౨౯౫

మ॥ జలజాక్షుం డొకనాఁడు బింబతులితోష్ఠంబుచు నందంబుగాఁ
గలనాదాంచితవంశినింబూనిపి సంగాతంబుతోఁదర్గు నె
చ్చెలులన్ గూడుచుఁ బాడుచున్ నగుచు గోశ్రేణిన్ దమిన్ద్రోలు చా
జలజాతాప్తసుతాతటిన్ జనె విరాజన్మూర్తి కాముండనన్ ౨౯౬

తే॥ అతఁడుఁబోయినబాటల నలరు జనపదముల వృషభానుపురమునఁ దద్దవెలుఁగు
వెలఁదులందఱు దమిఁబొంది వింతనొంది తాళఁజాలక నేలపై వ్రాలిరయ్య.

ఆ॥ అట్టి నందసుతుని యాకృతిప్రతిభాది విషయములను సరిగ వినిన కనిన
రాధ నెచ్చెలులును రమణీయగాత్రిలుసగు విశాఖ,లలిత లాతురమున ౨౯౮

చ॥ చిలుకలముద్దుపల్కులును జిందముచందము మీఱునట్టు ద
మ్ములకెనయైన కన్గవయు బున్నసుధాకరతుల్యవక్త్రముల్
దళతళలాడు మించువలెఁ దద్దవెలింగెడి మేను బెళ్కు కు
లుకులుగల రాధికాంగనను గొంకకచేరి వచించి రిట్టులన్. ౨౯౯

మ॥ నవలామిన్నరో! మానుడుల్ వినుము విన్నాణంబుగానేఁడు త
న్నవలీలారతుఁడైన కృష్ణుఁడు దివానాథాత్మజాతీరమున్
నవకందర్పుఁ డనంగ సాగి మురళీనాదంబు వొల్పార ధే
నువృషశ్రేణులఁ ద్రోలుచున్ జనె నిచే నోరూర నవ్వారిగాన్ 300

ఉ॥ తేఁటులదాఁటునెక్కురులు దేనియలొల్కెడిమోవి బంగరున్
మీఱెడివల్వ లబ్జములమించుకనుంగవ నిండుచందురున్
మూఱెడినవ్వునెమ్మొగము మల్లియమొగ్గలగేరు దంతముల్
వాటపుచూపులున్ గలిగి వాఁడలరుంగద! ముద్దుగుమ్మరో! 30౧

సీ॥ ముఖముఁజూపించెనా పుణ్యంబుసేకూరుఁ గన్నెత్తిచూచెనా కలుగుమేలు
పక్కన నవ్వెనా పండువెన్నెలగాయుఁ గలిసిమాటాడెనా కలుగుఁజెలిమి
వేణువు నూఁదెనా విశ్వంబుమాఱ్పడు డాసెనా మదనుండు డాయుచుండుఁ
గరముఁజేపట్టెనా కంతుకాఁకలుదీరుఁ గోపించెనా వైరికోటిగూలు

తే॥ కరుణఁబలికిన మోక్షంబు గల్గుఁగాదె యామహాత్ముండు నీహృదయంబునందుఁ
దలఁచుచుండినవాఁడెకా జలజనేత్ర, పాదపంకజయుగసక్త బంభరంబ! 30౨

ఉ॥ వేకువ బాలురంగలిసి వేడుకపాటలఁ బాడుచుఀ జగ
చ్ఛ్రీకరగోసమూహములఁ జేర్చుచు లీలగఁ ద్రోలుచున్ మనో
జాకృతివచ్చు నాహరియె యప్పుఁడు నమ్మఁడు దర్శనీయుఁడో
హాకమలాక్షి! యన్నవిని యుబ్బుచు రాధ వచించె నిట్టులన్ 303

క॥ చెలులారా! మీరిప్పుడు పలికిన ఘనురూపునిందు బ్రాయుఁడు కని యా
వల నాతనిఁ దెలిపెదనని పలుకఁగ నాచెలులు నేర్పుబలిమినిఁగమ్మన్ 30౪

ఉ॥ నందకుమారసౌష్ఠవఘనప్రతిమన్ విలిఖించి యామె కా
నందముతోనొసంగ నల నవ్యలతాంగియు దానినిం గరం
బందుఘటించి కాంచి కనులార మఱిన్ మనసారఁగోరి వీని నే
మందు మనోహరుండనియె యందును బొందెదఁగాక తొందరన్ 30౫

చ॥ అని మనమందునం దలఁచి యట్లనెచూచుచు మోహవారిధిన్
మునిఁగెననంగఁ గూరుకును బొందె యదాటున బృందకాటవిన్
ఘననిభుడున్ శుభాంగుఁడును గాంచనచేలుఁడు నైనశౌరి వే
డ్కను దనతోడఁగూడినటుగాంచి యొకానొక స్వప్న; మాదటన్ 30౬

తే॥ మేలుకొనిభూషణోత్కరకీలితుఁడగు హరివియోగంబు నైపక యాకులతను
బొంది కలఁదనకబ్బిన ముచ్చటలను దలఁచితలఁచి కన్నులనుండి జలములొలుక.

సీ॥ ఈముఖపంకజామృతము నే నెన్నఁడు ద్రావుభృంగంబనై తనరఁగలనో
యీముఖపూర్ణేందు కౌముది యెప్డు నా పైఁబడ నాకాఁకఁ బాపఁగలనో
యీముఖజీవనజామోదముల్ బర్వ నెన్నఁడుమూర్కొని హెచ్చఁగలనో
యీముఖసుఖపీఠి నెన్నఁడునామోముదామర నేనుంచి తనియఁగలనో

తే॥ యీమనోహరాంగునిఁగూడి యెన్నఁడేను సూనశరశరబాధల మానఁగలనో
యీసుముఖుని నేనెత్తఱినాసతోడ సుముఖుఁగాఁజేసికొని వేడ్కఁ జూడఁగలనో.

ఉ॥ ఎన్నఁడు చేతులార! భువనేశ్వరుదేహ మలంకరింతునో
యెన్నఁడు సుందరుండయిన కృష్ణునిముద్దులఁ బెట్టికొందునో
యెన్నఁడు వానిపెన్నురము నెక్కి రతిఀ రతిఁ దేల్చుచుందునో
యెన్నఁడు తత్కరంబుఁగొని యిట్లటులఀ వని సంచరింతునో 30౭

కం॥ అని చింతించుచు నాథునిఁ గనుఁగొనఁగా దలఁచి తోఁచక చరించుటఁగాం
చిన యాచెలికత్తియ లావనజాక్షుని జాడఁదీయ భావించి మదిన్ ౩౦౦

ఉ॥ చూచిరి సందుగొందులనుఁ జూచిరి సర్వచతుష్పథంబులన్
జూచిరి సర్వగోష్ఠములఁ జూచిరి రథ్యలఁ జుట్టుపక్కలన్
జూచిరిగాని యెచ్చట యశోదకిశోరుఁడు లేమిఁ దిర్గి పోఁ
జూచెడిలోన నెల్లకడఁ జూచిరి వచ్చెడి గోపడింభకున్ ౩౦౧

తే॥ కనిన యాచెలికత్తెలు గాంచిముదము,
ముందుగాఁబోయి రాధాసముఖమున కిటు
పల్కిరోయమ్మ! రమ్మ తత్పంకజాక్షుఁ
డాలఁద్రోలుచు నటువచ్చు నోలిఁగనుమ! ౩౦౨

కం॥ అన నాయమ పెన్నిధిఁ గాంచిన పేదరహిన్ జెలంగి చెలికత్తెలతో
జని సౌధాంతరమందునఁ దనరెడి వాతాయనంబు దాపునఁదగుచున్. ౩౦౩

మ॥ కనవే! యేమది ధూళిపుంజమెసఁగెన్ గంజాక్షుఁ డేతెంచునా?
ఘనముల్ గ్రమ్మినయట్టు లంబరమణిన్ గ్రమ్మెన్ జుమీ యాదెసన్
వినవే మంజులవంశినాదములు నీ వీన్దోయిఁ జొప్పించి యే
దనవేమీ చెలిరో యదేనినదమో యాలించి వాక్రువ్వుమా! ౩౦౪

మ॥ ఎవరో డాయుచునుండిరట్లు గనుమీ యిందిందిరప్రోల్లస
న్నవసూనాంచిత మాలికాధరుఁడు పీనస్కంధుఁ డాజానుబా
హువృతుండున్ వరచేలధారుఁడదిగో యుంకించి కాంచంగ మా
ధవుఁ డేయంచుఁ దలంతు నిక్కువమె కాదా యో సఖీబృందమా! ౩౦౫

వ॥ అని వీక్షించుచు, యోచించుచు, ననుమానించుచుఁ బృచ్ఛింప నాసఖులానానని యలరుచుఁ దలలూచి సంకోచపథంబునుండి తారకలందు నిందునికైవడి నొప్పారుచు నాలం ద్రోలుచుఁ గ్రమక్రమంబుగా సమీపించెడి శ్రీకృష్ణునిం జూపుడువ్రేలునంజూప నాయంగనామతల్లిక యొక్కసారిఁ గన్నులార సోరణగండ్లనుండిఁ గాంచి, ౩౦౬

సీ॥ దర్శనీయంబులన్ దర్శనీయముగాదె యీమహామహుముఖం బింతులార!
పేయంబులందునన్ బేయంబుగాదెయీ శౌరి యధరసుధ చానలార!
స్పర్శనీయంబులన్ స్పర్శనీయముగాదె యీ మాధవుని మేను లేమలార!
గేయంబులందునన్ గేయంబుగాదెయీ ఘనుదివ్యచరితంబు కాంతలార!

తే॥ జ్ఞేయములయందు జ్ఞేయమీ తోయజాక్షు
వర్తనముగాదె సతులార! పార్థివములను
ప్రార్థ్య మీజగన్మోహను పరమసంగ
మంబుగాదె నారీతిలకంబులార! ౩౧౮

క॥ అని తన చెలులకుఁజెప్పుచుఁ గనుఱెప్పను వాల్చక హరిఁ గనుచిల మూర్ఛి
ల్లె నతండు నోరచూపులఁ గనియామెను దలఁచె నిటులఁ గౌతుకమతితోన్.

సీ॥ కచములా యివిగావు ఘనముఖాంబుజసుధన్ గ్రోలుభృంగముల గుంపుగాని
వేణియా యిదిగాదు వెనుకలరక్షించు భయమిడు కృష్ణసర్పంబుగాని
వక్త్రమా యిదిగాదు జహుఁశలోకానందకర పౌర్ణిమానిశాకరుఁడుగాని
హాసమా యిదిగాదు హర్షంబుగూర్చెడి దివ్యరాకేందుచంద్రికలుగాని

తే॥ కనుల యివిగావు గండుమీన్ గవయుగాని, కంఠమా యిదికాదు శంఖంబుగాని
కుచములాయివిగావు పొన్గొప్పగిండ్లుగాని మైఁదీఁగె యిదిగాక కాదె చపల.

మ॥ భువిలోనన్ దివిలోన దీనికెనయౌ పూఁబోఁణి లేదెందు నీ
స్తవనీయద్యుతిభాసురన్ ఘనకచన్ దారుణ్య లావణ్యవై
భవవిభ్రాజితనిర్జితస్మరసతిన్ భాగ్యాంచితన్ శ్రీమతిన్
దవులన్ లేని నరుండు వ్యర్థుఁడుగదా తర్కింప భావంబునన్ ౩౨౦

తే॥ కాన నీచానతోఁగూడి కరుణఁదొఱఁగి, విరతిలేకుండ శరముల వేయు మదను
మదము సదమదమొనరించి ముదము నేను గాంచనౌనని యింటికే తెంచెనంత.

చ॥ లలితయు రాధఁజేరి యిటులన్ బలుకాడఁదొడంగె నమ్మరో!
పలుకవు రావు నవ్వవు సుభక్ష్యయుతాన్నముఁ గ్రోలవేదియున్
దలఁపవు మంచినూనియలఁ దద్దయురుద్దుచు దువ్వి దువ్వెనన్
దలను నలంకరింపవు యథార్థము నాకిపుడీవు సెప్పవే! ౩౨౨

చ॥ హరినిమదిన్ మనోవిభుగ నన్నివిధంబుల నెంచియున్న స
త్వరగతి వాని నెయ్యమగుపద్ధతిఁజూడుము నీకు మేలగున్
ధరణికి మంచియౌ నిఁక వ్యథాజ్వాలనుండల కుంభకారవ
హ్నిరహిని భగ్గుభగ్గుమని నిన్నిసుమంతయుఁ గాల్చెఁడో చెలీ! ౩౨౩

ఉ॥ పిమ్మట రాధికామహిళ వేడుకతోఁదన పద్మపత్ర నే
త్రమ్ముల విప్పి యోసి లలితా! మునినిర్జరపూజితాంఘ్రి యు
గ్మమ్ముగలాఁడు ముద్దులనుగార్చెడువాఁడును నైన యచ్యుతుం
డిమ్మెయి రానిచో నిచటి కేనిదె దేహముఁ బూదిఁ జేసెదన్ ౩౨౪

ఉ॥ ఇట్టుల గద్గదోక్తి వచియింపఁగ నాసఖి వించు నోచెలీ!
యెట్టులొ పట్టుకొమ్మొదను నేనెర వేర్చెద నీమకోర్కి నీ
పట్టుననంచు నల్ల వృషభానుపురంబును వీడి తోడనే
యట్టి కళిందజానదికి సందికలోఁగల బృందకాటవిన్ ౩౨౬

తే॥ మాధవీముఖవల్లరుల్ మలయ వివిధవిహగకలకలారావముల్ వినపడంగఁ
గడిమిచెట్లచాయను నొంటిఁగావసించు పసిఁడిపుట్టముతాల్పుపార్శ్వమున జేరి.

ఉ॥ శౌరి! త్రిలోకసుందరియుఁ సాధ్వియు దద్వృషభాను పుత్రియై
మీఱెడి రాధికారమణి మిమ్ములఁజూచిన నాఁటఁగోలె మీ
సౌరు దలంచి గోడపయిఁ జక్కఁగవ్రాసిన బొమ్మకైనడిన్
మాఱుచు నోర్మెదల్పదది మాయయొ యేదియొ చెప్పలేనుగా ౩౨౭

చ॥ వినుఁ గనుమూయుఁ గాంచుఁ జను వెన్కకువచ్చును గూరుచుండు ని
ల్చును బడు లేచు మిన్నుగను సొమ్మసిలున్ దెలివొందు శ్రీహరీ!
యనుఁ బ్రణమిల్లు నేడ్చు నగు హా! యని పేసరు నిట్టులన్ క్షణం
బునకొకతీరు చేయు నిది బుద్ధికిఁ దోఁపదు లోకమోహనా! ౩౨౮

చ॥ సుమతతి బాణజాలముగ సోముఁడు హాలహలోరుమూలకం
దముగ సుగంధి దుష్కటువిధంబుగ సొమ్మెఱనిప్పుతున్కఁగాఁ
గమలినకోక ధార్యముగఁ గ్రాలెడి రాధకు, నందుచేత నా
యమ పెదమేడ పాడుపడినట్టులఁదోఁచెడి పద్మలోచనా! ౩౨౯

ఉ॥ కావున నొక్కమాఱు మమకారముతోఁ జనుదెంచి యట్టి రా
ధావనితామతల్లికకు దర్శనమిచ్చి సుఖంబు గూర్పవే?
నీవెకదా సమస్త ధరణీజననస్థితినాశనంబులన్
దేవుఁడ వింక సర్వమున దిక్కగువాఁడవు రమ్ము శ్రీహరీ! ౩౩౦

చ॥ అని పరమేశ్వరుంగుఱిచి యాలలితాలలనాలలామ నే
ర్పున మనవింబొనర్చుకొనఁ బూతచరిత్రుఁడు కృష్ణచంద్రుఁడున్
విని ఘనవాణి నిట్లనియె భీతమృగాక్షిరో! నీమనోహరో
క్తినిఁ జెవులారవింటి నలస్త్రీ యటుసేయుట ప్రేముడిన్ సుమీ! ౩౩౧

ఉ॥ ప్రేమ మనోవికారమగు ప్రేమ గృహస్థశుభప్రదంబగున్
బ్రేమయె సృష్టిమూలమగుఁ బ్రేమయె పోషణముఖ్యహేతువౌఁ
బ్రేమ వినాశకంబగును బ్రేమయె ధర్మనిదానమయ్యెడిన్
బ్రేమయె సర్వవశ్యమగుఁ బ్రేమనుమించిన లాతియున్నదే! ౩౩౨

ఉ॥ ఈరహిఁ బ్రేమయాట నలయింతియు నట్టులఁ జేయుచుండెగాఁ
క్షీరమునందుఁ దధ్నితరుచిస్థితి భేదము లేనిరీతిగా
నారయ నాకు నామెకును నంతరమింతయు లేదు మున్ను భాం
డీరవనిన్ విహారము గడించిగ నైనటు లిప్పు మాకగున్ ౩౩౩

ఉ॥ రాధకు నాకు భేదము గరంబుగఁగూర్చి జగంబునందు నే
రోప్పఁగలు నల్పుచుందు రలపుణ్యజనుల్ యమపాశబద్ధులై
బాధలఁ బొందుచుందురని భావమునందు నెఱుంగుమిట్టులన్
సాధులు భేదవాదులయి సన్నుతినల్పరె? ముక్తిఁగాంచరే? ౩౩౪

ఉ॥ కావున నెమ్మి హేమ్నలఁతికాలములోపల నేను వచ్చెదన్
నావుసు తల్లితాంగియును నమ్మత నాతని యాజ్ఞఁగొంచు బృం
దావని వీడి రాధసవిధంబునకుం జనుదెంచి యొంటిగా
భావమునం దలంచుచెదొ వర్తిలునామెకుఁ బల్కెనిట్టులన్ ౩౩౫

శా॥ అమ్మా! రాధరా! శౌరిఁజేరి కనఁగా నవ్వానిపై నీకు మో
హమ్మెట్టుల్ వసియించెనో యటుల నీయం దాతఁడున్ బూర్ణమో
హమ్ముంబొంది వసించెనం చెఱుఁగుమీ యవ్వానికిన్ నీకు భే
ద మ్మావంతయు లేదు మీర్జగమునన్ ద్వైవిధ్యమై యుందురిగా ౩౩౬

తే॥ కొలఁది కాలములోపలఁ గూర్మినాతఁ
డిటకుఁ జనుదెంచునని యెంతు నెడఁద నయిన
వానిరాకకు సత్కార్యపాళి హాళిఁ
జేయుచుండుము నీకిష్టసిద్ధియగును ౩౩౭

ఉ॥ ఈగతిఁజెప్ప నామె స్వముఖేందురుచిన్ నయనోత్పలంబులున్
బాగుగ విప్ప నిట్లు మఱిఁబల్కెఁజెలీ! యలవానిరాకకై
యేగతి నెట్టికార్యముల నేనొనరింపఁగనౌనొ యెట్టి య
భ్యాగతిదేవతీర్థములయర్చలఁజేయఁగ నౌనొ? చెప్పుమా!

తే॥ మఱియు మాగురువును మునివరుఁడునైన గర్గుఁడీయిష్టసిద్ధికే కార్యములను
జెప్పెనో వాని నాకు వచింపుఁడిప్పు, డో చెలియలార! యనికోరె నుర్వరేశ!

తే॥ అట్టి సమయంబునందుఁ దదాళిపాళిఁ జతురయైన చంద్రానన స్వాంతమందు
మిగుల యోజించి యమ్మరో! మీసెలవున నొక్కసత్క్రియఁజెప్పెద జక్క వినుము.

చ॥ తులసిదళంబులన్ సకలదోషవిదూరులు వేల్పు లెల్లరున్
వెలుఁగుచునుందు రవ్వి సరవిం గొని శ్రీహరిపాదపంకజం
బులకు విధేయతాఘణితిఁ బూజలసల్పిన వాని జన్మమే
వెలగల దర్థవంతము నభీష్టనుతంబును ముక్తియుక్తమున్. ౩౮౯

సీ॥ ఏపిను తులసిచే నెసఁగియుండఁగలేదొ పీనుగాదది పట్టి బీడుగాని
యేవాడ తులసిచే నెసఁగియుండఁగలేవొ వాడగాదది పల్లకాడుగాని
యేయిక్క తులసిచే నెసఁగియుండఁగలేవొ యిక్కగాదది నక్కబొక్కగాని
యేతోఁట తులసిచే నెసఁగియుండఁగలేదొ తోఁటగాదది యూతతోఁటగాని

తే॥ తులసిలేనట్టి చోటులఁ జెలఁగుజనము, జడమగునుగాని యయ్యది జనముగాద
టంచు నెఱుఁగుచుఁ బూజల నహరహంబు సల్పుచుండుమ! తులసికి శ్రద్ధతోడ.

తే॥ తులసి వాయువులేయింటఁ జెలఁగుచుండు
నట విషూచిమశూచికాద్యామయములు
నించుకేనియుఁ జొరఁబడవం చెఱుఁగుమమ్మ!
కాలుఁ డాయింటివారలఁ గనులఁగనఁడు. ౧౯౧

తే॥ తులసిమంజరిం గొని తలనుదాల్చి ప్రాణముల్విడిచినవాఁడు పాపపంచ
పాతకంబులసల్పినన్ పావనుఁడయి యమునిదండన మొందఁడో యన్న మిన్న!

క॥ తులసీకాష్ఠజగంధ మొడలఁబూసినఁ బాపమెదియు డక్కొనదమ్మా
తులసీవనికల గేహంబులు పుణ్యక్షేత్రములుగఁ బొల్పారుఁగదా ౩౯౨

తే॥ నూఱుబారువలైన బంగారు మఱియు నాల్గువందలబారువల్ గల్గు వెండి
దానమిచ్చిన ఫలమెంత దనరునంతఫలముగల్గు నిట్టి తులసిపాలనమున.

తే॥ తులసిపాదునఁగలనీరు దలనుజల్లినగృహి యమరాపగాముఖస్నానఫలముఁ
బొంది నీటఁజెలంగియు భువనమంటని జలజముమాడ్కి భవభీతినిం గనఁడుగ.

తే॥ తులసినీడను శయనింప దోషమడఁగుఁ దులసిపూసలఁదాల్చినన్ గలుగుశుభము
తులసిఁబైవిధిన్ బూజల సలుప హరియు ప్రీతిబొందును తులసి వర్ణింపదరమె.

తే॥ తులసియుండిన శ్రాద్ధముల్ ఫలదములగు
దులసిఁబెంచిన వంశముల్ బొలుపుఁగాంచు
దులసి మాహాత్మ్యమెన్నుట సులభమొక్కొ?
త్వరగనీవును దులసిసేవలనుసలుపు ౩౯౬

చ॥ అని తులసీప్రభావము మహాస్మృతితో నుడువంగ రాధికా
వనితయు నాలకించి భయభక్తులఁ దత్తులసీవనంబు స్నా
పన మొనరింపనెంచి తగు పద్ధతులం గమనించి కేతకీ
వన మనుకూలమైనదని భావమునందుఁ దలంచి వెంటనే ౩౯౭

వ॥ తద్వనంబునందు సుభద్రశ్రీజేశేశు స్వచ్ఛందనిమొన్ని యందు జహాంరను ణీయంబగు నూసమూరలమ్ముకొలరొట చోటునందాని పొన్నలంబున బంగారు గోడల నెత్తుగఁగట్టించి రత్నరాగమణులతోఁ బటంబు నిర్మించి కాంచన ధ్వజంబుల నెలెత్తెనెత్తించి యందుఁ బ్రేక్షకమనోహరామందంబగు తులసీమందిరం బలసన్ను బొనరించి తన్మందిరాంతరంబున సర్వదోషహరంబై పచ్చనిపల్లవంబులఁ బొలుపారు శ్రీ తులసీవనంబు స్థాపించి యన్నాఁడంబగు నిర్మలమనంబున సమాహూతులందును వేదవేదాంగవిదులగుసు బురోహితులందును గర్గాచార్యులచే మంత్రపూర్వకంబగు తంత్రం బుపదేశించుకొంచు నభిజిన్నక్షత్రయుతశుభముహూర్తంబున శ్రీకృష్ణప్రీతికై పరమభక్తిసంభరితయై తత్సేవాపూజాదులఁ జేయ నారంభించి మాఘాయుజ శుద్ధ పూర్ణిమాదినంబున దీక్షవహించి చైత్రపూర్ణిమావర్యంతము నారాధించి పంచామృతంబులను నిక్షురసంబునను నామ్రరసంబునను ద్రాక్షారసంబునను నారికేళ రసంబునను శుద్ధోదకంబునను నభిషేకించి ప్రత్యేకంబుగాఁ బ్రతిపూర్ణిమాతిథియందు విశేషోపచారంబులం గావించుచు వైశాఖశుద్ధప్రతిపద్దినమందు సద్భక్తితోద్యాపనం బొనరించి రెండులక్షల బ్రాహ్మణుల నన్నముఖదానంబులతోఁ దృప్తులం గావించి యామలకప్రమాణంబులగు ముక్తాఫలంబులను నమూల్యంబులగునట్టి లక్షభార మౌక్తికంబులను గోటిభారదివ్యస్వర్ణంబును నాచార్యునకు దానంబొసంగి ఖేచరులు దుందుభులు మ్రోఁగించి కీర్తించి జయజయారావంబులు సల్పుచు బుష్పవృష్టిని దత్తులసీమందిరంబుపైఁ గురియంగని యానందమందు రాధికాసుందరీ సముఖంబున.

సీ॥ మించునుమించిన మేనిపైఁదళతళలాడుబంగరుచీర లమరుచుండఁ
దమ్ములఁదనరు వేతమ్ములఁగాఁజేయు కన్నుల నమృతంబు గాఱుచుండఁ
నల్లనిపెందాళ్ళచుఁ జిల్లనగాసల్లు పెంజడపీఱుదులఁ బుంజియాడఁ
దామరతూండ్లను దాఁటుచౌచేతుల బంగరుహొమ్ములు పరఁగుచుండ

గీ॥ హైమకుండల మకుటంబు లలరుచుండ వెలుఁగుచుండుపదాజేండ్ల వెలఁదియగుచు
గరుడగతహేమపీఠిపైఁ గ్రాలి తమ్మికంటివాల్గంటి తులసి వేడ్కనువెలింగె.

చ॥ కనుపడి యట్టు లామె తమకమ్మున రాధను గాఁగిలించి యి
ట్లనియెను నోసతీతిలకమా! భవదర్చలచేఁ బ్రిసన్నతఁ
గని యిట కేగుదెంచితిని గానఁ ద్రిశుద్ధిగ నేవరంబు నీ
వసయము గోరుచుంటి వదియక్కరవచ్చి ఫలప్రదంబగుఁ ౩౬౧

చ॥ మఱి సుభగత్వముఁ నబల మంచిదటంచుఁ బ్రసిద్ధురాలవై
ధరమనుచుందువమ్మ! యిది దప్పదు భూతల సంగ్రహార్థమై
కరముగ నిట్లుగోరితివి గాదె! యనంతరమందు నామె సం
బరమున మ్రొక్కి నాకుఁ బతిభక్తి నహైతుకి నిమ్ము బృందరో! ౩౬౨

చ॥ అనఁ దులసీమహోత్సవియు నట్టులె నీకగుగాకయంచుఁ దాఁ
జనె నటుమీఁద రాధ నిజసద్మముఁ జేరెను మైథిలేశ్వరా!
యనవుడు జేఁడు నట్లె కరదక్షుఁ సరంసము బ్రాఁగి తేఁట్లు తృ
ప్తినిఁగనట్టు లీకథ నె తృప్తిని జెందఁగలేను నారదా! ౩౬౩

తే॥ కాన మఱి హరికథను బల్కుండు వేఁడుచుంటిఁ ద్రాధికాదేవి యుత్తమవిధిఁ
దులసి నర్చించెఁగద దానఁగలిగినట్టి ఫలములన్ జెప్పవేఁడెద బ్రహ్మపుత్ర!

— శ్రీకృష్ణుండు మాయాగోపికయై రాధ దరికేగుట. —

ఉ॥ నావుడు దేవమౌనియు ననంగడెఁ గెన్ మిథిలాధినాథ! రా
ధానఘువాపిధిన్ మిగులఁ దత్తులసీవ్రత మాచరించుచున్
శ్రీవిభుఁడాలకించియుఁ బరీక్ష నొనర్పఁ దలంచి తోడనే
మావృషభానుపట్టణము నర్గి ప్రమోదముఁబొంది యంతనన్. ౩౬౫

ఉ॥ కంకణతారహారములు గమ్మలు నందెలు నత్తు కాంచియున్
గ్గింకిణులున్ దగన్ గనకనిర్మలవస్త్రములన్ ధరించి బ
ల్పొంకపు కేశపాశమును బూనియు హాయన గోపికాకృతిన్
జంకక తాల్చి తత్సదనసన్నిధి కేగి మదేభయానయై ౩౬౬

మ॥ వరుసన్ ద్వారసమాశ్రితాంజననిభేభశ్రేణులన్ బ్రోల్లస
త్స్ఫటికాసప్రసభాలయాంగణచతుర్ద్వారంబులన్ ఛత్రచా
మరహారాన్విత సింహపీఠముల ధర్మస్థానముల్ దివ్యహ్యా
న్మరుదాపమ్యజవాంచితాశ్వములఁ బ్రేమన్ జూచి యా పిమ్మటన్ ౩౬౭

ఆ॥ వత్ససహితధేనువారమహోక్షముల్ గన్నులారఁగాంచి కరమునందు
జెత్తమొప్ప మంచి పిల్లనగ్రోవితో నసిగఁబాడుగోపసమితిఁగాంచి ౩౬౮

క॥ శ్రీరాధాంతఃపురమును జేరి కవాటాలయాదిచిత్రంబులనున్
ఘూర్ణితసభాస్థలములలోఁ గోరిక వర్తించుచుండు కోమలులఁగనెన్ ౩౬౯

ఉ॥ కృత్రిమగోపికామణి మఱిన్ వృషభానుకుమారికీర్తి వా
దిత్రముఖంబునన్ మిగులఁ దేటగఁ జెల్లమొనర్చు గోపికల్
చిత్రవిచిత్రపుష్పములఁ జేకొని వేడుకతోడఁ జెంగనా
లాత్రములేక వేయుటను నాస్థనుగన్గొని మెచ్చి యంతటన్ ౩౭౦

తే॥ కుందమందారదాడిమీ కోవిదార మాలతీ కేతకీబృంద మాధవీప్ర
భృతిధరారుహోపేతంబు వివిధవిహగకలితమగు నుపవనమొండు గ్రాలునందు

సీ॥ కల్పవృక్షసుగంధకమ్రంబు మధుమత్త షట్పదసంకృతిసంయుతంబు
గంధాక్తకేతకగహ్వరమత్తంబు శుకముఖభాగోదిత శోభితంబు
ననిలాల్పభూతకహ్రదతరంగభాసురం బఖిలపుష్పశోభితంబు
కూపవాపీసరకల్హారసంఘంబు బహుశోభాద్విజాలిభాసితంబు

తే॥ స్వర్ణకృతశాలమునకు నాయక వన్యశోభకలు మనుకరుసమునైన రాధికాస
మీపమందిరమ్ము కుంజంబు జేరి లలిత గాంచి మెచ్చి యుండు నంత గౌతుకమున.

తే॥ వజ్రాలు మేఘమండిత మండపాలతరణికుండలాంచితకదళీద్వారకుశలలు సుము
ఖలను వరవస్త్రధరలు నా చెలిమికత్తె లలరుచుండుటం గనికొంచె మవలనరిగి.

ఉ॥ కుంకుమపుష్పవన్నెలను గూర్చినసన్నని పట్టుపట్టలి
ర్వంకలఁగట్టియుండి సుమవాసలుజల్లఁగ నెల్లచోటులన్
సంకుముదైణనాభికునసారకవటీరసువాసనల్ జగన్
వంకయొకింతలేనియటు భాసిలు రాజగృహంబునుం గనెన్ 324

ఉ॥ అందునఁ జేటికాసహితరాచెలికత్తెలఁ గోటిచంద్రులన్
డిందొనరించు తేజలరి కేళిగనుండెడి రావిమోహినిం
జెంది సతీలలామయు సుశీలయు నైనతిఁబొందు రాధికా
సుందరి యొద్దిమోతలఁచుచున్ బదమున్ గదలించుటంగనెన్ 325

ఉ॥ అత్తఱి రాధికాసతియు నట్టుక్రమంబుగ డాయు గోపికా
త్యుత్తమఁగాంచి కౌఁగిళుల నొంది పదంబుల తూళనంబుకై
యుత్తమలోకకీర్తి జలమొయ్య నొసంగియుఁ బీఠమిచ్చి లో
కోత్తరమైన పద్ధతిని కొద్దకుఁబోయి వచించె నిట్టులన్ 326

తే॥ అమ్మ! స్వాగతమియ్యదే యందుమమ్మ! మాగృహంబున కీవిపుడేగుదెంచ
ధన్యతమనైతినోయమ్మ! తప్పకుండ నర్ఘ్యమొంది నాయాతిథ్య మందుమమ్మ!

—♦ మాయాగోపికా రాధికా సంవాదము. ♦—

చ॥ ఇది యెటనుండిరాక మతియెక్కడికేగఁ దలంచియుంటివో
యెవిభవదీయవాస మికనెట్టిదొ నీచరితంబు నేటికే
యదనున నాసమీపమున కాగతవైతివొ చెప్పుమవ్వి నా
కుఁ దగినవైనఁ జేసెదను గొంకక పద్మదళాయతేక్షణా! 327

ఉ॥ భూతలమందుఁజూడ నినుఁబోలినరూపము గోచరింపదే
ప్రీతిగ నిన్ను జూతురల పెద్దలుధన్యత గాంచకుందురే
యేతఱినీపదాబ్జముల నెచ్చటఁద్రొక్కెద వద్ది యత్తఱిన్
పూతమహాపురంబగుచుఁ బొల్పువహింపదె? గోపికామణీ! 328

క॥ అమ్మా! శుభదము వాంఛా సమ్మతమును నఘజాల శైల దంభోళియునై
సమ్మదకరమగు మీ నామమ్మును వినఁగోరుచుంటి మాన్యచరిత్రా! ౩౮౦

క॥ కృతిచే స్తుతిచే స్మృతిచే గతిచేఁ గరుణాకటాక్షకలితస్థితిచే
మతిచే వచనముచే శ్రీపతిపై భాసిల్లితివి భామామణిరో! ౩౮౧

ఉ॥ మిమ్ములఁజూచినంగొలఁది మేజనుమీఱు ప్రియంబు చెందమం
దిమ్మెయిఁ గల్గుచుండెడి రమేశునకున్ మఱి మీకుఁ దారత
మ్యమ్మిది గోచరింపమిఁగ యుందుమ నేను వనాంతరా మిముఁ
నమ్మి తలఁ వహించుచు ఘనంబుగఁ దిష్టక సత్కరించెదన్ ౩౮౨

చ॥ మఱియును మీరు నిత్యమును మానక యిచ్చటి కేఁగుదెంచి మీ
దరిసెనమియ్యఁ గోరితిని దద్విధి పేరొనఁగూడిజేసి మీ
వరకృప మెచ్చులన్ గలవొ పుణ్యము వచ్చెడిఁ బ్రత్యహంబు ని
ద్దర మొకచో నెటో కలిసి తద్దయుముచ్చట లాడ రా సఖీ! ౩౮౩

క॥ నావుడు మాయాయువతియు శ్రీవిభుడున్ దేవుఁడైన శ్రీకృష్ణవిభుం
దావనజాక్షికి రాధిక కావశ్యకభక్తినిబుల ననియెను జనకా! ౩౮౪

ఉ॥ ఊరెదివియన్న నందపురి నొందిన నందుని యిక్కఁ బక్కఁగా
బేరడిరేన్ ప్రభావటలి వెల్గెడి గోకులమై చెలంగు నా
పేరిఁక గోపదేవియని విశ్వమునన్ విదితంబు రాధ! నీ
నాయను జేటియా లలిత చక్కఁ వచింపఁ గనంగ వచ్చితిన్ ౩౮౫

చ॥ నవనవపుష్పవాసనల నవ్యలవంగలతాదిసంతతిన్
నవకపుఁదేంట్ల పాటలను నాణెముగా ఫలియించు చెట్టులన్
నవనవలాడు నీవనము నాకనులారఁగఁ గాంచియుంటి వా
సవఘననందనోపవని సైతము దీనికి సాటివచ్చునే! ౩౮౬

ఉ॥ ఇట్టుల నిర్వురుంగలిసి యేవియొ ముచ్చటలాడికొంచటన్
జెట్టులచాటుచోటులను జేరుచు నాడుచుఁ బాడుచున్ మఱిన్
నెట్టుచుఁ బాఱుచున్ నగుచు నివ్వెఱజెందుచు బంతియాటలన్
జెట్టుగఁ జేయుచున్ మిగుల వెల్గుచునుండిరి మైథిలేశ్వరా! ౩౮౭

ఉ॥ అంతట గోపదేవత మహాదృతితో సఖి కిట్లు వల్కెనో
యింతుల మేలుబంతి! యిఁక నేగెదఁ బ్రొద్దదెగుంకెఁ దిర్గి నీ
చెంతకు నేఁ బ్రభాతమునఁ జేరెద. మద్గృహముండు దవ్వునన్
జింతనువీడి యాజ్ఞయిడి చెచ్చెరఁ బంపుమ గోపికామణీ! ౩౮౮

చ॥ నరసురయక్షసిద్ధమునినాయకులెవ్వని పాదపద్మముల్
శిరమునఁదాల్చి మ్రొక్కులిడి శ్రీ గలుగన్ భయభక్తులన్ బలిన్
సరగునఁదెచ్చి యెవ్వనికి సంతసమందఁగ యిచ్చుచుందురా
సిరిచెలి నిర్ధనుండనుచుఁ జెప్పఁగరాని నుడుల్ వచింతువే? ౪౧౬

చ॥ వికటకృతిప్రపీడితులయి విశ్వముఁ బాడొనరించు ధేనుకున్
బకు నఘు పూతనాసురను వత్సనిశాచరు వ్యోముదైత్యునిన్
శకటసురారినిన్ మఱి నిశాటుల నెందఱినో వధించి సౌ
ఖ్యకరవిధానముల్సలిపి కాచెడి నాహరియున్ వినింద్యుఁడే! ౪౧౭

చ॥ అలహరిభక్తిలేనియెడ నాతఁడు బ్రహ్మయుగాక యిందిరా
లలనయుగాని మూఁడుకనులన్ దగు నీశుఁడుగాని యేనుగా
ని లలితకృష్ణరూపము స్వనేత్రములన్ గనరమ్మ! భక్తవ
త్సలుఁడుగదా! చెలీ! పలుకు తాదృశనిందకు వాఁడు పాత్రుఁడే? ౪౧౮

చ॥ పరమదయానిధిన్ బతితపావను విద్రుమబింబసన్నిభా
ధరవిలసత్ప్రియధ్వనినదన్మురళీరతునిన్ ధరామనో
హరు స్మితపూర్వభాషి నిగమాదినుతున్ జగదేకసుందరున్
హరిని ననాదిమర్త్యులయి నట్టులదూరుట దోషమౌనుమా! ౪౧౯

క॥ గోలోకనాకధాత్రీపాలున్ గరుణాలవాలు స్వర్ణసుచేలున్
బాలున్ బుధనుతసద్గుణజాలున్ లీలావిలోలు శపియింపకుమా! ౪౨౦

ఉ॥ ఆహరినిన్ భజించు పతితాధములైనఁ బవిత్రులౌచు నా
యైహికపారమార్థికము లందలిసౌఖ్యము లొందకుందురే?
మోహముతోడ నావిధిని ముచ్చటలాడితి వైనదిగ్గి నీ
యూహఁదలంపుమా! యనఁగ నొయ్యన నాయమ రాధకిట్లనెన్ ౪౨౧

చ॥ చెలి! భవదుక్తిధోరణి వచింపఁగ శక్యమె? యాబృహస్పతిన్
బలుకులకల్కిఁబోలి శ్రుతిపద్ధతి నొప్పుచు నన్నుఁ దృప్తఁగా
నలిపెను సత్యమమ్మ! యిఁకఁ జక్రధరుండిట నల్పకాలమం
దలరుచు నీ యభీష్టముల నన్నియొసంగు నటంచు నెంచెదన్ ౪౨౨

ఉ॥ అంతట రాధ వేడ్కపడి యమ్మరో! యాహరి ప్రేమతోడ నీ
పొంతకువచ్చినట్టయినఁ బొల్పుగ నేమి యొనర్పనౌను ప
తౌంతరమందు రానియెడ నాక్షణమందున నీకు నా ధనం
బంతయునిచ్చి కానకఁ బ్రియాణము సల్పెదనంచు భక్తితోన్ ౪౨౩

ఉ॥ కన్నులమోడ్చి గద్దెపయిఁ గంజదళాక్షుని ధ్యానపర్వమం
దెన్నుచునుండ శ్రీహరియు నిందునిభాస్య దివ్యభక్తి సం
పన్నను స్వప్నగంబునను బాష్పసమేతను రాధఁజూచి యా
పన్నదయాళుఁడై చను స్వకీయసుదేహముఁ దాల్చి భూవరా! ౪౨౪

చ॥ పిలువ సఖుల్ గనన్ ఘనగభీరగళంబున శౌరిఁ రాధికా
సుదతికి నీరహీన్ బలికె సుందరి! యోకరభోరు! యిందువ
ద్వదన! సరోజనేత్రి! తరుణి! పంకజగంధి! చెలీ! భవజ్జపం
బెవ లలి మెచ్చి వచ్చితిఁ ద్వదీక్షణముగ్గ్రము విప్పి చూడుమా! ౪౨౫

ఉ॥ నీవిటుఁ "గృష్ణ! రమ్మ"నుచు నిర్మలభక్తిని బిల్వ వించు నా
గోవుల గోపులన్ యమునకూలమునన్ విడి యందునుండి నీ
భావగ తేప్సితంబుల నవారిగ నిచ్చి ముదంబుఁగూర్ప నే
ధావనముల్ బొనర్చియిట వండిగనుంటిని గంటఁగాంచుమా ౪౨౬

ఉ॥ ఇత్తఱి నిందునుండి నొక యిందునిభానన లేచి వెంటనే
తత్తఱపాటుతోఁ జనియెఁ దత్సతి దేవియ-దయ్యమా-మదో
న్మత్తనిశాచరాంగనయ-మానవనారియ-యేరొ పల్కుమా
యిత్తరళాక్షులన్ మదిని నెంతయు నమ్ముట బాము నమ్ముటే! ౪౨౭

ఉ॥ కావున నేరిమాటలను గాదని నానుఁజులెల్ల నమ్ముచున్
నీవిటఁ జూడు పేనిమెఱ నేనిటువచ్చుట వ్యర్థమాసుమీ
నావుడు రాధ వేగ నయనంబుల విప్పఁచుఁ గృష్ణుజూచి యా
శ్రీవిభుఁ గౌఁగలించుకొని చెందె ముదంబు విదేహభూవరా! ౪౨౮

తే॥ ఇట్టి శ్రీకృష్ణకథ నెవ్వరు వినుచుందు రవ్వారలిద్ధర నొంది సుఖము
లంతమందున గోలోకమందుఁజేరి సకలసుఖములఁగాంతురు జనకరాజ! ౪౨౯

చ॥ అనవుడు మైథిలేశ్వరుఁడు హర్షపరీతమనస్వియౌచు నో
మునివర! కృష్ణచంద్రుఁడటు బూన్కిని నావృషభానుపుత్రి ప్రే
మనొగిఁ బరీక్షసల్పి యనుమానము మానుచుఁ బ్రీతి ద
ర్శనమిడి యాత్మలీలఁ దొలిసల్పినకార్యము జెప్పుమా! యనన్ ౪౩౦

ఉ॥ నారదుఁడిట్లనెన్ జనకనాయక! మాధవుఁడంత మాధవీ
వీరుధముల్ గ్రహించి కడువేడుక మాధవమాసమందు బృం
దారమణీయకాననము దర్పకుఁడమ్ముల వేయు రాసకే
ళీ రచనేచ్ఛుఁడై చని స్వలీలలఁ జూపగడంగెఁ బొంగుచున్ ౪౩౧

## — రాసక్రీడా వర్ణనము. —

క॥ వైశాఖమాసపంచమి శ్రీశుఁడు చంద్రోదయంబు నెసఁగఁగఁ బ్రేమా
వేశమునన్ రాధికతో నానుగతిన్ బోయికహాడె యమునోపవనిన్. ౪౩౨

వ॥ దేవా! అది యెట్లంటివేని వినుము. మున్ను గోలోకమునుండి వెన్నుని యానతిఁ గొంత దివ్యప్రదేశం బిద్ధరాస్థలంబున కాగతంబైనదని వాక్రుచ్చితి. అందుఁ బద్మరాగమయంబై కామధుక్ద్రుమంబులను ధరించి నందనవనంబును విడంబించుచు బృందావనం బలరారు. దివ్యరత్నఖచిత సోపానసంపన్నంబై వివిధవిహగపరీవృతంబై పుండరీకమండితంబై యమునాధునీరాజంబు ప్రవహించు. రత్నకూటవిభాసురంబును రత్నధాతుమయంబును ఫలపుష్పలతాసమాకీర్ణంబునునై సుందరంబులగు బిలంబులను మధురాంబుపూరితంబులగు నిర్ఝరంబులను శ్రావ్యంబులగు ఝంఝర ఝుంకారంబులను జెలఁగి కరీంద్రంబుపగిది వెలుఁగు గోవర్ధనాచలేంద్రంబు దేజరిల్లు. ఉప్పరపీడినొరయు నుప్పరిగలను వాటంబులగు కొలువుకూటంబులను బొంకంబులగు నంకణంబులను నింబునుగొల్పు కంబంబులును గెల్పునుదెల్పు నిక్కిన కెక్కియంబులను జక్కనిచదుకంబులను మధుమత్తంబులై శ్రీరాధాకృష్ణగాథాగానం బొనరించుచు నర్తించు మధువ్రతంబులను శుకపికశారికాముఖవిహంగకలకలనాదంబులను సంగతంబై శ్వేతపీతారుణపుష్పసందోహబంధురంబులగు నికుంజంబులు పుంజిమీఱు. మఱియు సహస్రదళసరోజరజంబుల సారెసారెకుఁ దూలించుచుఁ బుష్పసౌరభగ్రహణం బొనరించి చల్లనిపిల్లవాయువు లల్లలన వీచుచుండఁ జెలఁగు కుంజంబులును జెన్నుమీఱు. అందు నాసమయంబున శీలరూపవయస్సంపన్నలై విరిపాన్పు లమర్చువెలఁదులు గొందఱును శృంగారకార్యకరప్రవీణలగు శృంగారవతులు గొందఱును ఛత్రచామరంబులంబట్టి మిసమిసలాడు మెలఁతుకలు గొందఱును బూలసొమ్ముల రచింపఁజాలిన పొలఁతులు గొందఱును బృందావనపాలికలగు సుందరదనలు గొందఱునుగోవర్ధనాచలనివాసినులగు కోమలాంగులు గొందఱును విరాజిల్లిరి. మఱియు నందు నత్తెఱి నత్తామరసాతుసమీపంబున రాసక్రీడార్థంబు ద్వాదశయూథంబులును బ్రవర్తిల్లె. వెండియు నటకు, ౪౩౩

క॥ నల్లనివర్ణంబొప్పఁగ నల్లనిచీరన్ ధరించి నవమణిభూషల్
బెల్లుగఁదాల్చియుయూథం బల్లనఁగొని కమలనేత్రయ గుయమున చనెన్ ౪౩౪

తే॥ తెల్లవన్నియ చెన్నారఁ దెల్లకోక వెలుఁగ ముక్తాభరణములు సెలఁగ యూథ
యుతయు సుందరవదన శ్రీమతియునైన గంగ వేడుకతోడుతఁ గదలి చనియె.

తే॥ అంత శ్రీరమాదేవియు నరుణవసనములను దగి విధువిద్యుతిలలితయగుచుఁ
బద్మరాగవిభూషలు బరఁగ మందహాసమున యూథసహితయై యరిగె మఱియు

తే॥ పూలతోడవులఁ బెట్టి యంభోజముఖికి నవని తెల్లనిపట్టుఁబుట్టంబు దాల్చి యూథ
మొందె శ్రీమధుమాధవి యందమైనసతి ప్రమిత్రతోడ నేగె నసంతరమున ౪౩౮

తే॥ వరహారిద్రవస్త్రముఁ గట్టి సరసవాక్యచతురయైనసుందరీప్రీతిహితయగుచు
రత్నభూషలఁ దిద్దించి రాణమీఱు విరజ యూథంబుఁ గైకొని వెడలిచనియె.

తే॥ మాయ లలిత విశాఖలు స్వీయములగు భూషణాంబరశోభలు బొలుపుగొలుప
యూథములతోడ రమ్యబృందావనము రాసలీలార్థమేగిరో రసికవర్య! ౪౩౯

తే॥ అంత యూథసమేతహరిప్రియాష్టభార్య లరిగి రంతట నవ్వారి యష్టసఖుల
యూథములు నేగె షోడశ యూథములును జో మెయిముప్పదిరెండన్ని మొత్తమునకు.

చ॥ చనలు నరిక్కలం గలిసి చందనసుందరిమాధవీవంశినిం
జెవవులఁ బెట్టి పాడుచును జిత్తముఁ గైకొని పచ్చపుట్టముల్
గుమగుమఁ గట్టి పింఛమును గూటికిదాల్చి మనోజ్ఞకీర్తి ము
ప్పదిమూడిరెండు యూథముల భామలఁ గూడి ముకుందుఁ డొప్పెడిన్ ౪౪౧

చ॥ రతిని రతీశ్వరుండు దగి రాజిలుచాడ్పున రాసమందు శ్రీ
పతి యల రాధతోఁ గలిసి భాసిలి వంశిని దివ్యరాగసం
తతులను బాడుచున్ యమున దాపున కేగి ప్రియాకరాంబుజం
బతిశయకోమలస్వకకరాబ్జమునన్ గొని సైకతస్థలిన్ ౪౪౨

తే॥ కూరుచుండి బృందావనిసౌరుఁ గనుచు సరససల్లాపముల్ దమిసలిపినగుచు
లేచి కుంజకుంజంబునలీలఁ దిరిగి టక్కునన్ సతి కేల్విడి డాఁగెనటనో ౪౪౩

చ॥ అటుపయి రాధికాలలన యాతనిఁ గన్గొన మాఱుమాఱుకునం
జటవిని సంచరించి కని యంతయుమందొకకొమ్మనున్న శ్రీ
చటులవిలాసు స్వప్రియునిఁ జట్టనఁ గాంచుచుఁ బట్టి నవ్వి య
చ్చట నెటో యొక్కశాఖికుంజాటునఁ దానును డాఁగెఁ జక్రియున్ ౪౪౪

ఉ॥ ఏమఱుపాటునన్ స్వసతి యేగుచు దాఁగినచోటు మార్గణం
బేమఱకుండఁ జేసి తుదనెంతయుఁ గుంజములందుఁ బౌఱరా
ధామహిళన్ ధరారుహముదాపునఁ గన్గొని కేల్గ్రహింపఁగా
నామె స్వహస్తమున్ గొనుట కట్టిటులన్ గదలించె నత్తఱిన్ ౪౪౫

సీ॥ కాకిచల్వనుమించు చీఁకటిమాఱుఁకులు బంగారుతీవియఁ బరఁగినట్లు
నాణెముగానుండు నల్లనిమబ్బులు వెలిగెడిమించునఁ జెలఁగినట్లు
నీలాచలేంద్రంబు నిగనిగలాడెడి బంగరుగనుల వెలింగినట్లు
చేరేడుపండును మీఱిన నెమ్మేను బచ్చనిపచ్చల వఱలినట్లు

తే॥ కృష్ణుఁడారాధికాసతిఁ గృష్ణతోడ మదనమోహనుఁడై రతిసుదతిఁ గూడు
మన్మథుండన బృందియన్ మధురవనిని రాసరంగంబునందున రాణమీఱె.

ఉ॥ ఎందఱుగోపికల్ గలరొ కృష్ణుఁడునందఱ కన్నిరూపులన్
బొందుచు రెండుపక్కలను ముద్దులగుమ్మలు వెల్ల నంతరం
బందునఁ దావసించి నటునట్టుల నాట్యమొనర్చె వ్రేతలా
నందముతోడఁ బాడుచును నాట్యముసల్పిరి దివ్యవైఖరిన్ ౪౪౭

క॥ నించెను దమిమది హరి నర్పించెను జరియాచకముల నింపుగనాశ్లే
షించెను సర్వవిధుల మెప్పించెను రాసములఁ గొల్లయింతులనెల్లన్ ౪౪౮

తే॥ ఇంద్రుతోఁ గూడి సురభామలెల్ల కెలమి నలరినట్టులగోపికల్ హరినిఁ గూడి
వెలిఁగిరట్టులఁ గృష్ణుఁడు లలితరాసములను సలిపెను గాళిందిపొంత నంత ౪౪౯

మ॥ జలకేళీరచనాకుతూహలముతో సంఫుల్లపద్మేక్షణుం
డల యక్షీజనమందు యక్షవిభుచాయన్ బ్రీతిబద్ధాత్మలున్
జలజాతాయతపత్రనేత్రలగు ఘోషాయోషలన్ వెల్గుచా
జలజాతాప్తసుతాతటంబునరుగన్ సాగెన్ నిరాతంకుఁడై ౪౫౦

ఆ॥ అప్పు డాదియంమనాభీరసుందరీమణులు తటినిలోఁ గ్రమముగఁ దిగుచుఁ
దరఁగలను కరముఁ దమ్ము నాశ్లేషింపనసుగుదెంచు యమున నాదరించి ౪౫౧

తే॥ చనులబంటిని జని నిల్వ శౌరిగని కరేణువులఁ గూడి కరియాచకేళిఁ జనుచు
నగుచు నీఁగ్గొంచు డాయుచా మగువలను మీఁజల్లుచున్ గౌఁగిలించుచుఁ జనుచునుండు

క॥ అత్తఱిన త్తరళాక్షుల నెత్తావులుగల్గు వస్త్రనివహము దేలెన్
దత్తరణికుమారితలన్ హత్తినయుష్ణీషమనఁగ నవనీనాథా! ౪౫౩

ఉ॥ ఇట్టుల సర్వగోపికలు కృష్ణుని రాసవిహారమందు నే
నట్టులు లేనియట్టుల మనంబుననుండెడి వాంఛలన్నిటిన్
బెట్టుగఁ బొందిరా పటహవేణుమృదంగవిపంచికాదు లి
ట్టిట్టనట్లు మ్రోసె జగదీశ్వరకీర్తిని జాటెనా యనన్ ౪౫౪

తే॥ యక్షచారణవిద్యాధరాంగనలును సిద్ధగంధర్వకిన్నరచేటికలును
రాసరంగంబు వీక్షించి రతినిమిత్తి ప్రశ్లథన్నీవులైరి భూపాలవర్య! ౪౫౫

తే॥ వేల్పు లారాసరంగంబ నల్పరీతిఁ గాంచి తత్సురాంగనలతోఁ గలిసి పూల
వానఁ గురిసిరి పిమ్మటఁ బద్మనాభుఁ డావిధమునజలక్రీడలాడి వేగ ౪౫౬

ఆ॥ ఎల్లవ్రేతలఁ గొని యల్ల గోవర్ధన గిరికి నరిగి యందు వరలుచుండు
శుద్ధరత్నఖచితసిద్ధబిలంబునన్ రాసకేళిఁ జేసి రాధతోడ ౪౫౭

తే॥ అల్లనల్లనఁ దిరుగాడి యచట గొప్పగొప్ప పూలగద్దియపైని గూరుచుండి
పర్వతస్థసౌదామినీభాసురాభ్రము వలెఁ బొల్పారె భూవరా! యవల వినుము!

చ॥ అతిశయకాంతికాంతముగ నా వెనుకన్ ప్రియసున్న రాధికన్
గుణకముతోడ వెచ్చాలులు కుంకుమసంకుమ ద్రైణవాదిపు
ష్పతతిపటీరకజ్జలసువర్ణమణీ ప్రస్ఫుతోడభూషణ
ప్రలతి సలాక్స్తపేల్ సలికి భాసిలఁజేసి దనంతరంబునన్ ౪౫౯

చ॥ యమున నవప్రసూనరస మర్మవిధంబున మీరఁజల్లి యా
యమునకు విధిప్రకారమున సన్నిలకల్పియుఁ బ్రోక్షకాళినే
తన్నిములకువిందొనర్చి నరరత్నవిభాసురనూపురంబులన్
గన్నినముగఁ జారితోడ ముగా నిడి కౌతుకమొందెఁబిమ్మటన్ ౪౬౦

ఉ॥ రంగదభంగతుంగబహురమ్యతరంగవినోదమైన శ్రీ
గంగయుఁగీర్తినందిని కళిల్మషభక్తిపవిత్రచిత్తమై
భంగనుగజ్జెయల్లలిగి కిన్నులపండువసేయుచుండు పా
దాంగదమొందుకాన్గఁగ వమర్పణముంబొనరించె నావలన్ ౪౬౧

చ॥ విరజయు గోటిచంద్రసమభిమ్మతిసంయుతచంద్రహార మిం
డిర వరకింకిణుల్ మధుమతీసతి, యంగదయుగ్మ మేకవా
శి, రుచిరకంకణంబులను శ్రీమధుమాధవి, హారముల్ విశా
ఖ, రతనముల్ మనోజ్ఞమగు కమ్మలు బంధి, యొసంగెఁబొంగుచున్ ౪౬౨

తే॥ అంగుళీయకములఁ జంద్రానవసతి, లలిత కంచుకరత్నముల్ జెలువమిన్న
యైన యా నందిభామ, యనర్ఘ్య ఫాల తోరణంబునొసంగె సంతుష్టితోడ.

ఆ॥ ఫాలభానుతుల్యఫాలపుష్పంబును చంద్రికన్య, యిడెను సంతసముసఁ
బన్నపూర్ణకీర్తిభానుకళానుమ ఫాలతిలకబిందు నొలినొసఁగె ౪౬౪

తే॥ మఱియుఁబద్మావతియు,ఘ్రాణ మౌక్తికంబు
బాహుపుష్పలనుశీతచంద్రవక్త్రి.యింక
వరశిరోమణిన్ సుందరీభామినియును
భక్తితోడుతనిచ్చెనో పార్థివేంద్ర ! ౪౬౫

క॥ బృందావననాయికయగు బృందాసతి,రమ్యరత్నవేణిని మఱియా
నందదచూడామణి నానందముతోడ వృషభానునందనకిచ్చెన్ ౪౬౬

తే॥ కృష్ణచంద్రుండు ప్రేముడి నెసఁగియిట్లు రమ్యశృంగారసంస్ఫురద్రాధతోడఁ
గూడి గిరిమీఁదనొప్పెను గోర్కితోడ యజ్ఞఁడాదక్షిణాసతి నలరినట్లు.

తే॥ ఎలమి గోవర్ధనాద్రియందెచటఁజక్రి రాసరంగంబునిర్మించి రాధతోడ
రాసకేళుల సల్పుచు రాణమీఱె నచట శృంగారమండలం బలరె భూప !౪౬౮

ఉ॥ పిమ్మట స్వప్రియాన్వితుఁడు నెమ్మదిఁ జంద్రసరోవరంబు వే
గమ్ముగఁ జేరి దాని యుదకమ్ములలో గజపంక్తిఁ గూడు నా
గమ్మువిధాన నాటలను గ్రాలఁ గళానిధి, చంద్రకాంత ర
త్నమ్ముల కెంపుసొంపు నిడ తద్వృషభానుకుమారి కాస్థతోన్ ౪౬౯

తే॥ వేయిదళములుగల కెంపుతోయజంబు లొందె నొక్కటి రాధకు నొకటి హరికి
నిచ్చి చనియెనుఁ దమవాతఁ గృష్ణుఁ డెలమిఁ బరమబృందావనశ్రీని సరిగఁ గనుచు.

ఉ॥ భూరుహవల్లరీయుతము పుణ్యసరోవరభూషితంబు నా
నారుచిరమ్యబాహులవనంబున కేఁగియుఁ దిగ్గి చెమ్మటల్
గారఁ జరించు నెచ్చెలులఁ గాంచుచుఁ బిల్లనగ్రోవి మేఘమ
ల్లారమనోజ్ఞరాగ మతులంబుగఁ బాడె విదేహభూమిపా! ౪౭౧

ఉ॥ అంచితరాగ మిట్లు విని యభ్రి మదభ్రముదంబుఁ బొంది వ
ర్షించె సువాసనారుచిరశీతలవాతము వీచె గోపికా
సంచయముల్ వ్యథల్ విడిచి సంతసమందియుఁ గృష్ణచంద్రు ధ్యా
నించుచు సద్గుణంబులను నెమ్మిని గానముఁ జేసె నంతటన్ ౪౭౨

చ॥ హరి యటనుండి లేచి తనయంగన లెల్లరు వెంటనంట స
త్వరగతి నేత్రపర్వమగు తాలవనంబున కేగి యందు సం
బరమున రాసకేళులను బాడుచు సల్పఁగ డంగె నింతలోఁ
గరము వ్రజాంగనాతతులు గ్రాలఁగ చెమ్మటఁ గ్రమ్మ నిల్లనెన్ ౪౭౩

శా॥ శ్రీకృష్ణా! హృదయేశ్వరా! వినుము! మారీతుల్ దగన్నాలుక
ల్బికన్ సాగెను దూరమయ్యెనల కాళిందీనదీరాజ మి
ట్లీకాండంబుగఁ గాఱుచుండెఁ జెమటల్ సృష్టిస్థితిధ్వంసముల్
జోకన్ సల్పెడివాఁడవీవె యిపుడా శుద్ధాంబులం దాడనా ౪౭౪

చ॥ అని వినయంబుగాఁ బలుక నాకమలేక్షణుఁ డాలకించి గో
బ్బునఁ దన వేత్రదండమున భూమిని బాఁదె ననంతరంబునం
దున నట "వేత్రగంగ" యన దొడ్డధునీమణి పుట్టె దాని స్ప
ర్శనమున బ్రహ్మహత్యలు గరంబు నశించుఁ బరంబుఁ గల్గెడిన్ ౪౭౫

ఉ॥ అంత ననంతలోకపతియా హరి రాధను గోపికాజనం
బంతయుఁ గొంచుఁ దజ్జలమునందు యదృచ్ఛగఁ గ్రీడలాడి బల్
సంతసమొంది యద్దివిడి సాగి లతాతరుపంక్తితోడ నా
పొంతఁ జెలంగుచుండిన కుముద్వనమేగెను మైథిలేశ్వరా! ౪౭౬

ఉ॥ అచ్చట నచ్యుతుం డలరి యాఁడుపికమ్ముల కూఁతలాలకించుచున్
మెచ్చుచు రాసరంగమున నిచ్చలు జేరి సఖీజనంబులన్
జొచ్చియు రాసమున్ సలిపె సొంపుగ రాధయు నందనంబులా
పచ్చనిపట్టుపుట్టములభాసిలునాభికొనర్చెఁ బత్త్రలిన్ ౪౭౯

సీ॥ సౌరభవాసితచంపకసుమములఁ గరముకట్టిన నడికట్టుఁగలిగి
వేయిదళంబుల వెలుఁగుపద్మంబుల సొంపుమించిన శ్రుతులఁబొంది
కనులపండువసేయుకల్హారకదంబపుష్పాలదంబు సెలఁగుకిరీటంబుఁబొంది
యందంబుగానుండు మందార కుసుమంబు లమరినయుత్తరీయంబు దాల్చి

తే॥ మోహనీమాలఁదాల్చియంభోజయష్టిఁ గేల నైకొనిమల్లికాకేతకీకు
సుమములన్ వెల్గుహారము సొరిదివేసి తులసిఁగూడుతోమాలఁ జెలఁగుచక్రి.

వ॥ సర్వర్తుకాంతుఁడగు వసంతుండొక్కెడఁ బొందిన స్వప్రియచే నట్లు కుసుమోద్యానంబునం బుష్పంబులచే నలంకరింపంబడి తేజరిల్లఁ దద్విహారాంగనాజాలం బాలోకించి వీణావేణుమృదంగనాదంబులం బొనర్చి మనోహరంబులగు భైరవ మేఘమల్లార భూపాళ హిందోల బంగాళ మాళవి దీపక కోశల మోహన పున్నాగ శ్రీ రాగాదులను వేఱువేఱుగా గానంబొనర్చి యష్టతాళంబులను, షడ్జమధ్యమ గాంధారంబులనెడి మూఁడుగ్రామంబులను, స, రి, గ, మ, ప, ద, ని, యను సప్తస్వరంబులను హావ, విభావ, భావానుభావసంభావితంబులును హృదయంగమంబులునునగు నృత్యంబులం గావించి జగన్మోహనులగు శ్రీ రాధాకృష్ణులను సంప్రీతులం జేయఁ దత్సుందరీబృందపరివృతుండగు నాహరి, యటనుండి వెడలి మురళీగానంబు కర్ణపేయంబుగా సల్పుచు వికచన్మాలతీమాధవీముఖలతావిద్యోతితంబును, దివ్యవృక్షసమావృతంబును, శారికాకీరాదివిహగకలరవసంభృతంబును, నిర్జనంబును, సకలజనమనోభిరామంబునగు మధువనంబునకేగి యందు నందనవనంబున బృందారకేంద్రుం డింద్రాణీసహితుండై యానందంబుఁ జెందినట్లు గోపీగణంబులతోఁ గ్రీడించి పెల్లుమోదిల్లి యందునుండి వెడలి,

ఉ॥ కుందవనంబు నామ్రవనిఁ గోమలమాలతిసద్వనంబు నా
నందదనాగరంగవని నవ్యకదంబవనంబుఁ గేతకీ
బృందవనంబు దీర్ఘవట విస్తృతసద్వని దాడిమీవనిన్
సుందరపిప్పలావని నశోకవనిన్ గని తిర్గి పిమ్మటన్ ౪౮౦

చ॥ వకుళ కరిల్ల కుంజ పిచు బాదర నింబ తమాల సద్వన
ప్రకరముఁబొంది కాంచి మఱి ద్రాక్షలకానకు నేగి శ్రీఫల
ప్రకటవనంబుఁజొచ్చి యటుపైఁ గదళీవనిఁజూచి కోవిదా
ర కుటజ దేవదారు వనరమ్యముఁ గన్గొని యుల్లసంబునన్ ౪౮౧

క॥ తులసీవనమునఁజొచ్చియు బొలుపునుగని యంతఁగల్పభూరుహవనిలోఁ
లలితంబుగఁదిరిగియు నా స్థలమునువిడనాడి సంతసంబున వేగన్. ౪౮౨

ఉ॥ కామవనంబుఁజేరియటఁగ్రాలు గిరీంద్రమునందు గోపికా
స్తోమముతోడ నాడి నగుచున్ మధురాధరలగ్నవంశితోఁ
బ్రేముడిగానమున్ సలుప వ్రేతలు మోహపయోధిమగ్నలై
యేమియుగుర్తెఱుంగనటు లిద్ధరవ్రాలిరి మూర్ఛతో విభూ! ౪౮౩

చ॥ మఱియు నమర్త్యభామలు విమానములన్ మదనాస్త్రభిన్నలై
సురలనుగూడి కళ్కలత సోలుచు వీడెడిపోకముళ్ళతో
వఱలిరి నద్దెఱంగులగు ప్రాణులు స్థావరరాజితోడ సా
మ్మరహిని బొందె నిల్చె నదిమండలి; యార్ద్రతఁ జెందె శైలముల్ ౪౮౪

ఉ॥ కామవనంబునందలరు గ్రావము శ్రీహరి పాదచిహ్నితం
బై మెఱపొందె నందెవఁడు పానముఁదానము నాచరించునో
యామనుజుండు ధన్యతను నందును భూవర! యంత శౌరి గో
పీమహిళాన్వితుండగుచు వేడ్కనుజేరుచు నంది శైలముల్ ౪౮౫

చ॥ కడునిడుపైనసానువులఁ గ్రాలుచు రాసముసల్పనుండి నా
పడఁతులు నానయెక్కుడగ భావములందునఁ బొంది వెంట రాఁ
దొడఁగకపోవుటల్ గనుచుఁ దోడ్తనె రాధికతోడఁగూడి యు
క్కడనె యదృశ్యుఁడయ్యెఁగద! కాంతలు ముగ్ధలుగారె! యారయన్ ౪౮౬

—♦ గోపీ విరహ వర్ణనము ♦—

ఉ॥ అంతట గోపికాలలన లాత్మమనోహరుఁజూడ వాఁడు త
త్ప్రాంతమునన్ వసింపమిని బాష్పములొల్కుచునుండ భీతితో
నెంతయు నిట్టుల్ దిరుగు నిట్టివలెన్ వనమందు నింక నా
చెంతలఁదిర్గిరో జనక! చెప్పఁగరానియనంతచింతలన్ ౪౮౭

క॥ కురవులు కురరముఁజూడనికరణినిఁగరినాథుఁగరుల గానవిభంగిన్
హరిఁగనఁజాలక వెఱ్ఱిని వఱలినరహి వారుదిరిగి ప్రశ్నించిరిటుల్ ౪౮౮

సీ॥ మధుకంబ! కంటివే మధురిపుఁగానవే మధురసా! మధురిమమహితవచను
బ్రహ్మణ్యా! కంటివే రక్షితబ్రహ్మణ్యు క్షీరికా! కానవే! క్షీరచోరు
నర్జున! కంటివే యర్జునసన్మిత్రుఁగుంసమా! కానవే! కుందరదనుఁ
బూతనా! కంటివే పూతనాఘాతకు భూరుండికానవే భూరమణుని

తే॥ హేమపుష్పిక! కానవే హేమచేలుఁ దిలకమా! కానవే! బుధతిలకుగనిన
నెనరు మాపయి నించి యీ నిముసమందుఁ జూపిరక్షింపరే మమ్ము శోకమూడ

సీ॥ మన్మథ! కానవే మన్మథమోహను మందార! కంటివే మందహాసు
పున్నాగ! కానవే పున్నాగసంవిహారు జాతిక! కంటివే చిత్రచరితు
సహకార! కానవే సజ్జనసహకారు గొతపంబ! కంటివే కితవరిపుని
శ్రీఫలా! కంటివే శ్రీరమణీశ్వరుఁ గృష్ణలా! కంటివే కృష్ణచంద్రుఁ

తే॥ సకలవృక్షమ్ములార! మా సకలభువననాయకునిఁగాంచినం గరుణాళువులయి
యెచటనుండినవార్త మాకెఱుఁగఁజెప్ప వేఁడుచుంటిమి శిరముతో వినతిఁజేసి.

చ॥ వనవనమందు నిట్టుల నపారముగా హరివర్ణనంబులన్
బొనరిచి సర్వవృక్షములముంగల కేగి కరంబులన్ మహా
వినయముతోడ మోడ్చి బహువేదన వేఁడిన నవ్వి సెప్పమిన్
వనటను గృష్ణ! కృష్ణ! యని పల్కుచు నాహరి నమ్మియుండుటన్ ౪౯౧

ఉ॥ గోపికలంద ఱబ్రముగఁ గోమలియాకృతులం ద్యజించి ల
క్ష్మీశ్వపతిరూపముల్ భ్రమరకీటవిధంబునఁజెంది తత్పదా
రోపితభూమిపైఁ దగి నిరూఢిగఁగాంచియుఁ గాంచలేక రా
ధాపదయన్ మదన్ గనిరి తత్పదచిహ్నితదివ్యదేశమున్ ౪౯౨

క॥ నావుడుమిథిలేశుండో దేవమునీ! చక్రి, రాధఁ దేఁకువఁగొనితా
నేవిధినెచటకుఁజనియెనో యేవిధమున గోపికలకు నెటనగుపడెనో? ౪౯౩

చ॥ అనియడుగంగ మౌని జనకా! విను మాహరి రాధతోడ ని
ర్జనము రహస్యమైన వటసాలసమీపమునందుఁజేరి గో
ప్పునఁ దనఁరాణిసిన్ గబరిపుష్పలచేత నలంకరించె నం
తన లఘిమాలలాఘుయు ముదంబు మనంబునఁబొంది డంబునన్. ౪౯౪

తే॥ చక్రనీలకుంతలముల సంగ్రహించి మెలియఁబెట్టి సువాసనామిళితతైల
ములనుబూయుచునవ్వి సంపూర్ణచంద్ర ముఖమునంబత్రభంగంబుఁబూనిసల్పె.

ఉ॥ అంతటరాధికాచ్యుతులు నావటమున్విడి భద్రకానన
ప్రాంతముఁజెంది యంత ఖదిరప్రకటాటవికేగి తిర్గుచున్
సంతసమొంది బిల్వవనిఁ జక్కభ్రమించియుఁ గోకిలాటవిన్
వింతలఁజూచి పాడుచును వేడుకఁజెందుచునుండిరో విభూ! ౪౯౫

చ॥ అరయుచు వేత్ర లట్టులఁ దదచ్యుతపాదసుచిహ్నితావనీ
సరణినిఁబట్టి పోవుతఱి స్వస్తిక చక్ర ఝషాష్టకోణతో
యరుహ ఘట త్రికోణ విశిఖా కుశ కేతన శంఖ నీల గో
ఖురసమచంద్ర వజ్ర యవగుంఫిత రేఖలఁగాంచి వెంటనే ౪౯౬

చ॥ ఘనముగనున్న ఛత్ర యవకంబులు చక్ర గదార్ధచంద్ర జీ
వనజ కుశాంకుశాసన లవంగ లతా ధ్వజ బిందుయుక్త మ
త్స్య నగ శతాంగ శక్తి విలసత్స్వర రేఖలఁజూచి రాధికా
వనితపదంబు లివ్వియని వారలా వ్రజకాంత లంతటన్ ౪౯౮

చ॥ ఒక యెడ నిల్చి మార్గమున నోచెలులార! రమేశ్వరుండు రా
ధికను గ్రహించి యాపథినిఁ జిన్నగ నేగెను గాంచనానటం
చకలుషభక్తిఁ గోకిలమహాటవిఁ జేరిరి తత్ప్రవేశసూ
చకరవ మావనిం జిసుగ కౌరియు విం చలరాధ కిట్లనెన్ ౪౯౯

తే॥ కోటిచంద్రప్రతీకాశ! కువలయాక్షి! రాధికా! ప్రియ! గోపికల్ రామొదలిడి
నిన్నుఁ గొంపోవఁగలరిఁగ నీవు వేగ నహుగ పెంచుము నాతోడ ననియె నవల

ఉ॥ మానవతీలలామయు సమంజసభావనరూపశీలకా
లీనమనోజ్ఞ రాధిక, బలిప్రభువైరి వచించు సూక్తిసం
తానము నాలకించి ప్రియ! తాళను నేసుకుమారిఁ జెమ్మటల్
మేన స్రవించెడిన్ గదలలేనిఁక నన్నెటుఁ గొంచు నేగెదో! ౫౦౧

ఉ॥ ఇట్టులఁ జెప్పఁగా సరసిజేక్షణుఁ డున్ విని స్వీయమైన హాం
బట్టున వెల్గుపుట్టమును బట్టి స్రవించెడి స్వేదమారని
క్కట్టులు సట్టనన్ విడువఁగాఁ దగినట్టులవీచి దేవి! యీ
పట్టున లెమ్ము రమ్మనుచుఁ బాణిని బట్టుచుఁ బల్కె నామెయున్ ౫౦౨

చ॥ పెడచెవిఁ బెట్టి యూరకొనెఁ బిమ్మట లచ్చిమగండు తిర్గి యా
మడఁతికి నిట్టులన్ బలికె మానినిరో! మనముండు పట్టు ని
ప్పుడుగని పెట్ట గోపికల మొత్తము వచ్చెడి నిందు వారని
న్విడి యెటకేనిబోయి యట నీకెది యిష్టమొ యద్ది దీర్చెదన్ ౫౦౩

ఉ॥ కావున లెమ్ము నాభుజముఁ గట్టిగఁ బట్టుచు నెక్కి హాయిగా
నీవు వసింపుమంచుఁ గడు నిక్కి నస్కంధముమీఁద నాయమన్
దా వహియించి యెక్కడకొ తర్లె ననంతరమందు గోపికల్
శ్రీవిభుఁ గాంచఁజాలక విశేషవియోగకృశానుదగ్ధలై ౫౦౪

ఉ॥ సిబ్బితి వీడి యాయడవిఁ జేరి కడుంగడు నేడ్చి రాదరిన్
బ్రబ్బిన గోపియూథము లవారిగ విం చల కోకిలాటవిన్
గొబ్బునఁ జేరి యాద్యుతినిఁ గోమలులార! నిమేష మీరిటన్
నిబ్బర మొందుఁడీ కనులనీరము గాఱఁగ నియ్యకొందుఁడీ! ౫౦౫

చ॥ అని తమి నాశ్వసించుచుఁ దనన్నులుఁగొందఱు రెండుఁబ్రక్కలం
దున మకరందసేచనము దుష్టిగఁ జల్లి సుగంధవస్తువుల్
గొని మెయిఁబూసి తళుకుల్ గలుగంగ నలంకరించి పే
ననలను ఛత్రచామరలఁ బట్టుచు పేన మహాద్భుతాకృతిన్ ౫౦౬

చ॥ సవిధమునందు వేడ్క నొకస్వామిని గన్పడి యల్లగోపికా
నివహముననాఁజడించి "బళి! నీరజలోచనలార! రాధికా
ధవుఁడిటు రాఘమానమును దాఁగొననేగెడి" నన్న విన్న య
జ్జవిపులనేత్రలైన వ్రజభామలు విస్మయమొందిరో విభూ! ౫౦౭

క॥ చింతల నటుఁబొందిన తత్కాంతలు తౌర్యత్రికంబు గ్రాలఁగఁ నాశ్రీ
కాంతగుణయశోగానము చింతలఁబోఁద్రోసి యిటులఁజేసిరి భక్తిన్ ౫౦౮

—♦ గోపికలు శ్రీరాధాకృష్ణుని గీర్తించుట. ♦—

తే॥ నందనందన! యానందకంద! కుందరదన! మన్మథమోహనా సదయహృదయ!
విశ్వభూషణ! జననుత! విశ్వదీప! విశ్వదుఃఖవినాశకా వినతులివిగో!

చ॥ అవనిసురోత్తమశ్రుతి జయధ్వజ! నందకులాబ్జభాస్కరా!
దివిషదమోఘవంద్య! సురతృప్తిదకార్యధురీణ! ధారణీ
ధవ! మధువైరి! ముక్తజన దర్పణ! కంసమురాదిమారణా
ర్థవిధికృతావతార! యదురాజ! జయంబు ఘటిల్లుచుండుతన్ ౫౧౦

క॥ గోపాల సింధుచంద్రమ! గోపకవంశాద్రిశిఖర! గోధునికమలా!
గోపరిపాలన దక్షా! గోపకగృహరత్నదీప? గోపకవినుతా! ౫౧౧

క॥ రామాభిరామ! సుగుణోద్దామా! కల్యాణసీమ! దైత్యవిరామా!
శ్యామవతేజోధామా! రామానుజ! వారిజాభిరామా! భూమా! ౫౧౨

క॥ రాధాస్యసరోజాళీ! రాధాముఖచంద్రకోక! రాధారమణీ
మాధుర్యలతామాధవ! రాధాహృచ్చంద్రహార! రాధాకృపా! ౫౧౩

ఉ॥ ఎవ్వఁడు రాసకేళులను నింతులఁగూడుచు నాచరించెనో
యెవ్వఁడు వేణుగానమున నెల్లజగంబులఁ దృప్తిఁజేసెనో
యెవ్వఁడు గోపికాళినయనేంద్రియజీవనము కృపాకరమై
యవ్యయముగా వసించు నల మాపతి మాపతి మమ్ముమన్నుతన్ ౫౧౪

ఉ॥ ఏవిభుఁడెల్ల యాధముల యిష్టముదీర్పఁగడంగె నేఁడు రా
ధావనజాక్షిమానము నదాటున నొంటిగమాన్చె నేఁడు బృం
దావనిఁ దళ్కునల్పె వసుధావిభవాఢ్యుఁడెవండో యెవ్వఁడా
గ్రావము శుద్ధిజేసె నలకారుణికుండు ప్రసన్నుఁడయ్యెడున్ ౫౧౫

చ॥ అరుణ, కళానిధుల్, జ్వలనునట్లు ప్రసన్నవనప్రవేశమో
ఘురకవనప్రవేశముగ సొంపగు చల్లనిగాలి వీల్లఁగా
విరు లెఱనిప్పతున్కలుగ వేస్గ్రము నొల్కఁగ మాకుఁ బోఁచె నిన్
దొఱఁగిననాఁటఁగోలె దయతోడఁ బ్రసన్నతఁబొందు మోహరీ! ౫౧౬

చ॥ తొలుత సుదాసపుత్రకునితో యమ్మలి భర్తనుఁబీడి బాధలన్
నలిగెను దానికంటె నలునాతి నలిన్ విడి కష్టమొందె నా
సిలుగులమించి సీత తనజీవితనాయకుఁబాసి పెల్లు బా
ములఁబడె దానికన్న నిది వొందఁగరానిది కృష్ణ! బ్రోవుమా! ౫౧౭

—♦ శ్రీకృష్ణుండు గోపికలకుఁ బ్రసన్నుండగుట. ♦—

మ॥ అని ప్రార్థింపఁగ దేవకీసుతుఁడు భూషాలంకృతాకారుఁడై
నునుపుట్టంబులఁగట్టి యామురళితో నూజాసు రాగంబులన్
ఘనలీలన్ గడుగానమున్ సలుపుచా కాంతాసమక్షంబునన్
దనరెన్ రాధనుగూడి చిర్నగవు వక్త్రంబందుఁ బొల్పారఁగాన్ ౫౧౮

తే॥ అంత గోపికలందఱు జింతలవిడి వచ్చినిలిచినకృష్ణుని మెచ్చుటఁగని
యొక్కసారిగ లేచి యను త్తమవిధిఁ జుట్టుముట్టి రంతట మధుసూదనుండు

క॥ గోపికలెందఱు గలరో రూపములన్నింటిఁదాల్చి గోపిష్ణుండై
యాపడుచులలో నడుమను నేపునఁ దా నిల్చి నాట్యమెలమినొనర్చెన్

తే॥ చేసి యట్టుల నాట్యంబు శ్రీధరుండు వనమునందొక్కచోనుండ వల్లవసతు
లుగని యాజలజాలయాలోలు డాసి దోసముల క్షమింపుమటంచుఁ జేసి నతుల

క॥ వినవే మామొఱ దేవా! కనవే కారుణ్యమతిని గాసుగ జగమున్
గని సర్వము నీవేయని మనమందున నమ్మి మమ్ము మఱచుటదగునే?

క॥ నమ్మిన మమ్మును మోసమ్మిమ్మాడ్కి నొనర్చి యెచటికేగితివో నీ
నెమ్మది యెట్లుసహించెనో యమ్మక్క! యిదేమి న్యాయమయ్యా కృష్ణా!

ఉ॥ ఆపయిఁ గృష్ణమూర్తి వినుఁడంగనలార! మనోజ్ఞపుష్కర
ద్వీపమునందు దధ్యుదధి దివ్యమునీంద్రుఁడు హంసనామకుం
డోపి మనుద్వయాంతరము నుత్తమపద్ధతిఁగోర్కిలేక నా
ప్రాపును వేడుచున్ దపము బాధముగానొనరించె నింతలోన్ ౫౨౪

తే॥ యోజనార్ధశరీరము నొందియున్న రెండుచేఁపలే తెంచి యా దండిజోగి
మింగె. వానిలోనుండి యభంగభంగి నిర్గమించెఁ బాణ్నామక నిర్ఝరారి

ఉ॥ భక్తుని కంతవంత యటువచ్చుటఁగాంచి విజ్ఞాన నేగి నా
శక్తిని వానిఁగొట్టి మునిసత్తముఁగాచియుఁ జెల్లపేవిలో
యుక్తముగాఁ జెలంగెడి పయోధి ఫణీశ్వరతల్పమందునన్
రక్తిఁబరుండి కొండిఁయుఁ గరంబుగ పారవశతఁగాంచి వచ్చితిన్ ౫౨౬

తే॥ భక్తవశ్యుఁడ నెప్పుడున్ భామలార! క్షీరసాగరమందలి శేషశయ్య
గాఢనిద్రను జెందెడి బాధసౌఖ్యము విడి యిటువచ్చుటకు నదే మూలమయ్యె

తే॥ శాంతి దాంతి సమేతులు సన్న్యాసములు నైరపేక్ష్యులునగు మునినాథులెల్ల
జ్ఞానవిషయుల్ రసాదుల సరసనెఱుంగుకరణి నాసిరపేక్ష సుఖమని యుంద్రు

తే॥ అంత గోపికలో దేవ! యబ్ధియందు శేషశయ్య నీకొప్పిన చిత్రరూప
మిపుడు దయతోడఁ జూపుమో కృష్ణచంద్ర! యంచు సన్నుతింపఁగ నాతఁడభిమతించి

సీ॥ అభ్రంకషంబులౌ యలలతోఁ దుతఁగ్రాలు పాలకడలి నటఁ బొడఁజేసి
నవరత్నములతోడ నయనపర్వమొనర్చు ప్రాసాదరాజముల్ ప్రబలసల్పి
బాలప్రభాకరభవ్యసహస్రభోగంబులు గల శేషుఁ గ్రాలఁజేసి
వృషభానుపుత్రియై విశ్వమోహినియైన రాధను లక్ష్మిగా రాణమార్చి

తే॥ అష్టభుజములఁ దాలిచి యంఘ్రితలమునందుఁ గలుములజవరాలు నడుగులొత్త
గోటిమార్తాండమూర్తియై కుండలీంద్రశయ్య నిద్దురవోయె నో జనకరాజ!

చ॥ పదపడి గోపికావళి యపాంపతినిర్మితశేషశయ్యపైఁ
గుదిరిన కృష్ణచంద్రుఁగని కొంకక యైదుపదుల్ పొనర్చి స
మ్మదమును బొందె నేస్థలి నమోఘముగా హరిదర్శనంబు త
త్సదపతులకిచ్చె నాస్థలము దోషహరంబును బుణ్యదంబగున్ ౫౩౧

— యమునాతటమందు రాధాకృష్ణులు విహరించుట. —

క॥ పిమ్మట హరి, గోపీవ్రాతమ్ములతోఁగూడి వేగ తద్యమునా నీ
రమ్ములను గళాకేళి సుఖమ్ముగ నొనరించె రాధికాయుక్తుండై ౫౩౨

చ॥ వనజదళాయతాక్షి వృషభానుకుమారిక, వేడ్క లక్షప
త్రనిభృతదివ్యపద్మముఁ గరంబునఁదాలిచి నిల్వఁగన్న యా
కనకపటుండు డాసి తమకంబునఁగూడుచుఁ బాడుచుండి య
ట్టైనగుచు నెట్లొ దానిఁగొని పెక్కనరేగఁగడంగె దన్నదిన్ ౫౩౩

తే॥ అంత నక్కమలేక్షణ యభయుఁడగుచు నక్కళిందజానదిఁజను నచ్యుతుఁగని
వెంటపడి వాని పట వంశివేత్రములనుగొని హసించుచుఁ జనసాగె జనకరాజ!

ఆ॥ అపుడు శౌరిగాంచి యయ్యవి ప్రేయసీ! నాకునిచ్చిపొమ్మనంగ నామె
నాథ! నాకమలము నాకిమ్ము పిమ్మట నీకునివ్వియిత్తు నిక్కమనఁగ

క॥ గరుడధ్వజుఁ డో తరుణీ! సరిసరి యిఁకఁ జాలుఁ జాలు సరసము నాతోఁ
బురుషుల మించఁగ నెంతువె సరగున నవిడెమ్ము పిదప జలజముఁ గొమ్మా!

తే॥ అవలరాధయు మాధవా! యన్నెచిద్ది దొలుత నాతమ్ముఁ గొనలేదె వోసమెసరి
దయ్య! యోజించుమనఁ గృష్ణుఁ డా కమలము నామెకిడి తనవస్తువులన్నిటిఁ గొనె

క॥ శ్రీరాధా హరులంతటఁ గోరిక భాండీరవన మకుంఠితగతితోఁ
జేరి యలంకృతులొండొరు లారా! యనఁ జేసికొనిరి హరిదాసమణీ! ౫౮౦

తే॥ పిదప శ్రీకాంతుఁ డట్టి యాభీరసతులఁ గూడి మాధవీముఖలతా కుసుమభరిత
మైన లోహజంఘువనంబు నరిగి యెల్లగొల్లఁతల తలలను బూలఁ గూర్చి ముడిచి

ఆ॥ అచటనుండి గదలి యమునతీరంబున గోపసతులతోడఁ గూడి తిరిగి
తరులతాసుమఫల వరమహాపుణ్యవనంబుఁ జేరి విపులసత్వరథను

చ॥ సురపతి యప్సరోంగనల శోభిలి యాడెడిమాడ్కి రాధికా
తరుణిసిగూడి గోపికలు తాళము వేయుచుఁ బాడుచుండ న
బ్బురమగు రాసకేళులను బొల్పుగఁ జేయఁగడంగె నందు భూ
వర! యొకచిత్రమయ్యె నదివల్కెద బాగుగ నాలకింపుమా! ౫౮౧

## శంఖచూడ కంసులు గదాయుద్ధం బొనరించుట.

ఉ॥ దక్షుఁడు ముద్గరాజి ధనదప్రభుభృత్యుఁడు శంఖచూడుఁ డన్
యక్షుఁడు సాటిలేక ధరయం దొకవేళను నాముఖంబునన్
శిక్షితకంసవిక్రమవిశేషము వీనుల నాలకించి స్వీ
యాక్షయలక్షభారయుత మౌ గదఁ గేలఁ గ్రహించి యుద్ధతిన్ ౫౮౨

చ॥ వడి మధురాపురంబునకు వచ్చి మహోత్కట కంసగోష్ఠి క
ప్పడెచని మ్రొక్కి యాదవవిభూ! యిల నీవు గదాసమిత్కృతా
స్థుఁడవని వచ్చితిన్ గనుకఁ దోడ్త గదాసమరంబు జేయఁగా
నడిగెద నిందు నోటమియె నాఘన జేతకు దాసుఁడయ్యెడిన్ ౫౮౩

తే॥ అనఁగఁ గంసుఁడు దానికి నభిమతంబు జూపి గదగొని మధ్యాహ్నసూర్యుపగిది
మండిపడి శంఖచూడుతో భండనంబు సల్పమొదలిడె వార లాసమయమందు

క॥ కరి గరిఁ బోరెడి కైవడి హరి హరియును జేరి కలహమాడినయట్టుల్
గిరిగిరి దాఁకినవిధిఁ జూపఱకును నగుపడుచు వారు పటుదర్పమునన్ ౫౮౪

ఆ॥ ప్రళయకాలమేఘ భయదరావముబోలు రెండుగదల రొదలు రేఁగుచుండె
నటియు నటుఁడు నటనఁ జటులంబుగా సల్పుకరణి వారుబోరఁ గ్రాలి రపుడు

తే॥ రెండు గదలును మొత్తనిట్టిడి పోటు జూచి కంసుండు గసి శంఖచూడయక్షుఁ
బిడికిటంగొట్టెఁ గ్రమ్మఱఁ బృథుల ముష్టి శంఖచూడుండు కంసుని౦జదియఁగొట్టె

చ॥ సురనికరం బనంతమునఁజూడ యదూద్వహ శంఖచూడు లి
ట్లిరువురయేడువాసరములేగెడిదాఁక రణంబునాచరిం
చిరి పిదపన్ యదుప్రభువు చేత గ్రహించుచు శంఖచూడు నం
బరమున వందయోజనలు బాఱఁగవైచె ననంతరంబునన్ ౫౪౯

తే॥ శంఖచూడుండు పైనుండి చదికిలఁబడి కొంతచింతించి క్రమ్మఱఁ గోడెపుంజు
వోలె లేచియుఁ గంసునిఁబూన్కిఁబట్టి వినునఁ బదివేలయోజనల్ జనఁగవిసరె

చ॥ అటుపయి నుగ్రసేనసుతుఁడాకసమందున నుండి గూలి మ
ల్లటపడి తిగ్గిలేచియుఁ జలంబున సింగముమాడ్కి వానిపైఁ
దటుకున వ్రాలి పట్టుకొని ధారుణిని౦ బడఁదన్నె యక్షుఁడం
తటఁగసిఁ గంసుఁగొట్టె వసుధాస్థలిఁదొక్కెను మైథిలేశ్వరా! ౫౫౦

చ॥ ఇటుల మదాతిరేకులు నహీనబలిష్ఠులు ముష్టిభండనో
త్కటులు గదాభిధన్యులు నకంపితధీరులునైన వారలా
ర్భటులు చెలంగ యుద్ధము నపారముగానొనరింప భూమి వే
చటులభయంబునన్ వణఁకసాగెను వీరులు జెంది రభ్రమున్ ౫౫౧

తే॥ అట్టి కాలంబునందున నఖిలయదు పురోహితాగ్రణి శ్రుతిశాస్త్రరూఢిభావ
విదుఁడు గర్గమునీంద్రుఁడు కదనముఁజని వినతులంగొని కంసున కనియె నిట్లు

వ॥ యదువరా! ముందు కదనంబు మాని నామాటాలకింపుము. ఈ మహా బలిష్ఠుండగు శంఖచూడుండు నీతో దీటుకురాఁదగు పోటుమగండుగాఁడు. కాన నీకు సాంపరాయంబు సాంప్రతం బసాంప్రతంబయగు మున్ను బలశాలివగు నీదృఢ ముష్టిని సర్వసుపర్వేంద్రుని వాహనంబగు నైరావతంబు సైతము ధరణింబడి త్రోభిల్లి యమరావతీపురంబునకుం బరుగిడదే? మఱియు నీబలంబున డిందిన వీరుల పేరులుగ్గ డింప నలవియగునే? రెండియు నీ యక్షుండు నీకు సఖుండుగాని వధ్యుండుగాఁడు. పరిపూర్ణతముండగు శ్రీకృష్ణునిచే నీఁడు మడియదగినవాఁడు. కాన సందియంబు మాని వేవేగ వీనితో నేస్తంబొనరింపుమని చెప్పి శంఖచూడుని వైపునకుం దిరిగి యక్షవరా! మీయిరువుర కొక్కఁడే ఘాతుకుండై యుంటఁ గంసుండు నీకుఁ బ్రాణ మిత్రుండగునట్లొనర్చుకొనుమని యుపదేశింప, నా యదువరశంఖచూడు లాముని వాక్యంబుచొప్పున సఖ్యంబొనర్చిరి. కొంతకాలమగుడు తద్యక్షుండు మిత్రునివీడ్కొని స్వగృహంబున కేగుచు, మార్గమధ్యంబున నిశీథమందు మనోహరంబగు రాసగానం బాలించి, తత్కాలశబ్దానుసారంబుగా నరుగుదెంచి, రాసమండలంబు గన్గొని యందు

రాధికాలంకృతవామభుజుండును, స్వచ్ఛందవక్రీకృతదక్షిణపాదుండును, వేత్రవంశీధరుండును, జగన్మోహనుండు నగు శ్రీకృష్ణుండు ఛత్రచామరాద్యంచితలగు గోపికలు చుట్టుముట్టి కొలువ, రాసక్రీడలొనర్చుటం గాంచి, రాసేశ్వరుండు వాసుదేవునిగా నెఱింగి, యతని సామాన్యబాలుగా గణించి, సుందరులగు తద్గోపికల నపహరింప నెంచి, సమీపించెనని విన్నవింప విని, రాజేంద్రుం డాశ్చర్యమగ్నమనస్వియై మౌనీంద్రుతో నిట్లనియె. ౫౫౫

## —♦ శ్రీకృష్ణుండు శంఖచూడుని వధించుట. ♦—

తే॥ అంత రాసరంగంబున నతఁడువచ్చి యేమిచేసెనో ? నాకది యెఱుఁగఁదెలుప
మిముఁ బరావరవిత్తము నమలభక్తి నభినుతించెద నన ముని యనియెనిట్లు

ఆ॥ అధిప ! వ్రేతలెల్ల రాతాళభూరుహాయతశరీరు ధీరు వ్యాఘ్రముఖుని
నసితవర్ణు యక్షు నతిలలజ్జిహ్వుని గాంచి పరుగులిడిరి కడిఁదినడలి ౫౫౬

తే॥ అపుడు కోలాహలంబులు నతిశయిల్లె యక్షుఁడా పాఱునతివలన్ హాహాయని
పాఱెడి శతచంద్రాననన్ బట్టి యుత్తరాశఁజనెఁ గాము లెంతసాహసులుదలఁప

శా॥ ఓరా పోకిరి ! లేకి ! నన్నిడువురా భూమిన్ స్వసల్ దల్లులున్
లేరా నీకిఁక నున్నచోఁదగునె ఛీ లేదా నయంబించుకేన్
రారా చూడర మంచిచెడ్డలను నన్ రక్షింపరా యేఘనుల్
మారాకారుఁడు నావిభుండు త్రుటి నిన్ మాయింపఁజా లుంటకే! ౫౫౭

క॥ అని దూఱుచు హరి హరి హరి యనుచడలుచు నార్చు చల్ల యక్షునిమీఁదన్
దనరుచు నరిగెడితనచెలి వనజాక్షుఁడుగాంచి సాలపాణియయి చనెన్ ౫౫౮

ఉ॥ ఆవల గుహ్యకుండు వెనునంటుచు దండధరోపమానుఁడై
లాపునవచ్చుచున్న కమలాపతిఁగన్గొని భీతినల్ల హే
లావతి నచ్చటన్ విడి పలాయనమయ్యెను బిమ్మటన్ దదిం
ద్రావరజుండు నుద్దవిడి సర్వవిధంబున వెన్కొనెన్ జుమీ ౫౫౯

చ॥ కని యది యక్షుఁడెల్లెడలఁ గాల్పొలఁదిన్ పరుగెత్తినన్ జనా
ర్దనుఁ డగధారియై వెనుకఁగ్రాలుట శీత నగాంతికంబునన్
కని యొకసాలమున్ బెఱికి కయ్యముఁగోరుచు శ్రీశసమ్ముఖం
బున నిలుచుండ శౌరి యల భూరుహముంగొని వేయ వానిపై ౫౬౦

ఉ॥ వాతహతాగరీతి వడి వాఁడిలపైఁబడి తిర్గి యుత్థితుం
డై తనముష్టి శ్రీధరుఁబడన్ బ్రహరించి దిగష్టకంబునన్
మ్రోఁతసెలంగ రోసమున బొబ్బలిడన్ హరిగాంచి యక్షునిన్
జేత గ్రహించి త్రిప్పియుఁ గసిన్ ధరఁగూల్చె ననంతరంబునన్ ౫౬౧

తే॥ శంఖచూడుని కృష్ణుఁడు సంగ్రహించి భూతలంబున బడెను బ్రీతిమాని
ధ్వంస్వీయుద్ధమేతద్రీతి వజలంబుజమి యడలఁదొడఁగెను నంతినుంబందు జక్రి

చ॥ పిడికిలితోడఁ దచ్ఛిరము భిన్న మొనర్చియు దానినుండి వె
లైడుమణి భాగ్యవంతుఁ డవలీలఁగ శేవధినిన్ బరిగ్రహిం
చెడువిధి సంగ్రహించెఁగద శ్రీపతియై హరి యన్యదీయమా
విడిఁగలకెంపుఁ గైకొనియె వింతఘటింపదె? యిద్ది భూవరా! ౫౬౩

తే॥ అంతఁ దజ్జ్యోతి శ్రీకమలాక్షునిదుఁడైన శ్రీదాముచందన లీనమయ్యె
నిటుల శంఖచూడుని వధియించి మణికరుఁడయి వెన్నుఁడు గ్రమ్మఱవడిని వెడలి

తే॥ రాసరంగంబుఁజేరి సంతోసమొదవ మణి నలకౌతచంద్రానవామహిళకిచ్చి
గోపికలఁగూడి తద్రాసకుర్దనములఁజేసి యమునాతటశ్రీని జేరి కనుచు

క॥ బృందావనమున కనుఁగుచు నందున విహరింప నెంచె నటుపై హరిచేఁ
బొందినవరమున నోషధిబృందము సతులౌచు యూథవృతలై రతికై ౫౬౬

చ॥ హరిసవిధంబునన్ నిలువ నచ్యుతుఁడట్టి లతాంగనాజనం
బరుసమునన్ గనుంగొని మహాద్భుతితో మననార వారితో
మురళిని గీతిఁబాడి నగుమోమున రాసమొనర్చి యాయనం
తరమున రాధతో యమునదాఁపునకుం జని చూచి తత్తటిన్ ౫౬౭

చ॥ త్రివిధములన్ సమీరణుఁడు దివ్యసుమంబుల సౌరభంబులన్
నవకముజెంది వీవఁగఁ గనద్వటవంశికదంబయుక్తమై
భవికమై మనోజ్ఞమయి భాసిలుసైకతమందు రాసకే
ళివలనఁ గల్గినట్టి శ్రమ, లీల నశింప వసించె భూపతీ! ౫౬౮

తే॥ అపుడు గోపికావేణువీణాదివాద్యసరణి ననుసరించి సకలసురలు గరము
వార లిష్టాప్తి బాలవాననుకురియించి రందలిసతులు సేవించిరిటుల

## —♦ గోపికలు విహ్వాలలై శ్రీకృష్ణునింజేరుట. ♦—

చ॥ మరగిన కొందఱున్నలరె! మాపతి! మాపయిఁ గోపమేల? సుం
దరులముగామె యేమిఁకను దాళగలేము, విరాళిహెచ్చె ని
ష్ఠురముగ నుండఁబోకుమని జోతలొనర్చిరి కొందఱంగనల్
వరగళమందు హారములవైచి వసించిరి కృష్ణుముంగలన్ ౫౭౦

సీ॥ కాంతుఁడా! రమ్మని కరమునులాగుచుఁ గుతుకమొందెడిచెలుల్ కొంతమంది
పంకజనాభుని వక్షంబుదాఁకుచుఁ గోర్కులొందెడిసతుల్ కొంతమంది
కరములఁ గమలాక్షుఁ గ్రాలసల్పుచువనిన్ గ్రమ్మరుకోమలుల్ కొంతమంది
శ్రీహరి మోవిలనుజేరి తళ్కులబెళ్కు కుల్కులందగుచెలుల్ కొంతమంది

తే॥ రాధికావేషమును బూని రాణమీఱి కుసుమగాత్రు మెలఁతలు కొంతమంది
కృష్ణవేషంబుతోఁ జుతేఁ గీర్తనంబు వింతగాఁ జేయుచుండిరి కొంతమంది ౫౭౧

సీ॥ తాళస్వరంబులఁ దేలిమి రాగముల్ పాడిరి కొందఱు భామినులును
హావభావసంభావితమ్మలు నాడిరి కొందఱు కామినులును
జారిణీవృత్తుల శౌరినిం జేరుచుఁ గోరిరి కొందఱు కోమలులును
విశ్వమోహనుఁడైన వెన్నునిఁ గనులారఁ గాంచిరి కొందఱు కామినులును

తే॥ పురుషోత్తముతోడుతఁ బూలబంతులాడఁదొడఁగిరి కొందఱుపోరికలు మఱి
దానవారాతితోఁ దమి దాఁగురింతలాడిరో జనకా! కొంద ఱతివలింక

సీ॥ కడియంబులందియల్ గల్లుగల్లనమ్రోయ హరి మధురాధరమాను సతులు
యోగిమర్లభమైన శ్రీగరుడధ్వజు పట్టపుకాళ్ళఁ బెనఁగిరి సఖులు
జన్నినవ్వనవెల్లు వెన్నునినెమ్మోముఁగని నవ్వి ముద్దాడిరి కొందఱు రమణులు
కృష్ణకృష్ణాయని కేవలభక్తితో నాతనిగుణముఁ గొండాడుచెలులు

తే॥ సరసపరిహాసముల్ జేసి సమ్మదంబుఁ జెందు మందయానలు తత్కాలింపజూచి
రిత్తటిఁ మూఁగి రాధికా శ్రీహరులకు దృష్టిఁగూర్చుచునుండిరో దివ్యచరిత!

చ॥ హరియును వారలంగలిసి యాడుచుఁ బాడుచు పేరెమిచ్చుచున్
మఱియును గొంచు నృత్యములమాటున డాఁగుచుఁ గావిమోవులన్
గొఱకుచు నవ్వుచున్ బ్రణయకోపముఁబొందుచు వారికోర్కులఁ
ద్వరఁ నెరవేర్చుచున్ మిగులభాసిలుచుండెను మైథిలేశ్వరా! ౫౭౪

సీ॥ సకలవిధంబులఁ జక్కఁగాఁ బోషించు తలిదండ్రులఁ జుట్టములను వీడి
యాపదల్ బాపుచు నఖిలసుఖంబుల గడనఁజేసెడి విడిముడిని విడిచి
యుభయలోకానందమొదవించు సుందరియైన యర్థాంగిని నవలఁద్రోసి
మెండగునెండలఁ మండియు, వానలఁదడసియుఁ జలిచేత దడను జెంది

తే॥ యన్నపానాదులఁ విడి యనిలభక్షకులయి నిర్వాతదీపమువలె సమాధి
గ్రాలు యోగులునైతము గాంచలేని హరినిఁ బొందిరాసతులిది యరుదుగాదె

ఆ॥ ఇటుల ద్వారకేశుఁ డింతులతోఁగూడి రాసకేళిసల్పె నాసమయము
నందు నొక్కచిత్రమయ్యె నయ్యది యేదియనినఁ జెప్పుచుంటి వినుము జనక!

## ఆసురిమహాముని కథ.

క॥ ధీరుండగు నాసురిముని నీరజదళనేత్రునమ్మి నిర్మలతపముఁ
నారదనామకనగమునఁ గోరికవిడి చేయఁదొడఁగె క్షోణీనాథా! ౫౭౭

ఉ॥ దానికిమెచ్చి యచ్యుతుఁడతండు తపంబొనరించు వేళలో
మానక సుందరాభరణమండితుఁడై సహధర్మిణీయుతుం
డై ఘనమోహముతో జరని యక్షియుగంబున గోచరించు చ
న్మానమునందుఁ జూచుఁ జనుఁ బ్రతిఘనమ్మునందు భూవరా! ౫౮౮

తే॥ సృష్టి తమనాంబునందు శ్రీకృష్ణుఁడొక్కపరిఁ దన్నేత్రముల కగుపడకపోయె
దీనికెంతో యమ మానుదివహానివహ్యుఁడాడఁజెందుచు యోజించి యచటనుండి

ఆ॥ తపము నాపి కృష్ణదర్శనలాలసుఁ డగుచు లేచి యల మహాముని౦ద్రి
మాన్యబదరికాశ్రమంబున కేతెంచి హరిని గనక వగచి యందుసాగి

క॥ లోకాలోకాద్రికిఁ జని శ్రీకాంతుని వెదకి కనక చేష్టడి యచటన్
దూఁకొనిన పార్శ్వములఁ గని పేఁకన్ బ్రశ్నించ వారు వీక్షింపమనన్ ౫౯౧

క॥ శ్వేతద్వీపముఁ జేరుచుఁ బీతపటుఁడు శేషశయ్య వెలుఁగమిఁగనుచున్
భ్రాంతిగఁ బొగులుచు నచ్చటి లాఁతులనడిగియును నేమిలాభము లేమిన్

తే॥ అధికదుఃఖంబుఁ బొంది యహా! యిదేమి యెచట వెదకినన్ శ్రీహరి యెఱుఁగఁబడక
యుండె నేనేమిసల్పనో నుందునెందు? నెటుల నాతనిఁ జూతునో యెఱుకపడదు

క॥ అనుకొను చిట్టుల మఱి శ్రీవనజాక్షుని నెమక దివ్యవైకుంఠంబున్
జని తత్స్థలమున శ్రీపతిఁ గనజాలక మిగులవగచి కదలియునచటన్ ౫౯౪

తే॥ వడిని శ్రీరమావైకుంఠపదవిఁ జొచ్చి చూడ నచ్చట నాతఁడు శోభిలమిని
గుంది వీడ్కొని గోలోకకుంజమునకు బృందకాటవిన్ వెదకి గోవిందుఁగనక

క॥ కని కావలివారల నో ఘనులారా! మీరు హరినిఁ గంటిరె? యేచో
టున కేఁకితిని జనిమెనొ యనుమానముమాని తెలుప నర్థింతుఁ జుమీ ౫౯౬

ఆ॥ అని యడుగఁగ వార లగ్రజాగ్రేసరా! వినుము మావిభుండు పృశ్నిగర్భ
కలితవామనాండ కనదిల కిద్దెస నరిగెననిన నల్ల యాసురిముని ౫౯౭

ఉ॥ ఆసరణిన్ మనోగతిని నాజగమున్ విడి యిద్ధరాస్థలం
బాసను జొచ్చిచూడ నిట నాహరి గన్పడకుంట నెమ్మదిన్
వేసటఁ బొంది తుట్టతుద విష్ణుని జిష్ణునిఁ గృష్ణునిల్పి కై
లాసగిరిన్ జెలంగెడి కళానిధిమౌళినిఁ గాంచి మ్రొక్కియున్ ౫౯౮

తే॥ నీలకంఠ! మహాదేవ నీరజాక్షుఁ గాంచ నేను వైకుంఠలోకంబు మొదలు
పరమ గోలోకముందాఁక సరిగ వెదకియుంటిఁ గాని యాచక్రి నాకంటఁబడఁడు

క॥ కావున దేవా! యెచ్చట దేవకితనయుండు వఱలుఁ దెలుపుము దయతోన్
నావుడు గంగాధరుఁడును నీవిధివచియించె మునికి నిద్ధచరిత్రా! ౬౦౦

ఉ॥ నెమ్మది నాసురీ! యరయ నీవె కృతార్థుడవంచు నెంతు నా
యెమ్మికనుండు కర్మవిషయుల్ సుకసాదులఁబోలె నల్పకా
మమ్మెననుండుమాను లసమాన మనూనజవాశ్వముల్ రహ
స్యమ్మెను నిర్గుణంబునను సౌఖ్యలవంబెఱుఁగంగ జేస్తురే? ౫౯౧

తే॥ కాన నీవిటు నిష్కామమమానినగుచు నిర్గుణాధిక సౌఖ్యంబు నిస్తులముగఁ
జెందియుంటివి కీర్తిగాఁజేసితి శ్రీను పద్మనాభుపిననింక భావమున్న

చ॥ విపులమహోదధిన్ మిగుల వేదనఁబొందెడి హంసవాని న
ట్లుపగతమౌఖుగా నలిపి యాజగుచందములనుండి బృందకా
విపినమునందు రాసమున వ్రేతలఁగూడుచునుండెఁ గాన నీ
విపు డటకేగుచుండు మిదె యేనును వచ్చెద వంశనాయకా! ౫౯౩

చ॥ అని యటులాసురిం గలిసి త్వరితంబుగఁ దా యమునాతరంగిణీ
ఘనతటసంగతోన్నతరుకాండలతావిలసన్నికుంజ పుం
జనిభృతసైకతస్థలికి సాగఁగ నద్దరి గోజగన్నివా
సినులగు ద్వారపాలికలు చేతులఁదాలిచి మంచిబెత్తముల్ ౫౯౪

ఉ॥ అడ్డిన వెంట నాయిరువురా పువుఁబోఁడుల కిట్లుపల్కిరీ
రెడ్డముఁబెట్టఁబోకుఁడీక నే మతిదూరమునుండి నాస్థ నా
దొడ్డక మేళుఁగాంచ వడితోఁ జనుదెంచితిమమ్మలార! మీ
రడ్డుఘటింపకుండ హరిఁజేర నొనర్పుడి! చూడుఁడీ దయన్ ౫౯౫

తే॥ తరులుఁ దటినులు గోవులు ధాత్రియందుఁ దమిఁ "బరోపకారార్థమిదంశరీర"
మనుచు ఫలతోయదుగ్ధంబులనిశమిడుచునలరినటు బుధుల్ పరహితమందునుంద్రు

వ॥ అంత నాద్వారపాలికలు ౫౯౬

ఉ॥ బాగుగనున్న వీరనెడి పల్కులుగాని క్రియన్ ఫలింపవా
శ్రీగరుడధ్వజుం డిపుడు స్త్రీపరికరాన్విత రాసఖేలనో
ద్యోగిగనుండి మేమిచటనుండ విధించెను గాన లాఁతివా
రీగడిదాఁటి లోపలకు నేగిన ముప్పగు మాకు వారికిన్ ౫౯౭

ఉ॥ లేనియెడన్ హరింగనఁగ లిప్సదృఢంబుగ మీకు నున్నచో
మానసనామపుష్కరిణి మజ్జనముం బొనరించి గోపికా
మానవతీసురూపము లమందముగా ధరియించి వచ్చిన
న్గోనికిఁ బోవఁజాలుదురు నూల్కొనుఁ డో ద్విజులార! దానికిన్ ౫౯౮

ఉ॥ నావుడు వారలిర్వురల నాతుల వాకులనాలకించి యా
తావునువీడి సాగి త్వరితంబుగ మానసరోవరంబునం
దోపుచుఁ దానముల్ సలిపి యుగ్మలిరూపులఁదాల్చి తోడ్త నా
శ్రీవిభురాసమండలముఁజేరి యనంతరమందు మెల్లఁగాన్ ౬౦౦

సీ॥ స్వచ్ఛజాంబూనద భ్రాజిత పద్మరాగాంచిత ధరణీసమన్వితంబు
మాధవీముఖలతా పిధీకపంబాడి భూరుహసందోహ భూషితంబు
మండితప్రాంగణ మండప స్తంభసభావీధిపంక్తి విభాసితంబు
నరుణసితాసిత హరితవిచిత్ర వర్ణస్ఫురత్పుష్పవిరాజితంబు

తే॥ లలితవాసంతచంద్రికావిలసితంబు విహగమధుకరూజితం బబ్జవితతియుతము
శీతలానిలాన్వితము సంప్రీతికరమునగు నికుంజమొక్కటుగని యరిగి యందు

సీ॥ కోటిమన్మథరూపుఁ గోటీందుతేజునిఁ గౌస్తుభశోభితుఁ గమలనేత్రుఁ
గనకపుయాంబరుఁ గరుణాపయోనిధిఁ గమలామనోహరుఁ గమలనాభు
శ్రీవత్సచిహ్నితు శ్రీనరస్నేహితు శ్రీద్వారకావాసు శ్రీనివాసు
జలధరవర్ణుని సర్వభూషణయుతు వేత్రవంశీధరు వినుతచరితు

తే॥ గోపికావృతునిన్ రాసకుర్దనేశు ద్విరదగామినీరాధికావిహితు వరదుఁ
గృష్ణు దూరముగాఁగాంచి కేలుమోడ్చి యెల్లగోపికల్ గనుచుండ నిట్లులనిరి

తే॥ కృష్ణ! కృష్ణ! కృపాసింధు! కీర్తనీయ! దేవదేవ! జగత్పతీ! దివ్యచరిత!
పద్మనాభ! నారాయణా! పరమపురుష! విశ్వకారణ! శౌరి! మావినతులివిగొ

తే॥ భూమి భూరిభారము పాపఁ బుణ్యనరులఁగావ వేదములన్నిల్పఁగా మఖములఁ
బ్రోవ వైకుంఠలోకంబు బూన్కి వదలి నందు ఇంకిని బిడ్డవై యలరితివిగ ౨౦౪

కం॥ రాధాధరమధుభృంగా! శ్రీధర! బ్రహ్మాండకోటిశేఖర! గోపీ
యూథావృత! మధుసూదన! మాధవ! గోవింద! చక్రి! మమ్ములఁగనుమా

తే॥ అరయ సర్వావతారంబులందు నీవెగాదె పరిపూర్ణతముఁడవు ఘనచరిత్ర!
వరదుఁడవు నీవె గోలోకపతివినీవె పరమయోగీశుఁడవు నీవె పరమపురుష!

తే॥ నిన్నుఁ జూడంగ నెల్లెడ నెమకినెమకి తుట్టతుదకిటువచ్చుచుఁ దోయజాక్షుఁ
డవగు నిన్నని యఘములడంచి ధన్యతములమైతిమి రాసేశ! దయను గనుము

తే॥ అంత భగవంతుఁ డానుతి నాత్మమెచ్చి రాధతోడఁ బ్రసన్నుఁడై రవలుగురియు
మేఘగంభీరవాణి నామేటితబుసులకు వచించె నేతదీప్రితి సకలుషముగ ౨౦౮

కం॥ షష్టిసహస్రాబ్దంబులు కష్టపడి తపంబుసల్పఁ గరుణనుగని మీ
యిష్టము నడిగినఁజెప్పమి నిష్టులని యుపేక్షజేసి యొసఁగితిఁగాదే ౨౦౯

ఉ॥ ఐనను మీయభీష్టముల నన్నిఁటి నిత్తుఁ దెల్పుఁడన్న నీ
శానుఁడు నల్లయాసురియు సాగిలిమ్రొక్కి మహాత్మ! యన్యముల్
వేనినిగోర మీవిపుడు ప్రీతిని రాధిక, నీదుపాదముల్
ధ్యాన మజస్రముఁ సలుపు నావిధి మాకు ననుగ్రహింపుమా! ౨౧౦

తే॥ అవలఁ గృష్ణుఁడు దానికి నభిమతింప శంకరాసురులావంశిసాలసవిధ
మున మనోహరతరుయుత పులినమందు నిత్యవాసముజేసిరో నుతచరిత!

క॥ పిమ్మట రాధాపతి లోపమ్ములు లేనట్టికీర్తిఁ బద్మాకరనా
మమ్మగల వనంబున రాసమ్ములఁ ప్రేతలనుఁగూడి సలిపెను జనకా! ౬౧౨

ఆ॥ ఆఱుమాసములిటు లతివలఁగూడుచు రాధికాధవుండు రాసములను
జేసియుంట గోపికాసముదాయంబు పూర్ణతుష్టిఁబొందె భూప! యవల

క॥ అరుణోదయ వేళను నిద్దురవిడి గోపీజనంబు తొందర స్వకమం
దిరముల కేగఁదొడఁగె నిజవరయూథము లెల్లఁ జుట్టు పరివేష్టింపన్ ౬౧౪

తే॥ నందనందనుఁ డంత స్వమందిరమున కేగె వృషభానుసుత తనయింటికరిగె
నిట్టి రాసకేళీకథ నెవరుభక్తి వినెదరో వారు ముక్తులై తనరఁగలరు ౬౧౫

తే॥ అనఁగ జనకుండు నారదా! యఘముఖాసురరుచు లెట్టుల రాధికారమణుఁ గలిసె
నెటుల శంఖచూడునిజ్యోతి కృష్ణమిత్రుఁడైన శ్రీదాములో లీనమయ్యెఁ! జెపుమ!

—♦ శంఖచూడోపాఖ్యానము ♦—

తే॥ అంత మునివరుఁడిట్లనె నమలచరిత! రమ్యగోలోకవార్త నారాయణముని
ముఖమునఁ మున్ను వింటిని భూప! వినుము చిత్తమన్యస్థలంబునఁ జేర్పకుండ

క॥ దామోదరునకు ముగ్గురు, భూమి, శ్రీ, రాధ, లనెడి పొలఁతులు గలరా
భామినులందున రాధా, కామినియే హరికి ముఖ్యకాంతగ నుండెన్ ౬౧౮

వ॥ అంతఁ బరిపూర్ణయౌవనాఢ్య యగు రాధ తనవిభుండు సవతియగు విర
జతోఁగూడి వేడుకగా నేకాంతంబుగాఁ గ్రీడించుచుండెనను సంగతి నిజసఖిచే విని,
మిగులవగచి, వందయామడ లెత్తును, వందయామడల విస్తృతంబును, కోటిభాను
సన్నిభంబును, గోట్యశ్వకల్పితంబును, హారతారాంచితంబును నై యొప్పు నరదం
బధిరోహించి, ౬౧౯

చ॥ కరములయందు బెత్తములుఁగ్రాల దశార్బుదచేటికాజనుల్
నడులుచు నాల్గుప్రేవలను భద్రముగూర్ప సువర్ణభూషణో
త్కరముధరించి కోటి శశికాంతివిభాసురయై మనోహరున్
హరిని గనంగఁ బైనమయి యధ్వగచిత్రము లెల్లఁ జూచుచున్ ౬౨౦

తే॥ ఒయ్యనొయ్యన శ్రీకృష్ణునునికిఁ జేరుతఱి హరిన్యస్తుఁడైన శ్రీదాముఁడు మొగ
సాల నిల్చి యారాధికా స్యందనంబు నడ్డగించె స్వప్రభుసూక్తిననుసరించి

తే॥ అవల నడ్డిన శ్రీదాము నధికబలుని జక్రిమిత్రుని రాధికాసఖులుగాంచి
యిట్టిదొరసాని తేరెటు లీవునిల్ప వెడలితివటంచుఁగొట్టిరి బెత్తములను

తే॥ అంతఁ బొదరింటిలోపల సతివసించు కృష్ణుఁడారాధికాసఖు లేపుమీఱ
ద్వారపాలకుఁ డన్నెడి ధ్వనులవినుచు భీతిచేఁ దిరోహితుఁడయ్యెఁ బిదప విరజ

తే॥ అడలి నదియాయె గోలోకమందుఁ గోటియోజనాయుతంబుగఁ బాఱెనుదధియుర్విఁ
గ్రమ్మినట్టుల రవియు నల్గడల నొక్కసారి వెల్గినపద్ధతి ధారుణీంద్ర! ౬౫౮

తే॥ అంత సఖులతో రాధ కుంజాంతరంబుజొచ్చి యెల్లెడఁగని మధుసూదనుండు
భీతిచేఁ దిరోహితుఁడౌట విరజ నదిగమాఱుట నెఱింగి మఱి నిజాగారముఁ జనె

తే॥ అవలఁ గృష్ణుఁడు హ్లాదినియైన విరజ మరల సాకారగాసల్పి పరిసరంబు
నందువెల్గు బృందావనమునందునున్న కుంజమున రాసముల్ జేసెఁ గూర్మిఁ బిదప

ఆ॥ విరజ శౌరివలన హరినిభసప్తపుత్రులను గనియె వార లలసనంబు
నకుఁ దొడవులుగఁ దగి లోకపరిఁ దమ్ముల, నన్నలు వహించి రాడుకొనుచు

క॥ చిఱుతలపుడు మఱిఁ గొట్టక పఱువిడి హరియుక్తజనని పయ్యెటకాఁగన్
విరజయు గని వత్సలతన్ గరములఁ గొని బుజ్జగించెఁ గప్రేమోక్తులతోన్

క॥ వనజాక్షుం డటు తనచెలి తనువిడి యల యర్భకులను దమిఁ గొనుచుంటన్
గని కనలి యదృశ్యుండయ్యెను విరజ గడువగచి హరి యెడఁబాయుటచేన్

తే॥ కొడుకులార! మీరలు హరికూడిక చెడ నలిపితిరి దాన జలధులై జంతుకోటి
గ్రోలనట్లు నైమిత్తికాఖ్యాలయమునఁ గలిసికొనురీతి నుండురుగాక భువిని

వ॥ అని శపింప నయ్యేడ్వురు కొమరులు మాతృశాపనిహతులై తత్క్షణం
బునఁ బ్రియవ్రతుంబు నరదంబుగా రచించి, యందు సమాస్థితులై భూలోకంబునకుం
జనుదెంచి లవణేక్షు సురా సర్పి దధి దుగ్ధ జలంబులను పేర సప్తార్ణవంబులై ప్రాణికోటి
గ్రోలరాని ఘోరజలంబులు గలిగి యగాథంబులై జనంబులకుఁ దల్లియుండ్లై ప్రథమ
ద్వీపంబున లక్షయోజనంబులందును, ద్వితీయ ద్వీపంబున రెండులక్షల యోజనంబు
లను, తృతీయద్వీపంబున నాల్గులక్షల యోజనంబులను, చతుర్థ ద్వీపంబునం దెనిమిది
లక్షల యోజనంబులను, పంచమద్వీపంబునం బదాఱులక్షల యోజనంబులను, షష్ట
ద్వీపమునందు ముప్పదిరెండులక్షల యోజనంబులను, సప్తమద్వీపమునం దఱువది
నాల్గులక్షల యోజనంబులను నాయామంబు వేఱువేఱుగాఁ బొంది యొండొరులకు
సంబంధము లేని మాడ్కిఁ బ్రవహింపం దొడంగిరి. అంత నవ్విరజాకాంత, సంతాన
కాంత విరహాతురయై కుందుచుండఁ గరుణాసముద్రుండగు నుపేంద్రుండు గ్రమ్మఱఁ
బ్రసన్నుండై "జీవితేశ్వరీ! నిన్నుబాసి నేనొకక్షణంబైన నుండఁజాలను. మఱియు
మన తనయుల నహరహంబుజూచి నిజశక్తిని గాంచుచుండఁ గలవని వరంబొసంగి
యోదార్చి, తన వియోగంబున రాధికకుఁగలిగిన సిలుగెఱింగి యటనుండి వీడ్కొని

నెచ్చెలియగు శ్రీదాముతోఁగూడి తద్రాధాకుంజంబునకుం జని తోరణాంతికమున నిలుచుండఁ ద్రిపురసుందరియు, మానవతియునగు నా రాధికఁ గనుఁగొని సకోపయై యిట్లనియె.

చ॥ నరహరి! పొమ్ము పొమ్మటకె నాదరిఁ జేరకు మా నికుంజమున్
దరసముతోడ నా విరజ మాపగగా నడమాడు నీవు సం
బరమున నెల్లకాలమును వాసముసల్పినఁ జక్కనుండు నో
హరి! యణువంత లాభమిట హత్తదు గావున వేగ నేఁగుమా! ౬౩౨

క॥ అనవుడు శ్రీహరి విని యా మె నికుంజములోనదూఱి మిన్నకయుంటన్
గనుఁగొను శ్రీదాముఁడు రాధను గని యిట్లనియె నధిక తామసబుద్ధిన్

క॥ తల్లీ! గోలోకేశుని పుల్లసరోజాక్షు సకలభువనేశ్వరు లీ
లోల్లాసుని భగవానుని నల్లరిగా నుల్లసంబు లాడుట దగునే? ౬౩౪

సీ॥ నిస్సారసంసారదుస్సహరోగముల్ బాపెడి వైద్యుండు పతియుకాఁడె
యార్థిక వైదిక యౌగిక నైతిక, శక్తిఁ దెల్పెడివాఁడు పతియుకాఁడె
ధర్మార్థ కామ సంతాన సాధనముల్ వాసికెక్కినకర్త పతియుకాఁడె
యెట్టిచింతలనైన నెట్టివంతలనైనఁ బాపెడి నేర్పరి పతియుకాఁడె

తే॥ సకలవాంఛల నెరవేర్చి సౌఖ్యమిచ్చు ప్రభువుపతికాఁడె చుట్టాలకభయ మొసఁగి
కరుణఁగనువాఁడు పతికాఁడె కమలనేత్ర! యట్టి నీపతిన్ దూఱుటన్యాయమగునె?

మ॥ జననీ! పెన్మిటి రూపహీనుఁడయినన్ సౌశీల్య సౌజన్య స
ద్ఘనతా పుష్కలతా గరిష్ఠకవితా దాక్షిణ్య కారుణ్య ధ
ర్మ నయ ద్రవ్య విహీనుఁడైనఁ దమితో మన్నించి ప్రేమించు స
ద్వనితాసంఘముఁగాంచి వేల్పు లెపుడున్ వర్ణించి కాపాడరే ౬౩౬

తే॥ అఖిలవిధముల ననుకూలుఁడగుచు నిన్ను బ్రేమతోఁడాయు మా కృష్ణు విధముగ సకల
ధూర్తవై యిట్లు నామోలిఁ దూలనాడఁ దగునె? జెప్పుమ సుదతీమతల్లి! తల్లి!

చ॥ మఱి నినుఁబోలు శక్తులతిమాత్రముగా సృజియించు దివ్యచా
తురిని గడించియున్న హరితో నటుదూలఁగ మాటలాడెదే?
సరిసరి కోపమున్ విడిచి శాంతము జెందుమనంగ రాధికా
తరుణియు వించుఁ గిన్కను దురితంబుగ నిట్లనె వానికో విభూ! ౬౩౭

చ॥ జనకు నుతించుచున్ జనని శాపములాడితి వోరి శుంఠ! వే
దనుజుఁడవై ధరిత్రిని వ్యథాజలధిన్ బడి పీడఁ జెందుమా!
ఘనమగు గోజగంబు క్షణకాలములోపల వీడి యేగుమా!
యనవుడు శౌరి మిత్రుఁడు తదంబకుఁ గ్రిమ్మఱి నిట్లు వాకొనెన్ ౬౩౮

క॥ అనుకూలుండగు హరిపైఁ గినియుటచే నీవు ధరను గృష్ణునివిడి బా
ధను నూఱేఁడులు దాఁకను గనుచుందువు తప్పదిద్ది కాంతామణిరో! ౬౪౦

తే॥ ఇటుల నొండొరుల్ శాపములిచ్చికొనియుఁ
గుందుచుండుటఁ జూచి గోవిందుఁడెలమి
స్వయముగా వారియెదుటకు వచ్చి తొలుత
రాధ కిట్టులఁబల్కె ధరాతలేంద్ర! ౬౪౧

తే॥ మద్వచన మబద్ధమునల్ల మంచిసేయ్య కలదు గాని భక్తోక్తులఁ గల్లఁజేయు
శక్తి పరమాణువంతయు సరిగ లేమి నీకు నొకవరమిచ్చెద నెలఁత! వినుమ

క॥ వారాహ కల్పమందున ధారుణి భారంబుఁబాప దైత్యులమాపన్
ధీరులకును దర్శనమిడఁ జేరిమి నీతోడఁగలిసి వెడలెద ధరకున్ ౬౪౩

తే॥ నీ విరహకాలమందున నెలకు నెలకు నేను దర్శనమిచ్చెద మాను మార్తి
యనుచు భార్యను నోదార్చియనుచరుండు ఘనుఁడునైన శ్రీదామునకనియెనిట్లు

క॥ నీ యంశముతో రక్కసివై యవనిన్ బుట్టి యట్టివై వస్వాతమ
న్వాయతకాలమునన్ నేఁ బాయక రాసములఁజేయుపట్టున నీవున్ ౬౪౫

చ॥ అరమున నన్నుజేరి పరిహాసములం బొనరింతు వందునన్
మరలక నీవు నావలన మరిందెద వష్టై సవిగ్రహుండవై
మరల యథాప్రకార మసమానరుచిన్ దగియుందువయ్య యీ
వరమును బ్రీతిఁగైకొనుచు భావమునందలి చింతమానుమా! ౬౪౬

తే॥ అనఁగ నతఁడట్లు స్వాంశతో ననురుఁడగుచు
సుధను గృహమునన్డగి శంఖచూడుఁ డనెడి
పేరుఁగని బలిమూచుఁ గుబేరుమిత్రుఁ
డగుచు హరిహతుఁడై దివ్యుఁడయ్యె నయ్య! ౬౪౭

తే॥ అద్వయుండయి యందఱి యందునుండి సర్వకార్యంబులొనరించు జాణ కిదియు
జిత్రమానొకొ? యాకృష్ణుఁజేర నుతులొసలిపి సాగిలి మొక్కెద జనకరాజ!

తే॥ కల్మషులును బృందావనఖండ మిద్ది భక్తి వినినచో నాపంచపాతకములు
వ్రేల్మిడిన్ జన ధన సుత వృద్ధిఁబొంది దండిగోలోకమందున నుండఁగలరు

తే॥ జనక! మఱియేమి సత్కథవినవలతువో తెలుపుమా యన నాతఁడో దేవమౌని
బాలుఁడగు హరి యెట్లు గోవర్ధనగిరిఁ జేతనెత్తెనో యాకథ జెప్పుమనుడు

ఉ॥ శ్రీకమలానివాస! మునిశేఖర మానసవాస! నిర్మల
ప్రాకట సత్యభాష! బహురమ్యసువర్ణ విభూష! దేవతో
షా! కమనీయ వేష! శరణాగతనాధు సుపోష! ఖండితా
స్తోక సమస్తదోష! యమునంశపయోనిధి పూర్ణచంద్రమా! ౬౪౧

ఉత్సాహవృత్తము॥ గోపికాసమేత! రాస కూర్దనప్రణేత! సం
తాపపాపజేత! దుష్ట దైత్యకరిమృగాధిపా!
గోపతీ! హరీ! మనోజ కోటిదివ్యవిగ్రహా!
భూపవీస్రగంచితాంగ భూసురాగ్రణీ ప్రియా! ౬౪౨

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవి సుబ్రహ్మణ్యా
దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వనిశ్చయ, సుజనవిధేయ,
శ్రీనివాసాపరనామధేయాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతంబందలి బృందావనఖండము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

హరిః ఓం తత్సత్

శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీ కృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ గర్గ భాగవతము

## గిరిరాజ ఖండము



యమునారుచిరాంగా!
తోయరుహ సమానహస్త! తోయజనాభా!
తోయజ సద్మాధర! నా
రాయణ! రాసప్రవీణ రాధాకృష్ణా! ౧

### శ్రీకృష్ణుండు తండ్రిని ఇంద్రపూజనుగూర్చి ప్రశ్నించి గోవర్ధనగిరిని బ్రశంసించుట.

వ॥ అక్కథకుండు జనకవిభున కిట్లు చెప్పందొడంగె. దేవా! జనులు జనపాలకునకు వార్షికంబగు కప్పంబుఁగట్టినట్లు కృషీవలురగు గోపకు లందఱా పురందరునకుఁ బ్రతివత్సరంబందుఁ బ్రావృట్కాలంబునఁ బూజాపురస్సరంబుగా బలిని సమర్పించుచుంట బ్రహ్మాండనాయకుండగు శ్రీకృష్ణుం డొక్కతఱి నవలోకించి, సకల గోపకీర్తితుండగు సభాస్థలినున్న నిజజనకుండగు నందునిం గని, నాయనా! ప్రత్యబ్దంబున నయ్యింద్రునకు కిట్లు బలిని సమర్పించుచుంటిరి. దీన మీకేమి ఫలంబుగలదు? లౌకికమా? పారలౌకికమా? యేదియో యానతీయుడని పార్థింప, నందుం డందుల కియ్యకొని నిజనందనునకు నిట్లనియె. ౨

ఆ॥ ఇది సురేంద్రపూజ యెడఁదఁ దలంపఁగ భుక్తిముక్తికరముఁ బుణ్యతమము
దీని విడిచినవాఁడు దీనుఁడై తిరిగెడిఁ గాని సుఖయుతుండు గాఁడు గాఁడు 3

క॥ అనవుడు భగవానుం డల్లన నగి తండ్రీ! యిదేమి లక్షణమిపుడే
ఘనుఁడు వచించెను మీరిది యనుమానము మాని విడుట యర్థప్రదమా

ఉ॥ కారణ మేమనన్ వినుఁ డఖండపురాకృత కర్మరీతి బృం
దారకులున్ సురేంద్రుఁడు యథావిధి స్వర్గసుఖంబుఁబొంది యే
వారమునన్ స్వపుణ్యమితిపారము సెందునొ నాఁటగోలె నీ
ధారుణి జన్మమెత్తి సుకృతంబును దుష్కృతిఁ జేయుచుండరే ౫

క॥ కావున వారును మనతో నేవిశయములేనియట్టు లీశ్వరుపై యుంటన్
జీవన్ముక్తి ఘటిల్లక జీవితముల్ వ్యర్థములగును సేవించినచోన్ ౬

చ॥ సురతతికంటెఁ దన్ను ముచిసూదనుఁ డాదివిజేశుకంటె సుం
దర చతురాస్యయుక్త విధి తద్విధికంటె హిరణ్యగర్భుఁడా
వరపరమేష్ఠికంటె గుణభాసురమాయయు దానికంటె నా
పరమగుణం బనశ్వరము బ్రహ్మముపాస్యమటఁ చెఱుంగుమా! ౭

చ॥ అదియ జగన్నిదానమయి యాగమ గోసుర వహ్ని ధర్మ సం
పదలకు మూలమై సకలభాగ్యమహానిధియై వెలుంగు న
య్యది విడి వేఱుదాని మనమందున నమ్మి భజించునట్టి దు
ర్హృదునకు ముక్తి సేకురునె? యాప్సితముల్ నెఱవేఱుచుండునే ౮

క॥ కావున నింద్రుని పూజల నావలఁ బోఁద్రోసి వీరు లటు లర్చల నా
శ్రీవిభువక్షోజంబగు గోవర్ధనగిరికి సల్పి కోర్కులఁ గొనుఁడీ! ౯

ఉ॥ తద్గిరియో పులస్త్యుని యుదాత్తబలంబున నీస్థలంబునన్
సద్గతిదాయకం బగుచుఁ జక్కఁగఁ జొచ్చెనుగాన బ్రహ్మవ
ర్త్రోద్గత భూమిదేవులకు నొయ్యన నాలకుఁ బూజసల్పి సం
పద్గతపారితోషికము బాధముగా నిడనౌను దానికిన్ ౧౦

ఉ॥ నంద! యొనర్పఁగా నటుల నాకుఁ బ్రియంబగు నన్న దత్సభన్
జెందియు నాలకించెడి సుశీలురయందున వృద్ధుఁడైన స
న్నందుఁడు కృష్ణవాక్యము మనంబునఁ బూర్తిగ మెచ్చి నాయనా!
నందసుతా! వచింపుము ఘృణామతిఁ దన్నగపూజ యెట్టిదో? ౧౧

—♦ గోవర్ధన పూజావిధి. ♦—

వ॥ అంత రాధికాకాంతుండు స్వాంతంబున సంతసించి, నన్నందున కిట్లనియె. గోపవృద్ధా! తద్గోవర్ధనధరాధరవరంబునందలి క్రింది ప్రదేశంబున గోమయంబున నలికి నిగ్గగు ముగ్గులఁబెట్టి పూజాసంభారంబుల గొని జితేంద్రియుండై బ్రాహ్మణులతోఁగూడి పరమభక్తిని దదచలంబును ధ్యానించి, యావాహనంబు సల్పి యర్ఘ్యమొసంగి పాద్యమిచ్చి యాచమనం బిడి గంగాయమునోదకంబుల సహస్రశీర్షయనెడు మంత్రంబున నభిషేకించి, పంచామృతంబుల స్నానంబుఁ జేయించి, దివ్యవసనంబును, యజ్ఞోపవీతంబును సమర్పించి, చందనాది సుగంధద్రవ్యంబుల నలఁది కమనీయంబులగు సుమంబుల నర్చించి, నానాదివ్యగంధభాసురంబగు ధూపంబును, జగజ్జ్యోతిభాతి వెలుంగు దీపంబునర్పించి, భక్ష్య భోజ్య లేహ్య చోష్య మధురాన్నరాశి నివేదించి, చతుష్షష్టికలశంబుల నైదుపంక్తులుగా నమర్చి, యాపాత్రలందు గంగా యమునా

జలంబుల నించి యందుఁ దులసీదళంబు లిడి, యొక్కొక్కదానికి షట్పంచాశద్విధంబులగు సామగ్రుల భోగంబులుగలుగఁజేయుఁ జేవించి, సుర భూసురాగ్ని గోబృందంబుల షోడశోపచారంబుల సంతుష్టిపఱచి ద్విజవరులకు మృష్టాన్నం బిడి తదితరులకు సైతం బన్నదానంబొసఁగి, గోపీ గోపాలయుక్తంబుగాఁ దానును సొపడి కాంస్య ఘంటాది చతుర్విధ వాద్యంబుల మొఱయించి, కర్పూర నీరాజనంబెత్తి, వేదాహమేతమ్మనెడు మంత్రింబునఁ బుష్పాంజలి నర్పించి, సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, వినుతించి, జయశబ్దంబులం గావించుచు, నాట్యం బొనరించి, గోవర్ధనగిరి రాజోత్సవంబుఁ జేయందగు. ౧౨

తే॥ ఎందు గోవర్ధనాచల మొండలేదొ యందు గోమయంబున దానియంత యెత్తు
బొడవు వెడలుపు రచియించి పుష్పవల్లి భూరుహాదులఁగూర్చినఁ బూజ్యమగును

తే॥ అట్టి గోవర్ధనాచల మందునుండి శిలను దత్తుల్యకనకముఁ జేర్చికొన్నఁ
బుణ్యుఁడగు నిట్లు చేయని పూరుషుండు గరము రౌరవనామక నరకమొందు

శా॥ సాలగ్రామ సురార్చనంబుఁ బ్రతిఘుస్రంబందునన్ జేయు ధీ
శాలిన్ బాపములంట వప్పు జలభాస్వత్పద్మ మట్లిందునన్
గోలోకంబుననుండి వచ్చి తగు నా గోవర్ధనాద్రీశు నే
రేలోపంబులు లేక మ్రొక్కెదరొ వారిష్టంబులం బొందరే? ౧౫

తే॥ అనఁగ నందసన్నందులు నఖల గోపకులును విని యద్భుతంబునఁ జెలఁగి వాడుకగ నొనర్చు నింద్రునిపూజ దిగఁగవిడిచి శైలవిభుఁ గొల్వఁదలఁచిరో జనకరాజ!

## గోవర్ధన పూజా మహోత్సవము.

చ॥ అవల గిరిప్రభూత్సవము నంతటఁ జాటియు గర్గరామకే
శవుల యశోదఁ గూడుచు గజంబున నెక్కుచు గోపగోపికా
నివహము గోగణంబులును నెయ్యముతోఁ జనుదేర గోత్రరా
ట్సవిధమునందుఁ జొచ్చెను వ్రజప్రభుఁ డాసమయంబునందునన్ ౧౭

ఉ॥ స్వాంతమునందు సంతస మొసంగ జయంత శచీ సమేతుఁడై
దంతివరంబు నెక్కి సురతండముతోఁ బ్రియదావనాంతర
ప్రాంతముజేరు వజ్రివలె భాసిలె నాయుపనందనందులా
వంతున నార్యులైన వృషభానులు వచ్చిరి దారయుక్తులై ౧౮

చ॥ మఱియు సహస్రబాలరవిమండలభాసురమైన పల్లకిన్
సురపతిపత్నిబోలె మణిశోభితభూషణముల్ ధరించి చె
చ్చెర భ్రమరీసమాకులవిచిత్రచకోరివిధానఁజేటికో
త్కరయుత యాచు నెక్కి గిరికాంతునిఁ జేరెను రాధ వేడ్కతోన్ ౧౯

చ॥ అటు గిరినాయకాంతికము నందిరమిాఁదట రాధ వోలికన్
దటుకున దీప్తి కోటిసదృశాకృతమై లలితా విశాఖలున్
జటుల మనోజ్ఞ చామరలఁ జక్కఁగఁ బట్టుచు నిరు భక్తులు
త్కటనుతి సల్పుచుండఁగ ఫణిరాజనాథ! యనంతరంబునన్ ౨౦

సీ॥ ద్వాత్రింశదధికయూథంబులు మిథిలానివాసినుల్ గోకులవాసినులును
ధ్రువలోకకాంతలుఁ దోయధిభాషినుల్ శ్రీరమావైకుంఠ చిత్రరతులు
నోషధీసతులు మహోజ్జ్వలద్వీపవాసినులు జాలంధర చేటికలును
సూర్య్వవైకుంఠమందుండెడి సుదిదలు శ్రుతిరూప మునిరూప సుదతితతులు

తే॥ పృథుల బర్హిష్మతీసతుల్ విపినవాసినులును యజ్ఞసీతాస్త్రీలతలవిలాసి
నులును యూథములనుగూడి బలులఁగొనుచు శైలనాయకు సరసకుఁజనిరి మఱియు

చ॥ సరిగ నలంకరించుకొని జాణతనంబున బాలవృద్ధుల
చ్చరలును రాజయోగులును శాంతులు దాంతులు వైరాగులున్ ధరా
మరులు సురర్షులున్ జెలులు మంత్రులుఁ దద్గిరిరాజపూజకై
కరములఁ బుష్పలం బలులఁగైకొని యేగిరి మైథిలేశ్వరా! ౨౨

ఉ॥ ఈరహి గోప్రవర్ధనగేంద్రమహోత్సవ మాలకించి కా
మారి, భుజంగహారకటకాంచితుఁడై సిగఁ జక్కఁగూర్చి ధు
త్తూరము భృంగరాజమును దూఁకొని తత్ప్రముఖప్రియుక్తుఁడై
తోరముగా నుమారమణితో నటకుం జనె నందివాహుఁడై ౨౩

తే॥ చాలదూరము నుండియు శైలనాయకోత్సవంబును జూడఁగా నుచితవిధుల
జనులు సనుదెంచి రెక్కువ సంతసమున నోలి నిసుకనుజల్లిన రాలనట్లు

ఉ॥ అంచితగోప్రవర్ధననగాధిపుఁ డత్తఱిఁ గృష్ణునానతిన్
గాంచన శృంగ సంగతుఁడు గాంతిపరీవృతరత్నసానుభూ
మ్యంచితుఁ డీప్సితప్రదుఁడు నాయతకాయుఁడు బుష్పనిర్ఝరా
భ్యంచితుఁడున్ ధరారుహసమన్వితుఁడై తగియుండె నో విభూ! ౨౪

ఉ॥ మేలిమి రూపులన్ జెలఁగు మేరుహిమాద్రిముఖాచలంబు లా
కాలమునందుఁ దద్వరనగంబునకున్ జనుదెంచి భక్తితోఁ
గేలుమొగిడ్చి కానుకలఁ గించను గాంచక యిచ్చి మెచ్చి రా
శైలవరార్చ నందుఁడు ద్విజన్మముఖంబున సల్పి యాదిలోన్ ౨౫

చ॥ హరివచనానుసారముగ నల్ల ధరామరగోసురార్చనల్
సరిగ నొనర్చి పాతులకు సాపడఁజేసి ధనంబొసంగియున్
ద్వర నుపనంద నంద వృషభానుయుతుండయి శైలపూజలు
ద్ధరముగ నాచరించి బలిఁ దోరముగా నిడె గాఢ భక్తితోన్ ౨౬

తే॥ దానవారి యాగిరికిఁ బ్రదక్షిణములఁజేసె వేల్పులు పూలవర్షించి రెల్ల
గోపికాగోపులాతనిఁ గోకిలస్వనమున గానముసల్పి రానందమొదవ

తే॥ అర్చనాదుల సగవరం బంతకంత కన్ని తెన్నులఁ జెన్నొందె హరియునందు
వేఱురూపముతోడుత వెలిఁగి బలిగనిడిన యన్నరాశులఁ గ్రోలి యిట్లనుడివె

క॥ గోవర్ధనుఁడను చూడుఁడి! యీవిశ్వమునందునున్న యెల్లమలలకే
నేవిభుఁడనని యెఱిఁగి సంభావనలన్ సల్పుఁడీప్రభు వ్రజలార! యనన్ ౩౦

ఉ॥ చూపఱు తద్గిరీంద్రమున శోభలు నల్గడలందుఁ జింద స
ల్లాపముఁజేయు దేవుని సులక్షణలక్షితుఁగాంచి దేవ! మా
శ్రీపతి మిమ్ముఁ జూపుటను జెందితి మేము కృతార్థతన్ దయన్
మా పసులేము బంధు సఖిమండలి వృద్ధిఁజెలంగఁ బ్రోవుమా! ౩౧

తే॥ నావు డపరంజినగల విన్నాణమొంది దివ్యరూపంబు ధరియించి తేజరిల్లు
గోవర్ధనుఁ డన్వారి కోరికలిడి వేల్మిడిన్ దిరోహితుఁ డయ్యెఁ బిదప మరలి

తే॥ నంద వృషభాను గోపోప నందబంధు గోపికాజనులు మిత్రకూటములును
జంద్రమాళి నీలాంబరోపేంద్రముఖులు చనిరి సకుటుంబముగ నిజసదనములకు

ఉ॥ ఈదృశ గోవర్ధన నగేంద్ర పవిత్రచరిత్ర మిత్తఱిన్
నీదరిఁ జెప్పినట్టు లల నిర్జరపాలకు ద్రోలఁ బల్కఁగా
నా దివిజాధిపుండు పరిహాయనమందలి నాదుపూజ వీ
రీడినమందు మాని గిరికెట్టుల నర్చల సల్పి రోమునీ! ౩౨

—♦ ఇంద్రుడు గోకులంబుపైఁ గోపించుట. ♦—

ఉ॥ మూర్తములోన వీరలను బూదినిఁగల్పెద నంచుఁ గిన్కఁ సం
వర్తకనామ మేఘముల బంధనముల్ వదలించి వారివా
వార్త నెఱుంగుఁడీ! తుటిని బ్రత్యవహారమునన్ జగంబులన్
బూర్తిగ ముంచివేసినటు బోయి వ్రజంబును ముంచివేయుఁడీ ౩౩

చ॥ అని తనుపన్ దదంబుదము లప్పుడు రోహిత పీత మేచకా
ర్జున బహుచిత్రవర్ణముల జొత్తిలి యింద్రనిభంబులై కసిన్
ఘనగజహస్తధారలను గర్జల మించులఁగూడి యేకరీ
తినిఁ గురిసెన్ భయంకరవిధిన్ వ్రజవాసివినాశనార్థమై ౩౪

క॥ సుడిగాలి వీవఁ దొడఁగెను దడదడఁ బిడుగులును బడియె దరువుల్ గృహముల్
దడయక కెడసెను గడువడిఁ బుడమిని గొండలునుగూలెఁ బొడిపొడిగాఁగన్

ఉ॥ సప్తబిలంబులున్ బృథులసప్తజగంబులు మాఱుమ్రోఁగె ది
క్ప్రాప్తగజాష్టకంబును ధరాస్థలి ఢీకొని కూలెఁ దారలున్
దీప్తులవీడి నేలఁబడె దీనత వేత్రలతోడ వ్రేలు సం
సుప్తుల బిడ్డలన్ గొనుచు క్షోభిలుచేసిరి నందుచెంకిన్ ౩౯

తే॥ అటుల వారలు నందుని యాలయమునకరిగి బలరామయుక్తుఁడౌ హరిఁ గాంచి
కరయుగంబుల ముకుళించి కట్టిడులకు నక్కటికము గలుగునట్టు లనిరి జనక!

మ॥ అకటా! మానుడి నెక్కసంచు మదిలో నత్యంతమున్నమిత్ర వా
సుకఁగాఁ జేయు సురేంద్రపూజ విడి విస్తారంబుగా నొంచుకొం
డకు నర్చల్ బొనరించుచుంటిమి గదా! దంబంబుకై యిట్టు లూ
రక వాచించుట పాడియే శివశివా! రామా! యశోదాత్మజా! ౪౦

చ॥ అల సురనాయకుండు తన యర్చను మానిరటంచుఁ గిన్కతో
నల ప్రళయంబునందువలె నన్నులు, జిన్నలు, గొడ్డుగోదలే
మలజడు లిట్టులొందఁగ గృహంబులు గూలఁగ సర్వవస్తువుల్
విలయము జెంద బిట్టుఁ గురిపించె నవాభ్రముఖంబులన్ బలీ! ౪౧

తే॥ ఇటుల మము బాధపెట్టుచు నింట నీవు
సుఖముగా నుంటి విదిమాకు చోద్యమయ్యె
నరయఁ బిల్లికిఁ జెరలాట మూఖువునకుఁ
బ్రాణసంకట మనునట్లు బాలకృష్ణ! ౪౨

ఉ॥ కావున నింద్రకోపము నికన్ సహియింపఁగలేము మమ్ము నీ
వేవిధిఁ గావ నెంచితివొ? యేర్పడఁ దెల్పు మనంగఁ జక్రి గో
పావళులార! మీరు భయమందక వస్తుసమేతులై కుటుం
బావృతులై త్వదర్చిత నగాంతికమొందుఁడి! యేను వచ్చెదన్ ౪౩

—♦ శ్రీకృష్ణుండు గోవర్ధన పర్వతం బెత్తుట. ♦—

చ॥ అని యటు వారలంబనిపి యాహరి సాగ్రజుఁడౌచు గోవ
ర్ధనగిరిఁ జేరి బాలుఁడు త్వరన్ గమలంబును జేతఁగొన్నరీ
తిని దనకేలఁ నన్నగపతిన్ బెకలించి గ్రహించి గోపులా
ర! నదువుఁడీ! యిటన్ జనుఁడి! రండు కుటుంబపశుప్రయుక్తులై ౪౪

తే॥ అట్లు పలుకంగ గోపకు లంద అద్భుతమున ముక్కున వ్రేలిడి దారపుత్ర
మిత్ర పరివార గోవస్తు మిళితులగుచు నద్రివిభుక్రిందఁ జేరిరో యవనినాథ!

ఆ॥ అవల వానవలన నరుదెంచు ఝురములు పర్వతంబుక్రిందఁ బాఱఁదొడఁగ
విడిముడి పడతియొడయుఁడు గని సుడివాలు వ్యాళిపాలుఁ దలఁచె వారిఁగావ

క॥ తలఁచిన వెంబడిఁ జక్రిముఁ జిలువలయొడయఁడును వచ్చి చెంతఁ జెలంగన్
గలిమిచెలిచెలియుఁ గనుఁగొని జలములఁ దొలఁగించి గిరిని సాకుఁడి మీరల్

క॥ అని పంపఁగఁ దచ్చక్రము మునుపల వనధుల నగస్త్రముని యానినరీ
తినిఁ దన్నగావరణగతవనముల గడగడను ద్రావి వఱలుచునుండెన్ ౪౯

ఆ॥ మఱి యనంతుఁ డల్ల గిరివరుఁగుండలి యగుచు మోసి యతిశయముగఁ బొలు
చరుగుదెంచు ఝురము నావలఁద్రోయుచుఁ గ్రాలె జలధినాప్రు వేలఁబోలె

తే॥ ఏడుదినము లిట్టుల నచలేంద్రమెత్తి తమ్ముఁగాపాడు కృష్ణుని నెమ్మితోఁ జ
క్షోరవిధమునఁ జూచుచు గోపకులము హాయిగానుండె నోమైథిలాధినాథ !

మ॥ అపు డాజాడ సురేశ్వరుం డెఱిఁగి వేయైరావతంబెక్కి స్వీ
య పదాతి ద్విప రథ్యయానములు వెన్నాడంగ నూఱించులో
ప్పుపవిన్ దాలిచి కిన్కతోఁ జని వ్రజంబున్ మాపి తాఁ గన్న యా
యపకీర్తిన్ దొలఁగింపనెంచి విసరెన్ హాహా ! యనన్ గోపకుల్ ౫౧

ఉ॥ దాని జనార్దనుండు గని దవ్వుల వజ్రయుతంబుగా హరిన్
ప్రానుపడం బొనర్చెను సుమా ! యపుడా దివిజేంద్రుఁ డభ్రముల్
సేనలఁ గొంచు సాధ్వసముఁజెంది తెగించి హసింపఁ బొఱఁ బం
చాననతాడితంబగు గజంబు విధంబున భూప ! యాపయిన్ ౫౨

ఉ॥ వాన లణంగె వెల్లువలు వాసెఁ బ్రచండసమీరణంబులున్
మానె విపంకమయ్యె ధర మప్పితమైన జలంబుతో నదుల్
దానముఁజెందెఁ బక్షు లమితంబగు సౌఖ్యముఁబొందె గోపసం
తానము సంతసించె హరిదశ్వుఁడు వెల్గె నభంబు భాసిలెన్ ౫౩

క॥ మని రాభీరులు హరి దయఁ గనిరి ఘనాఘనసమీరకష్టము లేమిన్
వినిరి వనజాక్షసూక్తులఁ జని రీవల కందునుండి స్వజనాన్వితులై ౫౪

చ॥ చెలులను గాంచి శ్రీహరి వచించె నిటుల్ సఖులార ! మీరు నా
వలె నిపుడీ నగంబు నొకపాణిని నెత్తుఁడి ! చూతుఁగాక ! యం
చల గిరి నర్ధభారము నె యా సహవాసుల కియ్య వారలం
దుల కరకీకరించి మలఁ దొడ్డఁగఁ బూనుచుఁ గూలి రిద్దరన్ ౫౫

చ॥ పులిఁగని నక్క వాతలను బొందినయట్టులఁ దన్ను జూచి కొం
డలతలకట్టు నెత్తఁగఁ గడంగి ధరన్ బడి లేవలేనిమి
త్రులను రమేశ్వరుండు గని రోయక నవ్వుచు లేవఁదీయ వా
ర లలరి కృష్ణమిత్రుఁ బరిరంభణభూషితుఁ జేసి రెంతయున్ ౫౬

ఉ॥ తమ్ములుఁ దండ్రులున్ జెలులుఁ దాతలు మామలు సోదరీగణం
బమ్మలుఁ బిన్న పెద్దలును నన్నలు వెండియు నావునుండు లో
కమ్ములు శ్రీహరీ! భవదఖండకృపాపరిపూర్ణదృష్టిచే
వమ్మున లొంగ్గర్షీ జడక పర్విలుచుంటిమటంచు వేఁడియున్ ౫౪

## — శ్రీకృష్ణాభిషేకము. —

చ॥ పెరుఁగును బాల నేతులను పెల్లుగ నిచ్చి సుమాక్షతాదులన్
హరిపయిఁ జల్లి చందనము లర్చకులుంబుగ సల్పి స్త్రీయమం
దిరములు కేగిరంత వసుదేవసుతుండును బూర్వరీతిఁ ద
గ్గిరివర ముంది యొంటరిగ దిగ్గడిపేళ జలారి గాచుచున్ ౫౫

క॥ అమరులఁ దోడ్కొని కృష్ణుని సముఖంబున కేగుదెంచి సాష్టాంగముల్
గ్రమముగ సల్పియు వినయభయములను శ్రీహరిని సన్నుతించి రెపెన్.

సీ॥ శ్రీవాసుదేవాయ దేవాదిదేవాయ అంబుజాక్షాయ తుభ్యం నమోస్తు
గోపాలకేశాయ గోలోకవాసాయ అభ్రవర్ణాయ తుభ్యం నమోస్తు
బ్రహ్మాండమండల భాస్వత్స్వరూపాయ అసురాంతకాయ తుభ్యం నమోస్తు
కరుణాసముద్రాయ పరిపూర్ణజాతాయ బలరామేతాయ తుభ్యం నమోస్తు

తే॥ గోపికాజననాథాయ గోవర్ధనాచలోద్ధారకాయ తుభ్యం నమోస్తు
పరమయోగీశ్వరాయ తుభ్యం నమోస్తు నరదశావతారాయ తుభ్యం నమోస్తు

తే॥ పతితపావన! జగదీశ! పాహి! పాహి! కంసముఖదుష్టులన్ జంపఁ గ్రాలితీవు
విశ్వమోహన! నీమాయ వెజ్జినైన నన్ను బుత్రవాత్సల్యమునన్ గ్రహింపు

తే॥ అనుచుఁ గొనియాడెఁ బిమ్మట నబ్ధిజాతమైన సురభినామక కామధేను వట్టి
గోవర్ధన నగమునఁ గుదిరియున్న శ్రీపతిన్ స్నాతుసల్పె స్వక్షీరధార

క॥ ఆవల నైరావత మా దేవధునీసలిలములను దివ్యకరములన్
శ్రీవిభు నభిషేకించెను దీవించిరి బ్రహ్మరాజదేవమహర్షుల్ ౬౩

క॥ సురలును హరిపైఁ బ్రీతిని గురిసిరివరపుష్పవృష్టిఁ గొండాడిరి కి
న్నరచారణగంధర్వులు నరుసముతో నప్సరసలు నాడిరి తేఁడా! ౬౪

క॥ పరపడి గోవర్ధనమునఁ ద్రిదివేంద్ర ప్రభృతిసురలు దేవకీపుత్రున్
ముదమున నభిషేకించిరి పిదపన్ గారుణ్యరసము వెల్లివిరియఁగన్ ౬౫

శా॥ శ్రీకాంతుండు ప్రసన్నుఁడై యల నగశ్రేష్ఠంబు హస్తంబుచేఁ
దాఁకెన్ దత్కరచిహ్నమిప్పటికిఁ దద్గ్రావంబునన్ వెల్గు నే
ర్జ్లోకన్ దానిని గాంచుచుందురల సుశ్లోకుల్ సుఖంబొంది యా
వైకుంఠంబున నొప్పుచుందురని నీభావంబునన్ నమ్మమా! ౬౬

చ॥ మఱి యటఁ గృష్ణుపాదములమచ్చలు గన్పడుచుండుఁ గామధు
గ్సురభిపదాంకముల్ వెలుఁగుఁ జూచినవారలు పాపదూరులై
పరమముఁగాంత్రు వెండియు సుపర్వధునీవిమలాంబువందు సం
బరమునఁ బాఱుచుండు నది "మానసిగంగ" యనంగ నొప్పెడిన్ ౬౭

ఉ॥ అందున నేపరిజల్ జలకమాడెదరో యలవారు పాపముల్
డింద నొనర్చి పుణ్యము గడింపఁగఁ గాంతురు కామదోగ్ధ్రి గో
విందుని స్నాతఁగా నలుప వెల్లునవాఱిన దేశమెల్ల "గో
విందసరోవరం" బనఁగ విశ్రుతికెక్కెను విశ్రుతప్రభా! ౬౮

ఉ॥ మానిని గాంచువారలును సిద్ధరిఖామముఁ జెందుచుందురో
మానవనాయకా! యమరమండలనాథుఁడు దేవయుక్తుఁడై
దానవవైరికిన్ సతతసంతసిశీ కష్టముగట్టి జేయఁగాఁ
గా నిజపట్టణంబునకుఁ గ్రమ్మఱి క్రిష్ణుఁడ వేగ సంతటన్ ౬౯

— గోపకులు శ్రీకృష్ణుని పరీక్షించి సిస్సందేహులగుట. —

చ॥ ఒకపరి వేలు వేలను నొద్దికగా గుమిగూడి నందుని
కృకుఁ జని నందరాజున కకల్మషబుద్ధి వచించిరిట్లు గో
పకవర! నీవె ధన్యుఁడవు పంకజనాభుని బోలియుండు పు
త్రకు నిటు లేరు గాంచి ప్రమదంబునుబొంది యశంబుఁ జెందిరే? ౭౦

తే॥ ప్రట్టగొడుగులఁ బెకలించు బుడుతలవలెఁ దామరసమును బీకెడి దంతిమాడ్కి
నాయతంబగు కాయంబునందియున్న గిరిని నొక కేలనెత్తె నీకృష్ణమూర్తి

తే॥ ఎచట నేడేండ్లబాలకుఁ డెచట నేడుప్రొద్దు లా గోవర్ధనభూధరంబు
నొక్కచేతను ధరియించియుండు టిద్ది చిత్రములలోనఁ జిత్రమై చెలఁగె నంద!

వ॥ అదియునుం గాక తల్లియగు నీ యశోదయుఁ, దండ్రివగు నీవును దెల్లని వారుగా నుంటిరి. మీకు జనించిన పిల్లఁడుమాత్రము నల్లనివాఁడై మన చంద్రవంశంబున విలక్షణుండై యుండె. గతంబేమి? ఇతని యన్నయగు బలభద్రుండు గౌరవర్ణుండగుటవలన సందేహాస్పదుండు గానేరఁడయ్యె. చూడంజూడ నీ కృష్ణుండు క్షత్రియసంభూతుండని తోఁచెడి. ఇయ్యది మనకులంబునకుఁ గళంకం బాపాదించెడి వెనుదీయక సత్యంబుఁ బల్కుము. లేనిచో గోపకులకుఁ బరస్పరంబుఁ వివాదంబు సంభవించుట ధ్రువం బన యశోదాసహితుం డగు తన్నందుండు భయభీతుండై సవినయంబుగా నయ్యాలారా! మున్ని కృష్ణవిషయంబున మన పురోహితుండగు గర్గమహర్షివలన వినిన సూక్తులు మీరడిగినవానికిఁ బ్రత్యుత్తరంబు నీఁజాలును. కాన

నాపైఁ గోపమూపి యాకర్ణింపుఁడు. పూర్ణావతారములగు కమలాకాంతుండును, రాముండును, శ్వేతద్వీపాధిపతియగు హరియు నరసింహుండును, నరుండును, నర నారాయణ మహర్షులు వర్ణక్రమంబుగా లీనమైయుండునను విషయంబు స్ఫూర్తిం బొనరించు "కృష్ణ" యను నామంబున స్మరింపఁబడును. వేదగుహ్యంబులగు వాసుదేవాద్యనంత నామంబులం దాల్చి ద్వాపరాంతంబునను, కలియుగారంభంబు నగు కాలంబునఁ గంసాది దుష్టశిక్షణంబును, శిష్టరక్షణంబు నొనర్ప సకల బ్రహ్మాండనాయకుండగు పరమేశ్వరుండు పరిపూర్ణతమావతారుండై పుట్టి నీకుఁ బుత్త్రుఁడై పరిఢవిల్లుచున్నవాఁడు. ఇతఁడు వృషభానుగృహంబున జన్మించిన రాధావనితామతల్లికకు విభుండగు. ఇతనియందే సకల స్థావరజంగమంబులు విలసిల్లు. ఈతఁడు యుగక్రమంబున శ్వేతారుణ కృష్ణ పీతవర్ణంబులం బొంది యిప్పటికి నుద్భవిల్లు. మఱియుఁ గ్రమక్రమంబుగా నీతని లీలలు పరమాద్భుతకరంబులై వినఁ బడునని యెఱింగి యాతనిపై మోహంబుఁ బొందకుమని వాక్రుచ్చె. ఇద్దాని నెల్లరకు బ్రహ్మజ్ఞానవాక్యంబు బ్రహ్మవాక్యంబు గదా యని వారొన నాలకించి గోపకులు మెచ్చుక నందున కిట్లనిరి.

ఉ॥ ఈవనురీతి గర్గముని యిచ్చటికిన్ జనుదెంచినట్టి నము
న్నీవపు డేలఁ బిల్వవొకో ? నిక్కమె యియ్యది ? చాలుఁ జాల్నదూ
భావనచన్ను లెందుల కబద్ధములాడకు మింక గార్గ్యముల్
నీవాకరుండె వేసలిపి నెమ్మదిఁజెందుచునుండుమో ప్రభూ ! ౭౪

తే॥ పలికి యిట్టుల వారు తద్వల్లవేంద్రు లోగిలిన్ వసి యొకతఱిఁ బటిలోపల వృష
భానువరు దరి కరుదెంచి ప్రణతిఁజేసి సేమమడిగి యీచొప్పునఁ జెప్పిరయ్య!

ఆ॥ తొలుత మేముపలుకు పలుకులనాలించి నందుచుట్టఱికము నట్టులేక
విడిచి మనకులంబు విమలంబు జేయుమా వల్లవకులకునలబంధుచంద్ర ! .

చ॥ అనవుడు తద్విభుండు విని యచ్చెరువొందుచు ఘోషులార ! గో
పనికరనాధనందవరు బంధముఁ దెంపుమటంచు నాకుఁ గి
న్కను బలుకంగసాగితిరి కారణమేమి ? వచింపుఁడీ ! యదే
మనమునకుం బ్రియంబయిన మానక మీ రసినట్లొనర్చెదన్ ౭౫

ఉ॥ నందుఁడొ కీర్తిశాలి నవనందవిభుండును సర్వగోపకా
నందవిధాయకుండు మునినాథనుతుండును మత్సఖుండు గో
విందుని తండ్రియై జగతి విశ్వజనీనుఁడుగాఁ జెలంగు నే ?
యెందుల కట్టివాని మన మిత్త్రతవీడుట మీరు చెప్పుఁడీ! ౭౬

తే॥ తప్పులేనట్టివస్తువు ధరణిలేదు గానఁ దగినంత దోషంబుఁ గనఁబఱచుఁడి!
నాకు నచ్చినన్ విడుతు మా నందవిభుని సందియంబిందువలదోయి సరసులార !

ఆ॥ అంత వారలయ్య! యూనంగవిభువకుం గుల విశుద్ధుఁడైన కొడుకు పుట్టె
నతని పలుకుఁ, జనులు, నాకృతి, యద్భుతమా సింతకంటె దోషమేమునవలె?

క॥ ఈదోషము వరుసఁగ మీ మీఁదికి రాకుండ ముందు మేము వచింపన్
మీవరిఁజేరితి మిష్టము లేదా యింక మీకు మాకు లేవు ప్రియంబుల్ ౮౧

ఆ॥ అదియుఁగాక నీకు నాత్మజ యొక్క_త్తె గలదు సరిగ మదిని దలఁపుమయ్య!
యదంచుఁ జెప్ప నాతఁ డాతఁడు నేవిన్న గర్గసూక్తి వినుఁడు కనుఁడు నిజము

చ॥ సకలజగన్నివాసుఁడును స్రష్టయు భర్తయు హర్త భక్తర
క్షకుఁడును నా పరేశుఁడు రసాతలభారము దీసివేయఁగా
వికలమనం బణంపఁగను వేధ నుతింపఁగ నొప్పి నందపు
త్రకుఁడయి గోకులంబున విరాజిలుచుండెను కృష్ణనాముఁడై ౮౩

తే॥ త్వన్నికేతన మందు నున్నదము గన్న రాధ గోలోకవాసిని రమ్యరూపి
శోభనపరమేశ్వరిగ నెంచి నీవు మోహమందకుండుము వృషభానుబృందనాథ!

తే॥ మఱియు నీకుమారికకు నా హరికిఁ బెండ్లి ధాతయేఁ వచ్చి యమునకు దాపునందు
నెగడు బృందావనంబున నిర్జనముగఁ గ్రాలు భాండీరవనిఁ జేయఁగలఁడు ముందు

తే॥ నీ కుమారిక కోర్కెచే నిఖిలగోపచయము గోవర్ధనాహ్వయశైలవరము
గోపికాతతులును యమున బృందావనంబు పరమగోలోకమునునుండి వచ్చె నిటకు

ఉ॥ ఈరహిఁ బల్కి గర్గముని యేగెను తత్ప్రభృతిన్ మనంబునం
దారసమున్ గఱించి విశేషంబులఁ జెందక భక్తిఁ జూతు నా
ధీరసుధీవిలాస! ధర విప్రవరోక్తియు వేదవాక్యమై
తీరునుఁ జెప్పఁగాదె మది దీర్ఘముగాఁ బరికింపుఁడీ యనన్ ౮౭

తే॥ ఆలకించి గోపకులందఱుబ్బురంబుఁ జెంది క్రమ్మఱ వృషభానుశేఖరునకు
యుక్తియుక్తముగా నిట్టు లుచితరీతిఁ బల్కఁదొడఁగిరి బహులాశ్వపార్థివేంద్ర!

చ॥ సరిగ నెయున్న వీవనిన సంగతులన్నియుఁ జూడిపంట బం
గరు రజతంబు రత్నములుఁ గాంచన నిర్మితహర్మ్యముల్ మనో
హరమగు నారెముల్ బలము నర్థము సంపద కీర్తి గోవులున్
వఱలుచునుండె నీకుఁ బలుభంగులఁ గంసుఁడు పోంగు భంగిగన్ ౮౯

ఉ॥ కాని త్వదుక్తరీతి వ్రజకాంతుఁడు కాంచనరమ్యవేశ్మముల్
గాని సువర్ణభూషణనికాయముగాని యశోబలంబులన్
గాని మనోజ్ఞగోవులను గాని వదాన్యతఁ గాని యింకనె
ద్దానిని గాని నీకెనఁగఁ దార్కొననేరఁడు గాఁడె చూడఁగన్ ౯౦

క॥ ఎమ్మెడ నెయ్యంబునఁ గయ్యమునకు వియ్యమునకుఁ గావలె సామ్యం
బియ్యెడ నది సూడుము మా కయ్యేని విని నందుతోడ కూర్మిని విడుమా!

తే॥ అతని సంబంధమున్ విడి యైలబిలునిసరణి ధనియును గాన్యకుబ్జాపుకపతి
యధికబలియా బలందను నల్లునిగను జేసికొనినచో లెస్సయై చెలఁగుఁగాదె

ఉ॥ అంతియకాని కష్టముల నన్ని తెఱంగులఁ బొందుచున్ గృషిన్
సంతత మాచరించెడి వ్రజస్థితనందుని పుత్రజాతు నీ
చెంతకుఁ జేర్చవల్దతని చిన్నిసుతుం డని పేర్మెఁ జైన మే
నంత నను న్గొనంగ నధిపా యిపుడీవు పరీక్షఁ జేయుమా! ౯౩

చ॥ పలుకఁగ నిట్లు లక్ష్మి వృషభానునకుం గను నాలకించి గో
కులపతి వైభవంబును నకుంఠితకీర్తిఁ బరీక్షసేయఁగాఁ
దలఁచి క్రియాళిసంఘులనదస్సులు మోహ్యలు భాగ్యవంతులు
జ్యోలులును నౌ వృణానుల వెసన్ బిలిపించె విదేహనాయకా! ౯౪

ఉ॥ ఆపయి నాతఁడా బుధుల నందఱు జూడఁగ గోట్లకొల్ది ర
త్నాపితతారహారముల నామలకాభవిశేషదివ్య ము
క్తాపటలంబులన్ మణికదంబము మాడలు జక్కెరంబులం
దోపిక నింపి యిచ్చి యుచితోక్తులఁ గొన్ని వచించి పంపెఁగా ౯౫

ఉ॥ అంతట తద్వ్రణానులును నావ్రజనాయకు గోష్ఠిఁ జొచ్చి నే
త్రాంతములన్ బ్రమోదజల మగ్గలికన్ గురియంగ భక్తి న
త్యంతము మ్రొక్కి కానుకల నన్నిటి నాదృతినిచ్చి నమ్రులై
శాంతవచస్సులన్ బలుకసాగిరి నందున కిట్లు భూవరా! ౯౬

ఉ॥ ఆవృషభానుఁ డాత్మతనయాకరపీడన మాచరింపఁగా
భావమునం దలంచి మముఁబంపె నిటుల్ వరనిశ్చయార్థమై
కావున నొప్పి నీసుతునిఁ గైకొని పెండ్లికిఁ దర్లి రండు క
న్యావరణార్థమొందు నగ నర్మిలి మా కిడి యంపుఁడో ప్రభూ! ౯౭

చ। అనవుడు నందరాజు విని యల్ల యుపాయనముల్ గ్రహించి యో
జన సలుపన్ యశస్వినియు సాధ్వియునైన యశోదచెంతకున్
జని వృషభానుదత్తమణిసంతతిమౌక్తికతారహారకాం
చనములఁజూపి తల్లపితజాలము దెల్లముజేసె నల్లనన్ ౯౮

తే॥ శ్రీయశోదయుఁ దనభర్త చెప్పినట్టి హరివివాహమహోత్సవం బాలకించి
యల్ల వృషభానుఁ డంపిన యాణిముత్తియములఁ గన్గొని నందునకనియె నిట్లు

ఉ॥ శౌరివివాహవార్త విన సంతసమయ్యెడి గాని యిత్తఱిన్
వారు వరార్థమై మణులు బంగరుసొమ్ములు మౌక్తికంబు ల
వ్వారిగ నిచ్చిరన్ మనకుఁ బంపిరి గ్రమ్మఱఁ ద్విగుణంబునన్
వారికి నంపినన్ మిగుల బాగుగనుండును గాని యారయన్. ౧౦౦

చ॥ ధనము సువర్ణభూషలును దారములున్ వరహారముల్ మణుల్
ఘనముగ నేనొసంగఁ గలఁ గాని తదాకృతినొప్పు మౌక్తికం
బు నొకటియేని లేమి నిను పూనికలే డిఁక నేమొనర్తు? వా
నిని నిడకున్నచో యశము నీలిపడెందదె? ప్రాణనాయకా! ౧౦౧

తే॥ కానఁ గర్తవ్యమేమొ పల్కుంగదయ్య న, నంగ నమ్మఁడు సరియని నందనపరి
ణయము నిట్టి ముత్తెంబులు నాకునొరకి,నప్పుడొనర్తునంచెంచి యేమనకయుండె.

తే॥ ఇట్టి జాడ సర్వజ్ఞుఁడౌ కృష్ణుఁడెఱిఁగి, యల్లముత్యాల నుడువుగా నగుపడునవి
శతము నొంగిలి చని బహిస్స్థలమునందు,నాటెఁ గృషికుఁడు బీజముల్ నాటినట్లు.

చ॥ సరసఁ నందరాజు వృషభానుఁకు పంపిన మౌక్తికంబుల
న్గొనకొని లెక్కసేయ నొక నూ ఱుకొ తగ్గుట గాంచి యేమిరా!
యిది! బలి యాటకై కొనెనొ కృష్ణుఁడు నైకొనెనో మఱెవ్వ రి
య్యది యెటు లాచరించిరొకొ? యంచు విచారణ సేయ నెంచుచున్. ౧౦౪

చ॥ తొలుతను కృష్ణసన్నిధికి దూఁకుడుగాఁ జని యిద్దియేమిరా!
చిలిపిపనుల్ త్యజింపవుగ ఛీ యిపు డిచ్చట నున్న ముత్తియం
బులఁ గొనియుంటివే యిటకుఁ బోకిరు లెవ్వరు వచ్చినట్లు నేఁ
దలఁపను నీవుగంటివె? యథార్థముఁ దాఁపక చెప్పుమో సుతా! ౧౦౫

క॥ అప్పురుషోత్తముఁ డప్పుడొ, యప్పా! శతమౌక్తికముల నంది వెలుపలన్
గొప్పఁగ నాటితిఁ గృషికుల, చొప్పునఁ దప్పేనఁ గొట్టు! చుల్కనఁగనుచున్.

చ॥ అనవుడు నందుఁ డోరితులువా! యెటు లివ్వి హరించి యెట్టి నే
లను వెదజల్లియుంటివో విలంబము సేయక వచ్చిచూపుమా!
యని హరితోడఁ దా నరిగి హంగగు బంగరు కొమ్మలాకులన్
ఘనమగు చెట్టులం దుసిరికాయలఁ బోలిన ముత్తెము ల్గనెన్. ౧౦౬

తే॥ కాంచి యాతండు వెన్నుని గౌఁగిలించి,ముద్దులాడియు నాయనా! మొదల వృథగ
మొరటుగ నిను దండించితి బుద్ధి నఱియ, నీవు పరమాత్మవని తోఁచె నిశ్చయముగ

తే॥ కొడుకు కొడుకన్న నందఱు కొడుకు లగుదు
రొక్కొ? యీఘకిక్కఁ దలిదండ్రు లుబ్బునట్లు
మంచిపనులను సల్పు కొమరుఁడెకాక
యహహా! యద్భుతానందంబు లబ్బె నేఁడు. ౧౦౭

ఉ॥ వాకొని యిట్లు రిక్కలు సభంబునఁ బల్కినమాడ్కిఁ జెట్లపైఁ
బ్రాకిన మౌక్తికంబులను బ్రజ్ఞను గోటి గ్రహించి యప్పి శ్రో
భాకరహైమపాత్రములయం దిడి కంకణకాంచికింకిణుల్
గోకలు హారముల్ మణులు కోట్లకొలందిగఁ గూర్చి కూర్చితోన్. ౧౧౦

ఉ॥ సత్తముతో వృషానులకుఁ జక్కఁగ నిచ్చి సుధీపలోక! మీ
రెత్తఱిఁ బెండ్లిమూర్తుని యిచ్చుటికిన్ మఱిరేపు డెంతకో
యత్తఱి వేడ్క నెల్లరము వచ్చెదతోఁ జనుడెంతు మిప్పుడే
యుత్తమహారితోషికము లుజ్జ్వలికై యిడియుంటి మేగుఁడీ! ౧౧౧

చ॥ అని యనుపన్ వృషానులు మహోద్భుతహర్షము లొంది వాని వీ
డ్కొని వృషభానువర్యసభకుం జని నేతకు వందనంబులన్
బొనరిచి గోకులేశ్వరుఁడు బుద్ధిమదగ్రణి యైన నందుఁ డం
పిన కరదంబు లిచ్చి సరవిన్ బలుకాడఁ దొడంగి రిట్టులన్. ౧౧౨

తే॥ దేవ! మీయాజ్ఞఁ గైకొని దివ్యమైన, వ్రజమునకుఁబోయి నందుని భవనమునకు
నేగి బహుమానముల నిచ్చి యీర లనిన, పలుకులాడితి మాతని ఫణితి వినుమ!

మ॥ పలుకా తేనియలొల్కు ధనమా పౌలస్త్యకోశాభమున్
బలమా శత్రుభయంకరంబు గృహమా స్వారాడ్గృహశ్రేష్ఠమున్
జెలియా పూతచరిత్ర సుతులా శ్రేష్ఠుల్ సుహృల్లోకులా
యలఘుల్ గోవులు కామధేనువులు సూ! యా నందభూనేతకున్. ౧౧౪

తే॥ సిరియు సంపత్తు రెండును సరిగ వఱలు
విలువగల రతనంబులు వెల్లివిరియు
దివ్యముక్తాతరుప్రతతియుఁ జెలంగు
నందసుందరమందిరం బందు దేవ! ౧౧౫

క॥ మీరలు వలికినభావము, లూరీకృతమగును గోపకోత్తముఁడు వెసన్
గోరికఁ గన్యార్థముగ న, పారముగాఁ గానుకలిటులఁ బంపెను గనుమా!

క॥ నందుఁడు కేవలకృషికుఁడే, మందముగాఁ జేయునెడి మాటను గర్ణం
బందునఁ బడనీయకుమీ, యందఱిమిన్ మించినాఁడటంచుఁ దలఁపుమీ!

ఉ॥ ఆవల గోపు లావలుకు లన్నిటిఁ దిన్నఁగ నాలకించి యా
హా! వృషభానువాక్యములె యక్షరరీతి యథార్థమయ్యె రా
ధావనజాక్షి యాహరికి దారయు నామెకు నట్టి కృష్ణుఁడే
జీవితనాయకుం డగును శ్రీహరియే పరమాత్మయౌఁ జుమీ. ౧౧౭

చ॥ మఱి వ్రజనాయకుం డధికమాన్యుఁడు నందుఁడు భాగ్యవంతుఁ డుర్
వరనుఁ దటంచుఁ దోఁచెడిని సాంతముగా మన పల్కులెల్ల ద
బ్బర లగుచుండె నంచు వృషభానునకున్ నతులం బొనర్చి పో
యి రతఁడు సంతసించె జనులెల్లను హర్షముఁ బొందిరో విభూ! ౧౧౯

క॥ శక్తిని నెచ్చట శ్రీహరి, ముక్తాక్షేపంబుఁ జేసె ముచ్చట నచ్చో
ముక్తాసరసి తగెను నట, కార్త్తికమిడు నరుఁడు ముక్తి మలయును జనకా!

తే॥ అనంగఁ జనకుండు ముదమున నమరమునికిఁ, గ్రమ్మఱన్ బల్కెనిట్టులో క్ష్మాసురేంద్ర!
గోవర్ధనగిరి నెన్ని గొప్పతీర్థ, ములు వెలుంగునో తత్స్థితిఁ దెలుపుమయ్య!

ఉ॥ నావుడు మైథిలేశునకు నారదుఁ డిట్లనె గోవర్ధన
గ్రామము సర్వతీర్థతిలకం బతిరమ్యము గోపగోపికా
గోవితతివ్యథాహరణకోవిదతావిదితంబు వెంచి బృం
దావన మెల్లక్షేత్రములఁ దద్దయుఁ బెద్దద టంచు నెంచుమా! ౧౨౨

వ॥ మఱియు నగ్గిరివరం బింద్రయాగం బధఃకరించి యఖిలాండకోటిబ్రహ్మాండనాయకుండును భగవానుండును బరాత్పరుండును బరిపూర్ణతమావతారుండును గోలోకేశ్వరుండును స్వయంభువుండునగు శ్రీకృష్ణునిచే మంత్రతంత్రయంత్రసమన్విత పూజాపురస్కారంబులం బొంది యఘనాశనియగు మానసీగంగను శుభ్రంబును శుభప్రదంబును శుద్ధంబును నగు చంద్రసరోవరంబును గుసుమాకరసరోవరంబును గోవిందకుండంబును రాధాకుండంబును గృష్ణకుండంబును లలితాకుండంబును గోపాలకుండంబును గలిగి కృష్ణప్రియంబై పూర్ణబ్రహ్మాతపత్రంబై గోలోకముకుటంబై వెలసెన్. అం దిన్నీకసహితంబుగా దేవకీగర్భసంభూతవిశ్వగర్భుండు క్రీడలాడె. వెండియు నక్కొండ యందలి శ్రీకృష్ణశీర్షస్పర్శసంజనితలాంఛనాంచితశిల మౌలిశిల యనం బరఁగె. అందు గోవిందుఁడెందుఁ గందుకఖేలనం బొనరించెనో యాస్థలంబు కందుకక్షేత్రంబన వన్నె కెక్కె. ఏయశ్మంబునం జిత్రంబు లొనర్చెనో యది చిత్రశిల యని వ్యవహృతంబయ్యె. ఏపాషాణంబున నాహృషీకేశుండు క్రీడారతుండై వాగ్వాదం బాచరించెనో యది వాదని యనం బ్రసిద్ధంబయ్యె. ఏ నేల గోపాలబాలుండు బాలకసహితంబుగా వేల యుష్ణీషంబుల దొంగిలించెనో యద్ది యౌష్ణీషతీర్థంబని విదితంబయ్యె. ఎవ్వ రా మలఁగల పూర్వోక్తపుణ్యతీర్థంబులను శ్రద్ధాభక్తులం గని యందగపడు శక్రపదంబులం గాంచి బ్రహ్మపదంబుల నెఱిఁగి కృష్ణపదంబుల సంచరింతురో యవ్వారు పంచమహాపాతకులైనను పావనులై యైహికసుఖంబులను సమగ్రంబుగా ననుభవించి యవసానంబున విష్ణుపదంబుఁ జెందఁగలరు. తన్నగప్రభావం బభివర్ణింపఁ జతుర్ముఖ పంచముఖ షణ్ముఖ సహస్రముఖప్రముఖులును శక్తులు గానేర రనిన నాబోంట్లకలవి గాదని పల్కవలయునే యని మఱల నిట్లనియె. ౧౨౩

## —♦ దధిహరణ లీల. ♦—

తే॥ ఒక్కయెడ హరి, తద్గిరి గోష్ఠమందు మురళిఁ జాలించి యాఁడుచు నరుగుచుండి
పెరుఁగునమ్ము వ్రేతలఁ గాంచి వేమఱుఁ దదనుగ్రహత్వ మూహించి యిట్లనె నవ్వుదేర.

క॥ అలుగకుఁడీ! చెలులారా! తొలఁగకుఁడీ యిందునుండి దూఱకుఁడు మాటల్
బలుకకుఁడీ పెడభావము దెలుపకుఁడీ గోపికాసతీమణులారా! ౧౨౫

క॥ అందుఁడు నా కరకమలముఁ బొందుఁడు మనసార సౌఖ్యముల నాతోడన్
జెందుఁడు దమి విహరింపఁగ నొందుఁడు కమనీయ వనుల నుగ్గులులారా!

తే॥ సుందరీమణులార! యీ యందగాఁడు మీకు నికఁ సంభవించునే? మెలఁగి చిత్త
మందు మీరు మోహించుఁడీ యడిగినప్డు నిడనిదప్పనుగాదె మోసకత్తెలార!

ఆ॥ పలుక నవుల నల్ల వల్లవల్లభ నయన లల్ల విరవెలిన నేత్రు
కరసరోజము దోలఁగంగ జేయుచు నిట్లు పలుకఁ బోడఁగి రయ్య పార్థివేంద్ర!

శా॥ పో పో పోకిరి! త్రోవలోన నిటు మమ్మెంతొ బొట్టుటల్ పాడియే?
నీపోకిళ్లణఁగారిపోను దలఁపన్ నీతల్లిదండ్రుల్ జెజన్
భూపాలాజ్ఞను గష్టమొందరొకొ? నీవో పెద్దవాలెవ్వడున్
గోపాగారములందు దొంగిలవె యో గోపాల చాల్ జాలురా! ౧౨౯

తే॥ అనఁగ వినినట్టి హరి, వారి కనిరె నిట్లు, ప్రబలుఁడైనట్టి కంసు సబాంధవముగఁ
జంపి యిటకేరుదెత్తు నా శక్తిఁ గనుఁడు, పెండ్లియాడుఁడు నన్నిప్డు వెలఁదులార!

క॥ అనవుడు వ్రేతలు దానికి, ననుమతిజూపక వచింప హరి విని వేత్రం
బునఁ దచ్ఛిర స్థిత దధి,ఘన భాండములెల్లఁ బగులఁగాఁ బ్రహరించెన్. ౧౩౧

ఆ॥ అద్ది గాంచి యల్లయాభీరనారు లో పంకజాక్ష! పెరుగు భాండములను
బగులఁగొట్టితివిగ బళిర మీ తలిదండ్రులకు వచింతు మంచలయక చనిరి. ౧౩౨

ఉ॥ ఆపయి నచ్యుతుండు ముదమందుచు సందిదె యంచు మిత్రులన్
దాపునఁజేర్చి తృప్తిపడఁ దద్దధి నీపపలాశదిన్యప
ర్ణాపితమైన దొన్నెలను హాయిగఁ బోయుచుఁ గ్రోలె నాస్థలం
బోపతి! "ద్రోణతీర్థ"మన నొప్పు నఘాచలవజ్రకల్పమై. ౧౩౩

ఆ॥ అందుఁ జెట్లకొమ్మలాకులు దొప్పల వలెఁజెలంగు నింతవఱకు నెవఁడు
పెరుఁగు దాన మిచ్చి యొరిగలఁజేయునో వాఁడు గోజగతిని వఱలు స్థిరత

## —♦ గిరిరాజ విభూతి వర్ణనము. ♦—

తే॥ ఏస్థలంబునఁ గమలాక్షుఁ డీక్షణముల మూసి చెలులతో దాఁగిలిమూఁతలాడె
నద్ది పుడమి లౌకికతీర్థ మనఁగ నొప్పి పాపరాసులఁ ద్రోలెడిఁ బట్టుఁబట్టి ౧౩౫

తే॥ ఎందు నెన్నఁడు సఖులతోఁ జెలుల నటుల నింబుగాఁడిర్గె నద్ది కదంబఖండ
తీర్థమన నొప్పి తన్ను భక్తిని భజించు నరుని నారాయణుం జేయు నట్టులేక

తే॥ ఎచట శ్రీహరి రాధతోఁ జేరఁగి రాసకేళినంబున శృంగార మొలిఁగాంచె
నద్ది శృంగారమండలం బనఁగ నొప్పి యల్ల గోవర్ధనాద్రియం దతిశయిల్లు

తే॥ ఎట్టి రూపముతోఁ దుతఁ గృష్ణమూర్తి గోవర్ధనగిరి నెత్తి గోపకులను
గాచె నారూప మిప్పుడున్ గాంచఁబడెడి నట్టి శృంగారమండలంబందు జనక!

తే॥ దనుజామిత్రుఁడై కలియుగారంభకాలమందు నాల్గు వేలెనిమిదివందలేడు
లయిన శృంగారమండలంబందు నచలబిలము నడుమను హరిరూపు వెడలఁగలదు

శా॥ ఆరీతిన్ దనరు చక్రి దేవదమనాఖ్యన్ బిల్వ నెల్లప్పుడున్
ధీరుల్ సన్నుతిసేయు లీలలను నెంతేన్ జేయు నవ్వాని నె
వ్వారల్ భక్తిని వేదశాస్త్రవిధులన్ బ్రార్థింతురో వారు పా
పారణ్యంబును దాఁటి పుణ్యపురికిన్ హర్షంబుతోఁ బోవరే. ౧౪౦

తే॥ భరతవర్షంబునం దొక ప్రక్కయందు ద్వారకానాథుఁడొక దెసన్ బదరినాథుఁ
డొక్కమూల జగన్నాథుఁ డొక్కచక్కి రంగనాథుండు నొప్పు నభంగభంగి

తే॥ ఇటుల నల్వురా నాథుల నెఱిఁగి నడుమ గోవర్ధననాథుఁడు గుదురుకొనియె
నాథపంచక మీక్షించు సాధుబృంద మవ్యయంబగు గోలోకమందు నుండు

తే॥ యాత్రఁ జేసెడి మానవు లఖిలనాథులను గనుంగొని గోవర్ధననగనాథుఁ
గాంచరో వారు యాత్రచేఁ గలుగుఫలము నొందఁజాలరు శంక కించిత్తు లేదు

తే॥ పంచనాథుల క్షేత్రాలను బాధితులకు శరణమగు ధర్మమండప స్తంభములును
గలవు వానిని నెవ్వఁడుగనునో యట్టి నరుఁడు నారాయణుండయి వఱలు మఱియు

తే॥ నడచి యాత్రలఁ జేయనినరులు నల్వురైన నాథులఁ జూడని మానవులును
గోవర్ధనగిరినాథుఁ గోర్కెఁ గనిన సర్వఫలములఁ గాంతురో జనకరాజ!

తే॥ మఱియు నైరావతాహ్వయకరిపదాంక
ములును దేవేంద్రపదచిహ్నములును విష్ణు
పాణి పద లాంఛనంబులా పర్వతమునఁ
దనరు నవి గాంచు మానిసుల్ ధన్యతములు

తే॥ పైని జెప్పిన చొప్పున బహుళపుణ్యతీర్థముల్ గోవర్ధనాద్రివరమునకు
నవయవంబులుగానుండు నమలచరిత! యింక నెయ్యది వినెదవో యెఱుఁగఁజెపుమ!

తే॥ అనఁగ జనకుఁ డేతీర్థములే యవయవములుగఁ గల్గిరి కమ్యనో తెలుపుమయ్య!
జ్ఞానివర! యన్నఁ దన్నాకమౌనివర్యుఁ డిట్లు వత్సలతఁ బలికె వచియింపఁ గడఁగె

వ॥ భూపా! సకలభూతంబుల సర్వాంగంబులందుఁ బొందుపడియున్న బ్రహ్మాంబున కవయవవిభాగం బేర్పరచుట దుర్ఘటంబగున శ్రీగోవర్ధననాథున కానుపూర్విగా నంగంబుల నిష్కర్షించుట దుష్కరంబని యెఱుంగుము. ఐనను ప్రసిద్ధంబులైన యంగంబు లేయే తీర్థంబులుగాఁ జెలంగెనో యది నా మెఱింగిన కొలఁది విన్నవించెద. వినుము. ఎచ్చోట గోకులవాసులు పూజాపురస్సరంబుగా నన్నకూటంబు సమర్పించిరో యద్దానికి శృంగారమండలం బుపరిభాగంబున నుండునో యా రమ్యస్థలం బచలనాథునకు ముఖంబును, మానసీగంగ నేత్రంబులును, చంద్రసరోవరంబు నాసికమును, గోవిందకుండం బధరంబును, కృష్ణకుండంబు చిబుకంబును, రాధాకుండంబు రసనయు, లలితాకుండంబు కపోలంబులును, గోపాలకుండంబు కర్ణంబులును, కుసుమాకర సరోవరంబు కర్ణాంతంబులును, మాలిశిల లలాటంబును, చిత్రశిల శిరంబును, వాదినీశిల కంఠంబును, కందుక క్షేత్రంబు పార్శ్వంబులును, నౌష్ణీషకుండంబు కటియును, ద్రోణతీర్థంబు పృష్ఠంబును, లౌకిక తీర్థం బుదరంబును, కదంబఖండతీర్థం బురంబును, శృంగారమండలంబు జీవంబును, శ్రీకృష్ణ పదలాంఛనంబులు మనంబును, హస్తచిహ్నంబులు బుద్ధియును, ఐరావతాంకంబులు పదంబులును, పుచ్ఛకుండంబు వాలంబును, కామధేనుపాదవాళులు బాహువులును, వత్సకుండంబు బలంబును, రుద్రకుండంబు క్రోధంబును, శక్రకుండంబు కామంబును, కుబేరతీర్థం బుద్యోగంబును, బ్రహ్మతీర్థం బనుగ్రహంబును, యమతీర్థం బహంకారంబును నై విరాజిల్లు నని పెద్దలు వర్ణించిరి. ఇట్టి గిరివరంబు హరి యురంబునఁ బ్రాదుర్భవించి పులస్త్య తేజఃపుంజంబున నచ్చటికి వచ్చి సర్వపాపంబుల గచ్ఛవిచ్ఛిన్నపరించుచు సాటిలేనిదై మించె. ఏతన్నగవిభూతికథాశ్రవణతత్పరు లఘురహితులై పునర్జన్మంబుఁ గాంచక గోలోకమం దానందం బనుభవింతురని గుర్తెరుంగు మన విని బహులాశ్వుండు మునివరున కిట్లనియె.

మ॥ గిరిరాడ్ఖ్యాతిని నాకుఁ దెల్పితివి కోర్కిన్ వింటిఁ దచ్చైలమా
హరివక్షంబున నెట్లు పుట్టినది వర్ణింపంగ నే వేఁడెదన్
సరసజ్ఞానధురీణ! నా మునియు రాజా! యల్ల గోలోక భా
సురగోవర్ధనజన్మగాధ విను మంచున్ జెప్పఁ దొడ్గెన్ జుమీ. ౧౫౦

## —♦ గిరిరాజోత్పత్తి వర్ణనము. ♦—

ఉ॥ సత్యుఁ డనంతుఁడున్ బరుఁడు జ్ఞాని విశుద్ధుఁడు నైజసిద్ధుఁడున్
నిత్యుఁ డనన్యుఁ డవ్యయుఁడు నిర్గుణుఁడున్ బ్రమదస్వరూపుఁడున్
బ్రత్యవహార భాసురుఁడు భర్తయు హర్తయు గర్తయున్ ముని
స్తుత్యుఁడు కాలరూపుఁ డఘదూరుఁడు పూర్ణుఁడు కృష్ణుఁ డొప్పెడిన్. ౧౫౧

ఉ॥ ఆతని వీడి మానస మహాంకృతి చిత్తము బుద్ధియున్ మహా
భూతములున్ మహత్తులు విధుండు బలుండు గుణత్రయంబు బ్ర
హ్మోత్తమునున్ గళానిధియు నుర్వియు నూర్ధ్వము దిగ్చయంబు జీ
మూతము నిల్వవం చెలుఁగు భూవర! యాహరి యిచ్చు నాదిలోన్. ౧౫౨

శా॥ వాలాయంబుగ శేషుఁడై బిసరుచిన్ భాసిల్లి యాపుస్థలిన్
లీలోత్సృష్టము పూపపార్షదము దల్లేఖస్తుతంబైన శ్రీ
గోలోకంబు సృజించి పాదమున దివ్యాలంకపోర్మిచ్ఛటా
వ్యాలిక త్రిపథప్రసారచతురన్ భాగీరథిన్ గాంచియున్. ౧౫౩

సీ॥ వామాంసమందున వాహినీవరమైన కాళిందినిం గుతుకమునఁ గాంచెఁ
జీలమండను గడు జెన్నువహించెడి రాసమండలమును రాణఁ గాంచె
జానువులందున సర్వవనంబుల నింపగు బృందావనంబుఁ గాంచె
నూరువులందున నుత్తమోత్తమమైన లీలాసరోవరం బోలిఁ గాంచెఁ

తే॥ గటిని నవరత్నఖచితమౌ కనకభూమిఁ గాంచె నుదరరోమావళిన్ గ్రమమాధ
వీ లతలఁ గాంచె నాభిని వేలకొలఁది వివిధవర్ణాంచితాబ్జముల్ వేడ్కఁ గాంచె.

చ॥ మఱియును వక్షి జంఘముల మాధవమాధురిసాధువున్ సరో
వరరుచిరంబు భృంగరుతిభాసురమున్ సుమనోమనోజ్ఞమున్
సరసవిహంగసంగతము చత్వరహర్మ్యసభాసమేతమున్
గురుతరభాస్వరంబయిన కుంజముఁ గాంచె మహోల్లసంబునన్. ౧౫౫

తే॥ జత్రుదేశంబులందు విచిత్రములగు ద్వారకా మధురాపురుల్ పరిఢవిల్లె
భుజములందున శ్రీదామముఖులు నష్టపార్షదుల్ బుట్టిరా పీతపటున కింక.

మ॥ త్రివళిప్రాంతములన్ సుగంధయుతమౌ దివ్యానిలం బొయ్య ను
ద్భవమయ్యెన్ మణిబంధయుగ్మమున నంద్రశ్రేణి జన్మించె రో
మవితానంబున గోపవంశమును జన్మం బొందె బుద్ధిన్ లతా
నివహంబుల్ తృణగుల్మముల్ గలిగె నిర్నిద్రప్రతాపోదయా! ౧౫౬

వ॥ వెండియు నా బ్రహ్మాండనాయకునకు ౧౫౭

చ॥ మనమున గిబ్బగిడ్డులు సమంజసరీతిఁ దగెన్ గరాగ్రమం
దున నుపనందులున్ దగిరి దోర్యుగమూలములందుఁ బొందికన్
ఘనవృషభాను పట్టమును గన్పడె దాపలమూఁపునందు గౌ
రనిబిడకాంతిపుంజము విరాజిలె రాజ! యనంతరంబునన్. ౧౫౮

తే॥ దానినుండి లీలయు, సిరి ధాత్రి విరజ
లనెడి వనితామణులు వెల్గి రందు లీల
యను లతాంగిని శ్రీరాధికాఖ్యఁ బిలుతు
రామె హరిసతులందు ముఖ్యముగఁ జెలఁగు. ౧౬౦

ఉ॥ ఆయన దివ్యబాహుయుగమందుఁ గమిన్ లలితావిశాఖలన్
దోయలు లిప్పు రొప్పిరికిఁ దోయజలోచనలైన గోపికల్
బాయక యామె కేశముల భాసిలి రిట్టుల గోజగంబు భా
గ్యాయతనంబుగా నలిచె నా కమలాలలనేశుఁ డంతటన్. ౧౬౧

ఉ॥ దేవుఁడు దేవపోషకుఁడు దేవనుతుండును వాసుదేవుఁడున్
భావజకోటిమోహనుఁడు భక్తవశుండు పరాత్పరుండు శి
ష్టావనతత్పరుండు నగు నచ్యుతుఁ డగ్గలమైన వేడ్కఁ రా
ధావనజాక్షితోఁ గలిసి తత్పృథు గోజగమందు నొప్పఁగన్. ౧౬౨

చ॥ ఒకపరి వేణుగానరవయుక్తము భామినినూపురధ్వని
ప్రకటితమున్ సువర్ణగృహవప్రసభాంగణహర్మ్యరమ్యమున్
సకలలతాప్రసూనఫల సంయుతమున్ జననేత్రరామణీ
యకమగు రాసమండలమునందున రాధిక, భర్త కిట్లనెన్. ౧౬౩

తే॥ జీవితేశ్వర ! నాపైనిఁ జెలిమి నిశ్చయముగ నున్నచో నీతోడ నంతరంగ -
మందునుండెడి భావంబు నజమజలను విడిచి నుడివెద నావుడు వెన్నుఁడపుడు.

ఉ॥ దాని వచోవిలాసమును దాని సుధాకరతుల్యవక్త్రమున్
దాని మదేభయానమును దాని లసన్మధురాధరంబునున్
దాని శరీరసౌష్ఠవము దాని మనోజ్ఞవిభావహావముల్
దాని కటాక్షము ల్గని ముదంబును బొందుచు నామె కిట్లనెన్. ౧౬౪

తే॥ నీదుభావమునందున నిలిచియున్న యాశయంబును దెలుపుము! యద్ది యొసఁగఁ
దగనిదైనను నీపైని తమకమునను నిడుదు స్పష్టీకరింపుమో యెమ్మెలాఁడి!

క॥ అనవుడు రాధిక యిట్లను వనజాక్షా! యమునతటిని వఱలెడి బృందా
వనిఁ గుంజమునదరి గూఢమయిన దేశము రాసమునకు నేర్పరచు మనన్.

చ॥ హరి శ్రవణంబులార విని యట్టులె యం చరుసంబుతోడ న
చ్చెరువునుగొల్పు భూమిని రచింపఁగ నెంచి సమస్తలోకముల్
గరము బరీక్ష సల్పి యెటఁ గన్గొనఁజాలక స్వీయనేత్రతా
మరసములన్ స్వపక్షము నమందముగాఁ గనె నంతమాత్రనే. ౧౬౫

శా॥ గోపీవ్యూహము సూచుచుండ నల వైకుంఠోరువక్షంబునం
దా పేర్మిన్ సజలప్రభాపటల మత్యంతంబుఁ దోఁతెంచి క్రీ
డాపాత్రంబగు రాసభూమిఁ బడి గుట్టంబోలురూపంబుతోఁ
బాపధ్వంసకృతిప్రశస్త మగుచున్ భాసిల్లె నంతంతటన్. ౧౬౯

సీ॥ శ్రీఫలమన్మథ చిత్రికనకుళకదంబరంభాముఖతరువరముల
మల్లికా మాలతీ మాధవీ చంపక పారిజాతాది పుష్పనిచయములఁ
గీరపారావతశారికాపరభృత సారస భృంగాది సరసరుతుల
స్నానపానోచిత స్వాదూదకోల్లసన్నిరజవ్యాపృతనిర్ఝరములఁ

తే॥ జెలఁగి శతకోటియోజనములను గ్రాలు, శేషుఁబోలిన లంబంబుజెంది లక్ష
యోజనంబుల వెడలుపు నొంది యైదుపదులకోట్లామడల యెత్తు. వఱలి ప్రబలె.

తే॥ స్వర్ణకలశోజ్జ్వలత్సౌధసరణి నద్రి కోటియోజనవిస్తృతకూటశతక
ములను వెలుఁగు గోవర్ధనాచలమని శతశృంగమని దానిఁ బిలిచెద రిలను జనులు.

ఉ॥ అత్తఱి గోజగజ్జనము లర్థుచె! యొక్కక్షణంబులోన నీ
యెత్తు, విశాల, మాయతము లీ మల కెక్కడనుండి నేవిధిన్
హత్తెనొ యంతకంత కిది యంతయుఁ గ్రమ్మచుఁ బెర్గుచుండె హా
చిత్తము దత్తరిల్లెడిని జేయుట కేమియుఁ దోఁప దక్కటా! ౧౭౨

తే॥ అద్ది గనుఁగొని వనజాక్షుఁ డద్రిఁజేతఁ జఱచి యేల గోవర్ధనాచల! యిదేమి
జగముఁ గ్రమ్ముచుఁ బెరిగెదవిఁక నిలువుమంచు శాసింప నాగుట్ట యట్టె యాగె

ఆ॥ అంత వెన్నునిచెలి యైన యారాధిక నయనపర్వమిడెడు నగవరంబు
నందు గూఢమైన యనుఁగుచోటును గాంచి శౌరితోడఁ గూడి చేరె ధీర!

ఉ॥ ఆవల నగ్గిరీంద్ర మల యచ్యుతు నానతి సర్వపుణ్యతీ
ర్థావృతమున్ దిరస్కృతఘనాసితకాంతియుతంబు నాదితే
యావళిహర్షదాయకము నై యల ద్రోణుసతిన్ జనించి మో
దావహమైన గోకులమునందుఁ జెలంగెఁ బులస్త్యనీతమై. ౧౭౫

ఉ॥ ఎట్టులఁ దత్పులస్త్యముని యెందుల కాగిరిఁ దెచ్చి యిచ్చటన్
బెట్టెనొ యట్టివార్త వినిపించితి మున్నిఁకఁ దన్మునీంద్రుఁ డా
గుట్టలమేలుబంతి కల గోజగమందున హెచ్చిన ట్లిటన్
బిట్టుగఁ బెర్గునేమొ యను భీతిని శాపమిడెన్ క్షయార్థమై. ౧౭౬

క॥ అనెడి సమాచారంబును మును సెప్పితిఁగాదె! యిట్టి భూధరజన్మం
బును విన్నవార లందఱు గనరే గోలోకబహుసుఖంబుల జనకా! ౧౭౭

## —♦ గిరిరాజ మాహాత్మ్యము. ♦—

క॥ ఏతద్గిరిమహిమంబుల నైతిహ్యము వినుము విజయుఁ డను బాపఁడు త
ద్గౌతమితీరంబందున భూతలజనవంద్యుఁ డగుచుఁ బొలుపారవలెన్. ౧౭౮

చ॥ అతఁడు ఋణంబు గైకొనఁగ నా మధురాపురికేగి స్వీయమా
కృతి నెఱవేర్చి తిర్గి తన యింటికిఁ బోవుచు త్రోవలోన న
ద్భుతమగు రూపముల్ గలిగి పొల్పువహించిన తన్నగంబునం
బతికయవర్తులం బయిన యశ్మము నొక్కటి గ్రహించి వేడుకన్. ౧౭౯

గీ॥ వరుసఁగ గోకులంబు విడి వైవఁ బ్రయాణము సల్పునప్పుడున
న్గరములు మూఁడు, హస్తనిభనాస, ముఖస్థముఖంబు, వక్రమై
న రదనపంక్తి, రక్తనయనంబులు, నాలుకలు నాల్గు, చేతులే
డువవగు ముండ్లఁబోలిన నఖోత్కరము, ల్గల రాక్షసు న్గనెన్. ౧౮౦

ఉ॥ ఆదనుజుండు వోయెడి ధరాసురవర్యునిఁ గాంచి యాఁకటన్
రోదసి భేదిలన్ బహువిరుద్ధవిధంబున ఘుర్ఘురాభమా
నాదమొనర్చి వానినయనంబుల ముంగల నిల్వ బ్రాహ్మణుం
డాదను గేలనున్న గిరియశ్మమునం బ్రహరించె భూవరా! ౧౮౧

ఉ॥ అంతట యాతుధానుఁడు నఘౌఘనివారణశీలశైలరా
డంతరనీతపూతశిల స్పర్శఘనంబునఁ బద్ధ దుష్కృతా
క్రాంతనిశాచరత్వము నరంబున వీడి మనోజరూపుఁడై
చింత దొఱంగి బ్రాహ్మణునిఁ జేరి నమస్కృతి సల్పి యిట్లనెన్. ౧౮౨

ఉ॥ భూసురవర్య! నీవె బహుపుణ్యతముండవు లోకరక్షణా
భ్యాసమహాశయుండ వొక వర్తులమౌ శిలఁగొంచు నాపయిన్
వేసి నిశాటరూపమును వీడ నొనర్చియు నిట్టిరూప మీ
వేస మొసంగి నాకుఁ గడు వేడుకఁ గూర్చితి విద్ది యల్పమే? ౧౮౩

ఉ॥ క్రమ్మఱ బ్రాహ్మణుండు పలుకంగఁ దొడంగెను సిద్ధపూరుషా!
యిమ్మెయి నేను మిమ్ము నఘహీనునిగా నొనరింపలేదు స
త్యమ్ముసుమీ మదశ్మమున కట్టి మహత్త్వెలంగునంచు లే
శమ్ము నెఱుంగఁజాల నిఁక సర్వము నీవె వచింపఁగాఁ దగున్. ౧౮౪

క॥ అనవుడు సిద్ధుం డిట్లను వినుమా గోవర్ధనాద్రివిభు మహిమంబుల్
మును పెద్దలు పల్కిన రీతిని జెప్పెద నీకు విజయ! ధీరసుగేయా! ౧౮౫

సీ॥ మంచిమాటలఁ జెప్పి మాయలఁ గావించి, కొంపలఁ గాఁజేయు కొంటెవాండ్రు
వేదశాస్త్రములకుఁ జెడయర్థముల్ సల్పి కుమతంబులన్నిల్పు కుత్సితులును
బవలమ్మ యని రేయిఁ బడకకుఁ బడఁతిరో! రమ్మని పిల్చెడి రాక్షసులును
నుపకారములఁ బొంది యపకారములఁ జేసి ధన్యులమని విఱ్ఱ వీగు రులును

తే॥ దేవ భూదేవతల దూఱు దుష్టులు మఱి "యాత్మవత్సర్వభూతాని" యంచు నన్య
దార ధనముల నర్థించువార లేని నల్ల గిరిని గాంచిన ధన్యు లగుదు రయ్య!

సీ॥ గంధమాదనయాత్రఁ గలుగుఫలంబును మించు పుణ్యంబు సిద్ధించుచుండు
వృషభాద్రికోలకబుశ్యమూకాద్రియాత్రలఁ గల్గు ధన్యత దనరుచుండు
మంగళగిరియాత్ర బంగరుగా భక్తి నొసంగిన సుకృతంబు సంభవించుఁ
గేదారమందున నైదు వేలేండ్లు తపంబును సల్పిన ఫలము గలుగు

తే॥ కూటకాద్రిని నపరంజికొమ్ములున్న గోవులను దానమిచ్చిన గొప్పఫలము
సేకుఱు నల గోవర్ధనచిత్రగిరిని, గన్నులారంగ గనిన నిష్కల్మషులకు. ౧౮౭

సీ॥ మలయాచలంబున మణుఁగుల కొలఁదిని స్వర్ణమిచ్చినఁ గూడ ఫలము లేదు
దేవగిరిన్ భూమి దేవతలకుఁ బంచభక్ష్యాన్నమిడినను ఫలము లేదు
సహ్యాపర్వతమందు శాస్త్రోక్తరీతి నుర్వర నొసంగినగూడ ఫలము లేదు
వేంకటాచలమందు వింధ్యాద్రియందు సవంబుల సల్పినఁ ఫలము లేదు

తే॥ వారిధారమహేంద్ర పర్వతములందు నశ్వమేధసహస్రంబు నధికభక్తి
నాచరించినఁ ఫలము లే దట్టి గోవర్ధనంబును గనసట్టి వారి కనఘ!

తే॥ అట్టి శ్రీశైలమందు విద్యాధరాఖ్యఁ
జెలఁగుకొలఁకున బదియబ్దములను జలక
మాడు పుణ్యంబుగలుగు నీ యద్రినున్న
పుచ్ఛకుండంబునం దొకప్రొద్దు మునుఁగ.

వ॥ మఱియు శ్రీరామనవమిని చిత్రకూటంబందలి పయస్వినీనదిని, నక్షు
తృతీయను బారియాత్రగోత్రంబునను, సప్తమిని నింద్రకీలశైలంబునను, వ్యాస
పూర్ణిమను గుకురగిరియందును, మధన ద్వాదశిని నీలాద్రియందును, స్నానదాన
తపంబులం జేసిన పుణ్యం బీగోవర్ధనాచలం బందలి మానసీగంగను మునింగిన
సిద్ధించు. వెండియు సురగురుండు సింహరాశిగతుం డగుచుండ గోదావరీ ప్రోదిని
యందును, వాచస్పతి కుంభరాశిం బ్రవేశింప మాయాపురం బనంబరఁగు
హరిద్వారంబునను, బుష్యమీనక్షత్రమందుఁ బుష్కరతీర్థంబునను, సూర్యగ్రహ
ణంబునం గురుక్షేత్రంబునందును, జంద్రగ్రహణంబున వారణాసియందును, ఫాల్గునంబున
నైమిశక్షేత్రంబునను, నేకాదశీతిథిని శూకరక్షేత్రమందును, గార్తికమాసంబునందు

గణముక్తిదక్షేత్రంబునను, గార్తికపూర్ణిమయందు వటేశ్వరక్షేత్రంబునను, శ్రీకృష్ణ జన్మాష్టమిని మధురాపురమందును, ద్వాదశీదినంబునందు ఖాండవవనంబునను, సూర్యుండు మకరగతుం డగుచు బర్హిష్మతీపురంబునను, మాసశివరాత్రిని వైజనాథ వనంబునను, సోమవతియగు నమావాస్యను గంగాసాగరసంగమస్థలంబునను, దశమిని రామేశ్వరంబందలి సేతుబంధంబునను, రథసప్తమిని శ్రీరంగక్షేత్రంబందును దర్శించి యవగాహనం బొనర్చి యథాశక్తి దానంబు లొసంగి సవంబులం గావించి జపతపస్స్వాధ్యాయంబుల నాచరించిన వారెట్టి ఫలంబు లొందెదరో యట్టి యగణ్య పుణ్యంబీ గోవర్ధనాద్రి నొకమాఱైన సందర్శించి గోవిందకుండంబునఁ దానంబు సల్పి దానంబు లనూనంబు గావించినఁ జేకూఱునని గుర్తెఱుంగుము. ఇంకఁ జాంద్రాయణాది వ్రతంబుల సల్పిన పుణ్యంబుకంటెఁ గోటిగుణితఫలంబు లభించు క్షేత్రంబులలో క్షేత్రరాజంబై పర్వతంబులం బర్వతశ్రేష్ఠంబై దర్శనీయంబులను సందర్శనీయంబై వెలుంగు నగ్గిరివరంబుతో సమంబగు క్షేత్రంబును బర్వతంబును దర్శనీయంబును బుణ్యప్రదంబును ద్రికాలంబులను లేదని తెలిసికొనుము. తాదృశమహామహిమా మనోహరంబగు నగ్గోవర్ధనం బందలి పాషాణంబున నన్నుఁ బ్రహరించితివి. తచ్ఛిలా స్పర్శంబున మత్కలుషంబులు లులితంబులయ్యె. రాక్షసత్వంబువాసె. రమణీయ రమారమణరూపంబు నాకు సిద్ధించె. కావునఁ దద్గిరిదర్శనస్పర్శనంబుల నాచరించిన నీవె కృతార్థుండవుగాదే యని నుడివిన నప్పుడమివేల్పు విని హర్షాశ్చర్యంబులం బొంది సిద్ధున కిట్లనియె.

ఉ॥ సిద్ధ! మహానుభావ! బుధశేఖర! నీ యనుకంప నిత్తఱిం
శ్రద్ధగ గోవర్ధనధరాధరదివ్యమహత్తు వింటిఁ ద్వ
చ్ఛుద్ధశరీరముం గనులఁ జూచితి నమ్మితిఁ బ్రాగ్భవాన నీ
పద్ధతి యెట్టిదో యెఱుఁగఁ బల్కుము నావుడు సిద్ధుఁ డిట్లనెన్. ౧౯౧

ఉ॥ కాశ్యపిదేవ! పూర్వజనిఁ గల్మషయుక్తుఁడనై పవిత్రమౌ
వైశ్యకులంబునందుఁ బ్రభవంబును బొంది ధనోద్ధతుండనై
వేశ్యలఁగూడితిన్ సురను వేమఱు ద్రావితి జూదమాడి య
ప్రాశ్యుఁడనైతి జాతి పిత భార్యయుఁ దల్లియు బిట్టు దిట్టఁగన్. ౧౯౨

ఉ॥ కోపము వచ్చి యొక్కతఱిఁ గొబ్బరికాయలఁ గొట్టినట్లు నా
తాపము దీర భార్య తలిదండ్రుల నెత్తులపైనిఁ గఱ్ఱతోఁ
బాపభయానుకంపలను భావమునం జొరనీక కొట్ట వా
రీ పృథివిన్ ద్యజించి పరమేగి రనంతరమందు వేడుకన్. ౧౯౩

ఉ॥ నేనును వారివిత్తమును నిమ్ముగఁ గైకొని వేశ్యతోడ నీ
శానసుమిత్రదిక్కునకుఁ జక్కఁగ నేగి ధనంబు వెచ్చ మ
న్న్యాన మొనర్చి డబ్బుకయి నూఱులకొల్ది జనంబుఁజంపి స
మ్మానపరాభవంబులను మాని చరించుచునుంటి భూసురా! ౧౯౪

ఉ॥ చేసిన బ్రహ్మహత్యలును జేసిన క్షత్రియహత్యలున్ మఱిన్
జేసిన వైశ్యహత్యలును జేసిన పావజహత్యలింక నేఁ
జేసిన భ్రూణహత్యలును జేసిన మానినిరత్నహత్యలున్
నీ సవిధంబునన్ బలుకనేర్తునె? యిన్నియటంచుఁ గోవిదా! ౧౯౫

క॥ ఒకపరి మృగమాంసార్థము సుకముగ నొక వనముఁ జేరి చూచెడితఱి నం
దొక భుజగం బేతెంచియు స్వకపాదములంటఁ గఱవఁ జచ్చితి నంతన్. ౧౯౬

క॥ చీఁకటి మ్రాఁకులఁగుమివలెఁ గైకొని కళపాశములను గన్నుల నిప్పుల్
దూఁకఁగఁ బండ్లను గొఱకుచు భీకరయమభటులు వచ్చి వెరఁగుపడఁ గసిన్.

క॥ త్రాడుల సుత్తముగా నన్నూడనిరహిఁ గట్టి ముద్గరోత్కరములతోఁ
దాడించి యాపుడమిపై నీడుచుకొని సంయమినికి నేగిన మీఁదన్. ౧౯౭

తే॥ కాలునాజ్ఞఁ గుంభీపాకఘననరకమునందు మన్వంతరం బుంచి యమితహింస
సల్పి తప్తోర్మినరకానఁ గల్పమొండు పెక్కుబాములఁ బెట్టిరో విప్రవర్య!

క॥ ఎనుబదినాలుగులక్షల పెను నరకములందు నన్నుఁ బెట్టుచు వేర్వే
రను నొక్కొక యేఁడును వ్యథలను జెల్లుగఁ బెట్టి రావలన్ శమనేచ్ఛన్ ౨౦౦

క॥ భారతధారిణిలోఁ బదిసారులు సూకరముగాను, శతజన్మములన్
దారుణశార్దూలంబుగ, నూఱుజనుల నుష్ట్రిముగను నూల్కొంటి మఱిన్.

తే॥ మహిష జన్మము నేనూఱుమాఱులెత్తియుంటి సర్పజన్మంబుల నొక్కవంద
సారులెత్తి దుష్టులచేతఁ జంపఁబడితి నింకఁ బదివేల యేండ్లిటులేగె జనుల.

క॥ అంతట నిర్జలమైన వనాంతరమం దిట్టి రాక్షసాకారముతో
వింతగ వికీరాలాఖ్యదురంతాపత్కరుఁడనగుచు నలయుచు నెంతో. ౨౦౩

తే॥ ఒక్క శూద్రుని మొదలున నొయ్యనెక్కి గోకులంబున కేగఁగా గోపకులును
కృష్ణపార్షదులు నగు నహీనబలులు గాంచి కఱ్ఱల నను గొట్టఁగడఁగి రంత.

తే॥ వారి తన్నుల కాగక వ్రజము విడిచి, కాళ్లకుందిగఁ బాఱి యాకరణి క్షుధను
నిర్దయాత్ముండనై యిప్డు నిన్ను మ్రింగ వచ్చియుంటిని నింతలోపలను నీవు

క॥ భీతి మనంబును గలఁచఁగ నాతతగోవర్ధనాద్రి యశ్మముతోడన్
ఘాత మొనర్చితి దానన్ బూతుఁడనై కృష్ణకృపను బొందితి శుభముల్.

ఉ॥ ఈకరణిన్ ధరామరున కెంతయు వాకొనులోన నట్టి గో
లోకమునుండి భూషణములున్ హయముల్ బదివేలుఁ గోటి సూ
ర్యాకృతితుల్యకాంతు లనుయాయులు లక్ష సహస్రచక్రముల్
దూఁకొను నొండు తేరటకుఁ దోడనె వచ్చియు నిల్చె ముంగలన్. ౨౦౬

క॥ దానిని సిద్ధుఁడు విప్రుఁడు ప్రాణికిఁ గని హర్షమొంది ప్రమోక్కి పిదపన్
దానిని నెక్కుచు సిద్ధుఁడు మానితగోలోకమునకు నమందగతిఁ జనెన్. -౨౦౯

తే॥ పిదప బ్రాహ్మణవర్యుఁడు వెనుక మరలి విమలభక్తి గోవర్ధనసముఖమునకు
జని ప్రదక్షిణముల్ జేసి సంస్తవంబు సలిపి ప్రణమిల్లి యరిగెను స్వగృహమునకు

ఉ॥ ఈరహి గోవర్ధనగిరీంద్రకథాసుధఁ గ్రోలువారలా
శ్రీరమణస్వరూపమును జెంది మనోహరతత్ఫలంబునన్
జేరి సుఖింత్రు గాని పితృశేఖరదండము గాంచ రిద్ధిము
క్కాలముల నిక్కమయ్య జనకా! యని ప్రీతి వచించె శౌనకా! -౨౧౦

తే॥ మఱియు గోపరాణ్ణవకేళి సరిగ విని వారు దేవరాజును బోలి పరమసుఖము
లనుభవించియుఁ బరమున నట్టి నందరాజుకైవడి శాంతులై రాజలుదురు.

క॥ అనవుడు శౌనకుఁ డిట్లను మునివర!, జనకుండు మఱి విబుధవరానిని నే
మని పృచ్ఛించెనొ యయ్యది వినఁగోరుచునుంటి బ్రహ్మవిద్వరిష్ఠా! -౨౧౨

తే॥ అవల గర్గబుధేంద్రుఁడు వనియె నిట్లు నారదా! యింతమాత్రన నాకుఁ దృప్తి
గలుగదయ్యెను గానఁ బల్కుంగవలయు రాధికాధవమాధుర్యగాథ లనుచు.

క॥ కువలయసంరక్షణరత! కువలయపతితిలక! గోపకులజలధీందూ!
కువలయమనోజ్ఞవర్ణా! కువలయమిత్రాక్షనేత్ర! కువలయనాథా! -౨౧౪

ఉత్సాహవృత్తము॥ దేవదేవ! వాసుదేవ! దేవకీసతీభవా
దేవమానినుత్యజీవ దేవభోగిరాడ్ధవా!
గోవివర్ధనాహ్వయోరు గోత్రభారధారకా
దేవదమననామధేయ దృప్తవంశవారకా! -౨౧౫

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్యదత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతం బందలి
గిరిరాజఖండము
సంపూర్ణము.

---

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓం తత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ కృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీగర్గభాగవతము

## మాధుర్యఖండము




మంజులనామా! రామా!
మంజీరకిరీటహార మణిగణ తేజః
పుంజసమంజస! గోపీ
రంజక! మురళీవినోద! రాధాకృష్ణా! ౧

### శ్రుతిగోపికోపాఖ్యానము.

చ॥ దివిజమహర్షి యిట్లనె విదేహధరాపతి కార్యవర్య! కే
శవుని వరంబుచే నల వ్రజస్థలిలో శ్రుతిరూప గోపికా
నివహము సత్కులంబున జనించియు నందకుమారరూపవై
భవములఁ గాంచి యిష్టపడి భర్తగఁ గైకొన నెంచి భక్తితోన్. ౨

క॥ బృందావనమున కరిగియు బృందావనరాజ్ఞి యైన బృందాదేవిన్
సుందరమండపమందున నందముగా వేదవిధుల నారాధింపన్. ౩

ఉ॥ ఆమె ప్రసన్నయై వరము లడిగినమాడ్కి నొసంగఁ దద్వధూ
స్తోమము భక్తవత్సలుఁడు తోయజలోచనుఁడైన కృష్ణుతో
ధామములందుఁ బ్రత్యహము దప్పక కూడుచు రాసకేళులన్
బ్రేముడిఁ బాడుచున్ మిగుల వేడ్కను జేయుచునుండె నింతలోన్. ౪

మ॥ ఒక ఘస్రంబున నర్ధరాత్రము సనన్ యోగీశ్వరుండున్ వలా
హకవర్ణాభుఁడు నైన కృష్ణుఁడు తదీయాగారముల్ జేరుటన్
వికలత్వంబును బొంది గోపికలు తత్పీతాంబరున్ భక్తిపూ
ర్వకసాష్టాంగనతుల్ బొనర్చి యిటులన్ వాచించిరో భూవరా! ౫

॥ తోయజలోచన! యెపుడుచ్ఛ్రాయమహిమ గన్న నిన్ను జంద్రచకోర
న్యాయముగాఁ గనుచుండెడి మాయెడ కిందనుక రాక మసలితి వేలా? ౬

ఉ॥ నావుడు దమ్మికంటియు ననన్ సమకట్టి యిటుల్ లతాంగులా
రా! వినుఁ డెన్నఁడేని హృదయంబున నుండునొ వాఁడు సన్నిహిన్
దోఁచిన దాసి చూచినటు లుండును సభ్యోమణి భూమినున్న రా
జీవచయంబుఁ గాంచి వికసింపవొనర్చిన యట్లు చెల్మితోన్. ౭

తే॥ కాన దరినున్న దప్పనన్ గాలుచున్నఁ గాంచుచుండును మిమ్ము నోకాంతలార!
సద్గురుండగు సర్వాత్ముండన్ మాసినప్పుఁ డీప్రుడు భాండీరవనమున కేఁగుదెంచె.

తే॥ అల యుదంతంబు నాలించి యమితభక్తి శక్తి గొలఁదిని సేవల సలుపఁ దలఁచి
యతనికడ కేను వోతినో యతివలార! వానిఁ గాలమూపనపయ్యెఁగాని కనఁగ.

క॥ గురువే బ్రహ్మము గురువే హరియున్ గురువే శివుండు నఖిలామరులున్
గురువే పరమగు బ్రహ్మము గురు పగటంబట్టి యతనిఁ గొలుచుట యొప్పున్.

క॥ అజ్ఞానతమోంధున కా ప్రజ్ఞానాంజనశలాక ధనవాశకమా
సుజ్ఞాననేత్ర మిచ్చెడు ప్రాజ్ఞుని సద్గురుని నెఱఁగి భక్తి నుతింతున్. ౧౧

క॥ గురువును గాంచని దుష్టుఁడు గురువున్ నిందించుచుండు కుత్సితజనుఁడున్
గురువును దలఁపని లేకియు నరకమునన్ బీడఁబడఁడె? నానావిధులన్. ౧౨

క॥ అక్కారణమున నేనును నెక్కొని నాగురుని కెఱఁగి నిశ్చలమతితోఁ
జక్కని సేవల సలిపియు నిక్కడి కేతెంచితిఁ గమలేక్షణలారా! ౧౩

క॥ అనవుడు గోపికలెల్లరు మనమున నాశ్చర్యమొంది మాధవుకెంతో
వినుతులఁ జేసియు మ్రొక్కియు వినయమునన్ వక్ష్యమాణవిధి ననిరి విభూ!

తే॥ దేవ! పరిపూర్ణతముఁడవు దివ్యభువన
కోటినాయకుఁడవు జగద్గురుఁడ వక్షు
రుఁడవు నీకును నొక్క గురుండు గలఁడె?
వారిఁ గాంచంగ మామది పరుగులిడెడి. ౧౪

ఉ॥ ఎట్టుల నీ నిశీథము లయించి యహర్ముఖ మెప్పుడౌనో? మే
మెట్టులఁ ద్వద్గురుప్రవరు నీక్షణపర్వముగాఁగఁ జూతుమో
యెట్టులఁ గొప్పదై నదుమ నెద్దె మొదర్చు కళిందజానదిన్
బిట్టుతరింపఁజాలుదుమొ? వేఁడెద మీవు వచింప శ్రీహరీ! ౧౫

క॥ అనవుడు వనజాక్షుఁడు నేననుమాటల మీరలెల్ల రాస్థగ వినుఁడీ!
చనుఁడీ తన్నది యడ్డిన ననుఁడీ నేఁ జెప్పినట్టు లఱలేనిమదిన్. ౧౬

ఆ॥ గోపగోపికాళి గోవినోదుండైన హరి యధార్థబాలయతియ యేని
నతఖ నమ్మువార మైతిమేన్ యమునరో! త్రోవనిచ్చి మమ్ముఁ గావుమమ్మ!

తే॥ ఇట్లునుడివినఁ గాళింది యెలమి మీకు
దారి నిడు నంత మీరదిదాఁటి యల్ల
మద్గురూత్తముఁ గాంతురో మడఁతులార!
యన్న నాయన్నుమిన్నలహర్ముఖమున. ౧౯

క॥ గురు రాజ వధూ సుర భూసుర సన్నిధికిఁ ఫలంబో సూనమొ జలమో
సురుచిరపత్రమొ యేదో యురుసమునన్ గొనుచు భక్తి నరుగవలెఁగదా.

తే॥ కాన మనము యథాశక్తిఁ గాన్కలఁగొని యతనిసన్నిధానమునకు నరుగుదమని
వేఱువేఱుగ నేఁబదియాఱుపాత్రములను భక్ష్యాన్నముల నింపి పోవఁదొడఁగి.

తే॥ క్రమముగా నల నదిఁజేరి కట్టినేత్తకాఁడు వచియించినట్లు స్వకంధరముల
వంచి వచియించి పథినిడఁ వడినిదాఁటి పరమభాండీరవనమునకరిగి యందు

ఉ॥ వాస మొనర్చి యెల్లపు డపారతపంబొనరించుచుండు దు
ర్వాసుని గన్నులారఁ గని భక్తిభయప్రమదంబు లొప్పఁగాఁ
జేసి ప్రదక్షిణంబులను జేతులు మోడ్చి నుతించి యార్య? మీ
కోసము తెచ్చినట్టి యివి గొంచు గ్రసించియు మమ్ముఁ గావుమా! ౨౩

క॥ ఏవంవిధిఁ బ్రార్థింపఁగ నా విమలమునీశ్వరుండు నాలించి వివా
దావహాపద్ధతిఁ గన్గొని యీవిధి వచియించె వారి కిద్ధచరిత్రా! ౨౪

మ॥ సతులారా! యరయంగ నేఁ బరమహంసన్ నిష్క్రియుండన్ జుమీ
మతిలో మీరొనరించు సేవలకు సమ్మానక్రియాశ్రేణికి
న్గతుకం బొందితిఁ గాన మీ రిపుడు నా నోటన్ ద్వదానీత భో
గతతిన్ బెట్టుఁడి మెక్కెదన్ గనుఁడి మీకాంక్షల్ దమిన్ దెల్పుఁడీ! ౨౫

ఉ॥ ఆ ముని పల్కులన్ వినిన యాసతు లంజలు వేఱువేఱుగాఁ
బ్రేముడి వానిఁ గొంచు ఋషివిస్తృత వక్త్రమునందుఁ బెట్టఁగా
నాముని కోట్లకొల్దిగల యవ్వి క్షుధాతురరీతిఁ బాత్రలం
దేమియు లేనటుల్ మెసవె నింతులు వింతలఁజెంద భూవరా! ౨౬

ఉ॥ పిమ్మట వ్రేత లా మునిని వేఁడి రిటుల్ మునివర్య! యుత్తరన్
మిమ్ము శుభేచ్ఛతోడఁ గన మేము దలంచి తదబ్జనాభవా
క్యమ్మున దుస్తరంబయిన యా యమునాధుని దాఁటియుంటి మిం
కిమ్మెయిఁ దన్నదిన్ మరల నెట్లుతరింతుమొ కూర్మిఁదెల్పుమా! ౨౭

ఆ॥ అనఁగ మునివరుండు నాలించి సతులార! యిచటనుండి లేచి యెప్పుడట్టి
యమునఁ జేరఁగలరొ యాసమయంబున నిట్టులనుఁడు మీర లెసకమెసఁగ.

కం॥ నిర్వారి నిరన్నుఁడు వ్రతి దూర్వారసపాయి దోషదూరుఁడునై యీ
యుర్వర వెలుఁగుచునుండెడి దుర్వాసుని నమ్ము మాకు ద్రోవ నిమ్మా!

మ॥ అని ప్రార్థించిన మీకు నాఁడు మునియుక్ పూర్ణంబుతో మధ్యమం
బున మార్గంబు నొసంగఁ గానఁ జనుఁడీ పూఁబోఁడులారా! యనన్
వనజాక్షుల్ ముని సెప్పినట్లరిగి యావాహాపహంబున్ ఘనం
బును నా తద్ధునిఁ దాటి కృష్ణునికటంబున్ జేరరో యేలికా! 30

తే॥ అంత శ్రుతిరూపగోపిక లందఱుట్టి రాధికేశ్వరుతోఁ బలుక రాఁగమంచుఁ
దృష్టిఁజెందియు మనమునఁ దోఁచినట్టి సంశయంబుల నడిగిరో జనకరాజ! 31

తే॥ ఏము దుర్వాసుదర్శనం బిప్పుడు సల్పి వచ్చియుంటిమి కాని మీ వాక్యములను
సంశయంబులు గలిగె మాన్యాంతములను నాన స్వీకరించేమా కమలనాథ!

మ॥ మము నెల్లప్పుడు జేరఁజీరి తమితో మాతోడఁ గ్రీడింపవే?
మమతన్ వచ్చుచు వెన్న పాలు పెరుఁగుల్ మాయిండ్లఁ గాఁజేయవే?
యమునాప్రోదినిలో సతీయుతుఁడవై యాటాడవే బాలసం
యమి నేనంచు వచింతు వేల యిపుడో యంభోజపత్రేక్షణా! 33

తే॥ మఱియు నీయొజ్జ దుర్వాసుఁ డఱమఱవిడి మేము గొంపోయినట్టి యమేయభోగ
ములను బూర్తిగా మెక్కి మరలను దూర్వారసము గ్రోలుదునని దబ్బఱలవచించె

కం॥ అరయఁగ నీవలె గురువును గరముగ ననృతంబులాడు కతనుండని మా
కఱమఱఁ గల్గెడిఁ గావున త్వరఁ బ్రత్యుత్తరముఁ జెప్పి తనుపుము కృష్ణా! 34

వ॥ అనవుడు జనార్దనుం డిట్లనియె. మానినులారా! యేను నిరాధారుండను, నిరాకారుండను, నిరాహారుండను, నిరామయుండను, నిరంజనుండను, నిరహంకారుండను, నిర్గుణుండను, నిష్క్రియుండను, నిర్వికల్పుండను, నిర్మలుండను, వైషమ్యరహితుండను, సర్వసమానుండను, సర్వాధారుండను, సర్వాంతర్యామిని నైన మాట ధ్రువంబు. ఇందున సందియము లేదు. ఐన నుదకంబునందలి పద్మపత్రంబు వలె విషంబులోని క్రిమివోలె సంసారంబునందుఁ జరించువారు మత్కృత్యంబులం దనక్తులై రాగద్వేషంబుల మాని సదాచారప్రవర్తకులై కామసంకల్పంబుల వర్జించి బ్రహ్మార్పణంబుగా వర్ణాశ్రమవిహితంబులగు కర్మంబులను సల్పి జ్ఞానులై నన్ను భజించు భక్తులకోరికల ననుసరించి నామరూపంబులం దాల్చి సంచరింతు. నాకుఁ బరంబనుమాట లేదని యెఱుంగుఁడు! ఇఁక మానావమానంబులఁ గీర్త్యపకీర్తులఁ గష్టసుఖంబులఁ గోఖర బ్రాహ్మణచండాలుర సమదర్శియై నిరశనుండును, నియతాత్ముండును, బరిత్యక్తపరిగ్రహుండును నై జ్ఞానాగ్నిని సర్వకర్మముల దహించి లోకసంగ్రహార్థంబు వాని నాచరించువాఁడు విద్వాంసుఁ డనంబరఁగు. అట్టివాఁడు.

పుణ్యపాపంబు లంటక మోక్షార్హుండగు. ఏతాదృశుం డా దుర్వాసుం డౌట దూర్వారసమితాశనుండైనను మీభక్తికి మెచ్చి యిమ్మాడ్కి మీరిచ్చిన యన్నరాశులం బరిగ్రహించి మిమ్ములను ధన్యులఁ గావించెనని తెలిసికొనుం డన నా శ్రుతిరూప గోపిక లాశ్చర్యమొంది సంశయంబుల విడి జ్ఞానమయులైరి. మఱియు నిట్లే కృష్ణ భక్తివివర్ధనంబును, పాపహరంబును నగు ఋషిరూపగోపికాచరిత్రం బాకర్ణింపు మని నారదుండు జనకున కిట్లనియె.

## ఋషిగోపికోపాఖ్యానము.

తే॥ వంగదేశంబునందున మంగళుఁడను గోపకుం డొప్పు నవలక్షగోప్రభుండు
నధికధని దారపంచసహస్రవిభుఁడు శాస్త్రవిదుఁడు సల్లక్షణసంయుతుండు.

చ॥ ఒకపరి దైవయోగమున నుండిన ద్రవ్యము మాయమాయెఁ జో
రకులము గొన్నియాలను ధరాపతి బల్మిని గొన్నియాలఁ దీ
సికొనియె వీతిహోత్రుఁడు వసించెడి గీము దహించె నొక్క న
న్నకణముఁ గట్ట జీర్ణవసనంబును నుండకపోయె వానికిన్. ౩౮

ఉ॥ దాన ననంతచింతలను దైన్యముఁ బొందెడి వానిభార్యలన్
బూనిక దండకాటవిని ముచ్చటగాఁ జరియించు మౌనిసం
తానము రామునాజ్ఞ వనితావరరూపముఁ దాల్చి పుట్టె నా
మానినులన్ గనుంగొనుచు మంగళుఁ డిట్లు దలంచె నాత్మలోన్. ౩౯

ఉ॥ ఇప్పుడు పాడిపంటలును నిష్టులు విత్తము గీము నామునున్
జొప్పడకుండె నే నెచటఁ జొచ్చెదు నేమి యొనర్ప నౌను? నా
కిప్పగిదిన్ గుమారిక లహీనముగా జనియించి రయ్యయో! యీ
ముప్పెటు దప్పు? వీరికెటు బూన్కి వివాహము లౌనో? దైవమా? ౪౦

శా॥ ఆధివ్యాధిసమాకులుండనయితిన్ హర్షంబు వోనాడితిన్
సాధుశ్రేణివిదూరగుండనయితిన్ శాంతంబు మాయించితిన్
మేధాహీనుఁడనైతి దీనజనతామిత్రుండ నేనైతి క్షు
ద్బాధా దగ్ధుఁడనైతి గర్హ్యమగు నీ దారిద్ర్యదోషంబునన్. ౪౧

తే॥ ధనము గలిగినన్ బరుఁ డాత్మజనుఁడె యగును
ధనము లేనిచో స్వజనుం డితరుఁడు గాఁడె!
పేదనగు నాతనయుల నే విత్తవంతుఁ
డైన బంధువు సేకొన నరుగుదెంచు. ౪౨

క॥ ధని వీరిని గొన నేతెంచనిచో వీరెల్ల రాత్మజనులు సెలఁగుదాఁ
కను తత్కష్టములొందుచు నను దూఱుచునుందు రెట్లు నాగతియగునో. ౪౩

ఆ॥ సుతులు గలుగుచోట సొమ్ము సెలంగదు సొమ్ము గలుగుచోట సుతులు లేరు
రెండు గలుగుచోట దండిశేముషి లేదు మూఁడు గలుగుతావు భువిని వసుధ.

తే॥ దైవవశమున దారిద్ర్యదశఘటిల్లఁ గుందుచుండెడి నాకిప్డు కూఁతులిట్లు
కాకతాళీయరీతిని గలిగెనకట! చింతహెచ్చెను నైననేఁ జేసెద నిటు. ౪౫

చ॥ ధని బలికీర్తిశాలి శ్రుతిధర్మవిదగ్రణియైన యొక్కఁడే
తను గని పేరిసెల్ల గరదంబుగ నిచ్చెద మంచిదంచుఁ దా
ననుకొనులోనఁ దీర్ఘతతియూయియు వృద్ధుఁడు యోగ్యుఁడౌ జయుం
డను నొక గోపకుం డతని యందికకుం జనుదెంచి యిట్లనెన్. ౪౬

తే॥ మంగళాహ్వయ! నీవు నామాటవినుము నీకుమారికామణులను నెమ్మి నల్ల
నందరాజునకిచ్చి యానందమందు మట్లుసేయఁ బిల్లలు సుఖమందఁగలరు. ౪౭

ఉ॥ అందుల కాతఁ డొప్పుకొని యవ్వ్రజభాసురనందనేత్రతన్
గుందుచు నియ్యలేక యిడెఁ గూఁతులనంజలి నంత నందు నా
సుందరమందయానలును శుక్లసుధాంశుని బోలి వృద్ధినిం
బొందిరి సక్రమంబుగ నపూర్వకళావిభవాభిరాములై. ౪౮

చ॥ పదపడి నొక్కకాలమున వారలు తద్వ్రజనాథునింటిలో
మదనమనోహరాకృతిసముంచితుఁడై చెలువారు శౌరినిన్
ముదమునఁ గాంచి పెన్మిటిగఁ బొందుట కెంచి కళిందజాభిఖా
నదినిగుఱించి నిశ్చలమనంబున ధ్యానము జేసి రెంతయున్. ౪౯

ఉ॥ ఆయెడఁ దన్నదీమణి దయన్ దరి వెల్గుచుఁ గోర్కు లిచ్చితా
నేయెడకో చనెన్ బిదప సిద్ధమునీశ్వరరూపగోపుల
త్యాయతబృందకాటవిని నచ్యుతుతోడుత రాసకేళులన్
జేయఁదొడంగి రో మనుజశేఖర! కార్తికశుద్ధపూర్ణిమన్. ౫౦

తే॥ మఱియు మైథిలగోపికామహితచరిత మాలకింపుము మైథిలేశా! దశాశ్వ
మేధములఁ జేసినంత యమేయఫలము లొంది గోలోకసౌఖ్యంబుఁ జెందఁగలవు.

### మిథిలాగోపికోపాఖ్యానము.

క॥ అల రఘురామునివరమునఁ జెలుతో మిథిలానగరికిఁ జెందిన వనితా
తిలకము లానవనందుల నెలపుల జనియించి వృద్ధినిం గని రవలన్. ౫౧

మ॥ ఒక ఘస్రంబున నందగేహమున దృగ్వ్యగ్రంబునన్ జక్రిరూ
పకళావైభవరీతిఁ జూచి పతిగా భావించి తత్సిద్ధికై
సకలార్థప్రదమైన మార్గశిరమాసంబం దతిశ్రద్ధఁ గొం
కక కాత్యాయనినోము సల్పిరిటు తత్కన్యల్ మహాభక్తితోన్. ౫౩

ఉ॥ ప్రొద్దున లేచి తత్సతులు వోవము రమ్మని యొండొరు ల్దమిన్
దద్దయుఁ బిల్చుకొంచుఁ గరతాళమృదంగవిపంచికాస్వనం
బుద్దవిషిన్ జెలంగఁగఁ బయోరుహనాభగుణప్రభావముల్
విద్దెలముద్దుగుమ్మవలె వేమఱుఁ గోకిలవాణిఁ బాడుచున్. ౫౪

తే॥ యమునలో దిగి స్నానంబు నాచరించి శుభ్రవస్త్రంబులం దాల్చి శుద్ధమగు ని
సుమునఁ గాత్యాయనీ సురూపము రచించి షోడశోపచారంబుల సొరిదిఁ జేసి.

మ॥ జననీ! స్థావరజంగమంబులు భవచ్ఛక్తిన్ జరించున్ విరిం
చన లక్ష్మీపతి చంద్రమౌళి దివిషజ్జంభారికుంభోద్భవా
దినిరూఘుల్ నిను గొల్చి కోరికల నెంతేన్ బొందరే నందనం
దనునిన్ బెన్మిటిఁ జేసి మాకిపుడు మోదంబిమ్ము కాత్యాయనీ! ౫౬

ఆ॥ ఇట్లు నిత్యము నుతియించి తద్వ్రతరాజ మట్టి మార్గశీర్ష మగువఱకును
జేసి రంభ నొక్క వాసరంబందున నొక్క చిత్రమయ్యె వక్కణింతు. ౫౭

కం॥ చెలువలు దమతమ దువ్వలువల గట్టునఁ జెట్టి భక్తిఁ బాడుచు హరినిన్
మొలలోఁతు నీళ్ళలోనికిఁ జలములఁ జని జలకమాడు సమయమునందున్.

కం॥ తమకక జంకక కొంకక కమలాక్షుం డెటేఁగి యెట్లో కాళిందీ తీ
రము నల్లల్లనఁ జని యా కమలముఖుల యంబరములఁ గాఁజేసి వెసన్. ౫౯

ఆ॥ సంబరంబుతోడఁ జనుచు నర్భకుభంగి వాఁకమీఁది చల్లపయర విసర
నధికతాపమాప్పనట్టి హరిప్రియ వృక్షమెక్కి సుదతు లిట్టు లనిరి. ౬౦

తోటకవృత్తము॥ కోకలఁ దాఁకఁగఁ గూడదు కృష్ణా!
పోకుము పోకుము పోకిరివీఁకన్
నీకిది యెవ్వఁడు నెమ్మిన్ జెప్పెన్
మాకెటు దక్కును మానము మామా! ౬౧

సీ॥ గండరగండలఁ గారింపవలెఁగాని యబలలన్ నొవ్వఁ జేయంగఁ దగునె?
ముగ్ధకర్బురులను బోకార్పవలెఁగాని ముగ్ధలన్ విపదబ్ధి ముంపఁదగునె?
భూకంటకుల సిరుల్ గైకొనవలెఁగాని ముగ్ధాంబరములఁ గొంపోవఁదగునె?
శత్రుమానంబును సమయింపవలెఁగాని సతులమానము దీయుసరణి దగునె?

తే॥ నిన్ను హాసియించువారలఁదన్ని గోల సలుపవలెఁగాని నిరపరాధలను మమ్ము
గోలఁజేయుట దగునె? యొంఖేలనాతిలోల! లీలావిలోల! గోపాలబాల! ౬౨

సీ॥ చిన్నవాఁడవటంచుఁ జిత్తమం దెంతుమా చిన్నవారికిఁ గాని చేఁతలుండెఁ
బెద్దవాఁడవటంచుఁ దద్దయు నెంతుమా చిన్నతనంబెంతఁ జెలఁగుచుండెఁ
బోకిరివే యని బుద్ధియం దెంతుమా బుద్ధిమత్ప్రాజ్ఞముల్ బొందియుండె
బుద్ధిమంతుఁడవని పూనికనెంతుమా పోఁకిరిపోకడల్ వాలయుచుండెఁ

తే॥ తెలిసియిటు చేయుచుంటివో తెలియకయిది సలుపుచుంటివో మాకేది తెలియదకట
నీపనుల్ వింతగొల్పెడి నెమ్మితోఁ మా పటంబుల నిడి మమ్ము మనుపు కృష్ణ!

మ॥ ఘనవాహోగ్ర మహాగ్రహంబునఁ దటిద్గ్రస్తాశని శ్రేణితో
ఘనపంక్తుల్ వ్రజనాశనార్థమయి రాఁగా వేగ నీవేగి త
ద్ఘనశైలంబును నెత్తి మొత్తి ఘనముల్ తద్గోకులం బెల్లఁగా
చిన నీకియ్యది యెట్టి గొప్పతన మిచ్చోఁ జెప్పవే శ్రీహరీ! ౬౪

క॥ లెమ్మా! యిఁకఁ గొమ్మను డిగి రమ్మా! కరుణించి యంబరమ్ములఁ దెమ్మా!
కొమ్మా! చేసెడి జోతల నిమ్మాడ్కిని సలిపి నగెదవేలా కృష్ణా! ౬౫

చ॥ కులముల నుద్ధరించుటయొ గోసురభూసురులందు భక్తిగా
మెలఁగుటొ కల్మివిద్దియల మేలు గడించుటొ గొప్పరాజులన్
గలనున గెల్చుటో తగునుగాని యిటుల్ మముఁ జేరవచ్చి మా
వలువల దొంగిలించుట లవం బుచితంబుగ లేదు నందజా! ౬౬

తే॥ కాన మాపైని దయయుంచి కమలనేత్ర! కట్టుకోకల నిడి మమ్ముఁ గావుమయ్య!
యంచుఁ బ్రార్థింప నాతండు నల్లన నగి వారి కందఱ కిట్టులఁ బలుకఁదొడఁగె.

క॥ ఓ వనజాననలారా! యీవలువల నెవి యేవి యెవరి వెవరివో
భావింపలేను గావున నీవైపున కీరె వచ్చి యేఱికొనుండీ! ౬౭

అ॥ లేనియెడల నిప్పుడేనివి గైకొని యింటికరుగఁగలను నింతులార!
యనఁగ వారలు విని యాననంబుల వంచి నగుచుఁ బలికి రిటుల నానతోడ.

మ॥ జలజాక్షా! పలుమాటలేల పరిహాసంబేల మాతోడుతన్?
జలికాలం బిది యాఁగలేము వణఁకన్ జాలింపు సయ్యాటముల్
జలమం దుంటిమి వత్తు మెట్లటకు లజ్జన్ వీడి శ్రీకృష్ణ! మా
వలువల్ మాకు నొసంగి ప్రోవుము! దయావారాంనిధీ! ధీనిధీ! ౭౦

ఆ॥ గోకులంబునందుఁ గొంకని జంకని రసికమణివి గుణివి వ్రజపజుఁడవు
శ్యామసుందరుఁడవు సరసుండవును వనమాలి వీవు గావె మదిని దలఁప. ౭౧

తే॥ అయ్యొ! నీ బానిసలము మేమంబజాముని
మమ్ముఁ బాములఁ బెట్టుట మంచిదౌనొ?
మంచిచెఱుగులఁ గాంచి కావించుమయ్య!
యోగ్యు లప్రతిష్ఠకు జంకుచుంద్రుగాదె. ౨౨

క॥ నీయెడ నబల లటం చేలా యెంచెదవయ్య! "దుర్బలస్యబలం రా
జా" యన వినవే నలువల నీయనిచో జేనికి నచియింతుము కృష్ణా! ౨౩

క॥ అనవుడు వనజాక్షుండు విని వనజేక్షణలార! కంసపతి కిది వల్కన్
జనుటకు సిబ్బితిలేదా? ననుజేయుట కిపుడు మీకు నాన గలిగెనా? ౨౪

మ॥ చలియంచున్ జలికాలమంచు నిలువన్ శక్యంబు గాదంచు మీర్
పలుకన్ సాగితి రిద్ది నిక్కమను యేన్ వైశంబ యందుండి నీ
వల కేతెంచుడు నన్ను డాయుఁ డివిగో వస్త్రంబులం బొందుఁ డీ
లలిగాఁ జేసిన యెల్ల కష్టములు వాలాయంబుగాఁ దీరెడిన్. ౨౫

ఆ॥ బానిసలమటంచుఁ బల్కఁగా దొడఁగితి రట్టులైన మీర లనినయట్టుల
నల్పవలయుఁగాని బలముచేఁ బలుకుట పాడిగాదు రండు పడఁతులార! ౨౬

క॥ లేదా యింటికిఁ బోయెద మీఁదన్ మీయిష్టమన్న మెలఁతలు విని దా
మోదర! తగునే మానము వోదా నీదారి నీవు వోవన్ మాకున్. ౨౭

తే॥ అహహా! మేము వివస్త్రలమగుచు జలకమాడినందుల కెంతయు నర్హమైన
పాచితముఁ జేసి చక్కని పథము జూపి నడువుమంటివి నవ్వుచున్ నలిననేత్ర!

ఆ॥ అనుచుఁ గొంద ఱటకు నరిగెదమందురు గొంద ఱటకునేగఁ గూడ దంద్రు
కొందఱు మన మొఱను గుందఁడే కరుణించి తెచ్చి యిచ్చునంద్రు దివ్యచరిత!

ఉ॥ ఆద నిటుల్ వచించుచుఁ దదంగన లూరక చూచి యాహరి
న్నేము ఫలంబటంచుఁ దుద నిర్మలకోమలహస్తపద్మసం
ఛాదితమార గేహలయి సాగి జలంబులనుండి నల్ల దా
మోదరునెమ్రోలఁ జేరి తమ పుట్టము లిమ్మని కోరి రోప్రభూ! ౩౦

మ॥ అవలన్ బీతపటుండు నవ్వి సతులారా! మీకు సిగ్గేల? నా
సవిధంబందిపు డీరు నిల్చుటకుఁ గాంచన్ బాల్యమందుండి రేఁ
బవలున్ మిమ్ములఁ గూడుచున్ బెరఁగనో పాడాడనో యాడనో
యెవి మీకున్నవొ నే నెఱుంగనివి వే? యీక్షించి వాచింపుఁడీ! ౩౧

ఆ॥ మీరు మానవతులె? దూరదేశస్థిత
నదికి వచ్చితి రెటు? నగ్నత నెటు
నులుకు విడిచి మునుఁగఁ దలఁచితిరే రహిన్
నోము గొఱతఁగాదొ? నుడువుఁ డిపుడు. ౩౨

తే॥ కాన వేవేగ నపరాధమైనదనుచు నొక్కపరిఁ జేతు లెత్తుచు నొసఁగల నిడి
యీరు మీ మీ పటంబుల నేఱికొనుఁడీ వ్రతఫలంబును బొందుఁడీ రమణులార!

క॥ తరువాత నాసుదతులుఁ గరముల జోడించి కృష్ణ! కావుము నీవే
వరదుఁడవు మోహనుండవు కరుణాభరణుండ వనుచుఁ గైకొని వలువల్. ౪౪

క॥ కనుఱెప్పల వాల్పక యా వనజాక్షుం గాంచి వలచి నజలుచు నుండన్
వనమాలి విలోకించుచు ననె నిటు దరహసితవదనుఁ డగుచున్ జనకా! ౪౫

ఆ॥ అతివలార! మీరలాగ్రహాయణికమాసమున నన్ను గూర్చి శాస్త్రవిధులఁ
గ్రమమండపమునఁ గాత్యాయనీవ్రత మాచరించితిరిగ యధికభక్తి. ౪౬

ఉ॥ దానఁ బ్రియంబుఁ జెందితి యథార్థ మెఱింగితి మీ క్రియంబులన్
నే నెఱవేర్తు నెల్లికడ నిశ్చయమిద్ది యనంగ వారల
న్మాన్యనముదంబుఁ బొంది తమ యున్కుల కేగిరి మైథిలేశ్వరా!
యీ నెఱిఁ గోసలాంగనల వృత్తముఁ జెప్పెద నాలకింపుమా! ౪౭

## కోసల గోపికోపాఖ్యానము.

క॥ శ్రీరామోక్తినిఁ గోసలనారీమణులా నవోపనందసతులకున్
శ్రీరామారుచిసుగుణాకారాదులతో జనించి క్రమముగ నిలలోన్. ౪౮

సీ॥ అభ్రచయంబులో యంధకారంబులో సారసమధుమత్త షట్పదములో
రాజబింబంబులో రత్నదర్పణములో భవ్యమందిరములో పంకజములో
యంబుజన్మంబులో యంగజతూపులో కాటుకపిట్టలో గండుమీలో
జలజకోశంబులో చక్రవాకంబులో బంగారుగిండులో బొంగరాలో

తే॥ క్రముకకందర్పనారియో కరికరాలో
యబ్జములో పల్లవంబులో యంచు నట్టి
సతుల కేశపాశాస్యాలోచనకుచాద్య
వయవముల గూర్చి రసికులాప్రజలు పొగడ. ౪౯

చ॥ పెరిఁగిరి శుక్లచంద్రుసరవిన్ మణిహేమవిభూషణంబులన్
మెఱసిరి మేల్మినల్వాలను మించి రుదంచిత పద్మినీక్రియన్
వఱలిరి ద్రవ్యవంతులగు వల్లవపుత్రులఁ బెండ్లియాడి వే
పఱచిరి నాల్గుదిక్కులఁ నపారయశంబు ననంతరంబునన్. ౫౦

క॥ అల ననఁబోఁడులు లలితుని గలుములజవరాలిమగని గన్గవకింపున్
గొలిపెడివానిని దొడవులజెలువారెడికృష్ణుఁ గాంచి చెంది విరాళిన్. ౫౧

సీ॥ తీరునే యీమనదేహతాపంబులు కృష్ణసేవానువృష్టి మెసగకుండ
చూచునే యీమనచూడ్కులు లోకంబు కృష్ణముఖాబ్జ మీక్షింపకుండ
చేయునే యీమనచేతులు పరకృతుల్ కృష్ణహస్తముల గ్రహింపకుండ
వినునె యీ మనచెవుల్ పెజవారికతలను గృష్ణ వేణురవ మాలింపకుండ

తే॥ నడచునే యిప్పుడీ మనయడుగు లితర దేశములలోన శ్రీకృష్ణధిష్ణ్యములకు
జనక! మనసుదీరునె యిట్టి మనకు నన్యభూతిఁ గృష్ణసంభోగవిభూతిలేక. ౯౨

మ॥ అని చింతించుచు నొక్కనాఁడు మధురాఖ్యాపట్టణస్థోరు వీ
థిని గృష్ణా! జగదేకసుందర! హరీ! దీనావనప్రాపకా!
వనమాలీ! వనజాతదివ్యనయనా! భర్మాంబరభ్రాజితా!
యని పాలుర్ బెరుఁ గమ్మచుందురు తదజ్ఞాతప్రియాసక్తలై. ౯౩

ఆ॥ మఱియు నిటుల వారు మాధవుం డెందెందు సంచరించునట్టి స్థలములందు
నరిగి తిరుగుచుండి యాహరి గుణములఁ దమ మనముల మిగులఁ దలఁచి తలఁచి.

చ॥ జలమున నగ్నిఁ దేజమున ధాత్రితలమందున నంబరంబునన్
సలుగడలందు మానవగణంబునఁ జెట్టులగుట్టలందునన్
బులినములందునన్ యమునపొంతల నెల్లెడఁ జక్రి చక్కఁగాఁ
జెలఁగుటఁ గాంచి మోహమును జెందుచుఁ దన్మయులైరి భూవరా! ౯౫

తే॥ అత్తఱిన్ వారు కృష్ణహృతాంతరంగలగుచు సాత్త్వికభావాష్టకాన్వితలయి
చేతనాచేతనంబుల రీతి నెఱుఁగలేక పిచ్చివారలవలె వాగొనుదురు. ౯౬

తే॥ సర్వవాంఛల విడనాడి సత్యమైన బ్రహ్మమందు లయించెడి పరమహంస
విధిని నితరకార్యంబులవీడి యట్టి కృష్ణునందున వారెదర్ గీలుకొలిపి. ౯౭

చ॥ బలిమిని హస్తయుగ్మమున బాటల వ్రీడను వీడి సత్కళా
లలితసుధాకరేంద్రముఖలక్ష్యముగాఁ బొలుపారు కృష్ణు ము
ద్దులమొగముం గ్రహించి పరితోషముతోడుతఁ జుంబనంబుల
న్నలిఁ గొనిరావధూజపఘనస్థితి యేమనవచ్చు? భూవరా? ౯౮

చ॥ పదపడి తద్వ్రజాంగనలు పంకజనాభుని దోర్యుగంబుపై
ముదమున స్వీయబాహువులఁ బొందికగా నిడి రాసకేళులన్
జెదరనిచెల్మి సల్పి రలచేడెల భాగ్యవిధంబు వేయినో
ళ్లొదవిన శేషుఁడున్ నలువయున్ బలుకంగ సమర్థులౌదురే? ౯౯

ఉ॥ దోషములన్ హరించు శ్రుతిధోరణి సత్కృతిసాంఖ్యయోగవై
శేషికతర్కతత్త్వపరిశీలనధన్యులు దేనిఁ జెంది సం
తోషముఁ గాంతురో యది విధూతనిభంబగు భక్తితోడ నా
శేషశయానునిం గొలుచు శిష్టులకున్ వడిఁజిక్కుఁ బార్థివా! ౧౦౦

తే॥ భక్తివలననె పరమాత్మ ప్రత్యక్షమగు నట్టిమాఁ బల్కుఁగా సాంఖ్యయోగాదివిధుల
గల్పనట్టి యోగోపాసనములయందు సర్వవిధముల సాక్షివౌ జనకరాజ!

తే॥ మఱియుఁ బురుషార్థదంబును బరమము నైన
దర్శనప్రదమును నమోఘాశ్వానివాని
నలఘు చెలువల చరితంబుఁ బలుకుచుంటి
సావధానంబుగా విను మార్యవర్య! ౧౦౨

—♦ అమోఘాశ్వాసినీ గోష్ఠికోపాఖ్యానము. ♦—

చ॥ చెలఁగుఁగదా సువర్ణమణిచిత్రిత భిత్తికవాటజాలవే
దిలలితహర్మ్యకోటివనదివ్యసభాపరిఖాంగణాదిసం
కలితము ధార్మికప్రవరకమ్రతరంబగు చంపకాపురం
బిల కొక భూషణంబుగ బుధేంద్రనుతంబయి సింధుభూమిలోన్. ౧౦౩

ఉ॥ ఆపృతి ధర్మరాజు ధనమందున నైలబిలుండు భోగమం
దా దివిజేశ్వరుండు నయమందున శుక్రుఁడు రూపునందు దా
మోదరుపట్టి తేజమునఁ బూషుఁడు జీవి దధీచి భక్తిఁ బ్ర
హ్లాదుఁడు మేరుధీరుఁడును నా విమలాహ్వయుఁ డద్ది యేలెడిన్. ౧౦౪

ఉ॥ ఆతఁడు తత్పురంబు నయయంబు నయంబున నేలుచున్ రతిన్
నాతులనాఱువేలను ఘనంబుగఁ బెండిలియాడి దండిగా
శాతసుమాస్త్రతాపములు సల్లపడన్ రతులందుఁ దేలి యా
గోతులు గొడ్డురాం డ్రగుట గుందఁదొడంగె నిటుల్ నరేశ్వరా! ౧౦౫

సీ॥ రవిలేని దివమును రాజులేని తమిస్ర సారసములులేని సరసివరము
శీలములేనట్టి శృంగారవతియును దానములేనట్టి దంతిమణియు
దానములేనట్టి ద్రవ్యవంతుండును వాఙ్నియమములేని పౌరుషంబు
ధర్మంబులేనట్టి త్రిలోకంబులు హరిని నుతింపని యాననంబు

తే॥ బుధులు పర్వని గోష్ఠియుఁ బూర్ణతుష్టిఁ గనని బ్రాహ్మణుం డధిపతి తనరనట్టి
పృథులరాజ్యంబు వరసుతుం డెసఁగనట్టి వంగసంబును వాసికి వచ్చునొక్కొ?

ఉ॥ ఎన్నఁడు నాకుఁ బుత్రులు జనించెడి మంచి యదృష్ట మబ్బునో
యెన్నఁడు వానియాటల మదీక్షణపర్వముగాఁగఁ జూతునో
యెన్నఁడు వాఁడు నాయురము నెక్కఁగ ముద్దులఁ బెట్టుకొందునో
యెన్నఁడు నన్ను ధన్యుగ నహీనవిధంబుగ వాఁ డొనర్చునో. ౧౦౭

తే॥ వరసుతుల్ బుట్టి పున్నామనరకమందుఁ బడెడి బాధలఁ దప్పించి పరమగతికి
నేగునటు జేసెదరు గాదె యేమొనర్తు ననుచుఁ జింతిలుచుండె నోయవనినాథ!

ఉ॥ అమ్మెయి యాజ్ఞవల్క్యుఁడను నాగమనైగమవేది యొక్కఁడు
గ్రమ్మన నమ్మహీశ్వరుని సన్నిధికిన్ జనుదెంచి యర్చఁ బూ
ర్ణమ్ముగఁ బొంది సమ్ముఖమునన్ వసియించిన తన్నరేంద్రు వ
క్త్రమ్మును గాంచి యిట్టు లడుగన్ దొడఁగెన్ గరుణార్ద్రవాణితోన్. ౧౦౯

ఉ॥ సేమమె నీ కుటుంబమున సేమమె నీపరిపాలనంబునన్
సేమమె బంధులోకమున సేమమె మిత్రసమూహమందునన్
సేమమె యెల్లచోటుల సుశీల! త్వదాననసుందరాంబుజం
బీమెయిఁ జిన్నవోయెడి నదేదియొ యిత్తఱి నాకుఁ జెప్పుమా! ౧౧౦

తే॥ అనఁగ విమలుండు విని మునీ! యఖిలవేది
వైన నీవెఱుంగనిపొక్కు నరయనొక్కొ?
యైన మీవాక్యగురుతఁ బల్కుచుంటి
సుతులు లేనట్టివారికి గతులుగలవె? ౧౧౧

ఉ॥ మానివరేణ్య! మత్సతుల మానినియొక్కతె గూడ గర్భమున్
బూనకపోవుటన్ మిగులఁ బొక్కితిఁ జిక్కితిఁ దిక్కుగొంటి ని
ద్దానికి సేపనుల్ సలిపి తద్వ్యథలన్ ద్యజియింపనేర్తునో
మానక దివ్యదృష్టిఁ గని మా కెఱిఁగింపుము! చింతఁదీర్పుమా! ౧౧౨

ఉ॥ నావుడు యాజ్ఞవల్క్యుఁడును నందనుఁ డీజని నీకుఁ గల్గఁడో
భూవర! కోట్లకొద్దిగ సుపుత్రికలే జనియింతు రంకిలిన్
నీవు పరిత్యజించి సుఖనీరధిఁ దేలుమనంగ నాతఁడో
భూవిబుధేంద్ర! యంచుఁ దల భూమినిసోకఁగఁ మ్రొక్కియిట్లనెన్. ౧౧౩

తే॥ దేవముని పితౄణంబులఁ దీర్తు నెట్టు లెట్లు మజ్జీవితము వాసికెక్కఁగలదొ
నాసమస్తకష్టములెట్లు నాశమగునొ పల్కుమా! నాకుఁ గొమరుండు వఱలనపుడు.

చ॥ కొమరుఁడులేని మానవుఁడు గొంపనుదంపులఁబెంపుజేయు డెం
దమునవిచారమొందు శ్రుతిధర్మములన్ నిరసించి మాను ద్ర
వ్యమును గడింపకుండుఁ బరమార్థము వ్యర్థమటంచుఁ బల్కు లో
కమునకు నింద్యుఁడౌనుగద కావున నాగతి యెట్లొ చెప్పుమా! ౧౧౪

చ॥ అనవుడు యాజ్ఞవల్క్యముని యాతనికిట్లనె మేదినీశ! నీ
మనముననుండుభావము సమగ్రముగా వివియుంటి నీవిఁకన్
విను మిటు మాఘమందుఁ బ్రభవింపఁగఁబోయెడి కూఁతులన్ జనా
ర్దనునకు దాయలన్ గలిసి దానమిడన్ నెర వేరుఁ గోరికల్. ౧౧౫

చ॥ మఱియు ఋణత్రయంబు విడి మానవగేయుఁడవై పరంబు నీ
వఱగొఱలేక కాంతు వహహా! యన నా వినులుంచు మెచ్చి క్ర
చ్చఱ నిటు బల్కె మానివర! సంతసమయ్యెను గాని యట్టి శ్రీ
హరి యెపు డేకులాన జని నందునో యద్ది దయన్ వచింపుమా? ౧౧౮

వ॥ అంత నమ్మునికాంతుండు సంతసించి భూకాంతా! యీ ద్వాపర యుగాంతంబున మధురాపురాంతరంబున యదుకులంబునందు రోహిణీ నక్షత్రంబును, హర్షనామయోగంబును, బవకరణంబును, సౌమ్యవారంబును గలిసిన భాద్రపద కృష్ణాష్టమియం దర్ధరాత్రంబునం దంధకారబంధురంబగు సమయంబున శ్రీవత్సాంకుండును, మేఘవర్ణుండును, పీతాంబరుండును, పద్మనేత్రుండును, చతుర్భుజుండును, జగన్మోహనాకారుండును వనమాలియు నగు శ్రీకృష్ణుం డరణియం దగ్నివిధంబున దేవకీదేవియం దుద్భవించి వృద్ధిఁ బొందుచుండు. అతం డవతరించు నబ్దంబునకు నీప్రభుత్వం బింకను నూటపదునేనుసంవత్సరంబులు శేషింపఁగలదని యెఱుంగుము. అత్తఱి నక్కుమారునకు నీ కుమారికల నిడి ధన్యుండవగుమని నుడివి చనినమీఁద

చ॥ విమలధరాధిపుండు మది వేడుకఁ జెందుచునుండె నంత యాజ్ఞవ
ల్క్యముని వచించినట్లు శుభకాలము వచ్చుట తద్వధూటులన్
గ్రమముగ రామచంద్రునివరాన వయోధ్యవసించు భామినుల్
గొమరితలై జనించి రనుకూలవయోగుణరూపరేఖలన్. ౧౧౯

ఉ॥ ఆసుత లొయ్యనన్ బడిమయౌవనవయోన్వితలౌటఁ గాంచి యా
కోసలనాయకుం డెవ నకుంఠితమానివచస్సు యోజనన్
జేసి సమర్థదూత నొకనిం బిలిపించియు వానితోడఁ దా
నీసరణిన్ వచించె జగదీశ్వరతద్ధరిమార్గణార్థమై. ౧౨౦

తే॥ ఈవు మధురాపురంబున కేగి శౌరిమందిరంబున వసుదేవనందను ఘన
వర్ణునిం జతుర్భుజుని శ్రీవత్సయుక్తు సుందరాకారు శ్రీకృష్ణుఁ జూచి రమ్మ.

ఉ॥ వచ్చిన నీవు మత్సుతలబాంధవదాయయుతుండనౌచు నా
పచ్చనిపట్టుపుట్టముల భాసిలు స్వామికి శాస్త్రరీతిగా
నిచ్చుట నిచ్చయంబునుమి యేగుము! వేగ ననంగ నాతఁడున్
గ్రచ్చఱ సాగిచేరి మధురాపురవాసుల నడ్గె నిట్లులన్. ౧౨౧

ఆ॥ ఆర్యులార! మీర లావసుదేవుని
నెఱుఁగుదురొకొ యీనగరిని గలఁడె?
యతని కొడుకు లెచట నధివసించుచునుండ్రొ
విశదముగ నుడువుఁడు వేగ నాగ!

తే॥ మాథురులు విని యాదవసాత్వకంసభీతి మెల్లనిమాటలఁ బిలిచి యతని
చెవిని స్వీయవృత్తాంతములఁ జెప్పి యిట్టులఁ బల్కఁదొడఁగి శ్రీకృష్ణభక్తవర్య

ఉ॥ పుట్టిరిగాని పుత్రకు లమోఘబలుల్ గుణరూపకాంతు లా
దిట్టల నందఱం గని సుదీర్ఘబలుం డగు కంసరాజు, చే
పట్టి వధించె నొక్కసుత బాల్యమునన్ దివికేగె దాన ని
ట్టట్టనరాని ఖేదము జనింపఁగ నా వసుదేవుఁ డుండెడిన్. ౧౨౫

చ॥ ఇది యతిగూఢ మించుకయు నెవ్వఁడుఁ జెప్పకుమయ్య చెప్పినన్
యదుపతి కీడఁ బెట్టఁగలఁ డంచు నెఱుంగు మనంగ నాతఁ డ
య్యది విని తత్పురిన్ విడిచి యా విమలాఖ్యుని చంపకాపురిన్
గదిసియుఁ గన్నవార్త లల తన్మాతలనేతకు నిట్లు వాకొనెన్. ౧౨౬

క॥ అయ్యా! మధురకు నేగితి నయ్యానకదుందుభిప్రియాత్మజులను వే
యయ్యాదవభూపాలుం డయ్యారే యన వధించెనఁట! యయ్యయ్యో! ౧౨౭

చ॥ అల వసుదేవుఁ డాత్మజచయంబు లయం బటు జెందుటన్ లలిన్
గలఁగుచుఁ దన్మహాపురిని గ్రాలెనటంచును వింటి నంతఁ ద
త్స్థలమును వీడి మీదరికి సాగియు వచ్చుచు బృందకాటవి
జ్జెలఁగెడి నొక్క చిన్నిసుతునిం దిలకించితి నెట్టివాఁ డనన్. ౧౨౮

సీ॥ పీతాంబరుండును వేత్రవంశీధరుం డభ్రవర్ణుఁడు పంకజాననుండు
శ్రీవత్సయుక్తుండు భావజరూపుండు సమ్మృతనిష్యందివచోన్వితుండు
గంజనేత్రుండు జగన్మోహనుండును బహుళవిభూషణభ్రాజితుండు
గోపకపుత్రుండుఁ గోమలదేహుండు వనమాలి పీవరఘనభుజుండు

తే॥ ఖేలనాలోలుఁ డతులవిశాలకీర్తిశాలి బుద్ధిశాలియు శీలి సత్యభాషి
పాశుపాల్యప్రవీణుండు వల్లవాంగనాజనాంతరభాసుఁ డనన్యఘనుఁడు. ౧౨౯

ఉ॥ కాని చతుర్భుజుం డతఁడుగాక ద్విబాహుసమేతుఁ డౌటచే
నేను త్వదుక్తపుత్రుఁ డితఁ డింతయుఁ గాఁడని వీడి వచ్చితిన్
మానవనాథ! యట్టి మునిమాట యబద్ధముగాదు కాన న
న్మానక పంపు మెందయిన మానసమందుఁ దలంచినట్టులన్. ౧౩౦

ఉ॥ అంతట దద్ధరాధిపతి యందుల కద్భుతమొంది దానినిన్
స్వాంతమునందు మంతనముసల్పెడిపట్టున హస్తినాపుర
ప్రాంతమునుండి భీష్ముఁడనురాజు సమర్థత సింధుదేశ మ
త్యంతము గెల్వ వచ్చినపు డా విమలుండును మ్రొక్కి యిట్లనెన్. ౧౩౧

మ॥ కురువంశోత్తమ! యాజ్ఞవల్క్యముని నాకున్ మున్ను గూర్మిన్ ధరా
భరమున్ బాపఁగ వేదధర్మముల నిల్పన్ దేవకీదేవికిన్
హరి పుట్టంగలఁడంచుఁ జెప్పె నది సత్యంబంచు నేనెంచి యా
యిరువంకన్ వెదకింపఁగా నతఁడు లేఁడేమీ! దయన్ దెల్పుమా! ౧౩౨

క॥ కూఁతుల నతని కివుడుకే సేఁతలు సేయంగవలెనో చెప్పుము! బలులన్
బ్రీతిని గొమ్మా! యీనా జోతలఁ గొని శంకఁ బాపి చూడుము దయతోన్.

చ॥ విమలుఁ డిటుల్ నుతింప నల భీష్ముఁ డిటుల్ వచియించె భూప! యీ
సమయమునందు నడ్గిన ప్రశ్నోత్తరమేశచరిత్ర గాథగా
ఘనమయినదైన నీనుతి వృథంబుగ మెచ్చి వచింతు నాలకిం
పుము! మధుపురాన హరి పుట్టిన మాట నిజం బిఁకేమనన్. ౧౩౪

మ॥ వసుదేవుండు నిజాత్మజాళి యదుభూపాలుండు కంసుండు బల్
కసితోఁ జంపినమీఁద భేదపడి శ్రీకాంతుండు పుట్టన్ వెసన్
నసిఁగొంచున్ జని యాయశోమతిసతీశయ్యన్ బరుండంగ నుం
చి సమూఢంబగు యోగమాయఁగొని తాఁ జేరెన్ నిజాగారమున్, ౧౩౫

ఉ॥ ఆ కమలేశ్వరుండు వ్రజమందున వృద్ధినిబొంది యా
శ్రీకరబృందవనం జని విచిత్రములన్ గనుఁగొంచు గోపికా
గోకులగోపులంగలిసి కూరిమితో బహునాక్రీడేండ్ల వాఁ
డైకరమున్ జరించెడి నహో! యన దీని నెఱుంగరెవ్వరున్. ౧౩౬

క॥ దుష్టులఁ జంపుటకొఱకును శిష్టులఁ గాపాడుకొఱకు శ్రీహరి జన్మం
బిష్టముతో నెత్తెను నీకఁ గష్టపరంపరలుఁ జనును గలఁతల విడుమా! ౧౩౭

ఉ॥ దానవుఁడైన కంసుని హతంబొనరించినపైఁ బ్రకాశుఁడౌఁ
గాన దదంతరంబుననె కాంచినకూఁతుల గూఢరీతిగా
దానమొసంగి యాహరికి ధన్యుఁడవై పరమొందు మోధరా
జాని! శరీరధర్మములు చంచలముల్గద జాగు మానుమా! ౧౩౮

ఉ॥ శాంతనవుం డిటుల్ పలికి స్వస్థలముం జనెఁ బిమ్మటన్ ధరా
కాంతుఁడు తిర్గి దూతఁ దమకంబునఁ బిల్చి ప్రియోక్తితోడ నీ
వింతకుమున్ను నాకు వచియించిన కుఱ్ఱఁడె కృష్ణుఁడయ్య! య
త్యంతజవంబుచే నరిగి యాఘనుఁ దోడ్కొని రమ్ము ధీనిధీ! ౧౩౯

తే॥ రాయబారి బయలుదేరి యా యమునకు దాపునందుననున్న బృందావనమున
శీతవాతము హాయిగాఁ జెలఁగుచుండ సంచరించు కృష్ణుని రహస్యమునఁ గాంచి

చ॥ హరి! యరవిందనేత్ర! యభయప్రద! దోషవినాశకా! మహే
శ్వరుఁడ వజుండ వాద్యుఁడవు బ్రహ్మవు బ్రహ్మముఖాదివంద్య స
చ్చరితుఁడ వప్రమేయుఁడవు సామ్యవిహీనఘనుండవయ్య! నిన్
గుఱిచి నుతింపఁ జాలుదునె? కొమ్మవినో నతులో దయోదయా! ౧౪౧

ఉ॥ ఎవ్వఁడు కర్ణహీనుఁడయి యెల్లయుదంతము లాలకించునో
యెవ్వఁడు నేత్రహీనుఁడయి యెల్లజగంబులఁ జూచుచుండునో
యెవ్వఁడు రూపహీనుఁడయి యిష్టుల కన్గవ గోచరించునో
యెవ్వఁడు దేవదేవుఁడయి హెచ్చెనొ యానిను భక్తి మ్రొక్కెదన్. ౧౪౨

ఉ॥ ధన్యము నందగోకులము ధన్యము శ్రీమథురాపురంబునున్
ధన్యము గోపికాజనము ధన్యము గోపకవంశ మంతయున్
ధన్యము బృందకాటవియు ధన్యులు నీ తలిదండ్రు లింక నే
ధన్యుఁడ నైతి మీశుభదదర్శనమూట సరోజలోచనా! ౧౪౩

ఉ॥ కంసముఖాదిదానవుల కంఠములం దెగటార్చ భూమివో
హింసల మాన్ప గోశ్రుతిమహీసురసాధులఁ బ్రోవ సేవకో
త్తంసమనోరథంబుల యథావిధిఁ దీర్పఁగ జన్మమెత్తి యా
శంసితనందసౌధమున శౌక్ల్యసుధాంశునిమాడ్కిఁ బెర్గవే? ౧౪౪

ఉ॥ నీ యశమేకదా శశిని నిర్మలుగాఁ బొనరించి దిక్కులం
దాయతచంద్రికల్ బఱపి హర్షముగూర్చెడి దద్దియేకదా
యాయమరాపగాధరునియద్రిని దెల్లనిగొప్పకొండగా
హాయిగఁ జేయఁజాలెడిది యద్దిలవంబు నుతింప శక్యమే? ౧౪౫

చ॥ ఎన రెఱుఁగంగరాదనుచు నిచ్చటనుంటివి కాని నీ యశం
బవఘళమొంది యెల్లెడల నందఱున్ దెలియంగఁ జాటెఁగా
దె? వరద! పరాత్పరా! వరమతీ! మృగనాభిపటీర కేతకీ
నివహసువాసనల్ బరణి నెట్టన డాఁచిన డాఁగునేమొకో? ౧౪౬

శా॥ క్షేత్రజ్ఞుండవు కర్మసాక్షివిగదా శ్రీరాధికానాయకా!
ధాత్రిన్ నీవెఱుఁగంగఁజాలనివి సేతల్ గానరా వైన నో
సుత్రామాదినుపర్వవంద్యచరణా! చూపించి కారుణ్య మీ
మాత్రన్ దాత్యము గన్న నా వచనముల్ మన్నించి యాలింపుమా! ౧౪౭

తే॥ సింధుదేశమునందుఁ బ్రసిద్ధిగన్న చంపకాహ్వాయపురవరజనపతి యగు
విమలుఁ డనువాఁడు త్వత్పదవిమలపద్మములను మిక్కిలి నెద నమ్మి పలికె నిట్లు.

చ॥ జప మఖ వ్రతంబులను శ్రౌతసవంబులఁ దీర్థయాత్రలన్
దపమును సర్వదానములఁ జద్దయుఁ దావకదర్శనార్థమై
యెప్పుడును సల్పి నిన్ను నుతియించుచు నుంటిని నమ్మియుంటి నా
కిపు డొకమాఱు గన్పడుము! యీక్షణసర్వముగాఁగ శ్రీధరా! ౧౫౯

చ॥ మఱి నిను భర్తగా నెపుడు మానసమందు నుతింతు వారు తా
మరసదళాయతేక్షణలు మన్మథదాఁసమానహాసినుల్
వరనియమవ్రతస్థలును స్వర్ణవిభూషణాయుక్తలైన మ
త్సనుచిర కన్యకామణుల సొంపుగ నీవు పరిగ్రహింపుమా! ౧౬౦

శా॥ దేవా! యీవిధిఁ జెప్పఁనుంచు ననిపెళ్ దివ్యానుకంపన్ ననున్
రావే ప్రాకటచంపకాపురికి నిన్ బ్రార్థించు నాసేత కీ
వీవే దర్శన మానరేంద్రసుతలన్ హెచ్చిల్లి చేపట్టి పో
లేవే మమ్మెల ధన్యులన్ సలుపఁగాలేవే వివేకిప్రియా! ౧౬౧

తే॥ ఇట్లు వినుతింప సరియంచుఁ గృష్ణుఁడొప్పి రాయబారిని దోడ్కొని వాయువేగ
మున దదధికారియింటికేఁబోవ నతఁడు గద్దియన్ డిగ్గి యెదురేగి గాఢభక్తి.

శా॥ శ్రీవత్సాంకుని హేమచేలరుచిరున్ స్మేరాననున్ రమ్యరా
జీవాక్షున్ వనమాలివంశిధరునిన్ జీమూతవర్ణాంచితున్
దేవస్తుత్యుని గోపికాజనధవున్ దీనావనఖ్యాతు శ్రీ
గోవిందున్ స్వగృహాగతున్ గనుచు మ్రొక్కుల్సల్పి యిట్లాడెడిన్. ౧౬౩

చ॥ కొను మిదె సింహపీఠికను గూర్మిని నే నిడు పూజలెల్లఁ గై
కొనుమని యర్చలన్ సలిపి కొంకక దోసిలియొగ్గి సమ్ముఖం
బున నివసించెఁ దత్సుతలు ముచ్చట నా హరి జాలరంధ్రపం
క్తిని గనసాగి రంత నల కృష్ణుఁడు తత్పతి కిట్లు వాకొనెన్. ౧౬౪

క॥ విమలా! యిత్తఱి సంతోషము గల్గెను యాజ్ఞవల్క్య సద్వరమున నీ
కమితశివంకరదర్శన మమలదయ నిడితి వరము లడుగుము యిత్తున్. ౧౬౫

క॥ అనవుడు విమలుం డిట్లనె యనఘా! ధన్యుండనైతి ననిశము నీపా
దనలినయుగసుధ నానెడి ఘనపట్పదముగ రచించి కావుము కృష్ణా! ౧౬౬

క॥ ధీరుఁడవు సర్వవిద్యాపారగుఁడవు బ్రహ్మవాదివంద్యుఁడవు మహా
వీరుఁడవు వేదపథసంచారచణుఁడ వంతకంటె సద్వరము న్నే? ౧౬౭

తే॥ భక్తవత్సల? యది విడి పరవరంబుఁ గోరుటల్ జూడఁ దియ్యని కొబ్బెర విడి
చిప్ప వేఁడెడి వీఱిఁడి చొప్పుఁగాదె జలజనాభ! యన్యవరంబు వలదు వలదు.

ఉ॥ ఆవల దాని కంబుజదళాయతలోచనఁ బొప్ప నాతఁడున్
మావులఁ దేసులన్ దసుల మాడలు మాడువు లర్ధరాశు లా
దేవున కిచ్చి కూఁతుల శ్రుతిస్థితషక్కి నొసంగఁగా జయా
రావము నిండె వేల్పులు గరంబుగఁ బూలను జల్లి రో విభూ ! ౧౫౯

ఉ॥ ఆసమయాన నా విమలుఁ డర్కశతప్రతిమానమూర్తియై
భాసిలి వైనతేయుపయి భార్యలతోడుత నెక్కి యచ్యుతా
వాసముఁ జెందె నంత నలవారిజలోచనుఁ డా లతాంగులన్
రాసములందుఁ దేల్చె ననురాగముమీఱ వ్రజస్థలంబునన్. ౧౬౦

తే॥ మఱియుఁ గామవనమున నా మానినులను
గూడి శ్రీహరి విహరించెఁ గోర్కిమీఱఁ
దన్ను భజియించువారికి వెన్నుఁ డెలమి
నిచ్చలను దీర్చి ముక్తిని నియ్యఁ డొక్కొ ? ౧౬౧

చ॥ విమలకుమారి ముజ్జలము వెల్లిగఁ బాఱుట నందు దానికిన్
విమలసరోవరం బనెడి పేరు ఘటిల్లెను దానియందు నె
ట్టి మనుజుఁడైన దానము గడిందిగ సల్పినఁ బాపమేగుఁ బు
ణ్యము లభియించు నిట్టి కథ నాస్థను విన్న జనుండు ధన్యుఁడౌ. ౧౬౨

—♦ యజ్ఞసీతోపాఖ్యానము. ♦—

తే॥ జనకభూవర ! వెండియు శౌరిభక్తివర్ధకంబును సుఖదంబు బాపహరము
నైన యజ్ఞసీతాకథ నాలకింపు మనుచు నిట్లనె నారదమునివరుండు. ౧౬౩

తే॥ మున్ను దక్షిణదిగ్భాగమున ననేకరుచిరుచిరతరుసుమఫలనిచయకలిత
వన పశు స్వస్తికాదిభవన సమేతమగు "నుశీనరావన" రాజ మలరుచుండు.

చ॥ వరపరమప్రమాణవిధివర్ధితవేదపురాణశాస్త్రసూ
త్రరమణసార్థకార్థబహుధర్మ సుకర్మ కృతిస్ఫురత్ప్రభా
కరసమదీప్తి దిక్తిమిరకర్తనకీర్తితమూర్తులాఢ్యులున్
సరసులు సుందరీమణులు చాలఁ జెలంగుదు రందుఁ బాందిరన్. ౧౬౫

తే॥ అట్టిదేశంబునం దొక్కయవసరమున వరుసగాఁ బదియేడులు వానలేక
యతిశయక్షామడాంబరాద్యఖిలరుజలు గ్రాలుటన్ జను లెల్లరు దాళలేక. ౧౬౬

క॥ పుత్రకళత్రాదులతోఁ దత్రత్యులతోడఁ గూడి తన్నందు వ్రజం
బాత్రముగాఁ జేరి యటన్ జిత్రగృహంబులను గట్టి చేసిరి వసతుల్. ౧౬౭

చ॥ అటుపయి వారిగేహముల నా రఘురాము వరంబుచేత ను
త్కటముగ యజ్ఞసీతలను కాంతలు పుట్టి క్రమక్రమంబుగాఁ
జటులవయస్సమేతలయి సంయమికిన్ రతిగోర్చు రూపమున్
దిటముగఁ బొంది భూషలను దేహమునిండ ధరించి వేడ్కతోన్. ౧౬౮

ఉ॥ అందముగా విహారముల నందున సల్పెడికాలమందు నా
సుందరనందనందనుని జూచి విరాళిని సైపలేక త
న్నందనుతుం డుదారుఁడును నవ్యమనోభవరూపుఁడున్ మహా
నందమయుం డనాదియును నాథవిభుండు ప్రసన్నుఁ డౌటకై. ౧౬౯

కం॥ రాధాకేళీలోలుఁడు రాధాప్రాణప్రియుండు రాధాత్ముండున్
రాధాభక్తవరదుఁడున్ రాధాధీనుం డటంచు రాధను బనుచున్. ౧౭౦

కం॥ జననీ! మా మొఱ వినుమా విన నీ చరితంబు విశ్వవిదితము తల్లీ!
కన నీ రూపము వంద్యము కొన నీ మానందనములఁ గోరితి మమ్మా! ౧౭౧

తే॥ అమ్మ! వృషభానుపుత్రికా! యబ్జనయన! దేవదుర్లభుండగు హరి నీవశమున
నుండెఁ దత్ప్రసన్నార్థ మీవాచరించు వ్రతముఁ దెల్ప వేఁడితి మిమ్ము దివ్యచరిత!

కం॥ అనవుడు రాధిక యిట్లనె వినుఁడీ! యేకాదశీపవిత్రవ్రతమున్
ఘనముగ సల్పిన హరి వశ్యమగుడీ శుభమిచ్చు నద్దె సత్యమనంగన్. ౧౭౩

ఉ॥ వారలు రాధ కిట్లనిరి భామరో! యీ వ్రత మెట్లు పుట్టెనో
యేరిది సల్పిరో తొలుత నెన్ని యభీష్టము దీనికున్నవో
యేరహి నోమగావలెనో యీదృశసంగతులన్ వచించి మా
కూరట గూర్పుమమ్మ! భువనోద్ధురధారిణి! మానినీమణీ! ౧౭౪

## ఏకాదశీవ్రత వర్ణనము.

వ॥ అనవుడు రాధికాసుందరీమణి యందుల కురరీకరించి గోపికలారా! యీ యేకాదశి యసురలవధార్థంబై మార్గశిరకృష్ణపక్షంబు దా మహావిష్ణుదేహంబునం దుద్భవించె. తత్ప్రభృతిఁ బ్రతిమాసంబునఁ బూర్వాపరపక్షంబుల రెంటను వచ్చెడి. తద్విధి నొక యబ్దంబులో నేతెంచు నిరువదినాలుగేకాదశులకుఁ గ్రమంబుగా ఉత్పన్నా, మోక్షా, సఫలా, పుత్రదా, షట్తిలా, జయా, విజయా౽మలకీ, పాపమోచనీ, కామదా, వరూథినీ, మోహినీ, న్యపరా, నిర్జలా, యోగినీ, దేవశయనీ, కామినీ, పవిత్రా౽జా పద్మేందిరాపాశాంకుశారమాప్రబోధినులను నామంబులును, మలమాసంబున వచ్చెడి రెండేకాదశులకును సంపత్ప్రద యను నభిధేయంబులు గలిగె. ఈ షడ్వింశతినామశ్రవణంబు బొనర్చు వారి కేకాదశీ వ్రతాచరణ

ఫలంబు జిక్కు. ఇంక వ్రతాచరణం బెట్లనిన పూర్వదినంబగు దశమిని సుమఃకాలంబున లేచి కాల్యంబులం దీర్చి శుభ్రవస్త్రంబులం దాల్చి యేకభుక్తంబొనర్చి మఱల నొక మాఱుమాత్ర ముదకంబు గ్రోలి జితేంద్రియుండై భూమిమీఁద హరిని సంస్మరించుచు శయనింపందగు. మఱునాఁ డేకాదశిని బ్రాహ్మీముహూర్తంబున మేల్కాంచి భగవద్ధ్యానంబు సల్పి కాలకృత్యంబుల నెఱవేర్చి సర్వోత్తమంబగు మహానదీ స్నానంబుగాని, యుత్తమంబగు తటాకస్నానంబుగాని, మధ్యమంబగు వాపీస్నానంబు గాని, యధమంబగు కూపావగాహనంబుగాని యాచరించి క్రోధలోభ వివర్జితుండై బ్రాహ్మణనింధక, నీచ, దురాచార, మిథ్యావాది, పరద్రవ్యాంగనాపహరణాస క్తాగమ్యాగమనరత, సంభాషణంబు మాని కేశవుని ధ్యానావాహనాదివిధులఁ బూజించి ధూపదీపంబులఁ జూపి నైవేద్యంబు సల్పి నీరాజనం బొసఁగి మంత్రపుష్పం బిడి ప్రదక్షిణంబులఁ గావించి నమస్కరించి తద్వ్రతకథఁ బురోహితునివలన విని, యయ్యాచార్యునకు వందనపూర్వకంబుగా యథాశక్తి దక్షిణతోఁ గూడిన తాంబూ లం బిచ్చి నిష్కలుషీకృతంబగు మనంబున రేయిని గృష్ణనామసంకీర్తనం బొనర్చుచు జాగరణంబు జేయందగు. మఱియు దశమిని గాంస్యపాత్రభోజన, మాంస, మసూర, కోద్రవ, హరిమంథక, శాక, మధు, పరాన్న, మైథున, పునర్భోజనంబులను బదింటిని వర్జించి యేకాదశిని ద్యూత, క్రీడా, నిద్రా, తాంబూల, దంతధావన, పరనిందా, పైశున్య, స్తేయ, హింసా, రతి, క్రోధాసత్యంబు లను బదునొకండును బరిత్యజించి ద్వాదశిని గాంస్యపాత్ర, పలల, క్షౌద్ర, తైల, మంగళ్యక, పిష్టి, మష్టిక, కామ, క్రోధాసత్యపరాన్నమైథునంబులను బంద్రెండును వీడి యేకాదశీవ్రతంబు ముగించి ద్వాదశీపారణంబు బ్రాహ్మణయుక్తుండై సాత్వికాహారంబు గొనందగు. వృద్ధిగ నుండు నేకాదశికాక శేషించిన యేకాదశీదినంబె యుపవాసయోగ్యంబగు మదిరా బిందుపాతంబున గంగాఘటంబు త్యాజ్యంబగునట్లు దశమీవేధబాధితంబగు నేకాదశీ దివసంబు వర్జ్యంబగునని యెఱుంగుము. ఇఁక నేకాదశీవ్రతాచరణఫలం బెట్టిదనిన,

శా॥ అష్టాశీతిసహస్రభూసురసుధీరాన్నప్రదానంబు జ్యో
తిష్టోమాదిమహామఖాచరణముల్ దీర్ఘాటనంబుల్ శ్రుతి
స్పష్టామేయసుకర్మధర్మకృతియుల్ వాప్యాది సంస్థాపనం
బష్టాత్మార్చలు గూడ దీని కెనయౌనా? బిట్టు చర్చింపఁగాన్. ౧౭౬

సీ॥ సకలశుభప్రదసర్వవ్రతంబుల శ్రేష్ఠమా నేకాదశీవ్రతంబు
సంసారబాధలన్ సమయించుసేఁతలన్ శ్రేష్ఠమా నేకాదశీవ్రతంబు
నారోగ్యభాగ్యంబు నమరుచు మందులన్ శ్రేష్ఠమా నేకాదశీవ్రతంబు
హరిభక్తి నొడఁగూర్చు నతిశయయుక్తులన్ శ్రేష్ఠమా నేకాదశీవ్రతంబు

తే॥ ప్రలయరౌద్రాకృతిందాల్చి ప్రాణిచయముబట్టి బాధించు కాలునిన్ నెట్టఁజాలు
చేయువులను శ్రేష్ఠ మేకాదశీవ్రతంబు గాదె పంకజేక్షణలార! కాంతలార!

క॥ ఏకుటిలాత్ముండైనను నేకాదశియందు నుపవసించినచో న
స్తోకాఘధరాధరముల నేక్షణమందుఁ గాల్చి కృష్ణునిఁ జేరున్. ౧౮౧

క॥ ద్వాదశ్యేకాదశులను శ్రీదయితుఁ దలఁచి వ్రతముఁ జేసిన జనుఁడా
వేదోదితసవఫలముల మోదముతోఁ బొంది కృష్ణుప్రోలకుఁ జేరున్. ౧౮౨

తే॥ ఈ వ్రతంబును సల్పిన యెల్లజనులు
మాతృపక్షంబునం బదిమందిఁ దండ్రి
పక్కఁ బదిమందినిన్ భార్యవైపునఁ బది
మంది నుద్ధరించునుగాదె మదవతులార!

తే॥ శుక్లకృష్ణమాహేయులు సొరిదిఁ బిదుకు పాలయందున భేదంబు వలదనట్లు
శుక్లకృష్ణపక్షైకాదశులును మార్పులేక యొకేరీతి ఫలమిచ్చు లేమలార!

తే॥ నూఱుజన్మంబులందలి మేరుమందరసమపాపంబులన్ దూలఁద్రోఁగాల్చు
వహ్నిఁబోలె నేకాదశీవ్రతతిలకము వసి వహించును వైకుంఠపదవి నిచ్చు.

క॥ విధినో యవిధినొ కొలఁదిగ బుధులకు ద్వాదశిని దానము నిడ నదే మే
రుధరాధరతుల్యంబై మధురిపువాసముఁ జేర్చు మానినులారా! ౧౮౩

సీ॥ చిలువలయందున శేషునికై వడిఁ బక్షులందు గరుడపక్షిపోలె
దేవతలందున శ్రీవిష్ణువిధమున వర్ణంబులందున బాపలవలె
వనసీరుహంబుల నశ్వత్థతరువిధి నాకులందుఁ దులసిమాకుమాడ్కి
మాసంబులందున మార్గశీర్షమురీతి వేదంబులన్ సామవేదమువలె

తే॥ వ్రతములందు నేకాదశీవ్రతము మిగుల వన్నెకెక్కును బదివేల వత్సరములు
తపముఁ జేసిన ఫలమిచ్చి ధన్యచరితుఁ జేయుఁ గావున మీరది సేయుఁడర్థి.

ఆ॥ అంత వారు రాధ కని రిట్టుల్ దేవిరో! మున్ను దీని నెవరు మొదలుపెట్టి
ధన్యచరితులైరొ తత్కథ దయతోడఁ జెప్పు మనుడు నామె చెప్పె నిట్లు.

చ॥ తొలుతను వేల్పులీ వ్రతము దాలిచి రాజ్యముఁ దిర్గి గెల్చి దై
త్యులను నశింపఁజేయఁగ మహోద్ధురభక్తిని సల్పి రాత్మదా
యలవలనన్ ద్యజింపఁబడి యంకిలిఁబొందిన లుంపకాఖ్యుఁడున్
సలిపి నిజప్రభుత్వమును జక్కఁజయించి ముదంబుఁ జెందెఁగా. ౧౮౪

తే॥ భూతలంబున మేటియౌ కేతుమంతుఁడనెడి భూపుఁడు పుత్రలాభార్థ మీవ్ర
తంబు సల్పె వైశంతుఁ డేతద్వ్రతమున శ్రాద్ధదేవలోకస్థిత జనకుఁగాచె.

తే॥ దేవపత్నులు బ్రాహ్మణస్త్రీకి నిట్టివ్రతము దెల్పఁగ నదిజేసి యాబ్రాహ్మణియును
ధనము ధాన్యము మాన్యత తనయులలర స్వర్గసౌఖ్యంబుబొందె నోచానలార!

సీ॥ మఱిఁ బుష్పదంతియు మాల్యవంతుఁడు పిశాచత వీడ నెద్దాని సల్పినారొ
శ్రీరామచంద్రుండు సేతుబంధము రావణాంతార్థ మెద్దాని నాచరించెఁ
బ్రలయాంతమందు సురవ్రాగణంబు సకలశుభార్థము చేని సలిపియుండె
నప్సరస్సుప్రపష్టిదోషాంతార్థమై భక్తి మేధావి యెద్దాని మిగులఁజేసె

తే॥ లలితనాయకగంధర్వకులతిలకుఁడు శాపమునఁ గన్న దయ్యపురూపుమాయఁ
జేసె నెది యది యేకాదశీవ్రతంబుగాదె వివిధవిధాగతకలుషహరము. ౧౮౯

చ॥ భవుఁడును దీని సల్పి యల బ్రహ్మకపాలము వీడె ధుందుమా
రవిభుఁడు నంబరీషసగరప్రముఖప్రభు లిద్దిఁ జేసి మా
ధవునినివాసమొందిరి గదా యొక వైశ్యుఁడు జ్ఞాతిదూరుఁడై
యవగుణముల్ జెలంగి యది హాయిగ సల్పి కృతార్థతఁ దగెఁ. ౧౯౦

ఉ॥ భంగము లెన్నివచ్చినను బట్టునువీడక భక్తితోడ రు
క్మాంగదుఁ డిట్టి సద్వ్రతము నాచరణం బొనరించి శ్రీహరి
ప్రాంగణమొందె నైలబిల పార్థివశాపముచేతఁ గుష్ఠమా
త్మాంగను హేమమాలి యిదిదాల్మినొనర్చి కృతార్థతన్ గనెఁ. ౧౯౧

తే॥ మఱి హరిశ్చంద్ర మాంధాతృమాన వేశ్వరులును నేకాదశీవ్రత మలఘువిధిని
నాచరించి యీ పృధివికినధిపులగుచు నేలి వైకుంఠ వాసులై క్రాలిరయ్య!

తే॥ మఱియు ముచుకుంద నల్లుఁడై వఱలు శోభ
నాహ్వయుండును నీ వ్రతమాచరించి
చంద్రభాగయఁ భార్యతో సకలపృధివి
ధనదుబోలి పాలించు నీక్షణము వఱకు ౧౯౩

తే॥ కానఁ దిథిరాజమునుఁ భక్తకల్పకంబు నయిన యేకాదశీదినం బల్పమనుచు
నెదఁ దలంపక చేయుఁడీ! యింతులార! దానితోడీటుగా నే వ్రతంబురాదు.

చ॥ అనవుడు యజ్ఞసీతలును నచ్యుతలాలస లొచ్చుఁ దద్వ్రతం
బును విధిచోదితంబుగ నమోఘవిధంబునఁ జేయఁ గృష్ణుఁడున్
నెనరున మార్గపూర్ణిమను నివ్వెఱజెందఁ బ్రసన్నుఁడై తదం
గనలను గూడి రాసము లఖర్వముగా నొనరించె దేవరా! ౧౯౫

## —♦ పులిందినీ గోపికోపాఖ్యానము. ♦—

తే॥ మఱియు సర్వాఘహరము నమానుషంబు
కృష్ణభక్తివర్ధకమును గీర్తనీయ
ము నగు శ్రీపులిందజవధూ పుణ్యగాథఁ
బలుకుచుంటిని వినుమయ్య! యలఘుచరిత! ౧౯౬

తే॥ జనకరాజ! పుళిందులుచాలమంది యుక్కుమీఱి వింధ్యాచలోపవనము
నందు నివసించి దీనులయర్థము విశిజేని ధనమును గసిఁ దస్కరింపఁ బోవఁగ.

ఉ॥ ఆహవకేళి ధీరుఁడు మహాబలుఁ డాఢ్యుఁడు వింధ్యభూమిని
ర్వాహకుఁ డాకతాయలయి రైసి హరించెడి వారిఁ గాంచి వ్య
క్షౌహిణు లొప్ప నష్టి శరచాపకృపాణగదాదిహేతులన్
సాహసభూషణుం డగుచు సల్పె రణంబు ననంతరంబునన్. ౧౯౮

ఉ॥ వారలు గొన్ని ఘస్రములు లపారబలంబున నోర్చి నేర్పుతోఁ
బోరి సహింపలేక యమభూవరకింకరు కొక్కెజాబుగం
దీ రణకేళిగాథ లిఖియించియు నంపిరి వారిఁ గన్న మా
పిరనమంచునొప్పి పిలిపించి ప్రలంబుని సన్యకోపులన్. ౧౯౯

తే॥ జాబు నందలి సంగతుల్ జక్కఁ దెలిసి పొంపనంగఁ ప్రబలం బాహ్యభాపబలులు
శత్రుభీకర వేషముల్ సరగఁ దాల్చి భండనాంగణమొంది రాపట్టునందు.

సీ॥ కాఱుమబ్బులఁ బోలి కరముభయంకర మైనట్టి నల్లని మేనుతోడ
బహుభారసము పేతపటుతరాయోమయకాలపాశసమశృంఖలలతోడఁ
బ్రత్తికాయల మాడ్కిఁ బరగుచు నెఱనిప్పు కుంపటులనుబోలు గ్రుడ్లతోడఁ
బగతుఱ గుండియల్ బ్రద్దలౌనట్లుగఁ దగిన యఘోరముద్గరముతోడ

తే॥ మకుట కుండల ఫణిహారమండలంబు తోడ ప్రేలాడు నాల్కలతోడ నొప్పి
యోజనద్వయోచ్చాంగంబునొంది జగమువడఁక జేయు ప్రలంబునా ప్రభువుగాంచి

ఉ॥ బెగ్గలి వింతతోఁ గరముఁ బేరు టురంబున వైచి యీయనిన్
నెగ్గి జయింపఁజాల నని నెంజలిబొంది చమూసమేతుఁడై
మొగ్గరముం ద్యజించి రథమున్ వడినెక్కి మనోజవంబుతో
నగ్గిసముగ్గిసల్ బడుచు సాగె హరింగను నేన్గుచాడ్పునన్. ౨౦౨

ఉ॥ ఆవిధినట్టి వింధ్యపతి యాశుగఁ బాఱఁ బ్రలంబుఁ డాపుళిం
దావళితోడఁ గూడుకొని యామధురాపురి కేగె నంత ర
క్షోవిభుఁడైన కంసుఁడును జూచి ముదంబున వారి నందఱన్
సేవకవర్గమందునిచెఁ జెప్పిన చొప్పునఁ జేయునట్లుగాన్. ౨౦౩

చ॥ పనపడి వారు కామగిరిపై సకుటుంబముగా వసించి రీ
యదనున రామచంద్రవర మండలిశక్తిఁ బుళిందినీసతు
ల్తదవసథంబులన్ గలిగి లక్ష్మినిఁబోలుచు వృద్ధిజెందు చా
మదనసమానరూపుఁ డగు మాధవునింగని కన్నులారఁగాన్ ౨౦౪

తే॥ ప్రేమవిహ్వలలై తారు కామరోగపీడితలయి రేబవలును విష్ణుమూర్తి
సన్నుతించుచునుంట నాశౌరి మెచ్చి దాసకేళుల వారి సంతోసపఱచె. ౨౦౫

ఆ॥ ఎట్టివారలకును నీక్షింపఁగారాని కృష్ణమూర్తి వారికెట్టుల దరిసె
నంబునిచ్చి కోర్కినట్టులు లేకుంట నిడెను వారిభాగ్య మేమనవలె? ౨౦౬

ఉ॥ అరయు భక్తు లెప్డు డలయచ్యుతపాదసరోజధూళియే
కోరుదు రంతెకాని సురకోటివిభుత్వవర ప్రభుత్వ సం
సారసుఖార్థరాశిదృఢసత్త్వమహత్త్వమనోభవోపమా
కారములన్ సమీహాలను గావలె మాకని కోర దోవిభూ! ౨౦౭

—♦ రమాసఖ్యాది గోపికోపాఖ్యానము. ♦—

ఆ॥ అట్టి భక్తజనులనాధిక్యమున్ గన్న యన్యగోపికాజనామలకథ
విన్నవింతుఁ గాన వినుమయ్య! బహులాశ్వ! ముందు గోకులంబునందు వేడ్క.

వ॥ నీతివిన్మార్గవ, శుక్ల, పతంగ, దివ్యవాహన, గోపేష్టులను నాల్వురు వృషభానులు జనించిరి. అవ్వారల బిడారులందు శ్రీరమారమణవరంబుచే రమావైకుంఠమండలి మందయానలును, నూర్ధ్వవైకుంఠమండలి యువిదలును, శ్రీలోకాచలమండలి చెలువలును, శ్వేతద్వీపంబునందలి సుందరులును, సముద్రజలగు జలజేక్షణలును, మఱియు శ్రీలక్ష్మికి సఖురాండ్రై జనపదంబుల నివసించుసతులును జనించి దినక్రమంబున వర్ధిల్లి జగన్మోహినులై రేయింబవలుము శ్రీనందనందనచరణారవిందంబులను ధ్యానించుచుఁ దద్దర్శనకుతూహలలై మాఘమాసవ్రతం బాచరింప నద్దేవుండును మెచ్చి వసంతపంచమీదినంబున నా గోపికాజనంబును బరీక్ష జేయం దలంచి,

మ॥ పులితోల్గట్టి శిరంబునన్ జెనుజడల్ బొల్పార మౌనీంద్రుఁడై
లలి భస్మంబును బూసి దేహమున నుల్లాసంబుగా వంశితో
నిలపైనున్న జనంబు లెల్లరును మోహింపంగ బల్ పాడు చా
జలజాతాక్షులవాడలందుఁ దిరుగన్ సాగెన్ విదేహప్రభూ! ౨౧౦

క॥ అత్తఱి నత్తొయ్యలులున్ దత్తామరసాక్షుఁ గాంచి తమి హెచ్చిల్లన్
హత్తించి నాస ద్రేళ్ళను జిత్తరువుల మాడ్కినిల్చి చింతించి రిటుల్. ౨౧౧

సీ॥ ఎవ్వఁడో యీబాలుఁడిందుఁడా కాఁడాతఁ డంకంబు పీడింప నడఁగుచుండు
కంతుఁడా యీతండుకాఁడా మనోభవుం డంగహీనుండయి కుందుచుండు
నింద్రుఁడా యీఘనుండెన్నటికింగాఁడు బ్రహ్మహత్యలవాఁడు వగచుచుండు
కనకగర్భుఁడ వీఁడుకాఁడు విచారింప, నాతండు తాతయై యదరుచుండు

తే॥ నీకఁ దలంప వీఁ డెవ్వఁడో యెఱుకపడదు గాని మీరు యోజింపుఁడీ కాంతలార!
యన్న నవ్వారిలో నొంత ఱతివ లాత్మభావముల నీవిధంబునఁ బలికి రార్య!

తే॥ మేము నెఱుఁగము కాని యో మెలఁతలార!
యితఁడు నతులకాలుల చేత నెఱఁగ వినుగ
నిల్లు విడచి సంయమివలె నిట్లు దిరుగు
చుండెనని తోఁచుచుండె మాయుల్లములను. ౨౧౩

సీ॥ కాసిచో నీతని యానవచంద్రుండు మిగులఁ బవింపఁగాఁ బగునె చెప్పుమ!
కాసిచో నీతని కరకమలంబులు తిత్తి మాండలుఁ బట్టఁదగునె చెప్పుమ!
కాసిచో నితని వక్షఃకవాటంబు రుద్రాక్షమాలలను దాల్పఁదగునె చెప్పుమ!
కాసిచో నీతని ఘనసిద్ధదేహంబు తద్దయునాదిని బూయఁదగునె చెప్పుమ!

తే॥ కాసిచో నీని వాక్యము బసూనవకీరిఁ బ్రాయముల మాటమాటికిఁ జేయఁదగునె
చెప్పుమ! కాసిచో నిట్టి సుశీలు నడుగుదమ్ము లపవ్రుల నడనంగఁదగునె చెప్పుమ!

తే॥ ఇట్టి సుజ్జుని విడిచియు నెటుల దల్లి, దండ్రియున్ జెల్లె లన్నలును మ్ముత్తె లెలమి
బ్రతుకుచుండిరో తెలియదీపట్టిగన్న, వరులు విడుతురే విడి వారు బ్రతుకగలరె?

తే॥ అంచజము చేరి మెల్లన నతని కడకుఁ జేరి యడిగిన సరసమాఁ జెలువలార!
యనఁగ నందఱు సమ్మతమంది యతని చెంతకుం జేరి యిట్లు పృచ్ఛించిరార్య.

చ॥ యతివర! యేరు మీరు? భవదాహ్వయ మెయ్యది? యేకులంబు? మీ
స్థితి యెట? వృత్తి యెద్ది? మఱి సిద్ధిని నెందునఁ జెందియుంటిరో?
వితతముగా వచింపుఁ డని వేమఱు వేఁడితి మన్న నాతఁ డ
ద్భుతమగు వాక్యధోరణిని ముగ్ధల కిట్టులఁ బల్కె భూవరా! ౨౧౪

సీ॥ నా నివాసంబు మానససరోవరముననే యాహారములేని యమివరుండ
నాఖ్యయా నాకు స్వయంప్రకాశుండల పరమహంసదశకుఁ బరగువాఁడ
వర్తమానంబును భవ్యంబు భూతంబు దప్పక చెప్పెడి గొప్పవాఁడ
స్తంభనమోహనోచ్చాటనమారణమంత్రవిద్యాసిద్ధి మరఁగినాఁడ

తే॥ మఱియు సర్వవిద్యలయం దమానుషమగు,
నేర్పుగలిగినవాఁడనో నెలఁతలార!
మీర లడిగిన దాని సాధారణముగఁ
జెప్పఁగలను సంశయమిందుఁ జెందవలదు. ౨౧౫

చ॥ అనవుడు తద్వ్రజాంగనలు నాయతి కిట్లని రట్టులైన మా
మనములనున్న సంగతు లమందముగా వివరింపుఁడీ యనన్
విని యతఁ డించుకంత దనవీక్షణ మూర్ధ్వమునందు నైచి యి
ట్లనియెను దల్లతాంగులకు నాదర భావసుబద్ధబుద్ధియై. ౨౧౬

తే॥ మీ మనంబులనుండిన కామమధికగూఢమాటను జెవిచెంతఁ గోర్కి దీఱఁ
జెప్పఁగాఁదగుఁ గాదేని సెలవుమీర లిడినఁజేసెద వెల్లడి నింతులార! ౨౨౦

తే॥ అనుచు సాభినయంబుగా నట్టివార్తఁ
గొలఁది సూచించె నటుమీఁద గోపలులును
మెచ్చి యోగీశ! యెపుడు మాయిచ్ఛ కాఁడు
రాగలఁడొ యిట కయ్యది వేగఁ జెపుమ! ౨౨౧

ఉ॥ నావుడు సిద్ధుఁడిట్లనియె నవ్యసరోరుహనేత్రలార! మీ
భావము నే నెఱింగితిని బాగుగనున్నది మీరలందఱా
శ్రీవిభు నమ్ముచున్ గొలఁదిసేవు కనుంగవమూయుఁ డిప్పుడే
యావసుదేవపుత్రుఁ డిటకాగతుఁడయ్యెడి నన్న వారలున్. ౨౨౨

చ॥ సరియని యొప్పి శ్రీహరి నచంచలభక్తిఁ దలంచుచున్ గనుల్
సరగున మూసిరంత నలసారసనేత్రుఁడు వారిప్రేమ యు
ద్ధురతనుజూచి మెచ్చిదయతో యతిరూపము వీడి తోడ్త సుం
దరుఁడగు నందపుత్రుఁ డయి తద్వనితాసముఖంబునం దగన్. ౨౨౩

ఉ॥ పెన్నిధిఁగన్న పేదవలె వేడ్కఁగనుంగొని వారు వేఁడి రా
వెన్నుఁడు మాఘనువ్రతము వేమఱుఁ జేయుచుఁ దన్నుగోరు నా
యన్నులమిన్నలం గలిసి యబ్రముగొల్పెడి రాసకేళులన్
గ్రన్ననఁ దేలి తృప్తిపడెఁ గౌఁగిళులన్ మఱిఁ జుంబనంబులన్. ౨౨౪

తే॥ ఇటుల నమరాంగనలతోడ నెల్లసురలు, క్రీడలాడిన మాడ్కి నాచేడియలను
గూడి బృందావనిన్ హరి యాడినకతఁ జెప్పితిని నింక విను వ్రజస్త్రీలకథల.

## — దివ్యాత్రిగుణవృత్తి గోపికోపాఖ్యానము. —

తే॥ శాంతి వీతిహోత్రాగ్నిభుక్సాంబ పావనశ్రిత శ్రీకర వ్రజనాథ గోప
తులను నుపనందు లావ్రజస్థలినిఁబుట్టి బలయశోధనసుతశీలకలితులైరి.

తే॥ వారిభవనంబులందు శ్రీపరమపురుషవరముచే దివ్యలును నదివ్యలును భూమి
గోపికలును త్రిగుణవృత్తిగోపికలును బుట్టిరో మిథిలేశ్వర! పుణ్యపురుష!

క॥ రాధాసమరూపంబును రాధాగుణవేషములను రాధావృత్తిన్
రాధానాథప్రేమయు రాధాస్నేహంబుగలిగి ప్రబలిరి వారల్. ౨౨౮

ఆ॥ ఒక్కదినమునందుఁ నక్కీర్తిసుందరీతనయ యైన రాధ వనజనయను
పైని ప్రణయకోప మూని యారాసేశు రాసరంగమందుఁ బాసియేగె.

తే॥ అంత శ్రీకాంతుఁ డదిగని యామెకోప మార్ప మానవతీ హృదయాపహారి
హోలికోచిత వేషంబుఁ గాలఁదోట కేగె వారదిగని రాధ కిటుల ననిరి.

మ॥ కరభోరూ! వ్రజసుందరీమణి! జగత్కల్యాణసంధాయినీ!
సరసుం డంబుజలోచనుం డమృతనిష్యందాస్యుఁడుర్ బాలభా
స్కరసామ్యాంగదమాలికుండలప్రృథు గ్రైవేయకావాపకో
ద్ధురుఁడుర్ హేమపటుండు నౌ హరి యదే తోఁటెంచె వీక్షింపుమా! ౨౩౧

శా॥ అభీరాగసుకుంకుమాదిరసలిప్తాకారుఁడై రాసకే
ళీభాగ్యానఖిలాలనుంచుకనయి చెల్వొప్పు హోలికోద్ధర్షమం
దాభోగంబును జెంద నాతఁ డల యుద్యానంబునన్ వంశితో
నాభాషాసతి మెచ్చఁ బాడెడి సఖీ! యాహ్వైపురం జూడుమా! ౨౩౨

ఉ॥ నల్లనిముంగురుల్గలిగి నవ్యవయోన్మదఘూర్ణితాక్షుఁడై
నల్లనిరూపునన్ వెలిఁగి నాతుల ప్రీతికి మూలబంధమై
యుల్లస ముల్లమం దలర నొప్పిన యప్పరమేశుఁ గాంచుమా!
సల్లలితానురాగమునఁ జయ్యన నాతనిపొంత కేఁగుమా! ౨౩౩

ఉ॥ లెమ్ము ద్రుతంబునం జనుము లేమలచేతఁ బ్రదీయదమ్మదే
హమ్ము నలంకరించు మలయుత్తమగంధము పుష్పవాసలన్
ఘుమ్మనునట్లు జేయు మిఁక గోపము వీడుము కృష్ణచంద్రు మో
దమ్మునఁ గూడి రాసముల దద్దయు జేయుము రాధికాంబరో! ౨౩౪

ఉ॥ ఈసమయంబు మంచిదని యెంచుము క్రమ్మఱ నిద్దిరాదు సం
తోసముతోడ నుండు మనఁదోయజలోచనయైన రాధ చే
టీసముదాయముం గలిసి టెక్కున హోలిమహంబుఁ గాంచు వే
రాసను లేచి కిన్కవిడి యావనికేగె ననంతరంబునన్. ౨౩౫

వ॥ పూర్వోక్తలును, దక్షిణిలలామలును, గుంకుమపంకముదగోరోచనా హరిద్రాగురుకస్తూరీశ్రీఖండాది రసపూరితదృతిసమేతలునునగు నా వ్రజాంగన లంగద పాదాంగద కాంచీకంకణ తాటంకహారతారా ద్యాభరణంబులం దాల్చి వచ్చని వలువల ధరించి స్వీయకోమలశోణహస్తంబుల నాభీరారుణచూర్ణమ్ములు గైకొని భూనభో భాగంబులు సంధ్యారాగంబు విడంబించునట్లు లెడఁజల్లి కోకిలస్వనంబుతో హోలికా గీతంబుల గానం బొనర్చుచు ఫుల్లసరోజలోచనుండగు వల్లవకులజలధిహల్లకప్రియు పై వసంతంబుఁ బోసి కుంకుమపటీరాగసుచూర్ణములను బలుమఱువిసరి యొకసక్కి యమాడుచుఁ జనవుమీఱ డాయుచు నడుమనడుమ భయంపడుచు నాతని నగు మొగంబును ముద్దులాడుచు యథేష్టంబుగా విహరింపుచుండ నక్కమలాక్షుండును

మిక్కిలి సంతసించి యా సతీమణుల కంబుజ కన్నిహపులతో దైవారిచూపఱు తటిద్ఘనులని యగ్గలంబుగ నగ్గింప రాధాదేవితోడంగూడి తమత్సవంబు సంపూర్ణంబుగా నడిపించి తద్ధస్తకృతా క్తనేత్రుండై స్వకీయంబగు నుత్తరీయంబును గుఱుతుగా నా విరిఁబోఁడుల కొసంగి యటనుండి వెడలి నందభవనంబున కేగె. వెండియుఁ బురుషార్థప్రదంబగు దేవకన్యాగోపికాచరితంబు వినిపించెద వినుమని యిట్లు చెప్పందొడంగె.

## —♦ దేవకన్యా గోపికోపాఖ్యానము. ♦—

ఉ॥ ప్రాలుఁగదా కుబేరసమరైరుచిరుండు వ్రజప్రభుండు గో
పాలుఁడు కీర్తివంతుఁడు దివస్పతినాయకవీరుఁ డొక్కవే
గోలలఁ బెండ్లియాడి బుధకోటులు మెచ్చఁగ ధర్మపద్ధతిన్
మాలవదేశమేలుచు సమస్తసుఖంబులఁ బొందుచున్ ప్రభూ! ౨౩౭

తే॥ అతఁడు సంసారజనితపాపాబ్ధినీఁదఁజాలినది ముజ్జగంబులన్ సజ్జనసహ
వాసనౌకయ యొక్కటి వఱలెనంచు విజ్ఞులగు బ్రాహ్మణులచేత విని కడంక.

తే॥ అఖిలభార్యలఁ దోడ్కొనియాత్మగృహము
నుండి వెడలి క్రమంబుగాదండివైన
తీర్థములఁగాంచి సేవించి దివ్యమధుర
కేగి యందలి వింత లెన్నెన్నొ చూచి. ౨౩౯

తే॥ గోకులంబున బుధుఁడు యోగ్యుండు నైన నందభూపుఁడు గలఁడని నాగరకుల
వలన విని యా యశోదేశు పజ్జకరిగి కనియు బృందావనశ్రీనిఁ గాంచి యవల.

క॥ నందుని యానతిఁ గొని యానందముతో రమ్యయోజనద్వయదేశం
బొందుచు బృందావనిలో మందిర మొక్కండుగట్టి మనికి నొనర్చెన్. ౨౪౧

క॥ బృందిష్టంబగు గోష్ఠం బందముగా నొకటి గట్టి యాతఁడు దివిష
త్సందోహాధిపువలె నానందముతో నుండ నిజజనంబులతోడన్. ౨౪౨

క॥ దేవలవాక్యముచొప్పున దేవాంగన లాత్మజలుగ దివ్యాకార
వ్యావృతలై పుట్టియు సితజైవాతృకుపగిదిఁ బెరుఁగు సమయంబందున్.

క॥ మోహనరూపుండగు నా శ్రీహరినిం గాంచి మరులు జెంది వివశలై
యా హరినిం గూడుట కవ్యాహతవిధి మాఘమాసమందలి వ్రతమున్. ౨౪౩

ఉ॥ మోదముతో నొనర్చుటకుఁ బ్రొద్దున నిద్దుర లేచి భాస్కరా
ర్ధోదయవేళ నా యమునయొద్దకుఁ బోయి మునింగి యందు దా
మోదరచిత్రలీలల నొహో యన నుచ్ఛ్రియఫక్కి గానవి
ద్యాదయితామతల్లికయు హర్షముఁ జెందఁగఁ బాడి రయ్యెడన్. ౨౪౫

తే॥ తమ్మికంటి ప్రసన్నుఁడై తద్వ్రజాంగనలను జీరియు నిట్లనెఁ జెలువలార!
యీవు కోరెడి వరమేదొ యెఱుఁగఁ జెప్పుడీ యేనొసంగెద నెంతటిదైనఁ గాని.

చ॥ హరినుడి విన్న యా సతులు హర్షముఁ బొంది మహాత్మ! యారయన్
బరుఁడ వజుండ వాద్యుఁడవు బ్రహ్మవు మన్మథమన్మథుండ వ
క్షరుఁడవు మాన్యలభ్యుఁడవు కారుణికుండవు భూమిభారసం
హరుఁడవు సర్వనాయకుఁడవైన నినుం గను భాగ్య మబ్బెఁగా. ౨౪౭

చ॥ జలరుహనేత్ర! మాపయిఁ గృపం దయచూపి కటాక్షించె యున్నచో
జలజము జైత్రముల్ మురళి సంఘటితాంబర సుహాటకాంబరం
బులు నగ మోమునన్ నగవు మొలకలనెత్తఁగఁ బింఛమొప్ప భూ
షలఁ జెలువార సన్నుతుని చందమునన్ గనిపించుచుండుమీ. ౨౪౮

తే॥ ఇంతకంటెను బరవరం బెదియు వలదు శ్రీకరా! యన్న నాతఁ డంగీకరించి
హర్షమిడుచుండె సాంఖ్యాదులందలేని శౌరి భక్తవశుఁడయి చెన్నారఁడోకొ?

—♦ జాలంధరీగోపికోపాఖ్యానము. ♦—

క॥ మఱియును జాలంధరులగు తరుణుల చరితంబు నుడివెదన్ దీని వినన్
బురుషార్థంబులు గలుగును బరమును జేకూరునయ్య! బహుళాశ్వవిభూ!

తే॥ సప్తశైవలినీతీరసముపగతము సర్వసంపద్యుతంబు యోజనయుగాన్వి
తంబు సర్వకల్యాణప్రదంబునైన రంగనామకపురము వెలుంగుచుండు. ౨౪౯

క॥ ధనధాన్యసమృద్ధులతో ఘనుఁడౌ రంగోజినామకప్రభుఁ డా ప
త్తనమును బరిపాలించుచుఁ దనయులు మనుమలును గల్గి తనరు నరేంద్రా!

తే॥ అతఁడు హస్తినాపట్టణపతికి వార్షికంబుగా నూఱుకోట్లుద్బవంబులైన
మోహరీల్ గట్టుచుండును సాహసాంకజనకభూవర! వాఁడొక్కసమయమందు.

తే॥ వార్షికంబగు పన్ను గర్వంబుఁ జెంది ప్రభువరుండగు ధృతరాష్ట్రపతికిఁ గట్ట
కుండుటేకాక యాతనిదండకుఁ జని కలిసి మాటాడకుండె నక్కారణమున.

తే॥ హస్తినాపురనేతయు నాగ్రహించి శూరవరులైన పదివేలజోదుల నల
గోపనాయకుండైన రంగోజికడకుఁ బన్ను గొనిరండు పొండని పంప వారు.

చ॥ సరగునఁ బోయి సంకెలలఁ దత్పతిచేతులకుం దగిల్చియున్
గరముగఁ ద్రాళ్ళతో నతనిఁ గట్టి కరీంద్రపురంబుఁ జేర్చి వే
చెఱఁ బడవైచి తిట్టిరి కసిన్ బ్రహరించిరి కాని యాతఁ డా
కరినిగమాధినేత కొక గవ్వయు నియ్యఁ డదెట్టి దండియో. ౨౫౦

ఉ॥ ఇట్టులఁ గొంతకాలమది యేగఁగ నొక్క నిశీథమందు నా
దిట్ట మహాభయంకరము దీర్ఘముసౌ చెఱసాలనుండి తా
నెట్టులొ పాఱిపోయి తనయింటికిఁ జేరెను ధామణీశ్వరా!
జెట్ట లొనర్చు చేఁతలను శేషుఁడునైత మెఱుంగశక్తుఁడే? ౨౫౮

తే॥ పిదప ధృతరాష్ట్రుఁ డావార్త వినియు మరల
నాతనిం గట్టి తెచ్చుట కతిశయబల
సంయుతాక్షౌహిణీత్రయసైన్య మంపె
నంత నది యొక్కగడియలో నటకు నరిగి. ౨౫౯

క॥ రంగపురాధీశ్వరుఁడౌ రంగోజిని ముట్టడింప రాఁగా నతఁడున్
గ్రుంగక యక్షౌహిణితోఁ బొంగుచుఁ దద్రిపులతోడఁ బోరఁగఁ జనుచున్.

మత్తకోకిల॥ శాతహేతికృపాణముద్గరసంచయంబును వైరిపా
దాతికావళిపైని వేయఁగఁ దత్క్షణంబున వారు త
త్పూతరథ్యశతాంగకేతన శూరులన్ ద్రుటిలోన ని
ర్జితిగాఁ దెగటార్చి గోపకుఁ బిట్టుకట్టుఁ దలంచుటన్. ౨౬౦

ఆ॥ రంగపురవిభుఁడగు రంగోజి కనుఁగొని యుద్ధరంగము విడి యునికి కేగి
లేని చలము బలముఁ బూనుచుఁ గ్రమ్మఱఁ గొలఁది దినము లాజి సలిపి యవల.

ఉ॥ నాకు బలంబు లేదు మఱి నమ్మొటకుం దగినట్టి సైనికా
నీకము గూడ లేదిలను నేనిఁకఁ దక్కనటంచుఁ దోడ్తనే
కాకలమొందు చేతఁగొని కల్గిన వార్తల వ్రాసి దూతతోఁ
బ్రాకటదిగ్విజేత యదురాజగు కంసుని కంపె నావలన్. ౨౬౧

ఉ॥ దూత మనోజవంబున యదుప్రభుసన్నిధి కేగి భక్తితో
జోతలసల్పి యిట్లనియె శూరవరా! యొక జాబు వ్రాసి మీ
చేతికి నిమ్మటంచు రిపుసేవలచే వెతఁజెంది మీదు చే
యూఁతను గోరు రంగనగరోత్తమనాయకుఁ డంపె నన్నిటుల్. ౨౬౩

ఉ॥ కావున నిట్టి జాబు గొనిగాలివలెన్ జనుదెంచి మా విభున్
బ్రోవుము జాగు మానుము విరోధిభయంకరవీర! నీవు దీ
నావనతత్పరుండవు గదా యమరాసురమానవాళి ని
ర్జీవముగా నొనర్పవొకొ? చెప్పఁగలాఁడనె నీ సమర్థతల్. ౨౬౪

ఉ॥ ఆఁకటఁ బీడఁజెందు నరుఁడన్నము జూచెడి మాడ్కి దప్పిచే
నాకులమొందుచుండు జనుఁడంబువు గాంచెడిభంగి స్తోకకా
స్తోకము శారదాప్కణముఁ జూచెడిరీతిఁ జకోరకంబు దో
షాకరుఁ గాంచు నట్లతఁ డజస్రము జూచెడి మీదు రాకకై. ౨౬౫

ఉ॥ మీ రట కేగుదెంతురను మేలిమివార్తను నాలకించినన్
సూరునిఁ జూచి పద్మములు శోభను బొంది ముదంబుగాంచిన
ట్లారమణుండు సాకెకును హర్షము జెందఁడె? కంసభూవరా!
శూరవరాగ్రణీ! యనుచు జోతములం బొనరింప నాతఁడున్. ౨౧౬

తే॥ మానసంబున యోజించి మనుజభక్షకులగు కోటిదానవ్రులతోఁ గూడికొనుచు
రంగపట్టణపతియుద్ధరంగమునకు నేగి రంగోజిఁ గాచెదనే నటంచు. ౨౧౭

సీ॥ గోమూత్రసింధూరగోరోచనా మృగనాభిపత్రాంచితాననముతోడ
విశ్వభయంకరవింధ్యమహీధ్రసామ్యాయతోచ్ఛ్రాయ దేహంబుతోడ
నభ్రారవానుకార్యద్భుత శృంఖలా క్రమబద్ధ దీర్ఘ పాదములతోడ
శత్రునాశంకర చాణూరముష్టిక శలకూటముఖ నిజసఖులతోడ

తే॥ భీకరంబగు కువలయాపీడకరిని నెక్కి మదధారలున్ నెలయేళ్లుగాఁగ
గండపుటముల వెంబడిఁగాఱ వెడలి రంగపురి కేగె రిపులతోఁ రణముజేయ.

క॥ పదపడి యదుకులవీరులు మదమునఁ గుంతత్రిశూలమార్గణనిస్త్రిం
శదళములను బలుభంగులఁ గదనంబును సల్పిరి జనకధరాధీశా! ౨౧౯

ఉ॥ అత్తఱి బాణసంతస మాహవభూమిని గ్రమ్మఁ గంసుఁడున్
గత్తళమొండు వేసికొని కాఱడవిన్ జను చిచ్చువోలెఁ జే
రెత్తిన ముద్గరంబు గొనియెత్తెఁ గొఁకవసేనఁ జొచ్చి స
ల్లుత్తునియల్ బొనర్చెఁ బవితో హరి కొండలఁ గొట్టినట్టులన్. ౨౨౦

క॥ యదుపతి పదపడి పదముల నెదురులచురదములఁగూల్చి యిభములఁ దనదా
మదకరిచేఁ ద్రొక్కించియు సదమదముంజేసి తురగజాలముఁ దోల్తో. ౨౨౧

ఆ॥ వె॥ వైరివరుల దివికిఁ బొఱవైచియుఁ దిర్గి
కొనుచుఁ బరిహసించి గొడుగు లెక్కి
యముల ఛత్రచామరముల నరాతుల
మూఁపులందుఁ బెట్టి మోయ మనియె. ౨౨౨

సీ॥ ఘంటికానిస్వనక్రమగజంబుల గోటమీఁటెడి వ్యోమకుత్సితుండు
పశ్చిమాంఘ్రిద్వయబలమున మావులన్, ఘనులఁ ద్రోయును గేశికర్బురుండు
సాశ్వరథంబులన్ హస్తంబులనుబట్టి యట్టిటుల్ ద్రిప్పు వృషాసురుండు
ముష్టిబలంబున మొనకాండ్రతలలపై మొట్టికాయల వేయుముష్టికుండు

తే॥ మఱియు నానావిధంబులన్ మనుజభక్ష
కులగు దైత్యులు చెలరేగికలనులోన
జంపుచుండుట మిగిలినశత్రుసైని
కులు గనుంగొని పరుగిడిరులుకుఁ జెంది. ౨౨౩

ఉ॥ ఆజిభయంకరుండయిన యా యదువీరుఁడు శత్రుసేన లా
యోజఁ బరుంగిడన్ సలిపి యుద్ధము మాని స్వకీయసైన్యవి
భ్రాజితుఁడౌచు దుందుభులు బల్మఱు మ్రోయఁ గుటుంబయుక్తరం
గోజ్జనిఁ గొంచు నామధురకుం జనె మిత్రులు మెచ్చ నిచ్చలన్. ౨౬౪

చ॥ అల ధృతరాష్ట్రభూమివిభుఁ డాత్మసరాజ్యము మాలకించి యో
ధుల నిసుమంత దూఱి రిపుదుర్భరదోర్బల గర్వభంగమున్
సలుపఁగ నిశ్చయించుకొని చక్రిని కాలము గుఱ్తెఱుంగఁగాఁ
బలుమఱు వేగులన్ బనిపి వార్తలెఱుంగుచునుండె భూవరా! ౨౬౫

తే॥ అంతఁ గంసుండు గోకులంబందు బర్హిషదమ నెడిపురి రంగోజియమువిభునకు
నిడఁగ నాతండు గైకొని యెలమితోడ వాసమును జేసె నిజకుటుంబమును గూడి.

తే॥ ఈరహిన్ గొన్ని దివసంబులేగ నతని లలనలందున జాలంధరులును హరివ
రమునఁ బుట్టి మనోజ్ఞలై విమలచరితల గోపకులఁ బెండ్లియాడియుఁ గోర్కితోడ.

తే॥ జారధర్మంబుఁ జేపట్టి చక్రపాణితోడ స్నేహించి రద్దానఁ దోయజాక్షుఁ
డట్టి బృందావనంబున నాసతులను రాసములఁ దేల్చెఁ జైత్రికమాసమందు.

## —♦ సముద్రకన్యకాది గోపికోపాఖ్యానము. ♦—

వ॥ మఱియు నాగోకులంబునందు శోణపురాధీశ్వరుండును, శ్రీమతుండును, ధీమంతుండును, నీతిమంతుండును, సర్ధవంతుండును, బలవంతుండునగు నందుండను గోపకుం డైదువేలయతివలం బెండ్లాడి యింద్రభోగంబు లనుభవించుచుండ నతని సతులయందు శ్రీమత్స్యమూర్తి వరంబున నపాంపతిసముద్భవలగు ముగుదలును, బృథ్వీదోహనంబునఁ జిత్రవిచిత్రౌషధులను, బృథువరంబున బర్హిష్మతీపుర భామినులును, నరనారాయణమహామునివరంబున నచ్చరలును, వామనుని వరంబున సుతల నివాసినులగు విలాసినులును, శేషుని వరంబున నాగకన్యక లుద్భవిల్లిరి. అవ్వారలకు మహాయోగిపుంగవుండగు దుర్వాసుం డద్భుతమహిమోపేతంబును, వాంఛాప్రదంబునునగు యమునాపంచాంగంబను మహామంత్రంబు నుపదేశింపఁ దల్లతాంగులు శ్రీకృష్ణప్రీత్యర్థంబై నిశ్చలభక్తితో నందనందనమహిషియగు నాకళిందనందనను బూజించి యామంత్రం బుపాసింపఁ దద్ధునీశ్వరి ప్రసన్నయై యడిగిన వరంబుల వారి కొసంగె. తదుపరి మదనమోహనుండగు నా శ్రీకృష్ణుండు మాలతీమల్లికాపారిజాత కేతకీపద్మకువలయముఖకుసుమపరిమళభరితంబును, గోకిలపుంస్కోకిలకోక కేకీ శుక పిక మరాళపాళి మధుస్వనమనోహరంబును, మధుపధ్వనిమధురంబును, గాళిందీజల కల్లోల కోలాహలసమాకులంబును, వసంతలతికామనోహరంబును, జిత్రవిచిత్రంబును, బవిత్రంబునుఁ గల్యాణకరంబునగు బృందావనంబందు మలయమారుతంబు మంద

గతిని విసరఁ గల్పవృక్షాంతికంబునం జెలంగు కదంబతరుమూలంబున నొంటిగా వ్రేల లంగూడి మధుమాసంబునందు మోహపాశబద్ధంబును, గోపికామనోరథానుకూలంబు నగు హోలికోత్సవం బారంభించె. అంత నాయింతులా యనంతునితోఁ బ్రశ్నలకుఁ బొనర్చి సంతుష్టాంతరంగలైరి. అత్తఱి రాధాసహితుండగు కృష్ణుండు రతితోఁ గూడు పుష్పబాణునిఁ దిరస్కరించుచుఁ దేజరిల్లె. మఱియు నా నాగకన్యకలు బల భద్రరూపుండగు హరిసంగూడి తదుత్సవంబు దివిజనేత్రపర్వంబుగాఁ గావించి సంతసించిరిగాదె? దేవరాజబ్రహ్మర్షివరేణ్యాదుర్లభుండగు భాగవానునిగూడు చేడియల భాగధేయం బింతింతయని చెప్పఁగలనే? భూపా! పాపహరంబగు గోపికలచరితం బుల వినిపించితి. ఇంక నీవేమి వినవలతువో తెల్పుమని యడుగ నారదునకు జన కుం డిట్లనియె.

తే॥ నారదా! యట్టి గోపీజనముసకల్ల యనఘుఁడైన మహ్యాసుఁడౌ మునివరుండు
యమునాహ్లాదరీపంచాంగమమలబుద్ధి నిచ్చెనని చెప్పితివి దైనవిప్ప డీవు.

—♦ యమునా పంచాంగము. ♦—

మ॥ సదయాంతఃకరణుండ వౌచు యమునాసౌభాగ్యపంచాంగ మె
య్యదియో దానినెటుల్ జపింపవలెనో యద్దానిచే నేఫలం
బొదవుర్ మున్నిది యేనృపల్వి రను సర్వోదితముల్ బల్కవే!
మది యానందమహాసుధాజలధిలో మగ్నంబుగా నారదా! ౨౮౧

మ॥ శ్రుతులారన్ విని దేవమౌనియు నిటుల్ సూచించె సిద్ధాని కొం
డితిహాసంబు విదేహరాజునకు "భూమీశా! యయోధ్యాపురీ
పతియున్ రాజవరుండు దివ్యధనియున్ బాహాబలాఢ్యుండు స
న్మతిమంతుండును సత్ప్రవర్తకుఁడు నా మాంధాత నా నొప్పెడిన్. ౨౮౨

ఉ॥ ఆ యనఘుండు వేటకయి యాత్మగృహంబును వీడి కానకున్
జాయఁగఁ జేరి తిర్గ చలసౌభరినామకమౌని యాశ్రమం
బాయతబృందకావనమునందుఁ జెలంగుట గాంచి మెల్లఁగా
నాయెడకేగి యల్లుఁడగు నా మునికిన్ నతిఁజేసి యిట్లనెన్. ౨౮౩

శా॥ మౌనీ! నీవు పరావరజ్ఞుఁడ వసామాన్యుండ వార్యుండ వ
జ్ఞానాంధాన్వితలోకభాస్కరుఁడవో జామాత! యీవిప్పు డె
ద్దానన్ రాజ్యసుఖంబులన్ జెలఁగి యీ దైత్యారిసారూప్యమున్
సానందంబుగఁ జెందఁజాలుదునో నా కద్దాని వాక్రువ్వుమా! ౨౮౪

క॥ అనవుడు సౌరభి యిట్లనె వినతారక లెంతకాల మెసఁగెడినో యం
దనుకను రాజ్యంబిడి తుద వనమాలినిఁ జేర్చు యమునపంచాంగంబే. ౨౮౫

క॥ వివరించెదనని వినుమా స్తవ పటల సహస్రనామసరణికవచముల్
గవిసిన నది పంచాంగ మని విబుధు లనుచుందురు తరణికులశశాంకా!

తే॥ అనఁగ మాంధాత క్రమ్మఱ నడిగె నిట్లు
సౌభరీ! యమునాకవచంబుఁ దెలుపు
మది యనుష్ఠింతు భక్తితో ననఁగ మునియు
మఱియు నిట్లనె నతనితో మానవేంద్ర! ౨౮

తే॥ సర్వరక్షాకరంబును సకలశుభదమైన కాళిందికవచంబు ననెద వినుమ!
యగ్రజుండు చతుర్భుజ నబ్జనయన స్యందనస్థను శ్యామను యమునఁ దలఁచి.

తే॥ శైవలినియందు వేకువఁ జలకమాడి
సిగను ముడిచియుఁ బూర్వదిక్కుగఁ గుశాస
నమునఁ గూర్చుండి సంధ్య సక్రమముగాను
సల్పి కవచమిద్ది చదువనగును. ౨౯

## —♦ యమునా కవచము. ♦—

సీ॥మా॥ యమునాస్రవంతి శీర్షమును రక్షించుత కృష్ణ కన్నులను రక్షించుఁగాత
శ్యామయు భ్రూదేశ మోముత నాసికఁ స్వర్గవాసినియుఁ గాపాడుఁగాత
దాడల రక్షించుతఁ మోదరూపిణి హృది మహావాహిని యేలుఁగాత
జక్రివామాంసజ శ్రవణముల్ బ్రోచుత గాళింది యధరముల్ గాచుఁగాత
రవిసుత చిబుకంబు రక్షించుతఁ యమభగిని కంధరము గాపాడుఁగాత
కృష్ణప్రియాంగన పృష్ఠంబు బ్రోచుతఁ భుజములఁ దటినియుఁ బ్రోచుఁగాత
నూరువుల్ రంభోరు వోముతన్ జానువుల్ పాదభేదినియుఁ గాపాడుఁగాత
ఘుటికలఁ బ్రోచుత గోర్కి రాసేశ్వరి కలుషహారిణి కాళ్ళఁ గాచుఁగాత
నంతర్బహిరధోర్ధ్వహరిదుపదిశలన్ బ్రపూర్ణతమప్రియ బ్రోచుఁగాత

తే॥ సర్వదా సర్వథా సర్వసమయములను జక్కఁగాఁ బ్రోచుఁగావుత సకలలోక
మాత మాతల్లి మాకిటఁ బ్రీతితోఁ బ్రసన్నయై మ్రొక్కులంగొని సాకుఁగాత

క॥ ఇది యమునాకవచంబును బదిమాఱులుఁ బరమభక్తిఁ బఠియించిన య
ట్టిదరిద్రుం డల ధనదుపగిది ధనియై వఱలి కడకుఁ గేవలమందుఁ. ౩౧

తే॥ బలియు బుద్ధిమంతుఁడు నైనబ్రహ్మచారి
నియతితో మితాశనుఁడయి నెలలు మూఁడు
జరుగునందాక దీనినిజదువ నాతఁ
డఖిలరాజ్యాధిపత్యంబు నందఁగలఁడు.

తే॥ మూఁడునెలలలో నిశ్చలబుద్ధి నిద్ది నూటపదితడవలు మంచిచోటునందుఁ
జేరి చదివిన వారికి సిద్ధిగానివిషయమేదియు నుండదో విమలచరిత! ౨౯౩

తే॥ ఎవఁడు ప్రొద్దున మేల్కాంచి కృష్ణదర్శనాదికారణమగు దీనినధికభక్తిఁ
జదువునో యాతఁ డైహికసౌఖ్యములను జెంది గోలోకమున కేగిచెన్నుమీఱు.

తే॥ అనఁగ మాంధాత యిట్లనె యమునయొక్క
సర్వసిద్ధికరంబగు స్తవముఁ బలుకు
సౌభరీ! యన్న నాతఁడాజనవిభునకు
స్తవము నుడువంగఁ దొడఁగెనో జనకరాజ! ౨౯౫

## —♦ యమునాస్తోత్రము. ♦—

తే॥ పద్మనాభవామాంససంభవకుఁ గొల్పు కృష్ణకాజకుజోతంబు శ్రీకృష్ణరూపి
ణికి జోహారువు కాళిందినిర్ఝరిణికి జాగిలిఁ భక్తితోడుత సల్పుచుంటి.

క॥ సిలుగు సుజనులకుఁగూర్చెడి తులువలు గాముకులునైనదుష్టులు త్వద్భ
క్తులుగానై రేఁ వారిని సలలితమతి సాకు నీకు సల్పెదఁ బ్రణతుల్. ౨౯౭

తే॥ కృష్ణ! కృష్ణస్వరూపపు పృథుతరంగ
ములను గూర్మావతారుఁడు సెలఁగుచుండుఁ
బ్రలయమున మత్స్యమూర్తియై నిలుతువుప్రతి
బిందువందుగోవిందుఁడు వెలుఁగుచుండు. ౨౯౮

శా॥ అమ్మా! దేవపురుల్ యథాయథలుగా నబ్జోద్భవాండంబు ఖం
డమ్ముల్ గాఁగ గిరీంద్రభూమిరుహకుడ్యశ్రేణిదుర్గోరుకూ
లమ్ముల్ గూల జవంబునన్ విరజ నుల్లంఘించి లోకమ్ముఁ బూ
తమ్ముగ్ సల్పుచుఁ బాఱుచుంటివివె జోతల్ నీకు లీలావతీ! ౨౯౯

శా॥ ఫుల్లాబ్జాయతనేత్రవామభుజసంభూతా! విభూతీశ్వరీ!
తల్లీ! గోపకగోపికాసురభివత్సశ్రేణిసంరక్షణా
భ్యుల్లాసా! యరవిందమిత్త్రితనయా! పూతా! జగన్మోహినీ!
కల్లోలాకర! మేఘవర్ణరుచిరా! కావింతు నీకంజలుల్. ౩౦౦

ఉ॥ జీవనజోత్పలాదిబహుచిత్రసుమంబులఁ జూత నారికే
ళావనిజంబులన్ మిగుల హర్షముగూర్చెడి తీవెలన్ బ్రమో
దావహమైన కుంజముల నందముఁ జెందెడి బృందకావనిన్
శీవిఁ దలిర్పఁ జేరుచుఁ గడిందిగ మెచ్చెడి నిన్నుఁ గొల్చెదన్. ౩౦౧

సీ॥ కోవిదదుర్లభ! గోలోకమున నీవె యుత్తమవై సతముండువమ్మ!
బాధాకరంబులౌ పాపాఘువులకెల్ల దర్పోకరంబవై తనరితమ్మ!
గోవిందసంగతగోపకగోపికాకుర్దనకలితవై కుదిరితమ్మ!
జలలోలకల్లోలసంచయకోలాహలాంచితవై లలి నలరితమ్మ!

ఆ॥ సకలజగములందు సౌందర్యవతివమ్మ! సుమతివినుతవమ్మ! విమలరూప
వమ్మ! యాదిదేవునర్ధాంగివో యమ్మ! నిన్ను నమ్మియుంటి నన్నుఁ బ్రోచు.

క॥ యమునానామముఁ దాల్చితి వమరులు మీపేరుఁ దలఁచి యఘనగములఁ జూ
ర్ణము గావింతురు తల్లీ! యమభగినీ! భక్తి నిన్ను నారాధింతున్. 303

ఆ॥ నీకు నన్నయైన యాకృతాంతుండును నిన్ను దలఁపనట్టి నీచజనుల
నరగఁ గొట్టగన్ బ్రచండనాముండయి దండముఁ గొని పురిని మెండుదిరుగు.

తే॥ విషయకూపముల్ బడి వెతలఁగుడిచి వేసరున్ విసువొందెడి వెట్టుల పయి
నీ కటాక్షరజ్జువుబడ్డ నిముసమున నె లేచి వారు కేవలమునుజూచుచుంద్రు.

తే॥ శ్రీవిరాణ్మూర్తి విస్తృతశీర్షమందు వేణిరూపకమాలగా వెలుఁగుచుంటి
వమ్మ! నీగుణమందు నావంత యేని శేషుఁడున్ వర్ణనంబునుజేయఁగలఁడె?

తే॥ ఇట్టి నీవు కృపామతి నెచట నెచటఁ బాఱుచుందువో యందందు వఱలు నరుల
భాగ్యమేమని చెప్పనో భానుతనయ! మోడ్పులొనరింతుఁ గైకొనిప్రోవవమ్మ!

తే॥ ఇట్టి యమునా స్తవంబును నేజనుండు వేకువను లేచి పూర్వోక్తవిధిగ భక్తి
జపువునోవాఁడు జగతికిసౌఖ్యమొసఁగి భోగములఁబొంది గోలోకమునకు నరుగు.

## —♦ యమునా పటల పద్ధతులు. ♦—

వ॥ అనవుడు మాంధాత యానందించి మహాత్మా! యనుగ్రహించి కామ
ప్రదంబులగు కాళిందీపటలపద్ధతులను బోధింపవేఁడెదనన నమ్మునివరుండు విని జన
వరా! తద్యమునాపటలంబున కాదియందుఁ బ్రణవంబునుజేర్చి మాయాబీజం బుద్ధ
రించి రమాబీజం బనుసంధించి కాళిందీదేవి యనుదానిని జతుర్థ్యంతంబుగాఁజేసి
దానికి నమశ్శబ్దంబు గూర్చిన మహామంత్రంబగు. తన్మంత్రం బేకాదశలక్షావృత్తులు
జపించిన సిద్ధించి వాంఛాప్రదంబును శుభకరంబునగు నొక్కసింహాసనంబున షోడశదళ
పద్మంబును వేసి మధ్యభాగంబునఁ గర్ణికను జిత్రించి యమునాసహితుండగు శ్రీకృ
ష్ణుని మనోహరంబుగాలిఖించి పూర్వోక్తకమలంబునందలి షోడశదళంబులందు గంగా
విరజా, కృష్ణా, చంద్రభాగా, సరస్వతీ, గోమతీ, కౌశికీ, వేణీ, సింధు, గోదావరీ,
వేదస్మృతీ, వేత్రవతీ, శతద్రు, సరయూ, ఋషికుల్యా, కకుద్మినులను నదులను వేఱు

వేళుగాఁ దత్తన్నామమంత్రంబులతో షోడశోపచారంబుల నర్పించి క్రమంబుగా దిక్చతుష్టయంబునను బృందావన, గోవర్ధన, బృందా, తులసీ, దేవతలను స్థాపించి, యా మంత్రనామంబులతోఁ బూజించి భగవతియుఁ గళిందనందినియు, సూర్యసంజాతయు, యమభగినియు, శ్రీకృష్ణ ప్రియయు, యూథీభూతియునగు యమునకొఱకని మాటిమాటికి నుచ్చరించుచు నావాహనాద్యుపచారంబులం గావించి పైని చెలిపిన మహామంత్రంబు జపింపందగు. ఇట్టి దత్పద్ధతి యెట్టిదనిన తన్మంత్రపురశ్చరణంబు సిద్ధించునందాఁక బ్రహ్మచారియై మౌనంబుఁదాల్చి యవభోజయుఁగాని పస్తాశనుండుఁగానియై నేలఁబరుండి యింద్రియంబులను జయించి కామక్రోధాదులఁ దూరీకరించి సమర్థుండగు దేశికుని నేర్పాటుజేసికొని తదాజ్ఞానుసారంబుగా బ్రాహ్మ్యముహూర్తంబున మేల్కాంచి యమునను సన్నుతించి కాల్యంబులందీర్చి యరుణోదయంబున నద్యాదులందు స్నానం బొనరించి నిత్యంబులగు జపతపంబులఁ నిర్వర్తించి తన్మంత్రం బనుష్ఠింపందగు. మధ్యాహ్నంబగుడు సంధ్యానంతరంబొనర్చి నియమపూర్వకంబుగా నుండందగు. తన్మంత్ర పురశ్చరణసమాప్త సమయంబునం బుత్రవంతులగు దశలక్షబ్రాహ్మణులను గంధపుష్పాక్షతాదులతోఁ బూజించి షడ్రసోపేతంబగు మధురాన్నం బిడి జాంబూనదపాత్రాంబరాభరణ దక్షిణల నొసంగి సంతుష్టులం జేయందగు. ఇట్లాచరించిన నామంత్రంబు సిద్ధించి బుద్ధిగతాభీష్టంబులను సిద్ధింపఁజేయు. సందియ మౌనంతయు లేదు. నీవు ననుష్ఠించి సర్వసుఖంబులఁ బొందుమని యుపదేశింప నారాజవరుండు, కంగా

ఆ॥ అరుసమొంది ధీర! యమునా సహస్రనామనుతిగూడఁ జెప్పి మనము వొంగఁ
జేయ వేఁడితినన నా యోగివర్యుండు వలుకఁదొడఁగె నిట్లు పార్థివేంద్ర!

వ॥ భూరమణా! యీ మంత్రంబునకు సౌభరిమహర్షియు, యమునదేవతయు ననుష్టుప్ఛందంబును, మాయాబీజము కీలకంబును, రమాబీజంబు శక్తియు గలదు. ఈ నామస్తోత్రంబుఁ బఠించుటకు ముందుగా "శ్యామామంభోజనేత్రాం" అను దానితో ధ్యానంబొనరించి "కాళింది" యను నామంబు మొదలు "సర్వతీర్థాధిదేవత" యను నామంబువఱకుంగల వేయినామంబులఁ సక్రమంబుగాఁ జదువవలగు. ఇట్టిస్తోత్రం బొకమాఱు సల్పినవాని గృహంబునందుఁ జౌర్యంబును, దెండుసారులు జదివిన హాని కెట్టి ప్రదేశంబుననైనను ఘోరవ్యాఘ్రాది భయంబులు గలుగనేరవు. శుద్ధద్వితీయయందు దిద్దానిని బ్రారంభించి పూర్ణిమలోపలఁ బదితెడవలు పఠించిన రోగి రోగంబునుండియు, బద్ధుఁడు బంధనంబునుండియు విముక్తులగుదురు. గర్భిణి సుకుమారునిం గాంచు. విద్యార్థి సకలవిద్యలందుఁ గుశలియగు. మోహన స్తంభనోచ్చాటనఘాతనశోషణదీపనోన్మాదనతాపననిధిదర్శనవశీకరణంబులందు నేర్పును మనోగతంబులగు నిష్టంబులను సిద్ధింపఁ జేయు. దీనిని విధివిధానంబుగాఁ బారాయణం బొనరించిన బ్రాహ్మణుండు బ్రహ్మవర్చస్వియు, రాజన్యుండు సర్వరాజ్యాధిపతియు, వైశ్యుండు ధనాధిపతియు నగు. ఇది బ్రాహ్మణముఖంబుగాఁ దన్మహి

మంబు వినిన శూద్రుండును నిర్మలుండై మోక్షార్హుండగు. నిత్యంబును భగవత్పూజాకాలంబున నిద్ది చదివినవారు పుష్కరంబున స్నానంబు వొందియు నీరంటనట్లు సంసారమందుండియు తజ్జనితపాపంబు నంటఁడు. ఇది యొక సంవత్సరంబువఱకు నూరుమాఱులు ప్రత్యహంబుఁ జదివిన సప్తద్వీపవలయితంబగు నిమ్మేదిని నేకచ్ఛత్రాధిపతియై పరిపాలించుననుట కనుమానంబులేదు. నిష్కామియై యెవఁ డిది చదువునో వాఁడు పురుషార్థంబులంబొంది జగతిం బేరొంది జీవన్ముక్తుండగు. మఱియు నిది సావధానంబుగాఁ జదివినవా రఖిలసుఖంబులం గాంచి యంతిమంబున గోలోకంబున కరుగఁగలరని పలుక నా మాంధాత యాలించి యలరి మునికి నతులిడి నిజరాజధాని యగు నయోధ్యాపురంబున కేగెఁ గాదె! యింకను నీవేమి వినవలతువో తెలుపుమని యడుగ జనకుండు నారదున కిట్లనియె. ౩౧౧

తే॥ పుణ్యవశమున గోకులంబున జనించి
నట్టి సుకృతుల గాథల నల్ల యరక్షి
పుత్రి పంచాంగముఁ విం టి భూసుర ! మఱిఁ
గృష్ణుఁ డం దేమి సేసెనో యెఱుఁగఁ జెపుము ! ౩౧౨

## —♦ ప్రలంబాసుర వధ. ♦—

ఉ॥ నారదుఁ డద్ది వించు జననాథున కిట్లనె నొక్కవేళలో
శ్రీరమణుండు భ్రాతయగు సీరిని గూడుచు గోసమూహముల్
బారులుగట్టి నేత్రయుగపర్వముగాఁ జనఁ ద్రోలు చల్ల భాం
డీరవనంబుఁ జేరి యట లీవిగనుండెడి నొక్కచోటునన్. ౩౧౩

తే॥ గోవులను మేయఁ ద్రోలియుఁ గోఁడెకాండ్రఁ
గలసి వాహ్యవాహకరూప లలిత కేళి
నాడుచుండెను కంసుచే నంపఁబడిన
యల ప్రలంబ నిశాచరుఁ డట్టితఱిని. ౩౧౪

ఉ॥ గోపకబాలకుం డగుచుఁ గుర్దనలాలసులైన వారితో
శ్రీపతి చూచుచుండఁగనె చేరి ముదంబున నాడుచుండె నీ
రూ పల గోపబాలకు లెఱుంగక పోయి రనంతరంబునం
దా పురుషోత్తముండు గని యందఱ కియ్యది దెల్పె నత్తఱిన్. ౩౧౫

ఆ॥ ఆటలందు గెల్చినట్టి నీలాంబరు నోడినట్టి కుఱ్ఱఁ డొకఁడు గూడఁ
బందెమేసికొన్న భంగి మోయఁగలేక యుంటఁగను ప్రలంబుఁ డొప్పికడఁక.

ఉ॥ సీరిని స్వాంసలాసమునఁ జేకొని పైనమొనర్చి యట్టి భాం
డీరవనంబు నుండియు వడిన్ యమునాతటినీతటంబునన్
జేరిచి యందునుండి మఱిఁ జెల్వగు శ్రీమధురాపురంబునన్
జేరుట కుద్యమించుతఱి సీరి గనుంగొని యాక్షణంబునన్. ౩౧౭

చ॥ ఘనసమమైన రూప మధికంబుగఁ దాల్చి ధరాధరేంద్రము మా
డ్కిని బహుదుర్గముండయి తటిత్సహితాభ్రగతప్రపూర్ణచం
ద్రునివలె దైత్యపృష్ఠమునఁ దోఁచి వెలుంగఁదొడంగె దీప్తిదీ
ప్తనవమణిప్రకాశిత సువర్ణమయాభరణంబులన్ మఱిన్. ౩౧౮

ఉ॥ చండపరాక్రముం డయిన చక్రిసహోదరుఁ డాప్రలంబుఁ డు
ద్దండభయంకరుం డగుటఁ దాఁ గని వేగమ వానిఁబట్టి యా
కొండలఁ గొట్టు నింద్రునవలె గ్రుద్ది శిరంబును జెండివైచె బ
ల్దండిగఁ బూలవాన విబుధప్రతతుల్ గురియంగ భూవరా! ౩౧౯

ఉ॥ అంతట వాని జోతియును నా బలరామునిలో లయించె న
త్యంత జయధ్వనుల్ దివిని ధాత్రిని నిండె నరేంద్ర! యన్న భూ
కాంతుఁడు దిర్గి యిట్లు పలుకందొడఁగెన్ మఱి వాని పూర్వజ
న్మాంతర పుణ్యగాథను దయామతి నాకు వచింపవే సుధీ! ౩౨౦

—♦ ప్రలంబాసుర పూర్వజన్మ వృత్తాంతము. ♦—

చ॥ సురముని తిర్గి యిట్లనె యశోధన! తొల్లిఁ గుబేరుఁ డిందుశే
ఖరపదపద్మపూజకు స్వకంబగు చైత్రరథంబునందునన్
విరులను రక్షసేయఁగఁ బ్రవీణతఁ గాంచిన యక్షవర్యులన్
వఱల నొనర్ప నాభటులు భద్రముగా గనుచుండి రింతలోన్. ౩౨౧

తే॥ ఒక్కదినమందు నేర్పరి హూహూ వనెడి వానికొమరుడు శ్రీహరి భక్తవర్యుఁ
డు నగు విజయుఁడన్ గంధర్వజనుఁడు హరిని వేణువీణాకళంబులన్ వీధి వీధి.

ఉ॥ స్తోత్రముఁ జేయుచున్ ధనదు తోటను నెవ్వ రెఱుంగనట్లుగా
నాత్రముతోడఁ జొచ్చి విరులన్నిటిఁ దిన్నగఁ గోసికొంచు నే
మాత్రపు సద్దులేని యటు మంచినడన్ జనె నంత దాని నా
చైత్రరథేశ్వరుండు గని చాల విచారముఁబొంది కిన్కతోన్. ౩౨౩

చ॥ అరరె! యిటుల్ మదీయవనమందునఁ జేరి సుమంబులన్నిఁటిన్
బొరిఁబొరిఁ గోసి కైకొనుచుఁ బోయె నెటో యల తెక్కరీఁడు త
న్నర సురయక్షకిన్నర గణస్థితుఁడైన ఘనుండునైన ను
ద్ధురమగు నాదు శాపమునఁ దోడ్తనె రక్కసుఁ డౌచుఁ బుట్టుతన్. ౩౨౪

చ॥ అని శపియించెఁ దద్విధిని నా విజయుండు నిశాటరూపమున్
దనకు ఘటిల్లుచుండ నదాటునఁ గాంచి యకృత్యమెంచి తో
డ్తనె యల గుహ్యకేశ్వరునికి దాఁపునకుం జని తత్పదంబులన్
వినయవిధేయతల్ గలిగి వేమఱుమ్రొక్కి నుతించి యిట్లనెన్. ౩౨౫

తే॥ తప్పఁ బొరపాటుచే నిప్డు తాఁకోపవనమునందునఁ జేసితి ధనద! నేను
రాక్షసాకృతితో ధరన్ బ్రమరఁజాలఁ గాన మన్నించి ప్రోవుము కరుణతోడ.

తే॥ అనఁగ నా నరవాహనుఁ డభినుతించి ద్వాపరాంతమునందున వాసుదేవు
నన్నయగ్రజా బలభద్రుని హస్తములను శాపముక్తుఁడ వగుదువో సరసహృదయ!

తే॥ అనుచుఁ గరుణించెఁ దత్సూక్తి నా విజయుఁడు,
దైత్యుఁడై ప్రలంబాఖ్యతోఁ ధరణిఁ బుట్టి
యచ్యుతాగ్రజ హస్తసంహతుల శాప
ముక్తుఁడై పరమొందె నో పుణ్యపురుష! 3౨౮

—♦ కృష్ణుండు దావాగ్నిని మ్రింగి గోపకులను రక్షించుట. ♦—

తే॥ పిదపఁ గేళీలాలసులగు పిల్లవాండ్రు, ఘాస లోభంబునన్ ముంజకాననమున
కరిగి మేసెడి నాత్మీయ సురభితతుల ద్రోలుకొనిరాఁగఁ దేకువతోడ నేఁగి.

సీ॥ మన్మథదేవుని మన్ననఁ గల్పు ముక్కంటికిదా మూఁడవకన్ననంగ
భగ్గుభగ్గున మండి యెగ్గుల మిక్కిలి కలిగించెడి బడబానలమనంగ
నంభోధిమంథనమందు నొక్కుమ్మడి వెలుదేరిన విషజ్వాలలనఁగ
సర్వలోకంబుల క్షణములోన దహించు ప్రలయకాలాభీలవహ్నియనఁగ

తే॥ ఘోరభీకరమైనట్టి కారుచిచ్చు
పుట్టి తన్మహారణ్యంబుఁ జుట్టుముట్టి
కాల్చుచుండుటఁ గనుఁగొని కాతరులయి
యేమితోఁచక యెలుగెత్తి యిటుల ననిరి.

మ॥ అదిగో దావము చిట్పటార్భటులతో నంతంతకున్ మమ్ములన్
గదియన్ సాగె ధృతోరుకౌస్తుభమణీ! క్ష్మారాజచూడామణీ!
త్రిదివేశేశ్వరరక్షణప్రియమణీ! దీనాళి చింతామణీ!
స్వదయార్ద్రాఘభుజంగగారుడమణీ! చక్రాదిపాణీ! గుణీ! 33౧

తే॥ కృష్ణ! కృష్ణ! కృపాకరా! కీర్తనీయ!
మమ్ము దావాగ్ని కసితోడ మంటఁగలుప
వచ్చెడిని నిన్ను శరణంబుఁ జొచ్చుచుంటి
మయ్య! చయ్యన రక్షింపు మియ్యెడనన. 33౨

చ॥ అనఁ గరుణాళువుండయిన యచ్యుతుఁ డిట్లనె నన్నలార! మీ
మనముల భీతి వీడి యొకమాఱు కనుంగవ మూయుఁడీ! యన
న్విని యల గోపబాలురు స్వనేత్రయుగంబును మూసి రంత నా
వనజదళాయతేక్షణుఁడు వహ్ని దహించెడిచోటుఁ జేరుచున్. 333

చ॥ జలమును గ్రోలు పోలికను సాదపుముద్దను క్రింది భా—
వలయముగా గ్రహించెడి దధంబు గుటుకున్న క్రింగె నిం నే
ల్పులు దమ వ్రేళ్ళ నాసికలమోపి విచిత్రముఁబొందుచుండె మి
త్రులు నులు కాత్ములన్ విడిచి తోషముఁగాంచ బలుండు మెచ్చఁగాన్. ౩౩౪

మ॥ తనువాతన్ మునిపత్నులైన హరి యా దావంబుఁ బోకార్చి తే
త్పురభీగోపకబాలకానవులతో పూర్వాశ్రిత్రైజాతీర భా
సురభాండీరమహావటవృక్షముల శోకాటవిం జేరి సం
బరమొందెన్ జనకా! మహాత్ములకు నే భావంబు సిద్ధింపదే? ౩౩౫

ఉ॥ అంతన గోపబాలకులు వాఁకట దప్పిని బీడఁ బొంది క
ళింది జలాన్వితాచ్యుతుని లెస్సగ వందనముల్ బొనర్చి తా
రందరు జేరి వేఁడిరిటు లక్కట! దాసను బుద్ధిచే వ్యాకల్
జెంది సహింపనుంటి మికఁ జెచ్చెరఁ బ్రోవుము! నందనందనా! ౩౩౬

తే॥ అంత నాకుమూకలగాంగ యంచుల కుర
రీకరించియు వారికీ రీతిఁ బల్కె—
మాధురులగు బాపలతోడ మఖము నంగి
రసుఁ డొనర్చెడి ననతిదూరంబునందు. ౩౩౭

ఉ॥ అచ్చటికేగి బ్రాహ్మణుల కందఱకున్ గిడిగిల్ల భక్తితోఁ
బ్రచ్ఛజ సల్పి యన్నముదకంబుల నడ్గుడు పొందెదం గ వా
రచ్చటనుండి పైనమయి యా మునివర్యుని యజ్ఞవాటికిన్
జొచ్చి విధేయులై మిగుల జోతలొనర్చి వచించిరిట్టులన్. ౩౩౮

ఆ॥ విప్రవర్యులార! యప్రమేయుండగు గోకులేశసుతుఁడు గోపబాల
కులను గూడి గోతతులఁ దమిఁ ద్రోలు చశోకమనెడి వనికి సారిది వచ్చె

క॥ ఆతఁడు నాతని భ్రాతయుఁ నాతనితోఁ దిరుగులాడెడి మిత్ర
వ్రాతము లన్నోదకముల నాతురులై రందువలన నవి మీరిడుఁడీ! ౩౪౦

ఉ॥ వారల కుయ్యిలన్ విని సవక్రియలన్ నెరవేర్చు భూసురుల్
వారికి నిట్లు వాకొనిరి బాలకులార! ముదంబుతో నిటన్
వారినిగాని యోదనము పట్టెడుగాని యొసంగు వీలు మా
కేరహి లేదటంచు వచియింపఁగఁ జింతిలుచుంటి మక్కటా! ౩౪౧

శా॥ అంతన్ వారు నిరాశులై యల సరోజాక్షున్ మఱిన్ జేరుచున్
జింతాక్రాంతమనస్కులై యనిరిటుల్ శ్రీకృష్ణ! నీ యానతి
న్నింతాకంతయు దాఁటకుండ మఖమున్ నేమంబుతోఁ జేయు వే
దాంతార్థప్రథితాగ్రజన్ములను మే మర్థింప నన్నాంబువుల్. ౩౪౨

క॥ ఏమియు లేవని వాకొని రామిటఁజట మీదు దరికి నరుదెంచితి మిం
కేమెటు బ్రతుకంగలమో యీమెయి నుడువంగవలయుఁ దృష్ణా కృష్ణా!

క॥ నావుడు వారికి నిట్లనె శ్రీవిభుఁడో బాలులార! చెచ్చెర నలభూ
దేవుల భార్యల చెంతకు నీవేళనె పోయి యడిగి యిచ్చులఁ గనుఁడీ! ౩౪౪

క॥ ఈతడవకు నామాటను బ్రీతిగ విని పొందనంగఁ బిల్లలు మఱి యు
త్పాతోన్మాలనపటునవ మాతతముగఁ జేయు నిక్క కరిగియు నందున్.

చ॥ చెలఁగెడి ధాత్రిదేవతల చెల్వల మ్రొక్కుచు నమ్మలార! గో
కులపతిపుత్రకుండు నవకోటిసుధాకరసుందరాస్యుఁడున్
జలదనిభుండు పుష్పశర సామ్యమనోహరవిగ్రహుండు నా
జలజదళాయతాక్షుఁడు వ్రజస్థలినుండి నయస్యయుక్తుఁడై. ౩౪౬

ఉ॥ గోవులఁ ద్రోలుకొంచు ఖగగుల్మలతాపరిపూర్ణమౌ యశో
కావనిజాభిరామవని కాగతుఁ డయ్యెను నందనున్న మి
మ్రావళితోడ క్షుత్తృషల నక్కలిఁ బొందెడి దాన మీరు మా
కేవిధినేని జలాన్నముల నిండిఁకఁ ద్రోయకుఁ దన్మదుక్తులన్. ౩౪౭

మ॥ అని వేఁడన్ ధరణీసురాంగనలు దా మాలించి యాకుర్రలన్
గని యో బాలకులార! మీరిపుడిటన్ గాంక్షించు నన్నాంబువుల్
గొనుఁడీ! యట్టి మహామహుం గనుటకై కోర్కుల్ ఫలింపంగ మే
మును రానెంచితి మంచు వారి కిడె రప్పంబువ్వ లవ్వారిగాన్. ౩౪౮

చ॥ పదపడి బాలకుల్ సనిరి బ్రాహ్మణభార్యలు వైలుదేరి స
మ్మదమునఁ దన్మహోటవిని మన్మథమన్మథు సాగ్రజన్ముఁ గృ
ష్ణుఁ దనివితీఱ విన్నవిధిఁ జూచితిమం చరుసంబుఁ బొంది త
త్పదములకున్ నమస్కృతుల భక్తిని బల్మ ఱొనర్చియుండుఁడున్. ౩౪౯

తే॥ తమ్మికంటియుఁ గన్గొని తన్వులార! మీర లిటుకు నేతెంచుటల్ మేలుసుమ్మి
వల్లభులతోడఁగూడి ప్రాపంచిక సుఖములను జెంది గోలోకంబుఁ బొందఁగలరు.

క॥ అని వరమిడ నతులిడి వారు నశోకవనమ్మునుండి త్రుటిలో నాత్మీ
యనిలయములకున్ జనుదెంచినఁ గని తత్ప్రియులు నెదలఁ జింతిలి రిట్టుల్.

తే॥ సరసిజాక్షునిఁ గనిన మా తరుణిమణుల జన్మములె సార్థకంబులు సత్యమల్ల
కంసభయమున శౌరినిన్ గనని మాదు జన్మమేటికిఁ గాల్పనే జగతియందు.

ఉ॥ ఇమ్మాట నందనందనుఁడు పిల్లలు దెచ్చి యొసంగె నన్నతోఁ
యమ్ముల మిత్రసోదర సమన్వితుఁడై భుజియించి గోపమా
హమ్ములఁ ద్రోలుకొంచు హ్యాసయుఁగమహా వల బృందకాటికిన్
శమ్మునఁ జేరె నో యుపనిషద్విపులార్థవిచక్షణీ! గణీ! ౩౫౪

—♦ శ్రీకృష్ణుండు గోపకులకు వైకుంఠలోకంబు జూపుట. ♦—

తే॥ పాపహరమగు మఱి యొండు శ్రీపతికథఁ
జెప్పఁచుంటిని విను మార్య! శ్రీకరంబు
నఘహరంబును బరమందు సకల శుభద
మైన యేకాదశీవ్రత మాస్థితోడ. ౩౫౫

ఉ॥ గోకులనాథుఁ డొక్కతఱిఁ గోర్కె ఫలింపఁగఁ జేసి ద్వాదశిన్
వేకువ లేచి గోపపరివేష్టితుఁడై యమునా ధునీమణిన్
వీఁకను జొచ్చి క్రుంకులిడు వేళను నప్పతిసేవకుండు త
ద్గోకులనాథు రజ్జువులతో బిగగట్టి మహాజవంబునన్. ౩౫౬

తే॥ వరుణలోకంబునకుఁ గొనిపోవ నవల గోపకులను గోలాహల మాపఁజాల
నట్టు లయ్యెను బిమ్మట నచ్యుతుండు వారి నూరార్చి ముట్టె యా వరుణపురిని.

చ॥ పరమమతిన్ మదేభముల వాజులఁ దేరులఁ గేతనంబులన్
బరిఖల దుర్గవప్రములఁ బత్తుల భర్మమయోరుహర్మ్యముల్
బొరిఁబొరి బూదిలోఁ గలిపి మూలను డాఁగిన పాశిఁబట్టగా
నరిగెడివేళ నా వరుణుఁ డంజలులన్ ఘటియించి యిట్లనెన్. ౩౫౭

ఉ॥ కోపము మానుమయ్య! యనుకూలపథంబున నుండుమయ్య! మా
యోపినయంత మీ యెడ ననుత్తమరీతి వసింతుమయ్య! మే
మీపరిఁ జేయు తప్పులను నెంతయు నీవు క్షమింపుమయ్య! యో
శ్రీపతి! నీ పదంబులకు శీర్షముతో నతులం బొనర్చెదన్. ౩౫౮

క॥ గోపీదుకూలచోరా! గోపీకేళీవిలోల! గోపీనాథా!
గోపకరాజకుమారక! గోపకవంశాబ్ధిచంద్ర! గోపాలమణీ! ౩౫౯

మత్తకోకిల॥ శిష్టరక్షక! దుష్టశిక్షక! చిత్రఖేలనలోలుపా!
యష్టదారమనోహరా! పృథులాదితేయగణప్రియా!
యష్టమూర్తినుతప్రభావ! యహస్కరార్బుదతుల్యా! మా
కష్టముల్ దొలఁగంగఁ జల్లగఁ గావుమా! కమలేశ్వరా! ౩౬౦

శా॥ బ్రహ్మేంద్రేశ్వరు బ్రహ్మనాభు ననఘున్ వందారు మందారునిన్
బ్రాహ్మణ్యాంఘ్రిసరోజరాజివినతి ప్రారంభ ధన్యాత్మునిన్
బ్రహ్మానందమయున్ నిరామయుని శ్రీ రాధామనోచోరుఁ ద
ద్బ్రహ్మనిర్వచనీయుఁ గృష్ణుని నినున్ బ్రార్థింతు విశ్వంభరా! ౩౬౧

చ॥ అని పొగడంగఁ జక్రధరుఁ డాగ్రహమున్ విడి సుప్రసన్నుఁడై
మనమున భీతి మానుము సుమాళముగా మను మోయి పాశి! యీ
పనులిఁకఁ జేయకుండుమని పల్కుచు నందుని బ్రాళ్ళు విప్పి తో
డ్కొని యమునాతటిన్ వెలుఁగు గోపకసన్నిధిఁ జేర్చె నంతటన్. ౩౬౨

ఉ॥ నందముఖంబునన్ వనజనాభు ప్రభావము గోపకుల్ మహా
నందము గల్గఁగా వినియు నమ్మఁగఁజాలక నందనందనున్
దొందరతోడ డాయుచు మధుస్రవదుక్తులఁ బల్కి రిట్లు గో
విందపదారవిందయుగవేష్టన జృంభితబంభరోపమా! ౩౬౩

తే॥ నీరజాతాయతేక్షణా! నిశ్చయముగ నీవు భగవంతుఁడవె? యైన నీకుఁ డెంకి
యైన వైకుంఠలోకంబు నఱమరలను విడిచి చూపింప వినుతిఁ గావింతు మిపుడు.

క॥ అంత ననంతశయానుఁడు సంతసముం గని సగోపజనుఁడై వైకుం
ఠాంతర దేశంబున కత్యంతంబగు శీఘ్రగతిని నరిగియు నటఁ దాన్. ౩౬౫

సీ॥ వేయి శిరంబులు వేయి పాదంబులు వేయి భుజంబులు వెలుఁగుచుండ
శంఖంబుఁ జక్రంబు శార్ఙ్గంబు గదయును బద్మంబు వనమాల పరిఢవిల్ల
చామరాందోళికాచ్ఛత్రకిరీట కేయూరాది భూషలు నొప్పుచుండ
సవ్యాషిలేనట్లు జక్కఁగాఁ గావించు పార్షదుల్ పెక్కురు వరగుచుండ

తే॥ పెక్కుసూర్యుల కాంతులు పెనఁగుచుండ
సురహరాదులు మ్రొక్కి సంస్తుతులు సల్ప
జ్యోతిరురుమండలంబున నొప్పు సింహ
పీఠమున నున్న శేషుపై వెలిఁగె నపుడు. ౩౬౬

తే॥ గోకులమునుండి వచ్చిన గోపకు లతి భయమునన్ గుసగుసలాడి వఱలుచుంటఁ
గాంచి పార్షదులెల్లరు కనలి దవ్వునందు వారిని గూర్చుండ నాజ్ఞచేసి. ౩౬౭

ఉ॥ ఎత్తఱినైన విష్ణుసభ నీరలు గాంచితిరొక్కొ? యిట్టు లు
న్మత్తుల పోల్కి వాగుటలు న్యాయమె? యీ యెడ నాల్గువేదముల్
మొత్తముగాఁ బరేశ్వరుని ముచ్చట సెప్పు టెఱుంగరొక్కొ? నో
ళ్ళెత్తక యింక భక్తి నల కృష్ణునిఁ గొల్వుఁడి! ముక్తిఁబొందుఁడీ! ౩౬౮

తే॥ అని వచింపఁగ గోపకుల్ హర్షమొంది
మానమును బూని తను తమ మానసముల
కిట్లు బోధించుకొని రీ రమేశ్వరుండు
దివ్యసింహాసనంబునఁ దేజరిల్లె. ౩౧౯

చ॥ మనల సఖీకరించి యొక మాటయు నే న్ననతో నఁ బల్కఁ డం
దున శతధా ప్రజస్థలమె తుష్టికరంబు సుఖప్రదంబు గా
వున నిట లేచి యచ్చటికిఁ బోవఁగ నౌనని యెంచు వారిఁ దో
డ్కొని వడితో రమేశ్వరుఁడు గోకులమేగె ననంతరంబునన్. 320

### — సుదర్శనోపాఖ్యానము. —

సీ॥ మఱియొక వేళను మణిగణాన్వాన్విత శకటముల్ గొంచు గోపకచయంబు
నవనందనరు లుపనందులు వృష్ణి వృషభానువులున్ దమ వసతినుండి
నక్షిపర్వంబైన యంబికావనమున కరిగి సభృత్యులై యందు విడిసి
యందు మహావిద్య యను పేరఁ బరగెడి భద్రకాళీదేవిఁ బార్వతీశు

తే॥ భక్తితోడుతఁ బూజించి పాపతాప
హారమగు శ్రీసరస్వతీ ప్రాదిసీత
టమున భూదేవతలకు దానముల నొసఁగి
మ్రొక్కి మృష్టాన్నము భుజించి ముచ్చటాడి. 32౧

క॥ అందంబగు నొకచోటున నందఱు నిదురించి రంత నజగర మొండా
నందుని పాదము గఱవఁగ నందుఁ డులికిపడుచు లేచి నలఁగుడు పడుచున్.

ఆ॥ పాహి! పాహి! కృష్ణ! పంకజలోచనా!
యేదొ కఱచె నన్ను నీవు గనుము!
యంచు నెలుఁగునెత్తి యార్వ నిద్రించిన
వారు లేచి యటకుఁ బాఱి చేరి. 323

క॥ కఱచెడి నురగముఁ గనుఁగొని కొఱకొఱలాడుచును గట్టఁ గొట్టినఁగానీ
శిరమునఁగలమణి పీడని తెఱఁగున నది యడుఁగు విడక తిరుగుచు నుండెన్.

క॥ అత్తఱిఁ గాళియమర్దనుఁ డత్తెఱఁగును గాంచి కసి నిజాంఘ్రిని దన్నన్
దత్తఱిలి యది తదాకృతి బొత్తుగ విడి పొంది పూర్వపుణ్యాకృతినిన్. 32౪

వ॥ శ్రీహరినిం జేరి సాష్టాంగప్రణామంబు లాచరించి ముకుళిత కరార
విందుండై స్వామీ! భక్తవత్సలా! యేను సుదర్శనుం డను పేరంబరగు విద్యా

ధరుండను. ఒక్కసమయంబున నష్టావక్రమహామునీశ్వరుం గాంచి పరిహసించితిని. దాన నామహానుభావుండు కనలి సర్పంబు గమ్మని నాకు శాపం బిడె. అక్కతన నిందనుకం దదోర్భిసూపంబున నుండి పవిత్రపావనేత్యాదిబిసదాంచితభవత్పద పద్మమకరందరజఃకణస్పర్శనంబునం దచ్ఛాపంబు సమాప్తంబై తొల్లింటి రూపు నాకుం జేకూఱ ధన్యుండ నైతిం గాదె? ఇట్టి లోకశంకరుండవగు నిన్ను సన్నుతింప సమర్థుండనే? మన్నించి నన్ను రక్షింపు మని ప్రార్థించి సర్వోపద్రవరహితంబగు వైకుంఠలోకంబున కేగె. అంత నందులకా నందాదిగోపకు లంద ఱధికాశ్చర్యానందంబులం బొంది యాతండు భగవంతుండే యని నిశ్చయించి పొగడుచు మరలి వ్రజమండలంబున కేతెంచిరి. ౩౨౬

తే॥ వెండి యీ వేమి వినెదవో వేగఁ జెపుమ
యనఁగ జనకుండు మోదిల్లి యావ్రజమున
వనరుహాక్షుఁ డేలీలల నొనరిచెనొకో?
తెలుపుమా! యనఁ మునిమణి పలికె నిట్లు. ౩౨౭

తే॥ పసిఁడిపుట్టము తాల్పొక్కపట్టునందు నన్నతోఁగూడి స్వీయగృహంబునుండి
వెడలి యచలభాగములందుఁ బిల్లవాండ్రఁగూడి డాఁగురుమూఁత లాడఁదొడఁగె

—♦ శ్రీకృష్ణుండు వ్యోమారిష్టాసురులను వధించుట. ♦—

తే॥ అట్టిపట్టున దిట్ట మయాత్మజుండు బలియు నగు వ్యోమదైత్యుండు వైలుదేరి
గోపరూపంబు దాల్చి తత్క్రీడనరతులైన గోపకబాలుర నపహరించి. ౩౨౯

తే॥ కొండబండల క్రిందుఁగాఁ జండగతిని సారెసారెకు వచ్చుచుఁ జనుచు నున్న
తాద్రిసానువులందున భద్రపఱచుచుంట సోకుమూఁకలగొంగ యొయ్యఁజూచి.

ఉ॥ రక్కసునిం గరంబులఁ గరంబుగఁ బట్టి ధరాస్థలంబుపై
నుక్కున నొక్కపెట్టున జయోక్తులు నిండఁగఁ బుష్పవర్షముల్
జక్కఁగ దేవత ల్గురియ సంగడికాండ్రును మెచ్చ నన్యు ల
మ్మక్క! యనంగఁ గొట్ట నతఁ డానిముసంబున నీల్గె భూవరా? ౩౩౧

ఆ॥ అంత వాని జోతి యఖిలదిక్కులయందు వెలిఁగి చక్రిలోన విలయమొందె
ననఁగ జనకుఁడో మహర్షి! తత్పవిత్రన జన్మచరిత మెఱుఁగ స్పష్టపఱచు.

క॥ నావుడు ముని యనె నాతఁడు భూవర! భీమరథనామ భూమీశుఁడుర్ మే
ధావియు, యజ్వయు, ధని బలి శ్రీవిభు భక్తుండు నగుచుఁ జెలఁగెను గాశిన్.

ఉ॥ అయ్యది కాంచి కిన్క మరు నయ్యయు నయ్యచలంబు నయ్యెడ
న్జయ్యనఁ గొంచు నయ్యసురనాథు తలన్ బడవైచె దానిచే
నయ్యసురుండు కొంతవడి వ్యాకులుఁడై మఱిలేచి కొమ్ములన్
గయ్యము గోరి యుర్వి నుదకంబు జనించెడిలాగు గ్రుమ్మచున్. ౩౯౩

చ॥ కమలదళాక్షుపై నుఱకఁగాఁ గని చక్రి తదీయదీర్ఘశృం
గముఁను బట్టి వాతహతిఁ గంజము తిర్గిన యట్లు త్రిప్పి రో
షమున ధరిత్రిఁ గొట్టఁగ నిశాటుఁడు రక్కసి రూపువీడి భూ
మ్యమరశరీర మూని యల యంబుజనాభుని మ్రొక్కి యిట్లనెన్. ౩౯౪

సీ॥ నీరమణీయాంఘ్రి నీరజంబునఁ గదా తుంగవీచీ సంగ గంగ వొంగె
నీమనోహరనాభి నీరజజనిఁ గదా పృథుమాయ బిడ్డలఁ బెట్టియుంట
నీ కమనీయాస్య నీరజంబునఁ గదా భూసురవర్యులు బుట్టియుంట
నీదివ్యలోచన నీరజంబులఁ గదా నీరజమిత్రుండు నెగడియుంట

తే॥ నీ మనంబునఁ గద చంద్రు డామతిలుట నీదు సంకల్పమునఁ గదా నిఖిలభువన
ములును బుట్టుట గిట్టుట యలరియుంట పాశుపాల్యప్రవీణ! గోపాలబాల!

మ॥ కరుణాంభోనిధి! నందపుత్ర! నిజ భక్తశ్రేణికల్పద్రుమా!
వరతంత్వాఖ్యుఁడ బ్రహ్మచారిని సురోపాధ్యాయశిష్యుండ భూ
సురుఁడన్ నేఁ బొరపాటుచే గురుదరిన్ జొచ్చిల్లి పాదంబులన్
గరమున్ జాపి తిరస్కరింప గురుఁడున్ గాఠిన్యభావంబునన్. ౩౯౬

తే॥ ఎద్దువగుమని నను శపియించెఁ గృష్ణ! దాన వంగదేశములందు నేను వృషభ
రూపమును దాల్చితి సురవిరోధిమైత్రి వలన రాక్షసత్వంబును గలిగె నాకు.

తే॥ నీయనుగ్రహంబున నేను నేఁడు వేడ్క శాపముక్తుండనైతి రాక్షసత విడిచి
యుంటి నీరేడుజగముల కొడయఁడవగు నీకు మ్రొక్కెద శ్రీకృష్ణ! నిర్మలాత్మ!

తే॥ అనుచు మ్రొక్కి విమానంబునందు నెక్కి
దివ్యతేజంబుతో వాఁడు దివముఁ జేరె
నిపుడు పాపహారంబు నభీష్టదంబు
నైన మాధుర్యఖండంబు నంటి జనక! ౩౯౯

ఉ॥ ఆపదధీనదీనకరుణార్ద్రకటాక్ష! విపక్షశిక్షకా!
గోపరిపాలనప్రియ! యఘోరసుదర్శనచక్రపాణి! ల
క్ష్మీపతి! శౌర్య ధైర్యబలశేవధి! ధీనిధి! యాదవాన్వయో
ద్దీపక! సూర్యకోటిసమదీప్తివిభాసుర! భూమనోహరా! ౪౦౦

ఉత్సాహ॥ నిత్యసత్య శుద్ధబుద్ధ నిర్వికల్ప చిన్మయా!
స్తుత్య వేదరాశిగమ్య దోషదూర! శ్రీకరా!
ప్రత్యగార్థ! విశ్వరూప! పద్మనాభ! కేవలా!
ప్రత్యనీకభీకరాంగ! బహుళ లోకనాయకా! ౪౦౧

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్య దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతంబునందలి
మాధుర్యఖండము
సంపూర్ణము.



శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓం తత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీ కృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ గర్గభాగవతము

## మధురా ఖండము



మధురానాథా! శ్రీధర!
మధుదైత్యవినాశకృతిసమర్థా! లక్ష్మీశ
మధురాధరపానప్రియ!
ప్రథనాధిక విక్రమాఢ్య! రాధాకృష్ణా! ౧

వ॥ అనవుడు జనకుం డమరమునీంద్రున కిట్లనియె. మునివరా! రాధామాధవ కథావిధానకథనప్రథితసుధీనిధివగు నీ వనుగ్రహించి సకలజనమనోభిరామంబగు నమ్మధురాపురవరంబున నా మధురిపుం డేయే కార్యంబు లెట్లెట్లొనరించెనో దుర్భరంబగు దోర్బలంబున నిక్కిన మార్తురనొక్కుమ్మడిం ద్రొక్కం జాలిన యుక్కడీఁడగు నక్కంసుని ధ్వంసం బెట్లు గావించెనో విశదీకరింపు మని ప్రార్థింప నా కయ్యపుఁ డిండి యయ్యనీంద్రున కిట్లనియె. ౨

కంసుండు శ్రీకృష్ణ వధార్థంబై పన్నాగంబులఁ బన్నుట.

క॥ ఒకతఱి మధురానగరికి నికషాత్మజ విపులవంశ నిధనోద్యమమున్
త్రికరణశుద్ధిగఁ గోరి కుతుకమున నే నరిగి యుంటి దోషవిదూరా! ౩

చ॥ చనిచని గాంచితిన్ మనుజచారణ కిన్నర సిద్ధ యక్ష రా
డ్దనుజ సురాప్సరోజనయుతంబు శతాంగమదేభవాజిరా
జినిభృతమున్ బలిష్ఠ యదుశేఖరయుక్తము నూత్నరత్నజా
తినివృతవేదికాన్వితము దివ్యము కంససభాప్రదేశమున్. ౪

ఉ॥ అందున నల్గడల్ జయజయధ్వను లొప్పఁగ సింహపీఠికన్
జెందిన దుష్టుఁ గంసు యదుశేఖరుఁ గాంచితి నంత నాతఁ డా
నందముతోడ భండనమునన్ మును పింద్రునినుండి గొన్న యా
సుందరచామరాది పరిశోభితపీఠ మొసంగి భక్తితోన్. ౫

ఉ॥ వారికి నీ రహిన్ బలికి పంపి రహస్యముగా మనీషి న
క్రూరుని నంతరంగు ననుకూలుని మంత్రిని బిల్చి యిట్లనెన్
బోరను రామకృష్ణులను పోఁజలు నన్దగటార్తు రంచు సా
నారదమౌని యిత్తఱిని నాకునెఱుంగఁగఁ జెప్పెఁ గావునన్. ౧౫

—♦ కంసుం డక్రూరుని గోకులంబున కంపుట. ♦—

తే॥ ఎల్లివేకువ గోకుల మేగి యందు
నున్న నందునిగేమున వెన్నుఁడతని
యన్నయుండిన స్త్రీవార్త లన్ని జెప్పి
యమృతమొలెక్కెడి పల్కుల నాడ వేఁడి. ౧౬

క॥ పృథులోపాయన భరితులఁ బ్రథితుల నందాదిగోపరాజుల మథురా
విధసందర్శన మిషచే రథముల నెక్కించుకొనియు రమ్మక్రూరా! ౧౭

మహాస్రగ్ధర॥ వినుమాదిన్ రామకృష్ణుల్ విదితకువలయాపీడనాగంబుచేఁగా
ని నిరాఘాటంబుగా నా నిరతిశయబల స్నిగ్ధమల్లాళిచేఁగా
ని నిమేషంబందుఁ జావక్ నిరుపమ విధులక్ నేనొనర్తుక్ వ్రజేశున్
వెనుకన్ నీల్గన్ బొనర్తున్ నెన రెగ విడి యో విశ్వాసి మిత్రాగ్రణీ!

తే॥ పైని నావృషభానుని భంగపరతుఁ బిదప నందోపనందుల పీఁచమడఁతు
నంత నానకదుందుభిన్ హతమొనర్తు వానిసఖుఁడగు దేవకు వధమొనర్తు.

తే॥ మఱియు రాజ్యసముత్సుకు విరసు నుగ్రసేనుఁ బరిమార్తు యాదవసేన నంత
నంతమొనరింతు సంశయ మందవలదు వీరు ప్రాగ్జనిన్ సురలని విశ్వసించు.

సీ॥ భూత భేతాళాది నేతయు వీరసంస్తవ్యుండు భూతసంతాపనుండు,
కింకయేవచ్చిన శంకరుసైతము సంకటపడఁ జేయు సంకరుండు
పట్టుబట్టిన నట్టి ప్రలయకాలునిఁ గూడ నణఁపఁజాలిన ద్వివిదాభిదుండు
ముక్కంటినింగూడ మొగసాల కాపరిగా సల్పినట్టి బాణాసురుండు

తే॥ వృకనిశాట, హరిశ్మశ్రుహృష్ట నరక, కాలనాభ, మహానాభ, కర్బురులును
మిత్రులౌచు మదర్థమై మేడమందుఁ బ్రాణముల నియ్య సిద్ధులై వఱలిరయ్య!

క॥ ధనియును ధన్వియు బలియును దనుజామరమనుజవరులఁ దనమాటకు లొం
గిన వారినిగాఁ జేయుచు మనెడి జరాసంధుఁడరయ మామయకాదే. ౨౨

ఉ॥ ఆరయ నేనొ యీజగతి యందలి గండరగండలన్ గరం
బొరును బేరులేని యటు లుగ్రతనాశమొనర్చి యీ యకూ
పారవృతావనీస్థలము పాలనసేయుచు నుంటి సర్వ బృం
దారకులన్ బిడౌజు ద్రుటిఁ ద్రాళ్ళను గట్టి జయించితిన్ గదా. ౨౩

తే॥ వెండియున్ ద్రవ్యపతినిఁ గుబేరు మేరుగిరిగుహాభ్యంతరోదర్కమందు నిలుచుచుండఁ
ద్రోసియుంటిని త్రైలోక్యభాసమాన రాజ్యలక్ష్మినిఁ గైకొంటఁ బ్రణుతచరిత!

క॥ అపరితోభయుఁడను జమిన్హా యఁక నాకును నాలోకులకు నెది యనర్గంబై
సుకములఁ గూర్పఁగ జాలవో? ప్రకటింపుము కొంతలేని నహి నక్రూరా!

తే॥ కవిజనముల యం దీవె కవివరుఁడవు చతురనయలంపటా బృహస్పతివి నీవు
గాన నెడిచేయఁదగు? నదన్ దానలలితాఙ్గైన యక్రూరుఁ డతనికి ననియె నిట్లు.

తే॥ వినుము పలికిన పలుకులు మేలు నాన్నకని మిన్న వికాని యయ్యదిదలంప
దైవయత్నము చేతఁగాఁ బౌరుషాన నర ప్రయత్నము చేతఁగాఁ దనరఁగ వినుము.

శా॥ కంసుం డిట్లు వచించె దానలలితా! కాలించినన్ యత్నము
త్రుంసుల్ మెచ్చఁ గ్రియావళుల్ సఫలమై దైవానవే దైవమే
శంసార్హంబని నమ్మి పౌరుషబలస్థైర్యాదులన్ పెకిచన్
హింసల్గల్గనె? మిన్నకుండిన గడల్ హెచ్చిల్లి వేష్టింపవే?　　౨౮

ఉ॥ కాలము దైవరూపమని గట్టిగ నమ్మిన కర్మయోగి యే
మూలనో యుండుగాక జలముల్ జలముల్ మతిలేని కేఁగలుల్
వీలుగ దైవమే వరము విశ్వసనీయ మటంచుఁ జెప్పఁగాఁ
జాలుచు నుండుఁగాక దృఢశక్తి సమేతుఁడు దాని నొప్పునే.　　౨౯

ఉ॥ కావున రేపు గోకులము కంజహితోదయపూర్వవేళలో
నీవు బిరాన సాగుమని యేపున నొక్కి వచించి పంపె యా
సేవకజాలముల్ బనిపి చీదఱపడ్డ మనంబుతోడ న
త్నావృత పీఠికన్ విడిచి యంతిపురంబున కేగె భూవరా!　　30

—◆ వాసుదేవుండు కేశినిశాచరుం జంపుట. ◆—

చ॥ పదపడి కంసునానతి జవంబున నేగిన కేశిదైత్యుఁడున్
మదమున నశ్వరూపమును మానుగఁదాల్చి వ్రజంబుఁ జొచ్చి యం
బుదము విధాన బొబ్బలిడి పుచ్ఛహతిన్ ఘనపంక్తి నింగి యం
దదవదలౌనటుల్ సలిపి యంఘ్రిహతిన్ ధరఁగూల్చెఁ జెట్టులన్.　　3౧

ఉ॥ ఆ సమయంబునందు వ్రజమందు నివాసముఁ జేయు గోప గో
పీసముదాయ మాయసురు భీకర చర్యలఁ గాంచి బొందులం
దాసల వీడి మాధవుని యండకుఁ జేరుచు దిక్కు కమ్మనం
గా సరి యంచు నొప్పికొని కంజదళేక్షణుఁడారడించుచున్.　　3౨

పంచచామరము॥ తటాలునన్ గటిన్ బటంబుఁ దద్దఁగట్టి దైత్యుపై
హుటాహుటిన్ జనంగ నా నరోఁజనుండు శ్రీహరిన్
బటుత్వయుక్త దీర్ఘవామ పాదఘాత బాధితున్
ద్రటిన్ బొనర్చి యార్చె నింగి ద్రోఁగ భూమిద్రయ్యఁగాన్. 33

మ॥ అటుపై శ్రీధరుఁడాగ్రహించి నిజహస్తాగ్రంబుచే వానినిన్
విటతాటంబుగఁ బట్టి త్రిప్పియు వియద్వీథిన్ జతుః క్రోశముల్
ద్రుటిలో దాఁట గిరాటు వేసె నవలన్ దోషాచరోత్తంసుఁ డు
త్కటకోపంబునఁ దిర్గివచ్చి తనతోఁకన్ మోఁదె దామోదరున్. 34

వ॥ అంత నా దైత్యాంతకుండు ప్రలయాంతకు భంగిం గనలి యా కేఁద్రిమ్మరీని వాలంబుఁ గేలం దాలిచి గిరగిరం ద్రిప్పి యుప్పరవీదియందు పంచయోజనంబులపైఁ బడునట్లు విసర నయ్యసురుం డుసురుసురై క్రమ్మఱ లేచి ధారాధరంబు కరణి నార్చి పేర్చి జూలును, రోమస్తోమంబును విదలించుకొని కార్చిచ్చు ద్రింగిన యక్కమలాక్షు సమక్షంబునఁ బాదంబులన్ మేదినిం ద్రవ్వుచు నా బాలకృష్ణుం గొని విహంగంబు భంగి నింగి కెగయుచు దిగుచుఁ దిరుగుచు మిగుల బాధింపం దొడంగె. అంత శిష్టరక్షకుండగు నా శ్రీహరి యనిష్టపుష్టినష్టకరంబగు నొక ముష్టితో నా దుష్టనిశాటుం బ్రహరింప నతండు రెండుగడియల కాలంబు గడబట్టి తిరుగఁ దెరలి యా హరిని దన కంధరంబునఁ దగిలించుకొని చదలున కెగసి లక్ష యోజనంబు లుల్లంఘించె. అపు డందు గోవిందుఁ డా దుండగీని పాదసటాపుచ్ఛ ఖురంబులతో నఖండంబగు ఖండనంబు రెండుజాములొనర్చి నిజభుజంబుల నవ్వానిం గైకొని యుయ్యెల నూఁచినపగిది నట్టిట్టూఁపి యటనుండి క్రిందఁ బడవైచి యొక బుజంబు తదాస్యంబందుఁ జొప్పించె. అంత నది యుపేక్షించిన యామయంబు విధంబునఁ గ్రమక్రమంబుగాఁ బెరుఁగుచు నా యసురోదరంబును బ్రవేశించి కలంచఁ గని తగినట్లా రక్కసుండు తన కుక్షిం బ్రబలంబుగా నొనర్పం గడంగ ఖండితోదరుండై మృతుండయ్యె. అయ్యవసరంబున నయ్యశ్వశరీరంబునుండి కిరీటహారకేయూరకంకణకింకిణీకాంచీసమంచితంబగు దివ్యరూపంబు ధరించిన యొండు పురుషుండు నిర్గతుండై యా భక్తవత్సలునికిం బ్రణమిల్లి సాంజలియై యిట్లనియె.

—♦ కేశిపూర్వజన్మవృత్తాంతము. ♦—

తే॥ దేవ ! శక్రానుచరుఁడను దివ్యరూపధరుఁడఁ దేజస్వి వర్చస్విఁ దత్త్వవిదుఁడఁ
గుముదనాముకుఁడన్ నేను గొడుగుబట్టి యింద్రు మెప్పించి జీవింతుఁ గృష్ణ! తొల్లి.

తే॥ అపుడు దేవేంద్రుఁ డట్లు వృత్రాసురవధ సల్పి తద్బ్రహ్మహత్యాది శాంతికొఱకు
సర్వసవనోత్తమంబును స్వస్తిదంబు నైన యశ్వమేధంబు సమాచరింప. 35

తే॥ శ్యామ కర్ణాంచితము మనోజవయుతంబు,
శుభ్రవర్ణసంయుతమును శుభకరంబు
నైన హయమును విడువంగ దానిదన్ను
రించుకొని యెక్కి తలమున కేగియుంటి. ౩౮

ఉ॥ అత్తఱి నింద్రుఁడుర్వ దివిషదావళితోఁ జనుదెంచి నెత్తిపై
మొత్తుచుఁ ద్రాళ్ళఁగట్టి హయముం గొని మన్మతి! తేజోహపుత్తో
హోత్తు పిశాచరుండవగు మాయనుయుక్మ పలుంచు శాపమున్
జిత్తమునన్ దయారసముఁ జేర్చక నాకిదె నబ్జలోచనా! ౩౯

ఉ. నా హయమ్మహావన్నిత్రైతృఁడై చరియించుచుంటి నో
దానవవైరి! నీదయను దప్పించినా యకనాస మిత్తఱిన్
నేను విడింగఁ జాలితిని నిశ్చయ మియ్యది భక్తవత్సలా!
దీనశరణ్యా! దేవనుత! దేవ! నతుల్ బొనరింతు భక్తితోన్. ౪౦

చ॥ అని ప్రణమిల్లి నల్లడల నమ్మితరోచులఁ బన్వాచున్ మహా
ఘనమగు విష్ణులోకమును గాంతిసమన్వితమౌ విమాన మం
దున వెసనెక్కి చేరెను విభూతరిపూత్కర! తత్పరంబునన్
జనరిన సంగతుల్ వలికెదన్ వినుమో బహులాశ్వభూవరా! ౪౧

— అక్రూరుండు గోకులంబున కరుగుట. —

తే॥ కంసునాజ్ఞ నక్రూరుండు ఘనరథంబు నెక్కి గోకులంబునకేగు చక్కఁజమగు
గిరుల వరుల సరస్సులఁ దరుల విరులఁ గాంచు చలరుచుఁ జను చిచ్చనెంచె నిట్లు.

క॥ నయముననో భయముననో ప్రియముననో వైరముననో విష్ణుని బలునిన్
రయమునఁ దోడ్కొని రమ్మని నియమించిన యట్టి కంసు నిత్యముఁ గొలుతున్.

ఉ॥ ఏమితపంబుఁ జేసితినో యే మహనీయునిఁ గొల్చియుంటినో
యేమిజపంబొనర్చితినో యెట్టి వ్రతంబుల నోచియుంటినో
యేమిసుఖంబు ధాత్రికి ఘటించితినో కద! యీదినంబునం
దా మధువైరి నా స్వభువు నా హరినిం గను భాగ్యమబ్బెఁగా. ౪౨

ఉ॥ కాని మదాగమంబు విని కంసుని పంపున వీఁడు వచ్చె న
ద్దాన నితండు వధ్యుఁడని దానవహంత సమీకరంతయై
మానసమందు నెంచి పరిమార్చునో? చెల్మిని గద్దెనిచ్చి స
మ్మానముఁ జేయునో మఱియు మద్విధి యెవ్విధి నివ్వటిల్లునో. ౪౩

ఉ॥ ఎట్టులనైన నేఁడు కమలేశుఁ గనుంగొను భాగ్య మబ్బె నా
యట్టి కృతార్థుఁ డీ జగతియందుఁ జెలంగునె? పట్టుపుట్టముల్
గట్టెడిఁజేజె యేనుల కన్నుల గోచరుఁ డౌనొ వారు బ
ల్లెట్టులు నైన ధన్యులయి శ్రీధరుఁ జేరరె? యంతరంగమా! ౪౬

ఉ॥ ఈరహిఁ శౌరినిం గుఱిచి యెంచుచు సచ్ఛకునంబుఁగాంచి య
క్రూరుఁడు గాందినీసుతుఁడు గోకుల మర్కుఁడు గ్రుంకు వేళలోఁ
జేరి యవాంకుశాంబుజ విశిష్టజనార్దన పాదచిహ్నయు
గ్ధారణిఁగాంచి డిగ్గన రథంబును డిగ్గి మనోరథంబునన్. ౪౭

తే॥ పొరలి యానందబాష్పము ల్బొరల విడిచి
నందు మన్కికి నరుగంగ నందునుండి
బలునిఁ గూడిన కృష్ణుండు వచ్చుచుంటఁ
గన్నులారఁగఁ గనుఁగొని గాఢభక్తి. ౪౮

సీ॥ పురుషోత్తములను నంభోజలోచనులను శ్యామలగౌరవర్ణాంచితులను
లీలావరులఁ బీతనీలాంబరధరుల బాలుర గోబాలపాలకులను
మకుటాలలంతికా మంజీరకంకణ హారకేయూర సమన్వితులను
యోగిరాడ్దేవరాడురగరాణ్ణుతులఁ బురాణుల భక్తసంత్రాణరతుల

తే॥ నిర్జితానంగరూపుల దుర్జనగణ తర్జనాత్యూర్జిత బలుల దుర్జయులను
నార్జవార్జిత యశులను హరి బలులను డాసి పదములంబడి నతుల్ జేసె నవల.

క॥ శౌరియు రోమాంచితునిన్ వీరుని నానందబాష్పవిలసన్ముఖు న
క్రూరుని సక్రూరునిఁ గని కారుణికత్వార్ద్రనయనకమలుండగుచున్. ౫౦

చ॥ పదములనుండి హస్తములఁ బట్టుచు లేవఁగఁదీసి యింటికిన్
ముదమునఁదోడుకొంచుఁజని ముద్దగు గద్దియ నిచ్చి మంచిగాఁ
గుదిరిన భక్ష్యభోజ్యముల గోవుముఖంబునఁ బెట్టె భూవరా!
పదపడి గాందినీతనయు ప్రక్కకు నందుఁడు సేరి యిట్లనెన్. ౫౧

ఉ॥ సిగ్గును వీడి భోజపతి చిన్నల నల్లరఁజంపెఁ జెల్లఁబో!
యెగ్గులుఁగూర్చెఁ జెల్లెలకు నేమియెఱుంగని వారినిం జెఱన్
బగ్గను బెట్టె న్యాయము లవంబు దలంపక యింక నెవ్వరిన్
నుగ్గొనరింపఁ జూచెడినొ న్యూనతలేని యటుల్ వచింపుమా! ౫౨

తే॥ అట్టిచెట్టరాజ్యమునందు నెట్టులీవు బ్రతుకుచుంటివో యక్రూర! పలుకుమయ్య!
యనుచు గేహములోనికి నరిగెఁ బిదప హరియు గాందినీపుత్రకు నడిగె నిట్లు.

ఉ॥ సేమమె మీకు మీపురినిఁ జిన్నలుఁ బెద్దలు స్త్రీలు పూరుషుల్
సేమమె? నీవె సాగుతఁజేఁ జేసుచు నాతలిదండ్రు లాదటో
నేమి వచించి రాత్మజన మేనెతలక్ జజకుండెనొక్కొ? యిం
కేమిదలంచెఁ గంసుఁడిపు డెల్లజగంబులు క్షోభఁజెందఁగాన్. ౫౪

ఉ॥ నావుడు గాందినీసుతుఁడనందొరఁగెన్ బసిమాత్మ! మొన్న భో
జానవిజాని, మానమున నాసభయందుఁ గృపాణపాణియై
యానను దేవుఁ జంపుటకు యత్నముఁ జేయుటఁ జూచి వెంటనే
దేవమునీంద్రుఁ డాపె వసుదేవకుమారకు! వైరిమారకా! ౫౫

ఉ॥ దాన వశేషపూర్వపద్ధతుల ధాత్రికి వత్సలు పద్ధతిల్లి త
జ్జ్ఞానమునుండి తెల్పి పెజతాప్రలకున్ జని యింతఁ గంసుఁడా
దీనుల పూర్వజోత్తముల దేవతలన్ బరిమార్చి యున్నను
న్న్యానముగా నొనర్చెఁడిని యుక్త మయుక్తము లేక క్రూరుడా! ౫౬

క॥ అక్రూతమున నామధురకుఁ జక్కఁగఁ జనుదెంచి కంసుఁ జంపియుఁ బ్రజకున్
జిక్కులఁ బాపుచు సుఖముల గ్రక్కునఁ గలిగింపుమయ్య కరుణాభరణా! ౫౭

క॥ అనవుడు సబలుండగు హరి తనపెంపుకు తండ్రిదౌ యథార్థాగోయమున్
గొని కార్యకనుల బ్రేలను నెనరునఁ బిలిపించి యిట్లనెను బహులాశ్వా! ౫౮

క॥ నేనును నందులు మన్నొప్పు సభానువు లుపవందు లింక బలిగోపకు గం
తానము వృద్ధులు మధురకుఁ బైనము కాఁగలరు వేకువను సద్దానన్. ౫౯

క॥ అరుణోదయకాలమునన్ బరిగల నెయిపాలుఁ బెరుగుఁ బ్రోఁగుఁగఁగొని మీ
కరదంబులతో నయితం బరదంబులఁ బెట్టి యిచట కరుదెంచవలెన్. ౬౦

ఉ॥ ఆతరువాతఁ గార్యకరు లాహరి యాజ్ఞఁ దలన్ వహించి యా
వ్రేతల యిండ్లకుం దిరిగి పెద్దలు బిన్నలు నాలకింపఁ ద
త్పీతపటోదితోక్తులను వెల్లడిఁ జేయుచుఁ జిడ్డుపెర్గు పా
ల్నేతులు ప్రోఁగుగా నొకటఁ జేర్పుచుఁ జేర్పఁవొడంగి రింతలోన్. ౬౧

చ॥ విడిముడి బోఁటియేమగడ వెన్నుఁడు పైనమొనర్పు వార్త యా
పిడుగువలెన్ వ్రజాంగనల వీనులలోఁబడఁ గొందఱంగనల్
గుడిచెడి యన్నమున్ విడిచి గోలను బెట్టిరి కొందఱన్ను లీ
తఁడు మనలన్ త్యజించి యెటు దర్గు? నటంచుఁ దలంచి రెంతయున్. ౬౨

ఉ॥ కొందఱు గండదేశములఁ గోమల హస్తములుంచి బెంగతోఁ
గుందిరి కుందుఁడే చనినఁ గొంప మునుంగదె యంచు గోపికల్
గొందఱు వల్కిరామధురకున్ హరియేగుట ప్రస్తుతంబు నం
దెందులకంచుఁ గొందఱని రీశ్వర! మోశ్వర బద్ధశేముషీ! ౬౩

మ॥ మఱి యా రాధిక, కృష్ణు నెమ్మొగమునన్ మందస్మితంబున్ సుకం
ధరమున్ నాస నురంబు నాసు వరహస్తంబుల్ పదంబుల్ శరీ
రరుచుల్ మాటలు నీటులున్ బ్రణయవైరంబుల్ మహోద్యాన సం
చరణాసక్తిని రాసముల్ దలంచుచున్ శశ్వత్తు రోదించెడిన్. ౬౪

చ॥ ఇంకను కొందఱుగ్మలులు కృష్ణుని వీడఁగలేక యించుకేన్
జంకక యొక్కయిక్క నొక జట్టుగఁ గూడియు రాయబారిదా
వంకకుఁ బోయి యోయనఘ! పాడియె? మమ్ములఁ బాపి శ్రీపతిన్
జెంకెతనానఁ దోడుకొని వెళ్ళుట చెప్పుము! గాందినీసుతా! ౬౫

క॥ అక్రూరుండవు గాని సక్రమముగ నాడితిమిగ! చక్కనరయ నీ
వో క్రూరుండవు జమ్మా చక్రివియోగంబు మాకు సంధించుటచేన్. ౬౬

మ॥ మురళీగాన వినోద కార్యకలనాపూర్వప్రభావాఢ్య! యీ
తరుణంబందుఁ జిరంతనంబయిన తత్సంబంధమున్ వల్లరిన్
గరముం ద్రెంపి యనృచ్ఛగాఁ జనెదవే! కారుణ్య మావంతయేన్
సరిగా నుండిన యట్లు తోఁపదహహా! శౌరీ! మురారీ! హరీ! ౬౭

సీ॥ రాసకేళులయందు రతినిగావించిన చెలిమి యావంతయేన్ దలఁపవేల?
మాయిండ్లలోఁబడి మంచిపాల్పెరుఁగు నేతులు గ్రోలినట్టి మేల్ దలఁపవేల!
యలజలక్రీడల యందొనరించిన స్నేహంబు నాత్మలోఁ జేర్పవేల?
బృందకారణ్యంబు నందలి మాతోడి క్రీడలు మదిని లెక్కింపవేల?

తే॥ గోప్రవర్ధన శైలంబు గోటనెత్తి వ్రజ నివాసులఁ గాచిన పరమకరుణ
నల్పమైనను మాపైని దాల్పవేల? మధురకరిగెదవే కృష్ణ! మమ్ము విడిచి.

సీ॥ సీతామహాదేవి శ్రీరాముతోఁగూడ వనటచెందుట ప్రేమవలనఁగాదె
చంద్రమతియు హరిశ్చంద్రునితోఁగూడ వనటచెందుట ప్రేమవలనఁగాదె
యింద్రాణి యట్టి దేవేంద్రునితోఁగూడ వనటచెందుట ప్రేమవలనఁగాదె
హైమవతీ సతి హరుతోడ మిక్కిలి వనటచెందుట ప్రేమవలనఁగాదె

తే॥ మఱిఁ బతివ్రత లను వాసి మహినిగన్న వారలెల్లరు భక్తితో వనటకనుట
ప్రేమవలననె కావునన్ మేముగూడఁ గష్టసుఖముల నీవలెన్ గాంతుమయ్య!

మ॥ చెలులారా! యలనాఁడు రాసమున నీ శ్రీకృష్ణచంద్రుండు తే
నెలు వర్షించు స్వరాన నేమిపలికెన్ నేఁడేమి చేయంగఁదాఁ
జెలరేగెన్ గనుఁడీ యిదేమి నయమో చిత్తంబు స్థైర్యంబుగా
నిలుపన్ లేని మహానుభావు దయయున్ నిర్మూలమూలంబగున్. ౭౦

క॥ కావున లాభము లేదిఁక నేననికో యేమనికో యేగెదమో రా
జీవాక్షులార ! కర్మం బీవిధి యేర్పించుచుండె నెవిచేయనగున్. ౭౧

క॥ అని హేరాళమగు విరహమున వగచి స్వస్వగృహములకుఁ బోయెడి వారిన్
వనమాలి కాంచి యిట్టులనె నందజ కన్ని టపుపులందుచుఁ దాల్మిన్. ౭౨

—♦ శ్రీకృష్ణుండక్రూరసహితుండై యరుగుచు రాధాదుల నూఱడించుట. ♦—

క॥ కోకిలలారా ! మీ స్వరితాపంబును మానుఁడేను దప్పక త్వరలోన్
మీ కాంతకు వచ్చెద నని మీ రెఱిఁగింపుఁడి చేపట్టి మేలు మఱతునే ? ౭౩

వ॥ అని చెప్పి యటనుండి సాగి నృపధానీనివాజాత యగు శ్రీరాధాదేవి సుందరమందిరంబునకుం జని యందుఁ బరివారాదులచే నుపవీతనై కొంటిగా నాకమూలంబడి యున్న రాధికం జూచి తత్తటిపవనంబు ప్రద్యుత్ప్రభుత్వముచుండి సకల లోకశ్రవణపేయంబగు మురళీగానం బొనరింప నాలించి యప్పద్మిని పద్మినీమనో హారోదయంబును గాంచి సంతసించిన పద్మిని విధంబున నిజనయనపద్మంబుల విప్పి శ్రీపద్మాక్షపద్మబాంధవుం గని యలవారి సింహాసనం బిడి సత్కరించె. అంత నమ్మాధవుండు దీనయు, నశ్రుపూర్ణముఖియు, విరహవిహ్వలయు నగు నాసుందరిని డాసి మేఘగంభీరంబగు గళంబున. ౭౪

శా॥ ఈ నామాటలఁ దాలిమిన్ వినవె యో యేణాక్షి ! యీవేళలోఁ
బోనా యా మధురా పురంబునకు జేపో మాపొ యందుండి రా
లేనా దుష్టులఁ జంపి శిష్టులను హాళిన్ గాచి తత్ప్రీతుఁడన్
గానా నిన్నెడి యుండఁజాలుదునె ? యో కాంతామణీ ! పల్కవే ! ౭౫

ఆ॥ నేను వచ్చుదాఁక నెంజలి విడిచి భూషలను దాల్చి హాయిఁ జెలులతోడ
ముచ్చటాడుకొంచుఁ బొలుపారుచుండుమా ! యంచు నూఱడించె నవనినాథ !

క॥ అలపలుకులు దనచెవులకు ములుకులుగాఁ దోఁప రాధ మూర్ఛిల్లి మఱిన్
దెలివిఁ గని దావదగ్ధమగు లత విధంబునఁ దపించి కొంతుకపడుమదిన్. ౭౭

క॥ తగునే ? నీకిది నాథా ! యగచాట్లను నన్ను బెట్ట ననిశము నిన్నున్
మిగులన్ స్నేహించెడి నను దిగవిడిచియు నిచట నెటకొ తెగఁబోయెదవే ?

ఉ॥ పోయిన నేమి చేయఁగలఁ బొల్తుక పుట్టువుగాదె బూదినై
పోయెద నెంతలో నెటుల మూఁడెను గీడులు నాకు నక్కటా !
యే యెడ నేని నిన్నెడి సహించితినే ? కలనైన నిట్లు నా
కీ యగచాట్లు చొప్పడు నటంచుఁ దలంచితినే ! మనోహరా ! ౭౯

క॥ రక్షింపు మెటో ననుఁ గమలాక్షా! యని రెండుచేతులన్ మ్రొక్కుచు జగ
ద్రక్షకుఁడును కారుణ్య కటాక్షంబు నిగుడ్చి యిట్లు దాఁపక పలికెన్. ౮౦

మ॥ కలికీ! భక్తవశుండ సంతతము భక్తశ్రేణి యిష్టంబులన్
ఫలియింపన్ బొనరింతుఁ గాని యెపుడున్ వ్యర్థంబుగావింపనే!
యల శ్రీదాముఁడు నిన్ను భర్తృవిరహం బబ్బంగ నూఱేండ్లు బల్
పిలుగల్ గల్గ శపించె గోజనములన్ జింతింప లాభించునే? ౮౧

ఆ॥ అట్టిశాపకాల మరుదెంచె నిప్పుడే బిట్టు దాని ననుభవింపవలయు
సంచితాఘరాశి సంహారణంబుగాఁ జనునె? యెంతగొప్ప జనునకైన. ౮౨

చ॥ గతజల సేతుబంధము గాదొకో? యయ్యది చింతచేయుటల్
మతినరయంగ నాథునిఁడు మత్సఖుఁడే కద మైన నీవు నా
సతివగుటన్ డమిన్ విడువఁజాలక నేఁ బ్రతిమాసమందు నీ
స్థితిఁ గని వేడ్కఁగూర్చుటకు స్నేహమొనర్తు సఖీవతంసమా! ౮౩

తే॥ కాన శోకంబు మానుమో కమలనేత్ర! యన్న నామె చేయుటకు నెయ్యదియు లేక
దేవ! నీవుచించిన కీవి మాసమాసమందున దర్శనంబిచ్చి మనుపవయ్య!

ఆ॥ అటులఁ గాని యెడల హాటకసన్నిభమును శిరీషమృదులమునఘనంబు
దివ్యమునగు నాదు దేహంబు దాహంబు సలుపఁగలనటంచుఁ దెలియుమయ్య!

చ॥ జలరుహనేత్రుఁ డద్దివిని సత్యము నానుడులెల్ల ధర్మువున్
జలరుహబాంధవేందువులు సంధ్య యముండును నంతరాత్మ బ్రా
హ్మలు పలు శాస్త్రజాలము జనల్ నిశి సాక్షులు గాగ నామగో
వులపయి నొట్టుపెట్టికొని పూర్తిగఁ జెప్పినమాట నమ్ముమా! ౮౬

క॥ చేతస్ఫూర్తిగ నేర్పెన్ కైతుకముగఁ జెలిమిఁ జేసి యెగ్గుల్ లగ్గుల్
బ్రీతిగఁ దెలుపునొ వాఁడే భూతలమున ధన్యతముఁడు పుణ్యుండుగదా. ౮౭

క॥ చేతస్సునందు విషమిడి, ప్రీతిగ స్నేహించు నరుఁడొ విషపుచ్ఛుండున్
హేతుపటుఁడు లంపటుఁడును ఘాతుకుఁడునునైన నటుని కరణి నధముఁడౌ.

క॥ ఈయెడ నీయెడఁ జేసిన నేయమొ టకటొంకుగాదు నెఱి నమ్ముమ! యో
తోయరుహాయతనేత్రా! పోయెద సెలవిమ్ము త్వరగఁ బొలతులమిన్నా! ౮౯

తే॥ కర్మకరణంబులకు రసఘనత దెలియ
నటులఁ గోర్కెలఁ గాంక్షించునట్టి మునుల
కెద్ది దెలియరాదో యెద్ది యేమిగోర
నట్టిమునులకుం జిక్కనో యద్దినేను. ౯౦

తే॥ పాలకును బాలుగల తెల్పు డాలునకును దారతమ్యంబులేని విధమున నీకు
నాకు భేదములేదని నమ్మి మునులు సతము ధ్యానించుచుందురో సరసిజాక్షి!

క॥ నాకును నీకును భేదం బేకరణిని గూర్చి యెవ్వ రెద జపియింత్రో
యాకొంటెలు నరకమునం దాకమలాప్తేందుభముగ నత్తురు సఖి! ౯౨

తే॥ నీవు మేదిని నన్వీడి నిలువలేవు కాని నిన్వీడి యేను నుండగలనె? చెపుమ!
కాంచ నిప్పుక నెలనెలఁ గనుపడెదను బొత్తుగాఁ జింతమానుము పువ్వుబోఁడి!

ఆ॥ అంచు నూఱడించి యంగీకరింపఁగా నలిపి యింటికేగె నరగ నవల
సంగములు బలుల బొందె రథము లెక్కి కల్యమునందు లేచి కదలిరయ్య!

తే॥ అంత నక్రూరుఁడా రమాకాంతబలులఁ దన యరదమందు నెక్కించి తాను నెక్కి
మధుర కేగెడి వేళలో మార్గములను గొల్లకొలఁదిగ గోపికల్ గుమిగ నిలిచి.

మ॥ అదె యక్రూరుఁడు క్రూరుఁడై యరదమం దారామ హేమాంబరుల్
గుమరం జేసి సమీరతుల్యగతితోఁ గొంపోవుచుం దోతెంచెడిన్
గద! వీక్షించుఁడి! యడ్డగించుఁడి! కసిన్ గారించుఁడీ! దంచుఁడీ!
చెదరంగొట్టుఁడి! నెట్టుఁడీ! కొఱుకుఁడీ! ఛేదించుఁడీ! మించుఁడీ! ౯౬

ఉ॥ ఒండొరు లిట్లు పల్కికొని యుగ్మలు లారథ మధ్యపంక్తి మా
ర్తాండుని గప్పకై వడిని దద్దయు జుట్టును ముట్టి దండిగా
దండెములన్ గ్రహించుచు రథంబును జూర్ణమొనర్చి సారధిన్
రెండను వ్రేళ్లఁబట్టికొని జివ్వనఁ గ్రిందికి లాగివైచియున్. ౯౭

ఉ॥ దద్దులు గట్టునట్టులుగఁ దత్తురగంబుల వేత్రపంక్తితోఁ
దద్దయుఁగొట్టి నెట్టిన రథస్థుల యుక్కడగింప సాగఁగా
గ్రద్దన మాధవుండు గని కంజదళేక్షణలార! తిర్గి నేఁ
బ్రొద్దది గ్రుంకులోపలనె రూఢిగ వచ్చెద నిండ్లకేగుఁడీ! ౯౮

చ॥ అనియిటు పల్కి గోపికల నావల కంపి స్వభక్తు గాందినీ
తనయునిఁ బ్రోచి తేరును ద్రుతంబునఁ జక్కఁగఁ జేసి రథ్యముల్
మనమున భీతినిన్ విడి సుమాళము నొందఁగ మూఁపులందుఁ జే
తను గదుఁదట్టి కట్టియుఁ బతాకను నెత్తి వసింప వేడ్కతోన్. ౯౯

తే॥ గాందినీపుత్రకుండును గాంచి యలరి సజ్జితమగు నారథమును సరగ నెక్కి
రామకృష్ణులు దనవెంట రాజిలంగఁ బ్రోల సాగెను మధురపుం బ్రోవయందు.

ఉ॥ ఆరథకేతు వెందనుక నక్షుల కప్పుడు గోచరించెనో
యారథవాజిసంతతిఖురాహత ధూళులు నెంతదాఁక దై
వాఱెనొ యంతదాఁకఁ గని పాకజనాభుని పల్కు లెంచి శృం
గారవతుల్ విచిత్రముగఁ గాంచుచు నిల్చిరి బొమ్మలో యనన్. ౧౦౧

క॥ క్రమముగఁ గృష్ణుం డక్రూరముసలియుతుఁడై యల మధురాపురిఁ గల బా
హ్యామహోద్యానవనికి హర్షముతోఁ జని రథము డిగ్గి సత్వరగతితోన్.

ఉ॥ అన్నను రాముఁగూడి యమునాపగ కేగియు దాహ మారఁగాఁ
దిన్నగ నీరుఁద్రావి మఱిఁ దేరును నెక్కెను గాందినీజుఁడున్
గ్రన్నన రామకేశవులఁ గాంచి తదాజ్ఞను బొంది తద్ధునీ
సన్నిధిఁజేరి కాల్యములఁ జక్కఁగఁ దీర్చి యనంతరంబునన్. ౧౦౩

—♦ అక్రూరుండు యమునానదిని రామకృష్ణులం దర్శించుట. ♦—

తే॥ నిత్యనైమిత్తికంబులన్ నిష్ఠతోడఁ
జేయ జలములలోనికిఁ బ్రవేశించె నందుఁ
గరము సుడులతోఁ జెలఁగి యగాధమైన
యొక్కయెడ రామమాధవు లొప్పఁగనియె. ౧౦౪

తే॥ కనియు ముక్కున వ్రేలిడి గట్టునెక్కి రథమునందుననున్న యారామహరుల
గాంచి క్రమ్మఱ నదిలోనఁ గనఁగ వార లిర్వురొప్పుట గనియెద నెంచె నిట్లు.

మ॥ కలయో మాయయొ సత్యమో భ్రమయొ నా కందోయి వైచిత్ర్యమో
జలజాతాయతపత్రనేత్ర కృతియో జాలంబొ యింకేదియో
పలుకంజాలను గాని యేమి యిది యా పద్మాక్షునీలాంబరుల్
జలమందున్ రథమందు నొప్పి రొకకాలంబం దభేదంబుగన్. ౧౦౬

క॥ ఏవంవిధి ననుకొని తా భావమునం దలరి మఱియు వారలలోనే
తీవిగఁజూడఁగ సాగెను నావేళను గాందినీజుఁ డాకాళిందిన్. ౧౦౭

సీ॥ వేయిపడగలతో వెలిఁగెడి శేషునిఁ గుండలీభూతునిఁ గూర్మిఁగాంచి
యాతని యుత్సంగమం దద్భుతంబైన గోలోకచిత్రముల్ గోర్కిఁగాంచి
గోపకాళ్యవనానుకూలగోత్రేశ్వరం బైనట్టి గోవర్ధనాద్రిఁగాంచి
బృందకారామ కాళిందీ ధునీమణి సౌందర్యమంతయుఁ జక్కఁగాంచి

తే॥ కోటిమన్మథలావణ్యుఁ గోటిభాస్క
రోజ్జ్వలాంగుని రాసేశునూర్జితయశుఁ
గృష్ణు రాధికాయుతుఁ బ్రభుఁ దృష్ణతోడఁ
గాంచి బ్రహ్మయటంచు నుతించె నిటుల. ౧౦౯

సీ॥ ఎవనిచే జగము నుద్భవమొందు నెవ్వనిచే నిది వృద్ధిని జెందుచుండు
నెవనిచే నిది గిట్టు నెవనిలో నిది యుండు నెవ్వఁ డిద్దానిలో నెసఁగుచుండు
నాది మధ్యలయంబు లంటవో యెవనికి నెవనికిఁ గల్మషం బెదియు లేదొ
నామరూపగుణాదు లేమాత్ర మెవనికి లేవొ యెవ్వఁ డఖిల దేవదేవుఁ

తే॥ డట్టి శాశ్వతుఁడవగు నీ యద్భుతమగు
మాయ నిర్జరభూసుర మానివరులు
తెలిసికొనవప్పు డెఱుఁగఁగలనె? చెపుమ!
నన్ననుగ్రహింపుము కృష్ణ! నందపుత్ర! ౧౦౯

శా॥ పద్మాక్షా! హరి! పద్మవైరికులజా! పద్మోదరా! మానిహృ
త్పద్మేందిందిర! పద్మబాణజనకా! పద్మాలయానాయకా!
పద్మాళిప్రియకోటిరుక్సమరుచీ! పద్మోద్భవాదిస్తుతా!
పద్మవ్యూహసమర్థమాతుల! భవత్పత్పద్మముల్ గొల్చెదన్. ౧౧౦

ఉ॥ చేతులు నీదు పూజలను జేయుట కంఘ్రులు రెండునున్ భవ
త్పావని కేతనంబులకుఁ బోవుటకున్ శ్రవముల్ భవత్కథల్
బ్రాఁతిఁగ నాలకింపఁగ శిరంబు కరంబుగ నిన్ను మ్రొక్కఁగాఁ
జేతము నిన్దలంచుటకు సిద్ధమొనర్పుము నందనందనా! ౧౧౧

తే॥ దేవకీపుత్ర! బ్రహ్మాండదేవ! శరణు
నన్ను మన్నించి రక్షింపుమో నలిననేత్ర!
యనుచు ననులోనఁ గృష్ణుండు నఖిలలోక
సహితుఁడై తిరోహితుఁ డౌట సరిగ నెఱిఁగి. ౧౧౨

తే॥ మఱల నతులిడి సంధ్యాది మహితకర్మ
లాచరించి తీరమునకు నరుగుదెంచి
తిరిగి వెనుకకుఁ గనుచు నచ్చెరువుఁబొంది
హరి పరబ్రహ్మ యని నిశ్చయంబొనర్చి. ౧౧౩

చ॥ అలరుచుఁ దేరునెక్కి యసితాంబరనందకుమారయుక్తుఁడై
జనహితుండు క్రుంకుతఱిఁ జక్కఁగఁ దన్మధురాసమీపమం
దలసు వనంబుఁ జేరె నట నా వ్రజరాణ్ముఖ గోపకుల్ వడిన్
బిలబిలమూఁగిరా పిదప వెన్నుఁడు, నందుఁడు దొట్టివారలన్. ౧౧౪

చ॥ కని యలగాందినీతనయుఁ గాంచి ప్రియంబున నిట్లు పల్కె నో
ఘనచరితా! భవద్రథముఁ గైకొని ముందుగ వీఁడు లోనికిన్
జను మటుపైన మేమును వెసన్ జనుదెంతుము పొమ్మనంగ వాఁ
డును నయభక్తులన్ గడుఁగడున్ గిడిగిళ్ళు బొనర్చి యిట్లనెన్. ౧౧౫

తే॥ పతితపావన! జగదీశ! పరమపురుష! యాదవాభీరయుతముగా భేదము విడి
నా గృహంబునకేతెంచి నలినసౌమ్య పాదధూళిఁ బావనము సల్పన్ నుతింతు.

తే॥ నిన్నువిడనాడి యింటికి నేను బోను జూనె! యని పల్క విని యా యశోదపట్టి
యిట్లు వాకొనె నక్రూర! యేను కంసముఖవిరోధుల నందఱఁ బొడిచి యడఁచి.

ఆ॥ నీవు గోరినట్లు నీలాంబరాభీర సహితుఁడ నగు నేను సత్వరముగ
నీమనికికి వత్తు నీ వాలసింపక లెమ్ము రథముగొమ్ము పొమ్ము పొమ్ము.

## —♦ శ్రీకృష్ణుండు మధురకుఁ జేరుట. ♦—

వ॥ అంత నక్రూరుం డద్దానికి నొప్పి యుషఃకాలంబున మేల్కాంచి తనను మతిం గొని తన యరదంబెక్కి కంసుని సదనముం జొచ్చి యతనికి రామకృష్ణాగమనంబు వినిపించి నిజగృహంబున కరిగె. తదనంతరంబున నపరాహ్ణంబగుడు సాగ్రజుండగు కృష్ణుండు తత్పురీదర్శనలాలసుండై ప్రమాణసన్నాహం బొనర్చుట నందుం డాలోకించి నాయనా! యిది మహాసుకకరంబగు గోకులంబు గాక యతిభయంకరంబగు కంసుని ముఖ్యపట్టణంబని యెఱింగి యార్జవంబు ముందిడుకొని యప్రమత్తుండవై సంచరింపుము. నానుడి మనుచుకుమని హెచ్చరింప నతం డందుల కూరీకరించి నందప్రణోదితగోపకబాలవృద్ధసహితంబుగా నాపురిలోనికి నడుగిడి సల్లడిలం దలరెడి దుర్గంబులను బరిఖలను నప్రంబులను భర్మమయరమ్యహర్మ్యంబులను శృంగాటకంబులను శృంగారోద్యానవనంబులను విపణులను నచ్చరలనుబోలి మరుని చేతికటారులనం దగు మిటారులను యమునాతటినీతటవిలసన్మణిమయసోపానంబులను వెండియు నానావిచిత్రంబులను విలోకింపం దొడంగె. అమ్మెయిఁ జిరంతనమ్ముగ విని శ్రీకృష్ణుని రాకకై చంద్రచకోరన్యాయంబుగా నిరీక్షించెడి నమ్మాధురసుందరీమణు లమ్మాధవాగమనమ్ము విని స్వకృత్యమ్ములం ద్యజించి ప్రాసాదంబుల నెక్కియుఁ గవాటంబుల నక్కియు గవాక్షంబులనుండియు నా దీనపయోనిధిని గాంచి హృష్టాంతరంగలై,

సీ॥ వీఁడఁటే గోపకవిభు యశోదా తపఃఫలపుంజమని యెన్నఁబరగు సుగుణి
వీఁడఁటే పూతన విలయంబుఁ బొందఁగా జనుబాలఁ ద్రావిన ఘనసుతుండు
వీఁడఁటే మందలో వెన్నపాల్పెరుఁగులఁ గాఁజేసి మ్రింగిన గట్టిదొంగ
వీఁడఁటే చిటికినవ్రేలున గిరినెత్తి వ్రేపల్లెఁ గాచిన విదిత బలుఁడు

తే॥ వీఁడఁటే గోపికాంబర వితతిఁగొనుచు భూరుహంబెక్కి చతురత ముచ్చటాడి
డెందములను హరించిన సుందరుండు జలజలోచనలార! యో సకియలార!

సీ॥ వీక్షింపవే! వాని భృంగఘనాఘనోత్కరమునుమీఱు ముంగురుల హొయలు
జూడవే! యాతని శుద్ధరాకాచంద్రుఁ బోలెడి గుండ్రని ముద్దుమొగము
గాంచవే! యాతని కమనీయ పద్మినీకాశంబులైనట్టి కనులసొంపు
గనుఁగొనవే! వాని ఘనకవాటప్రతీకాశమై తనరు వక్షంబు విధము

తే॥ కనవె! యాతని మదమత్తగజసమానయానరమ్యు వీక్షింపవే హస్తిహస్త
శస్తమైన యాజానుభుజములతీరు జలజలోచనలార! యో సకియలార! ౧౨౧

ఆ॥ ఇతఁడు తిరిగినట్టి బృందావనంబును నితనిఁ జూచినట్టి యెల్లవేలు
రాసకేళి నిట్టి రసికుతోఁ గూడిన చేడె లే సుకృతముఁ జేసినారొ? ౧౨౨

ఆ॥ ఈమహాత్ముఁ గనిన యేము ధన్యులమైతి మంచుఁ బొగడుచుండ నచ్యుతుండు
రాచబాటఁ జనుచు రజకుఁ డొక్కఁడు తన కెదురుగాఁగ నిటు వచ్చె జనక!

{ రామాది సహితుండగు కృష్ణుండు రజకునిం జంపి
వాయక సుదామ మాలికుల ననుగ్రహించుట. }

క॥ ఓరీ! మెచ్చిందవురా రారా! నాకడకు రాకు రమ్యాంబరముల్
దేరా! మాటాడకురా పోరా! నామాట వినర పొందర సుఖముల్. ౧౨౪

ఆ॥ అంతనాతఁ డవ్వి యాత్మకోపాగ్ని కాజ్యాహుతులుగ నుండి యనియె నిట్టు
లకట! యెవ్వఁడిట్టు లనలేదు నన్నెవ్వ గాని యాతఁడెవఁడో కనెదఁగాక.

క॥ నీతాతయు ముత్తాతయు నీతండ్రియు నీవుగాని నేత్రంబుల నీ
రీతిగ నుండెడి వలువల నేతఱినే గంటిరొకొ? యెంగిలికాపరా! ౧౨౬

ఉ॥ కావున నోర్మికల్పక యిటేఁకఁ జను మియ్యవి వీరవీరుఁడై
దేవమనుష్యరాక్షసుల దిట్టముగాఁ బ్రహరించి లోకముల్
జేవఁగ నేలు కంసవిభు చేలము లంచు గ్రహించు మాప్రభుం
డీ విషయం బెఱింగిన సహింపక నిన్నెడఁ బెట్టు మర్త్యతే! ౧౨౭

ఉ॥ ఇట్టులఁబల్కు నారజకుఁ గృష్ణుఁడు గాంచి యరే యిదేమిరా!
తిట్టుచు మాటలాడెదవు దేహమెటుంగవె? యేమనత్తురో
యెట్టుల నిన్నుఁ గాచెదరొ? యేనిదె చూచెద నంచుఁ గూకటిం
బట్టి శిరంబు ద్రుంచెఁ దనవార లపారముదంబుఁ జెందఁగాఁ. ౧౨౮

ఉ॥ అంతట వానిజోతి యల యచ్యుతులోన లయించె నట్టి వృ
త్తాంతముగన్న తత్సఖులు తగ్గి కరంబులనున్న దుస్తులఁ
దొంతిగఁ జక్కి ముంగలకుఁ ద్రోసి శరత్సమయాన మబ్బు ల
త్యంతము బాఱినట్లు యథాంఘ్రిబలంబుగఁ బాఱిరో విభూ! ౧౨౯

తే॥ అనల వారలు వదలిన యంబరముల నంబుజాక్షుండు తొల్తొల్త నాత్మకిష్ట
మైన వానిని ధరియించె హలియుఁగూడ మంచివస్త్రంబులం దాల్చె మనసుదీర.

క॥ గోపకబాలురు సైతం బోపికతో నేఁజికొనుచు యుక్తపటంబుల్
జేపట్టి కట్టఁదొడఁగిరి శ్రీపతిబలరాములును విచిత్రముగఁగనన్. ౧౩౦

తే॥ మఱియు మిఁగిలిన వస్త్రముల్ మాధురులును
గొని ధరించి రీచిత్రంబు గనులఁగన్న
యొక్కవాయకుం డంబుజహారదరహాలి
గోపసన్నిధి కేతెంచి కోర్కిఁగాంచి. ౧౩౨

క॥ నిస్తుల పటముల నస్తవ్యస్తముగా వీరు గట్టిరని వారలకున్
శస్త్రవిధంబునఁగట్టెను స్వస్తియశశ్శ్రీలుఁ బరముఁ జక్రి యొసంగన్. ౧౩౩

ఆ॥ అచటనుండి కృష్ణుఁ డగ్రజ గోపక సహితుఁడగుచు లేచి చతురమతిని
బుష్పహారములను బొలుపుగాఁ గూర్చు సుదాముసదనమునకుఁ దరలిచనఁగ.

చ॥ అతఁడల రామకృష్ణులను హర్షమునన్ గని హేమరత్నచి
త్రితవృథుసింహపీఠములఁ దేజరిలం బొనరించి భక్తితో
శ్రుతిహితసత్కృతుల్ సలిపి క్షోణితలంబు శిరంబు సోకఁగాన్
నతులిడి వాఙ్మనఃక్రియల నమ్మి వినమ్రత శౌరి కిట్లనెన్. ౧౩౫

తే॥ భక్తసందోహమందార! బలినిగూడి నీవు నాయిల్లుజొచ్చుట నేను ధన్య
తముఁడ నా యన్వయంబును ధన్యమయ్యె నాగృహంబు పవిత్రమై నా నెమొందె.

తే॥ మఱియు నాతల్లివంక నామగువవంక దండ్రివంకనుండిన యేడుతరములఁదగు
పితరులెల్లరు నిత్తఱి విష్ణులోకమునకు నేగి రటంచెంతు వనజనాభ! ౧౩౭

క॥ సాధుజనరక్షణార్థ మసాధువధార్థంబు జగతి జన్మించితిరో
శ్రీధర! నీకివె మ్రొక్కులు బాధలఁ బోఁద్రోచి యిమ్ము పరమసుఖంబుల్.

చ॥ అని కొనియాడుచున్ మధులిడన్వితవాసిత దివ్యపుష్పముల్
గొని బలరామకేశవుల గోరుమొదల్ దల దాఁక యోగ్యమై
ననెఱి నలంకరించియుఁ బ్రణామముల్ మఱిఁజేయు వారలున్
మనమున నుబ్బి రావల రమాపతి యాతని కిట్లు వాకొనెన్. ౧౩౯

పంచచామరము॥ సుదామ! నీదుసేవలెల్ల సొంపుగాఁ జెలంగుటన్
ముదంబుగల్గె మాకు నిష్ఠె పుణ్యభక్తమైత్రియున్
మదాది శత్రుషట్కహీన మానసంబు భక్తియున్
సదా ఘటిల్లుఁగాక నీకు సంశయంబు లేనటుల్. ౧౪౦

క॥ ఆయెడ బలరాముండున్ నేయముతో నిట్లుపలికె నీకు సుదామా!
యాయుర్వృద్ధియు బలమును శ్రీయును విఖ్యాతి సతము చెలఁగున్ గాతన్.

క॥ వరముల నీరహి నొసఁగియు నిరువురు నటనుండి లేచి యింకొకవీధిన్
దిరుగుచుఁ గని రొక తరుణిని సరసిజనయనన్ బటీరసహితన్ గుబ్జన్. ౧౪౨

—♦ శ్రీరామకృష్ణులు కుబ్జతో సంభాషించుట. ♦—

చ॥ పదపడి రామకృష్ణు లల భామిని నిట్టుల నద్దసాగిరో
సుదతి! త్వదీయ నంగ మెది? సద్గతిమై గట్టించువాఁ డెవండు? పే
రిది? యెట కిప్పుడిట్టు చను మెన్నఁగ నెక్కొనఁ బోవుచుంటివో?
యిది యొక కొంత మాకు నెఱుఁగింపవె? యన నద్ది యిట్లనెన్. ౧౪౩

చ॥ సరసపులార! భూతలమునన్ ననుఁ బిల్తురు కుబ్జయంచు నే
నరవుడు నిప్డు కంసునకు దాసినతైక నుండి గంధమున్
గరముగఁ బూయఁబోయెదను గందముఁ గోరిన మీరె యెల్లెడన్
బురుషవరేణ్యులౌట నిదె పూసెద హస్తము లిట్లు చాఁచుఁడీ! ౧౪౪

చ॥ ఇటుల నచించి చందనముఁ గృష్ణునకున్ యమునావిభేదనో
త్కటపటురామమూర్తికిని దద్దయు రాచి వ్రజార్భకాళికిన్
జటులముగా నలంది పలు జాఁగిలులం బొనరింప వారలా
దటఁబడి రంతఁ జక్రి యల తన్విని గన్గొని యుత్సహించుచున్. ౧౪౫

ఉత్సా॥ గూను నద్ది కంటుటలను గోలుపడిన దేహమున్
మానుగా నొనర్పఁ దలఁచి మగువకాళ్ళ వ్రేళ్ళపైఁ
బూనఁజేసి తిన్నపదముల ముగుదగాఁ దనదు రెం
డైన వ్రేళ్ళఁబట్టి పైకి నద్ది నాగఁదీయుటన్. ౧౪౬

క॥ వంకర టింకరలు విడి శశాంకసతిన్ రతిని రంభ శచి మించిన బ
ల్వొంకపు దేహము కుబ్జకు నంకము లేనట్లు లమరె వారిపదభీనా! ౧౪౭

క॥ సుందరి యగు కుబ్జయు నానందంబును బొంది నందనందనుఁ గని గో
విందా! సుందర! దయ నామందిరమున కేగుదెంచుమా! యీవేళన్. ౧౪౮

తే॥ మఱి రసజ్ఞ! సర్వజ్ఞ! యభిజ్ఞ! నే మారుబారి
కాగజాల నామనము నీయందె చిక్కె
నిన్ను విడలేను రారమ్ము వెన్నదొంగ!
యంచు నగవుతో లాగె నాయవసరమున. ౧౪౯

తే॥ గోపబాలురు చప్పట్లు గొట్టి నవ్వ పెద్దవాఁడైన ముసలియు నొద్దనుండి
చూచుచుండ నీకుబ్జ యశోదపట్టి నెంతపనిజేసె నాచార! యేమియేమి!

తే॥ నలువకైనను వేనోళ్ళ చిలువకైన నంగనాసాహసం బెన్న నలవియగునె?
తగునె నీకిది వీథిలోఁ దలిరుఁబోఁడి ద్రైన నీకులమున కిద్ది యనువుగాదె?

ఉ॥ ఆరహిఁబల్కువారు చెవులార వినన్ హరి, యట్టికుబ్జకీ
ధోరణిఁ జెప్పె నో రమణి! త్రోవ నెఱుంగని వారికిన్ నిజా
గారములందు విందులిడి గౌరవముల్ బొనరింతు రౌర! యీ
యూరఁ జెలంగు వారి కగు యోగ్యతఁ జెప్పఁగలాఁడనే యహో! ౧౫౨

చ॥ నెలఁతరో! పోవె యీ పురిని నేను సుమిత్రులఁగూడి కాంచి నీ
నెలవున కేగుదెంచెదను నిశ్చయ మంచు నిజోత్తరీయమున్
జిలిబిలివల్కులాడి కొని చెచ్చెర వీడ్కొని రాజవీథిలోఁ
గల ధనధాన్యవృద్ధులను గన్గొనె వైశ్యకులాబ్ధిచంద్రులన్. ౧౫౩

ఉ॥ కాంచినతోడ నూరుజులుఁ గంజదళాక్షున కిచ్చి గద్దెన
భ్యంచితపొష్పహారులను, బాల జలమ్ములఁ దమ్మలమ్ములన్
మంచి ఫలమ్ములన్ విరుల మన్ననలం బొనరించి శీర్షమున్
వంచి నమస్కృతుల్ సలిపి పల్కి రిటుల్ ముకుళించి హస్తముల్. ౧౫౪

ఉ॥ శ్రీపతి! భావికాలమునఁ జిత్రతరంబుగ నీవె యిచ్చటన్
భూపవరుండ వైన మము బుద్ధిని రోయక సర్వకాలముల్
జ్ఞాపక ముంచుకొమ్మిదఁ దలంపఁ ద్వదీయుల మేము కామె? నీ
పాపల మాడ్కిఁ బ్రోవు మని పల్మఱు వేఁడి రనంతరంబునన్. ౧౫౫

కం॥ ముసిముసినగవులు నగి సంతసమున నా కోమటులను దైత్యారిపుం డి
ట్టి సరణి నడిగె ధనుస్థ్సల ముసులగు నటు జూపుఁ డిప్డు దూరుజులారా!

చ॥ అనవుడు వైశ్యులందఱు తదద్భుతచాపవిభంగభీతి దా
నిని వచియింప రై రవల నీరజనాభు శరీరసౌష్ఠవం
బునను గుణంబులన్ మిగుల మోహముఁ జెందు తిదన్యులెల్ల రో
తనయ! ధనుస్థ్సలం బిపుడు తప్పక చూపెదమయ్య! రమ్మిటుల్. ౧౫౭

తే॥ అనుచు వారలు చూపిన యధ్వమందు నడచు చాత్మీయసఖులతో నవ్వులాట
మాటలాడుచుఁ జక్రి సుమాళముగను గ్రమముగా నాధనుస్థ్సలికడకుఁ జేరి.

—♦ శ్రీకృష్ణుండు ధనుర్భంగంబు గావించుట. ♦—

సీ॥ స్వర్ణమయంబును సప్తతాలకయుక్త మష్టధాతుసహిత మలఘుతమము
లక్షభారయుతంబు దశపంచసహస్ర మనుజానయోచిత మహితభరము
నైంద్రాధికంబును నరిభయంకరమును వలయీకృతోరగ ప్రభుసమంబు
పార్థివ నాశక భార్గవదత్తంబు కంసగృహీతంబుఁ గాంతికాంత

తే॥ తానుసీసతీకుముఖవస్త్రంబో యనఁగఁ గటికచీకటు లెల్లెడఁ గ్రమ్ముదోడఁగ
భీతుఁడైనట్టినరువలె వెన్నుఁడన్నఁ జెలువఁగూడి యా నందునిచెంతఁ జేరె.

—♦ మధురాపురపురంధ్రీ విరహవర్ణనము. ♦—

క॥ పనపడి మధురావధువులు మదనజనకురూపుఁ గాంచి మన్మథకదచేఁ
జెనరివనుదిగలవారై నసలఁ బటము లొండొరులును బల్కుకొని రిటుల్.

ఉ॥ అంగనలార! యీపురిని నంగజకోటినుచుల్ హరించి శ్రీ
సంగుఁడు నేఁడు వేడుకఁగ జాలఁ జరించెను వాఁడె మాకు స
ర్వాంగములం దనంగమధురాకృతితోడఁ జెలంగి గోచరిం
పంగఁదొడంగెఁ జూడుఁడని పల్కఁగ నంవలిప్రోడ లెల్లనున్. ౧౭౦

మ॥ విని యిట్టుల్ బలుకాడఁగాఁ దొడఁగిరో బింబోష్ఠులారా! జనా
ర్దనుఁ డీయూరను నల్గడల్ దిరిగి తాన్పొవ్వంబునన్ జూచి మి
మ్మును నమ్మంగని పిరె మిన్నలనుచున్ మోహించి సర్వాంగముల్
గని చిత్తంబులు గొప్పఁ నించుఁ గొని వేగంబో యెఁ జోరాభుఁడై. ౧౭౧

క॥ వనమాలి యితం డింకను మనలన్ విడలేక యిప్రుడు మన యంగములం
దున వెలుఁగుచు నుండెడి నని యెఱుఁగుడి ? మీరు లెవల నరయఁగ మఱియున్.

సీ॥ కను లేనుఁగననట్టి కన్నులు కన్నులే సర్పముల్ జొచ్చు బెజ్జములుగాక
యజ్ఞాక్షుఁదాఁకని హస్తంబు హస్తమే మడ్డిగా నుండెడి బ్రెడ్డుగాక
గోవిందుమోవని గుబ్బయు గుబ్బయే దిక్కుమాలిన పెంటదిబ్బగాక
విష్ణూక్తుల విననివీనులు వీనులే గ్రావసంతతవివరములుగాక

తే॥ నీరజాక్షునుఁ బొగడని నోరునోరె చాలఁగా మ్రోఁగుచుండెడి డోలుగాక
హరిచేలుని కూడిక నెఱుఁగనట్టి ముద్దులాడి ముద్దియ యె? పెన్ మొద్దుగాక

సీ॥ కాయంబుతోడుతఁ గాయంబు దివ్యమా నధరంబుతోడ దివ్యాధరంబు
మోముతో మోమును భుజములన్ బుజములఁ గరతలంబులతోడఁ గరతలముల
ఱొమ్ముతో ఱొమ్ము లగ్నమ్ముతో లగ్నము నూరుయుగ్మముతోడ నూరుయుగము
ఘ్రాణానిలంబుతో ఘ్రాణానిలంబును పాదయుగంబుతోఁ బదయుగంబుఁ

తే॥ జేర్చి సందులేనట్టి యాశ్లేషములను గూర్మికొలఁదిఁ జేసికొనుచుఁ గుతుక మొందు
టెన్నడో గద యాకృష్ణుఁ డెట్టులేగెనో గదా యేమి చేయనౌ సువిదలార!

సీ॥ కోటిమన్మథులను దాఁటిన రూపేల యీకృష్ణమూర్తికే యొసకమెసఁగె
యొసఁగెఁబో యాహరి యేల తద్గోకులమందు నుండక యిట కరుగుదెంచె
నరుదెంచెఁబో నాతఁ డరుదుగా నేటికి వీధివీధుల వెంట వెడలవలసె
వెడలెఁబో యేల యాతఁడు ప్రస్తుతంబున నొంటిగా నిట మన కంటఁబడుట

—♦ కంసుండు మల్లరంగంబు నిర్మింపఁ జేయుట. ♦—

ఆ॥ ఆసమయమునందు నా భోజభూపతి పడక విడిచి లేచి భటవరులను
గార్యభారకరులఁ గ్రమముగా రావించి యాజ్ఞచేసె నిట్టు లవనినాథ! ౧౮౩

వ॥ కార్యసాధకులారా! మీరు వేవేగ జాంబూనద స్తంభవిరాజితంబును విపులాంగణసంగతంబును నగు సుశ్వేతవితానమండపంబున కగ్రభాగంబందలి ప్రదేశంబున మల్లక్రీడారంగంబు రమ్యంబుగా నవనవర్ణం బగునట్లు గావింపుఁడన్న వారలాపలుకు లౌదలఁ దాల్చి తత్స్థలంబున నిమ్నోన్నతంబుల సమంబుగాఁ జేసి హేమమయనవరత్నఖచితమంచంబులను రచించి చుట్టును నుంచి ముక్తాహారంబులు వ్రేలాడుచుండు బంగారుజాలులఁబోలిన మేలుకట్టు గట్టి యతిసూక్ష్మములంబగు తెలుగడతో వెలిఁగెడి వేనులవాని గద్దెగద్ద వజ్రంబు లమర్చిన పొన్నులుగల చామరంబులను మరాళసన్నిభంబులగు సితవ్యజనంబులను బూర్ణచంద్రమండలరుచిరంబగు శ్వేతచ్ఛత్రంబునను నమూల్యంబులగు నవరత్నంబులను విరాజిల్లి కనులపండువౌనట్టి నొండు మంచంబుఁ బదియూఱెత్తుఁ దను యేలికకై నిర్మించి యతిచతురంబుగా మల్లరంగంబు సిద్ధంబు సల్ప నయ్యదువీరుం డేతెంచి కాంచి సంతసించి మంగళతూర్యంబులు మ్రోఁగుచుండ వారాంగన లాడుచుండఁ బాటకాండ్రు పాడుచుండఁ దనకై యేర్పాటుజేసిన మంచెపై నాసీనుం డయ్యె. అంతఁ గంసాహూతులగు బాణాసురనరకాసురప్రముఖదనుజవరేణ్యులును జరాసంధప్రభృతిబంధురత్నంబులును నందాదులైన గోపకగ్రామణులును శంబరాసురప్రభృతులగు నాత్మసఖులును సామంతులును మండలేశులును బౌరులును జానపదులు నేతెంచి నమ్రులై వారితోఁ గానుకలను గప్పంబులను సమర్పించి సముచితంబులగు తమ యాసనంబుల నధిష్ఠించిరి. తత్సమయంబునఁ జాణూరముష్టికకూటశలతోశలప్రముఖప్రధానమల్లులుల్లాసంబున నామల్లరంగంబుఁ బ్రవేశించి యవ్యాహతవ్యాయామం బొండొరులు ముద్గరాద్యాయుధంబులతోఁ జేయుచున్న యవసరంబున ౧౮౪

—♦ శ్రీరామకృష్ణులు కువలయాపీడగజంబు వధించుట. ♦—

ఆ॥ రామహరులు మల్లరణకేళిఁ జూడంగ నరుగుదెంచి మోసలందు మిగులఁ
గ్రొవ్వి తిరుగులాడు కువలయాపీడమన్ ద్విరదవరముఁ గాంచి సరభసమున. ౧౮౫

చ॥ తొలఁగి మదేభచోదకునితో హరి యిట్లనె మావటీఁడ! యీ
కలభము నీవు ప్రక్కకటు గైకొని మార్గము మాకొసంగు మి
ట్టుల నొనరింపవేని నిను డొక్కలు చీలిచి యేన్గుతోడఁ గు
క్కల కిపుడేను వేసెదను గాచికొనం గమకింపుమా! యనన్. ౧౮౬

ఆ॥ మావటీఁడు మెండు మండిపడుచుఁ దన్మదేభవరముఁ ద్రోచెఁ గృష్ణుపైని
నంత నదియుగూడ నామృత్యుదేవత యనఁగఁ జెలఁగి మిగుల నాగ్రహించి.

శా॥ శీతాకారంబులు సర్వదిక్కరులకున్ జేడ్పాటు సంధిల్లఁగా
నుత్కర్షంబుగఁ జేసి శత్రుకులనాశో త్తీర్ణతుండంబుతోఁ
గుత్కీలాధిపధారిసిన్ హరిని గైకొం చెత్తె నా కృష్ణుఁడున్
దత్కాలంబున దానినుండి నెటులో తప్పించుకొం చేగుటన్. ౧౮౮

శా॥ కుంభిశ్రేష్ఠము సూచి క్రమ్మఱ లలిన్ గోపించి కుప్పించి త
జ్జంభారాతిసహోదరున్ గరముతోఁ జక్కంగఁ జేపట్టి వే
స్తంభంబుల్ బుసుకించు పాదముల క్రిందన్ వేయుచున్ ద్రొక్కి బల్
జృంభింపంగఁ బతిమ్ము జం పెఘయుఁడై చిత్రంబుగాఁ జూచి తాన్. ౧౮౯

శా॥ [illegible] ౧౯౦

మ॥ అటుపై దానవెరి వైరికరిసింహం బొచుఁ, బద్దాంఘ్రిలు
త్కటరోషంబునఁ బట్టి యూఁచి కిసి మోకాటించి కారించి యు
ద్భటకీర్తిన్ బ్రహరించి మించి పురికిన్ బాజంగ నుత్తేశమున్
బటురవ్వంబున నెంటవంటె నగరిన్ బర్వంగఁ గోలాహలాల్. ౧౯౧

శా॥ పాపధ్వంసకుఁడైన దానవకులప్రధ్వంసకుం డాగజం
బేపన్ గ్రమ్మఱిరమ్ము వర్ధి హరితో నేతెంచు వేళన్ బలుం
డాహరింబుగ దానితోఁడ నల కర్పూరాళి సర్పంబులన్
మాపన్ లాగినలాగు లాగెఁ బృథులావర్షంబునన్ భూవరా! ౧౯౨

క॥ ఆపై శ్రీపతి కని నగి కూపపుచేత్రాకులాగుకొనిన ట్లరిని
ర్వ్యాపణచణమైన కువలయాపీడకరంబు లాగ నారంభించెన్. ౧౯౩

క॥ ఇనుపుసుఁ దుదమొన లిరిహి వజలుచుఁ గరపుచ్ఛములను బటుభుజములతోఁ
బెజకఁగడిఁగ నాగజము పొగరు విడి నిశ్చేష్టమయ్యెఁ గలుషవిదూరా!

శా॥ వానిం గాంచి దురాగ్రహోగ్రనిభులై దర్పించి తచ్ఛోదకుల్
మానుల్ క్షీనిభు లేక్వ నుద్దవిడి తిన్మ త్తద్విపంబెక్కి య
ద్దానిం ద్రోలఁగనాగి వంకుశముతో దైత్యారిపై నింకఁ గ్రో
ధానీనాసిలమూస్తులైన పెజవా రత్యార్భటుల్ సేయుచున్. ౧౯౪

తే॥ మూఁడునందల కనులపై మొనసి యెక్కి
యంకుశాస్ఫాలనంబులన్ హరిహనులను
జంప వానిని ద్రోలి రా సమయమందు
గువలయాపీడమను కరి కోపగించి. ౧౯౫

ఉ॥ చండపరాక్రముండయిన చక్రధరున్ హరియింపఁబోవ నా
తం డలదాని తొండమును ధైర్యముగా బిగఁబట్టి యన్న యం
దుండి కనుంగొనన్ జను లొహోహోయనఁ ద్రిప్పుచుఁ బాఁదె ధాత్రిపైఁ
గొండికవాఁడు గిండిఁగొని కొట్టినయట్టుల ధారుణీశ్వరా! ౧౯౭

ఆ॥ అంత నద్ది గిట్ట నవలఁ దజ్జ్యోతియుఁ గృష్ణమూర్తితో లయించెఁ జక్రి
దాని దంతములను దక్షిణంబునఁబీకి యేద్వారైన మావటీంద్రుఁ జదిపె. ౧౯౮

తే॥ మఱియు సీరి శేషించిన మత్తకరులఁ బట్టి కొట్టెను దత్రత్యబలులు గాంచి
వర్షకాలముజనినట్టి పద్ధతిఁ గని వారిదములు బొఱినయట్లు పాఱి రవల.

క॥ గోపకబాలకయుతుఁడగు శ్రీపతి బలరాముఁ గూడి చిత్రమ్మృగములన్
మాపిన పంచాస్యమువలె నేపునఁ దగి జయరవంబు లెల్లెడ నిండన్. ౨౦౦

తే॥ ఆస్యకాంతి యనూరుని నపహసింప
శ్రమజలంబులు కాల్వలై చనఁగ దంతి
దంతముల్ మూఁపులందునఁ దనరుచుండఁ
జిచ్చుహెచ్చెడి నవిలంబుస్థితిని వెడలి. ౨౦౧

—♦ రామకృష్ణులు చాణూర ముష్టికాద్యసురుల వధించుట. ♦—

తే॥ శిల్పిముఖశిల్పచిత్రవిచిత్రితంబు సర్వభూపసుహృద్భృత్యసంగతంబు
నంగపాటవాదర్శనార్హాంగణంబు కంసకల్పితమల్లరంగంబుకడకు. ౨౦౨

సీ॥ పూఁబోఁడులందఱు పుష్పబాణుండన జెట్టులెల్లరు జగజెట్టి యనఁగ
గోపకులెల్లను గోకులవిభుఁడన దుష్టులు వైవస్వతుం డనంగఁ
బరమయోగీంద్రులు పరమతత్త్వంబన సురజాలములు విరాట్పురుషుఁ డనఁగఁ
నందరాజు స్వకీయ నందనుండని యుబ్బ రాజన్యులును రాజరాజనంగఁ

తే॥ గంసుఁ డాత్మీయమృత్యువుగాఁ దలంప
మఱియు నితరులు దమ తమ మానసముల
నున్నరీతుల నెన్నఁగా నొయ్యనరిగి
నలుగడల్ శోభ నెందఁగ నిలిచె నపుడు. ౨౦౩

తే॥ భోజభూపుండు వచ్చిన పుండరీక
నయనబలులను జచ్చిన నాగవరముఁ
గాంచి యబ్బురముం బొంది కలఁత జెంది
యేమితోఁచక మొద్దుబహీని వసించె. ౨౦౪

గిరాటువేయ నాయసురుం డాగ్రహంబున నుగ్రంపశ్యుండై నిగ్రహించుటయుం దత్సభాంగణమందలి గవాక్షంబుననుండి విలోకించుచున్న యన్నుమిన్న లాయాస సంజనితాంబుసిక్తంబులగు శ్రీరామకృష్ణుల దేహంబులం గాంచి నిట్టూర్పుచ్చి.

మ॥ అరరే! కుబ్జల నీబలాచ్యుతులఁ బుష్పాభాంగులన్ గ్రూరులున్
విరసుల్ వజ్రకఠోరదేహు లమరద్వేషాఢ్యు లౌముష్టికా
సురచాణూరులతో నియుద్ధమును గంసుం డీతఁ డీరీతి ని
ష్కరుణుండై పొనరింపఁజేసెఁగద! యీ కార్పణ్య మల్పంబొకో? ౨౧౨

క॥ అక్కట! యిక్కుఱ్ఱల నిటు ద్రొక్కించెడి కంసుఁ ద్రుంచు శూరవరేణ్యుం
డొక్కం డిక్కడ లేఁడే? లెక్కింపక కనెడివీరు లేకులు గారే? ౨౧౩

ఆ॥ సభకుఁ జనుట తప్పు చనినప్డు సభ్యుల తప్పు నెఱుఁగకుంట దప్పు తెలిసి
యూరకుంట దప్పు దాఱుమాఱుగ నందు బల్కుచుంట దప్పు ప్రాజ్ఞునకును.

సీ॥ అంభోజములమైన నంభోజనేత్రుండు హస్తంబులం గొని యాదరించుఁ
బిల్లఁగ్రోవుల మైన వెన్నుండు గమ్మని యధరామృతం బిచ్చి హర్ష మొసఁగు
నెమిలిపురుల మైనఁ గమలామనోహరుం డుత్తమాంగంబునం దూని మెచ్చుఁ
గడపచెట్టులమైనఁ గరుడధ్వజుం డొప్పి సరససల్లాపముల్ సలుపుచుండు

తే॥ స్వర్ణవరచేలములమైన సకలభువన
మోహనుం డంసమందునఁ బూనితీరు
నిటులు సలుపంగ నేనోము లేలరావొ
యెట్లు జీవింతుమో యమ్మ! యింక మనము. ౨౧౪

మ॥ మన మా గోకులమందు వ్రేతలుగ జన్మం బెత్తినన్ సూర్యచం
ద్రనిలింపేశశివేశపావకమునీంద్రబ్రహ్మధాత్రీమరు
ద్వినుతుండై తగు వీని సద్గుణములన్ వేషంబు రూపాదులన్
గనమా! మ్రొక్కమ! కౌఁగిలించుకొనమా! కామించి క్రీడింపమా! ౨౧౫

తే॥ ఈ మహామహుఁ గనుఁగొన నేమియేమి
నోములను వ్రజవాసులు నోచినారొ
యితనితోఁ గూడి యాడి హర్షించు గోపి
కల యదృష్ట మింత దటంచుఁ బలుకఁ గలమె? ౨౧౬

క॥ గడచినదానికి దుఃఖము పడుటొప్పదు నేఁడు మనకు భాగ్యవశమునన్
విడిముడియొడయని దరిసెన మడరిన యందులకు మనము హర్షింపవలెన్.

శ్రీ గర్గభాగవతము



మ॥ [illegible] ప్రాణసంపత్తి తోల్
[illegible] మ్రుముల [illegible] తిమిరాంబులన్
[illegible] సూర్యులయు [illegible] దిగ్గనా
[illegible] నక్షత్రముల్ [illegible] సంతసం బొందుచున్.

తే॥ [illegible] సులువుగాఁ జేసికొనుచుఁ గంసుండు దప్ప
[illegible] జలముప్పనే? యెచటనైన.

శా॥ [illegible] బాలించి క్రోధభ్రమా
[illegible] వేగన్ సల్పి యోష్ఠంబుల
[illegible] లకు నేత్రప్రీతి శాసించె నా
[illegible] పనులన్ సిద్ధింపఁగాఁ జేయుఁడీ! ౨౨౯

చ॥ [illegible] దేవహాసమును మాపుఁడీ! తండిరిగాక శత్రుపై
[illegible] నాకు బాధలను [illegible] జేసెడి నుగ్రసేనునిన్
[illegible]! [illegible] ఘనంబుగఁబుట్టిన యాదవావళిన్
ద్వారగ వధింపుఁడీ! కరుణఁ దాల్పకుఁడీ! యని పల్కులోపలన్. ౨౩౦

## —♦ శ్రీకృష్ణుండు కంసుని వధించుట. ♦—

శా॥ అంభోజేక్షణుఁ డాఁకటన్ దిరుగు పంచాస్యంబు దానోల్లస
త్కుంభీంద్రంబును జూచి దూఁకునటు శార్దూలంబు మాహేయి సం
రంభస్ఫూర్తిని బట్టఁబోవుకరణిన్ రక్తోష్ట్రజ్వాలత్ప్రాకృపై
దంభంబొప్పఁ జెలంగు కంసవిభుపైఁ దా దూఁకె రుద్రాభుఁడై. ౨౩౧

ఉ॥ పిక్కటిల భోజభూవిభుఁడు భీతిలి మిత్తియె వచ్చె నం చెవన్
చక్కఁ దెగించి మంచె విడి నవ్యకృపాణముఁ గేలఁ దాల్చి గ
ర్వమ్ము చెలంగ మాధవునిపై నరుగన్ గని శౌరి వాని ధై
ర్యమ్ముగఁ బట్టెఁ దార్క్ష్యుఁడు మహాఫణి నుక్కునఁ బట్టినట్టులన్. ౨౩౨

తే॥ కంసుఁ డంతటఁ బుండరీకమును పాము విహగపతినోటనుండి తప్పించుకొనిన
రహిని నెట్టులో కృష్ణుకరములనుండి తప్పుకొని చక్రధరుపైనిఁ దారసిల్లె.

శా॥ కంసుం డున్ మధుహింసకుండు నిటులన్ గ్రావంబుపై సింహముల్
శంసాపాత్రముగాఁగఁ బోరినటులన్ లక్షించి యన్యోన్యమున్
హింసల్ బొందుచు మంచెఁ బోరి రల భోజేశాసుఁ డబ్జాక్షునిన్
హింసింపన్ శతహస్తుఁడై దివికి వే యేగంగ శ్రీకృష్ణుఁడున్. ౨౩౪

తే॥ వేగ వేగను వెంటనంటి కనిఘముగ వానినెంతయుఁ బొఱుచు బాహువులను
ముజ్జగంబులఁగలబల్మి మొనసిపట్టి త్రిప్పి పైనుండి మహిమీఁదికిని ద్రోసె.

తే॥ తనుసరంబు తటిత్పాతపాతంబులట ఘోష మెసఁగ నడ్డపాతముగను,
మంచకంబము విఱుగఁగాంచి యట్టి నర్తనాలయముదల భోజవాత్రీప్రభువు.

ఉ॥ ఇంచుక వ్యాకులాత్ముఁడయి రోషపరీతుఁడు రాచబిడ్డ కో
పించి కృపాణపాణియయి వెన్నుఁడు వాని మహానుభావుఁ డిం
చెంచక పోవుచుండఁ గని కృష్ణుఁడు వానిని దిగ్గి మంచమై
నుంచి యురంబునెక్కి శిరముష్టిఁ బట్టి కరస్థలంబునన్. ౨౩౮

చ॥ సిగ బిగియంగఁ బట్టుకొని చెచ్చెర మంచమునుండి క్రిందికిన్
వగఁగ నెట్టి గండశిలఁ బర్వతశృంగమునుండి నేలకున్
మిగుల బిఱానఁ ద్రోసినటు మేదినినాథ! యనంతవిక్రముఁ
డగుహరి వానిపైఁబడె స్వయంబుగఁ బిత్రుతిశోధనార్థమై. ౨౩౯

తే॥ ఘోర లిద్దఱు నీరహి విపులమైనఁ గూలియుండుట నిద్దర ద్రుంగి సాలి
భాతి నొక్కముహూర్తంబు పట్టలేని ఫకికఁ దుకతుకలాడె నో వసుమతీశ!

శా॥ సింహం బేనుఁగు మీఁదుఁగన్ ధరణిపైఁ జిత్రంబుగా నిడ్చిన
ట్లంహోనాశకుఁడున్ బరాత్పరుఁడు నా నద్దానుఁ డా కంసునిన్
సంహారం బొనరించి చిత్రగతి నా సంస్ఫోటరంగంబునన్
రంహస్ఫూర్తిని నీడ్చెఁ బర్విలిడెఁగన్ రాజుల్ మహాభీతితోన్. ౨౪౦

తే॥ పిదప వైరభావంబుతో విగతజీవుఁడైన కంసుండు వెన్నుని నభినుతించి
యోగిగా నలవాని సారూప్యమొందె భ్రమరకీటకన్యాయంబువలెను జనక!

—♦ శ్రీకృష్ణ బలరాములచేఁ గంసానుజాష్టకంబు హతంబగుట. ♦—

వ॥ ఆ తరువాత నాతని కనిష్ఠభ్రాతలగు సునాముఁడు, సుహ్రువు, సృష్టియుఁ దుష్టిమంతుండును, రాష్ట్రపాలకుండును, శంకుండును, న్యగ్రోధుండును నవ్విధం బునఁ జిన్నాను నవ్వనరుహనాభునిచేఁ గూలియున్న తమ యన్నంగని కన్నులందు విస్ఫులింగంబు లభంగురంబుగాఁ గురియంగఁ గోపించి రూపించి తెగించి విక్రమించి మించి యఘోరంబుగా రవళించి నిశాతహేతిభల్లవ్రాతంబు ధరించి సంగరరం గంబుఁ బ్రవేశించి నరహరిశిరశ్శర్తనం బొనరింప నరుగుదెంచుట దూరంబునుండి రౌహిణేయుం డారసి మృగంబులంగని జంకుగొంకులు లేక గర్జించు సింగంబుభంగి నహంకారంబున హుంకరింప నాపరిపంథు లదరిపడి గడగడవడఁకి గగ్గోలుపడి దండ ఘాతంబులచేఁ జూతంబులనుండి ఫలంబులు జలజలరాలులీల నిజపాణులనుండి కృపాణ

శ్రీ గరభాగవత..



బాణములు వడ వడలునఁ బుడమినిఁ గూలఁబడి వడి లేచి విడివడి వడముడిగురుఁ
డగు నత్తాటిపడగవాని మేనుం బిడికిళ్ళతోఁ గరీంద్రంబులు శుండాదండంబులతో
గిరివరంబు గ్రుమ్మినట్లు బొడువ నమ్మధుసూదనాగ్రజుండు కనలి ముద్గరంబుతో
సృష్టిసునాములం గొట్టి దక్షిణభుజంబున న్యగ్రోధుం బరిమార్చి వామహస్తంబునం
గంకునిం జీంక వేయించె. మఱియు నా రమారమణుండు వామపాదంబున శంకుని,
సుహూనిఁ, దుష్టిమంతుని. నష్టంబు సల్పి దక్షిణపాదంబున రాష్ట్రపాలకుని రూపు
మాపె. ఇట్లా కంసానుజాష్టకంబు వాతసంఘాతఘాతంబుచేత ధరాజాతజాతంబు
పాతంబుఁ జెంది హతంబైనరీతిఁ బీతాంబరనీలాంబరులచే హతంబై కరుణాభరణుం
డగు నా పరమునియందు లీనంబైనసమయంబున. ౨౮౨

సీ॥ బృందారకేంద్రులు విరుల వర్షించిరి కాంచిరి ముదము సంగాతకాంద్రు
రంభాముఖాప్సరోరమణులు నాడిరి పాడిరి గంధర్వభామినులును
జయజయధ్వానముల్ సర్వదిక్కులనొప్పెఁ దప్పెను శిష్టసంతాపమెల్ల
నందాదిఘోషు లానందంబుఁ జెందిరి వొందిరి భీతినిఁబూర్వసురలు

తే॥ విశ్వసృణ్ముఖసురతతివినుతిఁ జేసె
మ్రోసె దుందుభికాహళముఖరతూర్య
ములును మునులును దీవెనల్ సలిపి రరరె!
హరియు హలియు శోభిల్లి రా యవసరమున. ౨౮౩

## —♦ కంసుని భార్యలు విలపించుట. ♦—

క॥ అస్తిప్రాప్తులను సతులు నిస్తులబలుఁడైన మగనినిధనము విని వే
హస్తములన్ హృచ్ఛిరములఁ గసిని బ్రహరించుకొనుచుఁ గన్నీరొల్కన్.

తే॥ భండనాంగణమందు వేదండశవమువలెను బడియున్న కంసునిప్రక్కఁ జొచ్చి
నేడు మాత్రాళ్ళు దెగెనంచుఁ బోడిమి విడి కాకిగోలగ నిట్లేడ్వఁగాదొడఁగిరి.

తే॥ హా మనోనాథ! హా దేవ! హా మహాత్మ! హా సురాసురాధికబల! హా నరేంద్ర!
హా మహావీర! హా యాదవాధినాథ! హా జరాసంధనుతతేజ! రాజరాజ!

శా॥ అయ్యో! యక్కట! చెల్లబో! కటకటా! హా నాథ! యీరీతి మా
కుయ్యాలింపక యేగుచుంటి వెటకో కోర్కిన్ మముం గాంచుమా!
కయ్యంబాడి త్రిలోకసంపదను సౌకర్యంబుగాఁ గొన్న నీ
వియ్యాజిన్ బడియుంటి వట్టి బల మిద్దేమయ్యె భోజేశ్వరా! ౨౮౭

తే॥ అరయఁగా నరులను గాని యమరులందుఁ గాని కర్బురులనుగాని కలనులోనఁ
గసిని నిన్ను డీకొనువారు గలరె చెప్పుమ? యట్టి నీకెటు మృతియేల హత్తెనొక్కొ?

ఉ॥ ఆరయ నీవు నీభగినియందు జనించినపుత్రకాళి ని
ష్కారణరీతిఁ జంపితివి శత్రువులైనను గాకపోయినన్
బౌరుషమే ప్రధానమని భావమునందుఁ దలంచి దిట్టవై
మారణ మాచరించితి వమాయికులన్ యదువంశజాతులన్. ౨౪౮

క॥ తత్కారణముననే నీ వుత్కటబలివయ్యు మృతిని నొందితి వంచే
ముత్కర్షముగఁ దలఁతు మత్యుత్కటపుణ్యాఘసంఘ మూఱకచనునే ?

తే॥ కాన వగచిన ఫల మేమి గలదు మాకు
నుదుటివ్రాతలు కొంచెమ్మేన్ జెనరఁగలవె ?
మే మనాథలమై యిట్లు మెలఁగవలసె
నెవఁడు తప్పింపగలఁడయ్య ! యిద్ధచరిత ! ౨౫౦

తే॥ మఱియుఁ గృష్ణుఁడు మృతుఁడైన మాతులునకు
నంతికంబున దైవాఱి యాగనువిధిఁ
బారలౌకికక్రియలను బూరితిగను
నాచరింపఁగఁ జేసియు నతిశయించి. ౨౫౧

ఉ॥ ప్రేక్షకపాళిఁ జూరిచి గభీరగళంబున నిట్లుపల్కె నీ
రాక్షసనాయకుండు మధురాపురనాథుఁడునైన కంసుఁడా
పక్షులపోల్కి నొంటరిగ వర్తిలు పేదలసాదులన్ గసిన్
శిక్ష యొనర్చె నందున నశించెను నిక్కము మీ రెఱుంగుఁడీ ! ౨౫౩

తే॥ కాన మీరింకఁ దెలివితోఁ గ్రాలవలయునంచు వచియించి తత్కంసు నంగనలను
నూఱడించి కళిందజాతీరమందుఁ జందనాంచితచితులను జక్కఁ గూర్చి. ౨౫౪

ఆ॥ పతికి మఱియు మృతికిఁ బొల్పడ్డవారికి దహనముఖకృతులను దద్దఁజేయఁ
జేసి బలుసఁగూడి వాసుదేవుఁడు వసుదేవు దేవకీసతినిఁ గనంగ. ౨౫౫

—♦ { రామకృష్ణులు దేవకీవసుదేవుల చెఱమాన్పి
యుగ్రసేనునిఁ బట్టాభిషిక్తుం జేయుట. } ♦—

చ॥ యదుకులజాతులం గలిసి యా తలిదండ్రులు గల్గు బంధనం
బుసరికి నేగఁగా ఖగవిభుం డరుదేరఁగ నాగపాశముల్
వదలినమాడ్కి గుత్తముగఁ బాములఁ గట్టిన వారి సంకెలల్
వదలఁగ వారు వీరు భగవంతు లటంచు నెఱుంగులోపలన్. ౨౫౬

తే॥ చక్రి సంభవస్థితిలయ సాధనమును
మోహకరియును నగుమాయఁ బుష్కలముగ
నలముకొనఁజేయ వారలు దెలివిఁ దప్పి
రామకృష్ణులు సుతులని ప్రేమతోడ. ౨౫౭

ఉ॥ కష్టము లిట్లు జెందితిమిగాదె యటంచు వచించునట్టు లా
విష్టపనాథులన్ దరికిఁ బిల్చి కవుంగిళులం బొనర్ప నా
దుష్టనిశాటహంతకులు తోడనె మ్రొక్కి క్షమాపణంబు సు
స్పష్టముగా వచించి తమిఁబల్కిరి తల్లికిఁ దండ్రి కిట్టులన్. ౨౫౮

శా॥ తల్లిం దండ్రిఁ బితామహిన్ గురుని దాతన్ జ్యేష్ఠు నభ్యాగతున్
గల్లల్ బల్కనివాని భక్తు నతిథిన్ గాంతన్ సఖున్ భూసురున్
సల్లాపాదుల సంతసంబు గలుగన్ సాగించు నాతండు హే
చ్చెల్లున్ యోగ్యులలోన నింకఁ బరుఁడో జీవన్మృతుండే కదా ? ౨౫౯

క॥ తల్లికిఁ దండ్రికి నరుసముఁ గొల్లలుగాఁ గూర్చువాఁడె కొడుకగుఁగాదే ?
తల్లిని దండ్రిని బెల్లుగ నల్లరి నొనరించు తులువొ యాత్మజుఁ డగునే ? ౨౬౦

శా॥ అమ్మా ! నాయన ! మాకుఁగా నిటులఁ గారాగార మందుండి క
ష్టమ్ముల్ బెక్కిటిఁ బొంది కుందితిరి మీ స్వామ్యాన్యమే యాస్థితిన్
వమ్మున్ సల్ప సమర్థతన్ గలిగియున్ బాపంగ రానట్టి యీ
మమ్మున్ గుజ్జులటంచు నెంచి దయతో మన్నించి రక్షింపుఁడీ ! ౨౬౧

క॥ ధర్మార్థకామముక్తులు మర్మమువిడి యిడెదునిట్టి మైనొసఁగిన మి
మ్మర్మిలిఁజూడని యీమముఁ గూర్మినిసైరించి నతులఁగొనుఁడీ ! కనుఁడీ !

చ॥ మలినముఁ జెందనీదు గుణమండలి వీడదు స్నేహమున్ విడన్
దలఁపదు దివ్యపాత్రమును దాపముఁ జెందఁగ నీదు ద్రవ్యమున్
దొలఁగెడివేళ సంచలతఁ దూకొన దార ! సుపుత్రదీప మే
కులగృహమందునేన్ మఱొక గొప్పప్రదీపము గల్గనేర్చునే ? ౨౬౩

తే॥ దేవకీవసుదేవులు తేనెలొలుకు
వారి పలుకుల కానందపరవశులయి
రామకృష్ణాఖ్యసుతులఁ గరములఁ గొంచు
ముద్దులాడుచునుండిరో పుణ్యపురుష ! ౨౬౪

ఉ॥ శ్రీమహిళాధవుం డవల స్నేహితసంవృతుఁడౌచు స్వీయ మా
తామహు నుగ్రసేనవిభుఁ దక్షిణమందునఁ బిల్చి తాత ! నీ
వీమెయి రాజ్యపీఠమున నెక్కుము ధర్మయుతంబుగా ధరన్
ప్రేమ దలిర్ప నేలుమెంట వేదవిరుద్ధకుబోధలేనటుల్. ౨౬౫

మ॥ అని వాక్రుచ్చి వియచ్చరుల్ పొగడఁగా నాత్మీయు లామోదముం
గనఁగా నున్నతరాజ్యపీఠమున నెక్కంజేసి యామీఁదఁ గం
సునిభీతిన్ బరదేశ మేగిన యదుస్తోమంబు రావించి చ
క్కని ప్రీతిన్ మధురాపురాన వసతిన్ గావింపఁగాఁ సల్పి తాన్. ౨౬౬

ఉ॥ నందుఁడు గోకులంబును జనం గమకించుటఁ గాంచి వేగఁ గా
ళిందివిభేదియుక్తుఁడయి లెస్సఁగ జోతలసల్పి నాయనా!
యిందున నున్న యెల్లరకు నెల్లసుకంబులఁ గూర్చి యంత మే
మందముగా సగోపకులమై చనుదెంతుము మీదు మన్కికిన్. ౨౬౭

తే॥ తల్లి యెవ్వతయో మఱిఁ దండ్రి యెవఁడొ కాని నిన్ను యశోదను గన్నతండ్రి
తల్లుల విధానఁ గనుచు మీ నయను నెప్డు లింతవారలమైతి మేమిది మరతుమె?

క॥ కాంచిన తలిదండ్రులకున్ బెంచిన తలిదండ్రులకును భేదం బెది గా
న్పించదు కావున వారిని వంచించెడివారలరయఁ బాపులు గారే? ౨౬౯

చ॥ అని వినయంబుగాఁ బలికి యర్హవిధంబున సత్కరించి ప్రీ
తిని బనుపంగ నందుఁడు సుదీర్ణతరప్రణయావశాత్ముఁడై
వనరుహనాభు ముద్దిడి యవారణపద్ధతిఁ గౌఁగిలించి తాఁ
జనియె సగోపకుండయి వ్రజంబున కో బహులాశ్వభూవరా! ౨౭౦

క॥ ఆ వసుదేవుం డానల శ్రీవిభు జన్మర్క్షమందు క్షితిదేవులకున్
గోవులఁ బదివే లిడె రాధావిభుఁ డావిర్భవించుతఱి ననినట్టుల్. ౨౭౧

క॥ దుర్గతివినాశకశ్రుతి వర్గార్థకృతార్థు యాదవకులాచార్యున్
గర్గుని బ్రహ్మణ్యుఁగవి ననర్ఘళమర్యాదఁ బిలిచి యర్చించి యొగిన్. ౨౭౨

తే॥ గురువరా! రామకృష్ణులకు నుభయులకు
వడుగు జేయంగ మిమ్ములఁ బ్రార్థనంబుఁ
జేయుచుంటిని నావుడు క్షితిసురుండు
నొప్పి శుభముహూర్తమున వేదోక్తరీతి. ౨౭౩

తే॥ తొలుత సల్పంగఁదగిన కృతుల నొనర్చి సకలపురుషార్థకర కార్యసాధనమగు
పూతయజ్ఞోపవీతంబుఁ బ్రీతితోడ వేసి వడుగు ముగించెడివేళయందు.

శా॥ కుక్షిన్ లోకములన్ ఘటించి విబుధుల్ గోరన్ సమస్తేష్టముల్
దక్షత్వంబున నిచ్చు రామహరులే తత్సద్గురూక్తిన్ "భవాన్
భిక్షాం దేహి" యటంచుఁ గొంగుఁగొని యాభీరాదిసామాన్యులన్
భిక్షం బెత్తిరిగాదె తద్వినయమున్ జెప్పంగ సామాన్యమే? ౨౭౪

ఉ॥ ఆపయి రామకేశవుల నానకదుందుభి విద్యనేర్ప సాం
దీపనిపజ్జకుం బనుప ధీరత వారలు నేగి తత్సనే
వాపరులై విధేయతఁ బ్రవర్తిలుచున్ సహపాఠియుక్తులై
యోపికతోడ విద్దెల నోహో! యన నేర్వఁ గడంగి రెంతయున్. ౨౭౬

క॥ అఱువదినాలుగువిద్దెల నఱువదినాల్గైనకళల యందలిసారం
బఱువదినాల్గుదినముల నె యఱగోఱలెవిలేనియట్లులందిరి జనకా! ౨౭౭

చ॥ హరిహలు లిట్లు విద్దియలనన్నిటి నేరిచి భక్తితోడఁ ద
ద్గురువరుచెంతకేగి యిలకున్ దలలంట నమస్కరించి యో
గురుసమ! మీరు దక్షిణనుగోరుఁడు మే మిపుడిత్తు మద్ది దు
ష్కరమగుఁ గాక సౌఖ్యకరసాధనమే యగుఁగాక కోవిదా! ౨౭౮

క॥ అనవుడు సాందీపనియున్ మనమునఁ దా నిట్లు తలఁచె మనుజులె వీరల్?
ఘనవిద్యల నన్నింటిని గనుమూసెడిలోనఁ జదువఁగలిగిరి దానన్. ౨౭౯

శా॥ మాయామానుషజన్మముల్ ధర సుధీమచ్ఛ్రేణినిం బ్రోవఁగా
మాయావిప్రతతిన్ హరింపఁగను నిమ్మాడ్కిన్ దయన్ గొన్న యా
మాయాతీతుఁడు సర్వలోకవిభుఁడున్ మాసీంద్రహృద్వాసియున్
ధ్యేయుం డాద్యుఁడు నై చెలంగు పరముండే యంచు నోత్సాహుఁడై. ౨౮౦

చ॥ మృతుఁడగు నాదుపుత్రకు నిమేషములం గొనిరం డటంచు నా
చతురులఁ గోర వారలును సంతసమంది సువర్ణకుంభచా
రుతరరథంబు నెక్కియు మరుద్గతితోడఁ బ్రభాసతీర్థసం
యుతజలధిప్రదేశమున కుద్ధతిగాఁ జని కాలరుద్రులై. ౨౮౧

ఉ॥ బాణము నెక్కుపెట్టుచు నపాంపతిపై నిడులోన నాతఁడున్
నాణెములైన ముత్తెముల నవ్యమణుల్గొని తెచ్చి యట్టి గీ
ర్వాణతతిప్రమోదకరరామరమేశుల కిచ్చి మ్రొక్కి నా
ప్రాణములేల తీసెదరు? బద్ధుఁడ మీనుడికో కృపాళువుల్. ౨౮౨

క॥ అనవుడు కృష్ణుండిట్లనె వనధీ! యట్లైన నీవు పటువీచికలన్
గొనియున్న మద్గురూత్తమతనయునిఁ గొని తెచ్చి నాకుఁదప్పక యిమ్మా!

ఉ॥ ఆవల సాగరుండును భయాతురుఁడై హరికిట్లు పల్కె దీ
నావనబద్ధకంకణఘనా! ఘనవర్ణమనోభిరామ! రా
మావరజా! భవద్గురునియాత్మజు నేఁ గొనలేదు శంఖరూ
పావృతదానవుం డొకఁ డహంకృతితో హరియించె శ్రీహరీ! ౨౮౪

ఉ॥ ఆతఁడొ యెప్డు నాయుదరమందు బలుండయి యెల్లవేల్పులు
స్స్థితిని జెంద నుండు నిఁక నీవె బలంబున నట్టిదానవుఁ
ఘాతమొనర్పఁగాఁదగును గావునఁ దత్స్మృతిసల్పి వే జగ
జ్జేతవు గమ్మనంగ హరి శీర్షము నూఁచి సరే యటంచుఁ దాఁ. ౨౮౫

తే॥ కనకచేలంబులఁ గటిఁగట్టిగాను గట్టి ముజ్జగంబులు వణఁకంగ నబ్ధి
వజ్రకూటాద్రిపాతంబువలనఁగలుగుభయము జెందఁగ నుదధిలో వడిగఁబడియె.

ఉ॥ తద్ధరిపాతఘాతమున దానవుఁ డంబుధినుండి వెంటనే
క్రుద్ధత లేచి యుద్ధమును గోరి రమేశుని పైని శూలముఁ
శ్రద్ధగ వైవ శౌరియుఁ గరంబున నయ్యది పట్టి దానితో
నుద్ధతి వానినిన్ బొడిచె నుర్విని సొమ్మసిలంగ భూవరా! ౨౮౭

ఉ॥ అంతటఁ బూర్వదేవుఁ డిసుమంతగఁ జింతను బొంది లేచి యా
యంతకసన్నిభుం డగుచునచ్యుతునిఁ దననెత్తితోడ న
త్యంతముగ్రుమ్మె సర్పవర మాత్మఫణంబునఁ గిన్కతో గరు
త్మంతుని గొట్టినట్టులుగ మైథిలనాథ! యనంతరంబునఁ. ౨౮౮

తే॥ కైటభారాతియుఁ లయకాలరుద్రుఁడగుచు నాతని తలపైన నాత్మముష్టి
తోడఁ బొడిచెను దద్ధతితోడ వాఁడు కాలమయ్యెను దజ్జ్యోతి కలిసె హరిని.

ఆ॥ లీల హరియు మృతకళేబరమందున నెమకి గురునిపుత్రు నేత్రములను
గనక యందు వెలుఁగు కంబువుఁ గైకొని యబ్ధినుండి వచ్చి యరదమెక్కి.

చ॥ యమపురిలోన స్వీయగురు నాత్మజుఁ డుండునటంచు నెంచి పా
ర్శ్వమునఁ బ్రలంబవైరి తగ వాయుజవంబున దీర్ఘమైన సం
యమినిపురంబుఁ జేరి ప్రలయాభ్రరవంబునఁ బాంచజన్యశం
ఖముఁగొని యూఁదఁగాఁ దొడఁగెఁ గాలునిపాలిటికాలుఁడో యనఁ. ౨౯౧

ఉ॥ తద్రవ మాలకించి విబుధప్రకరం బడలెఁ గృతాంతుఁడుఁ
నిద్రను గన్నవానివలె నేలపయిఁ గడఁబట్టె గొప్పవా
నద్రులు మాఱుమ్రోఁగె నిఖిలాబ్ధులు క్షోభను బొందె దిక్కులన్
భద్రగజంబులున్ బెదరెఁ బాడుచు నాడితి నేను నింగిపై. ౨౯౨

చ॥ ఎనుబదినాల్గులక్షలకు హెచ్చిన యా నరకంబులందునన్
దనరిన పాపులం దెవరు తద్ధ్వనులఁ వినిరట్టివారు ము
క్తిని గని రంత నాజముఁడు తెచ్చి బహూకృతు లెన్నొ యిచ్చి యా
వనరుహనాభుపాదములపైఁబడి గద్గదవాణి నిట్లనెన్. ౨౯౩

ఉత్సాహ॥ రామ! రామ! కృష్ణ! కృష్ణ! రౌహిణేయ! శ్రీహరీ!
యేమి యేమి యిద్ది? యేల యిట్లు సల్పుచుంటిరో?
ప్రేమతోడఁ దెల్పుఁడీపుడు వేగ దానిఁ జేసెదన్
మీమహత్త్వఁ దెలిసికొనెడి మేటిగాను ధీనిధీ! ౨౯౫

మ॥ కమలాక్షుండు తదుక్తులన్ వినియుఁ బల్కెన్ సాగె నీరీతి నో
సమవర్తీ! యటులేని మద్గురుసుతున్ శంకల్ విడంగా నిమే
షమునన్ దోడ్కొనివచ్చి నాకొసఁగి ప్రాజ్యంబైన యీ రాజ్యమున్
క్రమమౌ పద్ధతి నేలుకొమ్మనఁగ నా కాలుండు నాలించి వే. ౨౯౬

తే॥ గురుకుమారునిఁ గొని తెచ్చి సరసఁ బెట్ట
వార లాబాలకుం గొని నడి నవంతి
కాపురింగల యొజ్జకా పాపనిడిరి
గురుఁడు దమ్ము దీవింపఁగఁ గోరికొలఁది. ౨౯౭

వ॥ అంత నాహరిహలు లాత్మగురువరేణ్యున కానందభయభక్తులతో నమస్కరించి వీడ్కొని క్రచ్చఱ సకలాలంకారాలంకృతంబగు శతాంగం బెక్కి మనోజవంబున మధురాపురికిం జనుదెంచి యదుకులప్రేమాస్పదులై ప్రవర్తిల్లుచుండిరి. ఇట్లుండ నొక్కనాఁ డగ్రజసహితుండై కృష్ణుండు బాంధవ్య, భక్తి, బలంబులచేఁ దన మనంబును సంగ్రహించుకొనియున్న యా పాండవులను సంస్మరించుచు నిజభక్తుండగు నక్రూరుని సదనంబున కేగ నతఁడు ప్రత్యుత్థానం బొనర్చి షోడశోపచారంబులం బూజించి సాష్టాంగప్రణామంబు లాచరించి యానందబాష్పోత్ఫుల్లనయనవనరుహుండై దయాళువులారా! మీ రా నాఁ డామార్గంబున వాగ్దానం బొసర్చినకరణిని, నాగృహంబున కేతెంచితిరి. నే ధన్యుండనైతి. నాకులంబు పవిత్రం బయ్యె. గోవిప్రసాధుశ్రుతిధర్మదైవసంరక్షణార్థంబును, గంసాదిదుష్టశిక్షణార్థంబును, సకలబ్రహ్మాండనాయకులును, బురాణపురుషులును, నాదిమధ్యాంతరహితులును, నప్రమేయులును, నక్షరులును, వేదాంతవేద్యులును, బరిపూర్ణతములును, బరాత్పరులునునగు మీరీ లీలఁ జరించుచుంటిరిగదా. మిమ్ముఁ గొండాడ నేనెంతవాఁడ. నా నేఱముల మన్నించి రక్షింప వేఁడుచుంటినని మ్రొక్క నక్కమలాక్షుం డకపటికంబుతో సంభాషించి మఱియు నిట్లనియె.

ఉ॥ పాండవవర్తమానములు బాగుగనున్నవొ లేవొ చుట్టమొ
కండనురాఁడు సెప్పఁడు మృగంబులకున్ నెలవైన కాన ము
న్నుండి సమస్తకష్టముల నొందిరి నొచ్చిరి హెచ్చుగాను నే
నుండియుఁగూడ లాభమెదియున్ గనుపింపదు వారి కియ్యెడన్. ౨౯౮

తే॥ కష్టసుఖముల నారసి కావలసిన పనుల నెరవేర్చి కలహ మెప్పుగిదిఁగూడ
రానియట్లు మెలంగి పరస్పరంబు హాయి గనువారె బంధువు లగుదురయ్య.

ఉ॥ వారిని నేను జూచి బహువర్షములయ్యె నిఁకేమొనర్తు? నే
వారని వారు నేననియు వర్తిలుచుండిన మాకు సాంప్రతం
బీరహి దూరమయ్యెఁగద హెచ్చెడిదుఃఖముచిత్తమందు న
క్రూరుఁడ! వారి నారసి మరుద్గతితో మఱి యేగుదెంచుమా! ౩౦౦

చ॥ అని వచియించి యా యనఘు నంపి బలాన్వితుఁడై స్వకీయమా
మనికికి నేగె నా పిదప మాధవునానతి గాందినీసతీ
తనయుఁడు హస్తినాపురికిఁ దాల్మిని బోయి పృథాకుమారులన్
గని హరి పల్కులన్ వినిచి కాంచి తదీయసుఖంబుఁ బ్రీతితోన్. ౩౦౧

తే॥ మఱలఁ బాండవుల్ చెప్పిన మాటల విని
త్వరగ నటనుండి వీడ్కొని వాయుగతిని
నట్టి మధురకుఁ జనుదెంచి హరినిఁ గాంచి
పాండవోదంతముల్ దెల్పి పలికె నిట్లు. ౩౦౨

మ॥ కమలాక్షా! "కురురాజపుత్రకులచేఁ గష్టంబులం బొందు నీ
మముఁ బోషింపఁగ భావికాలమున నా మానాయకుం జెప్పి కా
లముజేసెం గద మాదు తండ్రి యని యాలాపించి యా పాండవుల్
మిము ధ్యానింతురు మిమ్మునమ్మి యెదలో నేటిల్లుచుంద్రెప్పుడున్. ౩౦౩

క॥ కూటికి గుడ్డకునున్ బలుపాటులఁబడినట్లు తోఁచె బహుదుఃఖ మెదన్
నాటెను నాకును మీతోడ్పాటే ఘటియించెనేనిఁ బ్రబలరె? వారల్. ౩౦౪

ఉ॥ ఇట్టులఁ బల్కఁగావినినకృష్ణుఁడు కన్నుల నశ్రు లొల్కఁగా
నట్టి కురుక్షితీంద్రుపయి నాగ్రహముం జనియింప వెంటనే
మెట్టి కరీంద్రపత్తనము మేడ మొనర్చి జయించి వానిచే
నట్టి పృథాకుమారులకు నర్ధధరిత్రి నిడన్ బొనర్చె తాన్. ౩౦౫

క॥ అలరుచు మధురకుఁ జని మును పలికిన నుడి ననుసరించి వడి నుద్ధవసం
కలితుండై మంగళదము లలితము కుబ్జావధూనిలయమున కరిగెన్. ౩౦౬

ఉ॥ దూరమునుండి మారుసతితోఁ దులదూఁగఁగఁజాలినట్టి కు
బ్జారమణీలలామ యలచక్రినిఁ గాంచి మహాప్రియంబుతో
నీరు సువర్ణకుంభమున నింపుచుఁ బాద్యము లిచ్చి పూజలన్
గోరికదీఱ సల్పి మణిగుంఫితపీఠమొసంగి మ్రొక్కఁగాన్. ౩౦౭

తే॥ మదనజనకుండు మెచ్చి యామదవతిమిన్నఁ గూడి కూర్చుండి భాసిల్లెఁ గోటిమన్మ
థాంగుఁడగు తానె యుజ్జ్వలదాసనమున శ్రీసతీమణితోడ భాసిల్లినట్లు. ౩౦౮

వ॥ అట్లు కుబ్జామందిరంబునం దెనిమిది ప్రొద్దులు వైకుంఠుండు వైకుంఠం
బునఁ గాలంబుగడపినట్లు గడిపి నిజసదనంబునకుం జనె. ౩౦౯

తే॥ జనక! యాకుబ్జతపమెన్న శక్యమగునె? మానివర్యు లనేకజన్మంబులెత్తి
తపమొనర్చియుఁ గననట్టి దానవారిదర్శనంబయ్యెఁగాదె? తత్తన్వి కటులు.

తే॥ పాపహరమును శ్రీహరిప్రాప్తికరముఁ
బుణ్యదమునగు నాచక్రి పూతగాథఁ
జెప్పియుంటిని మఱియేమి చెప్పవలెనొ
యానతింపు మహారాజ యన్ననతఁడు. ౩౧౧

## రజక పూర్వజన్మ వృత్తాంతము.

మ॥ బుభుమానీంద్ర! భవన్ముఖాబ్జమున నే భృంగాయమానుండనై
స్వాభుచారిత్రమరంద మానితి సురప్రత్యర్థికేశ్యాది పూ
ర్వాభవోదంతము కంసగాథ తెలిసెన్ వ్యక్తంబు కానట్టి కం
సభటుడౌ నల చాకివానికత మీర్చక్కంగ బోధింపుఁడీ! ౩౧౨

క॥ దగఁగొనుజను మనమెటు లింపగు నీరును నభిలషించునటు నా మనమా
సొగసగు కథనే విన హెచ్చుగ నాకాంక్షించుచుండె సురమునివర్యా! ౩౧౩

ఉ॥ ఆమెడ నిట్టులన్ బలికె నబ్జజజాతుఁడు రాజవర్య! త్రే
తాయుగమం దయోధ్యను సధర్ముఁడు రామవిభుండు రాజ్యమున్
హాయిగ నేలునప్పు డొకయర్ధనిశిన్ రజకుం డొకండు కో
పాయతరక్తనేత్రుఁడయి యాత్మసతిన్ బ్రహరించి యిట్లనెన్. ౩౧౪

శా॥ ఓసీ! ఛానిస! సిగ్గులేదె? యిఁక నిందున్నావె? ఛీ పొమ్ము నీ
మోసం బిచ్చట సాగునే? కదలవే? పోవే? కులంబెల్ల నీ
కోసం బెప్పుడు గుండెడిన్ బరునిదాకొంపన్ నెలల్ క్రొల్దిగా
వాసంబున్ దమి సల్పినట్టి సతికేల్ పట్టంగ రాముండనే? ౩౧౫

చ॥ అది వినినట్టి చారులు గృహస్థులు భూవరుతోడఁ జెప్పిరా
యదనున రామచంద్రుఁడు కటా! యని ఖిన్నతఁబొంది దైవమా!
యిది యపకీర్తి యెట్లుమరె? నెట్టిదిపోవు నటంచుఁ గీర్తికై
తుదకొక కానకంపెఁ దనదోషవిదూరగను ధర్మపత్నినిన్. ౩౧౬

తే॥ పాపరహితు లౌవారు లోకాపవాదమునకు భయపడి పైయట్లు బుద్ధిపూర్వ
కముగ నొనరింత్రు కాని తత్కలుష మట్టియప్రతిష్ఠఁబన్నినవాఁడెయనుభవించు.

తే॥ అందువలననె యాచాకి యా కలుషమననుభవింప మాజల ద్వాపరాంతమందు
నశుచులకు మూలనూ రజకాన్వయమున జన్మమెత్తి కంసునిసేవ సల్పుచుండె.

క॥ ఈసమయంబున స్వాయముగ నా సీతావిభుఁడు పుట్టి యపనిందలపా
ల్జేసినవానిని జంపియు దోసములం బాపి కరుణతోఁ బరమిచ్చెన్. ౩౧౯

క॥ వాఁడే వీఁడని యెఱుఁగుము! జేజా! యపకారి కుపకరించి పరంబా
జాడనిడిన శ్రీవిష్ణుని పోఁడిమి గుర్తెఱుఁగ మనకుఁబోలునె చెపుమా! ౩౨౦

—♦ వాయకసుదాముల పూర్వజన్మ వృత్తాంతము. ♦—

క॥ అనవుడు భూవరుఁ డిట్లనె మునివర! వనమాలిచేత మోక్షంబును బొం
దినవాయకుతొలిచరితంబును జెప్పఁగ మీకు జోతములఁ బొనరింతున్.

తే॥ అనఁగ నారదుఁడిట్లనె నధిప! మున్ను దశరథాత్మజరాఘవోద్వాహకాల
మందు నీ మిథిలాపురియందు నొక్క వాయకుఁడు సీరధ్వజప్రభునియాజ్ఞ.

తే॥ రామలక్ష్మణులకొఱకు హేమచేలములను జిత్రరీతులఁగూర్చిభూపునకిడ
నతఁడు జామాతలకొసంగ నాయుభయులు నేయమునఁగట్టి రప్పుఁడావాయకుండు.

ఉ॥ కన్నులపండువౌనటులఁగాంచి బళీ యని వారికీర్తిఁ దా
నెన్నుచు రామలక్ష్మణులకెన్నఁడు సన్నిపట్టుపుట్టముల్
మన్నన నిట్టు లిచ్చెదనొ మంచిగ వారి నలంకరించి యిం
కెన్నఁడు హర్షమొందెదనొయేమొ యటం చెదనెంచు సంగతిన్. ౩౨౪

క॥ రాముఁడు కరుణాధాముఁడు ప్రేమను గని ద్వాపరాంతవేళను నిదియా
నో ముఖ్యభక్త! యని వర మామోదమున నిడె వాయకాఖ్యున కిచ్చన్.

ఉ॥ ఆవల వాయకుండు మిహిరాన్వయసాగరచంద్రుఁడైన సీ
తావనితేశుసత్కృపను ద్వాపరఘుందుదఁబుట్టి నెమ్మితో
నావిధి రామకృష్ణుల కనర్ఘ్యపటంబు లలంకరించి తాఁ
గేవలమొందె ధాన్యధనకీర్తులఁ బూర్తిగఁ బొంది భూమిపై. ౩౨౬

క॥ అంతట మిథిలాకాంతుఁడు సంతసమున నిట్టు లడిగెస్రష్టృసుతా! శ్రీ
కాంతుం డేల సుదాము నిశాంతమునకు నేగె నట్టిసంగతిఁ జెపుమా! ౩౨౭

క॥ అనవుడు సురముని యిట్లనె జననాయక! మున్ను ధనదుచైత్రరథవనం
బున సుమవటుకుండగు నొక ఘనుఁడుండును హేమమాలికమనీయాఖ్యన్.

ఉ॥ ఆతఁడు న్యాయశీలుఁడు మహాత్మవిధేయుఁడు స్వీయభామినీ
ప్రీతికరుండు నన్యజనవిత్తసతీవిముఖుండు ధీవరుం
డాతతదానశీలుఁడు తదచ్యుతపాదసరోజబంభరీ
భూతుఁడునై చెలంగెడిని భూవర! యాతఁ డనంతరంబునన్. 3౨౯

క॥ హరి దర్శనంబుఁ గోరుచుఁ నరవిందము లైదువేల నాస్థగఁగొనుచున్
ధరణీ శంకరుఁడగు శంకరునిన్ బూజించె నాత్మకరములతోడన్. 33౦

ఉ॥ క్షీరవనముద్రమంథనముచేత జనించిన క్ష్వేళధార న
వ్వారిగఁ దాపమొందు నల బ్రహ్మముఖామరపంక్తిఁజూచి యా
ఘోరవిషంబశేషముగఁ గ్రోలి గుటుక్కున; సర్వలోకముల్
ధీరతఁ బ్రోచినట్టి శివదేవుఁడు మాకు బ్రసన్నుఁడయ్యెడిన్. 33౧

ఉ॥ అంత బ్రసన్నుఁడై గిరిశుఁడా ప్రియభక్తున కిట్లుపల్కె నీ
వింతగ నాకుఁ బూజలను నేల యొనర్చుచునుంటివి? వట్టి వృ
త్తాంతముఁజెప్పు మిప్పు డది దప్పక యిచ్చెదఁ గోరుమా! యనన్
సంతసమొంది యాతఁడిటుఁజక్కఁగ వేఁడె ననన్యభక్తితోన్. 33౨

క॥ చంద్రాననార్ధదేహా! చంద్రకిరణధవళవర్ణ చంచద్గాత్రా!
చంద్రార్కానలనయనా! చంద్రార్ధమనోజ్ఞశీర్ష! సాంద్రానందా! 333

తే॥ వామదేవ! మహాదేవ! వందనములు విశ్వనాయకుఁడైన యావిష్ణుమూర్తి
మద్గృహంబున కేతెంచి మన్ననలను గొని చనెడి వరంబియ్యఁగోరుచుంటి.

ఆ॥ అనుట మిత్తిగొంగ యాలించి మేలని ద్వాపరాంతమందుఁదప్పకుండ
నీవడిగినవరము నెఱవేఱునని పల్కె నంత నతఁడు ద్వాపరాంతమందు. 33౪

క॥ పుట్టి సుదాముండను నట్టి మథురయందుఁ జెలఁగ నా నలమురితా
ల్పట్టుల నాతనిసద్మము మెట్టి తదర్చలనుబొంది మేలు లొసంగెన్. 33౬

క॥ మఱియెయ్యది వినవలతువొ సరిగా వచియింపుమన్న జనకుఁ డిటులనెన్
దురితహరంబగు కుబ్జాచరితంబును దెల్ప నతుల నల్పెద మానీ! 33౭

## ♦ కుబ్జా పూర్వజన్మ వృత్తాంతము. ♦

ఉ॥ నావుడు నారదుం డిటు లనందొడఁగెన్ ధరణీంద్ర! మున్ను నీ
తావిభుఁ డట్టి పంచవటిఁ దమ్ముఁడు భార్యయు వెంటనుండ నా
రావణు తోడఁబుట్టువు సురప్రకరప్రతికూలఘోరరూ
పావృతయైన శూర్పణఖ! యచ్చటకేగి మహాజవంబునన్. 33౮

ఉ॥ రామునిఁ గోటిపుష్పశరరమ్యశరీరుని నేకపత్నితో
నేమముగాఁ జెలంగు ఘనునిం గని మోహముఁబొంది దుష్టయై
రామసతిన్ ధరాసుత నరంబున మ్రింగఁగఁబోవుటన్ సుమి
త్రామహిళాసుతుండు కని తత్క్షణమునందునఁ బట్టి దానినిన్. ౩౩౯

తే॥ కత్తితోఁ గోసె నాసికాకర్ణములను
గోసి పంప నా రాక్షసి గోడుఁజెంది
యన్నయా రావణునితోడ నది వచించి
పుష్కరమను తీర్థమునకుఁ బోయి యచట. ౩౪౦

క॥ పదివేలేడులు శ్రద్ధగ మదనరిపుండైన హరిని మదినెంచి తపం
బదవదలేనటుసల్పెను బదపడి యా శంకరుండు ప్రత్యక్షుండై. ౩౪౧

క॥ వరమేమి నీవు గోరెదో త్వరగా వచియింపుమన్నఁ దత్సతి దేవా!
స్మరసమరాముఁడు హృదయేశ్వరుఁడౌనటు వరము నా కొసంగుమనంగన్.

క॥ భూతేశుండనె నిటు నీ చేతస్సుననున్న కోర్కి సిద్ధించెడి నో
నాతీ! ద్వాపరకాలాతీతసమయమందు వాసుదేవముఖమునన్. ౩౪౩

చ॥ పదపడి నట్టి శూర్పణఖ ద్వాపరపుంగొనఁ గుబ్జనాగఁ దా
నుదయముఁ జెందియుండ హరి; యుగ్రు వచస్సు ఫలంబుసల్పఁగా
యదుకులమందుఁ బుట్టి యటు లాసతియింటికినేగి భర్తయై
ముదమును బొంది కొన్ని దినముల్ వసియించె నటంచెఱుంగుమా! ౩౪౪

—♦ కువలయాపీడగజ పూర్వజన్మ వృత్తాంతము. ♦—

వ॥ వెండియు నీవేమి వినెదవో తెలుపుమన నాబహులాశ్వుఁ డో మునివరా! కువలయాగజం బా గరుడధ్వజునిలోన నెట్లు లీనంబైనదియు దాని పూర్వచరితం బెట్టిదో వినిపింపుఁ డన నాయోగిపుంగవుండు దేవా! తొల్లి బలిపుత్రుండును నాయతకాయుండును, సర్వశాస్త్రార్థప్రవీణుండును, మహాబలుండు నగు మందగతి యను దైత్యుం డొకం డొకసమయంబున శ్రీరంగయాత్రకై బయలువెడలి మదద్వీపంబు కై నడిఁ బధికులం బడఁద్రోయుచుఁ బోవుచుండ వృద్ధుండును, బలహీనుండును నగు త్రితుండను మహాముని నేలపై నెత్తురువఱదలై పాఱఁ బడి ఓరీ! దుర్మతీ! నుదోన్మత్తుండవై మత్తేభంబుమాడ్కి సంచరించుచు నిష్కారణంబున నన్ను బడఁద్రోసితివి! కాన గజత్వంబును బొందుమని శపింప నతం డా త్రితమునికి నతులిడి దయాకరా! యీ శాపం బేను భరింపఁజాల; నాగజత్వంబున కెప్పుడు ముక్తి గలుగు? మీబోటి మహాత్ములకుసైతం బిట్టి యాగ్రహంబు దగునే? మీరు నిగ్రహానుగ్రహసమర్థులు గదా! రక్షింపుఁ డని ప్రార్థించుడు నమ్ముని శాంతించి నావచనంబు రిత్తకాదు

ఐనను నీభక్తికి మెచ్చితిఁగాన ద్వాపరాంతమందు మధురాపురిని సంచరించు శ్రీకృష్ణుని హస్తంబున గజరూపంబున నున్న నీకు ముక్తి కలుగునట్లు వరం బిచ్చితి. ఇద్ది గైకొని శోకింపకుమని పల్కెఁ. అంత నామందగతి యారీతిని నయుతద్విరద బలంబుగలిగి కువలయాపీడమను పేరుతో వింధ్యాద్రియం దుద్భవించియుండ మాగధేంద్రుండు లక్షగజంబులతోఁ జని దానిని స్వాధీనంబుఁ జేసికొని కంసునకు పారిబర్హంబుగా నిడె. ఇట్లా కంసనికటంబున నుండి శాపావసానం బేతెంచుడు తద్ధరి హస్తంబున నిహతంబై యతనిలోన లీనంబయ్యె. ఇదియ తచ్చరితంబు. మఱియేమి విననలతువో తెల్పుమన జనకుం డానందించి మునీంద్రా! యనంతబలుండగు శ్రీకృష్ణునితో మల్లయుద్ధం బొనర్చిన చాణూరముష్టికాదిమల్లులచరితంబు విన నిచ్ఛఁగలదని ప్రార్థింప నారదుండు ధారుణీంద్రునితో నిట్లనియె. ౩౪౫

## —♦ చాణూరాది మల్ల పూర్వజన్మ వృత్తాంతము. ♦—

క॥ అమరావతిపురమున మును విమలుండగు నుతథ్యనాని వెలయు నతనికిన్
గ్రమముగ సుతు లైదుగు రుదయముఁ జెందిరి పుష్పశరసమాకృతు లగుచున్.

ఉ॥ వారు దినక్రమంబునఁ బ్రవర్ధన మొందుచుఁ దల్లితండ్రులన్
మీఱి యథేచ్ఛగా శ్రుతిసమీహితమౌ నిజజాతిధర్మముల్
దూఱి సతంబు విద్యవిడి తోమరముద్గరకుంతపంక్తి దై
వాఱఁగ నేస్థలంబునకొ పాఱి నియుద్ధము నేర్చుచుండుటన్. ౩౪౬

తే॥ కన్నతండ్రి గనుఁగొని కనులకొనలనుండి నీరు వెల్లిగఁ బాఱుచుండ మిగుల
వ్యసనముం బొంది మిక్కిలి యలుకగలుగ భ్రష్టులౌ తనసుతులకుఁ బలికె నిట్లు.

తే॥ ఆర్జవము శమమును దమంబాస్తికతయు క్షాంతి శౌచము జ్ఞానవిజ్ఞానములును
జపము ననునివితొమ్మిది ధాత్రి దేవతలకు నియతధర్మము లండ్రు ధర్మవిదులు.

క॥ శౌర్యం బీశ్వరభక్తియు ధైర్యము దానంబు ప్రతిభ దయయును యుద్ధ
స్థైర్యము తేజము బుజగతి యార్యార్చయు క్షత్రియులకు నగు ధర్మంబుల్.

తే॥ పశుపాల్యంబు కృషియును బ్రాహ్మణసుర
భక్తి వాణిజ్య మనునివి వైశ్యులకును
నిర్జరాగ్రజసేవయు నిజకులోచి
తక్రియయు శూద్రులకు నౌనుధర్మములుగ. ౩౫౧

ఉ॥ పుత్రమిషన్ జనించి పలుపోకలఁ బోవుచు ధర్మదూరులై
రాత్రిచరాభులై ననుఁ గరంబుగ బాధలఁ బెట్టుచుంట మీ
ర్మత్రువులైతి రంతియ రసాతలదేవులె? మీరు? మీకృతుల్
క్షత్రియజాతిధర్మములుగావొకొ? కుత్సితులార! తెల్పుఁడీ! ౩౫౨

తే॥ వేయిమాఱులు సెప్పినన్ వినక మీరు స్వేచ్ఛగాఁ దిర్గుటను మీకు వేగ నసుర
కులభవంబును నసురునికూడిక దగ మల్లవిద్యాప్రసంగంబు సెల్లుగాక. ౩౫౬

క॥ అని శపియింపఁగ వారలు దనుజకులమునందుఁ బుట్టిదానవమైత్రిన్
దనరి నియుద్ధకృతార్థతఁ గని యటు హరిచేతఁ జచ్చికాంచిరి ముక్తిన్. ౩౫౭

తే॥ వార లైదుగురట్టి చాణూరముష్టి కశల తోశల కూటులుగాదె యన్న
మునముఁజెందిన బహులాశ్వభూవరుండు కంసు తమ్ముల కథఁదెల్పఁగా నుతింతు.

—♦ కంసానుజాష్టక పూర్వజన్మ వృత్తాంతము. ♦—

తే॥ అనఁగ నాముని యిట్లనె నలకయనెడు
పురినిఁ దొలి దేవయక్షుడన్ సరసుఁ డొకఁడు
జ్ఞానపరుఁడును జ్ఞాని యక్షకులజుండు
ఖండపరశుపూజకుఁడు నైక్రాలుచుండు. ౩౫౮

వ॥ అవ్వానికిఁ గాలక్రమంబున దేవకూట, మహాగిరి, గండ, దండ, ప్రచండ, ఖండా ఖండ పృథువులను నెనమండ్రు కుమారు లుద్భవిల్లిరి. వారలొయ్యనొయ్యఁ బెరిఁగి యొకనాఁడు జనకునియాజ్ఞను మానసరోవరంబునకుఁజని మధుపధ్వనిసంభృతంబులగు సహస్రారవిందంబులం గైకొని వాసనాలోలుభులై యాఘ్రాణించి యవ్వానినే తెచ్చి నిజపిత కొసంగిరి. అవ్వి ముక్కంటికిం బూజింపఁబడినను దదుచ్ఛిష్టీకృతదోషం బాకుమారాష్టకంబున కాపాదించె. దాన నవ్వార లసురజన్మంబుల ముమ్మాఱెత్తి పిదప న్యగ్రోధాదినామంబులతోఁ గంసానుజులై పుట్టి లోకశంకరులగు శ్రీకృష్ణబలరాములచే నిహతులై ముక్తులైరిగదా! మఱియుఁ దత్సాందీపసుపుత్త్రిని హరించిన శంకరూపావృతపంచజనుని పూర్వజన్మవృత్తాంతంబు వినుమని యిట్లనియె.

—♦ పంచజన పూర్వజన్మ వృత్తాంతము. ♦—

తే॥ అధిప! మున్ను చక్రాదు లాయంబుజాక్షు
నకు నుపాంగములుగనుండి నాణె మొందె
నందుఁ బాంచజన్యము శంఖ మధికమైన
హరిముఖంబును బొందె యిట్లాత్మనెంచె. ౩౫౯

ఉ॥ ఆర్తజనప్రియుండయిన యచ్యుతుఁడీ ననుఁగొంచు దక్షిణా
వర్తము గెల్వఁజాలెను నహంపతిపుత్రి కసాధ్యముల్ సుధా
పూర్తము రుచ్యమైన హరిమోవిని రాజమరాళకాంతితోఁ
బూర్తిగ నానుచుంటి ననుఁబోలుదురే? యెవరేని నిద్ధరన్. ౩౬౦

చ॥ అనుచు నఖర్వగర్వమున నాడుకొనంగ దదీయవక్షమం
దున వసియించు లక్ష్మి చెవితో విని వెంటనె దానిఁజూచి యి
ట్లనియెను శంఖమా! త్వరఁగ నాసురజన్మముఁ జెందుమో కుధీ!
ననుఁ బెఱవారి దూఱుదువె? న్యాయమె? యంచు శపింప నద్దియున్.

ఉ॥ పంచజనాఖ్యుఁడై తగి యపాంపతియందు నిశాటజన్మమున్
గాంచి ససింపఁగా దొడఁగి కంజదళాక్షుని యొజ్జకుఱ్ఱ బా
ధించి హరించి శ్రీపతిహతిన్ మృతుఁడై హరికేల శంఖమై
పొందిత దేహమున్ వెలుఁగ నాత్మయు నా హరియాత్మఁ జేరఁగాన్. ౩౮౯

తే॥ ముక్తిఁ బొందెను నిద్ది యద్భుతముగాదె?
మనుజనాయక! యింకేమి వినఁదలఁతువో?
నుడువుమా! యన్న రాజవరుఁడును సంత
సించి భక్తియుక్తుఁడయి పృచ్ఛించె నిట్లు. ౩౯౦

— శ్రీకృష్ణుం డుద్ధవుని గోకులంబునకుఁ బంపుట. —

ఉ॥ నారద! శౌరి యా మధుర నన్యముగా మఱి యేమి చేసెనో
కూరిమితోడఁ జెప్పుమని కోరఁగఁ దన్ముని యిట్లు పల్కెనో
భూరమణా! జనార్దనుడు బుద్ధిఁ దలంచెను నొక్కవేళ నా
భీరవధూలలామసురభిప్రకరాన్వితగోకులంబునున్. ౩౯౧

చ॥ తలఁచి యతుల్ సహోమహుఁడు తక్షణమందు రహస్యరీతి నె
చ్చెలిని స్వకీయభక్తుని సుశీలుని నేర్పరి ధీరు నుద్ధవున్
బిలిచి యొసంగి జాబులను బ్రీతిని నిట్లనె మిత్రవర్య! గో
కులమున కేఁగుమయ్య! మనకోరికలీరికలెత్త నిత్తఱిన్. ౩౯౨

చ॥ చని యొకజాబు నందునకొసంగుము రెండవదైన యుత్తరం
బు నల యశోదకిమ్ము మఱి మూఁడనకమ్మను రాధకిమ్ము న
న్ననవుముగూడు నెచ్చెలులకారసి నాల్గవదిమ్ము నెమ్మనం
బున నెనరుంచి తక్కినవి ముగ్ధల కిమ్ము సుమిత్రచంద్రమా! ౩౯౩

సీ॥ అనయంబు నాతోడ నాడుచుఁ బాడుచు బుజ్జగించు పితకు మ్రొక్కులనుము
పనులను రేయియుఁ బరమప్రియంబునఁ బోషించు తల్లికి మ్రొక్కులనుము
సతతంబు నాతోడ సల్లాపములఁజేసి ముద్దాడు రాధకు ముద్దులనుము
సంగాత మొనరించి సర్వచమత్కృతుల్ చూపిన సఖులకు సుకమె యనుము

తే॥ మద్వియోగంబునై పనిమానినులను మదుదితోక్తుల లాలింపుమా వ్రజంబు
నందు నుండు నెల్లరకు నత్యల్పకాలముననె తప్పక రాఁగలఁడనుము కూర్మి.

తే॥ మఱియు నక్రూరుతోఁగూడి మా వ్రజంబు
విడిచి చనుదెంచుమార్గంబు వేగ నడ్డ
గించి నన్నిల్పు గోపికాసంచయమున
కల్పకాలములో వత్తుననుము మిత్ర! ౩౬౫

తే॥ మఱియు నాకయి దేహముల్ మంటఁ గలుప
సిద్ధముగనున్న చెలులకు బుద్ధిచెప్పి
ప్రీతి సమకూర్పుమో హితవ్రాతముఖ్య!
పంపుచుంటిని నమ్మి నేర్పరినటంచు. ౩౬౬

ఉ॥ నాచెలివంచు వారు నిను నమ్ముటకై యివు డానవాలుగా
నాచెవిసొమ్ముఁ గౌస్తుభము నవ్యహరిత్పటపద్మమాలలున్
జాఁచిన వేయి రేకులను జక్కఁగ నొప్పెడు పంకజంబుఁ బు
ష్పాచితయష్టియున్ మురళి యంగదముల్ మకుటంబుఁ బొందియున్. ౩౬౭

తే॥ నావలెన్ నీవు వేషంబునాణెముగను
వేసి మచ్ఛతాంగంబు వేగ నెక్కి
పోయి యాపనుల్ సాధింపుమోయి మిత్ర!
యని సుగంధాదుల నొసంగినంత నతఁడు.

తే॥ చక్రికిన్ బ్రదక్షిణములసల్పి మ్రొక్కి పీడుకొని హరిరథ మెక్కి విష్ణువేష
మును ధరించి గోపకగోసమూహగోపికాజనాన్వితవ్రజమున కోజ నరుగ.

ఆ॥ మోహనాదిరాగములను శ్రీకృష్ణుని సన్నుతించు చాలఁజక్కఁగాచు
గోపగణము సూచి కొంతధవ్వుననుండ పెలుచ నొండొరులునుబలుకుకొనిరి.

ఉ॥ గోపకులార! మిత్రుఁడుముకుందుఁ డిటుల్ సనుదెంచుచుండె నా
శ్రీపతియానో కాదో యని చిత్తమునన్ విశయంబులేల? మా
లాపరిధానకౌస్తుభ చలద్ద్యుతిమాళిసహస్రపత్రసం
దీపితపంకజాశ్వతతిదివ్యరథాదులు చక్రివే సుమీ! ౩౭౧

ఉ॥ చాల దినంబు లయ్యె మనసంగడికానిని జూచి యంచు వే
యాలుడితో సుదామముఖులా హరిమిత్రులు కృష్ణవేషుఁ గు
తీక్కలధరాప్తునుద్ధవు నతిప్రమదంబున డాసి యిచ్చటన్
నీలపటుండు లేఁ డతని నెచ్చెలియా? మరిగాక యెవ్వఁడో! ౩౭౨

క॥ అని శంకించెడితఱి నాయున యల శ్రీదామముఖుల నచ్యుతసఖులన్
గని హరి పంపినయుత్తరమును నియ్యఁగ వారు దాని ముదమునఁగొనుచున్

తే॥ చదివి చదివి యందలి యెల్లసంగతులను
దెలిసికొని కనుఁగవ నశ్రులొలుకుచుండ
నుద్ధవున కిట్లు బల్కిరో మద్ధితాభి
లాషి! మాచెలి యిటు రాఁదలంచె నొక్కొ? ౩౨౪

ఆ॥ క్షణము యుగముగ నొకగడియ మన్వంతర
ముగను జాము కల్పముగను దినము
బ్రహ్మకాలముగను బద్మనాభుని వీడి
గడుపుచుంటి మేము కాలమిపుడు. ౩౨౫

ఉ॥ ఆశఁదులేని జీవితము నర్థము ధాన్యము వైభవంబులున్
బ్రేతశరీరమాత్రమును బ్రీతికరంబులు గావటంచు నీ
చేతమునందు నమ్ము మిఁక స్నేహితుఁ బీడిన మాయవస్థ యా
ధాతయుఁ జెప్పఁలేడని యెదన్ దలపోయుమ! యోయి యుద్ధవా! ౩౨౬

చ॥ అని మఱుసంగ నుద్ధవుఁడు నాడె నిటుల్ సఖులార! నేను త
ద్వనరుహనాభదాసుఁడను దత్ప్రియమిత్రుఁడఁ దద్రహస్యరుం
డనుజుమి నన్నుఁ గృష్ణుఁడు తటాలున గోకులమేగి మీసుఖం
బును గని రమ్మటంచు చనిపెఁబూర్తిగ మీర్వినుఁడీ! మదుక్తులన్. ౩౨౭

చ॥ మఱువక మిమ్ము మీచెలిమి మాధవు చెంతకు నేగి వేగ మీ
విరహము మీ యభీష్టమును విన్నపముం బొనరించి మ్రొక్కి త
ద్ధరిసహితుండనై మఱలఁదప్పక మీకడ కేగుదెంతు నా
యుఱగొఱలేనిపంతమిది యంచెద నమ్ముఁడి! చింతమానుఁడీ! ౩౨౮

తే॥ ఇట్లు శ్రీదామముఖసుహృద్బృందమూఱ
డించి యాత్మరథమున నెక్కించుకొనియు
నయ్యెఁడ స్తమించెడివేళయందు నంద
నగరమునఁ జొచ్చెఁ దద్వార్త నందుఁడు విని ౩౨౯

శా॥ ప్రత్యుత్థాన మొనర్చి యుద్ధవుఁ బరీరంభమ్ములన్ దేర్చి సం
స్తుత్యార్చల్ బొనరించి స్వాద్యజలజగ్ధుల్ ప్రీతితో నిచ్చి యా
దిత్యేశానమనోజ్ఞతల్పసమమై తేజొందు తల్పంబు స
న్నుత్యప్రజ్ఞనొసంగి యడ్గె నిటుల న్భూతప్రవృత్త్యర్థియై. ౩౩౦

ఉ॥ నాయన! దేవకీపతికి నందనయుక్తముగాసుఖంబె? లో
కాయతకంటకుండును నఘాకరుఁడౌ యదుభూపుఁ డంతమై
పోయినమీఁద యాదవులు పూర్తిగ సౌఖ్యముఁ బొందుచుండ్రె య
బ్బాయికి మాకుమారునకు భద్రమె? నీరికి నేను మేకదా! ౩౭౧

సీ॥ మనసారఁ బెంచిన జననియశోదను నెపుడేని నెద సంస్మరించునొక్కొ?
ధనమనఃప్రాణముల్ తనయుఁడేయని నమ్మియలరు నన్నెపుడేనిఁదలఁచునొక్కొ?
యాత్మీయసఖులతో నాడిన పాడిన బృందావన మెపుడే నెంచునొక్కొ?
బలభద్రుతోఁగూడి బాగుగాఁ గాచిన యీయాల నెపుడేని నెత్తునొక్కొ?

తే॥ గోపికా గోపికానళి గోత్రవర్గ
నాద్రి యమునోరుపులినవ్రజాంగణముల
నెప్పుడైనఁ దలఁచునొక్కొ? యిందిరేశ్వ
రుఁడును నాకుఱ్ఱయు నగు కృష్ణుఁడు సుమిత్ర? ౩౭౨

ఉ॥ దైవమ! ప్రాణతుల్యుఁడయి దాపుననుండిన నాకుమారు నే
క్రేవకొ నెట్టి యిట్లు విపరీతముగా వగపొందుచుంటి నా
జీవనజాతలోచను విచిత్రవిలాసవినోదు శౌరు బృం
దావనసంచరిష్ణుని సధర్ముని గృష్ణునిఁ జూచు టెన్నఁడో. ౩౭౩

ఉ॥ ఎందులకీ శతాంగము లిఁకెందులకీ తురగంబు లేటికీ
సుందరమందిరంబులు యశోధనధాన్యసువర్ణ ధేనుగో
బృందము లివ్వి యెందులకు నెందులకీ పరిపాలనంబు నా
నందనుఁ డిందు లేనియెడ నమ్ముము! యుద్ధవ! వ్యర్థుఁడన్ జుమీ. ౩౭౪

తే॥ ఆర్యనర్య! చకోరమా యమృతకరుని విడిచి పుడమిని బ్రతికిన విధిని నేను
మదనకోటిసుందరుఁడును గదనభీముఁడు నగు కృష్ణుని విడి యిట్లు మనుచునుంటి.

తే॥ భూమిభారంబుఁ బాపంగఁ బుణ్యనరులఁ బ్రోవఁ బుట్టిన జగదేకపూర్ణుడైన
కేవలుండనియెంతు నాకృష్ణమూర్తి బలయుతున్ వాని విడి యెట్లు బ్రతుకఁగలను?

క॥ అని పుత్రకమోహముచే ఘనముగ శోకంబుఁ బొంది కన్నీ రొల్కన్
దన పజపునఁగల తలగడ నునిచితలన్ మిన్నకుండె నుర్వీనాథా? ౩౭౫

చ॥ అవల యశోద యాపగవియోగమనంబును నాలకించి పు
త్రవిహితమోహబద్ధయయి ద్వారముచెంతకు వచ్చి నిల్చి క
న్గవను స్రవించు తోయమును గట్టినచేలముచేత నద్ది యు
ద్ధవునకు బంధుమోదములఁ దద్దయు నడ్గి యిటుల్వచించెడిన్. ౩౭౬

ఉ॥ నందునిగాని నన్ను నుపనందులఁగాని వ్రజంబుగాని స
న్నందమునిగాని స్వప్రియగణంబునుగాని మనోజ్ఞమైన కా
ళిందినిగాని బాల్యగతలీలలఁగాని విహారయోగ్యమౌ
బృందవనుగాని కృష్ణుఁడు స్మరించునె? యెత్తటినైన నుద్ధవా! ౩౮౯

ఉ॥ నాకొకపుత్రకుండు మఱి నల్వురు లేరుగదా కటా! కటా!
యాకొమరుండె నన్నిటు దయారహితుండయి యిందువీడి తా
నేకడకేగెనో కద యిఁకెట్టుల నే బ్రదుకంగనేర్తు నా
శోక మిదెట్లుపోవు నెటుజూచినఁ జక్కనిబాట సిక్కదే? ౩౯౦

శా॥ అమ్మా! చిక్కని మంచిపాలొసఁగవే? హైయంగవీనంబుఁ దే
తెమ్మా! జిడ్డుగుగడ్డపెర్గు నిడవే? దివ్యాన్నముం బెట్టుమం
చిమ్మాడ్కిన్ బలుకాడు నాకొమరుఁడె ట్లీవేళ దా మెక్కునో
యమ్మా! గోపకగోపికాజనుల ప్రాణాధారుఁ డీ కృష్ణుఁడే. ౩౯౧

ఉ॥ పాలనలాలనంబులను వత్సరమొండు క్షణంబుకైవడిన్
గాలము మేము పుచ్చితిమి గాదె? తదంబుజలోచనుం డిటన్
గ్రాలకపోవుటన్ క్షణము కల్పముగా నిపు డేగుచుండె మా
జాలమునం దితండె సిరిసంపదలో యదుపుత్రరత్నమా! ౩౯౨

మ॥ అరరే! యెంతటి క్రూరురాలను గదా! యానాఁడు నాకూన భీ
కరకోపంబునఁ బెర్గుకుండఁ బగులంగాఁ గొట్టెనం చేను స
త్వరనై ఱోటను ద్రాటఁగట్టి మిగులన్ బాధించితిన్ వానిఁ ద
స్కరుఁడంచున్ మఱి యొక్కనాఁడు నెఱిగా శాసించితిన్ జెల్లఁబో! ౩౯౩

సీ॥ ఏవీటికిని నేగ నేవాడకును బోవ నేఁడి కృష్ణుఁడని పృచ్ఛించువారె
యేపల్లె కేగిన నేయింటి కేగిన నేఁడి కృష్ణుఁ డని పృచ్ఛించువారె
యేతోట కేగిన నేచోటికిన్ జన నేఁడి కృష్ణుఁడని పృచ్ఛించువారె
యెవ్వానిఁ జూచిన నెద్దానిఁ గాంచిన నేఁడి కృష్ణుఁడని పృచ్ఛించువారె

తే॥ ఆలఁ గాంచిన నవ్వియు నబ్జనాభుఁ డేఁడి యేఁడియం చఱచెడి నేమొనర్తు?
వాఁడు లేని నాజన్మంబు వ్యర్థముగద! యేల యీ వైభవములు పరేంగితజ్ఞ!

చ॥ అని విలపింప నొప్పగవి యస్రముఁ బొంది వచించె నిట్లు నా
తనువున నెన్నిలోమములు దార్కొనియున్నవొ? యన్ని నాలుకల్
గొనియు నుతింపలేను మిముఁ గూర్మినిగూడినభక్తి మీకుఁ గృ
ష్ణునిపయినుండె నిట్టి దెటఁజూడను జంపతులార! యింతెగాన్. ౩౯౪

తే॥ తీర్థయాత్రాతపోదానదివ్యయోగసాంఖ్యదుర్లభమును బహుశాశ్వతమును
ప్రేమపూర్వకమగు భక్తి మీమనములయందు నెక్కొనె నియ్యది యల్పమొక్కొ?

ఉ॥ చింతల మాని మీసుతుఁడు చేత లిఖించిన జాబులోంది వృ
త్తాంతములెల్లఁ జూచుకొని ధైర్యము దెచ్చుకొనుండు కృష్ణుఁడుర్
సంతస మా పురస్థులకుఁ జక్కఁగఁ గూర్చుచు నన్నతోడ న
త్యంతముదంబుఁ జెందెడిని దన్మధురాపురమందు నిత్తఱిన్. ౩౯౭

తే॥ స్వల్పకాలంబులోన నా చక్రపాణి సాగ్రజుండయి యిచ్చట కరుగుదెంచు
దుష్టజనశిక్షణార్థంబు శిష్టరక్షణార్థము౯ జనించిన పరుఁ డతఁడె సుమ్ము.

వ॥ కావుననే పూతనాప్రాణహరణంబును శకటాసురనిపాతనంబును, తృణా
వర్తపాతంబును, యమళార్జునభంజనంబును, విశ్వరూపసందర్శనంబును, బృందావన
విహారంబును, గోపాలనంబును, బకవత్సాఘధేనుకాసురహింసనంబును, గాళియ
మర్దనంబును, దావాగ్నిపానంబును, గోవర్ధనోద్ధరణంబును, శంఖచూడామణి సంగ్ర
హణంబును, నరిష్టకేశివ్యోమాసుర వినాశంబును గావించి ప్రలంబాంతకుండగు
నన్నతోఁగూడి యక్రూరముఖంబున వచ్చిన కంసాహ్వానంబుఁ బురస్కరించుకొని
మధురాపురి కరిగిదండధరు దండంబుమాడ్కినుండు ప్రచండంబగు నొండు కోదం
డంబును వేదండం బిక్షుఖండంబు విఱిచినట్లు రెండుతుండెంబులుగా ఖండించి కువల
యాపీడనామకకంసకుంభీంద్రంబు శుండాదండంబుఁ బట్టుకొని నేలంగూల్చి చాణూర
ముష్టికకూటశలతోశలులను మల్లుల నోడించి లక్షగజసమబలుండును, మదోత్క
టుండునగు కంసుని సిగ బిగియం బట్టుకొని మంచంబునుండి క్రిందికిం బడవైచి కరీం
ద్రంబుపై నారోహించిన పంచాస్యంబుమాడ్కిఁ జెలంగి వధించి కంసానుజాష్టకం
బును, మృగంబులను మృగేంద్రంబుపగిది నష్టంబొనర్చి పంచజనుం బంచత్వంబు
బొందించి యమునితోఁ బోరాడి గురుపుత్రుం గైకొని దక్షిణగా గురువునకు సమ
ర్పించి నిజభక్తులం బ్రోవంజాలె. ఇట్టి మహత్తరకార్యంబులు వీరు దక్కఁ దక్కిన
వారు సేయంగలరే? కానఁ దచ్చారిత్రంబు సమగ్రంబుగా వినిపింప సమర్థుండను
గానని పలుకుచు నా యశోదానందులతో నారేయి నొక నిమేషంబుగాఁ గడపె
నంత. ౩౯౯

తే॥ వేకువను లేచి గోపికల్ విహితకృత్యములను సల్పి దీపంబుల వెలుఁగఁజేసి
పిచ్ఛిలంబగు పెరుఁగును బెద్దకడవలందుఁ జిలుకగడంగి రా యవసరమున. ౪౦౦

ఉ॥ కంకణకింకిణుల్ లయగఁ క్రమవిధంబున మ్రోయ వారు భూ
శంకరకార్యశూరవాలిచక్రికథాత్మకగీతుల౯ నిరా
తంకముగా సుగానమును దద్దయుఁ జేయఁ దొడంగి రించుకే౯
జంకని కింకిరాతశుకసారససామ్యమృదుస్వరంబుల౯. ౪౦౧

తే॥ ఉద్ధవుఁడు కశిపువు విడి యుచితకృత్యములను దీరిచి నదిలోన జలకమాడ
స్వకరథంబెక్కి నడచుచు వాడవాడలందు గోపికాకృతగానమాలకించి.

ఆ॥ విస్మయంబుఁ బొంది వ్రేలును ముక్కుపై వేసి యిట్టి నందువీట నెంత
కృష్ణచంద్రభక్తి యెసఁగె నహో! యౌర! యనుచు నదికిఁ బోయె నవల వారు.

ఉ॥ దూరమునుండి వాయుగతితోఁ జను నుద్ధవుఁ గాంచి యాతఁ డ
క్రూరుఁడనంచు వచ్చి మును కొంపలముంచిన క్రూరుఁడా? మఱిక్
శౌరివియోగబాధల నజస్రముగుందెడి మాకుఁ గష్టముల్
గూర్పఁ గంసమిత్రుఁడగు కొంటెయ? కానియెడన్ మఱెవ్వఁడే? ౪౦౪

తే॥ నిరపరాధలోకంబును నిర్నిమిత్తముగ వధింపంగఁ గ్రుద్ధవ మున్ను భోగు
లను సృజించినయట్లు గాందినియు మమ్ముఁ గాసిఁబెట్టఁగ నక్రూరుఁగ నెనుగాదె?

ఉ॥ ఆతఁడె తిర్గివచ్చెనొకొ? యం చధికాగ్రహవృత్తితో మరు
ద్రీతిగఁ బాఱి నీల్గునటు తేరున నుండిన కాతుఁ గొట్టి యి
ప్డీతఁ డెవండొ చెప్పు? వచియింపనిచోఁ బ్రహరింతు మియ్యదే
సూత! యటంచుఁ దన్ముఖముఁజూపుచు వ్రేలునఁ గ్రుచ్చి పల్కఁగాన్. ౪౦౬

ఉ॥ సారథి భీతిఁబొంది యలచానల కిట్టులఁ జెప్పసాగె నో
సారసనేత్రలార! సుమసాయకసామ్యమనోజ్ఞరూపుఁడై
శౌరిని బోలు నీఘనుఁడు చక్రిసఖుండని యెంచుఁడీ! యనన్
వారలు మెచ్చి యాతనికి వందనముల్ బొనరించి వేడ్కతోన్. ౪౦౭

తే॥ కృష్ణసందేశ మిపుడు గుత్తముగఁ గలదు
టంచు నొయ్యనొయ్యన నుద్ధవాంతికమున
కేగి యాతనిఁ దోడ్కొని కృష్ణవార్త
లడుగఁ గదళీవనంబునఁకరిగి యందు. ౪౦౮

ఉ॥ చల్లనిపిల్లవాయువులు చక్కఁగ వీవఁ గళిందజోర్మికా
వెల్లనజాతశీకరము వేంద్రము నార్పఁగ దివ్యవృక్షముల్
సల్లలితప్రసూనములఁ జల్లదనంబును గూర్ప జక్రికై
మల్లడిఁ జెంది బొంది గొఱమాలినదం చను రాధయింటికిన్. ౪౦౯

ఉ॥ చేరి రనంతరంబున సుశీల పరేశ్వరియైన రాధ యా
శౌరిసుమిత్రురాక విని చక్కనిపూజ సఖీజనంబుచేఁ
గోరికఁజేయ సల్పియు ముకుందకథాశ్రవణంబొనర్ప దై
వారఁ దదుద్ధవుండు గని భక్తిని మ్రొక్కుచు నామె కిట్లనెన్. ౪౧౦

తే॥ దేవి! యేల కృశింతువే? తేటపఱచు మీవు బ్రహ్మాండ నాయకునింతివయ్యుఁ
జింత సెందుట తగునొకొ? చిత్రముగద నీమహత్త్వ విచారింప నెమ్మనమున.

క॥ కృత్యనిత్యలీలుఁడై యతిచతురతఁ గృష్ణుండు పుట్టుసమయంబుదే
కృత్యనిత్యలీలవై యతిచతురత లీలావతివిగ జన్మింతువుగా! ౪౧౨

క॥ హరి పరిపూర్ణతముండై వఱలునొ యాయవసరమునఁబాయక నీవుఁ
బరిపూర్ణతమవుగా ధర వఱలెదవో భగవతి! వృషభానుకుమారీ! ౪౧౩

ఉ॥ ఎత్తఱిఁ జక్రి భూముఁడయి యిద్ధరఁ బుట్టునొ యప్డు లక్ష్మివై
హత్తితివమ్మ! యెత్తఱిఁ దదంబుజనాభుఁడు బ్రహ్మయౌనొ నీ
వత్తఱి వాణివౌదు వెపుడంబురుహాయతనేత్రుఁ డుగ్రుఁడై
యత్తనొ యప్డు నీవు శివవౌదు వహా! జననీ! పరమేశ్వరీ! ౪౧౪

తే॥ ఘన సనక, సనందన, సనాతన, సనత్కుమార, మునిరూప మెత్తఱి మాధవుండు
సెందునో యప్డు జ్ఞానమానందములను నిచ్చు నాదిదేవతవయి యెసఁగెదవుగ

తే॥ ఎపుడు శ్రీహరి విష్ణువై యెసఁగునపుడు
వైష్ణవివిగఁ బుట్టెదవుగదా పాయలేక
యెపుడు యజ్ఞవరాహుఁడై కృష్ణమూర్తి
యలరునో యప్డు పుడమివై చెలఁగెదవుగ. ౪౧౬

తే॥ ఏసమయమునఁ గాంతుతో వాసుదేవుఁ
డమరమునివర్యుఁడగునొ యప్డతనిచేతి
నలరు మహతియఁ వీణవై చెలఁగెదవుగ
తలఁతు నిన్నెద సాధ్వీమతల్లి! తల్లి! ౪౧౭

క॥ మఱి నరనారాయణులుగ ధర హరి జన్మించినపుడు ధాత్రికి సుఖముల్
గరముగఁ గూర్చెడి శాంతిగ సరసముగాఁ బుట్టెదవుగ సాధ్వీమణిరో! ౪౧౮

వ॥ వెండియు శ్రీకృష్ణుండు కపిలుండైనపుడు సిద్ధసేవితంబగు సిద్ధివిగను, దత్తాత్రేయుండైనపుడు జ్ఞానమయంబగు సిద్ధివిగను, యజ్ఞంబైనపుడు దక్షిణగను, నురుక్రముండైనపుడు జయంతివిగను, పృథుచక్రవర్తివైనపు డర్చివిగను, మత్స్యావతారం బెత్తినపుడు శ్రుతిరూపవుగను, కూర్మంబైనపుడు సర్వస్వరూపిణివిగను, ధన్వంతరియైనపుడు సంజీవనీనామక భేషజంబవుగను, మోహినియైనపుడు జగన్మోహినివిగను, నృసింహుండైనపుడు భక్తవత్సలతాత్మకలీలారూపిణివిగను, వామనుండైనపుడు కీర్తివిగను, బరశురాముండైనపుడు పరశువుగను, శ్రీరాముండైనపుడు సీతవుగను, వ్యాసుండైనపుడు వేదాంతవాణివిగను, బలరాముండైనతఱి రేవతీదేవివి

గను, బుద్ధుండైనపుడు బుద్ధివిగను, కల్కియైనతఱిఁ గృతివిగను, జంద్రుఁడైనపుడు చంద్రికవుగను, సూర్యుండైనపు డాతపంబవుగను, నింద్రుండైనపుడు శచివిగను, హిరణ్యరేతసుండైనపుడు హిరణ్యాయివిగను, గుబేరుండైనపట్టున నిధివిగను, క్షీరాబ్ధిశయనించు హరియైనపుడు సూక్ష్మసితతరంగిణివిగను జన్మించి జగంబుల నుద్ధరించి పోషింతువుగాదె మఱియు మహాసుహృండగు నా శ్రీకృష్ణుండే సాంప్రతంబున వ్రజరాజనందనుండై వెలుఁగ వృషభానుపుత్రికామణివై రాధయను నభిధానంబుతోఁ జెలఁగుచుంటివి. వెండియు న త్తమ్మికంటి యెప్పుడెప్పు డేయేరూపంబులంబూని యేయేకార్యంబు లొనర్పం గడంగునో యప్పుడప్పు డుచితభంగుల జన్మంబులెత్తి యాయాకార్యంబుల నెగ్గించెదవుగాదెయని వాక్రుచ్చి వెండియు నిట్లనియె. ౪౧౯

తే॥ సర్వదేవస్వరూపుఁ డాచక్రపాణి యఖిలదేవతారూపిణివమ్మ నీవు
పరుఁడు భగవంతుఁ డాతండు ప్రకృతివీవె యైదుపదిసేయుచుంటి మీకధికభక్తి.

తే॥ అట్టి భక్తవత్సలుఁ డంపినట్టి యుత్త
రమిది దయతోడఁ జేకొని యమలమతిని
జదువుకొన వేఁడుచుంటి నీస్వాంతమందుఁ
గలఁతఁ జెందకుమని చెప్పి కమ్మనొసఁగి.

ఆ॥ అనలిగోపికలను నామంత్రణము జేసి వందమించినట్టిపత్రికలను
మీప్రియుండు పంపె మేలుగా నివి యంచు వారి కాదరమునవరుస నిచ్చె.

చ॥ పదపడి రాధ శ్రీధరుఁడుపంపిన జాబును గండ్లకద్ది నె
మ్మదిని దదంఘ్రులన్ దలఁచి మానసపద్మము విప్ప నెమ్మదిన్
జదువుకొనంగ గడంగి యొకసారి నగున్ మఱి యొక్కతేన బల్
బెదరిపడున్ మఱొక్కపరిఁ బ్రీతిని జూపుఁ బలించి క్రమ్మఱన్. ౪౨౩

చ॥ సరియని శీర్షమూఁచి యలశౌరివియోగము దుస్సహంబుగా
ధరపయి వ్రాలె నాపిదపఁ దత్సఖులెల్లరు వచ్చి చూచి పు
ష్పరసపటీరసారము లపారముగా నొడలందుఁ జల్లి చా
మరముల వీవ నాసతి క్రమంబుగఁ దెప్పిఱెఁ దత్పరంబునన్. ౪౨౪

ఉ॥ గోపిక లుద్ధవుండును ముకుందవియోగపయోధిమగ్నయై
తాపముఁ జెందు రాధఁ గని తాళక తాము సులోచనంబులం
దేపున నీరునించి రదియెచ్చట వెల్లిగఁ బాఱె నందుఁ బ
ద్మాపితమైన యొండు కొలనయ్యెను లీలయనంగ దానిలోన్. ౪౨౫

తే॥ స్నానదానాదులన్ భక్తిసల్పువారు దుష్టులయ్యును పూతులౌదురుగ రాధ
మనమునందున దుఃఖంబుమఱుగుపఱచి యాత్మవిభువార్త లాతనినడిగె నిట్లు.

ఉ॥ యమ్ముల మా విహారముల మానసమం దెపుడేన్ స్మరించునే?
యమ్మదనాభు నాహరిని నాకమలాక్షుని నామనోహరున్
నెమ్మనమందు నే మరతునే? యిఁక వాఁడిట కేగుదెంచఁడే?
యమ్మధురానివాసమె సుఖాస్పదమయ్యెనె? వానికో సుధీ! ౪౨౭

ఉ॥ సోమునికై చకోరములు సూచెడికైవడిఁ గృష్ణమూర్తికై
యేమును గాంచుచుంటి మతఁడే యిటమండినయష్టు మాకుఁ బ్రొ
ద్దేమియుఁ జాలలేదుగద! యెన్నిపనుల్ బొనరించినన్ క్షణం
బీమెయిఁ బోవఁజాల దిది యేగ్రహచారమొ? కాని యుద్ధవా! ౪౨౮

ఉ॥ ఈవజి కాంజనేయుఁ డెటులేగి యయోనిజ స్వస్థఁ జేసెనో
నీవటువచ్చి నెమ్మదిని నెమ్మదిఁ గూర్చితి విప్డు వానికై
ధీవర! యెట్లొ యిందనుక దేహమునిల్పితి మింక దీని మే
మేవిధి నాపలేము వెసనేగి మఱిన్ హరితోడ రమ్మిటుల్. ౪౨౯

తే॥ ఇదిగో వచ్చితినని మాకు నెంతోయాశపెట్టి నిజమోహాధన మిట విడిచిపెట్టి
మధుర కేగి తాఁ బలికినమాటఁదప్పి చెలఁగునతని జాబిది విశ్వసించు టెట్లు?

—♦ ఉద్ధవుండు రాధా గోపికల నూరడించుట. —♦

తే॥ కాన దయయుంచి తప్పక కమలనాభుఁ
దోడుకొని యిచ్చటికి రమ్ము తొందరగనె
యని వచింపఁగ నుద్ధవుం డాలకించి
యాశ్వసించి యారాధకుననియె నిట్లు. ౪౩౦

తే॥ భగవతీ! భగవంతుఁడుస్వల్పకాలముననె వచ్చును లేనిచోఁబూని నేను
మీయవస్థల వచించి సమీరగతిని హరిని దోడ్కొని వచ్చెదనమ్మ! నమ్మ

తే॥ అని శపథముగఁ బల్కఁగా నామె యలరి ఛత్రచామరాందోళికాచంద్రదత్త
చంద్రికాంతయుగసహస్రచారుపత్రభాసురారవిందయుగముల్ బరగ నిచ్చి.

ఆ॥ శంఖు మాళినుండి చక్రి హరించిన మణి నొసంగి వక్ష్యమాణవిధిని
బలికె ధీరవర్య! వైకుంఠునకు మాకు సంఘటనము నీవు సల్పుమయ్య! ౪౩౧

క॥ శాశ్వతనిర్గుణభక్తియు నైశ్వర్యము జ్ఞానసుఖములాయువు గలుగన్
విశ్వజనీనుఁడవై యీ విశ్వమునన్ బ్రతుకుమయ్య! విశ్వాస్యసుధీ! ౪౩౨

ఆ॥ అంత వ్రేతలెల్ల రాభరణంబుల నిడిరి వాని నిందిరేశసఖుఁడు
గొనియె రాధికయు ముకుందసఖోక్తుల, నరుస మొందెఁ బిదప నొపగవియు.

ఉ. ఆయమయూనతింగొనుచు నంపలి కొల్వునఁ జేరి గద్దెపై
హాయిగఁ గూరుచుండెను వ్రజాంగన లంతట మెల్లమెల్లఁగా
నాయనఁ జుట్టుముట్టి యిటులడ్గిరి మత్ప్రియతుల్యవిగ్రహా!
యా యరవిందనేత్రుఁ డెటులాడెనొ మాకిపు డీవు దెల్పుమా! ౪౩౭

చ॥ అనవుడు నుద్ధవుండు పలుకాడఁ దొడంగె నిటుల్ లతాంగులా
ర! నను పద్మనేత్రుఁడు కరంబున నొంటిగఁ బిల్చి మిమ్ములన్
మనమున నెంచి కన్గవను మాటికిమాటికి నీరునించు చి
ట్లనియె వినందొడంగుఁ డికనవ్వి వచించెద సక్రమంబుగన్. ౪౩౮

చ॥ గొనములయందు మానసముగూడినచో భవబంధనంబునన్
దనరుచునుండు నయ్యదియె తత్పరమాత్మను లీనమైన ము
క్తిని గను నట్టి రెంటికి నదే ఘనకారణమయ్యెఁ గానఁ ద
న్మనముజయించి కామములమాని చరింపఁగ నౌను భూస్థలిన్. ౪౩౯

తే॥ ఎవరు నన్ను బ్రహ్మంబుగ నెల్లచోటు
లందు నున్నవానిగను నధ్యాత్మవిద్య
నెఱుఁగుచుందురొ యాఘను లెడఁదఁ జెలఁగు
కలుషభావంబుఁ ద్రోతురో కాంతలార! ౪౪౦

ఆ॥ కన్ను లెంతవఱకు ఘనసమాచ్ఛాదిత సూర్యమండలంబుఁ జూడఁజాల
వట్లు జనుఁడు మాయ నంతంబుఁ జేయనియంతవరకు ముక్తినందలేడు.

తే॥ స్థూలమార్గమునం జూడ దూరనగును
గాని తత్త్వపథంబునఁ గాను గాన
మన సమాగమమందున ముదఁతులార!
సాధనముగ నా విరహంబు సల్పుకొనుఁడు. ౪౪౨

తే॥ అట్లు సల్పిన సాంఖ్యయోగాదివిధుల
సంభవించు నా కూడిక సత్వరమున
మీకుఁ జేకూరఁగలదని మెలఁతలార!
భావమున నమ్ముఁడని మీకుఁబల్కుమనియె. ౪౪౩

## —♦ గోపికాగీతలు. ♦—

తే॥ అవల గోలోకవాసిను లాతని కని
రిట్లు ప్రియులను విడి కృష్ణుఁడిచటనుండి
యితర దేశమునకుఁ బోయి యెదొ లిఖించెఁ
దలఁప నిద్ది నిర్మోహతాబలముగాదె? ౪౪౪

తే॥ మఱియు ద్వారపాలికలును మాటలాడి రిట్లు ప్రేమించు మముఁబీడి కృష్ణుఁ డేగె
భాస్కరాంబుదాబ్జేందువుల్ పద్మచాతకాళిచాకోరముల వీడి యరిగినట్లు.

తే॥ అవల శృంగారకారిక లాడిరిట్లు, నెలకు వెన్నెలపులుఁగు నెచ్చెలియగాదె
యేల దానికి శశిరశ్మి కీల యయ్యె? ధాత వ్రాసిన వ్రాతలుదప్పవయ్య! ౪౪౬

ఉ॥ శయ్యను వేయుతో యయ్యలులు చక్కఁగఁ బల్కిరిటుల్ మృగంబులన్
ద్రయ్యఁగఁ గొట్టి కాల్కలఁదిఁ బాఱినబోయవలెన్ జనార్దనుం
డియ్యెడ నోరచూపులను నెంతయు మమ్ములఁ గొట్టి యేఁడకో
చయ్యన నేగి కర్మమ్మఱను స్వాంతమునందుఁ దలంపఁ డుద్ధవా! ౪౪౭

తే॥ అవల పార్షద లనిరిటు లంబుజాక్ష!
విరహబాధలు గడు మాకె వేద్యములగు
నొకని యడుగున జీకుముల్లొత్తుకొనఁగ
మఱియొకండు తద్బాధల నెఱుఁగఁ గలఁడె? ౪౪౮

మ॥ ఘనబృందావనపాలికామణు లిటుల్ కారుణ్యభావంబుతో
నని రే హేతువులేని ప్రేమ మనిమిత్తామోది పొందన్ సుమీ
సనిమిత్తుండు గ్రహింపలేఁ డది రసాస్వాదామృతిక్తాదులన్
గనఁగా శక్తము లౌనె? చేతులు గనుల్ కర్ణాదులో యుద్ధవా! ౪౪౯

తే॥ గోప్రవర్ధనవాసినుల్ గూడి యిట్లు
పలికి రల విలాసవతులవలచి వారి
కొడయఁడైనట్టి శ్రీకృష్ణుఁడున్న తాద్రిఁ
జెలఁగు మమ్మేలచూచు నెందులకుఁదలఁచు? ౪౫౦

తే॥ అంత గుంజవిధాయిక లాడిరిట్టు లతులమాధవీకుంజపుంజాంతరములఁ
గృష్ణవిరహగాథలె యాలకింపఁబడెడిఁ బ్రిస్తుతంబున మాధవప్రాణమిత్ర!

చ॥ మఱియు నికుంజవాసిను లమందగతిన్ బలుకాడి రిట్టు లా
వరయమునాధునీతటిని భాసిలుచుండెడి బృందకాటవిన్
నఱలు కదంబవృక్షములపార్శ్వమునన్ విహరించు నామనో
హరు సురభీవృతున్ సబలు నాహరిఁ బొందుట యెప్పుడోగదా. ౪౫౨

మ॥ యమునాయాధము లంతవచ్చి యిటు పల్కాడెన్ హృషీకేశసం
గము కుబ్జాదుల కెట్టు లీడినయిన్ గాఁజాలె నట్లే భవి
ష్యమునం దీ మనకున్ ఘటించు సతులారా! నమ్ముఁడీ మీరు భా
వమునందున్ దిరమే జయాపజయముల్ భావింప నే మేటికేన్? ౪౫౩

చ॥ గిరగిరగిఱ్ఱగిఱ్ఱగిరగిఱ్ఱనఁ గాలము చక్రముం బలెన్
దిరుగుచునుండుఁగాదె సుదతీమణులార! సుధీరు లాత్మలోఁ
గరముగఁ గష్టసౌఖ్యములు గానటికుండలటంచు నెంచి సం
బరమునసుందు)చింతవిడి పాపుఁడి! నెమ్మదినుండి తాపమున్. ౪౫౪

మ॥ కరుణాశూన్యుఁడు భారతీవిభుఁడు తత్కర్మానుసారంబు స్థా
వరముల్ జంగమముల్ సృజించి యొకచో బాధల్ సుఖం బొక్కచో
పఱులం జేసి క్షణాన కొక్కరహిగా బాలుండు క్రీడించి సం
బరముం జెందినలీలఁ బొందు ముదమున్ బద్మాక్షులారా! కటా! ౪౫౫

వ॥ తత్కారణంబున నేకదా కురూపిణియు, దాసీకులసంభూతయు, దుష్టపరి
చారికయునగు కుబ్జ సురూపిణియై కులీనయై పరమేశ్వరప్రాణసఖియై విరాజిల్లి
తన యిష్టసిద్ధియైనదని దుందుభితోఁ జాటింప సమర్థురాలయ్యెనని వాకొనె నంత
విరజాయూథంబు లేతెంచి యిట్లనియె. ౪౫౬

ఉ॥ ఎవ్వనికైన సంతతము నింతులకూడిక యుండదెప్పుడున్
జవ్వనముండదెప్పుడు వసంతుఁడు నుండఁడు స్వర్గపాలనం
బవ్విభుధేంద్రుఁడే యనిశ మక్కజసల్పుఁడు నాల్గుప్రొద్దు లి
ట్లెవ్విధిగానొ మీర్గడపుఁడీ! మనకష్టము దీరిపోయెడిన్. ౪౫౭

మ॥ లలితాయూథము లేగుదెంచుచు నిటు ల్వాక్రుచ్చె రామాభిషే
కలసత్కాలమునందు మంథర యనంగా నుండు కైకేయితో
త్తు లక్షిష్టాత్మ తదుత్సవంబునకుఁ బ్రత్యూహంబుఁ గల్గించె ము
న్నలతొత్తే తగెఁ గుబ్జ నాగ నది హోయం దేకృతుల్ జేయునో? ౪౫౮

చ॥ మఱియు విశాఖయూథము సమంజసఫక్కిని నిట్లు పల్కె నా
మురళి ముఖంబునం దలర భూషణముల్ మెయివెల్ల వేత్రమున్
గరమునఁ బట్టి గోవులను గాచి స్వపట్టణమేగఁ త్రోడిబా
లుర లలిఁ బిల్చు కర్దనవిలోలు హరిన్ మఱువంగలేమహా! ౪౫౯

శా॥ మాయాయూథము లిట్లుపల్కె నిఱుకౌమార్గంబులన్ బల్మిచే
నా యాభీరసతీపటంబులను భీహర్షంబులన్ గొంచు వే
స్త్రీయోరస్స్థలమందు నుంచుకొని యాశ్లేషించి పోనెంచు దై
తేయారిన్ హరి నెప్డు గీములకుఁ బ్రీతిన్ మేము దో డ్తెత్తుమో. ౪౬౦

తే॥ అష్టసఖులును నని రిట్టులంగసుందరుఁడును గోకులవిభుకుమారుఁడును నైన
హరినిఁ జూచిన యీకన్ను లతనివిడిచి యవనిఁ గననొలవని శౌరికనుము ధీర!

ఆ॥ అల్లె షోడశసఖులాడిరి బృందావనమునఁ జక్రి వేణునాదసుధను
జవినిగొన్నయట్టిశ్రవణయుగ్మము విశ్వగీతుల విన నిచ్ఛగింపదయ్య!

వ॥ అంత ద్వాత్రింశత్కాంత లేతెంచి యిట్లనిరి. ౪౮౩

సీ॥ గురుఁడు కోపించినఁ గోటిదండంబులఁ బెట్టి యావిబుధు మెప్పింపవచ్చు
బాపఁడు దుగ్రుండైనఁ బరమాన్నముం బెట్టి ప్రీత్యుక్తి నతని మెప్పింపవచ్చు
రసికుండు గనలినఁ రసముల నెల్లఁ జూపించి యాసరసు మెప్పింపవచ్చు
బిసినారి గినిసినఁ విడిముడిఁ గడుఁగట్టిపెట్టుచుఁ వాని మెప్పింపవచ్చు

తే॥ స్నేహితుం డాగ్రహించిన నిర్మలమగు
ప్రియ మొనర్చి యవ్వాని మెప్పింపవచ్చు
నెదిరి యెదిరినఁ లొంగి మెప్పింపవచ్చుఁ
గాని నిర్మోహు మెప్పింపఁగలఁడెవిధియు. ౪౮౪

చ॥ మఱి శ్రుతిరూప లిట్లని రమాయికవృత్తి గుణాశ్రయంబునఁ
ధరకు నిదానమయ్యె నెది తన్మహదింద్రియ దేవతౌఘముల్
సొర వెట జాగ్రదాదులకు నంతయు హేతువుకాదొ యేది యా
హరిమయ తేజముఁ గొలుతు మగ్నిఁ గృశానుకణంబు లట్లుగన్. ౪౮౫

చ॥ అవల ఋషిస్వరూపిణులు నాడి రిటుల్ మునియోగిదుర్లభుం
డెవఁడొ సమస్త వేదములకెట్లును జిక్కని వాఁడెవండొ మా
య విడిచి మేటియై నెవఁడొ యాద్యుఁ డెవండొ ప్రపూర్ణుఁ డెవ్వఁడో
యెవఁడు పరేశ్వరుండొ యలకృష్ణున కియ్యవె జోతముల్ సుమీ. ౪౮౬

తే॥ అమరసతు లిట్టుపల్కి రంశాంశకాంశపూర్ణ సత్కళావేశ సంపూర్ణనామ
షడ్విధావతారము లెత్తిసంభవస్థితిలయకారకుఁడౌ హరిఁగొలుతు మిపుడు.

ఆ॥ యజ్ఞసీతలిటుల ననిరిట్టిహరిగాదె లోకనాయకుండు గోకులపతి
రాసరంగవిభుఁడు రాధికాహృత్కాంతభూషణుండు నగుచు మురియుచుండు.

మ॥ పరమప్రీతి వచించి రిట్లు రమావైకుంఠకాంతామణుల్
ధరణీక్షేమముఁగోరి యాదవులలో దైవాటి యాభీరసుం
దరులన్ గూడి నిజాంఘ్రిధూళిలను బృందాభూమి గోవర్ధనో
ద్ధర శైలంబుల వెల్గఁజేయు హరి కీదోసిళ్ళు కృష్ణప్రియా! ౪౮౯

చ॥ మఱిఁ దెలిదీవిలోఁ జెలఁగుమానిను లిట్టులఁ బల్కి రర్భకుం
డరిగి శిలీంధ్రముఁ బెఱికినట్లు గజంబు స్వపుష్కరానఁ బు
ష్కరమును ద్రుంచుమాడ్కి బలుగండరగండలు మోయలేని య
గ్గిరి నొకకేల నెత్తి తగుకృష్ణునెదన్ మరువంగలేదహా! ౪౯౦

తే॥ చేరి యూర్ధ్వవైకుంఠవాసినులని రిటు
నలుపుతో వెల్గు మాకనుల్ నలుపు గలుగు
నిలనుగనుఁగదా ద్వైతమే యెఱుఁగనట్టి
మాకు యోగాదు లేలకో? మాధవాప్త! ౪౮౧

తే॥ అనిరిటుల్ లోకగిరిసతుల్ హరిని విడువ
లేక ప్రేమపాశంబును వీడఁ ద్రెంప
మైత్రి మార్తండో యహిపాశ మండజపతి
నఱికినటుఁ ద్రుటి నద్దాని నఱికి యరిగె. ౪౮౨

తే॥ అజితపాదాశ్రితాంగన లాడి రిట్లు పద్మలగ్నాళి దమ్మికై పదిదెసలను
దిరిగి కననట్లు మావి శ్రీహరివిలగ్నదృష్టులా హరికై చని యెఱుఁగకుండె.

చ॥ ఉసులుగ శ్రీసతీసఖులు నొయ్యన వచ్చి వచించి రిట్టులన్
బిసినితనంబునన్ యశముపీడును గోపముచేత యోగ్యతల్
వెసఁజనుచుండు దంభమున వృద్ధినిజెందినమైత్రి పాడగున్
వ్యసనములన్ ధనంబు వ్యయమౌనుగదా జనపాళికో సుధీ! ౪౮౪

చ॥ అనిరిటు మైథిలాంగన లహో! యెవఁడేని ధరాతలంబునన్
ధనము నొసంగి దేహము యథావిధిఁ గాచుకొనంగనౌను ద
త్తనువున మానరక్షణము దద్దయుఁ జేసికొనంగ నౌను ద
ద్ధనతనుమానశక్తులిడి తప్పక మిత్రునిఁ బ్రోవనౌఁ గదా. ౪౮౫

ఉ॥ తిన్నగఁ గోసలాబలలు దివ్యనిపల్కులనాడి రిట్టులో
యన్న! యెపుడు మాదు విరహవ్యథ గాంచఁగలండు? దైవమా!
యెన్నఁడు మాదుఘోరశిఖు లీ హృది నాటుట మానునో మఱిం
కెన్నఁడు వెన్నునిం గలిసి యేము సుఖింతుమొ సంతసంబునన్? ౪౮౬

వ॥ అంత నయోధ్యావాసినులేతెంచి తమ విభుం గూర్చి యిట్లనిరి. ౪౮౭

చ॥ తొలుత నిరాశఁగూర్చి తమితో వడిగాఁ జనుదెంచి మాదు నా
శలఁ గదుఁబెట్టి వీడ్కొని వెసన్ మధురాపురి కేగి రాక యీ
లలిఁ దనవైన యోగకుశలంబులు గల్గిన జాబు లిట్లు మా
నెలవుల కంపెఁ జూడ నిది నిష్క్రియ వృత్తముగాదె వింతగాన్. ౪౮౮

వ॥ అంత పుళిందమందయాన లరుగుదెంచి యిట్లనిరి. ౪౮౯

ఉ॥ ఇంతకుమున్ను శూర్పణఖ యేగి వనంబున కీమహాత్మునిన్
గాంతునిగా వరింపఁ దను గన్గొని తమ్మునిచేతఁ గర్ణనా
సాంతముదాఁకఁ గోయునటు లాస్థనుసల్పెను నట్టివానికీ
యంతరమందు మాయెడల నక్కటికం బెటువచ్చు? నుద్ధవా! ౪౮౦

ఉ॥ జాలిగఁ బల్కి-రా సుతలసాధ్వు లిటుల్ మన శౌరి విప్రుఁడా
పోలిఁగఁదాల్చి మోసమున నుర్వరఁ గైకొని తిన్నయింటిలో
దూలము లూడఁబీకునరుతో జతయాచు వదాన్యుఁడౌ బలిన్
జాలఁగఁ గొట్టి మట్టె నల చక్రికి నేమి యొనర్ప నేమగున్? ౪౮౧

వ॥ పిమ్మట జాలంధరీమణు లేతెంచి యిట్లు వాక్రుచ్చిరి. ౪౮౨

ఉ॥ ఈ దనుజాంతకున్ మదిని నెంతయు నమ్మఁటఁబట్టికాదె ప్ర
హ్లాదుఁడు సర్వకష్టములనంది మనోవ్యథఁబొంది కోర నీ
శ్రీదయితుండు నెమ్మదిగఁ జేరక భీకరమైనరూపుతో
నాదట వెల్గెఁ దొల్త నిపు డట్టి కఠోరుఁడు ప్రోచు మమ్మెటుల్? ౪౮౩

ఉ॥ పిమ్మటఁ బల్కి రిట్లు పృథివీవనితల్ మది నొండు వెట్టి వా
క్యమ్ములు వేఱుగాఁ బలికి యాచరణంబున లాఁతిరీతిఁగా
ర్యమ్ములఁజేయు పూరుషునిదా నడతన్ బరమేశ్వరుండు లే
శమ్ము నెఱుంగలేఁడె? యిఁక శక్తులమే? మన మిందు నుద్ధవా! ౪౮౪

తే॥ అవల బర్హిష్మతీసతు లాడి రిట్లు
ప్రలయమందున దయను వరాహజన్మ
మెత్తి యిలఁ బ్రోచి తొల్తొల్తఁ బృథువిభుఁడయి
యిలను బాలించె నా ఘనుఁ డితఁడ కాఁడె? ౪౮౫

ఉ॥ అంత లతాంగనల్ నుడివి రాస్థ నిటుల్ సుధఁ జేతఁగొంచు ధ
న్వంతరి నాగ వే వెడలి వైరమొనర్చు సురాసురాళి న
త్యంతము గాంచి వేల్పులకె యా యమృతం బిడి రాక్షసాళికిన్
గాంతగఁ దోఁచి మోహ మధికంబుగఁ గూర్చినవాఁ డితండెకా! ౪౮౬

తే॥ అవల నాగేంద్రకన్యక లాడి రిట్లు పతిగ నీహరిం గోరి శూర్పణఖ సనఁగఁ
గరుణ విడిచి కురూపిణి గాగ సల్పె నామె యంత కీ డితని కేమాచరించె?

చ॥ మఱియు సముద్రకన్య లనుమానము మాని వచించి రిట్టులన్
నరులకుఁ గల్మిలేముల క్షణంబున కొక్కవిధానఁ గూర్చి బల్
హరుసము దుఃఖముల్ గొలిపి యాఱడిగాఁ దిరుగాడు భార్గవీ
వరసతిఁ గొన్న యాతఁ డెటు బాదుకొనంగలఁ డిందుఁ బూర్తిగాన్? ౪౮౭

చ॥ పడపడి యప్సరోంగనలు పల్కిరిటుల్ మును పీ ఘనుండు స
మ్ముదమున గన్న శూర్పణఖ ముక్కుచెవుల్ దెగఁగోసెగాదె? యీ
యదనునఁ గోరు మమ్ములను నట్టులఁ గోయక వీడ దీనికై
మదుల నుతించి వానికి నమస్కృతులర్ బొనరింతు మెన్నియేఁ. ౪౮౯

ఉ॥ దివ్యులనం దొడంగి రిటు దేవవిభుండగు నీమహాత్ముఁ డా
దివ్యచరిత్రుఁడౌ బలికి దేవపదంబు నొసంగ నెంచి స
త్సేవ్యనిజాంఘ్రితో నదిమి చిత్రవిధిన్ సుతలానఁ జేర్చె నా
భవ్యచరిత్రుకృత్యములు పల్కఁగ శక్యమె? ధాతకైనకున్. ౪౯౦

ఉ॥ దంభము వీడి పల్కిరిటు తాల్మి నదివ్యలు భార్యతోడ స్వా
యంభువు కౌంతిగల్గి తప మక్కఱ సల్పెడివేళ విఘ్నముల్
సంభవిలంగఁజేసెడి నిశాటుల నూటిగఁ గొట్టి వాని నీ
జంభవిభేదితమ్ముఁడొగి నాకఁడె? మమ్మివు డట్లు ప్రోవఁడే. ౪౯౧

తే॥ పలికి రిట్టుల సత్వవృత్తలగు సుదతు
లెన్నియుగములు వచ్చినన్ దన్నుఁగొలుచు
నట్టి ప్రహ్లాదునిన్ ధ్రువు నధికదయను
బ్రోవఁడే యితఁడటు మమ్ముఁ గావఁడొక్కొ? ౪౯౨

తే॥ మఱి రజోవృత్తకాంత లీసరణి నాడి రల హరిశ్చంద్ర, రుక్మాంగ, దాంబరీషు
లను బరీక్షించి సౌఖ్యంబులను ఘటించి నట్టి యితఁడట్లు మముఁగని యలర జేయు

తే॥ అంతెలర్ దమోవృత్తలు నాడి రిట్టు
లిట్టి మాయావిమిమనె యిక్కట్టులొంది
సుఖముఁగన్న బృందావనక్షోణినాథ
కుబ్జలను బోలి సుఖములఁ గనమె? మనము. ౪౯౪

చ॥ కనికరమన్న నీ హరిదె కాంచుమి? యొక్కదెసన్ గృపాణియై
చెనఁటుల రూపుమాపు చొకచెంతను నేగు త్రివక్రయైన కు
బ్జను గని నిర్నిమిత్తదయఁ బట్టి త్రిభంగులఁ జక్కఁజేసి దా
నిని గొనెఁగాదె యా యితఁడు నిర్దయఁ ద్రోయునె? మమ్ము నిమ్మెయిన్.

తే॥ చూప అవ్యామనాంఘ్రివిక్షేపపార
నమయముం గననట్టుల శౌరిరాక
కవధి దోఁపదు మాయెదలందు నిపుడు
కన్నులార నెప్పుడు వానిఁ గాంచఁగలమొ? ౪౯౬

ఉ॥ అమ్మకచెల్ల! యట్టి హరి యా కరుణాకరుఁ డిందులేమి మా
నెమ్మది నిమ్మళంబుగను నిల్వదె! దేహము పాలిపోయెనే!
యమ్మయమయ్యెనే కనులు! హస్తములాడవె! నోర్మెదల్పదే!
సొమ్ములు భారమయ్యె! నిటు చూడుమ! యేమి యొనర్పుమందువో?

సీ॥ గోపాలకులతోడఁగూడి క్రీడించెడి కృష్ణు నే మెప్పు డీక్షింపగలమొ?
బృందావనమున గోబృందంబుఁ గాచెడి కృష్ణు నే మెప్పు డీక్షింపఁగలమొ?
తల్లిదండ్రుల కెంతో యుల్లాసముంగూర్చు కృష్ణు నే మెప్పు డీక్షింపఁగలమొ?
రాధికాచరితప్రసాధనములఁబొందు కృష్ణు నే మెప్పు డీక్షింపఁగలమొ?

తే॥ మోహనాంగుని లోకనిర్వాహపటు సుశీలు భూపాలు భక్తాలవాలు బాలు
జిష్ణుఁ బ్రభవిష్ణు రోచిష్ణు! విష్ణుఁ గృష్ణుఁ దృష్ణఁదీఱ నే మెప్పు డీక్షింపఁగలమొ?

తే॥ ప్రేమకోలఁదిని నిట్లు గోపికలు మిగులఁ
గృష్ణుఁ జింతించి చింతించి యెట్టకేల
కిలను వ్రాలిరి దేహంబు లెఱుఁగనట్లు
మైథిలేశ్వర! బహులాశ్వ! మఱియు వినుమ! ౪౯౯

—♦ ఉద్ధవుండు గోకులంబునుండి మధురకు వచ్చుట. ♦—

వ॥ అంత నుద్ధవుం డట్లు మూర్ఛితలై పడియున్న రాధాగోపికలం జూచి విచారించి వేఱువేఱుగా సంబోధించి నయవినయభయవచనంబులతో నోదార్చి ప్రత్యుత్తరంబును వ్రాసి యిమ్మని రాధాదేవినిం బ్రార్థింప నాదేవి లేఖినిం గైకొని మషిని ముంచి కమ్మపై వ్రాయఁబోవులోన నశ్రుజలంబులు గనులనుండి జలజల రాలఁ దత్కాలం బార్ద్రీకృతంబయ్యె. ఇట్లెన్నిపత్రంబులం దెచ్చి వ్రాయ మొదలిడినను నన్నియుఁ గన్నీటం దడిసి వ్యర్థంబులగుట నుద్ధవుం డుపలక్షించి ౫౦౦

క॥ అమ్మా! శోకింపకుమా! కమ్మ నెటుల వ్రాయఁగలవు కన్నీరొల్కన్
నమ్ముము! నామాటల నీ విమ్మెయి నాజోతలను గ్రహింపుము! తల్లీ! ౫౦౧

క॥ అని పలికి గోపికార్చలఁ గొని యా రాధికను వీడుకొని యా సాయం
బున రథమెక్కి వ్రజాధిప ఘనగృహమునకేగి వసతిఁ గావించి నిశన్. ౫౦౨

క॥ అరుణోదయకాలమునన్ హరిఁ బొగడుచు మేలుకాంచి యభివాదనముల్
శిరమున నందయశోదల కరుసము గలుగంగఁజేసి యనుమతిగొనియున్.

సీ॥ నందోపనందుల మందిరంబులకును వృషభానుల సదనములకు
నరిగి వారికి మ్రొక్కి యనుమతిం గొని యచ్యుతసఖులైనట్టి శ్రీదామముఖుల
కేగివత్తు నటంచు నెఱిఁగించి గోకులవాసులకుఁ జెప్పి వారు వనుప
జక్కని తేరెక్కి సకలకళాకర మధురాపురమున కమందగతిని

తే॥ జేరి యమునాధునీమణీతీరమందు నలరు నక్షయవటమూలమందు నొంటి
గా వసించిన కృష్ణుముంగలకుఁ బోయి సలిపి సాష్టాంగనతుల నంజలిఘటించి.

మందాక్రాంతవృత్తము.

లోకాధారా! నిగమనిలయా! లోకరాజా! మహేశా!
లోకస్తుత్యా! సకలవరదా! లోభరాగాదిశూన్యా!
రాకాపూర్ణేందురుచిరరుచీ! రాధికాప్రాణనాథా!
శ్రీకృష్ణా! యాదవకులమణీ చిన్మయా! సత్యరూపా! ౫౦౫

మ॥ భవదాజ్ఞన్ గొని గోకులంబుఁ జని మీ పత్రంబులన్ మీ విరా
ళి వెతల్ గుందెడి వ్రేలకున్ జెలులకున్ లీలావతీపంక్తికిన్
శివముం జెప్పి యొసంగి ప్రేముడిని నా చింతల్ త్యజింపంగఁ బ
ల్కి వడిన్ గ్రమ్మఱి యేగుదెంచితిని గోళీలోల! లోకేశ్వరా! ౫౦౬

తే॥ కాని నీవిరహంబునఁ గష్టపడెడి వ్రేతలన్ జూచి తాళక వేగిరముగ
హరిని దోడ్కొని యిచ్చట కరుగుదెంతునంచు వాగ్దానమిచ్చితి నందువలన.

తే॥ అల్ల యంబరీష, విభీషణాదిభక్తు
లందు నను నొక్కనిగ జేసి యట్టి నాదు
పలుకు సఫలంబుఁజేయ గోకులమున కిపు
డరుగుదెంచుము నాతోడ నంబుజాక్ష! ౫౦౮

—♦ శ్రీకృష్ణుం డుద్ధవసహితంబుగా గోకులంబున కరుగుట. ♦—

క॥ అని పలుతెఱఁగుల వేడఁగ విని కృష్ణుఁడు గోకులముఁ బ్రవేశించుటకున్
మనమున దలంచి మధురను నొనరుపఁ దగు పనులఁ దెల్పియుంచి ముసలినిన్,

ఆ॥ ఉద్ధవాన్వితుఁడయి యురుశతాంగం బెక్కి యేగ సాగి బాట నెసఁగు బృంద
కావనిఁ బులినముల గోవర్ధనాద్రిని గోసహస్రములను గోర్కిఁ గాంచె

ఉ. దూరమునుండి నాలు వడితోఁ జనుదెంచెడి కృష్ణచంద్రునిన్
సారెకుఁ జూచి మోములఁ దృణంబులు భాసిలఁ బాలు చన్నులన్
బూరితిగాఁ జెలంగ శ్రుతిపుచ్ఛములన్ బయికెత్తి వత్సముల్
గూరిమితోడఁ దోడ్కొని మొగు ళ్ళల నూర్చ్యనిఁ గప్పు చొప్పునన్. ౫౧౧

క॥ హాంభా యని యఱచుచు విశ్వంభరు నరదంబుఁ జుట్ట సంతసమున నా
యంభోజాక్షుఁడు వానిని సంభావనజేసినట్లు చఱచెను జేతన్. ౫౧౨

తే॥ అంతఁ బశువులఁ గాచుచు నాడుచుండు
నట్టి శ్రీదామముఖులట్టు లావు లేగి
స్యందనముఁ జుట్టియుండుట సరగఁ గాంచి
యబ్బురముఁజెంది యొండొరు లనుకొనిరిటు. ౫౧౩

ఉ॥ కనుఁడు శతాశ్వకల్పితము కాంస్యసుపత్రరవప్రయుక్తముల్
ఘనకలశధ్వజాంచిత మఖండశతార్కరుచిప్రకాశితం
బు నయి సమీర వేగమునఁ బోవు రథం బెటు గోవు లడ్డగిం
చినవొ సుమిత్రులార! పరిశీలనఁ జేయుఁడి! మాకుఁ దెల్పుఁడీ! ౫౧౪

ఉ॥ అందునఁ గొందఱాడి రిటు లాబుధుఁ డెవ్వఁడొకాని యాల కా
కానందముఁ గూర్చువాఁడని మనంబునఁ దోఁచెడి దక్షిణాంగముల్
స్పందముఁజెందుచుండె నల శౌరియె సర్వజనంబు మెచ్చఁగా
నిందుల కేగుదెంచెనొకొ? యీరును మేమును జూడనొ నిదే. ౫౧౫

తే॥ అవల నరయంగ వారంద రట్టి తేరుదరిని డాసి శ్రీధరుఁడని యరుసమొందు
చుండఁ గని హరి ముజ్జలమొలుకఁ గనుల రథము డిగ్గి వేశ్వేర భద్రంబు లడిగి.

మ॥ పరమప్రీతిని గాఁగిలించుకొని సంభాషింప నవ్వార లా
యరవిందాక్షవియోగబాధ లెదలం దావృత్తిగా జ్ఞప్తికిన్
సరిగా రా విలపింప శౌరి తమి నాశ్వాసించి గోష్ఠంబునం
దెటిఁగింపన్ దనరాక నుద్ధవుసఖున్ హేజీబుఁ బంపెన్ జుమీ. ౫౧౭

చ॥ అనుపఁగ నట్టి యాపగవి యా హరిమిత్రులఁగూడి చయ్యనన్
జని పృథుగోకులంబునకు సంబరమందుచు నందుఁదొట్టి వా
రిని గని మాధవాగమనరీతి వచింపఁగ వారు ప్రేమతో
విని యల కృష్ణుఁ బిల్చికొని వే యిలుఁ జేరఁగనెంచి వెంటనే. ౫౧౮

సీ॥ భేరీమృదంగాదివివిధవాద్యములతో వారిసంపూర్ణకుంభములతోడ
విప్రప్రతతికృత వేదనాదములతోఁ గమనీయచందనాక్షతలతోడ
వాసనావాసితప్రసవహారములతో శ్రీసతీసమసువాసినులతోడ
నేత్రపర్వప్రజా నీరాజనములతో దాసదాసీజనతతులతోడ

తే॥ శ్రీయశోమతీసతితోడఁ జిన్నవాంఢ్రతోడ జయజయారవములతోడ నుద్ధ
వాది గోపాలకులతోడ స్యందనములతోడ వెడలిరి చూపఱు తుష్టిపడఁగ.

తే॥ అవల వృషభానువర్యుఁ డర్యమునిఁ బోలి
యాలియగు కలావతితోడ హైమశృంఖ
లాన్వితంబు సిందూరపుష్పాంచితంబు
నైన మదకరిముందుంచి యరుగఁదొడఁగె. ౫౨౦

క॥ నందోపనందగోపకబృందము వృషభానువులును వృద్ధులుఁ బ్రోడల్
సుందరగతితో బహ్వానందముగాఁ జనిరి నందనందనుఁ గనఁగాన్. ౫౧

చ॥ మఱియును రాధికారమణి, మాధవురాక సఖుల్ వచింపఁగాఁ
గరముగ నాలకించి నవకంజము సూర్యునిఁ జూచి వాసనల్
బరగ నొసంగినట్లు తన భర్మమయాభరణంబులన్ని యా
తరుణులకిచ్చి యిచ్చను ముదంబును బొందెను సుప్రసన్నయై. ౫౨

తే॥ అష్టసఖులును ద్వాత్రింశదంగనలును షోడశాబ్దేక్షణలును యశోదకొడుకు
రాక నాలించి హర్షించి రాధమునికి కేగుదెంచిరి హరిని నీక్షింపఁదలఁచి. ౫౩

తే॥ అంత శ్రీరాధికాదేవి యంతికమున కరుగుదెంచిన సతులతో నలరి దివ్య
శిబికయందెక్కి చక్రి వసించినట్టి స్థానమున కేగె నుచితవేషంబుతోడ. ౫౪

ఆ॥ గోకులమున నుండు గోపికలందఱు కృష్ణురాక వినుచు గృహాకృతులను
విడిచి యంబరములుఁ దొడవులుఁ దాఱుమాఱువడఁ జని రసురవిరోధిఁ గాంచ

ఉ॥ పిమ్మట వాసుదేవుఁడటు చిన్నలుఁ బెద్దలు స్త్రీలుఁ బూరుషుల్
నెమ్మి వ్రజంబునుండి బహునిస్వనముల్ సెలువాఱ దివ్యనా
ట్యమ్ము లొనర్పఁగాఁ బొగడు చెండకువచ్చుటఁ జూచి భక్తితో
నమ్మ యశోమతీసతిని, నయ్యను నందుని, మ్రొక్కె నాదిలోన్. ౫౬

వ॥ అంతఁ దద్యశోదానందులు చిరాగతుండగు తమ ముద్దుబిడ్డను గన్నులారం గాంచి చేతులారం జేరందీసి కౌఁగిటం గ్రుచ్చి మనసారఁ జెక్కిళ్ళదువ్వి ముద్దిడుకొని యంకంబులఁ బొంకంబుగాఁ గుదిర్చి యానందబాష్పంబులచే స్నాతుగా నొనర్చి భూషణాంబరహారంబులతో నలంకృతుం జేయ నాకత్తెనెచ్చెలి మెచ్చి భూసురులకును నందోపనందవృషభానువులకును, సన్నందాదిగోపవృద్ధులకును వందనంబులొనర్చి తత్కృతాశియై నిజమిత్రులతో హస్తగ్రహణంబులం గావించి క్షేమ మారసి పౌరదత్తపారితోషికంబులం గొని యశోదానందుల నొక్క గంధసింధురంబున నెక్కించి తా నుద్ధవసహితంబుగా నిజరథంబెక్కి నందోపనంద వృషభానుగోపికాగోపయుక్తుండై నారీమణులు లాజాక్షతలు సల్లి మంగళారతులెత్తి పాడుచుండ నిలింపులు పూలవానలు గురియుచుండ జయజయశబ్దంబులు నిగుడ బ్రాహ్మణాశీర్వాదంబు లినుమడింప గోకులాంతర్భూతనందనగరంబునఁ బ్రవేశించె. అంత గోపకాంతలు సమ్ముఖమ్మున కేతెంచి ప్రాణవల్లభా! నీ సుమిత్రుండగు నుద్ధవుని యనుగ్రహంబున నిన్ను సందర్శింపఁజాలితిమి. నీవేకదా మాకందఱ కాధారభూతుండవని వాక్రుచ్చిరిగాదె. బహులాశ్వా! మఱి యేమి విననలతువో పలుకుమన నతం డాశ్రీహరి యే యే పనులం జేసి యారాధికాదుల కానందంబు గూర్చెనో

క్రమ్మఱి మధురాపురి కెమ్మాడ్కిఁ జనెనో యను విషయమ్ముల విస్తరింపఁ బ్రార్థించెదనన విని మునివరుం డాజనకున కిట్లనియె. ౹౹౨౭

తే॥ అట్లు గోకులముననున్న యంబుజాక్షు
నఱ్ఱుఁ డస్తమించెడివేళయందు రాధ
పిలువ నా వలమురితాల్పు వెడలి కదళి
వనమునకు వచ్చెఁ బ్రముదితస్వాంతుఁడగుచు. ౹౹౨౮

—♦ శ్రీకృష్ణుండు రాధతో సంభాషించుట. ♦—

ఆ॥ అంత రాధ, దరికి నాతండు వచ్చినసంగతి విని స్వీయసఖులఁ గూడి యర్ఘ్యపాద్యములిడి యఖిలోపచారముల్ సలిపి కుశలమడిగి సంతసమున.

ఉ॥ ఆతని కేలుఁబట్టుకొని యాయతముల్ గదళీధరారుహో
పేతముఁ జందనాదితరువిస్తృతముల్ యమునాతరంగిణీ
శీతలవాతశీకర విశిష్టము దివ్యసుధాగభస్తి ని
ర్యాతసుధార్ద్రిముల్ స్వకమునైన ఘనాలయమొంది యందునన్. ౹౹౩౦

తే॥ భర్మమణిమయాసనమునఁ వఱలఁజేసి తత్ప్రవాసంబు మొదలు తద్దర్శనంబు దాఁక దివ్యాన్నశయనచందనవిహారవీటులను మానియున్న తా విభునిఁ జూచి.

క॥ అంబరములచే సుమహారంబులచే భూషణనికరంబులచేఁ దా
రంబులచే డంబగు పగడంబులచే నందముగ నొడల నొనరించెన్. ౹౹౩౨

క॥ సింగారించి స్వదేహముఁ బొంగుచు గోపీశతయూథములు గొలువఁగ శ్రీ
సంగున కారాధిక యీ భంగిని డగ్గుత్తికవడఁ బలికెను బ్రీతిన్. ౹౹౩౩

చ॥ యదుకులచంద్రమా! యెచట నా మధురాపురముండు? నేటి కీ
యదనున మమ్ము వీడితివె? యర్హమె? చాలదినంబులైన మీ
దు దరిసెనంబు లేదె? మిము స్తోకకమ్రభ్రముఁజూచుకై వడిన్
గొదకొని సోముఁగాంచెడి చకోరముమాడ్కిని జూచుచుంటిమే! ౹౹౩౪

తే॥ మునుపు సౌదాస, నల, రామవనితలు, మద
యంతి, దమయంతి, విశ్వంభరాత్మజలకు
భర్తృవిరహారుబాధ సంభవిలెఁ గాని
యింతబాధలు మావలె నెసఁగవయ్య! ౹౹౩౫

తే॥ నా సపత్నులౌ గోపికల్ నమ్మి మిమ్ము నెమ్మిజలదమ్ముఁగనుభంగి నెమ్మిఁ గనుచుఁ
గసుగు నెంజిలుల్ మీ సన్నిధానమందుఁ జెప్పఁజాలక యుండిరో జీవితేశ!

తే॥ ప్రాణవల్లభ! నీవు విశ్వంభరుఁడ వశేషసాక్షివి గావొకో శేషశయన!
యట్టి నీకిట్టి మా వెత లవగతములు గావె? యైనచో దయ మముఁ గావ వేల?

ఉ॥ నీ చెలియైన యాపగవి నీ విరహంబునఁ జావనున్న మ
మ్మాఁ చెడి నీయుదంతముల నన్నిటి వాకొని యూఱడించి వే
లేచి మఱిక్ ద్వాదంతికము లీలఁగఁజేరి వచించి మాగతుల్
చూచెడిలోన మిమ్ముఁగొని చొచ్చె నిటక్ బురుషార్థి యీతఁడే. ౫౩౮

చ॥ అని కనులక్ బ్రవాహముగ నశ్రులు గాఱుచునుండఁ బల్కు రా
ధను గని లోకనాథుఁడగు దానవహంతకుఁ డాదరోక్తులక్
దనిపి యనంగసాగె నిటు తామరసాక్షి! యశేషసాక్షినై
యనయముఁ జూచుచుంటిఁగద యద్ది యెఱింగియు నేడ్తు వేలకో? ౫౩౯

తే॥ పాలకును నందుఁగల తెలిడాలునకును దారతమ్యము లేనివిధమున నీకు
నాకు భేదంబు లేనప్డు నావియోగ మెట్లు సిద్ధించె దానికై యేల వగపు?

క॥ నేనో పూర్ణబ్రహ్మము నానందాత్మకతటస్థవగుచు భువనసం
తాననిదానవు గావే జ్ఞానముతో నొక్కతేవ గనుమా! దానిక్. ౫౪౦

తే॥ ఇట్టి మనకిద్దఱకు నిప్డు బిట్టు దుఃఖములను గూర్చెడి విరహంబు పుట్టుటెట్టు?
లెచట నేనున్న నీవందు నెసఁగుచుందు వెందు నీవున్న నేనందు నుందునుగద.

తే॥ పంచభూతంబు లెట్టులు వ్యాప్తిఁజెంది
స్థూలసూక్ష్మరూపంబులతోడ నిత్య
మయ్యెనో యట్లు మనము నిత్యతనుజెంది
భువనముల నేలుచుందుమో ముద్దుగుమ్మ! ౫౪౩

తే॥ విమలతోయంబుమాదిరి వికృతిరహితుఁడనగు నేఁ ద్రిగుణంబులఁ దనరుచుంటి
నీ సదానందభావంబు నెఱిఁగి యీ "వహం మమేతి" భావంబుల నంటవలదు.

క॥ ఎత్తఱి నీవని నేనని చిత్తమునక్ వేఱుసల్పి చింతించెదవో
యత్తఱి నీమానసముక్ దత్తరముం బొందు దానఁ దాపము పుట్టున్. ౫౪౫

చ॥ కనులు ఘనంబులెందనుకఁ గప్పునో యందనుకన్ దివాకరున్
గన వెపు డభ్రసంతతులు గ్రమ్మవొ యప్డినుఁ జూచునట్టు లెం
దనుక గుణంబులన్ మనముఁ దాల్చునో యందనుకన్ స్వరూపమున్
గన దెపు డా గుణంబులను గ్రాలదొ యత్తఱి స్వాత్మఁగాంచెడిన్. ౫౪౬

ఉ॥ సంగముచేతఁ గామములు సంభవమయ్యెడి దానఁ గ్రోధ ము
ప్పొంగెడి దాన మోహమును బుట్టెడి దాన స్మృతిభ్రమంబు గ
ల్గుంగద దాన బుద్ధిసెడి క్రుంగును గావున నెవ్వఁడైన ని
స్సంగుఁడుగాఁ జెలంగవలె సత్యము తథ్యము పథ్యమో సఖీ?                    ౫౪౮

తే॥ మానినీమణీ! యెఱుఁగుమా మానసంబ ముక్తికిని బంధనమునకు మూలమంచు;
నంతులేనట్టి తలఁపుల నండవలదు నన్నుఁ జేరు మనన్యప్రణయముతోడ.                    ౫౪౯

క॥ అని నుడువఁగ రాధికయున్ విని మనమున సంతసించి ప్రేతలఁదగి పూ
జనముల వనరుహనయనున కొనరించెను శ్రద్ధతోడ నొడయఁడ! యవలన్.

ఉ॥ ఆర్తజనావనప్రియుఁ డఘాద్రివిభంజనవజ్ర వజ్రసం
పూర్తసువర్ణభూషణవిభూషితమూర్తి త్రిమూర్తిరూపకుం
డార్తవహారశోభితుఁడు నైన సరోరుహనేత్రుఁ డింబుగాఁ
గార్తికమందు బృందయను కానకు నేగె సతీసమేతుఁడై.                    ౫౫౦

చ॥ చని మురళీనినాదములఁ జక్రి యొనర్చి నిశాంతరంబునన్
ఘనుఁడు కుణప్రభన్ దగినక్కై వడి నింద్రుఁడు భార్యతోడఁ గూ
డినవిధి మారుఁ జాలినిఁ గడిందిగఁబొందినమాడ్కి రాధతో
డనుదగి రాసమండలము డాబుగ నిర్మితిఁజేసి యత్తఱిన్.                    ౫౫౧

మ॥ నటవేషంబు ధరించి యెంద ఉచటన్ నాతుల్ విరాజిల్లిరో
చటులత్వంబున నన్నిరూపములతో సంతుష్టచిత్తంబునన్
నటనంబట్టి మహానటుండు మతిఁ దన్నా కాంగనల్ మెచ్చ ను
త్కటరీతిన్ బొనరించి రాసములఁ దత్కాంతావళిన్ దేర్చి తాన్.                    ౫౫౨

ఉ॥ తల్లలనావితానసహితంబుగఁ జేరి కళిందజాతటిన్
బెల్లుగనుండు నారెముల విస్తృతమా పులినంబులన్ విరా
జిల్లు నికుంజపుంజములఁ జిన్నిసరస్సుల గోప్రవర్ధనం
బల్లనఁ డాసి యందుఁగల యద్భుతముల్ గనుచుండె నత్తఱిన్.                    ౫౫౩

తే॥ గోపికాశతయూథముల్ కోపపడుట హరి విలోకించి రాధికాతరుణితోడఁ
గూడి యంతర్హితుండౌచు గోప్రవర్ధనాద్రికిన్ యోజనత్రయమందు నున్న.

ఆ॥ చందనావనిరుహసుందరరోహితగిరికి నరిగి యందు వఱలు లతల
విరులఁ దసల దరుల వరుసగాఁ గనుఁగొనె నరుసమిచ్చుముచ్చటాడుకొనుచు.

తే॥ అంత హరి రాధతోఁగూడ నందు స్వర్ణమయలతల వెల్లుచోటునన్ మనికిఁజేసె
నచట బదరీనాయకకృత మాయతంబు నైన యొండు దేవసరసి యతిశయిల్లు.

తే॥ అద్ది పాఠీనకూర్మనక్రాదివివిధజలచరాంచితంబును సహస్రదళపద్మ
మండితము హంససారసమధులిడాదిదివ్యనినదాన్వితంబయి తేజరిల్లు. ౫౫౭

ఆ॥ అట్టి రమ్యమైన హ్రదముతీరంబునఁ బంకజాక్షుఁ డొక్కపట్టునందు
సౌరభయుతమలయమారుతములు వీవఁ గోరి రాధతోడఁ గూరుచుండ.

—♦ శ్రీకృష్ణుండు ఋభుమునిని జీవన్ముక్తుం జేయుట. ♦—

ఆ॥ అచట నిర్జలత, నిరశనత, శాంతత నఱువదాఱువేలహాయనముల
నుండి తపము నిశ్చలుండయి యేకాంఘ్రియందు నిలిచి సలుపు నట్టి ఋభుని.

ఆ॥ కమలలోచనుండు గని యద్భుతానందములను నవ్వ రాధమోముఁ గాంచి
యిట్లు పలికెఁ జెలిరో! యీభక్తునింజూడు మనము ప్రోవనౌను ఘనుని వీని.

ఆ॥ అటులని దయఁ జక్రి యామునిఁ "హే ఋభో"
యంచుఁ బిలువ నాతఁ డత్తఱిఁ స
మాధినుంట మఱల మాటాడమిఁ హరి
చూచి యతని యెడఁదఁజొచ్చె నంత. ౫౬౧

ఆ॥ ఋభుఁడు ధ్యానమందు నభయవరప్రదానుఁడగు హరినిఁ జూచి కడుముదంబుఁ
జెంది కనులఁదెఱచి శ్రీకృష్ణు రాధికాసహితు దేవదేవు సరసఁ గాంచి. ౫౬౨

క॥ భక్తిని రక్తినిఁ బ్రణతుల శక్తికొలందిగ నొనర్చి సర్వవిధములఁ
ముక్తినిఁ గోరుచు మనమున యుక్తముగా నిట్లు వేఁడె నుర్వీనాథా! ౫౬౩

సీ॥ పరిపూర్ణతమకును బరిపూర్ణతమునకు శ్యామకు నవఘనశ్యామునకును
రాసవల్లభకును రాసవల్లభునకు నీశ్వరికిఁ జగదీశ్వరునకు
నిందుబింబాస్యకు నిందువంశ్యునకును లీలావతికిఁ గేళిలోలునకును
దేవతాదేవికి దేవదేవునకు శ్రీమతియగు రాధకు మాధవునకు

తే॥ కృష్ణకును గృష్ణునకు మీకు నిరువురకును
వందనములివ్వె కొనుఁడంచు వారి పాద
ములను వ్రాలియు హరిని నిశ్చలతఁ దలఁచి
ప్రాణములవీడె నంత నా ప్రాజ్ఞజ్యోతి. ౫౬౪

క॥ ఊర్జితయశుఁడును ఘనుఁడును దుర్జనభర్జనుఁడు నూత్నతోయదనిభుఁడుఁ
దుర్జయుఁడును నగు హరిలో నిర్జరు లౌరా! యనంగ నైక్యగ లయించెఁ.

క॥ అంత ననంతుఁడు తన్మునికాంతుని బ్రియపూర్వభక్తిఁ గని ముజ్జలముఁ
సుంతగఁ గాఱ్చుచు నాతని సంతసమున రమ్మటంచుఁ జక్కఁగఁ బిలిచెఁ.

క॥ పిమ్మట నమ్మునిఁ, గ్రమ్మఱ నమ్మాధవునడుగుఁదమ్ములం దమ్మాతఁడా
పమ్మను గోటిమదనసామ్యమ్మునఁ బొలుపార నుత్తమాంగము నుంచెన్.

చ॥ అనలుఁ గృపాకరుండయినయంబుజనేత్రుఁడు తన్మునీంద్రునిన్
గవుఁగిటఁ గ్రుచ్చి సాంత్వనవచనంబుల నూఱడఁబుచ్చి మెచ్చుచున్
శివకరసవ్యహస్తమునఁ శీర్షము దువ్వుచుఁ దద్విభుండు మా
ధవునకు రాధకున్ దమిఁ బ్రదక్షిణముల్ నతులన్ బొనర్చె తాన్. ౫౬౮

తే॥ దివ్యరథమెక్కి దశదిశల్ దేజుఁదాల్ప నల్లగోలోకమున కేగె నద్ది గాంచి
రాధికాదేవి యతివిచిత్రంబుఁ బొంది పెనిమిటికి నిట్టులనిమెడిఁ బ్రేమతోడ.

తే॥ ప్రాణవల్లభ! కనుము నీ భక్తుఁడైన యిట్టిబుభుఁ డెట్లు గోలోకమేగె నహహ!
యితని దేహంబు దహనంబు నీవె చేయఁదగిన దిది తపశ్శుద్ధమై తగెనుగాదె?

క॥ అని నుడివెడితడవుగఁ దన్ముని దేహము కొలఁకుగ నల భూధరమునఁ బా
పనికరనాశంకరమై తనరెను బహుశంకరముగ ధాత్రీనాథా! ౫౭౧

తే॥ అద్ది రాధిక కని విస్మయంబునొంది హరికి నిట్టుల నుడివెనో యంబుజాక్ష!
యతనియపఘనం బెటు కొలనైనవార్త విస్తరింపుమనఁగ నిట్లు వెన్నుఁడనియె.

చ॥ మకరపతాకసుందరిసమానమనోహరరూప! ప్రేమపూ
ర్వకమగు భక్తితోఁ దగి వరప్రదుఁ ద్వద్యుతు నన్నుఁగాంచి కౌ
తుకమతితో సరస్సుగ విధూతమలుండయి పాటె నాతఁ డిం
తకుమును నేఁ బ్రవాహముగఁ దద్దయుఁ బాఱినయట్లు నావుడున్. ౫౭౩

—♦ శ్రీకృష్ణుండు రాధికకు నారదోపాఖ్యానంబుఁ జెప్పుట. ♦—

తే॥ కీర్తినందిని యలరి యా కృష్ణుఁ జూచి యిట్లు నొడివెను దేవరా! యీవుగూడ
సరస్సైతివె? యెట్లది సరిగఁదెల్పు మనవుడా కట్టినెచ్చెలి యనియెనిట్లు.

చ॥ సరసిజలోచనా! దురితజాలవిభేదనసమర్థ మర్థదం
బరిపురదావమైన యితిహాసమొకండు వచింతుఁ దీని కా
పరమునినాభిపద్మమున బ్రహ్మ జనించి ప్రపంచమిద్ది యే
ర్పఱచి నిజోరువందు మునివర్యుని నారదుఁ గాంచె నాదిలోన్. ౫౭౫

ఉ॥ నారదుఁ డట్లు పుట్టి స్వమనంబున నన్ను సతంబు నమ్మి నా
కీరితి నాగుణంబులను గీర్తనఁజేసి యనర్గళంబుగా
ధారుణిలో భ్రమించుటను దద్విధిఁ గన్గొని యేమిరా సుతా!
యీారహిమాని సంతుఁ గని యెల్లసుఖంబులఁ బొందుమా! యనన్. ౫౭౬

చ॥ అమరమునీంద్రమం జీట్లనిరె నయ్యా! భవద్వచనంబు వింటి స
త్క్రమమునంగాని యీ భవము కల్మషదుఃఖమయంబు గాన దా
ని మదిఁదలంప బిడ్డలను నేఁగనఁజాల నిఁకేమనన్ ద్రివి
క్రముపయి భక్తినిల్పెద నఖండితదీయయశంబుఁ బాడుచున్ ౫౭౭

క॥ కావున నీవును బ్రజలను నావలె సృష్టింపకుండ నలిననయనునిన్
శ్రీవిభు బ్రహ్మేండేశ్వరు భావమునన్ నమ్మి మనుము! పంకజయోనీ! ౫౭౮

ఆ॥ అనుచు బుద్ధిగఱప నబ్జాసనాసీనుఁ డాకళించి కనలి వ్యర్థచరిత!
గానపరుఁడవౌచు గంధర్వునకుఁ బుట్టి తిరుగు మొక్కకల్పమగువఱకును.

తే॥ అని శపింపగ నాతఁ డా యమరలోకమందు నుపబర్హణాఖ్యతో నతిశయిల్లు
చుండు గంధర్వవిభుఁడయి యొక్కతఱిని వనితలన్ గూడి విధిలోకమునకు నరిగి.

తే॥ సలువ కభివాదనంబుల సలిపి స్త్రీయుభామినీమోహవశుఁడయి స్వరలయాది
శాస్త్రవిధులను దాటి స్వచ్ఛందరీతిఁ బాడె నద్దాని వినిన యా పద్మభవుఁడు.

తే॥ మరల నిట్టుల శపియించెఁ జనమునీచ! గానవిధుల నుల్లంఘించి గాన మెట్లు
సలిపితివి చెల్లఁబో! శూద్రజన్మమెత్తి ధాత్రిలోఁ జరింతువుగాక తరలు మింక.

ఉ॥ దాన నతండు కల్పము గతంబగునన్ గలరూపు వీడి వే
పూని జఘన్యజన్మమును ముప్పటిసజ్జనమైత్రిశక్తిచే
దా నల శూద్రజాతివిడి ధాతకుఁ గ్రమ్మఱఁబుట్టి నన్ను న
న్యూనముగా నుతించుచిల నుండెఁద్రొడంగెను నారదాఖ్యుఁడై. ౫౮౩

వ॥ అట్లు విధూతపాపుండైన నారదుండు క్రమంబుగా మునీంద్రులలో మహాముని యై గాయకులలో మేటియై వైష్ణవులలో శ్రేష్ఠుండై భాగవతులందుత్తముండై జ్ఞానులలో భాస్కరుండై మత్ప్రీతికాస్పదుండై వెలయుచు మన్మనోమయుండయ్యె. ఇట్టి మునీంద్రుండు మద్గుణసంకీర్తనంబు గావించు చెల్లలోకంబులను విలోకించి యిలావృతనామకఖండంబునకుఁ జని జంబూఫలరసంబున జనించి నదియు జాంబూనదంబను స్వర్ణంబును జనించునదియు నగు జంబూనదిచే విరాజిల్లు దేశంబున ధర్మమణిమయహర్మ్యాదివినిర్మితంబును, దివ్యనారీనరపరివృతంబును నగు వేదనగరంబుఁ బ్రవేశించి యందుఁ గూనివాండ్రను, గ్రుడ్డివాండ్రను, మరుగుజ్జువాండ్రను, దొడ్డికాళ్ళవాండ్రను, విజంఘులను, జఘనవ్యంగులను, విశ్లథసంతులను, నతాననులను, గృశోరువులను, దుందిలోదరులను, సూక్ష్మకంధరులను, విగతజానువులను, బాదరహితులను, స్త్రీపురుషులలోఁ గాంచి దుఃఖించి యా పౌరులలోని గొందఱ నాలోకించి సరసులారా! వాదిత్రసహితులును,

గానపరాయణులును, దివ్యదేహులును, బ్రహ్మముఖులును, శుభ్రాంబరధారులును నగు మీ౯కీచందంబున సంగభంగంబులు నానాభంగులుగాఁ జెలంగుటకుఁ గతం బేమైయుండునో స్పష్టీకరింపుఁడని ప్రార్థింప నవ్వారు మునివరా! మేము వేద నగరవాస్తవ్యులము రాగనామకులము బ్రహ్మపుత్రుండగు నారదుండు ప్రేమో న్మత్తుండై యకాలంబున ఘనపదంబులను స్వరతాళవర్జితంబుగా నిష్టోదిని స్వేచ్ఛగాఁ దిరుగుచు గానంబొనర్చుట నాలోకించి యీరహిగా సంగభంగంబు లతో మానభంగమ్ములు గలుగంగ దుఃఖించుచుంటిమని యనుఁడు చిత్రంబుఁజెంది గర్వవర్జితుండై వైలక్ష్యస్మితం బొనర్చి తద్రాగంబులనుఁ గని మీ పలుకులు లెస్సయే కాని యింపుల కా నారదుం డేమి యొనర్చి తత్కాలతాళస్వరాది విజ్ఞానంబు సంపాదింపఁగలఁడో నుడువుఁడని యడుగ నాలించి యవ్వారో యోగి వరా! ఇయ్యది దుర్లభంబుగానఁ బరమేశ్వరప్రాణసఖియగు వాగ్దేవికడకే చని శిక్షం బొందిన దద్జ్ఞానం బౌమహాముని కబ్బఁగలదని వాక్రువ్వ నవ్విబుధక్షీంద్రుండు సంతసించి సరస్వతీప్రసాదసంపాదనార్థంబై యమలంబగు నొక్కమల కరిగి యందు దివ్యశతవర్షంబులు నిర్జలాహారుఁడై తపం బొనరించె. అట్లాచరించినది మొదలు తద్గిరి నారదగిరి యనుపేరం బరగు. అంత నా పలుకులవెలఁది యా మునితపంబు నకు మెచ్చి చెంగట వెలుంగ నతండు హర్షోత్కర్షమనస్వియై ప్రత్యుత్థానం బొనర్చి నతాననుండై నమస్కరించి దోసిలి యొగ్గి యిట్లు వినుతింపం దొడంగె. ౫౨౭

సీ॥ ఐరావతమరాళహీరముక్తావర్ణభాసురపటయుతా! వందనములు
నవభాస్కరోజ్వల స్నవరత్నచిత్రిత స్వర్ణభూషాంచితా! వందనములు
స్ఫటికమాలాంబుజ వల్లకీభాస్వర పాణివిభ్రాజితా! వందనములు
ఘనసారచందనకస్తూరికుంకుమవాసనావాసితా! వందనములు

తే॥ పరమకల్యాణదాయినీ! వందనములు ప్రకృతిగుణగణోల్లాసినీ! వందనములు
పతితసముదాయపావనీ! వందనములు వాణి! శ్రీకృష్ణు తొలిరాణి! వందనములు.

చ॥ చరణయుగంబుఛందములు జంఘలురెండుశ్రుతుల్ యజుస్సు నో
రురుభుజముల్ శ్రుతిస్మృతు లనుత్తమసామము కుక్షి బుక్కు కం
ధరమును శిక్ష మధ్యమము దర్కముురోజము లాస్యముఁ గృతుల్
వరనిగమాంత మఖులుగ భాసిలు నిన్ను నుతింతు భారతీ! ౫౨౮

తే॥ అంబ! జగదంబ! భాషాంబ! యంబికాదిసతికదంబసమర్చితచరణయుగళ!
సరళమానస! పోషిత స్వప్రియచయ! భద్రగజయాన! నీకివే వందనములు.

సీ॥ ఏ యంబ పాదంబు లా యంబుజాసనాద్యమరప్రణుతుల కర్హంబులయ్యె
నే యంబ చరితంబు లా యమరాచార్యచతురోక్తులకును నుచ్ఛ్రితములయ్యె
నే యంబ వర్తనం బా యంబికాముఖ సద్వృత్తి మార్గదర్శకమునయ్యె
నే యంబ యాగ్రహం బా యసురశ్రేణిహింసకు నత్యంతహేతువయ్యె

తే॥ మఱియు నే యంబ కరుణయు సరసకవిత కాదికారణమయ్యె నే యంబ పలుకు
సకలకళలకు బీజమై సఫలమయ్యె నట్టి నాతల్లి నిన్ను నే నాశ్రయింతు. ౫౮

తే॥ అమ్మ! కాలతాలస్వరాద్యఖిలగానవిధిదృఢజ్ఞాన మీవిచ్చి వేగఁ బ్రోచు
మమ్మ! సాష్టాంగనతులను నాచరింతు నమ్మ! నమ్మితి నిన్ను నే నెమ్మనమున.

చ॥ అని యిటులన్ నుతింప జగదంబ సరస్వతి సుప్రసన్నయై
నెనరున దేవదత్తమును నిస్తులమున్ స్వరధాతృభూషితం
బును శ్రుతిపేయనాదపరిపోషితమున్ వరతంత్రిభాసురం
బునగు విపంచికన్ ముని కమూల్యమటంచిడి శ్రద్ధతోడుతన్. ౫౦

వ॥ అసంఖ్యాకంబులగు నంతర్భేదంబులతోఁ జెన్నారు షట్పంచాశత్కోటి
భేదంబులతో రాగంబులను రాగిణులను దత్పుత్రులను మూర్ఛనావాద్రిత్రసహి
తంబులగు గ్రామనృత్యంబులతోడను, స్వరగమ్యంబులును, స్వతస్సిద్ధంబులు నగు
పదంబులతోడను, దేశకాలభేదంబు లనుసరించి తాలమానస్వరయుతంబుగా
నమ్మహాముని చేఁ బఠింపించి యద్వితీయరాగకర్తగా నొనర్చి రాసమండలంబున
గాయకనాయకుం డౌనట్లు వరంబిడి సనాథయై మునిని వీడ్కొని వైకుంఠపురం
బున కరిగె. అంత. ౫౧

మ॥ చెలిరో! నారదుఁ డట్లు గానకళలో శ్రేష్ఠత్వ మార్జించి ని
స్తులసంతుష్టిని బొంది గుహ్యమును సంతోషప్రదంబైన త
త్కాళ నర్హుండగువాని కీఁదలఁచి యా గంధర్వదేశంబునన్
బలుమాఱుల్ గని తుంబురుండను ఘనున్ స్వచ్ఛాత్రుగా సల్పి తాన్. ౫౨

తే॥ సక్రమంబుగ సర్వరాగములఁ గాలతాలముఖవిధియుతముగాఁ దద్ద నేర్పి
మద్గుణంబుల నన్నిఁటి మఱువకుండఁ జక్కఁగాఁ జెప్పి యిట్లంచె స్వాంతమందు

ఉ॥ నేర్చితి భారతీదయ ననేకవిధంబులనుండు రాగముల్
కూర్చితిఁ గ్రొత్తరాగములఁ గోట్లకొలందిగనున్న వానినిన్
మార్చితి మేలుచాలునను మార్గణముం బొనరించి వీనినిన్
దీర్చితి గాయకోత్తముగ దీని వినందగువార లెవ్వరో? ౫౪

చ॥ విని తమి మంచిచెడ్డలను వేనుఁ దెల్పెడివాఁ డెసం డటం
చనుకొని శిష్యుతోఁ గలిసి యా మఘవంతుఁడె యోగ్యుఁడంచు నా
తని దరికేగి మస్కరిని నతంఁడు నసింపమిఁ జూచి సాగి యా
వనజహితాలయంబునకు వచ్చెను దత్సమయంబునన్. ౫౯౫

చ॥ తరణి స్వకీయమైన యరదంబున నెక్కియుఁ బోఱుచుండు మా
దిరి గని పిలుఁగాదనుచు దిగ్గి శివంకరుఁగైలాలకేగె న
త్తఱి నల భూతనేత పరతత్త్వవిచారనిమగ్నుఁడై కనుల్
బోరిఁబోరి మూసియుంట గ్రతుభుఙ్మనిఁ గన్గొని శిష్యయుక్తుఁడై. ౫౯౬

ఆ॥ బ్రహ్మలోకమునకు వచ్చి విలోకింప నట్టి వేల్పుపెద్ద కఖిలసృష్టి
కార్యతత్పరతను క్షణమేనిదీరమి సరిగలేనటంచు సాగి వేగ. ౫౯౭

క॥ వైకుంఠమునకుఁ జనె నల వైకుంఠుఁడు కరుణతోడ భక్తార్థంబై
యేకడకేగెనో కానీ, యా కాలమునందు నందు నగుపడకుండెన్. ౫౯౮

ఉ॥ దానిని గాంచి తుంబురుయుతంబుగ నంబుజజాతసూతి త
త్స్థానము వీడిపోయె నహా! జ్ఞానులపోకలు ముజ్జగంబులన్
లోన బహిస్స్థలంబున ననూకగకర్మముఁ ద్రోసి స్వేచ్ఛగా
నేనెలవేనిఁబొందుటకు నేగవె? యో వృషభానుపుత్రికా! ౫౯౯

తే॥ అంత నా మౌనివర్యుఁ డనంతకోటి
లోకములఁ దాటి పరమగోలోకమునకు
నరిగి యరమునఁ గల్లోలభరితమైన
విరజయను ధునిన్ గనుఁగొని వెడలి యచట. ౬౦౦

శా॥ అందంబైన సదావసంతయుతబృందారణ్యముం గాంచి యా
నందం బిచ్చెడి గోవ్రపర్ధనగిరిన్ నల్దిక్కులం జూచి యా
నుందారాదిసమ స్తకల్పవిలసన్మత్కుంజముం జొచ్చి యం
నందున్ జెందిన చిత్రముల్ గని యెదన్ హర్షించుకాలంబులోన్. ౬౦౧

ఉ॥ ఎవ్వరు మీర లెందులకు నిక్కడి కాగతులైతిరంచు నా
మవ్వపు ద్వారపాలికలు మన్ననతో నడుగంగ వార లే
మవ్విబుధర్షి తుంబురుల మద్భుతగానకళావిశేషముల్
నివ్వెఱఁజెందఁజూపఁగలనేర్పు గడించినవార మందునన్. ౬౦౨

తే॥ మాదు విద్యాసమర్థతల్ మాధవునకుఁ, జూపవచ్చితి మిచటికో సుదతులార!
కాన నీవార ర యా రమాజానికిపుడు చెప్పవలెనని పలుక నా చేడియలును.

ఉ॥ లోనికివచ్చి వారిమొఱ లోపములేనటు నాకుఁ జెప్పఁగా
నే నురరీకరించితిని నెచ్చెలు లయ్యది తిర్గిపోయి యా
గానకళాప్రవీణులను గన్గొని తెల్ప ననల్పమోద మా
మానులు బొంది లోపల కమందగతిన్ జనుదెంచి వింతగాన్. ౬౦౪

తే॥ భానుకోటిప్రకాశవిభాసురంబు నసమముక్తాఫలసమన్వితాతపత్ర
చామరయుతంబు గౌస్తుభసంయుతంబు గోటిసతివృతమగు నా నికుంజమందు.

తే॥ వేయిరేకులతమ్మిపై హాయిగాను నిన్నుఁగూడి భాసిల్లెడి నన్నుఁగాంచి
చుట్టివచ్చి నమస్కృతుల్ సొరిదిఁజేసి సెలవుఁగొని పీఠమందు నాసీనులైరి.

చ॥ పదపడి నాదితేయమునివర్యుఁడు తుంబురయుక్తుఁడౌచు స
మ్మదమున దేవదత్తమును మంజులనాదసుధామయంబు స్వ
స్తిదము విపంచికామణిని జేకొని శ్రావ్యగభీరవాణితో
గొదకొని మద్గుణంబులును గూడఁగఁ బాడెను రాగమాలికల్. ౬౦౭

ఉ॥ అంతట నట్టి గాత్రముల నా మహతీనినదంబు నట్టి నై
కాంతరయుక్తరాగముల నా నటనస్వరకాలతాలముల్
బంతుగఁజూచి సంతస మపారముగాఁ దల నూఁచియూఁచి నే
నంతమునందుఁ దన్మయతనంది జలత్వముఁ బొటితిన్ ధరన్. ౬౦౮

తే॥ రాధ! యేవారి నా శరీరంబునుండి
భవముఁ గనె నద్ది బ్రహ్మద్రవం బటంచు
నెఱుఁగు మందుఁ గోట్లకొలంది నెలయుచుండు
నండముల్గల్గి దొరలుచునుండు నదియె. ౬౦౯

ఆ॥ పృశ్నిగర్భనామవిదితమౌ బ్రహ్మాండ మిద్ది నా నెలవని యెఱుఁగుమిపుడు
రాధ! యట్టి బ్రహ్మరస మీ జగంబు భేదించుకొనుచు వచ్చి దివ్యగతుల.

తే॥ దివిని స్వర్ధుని యనఁగను దివ్యతలమునందు భాగీరథి యనంగఁ గ్రిందిలోక
మందు భోగవతి యనంగ నడ్డులేక పాఱదొడఁగెను సర్వపాపహారమగుచు.

తే॥ అట్టి గంగాతరంగిణియందు జలక
మాడిన బుధుండు రాజసూయాధ్వరములఁ
జేసినంత ఫలంబును జెంది యఘవి
ముక్తుఁడగునంచు నెంచుమో పూవుఁబోఁడి! ౬౧౨

క॥ గంగా గంగా యని లలి గంగకు శతయోజనములఁ గ్రాలెడివాఁడేన్
బొంగుచుఁ దలఁచిన నఘములు గ్రుంగగ వైకుంఠమొందుఁ ధోయజనేత్రా!

ఉ॥ జన్మశతాఘముల్ దొలఁగు జాహ్నవిఁజక్కఁగఁగాంచువానికి
జన్మశతద్వయాగములు నాశము సెందుఁ దదంబుపాయికిన్
జన్మసహస్రదోషములు స్నానము నావది సల్పువాని కో
మన్మథభామినీమణిసమాన! లయించునుగాదె? యీకలిన్. ౬౧౪

తే॥ ఎవ్వరామిన్నువాకకుఁనేగి కనరొ వారి జన్మంబు వ్యర్థ మెవ్వారుదానిఁ
గాంతురో వారి జన్మంబు గలుషహీన మగుచు ముక్తిపాత్రంబగు నబ్జవదన!

తే॥ విరజ నీభీతి నెటు నది, విగజ కొడుకు, లబ్ధులెక్కిరి వేణియెట్లయ్యె శివుఁడు
నచ్చరల్ గండకినదిగనైరి బ్రహ్మ యెటు కకుద్మిని నా గంగయయ్యెనట్లు.

తే॥ మఱియు విష్ణువు కృష్ణగా వఱలె నెట్టు లట్టు లిట్టి బుభుంషను నధికమైన
ప్రేమపూర్వకభక్తిచే విమలవారి యయ్యెనని యెంచు మనుమాన మందవలదు.

క॥ ఈ కథవినువారందరు ప్రాకటకలుషంబులుడిగి పావనతములై
లోకములెల్లఁ గడవ గోలోకమునకుఁజేరఁగలరు లోలన్నయనా! ౬౧౮

చ॥ అని యిటుఁజెప్పి స్వప్రియకు నచ్యుతుఁ డా బుభుమానియాశ్రమం
బును విడి రాధతోఁగలసి భూరుహవల్లరిరమ్యమాలతీ
వనమున కేగి గోపికల వందురెరింగి కృపాళుఁడై శుభా
యనపులినంబుఁజేరె నటకస్థల వ్రేతలు వచ్చి రాస్థతోన్. ౬౧౯

ఉ॥ వచ్చినవెంట వారు హరిఁ బల్మరుఁ జూచుచుఁ గోపమఃఖముల్
బుచ్చి ఘనంబుతో మెఱపువొందినకై వడిఁ గూడి రంత నా
లచ్చిమగండు గ్రచ్చఱ సలక్షణమా నల బృందకాటవిన్
జొచ్చి సగోపకుండయి వినోదముగాఁ గడుఁబాడె వంశితోన్. ౬౨౦

ఉ॥ ఆ మురళీవినాదమున నందిరి మూర్ఛను గోపకన్యకల్
భూమిజముల్ జలత్వమును బొందెఁ బ్రపంచము నిద్రఁజెందె ది
క్సామజముల్ విచిత్రపడె స్తంభత వేల్పులుఁబొంది రండజ
స్తోమము వీడె దిర్గుట, నదుల్ వడిమానెను మైథిలేశ్వరా! ౬౨౧

తే॥ ఇట్లు రాధ గోపికలను కృష్ణుఁ డెలమిఁగూడి రాసములం దేల్చి కోడి గూయ
వేకువను లేచి వారిని వీడ్కొని యల నందమందిరమున కేగె నరవరేణ్య!

తే॥ అంత రాధికాదేవియు నఖిలగోపికాసహిత యాచు ముదమునఁ గదలి స్వీయ
జనకగృహమున కరిగె నా చక్రపాణి కొన్నిదివసంబు లటనుండి కోర్కెతోడ.

వ॥ ఆ గోకులంబుననున్న వారికింపెరకు దర్శనంబిచ్చి యమ్మధురాపురంబునకుం బోనెంచి నందోపనందవృషభానుగోపికాగోపకగోగణంబులతోఁ గలసి వారి సెలవ్వుఁ గైకొని వృషభానుపేరునియుగాంబునకు నరిగి తన పైనంబు హెచ్చరించి యశోదానందులకును తన ప్రయాణం బెఱింగించి వాయువేగంబునఁ జను ఘోటకంబులచే బద్ధంబైన తన దివ్యరథంబెక్కి వ్రజంబునుండి సాగిపోవు సమయంబున వ్రజవాసులగు గోపకులు దద్విరహంబు సైపలేక వెంటనంటి శ్రీకృష్ణా! తోందరగా వారలిరమ్ము. నిన్ను విడి నేము మనఁజాలము. యశోదానందానందసంధాయకుండవు వ్రజజీవధనంబవు యదుకులరత్నదీపంబవు మునిమనోమోహనుండవు నగు నీ దర్శనంబు మాకు నిదాఘమునందు నర్ఘంబుగను శీతార్తునకు గృష్ణవర్త్మగను జ్వరపీడితున కౌషధంబుగను మృతునకు జీవప్రదంబగు సంజీవినిగను నుండె. నిన్నుఁ గనెడి మా పూర్వపుణ్యంబు సమాప్తంబు గాకుండ నొనర్పుము. మఱియుఁ బ్రకృతిపరుండవును నిర్గుణుండవును నగు నీవు భక్తార్థంబై సగుణుండవైతివిగాదె. శివబ్రహ్మేంద్రాదిదేవేంద్రాదులు నిరపేక్షతో నీకు భక్తులై నిన్ను సేవించుచుందురుగదా! కాన భక్తులగు మాపై ననుగ్రహంబుంచి యల్పకాలమ్ములోనే రమ్మని ప్రార్థించుచు దుఃఖించు నా భక్తవత్సలుం డానందాశ్రువు లొలుకుచుండఁ బ్రేమవిహ్వలులగు నవ్వారినిం గాంచి గోపకులారా! మీరలందరు నా ప్రాణంబులు దేహం బన్యత్ర సంచరించుచున్నను నా హృదయంబుమాత్రము మీయందె యుండు. తత్త్వమార్గంబునం జూచిన మీకు నే దూరగుండనుఁగాక సమీపస్థుండ నౌదు. ఐన నొక నెలలోపల యిటకు రాఁగలనని విశ్వసించుఁడు. చింతిల్లకుఁడు. జరాసంధుండనెడివాఁ డిపుడు మధురాపురిపై దాడివెడలియున్నవాఁడు. దాన యదుసహాయార్థంబై పోవుచుంటి. అడ్డగింపకుఁడు పొండు. పొండని యనేకవిధంబులఁ బలికి పలుమాఱు మరల్చి యన్స్యందనంబున యశోదానందుల నారోహింపఁజేసి శ్రీదామావినుత్రిపురులం దోడ్కొని సోద్ధవుండై గంధవహజవమ్మునఁ జని తన్మధురాపురవాసులు గని మెచ్చుకొనఁ దత్పురింబుఁ బ్రవేశించెనని చెప్ప నబ్బహులాశ్వుం డామోదంబుఁ జెంది క్రమ్మఱ నా నారదమునీంద్రునితో నిట్లనియె. ౬౨౮

క॥ మధురానగరంబున కా మధురిపుఁడే తెంచి యచట మను పౌరులకున్
మధురంబగు దర్శన మావిధినిడి యేపనులఁ జేసె వివరింపు మునీ! ౬౨౯

—♦ బలరాముండు కోలనిశాచరుం ద్రుంచుట. ♦—

చ॥ అనవుడు నారదుం డిటులనాడెను దేవర! సాగ్రజన్ముఁడై
వనరుహలోచనుం డచటఁ బద్ధున నల్పిన కార్యముల్ వచిం
తును విను సావధానముగ దుష్కృతిప్రియుఁడైన కోలుఁడన్
దనుజుఁడు మాంసలోలుపత ధాత్రినిఁ దిరుగుచు నంతిమంబునన్. ౬౩౦

క॥ కౌశాంబీపురమున కావేశముతో వచ్చి జనులఁ బీడించుటచే
నాశువుగాఁ దత్పౌరులు స్వాశయములఁ దెల్ప మధురకరిగిరి భూపా! ౬౨౭

ఉ॥ అత్తఱి సీరపాణి మృగయార్థము [illegible]తురంగమెక్కి పో
నెత్తగఁ డక్క జెలంగుటను నేత్తెఱఁ [illegible] వాయ డాసి యో
సత్తమ! కోలదానవుఁ డజస్రము బాధలఁ బెట్టుచుంట నే
మిత్తఱి నీవె దిక్కనుచు నీడకు వచ్చి [illegible] బలీ! హలీ! ౬౨౮

క॥ ఆ రక్కసి, ప్రభువగు కౌశారవిసిం [illegible] మాకు శాసకుఁడయ్యెన్
సీరీ! తద్భీతిని మా భూరమణుఁడు [illegible] తినయపొంతకు నేగెన్. ౬౨౯

ఉ॥ ఏగి జితేంద్రియుండగుచు హెచ్చు[illegible] గోరి నిజప్రభుత్వ మీ
వే గతియంచు నిన్ను నుతియించు, [illegible]ణఁజేయ నా విభుం
డే గిలిలేని యట్లు తన యెత్తుడుబిడ్డ[illegible] మాదు బా
గోగులఁ జూచి ప్రోచెఁగద యార్జి[illegible]నుహత్వభాసురా! ౬౩౦

ఉ॥ కావున మాదు కుయ్యి విని క్రౌర్యమునన్ వెతఁగొల్పు కోలు ని
ర్జీవుగసల్పి మా విభుఁడె చేరి యథా[illegible]గాఁ బ్రభుత్వమున్
శీవి నొనర్పఁజేసియు గడింది ము[illegible]గూర్చి సాకు మో
దేవర! దేవదేవ! వసుదేవకుమా[illegible]! [illegible]మాపయోధివై. ౬౩౧

తే॥ దుర్జయుండైన కంసుని దోర్బలం[illegible]మొనరించితివి కాని ఫలము లేదు
కంససఖుఁడును గాశ్యపీకంటకుఁడు[illegible]న కోలదైత్యునిఁ జంపనంతవఱకు.

ఆ॥ దుష్టశిక్షణమును శిష్టరక్షణమును [illegible] సగుణుఁడవుగ జెలఁగితీవు
కోలదైత్యుఁడింకఁ గుంభిని బ్రతికిన [illegible]గంబులకును మాదుఁ గీడు. ౬౩౩

క॥ అని యిటు బద్ధాంజలులై వినుతి[illegible] సీరపాణి విని తద్గంగా
ధునియమునానద్యంతరమునఁ గల [illegible]ంబినామపురమునకరిగెన్. ౬౩౪

మ॥ అటుపైఁ గోలనిశాచరుండు తినత[illegible] నా రాముఁ డాజిం బొన
ర్పుటకై వచ్చెనటంచు వించరడ [illegible]హించి రోషంబుతో
జటులాక్షౌహిణులన్ బదింటిఁగొని [illegible]ంబుఁ జేయంగ ను
త్కటవేగంబున నేగుదెంచె నవలన్ [illegible]హిణేయుండొగిన్. ౬౩౫

తే॥ చంచలతురంగవీచికాప్రాంచితంబు
స్యందనేభ తిమింగలసంయుతంబు
బ్రలయజలధిధ్వనియుతమగా వాహి[illegible]లె
జెలఁగు వాని వాహినిఁగాంచి హ[illegible]ముఁ గొనుచు. ౬౩౬

ఉ॥ కట్టగ వేసి హా ముసలకాండముఁ గైకొని యొక్కమాఱు బ
ల్లట్టిగఁ గొట్ట నా ధ్వజినిఁ గ్రాలిన కొందఱు నేలఁగూలి రి
ట్టిట్టన నాసికాస్యముల నెత్తుచు నేగిరి కొందఱాతనిన్
ముట్టఁగ లేక తక్కిరికిఁ బోయిరి కొందఱు వ్రాలె రథ్యముల్. ౬౩౭

తే॥ నిసవఁ గోలసి శాటుండు స్వీయసేన
నష్టమైన శోకింపక శిష్టరక్షు
కుఁడగు బలభద్రు వధియింపఁ గడఁగి కార్ము
కముల ధరియించి నిప్పులు కనులఁ రాల. ౬౩౮

శా॥ పాటీరాదిసుపత్త్రయుక్తము నవద్వారిప్రదాభంబు ఘం
టాటంకారవిభీషణంబు రిపుకాండప్రాణహారంబు స
చ్ఛాటీబద్ధకటిప్రయుక్తము చతుర్దంతాంచితంబున్ హరి
ద్వాటీనాగసమంబునైన నిజమాతంగంబునం దెక్కెఁ దాన్. ౬౩౯

క॥ జంకక కొంకక పదనగు నంకుశమున్ గేలఁబూని యా గజమా తా
లాంకునిమీఁదికిఁ ద్రోలిన సంకెల గల్లనఁగ నద్ది చనియెను బిరవన్. ౬౪౦

చ॥ ముసలియుఁ గాంచి రోషమున ముంగలకున్ జనుదెంచు దానినిన్
బసగల వజ్రి వజ్రమునఁ బర్వతమున్ బ్రహరించినట్లు త
న్ముసలముతోడఁ గొట్టె నల పోటున నా కరి చూర్ణమయ్యెఁగా!
ఉసులునఁ గట్టదెబ్బ ఘట మోడయినట్టు లనంతరంబునన్. ౬౪౧

ఉ॥ కోలుఁడు దంతినుండి యిలఁ గ్రోడముఖుండును రక్తనేత్రుఁడై
శూలియు శూల మా బలిసిఁ గూల్పఁగనైన నతం డయోగ్రమున్
దాలిచి ముక్కముక్కలుగ దానిని జెండెను గాచపాత్రమున్
బాలుఁడు కఱ్ఱతో నుసిగ బాఁదినమాదిరి మేదినీధవా! ౬౪౨

తే॥ వేయిమణుగుల బరువున వెలుఁగు గొప్ప
గదను గొని కోలుఁ డా బలు హృదయమందుఁ
గొట్టె ప్రలయాంబుదము మాడ్కిఁ గూకలిడుట
తాటిపడగ వాఁడును దారసిల్లి పిదప. ౬౪౩

క॥ కజ్జలంబువోలెఁ గ్రాలిన కోలుని మూర్ధమందు స్వీయముసలహేతి
చేత మర్దనంబుఁ జేయ నా రక్కసి కూలి మరల లేచి కోపగించి. ౬౪౪

చ॥ కడువడి గ్రుద్ది యా హలికిఁ గన్పడకుండ దివంబుఁ జేరి బ
ల్పిడుగులుఁ దీవ్రవాతములు భీమఘనంబులు గాఱుచీఁకటుల్
బడయఁగఁ గ్రమ్మి యంతట జపాసుమభాసురరక్తబిందువుల్
దడదడ రాల్చి యోర్వనివిధంబునఁ జేసి రణాంగణంబునన్. ౬౪౫

తే॥ ప్రాయ మేదోస్థిమాంసవిణ్మూత్రమధుయు
తమగు ధారాధరంబులుఁ దద్దఁ గురియ
నటులఁ జేయఁగ నౌరా! యటంచు హాలియుఁ
దత్కృతమగు టక్కుని యెంచి తత్క్షణమున. ౬౮౬

తే॥ పరచమూధ్వంసకంబును బ్రబలయనహీన
సమము శతయోజనాయతి సంయుతంబు
సర్వశస్త్రఘాతుకమును స్వచ్ఛ సుష్ట
ఘాతమయమగు ముసలంబుఁ జేతఁగొనుచు. ౬౮౭

ఉ॥ వానిని సంహరించుటకు వైవఁగ నద్ది దశాశలందు న
న్యూనముగా వెలింగి చవినున్న ఘనాఘనసంచయంబు నా
భానుఁడు దట్టమౌ హిమము భంగముఁజేసినభంగిఁ గ్రుంగఁగాఁ
బూనికతోడఁ గొట్టె యటఁ బొందికగాఁ దగియుంట వెంటనే. ౬౮౮

చ॥ కనియుఁ బ్రలంబవైరి తనుకంబున స్వీయహలంబుతోడ వా
నిని నవలీల లాగికొని నిర్గతవంచను గోలదైత్యునిన్
దన ఘనబాహుదండముల ధైర్యముతోఁ గొని యేకుఁద్రిప్పుభా
తిని సుకరంబుగా మిగులఁ ద్రిప్పియు నేలనుగూల్చెఁ బెల్చనన్. ౬౮౯

ఉ॥ తద్దనుజప్రపాతజనితంబగు శబ్దముచేఁ బ్రపంచమున్
దద్దరిలెన్ దదాసురుఁడు దంతములెల్లను రాలఁ గన్నులున్
దద్ద భ్రమింప నష్టై నిధనంబునుజెందెను వజ్రహేతిచే
గ్రద్దన వృత్రుఁ డంతమును గాంచినకైవడి నట్టివేళలోన్. ౬౯౦

చ॥ కురిసెను బుష్పవర్ష మనుకూలముగా సురబృందదుందుభుల్
బరువడిమ్రోసెఁ గిన్నరులు పాడిరి చారణు లాడిరా బలుం
డురవడి నిట్లు గోలుఁ బ్రతికూలుని జంపి దయాళుఁడౌచు నీ
వఱ కల పట్టణంబుఁ బరిపాలనజేసెడి తేనిఁ బిల్చియున్. ౬౯౧

క॥ పట్టాభిషేక మొనరిచి పట్టిన కౌశాంబిపురిని వడి నిడి తనకుం
బట్టిన యఘములు సనుటకు బట్టున గర్గాదివిబుధపటలసహితుఁడై. ౬౯౨

క॥ భాగీరథికిం జేరియు నా గర్గప్రభృతివిప్రు లామ్నాయోక్తుల్
బాగుగఁ జెప్పఁగ స్నానము "హే గంగే పాహి" యనుచు నెలమినిసలిపెన్.

తే॥ అవల సంకర్షణుండు ధరామరులకు లక్ష మత్తేభముల్ రెండులక్షల రథ
ములును గోటిహయంబు లావులును నర్బుదంబు భక్తితో నిచ్చియు దనివిదాకన్.

తే॥ స్వర్ణయుతశతాశ్వవభారసహితదివ్యరత్నముల బహుప్రణతిపూర్వకముగాను
దానమిచ్చి యా మథురకుఁ దరలిచేరె నరయ నిది ప్రపంచార్థమై జరిగెఁగాదె?

తే॥ అట్లు రాముండు మునిఁగిన యట్టిచోటు రామతీర్థంబటంచిలఁ బ్రథితికెక్కె
నందు జలకమాడినవార లఖిలదోషములను బాసి పుణ్యంబులఁ బొందఁగలరు.

తే॥ కృత్తికాభాంచితమగు పూర్ణిమను గార్తి
కమున రామతీర్థమునఁ దానమును జేయు
నట్టివాఁడు హరిద్వారమందు మునిఁగి
న ఫలమును మించు ఫలమొందు నట్టులేక. ౬౫౭

తే॥ అని వచింపగ భూపతి యాడెనిటుల నట్టి కౌశాంబినగరికి నిట్టి రామ
తీర్థ మెంతదూరమునందుఁ దేజరిల్లు నద్ది నుడువుమనుటయు నిట్లనియె మౌని.

వ॥ భూపా! యీ రామతీర్థంబున కీశాన్యభాగంబునఁ జతుర్యోజనపరిమితం బగు దూరంబున నా కౌశాంబి యను నగరియు, వాయవ్యభాగంబున నంత దూరంబుననే సూకరక్షేత్రంబును, నాగ్నేయదిక్కునం దాఱుక్రోసులలోఁ గర్ణక్షేత్రంబును, పంచక్రోశంబుల నైఁక్షేత్రంబును, బూర్వభాగంబునందు మూఁడుక్రోశంబులలో వృద్ధికేశి సిద్ధిపీఠ బిల్వకేశ వనంబులు నుండు. ఇందుననే దృఢాశ్వుం డను వంగరాజొకఁ డుండు. అతఁ డొండొకవేళఁ గురూపియగు లోమశమహామునిఁ గాంచి పరిహసించి కురూపంబుగల క్రోడముఖంబుతో రాక్షసజన్మంబెత్తుమని తన్మునిచే శప్తుండై భూతలంబునఁ గోలుండను పేర నిశాటజన్మంబెత్తి సంచరించి యట్లు బలరామునిచే నిహతుండై ముక్తుండయ్యెనని యెఱుంగుము. అంత నా సంకర్షణుం డుద్ధవాదిమంత్రిసమన్వితుండై పుణ్యప్రదంబును, దక్షశ్రుతివిదితంబు నగు జాహ్నవీతీర్థంబునకరిగి యందు జలకమాడి భుసుకులను బుడమివేల్పులకిడి పాండవప్రియంబైన యాహారస్థాననామకస్థానంబునకేగి యందు మునిఁగి ద్విజాతులకు శుభక్తికంబుగా దక్షిణలొసఁగి దివ్యాన్నంబిడి యారేయి వసించి యుషఃకాలంబున లేచి భగవత్కృపాప్తికై యేకపాదంబున నిలిచి నిర్వాతదీపంబుభాతి నిశ్చలంబుగాఁ దపం బొనరించెడి మాండూకనామకుండగు స్వప్రియభక్తునిం గృతార్థుం జేయం దలంచి యోజనదూరంబున నున్న యమ్మునికడకుం జని కరంబుగా నతని శిరంబునఁ గరంబునిచి వరం బడుగుమని నుడువ నా యోగివరేణ్యుండు హృదయగతుండగు భగవానుండు తన ముంగటఁ జెలంగుటం గని యంతరంగంబునఁ బొంగి యిట్లు ప్రార్థించె. ౬౫౮

తే॥ భక్తవత్సల! రామ! శ్రీవత్సలాంఛనాగ్రజా! దానవాంతక! యాదవాన్వ
యాబ్ధిచంద్రమ! నీలాంబరా! మహాత్మ! చేతనాచేతనాత్మక! జోత లివిగొ.

తే॥ నిశ్చయంబున నాపైని నీకుఁ గరుణ
యున్నచో కలిహారణం బనుత్తమంబు
భాగవతమును శుకయోగివక్త్రిజనిత
మునగు సంహితామృతమిడు ముసలపాణి! ౬౬౧

క॥ అనవుడు బలుఁ డిట్లనె నో యనఘా! యుద్ధముఖమున నయ్యాది నీ క
బ్బునని మెఱుంగుము నావుడు విని మాండూకుఁడును నిట్లు వేఁడెను బలునిన్.

క॥ ఓ భగవానుండా! ఏ వా భాగవతార్నత యుల యూపగవి కేటుల్
లాభముగా నిసితివో మఱి యీ భక్తుం జెప్పుడు నాకు నగుపడఁగలఁడో?

చ॥ అనవుడు నీలచేలుఁ డిటులాడె రహస్యముఁ బుణ్యదంబునన్
ఘన మఘనాశనంబయిన గాథఁ దదీయము నే వచింతు నో
మునివర! సంహితామయుగ బోధకుగా నిషమింపఁబడ్డ యీ
యనఘుఁడె యుద్ధవుం డితఁ డనర్గళవృత్తినిఁ జూడు మిత్తఱిన్. ౬౬౪

ఉ॥ కాని దయాప్రపూర్ణుఁడు నకల్మషుఁడైన యితండు తీర్థయా
త్రానిరతిన్ జెలంగుటను ద్వత్ప్రియతత్వము సాంప్రతంబునన్
బూని వచింపనేరఁడని బుద్ధి నెఱుంగుము తాదృశవ్రజ
స్థానగగోపపఙ్క్తికి ముదంబునుగూర్చినవాఁ డితండెకా. ౬౬౫

తే॥ రాధికాముఖభామినీ బాధలెల్ల
నపనయించుట కితఁడే యర్హుఁడంచుఁ
దనకు మాఱుగఁ బరమాత్ముఁడును మహాత్ముఁ
డు నగు కృష్ణుఁ డీ యుద్ధవుఁ బనిపె మౌని! ౬౬౬

క॥ పరికరసంపాదనమున సరసత గుణరూపములను సర్వవిధములన్
హరికిని నీతనికిని నంతర మేమియు లేదటంచుఁ దలఁపుము యోగీ! ౬౬౭

సీ॥ భువనంబులందున ముద్రాధికారియు నేర్పరులను మంచి నేర్పరియును
ధార్మికవరులలో ధర్మనిర్ణేతయుఁ గవులయందున భవ్యకార్యకర్త
భాగవతులయందుఁ బరమభాగవతుండుఁ దత్వవక్తలలో వదావదుండు
మంత్రిసత్తములలో మంత్రివిదుండును బురుషులలోఁ బుణ్యపూరుషుండు

తే॥ వనరుహాయతనేత్రుని ప్రతినిధియును నాకుఁ గుడిభుజంబును సద్గుణాకరుండు
నైన యీ యుద్ధవుఁడు దలలోని నాల్కవలెను సంచరించెడి ధరాతలమునందు.

ఉ॥ మాధవుఁ డీతనిం గలిసి మానుగ గోకులమేగి యందునన్
మాధవమందు గ్రీష్మమున మంజులభాషల నాడుచుండి త
ద్రాధకు, నందరాజునకుఁ దత్సతికిన్ మఱిఁ దక్కువారికిన్
బాధలఁ బాపి సంతస మపారముగా ఘటియించె నో మునీ! ౬౬౯

ఉ॥ ఎత్తఱి మేము భూమివిడి యేగెదమో యపుఁ డీ ఘనుండు తా
నత్తి ధరామరశ్రుతివిదగ్రజ గో పరిపాలనంబు లో
కోత్తరపద్ధతిన్ సలుపుచుండును నీ యధికారమెల్ల మా
చిత్తముఁబట్టి యీతనికిఁ జెందునటంచు నెఱుంగు మో సుధీ! ౬౭౦

తే॥ ఎపుడు బదరికాశ్రమమందు నేము వఱల
కుందుమో యప్పు డీయన యందుఁ జేరి
స్వీయ తేజంబుచే దిశల్ వెలుగఁజేసి
యొప్పుచుండును మాండూక! యొప్ప జగము. ౬౭౧

చ॥ హరి విరహార్తిదగ్ధవిజయాత్మవధూతతి నూఱడించి సం
బరమిడ నుద్ధవాఖ్యు, నిజపౌత్రసతీగణబాధ మాన్ప మా
ధురవిభు వజ్రినాభుని యదుప్రభునింకఁ బరీక్షిదాఖ్యుఁ ద
త్కురుకులమందు సౌఖ్యమిడఁ గొంకక యేర్పఱచున్ మునీశ్వరా! ౬౭౨

తే॥ కురుకులమున జనించిన ధరణినాథుఁ
డగు పరీక్షిత్తునకు నొక్క యాత్మజాతుఁ
డమితరుచిఁ గల్గి జనమేజయాఖ్యుతోడఁ
బుట్టి జనకారిహరణంబు బుద్ధిఁదలఁచి. ౬౭౩

తే॥ సర్పయాగంబు సల్పెడి సమయమందుఁ
దద్విధానసామగ్రు లుద్ధవునివలన
నెఱిఁగి బర్హిర్ముఖాచార్యు కరుణ నది ని
వృత్తముగఁ జేయు మాండూక! యిద్ధచరిత! ౬౭౪

తే॥ తదహియాగస్థలంబునఁ దప్పకుండ గౌరవంశోద్భవంబు నకల్మషంబు
నైన చైతన్యకులమున కధికఫలముకా మహాభాగవతము బల్కఁగఁబడును.

చ॥ మఱి జనమేజయుండు నవమంత్రవిదగ్రణులైన ధారణీ
సురులకు నూఱుగ్రామముల జోతల నర్చలసల్పి యిచ్చి స
ద్గురువగు వేల్పుటొజ్జపలుకుం దలఁదాలిచి మాసమొందు సూ
కరమను తీర్థరాజమునఁ గ్రాలి యొనర్చి యనేకదానముల్. ౬౭౬

తే॥ పద్రసాంచితమైనట్టి సాద మగ్ర
జులకుఁ బెట్టి గజాశ్వగోవులను రత్న
ముల నొసంగి తత్స్థలినుండి పుణ్యగంగ
దరులఁగల తీర్థములఁ జూచి గురునిఁ గూడి. ౬౭౮

చ॥ వడిగ శయానమున్ బురికిఁ బార్శ్వదయుక్తముగాను జేరి యా
యొడయని యాజ్ఞ నచ్చటనె యుండి ససాధనవస్తుజాలుఁడై
బుడమినిఁ గెల్చి భూభుజసమూహవిభుండయి యశ్వమేధ మె
క్కుడుగ నొనర్చి స్వీయగురుకుంజరునిన్ శరణంబుఁ గోరియున్. ౬౭౯

తే॥ అమరనదికిఁ బూర్వదిశను నైమిశక్రోసులను జెలంగెడిచోటున నధివసించి
భక్తి నేకాంతసేవను యుక్తరీతి సల్పఁగలఁడు మాఁడూక! యా స్థానమందు.

ఉ॥ సంసృతిరోగహింసకము సార్థకమున్ బరమార్థదంబు స
త్సంసితమైన భాగవతధర్మవిచారముఁ బుణ్యపూరుషో
త్తంసులు నేరి సల్పుదురు తత్సమయంబున నీవు నుండి త
ద్ధంసవిశేషముల్ విని మహత్త్వదమొందెద వో మునీశ్వరా! ౬౮౦

క॥ డెందమునందున సందియ మిందులకుం జెందవల దహీనతపము రా
త్రిందివమును సల్పుట నీకుం దెలియ న్నుడివితి నిది కోవిదవర్యా! ౬౮౧

చ॥ అని యిటుబల్కి వేడ్క వర మాతనికిచ్చి తదచ్యుతాగ్రజుం
డనుగవిశిష్టుఁడై వెడలి యాయతమైన శయానపట్టణం
బునకు శివాశ నుండునది పుష్పవతీపురి కంతకాశఁ బొం
దినదియుఁ గంటకస్థలి కుదీచినినుండిన మంచిచోటునన్. ౬౮౨

తే॥ వాసమొనరించి పదివేలవాజు లొక్క
వందరథములుఁ బదివేలపాలుఁబితుకు
మంచియావులు నొకవేయి మత్తకరులు
భూసురులకు నొసంగెఁ దత్సమయమందు. ౬౮౩

ఉ॥ దేవతలున్ ద్విజన్ములును దివ్యతపోధను లేగుదెంచి యిం
ద్రావరజాగ్రజున్ గని తరంఘ్రిసరోజములందు వ్రాలి పు
ష్పావళిచందనాదులను నర్చనసల్పియుఁ "గోలఘాతినే
దైవతపోషకాయ వరదాయ నమోనయ" యంచు వేడుదున్. ౬౮౪

చ॥ హలి కని భావమం దలరి యార్యతపోధన దేవులార! ని
స్తులముగ నన్నుతించితిరి తూర్ణముగా వరమేమి మీకుఁ గా
వలయునొ తెల్పుఁడీ! యనఁగ వారిటులడ్గిరి మీర లెప్పు డే
సిలుఁగులు మాకుఁ గల్గినను జిందఱవందఱఁ జేయుఁ డత్తతిన్. ౬౮౫

ఉ॥ పిమ్మట రేవతీశుఁ డిటు ప్రీతి వచించెను నయ్యలార! భా
వమ్ముల మీరు నన్ దలచుపట్టుల మీదరి కేను వచ్చి క
ష్టమ్ములఁ బాపి పూర్ణమగుసౌఖ్యముగల్గ నొనర్చి పోయెదన్
నమ్ముడు దీని మానసమునన్ శపథంబు మదీయ మియ్యదే ౬౪౮

తే॥ ఈర లందఱీతావున కేగుదెంచి, భక్తితో నాకుఁ బూజలఁ బరగఁజేసి
యుంటి రందున నియ్యది యుర్విఁ బ్రథితి, నందె సంకర్షణస్థానమనఁగ నసఘ!

ఉ॥ మానవు లిందుఁ గల్గెడి నమర్త్యధునీమణియందు వేకువన్
స్నానమొనర్చినన్ వ్రతమునల్పిన వేల్పులఁబూజచేసినన్
దానములిచ్చినన్ హరిని నమ్మి భజించిన ధన్యులై ఘన
స్థానముఁ జెందనేర్తు రిది తథ్యము బథ్యమటంచుఁ బల్కియున్. ౬౪౯

తే॥ స్వపుర మైనట్టి మధురకు సకలమిత్రసహితముగ నేగె నీ కోలసంభ్రమమథన
రామపూజలు గలకథ యేమఱిలక, యవధరించినవా ర్ధన్యు లౌదు రనఘ!

తే॥ అనఁగ బహులాశ్వుఁ డిట్లనె నమరమాని!
సీరి యొకసారి చనినంత క్షేత్రమయ్యె
ననుచు వినిచితి నీఁక ననయంబు మధుర
ననికిఁ జేసెడి నది యెంత యుత్తమంబొ! ౬౫౦

## మధురాపురీ మాహాత్మ్యము.

మ॥ మఱియున్ దన్మధురాభిధాపురమునన్ మాహాత్మ్య మేముండు? నే
పరమాత్ముండు వసించు? నే నరపతుల్ పాలింతు? రద్దాని నే
పరమక్షేత్రమునందు నద్దితగు? నీ వార్తల్ ప్రశంసింపఁగా
గరమున్ వేఁడెద నారదా! యనఁగఁ బల్కన్ సాగె నాతం డిటుల్ ౬౫౧

ఉ॥ శ్రీరమణీమనోహరుఁడు చిత్తజరూపుఁ డనుత్తముండు సం
సారగతార్తిహంతకుఁడు సర్వకులేంద్రశయానుఁ డాద్యుఁడున్
వీరుఁడు దేవకీసుతుఁడు విశ్వవిభుండుఁ బ్రపూర్ణుఁడున్ నిశా
టారియునైన శ్రీహరియె యా మధురాపుర మేలు మేలుగాన్ ౬౫౨

సీ॥ భగవత్కరుణచేత బ్రాహ్మణవరుఁడగు కపిలున కే మహాఘనుఁడు పుట్టె
దత్కపిలాభిధుం డుత్కటామోదియై బృందారకేంద్రున కెవని నిచ్చె
నా విబుధులగెల్చి రావణుండును లంకఁ బొగడి యెవ్వానికిఁ బూజసల్పె
నా లంకను జయించి యవనిజాపతి యయోధ్యాపురి నెవరికి నర్చఁజేసె

తే॥ నట్టి శ్రీరాము భజియించి యిట్టి మధుర
యందు శత్రుఘ్నుఁ డెవ్వాని కంజలులను
గూర్చె నా మాధురులసేవఁ గొనునొ యెవ్వఁ
డల కపిలవరాహుఁడె మంత్రియయ్యె నయ్య! ౬౯౩

క॥ భూతేశ్వరుఁడగు శంకరుఁ డాతతయష్టిని ధరించి యధములు సెడఁగాఁ
బ్రీతిఁ జెందఁగ భక్తులు బ్రాఁతిగ నట క్షత్రియయ్యె బహులాశ్వవిభూ!

తే॥ సింగమందునఁ గూర్చుండి సిలుఁగులెల్ల బొల్లువడఁజేసి మంగళముల్ సెలంగ
సల్పి సతము మహావిద్య చండికాంబ గ్రామదేవతగా నుండెఁ గరుణ నచట

క॥ నేనో తత్పురిచారుఁడ నానేతఁ బౌరులకును నఖిలజగములఁ
మానక జరిగెడి వార్తలఁ బూనికతో నుడువుచుందుఁ బుణ్యచరిత్రా! ౬౯౪

చ॥ అల మధురాపురాంతరమునందున శ్రీమధురాంబ యుండి నెం
జిలులను బాపి సర్వులకు శ్రీ ఘనతా ధన శూరతాయుపు
ల్బలముగ నిచ్చు నాహారి సలక్షణదేహమునుండి తత్పుర
స్థలము జనించె దానిఁ గను సజ్జనుఁడొందుఁ బరంబు భూవరా! ౬౯౫

తే॥ జలధరాకార భాసురుల్ నలుబుజములు గలుగువారలు నగు రమాకాంతపార్ష
దులు విమానములందు మృతులను జేర్చి పరమపదవికిఁదోడ్కొని యరిగెదరట

తే॥ మును స్వయంభువు శతవర్షములు తపంబు
నట్టి మధురాపురమున నిరన్నుఁ డగుచుఁ
జేసి స్వాయంభువ మనువుఁ శ్రీధరదయఁ
బుత్రునిగఁ గాంచె మైథిల భూవరేణ్య! ౬౯౬

వ॥ వెండియు, దేవవరుండును, సతీపతియు నగు భూతేశ్వరుండు ప్రతిదై దివ్యవర్ష శతకంబు తపంబా మధువనంబునం బొనరించి, శ్రీకృష్ణప్రసాదంబుఁ బొంది, తన్మధురాపుర ద్వారపాలకత్వం బార్జించె. నేనును దదనుగ్రహంబుననే తన్నగరంబునకు దూతగాఁ బోఁజాలితి. దుర్గాదేవియు నట కరిగి శ్రీకృష్ణున కూడిగముం జేయుచుండె. తద్వనంబుననే యింద్రుండు మహేంద్రపదంబును, నినుండు మనువును, ధనదుండు నిత్యనిధిని, వాశి పాశంబును, ధ్రువుండు ధ్రువపదంబును, నియమంబుగాఁ దపం బొనరించి, సంపాదించిరి. శ్రీరాముండు లవణాసురపరాజయంబును, నంబరీషుండు ముక్తిని, రఘుచిత్రకేతులు కార్యసిద్ధిని బొందిరి. తన్మధువనంబుననే మాధవమాసంబున నమ్మధుసూదనుం డమ్మధునామకనిశాటుని డీకొని, డింక వేయించె. సప్తమహర్షులు, నన్యమునులు నందుననే తపించి, జపించి, యిష్టసిద్ధినిం బడసిరి. గోకర్ణనామకుండగు వైశ్యుండును, మహానిధిని నందుననే పొందె. లోక

రావణుండగు రావణుండు తద్వనంబున నధికనిష్ఠతోఁ దపంబొనరించి, గరిష్ఠులును ద్రఢిష్ఠులు నగు బర్హిర్ముఖుల నోడించి, దేవానాం ప్రియులగు పూర్వదేవులను గూడి యమరావతీపురంబును బురుడింపంజాలు లంకానగరం బకలంకంబుగా నిర్మింపంజాలె. అందు ననే శంతనుమహారాజును దపంబొనర్చి, తత్త్వార్థసాగరుండును, గుణరత్నాకరుండును నగు భీష్మునిం గుమారుగాఁ బడయ నేర్చెం గాదె యని వాకొన, బహులాశ్వుం డాకర్ణించి, సంతోషించి, శిరంబు వంచి, చేతులు ముకుళించి, స్వామీ! యట్టి మధురానగరతిలకంబున వాసంబుజేసినవారల కేఫలంబు గల్గునో వాక్రువ్వ మనుటయు సురర్షి యిట్లనియె. ౨౦౦

చ॥ తొలుత వరాహుఁ డీ ధరణి తోయధిలో మునుగంగఁ గోఱలన్
గలభము తమ్మిఁ దుండమునఁ గైకొనినట్టుల లేవనెత్తి యా
యిల మధురాపురిన్ నిలిపి యెల్లవిధంబులఁ గాచె నంచుఁ బె
ద్దలు వచియింప నేను విని తన్మహిమంబును నీకుఁ జెప్పితిన్ ౨౦౧

చ॥ మధురయటంచుఁ బల్కఁ నలమాధవు నామము నాడినట్లగున్
మధురను దాఁకినంత నల మాధవభక్తులఁ గూడినట్లగున్
మధురను విన్నమాత్ర నలమాధవుగాథను గ్రోలినట్లగున్
మధురను గన్నమాత్ర నలమాధవు గాంచినయట్టులౌ విభూ! ౨౦౨

తే॥ మధుర మూర్కొనినంత నా మాధవప్రి
యమగు తులసి నాఘ్రాణించి నట్టు లగును
మధురలో భుజించినమాత్ర మాపతికి మ
హాని వేదనమును బెట్టినట్టులగును ౨౦౩

క॥ మధురను దిరిగెడివాఁడును మధురిపు కృపఁగోరి తీర్థమండలియాత్రన్
వ్యథవిడి చేసెడి ఫలమును విధిగాఁ దా ననుభవించుఁ బృథ్వీనాథా! ౨౦౪

ఆ॥ మధురఁ గామములను మరఁగినవాండ్రును శ్రీరమేశు పూజఁ జేసినంత
ఫలముఁ జెందఁగలరు పరమపాతకియును దత్పురమున నున్న ధన్యుఁడగును

క॥ స్త్రీఘ్నులు గోఘ్నులు నిజగోత్రఘ్నులు రాజఘ్ను లాత్మతాతఘ్నులు బ్ర
హ్మఘ్నులు మాతృఘ్నులును గృతఘ్ను లచటనున్న ధన్యతను గాంత్రుగదా

క॥ అలపురి నడువనియడుగులు నలఁతియుఁ గననట్టి కనులు నాలింపని వీ
నులు నర్చింపని చేతులు బిలువని కంఠంబు నేతిబీఱలు గావే ౨౦౭

క॥ అందలి సందులగొందుల నందములగు రాజవీధులందున ముక్తిన్
జెందఁగఁజేసెడి వార్తలె పొందికగా జరుగుచుండు భూభుజవర్యా! ౨౦౮

క॥ ఆనగరంబున మనుజుఁడు స్నానమ్మును సల్ప వారణాసిగయాది
స్నాన మొనర్చిన ఫలములు మానక యందంగఁ గలఁడు మానవనాథా!

సీ॥ ఏ పురమందున నెల్లదోషంబుల నణఁగఁ ద్రొక్కఁగఁజాలు నని సెలంగు
నెట్టి పురంబున నట్టివనంబులు పదునాల్గుకోటులు బరగుచుండు
నేనగరంబున స్నానపానాదులం జేసినచో ముక్తి సిద్ధియగును
నేప త్తనముఁగన్న నెల్లతీర్థంబులఁ గాంచినఫలములు గలుగఁగలవు

ఆ॥ మఱియు నేపురి విన్నచో ధరణినున్న యెల్లపట్టణములవింత లెఱిఁగినట్టు
లగునో యామధురాపురి కధికభక్తి ద్రొక్కుచుంటిని నాకదే దిక్కటంచు

తే॥ అఖిల భువననాథుండును నవ్యయుండు నప్రమేయుండు నాదిమధ్యాంతరహితుఁ
డచలుఁడాద్యుఁ డనంతుఁడునైన కృష్ణుఁడేలు నామధురాపురి కెరఁగుచుంటి

క॥ వరదయు మోక్షద ధర్మాకరయును దీర్ఘేశ్వరియును గాళిందీని
ర్ఝరిణీతటభాసుర శ్రీహరిపురియా మధురఁదలఁతు నఘములణంగన్

తే॥ ఎవ్వ రీ కథవిందురో యవ్వరిష్టు లాత్మజన్మమునందలి యధికమైన
దురితముల నెల్లఁ బోకార్చి పరమమైన హరిపదంబును గాంతురో ధరణినాథ!

వ॥ మఱియు నెవ్వం డీమధురాఖండం బఖండభక్తితోఁ గామియై చదువునో వినునో యవ్వాఁ డేడుమూఁడుల జన్మంబులందనుక నుత్తమ జన్మంబెత్తి, కరితురగ రథపదాతులు దనతోరణంబునఁ బొలుపాఱుచుండ నవనిధినాథుండై పుత్ర పౌత్రాదులం గలిగి కీర్తిం జెందంగలఁడు. ఇది వినిన బ్రాహ్మణుం డుద్దండ విద్వాం సుండగు క్షత్రియుండు ఖండీకృతశత్రుమండలుండగు. వైశ్యుండు ధనాధిపుం డగు ఇంకను నామూఁడువర్ణంబులవారి ముఖంబున నాలకించిన శూద్రుండును నిర్మలుం డగు. వెండియు నెవండీ ఖండంబు నిష్కామియై పఠించునో యావిభుం డైహిక సుఖంబులఁ బోఁద్రోసి స్వర్గలోకాదులను దూరీకరించి, యత్యుత్తమంబగు గోలోకంబునకుఁ బోయి, బ్రహ్మానందంబు బొందఁగలండని యెఱుంగుమని బహులాశ్వున కుం జెప్పెనని గర్గాచార్యుం డనువదింప నాకళించుకొనిన శౌనకాదిమహర్షులు క్రమ్మఱ నిట్లని ప్రార్థించిరి. ౭౧౮

శా॥ వత్సా మర్త్య విపక్షశిక్షణకృతీ! వర్ణాశ్రమాధార! శ్రీ
వత్సాంకా! కనదభ్రవర్ణరుచిరా! బాణాసురధ్వంసకా!
సత్సాంగత్య సుగమ్యరూపధర! కుబ్జాకామదాయీ! దయా
ప్రోత్సాహార్ణవ! యుత్సవాంచిత! హరీ! యుర్వీధవా! మాధవా! ౭౧౯

మానిని.

అనుపమ గుణశాలీ ! యద్భుతాపీతకేలీ !
వనరుహదళనేత్రా ! బ్రహ్మపూజాదిపాత్రా !
మునిహృదయవిలోలా ! పుణ్యసంత్రాణ శీలా !
యనుగతరుచిపూర్తీ ! యోగమధ్యేయకీర్తీ ! ౭౧౬

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ సుబ్రహ్మణ్యాదత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన శ్రీగర్గభాగవతం బందలి మధురాఖండము సంపూర్ణము.

---

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓం తత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ కృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ గర్గ భాగవతము

## ద్వారకా ఖండము

అంభోజాసన జనకా!
యంభోజదళాయతాక్ష! యంభోదాభా!
యంభోధిశయన! సుకృతా
రంభా! సంరంభరహిత! రాధాకృష్ణా! ౧

వ॥ బ్రహ్మర్షి వరేణ్యా! సురర్షి వర్యుండగు నారదునిచే హర్షప్రదంబగు
నమ్మధురాఖండంబు శ్రవణమధురంబుగాఁ గ్రోలిన యా బహులాశ్వ భూపాలకుం
డావల నా విబుధమౌనీంద్రు నేమని పృచ్ఛించెనో పలుకుమనుటయు గర్గాచార్యుం
డిట్లనియె. ౨

క॥ నారద! మధురాఖండం బౌరహి వచియించి యెదుగు నఖిలాఘములన్
దూరీకరణ మొనర్చితి రీరె కద పరార్థపరు లహీనయశస్వీ! ౩

తే॥ మఱియు శ్రీకృష్ణపరమాత్మ మధుర విడిచి ద్వారకాపురి కేలకో తరలె? నందు
నేమిచేసె వివాహములెన్ని యతని కాత్మజాతులెందరు గలరవి వచింపు ౪

—♦ కంసుని భార్యలు జరాసంధుని మ్రోలకువచ్చి విలపించుట. ♦—

ఆ॥ అనఁగ నారదుండు ననియె నీవిధముగా నటులఁ గంసుఁ డంతమైన పిదప
నతని భార్యలైన యస్తియుఁ, బ్రాప్తియు మొత్తుకొనుచుఁ దండ్రి మ్రోలకేగి

శా॥ కట్టా! యెట్టుల నిట్టి దుఃఖమొదవెన్ గారానికాలంబు మా
కిట్టుల్ సేకురె? నెట్టి వీరులును దండ్రీ! యా హృషీకేశునిన్
మట్టన్ లేరుగదా! యయో! శివశివా! మాకిట్టి యాపత్తులో
దిట్టల్ మీరు సెలంగియున్ ఫలములేదే! యో జరాపుత్రకా! ౫

తే॥ సకల లోకంబులన్ గెల్చి చక్రవర్తివగుచుఁ గప్పంబులంగొని యలరునీవె
సపరివారానుజుండవై చక్రిచేత మడిసితివి నాథ! దుష్కాలమహిమగాదె?

క॥ అని కూఁతులు విలపింపఁగ వినిన జరాసంధుఁ డుగ్రభీషణవృష్టిన్
గని యిటులన్ వాక్రుచ్చెను మనుజామరకిన్నరులును మల్లటపడఁగన్ ౧

—♦ శ్రీకృష్ణునిపై జరాసంధుఁడు దండయాత్రఁ జేయుట. ♦—

పంచచామరము॥ భయంబు, భక్తి లేక యాదవప్రభూగ్రసేనజున్
లయంబు జేసినా వరే ! యనామకా ! యదూద్భవా !
రయంబునన్ జగంబు వీరరాశిసాళి మెచ్చఁగా
నయాదవంబుగా నొనర్తునంచు నెంచు మాత్మలోన్ ౨

తే॥ ఇటుల శపథంబుఁజేసి దుహితల నాశ్వసించి యాత్మీయ సఖులకుఁ జేసినట్టి
ప్రతిన తెలుపంగ భటవర్యుఁబనిచి ఘోరసమరసన్నాహముల్ సల్పి సరభసమున

క॥ ప్రాంశుబలిష్ఠమగు త్రయో వింశత్యక్షౌహిణులకుఁ బెరిగిన సేనన్
సంశయములేక కొని యదువంశముఁ గూల్పంగ వెడలెఁ బటుదర్పమునన్

సీ॥ తద్రోషఘోరాగ్ని దావానలముభంగి మధురాపురంబుపై మలయఁదొడఁగె
దత్సైన్యపాద ఘాతంబులు కుంభినిన్ గులగోత్రములతోడఁ గ్రుంగఁజేసె
దద్రణభేరిశబ్దంబులు సప్తసముద్రమహోర్మ్యటిన్ నిద్రబుచ్చె
దత్కరి హయ బృంహితాహేష లష్టదిగ్భద్రనాగంబుల బధిరపరచె

తే॥ దత్ప్రతిజ్ఞయు మానవ దానవామ రాహివిద్యాధరోప్సరో వ్యూహములకు
వింతగలిగించె మఱియుఁ ద్రివిక్రమ బలభద్రులకు గిన్కఁ బుట్టించెఁ బార్థివేంద్ర!

తే॥ ఇంతలో మధురాపురి నెలమి నున్న ప్రజ జరాసంధుశపనంబురాక లెఱిఁగి
కలఁతపడఁబొచ్చె నప్పుడా కమలనాభుఁ డగ్రజుండగు సీరికి ననియె నిట్లు ౧౩

ఉ॥ అగ్రజ ! యీ యహంబున జరాత్మజుఁ డాజినొనర్ప సేనతో
నుగ్రయమాభుఁడై యిటకు నుబ్బుచు వచ్చెడివానిఁ జూచి పౌ
రాగ్రణు లక్కలిన్ బడి భయంబున నుండిరి కాన వేగ నీ
వుగ్రునిఁబోలి వాని చము వుక్కడఁగింపుము నేను మెచ్చఁగన్ ౧౪

ఉ॥ కాని జరాతనూభవుని కంఠము ద్రెళ్ళఁగఁ గొట్టఁగూడ ద
వ్వానికిఁ గా మఱొక్క పృథుబాహుబలప్రథితుండు గ్రాలెడిన్
వీని చమూసమూహముల భిన్నమొనర్చిన జాలులోకము
న్మాన్యనముదంబు సెందఁగలదో ముసలీ ! యరినాగకేసరీ ! ౧౫

చంపెద వీనిబందుగులఁ జావఁగఁ గొట్టెద వీని రథ్యముల్
ద్రెంచెద వీని టెక్కెములఁ ద్రెళ్ళనొనర్చెద వీని సేనలన్
నింపెద నేన్గుపీన్గులని నెట్టెద వీని సహాయకారులన్
నింపెద హర్షమీభువికి నెమ్మినిఁ గూర్చెద సాధుపంక్తికిన్ ౧౬

వనజాక్షుం డిటు పల్కుచుండుతతి నా వైకుంఠలోకంబునుం
డి నిరాతంకముగా రథద్వయము కోటీరాస్త్రశస్త్రాంచితం
బు నలంకారసమన్వితంబునయి సంపూర్ణప్రభారాశితోఁ
జనుదెంచెన్ గద వారిముంగలకుఁ గాంచన్ సభ్యు లబ్రంబుగాన్ ౧౭

వచ్చిన స్యందనంబులను బద్మదళాక్షుఁడు గాంచి యన్నకున్
గ్రచ్చఱఁ గేలఁజూపి బలరామ! యివే జయలక్ష్మిఁగూర్చి పే
రెచ్చనొనర్పఁగాన వడినెక్కి జరాసుతు సైన్యథాన్యమున్
గచ్చియ నాఁగ ఓటఁబడఁగన్ నుసిఁజేయు మయోగ్రహేతితోన్ ౧౮

ఇటులన్ బల్కి మహోగ్రహోగ్రనిభులై హేరాళధారాళ స
ద్భటఘోటద్విపకోటిపాటవనటద్బాహామహోద్దండులై
పటుశస్త్రాస్త్రసమేతులై కవచశుంభద్దేహులై ధీరులై
త్రుటి నా తేరులనెక్కి కృష్ణముసలుల్ దోతెంచి రాజ్యార్థమై ౧౯

అంతం గంసాంతకుఁ డత్యంతోత్సాహంబు పుట్ట నాత్మచమువులన్
సంతాపము గలుగఁగ నరిసంతతులకుఁ బాంచజన్యశంఖం బూదెన్ ౨౦

ఇట్టిపట్టునందు నింద్రాదిదేవత లంబరమున నిల్చి యబ్బురముగ
ననిమిషత్వమెంతో యన్వర్థకముగాఁగఁ జూడఁదొడఁగిరో యశోధనాఢ్య! ౨౧

అంతన్ మాగధనాథుఁ డానగధరున్ హుంకారహుంకార వి
క్రాంతిక్రాంతనితాంతసైన్యయుతుఁడై కాలంబు జేయింప భా
స్వంతున్ మేఘముగప్పుచొప్పున సమాచ్ఛాదించి సోల్లుంఠ మ
త్యంతంబాడెను వక్ష్యమాణవిధిఁ దద్దార్ష్ట్యంబు స్పష్టంబుగాన్ ౨౨

## జరాసంధుండు శ్రీకృష్ణునిఁ బరిహాసోక్తులాడుట

గోపాలార్భక! పొమ్ము పొమ్మలఁతియా గోశ్రేణులన్ గాచుటో
గోపీగోపకబాలకావళులతోఁ గోలాటముల్ వేయుటో
సాపాటుల్ గడుజేయుటో మధురగవ్యాదుల్ త్రుటిన్ ద్రావుటో
నీ పంతంబున కర్హమా నీకనిదో నీచేతగాదో కుధీ! ౨౩

సీ॥ అబలను జంపుట సధికుండనైతి నే నంచు నీవాత్మ మదించినావొ
ప్రాతబండినిఁ దన్ని బలశాలినైతి నేనంచు నీవాత్మ యోజించినావొ
దేవశాక్కనిఁగొట్టి దిట్టనైతిని నేనటంచు నీవాత్మ గర్వించినావొ
రెండుచెట్టులఁగూల్చి దండివాఁడను నేనటంచు నీవాత్మలో నెంచినావొ

గీ॥ రెండు చిఱుబండలుండెడి నొండుకొండనెత్తి గండఁడ నేనంచు నెంచినావొ
యీజరాసంధు శూరత తెలియఁగవహహా! తొలఁగిపోకున్న నిచట నీతలతొలంగు

సీ॥ బృందావనముగాదు విహరింప నియ్యది పూర్ణభయదయుద్ధభూమి గాని
గోపాలకులు గారు కూడియాడఁగవీరు ప్రలయకాలసమానభటులుగాని
మురళిసరళిగాదు ముచ్చటపడ నిద్ది బహుఘోరరణభేరిఫక్కిగాని
హైమవేత్రంబుగా దాలఁదోలఁగనిద్ది చాపగదాతండసమితిగాని

గీ॥ మంజులాలాపములు గావు మాటలాడ నివ్వి ప్రాణములందీయు నెదిరి కలుకు
నుదురులుగాని కావున నీవు దుడుకువిడిచి బ్రతికి శుభములఁబడయుమో బాల!చనుము!

మ॥ కులగోత్రంబులు వన్నెవాసు లెవి వాత్రువ్వంగ వీల్గాని గొ
ల్లలలోఁబుట్టి ఘనుండనంచు నలవిగా లక్షింపకే యీ రహిన్
గలమున్ జేయఁగ సిద్ధమైతి వధమా! కయ్యంబు నీతోడ నే
సలుపన్ బూనుట లజ్జయయ్యెడిని ఛీ చాల్జాలు పో బాలకా! ౨౬

— శ్రీకృష్ణుఁడు జరాసంధునితో డీకొనుట —

ఉ॥ పల్కఁగ వట్లు మాగధుఁడు పంకజలోచనుఁ జాలకించి శా
మల్కలు జైలుదేరఁగ నిజోగ్రమహోగ్రహావహ్నిలో నిటుల్
బల్కె జరాకుమారునకుఁ బాపి! మదీయమహత్వతత్వము
పల్కకపోయినన్ దెలియవా! వృథగా ననుఁ దూలనాడెదే! ౨౭

క॥ తెలియకవాగితి వందునఁ బలికెద నొకకొంత నాది బాహాబలమున్
దెలిసికొని కలను సలుపుము పలుకులకుం బ్రధనమునకు బహుదూరముగా

సీ॥ ఎవ్వాఁడు చివ్వలో నెల్లలోకంబుల జయలక్ష్మిఁగైకొనన్ జాలియుండె
నెవ్వాఁడు గండున నెట్టిదిట్టలనైన జటికలో వశులుగాఁ జేసికొనియె
నెవ్వాఁడు వరదివిజేశ్వరాసురులచేఁ గప్పంబులంగొని గర్వపడియె
నెవ్వాఁడు మధురాపురీశుఁడై సకలభోగంబులం బొంది సుఖంబుఁజెందె

గీ॥ నెవ్వఁడీదృశోత్సాహసము లిపుడు పలికి వీరవీరుఁడనంచు గర్వించు నీదు
మవ్వఁజేకొన నలమాగధోర్విపతిని గంస హింసించితిని నోనృశంస! వినుము.

ఉ॥ చించితి నింక నట్టి జగజెట్టులఁబట్టి నియుద్ధమందునన్
ద్రుంచితి సాధుభూరమణ దూషణ మారణ కృత్ఖలాటవిన్
మంచితి వేడ్కతో దురభిమాన విహీన మదీయభక్తులన్
దించితిఁ గొంత భూభరము దింతు మరిన్ ద్వదఖర్వగర్వమున్ ౩౦

క॥ ఊరుం బేరును లేదని సారెకు నాజాతిఁగూర్చి జల్పింతు వరే!
యేరికి నీకూఁతుల నిడి సారెలఁజేసితివొ దాని జ్ఞప్తికిఁదెమ్మా! ౩౧

క॥ ఎగదిగఁజూచెద వేలా? యెగతాళి నొనర్తు వేల? యిపుడే యనికిన్
మగతనము గల్గెనేని సరిగ మొలత్రాడున్న నీకరే రా రమ్మా! ౩౨

వ॥ అనిన మదోన్మదుండగు జరాసంధుం డుద్దండదండధరుని మాడ్కి నఖండ రోషోద్ధురుండై ప్రలయాకాలానలుం బోలె రూక్షరక్తవక్త్రుండై యచలధరాధర నిచయంబు విధంబున సుస్థిరుండై భ్రుకుటి వికటంబుగా నయనంబులు విషమంబులుగాఁ గరంబులు శరపరంపరాగ్రహణచణంబులుగా దేహంబు దృఢకవచాచ్ఛాదితంబుగా యాదవమూలనిర్మూలనాభీష్టార్థియై యఖర్వగర్వంబున నంధీభూతచేతస్కుండై యుక్తాయుక్తంబులు త్యక్తంబుగావించి భక్తవత్సలుండును, దయాకరుండును, శ్రీకరుండును, దుర్జనభర్జనుండును, నర్జునసఖుండును, జగన్నాథుండు నగు మాధవునితో నాయోధనం బొనర్ప హరితో హరియును, మహీధ్రంబుతో మహీధ్రంబును, సముద్రంబుతో సముద్రంబును డీకొనువీఁకఁ దాఁక నాయనిరుద్ధుండు ప్రలయరుద్రుని మాద్రిఁ గ్రుద్ధుండై సర్వసన్నద్ధుండై యా యుద్ధరంగంబునం బ్రతిఘటింప నుభయ సైన్యంబు లనన్యశౌర్యధైర్యంబులతోఁ బరస్పరంబు జయం బభ్యర్థించుచు డమరు మడ్డు డిండిమ ఝర్ఝర మర్దల పణవ భేరీ కాహళ పటహ ఢక్కా ఘాంకార టంకార క్రేంకారంబులు సంకులంబుగా బహుళదరీపరివృతగిరులం బ్రతిధ్వనించునట్లు మొఱయు ముసల ముద్గర శరతోమర కరవాల శూలగదా పట్టిస పరిఘా కుంత సంతతులం బోరిఁబోరిఁ గసిమెయి వెసవెస విసరి వేసికొనుచు నడుమనడుమ బాహాబాహిం గచాగచిం గేశాకేశిన్ మత్సరంబునన్ బోరాడుచు మాఱాడుచు బాఱాడ వెన్నాడుచు నార్చుచుఁ బేర్చుచుఁ దమతమ మూఁకలం బేర్చుకొనుచు నేర్చినకరణిని మార్చిమార్చి నేర్పున బృందారక సందోహంబు లౌరా! యనం జిత్రతరంబును, రోమహర్షణంబు నగు తుములయుద్ధంబుఁ గావించు పట్టున. ౩౩

మ॥ ధృతరాష్ట్రాత్మజుఁడౌ సుయోధనుఁడు దుర్భీకుండు తన్మాగధా
నతుఁడౌటం దగు సాయమున్ సలుప మానస్థైర్యధైర్యాంచితం
బతులాశ్వేభరథాన్వితంబు నగు పంచాక్షౌహిణీసైన్యమ
ద్భుతధాటిన్ జనుదెంచ యాదవులతోఁ బోరాడవచ్చెన్ జుమీ! ౩౪

ఉ॥ వచ్చి నిలింపులార ! యనఁ బౌరుషమున్ వెలుగంగ మాగధుల్
హెచ్చ యదూద్భవుల్ బెగడ నేపునఁ దూపు లపారధారగా
గ్రచ్చఱవేసి యాదవతురంగమదద్విపయోధయూథముల్
వ్రచ్చునటుల్ బొనర్చెను జరాసుతుఁ డెచ్చుగ మెచ్చ నిచ్చలోన్ ౩౫

శా॥ సంధ్యారాగముఁ బోలు మోమున జరాసంధాత్మతుష్ట్యర్థమై
వింధ్యాధీశుఁడు తద్వశుండును ధనుర్విద్యానవద్యుండు గ
ర్వాంధ్యంబెల్లెడ గ్రమ్మఁ బేర్గొనిన పంచాక్షౌహిణీసేనతో
సంధ్యాలాపములాడు చాజిసలుపన్ సాగెన్ రిపుల్ భీతిలన్ ౩౬

కం॥ త్ర్యక్షౌహిణి సైన్యముతో దక్షుండగు వంగవిభుఁడు ధారాళముగాఁ
బ్రక్షయముగాఁగ యాదవపక్షము తా నేగుదెంచెఁ బ్రదనస్థలికిన్ ౩౭

చ॥ మఱియును దజ్జరాతనయు మాటకు లోఁగిన యన్యరాజులున్
కరిరథరథ్యయుక్తులయి కత్తళముల్ ధరియించి వాహినుల్
బరువడిసాగఁ బోరునకు వచ్చిరి వీరరసాతిరేకులై
యరినికరం బరే యనుచు నార్వ సుపర్వులు వింతసెందఁగాన్ ౩౮

మ॥ ఇటు లేతెంచి తదీయసైన్యములు శ్రీకృష్ణాయతానీకముం
బటునారాచపరంపరార్భటులతో వైరించి పోరాడఁగా
విటతాటంబుగ యాదవుల్ జెదరి వే వీతాసిశస్త్రాస్త్రులై
చటులప్రక్రియఁ బాఱఁగా దొడఁగి రా సంగ్రామరంగంబునం ౩౯

కం॥ అరదములు నేలఁగూలెను విరిగెను టెక్కెంబు లెల్ల బిద్దెను హారులుం
ద్విరదములు వ్రాలె నఱిముఱి నొరిగెను బాదాతమును పయోజాక్షు మొనం

గీ॥ ఇటులఁ దజ్జరాసంధుని చటులసేన యాదవులమూఁకలన్నింటి హతముసల్పఁ
గసి నసంఖ్యాకబాణముల్ విసరె నప్పు డంధకారమ్ము గ్రమ్మె రణాంగణమున

శా॥ వైకుంఠుం డటుపై నకుంఠితగతిం స్వవ్యూహసందోహముల్
జీకాకౌటను గాంచి మించి కసితో స్వీయంబు శార్జ్గంబు భూ
మ్యాకాశంబులఁ బర్వ దిగ్గజము లాహా! యంచు లక్షింపగా
సాకల్యంబుగ నెక్కుపెట్టెఁ దనదా సైన్యంబు మాన్యంబుగాం ౪౨

ఉ॥ ప్రెగ్గడ లగ్గలంబుగను బెగ్గిలసాగిరి జెట్టిజట్టులుం
బగ్గెనువీడి రశ్వములు పైకెగురంగడఁగెం భయంబునం
నెగ్గకపోయె నాగములు నీరసమయ్యెను విండ్లు సారథుల్
దగ్గిరి శార్జ్గటంకృతివితానముచే మగధేశుసేనలోం ౪౩

శా॥ ఇంకన్ దత్సమయంబునందు యదువంశేశాన సేనానులున్
శంకాతంకవిహీనులై డమరు వీణా మడ్డు ఢక్కానక
క్రేంకారంబులు ఘాంకృతుల్ సమర భేరీరావముల్ శింజినీ
టంకారంబులు సల్పి రొక్కమొగిఁ గాటంబౌనటుల్ భూవరా! ౮౮

వ॥ అంతన్ వైరివారవారణకరణకరణరచనాధురంధరుండగు నగ్గరుడధ్వజా సలుండు బలభద్రానిలుండు బాసటగా శిఖావళీపింఛంబుల్కగాఁ గరివీరంబులు రసనంబులుగా శార్ఙ్గ చక్రాద్యాయుధంబులు దరంబులుగా హేమచేల ద్వయంబు తేజఃపుంజంబుగాఁ బ్రచండమార్తాండుండు ప్రతాపంబుగా వీణా వేణుఢక్కానకాద్య నేకవాద్యంబులు స్వాహేతిశబ్దంబులుగా సాశ్వరథం బజవాహనంబుగా వెడలి పృథి మినిఁబడి వడివడి బ్రచ్చుకొని చొచ్చుడీ పిడుగు కడంకఁ గడలు గడగడవడంక దుర్భే దాంధంబును దుర్నిరీక్ష్యంబును నగు విపక్షపాక్షికమహారణ్యంబులోఁ జొరఁబడి ప్రలయకాలా భీలజాజ్వల్యమానజ్వాలను విధంబునఁ బెచ్చుపెచ్చిల్లి వియచ్చర మానీంద్రుండు మెచ్చి తాండవలీలాలోలుండుగా దహింపం గడంగె. అతతి నరాతి పదాతివ్రాతంబు లాజ్యాహుతులై భస్మీభూతంబులయ్యె. వెండియుఁ దత్పీతాంబర శాతాంబకఘాతంబుల శతాంగములు హతరథిరథ్యసంగతంబులై చక్రంబులు చూర్ణంబులుగా నేలంగూలె. మత్తేభంబు లొకటిపై నొకటి వ్రాలె. కొందఱరివీరు లధోముఖులును, కొంద ఱూర్ధ్వాననులును, కొందఱు భిన్నాంగులును, కొందఱు సంఛిన్నపాదులును, కొందఱు విశీర్ణతనుత్రాణులును, కొందఱు వ్యత్యస్తహస్తులును నై నానాప్రకారంబుల భాండవ్యూహంబుభాతి హతులైరి. తత్క్షణంబునందు ద్విపం బులు గ్రాహంబులుగా, నుష్ట్రఖరకబంధాదులు కచ్ఛపంబులుగా, రథంబులు శింశు మారంబులుగాఁ, గేశంబులు శైవాలంబులుగా, భుజంబులు భుజంగంబులుగాఁ, గరంబులు మీనంబులుగాఁ, దారహారహీరకుండలశిరోరత్నంబులు శర్కరిలంబుగా శస్త్రంబులు శుక్తులుగా, శంఖచ్ఛత్ర చామరంబులు సైకతంబులుగా, రథాంగంబు లావర్తంబులుగా, సేనాద్వయం బుభయతటంబులుగా, శతయోజన విస్తీర్ణభ్రాజ మానంబగు వైతరణీతరంగిణికిరణినొండు రుధిరస్రవంతిని భీకరంబుగాఁ బ్రాదుర్భ వించి నూఱామడలవఱకుం బ్రవహింపం దొడంగె. మఱియు నానిర్ఝరిణియందు భైరవభూతభేతాళయోగినీ గణంబులు చనుదెంచి, కాంచి, కేకరించి, కేరించి, కేకి సలంగొట్టుచు, నొండొరులు బిల్చికొనుచు, బ్రలయమేఘనిర్ఘోషంబులవలెఁ బొబ్బలఁ బెట్టుచు మహాకాల కపాల మాలార్థంబుగాఁ బృథులంబగు తద్రుధిరంబం దడఁగి యున్న శిరంబులం గెల్లగించి, పేర్చి, యార్చి, గ్రహించి, తచ్ఛోణితం బసకృత్తుగాఁ జప్పరించి, వికావిక నవ్వి, గ్రోలుచుఁ, డ్రేపుచు, మెచ్చుచు, హెచ్చి చెరలాట మాడుచు నృత్యం బొనర్చుచుండ భద్రకాళి రౌద్రమూర్తియై, సింహంబెక్కి రంహో స్ఫూర్తిని డాకినీశతంబు వెన్నాడ నామొగ్గరంబున కేతెంచి, నల్గడలడలఁ బరికించి, యిచ్చకొలంది నుష్ణంబగు రక్తంబు కడుపారఁ ద్రావి, యా నొవని తలపంకించి,

వికారంబుగా భీకరాట్టహాసంబులం గావించుచుండె. ఇంకఁ దత్సమయమందు స్వర్గ వాసంబు జేసెడి విద్యాధరీగంధర్వ్యప్సరోజనంబులు క్షత్రధర్మాచ్యుతులై బృందారకరూపంబులం బొంది, తోతెంచు వీరవరుల నహమహమికచే ననురూపులగువారిని వరించుచుండిరి. సంగర రంగంబున నభంగురంబుగా ధర్మంబుతోఁ బోరాడిన శూరులు గొందఱు మార్తాండమండలంబు భేదించుకొని విష్ణుపదంబున కేగుచుండిరి. అంతటఁ బ్రలంబాంతకుండు హలాయుధంబున మిగత పగమూఁకలను సమాకర్షించి త్రైలోక్యబలధారకుండై యొక్కమాఱి క్కుంభినిం ద్రొక్కంజాలు ముక్కంటి సొక్కసక్కమాడు రౌద్రంబున ముసలంబులచే మసలక నుసిజేసి యొసలాఱుచుండఁ గురు వంగ విద్యాధినాథు లనాథులై భయంబునం జిక్కినదే త్రోవయని పాఱిరి అట్టిపట్టున; ౭౫.

శా॥ మాతంగాయుత దోర్బలుండు మగధక్ష్మాపాలకుం డాత్మసే
నాతండానల మంబుజాక్షశితబాణశ్రేణివర్షంబులన్
బ్రాఁతిన్ బ్రుంగి వినాశమాటఁ గని దీవ్యత్స్యందనారూఢుఁడై
హేతుల్ దాలిచి సీరి ముంగలకుఁ దా నేతెంచె యుద్ధార్థమై. ౭౬

క॥ వచ్చిన మాగధునరదము లచ్చిమగనియన్న సూచి లాంగలమున వే
హెచ్చుగ లాగి ముసలమునఁ జచ్చునటుల్ సూతహరులు జదిపెం బిదపన్ ౭౭

క॥ హతసారథిరథహయుఁడయి వెతబడక జరాత్మజుండు స్వీయాస్త్రములన్
ద్రుతముగ విడి దోర్యుగమున ధృతితో బలుఁబట్టికొనియె నెదిరించి కసిన్

వ॥ ఇట్టులం బట్టుకొనం దిట్టయగు నా నల్లపట్టుపుట్టంబుల తాల్పు పట్టుబట్టి తట్టాడి యా జెట్టిపట్టు తప్పించుకొని యుప్పరవిధికిం గుప్పించియెగసి కంఠీరవంబుపైఁ గంఠీరవంబును, శార్దూలంబుపై శార్దూలంబును, గుంభిపైఁ గుంభియును, దూఁకు వీఁక నాఁకట్టిడివానిపై దూఁకి, తట్టసబుజంబులం దట్టి, యిట్టట్టనరానియట్టుల గట్టిగాఁ బట్టి, పిడికిళ్ళం బొడిచియుఁ, గాళ్ళం దన్నియు, వ్రేళ్ళన్ మొట్టియు, మోఁకారించి కారింప, నా క్రూరుం డయారెయని మెచ్చి, యగ్గరుడధ్వజాగ్రజుం డగ్గలి పగ్గె లగ్గలంబుగ నుగ్గడించి, యుగ్గెత్తుగా నుగ్గాడ, హుమ్మని భుజయుగ్మమ్మునం ద్రోసియుఁ, గాసరంబుభాతి శిరంబునం బొడిచియు, ఖరంబువిధంబునం బృష్ఠపాదంబులం బ్రహరించియుఁ, బొంచి చెంగున విహంగంబుభంగి పైకెగసి కసిని నుడుగణంబు పుడమినిఁ బడుబెడఁగున నా తాటిపడగవానిపైఁబడి బెడుసుగాఁ బీడింపం దొడంగం దడయక బలుం డఖండబలుండై పాదంబులం బాదంబులును, హస్తంబులన్ హస్తంబులును, నురంబునం దురంబును, శిరంబునన్ శిరంబును, భుజంబులన్ భుజంబులును గీలించి, నేల యుణ్ణంబై స్థాలిఁ బోలి ఘటికాద్వయంబు చలింప సిగం బిగియంబట్టుకొని సముదగ్రాగ్రహాగ్రవిగ్రహుండై పెల్చనం గూల్చి, ఘోరంబగు ముసలంబుఁ గైకొని,

యా వగతుం దెగటార్పఁ, దదుపరిస్థితుండుగా దీనవత్సలుండును, బరిపూర్ణతమోవ
శారుండును, మహాత్ముండును నగు నా శ్రీకృష్ణుం డధికరభసంబున బలభద్రుని కడ
కరిగి, విడు విడుమని యతని కడంకమాన్చి జరాసంధున కిట్లనియె. ౪౯

## — శ్రీకృష్ణుండు బలరామునకుం జిక్కిన జరాసంధుని విడిపించుట. —

చ. వగచెదవేల ? పొమ్ము రిపుపక్షముఁగూల్ప ననల్పసేనతోఁ
దగి మఱి యిందురమ్ము మగధా ! యభిమానధనుండ వీవిటుల్
నొగులకుమా ! నిలింపులు మనుష్యులు మెచ్చగ నాడినట్టి నీ
మగఁటిమి నిల్పుకొమ్ము చనుమా ! యనుమానము మానుమా ! యెదన్

మ. పరిహాసంబుగ నిట్లు బల్కి విడిపింపన్ దజ్జరాసంధుఁడున్
శిరమున్ సిగ్గునవంచి యిప్పుడిది యేఁ జేయంగవీలౌనా కా
ని రయానన్ జని నిర్జనస్థలమునన్ నిష్ఠం దపంబాచరిం
చి రణంబందున నీ హరిం దునిమి వాసిం దెత్తు నం చాదతోన్ ౫౧

తే. మంత్రులను బలాయితులైన మనుజవిభులఁ
దోడుకొని మధురాపురిన్ వీడి తనదు
పురమునకుఁ బోయి యందున నరివినాశ
కృతిసమారంభములఁ జేయు చెసరుచుండె ౫౨

చ. హరిహలు లట్టు లట్టి మగధాధిపు గెల్వ సురల్ సుమంబులన్
గురిసిరి వందిమాగధులు గోర్కి మహోన్నతసన్నుతుల్ పఠిం
చిరి రణవీరు లబ్బురముఁ జెందిరి కాహళశంఖదుందుభుల్
మొఱసెను యాదవధ్వజిని మోదముగాంచె ననంతరంబునన్ ౫౩

క. తురమున నరినికరంబులు బరువడి విడినట్టి దివ్యవాజిద్విపచా
మరశరమణిమకుటంబుల హరిపాక్షికచయము గొనినయంతట వేడ్కన్

సీ. వేదవేదాంగప్రవీణులౌ బ్రాహ్మణుల్ క్షేమంబుగల్గ నాశీర్వదింప
నలఘుచరిత్రలౌ కులసతుల్ సుమలాజచందనాక్షతలను జల్లుచుండ
రంభాద్యలైన వారస్త్రీలు గానాభినయవిశేషములతో నాట్యమాడఁ
బౌరనాయకులైన భాగ్యవంతులు పూర్ణకుంభనీరాజనాల్ గొంచునీయ

తే. సకలవాద్యంబులున్ మ్రోయ జయముఁగొన్న శౌరి సీరిసమేతుఁడై సర్వయాద
వులును జనుదేరవచ్చి సంపూర్తిగా నలంకరించిన మనికికి శంకదక్కి ౫౫

ఉత్సాహ॥ అంత మాధవుండు యాదవాధిపోగ్రసేనునిన్
సంతసమునఁ గాంచి మ్రొక్కి సమితిఁగొన్న ద్రవ్యముల్
సుంత మిగులకుండ నిచ్చి సుఖముగల్గ భూమి న
త్యంతముగను నేలుమంచు నాడె తేఁడ! పిమ్మటన్ ౫౬

క॥ ఇరువదిమూఁడక్షౌహిణు లరుదేరఁగ వెంట భీకరార్భటితోడన్
మఱల జరాసంధుఁడు శ్రీహరినిం దెగటార్ప మధుర కాగతుఁడయ్యెన్.

ఉ॥ ఆగతుఁడైన మాగధుని నా హరిగాంచి బలప్రియుక్తుఁడై
వేగ తదీయసైన్యమును స్వీయశితాస్త్ర కృపాణధారలన్
రేగి హతంబొనర్చి తృణరీతి నరాతినిఁ బాఱఁద్రోల నా
మాగధనాయకుండు నవమానపరీతమనస్కుఁడై చనెన్ ౫౮

తే॥ మధురలోనున్న జన మల మాధవుకృప
ధనకనక వస్తువాహన ధాన్యపుత్ర
పౌత్ర దీర్ఘాయురారోగ్య భాగ్యయోగ్య
తలు విశేషముగాఁ గల్గఁ దనరుచుండె ౫౯

తే॥ చని సహింపక తజ్జరాసంధుఁ డంబు
జేక్షణుం గెడపఁగఁ బదునేడుమాఱు
లేగి యోడి తిరుగఁ బదునెనిమిదవత
డవఁ దురముఁజేయ యత్నించు నవసరమున ౬౦

—♦ కాలయవనుండు నారదప్రేరితుండై కృష్ణునిమీఁద దాడివెడలుట. ♦—

చ॥ కలహమె విందుగాఁ దలఁచి గౌరవమొందెడి నేను పూని మ్లే
చ్ఛుల కధినాథుఁడై ప్రథితశూరులలో గణనీయుఁడై ధరన్
బలుఁడయి క్రాలు కాలయవనప్రభు డాసి తమిన్ దదాగ్రహా
నల మనిలంబుకై వడి ఘనంబుగ రేపుచు నిట్లు పల్కెతిన్ ౬౧

మ॥ యవనా! సప్తసముద్రముద్రిత పృథుజ్యానాగలోకాది లో
కవిరాజద్బలశాలురన్ గెలిచి తత్కాంతా నిశాంతార్థర
త్నవితానాశ్వమదేభ ధేనుమకుట ద్రాఘిష్ఠరాజ్యంబులన్
స్వవశంబొనటు గొన్న నీవొకబలున్ సాధింతువా? కాంతువా? ౬౨

శా॥ అతఁ డెటువంటివాఁడనిన నాగమగమ్యుఁ డనాదిపూరుషుం
డతులబలుం డమేయగుణుఁ డర్జునమిత్రుఁడు నర్జునాంబరుం
డతిరథుఁ డబ్జనేత్రుఁ డసురాంతకుఁ డాశ్రితపోషకుండు దు
[illegible] ౬౩

తే॥ మధురయనుపురమందునఁ బ్రథిత యాదవులు నుతింపగ వాసంబు సలుపుచుండు
నతనిఁ బట్టుము ! బలమున్న నపుడె నిన్నె లోకవీరుఁడవని మేము వాకొనెదము

తే॥ అనినతోఁడనే యవనుండహంకరించి హుంకరించి పెంగింకతో నూరు విడిచి
ప్రబలచతురంగబలముతో బయలుదేరి మధురచుట్టును విడిసె సోమానవేంద్ర!

ఉ॥ ముట్టడిసల్ప మాధురులు పూర్తిగ భీతినిఁబొంది కుంది మే
మెట్టుల నిందు నుండఁగల మేరహినిల్చెడి మాదుప్రాణముల్ ?
గట్టకటా ! కటా ! యకట ! కంజదళేక్షణ ! సంతతంబు నిన్
గట్టిగనమ్మియున్న మముఁ గావవె! వైరులఁ బాఱఁద్రోలవే ! ౬౬

తే॥ అనుచు వేఁడి చాతకము వర్షాగమంబుఁ జూచుకైవడి హరికృపఁ జూచుచుండి
రవల నసురాంతకుండు నిజాగ్రజన్మఁ జేరి యిట్టుల వాక్రుచ్చెఁ జింతజేసి. ౬౭

శా॥ అన్నా ! యెన్నఁగరాని శస్త్రములతో హస్త్యశ్వజాలంబుతో
విన్నాణంబగు స్యందనావళులతో భేరీరవస్ఫూర్తితో
విన్నం గన్నను గుండె జల్లుమను నుద్వృత్తోద్భటశ్రేణితో
నెన్నం డిందునరాని కాలయవనుం డేతెంచెఁ బోరాడఁగన్. ౬౮

తే॥ కొలఁదికాలంబు గడచినఁ గొంపముంపఁ
దజ్జరాసంధుఁడున్ మఱి దాడివెడలు
నప్పుడుభయులుఁ గలిసి యీ యాదవులను
హతముఁజేయుట ధ్రువమని యాత్మనెంచు. ౬౯

― శ్రీకృష్ణుం డర్ణవమధ్యంబున ద్వారకాపురంబుఁ గట్టించుట. ―

మ॥ అనఘా ! వారిని నేకకాలమున సంహారంబుఁ గావించుటల్
గనఁగా దుష్కరమయ్యెడిన్ మన కనిన్ గానన్ బురంబొండు త
ద్వనధిన్ మార్తురుసేరరానికరణిన్ బల్ గూఢమానట్లు నే
ర్పున నిర్మింపఁగనౌను యాదవజనంబుల్ వాసమున్ సల్పఁగాన్. ౭౦

ఆ॥ అనఁగ నీలచేలుఁ డంగీకరింపఁగా లోకపాలకాదిలోకనుత్యు
విశ్వకర్మఁ బిలిచి విపులాంబుధిం బురిఁ గట్టుమంచుఁ జెప్పె గరుడవిభుఁడు.

ఆ॥ అవల విశ్వకర్మ యారేయిఁ బురమొండు కట్టె దాని కేదికాదు సాటి
యనని నిదంద్రవరుణ ధనదపితామహ శమననగరముల ప్రశంస యేల? ౭౧

క॥ వెండియు మోక్షముఁగోరు నఖండులు వైకుంఠమంచుఁ గాంచుదు రది కృ
ష్ణుం డెది చేయించిన నది దండిదియై చెల్లుగాదె ధరణీరమణా ! ౭౩

పృథ్వీవృత్తము॥ అనంతరమునన్ రమారమణుఁ డట్టి యంభోధిలో
ననన్యఫణితిన్ విశాలముగ నున్న యా ద్వారకన్
ఘనంబగు స్వయోగశక్తి యదుపుత్రకశ్రేణిఁ దో
డ్తనన్ దయనుజేర్చి యీ మధురకేగె ధాత్రీవిభూ! ౨౪

క॥ అరిగి యసహాయుఁడును నిశ్శరుఁడను హరి పురమునుండి చనె వెలుపలకున్
హరి గుహవిడి వడి వచ్చెడి కరణిని సరగునఁ గడంగి క్ష్మాతలనేతా! ౨౫

ఉ॥ అంతఁ దురుష్కసైన్యవిభుఁ డా హరిఁ గన్గొని చిత్తమం దిటుల్
జింతనచేసె నే నిట వసించుట గాంచియుఁ గించలేక నా
చెంతకు వచ్చె వీఁడెవఁడొ శ్రీధరుఁడో మఱిఁ గాఁడొ యైన శ్రీ
కాంతుఁడటంచుఁ దోఁచుఁ గనఁగా నలనాఁటి సురర్షిసూక్తులన్. ౨౬

—♦ కాలయవనుండు శ్రీకృష్ణుని వెంబడించి పాఱుట. ♦—

చ॥ తలఁచి యటుల్ తురుష్కవసుధాపతి దాల్పక యెట్టిహేతిఁ గా
ల్బలమును వీడి యొంటరిగ వాహనమెక్కక బంటుచాడ్పునన్
సలిలజనేత్రుఁ బట్టికొని చంపఁగఁ బైకరుదేర శౌరి యా
బలికిఁ బరాఙ్ముఖుం డగుచుఁ బాఱఁగడంగె నభంగసంగతిన్. ౨౭

చ॥ పఱుగిడఁ గాంచి తద్యవనపార్థివుఁ డీతఁడు పాఱుబోఁ తరే!
యెఱుఁగకపోతి వీరుఁడని యే విని యిందుల కేగుదెంచితిన్
సరిసరి! వీనిఁ బట్టుట సుసాధ్యమటంచుఁ దలంచి నవ్వి స
త్వరగతితోడ వెంటఁబడి పాఱెడిఁ దత్సమయంబునందునన్ ౨౮

క॥ అక్కమలాక్షుఁడు సక్కఁగ నక్కపటికిఁ జిక్కినట్టు లగుపడు మఱలన్
జిక్కక పఱుగిడు మునులకుఁ జిక్కని వాఁడె ట్లతనికిఁ జిక్కు? నరేంద్రా!

చ॥ మఱి హరి,దుర్గమంబులను మానవశూన్యములౌ నరణ్యముల్
పురములు బక్కణంబులును బుణ్యనదీనదసాగరంబులున్
సరసర తిర్గి తద్యవనసన్నిధినిల్చి హసించి పిల్చి పో
టరి! బలమున్నె? యుండినఁ దటాలునఁ బట్టుమటంచు రేపెడిన్ ౩౦

శా॥ మారీచుండు సఖోదితుండగుచు మున్ మాయాసువర్ణైణియై
శ్రీరామున్ బరువెత్తఁజేసినటు లీ శ్రీకృష్ణుఁ డా కాలునిన్
బాఱంజేయుచు శ్యామలాద్రిగుహలోఁ బాఱాడి కోణంబునన్
జేరెన్ దద్యవనేంద్రుఁడున్ జొరఁబడెన్ జృంభించి దంభంబుగాన్ ౩౧

తే॥ అట్టి బిలమందు ముచుకుందుఁ డనెడి నాతఁ
డొడలు దెలియని భంగినిఁ బుడమిపై సి
గిరి ప్రతిధ్వనించెడిరీతి గుఱక లిడుచు
నిదురఁబోవుచునుండె నో నిర్మలాత్మ! ౯౩

క॥ అంతన్ దత్కాలుండు తదంతరమున్ జొచ్చి కనఁగ నంధంబౌటన్
సుంతయు జూడఁగఁ జాలక కొంతవడికిఁ బండిన ముచుకుందుం గాంచెన్

చ॥ కని హరియంచు భ్రాంతిపడి కయ్యముఁ జేయఁగలేక లేక! త
జ్జనపదపట్టణాబ్ధి వనశైలము లన్నియు దాఁటఁ బాఱి ద
వ్వునఁగల యీ బిలంబునకుఁ జొక్కితివై చనుదెంచి నిద్ర వో
యిన నరుమాడ్కి నుండెదవె? యే నికఁ జంపక పోవనిత్తునే? ౯౪

తే॥ అంచు నట్టహాసంబు గావించి మించి
యశనిసదృశపాదంబున నతనిఁ దన్ని
యన్నగము మాఱుమ్రోయఁగా నఱచి కరత
లముల బుజములఁ జఱచి చెలంగుచుండ ౯౫

చ॥ అల ముచుకుందుఁడున్ నిదుర కన్ను ఘటిల్లుట లేచి చూచి ముం
గలఁ గల కాలుఁ గీలివలెఁ గ్రాలెడికంటఁ గనం దదంగజా
నలము బహిర్గతంబయి క్షణంబున వాని దహింప భస్మమై
లలి నిలపై నివ్రాలె మిథిలాపరిపాలనధర్మలోలుపా! ౯౬

తే॥ అవల బహులాశ్వుఁ డిట్లనె నమరమునికిఁ
బలికె నారద! యా గొప్పవాఁ డెవండొ
కాలయవనుండు వానిచేఁ గాల్పఁబడుట
కేమి కారణమో కృపనెఱుఁగఁ జెపుమ! ౯౭

## ముచుకుంద వృత్తాంతము.

వ॥ అన విని మునివరుండు జనకున కిట్లనియె. భూవరా! మున్ను ముచుకుందుండు మాంధాతృపుత్త్రుఁడై యఖండభూమండలపాలకుండై యేలుచు నొండెడ నిశాటులు నిర్జరగణంబును దౌర్జన్యంబున నిర్జించి తర్జించుచుండం గని యిది కర్జంబుగాదని చని యా దుర్జనులన్ భర్జించి సంరక్షించిన నా బృందారకబృందం బానందంబుఁ బొంది సందియంబులన్ మాని డాసి రాజపుంగవా! మమ్మాకర్బురులవలనఁ గలుగు దుర్భర బాధల మాపుమాపి సంరక్షించితివి. కాన నీకుఁ గావలసిన వరంబు లొసంగవచ్చితిమి. తెలుపుమ్మని పృచ్ఛింప నా సచ్చరితుండు మెచ్చి వియ

చ్చరులారా! భవత్సంరక్షణకార్యమం దహోరాత్రములు నిద్రమాని, యప్రమత్తుండనై పాటుపడితి. దాన నిపుడు బహుబాధలు గల్గుచుండెం గాన గాఢనిద్రయలవడునట్లును, దన్నిద్రావసానంబునందు సుందరనందనందనసందర్శనంబు ఘటిల్లునట్లును, దద్దర్శనంబునకుమున్నె నా నిదురకు భంగంబు గల్పించిన దుస్సంగుండు భంగీభూతుండగునట్లును, వరంబియ్యం బ్రార్థించితినన వారలిచ్చి స్వధామములకుం జనిరి. తద్వరప్రభావంబున నాతం డా శ్యామలాచలగుహాలోఁ గృతయుగంబునం బ్రవేశించి గాఢంబుగా నిద్రించుచుండ నక్కాలయవనుం డేతెంచి, యచ్యుత దర్శనంబు గాకమున్నె యతని శయనంబున కంతరాయంబు గల్గించి ధ్వంసంబయ్యె. ఇట్లా కాలుండు చూర్ణీభూతుండైన పిదప నా యచలబిలమున దొకమూలనున్న శ్రీకృష్ణుండు జగన్మోహనాకారుండై కోటిమార్తాండమండల ప్రతీకాశతేజఃపుంజవిభ్రాజమానుండై నానాభూషణభూషితుండై ప్రసన్నవదనారవిందుండై దయాసముద్రుండై యా ముచుకుందుకురంగటం జెలంగినంగాంచి యాతండు ప్రత్యుత్థానం బొనరించి సంతోషించి నమస్కరించి యిట్లు భక్త్యంచితుండై వినుతించె. ౮౮

సీ॥ తమ్మింట్లు మొదలైన సొమ్ములు గలవానిఁ, దమ్మిచూలినిఁగాంచి తనియువానిఁ
దమ్మికనులవానిఁ దమ్మిఁదాల్చినవానిఁ, దమ్మికంటులతోడఁ దగులువానిఁ
దమ్మియింటిచెలి యెదను జెలంగెడివానిఁ, దమ్మితూపరిరూపుఁ దనరువానిఁ
దమ్మిపగతునింటఁ దద్దఁబుట్టినవానిఁ, దమ్మిమొగ్గరమునఁ దరలువానిఁ

తే॥ దమ్మిపొక్కిలిగలవానిఁ దమ్ములదొర, యందు వెలిగెడివానిని నందముగల
మబ్బుచాయను దగువాని మంచివారిఁ, బ్రోచువానిని నిన్నిదే మ్రొక్కుచుంటి.

స్రగ్ధర॥ ధ్రువకోకిల॥ సభయలోకశరణ్యా! మాధవ! శంఖచక్రగదాధరా!
ప్రభువరేణ్యా! యగణ్యాపుణ్యా! విపాటితాసురవాహినీ!
యభవమిత్ర! యనాదిపూరుష! యాదితేయ నమస్కృతా!
యభయమిచ్చి కృతార్థతంగనునట్లు ప్రోవుము! యిత్తఱిన్. ౯౦

మత్తకోకిల॥ వాసుదేవ! త్రివిక్రమా! వ్రజపాలకాత్మజ! కేశవా!
దాసపోషక! గోప్రవర్ధనధారణోద్ధ! మహాఘనా!
రాసమండలకుర్దనోత్సుక! రాధికేశ్వర! శాశ్వతా!
భాసురాఖిలలోకనాయక! వందనంబులఁ జేసెదన్. ౯౧

తే॥ వేయికనుల్ వేయిశిరముల వేయిబుజముల
వెయ్యిరూపుల వేయిపేళ్ళ వేయియురముల
వేయిపదంబుల వెయ్యికోటి యుగములను
బూనినట్టి యనంతు నిన్మ్రొక్కుచుంటి. ౯౨

క॥ శౌరీ! హరీ! యారయ, ధారణి నావంటి పాపి దైవాఱఁడు దై
త్యారీ! నీవంటి దురిత,హారియు నగుపడఁడు గాన నలరం గనుమా! ౯౩

చ॥ అని వినుతింపఁ గృష్ణుఁడును హర్షముఁబొంది యిటు ల్వచించె నో
యనఘ! త్వదాత్మ నిర్మల మహాంకృతిశూన్యము ధన్య మీవునుఁ
ఘనుఁడవు నా నుతుల్వినుచు నా వసియించెడి బాదరిస్థలం
బున కిపుడేఁగి దివ్యతపముం బొనరింపు మదాశ్రయంబుగాఁ. ౯౪

చ॥ తప మొనరించినన్ నిఖిల ధర్మములం బొనరింప నర్హమై
యపగతపాపమై వెలయు నగ్రజనంశమునందు నీవు నా
కృపఁ దలకట్టుగాను జనియింతువు తప్పక ప్రేమరూపభ
క్తిపరుఁడవౌచు మత్పదవికిన్ జనుదెంతువు తిర్గి రానటుల్. ౯౫

క॥ అని యాజ్ఞాపించినఁ ద,జ్జనపతి ముచుకుందుఁ డట్టి చక్రికి నతులం
బొనరిచి విడఁజాలక వీ,డ్కొని బాదర్యాశ్రమమున కుఁజ నెడివేళన్. ౯౬

తే॥ ద్వాపరంబందుఁగల నరుల్ స్వల్పు లౌట
దాళశతమహోచ్ఛ్రితుఁడైన తజ్జనవిభుఁ
గని భయంబునఁ దిరుగాడఁ గాంచి యతఁడు
వెఱవకుఁ డటంచు నేగెఁ గుబేరదిశకు. ౯౭

చ॥ ఇటు ముచుకుందభూపతికి నిచ్చి వరంబు సరోజనేత్రుఁ డం
తట మధురాపురంబునకు ధైర్యమునం జనుదెంచి యందు మి
క్కుటముగ నున్న తద్యవనకుంజరసేనలఁ దుక్కుధూళుగా
నటు ప్రహరించె యాదవులు హర్షపయోధినిమగ్నులౌనటుల్. ౯౮

క॥ ఏతత్సమయమున నల జ,రాతనయుఁడు జగడమాడ రానెంచి యశో
స్ఫీతజ్యోతిషికుల మగ,ధాతత వాసులను బిలిచె నవనీసురులన్. ౯౯

ఆ॥ పిలిచి యిట్లు లనియెఁ బృథ్వీత్రిదశులార!, వాసుదేవుఁడనెడి బలుని గెలువఁ
దలఁచి మధుర కరిగెదన్ గాన మూర్తంబు, మంచిదొకటిఁ బెట్టి పంచుఁడెలమి.

తే॥ ఆముహూర్తబలమున జయంబు నాకుఁ, గల్గినన్ మిమ్ము సాకెద గౌరవమున
సర్వవిధములఁ బూజించి సంతతంబు, సౌఖ్యముగ నేలుచుందు ద్విజన్ములార!

ఆ॥ లేనియెడల నట్టి దానవఘాతకుం, డోర్చి నన్నుఁ జెఱను నుంచెనేని
నపజయమ్ము గల్గ నవమానమున్ సల్పి, పంపెనేని మిమ్ముఁ జంపివేతు.

వ॥ అనవుడు తద్వసుంధరాబృందారకేంద్రులా జరాసంధవాక్యబృందంబు డెందంబం దమందంబుగ నాలోచించి యథార్థం బెఱింగి పృచ్ఛకుండు తుచ్ఛుం

డగుట హెచ్చుగ ముచ్చటింపంజాలక దైవంబుపై భారం బునిచి తజ్జరాసంధ జయంబునే యభిలషించి యొక్కమూర్తంబు నిర్ణయించి యతని కిట్లనిరి.

తే॥ ఓ జరాసంధ ! నీమాట యొప్పి యిప్డు, డొక్క లగ్నము పెట్టితి ముచితరీతి
రణముఁ జేయఁగ జనుమ ! పరాజయంబు, నీకుఁ జేకూర దియ్యది నిక్కువంబు

క॥ అని వచింపగ నట్టి జరాత్మభవుఁడు నిగ్రహానుగ్రహాసమర్థులగ్రజన్ము
లనినపలుకుల విని మరి నబ్జనాభుఁదాఁక సత్రయోవింశత్యనీకుఁడగుచు.

చ॥ వెడలి కడల్ గదుర్ వడఁక వీరరసం బెగపొంగ సంభ్రమల్
జెడఁబడ నార్వఁ బ్రేక్షకు లిసీ యని రోయ సమస్త వాద్యముల్
దడబడమ్రోయ సల్పి నిశితస్వగదాస్త్రకృపాణసంతతిన్
విడివడఁ దత్పురిన్ విడిసె వెన్నునిఁ గొట్ట నతండు దండితోన్. ౧౦౮

తే॥ దేవకీనందనుఁడును భూదేవనాగముఖసమస్తలోకములకు మూలమగుటఁ
దజ్జరాసంధరణయాత్ర ధరణిదేవు, లనిన పల్కుల నెఱిఁగి యిట్లాత్మ నెంచె.

సీ॥ వీరి మూలముననే క్రూరులు సెఱచిరన్, వేదంబు లిందాఁక వెలయుచుంట
వీరి మూలముననే విశ్వోపయోగమౌ, సవనాదు లిందాఁక జరుగుచుంట
వీరి మూలముననే విపుల మద్గుణములు, వ్యక్తమై యిందాఁకఁ బ్రబలుచుంట
వీరి మూలముననే విద్యాకళలు గూడ, విలువగా నిందాఁక నిలిచియుంట

తే॥ వీరి మూలంబునంగదా పిత్రుమహర్షి, విబుధులున్ దృప్తిఁ జెందుట వీరిమూల
ముననె నాముఖ మానంద పూర్ణమగుచుఁ, బొగడఁబడుటయు శ్రద్ధతో బుద్ధిఁదలఁప.

చ॥ జగమభివృద్ధి జెందుటకు జక్కనిమూలము ధర్మమైనచో
నిగమము లట్టి ధర్మముల నిగ్గునుదెల్ప ప్రమాణమైనచో
జగతిని దత్త్రయీప్రకటశక్తులు బ్రాహ్మణవర్యులైనచో
నిఁగ నలవారినిన్ విడిచి యెట్లెచటన్ జను నా నమస్కృతుల్. ౧౦౯

క॥ దైవవశము జగమంతయు దైవము తన్మంత్రవశము తన్మంత్రము భూ
దేవులవశమైయుండుట నా విప్రుల దైవములుగ నభిమానింతున్. ౧౧౦

తే॥ ఇట్టి విప్రుల సూక్తుల నెట్లు రిత్తపుత్తుఁ ? బుచ్చినన్ భువనముల్ బూదిగావె
యంచు స్వప్రతిజ్ఞను గూడ నవలఁ ద్రోసి, భూసురోక్తులే నిజముగా వాసినెంచి

మ॥ బలుఁ డేతెంచఁగ వెంటఁ గాలినడకన్ బ్రహ్మాండనాథుండునై
లలిఁ దాదృఙ్మధురాపురంబు విడి యుల్లంఘించి తద్ద్వారి నా

వల దైవాఱుచు భీరువౌ నరువలెన్ బాఱాడ నాతండు క
న్నులతోఁ గాంచి హసించి యిట్లు పలికెన్ మోదం బనల్పంబుగాన్. ౧౧౨

వ॥ నిలునిలు మోయి వృష్ణికులనేత! యిటుల్ పఱ నెత్తఁ బాడియే ?
బలివని నిక్క నీల్గితివి భండన మీా వొనరింపఁజాలవే ?
చలము నశించెనే ? మునుపు సాగినలాగున నిప్డు సాగునే ?
తులువ! యిఁకెట్లు పోయెదవొ ? త్రొక్కనె ? నా కసిదీఱ నొమునేన్. ౧౧౩

వ॥ అని ప్రతిజ్ఞాలాపంబులాడుచు నతులధృతియుతపతాకినీసహితుండై చెన్నారెడి పాఱాడ మాఱాడక యా రామరమారమణులు గాల్నడలందిని యామ్యాగ్భాగంబునం బోయిపోయి యంతిమంబున ౧౧౪

॥ తాలహింతాల రసాలతిక్కోలకుందార మందారాది భూరుహగము
గండభేరుండఖడ్గగవయశార్దూల మృగరాజముఖజంతుమిశ్రితంబు
మాలతీమల్లికా మాధవీయూధికా మరువకకురువకమానితంబు
కీరపారావత శారికాపరభృత స్తోకాదికలరవశోభితంబు ౧౧౫

తే॥ మత్తషట్పదఝంకృతిమంజులంబు, కమలకల్హారభూషితవిమలబహుళ
పల్వలప్రాంచితంబు శుభప్రదంబు, నగుచుఁ జెన్నారెడిఁ బ్రహర్షణాచలంబు.

తే॥ అద్ది పదునొకండామడ లాయతంబు, నంత వెడలుపుఁ జెలఁగెడి నందు మిగుల
శబరులెల్లరు విహరింత్రు సర్వరోగ, నాశకరమగు నోషధుల్ నాటుకొనెడి.

॥ అల గిరిశృంగాగ్రంబున, సులువుగ నెక్కన్ మగధుఁడు సూడమి వారిన్
మల మొదలఁ జిచ్చుఁబెట్టెను, హలిహరినాశంబుఁ గోరి యవనివరేణ్యా !

॥ పెట్టినతోడ ధూమములు భీతికరంబయి మైలుదేరఁగా
బిట్టుగ రాఁజి గాడ్పులును వీవఁగ, భగ్గునఁ జిచ్చుమండి యా
గుట్టఁజెలంగు చెట్టులును గుంజనికుంజములున్ గుటీరముల్
గుట్టిమముల్ సమస్తమును గొట్టుపడన్ దహియించె నంతటన్. ౧౧౮

॥ బలకృష్ణుల్ తదనుక్షణంబునఁ బ్రతిద్వంద్వీక్షణాదృశ్యులై
మల శృంగాగ్రమునుండి పత్రికులసమాక్రీడీతిగా సాగి యా
వలఁ జెన్నారెడి ద్వారకాపురములోఁ బౌళంబుగా డంబుగాఁ
జెలు లానందము జెందఁ జేరిరి సుధీ! శ్రీమైథిలాధీశ్వరా! ౧౧౯

॥ అంత జరాసంధుఁడు శ్రీ,కాంతుండుఁ దదగ్రజుండుఁ గాలిరి గిరిలోఁ
బంతము నేఁటికిఁ దీఱెను, సాంతమునన్ సంతసంబు సక్కఁగఁ గలిగెన్. ౧౨౦

క॥ అని నెమ్మనమున నెంచుచుఁ, దన సైన్యముతోడఁ గూడి తాదృగ్గోత్రం
బును విడి నిజపురమునకుఁ, జన నభిముఖుఁడయ్యె జయముఁ జాటుచు ధర్కన్

తే॥ బ్రహ్మవాక్యంబు బ్రాహ్మణ వాక్యమొక్కరీతి ఫలమిచ్చునని భావిభూతవర్త
మానకాలజ్ఞు లెల్లరు మాటిమాటి, కాడుదురు వారి నమ్మినవాఁడు సెడునె ?

క॥ లోకక్షేమముఁ గోరుచు, శ్రీకరమౌ కృతుల నెల్లఁ జేయుచునుంటన్
నాకులు దైత్యులు నరు ల,స్తోకముగా వేఁడుచంద్రు క్షోణీసురులన్. ౧౨౩

సీ॥ పృథుచక్రవర్తినిఁ విశ్వవిఖ్యాతుగా, సల్పిన దీ విప్రశక్తికాదె
యిక్కట్టులన్ జిక్కి నింద్రుండు సుఖికాఁగ, సల్పిన దీ విప్రశక్తికాదె
మృతులైన వారి జీవితులుగా నొనరింపఁ, జాలిన దీ విప్రశక్తికాదె
భగవంతుఁ డిజ్జగం ♦ బగచాట్లు లేనట్లు, సాకుట యీ విప్రశక్తిగాదె

తే॥ సప్తసాగరములఁగ్రోలి సమ్మతమున, మఱల ధరణిపైఁ బాఱఁగ సరగ విడిచి
నట్టి దీ విప్రశక్తి మహాద్భుతంబు, నైన దీ విప్రశక్తిఁ గొండాడఁ గలనె ? ౧౨౪

క॥ తత్కారణముగదా బలి,కుత్కీలధరులు పయోధిఁ గుదిరిన పురిలో
నుత్కటముగ దాఁగుట మఱి, యుత్కర్ష జయంబు లరికి నొనఁగూడుటయున్.

తే॥ ధీర ! నీరజనేత్రుఁడా ద్వారకాపు,రంబునం దుండుటకుఁ గారణంబు నీకుఁ
జెప్పియుంటిని వెండియు నప్పరముని పరిణయంబులఁ గూరిచి పలుకఁగలను

## ♦ బలరామ వివాహమహోత్సవము ♦

క॥ ఇయ్యది సెప్పఁట కాదిని, నెయ్యముతో సీరిపెండ్లినిం గూరిచి నే
నియ్యెడఁ జెప్పెద వినినన్, జయ్యనఁ బురుషార్థసమితి సంసిద్ధియగున్. ౧౨౬

తే॥ భీకరార్భటియుక్త రత్నాకరంబు, నందు నానర్తుఁడన్ భూపుఁడాత్మనామ
మునఁ జెలంగెడి దేశంబుఁ బోషణంబు, ధర్మముగఁ జేయుచుండు నాధార్మికునకు

చ॥ కలఁడుగదా సుతుం డొకఁడు గాఁదగువారల మేలుబంతి యో
గ్యులఁ దలకట్టు దిట్టలను నుక్కరి దిక్కెడు వారికెల్ల ది
క్కలఘుచరిత్రులం దలఘుఁ డందఱకున్ దలలోనినాల్క బీ
దలకును బెట్టుఁజెట్టు వసుధాపతులం బెద రైవతుం డనన్. ౧౨౯

చ॥ అతఁడు నిపానఖాతపరిఖాల్పసరోహ్రదకూపదీర్ఘికా
దితలకగోపురావరణ ధిష్ణ్యసభామఠ వప్రమందురా

వృతివిశిఖాప్రపావిపణివీథిచతుష్పథధర్మహర్మ్యసం
గతముగ నద్భుతస్థితినిఁ గట్టెఁ గుశస్థలియన్ మహాపురిన్. ౧౨౮

క॥ ఆపురిఁ గాపుర ముండుచు, నేపున ధర్మముగ రాజ్యమేలుచు వేడ్కన్
శ్రీపతికరుణను రైవతభూపతి శతపుత్రకులను బుణ్యులఁ గాంచెన్. ౧౨౯

తే॥ మఱియు మాఱుమిటారిని మనువఁ జేయు
నంత సర్వాంగసుందరియైన రేవ
తియను కన్నెను గనెనా క్షితిపశిఖండు
మెందు గారాబమునఁ బెంచుచుండ నామె. ౧౩౦

తే॥ ప్రాప్తయౌవన యౌచు వివాహయోగ్య
యగుట వీక్షించి మిగుల నిజాంతరంగ
మందు నిట్లు యోజించె నీ యబల నెవని
కిచ్చినన్ లెస్సయౌ ? నది యెఱుఁగఁబడదు. ౧౩౧

క॥ తెలియక యే ముదుసలికో, చలమరికో లేకికో కుజనునకో గడికో
కలవాఁడని యీ రతిసమ, నెలనాగను గట్టి చెట్ట నేఁగానుగదా. ౧౩౨

తే॥ కులము శీలంబు ప్రాయంబు గలిమి బలిమి
బాంధవంబును రూపంబు భద్రలక్ష
ణంబులం గల్గి వెలిఁగెడి నరవరేణ్యుఁ
డెందుఁ గలఁడొక్కొ యెవరు వచింపఁగలరొ ? ౧౩౩

ఉ॥ హృదయమునం దిటుల్ దలఁచి యెల్లజగంబుల సృష్టిసల్పు నా
సదయుఁడు బ్రహ్మ చెప్పుటకు శక్తుఁడటంచు సువర్ణరత్నముల్
బొదిపిన స్యందనంబున స్వపుత్రిని రేవతి నెక్కఁజేసి స
మ్మదమున బ్రహ్మలోకము నమందగతిం జని యోగశక్తితోన్. ౧౩౪

వ॥ ఇట్లు చని యవ్విరించనుం గాంచి నమస్కరించి యం దాసమయమం దాతండా యింద్రాదు లేతెంచి స్వాభిప్రాయసంచయంబు విన్నవించు కొనుటయు వసిష్ఠవామదేవకశ్యపాత్రిభరద్వాజశాండిల్యమాండవ్యమరీచ్యాది యోగిపుంగవులు పరివేష్టించియుండుటయుఁ గిన్నరకింపురుషవిద్యాధరచారణగంధర్వాప్సరోజనంబులు నాట్యం బొనరించుటయు విలోకించి తరుణం బిదిగాదని యెంచి యించుకకాలంబు తూష్ణీంభావంబు వహించి యుక్తావసరం బాలోకించి సంతసించి క్రమ్మఱ నప్పరమేష్ఠిం డగ్గఱి యొరిగలిడి డగ్గుత్తికతోఁ జెవి యొగ్గుమని యగ్గలంబుగ నగ్గించి యిట్లుగ్గడించె. ౧౩౫

క॥ జననస్థితిలయములకున్, ఘనకారణుఁడవు పలుకులకలికిమగఁడ వ
ర్థినికాయాధారుండవు, వనజాసనుఁడవు నిలింపవర్యుండ వజా! ౧౩౬

క॥ ఆనందాకారుండవు, మానివితతిసన్నుతుఁడవు మాధవజుఁడవో
దీనదయాజలధీ! నా, యీ నతులం గొనుచు నన్ను నేలుము! పరమా!

చ॥ మనువు మనీష యంగము లమర్త్యులు వేదము లుత్తమాంగముల్
దనుజులు పాదముల్ విమలధర్మము వక్షము వీపధర్మమున్
దనువు సమస్తసృష్టిగను దద్ఘటిల్ల వెలుంగునీకు వం
దనములఁ జేయుచుంటిని బితామహ! పూర్ణపురాణపూరుషా! ౧౩౮

క॥ అలఘుజగంబును హస్తామలకముగా సృష్టిఁజేసి మనిపి ప్రవృద్ధిన్
సులువుగ లూతావిధమున, లలిమ్రింగి ముదంబుతోఁ జెలంగవె యీశా!

విద్యున్మాలావృత్తము॥ తాతా! తండ్రీ! ధాతా! విద్వ
జ్జేతా! నేతా! శిష్టప్రీష్టా!
భూతప్రీణప్రోహాగ్రిణ్యా!
జోతల్ గొమ్మా సూరిప్రాప్యా! ౧౪౦

చ॥ వినుము మహానుభావ! యొకవిన్నప మిత్తఱి నెట్టి స్త్రీల కె
ట్టినరుల కేవిధంబున ఘటింతువొ యే మెఱుఁగంగలేము గా
ని నయగుణుండు శూరుఁ డతినిర్మలుఁడున్ జిరజీవియైన వా
ని నొకని మత్కుమారికకు నిర్ణయముం బొనరించి చెప్పుమా! ౧౪౧

క॥ నీవె సమర్థుఁడవని యిట, కీవిధి నే నచ్చియుంటి నీక్షింపఁగ నీ
రేవతియో రతితుల్యయు, కావునఁ బగువరునిఁ జూచి కరుణను జెపుమా!

చ॥ పొగడుచు నడ్డ భారతివిభుండు ప్రసన్నచతుర్ముఖంబులన్
నగు చిటుబల్కె రైవత! క్షణంబిఁక యాపనమైనచో బలం
బగు నలకాలమం దిరువదాఱునొకండగు కల్పముల్ సనన్
జగము మనుష్యయుక్తమయి సాగెడిఁ దత్కలికాలమందునన్. ౧౪౩

క॥ నీ పుత్రులు నీ పౌత్రులు, నీ పెండ్లము నీదు చెలులు నీ బందుగులున్
భూపతి! యుండఁగఁజాలరు, నా పలుకుల్ విని వడి భవనమునకుఁ జనుమా!

మ॥ చని తాలాంకుఁడు నీలచేలుఁడు మహాసౌశీల్యసంపన్నుఁడున్
వనజాతాయతలోచనాగ్రజుఁడు విభ్రాజత్సితాంగుండు స
జ్జనసంరక్షకుఁ డాహవోగ్రుఁడు హలాస్త్రప్రాంచితుండున్ సుధీ
ఖనియౌ రాముని కిచ్చి నీదు తనయన్ గావింపుమా! పెండిలిన్. ౧౪౫

క॥ మఱి సుమబాణాకారుఁడు, చిరజీవియు యాదవకులశేఖరుఁ డతఁ డీ
తరుణికిఁ దగినవరుండని, కరముగ నేఁ బలుకుచుంటిఁ గాన సలుపుమా!

క॥ ద్వారకలో నా హరి యా, సీరియు భూభారమణఁపఁ జెలఁగుదురు మహా
వీరులు వసుదేవజులును, ధీరులు బ్రహ్మాండభక్తదేవవిభులునై. ౧౮౭

ఆ॥ బ్రహ్మ యిట్లు పల్క రైవతభూపతి మ్రొక్కి యందు వెడలి పూర్ణవృద్ధి
వృద్ధమగుచు మిగుల వెలిఁగెడి ద్వారకాపురికి నేగుదెంచె పుత్రితోడ.

ఆ॥ వచ్చి విడిదిఁ జేసి వసుదేవునకు నా యుదంత మెఱుఁగఁజేసి సంతసమున
స్వజనములనుగూడఁ జక్కగా రావించి యుచితముగ సత్కరించి యంత.

తే॥ సర్వకల్యాణకరమును సౌరభాన్వితంబు పుష్పాంచితంబునై దంబు మీఱు
నొండు కల్యాణమండప ముచితరీతి! నేర్పరచి దంపతుల వసియింపఁజేసి. ౧౯౦

సీ॥ యాదవనాయకు లరుదెంచి యియ్యాదే, యుక్తవివాహమంచు గ్గడింప
సకలసామంతులున్ జనుదెంచి ధనకనకాదిబహూకృతు లందనియ్య
నంబరమందలి యమరులు విరులను, గరముగఁ బోరిఁబోరిఁ గురియుచుండఁ
గల్యాణకరములై కర్ణపేయంబులై, వివిధవాద్యములు శబ్దించుచుండ

తే॥ నుర్వి దేవతలెల్ల రాశీర్వదింప, మంత్రతంత్రియుతంబుగా మానవతిని
రేవతిఁ గూతు నట్టి సీరికరమందుఁ, బెట్టి దానంబు సల్పెఁ బెన్వేడ్కగాగ.

తే॥ మఱియు నాతండుహాలికిఁ డెఁగరదములుగ, బ్రహ్మదత్తరత్నంబుల వస్త్రములను
హయసహస్రాంచితము యోజనావృతంబు, విశ్వకర్మనిర్మితమునౌ విపులరథము

తే॥ ఇట్లు రైవతభూవరుఁ డెలమి స్వీయపుత్రికావివాహోత్సవముం బొనర్చి
తపము సల్పఁగ బాదరస్థలికి నేగె, నిద్ది వినువారు సద్దశ నెసఁగఁగలరు. ౧౯౩

—♦ శ్రీ రుక్మిణీకల్యాణ కథాప్రారంభము ♦—

క॥ మిథిలాపురనాయక! శ్రీ,మధుమధనవివాహకథల మాటాడెద నీ
కథలను విను సజ్జనునకు, వ్యథలు సనఁ సర్వపూరుషార్థము లొదవున్.

వ॥ ఈ యఖండభూమండలంబునం బరబ్రహ్మంబువిధంబున సత్యజ్ఞానానంద
మయంబై సత్యలోకంబుపగిది దివ్యభాషాబ్రహ్మవిభాసురంబై వైకుంఠంబువైఖరి
శ్రీపుండరీకాక్షమండితంబై కైలాసంబుకైవడి రాజశేఖరసర్వమంగళాస్పదంబై
యమరావతిచందంబున విబుధగణవిభ్రాజమానంబై తేజోవతీనగరంబుకరణి శుచి
నిచయసముచితంబై సంయమినీపురంబుచాడ్పున సమవర్తియుక్తంబై నైరృతిస్థానీ

యంబులాగునఁ బుణ్యజనసమాకీర్ణంబై వరుణపురంబుసరణి ఘననికరవిరాజమానంబై యనిలుని నిలయంబునెఱిని నానాసుగంధబంధురంబై యలకాపురంబు చొప్పున ధనదసముదాయసముదయంబై భోగవతిసొబగున మహాభోగియోగ్యంబై గోలోకంబులీల గోగోపకాళిరమ్యంబై గంధర్వలోకంబురీతిఁ జిత్రరథాదివిచిత్రంబై గ్రహమండలి యట్లు మిత్రరాజబుధగురుకవిముఖభూషితంబై హస్తినాపురంబుకైవి ధృతరాష్ట్రవాసంబై యింద్రప్రస్థపత్తనంబుభాతి నధిగతధర్మజాతంబై వారణాశీపురంబుకేవఁ గాలభైరవశూలపాణిపరీవృతంబై సుజనచరితంబుమాడ్కి నిష్కళంకంబై విమలకమలకమనీయకమలకల్హారమరాళరాజరాజివిరాజితంబులై మానసరోవరంబుఁ బురుడించు దివ్యసరసులును, సరసజనమనోరథానుకూలంబులై చైత్రరథనందనంబులం బోలు నుద్యానంబులును, నుద్యానరతహృద్యంబులై సురపురరథ్యలం బోలిన రాజమార్గంబులును, రాజమార్గోభయపార్శ్వవిభాసురంబులై సురసాలంబులవలెఁ గ్రాలు సురసాలాదిసాలంబులును, సాలజాలప్రభవవాసనావాసితంబులై మలయమారుతంబును మరపించు శీతవాతంబులును, శీతవాతభీతలై రతి రంభాదిసతులను బోలి లతాతన్వి తరుమనోహరు నాశ్లేషించుమాడ్కిఁ దమతమ ప్రియులం గౌఁగిలించుకొను సుందరులును, సుందరసుందరీసుందరంబులై సంక్రందన మందిరంబును గ్రేణించు మణిఘటితభర్మమయ రమ్యాహర్మ్యంబులును, గలిగి భూరి వికారవస్తుప్రశస్తంబయ్యు నభూరివికారవస్తుప్రశస్తంబై లాలాటికజాల విలసితం బయ్యు నలాలాటికజాలవిలసితంబై యర్థిజనావనసమర్థరమణీయంబయ్యు ననర్థిజనావనసమర్థరమణీయంబై సర్వవిధసామరస్యంబై సమస్తసంపత్సారస్యంబై సకల జనానందకరంబై విదర్భదేశాంతర్భ్యాతంబై కుండినపురవరంబొండు చెన్నారుచుండు.

ఉ॥ ఉండుఁగదా యొకం డచట నుర్విసుపర్వసుపర్వభక్తియు
క్తుండు తదాధిపత్యసహితుండు వదాన్యుఁడు సద్గుణుండు ద్వి
ణ్మండలఖండనోత్సవుఁడు నైతికవైదికలౌకికార్థికో
ద్దండకృతిప్రవీణుఁడు నితాంతయశుండును భీష్మకుం డనన్. ౧౫౮

ఆ॥ రుక్మి రుక్మరథుఁడు రుక్మబాహుండును, రుక్మకేశి యింక రుక్మనేత్రుఁ
డనెడి తనయులేవురా ధరాధిపునకుఁ, గల్గి రంతఁ గొంతకాల మరుగ. ౧౫౭

మ॥ జనియించెన్ గమలాంశతో నమృతనిష్యంద్యాననాబ్జంబుతో
వనజాతాయతపత్రనేత్రపదసంబద్ధాంతరంగంబుతో
ఘనరుక్మద్యుతిభాసమాన మృదులాంగశ్రేణితో రుక్మిణీ
వనితారత్నము పుణ్యరాశి యనఁ దద్భార్యామణిన్ మైథిలా! ౧౫౮

క॥ ఆపాప దినక్రమమున, నేపారుచు శుక్లతారకేశవిధమునన్
భూపతి కాటలఁ బాటలఁ, దేపకుఁ దేపకును గూర్చె తృప్తిముదంబుల్. ౧౫౯

సీ॥ ఒకపరిఁ జెలులతో నోమనగుంటల, నాడును జేకడియంబులాడ
నొకతేప నెచ్చెలులుండ వీణామలర్ప, వాయించుఁ దొడవులు వామలాడ
నొకసారి సకియలన్ సుకముగా రావించి, బంతులాడును బలుపింతలొడప
నొకమాఱు సఖులతో నొంటిగా ముచ్చట, లాడుఁ జెలుల్ పరిహాసమాడ.

తే॥ నొక్కతడవను జేటుల నొయ్యఁబిలిచి,బొమ్మలకుఁ బెండ్లినొనరించి సమ్మదమున
మంచి గుజ్జనగూళ్ళ వడ్డించి మించు, స్వకులరూపశీలంబులు జగతి మించ.

ఆ॥ ఆమె యతిథులకును నభ్యాగతులకును, మ్రొక్కి సత్కథలను ముచ్చటింప
నాలకించుచుండు నా సమయంబున, నేను గూడఁ బోయి యెలమితోడ. ౧౬౨

క॥ కృష్ణు మహాత్త్వము సత్త్వము విష్ణుత్త్వము సర్వలోకవిజయిత్త్వము నో
చిష్ణుత్త్వము బ్రహ్మాండచరిష్ణుత్త్వముఁ దత్త్వమంటి ప్రీతిచెలంగన్. ౧౬౨

ఆ॥ ఇట్టులాడ నామె యిందిరావిభుఁడె నా ప్రాణనాథుఁడంచు భావమందు
నిశ్చయించి యతని నిర్మలగుణములన్, గీర్తనంబుఁ జేసి కేరి వసుస. ౧౬౪

సీ॥ పెద్దలవద్దకు నుద్దవిడిన్ వచ్చి మాటాడువాడుక మానఁదొడఁగె
నిమ్మపండులఁబోలి నెమ్మదినుబ్బెడి గబ్బిగుబ్బలఁ బైఁటఁ గప్పఁగడఁగె
జెలికత్తియలతోడఁ జేరి యేకతముగా ముచ్చటలాడుట మొదలుపెట్టెఁ
దల్లికిఁ గొలఁదిగాఁ దనయిచ్చ వెలిగాగఁ గటివేల్పు గొప్పఁ బల్కంగఁగడఁగె

తే॥ చిన్ని వెన్నునివన్నెలఁ జిన్నలెన్ని యెన్నఁడెన్నఁడు సన్నని యిన్నడుమును
నొప్పజెప్పఁగా జాలుదు నొక్కొ? యంచు, మిగుల నువ్విళ్లలూరునో మేదినీశ!

తే॥ మఱియు నొకపరి శ్రీహరిదరికి నరిగి రుక్మిణీకులసౌశీల్యరూపగుణము
లేను వర్ణింప నాతఁడాయింతి తనకుఁ దగినసతియని యెంచెనో ధాత్రినాథ!

వ॥ అంత నయ్యనంతాకాంతుం డాత్మీయబంధుసంతానంబుతో నేకాంతంబున మంతనం బొనరించి యనంతకల్యాణగుణగణకాంతుండును, దైత్యాంతకుండును భగవంతుండు నగు నిందిరాకాంతునకుం గోటిపూర్ణేందుప్రతీకాశయగు తన కూఁతు నిడి వివాహం బొనర్చునట్లు నిశ్చయించియుండ యౌవరాజ్యాభిషిక్తుండగు రుక్మి యను జ్యేష్ఠపుత్రుండు భీష్మకుం డాసి తండ్రీ! నీవు నిర్ధారించిన విషయం బన్యాయంబై నాకు వేంద్రంబు దీండ్రింబుగాఁ గల్గించెడి. ౧౬౫

సీ॥ ఆకారమెంతుమా యఖిలజనాసహ్యాకరకృష్ణరూపంబు గలుగనయ్యొ
నన్వయంబెంతుమా యా యయాతిప్రభుశప్తగోపాలవంశంబునయ్యొ
సౌశీల్యమెంతుమా సర్వదూష్యంబైన తస్కరించుటయె ప్రధానమయ్యొ
వాహనంబెంతుమా వాజిగజాదులు గాక మురలిబొల్లిగ్రద్దయయ్యొ

తే॥ ఆధిపత్యంబు నెంతుమా! యాలదొరతనంబె యయ్యె నీకేకికి నాచెలియలఁ
త్రిపురసుందరి నీవెట్లు కృపను మాని యిడఁదలంచితివో యయ్య! యెఱుఁగ జెపుమ!

సీ॥ గండుసెలంగని తిండిపోతే కాక నీతిమాలినపాలుఁబోఁతువాఁడు
కాలకూటధరుసంగాతకాఁడే కాక విషధరంబులపైని వెలుఁగువాఁడు
పున్యాజనాళి కప్రూజనీయుఁడె కాక యెల్లవారలకును నెల్లిదుండు
గోకులంబందలి క్రుమ్మరీఁడే కాక యెల్లచోటులఁదిర్గు చిల్లగొండి

తే॥ యైన వీనికి నా సతి నా సరోజనయన నా దివ్యగాత్రి నా నవ్యచరిత
నా మహాభాగ్యవతి నెట్లు ప్రేమవిడిచి యిడదలంచితివో యయ్య! యెఱుఁగఁ జెపుమ!

వ॥ అట్టి దిక్కుమాలినవాఁడే యనురూపుండగు వరుండయ్యెనే? ఇఁక వేఱొండు దిక్కు లేదే? అక్కటికవాని కిచ్చి పరిణయం బొనరించుటకన్న నన్యం బగు పాతకంబుండునే? కాన నద్దాని మాని చేదిధరాధీశుండును, నవక్రపరాక్రమ-విక్రమక్రముండును, మదనరూపుండును, నభిజాతుండును నగు శిశుపాలభూపాలున కిచ్చి పెండ్లి నొనరించి యైహికాముష్మికసుఖంబులం జెందుట సెల్లుం గాదే యని పలుసారులు నొక్కివక్కాణించి యెట్టకేల కాతని నొడంబఱిచె. అవల తద్భీష్మకాదులు తత్పరిణయారంభతత్పరులైయుండుట నక్కన్నియ యెఱింగి తన మనోరథంబు వృథయయ్యెనని వందురుచు నిట్లు చింతించె. ౧౬౯

ఉ॥ ఎన్నిదినాలనుండియొ యుపేంద్రుఁడు భద్రగుణుండు నైన యా
వెన్నుఁడు ప్రాణనాథుఁడని వేమఱుఁ జెందెడి నాదు వేడ్కఁ బె
ద్దన్నయ పానకంబునకు నడ్డుగుపుల్లవిధాన నడ్డుఁ గాఁ
డన్న యితండు దున్నయని యందును సందియమేమి లేనటుల్. ౧౭౦

క॥ ఇంతకు నా ప్రారబ్ధమె సాంతముగా హేతువగుచు నగుపడుఁ గానీ
యింతట నియ్యది యా శ్రీకాంతున కెఱిఁగించువారు గలరే? యిలలోన్.

— రుక్మిణి బ్రాహ్మణుని ద్వారకకుఁ బంపుట —

మ॥ అని చింతించెడికాలమందుఁ గులగోత్రామర్త్యుఁ డేతెంచ నా
వనితారత్నము గాంచి మ్రొక్కి యిటులన్ బల్కెన్ ధరానిర్జరా!
యనఘా! సర్వవిధంబులన్ హృదయ మాయబ్జాక్షుపై నిల్చెఁ గా
వున నా ద్వారకనుండి యా హరి నిటన్ బొందింప నిన్ వేఁడెదన్. ౧౭౨

క॥ శ్రీపతిపాదారాధక! యీపనికిం దగినవాఁడ వీవే యని బల్
తోఁపఁగఁబంపించుటకే నీపగిదిం గడఁగుచుంటి నేగుమ! వేగన్. ౧౭౩

అ॥ అనియుఁ జెప్పఁదగు రహస్యోక్తు లొకకొన్ని
నుడివి యంపె నంతఁ బుడమివేల్పు
పద్మనాభుఁ జూచు భాగ్యమబ్బె నటంచు
ద్వారకానగరికి వడిగఁ జేరె. ౧౭౪

చ॥ చనిచని కాంచె దీప్తివిలసన్మణిరత్నవిరాజమానకాం
చనమయరమ్యహర్మ్యమును జాలచతుష్పథచత్వరప్రపా
దినిభృతమున్ మదేభరథదివ్యతురంగమనోజ్ఞమున్ మహో
పవనసహితంబు గోపకవిభాసురమున్ రమలేశవాసమున్. ౧౭౫

ఆ॥ అవల నట్టె విప్రుఁడచ్యుతు దర్శించి, యర్ఘ్యఁగొని భుజించి యడిగి కుశల
మొసఁగి దీవెనలను నూరక యుండుటఁ గనుచు సెలవుఁగొనుచు ననియె నిట్లు.

వ॥ దేవా! యీ వసుంధరను విదర్భనామకదేశంబున కధినాథుండై భీష్మ
కుండను నామంబున నొకఁడుండు. అతనికి రుక్మిణి యనంబరగు నొక కూఁతు రైదు
గురుకుఁ జెలియలై కలదు. త్రిపురసుందరి యగు నక్కన్యకామణి యనన్యలావణ్యా
తారుణ్యపుణ్యచరిత్రాగ్రగణ్యుండవగు నీయందు బద్ధానురాగయై పాణిగ్రహణ
మహోత్సవప్రశస్తవాచికం బొండు సవినయంబుగా వాచింపుమని నన్నుం బంపిం
చెంగాన విన్నవించెద వినుము. ౧౭౭

శా॥ నిత్యానందమహోదధీ! గుణనిధీ! నిర్ధూతదంభత్క్రుధీ!
స్తుత్యామ్నాయ సమూహమార్గపధీ! శూల్యాదిసంస్తవ్యధీ!
దైత్యారాతివితానరక్షణసుధీ! త్వద్భక్తరాట్సేవధీ!
నిత్యంబున్ శుభమబ్బఁగాత గొనుమీ॥ నేఁజేయు జోహారులన్. ౧౭౮

క॥ నారదమునిచే మును నీ చారిత్రము నాలకింప సంపూర్ణముగాఁ
గారణకారణుఁడ వనుచుఁ బూరితిగా దోఁచఁబడెను భువనచరిష్ణూ!

క॥ ఇచ్చట నంతయు క్షేమం బచ్చటి క్షేమాతిశయము లరుదుగ దెలుపన్
హెచ్చుగ వేఁడెద సర్వం బచ్చుగ నెఱుఁగుదువు కృష్ణ! యైనను వినుమా!

ఉ॥ నీ మృదుభాష నీ నటన నీ సుగుణంబులు నీ చరిత్రముల్
నీ మహిమంబు నీ బలము నీ ఘటనాఘటనప్రశక్తియున్
నీ మహనీయరూపమును నీ కులగోత్రయశంబు లన్నియున్
క్షేమకరంబు లౌట నిను జీవితనాథుగఁ గోరితిన్ హరీ! ౧౮౦

ఉ॥ ఓ నరసింహ ! సింహమున కూర్జితమైనటువంటిసొమ్మెదర్
నాన యొకింతలేక యొకనక్క దురాశనుగోరినట్లు బల్
హీనగుణుండు చేదిధరణీశ్వరుఁడీ భవదర్థమౌ ననున్
బూనికఁ బెండ్లిఁ జేసికొని పోవఁదలంచెడి దాన శ్రీధరా ! ౧౮౨

ఉ॥ రమ్మనిఁ జేదినాయకజరాతనయప్రముఖారివార మం
తమ్మొనరించి రాక్షసవిధానముగాఁ గొనిపోయి నన్ను యు
క్తమ్ముగఁ బెండ్లియాడి మఱిఁ దావకభర్మవికారచారుహ
ర్మ్యమ్ముల సర్వసౌఖ్యముల రంజిలఁజేయు మనన్యధన్యఁగాన్. ౧౮౩

తే॥ అంతిపురమందు నుంట నీ యబల నాకుఁజిక్కదని సందియంబును జెందవలదు
దాని కొక యుపాయం బెదఁదలఁచియుంటి నద్ది వలికెద శ్రీహరీ ! యవధరింపు.

ఉ॥ ఎల్లి యనన్ వివాహమహ మేఁ గులదైవతయాత్రఁజేసి రం
జిల్లుచు నూరిబైట నివసించు భవాని కొనర్తుఁ బూజ న
ప్డల్లన నీవు వచ్చి మనసారఁగ నన్ గొనిపొమ్ము వచ్చెదన్
ఫుల్లసరోజలోచన ! యమోఘపరాక్రమవిభ్రమక్రమా ! ౧౮౪

క॥ రమ్మా ! త్వర ననుఁగొన భారమ్మా ! జగడంబు దుష్కరమ్మా ! బహుదూ
రమ్మా ! తత్సమయము వైరమ్మా ! నాపయిని నీకు రాజీవాక్షా ! ౧౮౬

—♦ శ్రీకృష్ణుండు రథారూఢుండై కుండినపురికిఁ జనుట ♦—

మ॥ అని యా రుక్మిణిభావ మాద్విజవరుం డాడంగ శ్రీకృష్ణుఁ డ
ల్లన దిక్కుల్ వెలుఁగంగ నవ్వుచు నిటు ల్వాక్రుచ్చె నీ పల్కులన్
వినియుంటిన్ జెవులార నా లలనపైఁ బ్రేమంబు నాకెక్కుడౌ
టను నిద్రించుటగూడ లేదునిశలన్ డక్కిందు లేదో బుధా ! ౧౮౭

క॥ కావున నీవడిగినపని శేవనునొనరింతునంచుఁ జెక్కున రథమున్
శీవిని సిద్ధ మొనర్పఁగ నావేళను దారుకునకు నాజ్ఞాపింపన్. ౧౮౮

సీ॥ ఘణఘణాత్కారఘోరు ఘంటికాయుక్తంబు, రత్నరాజిప్రభారాజితంబు
స్వర్ణకుంభత్కుంభ సంచయరుచిరంబుఁ బుష్పమాలావాళి భూషితంబు
శస్త్రాస్త్రకరవాల జాలసంపన్నంబు నరుణసహస్రదీప్త్యద్భుతంబు
భక్తలోకావాస వైకుంఠనిర్మితం బుత్తమోత్తమము మహోచ్ఛ్రితంబు.

తే॥ శైబ్యసుగ్రీవమేఘపుష్పకవలాహ కాశ్వబద్ధంబు శుద్ధంబు హర్షదంబు
ఛత్రచామరయుతముగా స్యందనంబు దెచ్చి నిలిపె దారుకుఁడు తద్దేవునెదుట.

చ॥ నిలిచిన తేరుఁగాంచి హరి నెక్కొని సారథిమూఁపునందు ని
ర్మలనిజపాదపద్మములు రాజిల నెక్కి స్వహస్తమిచ్చి ద్వా
పల ద్విజునెక్కఁజేసి నిరపాయము ముక్తిదికాలమందుఁ జం
చలగతితోఁ జనం గడఁగె సాహసధైర్యనిజస్థబుద్ధియై. ౧౯౦

ఆ॥ అంత రేవతీశుఁ డచ్యుతుఁడొంటిగాఁ గన్యకార్థమేగు గమనిక విని
కలివిశంకితుఁడయి బలమైనసేనతో నరిగెఁ గృష్ణువెంట నరుల నణుక. ౧౯౨

తే॥ అటుల వెడలి రమేశ్వరుఁ డబ్ధిశైలనగరజనపదవనములు దిగువగాగ
నచ్చి యా విదర్భాంతర భాసమాన, కుండినోపవనంబునకు నరుదెంచి.

వ॥ పంచాశద్ధస్తప్రమానాధికోన్నతప్రశస్తంబగు ప్రాకారంబును, ధనుశ్శత సహితంబును, విస్తృతంబును, దుర్లంఘ్యంబును, దుర్గమంబును నై చాతుర్మాస్యతరంగిణీకరణిం బయఃపరిపూర్ణంబునైయున్న ఖేయంబును, గూజద్వనప్రియకోకమరాళ శారికాకీర పారావతాదివిచిత్రవిహంగపతనానుకూల హేమకుంభధ్వజతోలకంబులును గల ధాతుమయసౌధరాజంబులును, సప్తదశయోజనపరిమితంబగు వర్తులంబునుం గల్గివెల్గు కుండినపురవరంబును గాంచుచు సహాసీనుండగు నద్ధరామరుంబనిచి యంత. ౧౯౩

క॥ కాంతాసంగ్రహణాత్మకచింతకు ననువైనయొక్క చింతకుదిగువక
సంతసమున విడి హయముల మంతనముంజేయుచుండె మనమున జనకా!

ఆ॥ పిదప భీష్మకుండు స్వీయసుతక్ శిశుపాలున కిడుదునని పలికి పట్ట
ణంబునంత మండనం బొనరింపఁగా నాజ్ఞజేసె సేవ కాళికపుడు. ౧౯౫

సీ॥ కోటలు పేటలు గొందులు వాడలు గొలువుకూటంబులు గోమరుమిగిలె
మిన్నుముద్దాడెడి మేడలగోడలు చిత్తరువులతోడఁ జెలఁగుచుండె
దట్టంబులైనట్టి ద్వారబంధంబులు తోరణంబులతోడ సొరుమీఱెఁ
దకతకధిమిధిమిందైతక్కయను వారభామలయాట లవారిఁబ్రబలె. ౧౯౬

తే॥ మంగళప్రదతూర్యముల్ మాటిమాటి
కిని మొఱయుచుండెఁ బూరుషులును వనితలు
నవపటంబుల భూషల నవ్యపుష్ప
హారములఁ దేజరిల్లి రాయూరధీర! ౧౯౭

వ॥ అంత నక్కన్యకామతల్లికను జిరత్నార్జితామూల్యరత్నంబులచే నిర్మింపఁబడిన కల్యాణమండపంబున మంగళగీతవాద్యంబులు మ్రోఁగుచుండ సిద్ధులుభూదేవిం జుట్టినట్లు సువాసినులు పరివేష్టించి పన్నీటజలకంబాడించి పరిమళద్రవ్యంబుల ధూ

పంబులిడి చందనాదులంబూసి పుష్పదామంబుల వేసి దివ్యాంబరాభరణంబుల నలంకరించి తోడ్తోడ నిరాశ్రుతిచతుష్టయపారంగతులగు బ్రాహ్మణవరులు విఘ్నేశ్వర పుణ్యాహవాచనాది శాంతికర్మంబులు జరిపి రక్షాబంధనముహూర్తంబు గావింపం గన్యాదాతయగు భీష్మకుండే తెంచి లక్షబారువులబంగారంబును దద్ద్విగుణంబుగా ముత్యంబులను సహస్రభారవస్త్రంబులను బదివేలతొడవులను నాఱర్బుదంబుల గోవులను నయుతగజంబులను దశలక్షరథంబులను దశకోటితురంగంబులను గుడతిలపర్వతంబులను సహస్రసువర్ణపత్రంబులను నా బ్రాహ్మణపుంగవులకు వందనపూర్వకంబుగా నిడి వరనిరీక్షణంబు గావించు నెడ. ౧౯౭

క॥ దమఘోషుఁడు తన తనయునిఁ బ్రేమ మెప్పఁగ ధాత్రీసురులు రక్షను జేయన్
సుసుహోరాంబరభూషల నమితముగ నలంకరించి యాచారవిధిన్. ౧౯౮

ఉ॥ మంగళగీతవాద్యము లమందముగా మొఱయన్ లతాంగులు
న్మంగళహారతుల్ గొన ఘనంబుగఁ బెండ్లికుమారుసల్పి మా
తంగము నెక్కఁ జేసి యమితస్వఃపౌండ్రజరాసుతాదిసే
నాంగసుసంగతుండయి ప్రయాణమొనర్చె విదర్భకోవిభూ! ౧౯౯

ఆ॥ అట్లు పోవునప్పుఁ డాశిశుపాలుని నెచ్చెలులగు క్షోణినేత లెట్లొ
కృష్ణయత్న మాలకించి స్వామిద్రోహినిఁ గావఁ జనిరి మొనలఁ గలిగి యవల.

మ॥ వరబంధ్వాప్తులతో సువాసినులతో వారాంగనాశ్రేణితో
ధరణీదేవులతో గజావళులతో ద్రాఘిష్ఠసైన్యంబుతో
శరసంతానముతో రథాశ్వములతో సామంతలోకంబుతో
నరుదౌనట్లు వరుండువచ్చుట విదర్భాధీశుఁ డాలించి తాన్. ౨౦౧

క॥ ఘనముగఁ బ్రత్యుత్థానముఁ బొనరిచి పూజించి వస్త్రముల నిడి వరువా
రిని శుభకరగృహములలో, నునికిని సల్పంగఁ జేసె నుర్వీనాథా! ౨౦౨

ఆ॥ ఇట్టికాలమందు నట్టిరుక్మిణియును గాంచి యచ్యుతుండు గదియఁడంచుఁ
గరము శంకితయయి కమలాక్షుపదములనిలిపి యిట్టు లెంచె నెమ్మనమున.

—♦ రుక్మిణి కృష్ణునికై నిరీక్షించి చింతించుట ♦—

శా॥ మూర్తంబెల్లి కరగ్రహంబు గడిసెన్ భూదేవతల్ వచ్చి రా
యార్తత్రాణపరాయణుండు హరి యేలా యిందు రాఁడో? మనం
బార్తిన్ గుందెడి నామనోరథములున్ వ్యర్థంబులౌనో? ఫల
స్ఫూర్తిం జెందునొ? యిట్టివేళ విధి యేబుద్ధిన్ గటాక్షించునో? ౨౦౪

మ॥ ధరణీదేవుఁడు సాగెనో? పథమునన్ దైవాఱెనో? చేరెనో?
హరిదర్శించెనో? యీపనిన్ దెలిపెనో? యాలించి యా కృష్ణుఁడున్
సరిగాదంచుఁదలంచెనో? యిటకుఁ గాంక్షన్ వచ్చునో? కాళియున్
గరుణన్ బ్రోచునో? లేదొ నాదయిన భాగ్యంబెప్ప నెట్లున్నదో? ౨౦౭

మ॥ శిశుపాలుండు తదీయసైన్యములతోఁ జేరెంగదా వీటిలో
విశదాభావనుసన్నులై జనకుఁడున్ బెద్దన్న యుద్వాహకే
వశఁగాఁ బెండ్లినొనర్చి తీరుదుముగా పద్మాక్షుఁ డేతెంచఁడే?
యశుభంబో శుభమో యెదో నుడువ కీరాగ్రేసరుల్ వేరుగా! ౨౦౮

మ॥ ప్రతికూలించెను నంతరాయనికి దాత్మన్నాద్రిభవ విఘ్నేశుఁడున్
ప్రతికూలించెను లోకశంకరకృతి ప్రష్ఠుండు గౌరీశుఁడున్
ప్రతికూలించెను సర్వలోకసృజనప్రాజ్ఞుండు వాణీశుఁడున్
ప్రతికూలించెను గోధరామరతతుల్ ప్రారబ్ధ మిట్లుండెఁగా. ౨౦౯

క॥ ఏదిచేయుదను? నెదిమానను? నెది దిక్కెటుపోవనగునో? యెందుండఁదగున్?
సదయుం డభయప్రదుఁడును విదితుఁడునగు చక్రి యిటకు వే రాఁడుగదా.

క॥ అని చింతించుచు బలుకుచు వనజాక్షుఁడు వచ్చెననుచు భవనాట్టము నె
క్కుచును గనుఁగ్రమ్మఱుఁగ్రమ్మఱుఁ జను వచ్చును మిన్నకుండు సైపక వగచున్.

ఉ॥ కట్టదు మేల్మిచీరఁ బొడఁగట్టదు తల్లికిఁ బంక్తికిం దలన్
గట్టదు మంచిపూల్ నడుముఁగట్టదు మేలిమికాంచిచేఁ జెవిం
బెట్టదు కీరనాదములఁ బెట్టదు నోటను బట్టెడన్నమున్
బెట్టదు కస్తురిన్ నొసలఁ బెట్టదు స్వర్ణవికారభూషలన్. ౨౧౦

ఉ॥ చూడదు దర్పణంబు సరిచూడదు నెచ్చెలురాండ్రమోములన్
జూడదు పెండ్లివింతలను జూడదు స్వీయశరీరసౌఖ్యముల్
బాడదు దివ్యగాత్రమునఁ బాడదు వల్లకిపూర్వకంబుగా
నాడదు మాటలేవియును నాహరిపైఁగల కూర్మి యెట్టిదో. ౨౧౧

తే॥ ఇటులఁ శ్రీకృష్ణురాకకు నెదురుచూచునట్టి రుక్మిణికుత్తరంబాడె ననఁగ
వామపార్శ్వంబుకంపింప భైష్మియలరి తిరుగుచుండఁగ నావిప్రుఁడరుగుదెంచి.

ఉ॥ అమ్మ! ఫలించె నీతలఁపులాహరి నా కనులారఁగాంచి యో
గ్యమ్మగుపూజలొంది మనసారఁగ నీ శుభవాచికమ్ము స
ర్వమ్మును జెప్పి నీ సుగుణరాజిని వర్ణనజేయ నాతఁడున్
సమ్మదమొంది యీ పురికి సాగి త్రుటింజనుదెంచె రుక్మిణీ! ౨౧౩

చ॥ అనవుడు రుక్మిణీతరుణి యగ్రజసర్వ! మదీయసూక్తులన్
వినిచని ద్వారకాపురికి వెన్నునిఁ గోర్కొని వచ్చియుంటి వీ
పని కుపకారముల్ దగినపాటిది యేదియు లేదు గాన వం
దనములొనర్తుఁ గైకొనుము! ధన్యచరిత్రను నైతి నీకృపన్. ౨౧౪

వ॥ అంత నద్ధరామరుండు సంతుష్టహృదయంబుతో నిట్లనియె. ౨౧౫

మ॥ తరళాక్షీ! ధనధాన్యహేమమణిసౌధజ్యాదులన్ మించి త
త్పరమేష్ఠిప్రమథాధిపేంద్రముఖదేవశ్రేణియోగీంద్రదు
ష్కరమై సౌఖ్యదమై యఘౌఘగిరివజ్రంబై శుభంబైన త
ద్ధరిసందర్శనభాషణాదిధన మిష్టంబ్బెగదా నీపనిన్. ౨౧౬

ఆ॥ ఇంతకంటె నాకు నేమిగావలెనమ్మ! స్వర్ణముఖపదార్థచయము దిరమె?
స్థిరను సంబరమున దీర్ఘసుమంగలివగుచు మనుమ! మరువకమ్మ! నన్ను.

ఉ॥ ఆవల భీష్మకుండు నుపయామముఁజూడఁగ రామకృష్ణులన్
దేవులు వచ్చిరం చవని దేవముఖంబున వించు నర్ఘ్యపూ
జావిహితార్థసంచయము జక్కఁగ కానికలంగ్రహించి తూ
ర్యావళిమ్రోయ విందులు నమ్మంబున వెన్కొనఁ జేరి వారినిన్. ౨౧౮

ఆ॥ అర్ఘ్యపాద్యము లిడి యర్చించి రత్నాంబరాభరణము లిచ్చి యరరె! వీని
"కామె నిడకపోతి"నంచు నావందనమున విడిదిఁజూపి నతులిడి చనె. ౨౧౯

వ॥ అంతఁ గర్ణాకర్ణికగాఁ బౌరజనంబా శౌరిచేరిక విని యానందవనంబున
కరిగి యానందనందనసుందరవదనారవిందామృతంబు నమందంబుగా నిజనయనాంజలు
లతోఁ గ్రోలుచుఁ బరమానందంబుఁ బొంది యిట్లనిరి. ౨౨౦

చ॥ తగిన మనోహరుండితఁడు తాన్సృశరుక్మిణి కామె భార్యగాఁ
దగినది యీ మహాత్మునకు దంపతిభావము వీరి నిద్దఱిం
దగులఁగఁ జేయఁ బూర్వసుకృతంబుల ధాతకు ధారపోతు మీ
జగమున నిట్టిరూపసియు సద్గుణియుండునె? తిర్గిచూచినన్. ౨౨౧

ఉ॥ ఎప్పుడు మావిదర్భధరణీశునికీసుతఁ డల్లుఁడౌనో యిం
కెప్పుడు తద్గృహంబునకు నీకమలేక్షణుఁ డేగుదెంచునో
యెప్పుడు కన్నులారనట నీకమలాహృదయేశుఁ గాంతుమో
యప్పుడుగాదె మా జనులు సార్థకమౌ వృథయౌను గానిచోన్. ౨౨౨

వ॥ ఇట్లు పరస్పరం బాడుకొనుసమయంబున. ౨౨౩

—♦ రుక్మిణి కులదేవతాపూజకై బయలుదేరుట ♦—

సీ॥ వందిమాగధులు కైవారంబులం జేయ వివిధతూర్యంబులు చవిలిమ్రోయఁ
గమనీయరాగముల్ గాయకుల్ బాడ వారాంగనామణుల్ జెలిసియాడ
నర్జునచ్ఛత్రాదులనుజీవులుం బట్టఁజుట్టముల్ ప్రీతితోఁజుట్టుముట్ట
మంగళారతులతో మానినుల్ సనుదెంచ నాక్కొంద చేటిక లగరుదెంచ

తే॥ నలుగడల జయశబ్దముల్ సెలఁగ స్వీరసతురగరథకరథిరయోధులు దూరముగనె
భద్రముగఁజూడ నగరున భైష్మి వెడలి గిరిజనర్చింప నేతెంచె హరిహృతమతి.

ఆ॥ అతుల నామెవచ్చి యాలయస్థిత దేవి పాదపద్మములకు బాఢభక్తి
శిరము ధరణినంటఁజేసి నమస్కృతు లిటుల వేడఁదొడఁగె నెలమిమెసఁగ.

ఉ॥ అంబ! మదంబ! సర్వజగదంబ! గజాస్యషడాననాంబ! యో
శంబరవైరిహారికులసాధ్వీమణీ! భవరోగహారిణీ!
కంబుగళా! భవాని! యధికంబుగనమ్మిచు మ్రొక్కుచుంటి హా
ర్ధంబుఘటిల్ల నన్ను హరిరాణిగఁజేయు మభీష్టదాయినీ! ౨౨౬

వ॥ అని ప్రార్థించుట సకియలాలించి చెలీ! యా కృష్ణనామంబుఁ బలుక వలదు. శిశుపాలుండుద్దిష్టుండగు వరుండు కాన నతని నామం బుచ్చారణాన ర్థంబని వక్కాణింప ధిక్కరించి యక్కన్యకాలలామ నెక్కొని క్రమ్మఱనక్కమలాక్షుండే భర్తయగునట్లు కావింపుమని యా శర్వాణిం బ్రార్థించి గంధాక్షత పుష్పధూపదీపాపూపతాంబూలనీరాజనాదు లొసంగి యర్చించి భూషణంబులర్పించి భూసుర తరుణీమణులకును, దక్కంగల సాధ్వులకును బూజించి మ్రొక్కనవ్వార లిట్లు దీవించిరి. ౨౨౭

సీ॥ శతరూపఁబోలిన సౌందర్యమమరుత జానకివలెనోర్పు సంఘటిలుత
వాణితోఁదీటగు వాణియుగల్గుత శివవలె శీలంబుఁజెలఁగుగాక
వనమాలిభర్తాభపతిభక్తి యలరుత శచివలె భోగముల్ సంభవిలుత
లక్ష్మినిబోలి కళాసక్తినగుగాత దక్షిణఁబోలు ముత్తైదువగుత.

తే॥ మతియరుంధతితోఁ సమానమైన భర్తృశుశ్రూషణాసక్తి ప్రబలుఁగాత
గోర్కెలీరికలెత్తఁగా గొప్పవాసి గలుగమనుమమ్మ! రుక్మిణీ! లలితచరిత!

చ॥ పిదప విదర్భరాజసుత పీడి మునివ్రతమాస్థఁగ్రమ్మరఁగ్
సదయకు నీశ్వరప్రియకుఁ జాఁగిలిమ్రొక్కి ధరామరాంగనా
పదములకున్ నతుల్ సలిపి బంధుసఖీపరివారపంక్తితోఁ
గదలెను దద్గృహంబువిడి గంధగజేంద్రసమానయానయై. ౨౨౮

తే॥ కోటిచంద్రప్రతీకాశకుందరదనఁ బద్మనయనను భైష్మి డబ్బాటుగాను
సునిధినిర్ధనుల్ గనినట్లు శూరులైన కరిహయారోహకరథులుఁగాంచి యపుడు.

చ॥ అడలిరి సూచిసంధులకు హర్షముఁజెందిరి నెమ్మనంబులం
దుడిగిరి సర్వచేష్టలను నూడ్చిరి మానగభీరిమాధృతుల్
విడిచిరి సేతిమూపులను వీడిరి రథ్యకనద్రధాలఁ గ
న్పడిరి కరమ్ము గోడపయిఁ వ్రాసినబొమ్మలకై వడిన్ విభూ! ౨౩౧

తే॥ మఱియు స్వీయదేహంబును మరచి నేలవ్రాలి రట్టివై దర్భిరూపప్రకాశ
హాసనలజ్జాకటాక్షంబులనెడి కామబాణములచేత దెబ్బలఁబడుచువారు. ౨౩౨

తే॥ ఇట్టు లిలఁవ్రాలు రాజుల నట్టి భీష్మకసుత క్రీఁగంటఁజూచుచుఁ గాలినడక
నల్లనల్లననడచుచు నాత్మచిత్తగతమనోరథప్రాప్తంబు గలుగుచుండ. ౨౩౩

శా॥ వీక్షన్ గాంచెను గౌస్తుభోజ్జ్వలితునిన్ బీతాంబరున్ వీరునిన్
శ్రీకారుణ్యపయోధినిన్ గుణనిధిన్ శీలిన్ జగన్మోహనున్
రాకాపూర్ణసుధాకరాస్యరుచిరున్ రాజీవపత్రేక్షణున్
శ్రీకృష్ణున్ బహుభూషణాన్వితు లసజ్జీమూతవర్ణాభునిన్. ౨౩౪

తే॥ కాంచి తద్రూపరుచిచమత్కారశూరతాగభీరిమాప్రాయముల్ దలఁచి యామె
యిప్పుడాహరి నన్నుఁగొని యేగినఁ గడుబాగుగా నుండునని యెంచుపట్టునందు.

## శ్రీకృష్ణవిజయము

వ॥ ఘంటామంజీరమంజులనాదసమన్వితంబును, మంగళకరోత్తుంగసంగతంబు నగు నరదంబును, వాయువేగంబుతో సారథియగు దారుకుండు దోలెఁ బార్థసారథి నిజయోధయూధసంఘట్టనంబునఁ జరిపంథులగు జరాసంధాదివసుంధరాధినాథుల వరూధినులను ఝంఝామారుతంబు నీరజవనంబును భంగంబు గావించినట్లు భేదించుచు విహగేంద్రుం డమరావతిసితనందనవనంబున కరిగి యమృతంబుఁగొని చనుదెంచినట్లు స్త్రీకదంబంబునం జొరఁబడి పసగల పసిడిపసిమిని మిసమిసలాడు నాసుందరిని సంగ్రహించుకొని ప్రతిద్వంద్వికర్ణకఠోరంబగు శార్ఙ్గంబుఁడంకారం బెడనెడఁ గావించి దేవదుందుభిబృందంబు శబ్దింప యదుదుందుభులు మ్రోయఁ గిన్నరకింపురుష చారణవిద్యాధరగంధర్వాప్సరోజనంబులు లాస్యంబుసల్పి పూలవానంగురియ జయ జయారావంబులు దశదిశలం జెలరేఁగఁ దనస్యందనంబున నిడికొని సృగాలజాలమధ్యంబునుండి సింహంబాహారంబుఁగొనివచ్చినభంగిం జనుదెంచి యాదవధ్వజిని ముందు నడువ బలభద్రుండు తోడుగారా ద్వారకాపురమార్గంబుఁబట్టియరిగె. అంత నాస్థలంబునఁ గోలాహలం బుప్పతిల్లుట జరాసంధాదిరాజు లాలించి యోర్వఁజాలక. ౨౩౬

ఉ॥ క్షుద్రసృగాలజాతి సని నొప్పమృగేంద్రుల కీర్తిఁగోంచు బల్
భద్రముఁ జెందినట్లు యదువంశజు లీ మనవాసితోడ న
చ్ఛిద్రముగా విదర్భసుతఁ జేకొనిపోయి రిఁ కేలజన్త్రముల్
నిద్రలఁబోతిమో బలము నీరసమయ్యెనొ వింక్లగాల్పవో. ౨౩౭

వ॥ అని పరస్పరంబుద్బోధించుకొని యాపెడినాముకులవీక క్రోధపరులై శస్త్రాస్త్రంబులందాల్చి తనుత్రాణంబులనుధరించి రథంబుల నధిష్ఠించి చతురంగబలంబుల గూడి యాదవులతో యుద్ధంబొనరింప సన్నద్ధులై యుద్ధతింజని పౌండ్రకుండు రెండక్షౌహిణులవాహినితోడను, విదూరథుండు మూఁడక్షౌహిణుల దండుతోడను, దంతవక్త్రిం డేనక్షౌహిణుల మొనతోడను, శాల్వుండు మూఁడక్షౌహిణుల మూఁకతోడను, జరాసంధుండు పదియక్షౌహిణుల పౌఁజుతోడను, మఱియుఁ దక్కుఁగల రాజులు పెముకఁదగిన సైన్యంబులతో హరిసమ్ముఖంబున కరిగి యహంకారంబున హుంకరించి ధిక్కరించి నిలునిలుఁడని హెచ్చరించి నిజచాపంబులను మాటిమాటికిఁ డంకరించి సంగరరంగంబంధకారబంధురంబుగాఁ బ్రయోగింప నయ్యాదవు లాయరాతిబలప్రళయజలధిం దరింప దివ్యపోత్రప్రాయులై చనుదెంచి తృణీకరించి రండు పోరాడుఁడనికొల్లలఁ జేసి మారొక్కనుసమయంబున నా చంచలాక్షి కాంచి భీతమృగేక్షణయై సిబ్బితిప్రబ్బుకొన నిబ్బరించుకొనుచు నబ్బలానుజునాననంబు విలోకింప నా మహామహుండు. ౨౩౮

క॥ చెలిరో ! యడలెదవేలా ? యలఘుతరాభీరబలములదిగో శస్త్రా
దులతోఁ బౌరుషములతోఁ దలపడె నిఁక భ్రమందఁగలవు తదరిధ్వజినుల్. ౨౩౯

వ॥ అని భయంబుదీర్చి విలాసంబుగఁజూచుచుండ బలభద్రుండుప్రలయరుద్రుమాద్రిం గ్రుద్ధుండై హలముసలగదాద్యాయుధంబులందాల్చి సేనానియై ప్రోవయాదవబలంబు లహంకరించి హుంకరించి భేరీభాంకారశింజినీటంకారనిస్సాణధణధణాత్కారశతాంగనేమిపటపటాత్కార కుంభిఘీంకారాభరణఝణఝణాత్కార కింకిణీకిణకిణాత్కార రథ్యఘుంటాఘణఘణాత్కార వివిధక్రేంకారంబులతో నుత్సహించి యెదిరించి మత్సరగ్రస్తులగు నరాతినేతృపదాతివ్రాతంబుల నమ్ములంగ్రుమ్మియు విండ్లనువేసియు గదలంబొదిఁయు ముద్గరంబులమోఁదియు ముసలంబులంజదుపుచుఁ గత్తులంజించుచు శూలంబులఁ గ్రవంచించుచు నడిదంబులనడఁచుచుఁ గుఠారంబుల భేదించుచుఁ గుంతంబులఁగ్రుచ్చుచు సురియలనఱకుచుఁ బట్టిసంబులంబ్రద్దలుసేయుచు బరిఘలంజిమ్ముచు ముష్టులనుమొట్టుచుఁ గాళ్ళందన్నుచుఁ జేతులంద్రిప్పుచు రథరథ్యసమరపరికరసహితంబుగా ధ్వంసంబొనరించుచుండ బ్రహ్మాండనాయకుండగు శ్రీకృష్ణుండు వైరివీరమహారణ్యంబున దావవిధంబునంజొరఁబడి బాణకృపాణచక్రగదాద్యాయుధంబులతో విభిన్నంబుగా నూరువులు వేఱువేఱుగాఁ జేతులు చిందరవందరగాఁ బార్శ్వంబులుపాడుగా దంతంబులువిశ్లథంబులుగాఁ గవచంబులు విశీర్ణం

బులుగా వక్త్రంబులువక్రంబులుగా నంగంబులువికలంబుగా దేహంబులురక్తమయం బులుగారథంబులు-చూర్ణంబులుగా రథ్యంబులంగూల్చి రథికుల నుఱుమాడిపతాకలం జించి పరివారంబులంఒలాయితులంజేసి యుల్లంబునం బెల్లుగనుల్లాసంబునిండ జగదేకవీరుండని బృందారకులగ్గింపఁ బ్రవర్తిల్లుచున్న సమయంబున మహాబలుండగు శాల్వుండుకని కిసిసి యనిమొనకుంజని నిజగదావిద్యాధన్యతఁ జూపఁజకద్భుతంబుగా గజత్తో వగ్గదినిం బ్రహరింప నాగదాగ్రజుండు తద్గదావిద్ధుండై మూర్ఛిల్లియుఁ గ్రమ్మఱలేచి ధనుర్యుద్ధంబాపి లక్షభారసమన్వితంబును, గామోదకీసమంబును మహాత్తరంబునగుగదను నిజాగ్రజన్ముండంపఁజేయ గ్రహించి జంభభేది జృంభించి దంభోళితో మహీధ్రంబులంగొట్టినట్లా శాల్వునిం బ్రహరింప నతండు తత్ప్రహార బాధితుండై శస్త్రహతంబైన వృక్షంబుమాడ్కి-నేలంగూలుట బౌండ్రకజరాసంధదంతవక్రవిదూరథులను నలువురు వీరులేతెంచి పోరాడంగడంగిరందుఁ బౌండ్రకుండు కువాక్యంబులచే మైత్రినశింపఁజేసినట్లు దశవిశిఖమ్ములఁదద్గరుడధ్వజంబుఁద్రుంచె. దంతవక్రుండు నిజగదాఘాతంబునఁగజ్జుతో ఘటంబుల భంగంబుజేసినట్లు తద్రథంబును జూర్ణంబొనరించె. జరాసంధుండు తత్తురంగంబులంగూల్చె. విదూరథుండు తత్సారథింబ్రహరించె. అంత రేవతీకాంతుండాగతుండై కల్పాంతకృతాంతసన్నిభుండై ముసలంబుంగొని హేరాళకరాళవక్త్రవిశాలుండగు దంతవక్త్రుని మూర్ధంబునం బాఁది యాతండు వక్రంబగు మొగంబుతోఁబాటు దంతంబులు వంకరగా నిజానుజన్ముండు రుక్మిణీసహితంబుగా హాసింపనేలంగూలంజేసి జరాసంధవిదూరథపౌండ్రకులను విరామంబులేనిమాడ్కి-ముసలంబునం గసిదీఱమోఁద నమ్ముప్వురునొచ్చి రక్తసిక్తాంగులై సొమ్మసిల్లిరి. వెండియుఁదత్సైన్యంబులేతేర బలుండుగాంచి యాగ్రహించి హాలంబున నొక్క-మాఱాకర్షించి ముసలంబునం దశయోజనపర్యంతంబును రథిరథకరితురగపదాతిచ్ఛత్రచామరంబులు హతంబులై నిండం బ్రహరించి జగజ్జేగీయమానుండయ్యె. అంత జరాసంధాదిరాజులు మూర్ఛదేఱి నష్టోత్సవులగుటయు కాక మరణావశిష్టులై నోటనురువులుఁగ్రమ్మ వరదలై పాఱరోఁజుచు నాలింగోలుపోయినవాని లీలను, బెన్నిధింబోఁగొట్టుకొన్న మానసిచందంబునను, నేలకు మొగంబువేసికొని యమితంబుగా విచారపడుచుండు శిశుపాలుంగాంచి శత్రుహతుండవుకాక బ్రతికితివి గదా యని సంతోషించి యతని కిట్లు పల్కఁదొడంగిరి. ౨౮౦

తే॥ పురుషశార్దూల! కలుషంబుఁబొందవలదు బ్రతికియుండినఁ బెక్కు-రుసతులు నీకు
గాఁగలరు మఱి మనకిది కష్టకాలమందునం గాలమొకకొంత యరుగఁదగును.

క॥ తేపే ద్వారకకరుగుచుఁ గోపంబున సర్వగోపకుల నలసీరిన్
గోపాలకృష్ణుఁ జంపెదఁ దాపంబడఁగంగ నీకు ధైర్యముగొమ్మా! ౨౮౨

తే॥ అట్లు మిత్రసంబోధితుఁడగుచుఁ జైద్యుఁడాత్మచంద్రికాపురమున కరిగెనంతఁ
బౌండ్రకాదులు దమతమవాసములకుఁ జనిరి చావఁగమిగిలిన చమువుఁగూడి.

## —♦ రుక్మి కృష్ణుని వెంబడించి పోవుట ♦—

చ॥ చెలియల సంగ్రహించుటయు స్నేహితబంధుపరాభవంబుఁ జా
రులవలనన్ జెవింబడఁగ రుక్మియనంబడు భీష్మకాత్మజుం
డలఘుబలుండు క్రుద్ధుఁడయి యా యసి మీసలఁ ద్రిప్పి యిట్టులన్
బలికెను భూభుజుల్ సఖులు బంధుగులున్ వినుచుండ భూపతీ! ౨౪౪

తే॥ సమరమందున శ్రీకృష్ణుఁజంపి నాదు చెలియలగు రుక్మిణిన్ గొని చేర నేని
సకలభోగాస్పదంబును సౌఖ్యకరమునైన యీకుండినపురికి నేనురాను. ౨౪౫

వ॥ అని శపథంబొనరించి దివ్యంబగు వర్మంబును, ఘనంబు నంబుదనిర్మితంబు సింధుదేశజనితంబునగు శిరస్త్రాణంబును సౌవీరదేశభవంబగు చాపంబును, శాలిలాట దేశసంజనితంబగు నిషుధిద్వయంబును, మ్లేచ్ఛదేశసమార్జితంబగు ఖడ్గంబును, గౌడ జంబగు చర్మంబును నేతరీయంబగు మహాశక్తిని ఘూర్జరరాష్ట్రోద్భవంబగు గదను, వంగజంబగు పరిఘంబును, గౌంకణంబగు హస్తత్రాణగోధాంగుళిత్రాణంబులను ధరించి కిరీటాంగదకుండలాదిభూషణంబులందాల్చి జైత్రంబగు రథంబెక్కి యక్షౌహిణీద్వయపరిమితసైన్యంబుఁ దోడ్కొని వెన్నుని పిఱుందనంటఁబడుచుఁ బోరాడఁ బోవునంతలో బలరాముండు సూచి నిజచమూసమన్వితుండై తత్సైన్యంబు నుఱుమాడుచుండినను నతివేగంబుగా శతాంగంబుఁద్రోలించి హరినిన్ డాసి యిట్లనియె.

చ॥ యదుకులనాధకా! నిలువురా! యెటకేగెద? వోర! నాస్వసన్
విదళితమత్తవైరికులు భీష్మకపుత్రికు నంగరాజు నన్
హృదయమునన్ గణింపక యథేచ్ఛ హరించి గమించుచుంటివే?
యిదిదగునే? త్యజించి సతి నేగుము! చచ్చెద వట్లులేనిచోన్. ౨౪౭

క॥ తుచ్ఛా! గోపాలుఁడవయి యుచ్ఛిష్టము మెక్కుచుండు వుజకవె? మును ద
న్మ్లేచ్ఛధరానాధునకు బలోచ్ఛ్వానజరాత్మజునకు నోర్వక మొనలోన్. ౨౪౮

తే॥ మఱి యయాతిశాపంబునఁ గరముభ్రష్టుఁడవయి చనలేదె? చెట్టలన్ దవులలేదె?
యిట్టివాఁడవు మాతోడ నెనయగుదువె? విడువు రుక్మిణిన్ లేనిచోఁ బడెదవవని.

చ॥ పలికియటుల్ కఠోరముగ వైరిబలంబునుజూడకుండ న
మ్ములపొదినుండి బాణమునుబొంది చెవిందగులంగలాగి ముం
గలఁగల కృష్ణుపై విసరఁగాంచి యతండొక శాతహేతితోఁ
జిలువను బక్షినాయకుఁడు సెండిన కైవడిఁ ద్రుంచె వేళ్ళిమ్మడిన్. ౨౫౦

చ॥ అటుపయి రుక్మి వేఱొకటి హైమగుణాంచితచాప మూని వే
పటుపరశసాయకంబులను భద్రముగా జతజేసి శౌరి ను
త్కటముగఁ గొట్ట నాతఁడును దత్త్వమునన్ గుణయుక్తసంస్కృతిన్
దిటముగ మాపినట్టు లొకదివ్యశిఖంగొని చెండి వెండియున్. ౨౫౧

తే॥ వేఱుతీవ్రబాణంబునన్ భీష్మకసుతుధనువు రెండుగావిఱిచి మధ్యమున నంద
భల్లముల వేసె రుక్మిపైఁ బౌరుషమున నంత వైదర్భుఁడున్ గాంచి యాగ్రహించి.

తే॥ ఓరిగొల్లఁడ! యిపుడు నీయుసురు లేగుఁగాచికొమ్మని దీప్తిప్రకాశమాన
శక్తినింబ్రయోగించెను జక్రిఁ దునుమ; నద్దిగని గదాగ్రజుఁడును జిద్దుతోడ.

చ॥ మదనదశేషశత్రుకులమారణకర్మకృతార్థతాలస
ద్గదఁగొని వేయ నద్ది దృఢతావిదితంబగు వానిశక్తినిం
జదిమియు రెండుతునుకలుగ సారథిగీటణఁగించి తేరుపై
గొదకొని వ్రాలి చూర్ణముగఁ గొట్టె గిరిన్ బవికొట్టినట్లుగన్. ౨౫౪

తే॥ భైష్మకుండంత స్వకగదన్ బద్మనాభుఁగొట్ట నతఁడు చక్రింబుతోఁ గొట్టె నుసిగ
వెనుక రుక్మి వంగజపరిఘును రమేశ్వరాంసమున బాఁది యార్చె భీమాభ్రరీతి.

వ॥ అంత శ్రీకాంతుండు తత్పరిఘాఘాతంబునం బుష్పమాలాఘాతంబుపడిన
మాతంగేంద్రింబు భంగిం దైవాఱి దానితోడనే యా రుక్మిం జక్కఁ బ్రహరింపనవ్వా
డించుక నొవ్విపడినమనంబుతో శౌరిందూఱుచు నసిచర్మంబునకు లోనుజేయ నా
యంబుజాక్షుం డాలోకించి సులువుగా స్వఖడ్గచర్మమున నద్దానింజీల్చి కృపాణ
పాణియై సమీపించు నవ్వానిశిరస్త్రాణంబును దనుత్రాణంబును హస్తాంగుళిత్రాణం
బులను విదారించి ధారణిపై భుజదండంబులతో నతనిం బడవైచి మృగంబుపై వృగేం
ద్రంబెక్కినచక్కని నారోహించి మిక్కిలి పదనుగల తననందకంబనుకత్తితోఁ గసి
దీఱఁ దత్కంధరంబుననఱుక నుద్యుక్తుండగుట రుక్మిణి వీక్షించి భ్రాతృవధకు
ఖిన్నయైవగచుచు శ్రీహరిచరణారవిందంబులపై వ్రాలి వినయభయంబులతో నిట్లు
ప్రార్థించె. ౨౫౬

స్రధువకోకిల॥ భువననాయక! పుణ్యపూరుష! పూతజీవితభావితా!
భవగదాళిభిషగ్వరా! భవపద్మయోనిసురేశ్వర
స్తవనపాత్ర! యమిత్రభంజక! జ్ఞానరూప! దయానిధీ!
యవనిభారహృదగ్రగణ్య! రమాదిసాధ్వీమనోహరా! ౨౫౭

తే॥ నీవు యోగీశ్వరాగమ్యదేవుఁడవుగ నీమహిమము నెఱింగెడి నేర్పులేక
ప్రతిఘటించిన నా యన్నబాహుశాలి సాలభుజు స్యాలకునిఁ జంపఁజనదు నీకు

చ॥ అని వినుతింపఁ గత్తిచెలి యన్నకునై మొఱవెట్టుదానిఁ గ
గనులను నీరునీరధిఁ గగాఱ్చు పవిత్రను రుక్మిణిన్ స్వభా
ర్యనుగని చింతమానుము త్వదగ్రజుఁడో బ్రతుకంగలండటం
చు నుడివి తత్కిరీటముఁ ద్రుంచి చులకన జేయఁ దలంచి నవ్వుచున్. ౨౫౯

శా॥ బావా! రమ్మని తెల్పుటట్టి మనము బల్మిం గ్రహించి గద్దించి ఘా
రావిర్భావిత ఖడ్గముం గొనుచు వక్త్రక్షితి కేశంబులన్
జేవన్ ఖడ్గమున న్వొనర్చి వడిగా చెవనే సీరాయుధుం డప్పుడే
యూ వైదర్భుని సేనఁ జంపి తమితోనంచ్చోటికే తెంచియున్. ౨౬౦

—♦ బలరాముండు సహోదరభిన్నయగు రుక్మిణి నూఱడించుట ♦—

ఉ॥ కాంచి వివర్ణరాట్సుతు మొగంబు దయామతి వానికట్లులన్
ద్రెంచి యిదెంత చెడ్డపనిఁ దేరఁగఁ జేసితివోరి కృష్ణ! హిం
సించుట యింతకంటెఁ గడు శ్రేయముఁ గూర్చెకిసేత గాదె మో
జించుమ! పాడియానొకో? యిసీ యనరే! మనలోకులెల్లరున్. ౨౬౧

తే॥ మనకు బావయు రుక్మిణీవనితకన్న పూజనీయుఁడునగు రుక్మిభూమిధవున
కట్టి మానభంగము ఘటియింపదగునె? యనుచు ఖిన్నయౌ వైష్మికి నిట్లనియె నిట్లు.

వ॥ కల్యాణీ! నీ ప్రత్యక్షంబునం గృష్ణకృతంబగు సహోదరమానభంగంబు నకు సహింపుము వగవకుము. నా వాక్యంబు లాకర్ణింపుము. ప్రియంబుగాని యప్రియంబుగాని కాలాధీనంబులై యుండు. తత్కాలంబు చక్రంబువిధంబునం బరిభ్రమించుచుండు జీమూతంబులు మారుతంబునకువశంబైనట్లు జగంబు కాలంబునకధీనంబై యుండు అయ్యది భగవత్స్వరూపంబు తత్కారణంబుననే యది యనుల్లంఘ్యంబు. అహంమమేతిభావంబు జగద్బంధకారణంబు తదన్యంబు మోక్షంబు. సుఖదుఃఖంబులు పురుషాత్మవిభ్రమంబులుగాని యితరంబులుగావు. మిత్రుండనియు, నమిత్రుండనియు, నధికారియనియు, దాసుండనియుఁ దలంచుట సంసారఘోరతమంబున సంభవంబైనదని తెలిసికొనుము. కాన ననంతంబగుచింతను మాని స్వస్థంబగు మనంబుతో సుఖింపుమని యనేకవిధంబుల నూఱడించి పరాజితుండగు రుక్మికింబూర్వోక్తంబుగాబోధింప నాతండు వారిని వీడ్కొని విఫలమనోరథుండగుట తత్కృతస్వాకారవికారంబునకుఁ జింతించుచుఁ దపంబొనరింప సంకల్పించి వనంబునకుంజన నుద్యమించి మంత్రివరులచే నాగి కుండినపురప్రవేశంబు జేయక భోజకటకంబను పురంబునకరిగి వాసంబుఁ గావించె. అంత ౨౬౩

తే॥ వైష్మివై మనస్యంబును బాఱఁద్రోలి
యలరుహారి జయదుందుభుల్ సెలఁగ రామ
సహితుఁడై రుక్మిణింగూడి సకలయాద
వులును వెన్నాడ ద్వారకాపురికి నరిగె. ౨౬౪

—♦ శ్రీకృష్ణుండు ద్వారకాపురంబున రుక్మిణిం బెండ్లాడుట ♦—

వ॥ అంతఁదన్నాగరులు రుక్మిణీకాంతాతత్క్రాంతాగమనంబు విని తమ దివ్య సదనంబులంబన్నీట నలికి సుగంధద్రవ్యంబులంజిలికి కర్పూరంబుల ముగ్గులంబెట్టి పరిమళత్పుష్పహారంబులతోఁ దోరణంబులందుఁ దోరణంబులంగట్టి నవ్యాంబరాభరణంబులందాల్చి నీరాజనంబులంబట్టి బంధుమిత్రపరివారసహితంబుగా వీణావేణుమృదంగపణవధక్కాదిసకలమంగళవాద్యంబులు మ్రోఁగుచుండ వారాంగన లభినయపూర్వకంబుగానాడుచుండ గురుకవివిబుధులాశీర్వదించుచుండ నెదుర్కొనిసర్వవిధాలంకృతిసమలంకృతంబై యమరావతీపురోపమంబై భూమండలమండనాయమానంబై కరితురగరథరథిపదాతిరాజివిరాజితంబై సర్వభూకాంతసంతానని షేవితంబై సకలకళాకరంబై నరఖేచరసన్నుతంబై యాదవనివాసంబై చెన్నుమీఱు ద్వారకాపురంబునం దూరేగించి తన్నందనందనసుందరమందిరంబునకుం జేర్చి యంత మార్గశిరమాసంబందు శుభతిథినక్షత్రయోగకరణవిశిష్టంబగు సుముహూర్తంబునఁ బరిమళత్పుష్పహారాభిరామంబును, వివాహసంభారసంభరితంబును, క్రముకకదళికాప్రవాళనారికేళాదిబద్ధంబును, భూసురబంధుమిత్రబంధురంబును, మంగళవాద్యహృద్యంబును, సువాసినీశోభితంబునగు కల్యాణమండపంబుసం బ్రవేశించి.

మ॥ వనజాక్షుండు వివాహమాడె విలసత్సర్వాంగభసద్రూపిణిన్
ఘనతాపావనతాసుశీలగుణితా గంభీరతాధారిణిన్
ధనధాన్యస్థితికారిణిన్ దురితకృద్దారిద్ర్యసంహారిణిన్
వనజాక్షీమణి రుక్మిణిన్ నిజమనః ప్రాప్తోరుసంచారిణిన్. ౧౬౬

తే॥ హితులు సామంతులున్ ధరాపతులు బంధువులును జీనిచీనాంబరభూషణ
తురగరథములు మొదలగు కరదములను రుక్మిణీకృష్ణుల కిడిరి మ్రోలకేగి.

క॥ అందుఁదన్నగరంబున నందునినందను వివాహనవమహామున కా
నందముఁబొందిరి ఘనఫలబృందము ఘటియించు దీనివినిన జనులకున్ ౧౬౭

తే॥ రుక్మిణీవివాహంబును రుచిరఫణితినాడియుంటిని మఱి హరికైన యితర
పరిణయంబులఁగూరిచి పలికెద నివి సావధానంబుగా వినుమయ్య జనక! ౧౬౮

—♦ శ్రీకృష్ణుండు సత్యభామాదిసతులం బెండ్లాడుట ♦—

క॥ సరసుఁడు సత్రాజితుఁడాయరుణునిచే దచ్చిమణుఁగులవరంజిని వా
సరవాసరమున నీనుచు నెఱిమెఱయుస్యమంతకమణినింగొనె భక్తిన్.

ఉ॥ అయ్యది రాజధార్యముగ నాత్మకుఁ దోఁచుట జక్రపాణి యా
యయ్యను నుగ్రసేనునకు నాదృతిఁగానిడుమన్న నాతఁడుర్
గొయ్యతనంబునన్ ధనమె గొప్పదటంచుఁ దలంచి నెమ్మితో
నియ్యక పోయె నయ్యదుకులేశునకున్ హరికోనరేశ్వరా! ౨౮౧

తే॥ అట్టి సత్రాజిదాఖ్యున కనుఁగుఁదమ్ముఁడగు ప్రసేనుఁడు తన్మణిఁ జక్కనిడి
సైంధవంబగు నశ్వంబు సరగ నెక్కి వేఁటఁ జేయంగఁ జనెనొక్క విపినమునకు.

తే॥ చనిన యాతనిన్ సింహంబు చంపి మణిని సంగ్రహించి గమించె డీసమయమందు
జాంబవంతుండు దానినిన్ జంపి మణినిఁ గొంచుఁ జెంతనుగల తనగుహనుదూరె.

క॥ అంతట సత్రాజితుఁడు స్యమంతకమణిఁ దాల్చి చనిన మా ప్రసేనుం
డెంతో కాలమరిగిన నిశాంతమునకు రామిఁగాంచి సభనిటుఁ బలికెన్. ౨౮౪

తే॥ తోడులేక నాతమ్ముఁడు దొడ్డవనికి మణిని ధరియించి యేగె నా మానిఁ దఱిగి
దానిపైఁ గన్ను వేసిన తద్ధరి యది సంగ్రహించె నిదెంత మోసంబొ కనుఁడి!

వ॥ అంతట భగవంతుండా వృత్తాంతంబంతయు శ్రవణతాడితంబుగాఁ దన
కాపాదించిన యపనిందం బోఁగొట్టుకొనం దలంచి నగరజనంబుతోఁ గూడ ద్వారకా
పురినుండి వెడలి యెల్లయెడలఁ దిరిగి యన్వేషించి యెట్టకేల కా యడవికేగి ప్రసే
నాశ్వసింహాకళేబరంబులు పడియుంటం జూచి కాలిజాడలం బట్టి యా జాంబవంతు
గుహలోనికొంటిగాఁ బ్రవేశించి యవ్వానితో నిరువదెనిమిదిదినంబులు విరామంబు
లేనిపగిది యుద్ధంబొనరించి జయింప నా భల్లూకవల్లభుం డాతని మహాప్రజ్ఞాభిజ్ఞ
తాగంభజయంబుల కుల్లంబునం బెల్లు సంతసిల్లి భగవంతుండేయని నిరూపించి తన్మణి
సహితంబుగా గుణవతియుఁ గోమలాంగియునగు జాంబవతియను తన తనయను బారి
తోషికంబుగా నిడి ధన్యునిఁగా జేయుమని ప్రార్థించుచు మొక్కి నక్కమలాక్షుం
డక్కటికంబున నాతని మన్నించి మణికన్యకామణిసహితంబుగా ద్వారకాపురంబున
కేతెంచి యపశ్రుతిమోపిన సత్రాజిత్తుం బిలిపించి కొమ్మని యామణి నొసంగి నిష్క
ళంకుండయ్యె. అంత నతండు వ్రీడితుండై యా గోపాలుపాలికిం బోఁజాలక తదా
గ్రహప్రశమనార్థంబై యాశ్యమంతకమణి నిడి నిరుపమానలావణ్యయు నిజపుత్రియు
నగు సత్యభామయను భామినీలలామంబు నాతనికిం బాణిగృహీతిగా నొసంగి చరి
తార్థుండయ్యె. వెండియు ౨౮౬

క॥ అండజవాహనుఁ డొకపరిఁ బాండవులను జూచి తోడుపడుటకుఁ గరుణా
ఖండయి యింద్రప్రస్థ మఖండగతిన్ జేరి యేడుగడపియు నచటన్. ౨౮౭

మ॥ నరుతోఁగూడ శతాంగమెక్కి మధురార్ణ్రభ్రాజదానాహ భా
స్కరపుత్రీతటమందు వేఁటసలుపంగాఁబోయి యచ్చోట దు
ష్కరమైనట్టి తపంబుఁజేసి వరముంగాంక్షించు కాళిందినిం
గరుణన్ గాంచి సఖుండు సూడఁగొనియేగన్ సాగె స్వస్థానమున్. ౨౮౦

తే॥ అట్లు ద్వారకాపురిఁజేరి యచ్యుతుండు విధివిధానంబుగాఁ దమిఁబెండ్లియాడ
భైష్మినిం గొన్నయట్టు లవంతికాంతుపట్టి మిత్రవిందఁగొని వివాహమాడె

తే॥ అవల నగ్నజిదాత్మజయైన సత్య సప్తగోవృషంబులఁదిప్పి శాస్త్రరీతిఁ
బరిణయంబయ్యెఁ గృష్ణుఁడు సురలునరులు జుట్టములుమిత్రులునుజేరి చూచుచుండ

తే॥ పిదప శ్రీహరి కైకేయిబిడ్డ పూర్ణచంద్రబింబాభముఖబింబఁ జతురమతిని
భద్రయన్ గన్నెఁ గాళిందివలె గ్రహించి పెండ్లియాడెను వేదోక్తవిధిగ జనక!

ఉ॥ ఆ నరమిత్రుఁడావల స్వయంవరమందున మత్స్యయంత్ర మ
న్యూనబలానఁగొట్టి పగ నుక్కురులన్ దెగటార్చి వే బృహ
త్సేనునిపుత్రికామణి సుశీల సులక్షణయుక్త లక్ష్మణన్
బూనికఁ బెండ్లియాడె శ్రుతిబోధితరీతి మహోత్సవంబుగాన్. ౨౮౧

చ॥ మఱియుఁ బదాఱువేలుగల మానినులన్ మృధరంగమందునన్
నరకనిశాచరున్ వధమొనర్చి గ్రహించిన వందమందినిన్
దరుణుల రాజపుత్రికలఁదద్దనుజాయతబంధముక్తలన్
బరిణయమాడె వెన్నుఁడొకపట్టుననే తగి పెక్కురూపులన్. ౨౮౩

తే॥ మఱియు శౌరియాసతులకు మందిరముల వేఱువేఱుఁగగట్టించి స్వీయమాయఁ
బెక్కుతెఱఁగుల విహరింప డక్కొనెఁగద యాతనికి దుష్కరంబైన సేఁతగలదె?

చ॥ పదపడి కృష్ణమూర్తి కలభామల నొక్కొక్కదానియందునన్
బదుగురు పుత్రరత్నములు బాహుబలుల్ కరుణాగుణాకరుల్
గొదకొనికల్గి రందఱు ముకుందునిఁ బోలుచునుందు రాకృతిన్
మదిమది తీవితేవలను మాటలనీటులఁ బాటవంబునన్. ౨౮౪

తే॥ మొట్టమొదటను రుక్మిణిన్ బుష్పబాణుఁ డనతరించెను బ్రద్యుమ్నుఁడనెడిపేర
నతఁడు సర్వలక్షణములన్ హరినిఁబోలి ముజ్జగముల రూపసియయిపొల్పుఁగాంచె.

వ॥ ఇట్టితరుణంబున శంబరుండను నొకయసురుం డాబాలకుండు తనకు మార
కుండని యితరులచేవిని కామరూపియై యా పురుటింటిలోనికింజని యా శిశువును
సంగ్రహించుకొనివచ్చి సముద్రంబునంబడవైవ నాచిఱుతయొక్క మహామీనంబుచే

మ్రింగఁబడినను మృతుండుగాకయుండె. అంత నమ్మన్మథాంగియగు రతీదేవి నిజమనోవిభూదంతంబు నెట్లో యెఱింగి నిరీక్షించి దైవవశంబున నమ్మీనగర్భంబు నుండి వెల్వడిన మగనింగని కొని పోషింప నతండు దినక్రమంబున నారూఢయౌవ నుండై జగన్మోహనుండై చెన్నారుచుఁ దచ్ఛంబరకృతమహాకృత్యం బెఱింగి కినిసి యా దనుజుంజంపి మాయావతియను పేరంబరగు తన సతియగురతితోఁగూడ ద్వారకాపురికే తెంచి తలిదండ్రులగు రుక్మిణీకృష్ణులకు నమస్కరింప నవ్వారలత్యా శ్చర్యానందంబులం బొందిరి. వెండియు నా మన్మథుండు భోజకటపురంబునం జరుగు స్వయంవరంబున కరిగి భీష్మకపుత్రుండగు రుక్మిపుత్రికామణిని వరించి యథావిధిగాఁ బెండ్లాడి యయుతగజబలుండును, శౌరి దేందీవరసన్నిభుండునునగు ననిరుద్ధుంగాంచె. ఇతండు బ్రహ్మాంశుని యెఱుంగుము. దేవరా! సంపత్ప్రదంబులును, సర్వపాప హరంబులును, బుణ్యాకరంబులునగు శ్రీకృష్ణుని వివాహవృత్తాంతంబులు సాంతం బుగా వినిపించితి. మఱియు నేమివినమనసుగలదో తెలుపుమనిన నాబహులాశ్వుం డలరి యిట్లనియె.

—♦ నారదుండు ద్వారకాపురాగమనహేతువులఁ జెప్పుట ♦—

మ॥ జగదీశుండు పరాత్పరుండు హరి యిచ్చ్చన్ జేరి తద్ద్వారకా
నగరిన్ బాలనజేసెనార! యహహా! నాబుద్ధి కాగ్రామమే
జగదాద్యంతవిరాజితాఖిలపురీసారస్యమై ధన్యమై
తగెనం చెంతయుఁ దోఁచెడిన్ గుణిమణీ! దైవర్షిచూడామణీ! ౨౮౮

తే॥ నారదా! యట్టిద్వారక శౌరి దేహజనితమంచు నాలించితిన్ శ్రవములార
నేటికది యిటకేతెంచె? నెపుడువచ్చె నద్దినోడువుమ! యన మునియనియె నిట్లు.

ఉ॥ భూతలనాథ! యి త్తఱిని ముచ్చటజేసిన ప్రశ్నయోగ్యముల్
బాతకనాశకం బఖిలభావుకదంబును గాన విన్ముశ
ర్యాతియనన్ మనూద్భవుఁడు రాజిలి రాజ్యము సార్వభౌముఁడై
ప్రీతిగనేలె నేండ్లుపదివేలగుదాఁక ననర్గళంబుగాన్ ౨౯౦

తే॥ నలిగ నుత్తానబర్హియానర్తభునుఁడు మఱియు భూరిషేణుండు నా వరకుమారు
లాతనికిఁ బుట్టి రంత నానేత యొక్కతఱిని నిట్లనెఁ బుత్రులన్ దరికిఁబిలిచి.

తే॥ ప్రథమసుత! నీవు ప్రాగ్దిక్కుఁ బాలనంబు
సలుపుకొనుమోయి యానర్త! శమనదిశను
నేలుకొను! భూరిషేణ! పాలించుకొమ్ము!
పశ్చిమస్థితదేశంబు వాసితోడ. ౨౯౨

ఉ॥ పుత్రకులార ! వారినిధిముద్రితముఁ వరరత్నగర్భయుఁ
స్తోత్రసమర్థముఁ నగరదుర్గవనాచలయుక్తమైన యీ
ధాత్రిఁజిరంతనంబుగను దద్దగడించితిఁ జక్రవర్తినై
క్షత్రియనీతినేలితిని గావున మీరలు నట్టులేలుఁడీ! ౨౯౩

తే॥ నావుడు ద్వితీయపుత్రుఁడానర్తవిజ్ఞుఁ డాత్మజనకవాక్యంబుల నాలకించి
నగెడినరుఁబోలె జెలఁగి జ్ఞానమయమైన పలుకులిట్లాడె ధీరుఁడై పార్థివేంద్ర !

ఉ॥ నీయదిగాదు ధాత్రియిదె నీవిదియేలఁగ లేదొకప్పుడుఁ
నీ యలఘుప్రవీణతను నిల్వఁగలేదిది నీ బలంబుచే
నీయది గెల్వఁగాబడ దిఁకెందులకిట్టులఁ జీటిమాటికిఁ
నాయది నాదియంచనెదు ? నాయన ! కాని గ్రహింపు మీనుడుల్. ౨౯౫

ఉ॥ కృష్ణుని దీధరాతలము కృష్ణుఁడు దీనిని నేలునెప్పుడుఁ
గృష్ణబలానలిచ్చె నిది కృష్ణుఁడు దీనిగడించెఁ దేజునఁ
గృష్ణుఁడె విశ్వమంతయు సృజించునుబ్రోచును సంహరించు నా
కృష్ణునితోడఁ బోలుటకు నెవ్వఁడురాఁగలఁడోయి నాయనా! ౨౯౬

సీ॥ ఎతఁడు భూతంబులనెలసి యాశ్రయుఁడయ్యె నాతఁడె విశ్వరూపాధియజ్ఞుఁ
డెతనిభయంబున నినుఁడు వెల్గుచునుండు నతఁడె సంపూర్ణతమానతారుఁ
డేతనిభీతిని వాతమువీచెడి నాతఁడె గోలోకనేతృ తేభ్యుఁ
డేతని వెఱపున నిందుగ్రిందువర్షించు నాతఁడె కాలత్రయస్వరూపుఁ

తే॥ డెతఁడచేతనములకు నధీశుఁడయ్యె నతఁడె వసుదేవపుత్రకుఁడయ్యె నెతఁడు
భక్తవత్సలుఁడాతఁడే బ్రహ్మమల్లకృష్ణుఁగొల్వు! మహంకృతి నెత్తివేసి.

తే॥ అతనిఁగొల్చిన నాముష్మి కైహికములు గల్గితీరెడిఁగావునఁ గదలకుండ
మనముబిగబట్టి సేవింపుమా ! మఱొండుమాటలాడకుమోతండ్రి ! మానవేశ!

తే॥ అంతశర్యాతి సుతవాక్యరాహతుఁడయి
జ్ఞానియయ్యును దోఁకఁద్రొక్కంగఁబడిన
పామువలెలేచి కిన్కతోఁ బ్రస్ఫురదధ
రుఁడయి యానర్తసుతునకు నుడివెనిట్లు: ౨౯౯

చ॥ మొఱఁగెదవేల యొజ్జవలె ? బుద్ధియొకింతయులేదె నీకిసీ !
తొరగఁదొలంగు మావలకు దుష్ట ! యితఃపరమందు నీవు నా
ధరణివసింపఁగూడదు యథావిధిగానిక నట్టికృష్ణునిఁ
మురిపెముతోనుతింప మలబుద్ధిమదగ్రణి యిచ్చు సర్వముఁ. ౩౦౦

తే॥ అనవుడానర్తుఁడుర్వి మఱి యునియె నిట్లు జనక ! నీదగుధరను వాసంబునాకుఁ
గల్గకుండుతయని యటఁగదలి కడలిఁజేరి నీటిలోఁదపమును జేయుచుండె.

వ॥ ఇట్లు పదివేలవర్షంబులు గడవ నా కడలియుల్లంఘాతని ప్రేమలక్షణంబగు
భక్తికిమెచ్చి ప్రసన్నుండై వరంబుఁగోరుమని యడుగ నా భూపుండు ముకుళితకరా
రవిందుండై లేచి తచ్చరణసరసిజంబులపై వ్రాలి పులకితగాత్రుండై. 30౨

పంచచామరము। అనాథనాథ ! రాధికాధవా ! ధరాధరోద్ధరా !
జనార్దనా ! మహానుభావ ! శంఖచక్రభాసురా !
ఘనాఘనాభ ! లోకనాథ ! కాంచనాంబరాంచితా !
యనంతపద్మమాది ! యవ్యయా ! దయోదయోదయా ! 303

తే॥ వాసుదేవ ! మజ్జనకనిష్కాసితుండననుచు నిన్ను సేవించితి నన్న మేమి
వెఱపులేదు దయానిధీ! విపులరాజ్యమొసఁగి రక్షింపుమో కృష్ణ! యనఘచరిత!

తే॥ అనఁగ దీనసంరక్షకుఁడతని వినయనయభయంబుల కలరి యానర్త ! నీవు
తండ్రికింగాని రాజ్యంబు ధాత్రిలేదె యైన నీ ప్రార్థనంబున నరసి నేను. 30౫

క॥ నైఋతమునుండియు లక్ష్మీశ్రీకరశతయోజనపరిమితదేశంబుల్
నీకై పంపెదఁగొనుమీ ! చీకాకీకరణి నీవు సెందుటయేలా ? 30౬

వ॥ అని చని తనలోకంబునుండి నూఱామడలచోటును వెల్లగించుకొనివచ్చి
కల్లోలకోలాహలభరితంబగు సముద్రంబునందుఁ సుదర్శనచక్రధారియై నిలిపి యాతని
కియ్య నయ్యానర్తుండానందంబుఁ బొంది లక్షవత్సరంబులు గడచునందాక. 30౭

చ॥ కరముగనేలె నాయవని గాథయశోధనధాన్యపుత్రపౌ
త్రరుచిరధర్మకృత్యతిథితత్పరతాకవితాప్రగల్భతా
పరమపదార్థతాఘటన పద్ధతిసిద్ధ్యనుకూలవిజ్ఞతా
భరకృతకృత్యసత్యబుధవాక్సమవృష్టిసుపుష్ట మానటుల్. 30౮

తే॥ ఇట్టిసంగతి శర్యాతియెట్టులోవించు
బొమ్మబాఁదుకొనెఁ వింతఁ బిమ్మట నల
యవని యానర్తసంచితమగుటచేతఁ
బ్రథితిగలిగెను "నానర్తరాజ్య"మంచు. 30౯

తే॥ అతనికిఁగల్గె రైవతుఁడనెడి తనయుఁ
డతఁడు శ్రీశైలతనయుని దుహితముతోడఁ
బెఱికి యానర్తధరఁ బడవేసె దాన
నద్ది "రైవతగిరి"యని ఖ్యాతికెక్కె. 3౧౦

క॥ ఈ రైవతుఁడె కుశస్థలి చారుపురిం జక్కనేలెఁ జతురాస్యుదరిం
జేరియు వడిగియు నిజసుత నా రేవతిని బలునకిచ్చినట్టి డితండే. ౩౧౧

క॥ ఈ సంగతి మున్నాడితి నీ సముచుంబందు నింక నేమివి నెదవో
వాసిగఁ దెలియంబలుకుము! వీసంబేని విడువకుండ వివరింతుజుమా. ౩౧౨

ఉ॥ నావుకు జేఁడిటుల్ నుడివె నారద! యిత్తఱి ద్వారకాగమం
బీవు సకారణంబుగ వచించితివయ్యది వ్యక్తమయ్యె ద్వా
రావతినున్న తీర్థనికరంబా యెఱుఁగకపోతి లేశమేని
గావున వానినింగుఱిచి క్రమతరంబుగఁ జెప్పుమా! యనన్. ౩౧౩

## గోమతీనదీమాహాత్మ్యము

ఉ॥ నారదుఁడాడె నిట్లవనినాయక! విన్ముప్రభాసతీర్థరా
ట్తీరవిరాజమానమయి దివ్యమునై శతయోజనంబు లిం
పారెడి ద్వారకాపురిని నాడినఁబాడిన విన్నఁగన్నఁ బ్రో
ల్వారినఁ బ్రాణముల్ విడిన నవ్యయమోక్షముఁ జెందు నెట్టిఁడేన్. ౩౧౪

క॥ శ్రీవిభుఁడొకపరి భక్తుని రైవతునిం బ్రీతి మోదరాజితుఁగని సం
భావితదర్శనమిచ్చుచు శీవిని ముజ్జలములిడెఁ గడిందినిఁ గనులన్. ౩౧౫

తే॥ అట్టి నీటిబొట్టులు వడి యచట "గోమతి" యను పృథునది జనియించె దివ్యధాటి
నద్ది సూచినమాత్రనే యంతరించు బ్రహ్మహత్యాదిపాతకపంచకంబు. ౩౧౬

తే॥ గోమతీతీరజము రజంబేమనుజుఁడు శిరమునందాల్చునో యట్టినరుఁడు నూఱు
బాములను జేసిన సకలపాపములను విడుచునిందున సంశయపడఁగవలదు. ౩౧౭

క॥ గీమునవో చెఱువుననో యేమూలనొ స్నానమాచరించిన వేళన్
"గోమతి" యని పలికినచో. గోమతిమునిఁగినఫలంబుఁ గొనఁగలఁ డెవఁడేన్

చ॥ రవి మకరంబునందుఁ గుదురన్ దమి మాఘమునం బ్రయాగమున్
దవిలి మునుంగువారలకుఁ దప్పకకల్గు శతాశ్వమేధసం
భవఫల మంతకంటె నల పావనగోమతిలోన మున్గు మా
నవులకు వేయిరెట్టులుగ నవ్యఫలంబు ఘటించు భూవరా! ౩౧౯

## చక్రతీర్థమాహాత్మ్యము

వ॥ గోమతీధునీమణియందునం జక్రతీర్థంబను నొండుగలదు. అందుఁ బాషా
ణంబులు చక్రత్వంబునుబొంది పూజనీయంబులగు. అట్టి చక్రచిహ్నకరంబగు చక్ర

తీర్థంబున నేనందు ద్వాదశిని జలకమాడునో యానరుండు చక్రపాణిదివ్యపదంబుఁ జెందంగలఁడు. పతితుండేనిఁ బాతకుండేనిఁ దత్తీర్థతీరవిరాజమానసోపానంబుపై నడు గిడినంతఁ గోటిజన్మదురితంబులచే విముక్తుండై జీవన్ముక్తిం బొందుననివాక్రువ్వ నాబహులాశ్వుం డలరి మునివరా! తచ్చక్రతీర్థంబు తాదృక్ఫలప్రదంబై తద్గోమతీ తీరంబున నెట్లు ప్రాదుర్భవించెనో యానతిచ్చి వేఁడు నా మానసమ్ముం డించుల కొండు పురాతనేతిహాసంబుఁ దెల్పెద నాకర్ణింపుమని యిట్లనె. ౩౨౦

తే॥ నవనిధీశుఁడు గుహ్యకనాయకుండు రాజరా జలకేశుఁడు త్ర్యంబకసఖుఁ
డగు కుబేరుఁడు వైష్ణవంబగు సవంబు రజతగిరి కుత్తరధర నారంభమిడెను.

తే॥ మఖమహోత్సవమునకు నామంత్రణంబుఁ జేయ నారాయణుండును జెచ్చెరఁ దన
దండివైకుంఠధామంబునుండి వెడలి యజ్ఞవాటికకేతెంచె సతినివెంట.

చ॥ రవి శశి భౌమ సౌమ్య గురురాక్షసనద్గురుమంద రాహు కే
తు విబుధజంభభేది విధిధూర్జటి చారణసిద్ధసాధ్య ది
గ్ధన సురమాని విప్రఋషిధాత్రి కుబేరసుతాదిఖీదు లా
సవమున కేగుదెంచిరి వెసన్ స్వకలోకసమేతులై విభూ! ౩౨౩

తే॥ వీరభద్రుఁడా యజ్ఞము వేయికనులఁ గాచుచుండెను దత్సేవ గజముఖుండు
సలుపుచుండెఁ దత్పరివేషముల నొనర్పఁగా మరుద్గణములుకొల్పెఁ గాశ్యపీశ!

తే॥ బాహులేయుండు ధర్మతత్పరత సభను సముచితంబుగ భక్తితో సత్కరింప
బయలుదేరె ఘంటానాదపార్శ్వమాళులను కుబేరుమంత్రులు దాతలై రిధీర!

తే॥ మఱియుఁ గార్యనిర్వాహకుల్ మాటరాని
పగిదిఁజూడంగ యజ్ఞంబు ముగియ ధనదుఁ
డవబృథముఁజేసి దక్షిణ లగ్రజులకుఁ
బరమభాగంబు సురలకుఁ గరమొసంగె. ౩౨౬

ఉ॥ ఈ సమయంబునన్ గినుక నింధనపత్రమ్మృగాజినోరుద
ర్భాసనకుండిదండములనంది పదంబులఁదాల్చి పాదుకల్
మీసలఁద్రిప్పుచున్ నొడుగుమీఁదవెలుంగ జడల్ సెలంగ దు
ర్వాసుఁడు తన్మఖస్థలికివచ్చెఁ గృశుండు గృశోదరుండునై. ౩౨౭

తే॥ అట్లువచ్చిన దుర్వాసునైలబిలుఁడుగాంచి యెదురేగి భక్తినర్ఘ్యంబుఁ బాద్య
మునిడి పూజించి భయభీతమనముతోడ బద్ధహస్తారవిందుఁడై పలికెనిట్లు.

మ॥ ఫలితంబయ్యె మదీయజన్మమిపుడే ప్రాజ్యంబుమద్రాజ్యముల్
ఫలితంబయ్యెను నామయాగమును ధన్యంబయ్యె నిచ్చోటి కీ
రలు దోడ్తెంచుట నా నతుల్గొనుచు దుర్వాసా! మునీంద్రా! తమో
విలయప్రౌక్ష! మహానుభావ! దయతో వీక్షించి రక్షింపుమా! ౩౨౯

క॥ అని వినయంబున వేడగ మునివరుఁడానందమొంది పుణ్యజనేశా
నున కిటుబలికెను దనమోమునఁ జిఱునగవొప్పుచుండ భూభుజవర్యా! ౩౩౦

చ॥ నరవరవాహనుండవు ఘనప్రతిభాప్రథితుండ వర్థసం
భరితుఁడ వగ్రజన్మబహుభక్తియుతుండవు రాజరాజ వు
ద్ధురతరదానశౌండుఁడవు ధూర్జటిమిత్రుఁడవీవు శ్రద్ధ ని
త్తఱి హరిమెచ్చుజన్నము యథావిధిగా నొనరించియుండవే! ౩౩౧

ఉ॥ ఏ విషయంబునదెదియు నీవఱకడ్గియెఱుంగఁ గొమ్మటం
చీవయినన్ దృణంబయిన నిచ్చి యెఱుంగవు నాకుఁగావునన్
నీవె వినుత్యదాతవని నెమ్మదినమ్మియు నిప్డుయాచనన్
దీవిగఁజేయుచుంటిని గడిందిగ దీసనొసంగుమో సుధీ! ౩౩౨

తే॥ ఇడినచో నీకు వరములనియ్యఁగలను నిడనిచో నిగ్రహించి శపించి నిన్ను
బూదిసల్పెద నీభావమునఁ దలంచుకొని యొనర్పుము! కనుము! నాకోర్కి వినుము!

చ॥ నవనిధులిట్టి నీదు సదనంబున నుండెనుగాదె వానినిన్
బ్రవిమలబుద్ధితో నొసఁగి భద్రముఁబొందుము! వానిఁజెంద నీ
సవిధముఁజేరియుంటిఁగద! సాంబసఖా! యననయ్యుదారుఁ డ
య్యవి యిడ నొప్పితిన్ మునివరా! యనియిచ్చుట కుద్యతుండుగాన్. ౩౩౪

క॥ దానాధ్యక్షులయిన ఘంటానాదుఁడు పార్శ్వమాలి డక్కొని ధనదున్
మానిపి ధనమోహితులై యీ నెఱివచియించిరో రమేశ్వరభక్తా! ౩౩౫

శా॥ ఆఱుంబిడ్డలులేని యీపిసినికేమయ్యా! నిధిశ్రేణి ని
ట్లేలాయిచ్చెద వద్ది మాకుఁజెపుమా! యీ మానికీ వేళలోఁ
జాలన్ లక్షధనంబొసంగి యిఁకఁ దజ్జన్మంబు సొంతంబుగాఁ
బౌలస్త్యా! కొఱలేనియట్టులుగ శేవన్ గాంచి పోషింపుమా! ౩౩౬

చ॥ అటు పరుషంబుగాఁబలుక నా ముని యుగ్రహవిగ్రహాగ్రుఁడై
కుటిలముగాఁగ భ్రూకుటి నకుంఠితరీతినొనర్చి కన్నులు
త్కటముగ నెఱ్ఱబాఱఁగనఁగా నిమిషద్వయ మెల్ల లోకముల్
దటతట స్థాలికైవడిని దద్దఁజలించె నుతించె యక్షుఁడున్. ౩౩౭

తే॥ అంతఁ దన్మునినాయకుఁ డా కుబేరుఁడట్టుల నభివాదనాదుల నాచరించు
చుంటఁగని తలయూఁచి యాతంటలాడు సచివులన్ శపియించె నీసరణి జనక!

క॥ తులువా! ఘంటానాదా! పలుఁగాకి! యలంజ! పిసిని! పాపమతీ! నీ
వలఘుగ్రాహమువలె ధనములను గ్రహించెదవు దాన ♦ మొసలివి గమ్మా!

ఆ॥ పార్శ్వమాళి! నీవు ♦ పరమనీచుఁడ వయి, ధనమదంబుచేత ♦ ధర్మమునిడి
ద్వీపములోలె మిగులఁ బ్రేరేపణ మొనర్తునందువలన వేగహస్తి గమ్ము.

ఉ॥ ఈసరణిన్ గుబేరసచివేంద్రుల శిక్షకొనర్చి యట్టి దు
ర్వాసుఁడు సమ్మతించి మనుజేశ్వరునిచే నిధులెల్లఁ గొంచు సం
తోసముచేత నాశ్రమముఁ జేరెను శక్తిప్రభావంబుగా నిధుల్
భాసిలఁ జేసియేగెఁ గను బ్రాహ్మణతేజసశక్తి యెంతదో! ౩౪౧

ఉ॥ ఈ రహిఁ మానిశాపహతి నిర్వుదు తత్సచివుల్ మనంబునన్
భూరివిచారదగ్ధులయి ప్రోచెడివాఁడలకృష్ణుఁడే యటం
చారసి వాని కాళ్ళఁబడి యార్తిఁ దలన్ మముఁగావుమన్న నా
శౌరియు నొప్పిచెప్పె నిటు సాంత్వనకారకదివ్యసూక్తులన్. ౩౪౨

ఆ॥ సచివులార! నాదుసముఖంబునన్ మీరు విప్రశాపహతిని వెతలఁ బడుచు
వచ్చియుంటిరట్టి బ్రాహ్మణవాక్యంబు వ్యర్థపుచ్చఁజాలనైన వినుఁడు. ౩౪౩

ఆ॥ బ్రాహ్మణోక్తరీతి గ్రాహద్వీపములుగాఁ బుట్టి పిదపనొకటి మొసలి మెప్పు
డాల మాడఁగలరొయపుడు నా కరుణచే స్వీయమైనరూపుఁ జెందఁగలరు.

వ॥ అట్లు గరుడధ్వజునిచే నుగ్గడింపఁబడిన యా ప్రెగ్గడలిరువురును జాతిస్మరణసంయుతంబుగా మకరకరిజన్మంబులెత్తిరి. అందు నక్రజన్మంబుఁ గాంచిన ఘంటానాదుండు రౌద్రంబును, భయంకరంబును, వికరాలంబునగు శరీరంబుతోఁ దగి తెగ్గో మతీశైవలినిం బ్రవేశించి విహరించుచు వర్తిల్లుచుండె గజేంద్రుండై పుట్టిన పార్శ్వమాళియుఁ దదాన్తర్దేశవిభాసమానరైవతాచలవనంబునఁ జతుర్దంతంబులు గలిగి ధనుశ్శతపరిమితప్రోచ్చపృష్ఠభాగంబునం జెన్నారి కజ్జలంబుతోఁ దుల్యంబగు వర్ణంబు సెలంగ వకుళవంజులపరివాళకురవకకుందమందారకోవిదారాసనార్జునబదరవేణు పాటలాశోకపిప్పరియామ్రమాతకామ్రక్రముక పున్నాగనాగరంగమాతులుంగ లవంగచంపకచందనజాతి పనసోదుంబరాశ్వత్థఖర్జూర భూర్జమన్మథతిలకమాలతీమాధవీగిరిమల్లికాద్యామోదితనికుంజకుంజపుంజంబులలో యథేష్టంబుగాఁ గరిణీసమూహంబుతో సంచరించుచు వైశాఖమాసంబునం దొకనాఁడు గోమతీధునిలో నవగాహనం బొనర్పసంకల్పించి చని తన్నదిలోనికిం దిగి యగాధప్రదేశంబుఁ జొచ్చి చిరకాలంబు

స్నానంబుఁజేసి తుండాదండంబున నీళ్ళతోఁ జెఱలాటలాడి యాత్మవల్లభలను జలక
మాడించి దరికిరానెంచు తఱుణంబున. ౩౮౫.

క॥ ఆగ్రాహము విధివశమయి యాగ్రహమున నచట నొప్పియాడు గజేంద్రుఁ
వ్యగ్రుఁడుగాఁబట్టఁగ సముదగ్రిబలుఁడు వాఁడొనర్చి యతిక్షీంకృతులన్.

క॥ చుఱచుఱనాలోకించును గరమునఁ బ్రహరించు మకరి గట్టెక్కుటకై
మఱిమఱిఁదలఁచును బోరిఁబోరిఁజరణంబును గుంజికొనును శక్తింజూపున్.

క॥ నక్రం బద్దానిని నిర్వక్రంబగు విక్రమమునఁ ద్వరగతిగలుగన్
వక్రించి నిజవసతికి నవక్రగతిని లాగికొనుచు వచ్చెను బిదపన్. ౩౮౭

ఆ॥ కరిపుఁజుట్టియున్న కరిణులుఁగలభముల్ విక్రమించి మొసలివేగఁబట్టి
దండితొండములను దద్దయుఁగొట్టియు గజవరేణ్యు సుంతగావవయ్యె. ౩౮౮

క॥ కరిమకరంబులు పిదప నొకరినొకరును నీడ్చుకొనుచుఁ గయ్యంబాడన్
జరిగెను నేఁబదివైయేండ్లరుదుగఁ జూపఱుగనంగ నవనీనాథా! ౩౯౦

ఆ॥ అంతమందునట్టి హస్తీంద్రుఁడే బహుబాధఁజెంది పూర్వభవవిధంబుఁ
దలఁచి ప్రేమలక్షణలలితభక్తితో విష్ణుమూర్తి నిట్లు వేఁడఁదొడఁగె. ౩౯౧.

మ॥ కరుణాసాగర! సాగరాత్మతనయాక్రాంతాత్మ! యాత్మేశ్వరా!
ధరణీభారనివారణవ్రతధరా! ధారాధరాభోజ్జ్వలా!
నరమిత్రా! శతపత్రనేత్రరుచిరా! నన్యశ్రుతిధ్యేయ! యో
పరమేశా! జగదీశ! యోవరద! నీపాదంబులం గొల్చెదన్. ౩౯౨

మ॥ ధనమున్ ధాన్యము ధర్మమున్ సవములున్ దంత్రంబు మంత్రంబు భూ
జనమున్ దేశము కాలమున్ దివిజులున్ సత్యంబుజ్ఞానంబు వే
దనికాయంబును శాస్త్రముల్ పృథుసముద్రంబుల్ మహాశైలముల్
వనముల్ సర్వమునీవెకాదె! దయ రావా! నన్నురక్షింపవా! ౩౯౩

తే॥ సాధుబృందావనాసక్త! చాఁగిలింత సత్యభామామనోహరా! చాఁగిలింత
శంఖచక్రగదాధరా! చాఁగిలింత లోకనాథ! నా మొఱవిని సాఁకరావె!

ఉ॥ శైవులుసాంబమూర్తియని సౌరులు సూరుఁడటంచు వైష్ణవుల్
శ్రీవిభుఁడంచు శాక్తులును శ్రీశివశక్తియటంచుఁ గార్మికుల్
భావుకకర్తయంచు శ్రుతిపారగవారము బ్రహ్మమంచు బౌ
ద్ధావళిబుద్ధుఁడంచు నిను బ్రార్థనఁజేయరె! భక్తరక్షకా!

ఉ॥ లావు రవంత లేదు కనులాకనరావు బలంబు సున్న నా
తావులఁ దప్పెఁ బ్రాణములు జప్పితి లెస్సగ నీ సరస్సునన్
దేవ! తటాలునం గనవె! దిక్కెవరింకను రావె! ప్రోవవే!
యీవె జగత్కుటుంబివయి యేలవె? యేకొఱ లేనటుల్ హరీ! ౩౫౬

తే॥ కృష్ణుఁడేఁ జేయు నీమొఱాలించుఁగాక! కాంచుఁగాక యిచ్చట కరుదెంచుఁగాక!
మించు నాపాపపాశంబుఁ ద్రెంచుఁగాక! మెచ్చి యభయవరముల నాకిచ్చుఁగాక!

వ॥ అని ప్రార్థింపనయ్యిందిరాకాంతుండు తన్ను ధ్యానించుచు శరణాగతుండైన మాతంగేంద్రుని మొఱనాలకించి కేవలభక్తత్రాణపరాయణుండై నిజవల్లభలతోడి సరససల్లాపంబులఁ బీడి చివ్వున లేచి సంసిద్ధుండై యున్న విహంగనాథు నెక్కి తీవ్రావంజన తద్గోమతీనదీస్థితగజస్థితిం గని కనికరించి యుగ్రమర్క దీప్తి దగ్గతి తేజోవిరాజితంబగు సుదర్శనచక్రంబుఁ దన్నక్రంబు ద్రుంపఁ బ్రయోగించె. హాని దైన్యంబు ప్రాప్తంబగుటకుఁ బూర్వంబు ధనంబు నాశంబైనట్లు తద్గ్రాహదేహంబు భిన్నంబగుటకు ముందు తదద్భుతకరశిరంబు ఖండీకృతంబయ్యె. పిమ్మట నచ్చక్రంబుచ్చైర్నాదంబుతో నజ్జలంబున మ్రోయుచు నందలి పాషాణంబులపై బడి చక్రాకారంబులుగా నానర్చుటచే దత్క్షేత్రంబున గదిమెసలు చక్రతీర్థంబను నామంబుగల్గె. తచ్చక్రసంఘర్షసంభవచక్రతీర్థదర్శనస్పర్శనంబులు బ్రహ్మహత్యాదినివారకంబులని యెఱుంగుము. మఱియు నా శ్రీకృష్ణుని యనుగ్రహంబున నా గజేంద్రుండును సైతము ముక్తశాపు వీడె. అట్లు కరిమకరరూపంబులం బరిత్యజించిన యా యిరువురును బూర్వాకారంబులం దాల్చి బద్ధాంజలులై హరిం జుట్టివచ్చి నుతించి నమస్కరించి సెలవుగొని యలకాపురికేగి కుబేరమంత్రిపదంబుల నధిష్ఠించి యథాప్రకారంబుగా నుండిరి. ప్రసన్నుండైన శ్రీకృష్ణుండును సురలు విరులం గురియఁ దద్దుందుభులు మ్రోయఁ బ్రకృతిపరంబగు నిజధామంబున కేగె. ఈ చక్రతీర్థోత్పత్తివృత్తాంతంబును, గజేంద్రమోక్షణంబును విన్న యన్నరులన్ని సుఖంబులఁ బొంది దుస్స్వప్నదుష్టఫలంబులఁ బోఁద్రోసి సుస్వప్నలాభంబులం బొరయంగలరని నుడివి శంఖోద్ధారతీర్థమాహాత్మ్యం బిట్లభివర్ణింపం గడంగె. ౩౫౭

## శంఖోద్ధారతీర్థమాహాత్మ్యము

ఆ॥ అఖిలపాపనాశమైన శంఖోద్ధారతీర్థమందు నెవఁ డుదీర్ణభక్తిఁ
గనక మిడునొ వాఁడు కలుషంబులన్ వీడి వాంఛలొంది పరమపదవిఁ జేరు. ౩౫౮

క॥ హరిభక్తుఁడు శాంతాత్ముఁడు సరసుఁడు త్రితుఁడ నెడమాని శార్దూలుఁడు ముక్
చరతీర్థంబుల యాత్రను జరుపుచు నానర్తధరకుఁ జనుదెంచి యటన్.

ఆ॥ మంచికాలఁకు నొందుగాంచి యథావిధి జలకమాడి భక్తిసరసిజాక్షుఁ
బురుషసూక్తవిధిగఁ బూజించి ధ్యానించి శిరమువంచి నతులఁ జేసెనపుడు.

క॥ కక్షీవంతుండను తత్కుక్షిత్తుఁ డాత్రితునిపూజఁజెలువాఱు మహా
లక్షణయుతశంఖంబెట్లో కక్షునునిటుకించెఁ జోరకార్యచణుండై. ३౬౨

క॥ అటుపయిఁ ద్రితుఁడదిగనమిని గటకటఁబడి యిట్లు దూఱెఁగంబు వెవండి
చ్చటఁ గాఁజేసెనో తన్నరుఁడిటుపయిఁ దత్సంఖరూపమెత్తుంగాతల్. ३౬३

క॥ అదివిని తచ్ఛాత్రుఁడు కడునదరుచుఁ ద త్త్రితునిపదములందునఁబడి గ
ద్గదకంఠంబుననిట్టులఁ గొడకొని ప్రార్థింపఁదొడఁగె క్షోణీనాథా! ३౬౪

చ॥ ఎఱుఁగక మీ సుశంఖమిపుడేను హరించితిఁ దప్పఁజేసితిన్
గురువర! నన్ క్షమింపుమటు కుంభిని జన్మము నెత్తలేనదన్
గరుణను నింపిచూడు మధికంబుగ నమ్మితిమిమ్ము నిమ్మొయిన్
శిరమున మ్రొక్కుచుంటిఁ బరిశీలనఁజేయుముగావుమో బుధా! ३౬౫

చ॥ అనవుడు త త్త్రితుండు హృదయంబున శాంతముఁజెంది నాయనా!
కనులను మూసియుండెఱుచు కాలములోపల నెంతసేత నీ
వొనరిచియుంటి వింతపనియొప్పనె! స్తేయకృతాఘమిట్లు నీ
కనుభవమైనమేల్గలుగు నా హరిఁగొల్చిన ముక్తిసేకుఱున్. ३౬౬

తే॥ గురువిటుల్ బల్కుచన నాతఁ డఱగొఱవిడి
శంఖరూపముఁదాల్చి యా సరసునందుఁ
గృష్ణ! కృష్ణా! యనుచు వచియించిపడియు
వర్ష శతకంబునుండె నా పట్టునందు. ३౬౭

మ॥ పరిపూర్ణుండు పరాత్పరుండు సకలబ్రహ్మాండనాథుండు నా
హరియే తెంచి భయంబు వీడుమనఁగా నా శిష్యవర్యుండు న
బ్బురమై మేఘగభీరమై యభయమై మోదప్రదంబై మనో
హరమైయున్నతదుక్తివించు నిటులన్ ధ్యానించె నవ్వారిగాన్. ३౬౮

తే॥ దీనవత్సల! దీనేశ! దేవదేవ! వాసుదేవ! మహాదేవ! పరమపురుష
నందనందన! గోవింద! సుందరాస్య! శంఖచక్రగదాధరా! శరణుశరణు!

తే॥ ధ్రువునికిన్ ధ్రువపదమును రూఢినిడితి వట్టి ప్రహ్లాదు బాధల నణఁగఁద్రొక్కి
తివల గజరాజునుంగాచితివి బలి బలమెఱిఁగితివిగాదె శ్రీధరా! యివిగొనతులు.

ఉ॥ కౌరవులార్యబంధుగురుకాండసమేతమహాసభన్ గుధీ
పూరితులౌచు ద్రౌపదిని బుణ్యవతిన్ నిలుచుండఁబెట్టి త
చ్చీరల విప్పసాగఁ బరిశీలనజేసి యపారచీరలన్
దూరిచి యామెఁగావవొకో? ధూతనిశాచరకోటిపాటవా! ३౭౧

తే॥ లక్కయిక్కరగిలినకాలంబునందు విషముఁ బొట్టనిండఁగఁబెట్టువేళయందు
భయదవనమునఁదిరిగెడి పట్టునందుఁ బాండవుల నీవుగావవే! పరమకరుణ.

మ॥ గురుమాతృద్విజవర్యపుత్రకుల వైకుంఠా! వెసందెచ్చి త
త్కరపద్మంబులఁబెట్టి తుష్టిగలుగంగాఁజేయవే యాదవో
త్కరదార్ఢ్యంబున క్ష్మాశయుండవుగదా కారుణ్యరత్నాకరా!
గిరిభిద్భీతితొలంగ గోపకుల రక్షింపంగలేదే ప్రభూ! ౩౨౩

ఉ॥ ఓ యనిరుద్ధ! యో వరద! యో మురనాశక! యో దయోదయా!
యో యమునేశ! యో సుగుణ! యో కమలాహృదయేశ! యంబుజా
తాయతపత్రలోచన! యహార్యధరా! ధరణీమనోహరా!
నా యభివాదనంబు గరుణంగొని బ్రోవుము! నన్ను దీనునిన్. ౩౨౪

ఉ॥ తల్లివినీవె యీవె చెలి తండ్రివినీవె విభుండవీవె నా
చెల్లెలవీవె యీవె గురుశేవధివీవె గురుండవీవె వి
ద్యోల్లసితాత్మవీవె నిగమోదితదివ్యపరాత్మవీవె భా
సిల్లెడి సర్వలోకములు శ్రీకమలాలలనామనోహరా! ౩౨౫

తే॥ కృష్ణ! నృగధరావిభునుద్ధరించితివి
సుదాము దైన్యంబుఁ బోఁగొట్టితగితి వలజ
రాత్మజుని భీతిఁగుందిన యవనిధవులఁ
బ్రోచితివిగాదె! యలనిన్ను మ్రొక్కుచుంటి. ౩౨౬

క॥ ప్రద్యుమ్నా! ప్రతిభాంచిత! సద్యస్కాలంబునందు శాపహతుని నన్
హృద్యచతుర్వ్యూహయుతా! సద్యశమునీకు హెచ్చసాఁకుమ! దేవా!

మ॥ అని వేఁడన్ హరి శేషభోగసమదీవ్యద్బాహుదండంబుతో
ఘనశంఖాభశరీరు దీను నిజభక్తశ్రేష్ఠు నాగేంద్రుఁబో
ల్కిని నుద్ధారముఁజేయఁగా నతఁడు హాళిన్వీడి శంఖాకృతిన్
గొని దివ్యంబగురూపు నాహరికి మ్రొక్కుల్ జేసి కొండాడియున్. ౩౨౭

తే॥ సూర్యశతసమానప్రభాశోభిత మభయంబునగు విమానంబున నధివసించి
దశదిశల వెల్గఁజేయుచుఁదరలి వైష్ణవమగు లోకమ్మునకునేగె నమలహృదయ!

శా॥ శంఖోద్ధారము శౌరిచేసె నెటఁదత్స్థానంబు లోకంబునన్
శంఖోద్ధారమనం జెలంగె జనకక్ష్మాపాలకా! యెవ్వఁడీ
శంఖోద్ధారకథావిధిన్ వినునొ యాసత్పూరుషుం డాస్థనా
శంఖోద్ధారసరోవగాహనఫలస్ఫాతింగనున్ సన్మతీ! ౩౭౦

## —♦ ప్రభాసతీర్థమాహాత్మ్యము ♦—

తే॥ పరమమధురోదయుతము ప్రభాసతీర్థమును గుఱించి వచించెద విననజనులు
కొండలనుబోలియుండెడి దండిదోసములను జూర్ణీకరింతురు బలుసులువుగ.

సీ॥ గురుఁడు సింహంబునంగుదుర గోదావరిఁ స్నానదానంబులు సల్పుఫలము
గురుఁడు కుంభగతుఁడేఁ హరితీర్థమందున స్నానదానంబులు సల్పుఫలము
భానుగ్రహణమున వరకురుక్షేత్రంబునందు స్నానాదుల సల్పుఫలము.
చంద్రగ్రహణమునఁ జక్కఁగాఁ గాశిలో స్నానదానంబులు సల్పుఫలము

తే॥ గలుగుటయుకాక వందరెట్టులుగఫలము ప్రాప్తమయ్యెడినట్టి ప్రభాసతీర్థ
మందు నీరాడి పుడుకుల నమలభక్తి నర్థులకు నిడువారికి నహరహంబు.

తే॥ దక్షశాపంబునఁ గళల్ దఱుగుచుండ క్షయగదాపీడితుండైన శశిని మఱల
శాపమోక్షంబు నిడి కళల్ సంభవిల్లఁ దనరఁజేసినదిట్టి తీర్థంబకాదె.

## —♦ సరస్వతీ తీర్థమాహాత్మ్యము ♦—

తే॥ పావనంబును బశ్చిమవాహినియును ఘనమునగు సరస్వతియనుధునియొకండు
సెలఁగుఁదత్ప్రాంతమందునఁ జేరి మునుఁగుపాపి బ్రహ్మస్వరూపుఁడై వఱలఁగలఁడు

తే॥ వెండితత్తీరమున బోధిపిప్పలమనునొండు నదియుండు నందుఁ బయోజనేత్రుఁ
డుద్ధవునకు భాగవతంబు నుత్తమవిధి నుడివియుండె బూర్వంబునఁ బుడమిఱేడ!

ఉ॥ ఏకుటిలుండుగాని యట కేగి నమస్కృతిఁజేసి దానినిఁ
దాఁకినఁ బూజసల్పినను దానమొనర్చిన దానమిచ్చినఁ
శ్లోకమునో తదర్థమునో సొంపగుభాగవతంబునందు సు
శ్రీకులుసెప్పఁగావినినఁ జేతికి విష్ణుపదంబు చిక్కెడిఁ. ౩౮౬

తే॥ భాద్రపదశుద్ధపూర్ణిమఁ భాగవతము హేమసింహాసనమున నెసఁగఁజేసి
దానమిచ్చిన యాతండు తత్త్వవేదియగుచుఁ బరమపదంబున నధివసించు.

తే॥ ధరణియందున నివసించునరుల తమదుజన్మముల నొకపరియైన సర్వశుభద
భాగవతమును విననిచో వారిజనులు గ్రుడ్డిగవ్వకుఁ గొఱగావు కుంభినీశ!

చ॥ ఎవఁడు చరాచరంబులకు నీశ్వరుఁడౌ హరిఁబూజఁజేయరో
యెవరల దివ్యభాగవతమిచ్చిన భక్తిని నాలకింపరో
యెవరు ధరామరాగ్రణులకిష్టముగా భుజియింపసల్పరో
యెవరు హరిందలంప రలహీనులు భారముగాదె భూమికిఁ. ౩౮౭

## —♦ గోమతీ సింధుసంగమమాహాత్మ్యము ♦—

తే॥ ద్వారకాపురిఁ గోమతీవార్ధిసంగమస్థలంబు సెలఁగునందు మానవుండు
గ్రుంకులిడినచో నట్టి వైకుంఠపదవి కరిగి యానందమంతయు ననుభవించు

తే॥ అమరనద్యబ్ధిసంగమం బశ్వమేధ శతమొనర్చిన ఫలమిడఁజాలు నింక
గోమతీసింధుసంగమస్థానమో యొసఁగును దత్సహస్రగుణితముగ నరేంద్ర!

క॥ ఇందుల కొం డితిహాసం బందముగా నుడువుచుంటి నాలించిన వా
రందఱు తాపాఘములఁ డిందుపఱచి తీఱుదు రవనీరమణేంద్రా! ౩౯౨

చ॥ ధనదసమార్థవంతుఁడును ధర్మపరిచ్యుతుఁడాఢ్యనిందకుం
డనుచితకార్యశూరుఁడు విటావళిగోష్ఠివిశారదుండు ద్యూ
తనిరతుఁడున్ మదోన్మదుఁడు దౌష్ట్యయుతుండగు నొక్కయూరుజుం
డనయము హస్తినాపురమునందు నివాసమొనర్చుచుండెడిన్. ౩౯౩

ఉ॥ ఆతఁడు తల్లిదండ్రులకు నాలికిఁ బాపల కొక్కతేపయేన్
ప్రీతిగ మృష్టభోజనముఁ బెట్టఁడు వారవధూచయంబుతో
రాతిరియుంబవల్ గడుపు వాఁడు గృహంబున కేష్టసత్వముల్
ప్రాఁతిగఁ బల్కుచుండుఁ దనవారల కీఁడొక చిల్లిగవ్వనేన్. ౩౯౪

చ॥ హరికథయో చెవిన్ బడినయంతన వీనుల మూయుచుండు స్త్రీ
యరమణివీడి వేఱగుచు నాటవెలందులఁగూడి రొక్కమం
దరను వ్యయంబొనర్చె మఱి యాతనిదగ్గరనున్న డబ్బుఁ ద
స్కరులుద్రుటిన్ హరించుకొని సాగిరి సర్వమువోయెనట్టులన్. ౩౯౫

తే॥ పుణ్యమున లక్ష్మి వృద్ధినిం బొందుచుండుఁ
బాపమున లక్ష్మి చిటికలోఁ బాడువడును
దానఁ దద్వైశ్యుఁ డఘములఁ దద్దఁ జేసి
నిర్ధనుండయ్యె వేశ్యల నెఱిఁగ విడక. ౩౯౬

చ॥ అల కరిపట్టణాంతరమున నందున దొంగతనంబుఁ జేయుచున్
మలయుచునుండ నొక్కపరి మానవనాథుఁడు శంతనుండు దొం
గిలు నలవైశ్యుఁ బట్టికొని కేణినిఁ గొట్టి పురంబునుండి వె
ల్వలఁ దఱుమన్ దదూరుజుఁడు పాఱి వనంబునఁ జేరి సారెకున్. ౩౯౭

తే॥ సంచరించుచు జీవహింసలనొనర్చి ద్వాదశసహస్రనవవర్షపరిమితమగు
కాలముంగడపె నట దుష్కాలమగుట నచటనుండి ప్రతీచికి నరిగె జనక!

తే॥ అవల నాయూరుజుండు సింహంబుచేఁ జిక్కి తలపాటింబడి డమ్మరనేఁ దక్షిణమున
వంజనాచలనిభులును నాయతశరీరులునగు యమకింకరులువచ్చి కినుకతోడ.

చ॥ అల విసుఁబట్టి మోఁకులఁదదాస్యము క్రిందికిఁగాఁగఁగట్టి చే
తులఁ జబుకుల్ గ్రహించి కసితో మెయిఁదద్దయుఁగట్ట దద్దురుల్
లలిఁబ్రహరించి ముష్టులఁ దలంగడు మొట్టి వెసన్ బరేతరా
ట్పులమున కీడ్చుకొంచుఁ జనసాగిరి తత్సమయంబునందునన్. ౪౦౦

తే॥ ఒక్క పెదగ్రద్ద యరిగి తదూరుజభుజ
మాంసమును గొనివడిని వ్యోమమున కెగిరి
స్వీయచంచూపుటమున గ్రసించుచుండె
నట్టితఱిని శేషించిన యండజములు. ౪౦౧

వ॥ ఆహారంబు లేక తన్మాంసంబు గైకొనందలంచి యుద్రేకించి దానిని వెంబడించి నిరోధించి పోరాడ నది యవ్వాని ధిక్కరించి చనుచుండె. ఇట్లవ్వాని కన్యోన్యంబున శంఖచిహ్నాదితుల్యంబులగు గాయంబులతోఁ గోలాహలంబుగాఁ గల హంబయ్యె. అట్లైనను దద్గృధ్రంబు తనవాఁతనుండి తత్పలలంబును వదలక పశ్చిమ దిశకుఁజనె. అంతఁదత్సమంబగు మఱియొండు మహాగృధ్రంబు తోతెంచియద్దానితో బోరాడి నిజచంచుపునంబొడువ నది యడలి తన మొగంబునుండి తదామిషంబును విడిచె. అవలఁదత్ఖండంబు మహాపుణ్యాకరంబగు గోమతీసింధుసంగమంబునం బడి మునింగె. తావన్మాత్రంబుననే యా వైశ్యుండు పాపవిముక్తుండై తత్కింకరు లాలోకించుచుండ జంకుకొంకులమాని స్వయంబుగా యమపాశంబులఁద్రెంచి చతు ర్భుజసమన్వితంబగు సుందరరూపంబు ధరించి వైకుంఠంబునుండి విష్ణుదూతలు తోడ్కొనివచ్చిన దివ్యవిమానంబెక్కి దశదిశల వెలిఁగించుచుఁ బరమపదంబున కరిగెంగాదె. ఇట్టి గోమతీసాగరసంగమప్రభావవర్ణనం బొనర్ప నెవండు శక్తుండగు? ఏతత్కథాశ్రోతలు సర్వకిల్బిషంబులు దూరీకరించి యంతిమంబునఁ బరమపదంబున కేగఁ గలరని యెఱుంగుము. మఱియుఁ దద్ద్వారకాపురీవిరాజమానసాగర మాహా త్మ్యంబు సైతమాకర్ణింపుమని యిట్లనియె. ౪౦౨

## — సాగరమాహాత్మ్యము —

క॥ వైశాఖశుద్ధపూర్ణిమ నాశైవలినీశులేశునందు మునిఁగి పూ
జాశంసనములనొనరిచి రాశిగ మణులియ్యఁదగును రాజవరేణ్యా! ౪౦౩

తే॥ అట్లుచేసిన మానవు నపఘనమున బ్రహ్మవిష్ణుమహేశ్వరుల్ వఱలఁగలరు
వాని గనుమాత్ర ధన్యతవఱలు వానిఁదాఁక బ్రహ్మహత్యాదులు త్వరఁదొలంగు

తే॥ ఇంక నాయంబుధిస్నాత యెచట నడుగులిడునొ యచ్చట నర్షముల్ బడును సరిగ
సర్వరోగముల్ నశియించు సంతుసిరియుఁగలుగు ననుచితకార్యముల్ గలుగవయ్య

కం॥ జగమును నాశమొనర్చెడి తెగదారియు వానిఁగనినఁ దీక్ష్ణాఘముల్
దెగఁగొట్టి పరమపదమునఁ దగఁగలఁడని యెఱుఁగుమయ్య! ధరణీనాథా!

## —♦ రైవతాచల మాహాత్మ్యము ♦—

కం॥ రైవతగిరిమాహాత్మ్యము భూవర ! వచియింతువినుమ ! భుక్తిన్ ముక్తిన్
లేవ నొసంగును ఘనదోషావళి నశియింపఁజేయునది నిక్కముగాన్. ౪౦౭

ఆ॥ గౌతమాత్మజుండు ఘనుఁడు మేధావినామకుఁడు వైష్ణవుండు మౌనివరుఁడు
వింధ్యయనెడి గిరిని వెలిఁగి లక్షాబ్దముల్ తపముఁజేసె నపుడు ధరణీంద్ర !

తే॥ తన్మునిఁగన నపాంతరతమమునీంద్రుఁ డరుగుదెంచెను దత్సమయంబునందు
నట్టి మేధావిభక్తి నాత్మాసనంబునుండి లేవకుండుటఁగాంచి మండి యతఁడు.

ఉ॥ అల్ప ! తపోభిమానమిటు లగ్గలమయ్యెనె ? నీకుఁ బెద్దలన్
స్వల్పులఁజేసి యించుకయు శైలముబోలెఁ జలింపకుందువే ?
తాల్పవె నమ్రభావమిఁక దాన నరంబున నీవు గొండవై
తెల్పుఁడులేనికైవడి క్షితిన్ దగుమంచు శపించి యేగఁగాన్. ౪౧౦

కం॥ అల మేధావియు వెంటనె మలయై శ్రీశైలమునకు మవ్వపుబిడ్డగాఁ
గలుములచెలిచెలిబత్తినిఁ దొలిబామును మరువకుండఁ దోతెంచెఁజుమీ.

చ॥ ఒకపరిఁదన్మునీశ్వరుఁడు యుక్తవిధంబున మన్మఖంబునన్
సకలము ద్వారకాపురలసన్మహిమంబుల నాలకించి నన్
ముకుళితహస్తపద్ముఁడయి మ్రొక్కియు నిట్టులఁబల్కె బ్రహ్మపు
త్రకవర ! నామొఱన్ వినియు ధన్యుగఁజేయుమ ! యద్దియేదనన్. ౪౧౨

మ॥ అల ద్వారావతినున్న రైవతధరేశాంతస్థలంబొంది యాఁ
దలతో జోతలసల్పి యిట్టులనుమా ! ధాత్రీశ ! మేధావి నీ
బలమేనమ్మి వసించెగాన నతనిన్ భద్రంబుగాఁబోయి త
త్స్థలిపీడంగొని తెచ్చి నీపురమునన్ స్థాపింపుమం చోమునీ ! ౪౧౩

చ॥ అనవుడు భక్తతాపహరణాత్మకకార్యరతుండనైన నే
విని యది సమ్మతించి వడివేడ్కగ ద్వారకనున్న రైవతే
శుని దరికేగి వానిమనసున్ దెలుపంగ నతండు దానికి
ఘ్ఘనముగనొప్పి యిట్లనియె నాకు మనోహరసూక్తులన్ విభూ ! ౪౧౪

ఉ॥ నారద! వింటివన్ను శరణంబును జెందినవానిఁగాచుటే
సారముగల్గుకార్యమని చక్కనెఱింగితి నెట్టిశైలమీ
ద్వారకయందు లేదదికతంబునఁ దద్గిరినాథు మద్భుజా
సారముతోడఁబీకి యిటస్థాపనఁజేసెద నట్టులేనటుల్. ౪౧౬

తే॥ అంత నటనుండి నేఁబోతి నతఁడుగూడఁ దద్గిరిని దీసికొనిరాఁగఁ దలఁచి తగిన
యత్నమందుండె నింతలో నాయచలముఁగనిన శ్రీగిరివరికి నేఁజనిముదమున

వ॥ కలహంబును బురికొల్పుమాటలతోఁ తత్సుతసంగ్రహణాత్మకరైవతో
ద్యోగంబును వినిపింప నా శ్రీశైలంబు పుత్రమోహాసంహతుండై యుత్పన్నానర్థప్రతీ
కారంబుకంటె ననర్థోత్పత్తిప్రతిబంధంబే వరంబనియెంచి గిరిరాజులగు మేరుహిమ
వంతుల చెంతకుంజని వినతుండై వారిఁబ్రాపుంగోరి యిట్లనియె. ౪౧౭

ఉ॥ దైవము పుత్రునొక్కనిగదాయిడె నా కలవాని జేపొ మా
పో వడి రైవతుండనెడి భూపతి నాదరికేగుదెంచి బల్
చేవను సంగ్రహించుకొని స్వీయపురంబున కేగునంట నా
జీవము తల్లడిల్లు నెదొ చెప్పఁడు! బ్రోవుఁడు! నన్ను నా సుతున్. ౪౧౮

చ॥ కొడుకును వీడి నేక్షణముగూడ వసింపఁగలేను దాన మీ
యడుగులపై నివాలి శరణంటిని వైళము యట్టి రైవతున్
గెడపి మదాత్మజున్ నిలిపి కీర్తినిఁజెందుఁడి! పొందుఁడీ! నతుల్
విడువకుఁ డిట్టిదీనుఁ బృథివీధరనాయకులార! నావుడున్. ౪౧౯

చ॥ సరియని తన్నగేశ్వరు లసాధ్యధరాధరలక్షయుక్తులై
శరణునుగోరు శ్రీగిరినిసైతముఁ దోడ్కొని తత్స్థలంబునన్
ద్వరగతిఁజేరి రైవతుఁడువచ్చి తదద్రిని నాంజనేయుమా
దిరిగ భుజంబులందు నిడి తేఁకువనేగుటఁగాంచి కిన్కతోన్. ౪౨౦

తే॥ శస్త్రముల నస్త్రముల ఖడ్గసమితిఁదాల్చి యతఁడు వోయెడినధ్వము నడ్డగించి
తలపడన్ రైవతుండు పత త్తటిత్తుపరణిశబ్దింప నట్టహాసంబుఁజేసె. ౪౨౧

క॥ తద్రవమున బ్రహ్మాండము భద్రమువిడి మాఱుమ్రోఁగె బహుభయమున ది
గ్భద్రేభంబులు భ్రాంతిలె నద్రిగతాయుధములు దమయంతటరాలెన్.

తే॥ అవలఁ దన్నగేశ్వరులు నిరాయుధులయి సరకుసేయక సరగ శ్రీశైలసుతుని
దీసికొనిపోవుచుండు నుదీర్ణబలుని రైవతుని వెంటనంటి కరముగ నార్చి. ౪౨౩

ఉ॥ తిట్టిరి మానభంగకరతీవ్రవచఃప్రచయంబుతో మెయిం
గొట్టిరి రక్తనిర్ఝరిణికోటులు భూమిని బాఱఁగా దలన్
మొట్టిరి చేతివ్రేళ్ళఁ గడుమోఁదిరి జానువులన్ మహోర్భటిన్
నెట్టిరి నేలఁగూలునటు నేఁటుగ బోటను జాటిపోటులన్. ౪౨౪

తే॥ మున్ను శ్రీహనుమంతుఁ డమోఘబలులు పెక్కుమంది వేష్టించిరన్ విడక గిరివి
నరిగినట్టుల రైవతుం డచలనపులు బాధపెట్టిన నాగిరిన్ వదలకుండె. ౪౨౫

తే॥ ఇట్టి తరుణంబునందున నేనువోయి హరికి శ్రీశైలపుత్రకు సఖీసుతంబు
రైవతోద్యోగమద్రీశ్వరప్రవృత్తియంత నుడివితి దాని కాహరియునొప్పి.

క॥ తనభక్తునిఁ బ్రోవుటకై విను తెన్నన నచటకరిగి వే నిజతేజ
స్సును దద్రైవతునకు భయమును బాపుమ నిచ్చి చనియె భూపుండవలన్.

మ॥ భగవత్తేజముతోడ మీఱి యలఘ్రాణంబొందు హస్తంబుతో
మిగులంబట్టుచు వజ్రితుల్యుఁడయి తన్మేర్వద్రి దంభోళి కీ
డగుముష్టిన్ బ్రహరించి శీతగిరినయ్యారే! యనంగూల్చి మొం
డుగ నన్యాద్రులఁ గాళ్ళఁదన్నె నటఁ డాటోటమిలేనట్టులన్. ౪౨౭

ఉ॥ మేరునగంబు విహ్వలత మిన్నకయుండె హిమాద్రినొచ్చె నా
ర్వోరము పిడిపాటె నలవింధ్యముమున్న గుకొండలెల్ల; సొం
పారెను రైవతాఖ్య మలయద్రిసుతుండనుమెచ్చె నిచ్చ నిం
డారె జయారవంబులును నావిభుఁడాయనినుండి క్రమ్మఱెన్. ౪౨౮

ఆ॥ ఇట్టులచట వెడలి యాగిరి నానర్త భవ్యదేశమందుఁ బడఁగవైచె
నద్దిసుతఁ దదద్రి హరిభక్తుఁడై రైవతః గిరీంద్రుఁడనఁగ ద్వారకఁడగె. ౪౩౦

ఉ॥ దానినిజూచు మానవకదంబము వాయును బ్రహ్మహత్యలన్
దానిని దాఁకువారు సవనంబులవందమొసంగు పుణ్యముల్
మానకకాంత్రు దానికొకమాఱు ప్రదక్షిణ మాచరించినన్
బూనిక తీర్థయాత్రలకుఁబోయిన సత్ఫలమబ్బునేరికేన్. ౪౩౧

తే॥ మఱియు నామలయందెట్టిమనుజుఁడైన నొక్కబ్రాహ్మణునకు నేని నొక్కతడవ
భోజనముఁబెట్టి నట్టైన భువననాథుఁడైన శ్రీహరిపదవికి నరుగఁగలఁడు.

## యజ్ఞతీర్థ కపిటంకాది తీర్థమాహాత్మ్యము

వ॥ వెండియు నారైవతగిరియందొక యజ్ఞంబొనర్చినఁ గోటిఫలంబు లిడం జాలిన యజ్ఞతీర్థంబను నొకదాని నారైవతుండు ద్రవ్వించెంగాదె. అద్దాని కనతిదూరం

బునఁ గపిపాతసముద్భూతంబును, సర్వపాపప్రణాశనంబునగు కపిటంకనామకతీర్థం బొండుగలదు. అందు భౌమాసురసఖుండును దుష్టుండునగు ద్విజుండను వానరుం డుద్దండబలుండగు బలరాముని యశనిసదృశంబగు ముష్టిని నిహతుండై ముక్తిం జెందె. మహాత్ముల నిగ్రహంబును సద్గతిమూలకంబుగాదె. ఆతీర్థంబునకుఁ బ్రత్యహం బమరులు స్నానార్థంబై యేగుదెంతురు కలవిలంకయాత్రి నొనర్చినవారికిఁ గోటి గోదానఫలంబును, దద్విగుణంబుగా దండకారణ్యసంచారులకును, దచ్ఛతగుణంబుగా సైంధవవననివాసులకును, దత్పంచగుణంబుగా జంబుమార్గస్థులకును, దద్దశగుణం బుగాఁ బుష్కరాటవివిహారులకుఁ దద్దశగుణంబుగా నుత్పలావర్తయాత్రికులకును, దద్దశగుణంబుగా నైమిశారణ్యభాసురులకును, దచ్ఛతగుణంబుగాఁ బుణ్యం బేతత్క పిటంకతీర్థసేవకులకు లభించితీరు. మఱియు ౪౩౩

క॥ నృగకూపంబను తీర్థము తగియుండెను గొప్పదనఁగ ద్వారకలోఁ దా
నిఁగనెడివారలు బ్రాహ్మణుఁదెగఁగొట్టిన దోసమైనఁ దెగవేతురుగా. ౪౩౪

తే॥ నృగుఁడు దెలియక యొకమేదినీసురసుర భీమణింగొని మఱియొక్క విప్రున కిడె
దానఁ గృకలాసదేహంబుఁదాల్చి యతఁడు ద్వారకాస్థకూపంబునఁ దనరుచుండె

ఉ॥ ఆతఁడు దాతలందుఁ బెనయయ్యుఁ జతుర్యుగకాలమానమా
నూతి వసించుటంగని యనుగ్రహసాగరుడైన శ్రీధరుం
డాతని నుద్ధరించెను దయన్ "నృగకూప" మటంచునద్ది వి
ఖ్యాతినిఁబొందె నాఁటినుత కల్మషపర్వతవజ్రతుల్యమై. ౪౩౬

తే॥ ఊర్జపూర్ణిమనట్టి తీర్థోదకమున మునిఁగినం గోటిజనిపాపములు నశించు
నందు నొకగోవునిచ్చిన నాలకోటిదానమిచ్చిన ఫలమబ్బు ధారణీంద్ర!

## గోపీభూమిమాహాత్మ్యము

తే॥ మఱియు గోపికామేదినీమహిమ నీకు విస్తరంబుగ వినిపింతుఁ బృథివినాథ!
యద్దివినువారు పాపంబులవలఁద్రోసి యవ్యయమగు సత్పదవికి నరుగఁగలరు.

శా॥ పాపారణ్యకుఠారమం చెది బహుప్రఖ్యాతినిం గాంచెనో
గోపీచందనమేస్థలింగలిగెనో గోప్యంగరాగంబుల
న్గోపీరత్నము లేమహాస్థలమునన్శోభిల్లెనో యద్దియే
గోపీభూమియనన్ వినోదకరమై క్షోణింబ్రతిష్ఠంగనెన్. ౪౩౯

క॥ ఘనమగు నాగోపీచందనమెవ్వఁడు పూసికొనునొ తన్నరుఁడు మరు
ద్ధునిలో మునిఁగిన పుణ్యంబును జెందఁగలఁడు విదేహాభూభుజవర్యా! ౪౪౦

చ॥ అనిశము గోపిచందనమహత్త్వము ప్రల నొప్పువాఁడు తీ
ర్థనికర సేవనవ్రతవితానమఖప్రకరాశ్వమేధ వే
దనిపత రాజసూయవరదానసమార్జిత పుణ్యరాశులన్
దినదినమందుఁ జెందెడి సుధీవరుఁడై చరితార్థుఁడౌ విభూ! ౪౪౧

తే॥ విష్ణుపదిమృత్తికం బెను ద్విగుణపుణ్యమిచ్చుఁ జిత్రకూటరజంబు నిచ్చుఁ దద్ద
శగుణఫలమిచ్చుఁ బంచవటీగరజంబు తచ్ఛతగుణఫల మిడుఁ జందనంబు

క॥ గోపీచందన మలఁదినఁ బాపియు యమకింకరులకుఁ బట్టువడక యో
భూపతి! ప్రకృతిపరంబగు గోపృథివికిఁ జేరగల రకుంఠితగతితోన్. ౪౪౩

ఉ॥ భారతవర్షమందు మును పాపియుఁ బాపిసహస్రసంగుఁడున్
వారసతీవ్రతుం డనృతవాది పరార్థపరుండు సింధుపృ
థ్వీరమణుండు నార్యపృథివీసురశత్రుఁడు దీర్ఘబాహుఁడన్
వీరుఁ డొకండు గ్రాలు నవివేకిశిరోమణియై యచు భూమిపా! ౪౪౪

క॥ నిర్భయమున నా దుష్టుఁడు గర్భవతీవశకము నరకపిలాసురభిన్
నిర్భలయోగాంచితులను దుర్భరమున్యాపలాడి దునుముచునుండెన్

చ॥ ఒకపరి సైంధవాశ్వమున నుద్ధతి నెక్కి నిశాతహేతికా
ర్ముకపరిఘాగదాదిపచిరుండయి కానకు నేగి వేఁటఁ గో
రిక నొనరించి క్రమ్మఱ ఋతజెంగని తత్సచివుండు వానికు
త్తుక నొఱనుండి వాలు వడిదూసి వధించెఁ బ్రభుత్వలుబ్ధుఁడై. ౪౪౬

తే॥ నఱికినంతనె కాలకింకరులు వచ్చి చచ్చిపడియున్నవానిని జక్కఁ జూచి
కట్టిమోఁకుల జాటులఁ గొట్టినగుచు జమునిమనికికిఁ దోడ్కొనిచనిరి పిదప.

చ॥ యముఁడతనిం గనుంగొని రయంబునఁ బిల్చియుఁ జిత్రగుప్తునిన్
గ్రమముగ నిట్టులడ్గె గణకా! యితఁడెవ్వఁడొ? వీనికున్న పా
పము లెవొ? యింక నే నరకబాధల కీఖలుఁ డర్హుఁడౌనొ? యీ
సమయమునన్ వచింపు మనఁ జక్కఁగ నాతఁడు రుత్కి నీగహిన్. ౪౪౭

తే॥ ధర్మరాజ! మహారాజ! దండధర! కృ
తాంత! సమవర్తి! పితృపతీ! ధాత్రియందు
నితఁడు దీర్ఘబాహ్వాభిధానయుతుఁడు వీఁడు
చేసినట్టిపాపములు హెచ్చిల్లియుండె. ౪౪౯

వ॥ దేవా! తపనావీచిరౌరవమహారౌరవసంఘాత కాలసూత్రాదినరకంబులును దప్తకుండంబును తౌరకుండంబును విట్కుండంబును మూత్రకుండంబును శ్లేష్మకుండంబును వహ్నికుండంబును వసాకుండంబును దూషికాకుండంబును శుక్రకుండంబును అసృక్కుండంబును మజ్జాకుండంబును మాంసకుండంబును క్షౌరకుండంబును గర్ణవిట్కుండంబును నఖకుండంబును లోమకుండంబును కేశకుండంబును అస్థికుండంబును తామ్రకుండంబును లోహకుండంబును తప్తసురాకుండంబును ప్రతప్తకుండంబును ప్రతప్తతైలకుండంబును తీక్ష్ణకంటకకుండంబును విషకుండంబును దంతకుండంబును క్రిమికుండంబును పూయకుండంబును సర్పకుండంబును మశకకుండంబును దంశకుండంబును వజ్రదంష్ట్రికుండంబును వృశ్చికకుండంబును శరకుండంబును శూలకుండంబును ఖడ్గకుండంబును గోళకుండంబును నక్రకుండంబును కాకకుండంబును సంచానకుండంబును బాజకుండంబును దగ్ధపాషాణకుండంబును శాతపాషాణకుండంబును లాలాకుండంబును జ్వాలాకుండంబును గాత్రమలకుండంబును దగ్ధశూర్మ్యంబును కుంభీపాకంబును నరుంతుదంబగు నటోదంబును పాంసుభోజనంబును పాశవేష్టంబును శూలప్రోతంబును ప్రకంపనంబును ఉల్కాముఖంబును అంధకూపంబును వేధనంబును దండతాడనంబును జాలబద్ధంబును దేహచూర్ణంబును దళనంబును శోషణంబును కషంబును సర్పజ్వాలాముఖంబును సర్పజిహ్వాముఖంబును ధూమాంధంబును నాగవేష్టనంబులోనుగాగల భయంకరంబులును దుస్సహంబులునగు చతురశీతిలక్షమహానరకంబులు దమ యేలుబడిలో గలవు. వీని యన్నిటియందు నితండు సమగ్రంబుగా బాధింపందగినవాఁడు సంశయంబు లేదు. వినుఁడు. ౪౫౦

ఉ॥ పాపములన్ని యేవనిన బ్రాహ్మణగర్భవతీవధంబులున్
బాపలవేల్పులన్ గురులఁ బల్కులు దూఱుచునుంటఁ దేవకున్
దేవకసత్త్వమాడుటయు నిక్కుటయున్ గపిలావధంబు రా
పాపుచు నాథుజంతువుల నంతమొనర్చుట లోనుసేత లే. ౪౫౧

చ॥ పలుకఁగ నిట్లు లేఖకుఁడు వాచికిఁ గీర్త్యను నాజ్ఞఁ గింకరుల్
దలపడి వానిఁ బట్టుకొని ధారుణిఁ నీడ్చుచు వెయ్యియామడల్
గలిగి భయంకరంబును నగాధము నైతగు కుంభియందునన్
సలసలఁ గ్రాగుసూనెను వెసన్ బడవేసిరి జాలిమాలియున్. ౪౫౨

తే॥ అలమహాపాపి పడినంతఁ బ్రలయపావకాభతప్తాకవహ్ని చల్లాఱెఁ ద్రుటిని
దొల్లి బ్రహ్మదుఁ డగ్నిలోఁ దూఁక నద్ది శీతలతఁ గాంచినట్టుల భూతలేశ! ౪౫౩

తే॥ అట్టి సంగతి యమదూత లాత్మపతికిఁ
జెప్పిరంత నాశమనుండు చిత్రగుప్తు
మఱలఁ బిలిచి యా దుష్టుఁడు మంచిసేత
యెదియుఁ జేయఁడె? యిదియేమి? యెఱుఁగఁ జెప్పుము! ౪౫౪

క॥ అని యడుగుచుఁ జింతించుచుఁ దనరెడికాలంబునందుఁ దనసభఁ కేతెం
చిన ధర్మజుని వ్యాసుని ఘనుఁగని యిట్లనియె బద్ధకరకమలుండై. ౪౫౫

మ॥ అనఘా! యాతఁడు భూతలంబున సుకార్యంబెద్దియున్ జేయఁడే
దనయంబున్ సురభూసురార్యవిబుధవ్యక్కారముల్ గర్భిణీ
వనితాబ్రాహ్మణధేనుసన్మృగచయ ప్రాణాపహారంబుఁ జే
సినవాఁడౌటను వీనిఁదెచ్చి యిట కీచిత్రోక్తి నాలించియే. ౪౫౬

క॥ వడిఁగుంభీపాకమునన్ బడ వేయఁగ నాజ్ఞయిడితిఁ బడినంతనె యీ
తఁడు తజ్జ్వాలనుఁడు చల్లంబడె నియ్యదివింతగాదె పరమమునీంద్రా! ౪౫౭

క॥ ఇందుల కేకారణమో డెందమునందరసి యిపుడు కీవింజెప్పన్
వందనమొనర్తు డెందము గుందుచుఁ గొట్టుకొను మానికోటిస్తుత్యా!

వ॥ అనవుడు పారాశర్యుండిట్లనియె. ధర్మరాజా! పాపపుణ్యంబులకు స్థూల సూక్ష్మంబులను రెండుదశలుగలవు. అం దీతండు భూకలంబున నేసత్కార్యంబొనరింపకపోయినను దైవవశంబున సిద్ధనుండిద్ధరాశింగాంచి నట్లోకమహాత్ముని కరాగ్రంబునుండి రాలిన గోపీచందనంబునఁ బూర్ణంబైన ప్రదేశంబుంగాంచి యందుఁ బ్రాణంబుల విడిచినవాఁడయ్యె. తత్ప్రభావంబునఁ దత్ప్రపాతంబగుడుఁ తత్కుంభీపాకాగ్ని యట్లు నిర్వాపణంబుఁజెందె. నరుఁడు తద్గోపీచందనలిప్తాంగుండైనను దద్దర్శనం బాచరించినను బ్రహ్మహత్యాదివిముక్తుండై నారాయణుండగుఁ గాఁ జేయని బోధింపనా సమనర్తితత్కీర్తివిదుండై యాతని నా తైలంబునుండి తీసి మన్ననతోఁదోడ్కొని వచ్చి దివ్యవిమానంబున నెక్కించి ప్రకృతిపరంబగు వైకుంఠలోకంబునకంపె. ఏతద్గోపీచందనమాహాత్మ్యం బాలించిన జనులు దురితంబుల దూరీకరించి హరిం జేరఁగలరని యెఱుంగుము. మఱియు నా ద్వారకాపురీవిరాజమానసిద్ధాశ్రమమహిమంబునుడివెద నాకర్ణింపుమని యిట్లనియె. ౪౫౯

## —♦ సిద్ధాశ్రమమాహాత్మ్యము ♦—

క॥ ఎద్దాని స్పృశించినచో నద్దనుజారాతి కరుణ నగుపడి సతతం
బొద్దనుబాయక చెలఁగునో యద్దియె సిద్ధాశ్రమమని యందురుపెద్దల్. ౪౬౦

క॥ కననటసాలోక్యము దాఁకినచో సామీప్యము మునిఁగిన సారూప్యం
బును ఐసతిని సాయుజ్యము మనుజులు వొందంగఁగలరు మైథిలనాథా!

చ॥ హరివిరహవ్యథాకులహృదన్విత యిందునిభాస్య రాధికా
తరుణి స్వకీయచేటిక యథాక్రమమొప్పఁ దదాశ్రమ ప్రభా
వరుచిరసంగతుల్ దనకుఁబల్కఁ దమిఁ విని రాధమాసభా
సురతరణిగ్రహంబునఁ బ్రదిశుద్ధిగ నెంచె నటఁ మునుంగఁగాఁ. ౪౬౨

వ॥ అంత నా రాధికాకాంతా ప్రేమ శ్రీకృష్ణసఖుండగు శ్రీదాముండు హరి విరహప్రదంబగు శాపంబుఁ దనకిచ్చి శతాబ్దంబులు గడచుచున్న సమయంబునం గదళీ వనంబునుండి లేచి శతయూథపసమన్వితయై నిర్గమించి గోపకగణంబులు పరివేష్టించి నడుమ సుందరీమణులు ఛత్రచామరంబులంగొని కొలువ నందనంబగు నందలంబెక్కి యానర్తదేశవిరాజమానతత్సిద్ధాశ్రమతీర్థరాజంబునకరిగె. అట్టిపట్టున ౪౬౩

తే॥ యాదవోత్తమపరిమండితాచ్యుతుఁడును
షోడశసహస్రగోపికాశోభితుఁడయి
యట్టి సిద్ధాశ్రమోత్తమ యాత్రఁ జేయ
వచ్చియుండె ముదమునఁ దత్పురమునందు. ౪౬౪

సీ॥ శస్త్రంబులందాల్చి చబుకులం గొనములఁబట్టినభటులు నల్ప్రిక్కలు గన
మగవారు సొరరానిమాడ్కిని గొందఱు గోపకవీరులుఁగూడి చూడఁ
బండ్లగంపను జట్టుపద్ధతి నెచ్చెలుల్ సుట్టుముట్టుచు నెత్తిఁజూచుచుండఁ
గావలసిన వస్తుకాండముఁ బరిచారికావళి యెడపక యందనియ్య

తే॥ శాస్త్రవిధిగ సిద్ధాశ్రమసలిలమందు రాధ నీరాడి దివ్యాంబరములఁదాల్చి
సర్వవిధదానములభక్తి జగతిసురుల కిడి నమస్కృతిఁ జేసె నోపుడమితేఁడ!

తే॥ అటకు నీరాడవచ్చిన యట్టి ద్వారకాపురీవ్రజ రాధికాకాంతభటుల
బెత్తములదెబ్బలంబడి బెదరికనుచు నొక్కయిక్కనునిలిచె నాయుచితవేళ.

క॥ వనజాక్షుని సతులందఱు వనమాలిసమేతలగుచు భక్తిని స్నానం
బొనరింపఁగఁ దజ్జనులకు వెనుకనె చనివారి నచటివిభవముఁ గనుచున్.

చ॥ అడిగిరటుల్ స్వకీయవిభు నచ్యుత! యీ స్థలమందు నెందఱో
పడఁతులు సుట్టుముట్ట యమువర్యులు నల్గడలందుఁగావ ని
ప్పుడు జలకంబులాడియు నమోఘముగాఁ బుడుకుల్ బొనర్చు నీ
పడఁతుకయేడుమో యెఱుఁగఁబల్కవె? సర్వవిదుండవీవగా. ౪౬౫

ఉ॥ నావుడు దేవకీసుతుఁడనన్ సమకట్టె నిటుల్ లతాంగులా
రా! వినుఁడీపె నా దుసతి రాధికనాఁదగి వారి రాసఖే
లావిధిముఖ్యయై బహువిలాసవిలోలయునై శుభాంగియై
శ్రీవృషభానుపుత్రియయి శ్రీమతియై పరయై చెలంగెడిన్. ౪౬౬

తే॥ ఈవ్రజేశ్వరి నీరాడునిచ్చచేత వ్రజమునుండి ప్రయాణమై పాపనాశ
మైన యిట్టి సిద్ధాశ్రమమాత్మగోపికాసహిత యాచుఁ జేరె నిష్కలుషబుద్ధి.

వ॥ మఱియు నీ జగన్మోహిని యిన్మహోత్సవంబున జలకంబాడి వృషుకులఁ బెక్కింటిని బుడమి వేల్పుల కొసంగి ప్రకాశించుచుండె. అద్భుతంబగు నీ మహావైభవంబంతయుఁ దదీయంబని యెఱుంగుమన నయ్యిందిరాకాంతుని కాంతలలో సత్యభామయను భామినీలలామంబు రూపయౌవనగర్వితయై యల్లన నిజసవత్నులతో నిట్లనియె. 820

క॥ హరి కర మీపెను బొగడెడి ధర నీయమ రూపవతియొ? ధైర్యవతియొ స
త్కరుణావతియొ గుణవతియొ యరయఁగనన్ మించఁగలదె? యంగనలారా!

ఉ॥ కాని కడంగిరూపసినిగానొ దయామతిఁగానొ ధీరనుం
గానొ విభూతులున్న సతిగానొ యుదారనుగానొ యోగ్య నేఁ
గానొ మఱెట్టి భామినిసిగానొ వచింపుఁడి! నాదుతండ్రి ము
న్నేనను నెండఁబో విబుధులిమ్మని వేఁడుట మీరెఱుంగరే? 823

సీ॥ శతధన్వుఁడనువాఁడు మృతుఁడయిపోవుట లలితమద్రూపమూలమునఁగాదె
యక్రూరకృతవర్మలటు పాఱిపోవుట లలితమద్రూపమూలమునఁగాదె
శక్రుతో నీచక్రి శత్రుపై పోరుట లలితమద్రూపమూలమునఁగాదె
హరితోడ ననిశంబు గరుడగామినినౌట లలితమద్రూపమూలమునఁగాదె
తే॥ దేవమాతకుఁ గమ్మలన్ దేవనాయకునకు ఛత్రమీయసురాంతకుండిడుటయు
లలితమద్రూపగౌరవములనుగాదె భామినీమణులార! సపత్నులార!

క॥ సరసిజముఖులారా! యీహరి కీరలు పత్నులౌట కధికనిదానం
బరయుఁడి! యెఱుఁగుడి! యీనాకరుణయె కారణమటంచుఁ గలఁగక యెదలన్

క॥ అల ప్రాగ్జ్యోతిషపురినలఘుండౌ భౌమనిర్జరారియు హరియున్
గలహించుతఱిని ధీరతఁ బలుసాయము పతికిఁజేసి వఱలితిఁగాదే. 826

సీ॥ అహరహంబును మంచియపరంజి నెన్మిది బారువులంగాంచి మీఱునెద్ది
తామడాంబరగరళామయసర్వాగ్ని మారీభయంబులన్ మాపునెద్ది
జారచోరాప్రయోజకవంచకబలులుండనట్టులఁజేసి యొప్పునెద్ది
సిరిసంపదలఁగూర్చి నరులకు సౌఖ్యముల్ గలిగించి వాసితోఁ జెలగుఁనెద్ది.
తే॥ దివ్యమార్తాండుకై వడిఁ దేజరిల్లు నెద్ది యాస్యమంతకమణి నేలమిఁగాన్క
గనిడి నా తండ్రినన్నిట్టి వనజలోచనునకునిచ్చె నా వైభవంబును గనుండు

క॥ నామాటయనినతోడన యీమాధవువలన మంచి వెన్నోరథముల్
సామజములు దురగంబులు భౌమాసురుసిరియు వచ్చెపడె నాయింటన్. 828

క॥ అప్పటికప్పటికాయా గొప్పనయిన కోరికలను గొంకక తమితోఁ
దప్పక యిడి నావాకిట నెప్పుడు దగుఁబారిజాతవృక్షేంద్రమహా! ౪౭౯

క॥ భూతవ్రాతవిభుండును భూతికరుఁడునైన కృష్ణమూర్తి యెప్పుడు నా
చేతికి వశుఁడై తగ నాపాతివ్రత్యంబుఁబల్కవలెనా? యింకన్. ౪౮౦

క॥ నారీమణులారా! యీ నారదునకు నాదు మగని నయభయముల సం
భారము లెల్లను జేర్చి యుదారమతినిడితి నల్పదానమె? చెప్పుఁడీ! ౪౮౧

చ॥ ధరఁగలభామలన్ మణినిఁదథ్యము గాదొకో? యీకెనాకెటుల్
సరియగు? నిట్టులుంచుఁ డిది చంద్రముఖీ! సఖి! యోసిరుక్మిణీ!
యరయఁగఁగావె రూపవతి? వంబుజలోచనలార! మీరు భూ
వరసుత లాపె గొల్లవనిభావనజేయుఁడి మిమ్ముఁబోలునే? ౪౮౨

క॥ కరుణామయులును గుణవతు లరవిందేక్షణలుఁ బూర్ణిమాబ్జాస్యలు శ్రీ
ధరలగుమిమ్మను రాధకు సరిగూర్చుట తగదు నన్నుక్షమియింపవలెన్.
క॥ అని తేనిపోనిమాటల నని యుబ్బింపఁగను భీష్మకాత్మజమొదలౌ
నెనమంద్రురాణు లన్వయఘనతాగుణకౌశలాదిగర్వితలగుచున్. ౪౮౪

తే॥ సత్యభామోక్తిపంజరస్థశుకములయి సంతతంబును రాధికాసతినిమెచ్చ
దేవకీనందనుంజేరి దివ్యఫక్కిఁ బలికిరిట్టుల బహులాశ్వ! పార్థివేంద్ర!

శా॥ దేవా! నీ యెడబాటునన్ బొగిలి భక్తిన్ స్నానదానంబు లీ
తావుంజేరియొనర్చి పూతయగు రాధన్ నీ ప్రియన్ జూపుమా!
యీవిశ్వంబునలేని రూపవతియో యేహ్యాంగియో యెట్టిదో
యీ వేళన్ గమనించి చూచెదము శ్రీకృష్ణా! జగద్రక్షణా! ౪౮౬

క॥ అనవుడు వనమాలియు నాపనికొప్పి పదాఱువేలపడఁతులు మఱి యా
యెనమంద్రురాణు లతిముఱి వెనుకొనఁజనసాగె రాధవెలిఁగెడి స్థలికిన్.

ఉ॥ చక్కని పెక్కు టెక్కెములఁజందురురూపునుబోలు డాలులన్
మిక్కిలి మేలుకట్టులను మేలిమిబంగరుకట్టుపాటునన్
జక్కనిదై శుభంబులను సారెకుసారె కొసంగఁజాలి యా
యిక్కగుడార మొండుదగె నిట్టిదటంచు నుతింపశక్యమే. ౪౮౮

ఉ॥ అందున సౌరభంబు లఖిలాశలఁ బర్వుచునుండు మాలతీ
బృందమరందముల్ సెలఁగు భృంగములున్ శ్రుతిపేయనాదము
ల్దందడిసల్పుము త్తియములన్ దగియున్న తెరల్ పటంబులున్
బొందికనుండుఁ బీఠికయుఁబొల్చునుగాదె తదాసనంబునన్. ౪౮౯

సీ॥ హంసనిభంబులౌ వ్యజనంబులం బట్టి స్వీయసఖీజనుల్ విసరుచుండ
ఛత్రచామరములన్ వేత్రంబుఁ దాలిచి గోపికలిటులటుఁ గూడి తిరుగ
బాలభానునిమాడ్కి భాసిల్లుచుండెడి కమ్మలుపీనులఁ గ్రాలుచుండఁ
గోటిచంద్రులకును గీటగు నిజదేహకాంతులు నల్దెసల్ గ్రమ్ముచుండఁ

తే॥ కోమలాంగియుఁ దన్వియుఁ గుందరదన కృష్ణహృత్తిమానసయునగు కీర్తిపుత్రి
యొప్పియటనుండి నడుగుల నొయ్యనిడుచుఁ బుష్పవనముఁ గల్లనఁ బోవుచుండె.

ఉ॥ అత్తఱినట్టి కృష్ణసతులందఱు దవ్వునఁ గాంచి యాయమన్
దత్తరణిప్రకాశమునఁ దారలు తేజము వాసినట్లుగాఁ
దత్తరుణీమణీరుచిహృతప్రభలై నిజరూపగర్వ సం
పత్తులఁబుచ్చి యొండొరులు బల్కకొనన్ సమకట్టి రిట్టులన్. ౪౯౧

ఉ॥ ఇట్టి మనోహరాకృతి ధరించినసుందరి నెందుఁజూడ మే
మెట్టుల నీయమం గుఱిచి యీవరకీహరి నోటవింటిమో
యట్టుల నిప్డు గాంచితి మహో! యనుకొంచు స్వనాథుమార్గముం
బట్టి తదంతికంబున విభాసిలఁబోయిరి భూప! యావలన్. ౪౯౨

తే॥ రాచకన్నెలకన్నులు రాధనెచ్చెలులగు శ్వేతలకనులును గలిసి వెలుఁగ
పట్టరాజ్ఞీసహితహరి వచ్చుటఁగని సల్పిరాభీరమానినుల్ జయరవముల.

చ॥ మణియును రాధికారమణి మాధవురాకనుగాంచి గద్దియన్
సరగున డిగ్గి పద్మసదృశస్వకనేత్రములన్ ముదశ్రువుల్
బొరిబొరి వ్రాల్చి యాతనికి బూజలసల్పి ప్రదక్షిణంబులన్
గరముగఁ జేసి స్వీయకరకంజములన్ ముకుళించి మ్రొక్కియున్. ౪౯౩

వ॥ శ్యమంతకమణిఖచితపాదంబులను చింతామణిమండితతటంబును బద్మ
రాగభాసురమధ్యంబును జంద్రమండలవర్తులంబును గౌస్తుభోద్భాసితాధః ప్రదేశం
బునుంగలిగి కుండలమండలమండితంబును పీయూషస్రవత్పారిజాతవిభ్రాజితంబును
ఛత్రచామరసమన్వితంబును విశాలంబును నగు సింహాసనంబాసంగి యుండు సమా
సీనుంగావించి యానందంబు సుందరాస్యంబున నందంబుగొల్ప నిట్లనియె.

క॥ సఫలంబయ్యెను జన్మము సఫలంబయ్యెను దపంబు సల్పిన నోముల్
సఫలంబయ్యెను ధర్మము సఫలంబయ్యె హరి! నీవు సనుదెంచుటచేన్.

తే॥ భక్తులకు సాయపడెదు నీపైని భక్తిఁ జూపఁజాలని దుష్ట నశుద్ధబుద్ధి
నైన నన్నిప్పుడిట్టి సిద్ధాశ్రమావగాహనము ధన్యగాఁ జేసెఁగద! మహాత్మ!

ఉ॥ నాబలమూతగాఁగొని రణంబున వైరులరూపుమాపవే !
నాబలమైన కారణమునన్ గిరినెత్తి వ్రజంబుఁగావవే
నాబిగినెమ్మిగోకులమునన్ విభవంబును నాకుఁజూపవే
నాబలిమిన్ క్షణంబున మొనన్ హతుఁజేయవె శంఖచూడునిన్. ౮౯౯

తే॥ మఱిజగజ్జేతయౌ కంసమానవపతి యడలఁడే ? నీబలమున కమరవిభుఁడు
గర్వమునువీడి తిరుగఁడే ? కమలనాథ ! నీదుచరితంబు నేను వర్ణింపఁగలనె ?

ఉ॥ రాసమునందు గోపికలరంబున నీదరికేగుదెంచి సం
తోసముఁబొంది కౌఁగిళులతో మృదుభావలతోడ మన్నన
జ్జేసి వశంబొనర్చుకొని నిక్కుచునుండ మెలంగవాకొ ? నీ
వీసరణిన్ బొనర్చుట మహీగతనారవిడంబనంబగున్. ౯౦౦

క॥ తన విభుఁగూరిచి యీరహితనుచుండెడి కీర్తిపుత్రి యావలవడితోఁ
దనచెలియగు చంద్రానన యనుమతివిన్నించె నిట్టులాహరిసతులన్.

ఉ॥ భామను సత్యజాంబవతి భద్రిఁగళిందకుమారి లక్ష్మణా
భామిని మిత్రవింద మఱిభైష్మిని డాయుచు వేఱువేఱుగాఁ
బ్రేమను గాఁగిలించుకొని ప్రీతిపురస్సరసూక్తులాడి త
త్క్షేమమెఱింగి స్వస్థితు లతిప్రిమదంబునఁదెల్పి యొయ్యనన్ ౯౦౧

తే॥ షోడశసహస్రగోపికాసుందరులను జేరి తమిని బుజముల నాశ్లేషములను
సల్పుకొని యుచితంబగు సరణిఁబలికి సత్కరించి యు మఱిఁబల్కసాగె నిటుల.

ఉ॥ చందురుఁడొక్కఁ డుద్భవిలసాగినతోడ్తఁ జకోరవారము
ల్దండడి మూఁగినట్లు కమలప్రియుఁడొక్కఁడు వచ్చినంత దృ
గ్బృందముమెండు గ్రాలినటు లీ భగవంతుఁడొకండు ప్రేమతో
నిందుననొప్పుచుండ మనమెల్లరముంటిమిగాదె భక్తితోన్. ౯౦౪

సీ॥ పద్మప్రిభావంబు భ్రమరముఖ్యంబును గావ్యప్రభావంబుఁ గవివరుండు
రత్నప్రభావంబు రత్నపరీక్షిత్తు విద్యాప్రభావంబు విబుధవరుఁడు
గానప్రిభావంబు గాయకశ్రేష్ఠుండు రసమహిమంబును రసవిదుండు
నోషధీమహిమంబు నుత్తమవైద్యుండు శిల్పచాతుర్యం బనల్పశిల్పి

తే॥ మాత్రమెఱిఁగినయట్టులే మరుగులేక భక్తుఁడొక్కఁడు మాత్రమీపరముఁడైన
కమలనాథుప్రిభావంబుఁ గాంచఁగలుగు నంబుజేక్షణలార ! యోషకలార !

— రుక్మిణి మొదలగువారు రాధను గౌరవించి సత్కరించుట —

చ॥ అవల విదర్భరాజసుత యాదవపుంగవుల నాలకించియున్
సవతులఁగూడి యిట్లనియె సాధ్వి! వృషభానునందినీ!
యనవిని నీకె ధన్యవనియందును నీగుణభక్తి కీర్తనమా
ధవుఁ డిటులొంగె నట్టి నినుదర్శనమొసఁగక యూరకుందురే ? ౯౦౮

తే॥ ఏమహామహాచరితంబు నెల్లజగము లెప్పుడు పొగడునో యాజగదీశ్వరుండె
నీదుచరితంబుఁ గీర్తించు నెమ్మినెప్పుడు నింతకంటెఁ గృతార్థత యేమిగలదు ?

క॥ ఇదమ్మాధవుఁ డెటువలెనో యమ్మా నీవని నిన్నుఁజూచి యలరితినమ్మా!
యిమ్మెయి నెమ్మిని మాశిబిరమ్మున కేతెంచ మిగులఁ బ్రార్థించెదమీ!

వ॥ అని వినయమ్ముగా వాక్రుచ్చి యనలంబంబుగా నాదరించుచు నిజకరార
విందంబిచ్చి శతయూధసమన్వితయగు నా రాధికాలలనాలలామమును మహోత్సుకుం
డగు శ్రీకృష్ణునితోడఁ బద్మకింజల్కవాసితంబును, సర్వతోభద్రంబును హైమం
బును నగు నాత్మశిబిరమ్మునకుఁ దోడ్కొనివచ్చి యందు శిరీషపుష్పకోమలంబగు నోవ
బర్హణపర్యంకంబును వేసి యందవ్వారిని సమాసీనులంగావించి సవస్త్రసహితమైన స్త్రీ
మాలాభరణాదులం జక్కగానలకరించిపూజించి గోపీశతయూథంబును నైతము వేఱు
వేఱుగా నర్చించి నిజవిభునితో సముచితంబుగా బహువిధంబులుగా సంభాషించి
నిద్రించుచ్చి యా కీర్తిపుత్రింగూడ నిజబోధంబనిచి కృష్ణభార్యలందఱు నమితమ
గుడారంబులకుం జనిరి. అంత రుక్మిణీతరుణీమణియు నిజవాసమ్మున కేతెంచుపట్టున
శ్రీకృష్ణుండు తల్పంబునన్ మేల్కొనియూర్చుండుటంగాంచి యల్లనడాసి దేవా! యర్ధ
రాత్రంబైనను నిద్రింపకుండుటకు గతంబేమో తెలుపుమని సవినయమై వేఁడ నా భగ
వంతుం డిట్లనియె. ౯౦౯

చ॥ తరుణిరో! యట్టి రాధికకుఁదత్పరతన్ విధిపద్ధతిన్ నమ
స్కరణము లర్ఘ్యలున్ నుతులు స్వాగతమిచ్చి మహోపచారముల్
బోరిఁబోరి నీవు చేసితివి వోండెను నంతస మామె కాని ని
ద్దురతొలియందు వాడుకగ దుగ్ధముగోరిలును బ్రిత్యహంబునున్. ౯౧౦

తే॥ అద్ది యీదినమిచ్చట నమరలేదు దాన రాధిక నిద్దుర మానెగాన
నాకునైతము స్వాపంబురాకయుండె నాలసింపక క్షీరంబులా మెకిమ్ము.

చ॥ అనవుడు భీష్మనందిని యహో! యటులా! యని యొప్పి వెంటనే
తనదు సపత్నులంగలిసి తక్కొఱకానివి పంచదార గ
ల్పినవి మహోష్ణమైనవగు క్షీరము బంగరుగిండిఁబోసి రా
ధను గడుపారఁగోరెడివిధంబున నల్పి విడెం బొసంగియున్. ౯౧౧

తే॥ సత్యభామాదులఁ గూడి శౌరిదరికిఁజని సుకృతమంచుఁ దత్పదసరసిజముల
స్వమృదుకరపల్లవంబులఁ జక్కనొత్తు చందుబొబ్బలఁ గని యిట్టులనియె వింత.

క॥ అరవిందనాభ! యేలా? యరవిందసమానతావకాంఘ్రియుగమునన్
బొరిఁబొరిబొబ్బలు దగె నిత్తఱిఁ గారణమేమి చెపుమ తద్విశయముపోన్.

చ॥ పలుకఁగనిట్లు చక్రి తనపై నల రాధికకున్న ప్రేముడిన్
దెలుపఁ బ్రసన్నచిత్తుఁడయి తియ్యనిపల్కుల ప్రేతలున్ స్వభా
ర్యలు వినుచుండ నీరహీనినాడె విదర్భనరేంద్రపుత్రికా
తిలకమ! యల్లె చెప్పెదను దిన్నగదానిని నాలకింపుమా! ౫౧౫

ఉ॥ దేవి! జగత్సమస్తసుదతీనుతజీవితరాధికాత్మరా
జీవమునన్ మదంఘ్రిసరసీరుహాయుగ్మము స్నేహాభక్తిపా
శావృతమాచునుండి యిసుమంతియు నీవఱకున్ జలింపలే
దావృషభానుపుత్రి కెనయౌనొకో? యెట్టి మహామహుండునున్. ౫౧౬

తే॥ ఇట్టి సమయంబునందున నీవు రాధకిడినపాల్వేడియౌటచే నిట్లడుగులఁ
బుట్టె బొబ్బలుగనుఁడి! పూఁబోఁడులార! యనఁగ రుక్మిణీముఖసర్వవనితలువిని

మ॥ అల హరియద్దుదమ్ముల మహాద్యుతితో సరిజేసి యిల్లెదన్
దలఁచిరి చాగురే! యహహా! తన్వ్రిజనాయిక కీవ్రజేశుపైఁ
గల తమియింతయంచు ననఁగానగునే? యెవరీమె కీడురాఁ
గలరొకో? యద్వితీయపరగా నుతియింపఁగనౌను సర్వథా. ౫౧౮

మ॥ మురళీగానవినోదబద్ధసుమతీ! ముల్లోకముల్ మెచ్చ సుం
దరబృందావనమందు గోపికలతోఁ దద్రాధికాభామతో
నరుదౌమాదిరి రాసముఁ సలుపవే యద్దానవారెల్లరున్
జరితార్థల్ గద తత్తపోబలము లెంచన్ శక్యమే? యేరికిన్. ౫౨౦

తే॥ కాని యారాసకేళీవిధానచిత్రములను వినుటయేకాని కన్నులకుఁబండు
వగను గాంచలేదో హరి! ప్రస్తుతమున నవ్వి కరుణను మాకిటనగుపఱచుమ!

క॥ కలరిట గోపికలందఱు గలదుగదా రాధికయును గ్రమస్థలమున్
గలదన్నియుఁ గలవీవిఁక సలుపుమ! యారాసకేళిసరళుల దేవా! ౫౨౧

క॥ చేర్పుమ! ప్రేతల రాధను గూర్పుమ! తచ్చిత్రరాసకుర్దనవిధులన్
నేర్పుమ! మాకును దద్గతిఁదీర్పుమ! మాకోర్కి సర్వదేవస్తుత్యా! ౫౨౩

ఉ॥ రాసముఁ జేయ నీయవసరంబుచితంబని చెప్పుచుంటిమో
శ్రీసుదతీప్రియా! యనఁగ శ్రీహరియున్ ముదమందిపల్కె ని
ట్లో సతులార! మీయెదలనున్నతలంపులు మంచి వివ్వి యా
రాసవిధాననాయిక కరంబుగనొప్పినచో ఫలించెడిన్. గ_౨౪

ఉ॥ కావున రాధికామనము గట్టిగ వేఁడి ప్రసన్నమౌనటుల్
కీవిగసల్పుఁ డత్తఱిఁ గడిందిగనయ్యెడి రాసకేళులో
భూవరపుత్రులార! యనముచ్చటఁ జెంది తదష్టభార్యలా
శ్రీవృషభానుపుత్రికడఁ జేరిరి సూచిరి గోరిరహిన్. గ_౨౫

శా॥ తల్లీ! భక్తసమూహరక్షణపరా! తద్రాసరంగేశ్వరీ!
ఫుల్లాబ్జాక్షి! పరేశ్వరీ! భగవతీ! పూర్ణేందుబింబాననా!
యుల్లాసాన్వితగోపికాజనమణీ! యుక్తాంగి! కీర్త్యాత్మజా!
యుల్లంబారఁగ మ్రొక్కుచుంటిమిఁక మాయుక్తుల్ జెవిన్ బెట్టుమా!

చ॥ రసదుఁడు రాసనాయకుఁడు రంజిలునిందున రాసముఖ్యవి
వెసఁగుచునుంటి విచ్చటనె యీస్థలినుండెడి సర్వగోపికల్
రసమునుగోరునేమునిటఁ గ్రాలితి మందున రాసకేళులన్
బసపొసఁగన్ రచించుచు సపారముదంబును గూర్పవే సఖీ! గ_౨౭

ఉ॥ అంతట విన్నరాధికయునాడె నిటుల్ చెలులార! యట్టి శ్రీ
కాంతుఁడు నొప్పినప్పుడ యఖండభవత్ప్రియమౌను గాన మీ
రింతటనైనఁ బోయి హరి నెట్లొ ప్రసన్నునిఁ జేయుఁడీ! యనన్
గాంతలు వారలామెకు జగత్పతి యొప్పినచొప్పుఁ జెప్పఁగాన్. గ_౨౮

తే॥ ఆమె యురరీకరించియునట్టులౌనుగాతమంచుఁ బ్రసన్నయై వ్రేతలగుమి
తోడఁగూడియుఁ బాడుచుఁ గ్రీడఁ జేయ సర్వసన్నద్ధయైయుండె జనకరాజ!

## —♦ శ్రీకృష్ణుండు రాధాష్టభార్యాదులంగూడి రాసక్రీడం గావించుట ♦—

వ॥ అంత శ్రీకృష్ణుం డనుత్తమంబగు నుత్తమాంగంబునం దాపింఛాభంబగు బర్హపింఛంబంచితంబుగ లగించి మణిగణాంచితముక్తాదామంబులం జుట్టి రాకాపూర్ణసుధాకరబింబసదృశంబగు సుందరముఖంబున దృష్టిదోషపరిహారంబుగాఁ దిలకంబిడి శ్రీకారాకారానుకారంబులగు శ్రవణంబులకు మండనంబులగునట్లు కుండలంబుల ధరించి తిలపుష్పనిభంబగు నాసికంబు లలితంబుగా సింగారించి కంబుతుల్యంబగు గళంబునందారహారంబులు మనోహరంబుగా వేసి శ్రీవత్సలాంఛనాంచితంబును, గవాటవిశాలంబును నగు వక్షస్స్థలంబునం గౌస్తుభంబలంకరించి తిరస్కృతదిక్కరటికరం

బులును, సర్వాలంకారంబులును నూపురంబులను గంకణంబులం బెట్టి పంచాస్యమధ్య ప్రశస్తంబగు లక్కంబునం దళతళలాడు నలినంపుఁబొంబట్టుపుట్టంబులం గట్టి సనకసనందనాదిమునివృందవందితంబులును, సకలభువనరక్షాకరణకరణంబులును నగు చరణంబులందు మంజులధ్వనిమనోజ్ఞమంజీరంబులం గూర్చి బింబతులితంబును, దాంబూలచర్వణారుణితంబును నగు మధురాధరంబున దరహాసంబుగా నికోరికతో సర్వశబ్దసరసంబగు మురళిం దాల్చి పల్లవంబుల నుల్లసంబాడు చేతివ్రేళ్ళం బట్టి తద్వివరంబులం బూరించి వెన్నెలం బోలిచిర్నగవు వల్లవులం బర్వ నలరుచుం బ్రీతిమెయి నాత్రోవలం జేరందీసి సాలంకారయు జగన్మోహనియునగు రాధికను వామకరంబునం గైకొని రుక్మిణ్యాద్యష్టపట్టమహిషులం గూడి సర్వసిద్ధికరంబును భువనప్రసిద్ధంబును నగు సిద్ధాశ్రమంబునకు శ్రద్ధమెయి నేగి మాఘమాసంబందలి పూర్ణిమాతిథియం దానందసంధాయకంబగు చంద్రోదయసమయంబున నృత్తవిద్యానవద్యంబై సర్వజనహృద్యంబై నవనవరాసమండలంబులం గల్పించి యందెందఱు సుందరీమణులు గలరో యందఱకు నన్నిరూపంబులం దాల్చి తాన యిరుకేవల భూషణభూషితులై పాలుపాఱు మోహనాంగులుగావించు గీతావేణుమృదంగాదిగానంబుల కనుకూలంబుగం బాదవిక్షేపంబులిడుచు నాడుచుం బాడుచు నుత్సహించుచుండ, దానును వల్లవపల్లవాధరలును సత్యభామాద్యష్టభామినీగణంబులును, శంఖపద్మవజ్రకందుకచతుర్ముఖ చక్రవాళి చతుర్భద్రనాగనందావర్తకుండలీకరణఖురరీబంధప్రముఖంబులైన బంధవిశేషంబులకుం బ్రవేశించి మించి సమపాదసమపాదవినివర్తితగతాగతవలితవైశాఖమండలత్రిభంగిప్రముఖంబులైన స్థానకంబులం దనూనంబుగ నిలిచి ఘటితాఘటితమర్దితావ్యావర్తప్రముఖంబులైన పాదకర్మవిశేషంబులం జూపి సమపాదశకటవదనమాతల్లీసూచీప్రముఖంబులైన పాదచారీభేదంబులను గనుపఱచి యపక్రాంతడోలాపాదసూచీప్రముఖంబులైన వ్యోమచారీవిశేషంబులును, గపిద్ధకటకాముఖశుకతుండార్ధచంద్రత్రిశూలపతాకపద్మకోశముఖంబులైన స్వస్వభావ వివిధవిధకరభావంబులం జేసి సమానదిత్రభ్రమణకటాక్షనాదులైన జానుమండలభేదతండంబును దండలాతాలాంతలలితవిచిత్రప్రభృతులైన దైవమండలంబుల దండిగ నాచరించి మీలనోన్మిలనకుంచితవికాసప్రముఖంబులైన దృష్టివిశేషంబుల నగుపఱచి నికుంచితాకుంచితకంపితాకంపితపరావృత్తపరివాహితప్రముఖంబులైన శిరోభావంబులం గనుపఱచుచు గోటిచంద్రప్రతీకాశుండై జగన్మోహనుండై సుందరీమణితారావారమధ్యగతుండై వాత్సృకుండై వెలుంగుచుండె. అప్పుడా రాసరంగంబు గంధర్వలోకంబుకరణి గానాసారంబై నందనవనంబువిధంబున సుమనోమనోహరంబై హరినిలయంబునుబోలె సర్వమంగళాకరంబై కళాకరమండలంబునుబోలెఁ గువలయాభిరామంబై రామాయణంబురీతి రామాభ్యుదయంబై దయాళుహృదయంబువిధంబున భూతరక్షాకరణసమర్థంబై సమర్థవిలాసంబులీల ననేకప్రబంధబంధురంబై చెన్నుమీఱె. అందా గోవిందుడు కాంతతోఁగూడిన మదనుని సొబగునను, సౌదామినిఁగూడిన జీమూతుని-

రీతిని, రోహిణితోఁగూడిన సుధాకరుని సొంపునను, శచితోఁగూడిన శక్రునిసరణిని నా రాధికాసతీమతల్లికతోఁగూడి యొప్పె. మఱియు ౫౩౦

తే॥ రుక్మిణీముఖకాంతలు రుక్మవర్ణభాసమానలు నృపసుతల్ రాసములను సలిపి తెన్నిశలన్నిటికిఁగణముఖాలెఁ గడపి హరితోడనిటు కట్టకడకు ననిరి.

క॥ ఓ నందనందనా! వ్రజమానినులనుగూడి రాసమండలమున నీ వానందప్రదవాస్యములాడెఁగా మొఱయసల్పి హర్షంబిడవే! ౫౩౨

శా॥ నీ వేషంబును భాష నీదు తెలుకుల్ నీకైతల్ నీకులుకుల్
నీ విన్నాణము నీ దరస్మితములున్ నీ టాట్యు నీ నాట్యముల్
నీ వైదగ్ధ్యము నీ మనోహరగతుల్ నీ వేణుగానంబులో
దేవా! యాదృశరాసకేళిఁగనసాధీరుల్ దిదృక్షాపరుల్. ౫౩౩

క॥ మునుపల బృందావనమునఁజని గోపీసతులతోడ జరిపితి వీరా సనికరమిప్పుడో భూవరతనయులనుగు మమ్ముఁగూడి తద్దయురుపవే? ౫౩౪

క॥ కావున నిటురాసము లేతావున నొనరింపలేదు తథ్యముగానన్ దేవా! ధన్యత నీకృప నీవేళనుగల్గెమాకుఁ గృష్ణావ్రతుణీ! ౫౩౫

తే॥ ఇట్టిశ్రేష్ఠుని మేమెందు నెపుడుగనము
నిన్నుఁబొగడంగఁదరమా నె? నిర్మలాత్మ!
మాదుజన్మము లిపుడునిర్మలములయ్యె
మోహనాకార! వినుమయ్య! మ్రొక్కులివిగో. ౫౩౬

క॥ డెందమునందున ముని యానందమునయుని నిన్నుఁగొల్చినపనవగతులన్ జెందెడినానందము మాకందఱకునుగూర్చియుంటి వహహా! కృష్ణా!

మ॥ శ్రుతివిత్సన్నుతమూర్తి! యాస్థలమునన్ శోభిల్లెడిన్ గోపికా
శతయూధంబులు రాధ షోడశసహస్రప్రేయసీరత్నముల్
రతిరూపాంచితచేటికావృతధనద్రాజ్యష్టకం బందుచే
నతిరేకించెడి నేఁటిరాసముల బృందారణ్యరాసస్థితిన్. ౫౩౭

చ॥ అనవుడు శౌరినవ్వి యిటులాడెను నోసతులార! బృందయన్
వనమున నేను ప్రేముడిని బల్మఱుజేసిన రాసకేళు లీ
దినమున నైన రాసములతీరున కీడుగరావటంచు మీ
గనెదరు కాని రాధ నిపుడన్గఁడి! దీనిని గొంకు లేనటుల్. ౫౩౮

ఉ॥ నావుడు వారలెల్లరును న్యాయపురస్సరవాక్ప్రవీణలై
యావృషభానుపుత్త్రి కిటులాడిరి పూర్వమునందు సట్టిబృం
దావననైన రాసములు తౌల్యముఁజెందునె ? నేఁటిరాసఖే
లావిధికిద్ది దెల్పుము సలక్షణపద్ధతి భామినీమణీ ! ౫౪౦

చ॥ అని యభిమానయుక్తలయి యాడగ నాయమ నవ్వి యిట్లనెన్
వనరుహనేత్రలార ! బహుభామలతో నిటరాసముల్ రచిం
చిన నలబృందకాటవినిఁజేసిన రాసముతోడఁబోలునే ?
ఘనమిదియౌనె ? యెన్నటికిఁ గాదనినమ్ముఁడి ! నెమ్మనమ్మునన్. ౫౪౧

తే॥ కారణంబేమనన్ బృందకావనంబు దివ్యతరుసమాకులము నుదీర్ణమైత్రి
భారనతలతమును మధువ్రతయుతంబుగలదె ? దృక్పర్వముగ నిటఁగాంతలార !

ఉ॥ ఎయ్యదిపుష్పగుచ్ఛముల నెంతయునొప్పెనొ మాళిఁబూనిన
ట్లెయ్యది రత్నతీరముల హెచ్చుగ ముద్రితమయ్యెనో మఱిం
కెయ్యదిపద్మహంసవిహగేంద్రబకాదిమనోజ్ఞమయ్యెనో
యయ్యమునాస్రవంతి యిటహర్షశుభాస్పదయౌచునున్నదే ? ౫౪౩

ఉ॥ అక్కడిచందనావనిరుహంబులు నక్కడిభృంగరాజిరాజితం
బక్కడిమాధవీలతలు నక్కడి కుంజనికుంజమండలం
బక్కడి దివ్యసైకతము లక్కడిసుందరమందిరోత్కరం
బెక్కడనక్కలార ! యొకచోనియు మచ్చునకైననున్నదే ? ౫౪౪

తే॥ రత్నసానుసమేతంబు రామణీయకమును భూరుహవల్లరీసుమఫలాన్వి
తంబు ఘనమును బుణ్యతీర్థసహితంబు నచలవరము గోవర్ధనంబిచటఁగలదె ?

చ॥ అలవనినైన మందమలయానిలమున్ సుమసౌరభంబులన్
జెలఁగుచుఁ జల్లగావిసరఁ జిత్రపతత్రికలస్వనంబులున్
లలితముగా జనింప లతలన్ విరులన్ దగుసైకతంబులన్
గల వనమాలిసొంపు లిటఁగాంచితినే ? చెలులార ! చెప్పుఁడీ ! ౫౪౬

ఉ॥ ఆమురళీవినోది మధురారవ మా కుటిలాలకోజ్జ్వల
త్సోమసువక్త్రపల్కుల యశోదకిశోరుకిశోరతాకృతి
స్తోమము నామనోహరుని చూడ్కులొయారపుకాల్నడల్ నవుల్
ప్రేమనుగాంతలార ! చెవివింటినె ? కంటను గంటినే ? యిటన్. ౫౪౭

ఉ॥ ఆహరితోడఁగూడుటయు నాడుటపాడుట డాఁగుచేఁగుటల్
మోహావశంబునన్ సలుపుముచ్చటలున్ బొదరింటనుంట న
వ్యాహతకామకేళులను నాగుటనూఁగుట హస్తకర్షణో
త్సాహము హస్తవర్జనవిధానము నాకిట సంభవించెనే ? ౧౮౮

ఆ॥ కోకలంగొనుచు నికుంజమందొకమూల దాఁగినట్టి యతనిఁ దద్దవెదకి
పట్టికొన్నముదము వంశివేత్రముల నేఁగొనియుఁ జనిన వేడ్క దనరెనొక్కొ ?

వ॥ మఱియు సుందరంబగు నా బృందావనంబందలి కృత్యంబు లసంఖ్యాకంబులై యనవద్యంబులై యప్రమేయంబులై పొలుపారు అట్టి ఏస్థలంబున మందువకైననున్నవే ? పత్యాంతరంబున నొండుకొండులీలలు గోపాలకృష్ణునిచే నొనర్పఁబడినవని యొప్పుకొన్నను నవి బృందావనరాజం బిందులేమిని మనకిప్రియంబులుగాకపోయె. ఏస్థలంబున నేలీలలు చేయఁదగినవో యవి యొనరించిన మనోజ్ఞంబుగా నుండునని పలుకనాసత్యభామాద్యష్టపట్టమహిషులు నిజగర్వంబులంబుచ్చి యచ్చెరువొంది ముచ్చటఁపడఁజొచ్చిరి. అంత నాయనంతుండు పూర్వోక్తంబుగా నాసిద్ధాశ్రమంబున స్నానంబులంజేసి సర్వగోపీగణంబులను దోడ్కొని రాధికాసహితుండై నిజధర్మపత్నులు తోడుగానడువ ద్వారకానగరంబుఁ బ్రవేశించి యత్యుత్తమంబులగు హర్మ్యంబులనుగట్టించి యందు రాసేశ్వరిని వసింపఁజేసి యితరంబులగు దివ్యసౌధంబుల నా వ్రేతలుండునట్టుసల్పి సుఖంబుగాఁ గాలంబుగడపం దొడఁగెఁగాదె. సర్వపాపహరంబును మోక్షప్రదంబునునగు సిద్ధాశ్రమ కథామాహాత్మ్యంబులు కధితంబులయ్యెనని వాకుచ్చి క్రమ్మఱ ద్వారకాపురిని బ్రశంసించుచు నిట్లనియె. ౧౯౦

—♦ ద్వారకాపురీ వర్ణనము ♦—

తే॥ పార్థివేశ్వర ! ద్వారకాపట్టణంబు వందయామడల్ వెడలుపుఁజెందెఁ జుట్టు
కొలతనాల్గువందలయామడలు సెలంగుఁ దత్పురీవిషయంబులఁ దమినివినుమ!

క॥ అనఘా ! దత్పురినడుమను వనమాలివినిర్మితంబు భావుకదంబున్
ఘనము వరము ద్వాదశయోజనపరిమితదుర్గమొందు సక్కఁగనుండున్. ౧౯౨

తే॥ మఱియు నావీటివెలుపల హరిరచితము నద్భుతంబును నవయోజనాన్వితమును
సకలజననేత్రపర్వము సర్వసిద్ధికరము నొదుర్గముండెడిఁ గాశ్యపీంద్ర ! ౧౯౩

ఉ॥ సత్తమ ! యాపురిన్ మఱియు సర్వకళాస్పదమద్భుతంబులో
కోత్తరమున్ రమారమిని యోజనయుగ్మముగల్గి పేరుపే
రెత్తిన దర్థవంతమును హేమమణీసముదాయవిస్ఫుర
ద్భిత్తికవాటసౌధముల వెల్గెడి మూఁడవదుర్గమొప్పెడిన్. ౧౯౪

క॥ ఆ దుర్గములఁదొలిది దామోదరునిది దానియందు మోక్షప్రదముల్
శ్రీదనుజాంతకగృహములు మోదదములుగాలు నాఱుమూఁడునులక్షల్.

శా॥ ఆలోనన్ వృషభానువర్యతనుజాత్యాశ్చర్యదాగారమున్
గాఁలిలున్ గాదె తదీయమై చెలఁగుద్వారంబందు బృందిష్టమై
గోలోకాగతమై యఘౌఘహరమై గోవిందనుత్యంబునై
లీలాధామమునై వెలింగెడిగదా లీలాసరోరత్నమున్. ౧౧౬

క॥ అటస్నానంబునుసల్పిన కటికయును నటనుటేఁడు గరోత్కటకుఁడేన్
జటులంబగుపాపంబుల జిటికేఁదుటూరించి పరముఁజేరున్ మీఱున్. ౧౧౭

ఉ॥ అందున నెట్టివాఁడయిన నప్పుడుమున్ని సమాహితాత్మ రా
త్రిందివమున్ నుతించి సవిధిన్ నతిసల్పి వ్రతంబుఁజేసి మే
ల్పొందనమించుకే నిడినఁగొంకక జంకక కోటిబాములం
దొందినపాపముల్ జదిపి యుత్తమకీర్తినిఁబొంది నెట్టనన్. ౧౧౮

క॥ తమిఁదన్గొనిచన గోలోకమునుండియు వచ్చినట్టి ఘనరథమం దె
ల్లమునులుగని పొగడంగా నమలాకృతి నెక్కి యతిశయానందమునన్.

మ॥ సుమరత్నాపితహారతారములతో సూనాస్త్రరూపంబుతో
విమలాదిత్యసహస్రతుల్యరుచితోఁ బీతాంబరశ్రేణితో
భ్రమదీఱండిగి పార్షదుల్ జయజయధ్యానంబులొప్పన్ ఘనుల్
దమివింజామరలన్ గ్రహించి విసరన్ దాఁజేరుగోలోకమున్. ౧౨౦

వ॥ అనిపలికి వెండియు నిట్లనియె. మైథిలేశ్వరా ! తన్నగరంబునం బదాఱు వేలనూటయెనిమిది పుణ్యతీర్థంబులును, శ్రీకృష్ణాష్టభార్యామణుల మందిరంబులును, గలవు. అవ్వాని కెవ్వరైనను వేఱువేఱుగాఁ బ్రదక్షిణంబు లొనరించి పునఃపునః ప్రణామంబు లాచరింపందగు. అందు జ్ఞానతీర్థంబనునది యొండుగలదు. తత్తీర్థంబున స్నానంబుసల్పి యటఁగల పారిజాతవృక్షంబును స్పృశించినవారికిఁ దక్షణంబున భక్తిజ్ఞానవైరాగ్యంబులు నిస్సంశయంబుగాఁగలుగు. మఱియు నవ్వారలహృదయమున వారమ్ముందాముకుందుం డానందమయుండై యెల్లప్పుడు నివసించి రక్షించుచుండు. స్వయంబుగా నా మహాత్మునిని సమృద్ధిసిద్ధులు వరింపంగలవు. ఎవండాదుర్గంబుదుఁ గల నందనందను సుందరమందిరం బానందంబునంగాంచునో యవ్వాఁడే భూతభవిష్యద్వర్తమానంబులందు జీవన్ముక్తుండనియుఁ, గృతార్థుండనియు, నిరుపమానవైష్ణవుండనియుఁ జెప్పందగువాఁడని గుర్తెఱుంగుము. పంచయోజనవిస్తారితంబగు తద్భగవన్మందిరంబునకు ధనుశ్శతమాత్రపరిమితదూరంబునం గృష్ణతేజస్సముద్భవంబై కృష్ణకుండనామకసరోవరంబొండు ప్రవహించుచుండు. జాంబవతీసుతుండగు సాం

బుండందు స్నానంబుసల్పి శ్రీకృష్ణుని యనుగ్రహంబున ముక్తుండైనట్లు తత్సరసిని స్నాతుండైనవాఁడు జీవన్ముక్తుండుగాఁగలఁడు. మహాబలుండగు బలరాముండు భూప్రదక్షిణాచారించి యభిజ్ఞనుత్యంబగు యజ్ఞంబొనరించి రేవతీసహితుండై యెచ్చోట విరాజిల్లెనో యందుతిృప్తతమంబగు బలభద్రసరోవరంబు వెలుంగు. అద్ది పూర్వోక్తకృష్ణకుండంబున కష్టాదశపదపరిమితదూరంబునఁ దూర్పుదెసంగలదు.

తే॥ అందు మునిఁగినవానికి నఖిలపాతకములు నశియించుఁ బుణ్యముల్ గలుగువైష్ణ
వమగులోకంబు సిద్ధించు బహుళసుఖములందుఁబొందును సందియమందవలదు.

చ॥ మునుపల రుక్మిణీతిసుణీపుత్రకుఁడౌ సుమబాణునెందునన్
గనుఁగొనలేనియప్డు గణనాథున కర్చలనేర్చలిన్ బొన
ర్చెనొ యెది యట్టి శ్రీహరి విచిత్రగృహంబున కంతకాశ వే
ఘనుప్రల దవ్వునంగలదో తత్సలినొప్పు గజాస్యకుండమున్. ౫౬౩

క॥ ధాత్రీశా! యిట మునిఁగినపాత్రుఁడు పొన్నిడిన పుత్రఫలమొందును ద
త్పుత్రునివంశము సితనక్షత్రవిభునిమాడ్కి వృద్ధిఁగాంచుచు వరుసన్. ౫౬౪

సీ॥ శ్రీకృష్ణుఁ డెందునఁజేసి తానంబులనెల్లప్డు డీవులనిచ్చునిడునొ
యెదికొల్దిబంగరునిచ్చిన దానికి నిబ్బడిఫలముల నియ్యఁగలదొ
యెదికొల్దిరజతంబునిచ్చిన దానికి నిడఁజతుర్గుణఫలమేరుపడెనొ
యెదియొకఫలమేనినిచ్చిన దానికి శతగుణలాభముల్ జక్కనిడునొ

తే॥ హరిగృహంబున కేది పశ్చిమాశ ద్విశత చాపపరిమితదూరమం దేపుమీఱె
నెద్దితీర్థరాజంబని యిద్ధమయ్యె నదియె దానసరోవరం బండ్రు బుధులు. ౫౬౫

చ॥ అటమొహరీల రత్నముల నాదృతినిచ్చిన పుణ్యరాశి కు
త్కటశతరాజసూయము లఖండసహస్రమహాశ్వమేధముల్
దిటముగఁజేసి పొందుబహుదివ్యఫలంబులు షోడశాంశమేన్
బటుగతిఁదూఁగఁజాలవని బాగుగనమ్ముమ! ధారణీశ్వరా! ౫౬౬

తే॥ బదరికాశ్రమయాత్రచే వచ్చుఫలము మేషరాశిని మిహిరుండుమెలఁగుచుండ
సైంధవాహ్వయవనయాత్ర సల్పుఫలము దమకు "దానతీర్థ" స్నానతత్పరులకు.

ఆ॥ తరణి వృషభమందుఁదగ నుత్పలావర్తమున మునింగి దానములనిడిన ఫ
లంబుకంటెఁ గలుగులక్షగుణఫలంబు "దానతీర్థ" రాజవర్యకులకు. ౫౬౭

తే॥ అంతకంటెను కోటిగుణాధికఫలమబ్బఁగలదని యెఱుఁగుమాయట్టి దాన
తీర్థమందొక మాసంబు దివ్యభక్తిమునుఁగుచుండెడి జనులకు జనవరేణ్య!

తే॥ అశ్వదానము దానములందు నేటి దానికంటెను మంచిది దంతిదాన
మంతకంటెను యోగ్యమానరదమిడుట సంతకంటెను భూదానమధికమండ్రు.

వ॥ సర్వసస్యసంపత్ప్రదంబగు నవ్వసుంధరాదానంబుకంటెను నన్నదానంబు మహాదానంబని వక్కాణింపంబడు. ఈ యన్నంబె దేవపితృభూతంబులకుం దృప్తిం గలుగంజేయు. ఇద్దానివలననే జగంబు విస్తారంబగు పంచకోశంబుల నీ యన్నకోశంబే ప్రథమగణ్యంబైనది. సమస్తజంతువుల కిదియే జీవనాధారంబు ప్రాణంబునం దిది ప్రతిష్ఠితంబైనది. సకలరోగంబుల నేగంజేయుట కిదియే యనుత్తమాగదంబు. ఇది లేనిప్రపంచంబు నశియించుటకు సందియంబులేదు. కావుననే యీ యన్నంబును బరబ్రహ్మస్వరూపంబని యార్యులొక్కమొగి ఘోషించిరి. ఇతరదానంబు లిద్దానివలెఁ దనివిం గూర్పం జాలవు. ఏతద్దానంబుతో సమానంబగునది త్రికాలంబులందును లేదని యెఱుంగుము. ఇట్టి యన్నంబును దద్దానతీర్థంబునం దానంబొనరించి దానంబాచరించిన మానవుని పుణ్యంబును, జతుర్ముఖుండుగాని షణ్ముఖుండుగాని సహస్రముఖుండుగాని వర్ణింపశక్తుండగునే? అవ్వాఁడు ఋణత్రయంబుఁదీర్చికొని పరమపదంబుఁజెందగలండు. వెండియుఁ దాదృశదానతీర్థంబున స్నాతుండై పూతుండై దాతయగువాని సుకృతంబు తత్పితృపక్షంబునం బదుగురకుఁ దన్మాతృపక్షంబునం బదుగురకుఁ దద్భార్యాపక్షంబునం బదుగురకును నరకంబుఁబాపి దివ్యరూపంబును జతుర్భుజంబులం గల్పించి పీతాంబరంబులం గట్టించి హారాదిభూషలను సింగారింపఁజేసి జయజయధ్వనులతోఁ బార్షదులు వెంటనంట దివ్యరథంబునం దారూఢులం గావించి గోలోకసుఖంబులం గూర్ప సమర్థంబై యుండుంగాదె. మఱియుఁ దద్భగవన్మందిరంబున కుదగ్భాగంబున నరకోసుదవ్వునన్ మాయాతీర్థంబు మనోహరంబై విరాజిల్లు. అందు సింహారూఢయుఁ జండముండనిషూదనియు భద్రప్రదయు దుర్గతివినాశనియునగు దుర్గ యనయంబు వెలుంగుచుండు. దేవకీదేవి తన కుమారుండగు శౌరి యపవాదాపనోదార్థంబై శ్యమంతకంబు సంపాదింప జాంబవంతునిబిలంబునకుం జనినకాలంబున సత్ఫలంబు లనన్యభక్తితోఁ దద్దుర్గంబూజించి జాంబవతీనామకప్రియాశ్యమంతమణివిభ్రాజమానశ్రీకృష్ణుండు మరలివచ్చుటం గని పరమానందంబుఁబొందె. అట్టి మాయాతీర్థంబు ఫలప్రదంబని వేఱుగానొక్కి చెప్పవలయునే? యెవ్వరాతీర్థంబునం జలకంబాడి యా మాయాదేవిం బూజింతురో యవ్వారు నిజమనోరథంబులు ఫలింపక్ గైవల్యంబున కరుగంగలరు. ఇఁకఁ దద్ద్వారావతీపురీవిరాజమానద్వితీయ దుర్గవిశేషంబులను వినుమని యిట్లనియె. ౫౭౧

## —♦ ద్వారకా ద్వితీయ దుర్గవర్ణనము ♦—

క॥ రెండవదుర్గమునకు నాఖండలదిశ నింద్రనామకసరోవర మొం
డుండును గామప్రద ముద్దండాఘవినాశకంబు ధర్మమయమ్మునై. ౫౭౨

క॥ ఆతీర్థంబున మునిఁగినఁబూతుండయి చంద్రవిభవముంగని జంభా
రాతిపదంబునకుం జని యాతతసౌఖ్యంబులొందు సథమాధముఁడేన్. ౫౨౩

తే॥ దానికింగుడివైపునఁ దరణికుండముండు నిచట సత్రాజితుండుష్ణరశ్మి
కర్చసల్పి స్యమంతకమనెడి మణిని భూషితుండయ్యెఁ బూర్వమోభూతలేశ!

క॥ జనుఁడెవఁడేనియునందున మునిఁగియు నొకపద్మరాగము నొసంగినచో
నినతుల్యవిమానంబున నినలోకముఁజేరి మీఱు నినసిభరుచితోన్. ౫౨౫

ఆ॥ దానికిం బ్రతీచి ధాత్రీతీర్థంబుఁడు నచట జలకమాడి హైమపాత్ర
మందుఁబాయసమిడి యతిశేయభక్తితోనిడిన వారిఫలము లీవువినుమ!

ఆ॥ పంచపాతకములు ధ్వంసమైపోవును బ్రహ్మహత్యలెల్లఁబాఱిపోవు
నన్నృతజనితదోషమడుగంటితేరెడి నిచటఁ గలఫలము వచింపనగునె?

చ॥ మఱిఁదలిదంద్రుల్ గురుల మానవనాథుల నాలఁజంపున
ట్టియ నట భక్తిమున్గిన త్రుటిన్ శుచులై దివిజేంద్రలోకమం
దయసముతో స్వపాదమిడియా కమలాసనయూపమొప్పఁగా
నరిగెద రజ్ఞజస్థలికి నాశశిసామ్యవిమాన మెక్కుచున్. ౫౨౭

తే. దాని కుత్తరదిక్కున్ దనరుచుండు "నీలలోహితతీర్థంబు" నీలలోహి
తుండు శ్రీమహాదేవుం డఖండదీప్తి సతతమచ్చోట వెలుఁగు రసాతలేంద్ర!

తే॥ మఱి మరుద్గణసప్తర్షి మాని దేవతలును దత్పలినుండు రాస్థలమునఁగల
నీలలోహితలింగబు నిశ్చలమతి నర్చ సల్పియారావణుండందెఁ బ్రభుత.

క॥ ఆ లింగంబును భక్తిని నాలోకించిన జనుం డనాయాసముగాఁ
గైలాసయాత్రఁ గలిగెడిమేలును శతగుణము లెచ్చుమేలునుబొందున్.

క॥ స్నానము దివసత్రయమును నా"నీలగిరికుండ" మందున మునుఁగం
గా నాశ్రీగణలోకం బానందముతోడఁబొందు నఘమయజనుఁడేన్. ౫౩౨

ఉ॥ భద్రదమున్ మనోహరము బాపవినాశకమైన "సప్తసా
ముద్రక"నామతీర్థ మటఁబొందెడి నందునఁ దానమాడు వాఁ
డద్రిదినిఁబోలు పాపము రయంబునఁగూలిచి శస్తసప్తసా
ముద్రకయాత్రఁగల్గు ఫలముల్ గనుఁగాదె విదేహభూవరా! ౫౩౩

తే॥ బ్రహ్మవిష్ణుమహాదేవవాయుసూర్య చంద్రదేవేంద్రపార్థభూజలధిధనద
వహ్నిముఖసురల్ దత్తీర్థపార్శ్వములను వెలుఁగుచుందురు సతతంబువినుతచరిత

క॥ మఱి యీ బ్రహ్మాండంబున వఱలుఁగదా సప్తకోటివరతీర్థము లా
సరసులు సర్వంబందున వరదము లైకలిసియుండుఁ బరహితబుద్ధిన్. ౨౮౭

తే॥ అట్టి తీర్థంబునందు నీరాడి చుట్టివచ్చు దిట్టలె ద్వారకాభవ్యయాత్రఁ
గన్న ఫలము సఫలముగాఁగంద్రుగాని యన్యథాకరించిన నద్ది వ్యర్థమగును.

తే॥ వెండి యా తీర్థరాజంబు విష్ణురూపమంచు వేల్పులువచియింతురట్టి ద్వార
కఁగల మూఁడవదుర్గమునఁగల సంగతులను జెప్పెద వినుమింక నలఘుచరిత!

—♦ ద్వారకాతృతీయ దుర్గప్రశంస ♦—

చ॥ వినుతచరిత్రుఁడున్ బ్రథితవీరుఁ డుదారుఁడు ధీరుఁడున్ విక
ర్తనవరశిష్యుఁడుర్ దశరథప్రియపుత్రకదాసుఁ డంజనీ
తనయుఁడు గ్రాలి యెల్లపుడు తత్పృథుదుర్గము దూర్పుఁబ్రోచు నా
ఘనుఁగనువాఁడు భక్తుఁడగుఁగాదె తదంజనిపుత్రుకై వడిన్. ౨౮౮

చ॥ అరయఁగనట్టి దుర్గమున కంతకదిక్కున సంతతంబు శ్రీ
హరిగతమానసంబు వరమైన సుదర్శనమోము దాని నె
వ్వరు గనుచుంద్రొ వారు నలపంకజనాభునిభక్తులై తదు
ద్ధురతరచక్రరక్షణముతోడుగ నొప్పుదురయ్య భూవరా! ౨౮౯

ఉ॥ దానికిఁ బశ్చిమాశ నతిధైర్యసమేతుఁడు ఋక్షనాథుఁడున్
మానదుఁడుర్ మహాబలుఁడు మాధవభక్తుఁడు జాంబవంతుఁడ
న్యూనముగాఁ జెలంగి సతమోమును తద్ఘనుఁజూచువాఁడు శ్రీ
జానికి ముఖ్యభక్తుఁడగుఁ జక్కఁజిరాయువుతోడ నొప్పెడిన్. ౨౯౦

క॥ దాని కుదగ్దిశ విష్వక్సేనుఁడు ఘనబలుఁడు ప్రోచుఁగీడ్పడువాఁడేన్.
వానింగనినన్ శ్రీహరిమానసమే ధన్యుఁజేసి మంచిన్ మనుచున్. ౨౯౧

వ॥ వెండియుఁ దద్బహిర్దుర్గంబున కనతిదూరంబునం దర్ధసిద్ధిప్రాయద్వారం బులనలెఁ జెలంగు రైవతాద్రిసముద్రంబుల నడుమను బిండారకనామక్షేత్రంబు సర్వతీర్థోత్తమంబై సకలపరిధానసంపన్నంబై మహాపుణ్యప్రదంబై చెన్నుమీఱు. మున్ని క్షేత్రంబునం బరిపూర్ణతముండగు శ్రీకృష్ణుని యానతివి యదుప్రభుండగు నుగ్రసేనుండు క్రతురాజంబగు రాజసూయంబొనర్చె. అందు బ్రహ్మాండగతసర్వ తీర్థంబులును సమాహూతంబులై స్థిరనివాసంబొనర్చునట్లు పిండీకృతంబయ్యె. తత్ప్రభృతి నాస్థలంబునకుం బిండారకక్షేత్రంబని ప్రసిద్ధిఘటిల్లె. అచట జలకంబాడిన వాఁడు రాజసూయఫలం బనుభవించు. దినత్రయంబు నీరాడివ్రతియై బ్రాహ్మణు

లకు స్వర్ణదానాదులంగావించి మ్రొక్కిన జనులకు ప్రత్యహం బవిచ్ఛిన్నంబుగా వంది మాగధస్తోత్రపాఠంబులను వినుచు భూషణవిభూషితలును, రాకేందువదనలును, క్షౌమవస్త్రధారిణులునగు విలాసినులచే సేవితుండై హృష్టుండై పుష్టుండై వీణా వేణు పటహఢక్కాదుందుభికాహళాదివాద్యంబులు మొరయ్య మొఱసినసరణిఁ మోయం గరీంద్రబృంహితంబులు నశ్వహేషలును సంకులంబుగా మంజులేక్షణలు మంచి చెడ్డలవిన్నవించుకొనుటకు మందిరబహిర్ద్వారంబున వేచియుండ రాజసంఘంబు నిటలతటఘటితకరపుటంబై పరివేష్టింప రత్నప్రఘటితస్వర్ణమయరథ్యాహర్మ్యంబులు విజయధ్వజంబులతోఁ బొల్పార మత్తకుంజరకర్ణతాడితంబులగు భృంగమండలంబు మంజులధ్వనిం జేయ జగజ్జేగీయమానుండై నరలోకశేఖరుండై వెలుంగుచుండు. అతండు మహాత్ముండని యెంచుట కనుమానింపఁదగదు. ఇహలైహికసుఖంబు లనుభ వించి యంతిమంబునఁ గైవల్యంబుఁజెందఁగలడు. మఱియు నెవ్వండైనను, గీ—౨

మ॥ అలపిండారకతీర్థముఁ గనక రాజ్యంబెట్టులఁ బొందు? నె
ట్లల పిండారకమందునన్ మును కకె యాత్మీయసత్పాపముల్
దలఁగా మోక్షముఁజెందు? నిద్దిసెపుమా! ధర్మంబు వర్మంబు ని
ర్మలకర్మంబు ముదంబు దీనివిడిచిన్ రాజిల్లునే? మేలుగాన్. గీ—౩

ఉ॥ యోగి సుయోగియౌ నతఁడనుత్తమతత్సరసిన్ మునింగినన్
భోగి సుభోగియౌ నతఁడు పుణ్యవతత్సరసిన్ మునింగినన్
రోగి నిరోగియౌ నతఁడు రూఢిగఁదత్సరసిన్ మునింగినన్
రాగి విరాగియౌ నతఁడరంబునఁ దత్సరసిన్ మునింగినన్. గీ—౪

తే॥ ద్వారకాపురమునకుఁ బ్రదక్షిణముల రాథమాసంబునం జేసి ప్రణతులిడిన
వారిచేతుల నైహికపారమార్థికసుఖములు గలవని యెఱుఁగంగఁదగును.

శా॥ తత్తీర్థప్లుతుఁడై యవాశనుఁడునై ధర్మిష్ఠుఁడై కేశవా
యత్తాత్ముండయి మేదినీశయనుఁడై యాహ్లాదియై మానియై
విత్తద్వారకయాత్రఁజై త్రిమొద లా విఖ్యాతవై శాఖిబల్
హత్తుందాఁక నొనర్చునట్టి జనుపుణ్యం బెన్న సామాన్యమే! గీ—౬

తే॥ అట్టి శ్రీకృష్ణపురయాత్రనమరునట్టి ఫలము లెన్నుట పదుచుండువానచినుకు
లెన్నుటయ కాక శక్యమే? యెట్టివేదమయచతుర్ముఖధాతకున్ మనుజనాథ!

సీ॥ ఘస్రంబులందు నేకాదశికై వడిఁ జలువలందున నాదిశేషుఁబోలె
పక్షిసంఘంబులన్ వైనతేయునిరీతి శ్రుతపురాణముల భారతమువితము
సంద్రంబులన్ క్షీరజలనిధిసరణిని దారలయందు సుధాకరువిధి
దేవతలందున దేవదేవునిభాతి నఖిలజంతువులందు హరివిధమున

తే॥ శ్రేష్ఠమైనకరణి నెల్లక్షేత్రములను ద్వారకాపురీక్షేత్రంబు వరము నిజము
దానిమహిమను వర్ణింపఁదరమె ? నీకు నాకుఁ దాతకు నాతనినాయనకును.

తే॥ ఆకసంబున మేఘముల్ గ్రహాదినులను గ్రాలులీలను వైకుంఠలీలలందగు
ద్వారకాపురి యాదవపటలిఁగూడి ధరకుఁదొడవయి ధన్యతఁ దనరె సహహ!

ఆ॥ ఆపురంబు నెప్పుడమరి చతుర్వ్యూహములను బాలనంబు సలిపి వెతల
నుత్తలపడుచుండు నుగ్రసేనునకిచ్చి సుఖగఁజేయుహరికి జోతలిడుదు.

చ॥ ఎపుడు స్వకీయలోకమున కేగుట కబ్జరుహాక్షుఁడెంచునో
యపుడలద్వారకాపురము నర్ణవమందున ముంచివేయు వి
శ్వప ! యటులైననచ్చట స్వసద్మముభాసిలకున్న వాసమె
ల్లపుడును సల్పునాస్థలిఁ జెలంగెడి నాతనిప్రీతియెట్టిదో. ౬౦౧

క॥ ఏతత్క్షణపర్యంతం బాతోయధియందుఁ గృష్ణుఁడాడెడినుడువుల్
ప్రాఁతిగ వినఁబడుఁగాదే భూతలపరిపాలకా ! యమోఘారంభా ! ౬౦౨

తే॥ వెండి శౌరి యాజలధిలోవిజ్ఞుఁడైన నజ్ఞుఁడైనను బ్రాహ్మణుం డతిశయముగ
మామకాత్మయయని పల్కు మాటికరయ విప్రపక్షపాతియకాఁడె? విష్ణుమూర్తి.

ఉ॥ బాడబుఁడైన మానవుఁడు వార్ధితటంబున కేగి లోతుతోఁ
గూడినచోటుఁజేరి యలగోపతిసత్ప్రతిమఁ గ్రహించి బ
ల్వేడుకఁగట్టి యిల్లొకటి విజ్ఞులుమెచ్చఁ బ్రతిష్ఠజేయు న
వ్వాఁడు ప్రభాకరుండనియె భావమునందుఁదలంపనా విభూ !

తే॥ ఇదియ ద్వారకాఖండంబు నెవరుదీనివి నెదరో పఠియింత్రో యాయనఘుల కల
పరమహరిపాదములఁగాంచుభాగ్య మబ్బఁగలదు నిజమిది మైథిలక్ష్మాతలేంద

తే॥ అని జనకునకు నారదముని నుడివినసరణి గర్గమునీంద్రుఁడు శౌనకునకుఁ
బల్కెనంతటఁ దన్ముని పరమభక్తి గర్గయోగిని బృచ్ఛింపఁగడఁగె నిట్లు. ౬౦౩

ఉ॥ భూసురదేవ ! దేవమణిభూషణభూషిత వాసుదేవ ! గో
పీసహితా ! హితప్రకరభీతివినాశరతా ! రతీశ్వరో
ల్లాసకరా ! వినుత్యసుకలా ! కరినాయకహారిహారి ! శ్రీ
వాస ! కుశస్థలీపురనివాస ! వలాహకనీలభాసురా ! ౬౦౪

మాలిని.

మగధవిభువిజేతా! మానిరాడ్గమ్యనేతా!
నిగమగదితరూపా! నిర్జితారాతిభూపా!
సుగుణనిచయయుక్తా! శుద్ధభక్తాళిరక్తా!
యగమతిలకధారీ! వ్యాజశాపాంతకారీ! ౬౧౩

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చిపురుపల్లి
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్యాదత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతం బందలి
ద్వారకాఖండము
సంపూర్ణము.

---

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓం తత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీ గర్గ భాగవతము

## విశ్వజిత్ఖండము



ఆతసీసుమసంకాశా !
వ్రతతివ్రతతిప్రయుక్తభవననివాసా !
రతిపతిజనకా ! రాసని
రత ! యతితతిసన్నుతాత్మ ! రాధాకృష్ణా ! ౧

తే॥ అవలనేమని బహులాశ్వుఁడమరమునిని నడిగెనో యది యిపుడు నాకానతీయు
మనుటయు౯ గర్గమానియునట్టి శౌనకునకు వినుమని యీరహిననఁగఁదొడగె.

ఆ॥ ఎవ్వఁడుగ్రసేనుఁ డెటుల యమప్రభుండాతఁడయ్యె నేల యాతనికటు
శౌరిసాయపడెనో? యీరహినంతయు ముచ్చటింపు మమరమునివరేణ్యా !

### మరుత్తోపాఖ్యానము

క॥ అనవుడు నారదముని యిట్లనియెను గృతయుగమునందు నతఁడినకులమం
దున మరుత్తుండను పేరున జనియించినచక్రవర్తి జననుతచరితా ! ౪

ఆ॥ అట్టిచక్రవర్తి యఘహారవిశ్వజిదధ్వరోత్తమంబు నఖిలవేద
శాస్త్రసమ్మతముగసల్పెను దక్షిణతి యెట్టిదనిన వినుమయే వచింతు. ౫

వ॥ అమ్మహాధ్వరంబును హిమాచలంబున కుత్తరప్రాంతంబునం దివ్యప్రదే
శంబుంగాంచి మునిశార్దూలుండగు సంవర్తుని నాచార్యుగానొనరించి తదాజ్ఞాను
సారంబుగాఁ బంచయోజనవిస్తారంబుగ హోమకుండంబొండును యోజనవిస్తీర్ణం
బుగ బ్రహ్మకుండంబును గవ్యూతివిశాలంబులగు పంచకుండంబులను నిర్మించి మేఖ
లాగర్తవిస్తారంబులుగ పదివేదికలను ఘటించి సహస్రహస్తోచ్ఛ్రయంబగు యూపం
బును స్థాపించి వింశద్యోజనవిస్తీర్ణంబుగా సువర్ణమయంబగు యజ్ఞమండపంబు కదళీ
స్తంభతోరణాదిప్రకాశమానంబగునట్లు రచించి బ్రహ్మరుద్రాద్యఖిలబర్హిర్ముఖులను
మహర్షివరేణ్యులను, మునీంద్రులను సవినయంబుగా నాహ్వానించి రావించి సంత
సించి. ౬

సీ॥ శాస్త్రోచితంబుగా సకలక్రియలసల్పు దశలక్షహోతృతాధనులతోడ
నఖిలాధ్వరంబులం దాఱి తేఱినయట్టి పంచలక్షాధ్వర్యవములతోడఁ
బ్రాచితంబులులేని పగిదిఁబనుల్ జేయు పంచలక్షోద్గాతృవరులతోడ
వెతగల్గినట్టి దీక్షవిడువక ఘనతభాసిలు దశలక్షదీక్షితులతోడ

తే॥ విదితులైన చతుర్వేదవిదులతోడ సర్వశాస్త్రార్థతత్వజ్ఞసమితితోడ
స్వకసమస్తపాపక్షయ ద్వారముగను శ్రీహరిప్రీతికొఱకు నాచరించెనంత.

క॥ నిరతంబగ్నిని హోమము గఱిశుంభాజ్యధారఁ గావించుటచేఁ
గరమాతనికి నజీర్ణముదొరకొనె నిది యబ్బురముగఁ దోఁపదుగాదే! ౮

తే॥ మఱియు మరుత్తుండు స్వీయమానుఖమునందుఁ బవిలి సభను విశ్వేదేవులెవరికెవ్వ
రికిని భాగములిమ్మని ప్రీతితోడఁ జెప్పిరో యటువారికిఁ దప్పకయిడె. ౯

ఆ॥ ఎల్లదేవతలును నెల్లమహామును లెల్లఋషివరేణ్యులెల్ల యోగు
లెల్లజంతువులును నెల్లభూసురులును జెంది తనివి మఱి యజీర్తిగనిరి. ౧౦

క॥ అత్తఱిముజ్జగములలో నెత్తావున నొక్కజీవమే నాకలితో
గత్తరజెందుటలేదని చిత్తమునన్నమ్ముమయ్య! శ్రీబహుళాశ్వా! ౧౧

తే॥ మరుత్తుఁ డాజన్నపుం దుదనవిసిడాసి నిజగురుఁడగు సంవర్తమునితిలకునకు
శాస్త్రరీతినిఁ బూజించి చక్కమ్రొక్కి దక్షిణగఁ జతుర్దశనియుతకరు లింక.

క॥ జంబూద్వీపప్రభృతయు జాంబూనదభర చతుర్దశనియుతములు ర
మ్యంబగు మణికోటుల నశ్వంబులు నూరర్బుదములు భక్తినొసంగెన్. ౧౩

తే॥ వాజులైదు వేలిభములు వంద నూఱుబారువలపొన్ను నొక్కొక్క బ్రాహ్మణునకు
వేఱు వేఱుగనిడి నమస్కారములను సల్పె నతనియీవికి నిలసాటిగలదె?

తే॥ తినినత్రాగిన పాత్రముల్ గనకమయములైన విప్రులు సంతుష్టినందికొనక
యరిగి రవి శతయోజనస్ఫురితగిరిగ మంచుమలపొంతఁ దగె నది మించునిపుడు.

క॥ పలుపలుకులు మనకేలా? యిలలో నాసవమువంటి యిద్ధమఖంబుల్
గలుగదనియు నాతని కెనగలయోగ్యుఁడు గ్రాలఁడనియు ఖ్యాతి ఘటించెన్.

క॥ అంతట విష్ణువు సవకుండాంతరమున నుద్భవించి యామరుత్తోర్వీ
కాంతునకు నాత్మరూపయు సంతోషముతోడఁ జూపి సన్నిధినిలిచెన్. ౧౭

చ॥ నిలిచినతోడ నామనుతనేత ముదంబునుబొంది యేమియుఁ
బలుకఁగలేక తన్నిహితభక్తివశుండయి తత్పదంబులన్
సులువుగఁ బ్రాలె నంతట యశోదకిశోరుఁడు తద్ధరేశుఁ జే
తులఁగొని లేవఁదీసి బహుతుష్టిదసూక్తుల నిట్లువాకొనెన్. ౧౮

మ॥ ధరణీనాయక ! నీమఖంబునకు హ్లాదంబొంది నేవచ్చితిన్
మతి నీబత్తికిమెచ్చితిం గనుక వేఱ్మార్గంబుబోకుండ నే
వరముల్ గోరెదొ యద్దిస్వల్పమయినన్ భారంబుగా నుండినన్
గరుణన్ నీకునొసంగెదన్ జుమియనన్ శ్యామనాయకుండంతటన్. ౧౯

చ॥ మరల శిరంబిలన్ దగుల మాపతికిన్ నతిసల్పి పూజలం
బరువడిజేసి యిట్లనియెఁ బంకజనాభ ! యశేషదోషముల్
సరగునఁబోవఁగోరికలఁ జక్కఁగనిచ్చెడి నీపదాబ్జముల్
బొరిఁబొరిఁగొల్చుభాగ్యము గుబుద్ధికి నాకిడియుంటివో ప్రభూ ! ౨౦

తే॥ ఇంతికంటెను బెఱమంచి యీప్సితంబుగలదటంచు వాంఛించుట గంగదరిని
దగను నాపుటకని బావిఁద్రవ్వ మూర్ఖునట్టులేనౌదు శ్రీధరా ! యైనవినుమ !

కం॥ నీమాటలపైఁగల గారామున నే నడుగుచుంటి రాజీవాక్షా !
నామదితామర నీపదతామరసము విడనిరీతి దయచేయగదే ! ౨౨

తే॥ అదియ ధర్మార్థకామమోక్షాదికారణంబుగద భక్తవత్సలా ! నావుడు హరి
వీనులారఁగనాలించి ప్రీతితోడ నతనికిట్టులఁబల్కెనో యార్యవర్య ! ౨౩

తే॥ తృపను వరముల నడుగక దివ్యమతిని జూపియుంటివి దానికిసుఖముగంటి:
నైనభక్తుఁడు ఫలయుతంబైన కోర్కి గోరకుండిన నాయెద కుదురపడదు

కం॥ కావున ననుమానింపక భూవర ! మఱియొక్క వరముబొందుము నాచే
నావుడు తన్మరుతాధిపుఁ డా విష్ణువుతోడ నిట్టులనియెను నతుఁడై. ౨౫

కం॥ నీ పదపంకజపూజయు నీ పదపూజకులతోడి నెయ్యముఁదగ ను
ద్దీపితవై కుంఠము నం దేపారువిధం బనుగ్రహింపవె దేవా ! ౨౬

మ॥ అని వేడన్ మురవైరి యిట్లనియె భూపాగ్రేసరా ! యీవరం
బును నీకిచ్చితిఁగాని యొక్కవిషయంబున్ విన్ముసౌఖ్యాకరం
బును నాశ్చర్యకరంబునైన త్రిదివంబుంబొంది మోదంబు నె
మ్మనమందొందుచునుండి బ్రహ్మయను నీ మన్వంతరంబందునన్. ౨౭

క॥ ఇటువడెనిమిదవ ఘనయుగమట గెడి తటి ధరనుబుట్టి యలసూలకుఁ గా
పరియా నాతో మైత్రిని నెఱపుచు మద్ధామమందు నిలుతువు మహితా! ౨౮

క॥ అని వరమిడి చనెఁ దద్విధి జనియించెఁ దదుగ్రసేన సదభిధ నతేఁడా
వనరుహలోచను ననుమతి నొనరించెను రాజసూయ మొండుఁ దమముగాన్. ౨౯

క॥ ఇది మరుత్తోపాఖ్యానము జదివిన వ్రాసినను వినిన సకలార్థంబుల్
గొడకొను హరిభక్తుల కెయ్యది యబ్బదొ? ముజ్జగముల నవనివరేణ్యా!

తే॥ అవలబహులాశ్వుఁడిట్లనె నమరమునికి
మానివర! చెప్పుమా యుగ్రసేనవిభుఁడు
రాజసూయాధ్వరవర మారంభమెట్టుల
సల్పె నెటుదాని శౌహరి సాయపడెనొ? ౩౧

—♦ నారదముని బహులాశ్వునకు రాజసూయవృత్తాంతంబు చెప్పుట ♦—

క॥ అనవుడు నారదుఁడిట్లనె జనకా! యాయుగ్రసేననరసుఁడు కీర్తిన్
దనరుచు మనుతఱి నొకపరి వనమాలినిఁబూజజేసి ప్రశ్నించె నిటుల్. ౩౨

ఉ॥ దేవర! దేవమానివర దివ్యముఖంబున రాజసూయమేఁ
బావనదాధ్వరంబనుచు బల్మరువింటిని దత్క్రతూత్తమం
బేవిధిఁజేయఁగావలెనొ? యేయధిదేవతయానొ? దానికిం
కేవిబుధాళిరావలెనొ? యేఫలమో? వచియింపు మియ్యెడన్. ౩౩

చ॥ జగమున నెందఱో నృపులు సారససామ్యభవత్పదంబులన్
మిగులభజించి యెల్లపుడు మిక్కిలి చిక్కులగల్గఁజేయు నీ
జగతిఁద్రృణీకరించి నిజసర్వమనోరథకంధి నీఁదరే
యగయుగశాపమోచనపరా! విదితాగధరా! పరాత్పరా! ౩౪

వ॥ అని సప్రశ్రయంబుగాఁబలుక నవ్వాలమురితాల్పలరి యాయేలిక కిట్లు వక్కాణించె. యాదవేశ్వరా! లెస్సగా నాలోచించి చక్కనివిషయంబు దేటపరచితివి. తత్సవోత్తమంబు జగత్త్రియప్రతిష్ఠాకరంబు నీ సంకల్పంబమోఘంబును, నిర్మలంబునునై నాకునుసమ్మతంబయ్యె. తన్మఖకృత్యంబు యదుప్రభుండవగు నీకొనర్పం దగినదియ వేఱొండు విచారింపక యారంభింపుము. అందులకుందొల్దొల్త సర్వయాదవుల నామంత్రణంబుసేసి మహాసభంగావించి తాంబూలవీటికం గరంబునం గ్రహించి తదధ్వరవిషయికప్రతిజ్ఞను వ్యక్తీకరించిన నవ్వారు మదంశసంభూతులును, లోకదంయవిజిగీషులగుటంబట్టి యద్దానికంగీకరించి నల్గడలం గెల్చి యందుండు రాజ

మార్తాండులనుండి కప్పంబులంగొని తెచ్చి నీకిచ్చి సంపూర్ణంబు జేయింపంగలరు. కాన విష్ణుప్రీతిగా విధివిధానంబునందడయక యా జన్నం బాచరింపుము. నేనును బాసటగా నుండెదనని సప్రియంబుగానుడువ నా యుగ్రసేనుండు మెచ్చి యదువృష్ణి భోజాంధకాదులగు యాదవులను సమాహ్వానించి గారవించి సుధర్మంగావించి తా నింద్రసింహాసనాసీనుండై చేతం దాంబూలపేటికం ధరించి. ౩౭

చ॥ తలంచితి రాజసూయము యథావిధిగా నొనరింప మిమ్ములం
బిలిచితి నిద్ది తెల్ప మొన నేరెడుదీవినినున్న రాజులన్
గెలిచి కరంబులంగొని సుకీర్తి గడించియు వచ్చు వీరుఁ డీ
స్థలిఁగలఁడేని లేచి యిది చక్రి గ్రహించి గ్రసించునియ్యెడన్. ౩౮

క॥ అని గంభీరగళంబున ననఁగా విని యాదవులును "హరిశివ" యనకే
చనసాగిరి తత్సమయంబునఁ బ్రద్యుమ్నుండు భైష్మీపుత్త్రుఁడు కడఁకన్. ౩౯

తే॥ పలికెనిట్లు జంబూద్వీపభాసమాన విభులనందఱ నాజికిఁబిలిచి గెలిచి
బలులఁగైకొని వాసితో వచ్చి రాజసూయసవము సంపూర్ణంబుఁ జేయఁగలను

తే॥ ఇట్టి దిగ్విజయంబును నేనుజేయ నేనగమ్యాగమనగురు ధేనుబభ్రు
భూసురాది హత్యాకృతుల్ జేసినంత దురితముల్ నాకు గల్గుత సరసులార!

క॥ అని శపథోక్తుల నాడుచు వినయముతో నుగ్రసేనవిభునకు నతులన్
బొనరిచి తద్వీటికఁగైకొనెఁ జూపఱునబ్రమొంద క్షోణీనాథా! ౪౦

—♦ యాదవులు దిగ్విజయార్థంబై వెడలు ప్రద్యుమ్ను నభిషేకించి బహుమతులిడుట ♦—

తే॥ అంత యదుకులాచార్యుఁడు నఖిలవేదశాస్త్రవిదుఁడగు గర్గుఁడు సన్ముహూర్త
మందు వేదసూక్తులతోడ నాతనికభిషేక మొనరింపఁజేసి యాశీర్వదించె. ౪౧

ఆ॥ ఉగ్రసేనుఁడతని కుచితతిలకమునుబెట్టె నంత గోపవిభులుగూడ
నాత్మశక్తికొలఁది నవనతులై బలుల్ దెచ్చియిచ్చి యిచ్చమెచ్చిరవల. ౪౨

క॥ వనమాలి స్వశార్ఙ్గమునన్ ధను వక్షయసాయకమయి తగు నిషుధియుగం
బును దనయమ్ములపొదులన్ జనియింపఁగఁ జేసియిచ్చె స్వకుమారునకున్.

సీ॥ ఉగ్రసేనుండైన యుగ్రసేనుండు మహాశితఖడ్గంబు నందనిచ్చె
నక్రూరమతియైన యక్రూరుఁడున్ దక్షిణావర్తశంఖంబు నందనిచ్చె
బలశాలియై హెచ్చుబలరాముఁడున్ దృఢమైన వర్మంబును నందనిచ్చె
వసుధావరుండైన వసుదేవుఁడు శతచంద్రాఖ్యాకృపాణంబు నందనిచ్చె

తే॥ నుత్తములకెల్ల ధవుఁడైన యుద్ధవుండు కేసరోల్లసన్మాలిక వాసినిచ్చె
దుర్గతుల్ బాపఁజాలిన గర్గమునియుఁ గృష్ణకవచయంత్రంబుల నిచ్చెనిచ్చె.

తే॥ బుద్ధిమంతులలోన్ వృద్ధుండు వృద్ధుఁడనగు శూరసేనుండు సత్కీర్తిమీఱు ఛత్ర
చామరాంబరకుండలసత్కిరీటముల నొసంగె శంబరవైరి కలఘుమతిని.

ఆ॥ హరిదధీశ్వరాన్వితాఖండలుండును విబుధమౌనిసహితవిధిశివులును
వచ్చిరంత బ్రహ్మ పద్మరాగము శంకరుఁడు త్రిశూల మలమదనునకు నిడిరి.

తే॥ పాశిపాశంబు ననిలుండు వ్యజనయుగము
యముఁడు దండంబు భాస్కరుండధికభార
రాజితగదఁ గుబేరుండు రత్నమాలఁ
జంద్రకాంతంబుఁ జంద్రుండు సరగనిడిరి. ౮౭

తే॥ వీతిహోత్రుండు బరిఘంబు భూతలంబు
యోగమయపాదుకాయుగం బుత్తమమగు
కుంతమును భద్రకాళియు గోర్కిమీఱ
నట్టి కందర్పునకునిచ్చి రాయదనున. ౮౮

సీ॥ అంగుగా సింగారముంగాఱుచెత్తైన బంగారు శృంగముల్ బరఁగినదియు
ఘనరవంబులఁబోలు ఘంటికాటంకార కింకిణీశబ్దముల్ గెరలునదియు
మారుతశీఘ్రింబు మానసవేగంబుమించిన లఘుగతిం గాంచినదియు
బ్రహ్మాండమందు వెల్పలనులోపలఁ బోవఁజాలిన నేర్పుతోఁ గ్రాలినదియు

తే॥ వెయ్యిబాబాలు జెండాలువెయ్యి వెయ్యి
చక్రములు గల్గినది రత్నచయముతోడఁ
జెలఁగునది విశ్వకర్మచేఁ జేయఁబడిన
దియగు జైత్రరథం బిడె దేవవిభుఁడు. ౮౯

క॥ అరిసంహారణకరణచణ వరశక్తిన్ శక్తిధరుఁడువచ్చి యతనికిన్
గరముగఁ గరదంబుగనిడె హరికరుణంగన్నవారి కల్లెడుటరుదే? ౯౦

ఉ॥ అత్తఱి శంఖదుందుభిమృదంగఘనానకవేణువల్లకీ
సత్తమవేదనాదములు జాలఁ జెలంగఁగ లాజలక్షతల్
ముత్తెములున్ విరుల్ గురియఁ బుష్పశరుండు బలాచ్యుతేశగ
ర్గోత్తములన్ నతిన్ దనిపి యొందితదాక్షమహోల్లసంబునన్. ౯౧

తే॥ విజయశబ్దంబులెల్లెడ వెల్లివిరియ దివ్యమగు శతాంగంబునం దేజుమీఱ
నెక్కియక్కశస్థలినుండి యేగఁదొడఁగెఁజూపఱుల్జోద్యమందుచుఁజూచుచుడం

తే॥ అతనివెంటనె చనిరి గదాదిబలులు
సాంబముఖులును మిత్రాత్మజాతయోధ
పత్తిరథగజహయయుతుల్ బద్మనాభ
మోదితుల్ మహారథులు నమోఘబలులు. ౫౩

తే॥ మఱియు శస్త్రాస్త్రములు బత్తి హరులు గరులు దేజుగల్గు దశార్హకభోజవృష్ణి
శూరసేనమధ్వాంధక వీరముఖ్యు లుద్ధవాదియాదవులేగి రుచితరీతి. ౫౪

తే॥ ఇంక నతనివెంటను మండలేశ్వరులును సకలశస్త్రాస్త్రభూషలను దాల్చి
యరదముల నెక్కి చతురంగపరివృతులయి బయలుదేరిరిగాదె తోడ్పాటుపడఁగ

వ॥ అత్తఱిఁ దత్పురినుండి గుండనంపు మొగ్గ లమర్పంబడిన వింతవింత మొగంబులతోడను, మిగుల మ్రోఁగుఘంటాకింకిణులతోడను, నరిభయంకరులగు జోదులతోడను, నయనపర్వంబగు నరుణాంబరంబులతోడను విరాజిల్లుచు దిగ్గజంబులం బోలుచు నీలాచలంబులభాతి భాసిల్లుచు మందగమనంబున మత్తమాతంగేంద్రంబులు గోట్లకొలంది నిర్గమింపందొడంగె. అందుఁగొన్ని భద్రంబులును, గొన్ని భద్రమృగంబులును, గొన్ని వింధ్యాచలభవంబులును, గొన్ని హిమాలయసంభవంబులను, గొన్ని మలయప్రభవంబులును, గొన్ని మారంగోద్భవంబులును, గొన్ని కాశ్మీరజాతంబులును, గొన్ని కైలాసవనజంబులును, నైరావతజనితంబులై చతుర్దంతంబులుగల్గినవి కొన్నియు, నూర్ధ్వంబుగాఁ ద్రిశుండంబులు గ్రాల భూమ్యంతరిక్షంబులందు సంచరింపంజాలినవికొన్నియు, నీలాంబరవిరాజితంబులై యంబారిని వీరులు జెన్నారం గాఱుమొగులుచందంబున ఘీంకృతుల నిశ్శంకంబుగాఁ జేయుచుం జరించునవి కొన్నియు, నిజశుండాదండంబునం గుల్మాదులం బెల్లగించి యర్కమండలమందుంచుచుఁ బాదంబులతో మేదిని నదలించుచు మదధారలతో నచలాదులం దడపుచుఁ దిరుగాడునవికొన్నియు, శిరంబులతో దుర్గాద్రిగండశైలాదులంగూల్చి వైరివారంబులం జీల్పంజాలి పెల్చనిల్చినవి కొన్నియు దుందుభిపతాకాసంయుతంబులై యబ్ధియందు మకరరాజంబులపగిది విహరించునవి గున్నయేన్గులు కొన్నియు నొప్పారు. వెండియు నంగవంగకళింగకాశ్మీర భోజకాంభోజ సౌవీరసౌరాష్ట్రమహారాష్ట్రమగధమాళవనేపాళకేరళ చోళపాంచాళగౌళమళయాళ సింహళసింధుద్రవిడకర్ణాటపుళిందాంధ్రదశార్ణకుక్కురు గాంధారబాహ్లికబర్బరకేకయ కోసల కుంతల కిరాతకొంకణకోంకణమత్స్యశ్వేతద్వీపవైకుంఠ రమావైకుంఠోర్ధ్వవైకుంఠాజితపాదదిస్థలసంభవంబులగు దివ్యహయంబులును గోట్లకొలంది నానాభూషణభూషితంబులై నిర్గమింపందొడంగె. అందపక్వసూత్రంబులమీఁదను, బుద్బుదంబులమీఁదను, వాయుమనోవేగంబులతో నడచుచు వింతగల్గించునవి కొన్నితురగంబులును, మేడలను మాడువులను, గోటలను గోడలను వాఁగులను వాఁకలను మిట్టములను బల్లములను నలువుగా దాఁటఁజాలునవి కొన్నితురంగంబులును, మయూరీతిత్తిరీక్రౌంచీహంసీ

ఖంజనీదివ్యగతులం బలుమాఱుమీఱుచు నాడునవి కొన్ని తురంగమంబులును. శ్యామకర్ణంబులను శుభాంగంబులను, బీతపుచ్ఛంబులను ధవళవర్ణంబులను భాసిల్లి పక్షంబులతోఁ జెన్నారునవి కొన్ని తుఖారంబులును. నుచ్చైశ్శ్రవకులోద్భవంబులు గొన్నియు వరుణప్రయోజితంబులై యశ్వినీసుతవిద్యానవద్యంబులైనవి కొన్నియు, సప్తాశ్వాశ్వసంభవంబులు గొన్నియు, నశ్వినీపుష్పతుల్యంబులు గొన్నియుఁ గల్ప తరుసంకాశంబులు గొన్నియు, మేలిమిబంగారురంగుగలవి కొన్నియు, నాలెపట్టుపైఁ బాఱుపారదంబువిధంబున నిరాధారంబుగా వాహులయందుఁ బాఱునవి కొన్ని హయంబులును, మనోహరంబుగానుండె. రథిసారథియోధ శస్త్రాస్త్రసంపన్నంబులైన శతాంగంబులు తత్సైన్యంబునం జెలఁగు. మఱియు నందుఁ ద్రిశూలాసిగదా పట్టిసపరిఘాముద్గరతోమరకుంతిధర్మపాశంబులందాల్చి దిగిభాభులై ప్రలయాంబుధి నిభులై ఘోరసంగ్రామంబులం బరినికరగర్వ మడంచి వాసికెక్కిన శూరులు నొప్పారుచుండిరి. పూర్వోక్తంబుగా సర్వసులక్షణలక్షితుండై ప్రద్యుమ్నుండు నచతురంగంబుగాఁ గుశస్థలిపురినుండి వెడల్చనుట సురాసురులాలోకించి చిత్రపడు చుండ నుగ్రసేనుండు సార్థరామకృష్ణుండై డాసి ధానుష్కవరుండగు నా కందర్పుని తోడ నిట్లనియె. ౫౬

తే॥ కృష్ణపుత్త్రక ! బుధవరా ! కృష్ణకృపను సకలభూపతులం గెల్చి సత్వరముగ
నిట్టి ద్వారకాపురికి నీవేగుదెంచఁగలవు నిక్కముగ్గాని యీ పలుకువినుమ !

క॥ మత్తుని నిద్రితుఁ బాలుఁ బ్రమత్తుని జనువిరథు భీతు మానిని మఱి న
న్మత్తుఁ బ్రపన్నుని నెదిరిని మొత్తరు నయవేత్తలనిని ముక్కాలములన్. ౫౮

క॥ ఆర్తులయార్తినిఁ బాపఁగఁబూర్తిగఁ గదనంబునందుఁ బోరుట బహుదు
ర్వార్తనవధయును విభులకుఁ గీర్తిదధర్మములుగావె కృష్ణాత్మభవా ! ౫౯

క॥ మానినిగానీ పురుషుఁడుగానీ యధముండుగాని కానీ షండుం
డైనను బ్రాణులపైఁ గసిఁబూనినచోఁ జంపనౌను బొందవఘంబుల్. ౬౦

ఉ॥ ఎవ్వఁడు చివ్వలోఁదనరి యిద్ధమహాబలయుక్తవైరులన్
జివ్వున రూపుమాపు నలశేముషి యాజగదేకదోర్బలుం
డివ్వసుధాస్థలిన్ యశమహీనవిధంబునఁబొంది యంతమం
దవ్వసుదేవనందనమహాలయ మొందఁడె ? కృష్ణఁగృష్ణజా ! ౬౧

క॥ గెలిచిన గెలువకపోయినఁ, గలఁగక యలకలనునందుఁ గాలూది తమిన్
నిలిచిననేర్పరి నీల్గినఁ గలువలపగయిక్కదాఁటి కనఁడే సుగతిన్. ౬౨

ఉ॥ క్షత్రియజాతి కధ్యవిలి కాంచి యవక్రపరాక్రమంబు వే
దత్రయసూక్తభూపతియధార్థనయంబును గుత్తెఱుంగుచున్
శత్రులఁబోరఁ జంపుటకు సాగిభయంబునఁ బాఱువార లీ
ధాత్రినినింద్యులై తుదను దప్పకనొత్తురు రౌరవంబునన్. ౬౩

క॥ సేనలు మానవనాయకు మానవనాథుండు సేన మనుపఁగవలయున్
ధీనిధిసారధి రధికుని నానేతి సారధిని రథియు హ్లాదింపవలెన్. ౬౪

తే॥ ఈవిధంబునఁ దొల్లిమహీశ్వరుండు సకలధర్మవిదుఁడగు స్వాయంభువమను
వనియెఁగావున నీవిషయంబునందు నేమరిల్లకు మోకార్ష్ణి! యెల్లయెడల. ౬౫

ఉ॥ యాదవులీరలందఱు మహాబలులున్ వివిధాస్త్రశస్త్రపం
పాదకులున్ యశోస్వితులుబట్టునఁ గార్ష్ణిని మీరుబ్రోవుఁడీ!
యాదవులార! మిమ్ములను నాతఁడు బ్రోచెడి వారి వీరినిన్
వేదసురావనీసురులు విజ్ఞులుబ్రోతురు తప్పకుండఁగన్. ౬౬

చ॥ హరికినుడుల్ శ్రుతిత్రయము సంగములున్ సురలాస్య మగ్రజుల్
సురభులు దేహమున్ మును లసుప్రకరంబుగఁ జెప్పుచుండుటన్
నరులకు మోక్షకాంక్షుల కనారతమయ్యవి సేవ్యమాను శ్రీ
హరిని సెవండునిల్పునో నిజాత్మను వాఁడెజయించు నన్నిటన్. ౬౭

క॥ అంతట యాదవులందఱు సంతసపడి యుగ్రసేనశాసనముఁదలన్
సుంతనువిడువక కొని యత్యంతముగ నుతించి మ్రొక్కిరటుపై మరుఁడున్.

క॥ గురువరునకు గర్గునకున్ హరికిని బలరామునకును నధిపునకునతుల్
బారిఁబారి నొనరిచి యాదల హరిదాళిజయార్థియగుచు నరుగఁగడంగెన్.

ఆ॥ అంత నుగ్రసేనుఁడల హలిహరులతో నిజనివాసమునకు నెమ్మిఁజనియెఁ
బ్రేక్షకులును స్వీయవేశ్మములకునేగి రవనిపాలక! తదనంతరమున. ౭౦

వ॥ అగ్రభాగంబున వాహినీసహితుండై మహాబలుండగు కృతవర్మయుఁ బశ్చాద్భాగంబునం బతాకినీయుతుండై ధనుష్మద్వరుండగు నకూరుండును, వాని వెనుకం బ్రతిమాపంచాంచితుండును, మంత్రికులతిలకుండును నగు నుద్ధవుండును, దత్పృష్ఠభాగంబునం దనేకాక్షౌహిణీసమేతులై ప్రద్యుమ్నానిరుద్ధదీప్తిమద్భాను బృహద్భానుచిత్రభాను విచిత్రభాను వృకసాంబారుణ మధుపుష్కర దేవవాహశ్రుత దేవసునందన విరూపకవిన్యగ్రోధులను కృష్ణపుత్రకులు పదునెనుమండ్రు మహారధులును, భోజవృష్ణ్యంధకాది సర్వయాదవులును బయలుదేరిరి. తత్సైన్యస్థిత యాదవులుమాత్రం బేఁబదియాఱుకోట్లమందిగలరు. ఇఁక నా మూఁక మొత్తంబుం దేల్ప,

నెవండు శక్తుండగు? నీరి శిబిరంబులచే నాలుగామడలచో టాక్రమింపంబడియె. ఇట్టి విజయధ్వజిని బలంబులు దేవతాహిణాంబుల ఘోషకారాహ్కారంబులును, గొణికిణాత్కారంబులును, జటపటాత్కారంబును జటపటాత్కారంబులును టంకార ఢంకార ఝాంకారఘీంకారక్రేంకారంబులు సంకులంబుగా జనించి మేఘగర్జంబుల విడంబించుచు దిగ్గజంబులం జెవుడుపరచుచు నాదిగూర్మంబులేమి కింకర్తవ్యమోయని ధావనము బొనర్చునట్లొనర్చుచు దైవమా! నాకేమి యుపద్రవంబు సంభవింపఁ జేసితివని భూదేవి యడలునట్లు సల్పుచు హెచ్చుం దొడంగెనని వాక్రుచ్చుటయు బహులాశ్వుండు నారదమహర్షితో సవినయంబుగా నిట్లనియె. ౨౧

కం॥ ఆయన యేయేశ్వలముల కామొడఁజనెనో సుతేజులపలనుగనెనో
యేయేకీపుల గెలిచెనో యీమెయి నయనాకుఁ జెప్పవమ్మావు సుకర్షి!

తే॥ అహహ! యేమేమి! యాశౌరి కాత్మభక్తులందుఁగలిగిన కారుణ్యమాడఁగలమె
యద్ది పాపినిఁగులముతో నడలచకితుఁనిగ నొనర్పవె! నాపుణ్యసద్ధర్షి!

ఆ॥ ఇట్టులాడె జేడ! యీవు జలిక్కన దవ్వు బాగుబాగుబాగు పద్మనాభ
భక్తజీవితములు బహుళలోకంబులఁ జక్కజేయుటరుదె నరిఁగవినుమ!

కం॥ రవికసనివి కనఁజాలెడి కవిచుణి ఘుటబిందువులను తామ్రజములనుఁ
దవిలి గణించునుగానీ భవికదిహరిగుణము లెన్నఁబైఁత్రేరఁడుగా. ౨౫

తే॥ నాలుగామడల్ దాఁక ఘనంబుగాను
నీడనిడువెల్లగొడుగుచే నేత్రములకుఁ
బండువౌనట్టు భైష్మిపుత్రుండు మఱఁడు
నైన ప్రద్యుమ్నుఁడెంతో పొల్పారఁ దొడఁగె. ౨౬

— ♦ ప్రద్యుమ్నుండు సేనాసహితంబుగాఁ గచ్ఛాదిదేశంబుల కరుగుట ♦ —

మ॥ అటులన్ యాదవవాహినీసహితుఁడై యైంద్రంబు దేరెక్కి యు
త్కటసంతోషముతోఁ దదంగజుఁడు తత్కచ్ఛాభిధా దేశముల్
జబులప్రక్రియగాజయింపఁ జనె మున్ శంభుండు జృంభించి యు
ద్భటతాదృక్త్రిపురంబులన్ గెలువఁగా బైల్దేరినట్టుల్ విభూ! ౨౭

తే॥ అట్టిపట్టునం గచ్ఛదేశాధిపుండు శుభ్రుఁడనువాఁడు వేఁటకదభ్రగతిని
జనుచు నరుదెంచుసైన్యంబుఁగని వెనుకకుమరలి యాత్మహాలాహ్వయపురికివచ్చె

తే॥ అతని మూఁకలు తత్స్థలికరిగినంత ద్విరదచరణసంహాతులచేఁ దరునికరము
గూలినుసిధుయ్యె రేగినధూళిలాకసంబు నంధమయంబుగా సంతరించె. ౨౯

క॥ దానింగాంచిన పౌరవితానము భయపడెను మిగులతద్భూవరుఁ డా
మీనధ్వజునకుఁ బ్రత్యుత్థానంబును జేసి మ్రొక్కి తత్పరమతితోన్. ౮౦

తే॥ హేమమాలల నొప్పారునిభము లైదు
నంద లయుతంబు హయములు స్వచ్ఛమైన
స్వర్ణ మిరువదిమణుఁగులు బలిగ నొసఁగి
పుష్పహారబద్ధాంజలిన్ మ్రొక్కె నంత. ౮౧

క॥ ప్రద్యుమ్నుఁడు తనకయ్యది హృద్యముగానుంట నతనికిడి రత్నస్ర
క్కృద్యతనవారిచీనులు జోద్యముగన నతని ప్రభుతసుస్థిరుఁ జేసెన్. ౮౨

ఉ॥ అంతఁ గళింగదేశముఁ దదంగభవుండు జయింపఁ దత్తటి
త్స్వాంతులఁగూడి యేగుమఘవంతునిపోలిక బైలుదేరి త
త్ప్రాంతముఁజేరె నంత నలపార్థివుఁడున్ స్వబలప్రయుక్తుఁడై
చింతభయంబులన్ విడి కసిన్ బ్రతిరోధము జేసె నాతనిన్. ౮౩

క॥ అది కని ధన్వివసుండగు మదనసుతుం డొంటిగానె మసలనియట్లా
కదనమునన్ శితశిఖులను బొదివి కళింగేశుపైనిఁ బూర్ణరుషాత్మన్. ౮౪

క॥ భటవరరథమదకరులను గటకటబడఁగా శితాశుగదశత్రయమున్
ద్రుటిఁబఱపియుఁ దంకృతులన్ జటులంబుగఁజేసె స్వీయసైన్యము వొంగన్.

క॥ అత్తఱి ననిరుద్ధుండాచిత్తజుఁడును జూచుచుండ శితబాణములన్
ఏత్తీక్ష్ణారిబలంబున మొత్తముగానైచె జనకభూభుజవర్యా! ౮౬

చ॥ అతని శితాశుగప్రహార మంది కళింగమహీశువాహినుల్
హతరథముల్ ద్విధాకృతమహాధ్వజముల్ హతమత్తనాగముల్
హతభటులున్ హతేశులు హతాశ్వయుచోదకజాలమున్ మఱిన్
హతరథిసారథివ్రతతియై కననయ్యె ననంతరంబునన్. ౮౭

క॥ ఆకాళింగేశుఁడు తనమూఁకలఁగని మేనఁ జెడిన బొందళమునగన్
వీఁక గజారూఢుండై యాకట్టగ నతనిఁ బోర నాగ్రహమతితోన్. ౮౮

తే॥ నూటనలుబదిమణుగులవాటమైన గదనుగొని యనిరుద్ధుపైఁ గంటుగిలగ
వైచి నిజకరిచే వీరవరులఁ ద్రొక్కసల్పి గర్జించె జలదంబు సరణిఁగరము.

ఉ॥ అట్టులఁ దగ్గదాహతిని జ్యావయిఁబడ్డ యుషామనోహరున్
జుట్టిన యాదవోద్భటులుజూచి మహాగ్రహవృత్తిఁ దద్రిపున్
బట్టి శితాస్త్రశస్త్రములఁ బాఁదిరిగా కురరంబుస్యేనము
న్బట్టిపలంబు మెక్కఁగ ఘనంబగు ముక్కునఁ గ్రుమ్మినట్టులన్. ౯౦

లవానికి సమర్పింపుమని సవినయంబుగాఁ జెప్ప నాగయుం డీపత్త్రికుపితుండై వీర్యశౌర్యంబులు ధైర్యస్థైర్యంబులతోఁ బెనఁగొన నఖర్వగర్వంబున నిట్లు వక్కా ణించె. ౯౯

తే॥ ఉద్ధవా! నీవు మీపతికొత్తి యిట్లు పలుకవలయును గయరాజు భండనంబు
సలుపకుండఁ గప్పముల నీఁదలఁచుకోఁగ లేవటంచు ముమ్మాటికి లేవటంచు

తే॥ అబ్బ! యల్పులౌ నీబోటి యాదవులకు నింత స్వల్పకాలంబులో నింతబుద్ధి
హద్దుమీఱి జనించెనే యౌర! యరరె! భండనంబును సల్పక బలుల నిడను

మ॥ పిదపన్ దద్గయు నుద్ధవుండు విడి వేవే సేరి ప్రద్యుమ్ను నో
మనసా! యంచు యదూద్భవుల్ వినఁగఁ దత్కాలనేతవాక్యంబులన్
జనువన్ బూసనుగ్రుచ్చినట్లు మరుఁడున్ సంగ్రామముం జేయ నె
మ్మదియోజించి స్వసైన్యయుక్తుఁడయి రమ్మా! యంచు నేగెన్ గసిన్.

తే॥ అట్లుచని యతఁడా గయ నద్రి దుర్గకేయవనరమ్య హర్మ్యముల్ గింకిరిపడఁ
గొట్టి యెదిరించు నరిసేన ముట్టినట్టి బిట్టుదిట్టగనొప్పె నప్పట్టునందు. ౧౦౩

మ॥ గయుఁడక్షౌహిణియుగ్మముంగొని మహోగ్రంపశ్యుఁడై ధీరుఁడై
హయదంతావళిపాదసంహతులకున్ జ్యాదేవి కంపింపఁగా
రయమొప్పం జని తన్మనోభవునితో రా! రమ్ము! రమ్మంచు ని
ర్భయవృత్తిన్ జెలరేగి ఢీకొనె దివిన్ బర్హిర్ముఖుల్ మెచ్చఁగాన్. ౧౦౪

సీ॥ మత్తేభములతోడ మత్తగజంబులు దుర్వారములతోడఁ దురగములును
రథికవరులతోడ రథికరత్నంబులు సాంధితతితోడ సాదులును
యోధపుంగవులతో యోధపుంగవులును మల్లవర్యులతోడ మల్లవరులు
వైమానికులతోడ వైమానికాగ్రణుల్ శస్త్రాస్త్రములతోడ శస్త్రములును

తే॥ దాఁకిపోఁకఁ బరస్పర మాకులంబుగాఁగ ఘోరయుద్ధంబయ్యెఁ గడకు గయుని
వీరులెల్లరు భయపడి తేరులవిడి తత్క్షణంబునఁ బాఱిరి దశదిశలకు. ౧౦౫

ఆ॥ అవల గయుఁడు పాఱునాత్మసైన్యంబును గాంచి యొంటిగానె కయ్యమాడ
ధనువు టంకృతులను దద్దసల్పుచు నేగెఁ బిదపఁ బంచశరుఁడు గదిసి కసిని

ఉ॥ పంచశిలీముఖాంబకంబులను వర్మముఁ జించి శతాశుగంబులన్
ద్రుంచి శరం బిషుద్వయముతోఁ బెనటెక్కెముఁ గూల్చి సూతు హిం
సించి మహోగ్రబాణమునఁ జెండిహయంబుల నాల్గుతూపులన్
వంచిరథంబు నిర్వదగుభల్లములన్ మృధమందు మించఁగాన్. ౧౦౬

క॥ గరుడుని గని పెఱధనువును బడయుముగాని దీప్తినంటు దళితాంతరని
ర్భయమున నిర్వాపితాపుల లయనానటు వేసి మొగలులుగాగ దజచెన్.

క॥ ఆయేటుకుఁ బ్రద్యుమ్నుండాయని చింతించి యతిక్షాన్నతి శక్తిన్
దీయుచు వాయుచుఁ బాపకి సూచునిప్పుడిమీఁద వైచె హాహా! యనఁగన్.

క॥ ఆశక్తియుఁ దద్భృదినావేశముతోఁ జెల్చి నెత్తుటిదివిగఁ గాని జల్
కాశి వనగ న్గోలెను ధరణీశుండను గరుడుఁడు మూర్ఛ నిద్దరఁ గూలెన్. ౧౧౦

క॥ వెంటనె తద్బాహుధనువులు గంటుగఁ బద్ధయుని దివ్యకంఠములాగెన్
మింటను దిరిగెడి గరుడుడు గంటునగని వాములాడకరిణిని దేవా! ౧౧౧

చ॥ సురనరదుందుభుల్ మొఱసెఁ జూపఱు వర్ష్రము సెందిరెంతియున్
గురిసెను బూలవానలును గుంభిని విప్పె మొగంబు నింతలో
ధరపయిఁ బడ్డ తద్గయుఁడు తాల్మిని సొమ్మను దేఱి లేచి యా
మరునిపదంబులన్ శరణు మాకు గురుంచుఁ బడెన్ నరేశ్వరా! ౧౧౨

క॥ పరపడి మదనుఁడు నుంకము ముదమునఁ గొని యచటసాగిపోయె నవంతీ
శువరికి బంగరుకర్ణిక మదమునఁ జను పట్టణంబు మాదిరిఁ బిదపన్. ౧౧౩

ఉ॥ మాలనభూవిభుండు మతిమంతుఁడునౌ జయసేనుఁడా రతీ
పాలకు నాగమంబు విని బంధుపురోహితసృద్వపుత్రమి
త్రాలిసగూడి భక్తిమెయినర్చలొనర్చి కరంబులిచ్చి వే
వ్రాలెఁ బదంత్రిపద్మములపై నటుపై నలపుష్పబాణుఁడున్. ౧౧౪

ఆ॥ కారణాంతరమునఁ గనివట్టి వృద్ధులౌ తల్లితండ్రులకును దండ్రి స్వసకు
నందముగను మ్రొక్కి విందానువిందుల వారిసుతులఁ బ్రీతిగారవించి. ౧౧౫

తే॥ మాలవోద్భవజనులతో నులసి యాదవాళిగొలువ మాహిష్మతియనెడుపురికి
నరిగె యాదవబలముతో దరినివఱలు నర్మదానదిఁ గాంచె విశ్రాణముగను.

వ॥ అంతఁ నా! యానర్మదాతరంగిణీరత్నంబు శృంగారతిలకంబు నుదుటం
బెట్టిన చందంబునం గల్లోలభరితంబగు తుంగతరంగనికరంబుచే భాసిలి మకుటంబును
వాళిభాగంబున ధరించినకరణిం బుష్పగుచ్ఛంబులతో విరాజిల్లి దేవతానిచయం
బులు మూర్తి భవించి పరికాశించినవిధంబునం గోరకిత పల్లవిత పుష్పిత ఫలితంబు
లగు వేతసీ వేణుచూతామ్రాతకాదితరునికరంబులతో శోభిల్లి మఱియు సకల విధం
బులను మందాకినీప్రవాహదినిమాదిరి వెలుంగుట నాపరిమ్యమున్నండు గని మనమందలరి
తన డేరాలు వేయుట కనువగు ప్రదేశంబని స్థిరీకరించి రమ్యంబుగా వేయించి నుర

నికరమధ్యంబున వెలుంగు మహేంద్రుని సరణి యాదవాదిబలమధ్యంబునం బ్రకాశిం
చుచుండ దన్మాహిష్మతీపురవిభుండగు నింద్రనీలుండనుగని నిజదూతంబిలిచి హస్తినా
పురనాథుండును ధీమంతుండును బలవంతుండునగు ధృతరాష్ట్రునిచే నేనీదేశంబునకు
రాజుగా నిర్ణీతుండనైతిని కాన నిటనుండి యాభూవరునకుఁదప్ప కప్పంబు లన్యుల
కొప్పంజెప్పంబడవు. సాహసించి రణమొనరించినను నీకు విఫలంబగుననియే గుత్తె
ఱింగి చనుమని చెప్పి నిజభటుంబంప నాతండా యాదవనేతకడకుంజని నమస్కరించి
తద్గదితోక్తులను విన్నవింప నప్పూవింటివాఁ డాలించి యాగ్రహించి కానిమ్ము మా
యుగ్రసేనమహారాజునుగాని తద్బలంబునుగాని నమ్ములఁగాని యీమొనగాఁ
డెఱుంగఁడుగాఁబోలు నితఃపూర్వం బిట్లేమమ్ముల ధిక్కరించిన గయకళింగరాజుల
కుంబట్టిన యధోగతియే యితనికిం బట్టునని యెఱుంగుమన నతివేగంబునంపనయొడ
యనికడ కరిగి ప్రద్యుమ్నకథితంబగుసంగతి సభాసదులు వినుచుండం బలుక
నాయింద్రనీలుండు విని యూర్ధ్వదృష్టిం గొంతఁదడవిచారించి యాదవబలంబునుగూర్చి
చింతించి శిరఃకంపంబొనర్చి పంచసహస్రగజంబులును, నియుతహయంబులును,
నియుతరథంబులును, గైకొని వినయభయంబులతో నాప్రద్యుమ్నున కర్పించి నమ
స్కరించి రక్షింపుమని ప్రార్థింప నతండు సంతోషంబుతో నవి గ్రహించి చమూస
మన్వితుండై యటనుండి కదలి గుర్జరదేశంబున కేగి యుదలించి స్వబలంబుఁ జూపించి
జయించి కరదంబులంగ్రహించి చేదిదేశంబునకుం జనియె. తద్రాజ్యంబునకుం బాల
కుండుగా. ౧౧౮

## —♦ ప్రద్యుమ్నుఁడు చేదిదేశంబు గెలుచుట ♦—

కం॥ ఆనకదుందుభిభగినీమానసహారుండు బుద్ధిమన్మాన్యుండుఁ
ధీనిధి శిశుపాలుని పితయై నెగడొకఁడు దమఘోషుఁడను నామముతోన్.

కం॥ ఆతనిచెంతకు మరుఁడున్ దూతగ నుద్ధవునిబనిపెఁ దోత్తనతండా
నేతనుగని కొలువున నీరీతిని నతులిశివచించె శ్రీహరిభక్తా! ౧౧౯

మ॥ దమఘోషా! మన యుగ్రసేనధరణీదాయుం డకూపారబ
ద్ధమహీభాజితసర్వరాజుల నిజోద్దామప్రతాపాదులన్
గ్రమమానట్లు జయించి వారివలనం గప్పంబులంబొంది ది
వ్యమునీంద్రుల్ దగ రాజసూయకృతి సల్పంగాఁ దలంచెంగదా. ౧౨౦

కం॥ అందుల కీప్రద్యుమ్నుని సుందరు ధానుష్కవరుని శూరుని ధరరా
డ్బృందము గెలువఁగబలులను జెందగ మున్నిట్లుబంపె చేదిధరేశా! ౧౨౧

కం॥ కావున నీవును మసలక యా వీరునకు బలులిచ్చి యనుపుమ యధిపా!
నావుడు శిశుపాలుఁడు విని పావకసమనయనుఁడగుచు వచియించెనిటుల్.

శా॥ ఔరా! కాలగతుల్ దురన్వయములై యాశ్చర్యముం గొల్పవ
ఝ్ఝారే! సరిస్తను గాలహరు నంత విజ్ఞానపరున్ ధారకీ
దాయన్ బ్రహ్మరుగూఁక నేఁడు కలియే శాస్త్రంబుతో నేలఁగాఁ
బ్రారంభించెను నోడబండి నుడియుక్ బాహ్లోపలమ్యెం గదా! ౧౨౩

ఆ॥ ఎచట రాజహంస మెచ్చట కాకంబు మూర్ఖుఁ డెచట నెచట బుధవరుండు?
కాని నేఁడు బంటు కాలగతిన్ సార్వభౌముఁ గెల్వఁగఁ డెఁ బలుకఁగలమె!

తే॥ అల యయాతిశాపంబున యాదవకులమెల్ల భ్రష్టరాజ్యపదమై యేఁనగింపఁ
బడదె! యది యిప్డు రాజ్యంబు స్వల్పమైన నొసఁగినను మగ్గ నడచుయి యెగసినట్లు

ఉ॥ తుచ్ఛకులోద్భవుం డఖిలతో యధివేష్టితరాజ్యపాలనన్
స్వచ్ఛయశంబుఁ గాంచిన నవాండితపుత్రుఁ డఖండపాండితిన్
గచ్ఛపమాదిపెన్నిధులఁ గన్న దరిద్రుఁడు ప్రసన్నవంతుఁడై
యచ్ఛబహూకృతుల్ గనిన నాపఁగఁ బోలునె? పగ్గమేసియున్. ౧౨౬

క॥ వారిధరద్రోణమువలెన్ ధీరతఁ గని యెక్కి నిక్కి దివిపైఁ జుక్కల్
దీరుగ నేమే యిత్తతి దీరిచితిమంచ మిరిద్దికీరే? చెప్పుమా! ౧౨౭

తే॥ కొలఁది పొద్దుల క్రిందట నలఁతిరాజ్య
ముగ్రసేనుండు వొందెనో యొందలేదొ
యపుడె మొతటివాఁడయ్యె నహహా! యతని
కట్టి వాసుదేవుఁడు మంత్రియుంట కాని. ౧౨౮

క॥ అతఁడు జరాసంధునిచే మతిచెడి తన మధుర విడిచి మనుటకు జలధిన్
బ్రతిగతిం కెక్కెను వాఁడే సతతము దద్విభునిఁ గొల్చు స్వబలాన్వితుఁడై. ౧౨౯

క॥ మతి యీచుంతిరి జని సంకర మల వసుదేవగోపకప్రభువరు లి
ద్దఱు నా కొడుకని కొడుకని తురమును బోనరింతు రెంతో తూఘూయనఁగాన్.

క॥ తెల్లనితెంగిరి కాంచిన తెల్లనివసుదేవునంచు ధీరులు దెగడన్
వల్లగ నీ హరిపుట్టెను డెల్లమయిన వార్త యిద్ది త్రిజగములందున్. ౧౩౦

తే॥ ఉద్ధవా! నీవుపల్కిన బుద్ధి యౌతుఁ
డతిబలుఁ డగు ప్రద్యుమ్నుఁడే యట్టి సంక
రునకుఁ బుట్టిన నీచుండు గనుక నీని
కేముకప్పముల్ గట్టుట యేటిమాట? ౧౩౨

క॥ మాటాడక పోరాడఁగ నీరాజును రమ్మటంచు నెట్టనఁ జెప్పుమా!
పోరా! పోరఁగ రారా! ద్వారావతి నేఁడు గెల్తు వెరులు డిందన్. ౧౩౩

తే॥ అని ప్రతిజ్ఞల సల్పి శితాస్త్రశస్త్ర
ములను గైకొని ద్వారకేఁబోవుచుంటి
నాయనా! సభాసదులార! నమ్ముఁడంచు
నరుగుతఱి నడ్డి దమఘోషుఁడనియె నిట్లు. ౧౩౪

— తలిదండ్రులు శిశుపాలునకు హితోపదేశం బొనర్చుట —

ఉ॥ చాలును జాలు సాహసము చక్కఁగ నోయికుమార! వైరినిన్
గాలము దేశమున్ దొలుతఁ గాంచుము మించుము మూఁడుశక్తులన్
మేలగునో సిలుంగగునొ? మిట్టిపడన్ ఫలమేమి? నెమ్మదిన్
జాలఁగ యోజనన్ సలిపి సాగుము వేగ నమోఘపద్ధతిన్. ౧౩౫

క॥ చేసెడికార్యము మంచిదొ దోసమొ యెదొ యరయనొను దుడుకొప్పదుసూ
వాసినిగోరెడివారలు గాసంతయు దుడుకులేక కననౌ శమమున్. ౧౩౬

క॥ శమమే కలహములాపెడి శమమే చెదిరిన మనంబుఁ జక్కఁగఁ జేయున్
శమమే మేలులఁగూర్చెడి శమమే తపమని వచించు సకలశ్రుతులున్. ౧౩౭

క॥ కినుకను మోహము దానన్ దనరెడి స్మృతివిభ్రమంబు దానను మతి నా
శనమునుగల్గెడి మతిదాన నశించెడిఁగానఁ బ్రజగనందగు శమమున్.

క॥ పురుషార్థంబులకోర్పే కరమగు సాధనమటంచు ఘనులందు రిటన్
ద్వరితముగూడదు గనుక సుకరముగ సామంబె సల్పఁగాఁదగుఁబుత్రా! ౧౩౯

ఉ॥ దానముచేత సామమును దానముసత్క్రియచేత నద్దియున్
ధీనిధినుత్య యోగ్యతనుఁ దీప్తినహించును వెండిఁ జేదిభూ
జానులు యాదవాళి యొకజాతికిఁ జెందినవారు గాన నా
మానస మొప్పకున్నదని మార్కొనిపోరుట కీరువారలున్. ౧౪౦

క॥ ఆతఁడు నల్పెడిసేతయొ పూతము బురుషార్థదంబు బుధనుత్యము నా
చేతనయినవఱకేవియొ ప్రీతిగఁ జనియిడెవ నీవు వెంబడిరమ్మా! ౧౪౧

క॥ అని యుచితంబుగఁ జెప్పఁగ విని యలశిశుపాలుఁ డందుభేదితుఁడయ్యెన్.
దననోరెత్తకయుండెను జనకులు పుత్రకులనిట్లు శాసింపఁదగున్. ౧౪౨

తే॥ ఇంతలో. శ్రుతశ్రవయను నింతిమిన్న చేదిపతిరాణి వసుదేవుచెల్లె లటకు
వచ్చి వినయావనతయయి పలికెనిట్లు పాత్రగాఁడును ఖలుఁడైన పుత్రకునకు.

మ॥ తనయా! దుఃఖముగూర్చఁ బోకు మనముల్ దద్యాదవుల్ పోరుటల్
జనదా యానకదుందుభిప్రభవు నీ సౌఖ్యార్థినా మాతులుం
డనియున్ దత్సుతుఁడైన శ్రీహరిని నీ సౌభ్రాత్రముం గోరి యా
వనుగా భావమునం దెఱింగి విను మబ్బా! పట్టు పోనాడరా. ౧౭౪

ఉ॥ ప్రస్తుతమందు నిందలకు వచ్చినవారలు కృష్ణ నాత్మజుల్
నిస్తులశౌర్య ధైర్య బల నిర్మలభావయుతుల్ మహోత్కటులున్
శస్త్రశరీరు లందునఁ బ్రశంస్యులు పూజ్యులు నాకు మీకునున్
గస్తి ఘటించు యుద్ధమునకై తలఁపన్ వలదయ్య! పుత్త్రకా! ౧౭౫

చ॥ అదియునుగాక నన్నలిసి యాగతులైన నమ్మనంటివారి నా
మదనముఖప్రభూత్తముల మాటలఁ బూజల తోఁబుతెచ్చుటల్
ముదమున గారవించి బలముల్ గొలువంగను దోడుకొంచు నా
సదనముఁ జేర్చ నే నిపుడు చాలఁగఁ గోరుచునుంటి నాత్మజా! ౧౭౬

క॥ చిరకాలమయ్యె వారిని మురిపెముతోఁ జూచి నిపుడు ముచ్చటపడెదన్
ద్వరగా మాతో రమ్మిఁక దొరకదు సుత! యిట్టివేళ స్తుతశీలవరా! ౧౭౭

క॥ తలిదండ్రులు తద్రీతిని బలికిరి శిశుపాలుఁ డద్ది పాటింపక యి
ట్టుల మఱి తనవారలకున్ బలికెను జెట్టలు హితోక్తిఁ బాటింతురొకో?

— శిశుపాలుఁడు ప్రద్యుమ్నునిపై దండెత్తుట. —

శా॥ అమ్మా! నా కలరామకృష్ణులు సతం బాగర్హశత్రుల్ గదా
యమ్మాయావులు యాదవుల్ పగను నా కామానముల్ గూర్చరో
యమ్మాడ్కిన్ మన కుండినాహ్వయపురంబం దుండఁగన్ జేరి పూ
ర్ణమ్మౌనట్టి పరాభవంబు గలుగన్ నాపెండ్లి నాపింపరో. ౧౭౯

క॥ వీరలతో నేయుంబే నేరీతిని జేయవలెనొ యేమేమి? యహో!
వీరిని భండనవహ్నిని మారణహోమం బొనర్తు మనవారలరన్. ౧౮౦

తే॥ అమ్మ! మీరిర్వురుంగూడ నహులపక్షమైతి రేన్ మిమ్ముఁ జెఱసాలయందుఁ బెట్టి
కష్టపెట్టెదఁ గంసుండు కన్నవారి జెఱను బెట్టి వేధించినకరణి నిజము.

వ॥ అని కఠినంబుగాఁ బలుక నాతలిదండ్రు లిర్వురు ఖిన్నులై. ౧౮౨

తే॥ ఆరయ నజాతమృత్యమూర్ఖులైన సుతుల
నాద్యు లిర్వురు మంచివా రంతిముఁ డటు
గాఁడుగద యాద్యులో సత్కృతిప్రష్టమలిఁకఁ
జివరవాఁ డసకృద్వ్యథన్ దవులఁజేయు. ౧౮౩

ఉ॥ ఎవ్వఁడు మంచిసేఁతల రచించి పితన్ దనియంగఁజేయునో
యవ్వినతుండె పుత్రకుఁడహో! పతికిన్ బ్రతిలేక సంతతం
బెవ్వతె తత్సుఖం బభిలషించునొ యా సతి భార్య నేఁ
డెవ్విధి నేన్ సుఖవ్యథల నెంతయు నుండునొ వాఁడె మిత్రుఁడౌ. ౧౫౪

చ॥ ఘనుఁ డటువంటిపుత్రకుఁడు గల్గఁడుగా యని మిన్న కుండిరో
జనవర! యుద్ధవుం డవల సాగి యటన్ నిజనేత చెంతకున్
జని శిశుపాలసూక్తుల "తు చా" లును దప్పనియట్లు చెప్పె నం
త నలమహోఖిలుండు తన దాయల భస్మమొనర్ప నేర్పనన్. ౧౫౫

క॥ వాహిని ధ్వజినియుఁ బృతనాక్షౌహిణులను నల్దెఱగులఁ గ్రాలెడి చము వు
త్సాహముచే నాయుధములచే హవణించి మును నడువ సిద్ధమొనర్చెన్.

తే॥ అవల బహులాశ్వుఁ డిట్లనె నమరమునికి నెంత సైన్యమాతఁడు గొనియేగె దాని
లెక్కలన్ నాకుఁ జక్కఁగా వక్కణించు మీరు కాలత్రయజ్ఞులు ధీర! యనఁగ.

వ॥ రాజా! యవధరింపుమని యిట్లని చెప్పంగడంగె. వందయేనుఁగులును, బదివేల గుఱ్ఱంబులును, లక్షకాల్బలంబును, బదునొకండువందలమంది రథులును, గలిగినది సేన యనియు నేతద్ద్విగుణంబుగా మీఱుసేన చతురంగిణియనియు, జతుశ్శతద్విపంబులును, నయుతరథంబులును, జతుర్లక్షతురంగంబులును, శస్త్రాస్త్ర బలవాహనసంపన్నులును, లోహకంచుకాంచితులును, ధనుర్వేదపారీణులును సమర్థులు నగు గోటిపదాతులును, విరాజిల్లునది వాహిని యనియు, దీని కిబ్బడిగా నున్నది ధ్వజిని యనియు, దీని కినుమడిగా భాసిల్లునది పృతన యనియు, నిద్దాని కిమ్మడిగాఁ గన్పడుమొన యక్షౌహిణియనియు, దీనికి నాయకుండైనవాఁడు సాహసుండనియు, శూరుండనియు, నిట్టి శూరులను నూఱుగురును భరించువాఁడు సామంతుండనియు, నేతాదృక్సామంతశతంబును నిర్వహించువాఁడు గజి యనియు సారథిరథవాజులం గాపాడి యుద్ధమొనర్చువాఁడు రథి యనియు, నీదృక్లక్షణంబులు గలిగి సేనలం బ్రోచువాఁడు మహారథి యనియు, పూర్వోక్తకార్యంబులు నెరవేర్చుటయేకాక శత్రుసైన్యంబులను ధ్వంసంబొనర్చువాఁ డతిరథుండనియుఁ దెలిసికొనుమని వెండియు నిట్లనియె. ౧౫౬

తే॥ అట్లు సేనల శిశుపాలుఁ డమరిచికొని వాహినీధ్వజిను లనెడి బలగములకు
సరగ సేనానులుగ ద్యుమచ్ఛక్తులనెడివారి నతబలిష్ఠులను నేర్పాటుజేసి.

క॥ పృతనాక్షౌహిణ్యాహ్వాయవితతచమువులకును రంగపింగాభిధులన్
బతులుగ నొనరిచి మంత్రిసహితుఁడై రతిపతిని గెల్వ నేగఁగ సాగెన్. ౧౬౦

ఉ॥ కాహళమర్దళ్ మొరజా ఢక్కా ఘంటలు మ్రోయఁగా నార్పుల
ర్వ్యాహతపంక్తి కర్ణులఁ గరంబులఁ బాలించి కెంజగాంపించి
త్వ్రహరిపుత్రసేన యరిసేనలు నా జలధిసదిరింప సు
త్సాహముతో నిరీక్షణము కల్గుచునుండె సురంబరంబునన్. ౧౦౬

—♦ మ్లేచ్ఛకర్తలు పాండవసేనతోఁ బోరి పార్శ్వకర్తలచే నీల్గుట. ♦—

ఆ॥ అటు లుభయుల పౌజు లాహవరంగంబున గలిసి కయ్యమాడఁగడఁగె నంత
దొలుత వాహినియను బలగంబుతో మ్లేచ్ఛులు నైన్యాధ్యక్షులఁ దాఁకెఁబగల.

క॥ అవరక యటు శిశుపాలునిచెలిమొన తెలపుటలఁ గాంచి పీఠిలకి జగ
ద్వాదితులు బలులను యోధులు లవినా! యనఁ బ్రతిఘటించి నర్తాళిమలతోఁన్.

తే॥ ఉభయసైన్యబాణంబుల నుద్ధురముగ
నంధకారమ్ము గ్రమ్మె రణాంగణమున
నుభయహయపద్రజంబుల నభము మిగుల
గప్పఁబడియెను బ్రేక్షకుల్ గాంచి యదల. ౧౬౪

క॥ అందలివాజులు పఱుగిడి సందియముల విడిచి రిపుల సామజములపై
నందడి జేయును మఱిఁ గరిబృందంబో కాళ్ళ నరుల నెప్పుచు ద్రొక్కెన్.

ఉ॥ బాణగదాస్త్రశస్త్రవర పట్టిసశక్తి కృపాణజాలముల్
బాణులఁ దాల్చి త్రాణఁగని వారలు వీరల వీరు వారలన్
బ్రాణములం దెగించి పడ బాఁదుకొనం దుద నందఁ బాదముల్
బాణులు నంగముల్ దెగిన బంటులు కన్పడసాగి రోవిభూ! ౧౬౬

సీ॥ అతిజవంబున నేగు నశ్వంబులన్ రెండుతుండెములుగ జేయు నొండు గండఁ
డతిబలంబున మించు హస్తిదంతంబులం బట్టి కుంభంబులం బఱుగు నొక్కఁ
డిభవాహమంత్రులన్ మృగరాజువలెఁ బట్టి పట్టి పల్లార్చెడి భటుఁడొకండు
పరసైనికులనెల్ల గరవాలమునఁ జీల్చి నటునటె దిసుగాఁడు భటుఁడొకండు

తే॥ విహగరీతినిఁ జెంగున విన్నుదాఁకి పీఁక మాస్తురపై దూఁకు వీరుఁ డొక్కఁ
డుండియుండనియట్లుండి భండనంబు జరుపుదళవాయి యొక్కఁడు వఱలు నందు.

మ॥ అవలన్ జైత్రబలోల్లసద్ధృతిమ లా యక్రూరుఁ డీక్షించి బా
ణవితానంబుల గుప్పె నంత రిపుసేనల్ వానకాలంబునన్
రవినిన్ మబ్బులు గప్పినట్లు గసిఁ దీవ్రంబైన విల్లమ్ములన్
నవయన్ వానిని గప్పెఁ జేదిధరణీనాథోక్తులన్ బొంగుచున్. ౧౬౯

ఉ॥ అంతట గాందినీతనయుఁడాగ్రహమూర్తి యనంగ నొప్పి పా
ణాంతముసల్పు రిష్టిగొని యారిపులేసెడి బాణసంతతిన్
సాంతముగా జయించి స్వమహత్తరశక్తిని దద్యుమంతు న
భ్యంతరమింతిలేనటు లయారె! యనం బ్రహరించె దేవరా! ౧౨౦

తే॥ తత్ప్రహారంబునన్ వాఁడు ధరణిపైన, రెండుగడియలుదాఁక మూర్ఛిల్లిమరల
లేచి లక్షభారభరకల్పితను గదనుగొట్టి వానిఱొమ్మున మేఘమట్టు లఱచె.

తే॥ వానిదెబ్బ నక్రూరుండు వ్యాకులాత్ముఁ
డగుట యుయుధానుఁ డీక్షించి యతిరయమున
గాలరుద్రనిమాద్రిని గవిసి తద్యుఁ
మంతునకుఁ దిరస్కృతి బలుమాటలాడి. ౧౨౧

ఉ॥ చీటికిమాటికిన్ విలువిశేషవిధంబులఁ డంకరించి వా
చాట! త్వదుత్తమాంగము వెసన్ హరియించెడి దీనిఁగాచికొ
మ్మా! టకటొంకు లాపుమిఁక నం చొక తూపును వేయ నద్ది యా
పోటరిగొంతుకన్ నఱికి భూమినిఁగూల్చె ననంతరంబునన్. ౧౨౨

తే॥ తద్యుమంతుని వీరులున్ దాళఁజాలమంచు గాల్కొలందిం బాఱిరవల శత్రుఁ
డనెడి ధ్వజినీప్రభుఁడు వచ్చి యట్లువారు పరుగిడుటఁగాంచి కోపించి పరితపించి

మ॥ అరరే! నేనిట నుండఁగానె యిటులన్యాయంబుగా సాగె నే
మిర! మావీరులు బాఱఁగాఁ దొడఁగిరేమీ! యాదవుల్ రేగిరే!
సరియే నేనిఁక నూఱకొంటదగునా? చాల్గాలు నంచుద్ధతిన్
వరశూలం బల సాత్యకిన్ దునుమఁగా వైచెంజుమీ పిమ్మటన్. ౧౨౩

ఉ॥ సాత్యకి వానిదెబ్బ నిముసంబు రసన్ గడబట్టె నంతఁ ద
త్పత్యయపాత్రుఁడైన కృతవర్మ రయంబున నేగుదెంచి త
న్నాత్యహయోజ్జ్వలద్రథమునూకఁగ నల్ప ననల్పశక్తుఁడున్
వ్యత్యయమయ్యెనంచు నధికాగ్రహముం గొని దువ్వె మీసముల్. ౧౨౪

చ॥ కసిఁ బస దివ్యముద్గరముఁ గైకొని తత్కృతవర్మ తేరు బ
ల్మిసిగనొసర్చె నావల బలుండగు నాతఁడు స్యందనంబు వీ
డి సరగ నట్టిశక్తునిఁ గడిందిగఁబట్టి భుజాయుగంబునన్
వెస రసఁగూల్చి నెట్టె నొక విస్తృతయోజనమేగునట్లుగాన్. ౧౨౫

క॥ అది కని తచ్ఛిశుపాలుం డదరియు నల రంగపింగులను బ్రెగ్గడలన్
మదపూరితులను హితులను నెదిరుల నెదిరింపుఁడంచు నేత్తెఱఁబంచెన్. ౧౨౬

——♦ రంగపింగులు యాదవబలంబుతోఁ దలపడి భానునిచే హతులగుట ♦——

చ॥ అనిపినమీఁద వారికివి దర్పసమీహలు విచ్చి వచ్చుగాఁ
జని శితబాణవర్షము లనాథ్యముగాఁ గొనరించి మించి ప
ల్కొనుకను దంతిరథ్యములఁ గేతనముల్ రథులన్ భటంబులన్
మొనతలకట్టులన్ మిగుల మోఁదిరి దేవ! యనంతరంబునన్. ౧౭౮

క॥ ప్రద్యుమ్నుఁడు రిపుబల మనవద్య పటిమ నెదుచుఁ గాంచి జొప్పరె! మనవా
రద్యస్థలమున మొనన్ సద్యశ్శమున్ గడనఁ జేయఁజాలరె తిర్వా! ౧౭౯

క॥ అనుచిటు యాదవులందఱ ఘనసభఁగాఁ గూర్చి యిట్లు గంభీరగతిం
బున యాదవులారా! యటుగనుఁడీ యరిలెంకుల నెలఁ గాంచెదరో?

క॥ కావున వే మన మొన మొన నీ వేళను జొచ్చి శత్రుబృందమ్ము తను వీ
రావేశముతోఁ దుత నలవై వస్వాతపురికి నంపివచ్చెద మెచ్చన్. ౧౮౧

తే॥ లేనిచో రంగపింగసేనాను లింక మన పతాకినులన్నిటి మడియఁజేయఁ
గలరు కావునఁ బోరెద నలఘుశక్తి మీరు నైతము దండెత్తు మేడమునకు.

వ॥ ఇట్లు శపథంబులాడుట శ్రీకృష్ణపుత్రకులలో నొక్కరుండును, నుక్కరియు నగు భానుండనువాఁడు తత్సభాగ్రమందు నిలిచి సభాసదు లాలకింప మేఘగంభీర భాషణంబులతో నగ్రజాగ్రణీ! తమ యాగ్రహంబున కిది యవసరముగాదు. ముల్లోకంబు లొక్కుమ్మడి నెత్తఱి నెదుర్కొనఁదలంచునో యత్తఱి భవదుగ్రధనుష్టంకారంబున కవసరంబుగలుగునేమో కాని సామాన్యులగు నీ రంగపింగుల శిరంబులం దురంబునం దొల్లంజేయుట కలఁతియగు నాకృపాణంబు చాలదే? కళింగరాజును జయించిన పగిది నివ్వైరినిం గెల్చి సంతోషంబు గూర్పంగలవని పగ్గించి తత్ప్రయత్నం బాపి ఖడ్గధరుండై పదాతిభాతి నరాతిపతాకినిలో వనగజంబు వనంబునం బ్రవేశించుచాడ్పునం జొచ్చి హయంబులం ద్రుంచి పతాకలం జించి యుపలించి యెదిరుల మదంబు సదమదంబుగావించియు బుజంబులం గొట్టియుఁ జెవితెక్కలుగాఁ గట్టియు దుత్తునియలగునట్టుల మట్టియు నెట్టియు క్షీణపుణ్యంబులగు తారకంబులు బుడమింబడెడివడువున ముత్తెంబులు రాలుచుండ గుంభికుంభములం జగిల్చి ద్వితీయ ఖడ్గంబునం దన్త్రైన్యంబంతయు నంతంబునల్పి నీహారపటలంబు భేదించుచుం బ్రకాశించెడి ప్రభాకరునిచందంబున వెలుంగుచు శ్రీకృష్ణదత్తంబగు కరవాలంబునం దద్రంగపింగశతాంగంబులం భంగంబుగావించి తురగంబులం మఱుమాడి సూతులం ఘాతించి తనఖడ్గంబును ఛేదింపవచ్చు తమభయచంద్రహాసంబులను నాశంబునల్పి తద్రంగపింగోత్తమాంగంబులకుం గుఱియగునట్లు సముదగ్రాగ్రహవ్యగ్రుండై యసి

వరంబొందు నైవ నా యిరువురిశిరంబు లేకకాలంబునం దెగి ధరణింబడి దొరలు చుండ నబ్భానుం డానందించి యవి సంగ్రహించుకొని. ౧౮3

చ॥ జయజయరావముల్ సెలఁగఁజారణులుం గొనియాడ స్త్రీయులున్
భయమునువీడి సంతసిల వైరులు బొఱఁగఁ బూలవాన ల
వ్యయముగ వేల్పులుం గురియ వాద్యములున్ మొఱయంగ నమ్మచె
ల్ల! యనఁగఁజూపఱున్ బహువిలాసముగా నిడె మారుచెంగటన్. ౧౮४

మ॥ తరువాతన్ శిశుపాలుఁ డా యిరువు రంతంబొందుటంగాంచి వీ
రరసం బుబ్బ శితాస్త్రముల్ బవనశీఘ్రివ్యాయతాశ్వీయబ
ద్ధరథశ్రేష్ఠములున్ విమానసమముల్ దంతుల్మదోద్వృత్తము
ల్వీరవిద్యాధరతుల్యులున్ భటులు గ్రాలం బోయెఁ బోరాడఁగాన్. ౧౮౫

తే॥ అటు వసుంధర మాఱుమ్రోయంగ సల్వ
తూర్యములతోడ రథమెక్కి తూఱ మొనర్పఁ
జేదినాథుఁడు వచ్చుట జిత్తజుండు
గాంచి యోజించి రోషించిమించి తొలుత. ౧౮౬

క॥ పురుహూతదత్తరథికుం డురవడితో నెక్కి శంఖమూఁదెను దానన్
ధరణియు నభమును మొఱసెను బరచిత్తములఁ గలగుండుపడియెను సుగుణీ!

—♦ ప్రద్యుమ్నుండు శిశుపాలునితోఁ బోరి యోడించుట ♦—

క॥ అవలన్ దత్కంఠరవ్పం డవిరళశిశుపాలసైన్యమనుమేడకు శా
తవిశిఖముల మెట్లుగఁగూర్చె విబుధులెల్లరును వినుతిసేయఁగ వీఁకన్.

శా॥ సత్తాఖ్యాతుఁడు చేదినాథుఁ డవలన్ శౌర్యాత్మజారంభముల్
మొత్తన్ మాటికిఁ జాపటంకృతుల నామూలంబు గావించి త
ద్దత్తాత్రేయసుశిక్షితంబు దృఢమౌ ధాత్రస్త్రమున్ వేయనా
చిత్తోద్భూతుఁడు దత్తజిల్లకయ శోచిష్కేశతుల్యాత్ముఁడై. ౧౮౯

తే॥ అతని యస్త్రప్రభావంబు నాక్షణంబునందు నవలీల మరల బ్రహ్మాస్త్రమేసి
సంహరించెను దానికాశౌర్యధనుఁడు చైద్యుఁడగు శిశుపాలుఁడు సాహసమున

క॥ అంగజుభంగమొనర్పఁగ నంగారాస్త్రంబు భార్గవాంతఃకరణా
భంగురలబ్ధము వేయఁగ నంగారంబులు జనించి యడజడులిడఁగన్. ౧౯౦

క॥ అర్జునమిత్రసుపుత్రుఁడు పర్జన్యాస్త్రంబు వేసి వాని శరంబున్
భర్జించి సుఖముఁగూర్చఁగ దుర్జనుఁడౌ చైద్యుఁ డలకతో నాత్రుటిలోన్.

ఉ॥ కావున నింతటన్ విడిచి కావుము మా నెఱసుల్ క్షమింపుమో
దేవ! యనాథరక్షణసుధీ! యని వేఁడ మరుండు భూవరా!
యీ విపరీతకార్యతతి హేతువు నీ సుతుఁ డేముగాము కా
లానగుణంబె కారణమటంచు మనంబునఁదోఁచుఁ బూర్తిగాన్. ౨౦౩

తే॥ అని సముచితంబుగా బల్కి యతని సుతునిఁ
బాశముల విప్పిపుచ్చ నపారముదముఁ
బొంది యా దమఘోషుఁడు పుత్రుతోడ
స్వీయచంద్రికానగరంబుఁ జేరె జనక! ౨౦౪

తే॥ అవలఁ దచ్చైద్యసామంతులందఱు తమ
ప్రభుని గతిగని యెదరక బలులనిచ్చి
రంతఁ గంతుఁడటన్ సాగి యాదవాన్వి
తముగ మనుతీర్థమున జలకములనాడి. ౨౦౫

— ♦ ప్రద్యుమ్నుండు కొంకణదేశాదులం గెలుచుట ♦ —

క॥ కొంకక జంకక లఘుగతిఁ గొంకణదేశంబు సొచ్చి క్షమఁ దనరాకన్
గింకరుచేఁ దెల్పఁగఁ దత్కొంకణపతి వచ్చి మరునికడ కిట్లనియెన్. ౨౦౬

ఉ॥ దేవ! గదాధరోత్తముఁడ దివ్యకులప్రభవుండ దిట్ట మే
ధావి యటంచు నన్బిలువ ధాత్రిని నేలెడివాఁడఁ గావునన్
నీవు గదారణం బిపుడు నెమ్మినొనర్చి జయించి నాదుసే
నావళి రూపుమాపుమని యాడగ నిట్లనెఁ బచ్చవిల్తుఁడున్. ౨౦౭

తే॥ పెక్కుమందిమి విఖ్యాతవీరవరుల మేము చెలఁగితి మరయ నీవేకకుఁడవు
గావె యిద్ది యధర్మముగాదె కనుకఁ ద్వరఁగఁజని కప్పముల్ గొని తమిని నిమ్ము.

క॥ అనవుడు మేధావియు నిట్లనియెను నటుకాని యెడ మదంఘ్రిని దీనిన్
గొని కదలించుఁడి! చూతము ఘనవీరులుగారె చెపుడి! గట్టిగ ననఁగాన్.

క॥ దానికి యాదవులందఱు మానముతో మండిపడిరి మఱిఁ దత్రాలాం
కానుజుఁ డధికబలుం డభిమానియునౌ గదుఁడు వానిమదము నణంపన్.

చ॥ గదను గ్రహించి నిల్వ నలకొంకణనాయకుఁ డాగ్రహంబునన్
గదఁగొని వానిపై విసరఁగాంచి గదుండుగదన్ దదీయమా
గద నుసిఁజేసి రోసమునఁ గాడుపడన్ బ్రహరింపనట్టి బె
ట్టిదుఁడు వసుంధరన్ బడి కడిందిగ నోటనుగ్రక్కె నెత్తురుల్. ౨౧౧

గెల్చుట కరిగె. అందు రాజధానియగు మహోరంగపురంబునం దద్వసుదేవుని మత్తి
యొకచెలియలగు శ్రుతదేవయనుదాని భర్త వృద్ధశర్మ, దంతవక్త్రిం డను తన
యునితోఁ గూడి పాలకుండుగా నుండు. ౨౧౪

ఆ॥ అట్టి వృద్ధశర్మ యాత్మజుఁడౌ దంతవక్త్రుఁ డంబుజాక్షువైరి యగుచు
నట్టి చైద్యుఁబోలె నమ్మయబ్బలమాట దాఁటి కినుక నిట్లు లోటులేక. ౨౧౫

—♦ దంతవక్త్రుఁడు మన్మథునితోఁ బోరి యోడుట. ♦—

ఉ॥ ఈదినమందు యాదవుల నెల్లర జల్లన డొల్లనేసి యా
మోదముతోడ వత్తునని ముజ్జగముల్ వణఁకన్ వచించి క్ర
వ్యాదభయాకృతిక్రియల నక్కజుఁడై పలువిండ్లఁ బట్టి దా
మోదరపుత్రుపై దుమికె మోఁదుటకై యసహాయశూరుఁడై. ౨౧౬

వ॥ అంతం గందర్పుండు దర్పంబునం దమమీఁది కేతెంచు. ౨౧౭

సీ॥ కనులఁద్రిప్పఁగఁజాలు కాటుకమలఁబోలు నల్లనిరంగుతోఁ జెల్లువాని
నిప్పులం గ్రక్కుచు నివ్వెఱబడఁజేయు వ్రేలాడు నాల్కతో వీఁగువాని
గుండె బ్రద్దలొనర్చు దండిమబ్బులఁబోలి పలుమాఱు బడబడన్ వాగువానిఁ
దద్దయు నిడుపైన దశతాళవృక్షంబు లంతయున్నతమున నమరువాని

తే॥ మకుటకుండలహైమవర్మకటకాది భూషలన్ వెలువానిని భూమి వణఁకఁ
దరుల గిరులను ద్రోయుచుఁ దిరుగువాని లక్షభారాంచితగదఁ జెలంగువాని.

తే॥ కాంచి యాతనితోడుతఁ గయ్యమాడ దివ్యశస్త్రాస్త్రముల్ దాల్చి త్రిజగములను
గెల్చి పెల్చన నిల్చెడి కీర్తిఁ గనెడి స్వబల మంపె నష్టాదశాక్షౌహిణులను.

మ॥ పిదపన్ దద్బల మస్త్రశస్త్రముల నా వీరుల్ మదోన్మత్తునిన్
జిదుకంగా బ్రహరించె నాగ్రహముతో శృంగుల్ మహోగ్రావమున్
జదియం గ్రుమ్మినయట్టు లాయసురుఁడున్ గాలాగ్నిరుద్రాభుఁడై
గదఁ గైకొంచు వియచ్చరుల్ వెఱపుతో గాంచన్ విజృంభించుచున్. ౨౨౦

ఉ॥ కొన్నిఁటి కుంభికుంభములఁ గుంభినిఁ గూలిచి తన్ని కొన్నిఁటిన్
గొన్నిఁటి వందయామడలకుం బడనెట్టి వియత్స్థలంబునం
గొన్నిఁటిఁ గొమ్ములం బెఱికి క్రోడిగముం బొనరించి కొన్నిఁటిం
దన్నుకొనంగ మొత్తి మొనఁ దద్రిపుసైన్యమునందు వెండియున్. ౨౨౧

ఆ॥ సాంబుఁ డంతలేచి సరసునఁ దద్దంతవక్త్రిపాదములను బట్టి యిలను
బడఁగ వైచె నద్ది కడువింతగాఁ దోఁచె సర్వజనులకో రసాతలేంద్ర! ౨౩౨

ఆ॥ అపుడు దంతవక్త్రిఁ డవలీలగా లేచి యఖిలభువనములును నార్వ నట్ట
హాస మాచరించి యా శంబరారితో బలుకఁదొడఁగె నిట్లు పరుషరీతి. ౨౩౩

మ॥ మదనా! మీరు యయాతిశప్తులును సామాన్యుల్ బరాస్కందులు
న్గదనప్రాంగణభీరువుల్ ఖలులు నానాగోత్రసంజాతదు
ర్మదమత్తాంధక యాదవప్రభృతులై మాయంతవార్లేరటం
చెవలో సిగ్గును వీడి వచ్చితివిరా! యీనాఁటి కీరీతిగాన్. ౨౩౪

క॥ వచ్చితివి పొమ్ము మీరిపు డిచ్చటఁ బదిమంది గలిసి యేకాకిని నన్
విచ్చలవిడి బాధింతురె? మచ్చరి ధర్మంబె వేయిమాట లిఁకేలా? ౨౩౫

తే॥ అయిన నిన్నన్నచో దోషమత్తుఁగాని నన్నుఁ గన్నట్టి తండ్రిని నీకులంబు
నిందఁజేసిన దోషంబుఁ జెందదందు వెయ్యిహేతువుల్ గల వవ్వి వినుమ దుష్ట!

సీ॥ ఎవఁడు జరాసంధు నేపున కోపకకూపారమును జేరి ప్రాపుఁ గోరె
నెవఁడు మహాకాలయవనునిధాటికి భయమినుడింపఁగా బాఱిపోయె
నెవ్వఁడు వ్రేతల యిండ్లలోఁ జొరఁబడి దధినవనీతముల్ దస్కరించె
నెవ్వఁడు వేదశాస్త్రరీతిధర్మముల్ దాఁటినబాటల మాటలాడె

తే॥ నెవఁడు గోపికాబాలుల యిండ్లకరిగి కూనరాగంబులం దీసి కొంటెయయ్యె
నెవఁడు టక్కులం జెక్కుల నేసరేఁగె నెవ్వఁ డేవగింపులకును నేవపడఁడో.

ఉ॥ ఎవ్వఁడు గోపికాంగనలయెంగిలికూడు భుజించి మెచ్చునో
యెవ్వఁడు రాసమండలుల నెబ్బెటికంబుగ నాటలాడునో
యెవ్వఁడు నందు గోవులను నెల్లపుడున్ దమిఁ గాచుచుండునో
యవ్విటకుండు కృష్ణుఁడుగదా నినుఁ గాంచినతండ్రి దుర్మతీ! ౨౩౮

తే॥ అట్టి నీచుండు నీ తండ్రి యల్పరాజ్య
మును గడించి ప్రభుండయ్యెఁ బుష్పబాణ!
యతని దయ నుగ్రసేనుఁ డా యలఁతి దొరత
నంబుఁ గైకొని యాదవనాథుఁడయ్యె. ౨౩౯

తే॥ అంతమాత్రన రాజసూయం బతం డొనర్పఁదలపడె క్షుద్రమహా నక్క సింహ
పంచనఖములతోఁ గలహించునట్టు లబ్బురమగుఁ గాలగతి దురత్యయంబు.

శా॥ అనవుడు దంతవక్త్రుఁ గని సంభ్రమమున శిశుపాలుఁ డిట్లనే
దనుజకులాధమా! మునుపు తాళ్మి వహించినవాఁడు బంటు
మునుఁ గను నాఁటియుండియు యధర్మప్రవర్తనంబు లనుచుల్
విని కని యుండి నేఁడు చిన్మయ మహిమ నను వారి కొంటుకే! ౨౮౧

క॥ నీ కీ కండకనిడి నరాధముఁ డెవఁడో మృత్యువు మాత్రోఁ జేయక
బూనితివి భార్గవుల కిడి నారాయణాధముఁడా! యధర్మము గాదే! ౨౮౨

వ॥ వెండియు క్రోధించెను వసు విశ్వసంభవను సంపదను నామంబునం
జన్మంబెత్తి గోపాలబాలకుం డై మెలంగెననియు, గోకులంబున వసించు
గోపికాగోపకులు శ్రీరాధామాధవ సహచరులు గోలోకవాసులనియు,
నెవ్వఁడు లోకాభిరాముఁడనియుఁ బరంధాముండనియు ననంతబ్రహ్మాండనాథుం
డనియు, గోలోకేశ్వరుండనియు, భగవంతుఁడనియుఁ బరాత్పరుండనియు వేదాంత
విదులచేఁ గొనియాడఁబడునో యే మహామహుండు స్వతేజంబున సర్వచరాచర
తేజంబులు లీనంబుగాఁ బ్రకాశించునో యా పరమేశ్వరుఁడే దుష్టశిక్షణార్థంబును
శిష్టరక్షణార్థంబును శ్రీకృష్ణనామధేయంబునం గోకులంబునం బరిపూర్ణతమావ
తారం బెత్తెననియు మరియుం దను పార్థివేంద్రుండె యా కృష్ణవరంబుచే నుగ్రసేనుం
డను పేరం జనించి యాదవేశ్వరుండై నిరంకుశంబుగా రాష్ట్రంబుఁ బరిపాలించు
చుండెననియుఁ బైనార లంపజను బూర్వజన్మార్జితానేకపుణ్యంబులచే జన్మించి
రనియు గుర్తెఱుంగుము. ఇట్టి మహాత్ముల మాలవాకుట వాడిగాక కీడులకుం
బోడగు. అట్లు నిందించినను జంబుకారవంబు లత్యంతంబు జేయని సింగంబుభంగిని
శ్వానధ్వానంబులను వినని మత్తమాతంగంబువిధంబునను, జెవిచెవిం బెట్టిదఁ గాన
శూరుండైన మిన్నక కదనమ్మునకుం గదలిరమ్మున సద్దనుజేంద్రుండు రోషా
వేశపరవశుండై ౨౮౩

తే॥ గదను లక్షభారాంచితఁ గరమునఁ గొని
మరుని యురదంబుపై వైవ వారిసహస్ర
మిలను గూలియు సకిలించి నలుఁగడలకు
వెఱపుతోఁ బాఱఁదొడఁగెను ధరణినాథ! ౨౮౪

ఉ॥ పిమ్మట నమ్మరుండు ధృతవిస్తృతమా గదఁ దాల్చి దైత్యువ
క్షమ్మునఁ గొట్ట వాఁ డలఁతిగాసిని జెందె ననంతరమ్మునం
దమ్మనుజాశనాంగజుల కద్భుతమైన గదాహవమ్ము ఘో
రమ్ముగ నయ్యెఁ గొండ మృగరాజులు పోటిగఁ బోరినట్టులన్. ౨౮౫

ఆ॥ అంత దంతవక్త్రుఁ డాత్మీయభుజదండ
ములను గృష్ణపుత్రుఁ బుష్పబాణు
మృగవిభుండు బల్మి మృగరాజునుంబట్టి
క్షోణిఁ గూల్చినట్లు గూల్చె నవల. ౨౮౬

చ॥ మదనుఁడు లేచి కర్బురు నమందముగాఁ గొని త్రిప్పి బాఁద వాఁ
డదటుగఁ గ్రక్కునెత్తురుల నస్థులు చూర్ణముగా ఖిలాంగుఁడై
యదవగఁజెంది ప్రాదిని నహార్యము గూలినమాడ్కి సొమ్మతో
న్గదనమునంబడన్ భువి వణంకెఁ జలించె జగంబు సర్వమున్. ౨౮౭

ఉ॥ అంతట వాని తండ్రియు మహావిబుధుండును బుద్ధిశాలియున్
శాంతుఁ డుదారచిత్తుఁడు రసజ్ఞవరుండగు వృద్ధశర్మ ని
శ్చింతగ సంధిఁగోరుచు స్వసేనలఁగూడి సతీసమేతుఁడై
కంతుని చెంతకుం జని మొగంబున దోసిలిఁగూర్చి యిట్లనెన్.

ఉ॥ దీనశరణ్యా! వృద్ధులము దీనులమా మముఁజూచి నీతనిన్
మాని శ్రుతిస్థధర్మమును మంటను గల్పుచు దుర్మదాంధుఁడై
పూనిక నిన్నుఁ డీకొనిన పోకిరి నా సుతు సత్కృపామతిన్
మానక కావవేఁడెదను మన్మథ! యాదవవంశదీపకా! ౨౮౯

ఆ॥ అట్లు వేఁడి బలుల నంగజునకు నిచ్చి యాదవప్రవరుల యర్చఁబడసి
యాత్మకీయమా మహారంగపట్టణమునకు మరలఁ జేరె భూవరేణ్యా! ౨౯౦

తే॥ అవలఁ బంచబాణుఁడు దక్షిణార్ణవమున
స్వబలములతోడ భక్తితో జలకమాడి
కొట్లకొలఁదిని గోవులున్ గోపకులును
సంచరించు నుశీనరస్థలికిఁ జేరి. ౨౯౧

క॥ పౌరులు భయభక్తుల నిడు క్షీరంబును బెర్గు వెన్నఁ జేకొని యర్చల్
భూరిగఁగొని గజహయరథహారాంబరమణులఁ బొంది హర్షముఁజెందెన్.

—♦ మన్మథుఁడు విదర్భాదిదేశంబులం గెలుచుట. ♦—

వ॥ పదపడి నమ్మదనుండు గదలి మణిరత్నమయంబై సర్పంబులతో భోగవతీపురంబు పొల్పారునట్లు రాజన్యులతో నొప్పారు చంపావతీపురి కరిగి తదధిపుండగు హేమాంగదునిచేఁ బూజితుండై కరంబులం బరిగ్రహించి నమస్కారంబులం గొని సంతుష్టుండై యా భూపలలామునకుఁ గింజల్కసముపేతంబగు హారంబును,

సహస్రదళంబులతోఁ శోభిల్లు దివ్యపద్మంబు నొసంగి సపరివారంబుగా వీడ్కొని
పలుమాఱు దుందుభులు మ్రోఁగించుచు వివిధదేశంబుల కడచఁ బాండ్యదేశాని
మగు కుంజినపట్టణంబునందుఁ జెలంగు భీష్మకుండను పాండ్యరాజు రాక విని
సంతోషించి చని యాతనిని సదనంబునకుం దోడ్కొనివచ్చి పూజించి దివ్యాంబ
రాభరణంబు లొసంగి ముక్తాహారముల సమర్పించి యుధిష్ఠిరుండుగా నాకంప
మ్పం దామోదరంబునొంది మాతామహుండగు సమస్తహారాజునకుఁ బ్రణామంబు
లాచరించి సైన్యసమేతుండై కుంతిదరదదేశంబుల కేఁగి, ౨౫౩

— మలయాద్రిపై నగస్త్యమహామునిం గాంచి పాండ్యదేశంబు నొందుట. —

తే॥ మలయభూధరపాటీర మారుతములు చల్లగా వీచుచుండఁగఁ జందనతరు
కేతకీపుష్పవాసనోపేతమలయగిరి నగస్త్యుఁ జేరి వీక్షించి భక్తి. ౨౫౪

చ॥ కరముల మోడ్చి కీర్తిబల కౌతుకసంపద లిచ్చు చీవెనల్
గరము గ్రహించి మౌని నడుగన్ సమకట్టి నిటుల్ నతాంగుఁడై
యరయజగంబు దృశ్యమగు నద్ధ మసత్యముగాదె యెట్లికన్
వఱలుచునుండె సత్యముగఁ? బల్కుము! యోగికులావతంసమా! ౨౫౫

తే॥ వెండి జీవుండు బ్రహ్మాంశకుండు ముక్తుఁ
డనుగదా యాతఁ డెట్టిక గొనములగుమి
బద్ధుఁడయ్యెడి? బ్రహ్మవిద్వర్య! చెపుమ!
కుంభసంభవ! దివ్యచక్షూ! మహాత్మ! ౨౫౬

చ॥ అనఁగ నగస్త్యుఁ డిట్లనియె నంగజ! నీ వల కృష్ణుపట్టివై
యనఘుఁడవై మహాత్ముఁడవు నై యిటు లద్భుత లీలయై జగం
బునకు శుభంబునెక్కొలుప మూలముగన్ హరివోలె నీవిలన్
జననముఁ జెంది మానవుల సాటఁగఁ దిర్మ్మరుచుంటివో ప్రభూ! ౨౫౭

తే॥ సత్యరవి ప్రతిబింబము సలిలమందు సత్యముగఁ దోఁచినట్టులన్ సకలవిధుల
తత్త్వమునకును మఱియుఁ బ్రధానమునకుఁ జూడఁదగినది శ్రీకృష్ణమానువర్య!

ఉ॥ ఎట్టుల నద్దమందు మొగ మెట్టుల సైకతమందు జీవనం
బెట్టులఁ దార్పిట సర్పము నహీనముగా నిజమౌచుఁ దోఁచునో
యట్టుల నీజగం బనృతమైనను నిక్కువమట్లు దోఁచు నిం
కట్టుల నిట్టి జీవుఁడు తదంగగుణంబుల బద్ధుఁడౌఁ జుమీ! ౨౫౮

చ॥ అనఁగ ననంగు డిట్లనె మహాముని నాయక! జీవుఁ డేవిర
క్తిని గుణపాళిఁ జిక్కుపడి తిమ్మట నెందఁడో? యేయుపాయపం
ధను గుణరాజిఁ జిక్కుపడి తల్లడమొందఁడొ? యట్టి సంగతుల్
గనికరముం ఘటించి పలుకన్వలె బ్రహ్మవిదగ్రిణీ! గుణీ! ౨౬౦

ఉ॥ నావు డగస్త్యుఁ డిట్లనె వసంతిశయానకుమారరత్నమా!
యేవిశుఁ డవ్వివేకము గ్రహించి జగంబు మనోమయం బటం
చావులవీడి యుండెడినొ యావిబుధుండు సనాతనంబు సౌ
ఖ్యావహమైన బ్రహ్మపదమందఁగలండు నిరర్గళంబుగాఁ. ౨౬౧

ఉ॥ భావుకభీతిజన్మమృతి బాధలు నాధులు వ్యాధులుం క్షుధల్
యౌవనబాల్యవృద్ధత లహంకృతులుం మమకారముల్ రతుల్
గావరముల్ విమోహములు గష్టసుఖంబులు మంచిచెడ్డలు
న్దేవర! యాత్మ కంటవని నెమ్మదినమ్ముమ! కొంకులేనటుల్. ౨౬౨

మ॥ నిరహంకారము నిష్కలంబుఁ బరముం నిర్దేహముం బుద్ధము
ద్ధురముం శుద్ధము సర్వతోముఖము సంతోషస్వరూపంబు శ్రీ
కరముం బూర్ణ మనాదిమధ్యలయముం కాలాత్మకంబుం గుణా
కరముం బ్రహ్మమటంచెఱుంగు నెవఁడా గాఢజ్ఞుఁడే ముక్తుఁడౌ. ౨౬౩

చ॥ ఎవఁడు ప్రపంచమంతయు శయించెడి కాలమునందు మేలుకొం
చవితథతత్వముంగనుచు హాయిగనుండునొ యామహాత్ము నీ
భువనముగాని మానవసమూహముగాని మఱేదిగాని యె
ట్టివిధిని జూడలేదని కడింది గ డెందమునందు నమ్ముమా! ౨౬౪

వ॥ మఱియు గగనానలానిలంబులు గోష్ఠకాష్ఠరేణువులకుం జిక్కుపడక మెలంగుభంగిని, స్వచ్ఛంబగు స్ఫటికంబు పీతారుణకృష్ణవర్ణంబులతో సంక్రమింపనిసరణిని గుణంబులచేఁ గట్టువడక లౌకికోక్తులచేఁగాని లక్షణాధ్వనివ్యంగ్యంబులచేఁగాని తెలియఁబడక ప్రత్యక్షానుమాననిగమాత్మజ్ఞానంబులతోఁ గొందఱచేఁ గర్మమనియు గొందఱచేఁ గర్తయనియుం గొందఱచేఁ గాలంబనియుఁ గొందఱచేఁ యోగంబనియుఁ గొందఱచే సాంఖ్యంబనియుఁ గొందఱచే వాసుదేవుండనియు, గొందఱచే బరమాత్మయనియుఁ గొనియాడఁబడుచు వెలుంగు నాబ్రహ్మంబు శ్రవణమననిదిధ్యాసంబుల విచారించు పుంగవుండు నిస్సంగుండై సుఖియై విరాజిల్లు వ్రీచలదుదకంబువలనఁ బాదపంబులు చలించినపగిదినిఁ దిరుగుడుకండ్లకు ధరణి తిరిగెడితీరునను, గుణంబులచే భ్రమించు మనంబున కాత్మయందు జననమరణాది దుఃఖంబున్నట్లు తోఁచుచుండు. భ్రాంతులగువారలు కరంబుచేఁ దిరిగెడి కొఱవి శరణిని జేసితిని జేయఁగలను, జేయుచున్నాను, నీవు సుఖివి. నేను దుఃఖిని. నిది

ఇదినాది యదినీది యని యజ్ఞానంబునం బలుమాఱుబలుకుచుం బరిభ్రమించుచుందురు. సర్వరజస్తమోగుణంబులు మాయాగుణంబులు గాని యాత్మగుణంబులు గావు. ఈ గుణంబులతోడనే తంతువులతోం బటం బేర్పడినట్లు జగం బేర్పడినది. ఇందు సాత్వికు లూర్ధ్వలోకంబునకు. రాజసులు మధ్యలోకంబునకును, తామసు లధోలోకంబునకుం జనుచుందురు. అంధకారంబున రజ్జువుం గాంచి సర్పంబను బుద్ధి జనించినట్లును, దూరంబునుండి మరీచికలంజూచి జలంబను భ్రమ కలిగినట్లును. గుణత్రయ భూయిష్ఠంబగు నీజగంబు మిథ్యాస్వరూపంబైనను సత్యంబను భావంబు వొడము. వృద్ధరాజులు గతించినతోడనే కుమారరాజులు పట్టాభిషిక్తులై రాజ్యసుఖం బనుభవించినట్లును, నరకవాసులు పాపంబులు క్షయంబుగా మరలివచ్చి సుఖం బొందినట్లును, మానవులకు సుఖదుఃఖంబులు గలుగుచుం దొలంగుచుండును, మేఘంబులును, దేహగుణంబులును, నహోరాత్రంబులును మొదలగునవి నియతంబుగా నుండక మాఱుచుండును గాదె? అట్లే జగద్దేహంబులను నైతం జెడుచుండునవి. అందుం దారతమ్యం బెద్దియు లేదు. ఎక్కలువచ్చిన తరుణంబునం బక్షులకు నిజంబుతోం బ్రయోజనంబులేని ఫక్కిని, నొడ్డెక్కిన తరుణంబున నుడుపంబుతో లాభంబు లేనివిధంబునను, జ్ఞానంబు గల్గినవానికీ సంసారంబు వలన ఫలంబు గానరాదు. వెండియుం జక్కని మార్గం బన్వేషించి యవలంబించి సమదృష్టితో నెల్లెడల సంచరించెడి సంయమీంద్రునకుం దర్పణంబుతో నుపయోగం బుండునే? ఎట్లిందుం డుదకపాత్రంబుల నానారూపంబులం జెలంగుచుండునో యెట్లగ్ని యింధనంబుల నానారూపములం బ్రకాశించుచుండునో యట్లే యద్వితీయుండును, భగవంతుండును నగు నాపరమాత్మయు స్వకృతంబులగు దేహాదులయందు ఘటమఠాకాశబాహ్యాభ్యంతరంబులందును నానారూపములతో విరాజిల్లు. ఇట్లు చెలంగుచున్నను స్ఫటికం బితర వర్ణంబులతో లిప్తంబు కానిచాడ్పున బ్రహ్మంబు తద్గుణంబుల నంటకుండు. శాంతాత్ముండును, కృష్ణభక్తుండును, జ్ఞాననిష్ఠుండును, విరాగియు నగు మహాత్ముని బూర్వోక్తగుణంబులు స్పృశింపనేరవు. ఎవ్వఁడు సదానందమయుండై బాలోన్మత్తపిశాచంబుల విధంబున సంచరించునో వాఁడే జ్ఞానియని యెఱుంగుము. సూర్యోదయంబున ధ్వాంతంబు ధ్వంసంబై గృహంబున సర్వపదార్థంబు లగపడినట్లు జ్ఞానోదయంబున నజ్ఞానంబు నశించి నిరతిశయంబగు తత్త్వం బగపడుచుండును. ఏకపదార్థంబె పృథగ్ద్వారంబులగు నింద్రియంబులచే బహుగుణాశ్రయంబైనట్లు శాస్త్రానుసారంబులగు వేదాంతవాక్యంబులచే బ్రహ్మపదార్థంబు బహుప్రకారంబులుగా వర్ణింపంబడుచుండు. కొందఱు దానిని బరబ్రహ్మంబనియు, కొందఱు విష్ణులోకంబనియు, కొందఱు వ్యాప్యంబగు వైకుంఠంబనియు, కొందఱుం గైవల్యంబనియుం గొందఱు ప్రకృతిపరంబగు గోలోకంబనియు కొందఱుం వేదంబగు పరమపదంబనియు వచింతురు. జ్ఞానవైరాగ్యభక్తిభావసంభరితులగువారే తత్పదంబున కర్హు లగుదురు. శ్రీకృష్ణునికి భక్తుఁడగువాఁడా కైవల్యనాథుండును, బరాత్పరుండును బుధ

షోత్తముండును నైన యాతని పదంబుఁ జెంది పునర్జన్మంబెత్తక యానంద మనుభవిం చునని తెలిసికొనుమన నా కుసుమశరుండు పులకితగాత్రుండై యమ్మహామునికిఁ బూజించి నమస్కరించి కృతాంజలియై తదాజ్ఞఁ గైకొని సపరివారంబుగా వీడ్కొని.

తే॥ తామ్రపర్ణినిఁ గృతమాలఁ దానమాడి రాజపురమున కరుగఁ దద్రాజు సాళ్వ
నామధేయుండు నాచేతఁ గాముఁ డాది యాదవులరాక విని కని యతిరయమున

ఉ॥ వానరనాథుఁడౌ ద్వివిదుపాలికిఁ బోయి స్వకీయసంగతిన్
బూని వచింపఁగా నతఁ డమోఘముగాఁ జెలికిన్ సహాయ మ
న్యూనమొనర్పఁగాఁ దలఁచి యుగ్రతి నుర్విఁ జలింపఁ జేయు చా
మీనపతాకు మూఁకలను మేమెయిఁ దాఁకె విదేహభూమిపా! ౨౧౮

మ॥ ద్వివిదుం డట్టులఁ దాఁకి దంతములతోఁ దీక్ష్ణంబులౌ గోళ్ళతో
నవిచిత్రంబుల స్వర్ణభూషితములన్ సంస్తవ్యముద్రావితా
నవరోచ్ఛ్రాయ మహాధ్వజంబులను నా నారీతులం జించి య
శ్వవితానం బరదంబులున్ జెడునటుల్ సాగించి జృంభింపఁగాన్. ౨౧౯

ఉ॥ అంగభవుండు గన్గొని రయంబున స్యందనమెక్కి శ్రోత్రముల్
గింగురనంగఁ డంకృతులఁ గేరుచు సల్పఁగ వాఁడు స్వీయమా
తంగమునుండి మారుని రథంబుపయిం బడి దీర్ఘమైన తోఁ
కం గొని సాతపత్రతురగం బరదంబుఁ గదల్చె భూవరా! ౨౨౦

క॥ అవల ననంగుఁడు శరముల ద్వివిదుని మెడవైచి లాగెఁ బిమ్మట నాతం
డవితథరీతిని జేతోభవునిన్ మర్దించె వజ్రబహుదృఢముష్టిన్. ౨౨౦

క॥ అంతట నంతకనిభుఁడగు కంతుఁడు విలునెక్కుపెట్టి కౌశలమునఁ గ
ర్ణాంతము నంటగ లాగుచుఁ బంతముతో వానిపైనిఁ బఱపె ధరేశా! ౨౨౧

చ॥ పఱపిన నమ్మహాశరము వానరనాయకుఁ బట్టి కొంచునం
బరమునఁ ద్రిప్పి యంతమున బాధలు పెక్కులుగల్గ లంకయం
బురి శతయోజనంబులకుఁ బోయిపడన్ విసరెన్ దదంగజుం
డఱిముఱి సాళ్వయోధులగు నాసురులం దునుమాడి గంటలోన్. ౨౨౨

చ॥ జయముసు బొంది దుందుభులఁ జక్కగ మ్రోయనొనర్చి తద్బలుల్
రయమునఁ గొంచవాచిని విరాజిలు శ్రీమధురాపురంబు ని
ర్భయముగఁ గాంచి మంగళకరంబుఁ ద్రికూటము నెక్కి లంకనుం
డి యల కపీంద్రుఁడున్ గడువడిన్ దదహార్యముఁ జేరి వెంటనే. ౨౨౩

తే॥ అచట వీడ్కొని మైనాకమనెడి గిరికిఁ జేరి యటనుండి వెడలి యాసింహళమున
కరిగి యటనుండి భారతధరణిఁ జొచ్చి యచటనుండియు శీతాద్రి కరుగుదెంచి

క॥ అడుగంగ నటు కవి మఱియునఁ గడఁగెను ముని దీనికొక్కకథ దగు దానిన్
గడువినువారికిఁ బాపము లడఁగును ఫలమబ్బు వినుమ! యాసురవర్యా!

తే॥ పూర్వమందున బ్రహ్మకుఁ బుత్రులైన సనకముఖులు యదృచ్ఛగా స్వర్గమువిడి
విష్టపత్రియమును దిర్గి విష్ణులోకమునకు నేగిరి తద్విష్ణుమూర్తినిఁ గన. ౨౮౬

తే॥ అంత నంతఃపురద్వారమందునున్న జయవిజయులు దిగంబరుల్ శాబకులయి
వచ్చినట్టి యామునుల లోపలకుఁబోవ నడ్డగించిరి బెత్తంబులొడ్డి దేవ! ౨౮౭

ఉ॥ అవల నమ్మహర్షులు మహోగ్రిహ మొంది కుబుద్ధులార! యా
శ్రీవిభునిన్ విలోకనముఁ జేయఁగఁబోయెడి మమ్ము నడ్డి బ
ల్కావర మిట్లుజూపితిరి గానఁ ద్రిజన్మములన్ నిశాటులై
భావముఁజెంది యారలటుపైఁ బరిశుద్ధులు గందు మెందుగాన్. ౨౮౮

వ॥ అని శపియించినయనుక్షణంబునం దా జయవిజయు లానందసంధాయ
కంబగు తద్భవనంబునుండి యధఃపతితులై దితిగర్భంబునందు హిరణ్యాక్ష హిరణ్యా
కశిపులను నామంబులతో జన్మించి దైత్యదానవపూజితులగుచు లోకంబులం
జీకాకుపరచుచుండం బరాత్పరుండు యజ్ఞవరాహావతారం బెత్తి జలంబునుండి
యిద్ధర నుద్ధరించుచు నాహిరణ్యాక్షుని నొక్కముష్టితో నష్టపరచి తిరిగి నృసింహావ
తారం బెత్తి హిరణ్యకశిపుం జీల్చి సుఖంబులం గల్పించె. ద్వితీయజన్మంబునం
దా ద్వారపాలకులు కేశినీగర్భమందు విప్రునకు రావణకుంభకర్ణు లను నామ
ధేయంబులతోఁ బుట్టి జగత్కంటకు లగుచుండం బరమేశ్వరుండు గని కనికరించి
శ్రీరామనామంబుతోఁ గౌసల్యకుం జనించి క్రమంబుగా లంక కరిగి భండనంబున
నా గండల నిర్వురను ఖండించె. వెండియు నీ మూఁడవ జన్మంబునందు క్షత్రియ
వంశంబులందు శిశుపాలదంతవక్త్రులను నభిధేయంబులతో నుద్భవించి వర్తమా
నంబునం జెలంగుచున్నారు. అవ్వారిని వధించుటకై పరిపూర్ణతముండును నసంఖ్య
బ్రహ్మాండవిభుండును గోలోకప్రభుండును నగు నా భగవంతుండు యదుకులంబున
శ్రీకృష్ణనామంబుతో నుద్భవిల్లి లీలోల్లాసపరుండై ద్వారకాపురంబున విరాజిల్లు.
ఈ మహామహునిచే నా శిశుపాలదంతవక్త్రులు ధర్మరాజ రాజసూయాధ్వరం
బునం జరుగు సాళ్వయుద్ధంబున నిహతులు గాఁగలరు. తద్దరి కొమరుం డీమరుం
డనియు, నిపుడు కోదండనిర్గతంబై యతిజవంబున దశదిశలం బ్రకాశింపం
జేయుచుఁ దటిత్స్వనంబుతో వచ్చిన బాణం బాతనిదే యనియు భోజభూపుం
డుగ్రసేనుండనియు నాతండు రాజసూయంబుఁ జేయందలంచి దిగ్విజయార్థంబై
యీ కృష్ణకుమారునిం బుత్తెంచె ననియు గుత్తెఱుంగుమన శ్రీరామభక్తుండగు
నవ్విభీషణుం డా శ్రీరామచంద్రుండే యీ శ్రీకృష్ణచంద్రుండని తెలిసికొని పుణ్యజన
సందోహసమన్వితుండై బలులం గొని యంబరమార్గంబునం బుష్పబాణు బలం

బాలోకించుచు నతనిం జేరి ప్రదక్షిణంబు లాచరించి సాష్టాంగదండప్రణామంబులం
గావించి తదభిముఖుండై కేలుమోడ్చుచు నిట్లు వినుతించె. ౨౯౮

మ॥ అరవిందాయతలోచనాయ మహతే యోగప్రభూతాయ తే
ధరణీభారనివారణాయ భవతే ధర్మావతారాయ శ్రీ
హరిపుత్రాయ మహాత్మనే భగవతే నానాస్త్రప్రహారక్షమా
ద్ధరదీనావనహితాయ దేవనుతయే ముక్తిప్రహర్త్రే నమః. ౨౯౯

తే॥ మత్స్య! కచ్ఛప! వారాహ! నరహరిసింహ!
వామనా! రామ! శ్రీరామ! రామ! బుద్ధ!
కల్కి! శ్రీవాసుదేవ! సంకర్షణా! ర
తీశ! జగతీశ! నన్ను రక్షింపుమంచు. ౩౦౦

తే॥ షోడశోపచారముల శాస్త్రోక్తరీతిఁ బూజఁ జేయ సంతుష్టుఁడై పుష్కరేక్షణుండు
జ్ఞానభక్తివైరాగ్యముల్ గరుణతోడ నొసఁగి మఱి సమాదరించి సముచితశక్తి.

ఆ॥ బ్రహ్మదత్తపద్మరాగశిరోమణి చంద్రదత్తకాంత చంద్రకాంత
భవ్యపత్త్రములను బౌలస్త్యదత్తమౌ రత్నమాల నిచ్చె రక్తితోడ. ౩౦౩

తే॥ అంతటఁ విభీషణుండు మహాముదమున
శంబరారికి బలులను జక్క నిచ్చి
మ్రొక్కి స్వీయమౌ లంకయను పురవరమున
కరిగె ధరణీశ! జహ్నులాశ్వ! యవల వినుము!

తే॥ రతివిభుఁడు ఋషభాద్రి శ్రీరంగపురముఁ గాంచి కన్గొని ప్రాగ్దిశఁ గల సరస్వ
తీనదిం జూచి కావేరిఁ దివిరి దాఁటి సహ్యగిరిదేశమున కేగుసమయమందు.

ఉ॥ పిల్లలు సేరి చప్పటల వేయుచుఁ బాడుచు వెక్కిరించుచున్
బెల్లుగ నల్లరుల్ సలిపి ఱీకినఁ దాఁకినఁ గూడ నుల్లమం
దుల్లసమూని స్వాంతికము నొందు దిగంబరు ముక్తకేశుఁ బు
ష్ఫుల్లసదంగు భిక్షుఁగని యుద్ధవు నిట్టులఁ బృచ్ఛ జేసెడిన్. ౩౦౬

క॥ సత్తమ! బాలపిశాచోన్మత్తులవలెఁ దిర్గుచు నవమానించిన నో
రెత్తక వచ్చెడి నీ సమచిత్తుం డెవ్వండొ నాకుఁ జెప్పుమనంగన్. ౩౦౭

శా॥ చిత్తోద్భూతున కుద్ధవుం డిటుల వాచింపం గడంగెన్ దపో
విత్తుం డచ్యుతసత్కళాకలితుఁడున్ వేదాంతవిద్వర్యుఁడున్
సత్త్వాఖ్యాతుఁడు గామకోపమదమాత్సర్యాదిహీనుండు నౌ
దత్తాత్రేయమునీశ్వరుం డతఁడు కందర్పా! యటు ల్గాంచుమా! ౩౦౮

క॥ ఇతని ప్రసాదంబున భూపతులు సహస్రార్జునాది పరములు యదుసం
తతులును సిద్ధులఁ బొందిరి రతిపతి! యన నాలకించి ప్రద్యుమ్నుండున్. అంత

క॥ తనశిబిరంబున కేతెంచిన దత్తాత్రేయమునికిఁ జేసి సపర్యల్
ఘనసింహాసన మిడి యిట్లనియె వినయపూర్వకముగ నంజలితోడన్. ౩౦౦

తే॥ పరమహంస! దత్తాత్రేయ! బ్రహ్మభువన
గతులఁ దత్త్వమార్గమున నవితథభక్తిఁ
జెప్పి నా సంశయముల నశింపఁజేయు
మనఁగఁ దన్మునివర్యుండు ననియె నిట్లు. ౩౦౧

వ॥ వస్త్వభావంబునం దుల్యాప్రయోజనంబును, దదభావంబునం దత్ప్ర
యోజనాభావంబును జెలంగిన క్లెంతవఱకుఁ దత్త్వం బజ్ఞాతంబై యుండునో తావ
త్పర్యంతం బీజగంబు సత్యంబుగాఁదోఁచి ప్రయోజనకరంబుగానుండు. ఎత్తఱిఁ దత్త
త్త్వంబు తెలియంబడునో యత్తఱి నద్దానితో ఫలంబు గానరాదు. శరీరంబునకుంగాని
లాఁతిదానికిఁగాని ముకురంబునం బ్రతిబింబంబు గన్పడక ముఖంబునకు మాత్ర
మగుపడినట్లు ప్రధానార్థంబునందు జీవుం డా పరాత్పరుండని తెలియంబడక
జ్ఞానంబుమాత్రము తెలియంబడునని వక్కాణింప నప్పక్కిడాల్వేల్పుపట్టి యమ్మునికి
నమస్కారమ్ములం గావించి వీడ్కొని ద్రవిడదేశంబునం జెన్నారు వైకుంఠాచలం
బున కరిగి సత్యవ్రతుండును రాజర్షివర్యుండును ధర్మజ్ఞుండును సత్యవాఙ్మానాంకి
తుండు నగు తద్ద్రవిడవిభునిచేఁ బూజాదులం గైకొని, ౩౦౨

ఉ॥ శ్రీలకుఁ దల్లియిల్లగుచు శృంగములం బొలుపాఱుచుండు శ్రీ
శైలముఁ గాంచి యందుఁ దగు శంకరుఁ గన్గొని కాంచి భ్రామరి
న్బాలు షడాననుం గని వినాయకునిం దిలకించి వీచికా
జాలయుతంబు పంప యను సత్సరసిన్ గనులారఁ జూచియున్. ౩౦౩

క॥ గోదావరి భీమరథీ ప్రాదిని హాతీర్థముఁగని యానందదమున్
మేదురము మహేంద్రాద్రికి నాదటఁ జని పరశురాము నాలోకించెన్. ౩౦౪

— ప్రద్యుమ్నుఁడు పరశురాముని దర్శించుట. —

చ॥ కని యతఁ డమ్మహామునికిఁ గాశ్యపి నౌఁదల దాఁక మ్రొక్కి యో
యనఘ! మహానుభావ! నిగమార్థవిదగ్రణి! క్షత్రియాంతకా!
మునికులసింధుపూర్ణశశి! భూసుర కేసరి! జామదగ్న్య! నా
వినతివితాన మందికొని ప్రీతినిఁ బ్రోవుము భక్తవత్సలా! ౩౦౫

తే॥ నావు డామునివర్యుఁ డానందమొంది
దిగ్విజయమున గూర్చెడి దీవెనలను
సలిపి తచ్చతురంగముల్ సంతసంబు
గాంచునటు గౌరవించి యోగమహిమమున. ౩౦౬

సీ॥ అన్నంబు, సూపంబు నవలేహ, లేహ్యము, లమృతఖండలు లెచ్చు నప్పడములు
బూరి పాయసాన్నంబు, బూరెలు గారెలు, బొబ్బట్లు మోదకములు
గర్జూరనాడులు గాయలు గూరలు, నట్లు బొంగరములు నామవడలు
బజ్జీలు, మణుఁగుఁబూ, లున్గజ్జముల్ చేగోళ్ళు, శతపత్రముల్, బూర్ణచంద్రకలలు,
గోధూమపరిఖలు, గోక్షీర, మండక, దధి, ఘృతనవనీతతక్రములును,
లసికలు రుదికలుల్ లడ్డులుబెడదలు, బటకముల్, గూపికల్ బర్పటములు
జక్రాభముల్ బాలచక్షుఖేరిణే, మధు, శిరికలును వరశిఖరిణులును
నాజ్యపూరంబులు ననిలపూరంబులు, జక్కిలంబులు, దివ్యశక్తికలును.

తే॥ హరిమద్రసమిశ్రితాహార ముద్భవిల్లఁజేసి వారల కిడి ప్రీతిఁగూర్ప
మరుఁడు విస్మయానందముల్ బరగ స్వబలకలితుఁడై యామునికిమ్రొక్కి పలికెనిట్లు.

తే॥ దేవ! త్వద్దత్తభోజనం బెవిధమగు లోటులేకుండ తృప్తి గలుగనొనర్చె
శ్రీరమేశ్వరభక్తులఁ శ్రేష్ఠుఁ డెవఁడో యెవ్వఁ డాహరి కిష్టుఁ డో యెఱుఁగఁజెపుమ

ఆ॥ అనఁగఁ బరశురాముఁ డంగజ! నీకంటె నెవరి కేదియైన నేమి తెలియు?
నిపుడు నీవు నన్ను బృచ్ఛించుటల్ లోకసంగ్రహార్థమనినఁ జనెడినైన.

సీ॥ ఎవ్వఁడీ భువనంబుఁ దృణముగా భావించి యఖిలభోగంబుల నవలఁద్రోయు
నెవ్వఁడు శ్రీహరి యితిహాసముల నెల్ల వినుటకు ననుటకు వేగిరపడు
నెవ్వఁడు శ్రీరాధికేశ్వరరూపాబ్ధి మగ్నచిత్తుండయి మహినిఁదిరుగు
నెవ్వఁడు శ్రీగోకులేశానపదపద్మముల నలిలీలను వెలుఁగుచుండు

తే॥ నెవఁడు శాంతుఁడో దాంతుఁడో యెవఁడు సకలభూతవత్సలుఁడో యెవ్వఁడాతితిక్షు
వాదయామానుఁడాగుణి యానుహృత్తు కృష్ణునకు ముఖ్యభక్తుఁడో కృష్ణపుత్ర!

క॥ అలభక్తుఁడు నిజపదరజముల భువనంబులను శుద్ధముగ సల్పి శుభం
బులఁగూర్చునటంచెఱుఁగుము! కలుములజవరాలిచూలి! కామా! భూమా!

ఉ॥ కోరక పారమేష్ఠ్యమును గోరక నిర్జరనాథధిష్ణ్యముల్
గోరక భూతలప్రభుతఁ గోరక యోగిమునీంద్రసిద్ధులల్
గోరక తిర్గి పుట్టుటయుఁ గోరుచు నాహరిపాదధూళి నే
సూరిసెలంగునో యతఁడె శుద్ధుఁడు శ్రీహరిభక్తుఁడో ప్రభూ! ౩౧౦

ఆ॥ ఎంతమంచికార్యమేని తృణంబునఁ దనువు ధనము మనము ధారవోసి
చేసి తత్ఫలంబుఁ జిత్తమునంగూడఁ దలఁప రట్టి భక్తు లలఘుచరిత! ౩౧౩

ఉ॥ వారె తదంబుజాక్షునకుఁ బ్రాణసముల్ ప్రియు లస్యభూపతుల్
గారు సురర్షివర్యులును గారు బలుండును గాఁడు యోగులున్
గారు పురందరాదులును గా రల శంకరపద్మయోనులున్
గారు రమాదిజాయలును గారని వీవెఱుగంగనౌ విభూ! ౩౧౪

ఆ॥ భక్తవత్సలుండు వారిజాక్షుం డల భక్తవరుల వెంటఁబడి తిరుగుచుఁ
బూతులుగ నొసర్చి ముక్తినొసంగును గాని భక్తి నిడఁడు సూనబాణ!

## మన్మథుఁ డంగవంగాది దేశంబుల కరుగుట.

క॥ అన విని మదనుండును నతిఁ బొనరిచి యమ్మునికిఁ దూర్పుమొగమున గంగా
వననిధిసంగమమున కరిగెను శ్రీబహులాశ్వ! విశ్వగీతసుకీర్తీ! ౩౧౬

ఉ॥ ధీరుఁడు మారుఁ డా రహిని దిగ్విజయోరుమిషన్ వసుంధరా
భారనివారణార్థమయి పర్యటనం బొనరింవనెంచి త
త్తీరమునుండి యంగవిభుదేశముఁజేరి తదీయసత్కృతుల్
భూరిగఁ బొంది కప్పములమొత్తముఁ గైకొని సత్వరంబుగన్. ౩౧౭

తే॥ ఆ ప్రదేశంబువిడి యుడ్డియనెడి దేశ
మునకు ముఖ్యపట్టణమును ఘనమునైన
డామరాహ్వయపురికేగి ఢంకఁ గొట్టి
బలుల నిమ్మన నా బృహద్బాహువందు. ౩౧౮

చ॥ దొరయగుటన్ మదాంధుఁడయి దూరపుయోజనలేక యిట్టి పో
కిరికిఁ గరంబు లిచ్చెదనె? కీర్తికరంబొకొ? యియ్యనంచు ధి
క్కరణమొనర్చ మున్మరుఁడు గన్గొని జాంబవతీకుమారు పెం
చ్చురికను జేయ నా బలుఁడు సాంబుఁ డవక్రపరాక్రమంబునన్. ౩౧౯

చ॥ ఇననిభమైన స్యందనము నెక్కి శిఖుల్గొని యద్వితీయుఁడై
ఘనము తుషారజాలముల గ్రావవరంబును గప్పుచొప్పునన్
జని యల డామరాహ్వయవిశాలపురంబును విండ్లతోడఁ గ
ప్పెను బిదపన్ దదీశ్వరుఁడు భీతిలి చేతులమోడ్చి యాదలన్. ౩౨౦

తే॥ బలుల నా మరునకు నిడి ప్రస్తుతించె నప్పు డక్షౌహిణీయుతుఁడైన వంగ
దేశనాథుండు బలశాలి తివిరి భావభవునితోఁ బోరనెదుటకు వచ్చెనవల.

మ॥ హరిపుత్రుండగు చంద్రభానుఁ డతిరంహస్ఫూర్తితోఁ బోయి యా
మరుఁడుఁ జూచుచునుండ వానిబలముల్ క్రందించె దుర్భాషలన్
వరమైత్రిఁ జెడగొట్టినట్లు నపు డా పాదాతహస్తిధ్వజా
శ్వరథిస్యందనముల్ నశించె గుముడుల్ బాడౌనటుల్ పార్థివా! ౩౨౨

తే॥ పడినకరులశిరంబుల వఱలు మౌక్తికములఁ గదనరంగంబొప్పె గగనతలము
చుక్కలఁ వెల్గినట్టుల; శూరవర్యు లరుసమొందంగ భీరువు లదలనెదల. ౩౨౩

చ॥ అట నొక రక్తశైవలిని యయ్యెను భూతపిశాచభైరవో
త్కటమదవిప్రరాక్షసులు గన్గొని నెత్తురుఁ ద్రాగి పుత్రైలన్
దటుకునఁ బొంది పేరులుగఁ దప్పక కూర్చి ధరించి దంతముల్
బటపటగీటుచున్ నగుచుఁ బాడుచు నాడుచుఁ గూడిరంతటన్. ౩౨౪

తే॥ తద్విభుఁడు వీరధన్వుఁడు తన చదలము భగ్నమౌటను గనుఁగొని వజ్రకల్ప
గదను దచ్చంద్రభానునిఁ గదిసికొట్టెఁ గాని యతఁడు చలింపక కనలి మరల.

ఆ॥ గదను వీరధన్వు హృదయంబునం గొట్ట నతఁడు జెట్టువోలె నవనిమీఁద
శోణితంబుఁ గ్రక్కుచున్ వడి మూర్ఛతోఁ గూలి తిరుగలేచి కొంతవడికి.

క॥ తెలివిని బలులను లలిఁగొని కలుములచెలిబిడ్డకిచ్చి కావించి జోహా
రులఁ దన నగరికి నరిగె నవల నా ప్రద్యుమ్నుఁ డాత్మబలకలితుండై. ౩౨౭

ఆ॥ అచటనుండి వెడలి యమలజలాన్వితబ్రహ్మపుత్రనదము వడిగ దాఁటి
యమితబలయుతుఁడగు నాశీమపతి బింబుచేత బలులఁబొంది ప్రీతిఁజెంది.

ఆ॥ కదలి యందునుండి కామరూపముఁజేర నింద్రజాలచతురుఁ డిద్ధబలుఁడు
పుండుఁడనెడి నచటి భూపుఁడు గప్పముల్ గట్ట నొప్పుకొనక కయ్యమాడ.

చ॥ తలఁచి చమూసమేతుఁడయి తత్సమరముంగలకేగి యుద్ధతిన్
దలపడె నంత యాదవులు దాఁకిరి బాణకృపాణశూలశ
క్తులను నఘోరధోరణిని దూసిరి త్రోసిరి వీర లాస వా
రల మఱి వారు వీరిని సురప్రకరంబులు చోద్యమొందఁగాన్, ౩౩౦

వ॥ అప్పు డప్పుండుని యింద్రజాలప్రభావంబునం జేసి పిశితాశనులగుఁ బిశాచంబులు గోట్లకొలంది బయలుదేరి రణాంగంబునం దట్టిటులం జరించుచుఁ బొఱుచు నఱచుచు నంగారంబులం బలుమాఱులు రిపుసైన్యంబుల విసరుచుండిరి. వాని వెంటనె సర్పంబు లనేకంబు లుద్భవిల్లి ముఖంబు నుండి గరళంబును గ్రక్కుచు బుస్సలు గొట్టుచుఁ బగతుఱఁ గఱచుచు సంచరింపం గడంగె. వాని వెంబడి లలజ్జిహ్వలును, దంతవక్త్రలును, భయంకరులును నగు రక్కసు లొక్కుమ్మడి ఖరాకారులై నిర్గమించి మార్తుర హింసించుచుం బరిభ్రమించుచుండిరి. వారిననుసరించి

యక్షులు గొందఱు సింహవదనంబుల తోడను, గొందఱు యక్షులు మాతంగ ముఖంబులతోడను శూలంబులం దాల్చి చెలరేగి భేదించుఁడు భేదించుఁడని చీటికి మాటికి జల్పించుచుఁ దిరుగుచుండిరి. వారివరుసన గంధర్వులును బయలు దేరి పరిభ్రమించుచుండిరి. ఇత్తరుణంబుననే వియత్తలం బత్తటిశ్శ్వాంతంబులతోఁ గప్పంబడియె. సుడిగాలి వీవ నేలయు రజోవ్యాప్తంబై యంధకారబంధురంబయ్యె. ఇది యంతయు భోజవృష్ణ్యంధకమధుశూరసేనదశార్హజులగు యాదవులు విలోకించి కింకర్తవ్యతామూఢులై దిక్కులు సూచుచుండ నక్కందర్పుం డాలోకించి యాలోచించి శ్రీకృష్ణదత్తంబగు కార్ష్ణికంబుఁగొని సత్త్వాత్మికయగు వైష్ణవీమాయఁ బ్రయోగించి యాయింద్రజాలంబును జెడఁగొట్టి వివిధంబులగు మహాబాణంబులతో నా పిశాచసర్పయక్షరక్షోగంధర్వాంధకారాభ్రమంబులనుమార్తాండుండు చండకిరణంబులతో ధారాధరంబులను యథాయథలు గావించునట్లు భేదించి రథవాహనాతపత్రధ్వజాది సహితంబుగా నా పుండునిసైతమంబరంబున ఘటికాద్వయం బెత్తి నిలిపి త్రిప్పి త్రిమ్మట బెట్టి త్రోయం బవనంబునం బద్మంబు పడిన కైవడి వ్రాలి కొంతతడవున కుత్థితుండై భయపడుచు శరణుఁ గోరుచు ననేకోపాయనంబులను లక్షహయంబులను నయుతగజంబుల నొసంగి నమస్కరింప నామోదించిన దర్పకుండు సబలుండై యటనుండి కదలి విపాశానామకనదిని దాఁటి కైకయదేశరాజధానియగు శోణనదపురంబున కరిగి తదధిపుండును, వసుదేవుని మఱియొక చెల్లెలగు శ్రుతకీర్తి యనుసతికిఁ బతియును, మహాత్ముండును నగు ధృతకేతువునిం గనుంగొన నతండు శ్రీకృష్ణప్రభావం బెఱింగిన వాఁడగుట నతని పుత్రుండగు నమ్మరుని సపరివారంబుగా గౌరవించి కరంబులిచ్చి కరంబులు ముకుళింప నప్పువ్విలుతుం డలరి యచట వీడ్కొని దుందుభుల మ్రోఁగించుచు. 33౧

## —♦ మన్మథుఁడు మిథిలాదేశంబున కేగుట ♦—

తే॥ మీరు పరిపాలనముఁ జేయ మీఱునదియు స్థిరసుఖదమగు మైథిలదేశమునకు
నరిగి దవ్వునఁ దన్ముఖ్య పురవిచిత్రమెఱిఁగి యుద్ధవుతోడుత నిట్టులనియె. 33౨

తే॥ కనకకుంభంబులన్ వెల్గి గగనతలముఁ జుంబనముఁజేయు మేడలన్ శోభఁజెంది
భోగవతివలె నొప్పు నీ పురమెవరిదొ మంత్రిముఖ్య! వచింపుమా! మాకనంగ.

చ॥ వినుమని యాతఁ డిట్లనియె విజ్ఞ! యిదే మిథిలాపురంబు దీ
నిని ధృతినామకుండు దమినిం బరిపాలనసేయుచుండు నీ
ఘనుఁడొ యుదారచిత్తుఁడు నఖండయశస్వి మనస్వి జ్ఞాని ధ
ర్మనిరతుఁ డుత్తమోత్తముఁడు మానదుఁడంచు నెఱుంగుమో ప్రభూ! 33౪

క॥ అతని కొక సుతుఁడుండెడి పీతాంబర భక్తవరుఁడు విజ్ఞాని ఘనుం
డాతతగుణవంతుఁడు విఖ్యాతుఁడు బహులాశ్వుఁ డనఁగఁ గమలదళాక్షా!

క॥ హరి తనభక్తున కతనికి దరిసెనము భవిష్యమందుఁ దప్పక యిడి యీ
పురి నాతని ధన్యునిగాఁ గరముగఁ జేయంగలండు కైటభజిజ్ఞా! ౩౩౬

ఉ॥ ఇప్పటి కచ్యుతుండు తన యిక్కను నీబహులాశ్వు నిట్టులే
యెప్పుడు భక్తిఁ దన్ను నుతియించెడి శ్రీశ్రుతదేవభూసురున్
దప్పక మెచ్చుచుం దలఁచి ధన్యులుగా నొనరింప సిద్ధుఁడౌ
నిప్పగిదిన్ మఱెవ్వరు రమేశున కిష్టులులేరు లేదేవరా! ౩౩౭

ఉ॥ మాని ధృతిప్రభుండును రమావిభునిన్ దృఢభక్తితోడ స్వా
ధీనునిగా నొనర్చుకొనె దేవవితానముగాని మానవుల్
గాని మఱెట్టివారలును గాని జయింపఁగఁజాల రీ పురిన్
గానఁ ద్వదిష్టమార్గమునఁ గార్యము సల్పుమ! దేవ! నావుడున్. ౩౩౮

ఉ॥ తద్ధరిపుత్రకుం డెదను దద్దయు యోజనజేసి వర్ణియై
యుద్ధవునిన్ స్వశిష్యునిగ యుక్తవిధిన్ బొనరించి భక్తుఁడౌ
తద్ధృతినిం బరీక్షను యథావిధిగా నొనరింప నెంచి బ
ల్శ్రీద్ధఁ జనంగడంగె మిధిలాపురికో బహులాశ్వభూవరా! ౩౩౯

ఉ॥ అత్తఱిఁ జర్మశస్త్రధరులై తిలకంబులఁ బుష్పమాలికల్
బెత్తములం ధరించి పురవీరులు విష్ణుసహస్రనామముల్
జిత్తములందునన్ జపము జేయుచునుండుట బ్రహ్మచారి యా
చిత్తభవుండు గన్గొని విశేషముదంబును బొంది వెండియున్॥ ౩౪౦

సీ॥ గేహగేహంబునం గృష్ణుని గానంబుఁ జేయుచునుంట వీక్షించెఁగాదె
దేహళీదేహళిన్ శ్రీహరినామముల్ జెక్కింపఁబడుట వీక్షించెగాదె
కుడ్యకుడ్యంబునం గోవిందలీలలుఁ జిత్రింపఁబడుట వీక్షించెఁగాదె
జాలజాలంబునన్ జక్రి దశావతారాంచితచిత్రి మీక్షించెఁగాదె
తే॥ వనవనంబునందుఁ దులసీవనము కనులపండువగ నుంట వీక్షించి బయలుదేరి
క్రమముగా మిధిలాఖ్య పురంబులోని కరిగి చూచెనుగాదె మహాత్మ! యిట్లు.

శా॥ గోపీచందనముద్రికాంచితులు వైకుంఠాలయాసక్తులున్
బాపధ్వంసకు లూర్ధ్వపుండ్రధరులున్ వర్ణాశ్రమాచార ధ
ర్మాపాయోన్మధనక్రియాచతురులున్ జ్ఞానదేవులా విప్రులన్
గోపాలాత్మభవుండు గాంచి తమిఁబ్రొమొక్కుల్ జేసి యానందటన్. ౩౪౨

చ॥ కుదుర గదోర్ధ్వముల్ నుదుటఁ గూర్మరుచాంబుజశంఖచక్రము
లదియ భుజంబులం ... సలంబు హారంబును ... దకంబునున్
హృదిఁదగ శీర్షమం ... నొప్పెడి గోప ... హారినిన్
... యుల భ ... ంచి ... బునన్. ౩౪౩

తే॥ ద్వాదశాఖ్యతిలకయుతభక్తవరుల మాలికాజాలసముపేత మానవులును
భాగవతపురాణాదిశ్రవణరతులను నైతిహాసికశ్రేష్ఠులం బ్రీతిఁ గాంచి. ౩౪౪

సీ॥ బ్రాహ్మ్యంబుఁ బాద్మంబు వైష్ణవశైవ మార్కండేయ లైంగముల్ గారుడమును
నాగ్నేయముల్ భవిష్యంబును బ్రహ్మవైవర్తంబు స్కాందంబు భాగవతము
బ్రహ్మాండ మాత్స్యకౌర్మవరాహ నారద వామనములు దివ్యభారతమును
శ్రుతులను స్మృతులను సూత్రముల్ బరాశరగర్గముఖసర్వ సంహితలను

తే॥ జదువువారిని వినువారి శాస్త్రవిదుల గాయనీగాయకులఁగాంచి క్రమముగ నల
భూవరద్వారమును జేరి సావధానముగ సభాస్థలంబున నొప్పు భూపుఁ గాంచె.

వ॥ అప్పుడు తత్సభాస్థలంబున వేదవ్యాసశుకాత్రివసిష్ఠబృహస్పతిగౌతమ
ప్రముఖులగు సర్వమునులును నేనును ధర్మవిచారణంబులం గావించుచుండ నాధృతి
ప్రభుండు శ్రద్ధాభక్తులతో బలదేవుని పాదుకలఁ బూజించుచు ముక్తికరంబగు
శ్రీరామకృష్ణనామంబు జపించుచుండ నకస్మాత్తుగా నేతెంచిన శిష్యసహితుండగు
నాబ్రహ్మచారిని విలోకించి నమస్కరించి యెదుర్కొని పాద్యాదులం బూజించి
ముకుళీకృతకరారవిందుండై తదగ్రభాగంబునందు నిలిచి. ౩౪౬

తే॥ స్వామి! నాజన్మమిప్పుడు సఫలమయ్యె మందిరము నిర్మలంబయ్యె మాపితరులు
తుష్టిఁజెందిరి సురలుసంతుష్టిబొంది రనఘులును సాధువులగు మీయాగమమున.

—♦ బ్రహ్మచారి వేషధారి యగు ప్రద్యుమ్నుండు బ్రసన్నుం డగుట. ♦—

తే॥ అరయ మీబోఁటి పెద్దలీ యవని సంచరించుటలు గేస్తులకు ముక్తినిడుటకుఁగద
యని నుతింపఁగ బ్రహ్మచార్యగ్రణియును సాదరమున నాజనకున కనియె నిట్లు.

ఉ॥ ధన్యుఁడవీవు నీకులము ధన్యము నీ మిధిలాపురంబునున్
ధన్యము నీ ప్రజల్ సఖులు ధన్యులు ద్వత్కృతసత్క్రియాతతుల్
ధన్యముగాదె యేపురినిఁ దద్ధరిసత్కథ లిట్టులున్న వే
మాన్యచరిత్ర! యిట్టి ప్రజ మాకనులం గనలేదు మున్ననన్. ౩౪౯

చ॥ జనకుఁడు వర్ణి కిట్లనియె సత్తమ! యీమిధిలాపురీ ప్రజా
కనకకళత్రమిత్రధనకార్యకలాపము లేవి నావి గా
వనియు సమస్తముల్ హరిమయంబని యెంచుచు సర్వకార్యముల్
బొనరిచి తత్సమర్పణ మమోఘముగా నొనరించెదర్ జుమీ. ౩౫౦

చ॥ పలుకఁగ నట్లు తద్ధృతికి వర్ణి వచించె నిటుల్ ధరేశ! యా
వలమురితాల్పు నీవయిన భక్తికిఁ దుష్టినిబొంది యైక్యమిం
గలఁడని చెప్ప విన్నధృతి, కారణవర్జితభక్తి నాకుఁ గా
వలయునుగాని యైక్యము లవంబు నవశ్యము లేదు సద్వ్రతీ! ౩౫౧

ఆ॥ అనఁగ బ్రహ్మచారి యాపతి కిట్లనె హేతువర్జితమును బ్రీతికరము
నవసులక్షణయుతము విమలమగుభక్తి నిజు నతండు నీకుఁ గృష్ణభక్త. ౩౫౨

ఉ॥ మారుఁడు దిగ్జయార్థ మనుమానము మాని స్వయంబుగా నె బై
ల్దేరెనుగాని యిప్పటికి దేవరవారగు మీ సమీపముం
జేరఁడు కారణం బెదో వచింపుమ! నాకిట సందియంబు దై
వారెడి జానివర్య! హరిభక్తవరా! యన నాతఁ డిట్లనెన్. ౩౫౩

క॥ శాంతుఁడు భగవంతుఁడు సర్వాంతర్యామియుఁ బరేశుఁ డఖిలవిదుండున్
గంతుఁడుగద యెటు లిఁక నా చెంతను లేకుండనుండుఁ జెప్పు? మనంగన్.

చ॥ వడుగిటులన్ వచించె నల పార్థివవర్యునకో మహాత్మ! మీ
నొడుగులు సూక్ష్మదృష్టిఁ గన నుత్యములౌ మఱి స్థూలదృష్టితో
నుడివిన నవ్విఁ వ్యర్థమని నూటికి నమ్ముమ! కానిచో నిటన్
వడి నల దానవాత్మజుని భాతి ననన్యుఁ జూపు మిప్పుడే. ౩౫౫

తే॥ అంత నాధృతిపతియును హర్షబాష్ప భూషితేక్షణుండై నిజబుద్ధియందు
శ్రీరమేశపదాబ్జముల్ జేర్చి యిటులఁ బ్రార్థనముఁ జేసి యిట్లనె భక్తితోడ.

ఉ॥ శ్రీ సుదతీమనోహరు విశేషముగాఁ గొనియాడియుంటి నేన్
దాసజనప్రియుండయిన తామరసాక్షుని దాస్య మెంతయున్
జేసితి నేనిఁ దత్కథల చిత్రములన్ వినియుంటి నేని నా
శ్రీసుమబాణుఁ డుద్భవము సెందునుగాత! మదగ్రమందునన్. ౩౫౭

తే॥ అటులఁ బల్కెడికాలమునందు సభ్యవరులు జూచుచునుండఁగఁ బార్థివుండు
గనుచునుండ స్వచ్ఛాత్రుఁడుగాంచఁ బంచశరుఁడు వర్ణియాకారముఁ జయ్యన విడి

శా॥ రాజీవాయతపత్రనేత్రములతో రాజీవవక్త్రంబుతో
రాజత్పీతపటంబుతో నగవుతో రమ్యాభ్రవర్ణంబుతోఁ
దేజఃపుంజముతో సుదోర్యుగముతో దివ్యత్కిరీటంబుతో
భ్రాజిల్లెన్ జగదేకమోహనుఁ డనం బ్రద్యుమ్ననామంబునన్. ౩౫౯

క॥ జనకుం డంతట గనుఁగొని యనఘు నతనిఁ జుట్టివచ్చి సాష్టాంగనతుల్
బొనరిచి బద్ధాంజలియై వినయముతో నీవిధాన వేఁడెను ఱేఁడా! ౩౬౦

క॥ ఈదినమే సుదినంబని మోదముతోఁ జెప్పఁగలను బుష్పశరుఁడా
మోదరసుతు సినుఁ గనుఫల మీ దీనునకుఁ లభించెఁ గృతినై తి ననఁ. ౩౬౧

ఉ॥ మెచ్చిన వచ్చువిల్తుఁడును మేలు! బళీ! యని యిట్లనెన్ ధృతీ!
వచ్చితి నిప్డు భక్తిగతభావపరీక్షనొనర్ప నాకును
స్నచ్చెఁ ద్వదీయభక్తియు ననంతయశోదృఢతాయురర్థసం
పచ్చయ మిత్తిఁ గొనుచుఁ బార్థివ! మత్సమరూపమొందుమా! ౩౬౨

క॥ పలుకఁగ నటు నీపిత ధృతి యలఘుతరసపర్యఁజేసి యభివాదనముల్
సలుపగ యదువరుఁడగు ప్రద్యుమ్నుఁ డట సాగి నిజశిబిరముల కరిగెన్. ౩౬౩

—♦ ప్రద్యుమ్నుఁడు మగధదేశంబునకు జని జరాసంధునితోఁ బోరి ఓడించుట. ♦—

తే॥ అంతఁ బ్రద్యుమ్నుఁ డటనుండి యాత్మసైన్య
సహితుఁడై సాఁగి మగధరాజ్యంబు గెలువఁ
బురవరమగు గిరివ్రజమునకు స్వీయ
సకలదుందుభుల్ మ్రోయఁగాఁ జనియె జనక! ౩౬౪

మ॥ చనఁగాఁ దన్మగధేశ్వరుండగు జరాసంధుండు కోపాంధుఁడై
యనె నిట్టుల్ మతిలేక యేవిధముగా నాయాదవుల్ నాస్థలం
బున కేతెంచిరొ? యెట్టి ధైర్యమున నన్ బోరం బ్రయత్నించిరో
కన "మొండుల్ బతికంబె దండులను" వాక్యంబే నిజంబయ్యెడిన్. ౩౬౫

చ॥ ఖలుఁడగు వీని తండ్రి మొనగాఁడని నే విని దాడిచేయఁగా
నులుకును జెంది తన్మధుర నొక్కట్రొటిన్ విడి పాఱిపోయి యా
జలనిధి దాఁగె వెండియొకసారి ప్రవర్షణమందుఁ గృష్ణురా
ములను దహింప వారు మిషఁబోవరె? చేరరె? ద్వారకాపురిన్. ౩౬౬

తే॥ ఇట్టి దేబెలు దిశల జయింపనేఁడు బయలుదేరుటె కాక నన్ భండనమున
గెల్చి బలులనుగై కొన నిల్చిరహహా! తులువ కవమానమానముల్ గలవె? యైన

తే॥ పిదపసప్పంబునైనను బెద్దకట్టఁ గొట్టవలెఁగాని విడరాదు దిట్టలంచుఁ
బలికెదరు గావునన్ నేను నలఁతులైన యాదవులనెల్లఁ జావఁగా మోఁది మీఁద

క॥ నులువుగ ద్వారకకేఁ జని బలకృష్ణుల నుగ్రసేనపార్థివసంయు
క్తులుగాఁ గట్టియుఁ దెచ్చెద నిలను నయాదవి నొనర్తు నిత్తతి నంచున్. ౩౬౭

క॥ కరిహరిరథిరథశస్త్రాస్త్రరుచిరము భయంకరంబు జతురతరంబౌ
నిరువదిమూఁడక్షౌహిణు లరుదుగఁ గొని భేరులు మొరయఁగ దండెత్తెన్.

క॥ అత్తటి యాదవు లదిగని తత్తటిలుటఁ జూచి మరుఁగు దక్షిణ యను స
ర్వోత్తమశంఖంబొత్తెను గత్తర లేదంచు నభయకౌతుక మిగుచుఁన్. ౩౭౧

క॥ అంతట జాంబవతీసుతుఁ డంతకసిభుఁ డగుచుఁ గంతుఁ డాలోకింపన్
బంతమున దశాక్షోహిణు లంతికమున నుండఁజొరె నామాగధుతోన్. ౩౭౨

క॥ హరితో హరియును గరితోఁ గరినిన్ రథితోడ రథియు గండఁడుగండుం
బోరిఁబోరి మాగధయాదవు లరరే! యని చూడ దొమ్ములాడిరి మఱియున్.

వ॥ యాదవబలంబున నశ్వారూఢులై కొందఱును, గజారూఢులై కొంద ఱును జెలరేగి భల్లంబులతో నరాతిపర్గంబును మర్దింపం గడంగిరి. కొందఱు తటి ద్వర్ణసంకాశంబులగు శక్తులంగొని విసర నవి రిపుబలము రూపుమాపి ధారణిం జేరె. కొందఱు వీరు లార్చుచు నిల్చి పెల్చన నమిత్రరథాంగంబులం బట్టి నేలం గొట్టిరి. కొందఱు భిందిపాలంబులతోడను, గొందఱు ముద్గరంబులతోడను, గొం దఱు కుంతంబులతోడను, గొందఱు కుఠారంబులతోడను, గొందఱు పరిఘంబుల తోడను, గొందఱు పట్టిసంబులతోడను, గొందఱు తోమరంబులతోడను, గొం దఱు గదలతోడను, గొందఱు నిస్త్రింశంబులతోడను, గొందఱు బాణంబుల తోడను, దన్మాగధసైన్యంబుల నుఱుమాడ గుఱ్ఱంబులపై గుఱ్ఱంబులును, మత్తే భంబునపై మత్తేభంబులును, వీరులపై వీరులును, గాళ్ళు దెగియు గరంబులుబోయి యు, శిరంబులు నఱకబడియు, నుదరంబులు బగిలియు, నాసికంబులు గోయంబడి యు, గర్ణంబులు ఛేదింపంబడియు, గవచంబులు జించంబడియు, రక్తంబులు ప్ర వాహంబులుగా ఖడ్గంబులు చ్యుతంబులుగా భూషణంబులు జెల్లాచెదరుగాఁ బుడమిం బడి విస్మయకరంబై భయంకరంబయ్యె. అంత విద్యాధరగంధర్వాంగన లా రణ రంగంబున కేతెంచి సదృశులగు వీరుల వరించి కొంపోవం దొడంగిరి. క్షత్రధర్మ పరులై చలింపక వెనుక కడుగిడక నీతిని విడువక పోరినవీరులు మార్తాండమండలంబు భేదించుకొని పరమపదంబొందిరి. ఇట్లు సాంబుండు మొదలగు యాదవవీరులచేఁ దద్బలంబు హతంబగుట వీక్షించిన హతశేషులు శ్రీకృష్ణభక్తిం గని యమంగళంబులు పఱుగిడినట్లు కాల్కొలందిని బాఱిరి. అట్లు నిజసైన్యంబు పలాయమానం బగుట జరాసంధుండు గాంచి ధనుష్టంకారంబులం గావించి సంబోధించి. ౩౭౪

చ॥ నిలునిలుఁ డీరలంద ఱిట నిల్వకపోయిన లాభమున్న దే?
సులువుగ నిట్లు పాఱుటలు శూరుల ధర్మమె? చెప్పుఁడే నిటన్
మెలఁగిరిఁగాదె యేది యిఁక మీకు నసాధ్యము లేదు గావున
న్దలఁగకుఁడంచు నంకుశమునన్ గరి రేపినయట్లు రేఁపుచున్. ౩౭౫

చ॥ బలగముతోడఁ గూడుకొని వైరులపై దుముకంగ సాంబుఁడున్
గలయఁగవచ్చి తన్మగధకాంతునిపై నిజచాపనిర్గతం
బులగు దశాశుగంబులను బూర్తిగవైచి దశాంబకంబులన్
జలధితరంగభీమరవసంయుతకార్ముకమౌర్విఁ ద్రుంపఁగన్. ౩౨౬

తే॥ తజ్జరాసంధుఁ డింకొక ధనువుఁ దాల్చి దశశరంబులఁ దత్సాంబు ధనువుఁ ద్రుంచి
యొక్కటన్ సాది రెంటను సెక్కియంబు రథముమూటనాల్గింటగుఱ్ఱములఁ గూల్చ

క॥ విరథుఁడు భిన్నశరుఁడు హతతురగుఁడు హతసాది యగుచుఁ దోర సాంబుం డ
న్యరథం బెక్కుచు జాపముఁ గరమునఁగొని టంకరించి గాసిల వైరుల్. ౩౨౮

మ॥ శతబాణంబుల వాని తేరు నుసిగా సల్పన్ జరాసంధుఁడున్
ద్రుతరీతిం గజమెక్కి యింద్రునివలెన్ దోఁతెంచి కాలాభుఁడై
యతితీక్ష్ణాంకుశహేతితోఁ బొడిచి సాంబాంతార్థమై త్రోల శీ
తకృతులన్ బర్వుచు నడ్డులేక యల మత్తేభేంద్ర మేతెంచియున్. ౩౨౯

క॥ సరథుని సాంబుని యాదవవరుఁగొని నవయోజనముల వైవఁగ నత్యు
ద్ధురకోలాహలముల్ జరిగెను దత్సాంబపృథులసైన్యములందున్. ౩౩౦

క॥ పదపడి మదనునిదరిగల గదుఁ డుదయాచలమునుండి గాఢాంధంబున్
జెదరంగొట్టుచు నేతెంచు దినమణివిధాన వచ్చి చుఱచుఱఁ గనుచున్. ౩౩౧

తే॥ వజ్రి పవి దరిభృద్గిరిన్ బాఁదినట్లు లొక్కముష్టిని గొట్టఁగా నక్కరీంద్ర
మాకులంబొంది ధరఁబడి యంతమొందె నది మహాద్భుతంబయ్యె నయ్యాహవమున

క॥ అట్టి జరాసంధుండున్ జట్టన ధరనుండి లేచి శౌర్యోద్ధురుఁడై
బెట్టిదపుంగద నాగదుఁ గొట్టియు గర్జింప నతఁడు గొంకక కింకన్. ౩౩౩

తే॥ గదను లక్షభారాంచితన్ గరమునఁగొని తజ్జరాసంధుఁ బ్రహరించి దశదిశలును
బెదర సింహనాదంబు గావించె దాన నాబృహద్రథపుత్రుండు వ్యథితుఁడగుచు

చ॥ సగదు గదున్ గరంబున వెసన్ గొనుచున్ శతయోజనంబులన్
గగనమునం బడన్ విసరఁగా నతఁ డుద్ధతిఁ దజ్జరాత్మజా
తుఁగొనుచు వెయ్యియామడలఁ ద్రోయ బృహద్రథపుత్రుఁ డాతఁ డా
గగనమునుండి వింధ్యమను గ్రావముపై బడి తిర్గి లేచియున్. ౩౩౫

క॥ హాహారా హాహారిగ గదుతోఁ బోరఁగఁజని సాంబుఁ డతనిఁ బూనుచుఁ జేతన్
ధారణిఁ ద్రిప్పియుఁ గొట్టెను ధీరత హరి హరినిఁ గొట్టుతీరున ధీరా! ౩౩౬

తే॥ అవలఁ దజ్జరాసంధుఁడు దవిలి కసిని నొక్కముష్టితో గదుని మఱొక్కముష్టి
సాంబునిం గొట్ట వారలు క్ష్మాతలమున మూర్ఛఁబడి రది గనొని పుష్పశరుఁడు.

ఆ॥ అగ్రహంబుతోడ నక్షౌహిణీయుక్తుఁ డగుచుఁ బెద్దటెక్కియమున వెలుఁగు
నరదమెక్కి యభయమాత్మీయులకుఁ జెల్పి వానితోడఁ బోరఁ బూనుకొనఁగ.

చ॥ మగధధరేశుఁడో "మదన! మా సరివారని మీరు వత్తురే?
పొగ రడఁగించెదన్ గనుఁడు! పోకిరి"! యం చొక లక్షమద్దులన్
దగు గదగొం చరణ్యమున దావముసొచ్చినయట్లు వారిలో
నఁ గలిసి పత్తి యోధ రథ నాగహయంబులఁ జెండె వెండియున్.　　౩౮౯

తే॥ ఆ జరాసంధసైన్యంబు లరుగుదెంచి యదుబలంబు హతంబుగా నాచరింప
నిర్భయమునఁ బ్రద్యుమ్నుండు దుర్భరముగ ధనువుఁ డంకృతుల్ సలిపి యథాక్రమముగ

చ॥ శరముల వైరివర్గములఁ జంపెడికాలమునందు ద్వారకా
పురతిలకంబునుండి తమ ముక్కుల ప్రేళ్ళిడి యెల్లవార ల
చ్చెరువునఁ జూడ నా మరుని ముంగలఁ దద్బలరాముఁ డొప్పి చి
చ్చఱపిడుగట్లు మండిపడి సాహసమూర్తియనంగ నుద్ధతిన్.　　౩౯౧

ఉ॥ మాగధనాథసైన్యము సమాంతముగా స్వహలాయుధంబునన్
లాఁగి యయోగ్రహేతిఁగొని లాఁతుగ మర్దనముం బొనర్ప నా
మాగధయోధరథ్యరథమత్తకరుల్ శతయోజనంబులం
దోఁగును జెంది కూలిపడ నొప్పె నరామరదుందుభిధ్వనుల్.　　౩౯౨

తే॥ అమలమతి సహదేవుఁడశ్వార్బుదమును రెండులక్షలుగజములు దండివైన
రథము లఱువదివేలను రతిపతికిడి యొరిగలన్ జేసి నిజపురికరిగె జనక!　౩౯౩

వ॥ అవ్వల నవ్వలతేఁడు బలగంబులతోడఁ గూడుకొని గయాపురంబున కేగి ఫల్గునదిలో స్నానం బొనరించి తత్పరిసరంబులందుండు దేశంబులం గెలువం బ్రస్థానంబుగాఁ దత్రత్యులును రాజులంద ఱాజరాసంధపరాజయం బాలించి భీతిలి బలులం గైకొని యాతని కిడి శరణుం బొందిరి. ససైనికుండగు మదనుం డటనుండి వీడ్కొని గౌతమీసరయూపుణ్యతరంగిణీతటంబుల నాలోకించి భాగీరథీ తీరమందలి కాశీపట్టణంబున కరుగఁ దద్భూపుండగు పార్ష్ణిగ్రాహుండు మృగయార్థంబై చనియుఁ జారులచే విని చనుదెంచి కరదంబు లామరునకర్పింప నతం డటనుండి సాఁగి కోసలదేశ విభాసురాయోధ్యాపురి కనతిదూరంబుననుండు నందిగ్రామంబున నివసించి తత్పాల కుండగు నగ్నిజిత్తుచే హరికరిరథధనాదులను బూజాపురస్సరంబుగా నందికొని యుత్త రేశుండగు దీపతముని చేతను, నయపాల పాలకుండగు గజుని చేతను, విశాలేశుండగు బర్హిణుని చేతను, హరిభక్తుండగు నైమిషాధిపుని చేతను గప్పంబులం గైకొని తీర్థ రాజంబగు ప్రయాగక్షేత్రంబునకుం జని తత్ప్రభావం బెఱింగి త్రివేణిలో జలకం

బాడి యిరువదివేల కరులను, దశలక్షతురంగంబులను, జతుర్లక్షశతాంగంబులను, దశార్బుదధేనువులను, స్వర్ణహారంబును, జాంబూనదాంబరంబులను దశభారసువర్ణంబును, లక్షముక్తాఫలంబులను, లక్షనవరత్నములను, దశలక్షవస్త్రంబులను ద్విలక్షకాశ్మీరకంబళంబులను, ద్విలక్షనవరత్నములను, వేదవేదాంగాది పారంగతులగు భూసురుల కభివాదనపూర్వకంబుగా నిడి యుండఁ గరూషదేశశాసకుండగు పౌండ్రుం డనువాఁడు శ్రీకృష్ణశత్రుండైనను దప్పనిపనిగా నెంచి కప్పంబులం గొని తెచ్చి యప్పచ్చవిల్తున కిచ్చి నమస్కరింప నతం డందునుండి లేచి పాంచాలకన్యాకుబ్జాదిదేశంబులం జేరఁ దదధిపతులగు వారలందరు భయార్తులై కుందుచుండిరి. అందుం గొందఱు దుర్గంబులను దేశంబులను విడనాడి పాఱిపోయిరి. మఱికొందఱా కృష్ణనందనుని శరణుం గోరిరి. బిందుదేశాధీశుండగు దీర్ఘబాహువు మాత్రమాతనితో సంధిఁజేసికొనందలంచి యతనికడకుం జని కృతాంజలియై. ౩౯౪

ఉ॥ వీరలు యాదవేశ్వరులు మేదురకీర్తులు నార్తరక్షకుల్
వీరులు దిగ్విజేతలును విజ్ఞులు శాంతులు దాంతు లుద్ధురో
దారులు నాదుభాగ్యమునఁ దద్దయుఁ జేరితి రిందుఁగాన నా
కోరికఁ దీర్ప వేఁడెదను గొంకక నాతమి నాలకింపుఁడీ ! ౩౯౫

తే॥ సజలకాచపాత్రంబునఁ శరము వేయ బిందువొకటియు నటనుండి చిందఁగూడ
దాశరం బందు నుండనౌ నద్దిపగులవలదు దానిలోఁ గరలాఘవ మమరవలె.

తే॥ ఇట్లొనర్చిన వానికే యేను నాదు త్రిపురసుందరులైన పుత్రికలనిడెద
నారదుఁడు ధనుర్విద్యావిశారదులని వినుతి మిమ్ముల్లఁజేయగ వింటి మునుపు.

ఆ॥ అనఁగ మదనుఁడొప్పి యంద ఱాలోకింప దీర్ఘవంశ మొండు దెచ్చి నిలిపి
లోనఁ ద్రాడుఁజుట్టి దానిపై సోదకకాచకుంభమంటఁ గట్టె త్రాట. ౩౯౮

చ॥ ధనువుగ్రహించి టంకృతి యథావిధిఁ జేసి శరంబు నొక్కటిం
గొని కరలాఘవంబున నకుంఠితరీతిని వేయ నద్ది వే
చనుచు శిరంబు భిన్నముగ సల్పియుఁ బాత్రములోనఁ జేరి త
ద్ఘనమున ద్వాదశాత్మనిపరిశాశము వెల్గినయట్టు లొప్పఁటన్. ౩౯౯

క॥ అదరక చెదరక పగులక కదలక యొకబిందువేని కార్చని కడవన్
గదనస్థితవీరులు గని మదులందునఁ జిత్రపడిరి మానవనాథా ! ౪౦౦

క॥ మఱియొక బాణముచే నీవఱకుఁ బ్రయోగించినట్టి బాణమునఁగొని యా
మరుఁడు యథాస్థితిగా వఱలెన్ దదనంతరమునఁ బౌరుషలీలన్. ౪౦౧

క॥ జాంబవతీపుత్రుండగు సాంబుండా గాజుకుండఁ జక్కఁగఁ గని పం
చాంబకముల వేసియుఁ జిత్రంబును గల్పించె మరునిరహిఁ దరువాతన్. ౪౦౨

తే॥ తమిని యుయుధానుఁడుఁ వచ్చి ధనువుఁ దాల్చి
బాణమొక్కటి వేయఁ దత్పాత్రము పడి
భగ్నమయ్యె నయ్యది గని పరచమువులు
యాదవులు పకాపకనవ్వి యాడిరిట్లు. ౪౦౩

మ॥ అర రే! యేమి! మహానుభావుఁడవు చాపాచార్యవర్యుండవో!
భర తాఖ్యుండవా! శంతనూద్భవుఁడవో! పార్థుండవో! ద్రౌణివో!
పురవిధ్వంసివా! కార్తవీర్యుఁడవా! యా భూపుత్రికాభర్తవో!
ధరణీభర్తవా! కాక నీవరయ నేతన్మాత్రపీరుండవే! ౪౦౪

వ॥ అంత సోదకకాచపాత్రంబు వేఱొం డనిరుద్ధుండు గొని తెచ్చి యద్దా నిపై నుంచి దానిం దిగువంగాంచి యొక్కశరంబును హస్తలాఘవంబుతో వేయ నద్ది యొకబిందు వేనియు బడనివడువునఁ దత్తలంబును భేదించుకొని. లోన మెల్లనఁ దూఱి ప్రకాశించి తత్పాత్రంబున నుపరిభాగంబున నైదుమూరలంత దూరమున నొండు పాషాణంబుండునట్లు ప్రేక్షకు లాశ్చర్యంబు బొందఁజేసి తిరిగి యతనిం జేరె. వెండియు దీప్తిమంతుండనువాఁ డేతెంచి ధనువుం బరిగ్రహించి యేకాంబకంబుం బ్రయోగింప నాబాణం బాతీరునసే యొకనీటిబొట్టేనియు రాలనీలీలఁ దత్తలంబును భేదించి తదూర్ధ్వస్థితశిలను రాల్చి లోనం బ్రవేశించి ప్రకాశించి మరలి యేతెంచె. తదుపరిఁ జంద్రభానుండు నరుగుదెంచి మిక్కిలి లాఘవంబుతో నొక్కయాశుగం బును వేసి తత్పాత్రంబు నూర్ధ్వముఖంబునుండి యధోముఖంబునకును నధోముఖం మునుండి యూర్ధ్వముఖంబునకును బలుమాఱులు మార్చిమార్చి యందునుండి యొక జలబిందువును జిందనీయక కారనీయక దానినిం బగులనీయక మెల్లన నందుఁ జొచ్చి మీఱుటం జూపఱు లాలోకించి విస్మయం బొంది బాగుబాగని కొనియాడిరి. ఏతద్విధంబుననే శ్రీకృష్ణపుత్రులగు ప్రద్యుమ్నుండు మొదలగు పదునెనుమండుగురు మహారథులును సోత్సాహంబుతోఁ దమతమ నేర్పులకొలందిఁ దత్కాచపాత్రంబుపై శరంబుల నైచుటఁగాంచి తద్దీర్ఘబాహుండు సంతోషించి మహాబలులనియు ధను ర్విద్యావిశారదులనియు నిశ్చయించుకొని శంఖభేరీమృదంగాది సకలవాద్యంబులు మ్రోఁగుచుండ సురలు విరులం గురియుచు నానావిధంబులం గొనియాడుచుండఁ దన కూఁతులఁ బదునెనుమండుగురిని నవ్వారల కిడి పరిణయం బొనరించి షష్టి సహస్రగజంబులును, హయార్బుదంబును, దశలక్షస్యందనంబులను, లక్షదాసీజనం బును జతుర్లక్షశిబికంబులను, బారితోషికంబుగా నొసంగ నా ప్రద్యుమ్నుం డామోదించి గ్రహించి. ౪౦౫

క॥ నారీమణులగు వారల ద్వారాపతి కంపి దీర్ఘబాహువుతోడఁ
భూరిగ నాలోచించియు జేరెను నిషధావనీశుచెంతకు నంతఁ. ౪౦౬

తే॥ సేనజిత్తను నాతఁడు కానికలను నట్టి ప్రద్యుమ్నునకు నిచ్చి యభినుతించె
నట్లు భద్రదేశాధిపుఁ డబ్జనాభభక్తుఁడౌ బృహత్సేనుఁడు బలులనొసఁగె. ౪౦౯

తే॥ మాఱుఁ డంతట మాథుర శూరసేన దేశముల కేగి వారిచే దివ్యపూజ
లందికొని వనయుతమధురాహ్వయపురిఁ జొచ్చివచ్చి తత్రత్యులఁ జూచి మఱియు.

తే॥ గోపికాగోపకులఁ గాంచి గోకులేశు నందరాజును నందోపనందుల వృష
భానులన్ యశోదాదేవి భక్తిమ్రొక్కి నందరాజునకుం గానుక లందనిచ్చి

క॥ త్వరగతి నుత్సాహముతో వఱలుచు నటనుండి సాఁగి భద్రాకరమా
కురుదేశంబుల కరిగెను పరివారముతోడఁగూడి బొఁదుచు ఢంకల్. ౪౧౦

## ప్రద్యుమ్నుండు కురుదేశంబులం గెల్చుట.

ఉ॥ తత్కురురాజధాని వసుధాతిలకంబు ననేకచిత్రప
జ్యోత్కరయోగ్యమున్ హయమదోత్కటసాదిభటాదియుక్తమున్
సత్కులజప్రపాలితము సత్కవినుత్యము హస్తినాపురం
బుత్కటలక్షణంబులను నొప్పు సురేంద్రపురోత్తమం బనన్. ౪౧౧

ఉ॥ అప్పురిబైటఁ బుష్పశరుఁ డామడలిర్వదినిండ స్వీయమా
గొప్పబలంబులన్ నిలిపి కొంకక యోజనపంచకంబునం
జప్పరముల్ ఘటించి వరుసన్ బదియామడలందుఁ డెక్కెముల్
జొప్పడఁజేసి తద్బలుల సుష్ఠుగఁగైకొన నెంచె నింతలోన్. ౪౧౨

క॥ అచ్చటి జనములు భయపడి క్రచ్చఱఁ దలుపులను వేసి గడెలిడి యెటకో
విచ్చలవిడిగాఁ బాఱిరి హెచ్చుగఁ గోలాహలంబు లెసఁగెను దేవా! ౪౧౩

క॥ అత్తఱి శౌర్యబలోపేతోత్తంసులు జక్రివర్తు లూర్జితవిత్తో
న్మత్తులు గౌరవు లదిగని చిత్తములన్ మిగుల శంకఁ జేయుచునుండన్. ౪౧౪

క॥ బుద్ధిమదగ్రణి సద్గుణి యుద్ధవుఁ డామీనకేతనోక్తుల విని య
త్యుద్ధురవేగముతోడుతఁ దద్ధస్తిపు రేశుకడకుఁ దరలి కడంకన్. ౪౧౫

చ॥ శకునిసుయోధనాంగపతిసైంధవలక్ష్మణయజ్ఞకేతుబా
హ్లికగురుభీష్మమద్రధరణీశ్వరసంజయసోమదత్తధౌ
మ్యకృపకృపీసుతాదివృతుఁడౌ ధృతరాష్ట్రునిఁ గాంచి మ్రొక్కియున్
ముకుళితహస్తుఁడై పలికె మోదకరంబగు నోలగంబునన్. ౪౧౬

తే॥ ఉగ్రసేనుఁడు రాజసూయోత్తమంబు సలుపఁదలచిఁ జంబూద్వీప సంస్థితులగు
భూపతుల నందఱను గెల్వఁ బుష్పశరుని బలయుతంబుగఁ బంపెనో పారివేంద్ర!

చ॥ పనుప నతండు నేగి శిశుపాల జరాసుతదంతవక్త్రసా
శ్వనరవరాదులం గెలిచివచ్చెను మీదరి కిప్డు గాన జా
గును విడి కాన్కలున్ జలులఁ గొంచల జేతకు నిచ్చి వారు మీ
రును మఱిఁజుట్టముల్ గలిసి రూఢినిఁబొందుఁడు సర్వరీతులన్. ౪౧౯

తే॥ కానిచో మీరుమేమును గలహమాడఁగలమటంచు వచింపుమంచలమరుండు
నన్నుఁ బంపెను దద్విధినన్ని చెప్పియుంటి నిది దూతపనిగద! యుర్వరేశ!

ఉ॥ కౌరవు లంతఁ గ్రుద్ధులయి కాలగతుల్ విపరీతముల్ గదా
భూరివనంబునన్ మృగవిభున్ గని దూఁకెడి భూరిమాయువున్
దీరున గొల్లలీదినము తెంపున మాపయి దూఁకుచుండిరే
యౌర! యెనర్తురంట! నృపులందఱ గెల్చియు రాజసూయమున్. ౪౨౦

ఉ॥ మాదరి నుండి ఘోషణ మమందతఁ జెందినవారుగారొకో?
మా దయరాజ్యపాలనము మన్ననలొందినవారు గారొకో?
మాదె గదా తదీయమగు మంచియుఁ జెడ్డయునెల్ల నెట్టు లా
యాదవు లంద రీదినమునందుఁ గసిన్ మము బోరవచ్చిరో! ౪౨౧

తే॥ ఏము వారికిఁ జేసినదెల్లయిపుడు పామునకుఁ బాలుపోసెడి పగిదినయ్యె
మేలు మరచిన తుంటరుల్ మేరలేనిపాపములఁ జేయఁజాలరే? పాడి వీడి.

సీ॥ ఎఱుఁగఁడే? నృపుల ముయ్యేడు మార్లాడ్చిన భార్గవున్ డీకొన్నబలుని భీష్ము
నెఱుఁగఁడే? జగముల నిద్ధచాపాచార్యుఁడను పేరు వడసిన యలఘు ద్రోణు
నెఱుఁగఁడే? గదతోడ నెదిరెడివారలఁ దలకట్టయిన సుయోధనుని ఘనుని
నెఱుఁగఁడే శూరప్రవరుఁడయి శస్త్రాస్త్రములఁ గన్న కర్ణ నమోఘదాత

తే॥ మఱియు దుశ్శాసనాదుల మహితబలుల
నెఱుఁగఁడే? యుగ్రసేనుఁడయ్యారె! యెఱింగి
యిట్లొనర్చెను? బ్రదుకంగ నిచ్చయున్న
మాపురిన్ విడిపొండని మంత్రి! చెపుమ! ౪౨౩

క॥ అని చెప్పఁగ నుద్ధవుఁడున్ విని యచ్చట కదలి మరుని వే చేరి తదు
క్తిని కరము యథోచితముగ వినిపింపఁగ మన్మథుండు భీమాభుండై. ౪౨౪

చ॥ కరమునఁబట్టి శార్ఙ్గము నఖర్వమదోన్మదులైన కౌరవే
శ్వరులు దలంప నాకుఁ బ్రియబంధువులైనను వాఁడితూపులన్
దఱిమెద యోగి నేమముల దైహికరోగము లాపినట్లు వా
రరరె! మదీయదోర్యుగబలాద్భుతసంపద గుర్తెఱుంగరే? ౪౨౫

తే॥ కాని యాదవులార! నిక్కముగ మీరు తల్లికిం దండ్రికిం బుట్టి తప్పనియెడ
గౌరవులచేతఁ గప్పముల్ గైకొనఁగలరంచు నెంచెద ముమ్మాటికనియె జనక!

## — యాదవ కౌరవ యుద్ధవర్ణనము. —

తే॥ అంత సంజాతకోపులై యాదవులును సకలశస్త్రాస్త్రములఁ దాల్చి సత్వరగతి
హస్తినాపురిఁ జొచ్చి రాయవసరమునఁ గౌరవులు రోషమూర్తులై క్షణములోన.

వ॥ రత్నకంబళవిజయధ్వజసువర్ణశృంఖలావిభాసురషష్టిసహస్రగజంబులతోడను, ప్రలయాంభోధిమహావర్తసంఘర్షరవానుకారిసుందుభిప్రయుక్తమాతంగంబులతోడను, లోహకంచుకాంచితులగు మల్లులతోడను. రణోపలబ్ధకీర్తులును, సుషీష భూషాభూషితులును, గజారూఢులు నగు ద్విలక్షవీరవరులతోడను, సింహధ్వజ విరాజమానంబులును, విమాన సమానంబులు నగు రథంబులతోడను, చిత్రవిచిత్ర వర్ణవిభూషణాంబరకవచశిరస్త్రాణాంగుళిత్రాణాదులం దాల్చి యంగవంగసింధుదేశ సంజనితంబులగు హయంబులనెక్కిన పెక్కుమోటరుతోడను, యాదవులతోఁ బోరఁ బ్రద్యుమ్నుని సముఖంబున కేతెంచిరి. ఇంద్రప్రస్థపురినుండి కౌరవసహాయార్థంబుగాఁ బాండవప్రేషితంబగు పృతనాపరిమితసైన్యం బేతెంచె. ఇట్లు కౌరవబలంబంతయుఁ బదాఱక్షౌహిణులవఱకు నటఁ జేరినదని యెఱుంగుము. అత్తఱిఁ బంచానసేంద్రపతాకాంచితంబును, శుక్లతురగవిరాజితంబును వజ్రదండమండితవ్యజనచామర చారుతరంబును, చతుర్యోజనపరిమితంబును, చంద్రమండలసంకాశంబునగు ఛత్రంబుతోఁగూడిన యరదంబును, దుర్యోధనుండెక్కి బాహ్లికసోమదత్తశకునిశల్యకర్ణవికర్ణ లక్ష్మణగురుకృపాశ్వత్థామభీష్మయజ్ఞకేతుధౌమ్యదుశ్శాసనాదివీరులనడుమ దుందుభి ధ్వనులు మ్రోయుచుండ వందిమాగధులు గౌరవగౌరవంబు గానం బొనర్చుచుండ నాప్రద్యుమ్నబలంబులతోఁ దలపడె. అత్తరుణంబున నుభయబలంబులు చెలరేగి ద్వంద్వయుద్ధం బాచరింప, ౪౨౮

చ॥ పుడమి వడంకె ధూళి దివిఁ బూర్తిగఁగప్పె నినుండు రిక్కయై
వడిఁదగె దిగ్గజాలఱచె వార్ధులు మ్రోఁగెను గ్రిమ్మఁ జీకటుల్
బడిరి భయంబు దేవతలు బన్నగనేత చలించెఁ గొంచె మె
క్కుడు మెకముల్ ధరన్ బడియెఁ గూలె హయంబులు రాలెఁ డెక్కముల్.

క॥ భటులును గడఁబట్టుచు మఱిఁ గటకటబడసాగి రపుడు కౌరవయదుసేనో
ద్భటులును గని కటకటబడి చటులాస్త్రాదుల ధరించి శమనసములునై ౪౩౦

వ॥ ధన్వివరుండగు ప్రద్యుమ్నుండు దుర్యోధనునితోడను, ననిరుద్ధుండు భీష్మునితోడను, ధీమంతుండు కృపునితోడను, భానుండు ద్రోణునితోడను, సాంబుండు బాహ్లికునితోడను, బృహద్భానుండు శల్యునితోడను, చిత్రభానుండు సోమదత్తుని

తోడను, వృకుం డశ్వత్థామతోడను, నరుణుండు ధౌమ్యునితోడను, బుష్కరుండు లక్ష్మణునితోడను, వేదబాహువు శకునితోడను, శ్రుతదేవుండు దుశ్శాసనునితోడను, సునందుండు సంజయునితోడను, గదుండు విదురునితోడను, కృతవర్మ భూరిశ్రవుని తోడను, నక్రూరుండు యజ్ఞకేతువుతోడను, సింహంబులు సింహంబులతోఁబోరాడి నట్లు బాణకృపాణకుంతపట్టిసగదాముసలముద్గరశక్తిచక్రశతఘ్నిభిండిపాలభుశుండీ కుఠారంబులతో నాయోధనం బొనర్చిరి. తత్సమయంబున శ్రీవత్సాంకవత్సుండు దుర్యోధనబలంబు మహత్తరంబుగానుండుట విలోకించి వరాహంబు గోటులఁ బ్రల యార్ణవంబు క్షోభింపం జేసినట్లు బాణసంఘాతంబునం ఘాతపఱిచె. తద్గతులఁగరికుం భంబులనుండి ముత్యంములు రాలి రాత్రియందుఁ దారాగణం బంబరంబునఁ బ్రకా శమానంబై ట్లాకదనరంగంబున విరాజమానంబయ్యె. రథంబులు జూర్ణంబులయ్యె. రథులు మొదలగువారు బుడమిం బడిరి. ఇట్లగుట దుర్యోధనుం డాలోకించి యమ ర్షోత్కర్షమనంబున. ౪౩౧

ఆ॥ విల్లుఁడంకరించి వేమాఱుఁ బ్రద్యుమ్నుఁ బదిశరములఁ గొట్టెఁ బిదప నతఁడు
వానిఁద్రుంపఁ గౌరవప్రభు వతని కవచమును దశశిఖుల వైచి చించి ౪౩౨

తే॥ శరసహస్రము వేసి యశ్వముల వేయి నఱికెఁ బాణశతంబున విఱిచెఁజాప
మవల మదనుఁ డుద్దవిడి వేఱరదమెక్కి కృష్ణదత్తకోదండముఁ గేలఁ దాల్చి

శా॥ ఆకర్ణంబును లాఁగి టంకృతుల బహ్వావృత్తులన్ సల్పి ది
వ్యైకాజిహ్మగ మేయ నద్ది ధృతరాష్ట్రోత్భవస్యందనం
బాకాశంబునఁద్రిప్పి రెండుగడియల్ హాహా! యనన్ గుఱ్ఱ బల్
జోకన్ గిండిగిరాటువేసినటు లీ క్షోణిన్ బడంద్రోసినన్. ౪౩౪

తే॥ ఆయరదము తుత్తునియలై పోయెఁదురగములును సూతులుబంచతఁ బొంది రవలఁ
గౌరవేశుఁడు మఱియొక తేరునెక్కి పదిశరంబులఁ బ్రద్యుమ్నుఁబొడె మిగుల

తే॥ దానమాలాహతంబగు దంతిఁబోలెఁ దనరుమదనుని హారిదత్తధనువునుండి
యంబకం బొండు సనుదెంచి యలసుయోధను రథమునుగొని నింగికి నరుగులోన

క॥ రెండవబాణము చని యుద్దండముగన్ బట్టి యా రథంబును మింటన్
మెండుగ దిరుగఁగ మూఁడవ చండతరాశుగవరంబుఁ జని యద్దానిన్. ౪౩౬

చ॥ గొని పెనుగాలి తామరసకోశము వ్రాల్చినమాడ్కి నాసుయో
ధనసదనంబునం జెలఁగు తద్ధృతరాష్ట్రసమీపమందునన్
దనరఁగఁగూల్చి తిర్గి యలదర్పకు మ్రోలకువచ్చె నట్టి పా
తనమునఁ దేరు గోల్పడియెఁ దత్పతి గ్రక్కునఁ జస్రుక్కి మూర్ఛిలెన్. ౪౩౭

తే॥ అట్లుపడిన దుర్యోధను నందఱుఁగని యబ్రమొందిరి దిక్కెదియంచు నాడి
రపుడు భార్గవునెదిరించి యధికుఁడంచు సన్నుతింగాంచి మించిన శాంతనవుఁడు

ఉ॥ వాడిధనుస్సుఁ గైకొని దవంబుదహించెడి వీతిహోత్రునిం
బోఁడిమి నొప్పి టంకృతుల బోరున సల్పి ప్రవృద్ధుఁడయ్యు నా
షోడశవర్షముల్ గలుగు చూలివలెన్ జెలరేగి సూడులన్
బూడిదఁజేయఁ బెక్కు శరముల్ విసరెన్ మిధిలాధరేశ్వరా ! ౭౭౦

క॥ అత్తఱి ననిరుద్ధునిమొనఁబత్తులు రధిసాదితురగభద్రేభతతుల్
నెత్తురుఁ గ్రక్కుచుఁగొన్నియు నత్తమిలెన్ గొన్ని తెగియు సంతంబొందెన్.

తే॥ మఱియుఁ గొందఱు యోధులు మకుటకవచ కటకహారాదిభూషలఁగలిగి కూల
సమరరంగంబు హతతరుసమితితోడ జెలఁగునట్టియరణ్యంబువలె వెలింగె.

చ॥ అరదము లెల్లయంగములు హస్తులు గుబ్బలు విండ్లు దంతముల్
శరములు కేశజాలము ధ్వజంబులు నోకలు గాఁగ మారి యీ
కరణి జనించి మించెననఁ గన్పడెఁ దత్స్థలి నొందు రక్తని
ర్ఝరిణియుఁ బొఱ వైతరణిచందమునన్ బహుభీకరంబుగాన్ ౭౭౩

తే॥ భూతభేతాళకూష్మాండముఖపిశాచసమితి సనుదెంచి భైరవస్వనమొనర్చి
గిరిశమాలార్థముగ వీరశిరములఁగొని చనియె ననిరుద్ధుఁ డాస్థితిఁగనుచుఁ గనలి

తే॥ అతిశయధ్వజయుతరథమందుఁనెక్కి డాసి గాంగేయు నొకశిఖి వేసి యతని
గత్తిఱనుగొల్పుచాపంబు నుత్తరించె గరుడి ముక్కునఁ బన్నగిన్ గొఱికినటుల

క॥ అంతట శాంతనవుండు కృతాంతనిభుండగుచు నన్యధనువును గొని య
త్యంతముగఁ డంకరించుచు బంతంబును బూనివేసె బ్రహ్మాస్త్రంబున్ ౭౭౬

క॥ అప్పుడు తత్కార్ష్ణిజుఁడున్ జప్పునఁ దద్దీప్తిఁగాంచి స్వబలముఁ బ్రోవన్
గొప్పది బ్రహ్మాస్త్రముఁ గొని యప్పా! యనఁ బ్రేక్షకాళి యనుసంధింపన్

క॥ రెండును బ్రహ్మాస్త్రంబులు మండుచుఁ దద్వాదశార్క్యమసమానముగా
దండిగఁ బోరాడియు బ్రహ్మాండంబులఁ దగులఁబెట్ట నారంభింపన్ ౭౭౮

క॥ అనిరుద్ధుండున్ గనుఁగొని వెనుకకు మరలించి వాని భీష్ముని చాపం
బును శరములఁ ద్రుంచెను రవి ఘనరశ్మిల హిమముఁజెండు కరణిన్ బిదపన్.

మ॥ కురువృద్ధుం డనిరుద్ధపద్ధతులకుం గోపించి లక్షించి ము
ద్గరమున్ దిట్టము లక్షభారయుతమున్ గైకొంచు నవ్వానిపై
బఱపన్ దద్బలి వామహస్తమున సర్వశ్రేష్ఠమున్ బట్టు. తా
త్స్వరహిన్ బట్టి గదన్ దదీయహృదిపై గొట్టెన్ విదేహాధిపా! ౭౮౦

క॥ ఆదెబ్బకు గాంగేయుం డాదిత్యుఁడు దివమునుండి హాహా! యనఁగన్
మేదినియందునఁ గూలినమాదిరి మూర్ఛిల్లె యుద్ధమండలమందున్. ౭౮౧

క॥ అదిగన్న కృపాచార్యుఁ డుపాహృదయేశునిపైని శక్తి నేయఁగ నసితో
గొదకొని ధీమంతుం డయ్యది సెండెను కూర్తిఁ జెలిమి హరియించినటుల్.

తే॥ పర్వతాస్త్రంబు ద్రోణుండు భానునిపయి
వైవ నందునుండియుఁ బెక్కుపర్వతములు
బయలుదేరి ద్విషద్బలములఁ బొడుజేయఁ
గడఁగె నపుడు హాహాకృతుల్గలిగె నపల. ౪౨౪

ఉ॥ భానుఁడు మారుతాస్త్రమును వైచి తదద్రులఁద్రోలె బాహ్లికుం
డానిముసంబునందు ననలాస్త్రము వేసెను దాన సాంబసే
నానికరంబు లన్నల వనంబులు గాలినమాడ్కిఁ గాలఁగా
ధీనిధియైన సాంబుఁడును దేఁకువతో ధనువెక్కుపెట్టుచున్ ౪౨౫

క॥ పార్జన్యంబేయఁగ నది భర్జించెను బావకాస్త్రబాధను విద్విట్
దుర్జయమైన యమాంకృశు నిర్జించినకై వడి ధరణీరమణీంద్రా! ౪౨౬

తే॥ అవల మధుపుత్రోఁ బోరాడునట్టికర్ణుఁ డతనిఁవిడి బాణవింశతి నల్లసాంబుఁ
గొట్ట సరధుఁడై నాతఁడు గోసుదాఁకఁ దిరిగి ఘటికాద్వయంబు చివరకుఁగూలి

ఉ॥ కొంచెముసేపు చింతపడి కోపముతో విడి తేరు వే గదన్
గొంచరుదెంచి కర్ణుఁగడుఁ గొట్టి ధరన్ గడఁబట్టఁజేసి మ్రోఁ
గించి ధనుస్సు తిర్గి రథమెక్కుచు శూలుని బాణవింశతిన్
నొంచియు సోమదత్తుఁగని నొంచెను బంచశితాంబకంబులన్ ౪౨౭

—♦ రామకృష్ణులు వచ్చి యాదవ కౌరవులకు సఖ్యంబు గూర్చుట. ♦—

వ॥ వెండియుఁ దత్సాంబుండు దశాశుగంబుల నశ్వత్థామను షోడశమార్గణంబుల ధౌమ్యుని దశపృషత్కంబుల లక్ష్మణుని పంచఖగంబుల శకునిని వింశతిసాయకంబుల దుశ్శాసనుని వింశతిశిరంబుల సంజయుని శతబాణంబుల భూరిశ్రవుని శతకలంబంబుల యక్షకేతువును హింసించి ఘనంబువిధంబున గర్జించి పదిపదిబాణంబులతో సారధులను నొక్కొక్కసాయకంబుతో గజంబులను హయంబులను నైదైదు రోపంబులతో వీరులను యేపుమాపుట స్వపరసైనికు లాలోకించి విస్మయంబుఁబొందెడిసమయంబున భీష్ముం డుత్థితుండై యేతెంచి యుత్తమంబగు చాపంబు ధరించి, దశాంబకంబులతో సాంబకోదండంబు ఖండనంబు గావించె, మఱియు వీరావేశపరవశులై కుంభసంభవ గాంగేయరాధేయులును దశాక్షౌహిణీసమేతదుర్యోధనుండు నేగుదెంచి పెక్కుసాయకంబుల వైచి యాదవబలంబును నతివిచిత్రింబుగా హతంబు గావించెడి సమయంబునం బరమేశ్వరులును, తాలగరుడధ్వజవిరాజమానులును నగు శ్రీరామకృష్ణులు ద్రింశత్కోటిదేవ

సహితంబుగా జయజయధ్వను లొప్పుచుండ భేరీమృదంగాదులు మొరయుచుండ సురగంధర్వాద్యంగనలు గీర్తించి లాజపుష్పాక్షతలంజల్లుచుండ నా రణాంగణంబున వెలుంగఁదొడంగిరి. తదవసరంబున యాదవులు నమస్కరించినమీఁద దుర్యోధనాది కౌరవులును దమతమశస్త్రాస్త్రంబు లొక మూలఁబెట్టి నమస్కరించి బలుల సమర్పించి కృతాంజలులై ప్రసన్నంబుగా నుండుట నా యదూత్తము లిరువురును వీక్షించి మదోద్ధతులును. స్వకుమారులునగు ప్రద్యుమ్నాదులను వాగ్బాణంబులతో దర్జించి నిర్జరాపగాత్మజాదికురువృద్ధులకుం బ్రణమిల్లి యా సుయోధనున కిట్లనిరి.

ఉ॥ బాగుగలేదు మామదికి భండనమిట్టు లొనర్చుటల్ మహా
భాగ! తలంపఁగా మనము బాంధవముఖ్యులమేగదా! యికన్
జోగులు వీరు మాసుతులు నూడరు మంచియుఁజెడ్డ గర్వులై
యీగతిఁ బోరినందులకు నీరు క్షమింపుఁడు! నిర్మలాత్ములై. ౪౬౦

తే॥ ఒక్క కంచమునం దెప్డు డోగిరంబు
గుడిచి యొక్కప్రక్కను బండుకొనెడి మనము
పూర్వమిట్లు పోరితిమొకో? భూవరేణ్య!
పరుషమాడిన మావారిఁ గరుణఁ గనుమ! ౪౬౧

ఉ॥ నావుడు కౌరవేశ్వరుఁడు నమ్రతఁ బూజలఁజేయఁ వార లా
భూవరు బుజ్జగించి యమపుత్రముఖాదులఁ బాండవేయులన్
ధీవరులం గనం దలఁచి ధీరులు తమ్ములు ధార్తరాష్ట్రులున్
గ్రేవల నొప్పుచుక్ నడువఁ బ్రేముడిఁ బోవఁగడంగి రింతలోన్ ౪౬౨

క॥ ఇంద్రప్రస్థము నుండి నరేంద్రుఁడు తద్ధర్మపుత్రుఁ డిష్టముఖముగా
నింద్రావరజబలాగమ సాంద్రోదంతంబు వినుచుఁ జని బహుభక్తిన్ ౪౬౩

ఉ॥ తమ్ములతోడఁగూడి వసుధావిబుధుల్ పఠియింపఁగాఁ ద్రివే
దమ్ముల శంఖదుందుభులు దద్దయు మ్రోయుచునుండఁ బౌరజా
తమ్ములు పుష్పముల్ గురియఁ దద్బలకృష్ణుల స్వీయహార్యమ్రరా
జమ్మునఁ జేర్చి కౌఁగిలిడి సంతసమందెఁ మునీంద్రు కైవడిన్. ౪౬౪

ఉ॥ అంతట మన్మథప్రముఖ యాదవులట్టి యజాతవైరి క
త్యంతము మ్రొక్కి దీవెనల నందిరి తత్పరమందునన్ రమా
కాంతుఁడు ధర్మ భీమునిని గవ్వడినిన్ గవలన్ స్వయంబుగాఁ
చెంతకుఁ నేగి కౌఁగిలిడి క్షేమము వడెఁ సహోదరంబుగాన్. ౪౬౫

చ॥ అటుతరువాత ధర్మసుతుఁ డాఘనమూర్తుల కర్చఁ జేసెఁ బి
మ్మట నల రామకృష్ణులును మారముఖాదుల కెల్ల దేశముల్
ద్రుటిఁజని గెల్చి వచ్చుటకుఁ దోడ్త ననుజ్ఞయొసంగి విక్రమో
త్కటులగు తమ్ములన్ దగిన ధర్మజుతోఁజని రాత్మధామమున్. ౪౬౬

తే॥ అనఁగ బహులాశ్వుఁ డిట్లనె నమరమునికిఁ
గృష్ణుఁ డట్లరిగిన మీఁదఁ గృష్ణపుత్రుఁ
డేమిచేసెనో చెప్పఁడీ! కృష్ణగాథ
పాపహరము సర్వేప్సిత ప్రదమనంగ. ౪౬౭

తే॥ అవధరింపుము హరిదాస! యంచు నిట్టులనియె ధర్మజుఁ డట్టుల హరినిఁ గలిసి
చనెడితఱిఁ నిజానుజునివిజయునిఁ దనకుఁ బాసటగఁబంపఁదోడ్కొని పంచశరుఁడు

— ప్రద్యుమ్నుండు త్రిగర్తాది దేశంబుల జయించుట. —

ఉ॥ అచ్చటనుండి యాదవబలాన్వితు డౌచుఁ ద్రిగర్తదేశమున్
జొచ్చి సుశర్మఁ దత్ప్రభునిఁ జూచి గ్రహించి బలుల్ విరాటుచే
హెచ్చుగఁ బొంది పూజల నహీనఝురీవిలసత్సరస్వతిన్
మెచ్చి మునింగి దానము లమేయముగా నిడి సాఁగి యచ్చటన్. ౪౬౯

తే॥ విమలమగు కురుక్షేత్రమున్ బిందుసార
మును "బృథూదక, త్రితకూప"ముల సుదర్శ
నమును గాంచి సారస్వతనాథుఁ డగు కు
శాంబుఁ డియ్యమి బలులను సాహసమున. ౪౭౦

వ॥ చారుదేష్ణ, సుదేష. చారుదేహ. చారుగుప్త, చారుచంద్ర. చారు. సుచారు. విచారు, భద్రచారు నామక రుక్మిణీనందనులతోఁ దత్కౌశాంబీనగరంబును ముట్టడించె. అత్తఱి నా రుక్మిణీపుత్రులు పదుగురును సైంధవారూఢులై సకలశస్త్రాస్త్రంబులం దాల్చి యా రిపుబలంబులతోఁబోరాడి కరితురగరథిరథపతాకాదులను ఖండించి తత్పురంబును వానరులు లంకాపట్టణంబును ధ్వంసంబొనరించి నట్లు నాశంబును సల్ప నా భూపతి వెఱచి పారితోషికంబులం గైకొని తెచ్చి యప్పచ్చవిల్తున కిచ్చి నమస్కరించి యాత్మదేశంబును రక్షించుకొనియె. అంత నా కార్ష్ణి దుర్యోధనాజ్ఞావశులగు సౌవీ, రాభీర, కాశ్మీర, సింధు, జాంగల, లతు గాంధార దేశాధీశులగు సుదేవ, విచిత్ర, మహౌజ, శ్చిత్రాంగద, సుమేరు, ధర్మపతి, బిడౌజులచేఁ గ్రమంబుగా నుపాయనంబులందికొని సేనాసహితంబుగా నటనుండికదలి.

తే॥ అర్బుదమ్లేచ్ఛ దేశము లతిరయమున గెలువఁ గల్కిమాదిరి నేగె నల యవనధ
రేశ్వరుఁడు కాలపుత్రుకుఁ డిద్ధబలుఁడునైన చండుఁడు విని కృష్ణసూనురాక.

ఉ॥ వచ్చెనొకో మదీయపితఁబొంతి నశింపఁగఁ జేసినట్టి పె
న్మ్రుచ్చునిబట్టి యిచ్చటికి మూర్ఖుని వీనిని నీ దినంబునం
గ్రుచ్చి శరంబులన్ జమునికొంపకు నంపి పితౄణమెంతయున్
గ్రచ్చుఱఁ దీర్చి ధన్యతను గాంచెదనంచుఁ దలంచి నెమ్మదిన్. ౪౭౩

క॥ ఘనము శతానీకినులను నెనసిన మొనఁ దోడకొంచు నెఱకన్నులుగాన్
గొని శస్త్రాస్త్రములను మదమును గాఱ్చెడి దంతినెక్కి పోయెను బోరన్.

చ॥ చనిన క్షణంబునం గుసుకుసాయకుఁ డా యవనేంద్రు వాసనే
నను గని స్వీయులం బిలిచి నా చెలులార ! యెవండు శూరతన్
మునపయిఁ జెక్కుటూపులను మాటికి మాటికి వేసి వచ్చు నీ
మొనను జయించునో యతఁడు వొందును మద్ధ్వజినీపతిత్వమున్ ౪౭౫

క॥ అని గంభీరగళంబునఁ ననఁగా వినినట్టి సభ్యులందు విజయుఁడున్
ఘనబలుఁడగు పార్థుఁడు నేనని లేచెను బౌరుషంబు హర్షంబొప్పన్ ౪౭౬

ఉ॥ ఆవల సర్వసైన్యము లహో ! యన వైరులసేనతోడ గాం
డీవి సహాయశూన్యుఁడయి డీకొని చాపముఁ డంకరించి గాం
డీవవిముక్తబాణములఁ డెక్కెములన్ రథులన్ రథంబులన్
మావటివాండ్ర నేనుఁగుల మావుల రౌతులఁ జెండె భూవరా ! ౪౭౭

తే॥ అపుడు హతరథిసాదికర్యశ్వభటులు శంకులన్ బడినట్టి కూష్మాండశకల
ములవలెన్ వెల్గిరా రణభూమి నంత మ్లేచ్ఛులెల్లరు వాఱిరో మేదినీశ !

తే॥ అవల నిభమెక్కినట్టి మ్లేచ్ఛాధిపుండు చండుఁ డాత్మశక్తింగొని చక్రఁ ద్రిప్పి
నరునిపై వేసి సింహస్వనంబుఁజేసె నంత విజయుఁ డయ్యది చెండె నంబకముల.

క॥ చండుఁడు విలుఁగొనె వెంటనె గాండీవవిముక్తశిఖులఁ గవ్వడి దానిన్
ఖండింపఁగ చండబలిష్ఠుండగు చండుండు గినుకఁ జఱచుఱఁ గనుచున్. ౪౮౦

ఉ॥ రెండవ దివ్యచాపము ధరించి భయంకరమైన వాని కో
దండముఁ ద్రుంచెఁ బన్నగముఁ దార్క్ష్యుఁడు ద్రుంచినమాడ్కి నంతఁ బా
ర్థుండు త్వగన్వితాసిఁ గొని తోడ్తనె వజ్రి బవిన్ గిరీంద్రమున్
జెండినలీలఁ దద్విరదశేఖరకుంభముఁ గొట్టె నెట్టనన్. ౪౮౧

ఉ॥ తద్ధతిఁ గుంభముం బగులఁ దక్కరి నొచ్చుచుఁగూలె మూర్ఛతోఁ
దద్ధరణీంద్రుఁ డద్దిగని తత్క్షణమందునఁ దాల్చి ఖడ్గమున్
దద్ధరి మిత్రునిం బొడువఁ దద్బలుఁ డా యసి లాగి చర్మతో
నిద్ధరఁ దచ్ఛిరంబుఁబడ నేసె స్వకీయమహాకృపాణమున్. ౪౮౨

ఆ॥ తిరిగి యరుసుండు తీవ్రబాణంబున వానిశిరము లాగి పంచశరుని
యెదుటఁ బడఁగవైవ నెల్లదుందుభులును మొరసెఁ గురిసె దేవపుష్పవృష్టి

క॥ అప్పచ్చవిల్తుఁ డప్పుడు గొప్పఁగఁ గొండాడి సైన్యకోటికిఁ బతిగా
నప్పార్థుని నొనరించెను దప్పక ఛత్రాదుల నదుతింపము గొలువన్. ౪౮౪

తే॥ పిదప నప్పుణ్యదావనిపతి వేగవంతుఁ డాతురుమ్మేంద్రుగతిఁ గని యవరి యధిక
బలులఁ గొని తెచ్చి యప్పచ్చవిలుఁడునకిడి శరణుఁగోరుచు మ్రొక్కుచు సంస్తుతించె

ఆ॥ అవల మందహాసుఁ డనెడి మహారంగదేశాధిపుండు దశసహస్రహరుల
మరున కిచ్చి నిటుల భరతఖండము గెల్చి యతఁడు ప్రాగుదేవి కరిగె నపుడు.

క॥ నదులును నదములు జలధులు జెరుచుఁ దత్తేజమునకు వే సేనల కా
మదనున కశ్వాదులకును గొదకొని మార్గంబు లిచ్చెఁ గొంకక జనకా!

ఉ॥ ఆ సుమబాణుఁ డా నరుస నర్గి సమస్తమునీంద్రపూజ్యకై
లాసగిరీంద్రపార్శ్వమున లక్షణయుక్తముగాఁ జెలంగు బా
ణాసురశోణితాహ్వయపురాంతిక మొందెను సేనతోడ నా
యాసురుఁ డట్టి యాదవుల నందఱఁ గాంచి దురాగ్రహంబునన్. ౪౮౮

క॥ పంద్రెండ దక్షౌహిణులన్ గంద్రల దళవరులఁగూడి కందర్పునిపైఁ
దీంద్రించెడి బలగంబులు గంద్రికలో నట్లు సేయఁ గడఁగెడిలోనన్ ౪౮౯

తే॥ సర్వమంగళాయుక్తుండు శంకరుండు నందివాహనారూఢుండు నాకవిభుఁడు
శూలహస్తుఁ డా బాణుని మోలికేగుదెంచి యాతని కిట్లనె మంచి నెంచి

మ॥ భగవంతుండు పరాత్పరుండు నిఖిలబ్రహ్మాండనాథుండు గో
జగతీనాయకుఁడున్ బ్రపూర్ణతముఁడున్ సచ్చిత్ప్రమోద స్వరూ
పగుఁడౌ కృష్ణుని యంశ మువ్వురముఁ దద్బ్రహ్మాదినామంబులన్
దగి మేమిట్టులఁ బుట్టియుంటిమి గదా దైత్యాన్వయోద్దీపకా! ౪౯౧

చ॥ మఱియుఁ దదచ్యుతాజ్ఞలను మాళిధరించి క్రియాకలాపమున్
గరముగఁ జేయుచుందు మనఁగా నిఁకఁ ద్వాదృశు లెట్లొనర్ప రీ
వఱుఁ ద్వదీయబాహువులఁ బాపిన సంగతి గుత్తెఱుంగవే
మఱతువె? బద్ధుఁడైన తన మన్మని నాయనిరుద్ధు విప్పుటల్. ౪౯౨

తే॥ కాన మీ దానవులకెల్ల మాననీయుఁ
డాతఁడంచు నెఱుంగుమా! యదియుఁగాక
యతని పౌత్రుఁడౌ ననిరుద్ధుఁ డల్లుఁడుగద
పూజ వారికిఁ జేయుమా! పోరు విడిచి ౪౯౩

తే॥ అటుల హరబోధితుండయి నట్టి బాణుఁ
డాత్మజామాత ననిరుద్ధు నాహ్వానల్పి
యర్చలం జేసి పారిబర్హంబు లొసఁగి
సైన్యయుతుఁడగు మన్మధున్ సత్కరించి ౪౯-౪

తే॥ కోటిరథములు బదివేలు కుంభులైదులక్షలశ్వముల్ గానికలను సమర్ప
ణంబుజేయఁగ నాతండు సంబరంబునంది సేనలతోడుత నచటఁ గదలి ౪౯-౫

ప్రద్యుమ్నుం డలకాపట్టణమున కరుగుట.

సీ॥ నందాలకానంద లందముగా నే నగరమణికిన్ దివ్యపరిఖ యయ్యె
రత్నసోపాన విభ్రాజితహ్రదము లేపుర బాహ్యవనములఁ బొల్పుఁగాంచు
గిన్నరగుహ్యక కింపురుషాదు లేపట్టణంబందున వఱలుచుండ్రు
సకల కళాకర సౌధరాజమ్ము లేనగరంబునందున మిగుల వెలుఁగు

తే॥ నాగకన్యలచే నొప్పు భోగవతి విధమున నే పురి రాజిల్లు ధనదపాలి
తమయి యేపీఁకు భాసిల్లు తత్పురమున కలక కరిగి కప్పంబుల నడిగె నంత

చ॥ ధనదుఁడు దానవాంతకుని ధైర్యబలప్రతిభాప్రభావముల్
గనియు నఖర్వగర్వమునఁ గయ్యముఁ జేయఁదలంచె స్వల్పుఁడౌ
ధనియ మహాత్ములన్ దృణవిధంబునఁ జూచెడి నింక నా ప్రభుం
డు నవనిధిప్రపాలకుఁడటుల్ గరువంబుననుంట వింతయే ? ౪౯-౬

క॥ అంతట గుహ్యకకాంతుం డెంతయు వాచించి దిట్ట హేమమకుటు నా
కంతునిదరి కంపఁగ ధీమంతుఁ డతఁ డతనిఁజేరి మాటాడె నిటుల్. ౪౯-౭

తే॥ మదన ! యాదవనాయకా ! మావిభుండు నన్ను దూతగఁ బంపె మీసన్నిధికిని
గాన నేఁజెప్పుసంగతుల్ వీనులార వినఁగ వేఁడెద ననియిట్టు లనియె జనక !

ఉ॥ ఎట్టుల దేవలోకమున నెల్లసురల్ సురరాజటంచు ని
ట్టట్టనరానిపూజల మహేంద్రు సుతుష్టుఁగఁజేసి మెత్తురో
యట్టుల నీధరాతలమునందు నృపుల్ నను రాజరాజ టం
చట్టె యొనర్చి యర్చలను హర్షముఁ గూర్తురటం చెఱుంగుమా ! ౫౦౦

క॥ అలకను బరిపాలించెడి నలఘుఁడ నవనిధులకేనె యధిపుఁడ శివుతోఁ
జెలిమిని జేసినవాఁడను బలుఁడను నగునాకు మీరు బలులియ్యఁదగున్. ౫౦౧

తే॥ కాని మీ యుగ్రసేనుఁడు మానవునకు నేను గప్పంబులిడజాల నిటులె మరల
నడిగినం గయ్యమాడెద నందు సందియంబువలదని చెప్పెనో శంబరారి ! ౫౦౨

క॥ అనవుడు ప్రద్యుమ్నుండును విని యిపుడీ రాజరాజు విశ్వఖ్యాతున్
ఘను రారాజులమేల్బంతిని బలు మాయుగ్రసేను ధీరునిఁ గనెనే? ౫౦౩

సీ॥ ఇంద్రాదిపూజల హెచ్చుగాఁ గైకొన్న కృష్ణుని నీయకుఁ దెలుఁగఁడొక్కొ
వజ్రసుధర్మను బారిజాతము హరికిచ్చుట నీయకుఁ దెలుఁగఁడొక్కొ
పాశి నీలాశ్వముల్ బ్రిణమిల్లి యాశౌరికిడుటయు నీయకుఁ దెలుఁగఁడొక్కొ
సకలలోకంబులఁ జక్కఁగా రక్షించు కృష్ణుని నీయకుఁ దెలుఁగఁడొక్కొ

తే॥ మఱియు మాయుగ్రసేనునిమహితసభను నట్టికృష్ణుఁడువెల్గుట యెఱుఁగఁడొక్కొ
యనియుఁ దత్ప్రేషితుఁడనేను ధనదునకిదె యిషుబలులనిత్తునని ధను వెక్కుపెట్ట

తే॥ బిలసమేతలోకంబులు లలినిమోగె దిగ్గజములు చలించెను స్థిరయు వణఁకెఁ
దారకంబులు వ్రాలెను దత్స్మరుండు బాణమొక్కటి ధనుపైఁ బఱుపనదియు

ఉ॥ మించెడి ద్వాదశార్యములమించిన తేజున దిక్కులెల్ల వె
లింగించుచుఁ బోయి యాతని శిఖిఁ గొడుగున్ మఱి జామరంబులన్
దుంచినఁ దద్ధనేశ్వరుఁడు దోర్దర్పనఁ గన్గొని యట్టివింత రో
షించుచుఁ బుష్పకంబు వడినెక్కి రణంబొనరించు నిచ్చతోన్ ౫౦౭

—♦ కుబేర నలకూబరాది యోధపుంగవులు యాదవులతోఁ బోరుట. ♦—

వ॥ ఘంటానాదపార్శ్వమాలినామకమంత్రియుక్తుండై ధ్వజంబు వెంబడి నలకూబరమణిగ్రీవపుత్రులు విరాజిల్లుచుండ భయంకరాకారులును దనుత్రాణశిరస్త్రాణాంగుళిత్రాణధరులును సకలశస్త్రాస్త్రశక్తిసంయుతులును హయవదన పంచాననానన శింశుమారముఖ, నక్రవక్త్రోర్ధ్వపింగార్ధకృష్ణోర్ధ్వకేశులును నగు వేలకొలందిగనున్న యక్షకిన్నరాదులతోడను గజాశ్వరథపత్తిసహితులగు సేనానులతోడం గూడి వందిమాగధులు ప్రశంసించుచుండ శంఖభేరీమృదంగపటహాదులు మ్రోగుచుండ నిర్గమించె. తత్సమయంబునం దత్సహాయార్థంబుగా యోగమహామహిమామయంబగు సిద్ధక్షేత్రంబునుండి ప్రమథగణంబులును డాకినీభూతభేతాళకూష్మాండోన్మాదసంయుక్తంబులును సవినాయకంబులును నగు మాతృగణంబులను బ్రిలయంబున సంవర్తకమేఘంబు లంబరంబు నాచ్ఛాదించుచు వచ్చెడివిధంబున భైరవరవంబు లవిరామంబుగా నొనర్చుచుఁ గోట్లకొలందిగ నేతెంచెడి నిశాచరపిశాచబ్రహ్మరాక్షసభైరవాదులను దోడ్కొని మయూరాధిరూఢుండై కార్తికేయుండును మూషికారూఢుండై హేరంబుండును వీరభద్రసహితంబుగాఁ జనుదెంచిరి. ఆ తరుణంబునం దావిత్తేశుని బలంబులకును, జిత్తజుని సైన్యంబులకు హోరాహోరిగ నద్భుతంబగు తుములయుద్ధంబయ్యె. అయ్యెడఁ బరస్పరప్రయుక్తశస్త్రంబులచేతను

దచ్చరణోత్థితరజంబులచేతను సూర్యాంబరధరామండలంబు లాచ్ఛాదింపంబడియె.
ఏతత్సమయంబున మణిగ్రీవుం డుగ్రుండై.

పంచచామరము॥ అరాతులన్ శరంబులేయ నవ్వియేగి వారివా
హారిధ్వజేభపత్తిసాదులన్ని ద్రుంప రాధికా
వరాత్మజాతుఁడైన చంద్రభానుఁడై దుతూపులన్
ద్వరన్ దదీయకార్ముకంబుఁ బాడుజేసి బైసుకన్. ౫౦౮

క॥ తురగయుతంబగు రథమును నరదశబాణంబులేసి నఱకృలు గాఁగన్
ధరఁబడఁగూల్చి పయోదము నెఱిగాఁగర్జింప నల మణిగ్రీవుండున్. ౫౦౯

క॥ అల్కను శక్తిని విసర మహోల్కవలెను నద్ది వెల్గు చుద్ధతిఁజనఁగా
నిల్కడ నతఁడెడచేతను జుల్కనఁగొని దాని ధనదుచూలినిఁ గొట్టెన్. ౫౧౦

తే॥ తత్ప్రహారమునకు వాఁడు ధరను సొమ్మసిలఁగ నలకూబర ప్రేరితులును బలులు
నై నరక్కసుల్ నర్ఘాన్కనంబుదములు గప్పినటుఁగప్పి రాతనిఁ గాండములను.

తే॥ అంత దీప్తిమంతుండు మహోగ్రహమున శాతఖడ్గముఁగొని యక్షసైన్యములను
జొచ్చి ఖండించె మంచులన్ జొచ్చియినుఁడు ఖరకరంబులఁజెండిన కరణి నవల

ఉ॥ కొందఱు భిన్నశీర్షులయి కొందఱు భిన్నపదాంసహస్తులై
కొందఱు భిన్నకర్ణులయి కొందఱు భిన్నవిశాలవక్షులై
కొందఱు భిన్నవర్ములయి కూలిరి శేషులు వాఱి రార్తిత
ద్బృందమునం జనింపఁ గని యేపునఁ దన్నలకూబరుండునున్. ౫౧౩

చ॥ అభయమొసంగి స్వీయులకు నబ్బె గుణధ్వని వింట మాటికిన్
సభయులుగా యదూద్భటులు సల్ప మహోచ్ఛ్రియకేతనంబుతో
విభవముగాంచు స్యందనము వేయధిరోహణ మాచరించి భా
వభవచమూపతిన్ విజయు బాఁదియు వింశతిమార్గణంబులన్ ౫౧౪

క॥ కృతవర్మ నైదుతూపుల హతినొనరిచి దీప్తిమంతు నధికబలుని విం
శతిసాయకములఁ గొట్టఁగఁ గృతవర్మయుఁ బంచశిఖుల నేసె నతనిపై ౫౧౫

క॥ అవి వడి నా నలకూబరు కవచంబును ద్రుంచి దూఱెఁ గాశ్యపిలోనన్
భువి వల్మీకములోనికిఁ దవిలి చనెడి ఫణులమాడ్కిఁ దచ్చరహతులన్. ౫౧౬

క॥ పుడమిని నతఁడును సొమ్మనుఁ బడుటనుగని హేమమాలి వడి నరదముపై
నిడుకొని యావల కరిగెను గడగడలాడిరి ధనేశుకాల్వురు లవలన్ ౫౧౭

ఉ॥ ఆదను మాని మంత్రులు మహాబలశాలురునైన ఘంటికా
నాదుఁడు పార్శ్వమాలియు రణంబున కేగి సువర్ణపుంఖముల్
భీదముఖంబులున్ జవనవేగము గృధ్రసుపక్షముల్ మహా
నాదము గల్గు తూపుల ఘనంబుగఁ గొట్టిరి యాదవావళిన్. ౫౧౮

చ॥ పదపడి నర్జునుండు ప్రతిబాణము వేయఁగ నవ్వి వానితో
నెదురుచు విస్ఫులింగము లహీనముగా వెడలంగఁ జెండి యా
చదలునఁ దిర్గు పెంగొఱవి చందమునన్ భ్రమియించి కోసులె
న్మిదిటికిఁ బైనిఁ ద్రోసె ధ్వజ మిశ్రతదీయరథంబులన్ ద్రుటిన్. ౫౧౯

ఉ॥ అప్పుడు యక్షు లాసచివు లానరమార్గణపంజరంబునం
దొప్పి నశించి రయ్యొ! యయయో! యిఁక నెయ్యది దిక్కటంచు బ
ల్లెప్పుచు యుద్ధరంగముఁ ద్యజించి పదంబుకొలందిఁ బాఱఁగాఁ
దెప్పున భూతజాత మరుదెంచెను గోట్లకొలంది భూవరా! ౫౨౦

తే॥ అటుల సనుదెంచి యయ్యవి యాహవమున
నరులఁ దునిమి నెత్తురుఁ ద్రాగి శిరములఁ గొని
కనుచు నఱచుచు నవ్వుచుఁ గనలు చెగురు
చాడుచున్ బాడుచుండెడి నవసరమున. ౫౨౧

చ॥ గదుఁడు బలానుజుండు గని కైకొని భీకరలక్షభారభృ
ద్గదను ఘనంబుకై వడిని గర్జనొనర్చుచుఁ దద్గణంబులన్
ద్రిదశవిభుండు వజ్రమున దివ్యనగంబులఁ గొట్టినట్లుగాఁ
జదుపఁగఁ గొన్ని సొమ్మగొనెఁ జచ్చెను గొన్నియు బాఱెఁ గొన్నియున్

ఆ॥ అట్లు భూతగణము లంతంబుజెందుట వీరభద్రుఁడు గని వీరరసము
వొంగ నరుగుదెంచి ముద్గరంబును వానిపైని విసరి జలదు పగిదినఱచె. ౫౨౩

క॥ అంత గదుఁడు తన గదఁగొని పంతమునన్ వీరభద్రుపై విసరఁగ న
త్యంత మవిరెండుఁ బోరుచు నంతమునన్ జూర్ణమయ్యె నావల వారల్ ౫౨౪

ఉ॥ జానుభుజాపదంబులను శైలములన్ బడఁద్రోసి గెల్పునే
మానసమందునం దలఁచి మల్లరణం బొనరించి రంతటన్
ధీనిధి వీరభద్రుఁడును దేఁకువతోఁ గరవీరమన్ గిరిన్
బూని పెకల్చి తద్గదుని మోమునవైచి హసించెఁ బెద్దగాన్ ౫౨౫

ఉ॥ అవ్వల యాదవోద్భటుఁ డనంతబలుండు గదుండు తద్గిరిన్
చివ్వున లాగికొంచతని శీర్షముపైఁ బడవేయ నాతఁడున్
నొవ్వక తద్గదుం గొని వినోదముగా నొక లక్షయామడల్
జివ్వున నెట్టెఁ బిమ్మట ధరిత్రినిఁ గూలిన తద్గదుండునున్. ౫౨౬

కం॥ ఇంచుక చింతించుచు నే తెంచియుఁ దద్వీరభద్రుఁ ద్రిప్పుచు దివిపైఁ
బంచె నొక లక్షయోజనుడ లెంచఁగఁ బ్రద్యుమ్నబలము లెల్లన్ భూపా! ౨౨౭

ఆ॥ వీరభద్రుఁ డంత వినునుండి కైలాసశైలశృంగమందుఁ గూలి స్వామి
నొక్క గంటకాల మొడలను దెలియకయుండె నవల వినుము యుర్వరేశ!

వ॥ మహాబాహుండగు కార్తికేయుండు క్రుద్ధుండై యుద్ధుర వేగంబుతో యుద్ధరంగంబున కేతెంచి యనిరుద్ధసాంబులం దెగటార్ప శక్తిమంతంబగు నొక్క శక్తిం బ్రయోగింప నయ్యది సత్వరంబునం జని యవ్వీరల తేరుల నుసిజేసి వేయి గజంబులను నహస్రహయంబులం బోకార్చి లక్షవీరులం బరిమార్చి సాంబుని నొప్పించి దశదిశల వెల్గించుచు బుస్సలుగొట్టుచు వల్మీకంబుఁ బ్రవేశించు పన్నగంబు విధంబున భూతలంబునం జొచ్చె. అంత సాంబుండు శింజినీఘోషం బాచరించి యొండుకాండంబు నిషంగంబునుండి కైకొనునంతలో నది దశబాణంబులయ్యె. అవి ధనువుననుసంధించుతఱిని శతబాణంబులయ్యె. కూర్చినపిదప నా నూరు రోపంబులు వేయి తూపులయ్యె. తన్మోక్షణసమయంబునం దవియే లక్షమార్గణంబులై తత్పరంబునం గోటిపృషత్కంబులై యనంతరంబునం దసంఖ్యాకంబులగు బాణంబులై చెలరేగి యరాతివీరులఁ గోట్లకొలందిగ ఖండించె. అప్పు డమ్మహాసేనుండు తత్ప్రహారంబున భిన్నాంగుండై యించుక వ్యాకులపడుచుండ, ౨౨౯

తే॥ సకల శస్త్రాస్త్రసహితుండు సర్వభూష
ణాంచితుఁడు జతుర్బాహుఁడు నాఖువాహ
నాధిరూఢుఁడు గార్తికేయాగ్రజుండు
ఫాలచంద్రుండు గజవక్త్రుఁడాలమునకు ౨౩౦

తే॥ వచ్చి పరశురామునివలెఁ బరశువునను బాశమున నంకుశంబున వైరివీర
వాజి రథ రథి బలముల బగ్గిఁగల్పి సరథు సాంబునిఁగొని కొట్టు సమయమందు

చ॥ బలములతోడ నున్న సుమబాణుఁడు గన్గొని వింతఁజెంది యి
ట్లల యనిరుద్ధనామకసుతాగ్రణి కాఁడె? సుధీ! యితండొ యా
వలమురితాల్పుపాలున భవంబును బొందినవాఁడు వీనినిం
గెలువఁగలేరు వేల్పులిక గెల్తురె కో మనబోటివారలన్?

చ॥ ఇతఁ డెటనుండు? నందు నను వేని పరాజయమొందఁబోడు ము
న్నితిగళగేహమందు నల శ్రీహరి యిచ్చె వరంబు వీనికా
కతమున గెల్పిటన్ మనకుఁ గల్గదు కావున నిందునుండి యీ
ధృతియుతు నాఖువాహనుని నెట్లు తొలంగ నొనర్పఁగావలెన్ ౨౩౩

కం॥ అందుల కొక్క యుపాయ మమందత వచియింతుఁ జండమార్జారమవై
యెందాఁక నీబలంబుల మ్రింగెదు మొ యంతదాఁక మసలక తఱుమా! ౨౩౪

కం॥ అప్పుడు తప్పక విజయం బొప్పును మనకనఁగ నట్టి యుత్కటబలుఁడౌ
నప్పచ్చవిల్తుబిడ్డఁడు గొప్పబిడాలముగ మారి కొంకక కింకన్ ౫౩౫

తే॥ విష్ణుమాయను గణపతి వీక్షణములఁ బడక భీకరఘూత్కృతుల్ ప్రాకటముగఁ
జేయు చాఖుసమ్ముఖమును జెంది గోళ్ళఁ దన్ముఖముఁ జీల్పఁగడఁగెను దత్పరమున

కం॥ ఉందురు వాలోకించుచు బొందివిడుచునంత భయముఁబొంది విడి యనిన్
వందురుతోఁ గాల్కొలఁదిని సందులకున్ గొందులకును జన నోతువునున్

తే॥ స్థూలరూపమునఁ దఱుమఁదొడఁగ నద్ది దిశలకున్ విదిశలకును దేవనాగ
భూతలములకుఁ జనె గజముఖునితోడ బుష్పశరుఁ డసులనుద్రుంపఁ బూనుకొనియె

ఉ॥ అప్పుడు విస్మయంబు ప్రమథాదులు వొందిరి పుష్పకంబునం
దొప్పు కుబేరుఁడున్ గని యొహో యని గౌహ్యకి మాయఁసల్పివే
గొప్పధనుస్సుఁ గొంచుఁ దల కుంభినిసోక మహేశు మ్రొక్కి బ
ల్మెప్పులఁగన్న మంత్రయుతమేదుర వర్మముఁ దాల్చి పెల్చనన్ ౫౩౯

తే॥ బాణసంఘంబు వైరులపైని వైవ నవ్వి సంవర్తకాభ్రములా పరిలయము
నందునం దటిత్స్వనముల నరుగుదెంచి క్రిమ్ములీలను వ్యోమంబుఁ గప్పిమిగుల

కం॥ కరికరనిభబిందువులన్ గురిసెను బాషాణములను గూడుచుఁ ద్రుటిలో
ధరణి నకూపారంబులు బఱఁగి భయంకరముగాగఁ బొఱఁదొడంగెన్ ౫౪౧

చ॥ అదియును గాక జీవసహస్రాహులు గన్పడె నందు నత్తఱిన్
యదువులు ప్రాకృతుల్ ప్రబలయమంచుఁ దలంచి భయంబుఁబొంది త
త్కదనము వీడి కార్ముకనికాయము వాఱఁగ వైచి కృష్ణ! యం
చదనముగా స్మరించి రపుడా యదువర్యుఁడు మన్మథుండునున్. ౫౪౨

తే॥ గౌహ్యకీమాయ యిదియని కరముదలఁచి సర్వమాయోపమర్దిని సాత్త్వికియును
నగు స్వవిద్యను ధ్యానించి యంగజాత బీజమున్ దూపునదుమను నోజఁగూర్చి

కం॥ పరిణుత శ్రీ బీజంబును బరిణవము దన్ముఖమునందు భాసిల వింటన్
గుణమెక్కపెట్టి నారాయణునిం ధ్యానించి నేసె హాహా యనఁగన్. ౫౪౪

తే॥ దాన గౌహ్యకీమాయ యథాయథలుగ నయ్యె రవిచేతఁ జీకఁటులరిగినటుల
నద్దిగాంచిన రాజరాజదరి స్వపురమునకు యక్షులతోఁగూడిపోయె నవల ౫౪౫

కం॥ చల్లిరి పూలను దదరితివల్లభుపై నెల్లసురలు బరమముదముతో
నెల్లరు జయజయరవములఁ బెల్లుగ నొనరించిరి యదువితతులు నవ్వేళన్ ౫౪౬

—♦ కుబేరుం డోడి బలులిచ్చి ప్రద్యుమ్నునిం బొగడుట. ♦—

వ॥ అత్తరుణంబున నవ్విత్తేశుం డుత్కటసంతోషంబుతోఁ జతుర్దంత యుక్తంబులై యచలంబులతో డీకొనంజాలిన ద్విలక్షగజేంద్రంబులను, ముక్తా తోరణభాసురదశలక్షరథంబులను, సూర్యవర్చస్సమన్వితంబులగు శతహయంబులను జంద్రవర్చస్సముపేతంబులగు దశార్బుదాశ్వంబులను, స్వర్ణవర్ణయుతంబులగు శత తురగంబులను, జతుర్లక్షయాప్యయానంబులను, బంజరస్థంబులగు ద్విలక్షశార్దూ లంబులను, గోటిచిత్రమృగంబులను, గోటిగవయమృగంబులను, గోటిమృగయా సారమేయంబులను, గీరశారికానురాళేతరపక్షుల నొక్కొక్క లక్షను, నేనిమిది యోజనంబుల నెత్తును, దొమ్మిది యోజనంబుల వెడల్పును గలిగి లక్షస్వర్ణకుంభంబు లతోఁ దేజరిల్లినదియు విశ్వకర్మనిర్మితంబును, గామగంబును, జాంబూనదశృంగభాసు రంబును, సహస్రప్రభాకరప్రతీకాశంబును, విష్ణుదత్తాఖ్యంబును నగు విమానంబును, సహస్రకులవృక్షంబులను, శతకామధేనువులను, శతచింతామణులను, స్పర్శచే లోహంబునైతము బంగారుగావించు శతదివ్యాశ్మంబులను ఛత్రచామరసమేత సువర్ణ సింహాసనశతంబును, నమృతపాత్రశతంబును, రత్నఖచితభూషణంబులను, దివ్యాం బరరత్నకంబళంబులను. నానావిధఫలంబులను, నైకవిధశస్త్రాస్త్రంబులను గింజల్కో పేతపద్మమాలికలను మత్తేభంబులమీఁదను, నరులమీఁదను వేసి మోయించుకొని తీసికొనివచ్చి ప్రద్యుమ్నునిం జుట్టివచ్చి యవ్వానిని సమర్పించి నవనిధులఁగూడి నొసంగి కృతాంజలియై యిట్లు స్తుతించె. ౧౪౭

సుముఖీవృత్తము॥ మనసిజ ! మార ! మహాత్మనుతా !
వనరుహనేత్ర ! పరాత్పరా !
జనపతివర్య ! సమస్తవిభూ
వినతు లొనర్తు విధేయుఁడనై ౧౪౮

తరళ॥ జలజలోచన పుత్రకాగ్రణి శౌర్యధైర్యసమేతునిన్
బలుని రుక్మవతీమనోహరు బాహుదాది విభూషితున్
గలశజప్రముఖర్షి పూజితుఁ గంబుకంఠు రతీశ్వరున్
జలచరధ్వజు లోకజేతను సంస్తుతించెద భక్తితోన్. ౧౪౯

పంచచామరము॥ అనాదిమధ్యనాశనా ! స్వయంప్రభాస్వరూప ! యో
యనాథనాథ ! భక్తవత్సలా ! యయన్యజా ! ప్రజా
మనోభిరామ ! కామ ! భూమ ! మాననీయ ! సుందరీ
మనోహరా ! పరాత్పరా ! మాళితోడ మ్రొక్కెదన్. ౧౫౦

క॥ చేయుచునుంటిని జేసితిఁ జేయగలను నిద్ది నీకుఁ జెందిన దదియో
నాయది యీతఁడు మిత్రుం డాయన యాగర్భశత్రుఁడని చెప్పుటయున్ ౧౫౧

తే॥ నేను భోగిని దుఃఖివి నీవనుట యహంకృతిని మమతను గల్గినవి జనుండు
ప్రకృతికాలాశయాంగజ ప్రబలగుణములను సుబద్ధుఁడై చెడుపనులొనరుచుఁగద

ఉ॥ కాచమునందు బాలు నిసుకన్ సలిలంబును ద్రాట సర్పమున్
జూచినచాడ్పునం గనుల శుంతతఁజూడక మీప్రభావముల్
జూచితి మిమ్ము హేలమెయి సొంటుల నాయవిబాపి దేవరా!
నీ చరణారవిందముల నిచ్చలుగొల్చెద భక్తి నీయవే! ౫౫౩

క॥ జ్ఞాననిధిసమాగమమును జ్ఞానము వైరాగ్యయుతము సాయుజ్యంబున్
సూనశరా! కరుణామతి దీనుఁడనగు నాకు నిడవె! దేవ! యనంగన్. ౫౫౪

తే॥ అంగభవుఁ డట్టులఁగుగాతమంచుఁ బలికి
యభయమిడి పద్మరాగంబు హాటకమణి
మయము ఛత్రచామరభాసమానము నగు
సింహపీఠంబు నొసఁగ నా శ్రీదుఁడు గొని ౫౫౫

తే॥ అతనిఁ జుట్టివచ్చి యనుమతిఁ గైకొని యాత్మమందిరమున కరిగె నవల
నితరరాజు లందఱెఱిఁగి తజ్జయమును బలుల నిడిరి మాని భండనంబు. ౫౫౬

## —♦ మన్మథుండు కింపురుషఖండంబు గెలుచుట. ♦—

ఉ॥ ఆ తరువాతఁ బంచశరుఁ డాత్మబలంబులఁగూడి సాఁగి ప్రా
గ్జ్యోతిషపట్టణంబునకు శూరులు దల్లడిలంగ దుందుభుల్
బ్రాఁతిగ మ్రోయనేగె నటుపైనిఁ దదీశుఁడు భౌమదైత్యసం
జాతుఁడు నీలుఁడున్ బెదరి శౌరికుమారున కిచ్చెఁ గానుకల్ ౫౫౭

క॥ అవి గొని మరలెడి మరుతో ద్వివిదకపి మున్ను దెబ్బ దినిన కినుకచే
జవమునఁ దత్పరివాకిటఁ గవిసి దళంబులను గోళ్ళఁ గాడ్పుడఁజేసెన్ ౫౫౮

తే॥ మఱియుఁ దత్కపి తోఁకతో నరదములనుగట్టి లవణాబ్ధినిన్ నెట్టి కరుల హరుల
గరములన్ బట్టి నింగికిఁ బఱపి బలిమి నగ్గలంబుగ గర్జింప నామరుండు ౫౫౯

చ॥ కనుఁగొని వాఁడు శత్రుఁడని గట్టిగ నెంచి గ్రహించి శార్ఙ్గమున్
ఘనముగఁ డంకరించి యొక కాండము వేయఁగ నద్ది తత్కపిన్
గొని దివిఁ ద్రిప్పి పల్మఱును గొంకక పూర్వవిధిన్ స్వకస్థలం
బునఁ బడునట్లు బంచి మఱిఁ పుష్పశరేషుధిఁదూఱె భూవరా! ౫౬౦

ఆ॥ అంత మదనుఁ డచట నక్షౌహిణీశతసహితుఁడగుచు సాఁగి సాలజాల
వల్లరీసహస్రపత్రలసత్సరః కలితదేశములను గలయఁగాంచి ౫౬౧

ఆ॥ యక్షుదిష్టమార్గమందునం జని చని హేమకూటభూధరేంద్రమునకుఁ
గ్రిందవెల్గుచున్న కింపురుషులఖండమునకు ముఖ్యమైన పురికి నరిగె. ౫౬౨

క॥ అంతటఁ గింపురుషులు రతికాంతాగమనంబు భటముఖంబున విని య
త్యంతముదంబును గని యీ వంతునఁ బల్కాడి రార్య బహులాశ్వవిభూ!

సీ॥ అఖిలాండపతియైన హరి పుట్టియుంట యాదవకులంబంతయు ధన్యమయ్యెఁ
బరమేశ్వరుండైన హరి చరియించుటక్ దన్మధురాపురి ధన్యమయ్యె
గోలోకవిభుఁడు ముకుందుఁడు దిరుగ బృందావనంబును బహుధన్యమయ్యె
హరిదంతభరితతద్యశమును గొనియాడి తత్త్రిలోకంబులు ధన్యమయ్యె

తే॥ దానమానరాసాది లీలానికరము గృష్ణుతోఁ గూడి కావించి యెల్లగోపి
కలును రాధయు ధన్యలైరలయమునయుఁ దద్ధృషీకేశునకుఁ బుట్టి ధన్యయయ్యె

తే॥ మఱియుఁ దద్దర్శనస్పర్శమననములను నెందఱో తపోధనులు నహీనమతులు
దీనులును ధన్యులైరి గాదే! తదబ్జనాభు మ్రొక్కుచునుందు మనారతంబు.

ఉ॥ ఆ యరవిందలోచనుఁడు యాదవవర్యుని నుగ్రసేనునిన్
జేయుచు సార్వభౌమునిగ శ్రేష్ఠతరంబగు రాజసూయమున్
జేయఁగఁ జెప్పి దిగ్జయముఁ జేయఁగ స్వీయకుమారు మారునిన్
దోయజనేత్రు నీఘనునిఁ దోయములన్ జతజేసి పంచెఁగా ౫౬౬

ఉ॥ కావున నీబుధున్ మనము గన్నులపండువగాఁగఁ గాంచి సం
భావనజేసి యిత్తఱి సుపర్వులకందని ధన్యతన్ గనం
గావలెనంచు నందఱటు గాన్కలొసంగి నమస్కరించి రా
శ్రీవిభుసూనువర్యుఁడు వశీకృతశత్రుఁడు పుష్పబాణుఁడున్ ౫౬౭

తే॥ నిజవిశదయశశ్శశధలను నిర్మలమగు ముజ్జగంబుల వెల్గించె బూర్ణచంద్ర
రశ్మిమిలితదుగ్ధాబ్ధిస్ఫురత్తరంగములను గరి విస్తృతిగ సల్పు పోల్కి జనక!

చ॥ మఱియుఁ దదచ్యుతాత్మజుఁ డమందనిజామల కీర్తిగానమున్
బొరిఁ బొరి నాలకించి బహుమోదముఁ జెందియు నట్టి కిం
పురుషుల కర్ధమాళిమణిభూషణకుండలహారబాహుదాం
బరవలయోర్మికాదులఁ గృపామతి నిచ్చి బహూకరింపఁగాన్. ౫౬౯

ఆ॥ రాజధానియైన రంగువల్లీపురినుండి తద్విభుండు దండివాఁడు
నగు సుబాహుఁడరిగి యంగజునిన్ మ్రొక్కి బలులనిచ్చి యవల పార్థివేంద్ర!

ఉ॥ వారిజనాభసూనుఁడు సుబాహునరేంద్రున కిట్లు పల్కెనో
ధీర ! త్వదీయపట్టణము దివ్యము దీనికి రంగవల్లియన్
బేరెటుగల్గెనో ? యొవరు పెట్టిరొ ? యీయభిధేయ మంతయున్
మీరలు నాకుఁ జెప్పవలె మీ ధ్వనియందును మున్న దీనిసిన్. ౫౭౧

చ॥ అనఁగ సుబాహు విట్లనియె నంగజ ! పూర్వము క్షీరవారిధిన్
దనుజులు నిర్జరుల్ గలిసి ధైర్యముతో మథియించుకాలమం
దునఁ బదునాల్గురత్నములు దోఁచెను వెండియు నందునన్ సుధా
కనదురు కుంభమున్ బాడువఁగా వనజాక్షుఁడు శ్రీరమేశుఁడున్. ౫౭౨

తే॥ కన్నులారఁగఁ గన్గొనెఁ గౌతుకమున నతని కన్నులఁగాజెడి నశ్రుపు లల
కలశమందునఁ బడుటచేఁ దులసియనెడి తరువు తత్స్థలిన్ జనియించె ధరణినాథ

ఉ॥ ఆరమణీయశాఖి కలయంబుజనేత్రుఁడు రంగవల్లియన్
బేరిడె హేమకూటమను పెద్దమహీధ్రముక్రింద నద్ది యొ
ప్పారుచునుండు నిప్పటికి నాతరునామమె మత్పురాఖ్యయై
కీరితికెక్కె నీతరువు కేవలుఁ జూపునటం చెఱుంగుమా ! ౫౭౪

చ॥ వినుము మఱొక్కసంగతిని వీని వరుండు మహానుభావుఁడున్
దినమణిముఖ్యశిష్యుఁడు సుధీనిధి రామభటుండు నంజనా
తనయుఁడు నిత్య మచ్చటికి దర్శనముం బొనరింప "నార్షిషే
ణు"ని గొని వచ్చెడిన్ హరితనూభవ! యంచు వచింప నాతఁడున్ ౫౭౫

వ॥ ఆనందించి తత్స్థలంబున కేగి తద్రంగవల్లీభూరుహావరంబును సందర్శించి ప్రదక్షిణంబు లాచరించి నమస్కరించి యట నిర్గమించి హేమకూటతటీభూతంబును, సింహశరభశార్దూలచిత్రికవన్యేభశిలోలూకాది నిర్ఘోషఘోషితంబును, భృంగారీభృంగఝుంకారసంకులంబును, గృష్ణాహారీతకీవల్లికీచకాశ్వద్ధమందారాది భూరుహబంధురంబును, బహుభయంకరంబు నగు మహారణ్యంబునుండి నడిచెడితరుణంబున నం బదియామడల పొడవుగల సర్పం బొండు దారుణగరళమయంబులగు ఫూత్కారంబులతోఁ జనుదెంచి మత్తేభంబుల మ్రింగుటం గని యాదవులు హాహాకారంబులం గావింప భాను, స్వభాను, స్వర్భాను, ప్రభాను, భానుమ, చ్చంద్రభాను, బృహద్భాను, రతిభాను, శ్రీభాను, ప్రతిభానువులనెడి సత్యభామాకుమారులు పదుగురు బహుతీక్ష్ణజిహ్మగంబుల నాజిహ్మగేంద్రంబును ఖండింపఁ దత్కళేబరంబునుండి దివ్యగంధర్వుం డొకండు బయలువెడలి ప్రద్యుమ్నునకు నమస్కరించి సురలు విరులం గురియుచుండ విమానంబెక్కి దివంబున కేగెనని వచింప బహులాశ్వుం డా గంధర్వుం డెవండో యాతని కాఫణిరూపం బేకతంబున వచ్చెనో తెల్పుమని ప్రార్థింప నారదమహర్షి యా రాజర్షి కిట్లనియె. ౫౭౬

ఆ॥ ఆర్ష్టిషేణుఁడనెడి నలఘుగంధర్వుని సోదరుఁడును దివ్య సుందరుఁడగు
సుమతి హనుమదరికి శుద్ధరామాయణమును బఠింపవచ్చెఁ బూర్వమందు.

ఉ॥ ఆతత హేమకూటగిరియందున నాహనుమంతుఁ డా ధరి
త్రీతనుజావిభుండయిన శ్రీదశలక్ష్మణ రామచంద్రు వి
ఖ్యాతినిఁ గల్యమున్ మొదలు యామయుగంబు గతించుదాఁకఁ బూ
జాతతిఁజేసి వర్ణనము సల్పును నిత్యము నట్టివేళలోన్. ౫౭౭

తే॥ అతిభయంకర ఫూత్కృతు లగ్గలముగ ఫణివిధంబునఁజేయుచు భక్తిభంగ
మును ఘటించు నా సుమతినిఁగనుచుఁ గనలి సర్పముగ నీవుగమ్మని శాపమిచ్చె

క॥ అంతట సుమతియు వెత హనుమంతుని పదములను వ్రాలి మన్నింపుము నా
మంతువు భగవంతుండవు తుంతవనగ హనుమ కడుప్రసన్నుం డగుచున్.

చ॥ అరుసముతోడ ద్వాపరయుగాంతమునందున దిగ్జయార్థమై
యరిగెడి కృష్ణపుత్రులు మహాశుగపంక్తినిఁ బాఁపరూపుతో
వఱలెడి నిన్నుఁజెండెద రబద్ధముగా దిది యప్డు నీవు శ్రీ
కరభవదీయరూపమును గాంచెదవో సుమతీ! యథాస్థితిన్. ౫౭౮

చ॥ అని కరుణింప నాసుమతి యారహి సర్పముగా జనించి యా
వనరుహలోచనాత్మభవబాణపరంపర గిట్టె నెమ్మదిన్
గనఁగ మహాత్మశాపము సుఖంబులొసంగు వరంబుగాదె? యో
జనవర! యంత నా కుసుమసాయకుఁ డచ్చటనుండి వేడ్కతోన్, ౫౭౯

సీ॥ ఎచ్చట మానవులేడులు పదివేలు చనుదాఁకఁ జక్కగా మనియుచుందు
రెచ్చటఁ బురుషు లహీనగజాయుతబాధబలంబుతో వఱలుచుందు
రెచ్చటఁ డ్రోతతో నెల్లవిషయముల నీడగుచున్ గాలమెసఁగుచుండు
నెచ్చట నుదకం బమృతముతోఁ దుల్యమై స్వచ్ఛతమంబుగాఁ బాఱుచుండు

తే॥ నెచట నవరత్నముల్ పుట్టు నెచట నిత్యయౌవనవిభూషితలగుచు నతివలుందు
రెచట సర్వభూరుహలత లెచ్చియుండు నల్ల చైత్రదేశములకు నరిగె నవల

తే॥ తత్స్థలంబునకుఁ రాజధాని యగు "వసంతతిలక" యన్ పురినుండి శౌర్యధనుఁడు
విభుఁడు శృంగారతిలకుఁ డాత్మభువుతోడఁ గలహమాడ నేతెంచెఁ జైత్రులనుగూడి

వ॥ అత్తరుణంబున సాంబ, సుమిత్ర, పురుజి, శ్రుతజి, త్సహస్రజి, ద్విజయ
చిత్రకేతు, వసుమ, ద్రవిణ, క్రతువులను జాంబవతీతనూభవులు బదుగురు నెదిరించి
నారాచంబులం బ్రయోగించి జగం బంధమయంబు గావింప వైరులు గోలాహలం
బులం జేయుచుఁ బోరుమాని పాఱఁగడంగుటఁ దద్భూపుండు గాంచి రోషించి

మించి మత్తేభంబునం దధిష్ఠించి త్రిశూలంబు గ్రహించి సాంబుని వక్షంబును బొడిచి కోదండనిర్గతంబులగు కాండంబులతో నితరవీరులను జెల్లాచెదరుగాఁ జెండి మహారణ్యంబునం బ్రవేశించి దహించు వైశ్వానరుని విధంబున నేకకుండయ్యు విజృంభించుట నాలోకించిన గదుం డేతెంచి మదోత్కటంబగు నమ్మాతంగంబుఁ దొండంబునుబట్టి దూరంబున భూతలంబునం ద్రోయ నా శృంగారతిలకుం డిలఁ గూలి క్రమ్మఱ లేచి భయభీతుండై యచ్చటితురగంబులను, లతురథంబులను, నయుతేభంబులను దీసికొనివచ్చి యాప్రద్యుమ్నునకు నర్పించి యొరిగలం గావించె. ఇట్లు కింపురుషఖండం బామన్మథుండు జయించి నిషాదదర్శితంబులగు మార్గంబుల నడిచి క్రమముగా సర్వసంపత్కరంబగు హరివర్షనామకఖండంబున కేగె. ౫౮౫

—♦ ప్రద్యుమ్నుండు హరివర్షంబును జయించుట. ♦—

తే॥ అందు నిషధనామకగిరి యమరు నచట వీరకోదండటంకార ఘోరరవము
లక్కజంబుగ జనియించె నమితభయముఁ గలుఁగఁజేయు నొకానొక కాననుండి

తే॥ క్రోశమాత్రదేహములతోఁ గూడు పెద్ద
గ్రద్దలున్ దీక్ష్ణతుండముల్ గలుగు గరుడు
లరుగుదెంచి క్షుద్బాధతోఁ గరుల హరుల
సైనికుల మ్రింగఁదొడఁగె నా సమయమందు ౫౮౭

తే॥ గగనతలము ఖగంబులం గప్పఁబడుట యాదవులు భీతిచెంది హాహా కృతులను
సల్పుటఁ గని మదనుం డనల్ప పన్నగాశనాస్త్రరాజము వైచె నపుడు వడిని

మ॥ అల బాణంబున వైనతేయుఁడు విహంగాధీశ్వరుం డొంది దీ
ప్తులచే వెల్గెడి దీర్ఘపక్షములతో భూర్యుగ్రకృన్నాసతో
నల దాక్షాయ్యకులింగతార్క్ష్యముల సంహారంబు గావింపఁగాఁ
బులుగుల్ గొన్ని భయమ్ముతో దెసలకుఁ బోయెన్ సఘాతంబులై ౫౮౯

ఉ॥ పిమ్మట నచ్యుతాత్మజుఁడు స్వీయచమూయుతుఁడై దశార్ణదే
శమ్ముల కేగెఁ దద్విభుఁ డసాధ్యబలుండు శుభాంగనామకుం
డమ్మరు చండపౌరుషము వ్యాసముఖంబున నాలకించి క
ప్పమ్ములతో దశార్ణగత భద్రతరంగిణిఁ దాఁటి నమ్రతన్. ౫౯౦

తే॥ మరునిదరిఁ జేరి యా బలుల్ సరగ నిచ్చి యెమపదిజేసె నంత నా యంగజాతుఁ
డా బలిష్ఠు నిష్కౌశాంబి యనెడి రాజధానినుండి యేతెంచిన వానిఁ గాంచి

క॥ ఓయి శుభాంగా! యెట్టుల మీ యవని దశార్ణమయ్యె మేధావి యెవం
డీ యభిధానముఁ బెట్టెనో? యీయెడ వచియింప నాకు నేఁ బ్రార్థింతున్

ఆ॥ అన శుభాంగుఁ డిట్టులాడె నృసింహుఁడు మును హిరణ్యకశిపుఁ బోరి త్రుంచి
భక్తు నతనిపుత్త్రుఁ బ్రహ్లాదుఁగూడి యిట్టి హరివర్షమునకు నేఁగి వచ్చి ౫౯-౩

క॥ నిలిచియుఁ బ్రహ్లాదున కిటు బలికెను శాంతుఁడవు ముఖ్యభక్తుఁడవగు నీ
యలఘుపితఁ జంపితినని కలఁగకుమ! కులక్షయంబు గావింపనుగా ౫౯-౪

క॥ అని ముదమున నను నరసింహుని కన్నులనుండి కారి యుదకంబు లటన్
ఘనమంగళకరమైన కొలనుగాఁ బాఱంగఁదొడఁగె లక్ష్మీప్రపుత్త్రా! ౫౯-౫

తే॥ దాని దర్శించి ప్రహ్లాదుఁడా నృసింహు నిటుల నడిగెనో నరసింహ! యేను పుట్టి
యమ్మనబ్బను సేవింపనైతిఁగాదె యిట్టిదోషంబు లెట్టుల నేగుఁ జెపుమ!

వ॥ అనవుడు శ్రీనరసింహుండు పుత్త్రా! నా హర్షబాష్పంబిట మంగళా
కరంబై సరోవరంబుగా నుద్భవించెఁగాదె! ఇందు మజ్జనం బాచరించి మాతాపిత
లయు భార్యా, సంతాన, గురు, సుర, భూసుర, ప్రపన్నర్షి, పితృదేవతలయు ఋణంబు
లం బదింటిని దీర్చి కృతార్థుఁడవగుము. ఎవండైనను నిందు స్నాతుండైనచో
వాఁ డా దశఋణంబులనుండి విముక్తుం డగునని వచింపఁ బ్రహ్లాదుం డాహ్లాదంబు
బొంది యందు నీరాడి యనృణియై యిప్పటికి నా నిషధాచలంబునుండి యేతెంచి
యందు జలకం బాడి పోవుచుండును. తత్ప్రభృతిఁ దత్తీర్థంబునకు దశార్ణమోచనం
బనియు, దద్దేశంబునకు దశార్ణదేశంబనియుఁ బ్రసిద్ధి గల్గెనని వక్కాణింప నక్కం
దర్పం డెక్కువగా సంతోషించి యాతీర్థంబున స్నానం బొనరించి దానంబులం
గావించె. ఈ దశార్ణదేశచరిత్రంబు వినువా రాపదిఋణంబులఁ దీర్చి ముక్తిపాత్త్రు
లగుదురని చెప్పి వెండియు నిట్లనియె. ౫౯-౬

—♦ మరుం డుత్తరకురుఖండంబును జయించుట. ♦—

చ॥ ఉరసుఁ డతండు మేరుగిరి కుత్తరభాగమునందునున్న యు
త్తరకురుభూమి వృద్ధిసహితంబును దివ్యము శృంగవద్ధరా
ధరవరపార్శ్వభాసురము దద్ద జయింపఁ దలంచి సాఁగి శ్రీ
కరమగు గంగవోన నవగాహనముం బొనరించి యాస్థతోన్ ౫౯-౭

క॥ వారాహీ నగరంబును జేర గుణాకరుఁడు బలుఁడు శిష్టుఁడు దద్భా
దారుఁడు సమ్రాట్టురు సంభారామరమానివరులు భాసిల్లంగన్ ౫౯-౮

తే॥ దశమహాయమేధయాగంబు దమినిఁ జేయఁదలఁచి నీలకర్ణాంచిత ధవళతురగ
మును దశాక్షౌహిణీయుతుఁ దనయు వీరధన్వుఁ దద్రక్షకుగఁ గూర్చి తద్దవిడిచె.

వ॥ అప్పుడు వీర, చంద్రాశ్వసేన, చిత్రగురు, వేగవ, దాము, శంకు, వసు,
శ్రీమ, తుక్కంతులను నాగ్నజితిసుతులు పదుగురు నాలోకించి యా హయంబును
బట్టె యిది విడిచిన వాఁడెవ్వం? డని పలుకుచు స్వసైన్యంబులం జేరం బ్రద్యుమ్నుఁ

డా యశ్వగళంబందలి పత్రంబుఁ గాంచి విస్మయంబుఁ బొంది యాయుధపాణులగు
యాదవులకుం జూపింప వారు నచ్చెరువొందెడి తఱుణంబున. ౬౦౧

ఆ॥ దానిఁ గాచుసేన దత్తురగంబును వెదకికొనుచు వచ్చి మదనసైన్య
ధూళి రేఁగుచుంట దూరంబునం జూచి నిలిచి వింతఁబొంది పలికి రిటుల ౬౦౨

చ॥ సరసుఁడు చండవిక్రముఁడు సర్వనయజ్ఞుఁడు నౌ గుణాకరుం
డఱిముఱినేలు రాజ్యమున నారయఁ బోసులు లేరు జారులున్
వఱలరు గోవులకానజకువారును లేరు ఖలుల్ వసింపరీ
యరుగుసిఁ గ్రమ్ముదుమ్మొచటిదైనది మాకెఱుఁగంగరాదుగా. ౬౦౩

క॥ ఈతఱి వాదిత్రంబులు నాతతకరిబృంహితములు హరిఘోషణముల్
శాతధనుష్టంకృతులన్ భ్రాంతిగ వినఁబడియె నట్టిపరులకు నవలన్. ౬౦౪

చ॥ మదనుని చేతఁ బంపఁబడి మంత్రివరుండగు నుద్ధవుండు త
న్మదయుతవీరధన్వ సవిధంబున కేగి ధరాతలేంద్ర! యా
యదువరుఁ డుగ్రసేనవిభుఁ డానృపసూయముఁ జేయ నెంచి యీ
మదనుని సర్వదిగ్జయ మమందత నల్పఁగఁ బంపె నీతఁడో ౬౦౫

చ॥ ఘనుఁడు మహానుభావుఁడు నఖండబలుం డరవిందనాభనం
దనుఁడును దుర్జయుండగుట దప్పక నీవును గాన్కలిచ్చి వం
దనములఁ జేయఁగాఁ దగును దద్విధి సల్పనిచో సమీకముం
బొనరిచి తీసికోఁగలఁ డమోఘముగాఁగ రదంబులన్ ప్రభూ! ౬౦౬

తే॥ భరతఖండంబు గెల్చి కింపురుషఖండమును జయించి యాహరివర్షమును జయించి
యిచటికే తెంచెఁ గావున నీతఁ డలఁతి గండఁడని యెంచఁబోవక కరము లిమ్మ!

తే॥ యజ్ఞపశువు వెంబడి నిట్టియంగజుండు దీనికొనివచ్చె దీని నే దిట్ట యపహ
రింపఁగలఁడు? సహాయుఁడై కృష్ణుఁ డుండ బలయుతుఁడగు రారాజిడి బలుల మ్రొక్క

ఆ॥ అనఁగ వీరధన్వుఁ డాడె నీవిధంబున శ్రీకుఁ డధికుఁడగు గుణాకరుండు
నల శచీశపూజలందియుండెను గాదె యతఁడు బలులనియ్యఁ డంగజునకు ౬౦౯

క॥ వారాహకారంబున శ్రీరాజితశృంగనద్గిరిని హరి వెలుఁగున్
ధారుణి యతనికిఁ బూజలఁ గూరిమితో సతముజేయుఁ గోర్కులొసంగన్.

ఉ॥ ఆ యచలంబునందు నయుతాబ్దము లట్టి గుణాకరుండు త
త్తోయజనాభునిం గుఱిచి తోరముగాఁ దపమాచరింపఁగా
నాయనఘుండు తుష్టిఁగని యంతికమొంది గుణాకరా! వరం
బేయది నీకుఁ గావలెనొ? యీ యెడఁజెప్పుము! యిచ్చెదం జుమీ! ౬౧౧

చ॥ అనఁగ గుణాకరుండు ముదమంది నమస్కృతులం బొనర్చి యో
వనరుహలోచనా! విను మపారకృపన్ నను నీవుదప్ప నే
ఘనులునుగాని యే సురలుగాని జయింపనిలాగు సల్పవే!
యనఁగఁ "దథా స్తు"టంచుఁ జనె నా గరుడధ్వజుఁ డోయి యుద్ధవా! ౬౧౨

క॥ ఆకారణమున మీరా శ్రీకురుఖండేశుహయముఁ జెచ్చెర విడుఁడీ!
యీకరణిని సల్పినచోఁ దేకువతోఁ బోరి దానిఁ దెప్పింతుఁ జుమీ! ౬౧౩

వ॥ అంతట నుద్ధవుం డతని వీడ్కొని ప్రద్యుమ్నునకు సభాసదులువినుచుండ యావద్వృత్తాంతంబు జెప్ప నందున్న కాళిందీనందనులగు శ్రుతకర్మ, వృష, వీర, సుబాహు, భద్రేకల, శాంతి, దర్శ, పూర్ణమాస, సోమకులను బదుగురును బది యక్షౌహిణులం గొని యాయుధంబుల ధరించి యుత్తరకురుయోధులతోఁ దలపడిరి ఆ యవసరంబున నా యుభయుల కద్భుతంబగు తుములయుద్ధం బయ్యె. అందుత్తర కురుజనులు హతులైరి. తత్స్థలంబున నొండు రక్తతరంగిణి జనించె. హతశేషు లగువారు శరత్కాలమేఘసంఘాతంబు విచ్చిచనినభంగి నలుగడలకుఁ బఱుగిడిరి. ఆకుమారులందుఁ బూర్ణమాసుండను బలుండు వీరధన్వుని స్యందనంబును బాణసంతతితోఁ జూర్ణీకరింప నాతండు విరథుండయ్యు ధనుష్టంకారంబులం గావించి యేకవింశతిమార్గణంబులతోఁ బూర్ణమాసునిం బ్రహరింప నశం డవ్వానిని నడుమనే నిజబాణంబున ఖండింప నా వీరధన్వుం డాతవి మార్వినిఁ గువాక్యంబులచే మిత్రత ఖండించినట్లు ద్రుంచె. తత్సమయంబునఁ బూర్ణమాసుండు పూర్ణరోషంబున లక్షభారభాసురగదంగొని యాతనిం గొట్ట నా వీరధన్వుండు నొచ్చి వడిని పరిఘంబుఁ గొని ప్రహరింప నా పూర్ణమాసుండు పవననామకగిరిం బెకల్చి బల్మిం ద్రిప్పి యతనిపై వేయ నది యా వీరధన్వునిం గొనిపోయి తద్వారాహీనగరమందలి యజ్ఞవాటికలోఁ బడవేసె. తత్పురియందు హాహాకారంబు లుప్పతిల్లె. నరామర దుందుభిరవంబులు జెలఁగ సురలు విరులా పూర్ణమాసుపైఁ గురిసిరి. తజ్జనకుండగు గుణాకరుండు రుధిరంబు గ్రక్కి మూర్ఛితుండై ముంగలనున్న వీరధన్వుం గాంచి క్రుద్ధుండై కోదండంబుఁ గైకొని యుద్ధం బొనరింపనెంచి నిర్గమించుట సర్వజ్ఞుండును దద్యజ్ఞహోతయు నగు వామదేవమహర్షి గని యతని కిట్లనియె. ౬౧౪

క॥ ఎఱుఁగక పోయెద వేలా? మఱలుము నామాట వినుము మాధ్యము దగునే?
పరిపూర్ణతముండును శ్రీధరుఁడగు శ్రీకృష్ణుఁ డరుల దనరెడి నతఁడో ౬౧౫

క॥ ధరణీభారముఁ బాపఁగ సురలకు నుపకృతులఁ జేయ శ్రుతిధర్మములన్
స్థిరముగ నిల్పఁగ భక్తులఁ గరుణన్ రక్షింపఁబుట్టెఁగద యాదవులన్ ౬౧౬

తే॥ ఆతఁ డుగ్రసేనునకు సహాయుఁడగుచు దిశలగెల్వ ద్వారకనుండి దివ్యబలుని
స్వసుతుఁ బ్రద్యుమ్ను వీనినిఁ బంపెనంచు నెఱుఁగుమనఁగ గుణాకరుఁడిట్టులనియె.

తే॥ సుముని! కృష్ణుఁడు పరిపూర్ణతముఁ డటంచు
నవ్యముగ వింటిఁ దల్లక్షణంబు లెవియొ ?
తెల్ప వేఁడెదనన వామదేవమౌని
యా గుణాకరునను నిట్టులాడె జనక! ౬౧౮

ఆ॥ ఎవని తేజమందు నెల్ల తేజంబులు నరిగి లీనమగునొ యట్టి దేవు
నిఁ బరిపూర్ణతముగ నిఖిలవిద్వాంసులు బలుకుచుందురయ్య పార్థివేంద్ర!

తే॥ పూర్వమందున వ్యాసాది మునులు సేరి షడ్విధావతారంబుల శౌరి యెత్తు
టంచు నిశ్చయించిరిగాదె యందునఁ బరిపూర్ణతముఁ డధికుండగు భూవరేణ్య!

క॥ ఆ పరిపూర్ణతముండే యీ పురుషోత్తముఁ డటంచు నెఱుఁగుమ! యతఁడో
యేపనికో యరుదెంచియు నోపికతోఁ గోటికృతుల నొనరిచె భువిలోన్.

చ॥ అనవుడు తద్గుణాకరుఁడు నట్టి హరిప్రతిభా ప్రభావముల్
విని ముదమంది వైరమునువీడి బలుల్గొని వేగ నేగి యా
మనసిజుఁ గాన్కలిచ్చియు నమస్కృతులం బొనరించి గద్గద
స్వనమున నిట్టులన్ బలికె బద్ధకరుం డయి మైథిలేశ్వరా! ౬౨౨

ఉ॥ ధన్యతఁ జెందె నాకులము ధన్యతఁబొందెను మత్ప్రభుత్వమే
ధన్యుఁడనైతి మత్స్వవనధర్మము లెల్లను ధన్యమయ్యె నో
మాన్యచరిత్ర! సాధుజనమైత్రి మఱిన్ బరిమార్గలక్షణా
నన్యభవత్పదాంబుజమహా నన్యసుభక్తి యొసంగి ప్రోవవే! ౬౨౩

ఉ॥ నావుడు భక్తవత్సలుఁ డనాథజనావనతత్పరుండు శ్రీ
దేవకుమారుఁ డా మరుఁడు తృప్తినిఁబొంది విరక్తివిశ్వలన్
గేవలమైన భక్తియును గీర్తిమామకభక్తమైత్రియున్
గావుతమంచు యజ్ఞతురగంబు నొసంగెను వానికో విభూ! ౬౨౪

—♦ ప్రద్యుమ్నుండు హిరణ్మయఖండంబు గెలుచుట. ♦—

క॥ అంత హిరణ్మయఖండప్రాంతములను గెలువ నల్ల ప్రద్యుమ్నుం డ
త్యంతజనంబునఁ జనె యదుసంతతులున్ వెంటనడువ సంతోషముతోన్

చ॥ అల భువిఁ గాంతికాంతమును నాయతమౌ నొక స్రోతనామకా
చలము సెలంగుచుండు నట శౌరిజనించెను గచ్ఛపాకృతిన్
బొలుచును నర్యముం డనెడి పూజరి తద్దరిమందిరంబునన్
వెలఁగెడి పుష్పమాల యను ద్వీపవతీమణి తత్థలంబునన్. ౬౨౬

తే॥ తన్నదీతీరమందున దండియడవి కందమూలఫలాదులఁ గలిగి వెలుఁగు
నావనంబున నల నీలులనెడి కపులు రామునాజ్ఞ వసింత్రు స్వప్రజనుగూడి

ఆ॥ అవ్వి తన్మదనబలారవంబు ల్వీని మిగుల కినుక రేగి యెగిరిపడుచు
వాలములను గోళ్ళఁ బండ్లను దశ్సైన్యహయరథేభములను హతమొనర్చి

క॥ విజయధ్వజనాథుండగు విజయుని యరదంబుఁ దోఁక బిగిచికొని దివిన్
గజిబిజిఁదిరుగ నల కపిధ్వజుధ్వజమున నున్న హనుమ ప్రత్యక్షముగాన్ ౬౨౯

ఆ॥ నిర్గమించి కసిని నిఖలవానరులను దోఁకతోడఁగట్టి పీఁకభువిని
నెట్ట నట్టికపులు నెమ్మికి రామకింకరుఁడు హనుమయంచుఁ గరములెత్తి

సీ॥ కొందఱు వానరుల్ సెంది యానందంబు భక్తితోఁ జేసిరి వందనములఁ
గొందఱు వానరుల్ గొంకక ముద్దాడి యయ్య! నిన్గని చిరమయ్యె ననిరి
గొందఱు వానరుల్ గోర్కె లీరికలెత్తి గంతులవేసిరి సంతసమున
గొందఱు వానరులందరు కుశలులా? యంచుఁ దమినిఁ గౌఁగిలించుకొనిరి

తే॥ మఱియుఁ గొందఱు మనసార మాటలాడి రవల నాంజనేయుఁడునిజహస్తతలము
తోడ నాకపులందఱ దువ్వి కుశలమడిగి సంతుష్టిఁగూర్పఁగ నట్టి కపులు ౬౩౦

ఆ॥ అతని యాజ్ఞఁబొంది యాత్మచిత్రాటవి కరుగుచెంచి రల్ల యాంజనేయుఁ
డర్జునుని పతాకయందు నంతర్ధానమయ్యె మైథిలేశ! యచటనుండి. ౬౩౨

క॥ మకరాచల వరభాసుర మకరావని గెలువఁ బటహమండలి మ్రోయన్
స్వకసైన్యసమేతుండగు మకరధ్వజుఁడేగె వడిని మానవనాథా! ౬౩౩

చ॥ పదపడి నట్టి యచ్యుతుని పట్టి బలంబులఘోషణంబులన్
దదచలపార్శ్వమందు మధుధారలఁ గ్రోలుచు సంచరించు ష
ట్పదములు గోట్లకొల్ది నొకసారిఁ జివుక్కున లేచి మూఁగి త
న్మదకరిరథ్యయోధుల నమందముగాఁ గఱవం గడంగుటన్ ౬౩౪

క॥ కని మరుఁడున్ బవనాస్త్రంబును వేయుచు నవ్వి నాల్గుమూలల కేగన్
బొనరిచె భూవర! యచ్చటి జనములు మకరాస్యులంచుఁ జక్కనెఱుఁగుమా!

వ॥ అంత రతికాంతుం డటనుండిసాఁగి డిండిమ దేశంబున కేగి గజముఖులగు నచ్చటి జనంబులం గాంచి యట నిర్గమించి త్రిశృంగ దేశంబుల కరుదెంచి శృంగ ధారులగు నందలి మనుజులం జూచి త్రిశృంగగిరిపరిసరభాసురంబును భర్మహర్మ్యమయంబును, సకలాలంకారాలంకృతంబునునై బంగరురంగున వెలుంగు పురుషుల తోడను మించువలెమించు మెలఁతలతోడను నాగనాగాంగనావృతభోగవతీ నగరంబువలె నొప్పారు స్వర్ణచర్చికయనునగరంబున కమరావతీపురంబునకుం జను సురేంద్రునిమాడ్కి నరిగె. తద్విభుండగు దేవసఖుండు మన్మథుంబునఁ దత్పరిద్యు

మ్నాగమనబలాదుల నాలకించి బలులఁగైకొని వచ్చి పూజించి సమర్పించి నమస్క
రింప నమ్మరుం డానందంబు బొందె భూవరా! నీవును నీపరిజనులకును జంద్రిసమంబగు
కాంతి యేకతంబున గల్గెనో యానతిమ్మని కోర నతండు దేవా! పితృపతియగు
నర్యముండు కూర్మరూపధారి యగు హరిపాదంబులం బరితోషంబు జేసె. తజ్జలం
బిట మహానదియై శ్వేతాచలంబుమీఁదుగాఁ బ్రవహించుచుండు. ఈ స్థలంబునం
బరిమేధుండను మనుకుమారుండు నిశీథంబున సింహభ్రాంతిని గపిలఁ జంపి వసిష్ఠ
మహామునిచే శప్తుండై శూద్రయోనిం బుట్టి కుష్ఠరోగంబుతో నొచ్చుచు సంచ
రించుచు నొకానొక సమయంబునం దన్మహానదిని స్నానం బొనరించి శాపరోగ
విముక్తుండై పూర్ణచంద్రతుల్యస్వచ్ఛశోభతోఁ జెన్నారె. తత్కారణంబున నీనదికిఁ
జంద్రకాంత యని నామంబుగల్గె. తత్తరంగిణిని మేమును జలకం బాడుటచేఁ దద్రీతిఁ
గాంతి మాకుఁ జేకుఱెనని వచింప వినిన మన్మథుండానందించి యాశైవలిని స్నానం
బొనరించి దానంబులం గావించె. ౬౩౬

## —♦ ప్రద్యుమ్నుండు రమ్యకఖండంబును గెలుచుట. ♦—

తే॥ ఇటు హిరణ్మయఖండం బహీనశక్తిఁ గాముఁడు జయించి దేవలోకంబునోలెఁ
జెలఁగు రమ్యకఖండంబుఁ జేరె నందు నీలనామకవరగిరి గ్రాలుచుండు ౬౩౭

ఆ॥ దానికుత్తరమునఁ దనరెడి కాలదేశంబు దానియంతికంబునందు
భీమనాదిని యను పెదవురిఁగాలనేమిసుతుఁడగు కలంకుఁ డెసఁగి యేలు. ౬౩౮

క॥ ఆరక్కసుండు త్రేతను శ్రీరాముని దెబ్బ నొచ్చి చెచ్చెర భీతిన్
బాఱి యిచటి కరుదెంచి సురారాతులతోడఁగూడి యధివసియించెన్ ౬౩౯

క॥ ప్రద్యుమ్నరాక నాతఁడు సోద్వోగులవలన వినుచు నుగ్రతను ధను
ర్విద్యాపారగులను ననవద్యబలాయుతనిశాటవర్యులఁ గొనుచున్ ౬౪౦

చ॥ ఖరమున నెక్కి దేహ మురుకాలరుచుల్ బఱపంగఁ జాపము
ద్గరశరశక్తియుక్తుఁడయి తద్యదుసేనలతోడఁ దాఁకె న
త్తఱిఁ గడు వారి కిర్వురకు దారుణవిగ్రహమయ్యె వేల్పు లం
బరమునఁ జూచి వింతపడి వైచిరి ముక్కుల వ్రేళ్లు భూమిపా! ౬౪౧

వ॥ అత్తరుణంబునఁ బ్రఘోష గాత్రవ న్సింహ బల ప్రబ లోర్ధ్వగ సహౌజ
మహాశక్త వరాజితులను లక్ష్మణాకుమారులు బదుగురును దమమొన కగ్రిభాగం
బునందు నిలిచి తీక్ష్ణశస్త్రంబులతోఁ బ్రత్యర్థిరథిసారథిరథరథ్యధ్వజంబులం బ్రహ
రించి ఝంఝామారుతంబులు ఘనంబులం బారఁద్రోలినవిధంబునఁ జెల్లాచెదరుగా
నొనర్ప నా రక్కసు లక్కసునఁ ద్రిశూలముద్గరాదుల నెదురుల నెదిరించెడినద
నునఁ గలంకుం డేతెంచి రోషించి, ౬౪౨

క॥ శరముద్గరాసిశక్తుల నరిరథిసారథిమదేభ హయవక్త్రములన్
బఱపియు ఘంటాదియుతద్విరదములన్ గాళ్ళఁబట్టి వేసెను దివిపై ౬౪౩

ఉ॥ అంతఁ బ్రఘోషుఁడన్ వనరుహాక్షునిపుత్రుఁడు వానరాస్త్ర మ
త్యంతబలంబులన్ విసర నందుఁ గపీశ్వరుఁ డాంజనేయుఁడున్
వింతగఁబుట్టి వాలమున ద్వేషులఁ గట్టియు వందయామడల్
బంతముతోడఁ బంచె దివి వాయువు దూదినిఁ బంచినట్టులన్. ౬౪౪

చ॥ పిదపఁ గలంకదైత్యపతి వీరుని నాతని నాంజనేయుఁడం
చెదను దలంచి మేఘము రహిన్ లలినార్చుచు లక్షభారభృ
ద్గదఁ బ్రహరింప నా కపి గదాభువిలోనికి దూఁకి ముష్టితోఁ
జదియగఁ గొట్టి వానిని వెసన్ హరియించెను దక్షిరీటమున్. ౬౪౫

క॥ అప్పుడు తదాత్రిశపతి గొప్ప త్రిశూలంబు వాని కుత్తుకనఱుకన్
దెప్పున వైచినవెంటనె యప్పరమకపీశుఁ డెగిరి యతివేగమునన్. ౬౪౬

తే॥ వాని పృష్ఠదేశంబెక్కి బాహువులను బట్టి భువిఁగూల్చి వైడూర్యపర్వతంబు
బల్మిఁ బెకలించివైవ నబ్బలుఁడు దాన జర్జరీకృతదేహుఁడై సమసె నపుడు

ఆ॥ జయజయస్వనములు సర్వదిక్కులనయ్యె శంఖదుంధుభులును జాలమ్రోసె
నంజనీకుమారుఁ డటనె యంతర్ధానమయ్యె విరులఁ గురిసి రమరవరులు. ౬౪౭

## ——♦ ప్రద్యుమ్నుండు మానవదేశంబున కేగుట. ♦——

క॥ మనసిజుఁ డంతట నిజసేనను గొని యటసాఁగి మనుజ నాయకయుతమున్
గనకమయంబు మనోజ్ఞంబును నగు మనుపట్టణంబుఁ బొందెను నందున్. ౬౪౮

సీ॥ కామఫలప్రదకల్పవృక్షయుతంబు గల్పవల్లీపంక్తిగాఢతరము
నామోదవహనశీలానిలయుక్తంబు మాధవీకేతకీ మండితంబుఁ
శుకశారికాముఖవిహగకూజితమును షట్పదఝుంకార సంకులంబు
గమలకుశేశయ కమ్రదళసహస్ర కాసారతిలకప్రకాశితంబు

తే॥ సకలసుమఫలవల్లరీ సముచిత మఖిలర్తుపుష్పశోభితము ధిక్కృతసురేంద్ర
నందనవనంబు వైకుంఠసుందరంబునైన నైశ్రేయసారణ్య మతిశయించు

తే॥ అరుధిపర్వతరీతిని నైదువందలామడలు లంబమును వందయామడలును
విస్తృతముగల్గి యాకానవెల్గు దాని యందమునుగాంచి యేతెంచునట్టి జనుల.

చ॥ మదనుఁడు సూచి యిట్లడిగె మానవులార! యిదేపురంబొ? యే
రిదో? వన మిద్ది యెవ్వరిదో? చెప్పుముగా వచియించుఁడీ! శనన్
ముదమును గొల్పుచుండె నిది పూర్తిగ మాకన వారలందఱో
యదువర! నీవు మాపలుకులన్నియు శ్రద్ధగ నాలకింపుమా! ౬౫౧

క॥ వైవస్వతుఁడను మనువొకఁ డీవేళ వెలుంగు నాతఁ డిద్ధము శృంగా
రావృతమానసగిరిఁ జని భావమునన్ నిల్పి మాత్స్యవరరూపి హరిన్ ౬౫౩

చ॥ సతము దపంబు జేసెడి విచారణసల్పిన నీ పురోత్తమం
బతనిది యీ మహావనము నాతనిదే మఱి యీ ధరాతలో
న్నతతమమానవాద్రులు ఘనంబగు విష్ణుజగంబునుండి య
ప్రతిహతరీతిఁ దీసికొని రాఁబడె మున్ను మహాత్మ! వెండియున్. ౬౫౪

తే॥ సూర్యచంద్రవంశంబుల శూరత నిలఁ బొలుచునట్టి మీరంపఱు భూరమణులు
నతని వంశంబునందున నవతరింప రొక్కొ? నాపుడు ప్రద్యుమ్నుఁ డొంది వింత.

సీ॥ మానవదేశస్థ మానవగిరిపైని సింహాసనంబునఁ జెలఁగువాని
యోగీశ్వరులును నోహో యనన్ మెచ్చెడి యోగమ్ములన్ జేసి యొప్పువాని
దిగ్దేశకంబును దీపింపఁ జేసెడి నిజశతరుచులతో నెసఁగువాని
శుకవసిష్ఠవ్యాస సురగురుముఖముని వితతితో హరికీర్తి వినెడివానిఁ

తే॥ దమకు నందఱకుం బ్రపితామహుండునైనవాని వైవస్వతమానవేంద్రుఁ
బరమ శాంతస్వరూపుని భ్రాతృయాదవులను దోడ్కొని చని కని నలిపెనతుల

క॥ మను వేతెంచిన మదనుని గనుఁగొని తనగద్దె డిగ్గి ఘనమగు సింహా
సనమిడి భయభక్తులతోఁ వినతుల నొనరించి యిట్లు వేఁడఁ దొడంగెన్ ౬౫౮

సీ॥ ప్రద్యుమ్నుఁడవు నీవు వాసుదేవుఁడ వీవు సంకర్షణుఁడవీవె శౌరిపుత్ర!
యనిరుద్ధుఁడవు నీవె యంగజాతుఁడవీవ యలరువిల్తుఁడవీవె యంబుజాక్ష!
గోపకపతివీవె గోపాలకుఁడవీవ గుణరహితుఁడవీవె ప్రణుతచరిత!
బ్రహ్మాండపతివీవె పరమాత్ముఁడవునీవె శ్రుతిబోధితుఁడవీవె సూరిగేయ!

తే॥ ఆదిమధ్యాంతరహితుండ వాదిపూరుషుఁడవు శాశ్వతుండవు దివ్యసుందరుఁడవు
దేవదేవ! మహాదేవ! దేవవంద్య! సన్నుతించెద మ్రొక్కెద సతము నిన్ను

తే॥ గగనపావకవాయువుల్ గలశకాష్ఠ పాంసువులఁ జిక్కువడనట్లు స్ఫటికమరుణ
కాలపీతవర్ణముల వికార మొందనివిధి గుణములఁ జిక్కక నీవు దగవె? ౬౫౯

తే॥ మాయస్వవశంబు నొనరించి మహితశక్తి భువనముల్ మాటిమాటికిఁ బుట్టఁ బెరుగ
గిట్టఁ జేయవె? ప్రళయమం దట్టులుండి సర్వమును జూచుచుండవె? సత్స్వరూప!

వ॥ వ్యంగ్యంబులకుఁ గాని లక్షణలకుగాని స్ఫోటపరాయణులకుగాని ధనులకు
గుణంబులకుఁ గాని జ్ఞానేంద్రియంబులకుఁ గాని తెలియంబడక కాలంబనియుఁ గర్మం
బనియుఁ గర్తయనియు సాంఖ్యంబనియు యోగంబనియు బ్రహ్మంబనియు మఱియు
నానావిధంబుల నెవ్వాండు వర్ణింపఁబడుచుండునో యెవ్వనినుండి శ్రుతిమనోబుద్ధిచిత్తా
హంకారాదు లగ్నిం బ్రవేశింపఁ జాలక మరలెడి విస్ఫులింగంబులకరణిఁ దిరిగి యేతెం

చునో యెవ్వఁడు హిరణ్యగర్భుండను నామంబుతోఁ బరగుచు వాసుదేవుండని కొని యాడుచుండఁ బరిభ్రమించుచుండునో యట్టి నిన్ను గుఱ్ఱెఱింగియే యసంగుండవై సంచరించుచున్నవాఁడనని పలుక నయ్యేలరువిల్తుండు మందహాసం బొనరించి మధురంబులగు భాషణంబులతో మోహింపఁజేయువానివలె నిట్లనియె. ౬౬౧

ఉ॥ మాకు గురుండవై నృపతిమండలి కాదివిభూత్తముండవై
మాకుఁ బితామహుండవయి మా నుతిపూజలకర్హమూర్తివై
మా కులవృద్ధువై యిటుల మమ్ము నుతించుట చిత్రమయ్యెడిన్
మీ కరుణాభిలాషులము మేముగదా కొనుమా! ప్రణామముల్ ౬౬౨

తే॥ ధర్మమూర్తివి నీదు పుత్రకుల మమ్ముఁగాంచి ప్రోవుమ! తపమాచరించి నీవు జగముఁ గాచుట లేదె నీసాటిసాధువెవఁడు గలఁడిలఁ జెప్పుమా! యెఱుకపడఁగ

తే॥ భాస్కరుఁడు బాహ్యతమమును బాపుఁగానిలోనితమమునుబాపఁగాఁ బూనఁడట్టి దాని కీవు చాలినవాఁడవో నుతాత్మ! యంచు మ్రొక్కి తద్గిరినుండి యవతరించె

తే॥ ఇటుల రమ్యకఖండంబుఁ ద్రుటి జయించి మన్మథుండు తత్స్థలినుండిమరలి మేరుగిరికిఁ దూర్పున నుండెడి కేతుమాలఖండమున కేగెఁ బరివారకలితుఁడగుచు

## —♦ ప్రద్యుమ్నుండు కేతుమాలఖండంబును జయించుట. ♦—

ఆ॥ అచట మాల్యవంతమనుగిరి మఱి జతుర్నామ్ని యనెడిగంగ నవ్యమగుచుఁ
జెలఁగు నట్టికొండచెంత మన్మథశాలిని యను పురవరంబునెగడు నందు ౬౬౩

తే॥ దివ్యపీతాంబరధరలు నవ్యనిత్యయౌవనవిభూషితలు పుష్పహారకత్రము లువిదలు శరీరపరిమళం బొక్కనందయామడలఁ దాఁకఁ బర్వుచు నధివసింత్రు

ఆ॥ మారసుందరులును శారదేందీవరశ్యాములుత్తములును సారసాక్షు
లునగు పురుషులుంత్రు గనుఁగొనఁగా నది దేవపురమువోలెఁ దేజరిల్లు

తే॥ అప్పుడా కేతుమాలఖండాంతరమునఁ గాపురముఁజేయు జనములా కంతురాక విని చుఁబరమముదంబున వెడలివచ్చి యతనికిన్ మ్రొక్కి భక్తితో నాడిరిట్లు

సీ॥ ఎవ్వఁడగమ్యుఁడో యెవ్వఁడచింత్యుఁడో యెవఁడప్రమేయుఁడో యెవఁడుపరుఁడో
యెవఁడాదిదేవుఁడో యెవఁడుచిన్మాత్రుఁడో యెవఁడుసద్రూపియో యెవఁడుఘనుఁడో
యెవఁడుదయాళుఁడో యెవఁడుభూతేశుఁడో యెవ్వఁడనంతుఁడో యెవఁడుబలుఁడో
యెవ్వఁడుస్రష్టయో యెవఁడువైకుంఠుఁడో యెవ్వఁడురుద్రుఁడో యెవఁడు విభుఁడో

తే॥ యెవఁడు భూభారనాశకుఁ డెవఁడు వేదశాస్త్రసన్నాశ్రమాచార సర్వధర్మ
రక్షకుండెవ్వఁడో వాని రాధికేశుఁ గృష్ణుమ్రొక్కుచునుంటిమో కృష్ణపుత్ర!

సీ॥ జనియించి పితరుల సంతసింపఁగ జేసి గోకులంబంతయు సాఁకలేదె ?
దోఁగి యశోద సంతోషింపఁగా సల్పి పూతనాదులఁ జావమోదఁలేదె ?
యాఁ తేండ్లబిడ్డయై యాడి గోపికలతో బృందావనిన్ విహరింపలేదె ?
యచలవరంబును నంగుళితో నెత్తి యింద్రుఁగూడను ధిక్కరింపలేదె?

తే॥ పసులఁగాచుచు నఘధేనుబకముఖాసురులను ద్రుంచింపలేదె? యబ్బలునిఁగంసు
రూపుమాపఁడె! నీతండ్రి శ్రీపతియని యానుపూర్విగహరియశమాడి మఱియు.

తే॥ అట్టి యుగ్రసేననృపసూయార్థ మఖిల దిగ్జయము సల్ప నిజసుతు దేవదేవు
నిన్నుఁ బంపఁడె యాహరి నీవు సకలనృపుల గెల్చియే తెంచవే? యిటకు దేవ!

ఆ॥ ఇపుడు మిమ్ముఁజూచి యేము ధన్యులమైతిమయ్య! యనఁగ మదనుఁడట్టివారి
కాదరమున మనగజాశ్వపుంతలమణిభూషణముల నిచ్చె భూనరేణ్య! ౬౭౩

తే॥ అట్టి రాజధానిని నొక్క యబ్దమొక్కదినముకై వడి గడపెడి మనసిజునకుఁ
దద్విభుఁడు హరిజాపతి బలితండముఁగొనివచ్చి యిచ్చియుఁ బ్రణమిల్లె భక్తినవల

తే॥ పరులు సొరరానిదియుఁ బ్రజాపతితనయులు సొరఁగఁదగినది శృంగారసురుచిరంబు
నైనకామవనంబునకరిగె మరుఁడు యానవభ్రాతృసైనికు లనుసరింప ౬౭౪

తే॥ అట్టి కామవనంబున నంగజాస్త్ర తేజములవెలు సుందరుల్ దివ్యగర్భ
మొందె వెంటనేకనెవరో యుర్వీరేశ! యిట్టియారామమొందైన నెఱిఁగితివొకో?

ఆ॥ ఆవనంబునుండి యపరకందర్పుండు పుష్పచాపవరముఁ బూని పీత
పటముఁగట్టి పంచబాణములను దాల్చి యేగుదెంచి విల్లునెక్కు పెట్టె. ౬౭౭

క॥ ఆరవమును విని యాదవవీరవరుల్ మిగుల కామవిహ్వలు లగుచున్
వారణహయములతోడుత ధారణిపైఁ గూలిరయ్య తత్పరముందున్ ౬౭౮

క॥ అల రుక్మిణీకుమారుఁడు లలితాంగుఁడు మన్మథుండు లక్షణయుతుఁడై
వెలిఁగెడి తత్స్మరులోపలఁ గలిసెను జలమున జలంబు గలసినభంగిన్ ౬౭౯

క॥ అత్తఱి యాదవులందఱుఁ దత్తజపాటును ద్యజించి తత్కృష్ణసుతున్
జిత్తభవున్ బూర్ణుండని చిత్తములం దెఱిఁగి వింతఁజెందిరి పిదపన్ ౬౮౦

ఆ॥ ఈ తెఱఁగున మరుఁడు కేతుమాలాహ్వయఖండమును జయించి కదలి యచట
భవ్యయోగమయము భద్రాశ్వఖండంబుఁ బొందె దుందుభులు మ్రోయ నందు.

—♦ ప్రద్యుమ్నుండు భద్రాశ్వఖండంబును గెల్చుట. ♦—

సీ॥ కనులపండువఁ జేయు గంధమాదన మను పర్వతంబొక్కటి వఱలుచుండు
భూతాద్యుపద్రవములను ధ్వంసముసల్పు సీతయన్ గంగయుఁ జెలఁగుచుండు
దివ్యహయగ్రీవదేవభాసురము వేదస్తోత్రరాజంబు దనరుచుండు
తద్ధయగ్రీవపాదయుగదాసుఁడు ధర్మసుతుఁడు భద్రశ్రవపతి వెలుంగు

తే॥ నల్లగంగాతటంబున యాదవులును హేమపటమయశిబిరము లిసుకతిన్నె
లందు వేసిరి పిమ్మట నట్టిఖండమేలు భద్రశ్రవుఁడు తత్ప్రవృత్తిని విని. ౬౮౨

చ॥ బలుల గ్రహించి యామరుని భక్తినొసంగి శిరంబుతో నతుల్
సలిపి యిటుల్వచించె హరిజా! పరిపూర్ణతమావతార! నీ
విల ఖలశిక్షణార్థమయి స్వేష్టజనావళిరక్షణార్థమై
కలుఁగవె? దిక్కులం గెలువఁగాఁ దమి నిట్టుల నేగుదెంచవే? ౬౮౩

ఉ॥ ఈవల శంబరాసుర వధింపవొకో? శకటస్థు నుత్కచా
ఖ్యావృతుఁదత్కనీయు ఖలు నాహరి గోకులమందుఁ ద్రుంపఁడే?
దేవ! యిఁకన్ దదగ్రజుఁడు దీనుల మానుల నాదితేయుల
న్వావఁగ మోఁదుచున్ శకుని నామముతో దిరుగాడు నియ్యెడన్ ౬౮౪

తే॥ కాన మీరలు వానిని గష్టమనక చంపవలయును నితరులో చంపఁజాల
రనఁగఁ బ్రద్యుమ్నుఁడో ధర్మతనయ! వాని వంశబలవసతిస్థితుల్ బలుకవయ్య!

వ॥ అనవుడు భద్రశ్రవుండో మహాప్రభూ! తొల్లికశ్యపమహర్షికి దితియందు
హిరణ్యకశిపుహిరణ్యాక్షులను నిరువురు రాక్షసులు జనించిరి. అందుఁ గనిష్ఠుండగు
హిరణ్యాక్షునకు శకుని, శంబర, వృష్ట, భూతసంతాపన, వృక, కాలనాభ, మహా
నాభ, హరిశ్మ, శ్రూత్కచులను దొమ్మండుగురు కుమారులు పుట్టిరి. వీరలు దేవ
కూటంబునకు దక్షిణంబున జఠరగిరికిఁ గ్రిందనున్న చంద్రావతీపురంబునం దుం
దురు. శకుని మిగిలిన యార్వురు తమ్ములతోఁగూడి తత్పురిని వసించుచు మహర్షులు
యజ్ఞంబులఁ బ్రారంభము జేసినపుడెల్ల వచ్చి తద్భంగంబులం గావించి బాధించి
చనుచుందురు. వీనియుగ్రత కింద్రాదులుసైతము గుందియుందురు. కాన నిట్టిదుష్టుం
డు నీకు వధ్యుండు. నీవు గోశ్రుతియజ్ఞసాధువిప్రభక్తరక్షణార్థంబై జన్మించితివిగాదె
నానతులం గ్రహించి నా విన్నపమాలించి యొనర్పుమని ప్రార్థింప నప్ప్రద్యుమ్నుం డంగీక
రించి యతని కభయంబిడి సైన్యయుక్తుండై తచ్చంద్రావతీపురంబున కరిగె. అంత
నా ప్రద్యుమ్నాగమనబలాదులను దైత్యపుంగవుండగు శకుని నాచే విని కనలి
దానవసభం గావించి యందు శూలమెత్తి సభాసదులకు నిట్లనియె. ౬౮౬

ఉ॥ దానవులార! నేఁడఖిల దైత్యులసూదును నాకు వైరియా
సూనశరుండు వచ్చెడిని జూడుఁడి? నాయనుజన్ము శంబరా
ఖ్యానిమిషారినిన్ దునిమినట్టి బలుండితఁడే సుమీ తొల్లిన్
వీనినిఁ జంపి యంత నలవేల్పులపెద్దను రూపుమాపెదన్. ౬౮౭

క॥ కావున మీరాగ్రహమునఁ దీవరముగఁబోయి వాని దీర్ఘబలంబుల్
బోవఁగ నెట్టుఁడి! కొట్టుఁడి యేవిధినా యయాదవముగ నిలఁజేయవలెన్.

## —♦ వృకుండను కృష్ణపుత్త్రుండు హృష్టదైత్యునిం గూల్చుట. ♦—

చ॥ అనవుడు హృష్టనామకమహాసురుఁ డన్నఋణంబుఁ దీర్చుకో
ర్కొని నిజదైత్యకోటిఁ గొని శ్రీవిభుపుత్త్రకుఁడైన మారుతో
డని నొనరింపఁగాఁ జనియె నావల నంగజుఁ డాత్మకీయసే
నను బ్రసుటిలోన గృధ్రరచనం బొనరించె విలాసరీతిగాన్ ౬౮౯

వ॥ తద్గృధ్రవ్యూహచంచుస్థానంబునం బ్రద్యుమ్నుండగు ననిరుద్ధుండును తద్గ్రీవంబున నర్జునుండును దత్పృష్ఠంబున సాంబుండును దత్పాదంబులను దీప్తిమద్గదులును దదుదరంబునం బార్ష్ణియు దత్పుచ్ఛంబున భానుండును బొల్పారిరి. అంత నా యుభయులకు నబ్ధులకబ్ధులకుం బోరైనట్లు తుములయుద్ధం బయ్యె. అందు దైత్యులు బాణకృపాణశూలత్రిశూలముసలముద్గరతోమరాద్యాయుధంబులను వారిదంబులు జలబిందువులం గురిసినట్లు వర్షించిరి. ప్రావృట్కాలంబున జలదంబులు జలజాప్తునిఁగప్పిన ట్లాసైన్యరజంబులు సూర్యాకాశమండలంబులం గప్పె. ఇట్టి సమయంబున వృకహర్షానిలగృధ్రవర్ధనోన్నాదమహాశపావనవహ్నిక్షుదులను మిత్రవిందానందనులు బదుగురు నేతెంచి యరులతోఁ జలపడిరి. అందు వృకుండను హరిసుతుండు సైన్యంబుల కగ్రమందు నిలిచి పలుమాఱు ధనుష్టంకారంబులం గావించి యరిహరికరిరథరథిసారథిపతాకాదులం జెండి చెకపికలాడ నా దైత్యోద్భటులు గొందఱు భిన్నపాదులై హతపాదపంబులభాతిఁ బడిరి. కొందఱు హతభాండంబులవలె నానారీతులం దెగి కూలిరి. మఱియు గజంబులు ఛురికావిద్ధంబులగు కూష్మాండఖండంబులలీల రెండుతుండెములై పడియె. అత్తఱి హృష్టుం డాలోకించి సింహారూఢుండై యేతెంచి రోషించి, ౬౯౦

చ॥ హరిసుతుఁడైన తద్వృకుని యశ్వములన్ జతురంబకంబులన్
నఱికి రథంబు నిర్వదిట నాశ మొనర్చి దశాశుగంబులన్
వరకవచంబు శింజినిని బాడొనరించి ధ్వజంబు వ్రాటిచే
ధరణినిఁ గూల్చి సారథిని దంచెను బాణయుగంబునన్ విభూ! ౬౯౧

చ॥ అనల వరిష్ఠుఁడైన వృకుఁడన్యరథంబును నెక్కి స్వీయచా
పవరముఁ గిన్కతోఁ గొనెడివట్టున దైత్యుఁడు దానిఁ ద్రుంప న
ట్టి వృకుఁడు దివ్యమౌ గదఁగడిందిగఁ గొట్టి తదీయసింహముఁ
గవియుచు హృష్టదైత్యుని మొగంబున మోఁదె ననంతరంబునన్ ౬౯౨

శా॥ సింహం బుత్కటరోషపూర్తమతితోఁ జేతఃకుతో వీఁకతో
రంహస్స్ఫూర్తిని నేగుదెంచి పలుగర్జల్ జేసి యోధావళిన్
సంహారం బొనరించి యా వృకబలున్ సర్వంసహన్ గూల్చఁగా
నంహోనాశకుఁడైన యా వృకుఁ డనాయాసంబుగా దానినిన్ ౬౯౩

చ॥ భుజములతోడఁ బట్టుకొని భూమినిఁ గూల్చుచు జెట్టి జెట్టిపై
గజిబిజిజెంద నెక్కువిధిగా నధిరోహణ మాచరింప నా
గజరిపు వార్చి నెమ్మదిగఁ గ్రిమ్మఱ లేపఁగడంగ నాతఁడున్
నిజదృఢముష్టితోఁ బొడిచె నీల్గెను దద్ధతిఁ దన్మృగేంద్రమున్. ౧౯౪

ఉ॥ అత్తఱి హృష్టదైత్యుఁడు మహాగ్రహమొంది స్వకీయశూలమున్
దత్తఱపాటుతోడఁ గొని తద్వృకుపైఁబడ వేయ నద్దియున్
గత్తఱగొల్పు నుల్కవిధిగాఁ జనుదెంచ నతండు దానినిన్
గత్తినిఁ జెండె నాస ఖగకాంతుఁడు సర్పముఁ జెండినట్టులన్ ౧౯౫

ఆ॥ అవల హృష్టదైత్యుఁ డాత్మఖడ్గంబుతో ధరవణంక వృకుని తలనుగొట్ట
నతఁడు దప్పికొనుచు శితఖడ్గమున హృష్టుతలను గూల్చె నట్టి తఱుణమందు.

చ॥ సురనరదుందుభుల్ మొరసెఁ జూచిరి వింతగఁ గిన్నరాదులున్
గురిసిరి పూల దేవత లకుంఠితరీతినిఁ గృష్ణపుత్రుపై
వెఱను నశేషరాక్షసులు స్వీయపురంబున కాక్షణంబునన్
బఱుగిడి రెల్లయాదవు లపారముదంబును బొందిరో విభూ! ౧౯౬

తే॥ అంత శకునినామక దానవాధిపుఁ డల
హృష్టుమరణంబు విని క్రుధ నిలనుమూర్ఛఁ
బడియు దేవభీకరులైన భ్రాతృవరుల
నంపెఁ బ్రద్యుమ్నుతోఁ బోర నందుమీఁద. ౧౯౭

## —♦ సంగ్రామజిత్తు భూతసంతాపనాసురునిం జంపుట. ♦—

తే॥ భూతసంతాపనుఁ డనెడి పోలసుదిండి
గజము వృకుఁడు ఖరంబును గాలనాభుఁ
డుదుకిరిన్ మహానాభుఁడు గరిఁ దిమింగి
లము హరిశ్మశ్రువును నెక్కి సమితిఁ జనిరి. ౧౯౮

సీ॥ వేయియశ్వంబులన్ వేయిచక్రంబులన్ వేయి కుంభంబులన్ వెలుఁగునదియు
వందజాబిల్లుల పాటి తేజంబులన్ వంద టెక్కెంబులఁ జెందినదియు
రత్నభూషణములన్ నూత్నముక్తాహారతతులను మిక్కిలి తనరినదియు
యోజనపంచక యుక్తవిస్తారంబు గామసంచారంబు గలిగినదియు

తే॥ జైత్రమును మయదానవ సంఘటితము
సర్వమాయామయంబైన స్యందనంబు
శకుని దానవేంద్రుం డెక్కి సమరమునకు
ద్వాదశాక్షౌహిణుల్ గొని బయలుదేరె. ౨౦౦

చ॥ అల పొలదిండిదండు ననునప్పుడు చాపరథేభరథ్యయో
ధులరవముల్ సెలంగె జలధుల్ నెఱి ఘూర్ణిలెఁ గూలె శైలముల్
గలఁగె ధరిత్రి యంత రతికాంతుఁడు ధీరుఁడు గృష్ణజుండు త
ద్బలములఁగాంచి స్వీయయదువర్యుల కిట్లనె మైథిలేశ్వరా ! ౨౦౧

తే॥ వపువు కర్మగుణయుతంబు పాంచభౌతికంబు ఫేనసమమని యాగత గత భవ
నములు గాలవశంబని సుమతు లర్భకపను లట్లు లెక్కింపరు కొంచెమేని

చ॥ చనెదరు సాత్త్వికుల్ నరులు సర్వసుఖాశ్రయనాకభూమికిన్
జనెదరు రాజసుల్ ప్రజలు స్వల్పసుఖాస్పదమధ్యభూమికిన్
జనెదరు తామసుల్ జనులు సర్వశోకాకర నీచభూమికిన్
జనెదరు వచ్చుచుంద్రు బలుసారులు వారలు స్వక్రియాతతిన్ ౨౦౩

తే॥ మనము బంధమోక్షములకు ఘననిదాన
మగును జగము మనోమయం బగును గాదె
యామనము భీతిఁగన్నచో నఖిలజగము
భీతికరముగ నుండు నో భ్రాతలార ! ౨౦౪

ఉ॥ ఏరహి రాజ్యసౌఖ్యము ధరేశులకున్ సతతంబు నుండదో
యారహి నాగలోకసుఖ మావిధి యజ్ఞములం బొనర్చి దై
వారెడివారి స్వర్గసుఖపఙ్క్తి తిరంబుగ నుండఁజాలదా
ధీరవిరాగులో తృణవిధిన్ దిలకింతురు వాని నన్నిటిన్ ౨౦౫

వ॥ ఎట్లు స్వభావంబుగా నహర్నిశలును ఋతుగుణంబులును దేహగుణంబులును గలుగుచుఁ దొలఁగుచునుండునో యట్లు జనులును బుట్టుచు గిట్టుచుందురు. మార్గమధ్యంబునఁ బథికులతోడి సంగాతంబు సంభవించి చనినయట్లు జీవునకును సతిసుతబాంధవాదులును గన్పడి చనుచుందురు. దృశ్యపదార్థంబెల్ల మంచుమాదిరి త్రుటిలో నశ్యంబని యెఱుంగుము. ఎట్లగ్ని యొక్కండయ్యుఁ గాష్ఠసంచయంబున నానారూపంబులతోఁ బ్రకాశించునో యెట్లిందుం డేకకుండయ్యు నుదకంబుల బహుత్వంబున వెలుంగునో యట్లద్వితీయుండగు బరాత్పరుండును నానారీతుల బాహ్యాభ్యంతరదేహాదుల విరాజిల్లుచుండు. పరమతత్త్వంబును గను మహామహుం డుభయలోకంబులవలనఁ బ్రయోజనంబు గానక నిశ్శ్రేయసపదంబును దిలకించుచు నెల్లెడల సంచరించుచుండు బ్రహ్మవిద్వరీయుండు భవనంబునైన వనంబుగాను, వనంబైనను భవనంబుగాను దలఁచుచుండు. పరమయతి బాలునివలె సుఖియు సదానందమయుండునై దేహాద్యభిమానంబుల వీడి కట్టువస్త్రంబున్నదియు లేనిదియు గుర్తెఱుంగక పరిభ్రమించుచుఁ బరమపదంబుఁ జెందు. ఏకపదార్థం బనేకగుణాశ్రయేంద్రియంబుల కనేకరీతులగా గోచరించిన ట్లాత్రిగుణాశ్రయపరాత్పరుం

ఢొక్కరుండే నానా నామరూపగుణవిశేషంబులతో నానా శాస్త్రపారంగతులగు బుధులకు వర్ణనీయుండగుచుండు. జ్ఞానవైరాగ్యసంపన్నుం డగును, కృష్ణభక్తుండునునగు జనుండే బహువిధవర్ణిత శ్రీకృష్ణపదంబుఁ బొందునని యెఱుంగుఁడన యాదవపుంగవు లంద ఱానందం బొంది నిశ్చయం బెఱింగి దృఢసంకల్పులై శస్త్రాస్త్రంబులం గొని సముద్రతట విలసల్లంకానగరంబునఁ గపీంద్రులు దానవులతోఁ దలపడినట్లు సీతాగంగాతటంబున నా రక్కసులతోఁ దలపడి తుములయుద్ధం బాచరించిరి. అందు దైత్య మహామాత్య ప్రణోదితంబులై ౨౦౬

సీ॥ అభ్రడంబర భీకరాద్రులవలె మత్తకరివరంబులు గిన్కనరుగు దెంచి
గొలుసులఁ ద్రెంచి బలుశీత్కృతులఁ జేసి బృంహితంబులసల్పి యెగసి కవిసి
తురగముల్ గూలిచి యరదముల్ వ్రాలిచి ధ్వజములఁ బుడమిపైఁబడఁగ వైచి
సారథిహయయుత స్యందనముల్ దండితొండములన్ ధాత్రిఁ ద్రోసియెత్తి

తే॥ మిన్నుపైనుంచియంత్రములఁ గొన్ని యరదములనునుసి జేసి మాతంగములను గొట్టి
వీరవరులను ఖండించి విస్తరించి, స్వీయనాథు లౌరా! యనం జెలఁగె మఱియు.

సీ॥ ఉత్పతత్తురగంబు లుద్ధవిడిఁ వచ్చి నుఱుమాడె దివ్యమహారథముల
గజహయారూఢులు గైకొని శక్తుల నేతెంచి కిన్కఖండించి రరుల
నసిధరుల్ గసితోడ నండజంబులభాతి నెగురుచు నఱికిరి పగరగుముల
బలులు గొందఱు రేగి పరశువుల్ దాలిచి ఖండింపఁదొడఁగిరి దండిమగల

తే॥ చక్రములతోడఁ గొందఱు సైనికులను రూపుమాపిరి కొందఱు రోషమతిని
బరిఘలఁ గ్రుచ్చి పత్తుల నఱికిరయ్య! యాదవులు నొవ్వఁగడిఁగి రాయవసరమున

వ॥ సంగ్రామజి, ద్బృహత్సేన, శూర, ప్రహరణ, విజి, జ్జయ, సుభద్రా వామ, సత్య, కాశ్వయులను భద్రాకుమారులు బదుగురు నాలోకించి యాగ్రహించి యరుదెంచి యాని శాలవస్యులతోఁ బోరాడఁ దొడంగిరి తత్సమయంబున.

తే॥ భూతసంతాపనాసురపుంగవుండు గనలి యదుసేన బాణదుర్దినము జేసె
నపుడు సంగ్రామజిత్తను హరిసుతుండు వచ్చి శతబాణముల వానిపైని విసరె.

తే॥ అపుడు భూతసంతాపనుఁ డల్లపల్లియకంథిస(?)ఘోషభీమసంఘట్టనాది
నియగు తత్కాంజినిం జెండె నివ్వెఱపడ మరల సంగ్రామజిద్వీరవరుఁడు గసిని

ఉ॥ కాంచి శితాన్యచాపమును గైకొని యెక్కిడి యట్టి దైత్యుపైఁ
బంచశతాంబకంబులను వైచి శరాసనము త్తరించి లో
హాంచితవర్మముఁ దునిమి హస్తివరంబును గొట్టి వే ప్రవే
శించెను ధాత్రిలో నవలఁ జింతిలి కొంచెము తన్నిశాటుఁడున్. ౨౦౭

చ॥ కనలి స్వకీయమత్తకరిఁ గంజదళాక్షుకుమారు మీఁదికిన్
బనుపఁగ నద్ది కాలయముభాతిని వచ్చుటఁ గృష్ణపుత్త్రుఁడున్
గని కినుకన్ గరంబులను గట్టిగఁ బట్టి గ్రహించి ఖడ్గమున్
దునిమెను నూరువ్రక్కలుగఁ దొండము భూప! యనంతరంబునన్. ౨౧౩

ఆ॥ అల గజంబు శీత్కృతులను హెచ్చుగఁ జేసి కటమునుండి మదముఁ గాఱ్చి తన్ని
శాటు విడిచి వీరసమితినిం గూల్చుచు స్వపురికేగె నస్తపాట్లఁ ద్రోసి ౨౧౪

క॥ అలపురి కాకరి యారహిఁ గలనువిడిచి వచ్చియుంటఁ గన్గొని యచటన్
జెలఁగెడి దనుజులు కోలాహలముల్ గావించి రెంతో యవనివరేణ్యా! ౨౧౫

చ॥ తురమున నంత నా ఖలుఁడు తోయజనాభుని పుత్త్రుఁ ద్రుంప రు
క్మరుచిరచక్రమున్ బఱపెఁ గోపముఁ గల్గఁగ నద్ది శ్రీమ్మభా
స్కరవిధి దన్నుఁ జేరుటను గన్గొని దానిసఁ గృష్ణసూనుఁడున్
నఱికెను వందతున్కలుగ నవ్యసిజామ్బరిచక్రిఘారలన్. ౨౧౬

తే॥ అవల భూతసంతాపను డచలమున్న జలదగిరిశృంగముం గొని సాహసమున
నతనిపై వేసె నంత నా హరితనయుఁడు దానిఁ గైకొని యాదైత్యుఁ దద్దఁ గొట్టె.

ఉ॥ పిమ్మటఁ దన్ని శాచరుఁడు భీకరమౌ జలరాద్రిఁ బూర్తిగా
హుమ్మని చేతులం గొనుచు నోఖల! యీగిరి వేసి నిన్ను నం
తమ్మొనరింతు నేనని మృధంబున నిల్వ నతండు దేవకూ
టమ్ముఁ బెకల్చి యీగిరిని డమ్మనిపింతును నిన్నె దానవా! ౨౧౮

క॥ అని యాతనిముంగల నిలిచె నవల దైత్యుండు నగము శ్రీహరినుతుపై
నునిచెను బదపడి భద్రాతనయుఁడు దనగిరిని వైచెఁ దద్దనుజునిపై ౨౧౯

ఉ॥ ఆ మల లట్టె పోరుచుఁ దదాసురుపైఁ బడ వాఁడు వెంటనే
యీమహిఁ గూలి నీర్గెను ధరేశ్వర! యంతట వానిజోతి సం
గ్రామజిదాత్మలోఁ గలిసెఁ గన్గొని చల్లిరి పూల వేల్పులా
కామపతాకిసిన్ బటహకాండము మ్రోఁగె జయస్వనంబులన్. ౨౨౦

—♦ అనిరుద్ధుండు వృకాసురుని వధించుట. ♦—

తే॥ అట్లు భూతసంతాపనుఁ డంతమగుట వినిన శకుని హరిశ్మశ్రువృకులు గాల
నాభుఁడున్ మహానాభుఁ డనంతరోషమున రణంబునకేతెంచి రనఘ! యపుడు.

తే॥ శకునిమన్మథు లనిరుద్ధవృకులు గాల
నాభసాంబులు మఱి మహానాభదీప్తి
మంతులున్ వెండియున్ హరిశ్మశ్రుభాను
వులును బోరాడఁదొడఁగి రా కలహమందు. ౨౨౧

మ॥ అనిరుద్ధుండు మహాబలుం డఖిలవీరాగ్రంబునన్ నిల్చి వీ
కను బాణంబుల నుగ్రమౌ పత్రులఁబవిన్ ఖండించిన ట్లామహా
దనుజానీకముఁ గొట్టెఁ దద్ధతులచే దైత్యుల్ విభిన్నాంగులై
ఘనవాతాహతవృక్షరీతిఁ బడి రక్తాయ్యంబునన్ మూర్ఛతోన్. ౭-౨౩

క॥ మఱియును దత్శరహతులను గరివరములు భిన్నకుంభకరరదనములై
యురువజ్రాహతగిరివిధి ధరఁబడె రెండుపఱియలుగ ధరణీనాథా! ౭-౨౪

తే॥ మఱియు దద్భిన్నకుంభస్థ మౌక్తికతతి యుంబకాంధకారమయమౌ నాహవమున
నిశినిఁ జదలున రిక్కలు నెగడినట్లు వెలుఁగఁదొడఁగెను జూపఱున్ వింతపడఁగ.

క॥ కొందఱు రథికులు భయపడి తొందరతో రథముల విడి దొరకినత్రోవన్
బొందుచు నేసందులనో చెందిరి మఱిఁ గొంద ఱచటఁ జెల్లిరి జనకా! ౭-౨౬

తే॥ ఇటుల దానవచమువులనెల్ల వల్ల విశ్వకేతువు ద్విరదంబు వెలఁగపండు
మ్రింగినట్టులఁ గ్రుటిలోనఁ గ్రుంగఁజేసె నౌర! తత్శక్తి వర్ణింప నలవియగునె?

సీ॥ కుంభివరంబులే కుంభీరములుగాఁగ రథములు శింశుమారములుగాఁగ
నుష్ట్రఖరాస్యాదు లురుకూర్మములుగాఁగ హస్తంబులెల్ల మత్స్యములుగాఁగ
భుజములు సరియైన భుజగంబులునుగాఁగ సొగసైన చక్రముల్ సుడులుగాఁగ
శస్త్రశంఖాదులు సైకతంబులుగాఁగ ముకుటరత్నాదులు మొరముగాఁగ

తే॥ వాలములు శైవలముగాఁగ బలయుగంబు తీరయుగ్మముగాఁగ నఘోరరీతి
నంద యోజనములుదాఁక వైతరణివిధమున రక్తతరంగిణి దనరె నాఁడు. ౭-౨౭

వ॥ అంత నా రణాంగణంబునకుం బ్రమథభైరవభూతభేతాళయోగినీగణంబు లును శతఢాకినీపరివృతయు సింహారూఢయు నగు భద్రకాళియు నరుగుదెంచి యట్టహాసం బొనరించి తద్దైత్యుల భక్షించి తదు్రధిరంబును గడుపారఁ ద్రాగి పాడి యాడి రుద్రుముండమాలార్థంబుగాఁ దత్కపాలంబులం గైకొని చనిరి. విద్యాధరీమణులును, గంధర్వీలలామలును, నప్సరసలు నేతెంచి క్షత్రధర్మపరులై మరణించి దేవరూపంబుఁబొందిన వీరులలో ననురూపులగువారినిం బరస్పరస్పర్థతో వరించి మురిసిరి. మఱియు రాజనీతివిశారదులై పరాఙ్ముఖులుగాక పోరి మృతులైన వీరవరులు మార్తాండమండలంబు భేదించుకొని విష్ణుపదంబున కేగిరి. శేషదైత్యు లా యనిరుద్ధుం గాంచి పలాయితులైరి. అత్తఱి వృకనిశాటుం డాలోకించి యేతెంచి రోషించి ధనుష్టంకారంబులం గావించి దశబాణంబులతోఁ దచ్చాపంబును ద్రుంప నా యనిరుద్ధుం డన్యశరాసనం బెక్కుపెట్టి పదిశరంబులతో నా యాసురుని విల్లు ఖండింప నా ఖలుండు లలజ్జిహ్వుండును, బ్రస్ఫురితాధరుండునునై భయంకరంబగు త్రిశూలం బెత్తి యవ్విశ్వకేతువుతో నిట్లనియె. ౭-౨౮

శా॥ దుష్టా! క్షత్రియుఁడీవు విక్రముఁడ నినున్ ద్రుంతున్ జుమీ, వేల్పులన్
గష్టంబుల్ గలిగించి చెండి తగు నాగంతల్ చమూసంతతుల్
నష్టంబౌనటు సల్పియుంటివర రే! నా విక్రమోత్సాహముల్
స్పష్టంబయ్యెడి నీకు నీక్షణమునన్ శ్రద్ధన్ విలోకింపుమా! ౨౩౦

మ॥ అనఁగా నా యనిరుద్ధుఁడున్ వినుము సిగ్గౌడెన్ నిశాటాధమా!
యనువారల్ బని యేమి సల్పుదువొ మీ యామాట నిక్కంబెగా
కనుమా! మద్బలధైర్యసంపద నినున్ ఖండింతు నేఁటట్లు స
ల్పని చో గోశిశువిప్రహత్యలను బ్రాప్తంబౌత నా కియ్యెడన్ ౨౩౧

తే॥ ఇటుల వృషంగునను బల్కించి చటులమగు ద్రికోణమున నసిపద్ధని శూరుఁబొడువ
నతఁడు వామహస్తమ్మున నదిపట్టి యట్టె దైత్యుఁడు ప్రహరించె నగ్గలముగ

చ॥ పదపడిఁ వక్ర్మప్రాంతము బహుబాహుసమేతగాన్ గ్రహించి సా
మదనకుమారు తేసు సుసిమాస్త్రి నౌనర్చ సరంపు గత్తితో
నెనుపుచుఁ దద్భుజాయుగము నేత్తజ ప్రుంచెను శైలపక్షముల్
భిదురముతోడఁ జెండినటుఁబిమ్మట ఛిన్నభుజుండు దైత్యుఁడున్. ౨౩౩

చ॥ ఇల వణికించు చంద్రములను హెచ్చుగనోరును విప్పి నాలికన్
వెలికిడి దంష్ట్రిలం దెఱచి విన్నును ద్రోలుచు భీకరంబుగా
సులువుగ నేఁగుదెంచి లలిఁ జూపఱు నబ్బురమొందగాఁ దిమిం
గిలము దిమిన్ గ్రిసించినటు గృష్ణునిమన్మని మ్రింగె భూవరా! ౨౩౪

ఉ॥ అంతటఁ గార్ష్ణి జుండు గమలాక్షునదయున్ దనుజోదరంబునన్
గంతుఁడు మీనకుక్షి నఘుగర్భమునందున గోపకుల్ శచీ
కాంతుఁడు వృత్రగర్భమునఁ గంజదళాక్షుఁడు దద్బకోరుగ
ర్భాంతరమందు నుండినటు లంతముఁ బొందకయుండె వేడ్కతోన్ ౨౩౫

తే॥ అవల యదుసేన భయమొందె నపుడు గదుఁడు
గదను దద్దెత్య తలఁగొట్టఁగా హతోత్త
మాంగుఁడగువాఁడు రక్తబింద్వాళితోడ
వ్రెల్గె గైరికాప్పుల వెల్గు వింధ్యమువలె. ౨౩౬

ఆ॥ మఱియు నర్జునుండు మంచిఖడ్గంబుతో నట్టి వృకసురారి యంఘ్రియుగముఁ
జెండ నతఁడు బడియె భిన్నాంఘ్రియై భిన్నపక్షుఁడగుచు నగము వడినయట్లు

ఉ॥ అమ్మెయి నయ్యుమాపతి మహాసినిఁ దద్వృకదానవేంద్రగ
ర్భమ్మును గోసి యీవలకు వచ్చి యనుక్షణమందు వాని శీ
ర్షమ్మును ద్రుంప నిర్జరులు నల్లిరి పూలను దుందుభుల్ సుపూ
ర్ణమ్ముగ మ్రోయసాఁగె జయనాదము లొప్పెను యాదవావళిన్ ౨౩౭

క॥ అనవుడు బహులాశ్వుం డిట్లనియెను బ్రాద్యుమ్నమిన్నియుద్ధ మానందమిడెన్
దనుజేశుఁడు వృకుఁడిటు సచ్చినమీఁద మఱేమియయ్యె జెపుము మునీంద్రా!

— సాంబుండు కాలనాభరాక్షసునిం బరిమార్చుట. —

తే॥ అనఁగ నారదుఁ డిట్లాడె నవనినాథ! యట్టి వృకదైత్యుమరణంబు నాలకించి
కాలనాభాసురుండు సూకరము నెక్కి యుద్ధరంగమునకువచ్చి యుగ్రమతిని

సీ॥ అంబకవింశతి నక్రూరుపై వేసి కాండదశకమేసి గదునిమీఁద
నాశుగవింశతి ననిరుద్ధునిం గొట్టి శతశరంబుల వైచి సాంబుపైనిఁ
బాణశతంబునన్ బ్రద్యుమ్నుఁ బ్రహరించి పత్రిదశకముతోఁ బార్థు నొంది
ఖగదశకంబుతోఁ గారించి కృతవర్మయుయుధాను బొందిఁ పంచోరుశిఖుల
తే॥ దీప్తిమంతుని బలవంతు తీక్ష్ణపంచబాణములతోడఁ బ్రహరింప వారలెల్ల
రాకులపడిరి ఘటికాద్వయంబుదాఁకఁ దద్ధయాదులు నిగ్గెను దత్పరమున ౭౪౧

చ॥ మదనుఁడు రుక్మిణీసుతుఁ డమందబలుం డల కాలనాభపూ
ర్వదివిజు హస్తలాఘవము బాగుగఁ గన్గొని మంచిమాటలన్
ముదమున సత్కరించి ధనువుం గొని టంకృతి నల్పి బాణమా
త్రిదశవిరోధిపైని విసరెన్ బహులాశ్వ! యనంతరంబునన్ ౭౪౨

తే॥ ఆ శరంబేగి యాతని యధికభయదసూకరముఁగొని దివిఁద్రిప్పి వీఁక లక్ష
యోజనంబులపైనుండి యుత్కటముగ మ్రోఁగు నుదధిలోఁబడవైచె భూవరేణ్య!

క॥ మఱి మరుఁడొకబాణముఁగొని త్వరగతి నా కాలనాభుపై విసరఁగ నా
శర మాతనిఁగొని త్రిప్పుచుఁ బఱపెను జంద్రావతియను పట్టణమునకున్

చ॥ పదపడి కాలనాభసురవైరి యటుల్ దనయూరఁ గూలి నె
మ్మది వెతఁబొంది రోషమునమండుచఘోరము లక్షభార భృ
ద్గదఁ గొని యాజికేగి యదుకాండ శతాంగ గజాశ్వపత్తులన్
జదిపెఁ ద్రుటిన్ బ్రకంపనుఁడు సాలములన్ దెగటార్చినట్టులన్ ౭౪౩

తే॥ మఱియునాదానవేంద్రుఁడుక్కరులఁ గొందఱనుగరంబులఁగొని దివినువ వారు
ధరను వడగండ్లుపడెడివిధమునఁబడిరి తత్సమయమున సాంబుండు మత్సరమున.

చ॥ గదగొని తన్నిశాచరు మొగంబునఁ గొట్టఁగ నాతఁ డా బలున్
గదఁ బ్రహరించె వారలిటు గంటునసల్పిరి యుద్ధరాజి నా
గదలును విస్ఫులింగములఁ గ్రక్కుచుఁ బోరియుఁ జూర్ణమయ్యె నా
యదనున వార లిర్వురును నన్యగదల్ గొని నిల్చి రయ్యెడన్. ౭౪౪

తే॥ కాలనాభుండు సాంబునిం గాంచి యిట్టుల
బలికె నో తుచ్ఛ! యీహత్తిన్ బ్రాణములను
గడపెదర్ నావుడా బలి గాఱులేల?
కలహమాడుము ముందని పలుక నతఁడు. ౨౪౮

ఉ॥ జాంబవతీకుమారుఁడును సాహసికాగ్రణియైన సాంబుఁడ
ర్షంబున వాటమౌ గదను జక్కఁగఁ గొట్ట నతండు వానివ
క్షంబున స్వీయమౌగద వెసన్ గొని బాదఁగ నాఖలుండు వ
క్త్రంబున నెత్తు గ్రక్కి పవిఖండితపర్వతరీతినిం బడెన్ ౨౪౯

తే॥ అమరనరదుందుభులు మ్రోసె నట్టి సాంబునేన వేల్పులు గురిసిరి సూనవృష్టి
జయజయధ్వనుల్ మినుముట్టె సంతసమున నచ్చరలు నాడి రత్తఱి నవనినాథ

—♦ దీప్తిమంతుండు మహానాభాసురుం డెగటార్చుట. ♦—

తే॥ అతుల గాలనాభాసురుం డంతమగుట విని మహానాభుఁడుష్ట్రమందున వసించి
యనికిఁజని స్వీయమాయ నిజాననమున నరిభయదవహ్నిఁ బుట్టించె నవల నద్ది

సీ॥ ఉర్వియందున మండి యుర్వీజముల మండి పొగలందున మండి భటుల మండి
కంచుకంబుల మండి కటిబంధముల మండి వివిధచిత్రాంబరవితతి మండి
ఛత్రంబులన్ మండి చామరంబుల మండి బంగారుసొమ్ములం బలుగమండి
ధ్వజములన్ మండి రథంబులందున మండి హస్తులందున మండి హరుల మండి

తే॥ మఱియు శస్త్రువస్తువులందు నెఱిగమండి
మించుచుండుట యాదవుల్ గాంచి భయము
బొందుటన్ దీప్తిమంతుడర్ పోటరి గని
వేసెఁ బార్జన్యమాయగ్ని వేగనార్ప ౨౫౦

క॥ ఆయంబున సంవర్తకతోయదనిచయంబువోలెఁ దోఁతెంచి మొగు
ళ్ళా యనిఁ దోయము గురిసెను జేయుచు భీకరరవంబు శ్రీబహులాశ్వా!

వ॥ అయ్యాసారంబున నియ్యిల గోకిల పుంస్కోకిల మయూర సారస మం
డూకాది స్వనంబులును నాకాశంబున నింద్రచాపసౌదామిన్యాదులును గలిగి ప్రావృ
ట్కాలంబుపగిది జెలంగుట గని యమ్మహానాభుండు మండిపడి నిశితశూలం బొందు
తద్దీప్తిమంతునిపై బ్రయోగింప నతం డహివిధంబున నేతెంచు నద్దానిని ఖడ్గంబుతో
గరుడి యురగంబును జెండినట్లు ఖండించి తన్నుం గొఱకవచ్చెడి తదుష్ట్రవాహనం
బును బ్రహరించె. తత్ప్రహారణంబున నా యుష్ట్రంబు హతకంధరంబై యానురుండు
గనుచుండ మృతింజెందె. అంత నద్దనుజుం డాగ్రహంబున హస్తివరం బెక్కి త్రిశూ
లంబును దాల్చి యేతెంచ నా దీప్తిమంతుండును సైంధవాశ్వంబెక్కి దివ్యఖడ్గంబుఁ

గొని తటిన్నిభుండై చనుదెంచి తద్దైత్యగజకుంభాంతంబునకు శ్రీకృష్ణుం డద్రి శృంగంబును బొందిన ట్లెగసి సురసరిదుందుభులు మ్రోయ జయజయనినదంబు లొప్ప సురలు విరుల గురియం గిన్నరాకులాపఁ దన్నస్త్రకంబును ఖండించి తత్సైన్యంబు హతంబుగావించె. అత్తఱి మిగిలిన రాక్షసులాహరిసుతుంగని పలాయితులైరి సురర్షి వరేణ్యులు హర్షించిరి. ప్రపంచమంతయు సంతసిల్లె. ఇట్లు మహానాభుండు మృతుండగుట హరిశ్మశ్రుండను మహాసురుండు విని రోషమూర్తియై తిమింగిలం బెక్కి ప్రస్ఫురితాధరుండగుచు రణంబున కేతెంచి యాదవులతో నిట్లనియె. ౭౫౭

—♦ భానుండు హరిశ్మశ్రుదైత్యుని ఖండించుట. ♦—

ఉ॥ యాదవ వీరులందఱును నల్పబలుల్ మనుజుల్ గనుంగొనన్
నాదృఢధైర్యశక్తులకు నాశముఁ జెందఁగలారు కాన మీ
జోదులలో నెవండయిన శూరుఁడె యుండిన లేచి వెంటనే
రాఁదగు శస్త్రమేదియు గరంబునఁ దాఁకఁగఁగూడ దాతఁడేన్ ౭౫౮

తే॥ శస్త్రములఁ బోరువారలు స్వల్పబలులు కాని గండలుగారని మానసమున
విశ్వసింపుఁడి! నాతోడఁ వేగిరముగ మల్లయుద్ధం బొనర్పుఁడీ! మనుజులార!

చ॥ అనవుడు యాదవుల్ దదసురాధిపవాక్యము లాలకించి యా
తని పెనుమేనుఁగాంచి తమదండినిఁజూచి పరస్పరాస్యముల్
గనుఁగొను చానిశాచరుఁ బగన్ బృథుమల్లరణంబునందు డీ
కొనఁదగమంచు నెంచి మదిఁగొంకుచు నోరుమెదల్పరో విభూ! ౭౫౯

తే॥ అపుడు భానుఁడు సత్యభామాత్మజుండు సాహసంబునఁ గృష్ణుని సంస్మరించు
చాత్మకీయశస్త్రంబుల నవలఁబెట్టి యట్టి దైత్యుని యెదుటకు నరుగుదెంచె

తే॥ అల హరిశ్మశ్రువున్ దిమింగిలము డిగ్గి బాహువులఁదట్టినిల్వ నబ్బలు లుభయులు
నటవి రదములన్ బోరాడు హస్తులవలెఁ ద్రోసికొనిరి చేతులను జేతులనుగల్పి

క॥ అట్టి యెడ హరిశ్మశ్రువు పట్టునఁ దద్భానుఁబట్టి వందామడలన్
నెట్టెను సింహము సింహముఁ బట్టుచు భుజవిక్రమమునఁ బఱపినకరణిన్ ౭౬౦

క॥ ఆ సమయంబున భానుఁడు రోసముతో వచ్చి కర్బురుని బలవంతున్
మోసమొనర్చెడివానిని ద్రోసెను వెయ్యామడలకు దోర్యుగశక్తిన్ ౭౬౧

తే॥ పడపడి నిశాచరుండు తద్భానుని మెడ నొక్కచేఁబట్టి తత్కటి నొక్కచేతఁ
బట్టి పడవేయ భానుండు బాహుశక్తి వెనుకనుండి యరిగి వాని వీపునెక్కి

ఆ॥ అసురు జంఘలఁగొని యవనిపైఁగూల్చెఁ దత్పరముని మఱి బలులు వారులేచి
గరుడఫణులు వోలె ద్వరను భుజంబులఁ జఱచి కయ్యమాడసాఁగి రపుడు

తే॥ అట్టి దనుజుఁడా భానుని యంఘ్రులంగొని నింగి లక్షయోజనములనెట్ట నాతఁ
డద్రిపతితుండై మసిన ప్రశ్నమమాశ్కి నవనిఁగూలియు జీవించి యచ్యుతదయ

తే॥ చని హారిశ్మశ్రుశువీర్య్మహా శ్మశ్రుశువులను పట్టి బుజముల బల్మితో వడినిఁద్రిప్పి
యాకసంబుమునన్ లక్షయోజనములను వేయ నతఁడిలఁబడి కొల్ది వెతనుబొంది.

క॥ మెుగమునఁ గూర్చముఁగూరిచి పగతుని నబ్బానను ముష్టిఁ బ్రహరించెను రెం
డుగడియ లిట్లు బిడికిళులఁ బొగరునఁ బోరాడి రట్టిపోటరు లవలన్ ౭౬౬

క॥ దనుజుఁడు పిష్టాంగుండై కనలుచు నొకపెద్దబండ గైకొని శ్రీకృ
ష్ణునిసుతుఁడగు భానునిపై నునిచెను దదనంతరమున నుక్కరి యతఁడున్ ౭౭౭

క॥ తరువును గైకొని యాఖలుశిరమునఁ బడవేయ నతఁడు జేకొని దానిన్ .
జ్వరగతితో నాభానుని శిరమునఁబడవైచి కిన్కఁ జెలరేగి మఱిన్ ౭౭౮

క॥ తనగజతుండముఁ గైకొని ఘనముగఁ బ్రహరించె నంతఁ గమలాక్షసుతుం
డును బెఱకరినిం జేకొని చనుదెంచి తదసురవర్యుఁ జదియఁగఁగొట్టెన్. ౭౭౯

వ॥ అంత నాహరిశ్మశ్రువు తద్దంతి దంతంబుల నూడఁజెఱికి యవ్వానితో నబ్బానుం బ్రహరించె అత్తఱి నాహరిసూనుం డచ్చెరువొందుచుండ వీరవరా! యీరాక్షసుని ప్రాణంబు లాతని యాస్యంబందలి కూర్చమందున్నవి. అద్ది యపహరింపఁబడని దే యీతండు మృతుండుగాఁడను నాకాశవాణి దనకు వినఁబడఁ బూర్ణక్రోధమూర్తియై వెంటనంటి బాహుబలంబున నా హరిశ్మశ్రువులం గొని త్రిప్పి బడవేసి తన్ముఖస్థితకూర్చంబును బెఱికికొని ముష్టితో మర్దింప నమ్మహాసురుండు మృతుండయ్యె. తత్సమయంబున జయజయనినదంబులతో సురనరమునుదుభులు మ్రోఁగె. సుర లామరుని సేనలో విరులం గురిసిరి. దేవాంగనలు నృత్యంబులం జేసిరి. ఈరీతిగా మహాద్భుతంబగు శ్రీకృష్ణపుత్రబలంబు వినిపించితి. మఱేమి విననలతువో వచింపుమన జనకుం డానందమంది యీ నారదమహర్షి కిట్లనియె ౭౮౦

తే॥ అతుల విఖ్యాతబలులగు దనుజులంద ఱంతమొందిన తరువాత నట్టి శకుని
దనుజవరుఁ డేమొనర్చెనో దయను నాకుఁ జెప్పవేఁడెద నారదా! తప్పకుండ

—♦ శకుని తన తమ్ములుగూలుటవిని చింతించి యాదవులతోఁ బోరుట కేతెంచుట ♦—

తే॥ అనఁగ నారదుఁ డిట్లాడె నవనిపతికి జనక! శకుని దైత్యేంద్రుఁడు సంగరమునఁ
దమ్ము లీల్గుట విని కిన్క సొమ్మసిల్లి తద్వ్యథన్ బల్కె నిట్లెల్ల దానవులకు.

ఆ॥ కాలకేయులార! పౌలోమలార! మద్వచనములను వినుఁడి దైవశక్తి
యెంతగొప్పవానినేని హింసించుఁనా యనుభవమున నాకు నద్ది దెలిసె. ౭౮౩

తే॥ సరసిజాప్తు నిర్జించిన శంబరుండు బాలుఁడగు మన్మథునిచేతఁ బడుట యెందు
గెలిచినట్టి యుత్కచుఁడును గృష్ణశిశువువలనఁ బడుటయు దైవదుర్బలతఁగాదె

తే॥ భండనంబున బల్మిని వరుణదేవుఁ దఱిమి గెలిచిన భూతసంతాపనుండు
తుచ్ఛులగు యాదవులచేతఁ ద్రుంపఁబడుట దైవదుర్బలతనుగాదె దనుజులార!

సీ॥ కాలునోడించిన కాలనాభుం డిందు వ్రాలుట దైవదుర్బలతఁగాదె
వహ్నినిం గెల్చినబలుఁడు హృష్టుం డిందు వ్రాలుట దైవదుర్బలతఁగాదె
బల్మిని శివనుతిఁ బడసిన వృకుఁ డిటవ్రాలుట దైవదుర్బలతఁగాదె
యనిలు నెదిరిన మహానాభుఁ డిచ్చోట వ్రాలుట దైవదుర్బలతఁగాదె

తే॥ శక్రసుతు జయించిన హరిశ్మశ్రు విట్టికలను వ్రాలుట దైవదుర్బలతఁగాదె
యేమిచెప్పుదుఁ జెప్పినయెడల నాకు వ్యసన మంతకంతకు హెచ్చు నందువలన

చ॥ పదిలముతోడ నేను శిశుపాల జరాసుత దంతవక్త్రసా
ల్వదయితవర్యులన్ గలిసి త్వాదృశులన్ దగి యాదవాన్వయం
బదబదఁబొందఁ జెండెదను నంత సురాళి బలిష్ఠబాణపూ
ర్వదివిజవీరులన్ సుతలవాసులఁ గూడి హతంబొనర్చెదన్ ౨౨౮

క॥ సురభూసురగోశ్రుతి మునివరయజ్ఞతీర్థ పరమతములన్
నఱికెద నిం దరయగ నల సురజేత సఖుండు కంసశూరుఁడె కృతిగా ౨౨౯

క॥ అట్టి వయస్యుం డిపుడెప్పట్టునఁ గనుపట్టఁడయ్యె బలులార! యటం
చిట్టులఁ బలుకుచు మదనుని యెట్టయెదుట కేగి దనుజవృతుఁడై తమిదోన్

చ॥ ఘనమును లక్షభారభృతకార్ముకమున్ మయదైత్యనిర్మితం
బునుగొని టంకృతిన్ సలుప భూమి చలించెనుగూలె శైలముల్
వనధులు ఘూర్ణిలెన్ భటులు వ్రాలిరి పాఱిరి రథ్యమత్తహ
స్తినికర మాదతో నెగిరె దిగ్గజముల్ జెవుడొందె నయ్యెడన్. ౨౩౦

తే॥ ఆత్మచమువకస్మాత్తుగా నదరిపడుట గదుఁడు మొదలైనవారలుగాంచి రథము
లెక్కి కదనరంగంబున కేగుదెంచి ధనువులం డంకరించిరి దనుజు లదల ౨౩౧

వ॥ అత్తరుణంబునం దా శకునిదానవేంద్రుండు దశబాణంబులతో నర్జునిం గొట్టి రథసహితంబుగా నాల్గుకోసులదాఁక నెట్టి వింశతిబాణంబులతో గదునిం బీడించి స్యందనసహితంబుగా నభోమండలంబున కనిపి నలుబదిశరంబులతో ననిరుద్ధునొప్పించి శతాంగయుక్తంబుగాఁ బదాఱుకోసులందోసి శతపృషత్కంబులతో సాంబునిం బ్రహరించి తేరుతోఁ గూడ నంబరంబున ద్వాత్రింశద్యోజనంబులకుఁ బఱపి తత్సమయసమాగతుండగు ప్రద్యుమ్నుం గాంచి యమితరోషంబుతో నసం

ఖ్యాకంబులగు నంబకంబులతో హింసించి యరదంబుతోఁగూడ ఘటికాద్వయంబు గిరగిరం ద్రిప్పి వ్యోమమండలంబున శతకోశంబులంతం బడునట్లొనరించి విజృంభింప యాదవులంద రాశ్చర్యపయోధిమగ్నులై మత్తేభంబులు మొత్తంబుగాఁ జేరి యచలంబును దంతంబులతోఁ బ్రహరించినట్లు నానావిధ శస్త్రంబులతో నా శకునిం బ్రహరించిరి. ఏతత్సమయంబుననే మరలి గదార్జునానిరుద్ధసాంబు లేతెంచి ధనుష్టంకారంబులం గావించిరి. మఱియు నమ్మారుండును వాయువేగంబుతోఁ జను రథం బెక్కి దశశరంబులతో మహాభయంకరంబగు వాని చాపంబును ద్రుంచి విం శతిమార్గణంబులతో సూతుం డెగటార్చి సహస్రశుగంబులతో సహస్రాశ్వం బులం బడవేయ నద్దైత్యుం డుగ్రుండై రథంబును లేవఁదీసి యన్యుని సారథిగా నేర్ప రచి యందారోహించి చాపం బెక్కిడి తూణీరంబునుండి శతశిశరంబులంగూర్చి యాకర్ణంబునులాగి యాహోపురుషికతో నంగజున కిట్లనియె.　　　　　౭౮౨

—♦ శకుని ప్రద్యుమ్నయుద్ధవర్ణనము. ♦—

పంచచామరము.　అరే! స్మరా! మదీయశాత్రులందు నగ్రిమండవౌ
దురాత్మునిన్ మదోత్కటున్ విధూతమత్సహోదరున్
సురానుపోషకున్ బలిష్ఠు సూనబాణు నిన్ని దే
శరంబులన్ క్షణంబులోనఁ జంపివేతు నాదిలోన్　　　　　౭౮౩

తే॥ అవల స్వస్థతేజంబుతో యాదవులను దదనుచసులను హయులను మదకరులను
గాలుబలముల వధియింతు ఘనతఁగాంతునంచు వచియింప మరుఁడువచించెనిట్లు

ఉ॥ కాలబలంబు ఛాయవిధిగాఁదగి దేహికిఁ గష్టసౌఖ్యముల్
జాలఁగఁగూర్చు నూఱ్చుఁ బలుసాహ లటన్ మనశక్తి లేదు మే
ఘాళి మరుద్బలంబుననె యర్గను నిల్చునుగాదె! నింగిపై
నేల వృథాప్రలాపముల? నిటులఁ బ్రేలెదవోరి దుర్మతీ!　　　　　౭౮౪

తే॥ విత్తనమునాటి పెరిగించి విమలవారిఁ గొడవలింగొని సస్యంబుగోసి సేద్య
గానివలెఁ గాలమిట్టిజగమున్సృజించి పెంచి హరియించు గుణములన్ విబుధువైరి

తే॥ చేసితిన్ జేయుచున్నాను జేయఁగలనటంచుఁ బలుకుట మూర్ఖతనగునుగాదె
నీకు నిటు లహంకృతియేల? నిర్జరారి? యనఁగశకునియు నిట్లనె నంగజునకు

తే॥ నీవెచరితార్థతముఁడవు నృపవతంస! పలుకులన్ మునులను మించి పఱలుచుంటి
వైనఁ ద్రిగుణపృథగ్భూత మానవస్వభావమును వీడనేర్తురే? ప్రజలుజగతి.

క॥ ఈరహి నొండొరు లనుకొను చారణరంగంబునందు నలవృత్రసునా
సీరుల తీరున స్పర్థను బోరాడిరి నింగిఁజిత్రమునఁగన సురలున్　　　　　౭౮౫

ఆ॥ అప్పు డంగజాతుఁ డర్కాంశునిభమైన శరవరమున నసురవరుని ధనువు
జెడ్డమాటఁ జెలిమిఁ జెడఁగొట్టినట్టులఁ ద్రుంచె నంత నతఁడు మించి కినుక.

తే॥ లక్షభారాన్వితమగు నలఘుగదఁగొని మరుని శిరమందుఁగొట్టె నత్తఱి నతండు
గుట్టి కాచపాత్రింబును గొట్టినట్లు దద్గదన్ నుసిజేసెను దత్పరమున ౭౯౧

ఉ॥ ఆ సురవైరి కిన్కను బ్రిభాద్భుతమైన త్రిశూలహేతితో
నా సుమబాణు శీర్షమున నార్చుచుఁ గొట్టఁ దదంగజాతుఁడున్
రోసముతోడ దానిఁ దన రుగ్జ్వలితంబు త్రిశూలమేసి పోఁ
జేసియు నూరువ్రిక్కలుగఁ జెప్పరఁ గుంతమువైచె వానిపై ౭౯౨

తే॥ తత్ప్రిహారంబునన్ నొచ్చి దైత్యవిభుఁడు పరిఘనుంగొని హరిపుత్రుబాఁదెనవల
నంగజుండును యమదండమంది యతని యాయుధంబునునుసిజేసి యద్భుతముగ

ఉ॥ స్యందన సూతరథ్యములఁ జక్కఁగఁ గూల్చి యతండు కోపమున్
బొంది నిశాతఖడ్గమును బూని తనుం గవియంగ దానిని
న్గుందరథంబు పన్నగమునోటను ద్రుంచినలీలఁ జెండి బ
ల్త్రొందరతోఁ దదంసమున దుఃఖపడన్ బ్రిహరించె భూవరా! ౭౯౪

క॥ పిమ్మట శకునియుఁ దద్ధతి సొమ్మనుబడె నపుడు మరుఁ డసురనాథునిపై
న్యమ్మున వనిఁజొరఁబడు ననలమ్మువలెన్ జొచ్చి త్రుంచె లయయమనిభుఁడై.

తే॥ అసురు లంతట దమసేన నచ్చెరువుగఁ జెండి చెకపికవాడెడి చండవిక్ర
ముఁడు కృతాంతనిభుఁడునగు పుష్పశరునిఁగాంచి భయపడి పాఱిరి గలనువీడి

ఆ॥ శకుని మూర్ఛఁదేఱి స్వబలముల్ హతమాటఁ గాంచిలక్షభార కలితధనువు
నేపునఁగొని యొక్కయిషువందు ఘటియించి మరునితోడ నిట్లు మాటలాడె.

ఉ॥ కర్మ మిలన్ బ్రిధానమగుఁ గర్మమె యేలిక కర్మ మీశుఁడున్
గర్మమె సద్గురుండు మఱి గర్మమొసంగెడి నుచ్చనైచ్యముల్
గర్మమె గూర్చు లోకుల కఖండజయంబుఁ బరాజయంబు త
ర్కర్మముతో సమంబెదియుఁ గాదని నీమనమందు నమ్ముమా! ౭౯౮

తే॥ ఎవనిచే నెట్టిపని యాచరింపఁబడునో యద్ది వానినేపొందెడిః నఖిలనరుల
గోసహస్రంబులందునఁ గోడెదూడ స్వీయమాతనెఱిఁగి చేరు విధిని మదన!

ఉ॥ కావున నిప్డు పెక్కు దృఢకర్మములం బొనరించి మించు నీ
చేవ నణంచి యేను స్మరజిత్తనుపేరు గడించెదన్ జుమీ
యీవిధిఁ గాచికొమ్మనఁగఁ గృష్ణసుతుం డిటులాడె దానవా!
నీవనినట్టి కర్మములె నిచ్చలు కాలవశంబు గావొకో! ౮౦౦

వ॥ కర్మంబే ప్రధానంబని నీవు వచించినట్లే కొంద ఱొకానొకప్పుడు చేయం
బడిన పాకంబునకు విఘ్నం బేదేని గల్గినప్పు డద్దానికిఁ గాలంబే కారణంబనియు

గొందఱు యుక్తకాలపరికరంబు లుండియుఁ బాకంబు జెడినతటిఁ గర్తయే కారణం బనియుఁ గొందఱు కాలకర్తృకర్మము లనుకూలంబుగా నుండినను బాకంబున కంత రాయంబు కలిగిన తరుణంబున యోగంబే మూలంబనియుఁ గొందఱు యోగకర్తృ కాలకర్మంబులు పరిపూర్ణంబుగా జెలంగుచున్నను నయ్యాది వికారంబుబొందిన కాలం బున సాంఖ్యవిధియే నిదానంబనియువచింతురు. ఇట్లుయోగకాలకర్మసాంఖ్యవిధులచేఁ జెప్పంబడునది బ్రహ్మంబుగాని వేఱుగాదు.తద్బ్రహ్మంబే యీచరాచరాత్మకజగంబు సృష్టించి పోషించి హరించుననియు నెఱుంగుము. తద్బ్రహ్మంబును బరిపూర్ణతముం డును బరమేశ్వరుండునగు భగవంతునకేను నమస్కరింతు. తద్వ్యతిరిక్తంబుగా నేదియు నీజగంబునఁ గానేరదు గాదే యన నాలించి మాయావియగు నాశకుని దైత్యేంద్రుండా యాదవేంద్రునితో నిట్లనియె. ౮౦౧

తే॥ ఓయి ప్రద్యుమ్న! యదువీర! యుర్వియందు నీవె జ్ఞానశేవధివని యెంచుచుంటి
నీదు సందర్శనంబున నిఖిలపాపములుదొలఁగ నరుల్ ధన్యతఁ జెలఁగఁగలరు

తే॥ మఱియుఁ ద్వత్సహవాసముఁ మరగునరుల
గొప్పతనమును నలువయుఁ జెప్పఁగలఁడె?
యంచు మయదైత్య శిక్షితంబైనరౌర
వాస్త్రమును బ్రయోగించె సుమాస్త్రిపైని ౮౦౩

క॥ అందున భీకరవిషధరబృందములుఁ దేళ్ళు బుట్టి యెదిరులమూఁకన్
డిందఁగఁగుందఁగ గఱచి యమందతఁ దిరుగుటను గాంచి మరుఁడుఁ గ్రుధతోన్

క॥ గరుడాస్త్రము వేయఁగ నందురుభీకరవివిధపక్షు లుద్ధురగరుడుల్
ద్వరబైలుదేరి లేళ్ళను నురగములన్ మ్రింగి యేగె నొకనిముసములోఁ ౮౦౫

తే॥ అంత మాయావి శకుని యాత్మాస్త్రమట్టు
లగుట జనులారఁ గన్గొని యాగ్రహమున
భీకరమగు పైశాచియఁ పెద్దమాయ
బగరపైనిఁ బ్రయోగించెఁ బట్టుపట్టి. ౮౦౬

ఉ॥ ఆయెడఁ గోట్లకొల్దిని భయంకరభూతము లెన్నొప్రేతముల్
డాయుచు నిప్పులం గురిసి డాంబరమందున హెచ్చుచుండ నా
తోయజనాభసూతి గని దూరవిచారణ జేసి తామసీ
మాయ యటంచెఱింగి యది మాన్పఁగ నెంచి విచిత్రపద్ధతిఁ ౮౦౭

మ॥ పరిశుద్ధంబగు సాత్వికాస్త్రిమణిసఁ వైచెన్ దదస్త్రింబునన్
బరిశుభ్రుల్ హరిపార్షదుల్ గరముగా భాసిల్లి తన్మాయనుఁ
ద్వరఁ దార్ష్యుండహిఁద్రుంచినట్లు నఱుకఁ దైత్యేంద్రుడుఁ గొహ్వాకీ
వరమాయఁ యదుసేనపైనిఁ బఱపెఁ స్వచ్ఛందసంచారియై ౮౦౮

క॥ అమాయను మేఘంబులు భీమంబగు ధ్వనులతోడ విస్ఫాస్రజ్మే
దోమజ్జామూత్రాస్థుల నామృధమునఁ గురిసె మిగుల యాదవులదలన్ ౮౦౯

తే॥ మదనుఁ డదిగని గౌహ్యాకీమాయయంచు
నెఱిఁగి కోలాస్త్రమున్ వేయఁ ద్వరను నందు
భయదయజ్ఞవరాహంబు బైలుదేరి
సడలజాడించి ఘుర్ఘురస్వనముతోడ. ౮౧౦

ఆ॥ శాతదంష్ట్రల నల జలదసంతతినెల్ల ద్విపము వేణువులను విఱిచినట్లు
జీల్చె నంత శకుని చిత్రమాగాంధర్వియ నెడి మాయఁబఱపెనపుడు దాన

సీ॥ హేమమయంబులై యెన్నంగ పీల్గాని ప్రాసాదరాజముల్ పరిఢవించె
మోహనరాగముల్ ముచ్చటగాఁ బాడు మోహినీకోటులు బొల్పుఁగాంచె
వాదిత్రపరమయి పాడెడి గంధర్వసుందరీబృందంబు సందగించె
బల్కులన్ జగముల వంచెడి విద్యాధరాంగనాసముదాయ మతిశయించె

తే॥ మఱియు నిట్టుల నెందఱో మఱఁత లాజిఁ
జెలఁగి యదుసేన మోహంబుగొలుపుచుంట
దర్పకుఁడు గని యిద్ది గాంధర్వియంచు
నెఱిఁగి జ్ఞానాస్త్రమున్ వేసె నేమఱలక. ౮౧౨

క॥ ఆనారాచంబున యదుసేనలు దమి విడిచి తెలివిఁజెలఁగుటఁగని యా
దానవనాథుఁడు చిత్రము మానసమునఁజెంది కినుకమందుచు దండిన్ ౮౧౩

తే॥ భయదరాక్షసీమాయను బఱపె నందు పక్షయుతపర్వతంబులు బైలుదేరి
క్షణములో నభస్థలమునుగప్పె నప్పు డంధకారంబు లెల్లెడ నల్లుకొనియె

వ॥ మఱియు నప్పర్వతంబులు దగులఁబడెడి వృక్షంబులను పాషాణంబులను నస్త్రులను గబంధంబులను రక్తంబులను గదాపరిఘాసిముసలాద్యాయుధంబులను రణంబున వర్షించుచు నంబరంబున సంచరింపందొడంగె. వెండియుఁ దన్మాయాబలంబున రక్షోగణంబులును యాతుధానవితానంబులును శూలంబులతోఁ గోట్లకొలందిగా నిర్గమించి కరిహయంబులను ఖండింప సమకట్టె. సింహవ్యాఘ్రవరాహ ఖరంబు లందు విజృంభించి యాదవకరిహరులను ద్రుంప నారంభించె. అంత రతికాంతుం డేతత్స్థితిని గని భయంపడి పరుగిడు నాత్మబలంబులం గాంచి తన్మాయోపశమనార్థంబై నృసింహాస్త్రంబు ప్రయోగింప నందు ౮౧౪

సీ॥ ధగధగద్ధగధగ త్తరణికోటిసమాన భాసమానప్రభాపటలితోడ
ప్రలయకాలాభీలపావకజిహ్వావిశేషభీకరలలజ్జిహ్వతోడ
శంఖచక్రగదాది సంస్ఫురచ్ఛండాస మాంసలాజానుబాహాళితోడ
దుష్టలోకాంతక ధూమకేతుసమాన సంచలద్దీర్ఘపుచ్ఛంబుతోడ

తే॥ ఆయతోత్కట కంటకప్రాయరోమ రాజితోడ దంభోళివిరాజదురున
ఖములతోడ నదభ్రాభ్రసమితితులితచిత్రరవముతో శ్రీనరసింహాకృతి.

వ॥ జనించి యహంకారంబుతో బ్రహ్మాండభాండంబు బ్రద్దలగునట్లు హుంకరించుచు నాకొండలంగూల్చి రక్షోయాతుధానగణంబులనుగొట్టి నెట్టి తత్కిరికిరిఖరాములను నఖంబులతోఁ జీల్చి గగనంబునం బాఱవైచి తద్రాక్షసి మాయ నశింపఁజేసి మఱందు మహేంద్రనామకవిజయశంఖంబుఁ బూరింప జయధ్వనిసహిత దుందుభులు మ్రోయ సురలు విరులం గురియ నంతర్ధానంబయ్యె. అత్తఱుణంబునం దయ్యసురుం డాత్మసైన్యయుక్తంబుగా నదటనే యదృశ్యుండై యమోఘంబగు దైతేయీమాయను బ్రయోగింపఁ దద్బలంబున సంవర్తకాది జీమూతంబు లంబరం బాచ్ఛాదించి వేదండశుండాసమధారతో వర్షించె. తద్వర్షంబున నొక్క త్రుటిలో నీ భూమండలంబంతయు నర్ణవమయంబయ్యె. అత్తఱి యాదవులు భీతిచెంది శ్రీరామ కృష్ణనామస్మరణం బొనరించుచు నాత్మబలంబుల మఱచి పరాజితులైనట్లు గడగడ లాడుచుండఁ బ్రద్యుమ్నుం డాలోకించి నిజచండకోదండంబున శ్రీకృష్ణనామకాస్త్రం బనుసంధించె. దానినుండి పీర తేజంబు జయించునదియు దశదిశల వెల్గించునదియు నవకోటిసూర్యులతో సాటియైనదియు నగు తేజం బుప్పతిల్లె అమ్మహాతేజంబున

సీ॥ స్వర్ణాంబుజపరాగవాసుండు నూత్నాభ్రవర్ణుండు సత్కరుణార్ణవుండు
శ్రీవత్సరత్నాది చిత్రితవక్షుండు తోయజాక్షుండు చతుర్భుజుండు
ప్రస్ఫురన్మకుటుండు పాదాంగదాద్యలంకారయుతుండు నిష్కల్మషుండు
భానుప్రభాభ జాంబూనదకుండలుం డలఘుబలుఁడు దివ్యహారధరుఁడు

తే॥ దేవదేవుండు కృష్ణుడు తేజరిలుట యాదవులుగాంచి యానందమంది మ్రొక్కి
పుష్పములఁ జల్లి రల్ల దామోదరుండు శకుని విలుద్రుంచె శార్ఙ్గజశరముతోడ.

తే॥ అంత ఛిన్నచాపుండగు నసురుఁ డాత్మహేతిసంహతులంగొని యేగుదెంచ
నెంచి చంద్రావతీపురి కేగెఁ గృష్ణుఁ డఖిలయాదవులం బిల్చి యనియె నిట్లు.

♦ శ్రీకృష్ణాస్త్రనిర్గత శ్రీకృష్ణుండు తద్వధోపాయంబాలోచించి గరుడునకుం జెప్పుట. ♦

ఉ॥ యాదవులార! వీఁడు మునుత్ర్యంబకుఁ గూర్చి తపంబు మేరుశై
లోదగనుత్తమస్థలిని నోదనముఁ విడి చౌయుగంబులుఁ
మోదమునం బొనర్ప నల భూతవిభుండు ప్రసన్నుఁడౌచుఁ బూ
ర్వాదివిజుఁజేరి యిత్తఱి వరంబులొసంగెద నీవు గోరుమా! ౮౨౦

క॥ అనవుడు శకునియు వినతులఁబొనరిచి యానందబాష్ప పూర్ణాక్షుండై
త్రినయనునిఁ బ్రసన్నుని శంభుని నిటుల వేఁడఁదొడఁగె మోడ్చి కరంబుల్

తే॥ ఏనె బలులనందఱను జయింపవలయు నీల్గినన్ ధరాస్పృష్టి జీవింపవలయు
నింగి ఘటికాద్వయము దాఁక నీల్గఁ గూడ దీవరంబుల నిడి కావవే! మహాత్మ!

ఉ॥ అత్తఱి శంభుఁ డాతనికి నట్టి వరంబులొసంగి గూటిలో
హత్తిన కీరమిచ్చి దనుజా! యిది జీవసమంబుగాను నీ
సత్తను గాచికొందగును సంతతమియ్యది యెప్డుపోవునో
యత్తఱి నీదు జీవములు నంతము జెందునటం చెఱుంగుమా! ౮–౨౩

తే॥ ఇటుల వచియించి శంకరుం డట నదృశ్యుఁడయ్యెఁ దత్కారణంబున నాశుకంబు
నీల్గినం గాని శకునియు నీల్గఁడంచు వైనతేయునిఁ గని యిట్లుపలికె నగుచు

ఆ॥ ధీవరేణ్య! విహగదేవ! యోజనశతవిస్తృతంబు నసురవృతము పవన
సౌధరుచిరమైన చంద్రావతీపురిఁ బొమ్ము పనులసల్పి రమ్ము మరలి. ౮–౨౪

క॥ అనవుడు గరుడుం డొప్పుచు దనుజులు దనుఁ గనని కరణిఁ దనురూపముతోఁ
జని చంద్రావతి కటఁగల కనదురుహర్మ్యాదిలీలఁ గాంచుచు వరుసన్ ౮–౨౫

—♦ గరుడుండు శకుని శుకహరణార్థంబై చంద్రద్వీపంబునకుఁ బోవుట. ♦—

చ॥ శకుని గృహంబుఁజేరి దనుజప్రభుజీవముగాఁ జెలంగు నా
శుక మెటనున్నదో యనుచుఁ జూచుచునుండఁగ క్రోధమూర్తియై
సకల మహాయుధంబుల వెసన్ గొని క్రిమ్మఱఁ నాజికేగు నా
శకుని కరంబుఁ బట్టికొని సాధ్వి మదాలస యిటు పల్కెడిన్ ౮–౨౬.

తే॥ నీకు ననుకూలురైనట్టి నేస్తకాండ్రు బేరుఁగాంచిన తమ్ములు వీరవీరు
లైన దానవోద్భటులు రణాంగణమునఁ బగరచేఁ జంపఁబడిరిగా ప్రాణనాథ!

మాలినీవృత్తము॥ వలదు వలదు నాథా! భండనార్థంబుగాఁ బో
వలదు వలదు రాజా! పంకజాక్షుండు నేఁడా
కలహముఁ బొనరించున్ గాన నామాటవించున్
బలులనిడి సుఖంబుల్ వాసిగాఁ బొందుమయ్యా! ౮–౨౯

క॥ అనవుడు తద్దనుజుం డిట్లనియెను నబలామణీ! మదనుజుల నెల్లన్
గినుకను జెండిన యాదవజనముల నీదినము జంపి సంతోషింతున్ ౮–౩౦

తే॥ సాంబవరమున నాకిలన్ జావులేదు చంద్రనామకోపద్వీప సమధిగతప
తంగగిరి శంఖచూడ భుజంగరక్షితశుకమందు నాప్రాణమున్ దనరుచుండె

తే॥ ఇట్టిసంగతి నెవ్వరు నెఱుఁగ రట్టి కారణంబున మృతియెట్లుగలుగు నాకుఁ?
జెలిరొ! భయపడవలదని చెప్పి నల్లచిలుకవార్తను విని ఖగశేఖరుండు ౮–౩౨

ఆ॥ అచటనుండి వేగ నా యుపద్వీపముఁ జేరఁదలఁచి యెగిరి సింధుతటముఁ
బొంది యట్టి దీవిఁ బూర్తిగా వెదకుచు దిరుగఁదొడఁగె మింట ధరణినాథ!

వ॥ అట్లు శతయోజనవిస్తీర్ణంబును భీమనాదంబును గల సముద్రింబుపై జరించుచు గ్రమంబుగా నొక్కద్వీపంబున కేగి తత్రత్యులచే సింహళంబని తెలిసికొని యటసాఁగి లంకాపట్టణంబున కరిగి తత్పరిసరంబందలి త్రికూటాచలంబును దర్శించి యవల పాంచజన్యద్వీపంబునకుం బోయి యందు క్షుద్బాధితుండై సాగరవిరాజమానమీనంబులం గడుపార గ్రసించుచుండె. అత్తఱి యోజనద్వయపరిమిత మహానక్రం బొం డాగరుడుని పదంబులంబట్టి జలంబులోని కీడ్వ నా వైనతేయుం డద్దానిం గ్రమ్మఱలాగికొనుచు నీవలకేతెంచె. ఇట్లు రెండుగడియ లా రెంటికి దంట పోరయ్యె. తుట్టతుద కా గరుడుండే తీక్ష్ణతుండంబుతోఁ దత్పృష్ఠభాగంబున యముండు దండంబుతో బాఁదినట్లు ప్రహరింప నద్ది మరణించి తన్నక్రరూపంబు విడిచి విద్యాధరరూపంబుఁ దాల్చి గరుడునికి నమస్కరించి ప్రసన్నవదనంబుతో దేవా! యేను హేమకుండలుండను విద్యాధరుండను. మున్ను దేవతలతోఁ గూడి స్నానార్థంబై విష్ణుపదికిం బోయి యందు జలకంబాడు కకుత్థనామకమహాముని పాదంబులం బట్టికొని విలాసార్థంబుగా నీటిలోని కేగుట నమ్ముని గని కినిసి మకరంబవు గమ్మని శపించి మత్ప్రార్థనం బాలించి విష్ణురథప్రహారంబున ముక్తుండవు కాఁగలవని యనుగ్రహించె. తద్రీతి నిప్పుడు నీదయ ధన్యుండనైతినని నుతించుచు స్వర్గంబున కేగె. అంత నా ఖగకాంతుం డటనుండి నభోమండలంబున కుడ్డీనుండై క్రమంబుగా హరిణాఖ్యద్వీపంబున కరిగి సంచరించెడి సమయంబున ౮౩౪

తే॥ అతనిపతుం బహర్నిశమధికతపము దమినిసల్పు నపాంతరతమతపస్వి
యాశ్రమంబునఁ బడె నప్పుడమ్మునిగని పైనిఁజను పక్షినేతకుఁ బలికె నిట్లు

క॥ గరుడీ! యీపక్షము నా శిరమున నీవుంచి వేగ స్వేచ్ఛనుబొమ్మా!
యఱమఱజెందకు మనవుడు గరుడుఁడు సనుదెంచి తెక్కఁగైకొని వేడ్కన్.

క॥ అల మునితలపై నిడి యటఁ బలుపక్షము లట్టి విందుభాతిని నుంటన్
లలివింతన్ గనుటన్ గని పలికె నిటు మునివిభుండు పక్షీంద్రునకున్ ౮౩౭

చ॥ ఎపు డెపు డా పరాత్పరుఁడు కృష్ణవిభుం డవతారమెత్తునో
యపుడపుడున్ మదీయశిరమం దొక తార్క్ష్యుని తెక్కరా లెడిన్
సుపతగ! నాశిరంబుపయిఁ జూడుము పక్షము లెన్నియున్నవో
యపహృతమస్తుఁడైన హరికంజలిజేసెద భక్తితోడుతన్ ౮౩౮

చ॥ అనవుడు తన్నగాశనుఁడు నద్భుతహర్షములొంది శ్రద్ధ నా
ఘనముని మ్రొక్కి వేరమణకంబను దీవికిఁబోయి యందునన్
దనరు విచిత్రలీలలను దద్దయుఁ గన్గొని సర్పరాజులి
చ్చిన కరదంబులన్ దమినిఁ జేకొని వెంటనె సాఁగి యచ్చటన్ ౮౩౯

క॥ ఆవర్తకాఖ్యఁ జెలఁగెడి దీవికరిగి యమృతకుండ దివ్యత్సుధనున్
ద్రావియు శుక్లద్వీపముఁ బోవఁదలఁచి యచటఁ గదలె భూపలలామా!

తే॥ అవల గరుడి శుక్లద్వీపమందుఁజేరి యల్ల చంద్రాహ్వాయద్వీపమడుగు చచటఁ
దనరు నాచేత దక్షిణతిన్ వినుచు నుత్తరాశకుం జనె శ్రీమైథిలాధినాథ! ౮౪౧

వ॥ అంత నాగాంతకుం డా చంద్రద్వీపంబున కరిగి తత్పతంగ పర్వతంబందలి జలదుర్గవహ్నిదుర్గంబులం గాంచి చంచూపుటంబున జలదుర్గంబును ధరించి యద్దానిచే నయ్యనలదుర్గంబునుజల్లార్చి సానుముఖంబుననున్న లక్షదైతేయులతో రెండు గడియలు భండనం బాచరించి పాదంబులతోఁ గొందఱను బక్షంబులతోఁ గొందఱను నఖంబులతోఁ గొందఱం బరిమార్చి వెంటనంటి మిగతవారిం దఱిమి లోనికిం బ్రవేశించి శుకరక్షకుండగు శంఖచూడ సర్పేంద్రునిపై నడుగిడ నది యులిక్కిపడి పంజరసహితంబగు తత్కీరంబును నీరంబునం బడవైచి పాఱె. అంతట నాఖగకాంతుండు వెంటనే చని నాసికతో నా చిలుకం గొని యుద్ధభూమికిం బోవనెంచి వ్యోమమండలంబున కెగురుట పలాయితులగు పలాశులాలోకించి శుకం బపహృతంబయ్యె నపహృతంబయ్యెనని మహాకోలాహలంబులం గావించిరి. తద్రవంబు భూనభోమండలంబు వ్యాపించె. కర్ణాకర్ణికగా నా శకునియుఁ దన శుకం బండజపతిచే నపహృతంబయ్యెననివిని కనలి శూలహస్తుండై యాత్మపురినుండి వెడలి యాగరుడునిం డాసి శూలంబుతోఁ బ్రహరించుచు వెంటనంట నాతం డాస్యంబునుండి యాకీరంబును వీడక సప్తద్వీపంబులను సప్తసింధువులను దిరిగి తద్దేతివాతపీడితుండై తుద కంబరంబున లక్షయోజనంబులేగి యటనుండికసితో నది మేరుపర్వతశిఖరంబునం బడి నీల్గునట్లు బడవేసి యుద్ధరంగంబునందున్న వెన్నుని సన్నిధికిం జని తత్ప్రశంసావాక్యంబు లందుచుండె. అంతఁ దత్ప్రహారంబున శుకంబు మడియుట దానవేంద్రుండు విలోకించి నొచ్చినమనంబుతో నాగ్రహించి హతశేషాసురులం దోడ్కొని యుచ్చైశ్రవహయం బెక్కి భయంకరంబుగా ధనువుం డంకరించుచు శ్రీకృష్ణ సమ్ముఖంబున కేతెంచె. ౮౪౨

తే॥ అపుడు యాదవులందఱు నసురవరుఁడు మరల వాహినితో నని కరుగుదెంచు
టను విలోకించి హేతులంగొనుచు నట్టి దానవులతోడఁ దలపడిరో నృపాల!

తే॥ అందు శూరులు శూరులు సహాసహామిక
సింహములు సింహములు బోరుఁజేయుకరణిఁ
బోరి రిటు రెండు తెగలకు ఘోరయుద్ధ
మయ్యె శకుని సేనాగ్రమునందు నిలిచి ౮-౪౪

—♦ శకునిదైత్యుండు శ్రీకృష్ణునితోఁ బోరి నీల్గుట. ♦—

శా॥ కోదండంబును డంకరించి శరముల్ గోటానకోట్లేసి యా
చ్ఛాదింపన్ దివి గ్రమ్మెఁజీఁకటులు తచ్ఛక్రాయుధుండున్ బలుం
డో దామోదరుఁ డప్డు జేకశిఖతోఁ దద్బాణసందోహమున్
ఛేదింపన్ సుకరంబుగా దితిసుతశ్రేష్ఠుండు రోషంబుతోన్ ౮-౪౫

క॥ ధనువెక్కుపెట్టి పూర్తిగ వనజాక్షుని హృదయమందుఁ బదిశరముల వే
సిన హరి పదిబాణంబుల దనుజేశుని ధనువుఁద్రుంచెఁ దత్పరమందున్. ౮-౪౬

చ॥ శకుని శతస్వరూపుఁడయి సారసలోచనుతోడ సాంపరా
యికముఁ బొనర్పఁగాంచి యల కృష్ణుఁడునున్ వెయిరూపులొంది ప్రే
క్షకు లదిరా! యనన్ దనుజకాంతునితో రణమాడ వాఁడు పా
వకసమమౌ త్రిశూలమును బల్మిని ద్రిప్పియు వైచె శౌరిపై ౮-౪౭

క॥ అంతఁ గృతాంతనిభుఁడు శ్రీకాంతుం డద్దానిఁబట్టి కరమున విఱిచెన్
బంతమున గరుత్మంతుఁడు వింతగ నాశీవిషంబు విఱిచినకరణిన్ ౮-౪౮

తే॥ మఱియు శ్రీహరి వజ్రసమానగదను హయమునుండి యా దానవుం డవనిపైని
గూలునటు శీర్షమందునఁగొట్టెఁ దత్ప్రహారమున వాఁడు మూర్ఛిల్లె ధారణీశ!

చ॥ క్రమముగ లేచి యా శకుని కన్నులనిప్పులురాలుచుండ స్వీ
యమగు గదన్ గరానఁగొని యా హరిఁగొట్టెను నిట్లు ఘోరనా
దములు సెలంగ వారికి గదారణమయ్యెను నంతఁ బూరుషో
త్తముగద యట్టి దానవుగదన్ నుసిజేసెను నంత నిర్వురున్ ౮-౫౦

తే॥ భూధరదరీముఖంబునఁబూన్కి రెండుసింహములు బోరుతీరునఁ జిత్రవనము
నందు రెండుమదేభంబులాహవంబుసలుపు తెఱఁగునఁ గయ్యంబుసల్పి రపుడు.

తే॥ శకుని శ్రీకృష్ణుని శతయోజనములఁ గసిఁ
ద్రోయఁ దోయజాక్షుండును దోర్బలమున
నతని పిక్కలన్ బట్టి సహస్రయోజ
నములఁగూల్చెను ధరపై ననంతరమున. ౮-౫౧

చ॥ జయజయ యంచు నా శకుని చారుధిశైలముపైవఁ గృష్ణుపై
రయమున నాతఁడద్దిగొని రాక్షసుపై బడవేసె నొండొరుల్
జయజయయంచు నిట్టు లలశైలముఁ ద్రోసికొనంగడంగి ర
ల్లయచలమంతమం దల పలాశపురంబునఁ గూలెఁ బాడుగాన్ ౮-౫౩

తే॥ శకుని యంతట స్వపురంబు వికృతిగనుట
గాంచి యత్యుద్ధురక్రుధఁ ఖడ్గచర్మ
ములను గైకొని యాకృష్ణుమ్రోలకేగె
నపుడు శార్ఙ్గి శార్ఙ్గముఁగొని యాగ్రహమున ౮౫౪

ఆ॥ అర్ధచంద్రరూపకాంబకం బతనిపై వైవ నద్ది గ్రీష్మభానుభాతి
వెలిఁగి దశదిశలను వెల్గించి తద్దైత్యు మస్తకంబుఁ ద్రుంచి మహినిఁ జొచ్చె.

ఆ॥ దనుజుఁ డిట్లు గిట్టి ధాత్రీతలస్పృష్టి క్షణములోన బ్రతికి స్వకశిరంబుఁ
బాణినిఁగొని తన కబంధంబునం బెట్టి మరల హరినిఁ బోరసరిగె జనక! ౮౫౬

తే॥ అపుడు కృష్ణుఁడు తీవ్రమహా సంటకమున
వాని తలఁద్రుంచెఁ గ్రిమ్మఱ వాఁడు బ్రతికె
నిటుల నేడుసారులు వాఁడు కృష్ణుచేతఁ
జచ్చియున్ మనె వింతగా సర్వులకును. ౮౫౭

ఉ॥ ఇట్టుల రాహుభాతిమరణించి ధరాతలమంటి క్రిమ్మఱన్
బుట్టెడి దానవేశ్వరుఁ డమోఘవిధంబునఁ జిచ్చు కాఱునుం
బట్టి దహించుమాడ్కి యదు పార్థివసేనలఁజొచ్చి వీరులన్
బట్టుచు లక్షయామడలఁ బాఱగవైచి నభస్థలంబునన్ ౮౫౮

ఉ॥ కొన్నిఁటి నేన్గులన్ నొసటఁగూరిచి కక్షలఁజేర్చి కొన్నిఁటిన్
గొన్నిఁటి నంసయుగ్మమునఁ గూర్చి లయానలరుద్రుకైవడిన్
బన్నుచు నొక్కఁడయ్యు యదువర్యభటాళిని గాళ్ళఁజేతులం
దన్నుచుఁ జెండ యాదవపతాకిని క్షోభముఁజెందె నయ్యెడన్ ౮౫౯

ఉ॥ చక్రి యవక్రవిక్రముఁడు సాధుజనావళిరక్షణార్థమై
వక్రిచరిష్ణుఁడౌ శకునిపైని సుదర్శనహేతి వేయ నా
చక్రము కాలకోటిరవిసామ్యరుచిన్ జని వాని కంఠమున్
శక్రుని హేతి వృత్రుతల సంహృతిజేయువిధిన్ హరింపఁగాన్. ౮౬౦

చ॥ హరి సని గిట్టనట్టి దనుజాధిపుహస్తమునం గ్రహించి యం
బరమునఁ బాఱవైచి యదువంశజులార! ప్రమాదహీనులై
శరములతోడ నిట్టిదనుజప్రభు ధాత్రిని నంటకుండఁగాఁ
గొఱఁతలు లేనియట్లెగురఁగొట్టుఁడి! నెట్టుఁడి! యంచుఁ బల్కుటన్ ౮౬౧

తే॥ యాదవోద్భటులందఱు నాలకించి నింగినుండి ధాత్రింబడు నిర్జరారిఁ
బెక్కుదివ్యబాణంబులన్ వేసి మింట నెగురఁగొట్టిరి సురలు వీక్షింప వింత

వ॥ అంత నంతరిక్షంబునుండి తిరిగి ధరం బడంబోవు నా పొలదిండి దీప్తి

మంతుని బాణంబులతో శతయోజనంబులకును, సాంబాంబకంబుతో సహస్రయోజనంబులకును నర్జునశరంబుతో నయుతయోజనంబులకును ననిరుద్ధమార్గణంబుతో లక్షయోజనంబులకును బ్రద్యుమ్నాశుగంబుతో నియుతయోజనంబులకును యామద్వయంబు గతించుదాఁక నింగికి నెగురఁగొట్టంబడి మరలి క్రిందిభాగంబున కేతెంచుట శ్రీకృష్ణుండు జూచి యొండు పృషత్కంబు వేసి కోటియోజనంబు లంబరంబునం దవ్వానింబఱపి వెంటనే రెండవశరంబుతో నలుగడలఁ గోటియోజనంబులవఱకుం ద్రిప్పి తుట్టతుదకు మారుతంబుచే దించి నీరజంబును నీరంబునంబడ వేసినట్లు నీరధిం గూల్చె. తత్పతనంబున నా చండబలుండు నిశ్శేషంబుగా మృతుండయ్యె. ఆ సమయంబునం దతనిజోతియు నా శ్రీకృష్ణునిలోన లీనంబయ్యె. అప్పుడు,

చ॥ కురిసిరిపుష్పముల్ సురలు క్షోణివికాసముగాంచె దుందుభుల్
మొరసె జయధ్వనుల్ సెలఁగె మోదము సెందిరి కిన్నరాదులున్
సురపతి మున్ను వేల్పులనుజూచి ముదంబునవచ్చి మ్రొక్కెరా
హరికి సమస్తమానితతిహర్షముఁబొందె ధరేశ! విస్ఫుటన్ ౮౬౪

శ్రీకృష్ణుండు చంద్రావతీపురి కేగి శరణాగతులైన శకుని
భార్యాపుత్రుల కభయదానం బొసంగుట.

మ॥ హతశేషుల్ దనుజుల్ పలాయితులుగా నా కృష్ణుఁడున్ యాదవ
ప్రతతిన్ గూడుచు వందిమాగధజనుల్ వర్ణింప ఢక్కాదివా
ద్యతతుల్ మ్రోయఁగఁజేయుచున్ జయజయధ్వానంబుతో రాక్షసా
వృతచంద్రావతి కేగె సంతసమునన్ వెన్నంట గీర్వాణులున్ ౮౬౫

తే॥ ఆసమయమందు శకునియర్ధాంగి భర్తృమరణదుఃఖార్త మానినీమణి మదాల
స నిజసుతుఁగొని శ్రీకృష్ణచరణములను వ్రాల్చి యశ్రుపూర్ణాస్యయై పలికెనిట్లు.

మ॥ ధరణీభారముఁ బాపఁగా సుజనసంతానంబు రక్షింపఁగాఁ
బరమేశా! యనుకంపతోడ యదుసద్వంశంబునం బుట్టవే
యరయన్ సృష్టినిఁ బాలనంబు మఱిసంహారంబునుం జేయు నే
ర్వరివీవే కద! యట్టులయ్యుగుణముల్ బంధింపవే నిన్నహో! ౮౬౬

సుగంధివృత్తము. దేవదేవ! వాసుదేవ! దేవరాజపోషకా!
దేవకీసుతా! మహాత్మ! దేవవైరినాశకా!
దేవవంద్య! రాధికేశ! దివ్యగోజగత్పతీ!
శ్రీవిభూ! శిరంబుతోడఁ జేసెదన్ నమస్కృతుల్ ౮౬౭

తే॥ కృష్ణ! నాభర్త నీయెడ నేమియేమితప్పులొనరించె నయ్యవి యొప్పులుగను
దలఁచి మన్నింపుమా! నాదు తనయు వీని బాలుఁ బాలింపుమా! కరుణాలవాల!

చ॥ అనవుడు కృష్ణమూర్తి తనహస్తములన్ భయభీతుఁడైన త
త్తనయుశిరంబుపైని నిడి దైన్యముపీడుము కల్పమేగుదాఁ,
కను మను మిట్టిరాజ్యమును గాంచుము జ్ఞానవిరక్తిభక్తులన్
గనుమని స్వీయమాల శిశుకంఠమునందున వైచె భూమిపా! ౭౨౦

ఉ॥ శ్రీవిభుఁ డంతమున్ను సురశేఖరు గెల్చి దివంబునుండి యా
దేవవిరోధియా శకుని దెచ్చిన ధేనుసురద్రుమాశ్వశో
భావిలసన్మణుల్ దివిజవర్యునకిచ్చెఁగదా యతండు గో
దేవధరామరశ్రుతిసుధీజనులన్ దమిఁ బ్రోవఁ బుట్టఁడే ; ౭౨౧

తే॥ అనఁగ బహులాశ్వుఁడిట్లనె నమరయోగివర! శకుని మొదలైన యీసురవిరోధు
లాదిజన్మంబునం దెవ్వరట్లుముక్తిఁ సెందుటకు హేతువేమొ? వచింపుమయ్య!

తే॥ అనల నారదుఁడిట్లాడె నవనిపతికి సంగ్రహించి వచించెద జనక! వినుము
తొల్లి బ్రహ్మకల్పంబునందున వసువను నొకఁడు గంధర్వనాథుఁడై యొప్పుచుండు

## నారదుండు జనకునకు శకున్యాద్యసుర పూర్వజన్మవృత్తాంతంబుఁ జెప్పుట

వ॥ అట్టి గంధర్వపతికిం గామరూపులును దివ్యభూషణభూషితులునగు మం దార మందర మంద మందహాస మహాబల సుదేవ సుధన సౌధ శ్రీభానువులను పేరులతోఁ బరగు తొమ్మండుగురు పుత్రులు జనించిరి. అవ్వార లొక్కసమయంబునందు బ్రహ్మలోకంబున కేగి తత్పుత్రికయగు సరస్వతిం గాంచి మోహించి మనంబున హసించిరి. తద్బ్రహ్మాపరాధంబున వారు తమోగుణమయంబగు రాక్షసయోని నాశ్రయించి వరాహకల్పంబున హిరణ్యాక్షునిభార్య యందు శకుని శంబర హృష్ట భూతసంతాపన వృక కాలనాభ మహానాభ హరిశ్మశ్రూత్కచులను నామంబులతోఁ బుట్టి నెగడుచుండ నపాంతరతమనామకమహాముని చనుదెంచె. అమ్మాయి నమ్మహాసురు లభివాదనమ్ములాచరించి సర్వజ్ఞా! భక్తవత్సలుండగు భగవంతుండు భక్తులకు ముక్తియిచ్చునుగాదే? అసురయోనియం దుద్భవిల్లిన మాచే నాపరాత్పరునియెడ భక్తిభావం బల్పంబేనిఁ జూపఁబడలేదు. ఇఁక మేమెట్లు కృతార్థులము గాగలమో యా యుపాయమానతీయుమని ప్రార్థింప నా యోగివర్యుం డెవరెవరే యేగుణంబుల నాపరుని భజింతురో వారు వా రాయారీతుల నిశ్శ్రేయసపదంబును బొందగలరు. మున్ను పృశ్నిగర్భసంబంధంబున బ్రహ్మలును, సద్భావంబునం బ్రహ్లాదుండును, స్నేహంబున సుతపమునియు, భయంబున హిరణ్యకశిపుండును, క్రోధంబున మీ తండ్రియగు హిరణ్యాక్షుండును సేవించి యా హరిం జేరిరి. అట్లే మీ రేదోవిధంబుగా నిశ్చలంబగు మనంబుతో నా దేవుని భజించి కృతార్థులుగండని చెప్ప నా శకున్యాదు లా విధంబుగా కీటంబు భ్రమరభయంబుచే భ్రమరంబైనట్లు

ద్వేషించి క్రమంబుగా నా హరింబొందిరి. ఇట్లు యాదవేశ్వరుండు భద్రాశ్వఖండంబు జయించి సకలసైన్య పరివారసహితంబుగా నందు సాఁగి,

## ప్రద్యుమ్నుం డిలావృతఖండంబును గెలుచుట.

సీ॥ జంబుభవంబగు జాంబూనదము స్వతస్సిద్ధభవంబయి చెలఁగు నెచట
సర్వామయంబులన్ సమయింపఁజాలిన "యరుణోద"యను నదివఱలు నెచట
నన్నాసనాభరణాదిఫలంబులనిచ్చెడి నదములు నెసఁగు నెచట
నెల్లకాలంబుల నీశుండు ప్రియలతోఁగూడి సంతసమునఁగొదరు నెచట
తే॥ శీతవాతోష్ణవైవర్ణ్య పూతిగంధ
బాధలన్ బాపెడి ప్రియకప్రభవపంచ
మధురమధుధారలన్ ద్రావి మనుజులెట సు
ఖంబుఁగాంతురా యిలావృతఖండమందె. ౮౭౫

తే॥ అట్టి ఖండంబునందున నరిగినవరు లబలలౌదురు సంకర్షణాభిధాన
దేవుఁ డుండును గాశ్మీర దేవతరువులొప్పు నూర్థ్వవనము వెల్గుచుండు మఱియు,

ఆ॥ స్వర్ణపద్మములును వాసంతశీతానిలములు దగు లవంగలతలు దనరు
సంతతంబు సురలు సంచరించుచునుంద్రు మత్తభృంగములును హత్తియుండు.

తే॥ పర్వతేంద్రంబు సత్కళావాస మవనిగోళకర్ణికాభము శాతకుంభమయము
రత్నసానురాజితము స్ఫురత్ప్రకాశమునయి మేరునామకగిరి దనరుచుండు

తే॥ తన్నగంబునకున్ నాల్గుతట్టులందు నందమగు మందరము మేరుమందరము సు
పార్శ్వమున్ గుముదంబనుపర్వతములు వెలుఁగుఁ బురుషార్థములబోలె నలఘుచరిత!

తే॥ అనల హరిపద్మరాగరత్నాంకురములఁ జెలఁగునచ్చటి భూమివీక్షించి వింత
పడుచుఁ దక్షండపతులచే బలులఁగొనుచు మోదమందుచునుండెనో భూవరేణ్య!

ఆ॥ మున్ను శోభనుఁడను ముచుకుందునల్లుఁడు భరతఖండమందుఁ బరమభక్తి
నుపవసించి పూని యుత్తమైకాదశీవ్రతముసల్పి చక్రపాణిదయను ౮౮౧

క॥ దురితవిదూరుండై నిర్జరనరులన్ గూడి మందరగిరిన్ సుగుణా
కరచంద్రభాగతోఁదగి యిరనేలును ధనదుకరణి నిప్పటివఱకున్ ౮౮౨

ఉ॥ ఆ సరసప్రభుండు హరియండకు నేగి ప్రదక్షిణంబులన్
జేసి నమస్కృతుల్ సలిపి చేకొని యీ బలులన్ మహాత్మ! న
న్వాసిగఁ బ్రోవుమంచు బహుభక్తిని వేఁడియుఁ దిర్గి స్వీయమా
వాసముఁబొందెనన్న విని పార్థివుఁ డా సురమౌని కిట్లనెన్. ౮౮౩

క॥ ధీరుం డా శోభనవిభుఁ డారహిఁజనినంత నేమియయ్యెనొ ? చెపుమా !
నారద ! నావుడు మునియును భూరమణున కిటుల నానుపూర్విఁ బలికెన్.

క॥ అలమందరాచలంబునఁ గల యొక పెదచఱియయందు ఘనకాసారం
బలఘుకనకాబ్జలలితము లలిఁగని పార్థుఁడు హరికిటులన్ బలికె విభూ ! ౮౮౫

తే॥ నందనందన ! కాంచనసుందరవ్రతతిసురుచిరారవిందబృందపరియుక్త
మైన యీకుండ మెవరిదో యేనువినఁగఁ గోరుచుంటిని సెప్రుమ! నాకోర్కెదీఱ

మ॥ అన శ్రీకృష్ణుఁ డిటు ల్వచించె విజయా ! యాలింపుమా యీస్థలిఁ
మును స్వాయంభువవంశమందుఁ బృథుభూపుం డుద్భవంబొంది శ్ర
ద్ధను హెచ్చైనతపంబుఁజేసెఁగద యేతద్దివ్యకుండంబొ యా
తనిదే దీనిజలంబుఁగ్రోలునరుఁడో ధన్యుండగున్ రూఢిగాఁ. ౮౮౬

తే॥ మఱియు నందున మునిఁగిన మానవేతరమగు జంతువుగూడఁ బరమపదంబుఁ
జెందు నోకవ్వడీ! యంచుఁజెప్పి యచటఁ గల తపోభూమి కేగె నాస్థలమునందు.

తే॥ అష్టసిద్ధులు బహుసుందరాకృతులను బొడుచాడుటనుండుట భక్తుఁడైన
యుద్ధవుఁడు గాంచి యబ్బురంబొంది యాదవేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁ బృచ్ఛించె నిట్లు

తే॥ ఈమనోజ్ఞతపోభూమి యేఘనునిదొ? కనులపండువగానాడు కమలముఖులు
సుందరులు వీరలెవ్వరో? నందనందనా ! వచింపుమా నావుడా శ్రీవిభుండు

క॥ తొలిస్వాయంభువమను వీస్థలమునఁ దపమాచరించెఁ దత్వజ్ఞా ! యీ
స్థలి యాతని దిప్పటికిఁ దెలిసికొనుము సందియములు దేవల దెదకుఁ ౮౯౧

తే॥ అణిమమొదలైనసిద్ధులీ యాకృతులను దాల్చి కలకాలమిచ్చటఁ దనరుచుండుఁ.
దప మిటఁ సల్పునరుఁడు బృందారకత్వమొందు నజుఁడిద్ది వర్ణింపనోపలేఁడు

వ॥ అంత నా రమాకాంతుం డటనుండి వెడలి తొల్లి హిరణ్యకశిపుండు దీర్ఘ
తపం బొనరించిన పోత్కటదేశంబులను జూచుచుఁ దద్రాజధానియు గాంచన
మయంబునగు లీలావతీపురి కేగె. అందు వీతిహోత్రుండు మూర్తిమంతుండై
ధర్మంబుగాఁ దద్దేశంబునేలుచు విరాజిల్లుచుండు. ఆయగ్ని యీశ్రీకృష్ణుని రాకవిని
పారితోషికంబులం గైకొని చనుదెంచి యామహాత్మున కర్పించి యగ్గలంబుగా
నగ్గించి చనియె. ఇట్లా హరి యా యిలావృతఖండం బంతయు దర్శించుచు మనో
హరంబగు జంబూద్వీపస్థితవేదనగరంబుల కేతెంచె. తన్నగరసభామధ్యమంబున,

## శ్రీకృష్ణుండు వేదనగరంబున కేగుట.

సీ॥ బ్రహ్మాణి! వల్లకీ గ్రంథంబులఁ దాల్చి శ్రీకృష్ణవర్ణనఁ జేయుచుండు
పూర్వచిత్త్యూర్వశీముఖులైన యచ్చరల్ హావభావాదుల నాడుచుండ్రు
హ్రస్వదీర్ఘప్లుతాద్యష్టాదశవిభేదములతోడ శ్రుతులను బలుకుచుండు
వాద్రతనల్లకీవంశిమృదంగాది వివిధవాద్యములు శబ్దించుచుండు

తే॥ నిగముఁడుఁ బ్రభువర్యుఁడై నెగడుచుండు మఱియువిశ్వావసుండుచిత్రరథతుంబు
రులు సుదర్శనుం డేనును లలితరీతి గానమును జేయుచుంటిమో మానవేంద్ర!

ఆ॥ ఇంక నట్టిసభను హిందోలమేఘమల్లారదీపకములు భైరవమును
మాలకోశకమును మఱియు శ్రీరాగంబు మూర్తిమంతములయి పొల్పుఁగాంచు

తే॥ అందు నొక్కొక్కదానికి నాత్మజాష్టకము సతీపంచకంబును గలదు భైర
వమనురాగంబు పచ్చగావఱలు మాలకంబు శుకద్యుతినొప్పు నఖండరీతి

తే॥ దీపకము సువర్ణద్యుతిఁ దేజరిల్లు మేఘమల్లారముఁ నెమ్మిమించువన్నె
నతిశయించు హిందోలము హంసరుచిని నొప్పు శ్రీరాగమరుణిమనుండు జనక!

క॥ అనవుడు జనకుం డిట్లనె మునివర! స్వరతాలనృత్యముల గ్రామములఁ
దనరెడి భేదములఁ బేర్కొనుజెప్పుము కరుణ నాకలఘుతరఫక్కిన్ ౧౫౦

## నారదుండు జనకునకు రాగతాలనృత్యాది భేదంబుల దెల్పుట.

వ॥ అన విని నారదుం డిట్లనియె. మైథిలేంద్రా! నిషాదర్షభగాంధార షడ్జమధ్యమధైవతపంచమంబులను పేళ్ళతో సప్తస్వరంబులును, రూపక చంచరీక పరమఠ విరాడ కమఠ మల్లక ఝుటి జటలను నామంబులతో నెనిమిది తాళంబులును, రాస తాండవ గాంధర్వ కైన్నర వైద్యాధర గాహ్య క్రూరస హావ భావానుభావంబులను నామధేయంబులతో దశనృత్యంబులును మాధుర్య గాంధార ధ్రౌవ్యంబులను నభిధేయంబులతో గ్రామత్రయంబు నొప్పు. సా రే గ మ ప ద ని యను పదంబులతో స్వరంబు లొప్పారు. ఇఁకఁ గాలదేశక్రియాభేదంబులచే జ్ఞానగీతంబు షట్పంచాశత్కోటిభేదంబులుగాఁ గలదు. తదంతర్భేదంబు లనంతంబులు. ఆ యానందగీతంబే శబ్దబ్రహ్మమయుండగు హరియని యెఱుంగుము. అందు భైరవరాగంబునకు భైరవీ పింగళా శంకీ లీలావ త్యగారులను పంచసతులును మహర్షి సమృద్ధ పింగల మాగధ బిలావల వైశాఖ లలిత పంచము లను నెనమండ్రుకొమరులును మేఘమల్లారంబునకు చిత్రా జయజయావంతీ విచిత్రా వృజల్లా వ్యంధకారులను నైదుగురు వనితలును, శ్యామకార సోరఠ నటో డాయన కేదార వ్రజరంహాస్య జలభార విహగులను అష్టసుతులును, దీపకంబునకు కంచుకీ మంజరీ టోడీ గుర్జరీ శాబరులను నైదుగురు సుందరులును, గల్యాణ శుభకామ గౌడకల్యాణ కామరూప

కాన్హార రామసంజీవన సుఖనామ మందహాసులను నెనమండ్రు పుత్రులును, మాల కోశరాగంబునకు గాంధారీ వేదగాంధారీ ధనాశ్రీ స్వర్ణమణీ నుణాగరులను పంచసుద తులును, మేఘ మచల మారుమాచార కౌశిక చంద్రహార ఘుంఘుట విహార నందు లను నెనమండ్రు నందనులు, శ్రీరాగంబునకు వైరాటీ కర్ణాటీ గౌరీ గౌరావటీ చంద్ర కళలను నైదుగురుమనోహారిణులును, సారంగ సాగర గౌర మరుత పంచశర గోవింద హమీరార గీర్భిరు లను నెనమండ్రు తనయులును, హిందోలంబునకు వసంతియు నైరజియు హేరియుఁ దైలంగియు సుందరియు నను పంచ సుందరులును, మంగళ వసంత వినోద కుముద విభాస స్వర మండలులను మొదలైననామంబులతో నొప్పారు నెనమండ్రుకొడుకులును గలరని రాగవేత్తలు నిర్ణయించిరిగాదే? యన నాలించి బహులాశ్వుం డా మునీశ్వరు నిట్లడిగె. ౯౯౯

తే। మౌనివర్య! శబ్దబ్రహ్మమైన వేద
మయిన కచ్యుతునకు రాస మండలాత్మ
కమగు హిందోలమునకు నంగంబులెవియొ?
పలుకుమా! యన ముని యిటు పలుకఁదొడఁగె ౯౦౦

సీ॥ ఆస్యంబు వ్యాకృతి హస్తముల్ మీమాంస విపులపాదంబులు పింగళమును
గనులుజోస్యంబునాల్కయును గాంధర్వంబు పీనవక్షము ధనుర్వేదరాశి
మనము వైశేషికంబును బుద్ధి సాంఖ్యంబు పరిబలపృష్ఠంబును వైద్యవిద్య
విమలమౌచిత్తంబు వేదాంతసారంబు నతిశయాహంకృతి న్యాయశాస్త్ర
తే॥ మంచుఁ బలికిరి పెద్దలా యచ్యుతునకు నిదియు రాగరూపంబని యెఱుఁగుమింక
నేమివినెదవో? నాకు వచింపుమనఁగ జనకుఁడిట్లనె నారదమునివరునకు

తే॥ విబుధమౌనీంద్ర! కృష్ణుఁ డా వేదపురికి
నేగి యేమేమినల్పెనో? యేను వినఁగఁ
గోరుచుంటిని నావుడా నారదుండు
సెప్పె నిట్టుల మైథిలశేఖరునకు ౯౦౨

చ॥ సుగుణవతంస! యట్లు మధుసూదనుఁ డాపురి కేగినంతటన్
నిగముఁడు తత్పురాధిపతి నెమ్మి బలుల్గొని వాక్ప్రభాంగితోఁ
దగి స్వరతాలరాగసహితంబుగఁబోయి యొసంగి మ్రొక్కి నా
నిగమవిహారుఁడైన హరి నెయ్యముతోఁగని వాని కిట్లనెన్ ౯౦౩

తే॥ నిగమ! నీభక్తిమెచ్చితి నీమనమునఁ జెలఁగు కోరికయేదియో చెప్పికొనుము
ముజ్జగంబుల మద్భక్త సజ్జనులకు నేదియును దుర్లభంబుగాలేదు గాదె! ౯౦౪

చ॥ అన నిగముం డిటుల్ పలికె నార్య! ప్రసన్నుఁడవైనచో నటుల్
నెనరున నాదుపార్శ్వదులు నేత్రములారఁ గనుంగొనన్ స్వదీ
యనిరుపమస్వరూపముఁ దదద్భుతగోజగతీవిభాసురం
బును బృఘుబృందకావన సముజ్జ్వలభాసగతంబుఁ జూపుమా! ౯౦౫

చ॥ అలనుడి విన్న శౌరి తనయద్భుతరూపము రాధికాన్వితం
బలఘువిధానఁ జూప నిగమానుచరుల్గని పాత్రికాశయం
బుల స్వతనుస్థితుల్ మరచి పూర్ణసుబొంది ముదంబుతోడ నె
ట్టుల మునువింటిమో మన మటుల్ గనియుంటిమి ప్రస్తుతంబునన్ ౯౦౬

క॥ అనుకొను చిట్టుల నిగముఁడు మునుగలవా రామహాత్మ్మ భువనేశ్వరు జీ
వనజాక్షుని రాధాకృష్ణు నుతించుచు నాడి రిటులఁ జూచుచు జనకా! ౯౦౭

వ॥ అం దాదియందు నిగముం డిట్లు స్తుతించె ౯౦౮

మ॥ సదసద్భావమహత్ప్రధానసమశశ్వద్దుర్గమద్రవ్యవి
శ్వదురాధర్ష విభుత్వసత్వమఘవద్బ్రహ్మాణ్డరశ్మైర్యదులే
విదితుండైన మహానుభావురుచితోఁ బ్రబ్బొత్తిగా సాటియై
కుదురంజాలరో యా మహామహు దయాకూపారు నిన్మ్రొక్కెదన్ ౯౦౯

వ॥ అంత సరస్వతీదేవి యిట్లనె ౯౧౦

మ॥ జగదీశా! మునివర్యులెల్లరును దేజఃపుంజమంచున్ నినున్
మిగులన్ వర్ణనసేయుచుందు రిఁక స్వామీ! భక్తులో దేహాయు
క్తుగ వర్ణింతురుగాదె నీ యుభయరీతుల్ నాదుదోషాళి పో
నెగురంగొట్టి శుభంబుగూర్చుటకు నే నెల్లప్పుడున్ మ్రొక్కెదన్ ౯౧౧

వ॥ పిమ్మట గంధర్వు లిట్లు ప్రార్థించిరి. ౯౧౨

మ॥ తలఁపన్ గౌరవినీలరుగ్రుచిర రాధాకృష్ణరూపంబుతో
జలదం బల్లతటిల్లతన్ దగినటుల్ సంతోషచిత్రంబులున్
గలుగన్ వెల్గుచునుంటివో గుణమణీ! కారుణ్యపాథోనిధీ!
జలజాక్షా! కొను మిప్పుడే మిడెడి సాష్టాంగప్రణామంబులన్ ౯౧౩

వ॥ అనంతరంబునం దప్సరస లిట్లు వేఁడిరి. ౯౧౪

చ॥ ఎటులఁ దమాలభూరుహామహీనవిథంబున స్వర్ణవల్లితో
నెటుల నదభ్రమేఘము నహీనవిధిన్ దొలుకారుమించుతో
నెటు పృథునీలశైలము నహీనకషోపలఖాని నొప్పునో
యటులనె రాధతోఁ దగుచు హర్షముఁగూర్చెడి నీకివే నతుల్ ౯౧౫

వ॥ అవల గ్రామక్రియం బిట్లు నుతించె. ౯౧౮

తే॥ శివరమోమాసురావళికవులతోడఁ గలిసి రాధికాదేవి యేఘనునిపాద
పంకజముల పరాగంబు భావమందుఁ గోరుచుండునో యట్టి నీకు నివెనతులు

వ॥ అంతఁ దాలంబు లిట్లుపొగడె. ౯౧౯

తే॥ జగమునందున బలియని స్తవముగన్న బలిమహారాజు నేబలివశము జేసి
కొనియెనో యట్టి నీకిప్డు వినతులేము సల్పుచుంటిమి శ్రీకృష్ణ! జలజనయన!

వ॥ అవల మానంబు లిట్లుగొనియాడె ౯౨౦

తే॥ జ్ఞానులంద జేదేవునిచరణకమలములను దిక్కని నమ్మిచుఁ బొగడి యఖిల
దుఃఖభూయిష్ఠసంసృతిఁద్రోసినారొ యట్టి నిన్మ్రొక్కిచుంటిమో యమరవంద్య!

వ॥ తరువాత స్వరంబు లిట్లు సంస్తుతించె. ౯౨౧

చ॥ అలిముని సంస్తుతంబులును నబ్జఝషధ్వజవజ్రచిహ్నితం
బులును మనోహరంబులును మోఘితశారదపుల్లపద్మశో
భలును సువర్ణనూపురవిభాసురముల్ భవదంఘ్రిపద్మముల్
దలఁతుము మ్రొక్కుచుందు మెదఁదాల్చుచునుందుము రాధికేశ్వరా! ౯౨౩

ఆ॥ అంత భైరవాదులైనరాగంబులువచ్చి యెదుటనున్న లచ్చిమగనిఁ
గృష్ణుఁజూచి యలరి యిట్లు వేర్వేఱుగా బొగడఁదొడఁగె జనక భూవరేణ్య!

వ॥ అందు భైరవరాగం బిట్లగ్గించె. ౯౨౪

తే॥ లక్ష్మినిజమృదుకరకమలములతోడ స్వాంకమం దిడి భక్తురాలగుచు నొత్తి
నట్టి త్వజ్జానుయుగ్మంబహర్నిశము గొలుచుచుందుము శ్రీకృష్ణ! జలజనేత్ర!

వ॥ వెంటనే మేఘమల్లారం బిట్లభినుతించె.

మ॥ వరరంభాశకలంబులో పసిఁడికంబాలో యటంచెంతో య
బ్బురమొందఁ జెలువొంది పీతపటముల్ వొల్పారఁ బీనంబులై
పరిపూర్ణద్యుతితోడ వెల్గెడి భవద్భవ్యోరుయుగ్మంబునుఁ
నెఱి ధ్యానించుచునుంటినో యదుఘనా! నీరేజపత్రేక్షణా! ౯౨౭

వ॥ తరువాత దీపకరాగం బిట్లు సన్నుతించె. ౯౨౮

తే॥ సకలమంగళకరములు స్వర్ణరుచిరుచిరములుఁ గట్యధస్స్థలస్థితము లమర
వంద్యములునైన భవదీయపాదములను సన్నుతింతుము కృష్ణ! ప్రసన్నవదన!

వ॥ వెండియు మాలకోశం బిట్లు వినుతించె. ౯౩౦

ఆ॥ మందమారుతముల మఱిమఱిఁగదలుచు మానవాళి దృష్టిమానముల హ
రించునది సునతము బుభమనోజ్ఞమగు నీ కేశరుచిరశటికిఁ గేలుమోడ్తు

వ॥ మఱియు శ్రీరాగం బీరహి నభినందించె. ౯౩౩

తే॥ కేశసందోహమన్మథా క్రీడభాసురంబు సువళిత్రియోర్మికారమ్యము నగు
నీదు నాభిసరోవరం బావ తేగ మ్రొక్కుచుంటి రాధాకృష్ణ! ప్రోవుమయ్య

వ॥ అంత హిందోలరాగం బిట్లు కీర్తించె. ౯౩౫

ఉ॥ ప్రీతిని మోహముం గొలుపు పిప్పలపత్రగతాళిపంక్తియో
శాతము వింతగూర్చు జలజస్థితమేచకరేఖయో యటం
చాతతసంశయంబు లిడునట్టి భవజ్జఠరస్థరోమసం
ఘాతమనోజ్ఞరేఖను నఖండముగా వినుతింతు శ్రీహరీ! ౯౩౬

వ॥ పిదప భైరవనారీమణు లీతీరున వర్ణించిరి. ౯౩౭

తే॥ స్వర్ణకాంతికాంతంబును సకలమనుజ దుఃఖహారమును దేవసంతోషకరము
నద్భుతము నింద్రధనురాభమైన నీదు దివ్యపీతాంబరంబు నుతింతుఁగృష్ణ!

వ॥ పిమ్మట భైరవకుమారు లిట్లు భాషించిరి ౯౩౯

ఉ॥ ఎవ్వి చతుస్సముద్రముల యేపున విశ్వమునందు నిండెనో
యెవ్వి చతుష్పదార్థముల యేపున మేలు జగానఁ గూర్చెనో
యెవ్వి చతుఃకకుప్కరుల యేపున ధాత్రిని మోయునట్టి నీ
యవ్వి చతుర్భుజంబుల నహర్నిశమున్ వినుతింతు మోహరీ! ౯౪౦

వ॥ తదనంతరంబున మేఘమల్లారసుదతు లిట్లు శ్లాఘించిరి. ౯౪౧

తే॥ అరుణబింబఫలద్యుతి సురుచిరంబు నవజపాపుష్పలలితం బనంతకోటి
భువనపతిమధురాధరంబును సతంబు చిత్తమా! సన్నుతింపుమా! చెదరకుండ.

వ॥ తత్పరంబునం దత్పుత్రు లిట్లు ప్రశంసించిరి ౯౪౩

క॥ ఘనసార కేతకీ చందనముక్తామల్లికామృతకళానిధిహీ
రనిరతిశయకాంతిని మీఱిన హరిరదనముల సంస్మరింపుము మనమా! ౯౪౪

వ॥ అటుపై దీపకభార్య లిట్లు ప్రస్తుతించిరి ౯౪౫

చ॥ పరిహృతదేవవృత్తమును భక్తజనావళిరక్షకంబు ను
ద్ధురబహులక్ష్యలక్షమును దోయజలోచన పుత్రకోజ్జ్వల
చ్చరసుపరీక్షకంబును విసర్జనదక్షము సుందరంబు నౌ
హరికరుణాకటాక్ష మనయంబు నుతింపుమ యంతరంగమా! ౯౪౬

వ॥ తరువాత దీపకాత్మజు లట్లనిరి ౯౪౭

తే॥ కమలమధ్యమునందు దుఃఖక్షయంబునొందఁగూర్చుండు ఖంజనయుగ్మమనఁగ
మదనచాపయుగ్మంబునఁ గొదరుమాధవేందుముఖగతభ్రుకుటినుతింతు మెంతొ.

వ॥ పిమ్మట మాలకోశమానినీమణు లిట్లనిరి ౯౪౯

తే॥ ఫణులు చంద్రమండలమందు భ్రమరములును భవ్యమకరంద నిర్భరపద్మమందు
నాడినటుకృష్ణగండములందురుచుల నాడు కుండలముల మ్రొక్కుమా! మనంబ!

వ॥ పిదపఁ దత్తనయు లిట్లు వచించిరి ౯౫౧

ఆ॥ వ్యోమమండలమున నుదితమౌ సూర్యయుగ్మంబనంగ నీల ఘనమునందు
మెఱయు మెఱపులనఁగ హరికపోలంబుల నెసఁగుకుండలయుగ మెఱఁగు మనమ!

వ॥ అంత శ్రీరాగిణి లిట్లు పల్కిరి ౯౫౩

ఉ॥ దూరమునుండి వే చనిన తుమ్మెదలున్ మఱి ఖంజనమ్ములున్
జోరఁగ వాని నెన్నడునుఁ బూన్క నరారుణబింబలిప్సతోఁ
జేరిన కీరమోయనఁగ శ్రీధర! నీ యెఱ్ఱతమ్మికన్గవన్
మీఱెడి పాపఁ గొల్చెద మమిత్రవితానలతాలవిత్రమా! ౯౫౪

వ॥ అవలఁ దత్పుత్రు లిట్లు స్తోత్రంబు జేసిరి. ౯౫౫

తే॥ పరికరీకృతదృఢపీతపటుని శిఖి మకుటనతీకృతకంధరుఁ గుండలధరు
లగుడవేణుకకరుఁగమలామనోహరు నటవేషధరుని గొల్తు మనిశ మేము ౯౫౬

వ॥ పిమ్మట హిండోలకామిని లిట్లు వక్కాణించిరి ౯౫౭

మ॥ యమునాకూలకదంబమధ్యగుఁడు నవ్యాభీరనారీవిహా
రమహోత్సాహుఁ డుమాసుమాభుఁడు లసద్రాజీవపత్రాక్షుఁడున్
గమలానాథుఁడు కర్బురాంతకుఁడు సత్కారుణ్యకూపారుఁడున్
విమలుం డావనమాలి మా కొసఁగుతన్ వేమాఱుఁ గల్యాణముల్ ౯౫౮

వ॥ పదపడి తదాత్మజు లిట్లు వాచించిరి ౯౫౯

క॥ మావంటి మహాపాపులు మీవంటి యఘాపహారి మేదినిఁగలఁడే?
కావున నీవే దిక్కని భావమునన్నమ్మి మమ్ముఁ బాలింపుమెటో ౯౬౦

క॥ ఈరాగకృతవినుతి సెవులారఁగ వినువారికనుల కాభక్తేశుం
డౌ రాధాకృష్ణుఁడు మమకారముతో గోచరుండు గాఁగలఁడు ప్రభూ! ౯౬౧

తే॥ ఇటుల హరి వారలకు నిజాకృతినిఁజూపి యందఱునుజూచుచుండఁగా నట నదృశ్యు
డయ్యె నంతట నిగమాదులాత్మమందిరములకేగిరి తదనంతరంబునందు ౯౬౨

క॥ శ్రీరాజీవాక్షుఁడు స్వకుమారుని మారుని స్వసైన్యమండలపతిగా
నేరుపడఁ జేసి క్రమముగ ద్వారావతికేగె సపరివారముగ విభూ! ౯౬౩

—♦ ప్రద్యుమ్నుండు గంధర్వదేశంబు గెలుచుట. ♦—

క॥ అంతటఁ గంతుఁడు నిజభటసంతతితోఁ గూడి విజయశబ్దము లొప్పన్
వంతమున గామధుఘునదాంతికమును జేరి విడిసె నా ప్రాంతమునన్ ౯౬౪

సీ॥ ఏలాలవంగలతాలలితంబును పారిజాతాద్యగ భాసురంబు
మత్తషట్పదరావమంజులతరమును శతయోజనాయత సంయుతంబు
కాంచనమణిమయ ఘనహర్మ్యరమ్యంబు రమణీయనిష్కుటరాజితంబు
వైరిభీకరవీరవారసమేతంబు రాజనీతిజ్ఞవిభ్రాజితంబు

తే॥ భూరిభోగీంద్రభూషిత భోగవతిపిధంబునన్ దివ్యగంధర్వతతిరుచిర "వ
సంతమాలతీ"నగరంబు సకలసగుణమండనాయమానంబయియుండు జనక!

తే॥ దాని గంధర్వవరుఁడు వతంగనాముకుండు నిర్జరేంద్రునివలె దండిగండు
లఁ బరిపాలించు నీతిసెలంగ నతఁడు మరునిరాకను విని కిన్కఁ మరమొనర్ప

చ॥ తలఁచి కృపాణముద్గరగదాపరిఘాదినిశాతహేతుల
న్నలిగొని దివ్యరథ్యరథనాగములున్ దశకోటి భీమవీ
రులుఁ జనుదెంచ మన్మథుని మ్రోలకుఁ జేరె ననంతరంబునం
దల యదువీరవర్యులుఁ బతంగునియోధులు పోరి రయ్యెడన్ ౯౬౭

తే॥ అనిని బాణాంధకారంబు లతిశయింపఁ
గ నతిరథుఁడు వతంగుండు ఘనముమాడ్కి
నార్చుచున్ విల్లునెక్కిడి యాహవంబు
సల్పఁగడఁగెను భూప! యాసమయమందు ౯౬౮

చ॥ గదుఁడు బలానుజుండు గదఁ గైకొని వజ్రి పవిన్ నగంబులన్
సదసదలౌనటుల్ సలుపుచందమునన్ రిపుసైన్యమంతయున్
జదియఁగఁగొట్టె నట్టియెడ సామజముల్ హతమస్తకంబులున్
బదిపు లధోముఖోర్ధ్వముఖపాటితబాహువులైరి భూవరా! ౯౬౯

తే॥ హరులనెక్కిన వీరులు నాలమందుఁ బడిరి వెనువెంట గంధర్వవరపతంగ
సైన్యమందొక్క రక్తనిర్ఝరిణి పుట్టె జూపఱందరు వింతతోఁ జూచుచుండ

తే॥ ప్రమథులున్ హారమాలకై వచ్చి శిరము
లను గొనిరి భద్రకాళియు ఘనమృగేంద్ర
మెక్కి డాకినీసహితయై యేగుదెంచి
నెత్తుఁ బుర్రెలతోఁద్రాగి నెఱిగ నాడె ౯౭౧

ఆ॥ గదునిచేత నొచ్చి గంధర్వులందఱు గాలికొలఁదిఁబాఱఁ గనిన లక్ష
గజబలాన్వితుఁడును గంధర్వనాథుండు నగు పతంగుఁడు గని నరుగుడెంచి

క॥ గదతో రామానుజుఁడగు గదుహృదయమునందుఁ గొట్టి గట్టిగ నఱవఁగా
గదుఁడు గదతోఁ బతంగుని హృదయమునఁ బాఁదె మైథిలేశ్వర జనకా!

వ॥ ఇట్లు వారిరువురును రెండుగడియలవఱకు గదలతో విస్ఫులింగంబులం బఱపుచుఁ బోరిరి. అంత నా రెండుగదలును జూర్ణీకృతంబులయ్యె. అయ్యెడ రణ దుర్మదుండగు పతంగుఁడు లక్షభారభరితంబగు నినుపకగదం గొని యా యాదవ యోధపుంగవుని శిరంబున మోఁద నగ్గదుం డొక్కనిమిసంబు మూర్ఛిల్లె. ఇట్టి తరుణంబున నే ౯౭౪

ఉ॥ ద్వారకనుండి కోటరవిభాసుర తేజము యాదవోత్కరం
బౌర! యనంగ వచ్చెఁజుమి యందున వీరుఁడు గౌరవర్ణుఁడుఁగా
సీరియు భక్తవత్సలుఁడు చిత్రపవిత్రచరిత్రుఁడుఁగా బలుం
డౌర! యనఁగా జనించి సకలాయుధముల్ ధరియించి మించుచున్ ౯౭౫

తే॥ లాంగలమున గంధర్వులన్ లాఁగి ముసల
హేతితోఁ గొట్టి రథ్యపదాతిజాత
ములను మోఁద సంచూర్ణితోపలములవలెఁ
బడిరి విరథుఁడయ్యెఁ బతంగుఁడడలి యతఁడు ౯౭౬

ఆ॥ తనపురమున కేగి తద్దనాలోచించి తిరిగి యరులతోడఁ దుర మొనర్ప
నిశ్చయించి యోధనివహంబు వ్యూహంబుగా రచించి వచ్చి కసినిఁదాఁకె

వ॥ అట్లు తలపడుట బలభద్రుం డాలోకించి కాలరుద్రుండై యాలసింపక గంధర్వమనోహరంబును, శతయోజనవిస్తీర్ణంబునైన వసంతమాలతీనగరంబును హాలంబుతోఁ బెకలించి యాకర్షించి తత్రస్థకామధుఘమహానదంబునం ద్రోయ నుద్యుక్తుం డయ్యె. అయ్యెడ నయ్యంబరంబునుజుంబించు హార్మ్యంబులు గూలం దొడంగ హాహాకారంబు లుప్పతిల్లె. అంతం బతంగుండాత్మనగరంబు తిర్యక్ప్లుతంబు రీతి నా ఘూర్ణితంబగుట వీక్షించి వెంటనే యీతం డాపరాత్పరుండై యుండునని యెంచి హర్షించి స్వర్ణకుంభత్కుంభకోటివిరాజమానంబులును, గామగంబులును, పతాకాముక్తాహారాద్యభిరామంబులును, దశయోజనవిస్తీర్ణంబులును నగు రెండు లక్షలవిమానంబులును, నాలుగులక్షలగోవులును, దశార్బుదతురంగంబులును, ననేకంబులగు దివ్యఫలంబులను, పుష్పహారంబును, కోట్లకొలంది భాజనంబులను, తాంబూలంబులను గైకొనివచ్చి యిచ్చి కృతాంజలియై ౯౭౭

మ॥ తలఁపన్ మీ తలపై సమస్తజగముల్ దైవారె నువ్వంతగాఁ
దెలియన్ లేను మహాత్మ! నీ మహిమముల్ దేవాదిదేవా! మహా
బల! నీలాంబర! కామపాల! యనుకంపానాగరా! దేవరా!
బలరామా! సుగుణాభిరామ! ముసలీ! భక్తప్రియా! మ్రొక్కెదన్ ౯౯

క॥ శేషా! నిర్జరసన్నుతవేషా! యాత్తారిహరణ విశ్రుతపృథుస
ద్భాషా! నిర్జితదోషా! దోషములన్ బాపి కరుణతో నను గనవే! ౧౦౦

క॥ అని ప్రణమిల్లగ బలుఁడున్ గనికరమున నో పతంగఘుక! జడియకుమా!
యని మన్మథు యదుసేవకు ఘనుగా నొనరించి ద్వారకాపురి కరిగెన్ ౧౦౧

—♦ ప్రద్యుమ్నుండు శక్రసఖుని జయించుట. ♦—

క॥ అపలఁ బ్రద్యుమ్నుం డాతావును విడి సాఁగి ధీరతన్ మధుధారా
శైవలినీతటమును సేనావృతుఁడై చేరె ఢక్కానాదము లొప్పన్ ౧౦౨

ఆ॥ అచటనుండి మారుఁ డామేరుగిరి పరిసరమునందు నున్న గిరిశసఖుని
కాంచనతిలకాఖ్య కమనీయవనమునుగాంచి మోదమొంది కదలి యచట ౧౦౩

వ॥ అమరు లతికష్టంబుగాఁ జొరఁదగినవియు, నసురు లెంతమాత్రము ప్రవే
శింపరానివియు, వేత్రవతియను గంగతోఁ గూడినవియు, బంగరున వెలుంగునవియు,
నగు కొండలోని పల్లపుఁజోటులకుం జనె. మున్నొకానొకప్పు డాదితేయులు దైతే
యులకు భీతిపడి స్వర్గంబునుండి పలాయితులై వచ్చి యందు నివాసంబు గావించు
చుండిరి, తద్గిరిప్రదేశంబందలి యొకపురంబున శక్రసఖుండను మహాబలుండొకఁడు
తద్దేవాధిపత్యంబు వహించి దిక్పాలకాధిపత్యంబును గాపాడుచుఁ జెన్నారుచుండు.
అట్టి ప్రభువరునిచెంతకు రతికాంతుం డుద్ధవునిం బంపె. అతనివలన నా దేవరా జావల
రాజురాకవిని యుగ్రుండై విగ్రహం బాగదాగ్రజాత్మజాతునితో నొనర్పం దలచి
యుద్ధవున కిట్లనియె ౧౦౪

ఆ॥ జరయు మృతియు లేని సురలు నాకనిశంబు బూజలిడుదు రన్నభూజనంబు
బూజలిడుదురంచు ముచ్చటింపఁగవలె నొక్కొ? యింద్రుఁబోలెనుందు నిందు.

ఉ॥ శక్రనిభోద్భటుండను నసాధ్యమదద్విపలక్షవిస్ఫుర
ద్విక్రముఁడన్ మహాత్ముఁడఁ గుబేరసమానధనాధినాథుఁడన్
శక్రసఖుండ నెవ్వరికి స్వల్పబలిన్ సయితంబొసంగనే
యక్రమరీతి నిప్పటుల యాదవనేతకు నిత్తుఁ? జెప్పుమా! ౧౦౫

తే॥ అష్టదిక్పాలకుల నేనహర్నిశమును నేలుచుంటిని గాదొకో? యాకతమున
నుగ్రసేనుఁడె కప్పంబు లొప్పగింపవలయు నా కిప్పు డుద్ధవా! పలుకుమిట్లు.

తే॥ అనవు డుద్ధవుఁడిట్లు పల్కఁ_డఁదొడఁగె శక్రసఖ! నీవు మరునకు సక్రమముగ
బలుల నిడనిచోఁ బూర్తిగా భంగపడెద వట్టులైనదిట్టుల విను మాడుచుంటి.

సీ॥ అలకాపురీశుఁడౌ నైలబిలుండును హరివర్ష పతిశుభాంగబలుఁడు
చిత్రచై త్రేశుఁడౌ శృంగారతిలకుండు విదితలంకేశ విభీషణుండు
సంస్ఫోటభీముఁడౌ సంవత్సరాఖ్యుండు భీకరాకారగుణాకరుండు
చంద్రావతీశులౌ శకునిముఖాసురుల్ ఖ్యాతివీరుండగు కేతుమాలుఁ

తే॥ డు మొదలైన వారందఱా సుమహృషత్కు_చేత నోడింపఁబడి రేను సెప్పినట్లు
విననిచో నీవు జితుఁడవై వెతల మిగులపడెద వందున బలులిచ్చి బ్రతుకుమయ్య!

క॥ అనవుడు శక్రసఖుం డిటులనె భాగవతదాస! యటులైన నుపా
యనముల నెప్పుడు నే నిత్తునా నీవిట సంతదనుకఁ దొలఁగక నిలుమా! ౯౯౦

ఉ॥ అంతట నుద్ధవుం డిటులనాడెను శక్రసఖా! త్వదుక్తికిన్
సంతసమయ్యెఁ గాని యొకసంగతి విన్నటు రాజనీతి వే
దాంతవిదుల్ మహాబలులు నాథ్యులునై యిట దూతనౌచు వృ
త్తాంతముఁ దెల్పినట్టి నను దండిని నడ్డుట ధర్మమేమొకో? ౯౯౧

క॥ నరవరులకు జ్ఞానంబును గరముగ నిడు మంత్రులందు ఘనుఁడను గాన
గరువముచే నన్నడ్డిన సిరిబలములు దొలఁగ నీకుఁ జేటుగలుంగున్ ౯౯౨

ఉ॥ నావుడు కిన్క_ శక్రసఖనాకవిభుం డచటు దృష్టినిల్పి యా
ధీవరు నడ్డగించెను సుధీవర! యంతట మంత్రి రామికిం
ద్రావరజాత్మజాతముఖయాదవులెల్లరు చింతఁబొంది నా
నావిధులన్ దలంచుచు దినంబులఁ గొన్నిఁటిఁ బుచ్చి రింతలోన్. ౯౯౩

తే॥ నాముఖమున శక్రసఖుఁ డొనర్చినట్టి
పనిని విని మరుం డాతని భంగపరుపఁ
బురుల గెలువఁబోయెడి రుద్రుఁబోలె సేనఁ
గలిసి రత్నసానుగుహాముఖమున కరిగి. ౯౯౪

చ॥ ఘనరణదుందుభిధ్వను లఖండముగా మొరయంగ నశ్వని
స్వనములు మిన్నుముట్ట గజసంతతిబృంహితముల్ సెలంగఁగాఁ
దనవిలుఁ డంకరించి నిశితంబగు హేతులతోడ దొమ్మిగా
ననిఁ బొనరించె సైన్యరజ మంబరమున్ నెటెఁ గప్పె మైథిలా! ౯౯౫

తే॥ అపుడు హేమాద్రియందున్న యమరవరులు
జూచి భయపడుచుంట తత్సురవిభుఁడగు

శక్రిసఖుఁడును గని దశాక్షౌహిణీప
తాకినిం గొని వానితోఁ దాఁకె పేఁక. ౯౯౬

క॥ వారికి వీరికి నాయెడ ఘోరతరములు యుద్ధమయ్యె క్షోణీశానా!
ఘోరప్రలయాబ్ధిధ్వని తీరున రవ మడఁదెఁ దగె దిక్పృష్ఠపు లదలన్. ౯౯౭

చ॥ తదుపరి సీరపాణిచినతమ్ముఁడు శస్త్రఘనుండు సర్వవి
గ్వాదితబలుండు సారణుఁడు వే చనుదెంచి శరాసనంబునున్
గొడకొని యెక్కుపెట్టి శరకోటుల వేసి యరాతిసేనలన్
సదమదమౌనటుల్ సలిపె సంతసమొందఁగ యాదవోద్భటుల్. ౯౯౮

తే॥ అపుడు రణభూమి, పరిపంథిహతాదియుక్త
మైన యాక్రీడముగ నయ్యెఁ బ్రియంకకనక
నమరు లట్టి సారణుని వీర్యమును గాంచి
తాళఁజాలక పాఱిరో ధరణినాథ! ౯౯౯

క॥ పిమ్మట శక్రసఖుఁడు స్వబలమ్ములు పఱుగిడుటఁ గాంచి లఘుగతిఁ జని చా
పమ్మెక్కుపెట్టి జీమూతమ్మువలెన్ బొబ్బరించి ధైర్యముతోడన్. ౧౦౦౦

చ॥ శతవిశిఖంబులన్ బలుని సాంబుని బాణశతంబుతో నుషా
పతి దశమార్గణంబులను బాధుని వింశతితోడ భానునిన్
శతయుగపత్రులన్ గదునిఁ జక్కఁగఁ గొట్టి సహస్రపత్రులన్
ధృతియుతు సారణున్ బొడిచె దీనత మాన స్వకీయసైన్యముల్. ౧౦౦౧

తే॥ తత్ప్రహారములను దద్వీరులెల్లరు యరదములను గూడి గిరగిరగిర
కుంభకారుసారె గొదకొని తిరిగెడికరణిఁ దిరిగి రొక్కగంటసేపు ౧౦౦౨

క॥ మఱియును దురగములీల్గెను నరదములున్ జూర్ణమయ్యె యాదవభటులున్
వెఱచిరి సూతులు గడఁబట్టిరి సాంబుం డపుడుగాంచి డిగ్గనఁ బగెన్ ౧౦౦౩

చ॥ ఇతరరథంబు నెక్కి విలునెక్కిడుచున్ దశమార్గణంబులన్
గ్రతుభుగధీశుచాపమును ఖండమొనర్చి తురంగపంక్తినిన్
శతవిశిఖంబులన్ నఱికి సాదిని మోఁది శరద్వయంబుతో
శతదశకాశుగంబులను స్యందనము న్నుసిఁజేసె వాసిగన్ ౧౦౦౪

ఉ॥ అప్పుడు శత్రుసేశుఁడు హతాశ్వరథుండును ఛిన్నచాపుఁడై
దెప్పున మత్తనాగమును ధీరత నెక్కి ధరించి శూలమున్
గొప్పగఁ బోరు సాంబుహృదిఁగొట్టెను దద్ధతిచేత నాతఁడున్
నెప్పరియయ్యెఁ గొల్దివెత నెప్పుకొసెన్ బహులాశ్వ! పిమ్మటన్ ౧౦౦౫

తే॥ యోజనంబంతపదము గవ్యూతియంత
పలు చతుర్యోజనములంత ప్రాంశు వంజ
నాద్రిరుచియు నాల్గామడలంత మూఁడు
తొండములుగల్గు తత్కరి దండి వచ్చి ౧౦౦౬

చ॥ వెఱపునుగొల్పు శీత్కృతుల వేసుఱుసల్పి యనల్పయాదవో
త్కరమును ద్రొక్కి యెక్కనగఁ గాడ్పడఁజేసి ధ్వజాశ్వహస్తిసూ
తరథములన్ విశేషముగఁ దల్లయదండధరోపమానమై
సరభసరీతి నిట్లటుల సంగరరంగమునం జరించుటన్ ౧౦౦౭

చ॥ గదుఁడను యాదవోద్భటుఁడు గనొని స్వీయము వజ్రకల్పమా
గదఁగొని దాని కుంభమున గాఢముగాఁ బ్రహరించె దాన నా
మదకరి భిన్నకుంభమయి భూమితలమందున ఛిన్నపక్షమై
యదవదఁ గూలుకొండవలె నార్చుచు వ్రాలె విచిత్రరీతిగాన్ ౧౦౦౮

ఉ॥ ఆవల కిన్క శక్రసఖుఁ డాత్మగదంగొనివచ్చునంతలో
నా విజయాభిలాషి గదుఁడట్టి గదన్ దదురంబునందునన్
జేవనుగొట్టె దాన సురశేఖరుఁ డాత్మమదద్విపంబుపై
నోవుచు సొమ్మసిల్లెను వినోదముగాఁ గన యాదవోత్తముల్ ౧౦౦౯

చ॥ తిరిగి యతండు లేచి గద దివ్యభుజంబులఁగొంచుఁ గ్రుద్ధుఁడై
త్వర గదుఁగొట్టె సీరహిని వారలు మల్లులు రంగమందునన్
బోరిఁబోరిఁ బోరుతీరున నమోఘముగా నటవిన్ వనేభముల్
గరువముతోడ దాఁకి నటు గాఢగదారణమాడి రంతటన్ ౧౦౧౦

చ॥ గదుఁడు బలానుజుం డతనిగ్గైకొని బాహుబలంబుతోడఁ ద
ద్విదితపురంబునందుఁ బడవేయ యశఃపటహస్వనంబులా
చదలును ముట్టెఁ జూపఱును సంస్తుతిఁ జేసిరి సంతసంబునన్
యదుభవులొంది రచ్చరలు నాడిరి పాడిరి కిన్నరాదులున్ ౧౦౧౧

తే॥ అట్లు స్వపురంబునందు బలానుజుఁడగు గదునిచేఁగూలి మూర్ఛిల్లి క్రమ్మఱ భువి
నుండి లేచిన శక్రసఖుండునొచ్చి యామరుండు పరబ్రహ్మయం చెఱింగి.

వ॥ ఐరావతకులోద్భవంబులును త్రిశుండాదండమండితంబులును జతుర్దంతకాంతంబులును ధవళవర్ణవర్ణితంబులు నగు మత్తేభసహస్రంబులను యోజనద్వయాకారచారుతరంబులును మేరుధరాధరప్రభవంబులును దిక్కుంభినిభంబులు నగు ద్విరదకోటులను దివ్యతురగకోటులను హైమంబులగు శతార్బుదాద్భుతరథంబులను యోజనద్వయవిస్తృతంబు లగు విమానాయుతంబులను గామధేనునియుతంబును బట్టుసరిగలు గలిసిన దారంబులతోఁ గూర్చిన మంచి

ముత్తియంబుల తోరణంబులచే వెలుంగు చందువాలతో నొప్పునవియు మల్లికావ కరందాన్విద్ధంబులును శిరీషకుసుమపేశలంబులు సోపబర్హణంబులును పయఃఫేననిభం బులు నగు దివ్యతల్పంబులను చిత్రవిచిత్రముక్తావితానయవనికాశిబికాచ్ఛత్రచామర వ్యజనభూషణామృతద్రోణసహస్రంబులను సహస్రశిఖరసద్మంబులను బద్మరాగాప్పవ ఘారంబులను హాటకహీరకస్ఫటికమణిఖచితకాదిసహస్రకోటిభాండంబులును కోటిభారహాటకంబును సుధర్మయనుసభను వననిధులను మఱియు నానావిధంబులగు ఫలంబులను గైకొనినిరు ద్ధుండును బుద్ధిసత్తముండునగు సుధన్వుం దోడ్కొని తద్ధరిపుత్రిని సన్నిధి కేతెంచి నమస్కరించి యవి సమర్పించి నా రాజ్యంబునుగూడం బరిగ్రహింపుమని పలించుచుం గృతాంజలియై రక్షింపుమని ప్రార్థింప నా దర్పకుం డానందంబుం బొంది సజ్జనస్వ భావం బిట్టిదని తెలుపుటకో యనం బ్రసన్నుండై రిత్రసఖా! నీ రాజ్యంబు నీవే యధేచ్ఛగాం బాలించుకొనుమని యథయోక్తులాడి రత్నమాల నొసంగి సైన్య సహితంబుగా నతని వీడ్కొని సర్వవిధసౌఖ్యంబులకును నారదాదానపేతటఘాసురం బులు నగు నిజశిబిరంబులలోం బ్రవేశించె. తత్సమయంబున నంబరంబు నుండి చమూసమేతంబుగా దుందుభులు మ్రోఁగుచుండ దిగి తనకడకు నచ్చు దేవేంద్రుని యాదవవీరు లాలోకించి యమిత్రుండేమో యని యూహించి శస్త్రంబుల ధరించి యుద్ధసన్నద్ధులై క్రమక్రమంబుగా సమీపించిన యతనిని సురనాథునిగాం దెలిసికొని యానందించిరి. అంత ౧౦౧౩

—♦ ప్రద్యుమ్నుండు సుందరీ స్వయంవరంబున కేగుట. ♦—

ఉ॥ మారుఁడు కొల్వులోపల సమంజసశక్తి నసింపఁగా సునా
సీరుఁడు వచ్చి యిట్లనియె శ్రీమకరధ్వజ! సర్వవేత్త వా
కారివిగాదె యైన నొకకార్యముఁ జెప్పెద నాలకించి నీ
వేరహితునై నసల్పి సుఖయింపుము! తెంపు నసింపనట్టులన్ ౧౦౧౪

తే॥ ఇచటనుండిన హేమాద్రి నెసఁగు సాను
వులను "లీలావతీపురి"గలదు దాని
బలుఁడు విద్యాధరావళి ప్రభువరుఁడగు
"సుకృతి"పాలించుచుండును సుఖమునిడుచు ౧౦౧౫

క॥ అతనికి సుందరియను నొక శతరాకాచంద్రవదన జనియించెను ద
త్సుతకు స్వయంవరమహా మాపతి ప్రకటనఁ జేసె జగతిఁ బ్రస్తుతమందున్

చ॥ అది సెవులార వించు హృదయంగమవిగ్రహులైన దిక్పతుల్
త్రిదశులు వేడ్కతో నల పురీతిలకంబున కేఁగుదెంచి రా
సుదతియు యేరివ క్త్రిమును జూచినమాత్రన మూర్ఛవచ్చు నా
సదృశవిహీనసుందరుఁడె చక్కవిభుండగు నాకటం చనున్ ౧౦౧౬

క॥ కావున నీవారలతో నీవును నాతోడరమ్ము నీరజనేత్రా!
దేవజనంబుల నచ్చట శేవినిఁ దిలకింపఁగలవు డిగ్గన రమ్మా! ౧౦౧౮

తే॥ అంతఁ బ్రద్యుమ్నుఁడుఁ యాదవానుజులనుగూడి నిర్జరనాయకుతోడఁగదలి
యల్ల లీలావతీపురికరిగి యట్టి పట్ణంబందుఁ గల వింతవరుసఁ జూచి ౧౦౧౯

సీ॥ విస్తారచత్వర విభ్రాజితంబును మౌక్తికతోరణ మండితంబు
స్వర్ణసింహాసన చయసమేతంబును దివ్యరత్నోత్కర దీపితంబు
చందనాగరుఘనసార వాసితమును జందనమృగనాభి చర్చితంబు
సురమరుద్వసురుద్ర సూర్యగణాన్వితం బష్టహరిన్నాయకావృతంబు
తే॥ మునివర వ్రజనాథాధిభూషితంబునగు స్వయంవరస్థలమున కరుగుదెంచి
యచలశృంగంబునందు సింహంబు గూరుచుండినటు గద్దెపైఁగూరుచుండెఁ బిదప

క॥ ఆ విబుధాదులు వచ్చిన శ్రీవిభుసుతుఁ బంచశరు సుశీలునిఁ గనుచున్
భావములందుండిన తమ వైవాహిక వాంఛ విడిచి వఱలుచునుండన్. ౧౦౨౧

మ॥ రతినిన్ రంభనుమించు సౌష్ఠవముతో రాజిల్లు చా సుందరీ
సతి యింద్రాణియొ వాణియో కమలయో శ్యామాదేవియో నాఁగ మేల్
రతనంబుల్ దగినట్టి దండఁగొని యారాజన్యదేవాది సం
వృతగోష్ఠీస్థలి కేఁగుదెంచెఁ దమితో విశ్వంభరా ధూర్వహా! ౧౦౨౨

తే॥ అట్లు సుందరి సభఁజేరి యంబుదంబు వెడకు చేగెడి చంచలవిధిని నచటి
జనులమోహింపఁజేయుచు సదృశపతిని గ్రమముగా నెమకుచుఁబోయి కట్టకడకు

చ॥ సరసిజపత్రనేత్రు సుమసాయకు మీనపతాకునిన్ సుధీ
వరుని దుకూలధారిని నపారబలున్ భువనైకమోహనున్
స్మరుఁ గని మూర్ఛతోడఁబడి సంజ్ఞను గ్రమ్మఱఁబొంది తత్సుకం
ధరమున రత్నమాలిక సదస్యులు జూడఁగవైచె వేడ్కతోన్ ౧౦౨౪

క॥ సుకృతియు నదిగని తానును సుకృతినయితినంచుఁ దలఁచి శ్రుతిహితవిధిగా
స్వకసతిఁ గూడుచు నల మరునకు నిజసుతనిచ్చె దివ్యనాదము లొప్పన్.

ఆ॥ ఆమహోత్సవంబు నమరు లాలోకించి యోర్వలేక యతని నురుఘనములు
ఖరకరుఁడగు సూర్యుఁ గప్పినచొప్పునఁ జుట్టుముట్టి రెట్టి నట్టులేక ౧౦౨౬

చ॥ జనక! యనంతరంబున ఝషధ్వజుఁ డాయమరాదు లట్లు కి
న్కను దను జుట్టుముట్టుటను గన్గొని కృష్ణదచాప మెక్కుపె
ట్టి నిశితకాండకాండముల డీకొని కొట్టఁగ వారలున్ వికి
ర్తనరుచి మంచులేగెడి విధంబునఁబాఱిరి భీతభీతులై ౧౦౨౭

తే॥ ఇట్లిలావృతఖండంబు గృష్ణసుతుఁడు గెల్చి స్వబలంబుతోఁగూడి సుంద
రీసహితుఁడయి యనుజులు ప్రీతి వెంటనంట భరతఖండంబున కరుగుదెంచి

—♦ ప్రద్యుమ్నుండు దిగ్విజయం బొనర్చి ద్వారకాపురి కరుగుదెంచుట. ♦—

వ॥ బిల్వకదంబన్యగ్రోధకంకోలతక్కోలతాలతూలతమాలహింతాల సురసాల రసాలసాలాగరుతగరపనసకుళవంజుళచంపకహరిచందనరక్తచందననారంగమాతులుంగ లవంగ లుంగప్రియంగు పిచుమంద మందార ఖదిరఖర్జూరనాగపున్నాగజంబూజంబీర దేవదారు హార సింగారసింధువారకోవిదారపిప్పలశ్రీఫలసీతాఫలరామఫలపలాశప్లక్ష వంశశింశుపా వంశగుల్మ వంశమదన బాణకర్ణికారసహస్రకందుకాగస్తిసుదర్శనచంద్రక కపిత్థాశోకామ్రామ్రాతకభల్లాతకరక్తపుష్పశుకపుష్పదాడిమానుజీవకపూగగోస్త నీబదామతూలశైలాజాసనమోదినీ సేవతీ మాలతీమాధవీయూథికామల్లికానవమల్లికా మతల్లికాది దివ్యవృక్షవిభ్రాజమానంబును, వైకుంఠసమాగత శుకపికశారికా పారావృత మయూర మరాళ ఖంజన చటకచక్రవాక బకబలాకకోయష్టికముఖవిహగ కృష్ణకృష్ణేతికలధ్వనిమంజులంబును, ఖాతాఖాతవాపీకూపనిపానవిరాజితంబును, కహ్లార కైరవేందీవరమేచకారుణపీతశ్వేతకమలకుశేశయవిస్ఫురత్కాసార సరోవరభాసురంబును, తామ్రరజతమహారజతవినిర్మితదుర్గత్రయవిద్యోతితంబును, దేవతమయ రైవతాచలరాజితంబును, నానర్తదేశాంతర్భూతంబును, పరిఖాభూతరత్నాకర గోమతీనదీపరీవృతంబును, శూరవారచారుతరంబును, ధర్మనిర్మితహర్మ్యరమ్యంబును, సువర్ణాపణధ్వజపతాకాదివిభూషితవైకుంఠశితికంఠపుణ్యమందిరసుందరంబును, విమానకోటివిభాసురంబును, శతశృంగాటకసంపన్నంబును, ననేకరథ్యాభిరామంబును, విశాలశాలాగోవాజిదంతిశాలాసంతతికాంతంబును, రౌప్యమార్గరాజితంబును నవలక్షషోడశసహస్రాష్టోత్తరశతశ్రీకృష్ణోన్నతప్రాసాదప్రకాశమానంబును, శ్రీమన్నారాయణనామపారాయణపరాయణ యాదవవీరభటజన సంకీర్ణంబును, పాపనివారకంబును, పుణ్యాకరంబును, సర్వమంగళకరంబును నగు ద్వారకాపురంబును జయజయ నినదంబులతో ఢక్కాదివాద్యంబులు వ్యాపింపఁజేరి తత్పురబాహ్యంబునందు నిలిచె

ఆ॥ తత్పురంబునందు దర్పకప్రేషితుం డయిన యుద్ధవుండు యాదవసభ
నున్న యుగ్రసేను వెన్నునికిని మ్రొక్కుచు సక్రమముగఁ జెప్పె జయకథలను

క॥ అల యుగ్రసేనవిభుఁడావలన శ్రీబలరామకృష్ణ బాంధవజనవృ
ద్ధులతోఁ జన దగి యవ్విరి విలుతునిఁ దోడ్కొనుచుఁ జేర వేడుక పడుచున్

సీ॥ శంఖ భేర్యానక ఝర్ఝరమర్దల డిండిమడమరువుల్ మెండు మ్రోయ
నఘుహారములు బ్రాహ్మణాననోద్గతములౌ నామ్నాయరావంబు లతిశయింప
శ్రవణపేయములు నిర్జరవారకామినులింపుగాఁ బాడు గీతంబులొప్ప
మండన మండిత మత్తేభరత్నంబు సర్వాగ్రమందున జానుమీఱ

తే॥ పుష్పలాజముక్తావర్షములును గురియ జందనాదివస్తూల్లసత్స్వర్ణకలశ
ములను గైకొని వెడలి యాయలరువిలుతుముంగలకు నేగుదెంచె నో భూవరేణ్య!

క॥ అంతటఁ గంతుఁడు ఖడ్గము సంతోషముతోఁ ధరించి స్వబలయుతుండై
వంతుగ భక్తిని యాదవకాంతుని హరి హలిని బుధుల గర్గుని మ్రొక్కెన్

చ॥ పదపడి నుగ్రసేనుఁ డల బాహుబలాఢ్యుఁడు దిగ్విజేతయా
మదనునుతించి పూజ నిగమంబులు పల్కనతండు సల్పి త
న్మదకరి నెక్కఁజేసి యలద్వారకలోనికివచ్చి వేడ్కలన్
ముదమున సల్పె నెండి యెది భూవర! వింటివా? చెప్పుమియ్యెడన్ ౧౦౩౪

## ఉగ్రసేనుండు రాజసూయం బొనర్చుట.

క॥ అనవుడు జనకుం డిట్టులనియెను సురయోగివర్య! యా నృపసూయం
బును నుగ్రసేనుఁ డెట్టులఁ బొనరించెనో? యద్ది నాకుఁ బూర్తిగఁ జెపుమా!

తే॥ అంత నారదుఁ డిట్లనె నవనినాథ! గర్గముఖగురుల్ మంచిలగ్నంబుఁ జూచి
హరిసహాయ మూఁతఁగఁగొనినట్టి యుగ్రసేనునకుఁ జెప్ప నాయదుశేఖరుండు

ఆ॥ తగినవారిఁ బిలిచి ధారణి నంతటఁ బిలిచి రండటంచు వినుఁభక్తిఁ
జెప్పి పంప వారు శీఘ్రముగాఁ బోయి బంధుసఖులఁ బిల్చి వచ్చి రవల ౧౦౩౬

సీ॥ వ్యాసపరాశర పైలసుమంతదుర్వాసోహరితధౌమ్య భార్గవులును
నత్రిదత్తాత్రేయ మైత్రేయ జైమిని కపిలభరద్వాజ గౌతములును
బ్రాడ్విపాకాసిత వామదేవవసిష్ఠ శాండిల్యజీవవిభాండశుకులు
గాధేయమాండవ్య కణ్వవైశంపాయ నాగస్త్యబోధాయ నాంగిరులును

తే॥ సనకముఖకృపద్రోణాది సకలమౌను లుగ్రసేనుఁ డొనర్చు క్రతూత్తమమగు
రాజసూయంబునకు శిష్యరాజిరాజితులయి వచ్చిరి ముదమున లలితచరిత!

సీ॥ అష్టదిక్పాలకులజుఁ డష్టమూర్తియు బ్రద్యోతనాది నవగ్రహములు
వసురుద్రగణములు ద్వాదశాదిత్యులు నఖిలవానరసహితాంజనేయుఁ
డప్సరోయక్షవిద్యాధరగంధర్వ కిన్నరచారణ కింపురుషులు
బ్రహ్లాదభక్తుండు బలిచక్రవర్తియు నందాదిగోపకనాయకులును

తే॥ వాసుకియుఁ గౌరవులు బంచపాండవులును దైత్యదానవభూతభేతాళపతులు
పుత్రపౌత్రసుమిత్రకళత్రభృత్యసహితులై చనుదెంచి రా సవనమునకు

వ॥ మఱియు నశ్వినీకుమారులును లంకాధిపుండగు విభీషణుండును సమస్త భల్లూకయుతంబుగా జాంబవంతుండును నిఖిలవిహగసమేతంబుగా గరుత్మంతుండును గోరూపంబును ధరించి కామధేనుసహితంబుగా భూదేవియు యశోదాది గోపికాదేవులును గోపికాశతయూథంబులును దమ ఘోషవృద్ధశర్మజయసేనధృతకేతుభీష్మకనాగ్నజిద్బృహత్సేనమైథిలేశకోసలేశ్వరులును దదితరరాజులును జాతుర్వర్ణ్యజనంబులును నచలనిచయంబులతోఁగూడి హేమాచలహిమాచలంబులును లతాగుల్మ

తనుసమేతంబుగా నక్షయవటవృక్షంబును దరంగిణీకులంబుతోఁ గూడి గంగా
యమునానదులును రత్నోపాయనపాణులై సప్తసముద్రములును సప్తద్వీపంబులును
గ్రామత్రయంబును నవారణ్యంబులును నవోషరంబులును చతుర్దశగుహ్యంబులును
తీర్థరాజంబగు ప్రయాగక్షేత్రంబును బదరికాశ్రమంబును దండకాదిమహారణ్యంబు
లును గోవర్ధనగిరీంద్రంబును బృందావనంబును స్వజనపరివార సమేతంబుగా
యేతెంచె. అంత ౧౦౪౧

తే॥ కోటిచేటీవిభాసుర కుందరదన దివ్యభూషణభూషిత భవ్యరూప
యైన శ్రీరాధికాదేవి యందలంబునందుఁ గూర్చుండి యేతెంచె నలకు మఱియు

తే॥ అష్టభూతులఁ దగు పరమాత్మఁ బోలెఁ
బుత్రపౌత్రులతోఁ బరిపూర్ణతిమయుఁడు
యజ్ఞమూర్తియుఁ బుండరీకాక్షుఁడు నగు
కృష్ణుఁ డొప్పెడి నంద రోచిష్ణుఁ డగుచు ౧౦౪౨

తే॥ ఉగ్రసేనుఁడుఁ రాజసూయోత్తమంబుఁ గడలికిన్ రైవతాద్రికినడుమఁ జెలఁగు
నట్టి పిండారకక్షేత్రమందుఁ జేయ గర్గవాక్యానుసారంబుగాఁ గడంగి

వ॥ పంచయోజనవిస్తీర్ణంబుగా యజ్ఞకుండంబును రెండేసికోసుల నైదు
గుండంబులును యోజనంబున బ్రహ్మకుండంబును మేఖలాగర్తవిశాలంబులుగా
వేదికలను వేసి వెయ్యిమూరల యూపస్తంభంబును నిల్పి రంభాస్తంభతోరణాది
చారుతరంబగునట్లు యాగమండపంబును సువర్ణమయంబుగా నైదామడలు నిర్మించి
యదువృష్ణ్యంధకమధుశూరసేనదశార్హకులతో దేవతలతో నొప్పి. శతమన్యువు
మాడ్కి వెలుంగుచు గర్గమహర్షిని నాచార్యునిగాఁ జేసికొని దశలక్షహోతల
తోడను దశలక్షదీక్షితులతోడను బంచలక్షాధ్వర్యులతోడను బంచలక్షోద్గాతల
తోడను గూడి యా రాజసూయం బామ్నాయోక్తంబుగా నాచరించె. అందు

తే॥ హస్తిరత్నశుండాసమానాజ్యధార ప్రేల్చుటఁ బితిహోత్రుండు పెదయజీర్తిఁ
గాంచె ముజ్జగంబులను నాకలిని గొన్న జీవమేదియు లేదు విచిత్రముగద

ఆ॥ అవల నుగ్రసేనుఁ డారాజసూయాంతమందు నవబృథంబు వ్యాసగర్గ
ముఖమునులనుగూడిపోయి పిండారకతీర్థమందుసలిపె దివ్యవిధుల

తే॥ అపుడు దక్షిణాసతితోడ నతిశయించు యజ్ఞవలె రుచిమతియుఁ శుభాంగితోడ
వెలుఁగు నుగ్రసేనునిపైని విబుధవరులు విరులఁగురిసిరి దుందుభుల్ నెఱిగ మొరసె

తే॥ అంత యదుపతి తురగశతార్బుదముల క్షౌమనవరత్నకోటుల స్వర్ణహార
లలితములగు చతుర్దశలక్షకరుల గర్గమునికిచ్చి గృహపరికరయుతముగ.

తే॥ వెయ్యి మత్తేభములఁ బదివేలహరుల బంగరిరువదిబారువుల్ పరమభక్తి
తోఁ బ్రతిబ్రాహ్మణున కిడి స్తుతియొనర్చి వందనంబుఁ జేసె నో పార్థివేంద్ర!

వ॥ అంతఁ దద్ధరామరులు సంతృప్తులై కనకమయంబులగు నుచ్ఛిష్టపాత్రంబులను మరుత్తుని యజ్ఞమునందువలెనే విడిచి స్వస్థానంబులకుం బోయిరి. దేవతలు సక్రమంబుగా హవిర్భాగంబులం బొంది తనివిం జెంది స్వర్గంబున కేగిరి. యక్షరక్షోవిద్యాధరాప్సరో గంధర్వ కిన్నరకింపురుష వానరభల్లూకనాగగోశైలవృక్షతీర్థక్షేత్రారామవనాదులును, వసురుద్రాదులును, బహూకృతులై తృప్తితో స్వగృహంబుల కరిగిరి. నందాదిగోపకులు శ్రీకృష్ణునిచేతను బూజితులై నిజమందిరంబులకేతెంచిరి. మఱియు నా యాగంబున కెవరెవరాహూతులైరో యీ విబుధబుధధరాధిపధనితస్త్రీపురుషులందఱ సత్కారంబులం బొంది యాత్మధామంబులకుం జనుదెంచిరి. శ్రీకృష్ణాశ్రితు లెట్టి గొప్పకార్యంబైన నిట్టులే సాధించుకొందురు గాదే! యీ రాజసూయవృత్తాంతంబు వినినను జదివినను సర్వాఘంబులు దూరీకృతంబులుగా సర్వార్థంబులు సఫలంబులుగా సాయుజ్యంబుఁ జెందఁగలరని వక్కాణింప నా బహులాశ్వుండు నారదమహర్షి కిట్లనియె. ౧౦౫౦

చ॥ యదుపతి రాజసూయసుసహాయ! విహాయసవాహ! వాహినీ
పద! పదచాతురీరుచిర! వాగ్మివరా! వరదా! వరద్విపే
ష్టద! సదయాంతరంగజలజా! జలజేక్షణ! శ్రీక్షితిప్రమో
హద! పురుషార్థవర్గద! గదాగ్రజ! యగ్రజవంశరక్షకా! ౧౦౫౧

భుజంగప్రయాతము. చతుర్వ్యూహజన్మా! పరిజారక్షణాస్థా!
చతుర్దివ్యబాహూ! యసల్లోకనాశా!
చతుర్వేదబోధ్యా! ప్రచండాంశురూపా!
చతుర్వక్త్రవంద్యా! భుజంగేంద్రశాయీ! ౧౦౫౨

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్య దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతం బందలి
విశ్వజిత్ఖండము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓం తత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ గర్గభాగవతము

## బలభద్ర ఖండము



క॥ కరధృత గోవర్ధనగిరి! పరిహృతగోపీమకూల! భక్తమవితాంబ
బర! గోలోకేశ్వర! నిర్జరనాయకపోషణాఖ్య! రాధాకృష్ణా! ౧

వ॥ నారదా! సుధాఖండంబును మించి చవులు గలిగించెడి విశ్వజిత్ఖండంబు వీనులార వింటి. శ్రీకృష్ణనందనాదినామరూపప్రతిభాప్రభావాది విశేషంబులు దెలిసె. ఆ హరికి షోడశసహస్రగోపికలయందును, భార్యలయందును జనియించిన తనయులును, మనుమలును, మునిమనుమలును గోటానగోటులుగా నుండిరిగాదే. కవివరుండు భూమియందలి రేణువుల లెక్కింపబయలుదేరునేమోకాని తద్ధరితలంబును గణింపరానేరఁడు. కాని మహాత్ముండగు బలరామునకు రేవతీసతియందుఁ బుత్రోదయం బేకతంబునఁ గాలేదో సవిస్తరంబుగాఁ బలుకుమని ప్రార్థింప నా దేవముని భూవరున కిట్లనియె. ౨

—♦ప్రాడ్వివాకముని బలరామావతారముం గూర్చి దుర్యోధనునకుం జెప్పుట.♦—

తే॥ చక్కఁగాఁ బల్కియుంటివి జనక! వినుము
మున్ను ప్రాడ్వివాకుఁడను మునివరుండు
హస్తినాపురనాయకుఁ డాత్మశిష్యుఁ
డగు సుయోధనుచెంతకు నరుగుదెంచె ౩

చ॥ అపుడు సుయోధనుండు తన యంతికమొందెడి నొజ్జగాంచి లే
చి పరమభక్తి నర్చలనుజేసి ఘనాసనమిచ్చి జోతముల్
నెపములఁ బాపుమో వరమునీ! యని సల్పి మతిస్థశంక యి
ట్టిపగిదిఁ బృచ్ఛఁజేసెను గడిందిగ మైథిల లోకనాయకా! ౪

చ॥ మునుపెవఁ డిట్టి హస్తిపురిఁ బూనికతోఁ దల(క్రిం దొనర్చె? నే
ఘనబలశాలి నాఁగను నఖండగదాగురు వయ్యెనో యెవం
డనుపమసుందరుండొ యెవఁ డచ్యుతసోదరుఁ డట్టిరాముఁ డెం
దున ధరఁబుట్టె నెవ్వరు నుతుల్ బొనరించి రటుల్ జనింపఁగాన్. ౭

తే॥ అంత ప్రాడ్వివాకుం డిట్టులాడెను యువరాజ! నీప్రశ్న పాపహరంబుగాదె
కాన సక్రమముగఁ జెప్ప నానుడులను వినుచునుండును! నిశ్చల విమలబుద్ధి

ఆ॥ అయ్య! యిట్టి ద్వాపరాంతమందున ధాత్రి యసురదుష్టపార్థివాళిభార
మును వహింపలేక పూని గోరూపంబు బ్రహ్మకడకుఁబోయి పల్కె స్వగతి

క॥ అంతట వాణీకాంతుఁడు చింతింపకుమంచు ధరకుఁ జెప్పి యుపర్ణా
కాంతేంద్రాది దివౌకస్సంతతితోఁ గూడి విష్ణుసన్నిధి కేగెన్ ౮

వ॥ అట్లు సర్వసుపర్వసహితుండగు పితామహుం డరిగి యా విష్ణుమూర్తికిఁ దన రాకఁ జెప్పి యతనిం బురస్కరించుకొని శ్రీవామనవామపాదాంగుష్ఠనఖనిర్భిన్నోర్ధ్వాండకటాహవివరమార్గంబున నడచి వెలుపలకు వచ్చి మహాద్భుతంబగు బ్రహ్మద్రవంబందుఁ బొల్పారు ననేకలోకంబులం గాంచుచు విరజానదీతీరంబును జేరి దాని కనతిదూరంబున నసంఖ్యాకోటిమార్తాండసదృశంబగు తేజఃపుంజంబును గాంచి నుతించి నమస్కరించి గుణలక్షణలక్షితుండును సహస్రవదనుండును సంకర్షణుండును నగు ననంతుని విలోకించి తదుత్సంగంబున బృందావనకాళిందీగోవర్ధనగోపికాగోపకగోకులలతాతరుకుంజనికుంజసంకులంబును సర్వభువననమస్కృతంబును నగు గోలోకంబు నాలోకించి తద్బహిర్ద్వారరక్షకాజ్ఞఁ గైకొని లోనికిం బోయి యనేకబ్రహ్మాండవిభుండును గౌస్తుభాదిదివ్యమణిభూషణభూషితుండును రాధానాథుండును బీతాంబరవనమాలావంశిధరుండును నగు శ్రీకృష్ణుని ముఖారవిందంబును జూచి వందనంబు లొనరించి భూభారవృత్తాంతం బంతయు విన్నవించుకొన నా పరాత్పరుం డాలించి స్వకీయులగు దేవజనులను యథోచితంబుగా నాజ్ఞాపించి యా యనంతునిం బిల్చి యిట్లనియె. ౯

తే॥ నీవు సంకర్షణా! ముందు దేవకి యనఁ
దనరు వసుదేవు సాధ్వి యుదరమునందు
నమరి రోహిణీగర్భముఖమున ధరను
బుట్టు దేవకియం దేను పుట్టఁగలను ౧౦

క॥ ఆరహిఁ జెప్పి ననంతుఁ డుదారమతిన్ సరియటంచుఁ దనసభలో నొ
ప్పారుచు నుండగఁ గిన్నర చారణ గంధర్వముఖులు సల్పిరి నతులన్ ౧౧

క॥ అంత "సుగతి"యను సారథి వింతగొలుపు తాళపాళి వెలిఁగెడి రథమూ
చెంతకుఁ దోడ్కొనివచ్చె ననంతుం డదిగని వెయివదనంబులతోడన్ ౧౨

మ॥ పరసేనాంతసమర్థమౌ ముసలముం, బర్హిర్ముఖారాతిసం
హారణప్రౌఢహలంబు, బ్రహ్మమయనామాంచత్సువర్ణంబుఁ, సం
బరముం బొందుచుఁ గాంచె నప్పుడు రమాకాంతుండు మున్ముందు చా
మరముల్ సిద్ధులు వీవ శేషుఁడరిగెన్ మార్తాండసామ్యద్యుతిన్ ౧౩

తే॥ అతుల నాతఁడు దివ్యసహస్రవక్త్ర
ముల నుతించి పాణినిపతంజలిముఖులగు
మునులు వినుతింప నా యనంతుని లయించె
నందుఁగలవారు చిత్రంబుఁ జెంద మఱియు ౧౪

తే॥ అజితవైకుంఠసుందరుం డఖిల యద్వైత
పాదపీఠస్థితుండుఁ డుఁ మహాదాదులు పను
చుండఁ బ్రేతవినాయకు లొప్పనిచ్చి
పొగడి వేనోళ్ళ నా దివ్యమూర్తిఁ గలిసె ౧౫

చ॥ మఱిఁ దెలిదీవినుండి వెయిమంచిఫణంబుల నొప్పు శేషుఁడుం
ద్వర సితశైలకాంతిఁ గుముదాక్షముఖానుచరాన్వితుండుగాఁ
గఱివలువల్ ధరించి ఘనకాలకచంబులు నొప్పఁగా భయం
కరముగ వచ్చి తద్ఘనునిఁ గాంచి నుతించి లయించె వెండియున్ ౧౬

తే॥ అల భవానికి దాసురాండ్రైన యప్సు
డాంగనాముఖులను గూడి యా యిలావృ
తంబునుండి శేషుఁడు వచ్చి తన సహస్ర
వదనముల సన్నుతించి యాబలునిఁ గలిసె ౧౭

వ. అంతఁ బాతాళలోకంబున కధఃప్రదేశంబున ద్వాత్రింశత్సహస్రయోజనంబులనుండి తామసీకలుండును, సహస్రవదనుండును, మకుటకుండలాదిమండితుండును, వ్యాసపరాశరసనకసనందనసనాతనసనత్కుమారనారదసాంఖ్యాయనపులస్త్యబృహస్పతివిశ్వామిత్రాత్రిజత్తాత్రేయమైత్రేయాది మహర్షి శోభాయమానుండును, వాసుకిమహాశంఖశ్వేతధనంజయధృతరాష్ట్రకుహకకాలియతక్షకకంబళాశ్వతరదేవదత్తాదినాగేంద్రసేవ్యమానుండును, మృగమదాగరుసంకుమదకుంకుమచందనపంకావలిప్యమానసాగకన్యకాప్రకాశమానుండును, సిద్ధచారణగంధర్వాదిగీయమానుండును, హాటకేశ్వరత్రిపురబలకాలకేయకలినివాతకవచాద్యనుయాయివిరాజమానుండును, గామధేనురుద్రవరుణాది ప్రియాయివిభ్రాజమానుండును, నిజైకఫణాధృతసర్వసర్వంసహామండలుండును, సిద్ధసంకల్పుండును నాగేంద్రవాహుండును, నగు ఫణీంద్రుండునైత మాబలభద్రసభ కేతెంచి యాసంకర్షణమూర్తిం గని వినుతించి యా దివ్యవిగ్రహంబున లీనంబయ్యె. తత్సమయంబునందుఁ దత్రిత్యు లత్యాశ్చర్యంబుఁ

బొంది యతండు పరిపూర్ణతముండగు పరమాత్ముండని తెలిసికొని నమస్కరించిరి.
అంత నాయనంతుండు నిజపార్షదులగు సిద్ధుల కిట్లనియె. ౧౮

తే॥ ఏను భూమిభారము బాప నేగుచుంటి
సంద్యునక మీరు యదుకులమందు సపరి
వారులై పుట్టుఁడీ! యని పరమకరుణ
తోడ వాచించి మఱియు నిట్లాడఁదొడఁగె. ౧౯

సీ॥ సుగతి! రథంబుతో వగవక యిందుండు మెపుడుదలంతునో యపుడురమ్ము
దుర్భేద్యకవచమా! తొలఁగక యిందుండు మెపుడు దలంతునో యపుడురమ్ము
లాంగలమా! నీవు గ్రుంగక యిందుండు మెపుడు దలంతునో యపుడురమ్ము
ముసలమా! నీవును బొగులక యిందుండు మెపుడు దలంతునో యపుడురమ్ము

తే॥ అమరవసురుద్రవిద్యాధరాప్సరోజనంబులార! యోగమునులార! నాగులార!
కుముదముఖులార! సఖులార! గోపులార! దనుజులార! నన్నిలమీరు గనుచునుండ్రు

తే॥ ఇటుల సంకర్షణునిచేత నెల్లవారు చెప్పఁబడి నిజగృహములకు జేరి రవల
నాగకన్యక లేగక నతుల సలిపియుంట నాయనంతుండు గ్రీగంటఁగాంచి ౨౧

క॥ ఎఱిఁగితి మీభావము మీరరుసము గన యమునదరి విహారము మీతో
వఱల నొకప్పుడు రాసము గరముగ నొనరింతు నాగకన్యకలారా! ౨౨

తే॥ అంచు నాగ్రుచ్చి వారలనంపె నంత నల నివాతకవచపతియైన కలియు
జనక యట్టి సంకర్షణు చరణకమలముల విరులఁజల్లి గ్రాలియుఁబలికె నిట్లు ౨౩

ఉ॥ త్వచ్చరణాంబుజంబుల సతంబును భక్తినిఁగొల్చు నన్ను మీ
యిచ్చను బంచుఁడీర లెట కేగుట కిత్తఱి నెంచియుంటిరో
యచ్చటికేగుదెంతు విశయంబును మానుచు భక్తవత్సలా!
నిచ్చయమిద్ది మిమ్మువిడి నేనిచటన్ మనఁజాలఁ జింతతోన్. ౨౪

చ॥ అనవు డనంతుఁడిట్లనె మహాసురవర్య! ముదంబుఁగంటి నీ
వును జనుదెంచి యట్టి కురుభూపతియౌ ధృతరాష్ట్రనామధే
యునకు సుయోధనుండనఁగ నుద్భవమొందుము చక్రవర్తివై
తనరుము నీకు నప్పుడు గదారణమున్ దమినేర్పుదున్ గలీ! ౨౫

తే॥ అంత నాతఁ డానందించి యాయనంతు ననుమతింగొని నిజగేహమునకు నేగె
నా కలివె నీవు! కృష్ణమాయాబలమున నెఱుఁగకుంటివి నీస్థితి నీవు భూప! ౨౬

తే॥ అవల నాయనంతునిసభకాతురమున శారదేందుమండలకోటి సామ్యకోటి
చేటికావృతస్యందనశ్రేష్ఠరుచిరయైన నాగలక్ష్మియు వచ్చి యనియె నిట్లు

ఆ॥ ప్రాణనాథ ! భూమి భారంబుఁ బాపంగ బోవుచుంటి వేను భువికి వత్తు
మిమ్ము విడిచి యొక నిమిషమేని మనఁజాలనం చెఱుంగుమా! సహస్రవదన!

తే॥ అంత నారహిఁ గన్నుల నశ్రుజాలుకఁ బలుకు నిజసతిం గని భక్తపాపహరుఁడు
భువనకారణకారణుం డవితథబలుఁడగు ననంతుఁ డాదరముతో ననియె నిట్లు

క॥ మగువరో! సంతోషించితి వగవకుమా! రేవతి యను భామను లీవం
బగుమా ! ధరఁగల నాతోఁ దగి సుఖముల్ బొందుమా! సతిమ రంభోరూ!

క॥ అన నాగలక్ష్మి యిట్లనె నసఘా! యా రేవతియను నబ్జాక్షి యెటన్
దనయునా యేయునకున్ దనయయొ యెఱుఁగంగ నాకు దయతోఁ జెపుమా!

వ॥ అంత నాయనంతుండు నిజకాంత కిట్లు చెప్పందొడంగె. 3౨

## ——♦ జ్యోతిష్మత్యుపాఖ్యానము. ♦——

ఆ॥ ఆదిసర్గమందు నల కశ్యపప్రజాపతికిఁ గద్రువయను భార్యయందుఁ
బుత్రకుఁడుగ నేను పుట్టి శ్రీకృష్ణాజ్ఞ సర్వలోకములకుఁ జాలక్రింద 33

తే॥ చేరి సర్వభూమండలభారములను మత్తమాతంగవరము కమండలువును
గరమునం గొనినట్టు లొక్కపడిగమునఁ దాల్చి మోయుచునుంటిఁ దత్సమయమందు

ఉ॥ చక్షునికొడుకు ద్వీపయుత సర్వధరాపరిపాలనక్రియా
దక్షుఁడు చండశాసనుఁ డుదారుఁడు వైరిభయంకరుండు నౌ
చాక్షుషుఁడన్ మనూత్తముఁడు సర్వగుణంబులయందు నా సహ
స్రాక్షుని నింద్రుగూడ నపహాస్య మొనర్చుచు నుండె దండిగన్ 3౪

క॥ అతనికి నుద్యుమ్నాదులు సుతులుగలరు మఱియు యజ్ఞకుండసము
ద్గతయగు నొకసుత జ్యోతిష్మతియను పేరం జెలంగు సారసనేత్రా! 3౬

క॥ అంత నొకప్పు డతఁడు దమిఁ జెంతకుఁ దనసుతనుఁ బిలిచి చెప్పుము! నీకే
కాంతుం డిష్టుఁడొ? నావుడు సంతసమున నామె యిట్లు చక్కఁగఁ బలికెన్

తే॥ ఎల్లభువనంబులందున నెవఁడు బలుఁడొ వాఁడె నాకు విభుండగు బాధ మవల
నతఁడు మోదిల్లి యింద్రుఁడే యధికబలుఁడటంచు నాతనిం బిల్చి సింహాసనమిడి

ఆ॥ సత్యమాడనట్టి జనుని సర్వంసహ మోయఁజాలనంచు మొత్తుకొనదె
కాన నిన్ను మీఱు ఘనబలుండున్నాఁడ లేఁడ? నాకుఁ జెపుమ లేఖవర్య 3౮

వ॥ నావు డింద్రుండు మనూత్తమా ! యథార్థంబుగాఁ బలుకుచుంటి. జగ
త్ప్రాణుని విడిచి నే నేకార్యంబును జేయఁజాలను. కాన నాతండె నాకంటె బలవం

తుండని చెప్ప నతం డంగీకరించి యష్టామూర్తుని నామంత్రణంబు సేసి నీకంటె బలుండగువానిం జెప్పుమనిన నతం డాలోచించి నావేగంబునకు సమస్తప్రపంచంబు కంపించును గాని ధరాధరంబులు జలింపవు. అక్కతంబున నవియే ఘనంబులని వక్కాణింప నామనువు మొదిల్లి యాశైలంబుల నాహ్వానించి యథాప్రకారంబుగాఁ బ్రశ్నింప నవ్వి మమ్ము భరించునది భూఖండమండలంబు గాన నదియే మాకంటె శ్రేష్ఠంబని స్పష్టీకరింప నాచక్షుషుం డాభూఖండంబును రావించి పూర్వోక్తంబుగా నడుగ నది యోమహాప్రభూ! నేను బలినిగాను. ఆదిదేవుండును వాసుదేవుండును సంకర్షణుండును సహస్రవదనుండును నాగేంద్రనాప్యశేషుండును కైలాసతుల్యధవళవర్ణుండును గోటికందర్పదర్పహారిలావణ్యవిభ్రాజమానుండును, గోటిసూర్యప్రతీకాశభానుండును గమలపత్రనేత్రుండును గమలకర్ణికాదివ్యనిర్మలపరిమళలోభితమధుకరనికరసంగీయమానుండును కిన్నరసిద్ధచారణాద్యుపగీయమానుండును సురాసురప్రకరసంధ్యాయమానుండును సర్వాగ్రవిరాజమానుండును బ్రహ్మాండవిభుండును కైవల్యదుండును భగవంతుండును గారణాకారణుండును నగు ననంతుండు లతాతరుగిరితరంగిణీసహితంబగు ననేకఫణంబుతో మోయుచు రసాతలమూలభాగంబునందుండు. ఆ మహాబలుని మించినవాఁ డొకండు నెందునను లేఁడని సమగ్రంబుగా బలికి యతని వీడ్కొనె. అంత నా చాక్షుషకుమారి నాబలప్రతిభాప్రభావాదులం దెలిసికొని మత్ప్రార్థ్యంబై పితృాజ్ఞఁ గైకొని వింధ్యాచలంబునకరిగి గ్రీష్మంబునం బంచాగ్నిమధ్యమందుండి క్రాగియు వానలఁ దడిసియు జలినిం జన్నీట నాకంఠంబుగా మునిఁగియు స్థండిలంబునం బరుండుచు బ్రహ్మనుగూర్చి తపం బనేకలక్షసంవత్సరంబులవఱ కొనరించుచుండె. అత్తఱి శక్రయమధనదాగ్నివరుణసూర్యచంద్రమంగళబుధగురుశుక్రశను లా తపస్వినీ వయోరూపలావణ్యాదులం దిలకించి పరికించి మోహించి మన్మథశరసంహతులై తాళజాలక యామె యాశ్రమంబున కేతెంచి మహానందంబుతో నిట్లనిరి. ౮౦

—♦ దేవేంద్రాదులు జ్యోతిష్మతిని మోహించి కోరుట. ♦—

ఉ॥ ఓ మదిరాక్షి! యెంతుల కనుత్తమమా తపమిట్లొనర్పవో?
నీమెయి కష్టపెట్టుటయు నింద్యము ప్రాయమె యోగ్యమైన దే
యామెయి మాకుఁ దెల్పు మది యిష్టఫలింపఁగఁ జేయనేర్తుమో
సామజయాన! నావు డలచాక్షుషపుత్రిక యిట్లు చెప్పెడిన్ ౮౧

ఆ॥ ఆర్యులార! నాకు నాసహస్రాస్యుండు వరుఁడు బలుఁడును భగవంతుఁడగు న
నంతుఁ డిపుడు ప్రాణనాయకుం డగుటకై తపముఁ జేయుచుంటిఁ దత్పరతను

క॥ అవ్వాల నవ్విబుధోత్తము లవ్వచనము లాలకించి యరరే! యనుచున్
నవ్వి పకాపక యామెకు నివ్విధి నొకఁడొకఁడు బల్కె నింపుని భాస్వా! ౮౩

వ॥ అందాదియందు బృందారకేంద్రుం డరుదెంచి యిట్లు హెచ్చరించె

చ॥ సరసిజలోచనా! వృథగ సర్వముఁగూర్చి తపించు టేలకో?
త్వరను దనంతఁదావలచి వచ్చిన నన్ను శతక్రతుండ సురే
శ్వరు వరుగాఁగ్రహించి బహుసౌఖ్యములం గనరాదె సుందరీ!
కరివరయానా! చంద్రముఖ! కంబుగళా! తడవేల? చెప్పవమ్మా! ౪౫

ఉ॥ ఆవలఁ గాలుఁ డేగి యిటులాడెఁ జెలీ! యమధర్మరాజు లో
కావళి శిక్షఁజేసెడి మహాబలవంతుఁడనైన నన్ను వే
నీవు వరించి యెల్లపుడు నెమ్మిని మప్పదిలోకమందునన్
భావుకసౌఖ్యములన్ గనుము! పంకజపాణిరో! కీరవాణిరో! ౪౬

ఉ॥ అంతఁ గుబేరుఁ డిట్లు పలుకాడెను నాకిఁకపుత్రికామణీ!
సుంతను నెంతవారలను జొక్కఁగఁజేసెడి ద్రవ్యరాశికిన్
గాంతుఁడ రాజరాజును నఖండబలుండనుగానఁ బ్రేమమైఁ
జెంతనువీడి నన్నిపుడు చేకొనుమా! భువనైకమోహినీ! ౪౭

ఆ॥ అవల నగ్నివచ్చి యాడె నీవిధముగా సర్వదేవముఖుని సర్వయజ్ఞ
సుప్రతిష్ఠితు నను సొంపుగాఁజేపట్టు మంబుజాక్షి! విడిచి యన్యబుద్ధి ౪౮

తే॥ అంత వరుణుండు నిట్లనె న్యథను విడిచి జలధినాయకుఁ బాశాదికలితు లోక
పాలకుని నన్ను వేగ చేపట్టి వైభవములఁ గనుము జ్యోతిష్మతీ! కమలనేత్ర!

క॥ వెండియు రవి సని యిట్లనెఁ జండకరుఁడ సర్వకర్మసాక్షి జగచ్చ
క్షుండను స్వర్మణిఁ గావునఁ బెండిలియగు నీచగతిని విడిచి మిటారీ! ౫౦

మ॥ పిదపన్ జంద్రుఁడు వోయి యిట్లనియె నో బింబాధరా! లోకవి
ద్యుదుఁ దారేశు సుధాంశు నోషధిపతిన్ రమ్యాంగు రాజున్ ననున్
మదిరాక్షీ! తమిఁ బెండ్లియాడుమిపుడే మావారు మీవారలున్
ముదముం జెంద ననంతుఁడన్ బలునిపై బోనీక నీబుద్ధినిన్ ౫౧

తే॥ అంత మంగళుఁ డిట్లనె నింతి! నాకుఁదల్లి యీరత్నగర్భయ తండ్రియన్నఁ
బరుఁ డుమాక్రముఁడగు పుట్టినదుగ్గుగాదె వృద్ధి గోరినచో నన్నుఁ బెండ్లియాడు

ఆ॥ అవల బుధుఁడు నిట్టులనెఁ గామినీరసవర్ధనుండ గుణిని బలుఁడఁగాన
సకలసురల విడిచి సుకముగా నాతోడ రతులఁ దేలుచుండరాదె రమణి! ౫౩

క॥ అంత బృహస్పతి యిట్లనె గాంతా! ధిషణుండ దేవకాండ్రగురుండన్
శాంతుఁడ దాంతుఁడ మంత్రిని స్వాంతమునకు నచ్చెనేని వరియింపు ననున్

క॥ అవలన్ శుక్రుం డిట్లనె గవివరుఁడను భార్గవుఁడ నఖండబలుండన్
దివిజారాధ్యాచార్యుండను బ్రవిమలమతిఁ జూచి నన్ను వరియింపు చెలీ! ౫౫

తే॥ అంత శని యిట్లువాకొనె నంబుజాక్షి నిఖిలనిర్జరశిరములన్ నిలుచు బలుఁడ
నాదు దృష్టిని సర్వుల బూదిగల్పఁగలను గావున నన్గోరి గనుమ సుఖము

వ॥ తత్పరంబునం దక్కరిణి నక్కావరు లొక్కుమ్మడివచ్చి వక్కాణించుట నక్కన్యకామణి యాలకించి వెక్కసపడి యొక్కమాఱు నన్నెక్కవగా స్మరించి యధరంబు చలింపఁ గన్నుల నిప్పులురాల మండిపడుచు నావేల్పులం గాంచె. తత్కోపంబున బ్రహ్మాండంబంతయు గంపించె. ఆనిలింపాధిపాదులు శాపంబిచ్చునేమో యని ప్రార్థించిరి. కాని యాతపస్విని కొంత శాంతించియుఁ దాళంజాలక యవ్వారల నిట్లు శపింపంగడంగె. ౫౮

— జ్యోతిష్మతి యింద్రాదులను శపించుట. —

చ॥ అరెశనిగా! హరించుటకునై ననుఁజేరితి వక్కటానఁ బం
గురధక్రశాంగకాత్యసితకుత్సితవిద్యుతినీచదృష్టులున్
వఱలఁగ శ్వేతమాషతిలభక్షివిగమ్మిఁక ముందు నిట్టులె
వ్వారిదరిఁ జేరబోవకుము భద్రము భస్మమొనర్తు వేల్మిడిన్ ౫౯

సీ॥ కావ్య! కాణుండవుగమ్మ! బర్హిర్ముఖ గురువరా! స్త్రీసంజ్ఞకుండవగుమ!
సౌమ్య! నీదినమున సర్వశూన్యంబౌత! సూర్యజ! వానరాస్యుండవగుమ!
శశి! నీవు రాజయక్ష్మంబున నొచ్చుమా! ద్యుమణి! సంభగ్నదంతుండవగుమ!
వరుణ! జలంధర బాధితుండవుగమ్ము! స్వాహేశ! సర్వభక్షుఁడవగుమ!
తే॥ గుహ్యకేశ్వర! హృతపుష్పకుండవగుమ! యంతకా! నీవు దనుజవరావమాని
తుఁడవు గమ్మని భీతిభీతుఁడగు నిర్జరేశ్వరుం గని చీకొట్టి యిటు శపించె. ౫౯

మ॥ సురనీచా! సురనేతనంచు నిటకున్ సుద్దుల్ నశింపన్ ననున్
హరియింపన్ జనుదెంచి యుంటి విటు నీయన్నున్ నృపుండొక్కఁడే
డ్డైఱఁగాఁజేయుచు నీవు వోవనెటకో దివ్యంబు నీస్వర్గమున్
బరిపాలించుత తుచ్ఛ! మత్పతిఁ బరున్ బ్రహ్మన్ బలున్ దూతదే? ౬౦

తే॥ మఱియు నొక మహాబలిరణమండలమున నిన్ను నిర్జించి పాశాళి నెఱిగఁగట్టి
ప్రసభముగ లంకయందలి బహుభయంకరాంధకారగృహమున వేయంగలండు

ఉ॥ అంతట నట్లు శప్తులయి నట్టి యమర్త్యుల నింద్రుఁ డాగ్రహా
క్రాంతమనస్వియై "సుదతి" కారులఁ బల్కెదవేల? యిష్టా జ
న్మాంతరమందొ యేసమయమందొ యనంతుఁడు నీకు నెట్టులోఁ
గాంతుఁడుగా లభించినను గల్గఁడు పుత్రుఁడొకండు సైతమున్ ౬౧

తే॥ అని శపించి తద్విద్యుతికాగలేక వేల్పులంగూడి నిజదివ్య విష్టపమున
కరిగె నంతట నక్కన్య మరలఁ దపముసేయఁ గడఁగెను జిత్తంబు చెదరకుండ

ఉ॥ తత్పరమున బ్రహ్మ తత్తపంబునుమెచ్చి బ్రాహ్మణులనుగూడి వాణితోడ
హంస నెక్కి యామె యాశ్రమంబున కేగి యంబరమున నిలిచి యనియె నిట్లు

క॥ జ్యోతిష్మతి! నీతపమే ప్రీతిం గలిగించె నాకు వేగంబే త్వ
చ్చేతస్స్థితవాంఛాస్థితి యాతజి నెఱఁగించికొనుమ! యిచ్చెద నిదుగో ౬౫

చ॥ అనుపమ తన్మృగేక్షణయు నాకమలాసనదివ్యసూక్తులన్
విని గళవారినుండి వడి వెల్వలకున్ జనుదెంచి భక్తితోఁ
గని వినుతించి మ్రొక్కులిడి కారుణికోత్తమ! నాకనంతుఁడే
పెనిమిటియౌనటుల్ సలిపి వేడ్కను గూర్పుమ! యీక్షణంబునన్ ౬౬

## —♦ బ్రహ్మవరంబున జ్యోతిష్మతి రేవతియై పుట్టుట. ♦—

వ॥ పిమ్మట నత్తన్మిమాలి యుమ్మా! నీపరంబుదుర్లభంబు. అట్లైన నాసంగె దనుగాని యిప్పుడే ధరను వైవస్వతమన్వంతరంబు ప్రారంభించె. ఇందిరువదియేడవ యుగం బతిక్రమించుసమయంబున నీమనోరథంబు సఫలంబుగాఁగలదు. అంత వఱకు వేచియుండుమన నక్కన్నియ క్రమ్మఱం బ్రణమిల్లి వాణీవల్లభా! మీగడు వతిదీర్ఘంబుగా నున్నది. సహింపజాల. సర్వసమర్థులు నావాంఛితం బతిశీఘ్రంబుగా ఫలించునట్లొనర్పుము. లేదేని నాచే దేవతలు శాపదగ్ధులైనట్లు నీవును గాఁగలవన నానలువ భయభీతుండై యించుక యోజించి కుమారీ! యొండొక కారణంబున నాగడువు త్రుటిగాఁ జనఁగలదు. కాన నీవు వెంటనే కుశస్థలీపురినుండు రేవతుండను రాజునకుం బుట్టి నీకోరిక దీర్చుకొనుమని వరంబిచ్చి యంతర్హితుండయ్యె. అంత నాజ్యోతిష్మతి తద్విధంబునం బుట్టి రేవతియను నామంబుతో శుక్లసుధాంశుభాతిఁ గ్రమంబుగా రూపౌదార్యాదిగుణంబులతో వర్ధిల్లుచు వివాహయోగ్యయగుటం దండ్రియగు రేవతుండుగాంచి కుమారీ! నీకెట్టికాంతుం డిష్టుండో యని చనవుననడిగి సర్వాధికబలుండే నాకు ప్రియుండను ప్రత్యుత్తరంబు గైకొని తాదృశవరుని యోజించి తోఁచక విచారింప బ్రహ్మలోకంబునకుం బుత్రీసహితంబుగా నరిగి యట క్షణంబు గడుపునంతలో నిలను బ్రహ్మాదితకాలం బత్యాసన్నంబయ్యె. ఇంతవఱకు నక్కన్నియతో నాతం డందున నేయున్నాఁడు. కాన నీవు క్షిప్రంబుగా నాకన్యకయందుఁ బ్రవేశించి ద్వారకాపురమందు నాతో సుఖంబుగా విహరింపు మని యాజ్ఞాపించె. అంత ౬౭

తే॥ నాగలక్ష్మియు స్వప్రాణనాయకుఁడు నఖండబలుఁడు పరుఁడగు సంకర్షణునకు
మ్రొక్కి వీడ్కొని విధి లోకమునఁ జెలంగు రేవతీకన్యలోఁ జొచ్చె శీఘ్రితోడ

తే॥ అవలఁ నట్టి సంకర్షణుం డఖిలలోకవినుతగోలోకమందుండి చనియె నిద్ది
యఘహరంబగు బలరామునాగమ మిఁక నెద్దివిందువో యువరాజ! యెఱుఁగఁజెప్పుమ!

—♦ ప్రాడ్వివాకుండు దుర్యోధనునకు శ్రీకృష్ణచరిత్రంబు సంగ్రహించి వచించుట. ♦—

చ॥ అనవుడు భూపుఁ డిట్లనియె నా బలు భక్తుఁడనైన నాకుఁ ద
ద్ఘనమహిమంబుఁ జెప్పి కృతిగా నొనరించితి రీర లావిధం
బున నలరామకృష్ణు లిలఁబుట్టి పితన్ విడి గోకులంబునుం
జనిరెటుఁ దమ్ము వేఱెఱుఁగఁజాలనియట్లెటులుండిరో? గురూ! ౭౦

తే॥ ఇట్టివిషయము సెపుము! మునీంద్ర! యనఁగఁ బ్రాడ్వివాకుండునిట్లనెఁ బార్థివేంద్ర!
యొక్కతఱి మధురాపురినుగ్రసేను నన్నయగు దేవకుండను యదువిభుండు

చ॥ తనసుతయైన దేవకిని దద్వసుదేవున కిచ్చి పెండిలిన్
బొనరిచి పంపునప్డు యదుభూమివిభుండగు నుగ్రసేను నం
దనుఁడగు కంసుఁడొక్క యరదంబున వారలఁ నెక్కఁజేసి వే
డ్కను వడి దోలఁగాఁగడఁగెఁ గౌరవనాయక! యట్టిపట్టునన్. ౭౧

తే॥ కంస! యీసతి యష్టమగర్భమందుఁ
గలుఁగు పురుషుఁడు నిను జంపఁగలఁడు సత్య
మనెడి నశరీరవాణిని నవధరించి
యా మహాబలుఁడగు కంసుఁ డాగ్రహించి ౭౩

చ॥ కరమునఁ గత్తిఁబట్టి స్వసకంఠముఁగోయఁగఁబోవఁ గాంచి బల్
త్వర వసుదేవుఁ డడ్డుపడి బావ! యధర్మము మాను మీమె కె
త్తఱిఁ దనయుల్ జనించెదరొ దక్షణమందునఁ దెచ్చి యిచ్చెదన్
నఱకుము స్వేచ్ఛ నానుడులు నమ్ముమనంగఁ దదాగ్రసేనియున్ ౭౪

ఉ॥ ఒప్పుచు వారినిర్వుర మహోద్ధతితోఁ జెఱసాలయందునన్
జొప్పడఁజేసి చింతవిడి సొంపుగనుండె ననంతరంబునం
దప్పువుబోఁడికిన్ బ్రథమమందు జనించిన దివ్యపుత్రునిన్
దెప్పునఁ గొంచు నట్టి వసుదేవుఁడు కంసునకిచ్చె నంతటన్ ౭౫

తే॥ కంసుఁడా వసుదేవునిఁ గల్లలాడువాఁడు గాఁడని పొగడి యాబాలుఁ జంప
కుంఠ విడె నంతఁ గయ్యపుఁదిండి యతనికడకు నరుదెంచి పల్కఁడఁగడఁగె నిటుల

చ॥ యదుభవులున్ నిలింపులు నహర్నిశమున్ భవదాత్యయంబు నే
హృదయములన్ దలంతురని యేగెను బిమ్మట జాతరోషుఁడై
యదువిభుఁ డూకి యెప్పటికి నప్పుడు దేవకి గన్నబిడ్డలన్
జదిపి యదుప్రధానులను జండతఁజూచెడిఁగుంది పాఱఁగాన్ ౭౭

తే॥ ఇంతలో దేవకీదేవి యేడవపరి బలుని భగవంతుని సహస్రవదను గర్భ
మందుఁదాల్ప శ్రీకృష్ణాజ్ఞ నట్టియోగమాయ తత్తేజమునుగొనిపోయి వడిగ

ఆ॥ వ్రజమునందు నున్న వసుదేవపత్నియగు రోహిణి జఠరమున రూఢిఁగూర్చె
మధురయందుఁ జెలఁగు మనుజు లీయనుగర్భ మేడ కేగె నంచు నాడి రంత. ౮౯

తే॥ అనల రోహిణికిఁ గర్భమై యెసఁగినమూలైన పిమ్మట దేవకీ మానవతియు
నందమందిర మంతయు నాణెమైన, ప్రభల వెలుఁగంగ భవ్యమా వ్రజమునందు.

తే॥ ఐదు గ్రహము లుచ్చస్థితి నలరుచుండఁ, దులను స్వాతిన్ బుధవార కలితమైన
భాద్రపదశుద్ధషష్ఠినిఁ బట్టపగలు, గులవధూమణియగు నామె బలునిఁ గనఁగ.

ఉ॥ వేల్పులు మంచిపూవులను బెల్లుగఁ జల్లిరి వారిదోత్కరం
బల్పతుషారముం గురిసె నావల నందుఁడు బిడ్డకుఁ బ్రియా
జల్పితజాతకర్మమును సల్పి ధరామరపంక్తి కాల న
స్వల్పముగా నొసంగి పురి వర్తిలు గోపుల సత్కరించెఁగా. ౯౨

వ॥ అంతఁ గారాగృహంబందున్న దేవకీదేవి యష్టమగర్భంబు ధరించి పరిపూర్ణతముండగు శ్రీకృష్ణచంద్రునిం గాంచఁగా వసుదేవుండు తదాజ్ఞచే నొకచోలిక నాశిశువు నుంచుకొని మహానిశీథంబున బయలువెడలి యమునానదిని దాఁటి వ్రజంబునందు యోగమాయంగాంచి నిద్రించెడి యశోదసెజ్జపై దనతనయుని డించి యందుండు యోగమాయాకన్యకం గొని వడితో నిజబంధనంబునం బ్రవేశించె. అవల దద్బాలికారోదనధ్వని యాలించి కావలివారు కంసునితోఁ జెప్ప నాతం డతిద్రుతగతినిఁ జనుదెంచి యాబిడ్డం గైకొని యొండుబండపైఁ గొట్ట నక్కన్యక చివుక్కునఁ బైకెగసి సిద్ధచారణాదులు స్తుతించుచుండ నిలిచి యోరీ దుష్టా! నిన్నుఁ జంపు బలుండీవఱకే యెచటనో జనించియున్నాఁడు. వ్యర్థంబుగా దేవకీవసుదేవుల హింసించెద వేల? యని పలికి వింధ్యాచలంబున కేగె. తరువాత నాయదువిభుం డాలోచించి యవ్వారలఁ జెఱనుండి విడిచి పూతనాదిరాక్షసులం బిలిచి పదిదినంబులలోపల ప్రపంచం బంతయుఁ దిరిగి వెదకి మీకుఁ గనఁబడిన పిల్లల నెల్లరను జంపి యావార్త దెలుపుండని పంచె. ఇఁక గోకులంబునందు నందుండు నందనోత్సవంబైనదని విని మహానందంబుతో మహోత్సవంబు సలిపె. ఇట్లు రామకృష్ణులు కంసభయమిషనటనుండి గోకులంబున కరుదెంచి గోపికాగోపకులను మోహపరచుచు నద్భుతంబులగు బాలక్రీడలం గావించుచుఁ బెరుఁగుచుండిరి. మఱియు నేమి వినవలతువో చెప్పుమన నా దుర్యోధనుండు సంతోషించి యా మునీంద్రున కిట్లనియె. ౯౩

క॥ ధీర! యల రామకృష్ణులు ధారుణిపై నవతరించి తద్వ్రజమందున్
ద్వారక మధుర మఱియొక యెడ నేరహిఁ దగి? రద్ది సంగ్రహించుచుఁ జెపుమా!

తే॥ అనఁగ బ్రాడ్వివాకుండు నా యవనిపతికి నీ కితఃపూర్వమంపున నేను సెప్పి
నట్టి వ్రజమధురాద్వారకాదిపురుల వారు సల్పినలీలలన్ వరుసఁ జెప్పె.

తే॥ జనక! తిరిగి సుయోధన చక్రవర్తి యిటులనడిగెను మునివర్య! యెపుడుబలుఁడు
యమునదరి నాగకన్యకలైన గోపికలనుగూడి క్రీడించెనో? పలుకుమయ్య!

ఆ॥ అనఁగఁ బ్రాడ్వివాకుఁడనె నిట్లు యువరాజ! సీరి యొక్కతఱిని స్నేహితులను
జూడ నుత్సుకుఁడయి సుందరతాలాంకసహితరథము నెక్కి సత్వరమున ౮౭

ఉ॥ ద్వారకనుండి గోకులము దక్షిణమందునఁ జేర నెయ్యురుల్
బేరిమిసల్పి తోడుకొని వేశ్మములన్ జనుదెంచి రంత నా
శూరునిరాక నందుఁడు యశోమతియున్ విని ప్రీతి నాతనిన్
జేరియుఁ గౌఁగిలించుకొని క్షేమముసడ్గిరి సక్రమంబుగాన్ ౮౮

తే॥ అంత బలరాముఁడందున నాత్మమిత్ర బంధుగోగోపికాగోపపంక్తితోడ
గలిసి చైత్రవైశాఖముల్ గడచుదాఁక సంతసంబున నుండె నా సమయమందు

ఆ॥ మున్ను జెప్పఁబడిన భోగికన్యక లిలఁ బ్రేఁతలుగ జనించి రేవతీశ
లబ్ధికొఱకు దివ్యలాంగలిపంచాంగమును గ్రహించి గర్గమునిముఖమున ౯౦

క॥ దాని జపించుచు సిద్ధి ననూనముగాఁ బొందియుండి రుచ్ఛ్రియబలుం
డా నారీరత్నంబులతో నొప్పుచు నొక్కతఱిఁ గుతుకమతితోడన్ ౯౧

చ॥ యమునతటంబుఁ జేరి యమృతాంశుఁడు సర్వకళాప్రపూర్ణుఁడై
సుమఫలవృక్షవల్లరుల శోభనుజెందు వనంబునన్ వినో
దముగ వెలుంగ దివ్యసికతామయ వేదికలందుఁ జైత్రపూ
ర్ణిమఁ బృథురాసకేళులను నేర్పునఁ జేయఁగడంగె నిట్టులన్ ౯౨

## —♦ బలరామరాసలీలావర్ణనము. ♦—

సీ॥ కమలమరందరేణుమిళితగంధవాహములు శీతముగ మందముగ వీవ
బల్లవసుమరజో భాసురశుకపిక బర్హిణాదులును శ్రావ్యముగఁగూయ
మాలతీ పద్మినీ మాధవీ మధుమత్తషట్పదంబులు ప్రీతి ఝుంకరింప
శ్యామల విద్యుతిచారుతరమగు కాళిందిభంగంబు లానంద మిడఁగ

తే॥ మకుటకుండల కంకణమణిమయాంగదాంగుళీయకహారతారాదిభూష
ణాంచితుండయి యక్షీజనాళినొప్పు ధనదువలె గోపికలతోడఁ దనరి బలుఁడు

వ॥ వరుణదేవప్రేషితంబయి వనంబంతయుఁ బరిమళింపఁ జేయుచు సుమభార గంధిలోభిభ్రమరనాదితమేదినీరుహాకోటరంబులనుండి శ్రవించు వారుణింగ్రోలి కెందామరచందంబున గన్నులు జెన్నుమీఱ మకరధ్వజావేశంబున సోలుచు విహార పరిశ్రమప్రస్వేదాంబుకణంబులచే గండస్థలమకరికాపత్రభంగంబు భంగంబుగా బాహుదండంబు వేదండశుండాదండంబును బోలి యొప్ప హలముసలాయుధంబులు హస్తం

బులం బొల్పార నీలాంబరంబులు నిజాంగకంబున వినోదంబుగా మెఱయ గున్న యేనుఁగులీల నడచి తన తేజంబు కోటిపూర్ణేందుమండలప్రభాతిం బురుడింపఁ జంద్రాస మండలభాసురసింహాసనాసీనుండై రత్నమంజీరనూపురకనకకింకిణీకంకణకటకహారాంగుళీయకశిరోరత్నాద్యలంకారంబులచే నలంకృతలగు నా గోపికాసుందరులతోఁ గరేణువులం గూడి విహరించు మత్తకరీంద్రుండై వడి నవ్వారల మనోరథంబుదీర మహావిచిత్రంబుగా ననేకరీతులం గ్రీడించె. అంత ౯౪

తే॥ అర్కతనయాతటవనపర్యటనబహువిహారకష్టజనితనిదాఘాంబుకణవ్ర
తాననారవిందుండగు హలి జలకములాడ నవ్వుచుండి రమ్మని యమునఁ బిల్చె.

తే॥ అటుల నాహూతి నందిన యమున యతని దరికిఁ జనకుండె నత్తఱిఁ ద్బలుండు
గాంచి కనలి దానిని హలాగ్రమునఁ జెంతకీడ్చుకొని నిష్ఠురంబుగ నిట్టులఁ బల్కె

క॥ ఓసీ! కాళిందీ! నాకీసమయమునం దవజ్ఞ యీ మానమతువే?
నాసరివారలు లేరని నీసూటికిఁ దగినలాగు నెఱిఁ దిరిగెదవే? ౯౭

తే॥ కాని యీ ముసలంబుతో నీనిమిషమునందు శతఖండములుగ నిన్నాచరింతు
నంచు భర్త్సింపగా నట్టి యమున భీతిఁ బొంది తత్పాదనీరజములను వ్రాలి.

మ॥ బలరామా! యదువంశసాగరశశీ! భక్తాళిచింతామణీ!
పలుజోతంబులఁ జేయుచుంటిఁ గొనుమీ బ్రహ్మాండభాండంబు నీ
తల నావంతగఁ దోఁచుచుండె నిఁక నా తప్పుల్ దయన్ బాపి నీ
బలమున్ గుత్తెఱుఁగంగలేని ననుఁ బ్రోవన్ వేఁడుచుంటిన్ విభూ! ౯౯

చ॥ ఇటు వినుతింప రాముఁడు నహీనదయన్ గని యా కళిందజన్
దటుకునఁ గ్రమ్మఱిల్లి గజితుండముతోఁ దగు మత్తకుంజరం
బటు లల వ్రేఁతలన్ గలిసి యా యమునానదిఁ గ్రుంకి లేచి త
త్తటమునఁ జేరియుండె వసుధావరవంద్యసుయోధనప్రభూ! ౧౦౦

తే॥ అపుడు యమునాతరంగిణి హాటకమణిభూషణముల దివ్యాంబరములను నీల
పటము లా బలునకు నిచ్చి వందనముల సల్పి చనె నంత సీరియు సక్రమముగ.

తే॥ వేఱువేఱుగ వ్రేఁతలన్ బిల్చి యవ్వి యిచ్చి తాను నీలపటంబు లిచ్చఁ దాల్చి
స్వర్ణనవరత్నమాలికన్ స్వగళమందు వేసి యైరావతముబోలె వెలిఁగె లలిగ

ఆ॥ ఇటుల నట్టి రేవతీశుండు చైత్రవైశాఖనిశల గడిపె శమనభగిని
కరిపురివలె బలుని గండుసూచించుచుఁ గృష్ణపంథఁ జెలఁగు నిప్పటికిని. ౧౦౩

క॥ ఇది బలరామకథావిధి చదివిన వ్రాసినను వినిన జనులకఘంబుల్
జదియఁగ సద్గతి యొదవెడి నెదివిందువో! మఱియుఁ జెపుమ! యిభపురినాథా!

క॥ అనఁగ సుయోధనుఁ డిట్లనె మునివర! యా సతులు గర్గమునిచే బలభ
ద్రుని పంచాంగం బెట్టులఁ గొనిరో యావార్త నాకుఁ గూర్మిని జెపుమా!

చ॥ పదఁపడి ప్రాడ్వివాకుఁ డిటుపల్కెను గర్గనగంబునుండి స
మ్మదమున గర్గమౌని యొకమా అల సూర్యసుతాతటంబునన్
గొదరెడి దివ్యకుంజమునకున్ జని యేకకుఁడౌచు సాధుభ
క్తదయితరామకృష్ణులను ధ్యానముసేయుచునుండె భక్తితోన్ ౧౦౬

తే॥ అపుడు గోపికలుగఁ బుట్టినట్టి నాగకన్యలా విజన్మజ్ఞాన కలితలగుచు
వచ్చి యాగర్గమౌనికిఁ బరమభక్తి వందనంబుల నొనరించి పలికి రిటుల ౧౦౭

—♦ బలభద్ర పంచాంగము. ♦—

క॥ బలభద్రుఁడు మాకిప్పుడు సులువుగఁ జిక్కెంగవలయు సూరివరా! యం
దుల కేవనులను నేరీతుల సలుపవలెఁ జెపుమా యదుప్రవరగురూ! ౧౦౯

తే॥ పిదప గర్గుఁడు వారల విమలభక్తి మెచ్చి బలభద్రపంచాంగ మిచ్చనిచ్చ
నన సుయోధనుఁ డాలించి మునివరేణ్యా! యద్దియెట్టిదో వివరింపుమార్య! యనఁగ

ఆ॥ ప్రాడ్వివాకుఁ డిట్టుబల్కెఁ దద్బలరాముపద్ధతి పటలముఁగవచము నుతి స
హస్రనామములను నైదింటిలోఁ దొలిదైనపద్ధతి వినుమయ్య భూప! ౧౧౦

ఆ॥ ప్రతిదినంబునందు బ్రాహ్మ్యముహూర్తంబునందు "రామ! కృష్ణ" యంచు లేచి
గురుని మ్రొక్కి భువినిఁగూడ ధ్యానించుచుఁ బుడమిపైని నడుగులిడిక దంక

క॥ జలమును దాఁకి రహస్యస్థలమున దర్భాసనమున సంస్థితుఁడై చే
తులఁ దొడపైనిడి చూపులునిలిపి స్వనాసాగ్రమందు నిష్ఠాపరుఁడై ౧౧౨

చ॥ వరుని ననాదిమధ్యలయు భక్తజనప్రియు రేవతీమనో
హరు వనమాలికాధరు విహారవిలోలు సుశీలు మేచకాం
బరు జగదేకసుందరు దివస్పతిదంతిసమాను గోపికా
వరు బలభద్రు ధ్యానమును భావమునందు నొనర్పఁగావలెన్. ౧౧౩

తే॥ ఇటుల నిత్యము తప్ప్రీతి కేకభుక్తి ద్విజలపానములన్ దగి విడిచి కల్ల
విజితషడ్వర్గుఁడౌచు భువిని శయించి మూఁడుపూఁటలన్ ధ్యానించు పూరుషునకు

తే॥ సాంఖ్యయోగాదివిధులచే సంభవింపనట్టి కారణకారణుఁడైన బలుఁడు
గోచరుండయి కరుణతోఁ గోర్కెదీర్చు నిదియ పద్ధతి పటలంబునిఁకను వినుమ!

వ॥ యువరాజా! అతిగుహ్యంబును వృద్ధిసిద్ధిప్రదాయకంబును బ్రహ్మచే నారదున కుపదేశింపఁబడినదియు నగు తత్పటలంబునకుం బ్రథమంబునం బ్రణవంబు నుద్ధరించి కామబీజంబుఁ జేర్చి కాళిందీభేదనసంకర్షణపదద్వయంబును జతుర్థ్యంతం బులుగా మార్చి కూర్చి తుదను "స్వాహా"యను పదంబు లగించి షోడశాక్షరాత్మక మంత్రరాజంబును దీక్షతో లక్షపదియాఱువేలమాఱులు జపించి తద్దశాంశంబున శుభ ప్రదంబగు స్థండిలంబున ద్వాత్రింశత్పత్రవిభాసురంబును గర్ణికాకేసరోజ్జ్వలితంబు నగు పద్మంబు నైదురంగులతోఁ జిత్రించి దానిపై స్వర్ణసింహాసనం బేర్పరచి యందు బలభద్రప్రతిమ నుంచి దానికి "నమోభగవతే" యను మంత్రంబుచే శిరంబుతో నమస్కరించి "జయజయానంత" యను దానిచే వాహనంబిడి "నమస్తేస్తు" అను మంత్రంబుతో నాసనాదిషోడశోపచారంబులం గావించి "విష్ణవే" యను దానిచేఁ బాదాదిసర్వాంగపూజం గావించి తన్నామమంత్రంబుచే శంఖచక్రగదాపద్మాసి ధనుర్బాణహలముసలకౌస్తుభవనమాలా శ్రీవత్సపీతాంబరనీలాంబర వంశీవేత్రగరు డాంకతాలాంక రథదారుక సుమతికుముద కుముదాక్షశ్రీదామాదులను వేఱువేఱుగా నర్చించి విష్వక్సేన వేదవ్యాసదుర్గావినాయకదిక్పాలనవగ్రహంబులను సక్రమంబుగాఁ బూజించి స్థాలీపాకవిధానంబున పితృహోత్రమునిం దృప్తిపఱచి యందు మూలమం త్రంబుచే నిరువదివేలయాహుతులను, ద్వాదశాక్షరిని నెనిమిదివేలయాహుతులను జతుర్వ్యూహమంత్రంబుచే నెనిమిదివేలయాహుతులను వేల్చి యాయగ్నికిం బ్రదక్షిణంబు లాచరించి నమస్కరించి దివ్యాంబరసువర్ణభూషణసవత్సగోధనంబు లాచార్యునకు సమర్పించి భోజనదక్షిణాదులచే బ్రాహ్మణులకుఁ దుష్టిగూర్చి నాగరు లను సైతము భోజనాద్యుపచారంబులచే గౌరవింపవలయు. ఇట్లీపటలంబు నియమం బుగా నడపు జనుం డిహాముత్రఫలసిద్ధులం బొందుఁగాదె. వెండియు వేదవ్యాసకృతం బగు తత్స్తోత్రంబు విశదీకరించెద వినుమని యిట్లనియె

సీ॥ దేవాదిదేవాయ రేవతీరమణాయ సంకర్షణాయ రసాధరాయ
శేషాయ పూర్ణాయ సీరహస్తాయ సహస్రాననాయ మహాబలాయ
రోహిణీపుత్రాయ మోహనాకారాయ యబ్జనేత్రాయ కృష్ణాగ్రజాయ
నీలవస్త్రధరాయ తాలాంకరుచిరాయ కరివరపట్టణ కర్షకాయ

తే॥ కూటముష్టికకుంభాండ కూపకర్ణ బల్వలాసుర ధేనుక ద్వివిద రుక్మి
కంససోదరతతినాశకాయ దివిజమానితాయ శూరాయ నమోనమోస్తు ౧౧౭

మ॥ యమునాభేదన! కామపాల! ముసలీ! యాభీరవామాంగనా
రమణా! గోకులమండనా! కురుధరా! రాజన్యశిక్షాగురూ
త్తమ! నానావరతీర్థపర్యటనసక్తా! భక్తచింతామణీ!
యమలోదారమనీష! మ్రొక్కెదను రామా! నన్ను రక్షింపుమా! ౧౧౮

క॥ మునిఫణిసురవరసన్నుత! యనఘా! బలభద్ర! నీకు నభివాదనముల్
బొనరిచెదన్ గైకొనుమీ కనికరమున నన్ను గనుచుఁ గావు మనంతా!

తే॥ ఇద్ది నుతి; యింకఁ గవచంబు నీవు వినుము!
జనుఁడు నీరాడి క్షౌమవస్త్రములఁగట్టి
దర్భబృసినొప్పి కుశపవిత్రంబుఁబెట్టి
శిరమునందు మంత్రమునఁ బ్రోక్షించుకొనియు. ౧౨౦

ఆ॥ మనమునందు నతని మఱిమఱి దలఁచుచు వందనములఁజేసి పాపహరము
క్షేమకరమునైన శ్రీబలకవచంబు నిటు ధరింపవలయు నిభపురీంద్ర! ౧౨౧

సీ॥ బ్రహ్మాండవిభుఁడును బరమేశుఁడునగు గోలోకనాథుఁడు నన్ను సాకుఁగాత
సేనాచయంబులన్ సీరి రక్షించుత హాలి యుద్ధమున గెల్పు నలుపుఁగాత
ముసలి దుర్గంబులన్ బ్రోచుత వనములన్ సంకర్షణుఁడు నన్ను సాకుఁగాత
యమునావిభేదనుం డప్పులఁ బ్రోచుతఁ గాలాంబరుఁ డగ్నిఁ గాచుఁగాత
తే॥ ననిలమందు రాముండు గాపాడుఁగాత బలుఁడు నింగిని బ్రోవుత వారిధుల న
నంతుఁడును రక్షసేయుత నగములందు వాసుదేవుఁడు బ్రోచుతన్ బ్రత్యహమును

సీ॥ వాదమున సహస్రవదనుఁడు బ్రోచుతఁ గామపాలుఁడు వెతన్ గాచుఁగాత
గామమునన్ ధేనుకామిత్రుఁ డోముతఁ గలనున ద్వివిదారి గాచుఁగాత
బిల్వలారియు నాసఁ బ్రీతినిం బ్రోచుత గద రౌహిణేయుఁడున్ గాచుఁగాత
మోహామునన్ జరాపుత్రారి బ్రోచుత నుదయాన వృష్ణీంద్రుఁ డోముఁగాత
తే॥ ప్రాహ్ణమున మధురాపతి రక్షసేయుఁగాత మధ్యాహ్నమున గోపకసఖు డోము
తన్ స్వరాట్టపరాహ్ణాన దయనుగనుత సాయమున ఫణిపతియును సాకుఁగాత.

ఆ॥ తపఁ బరాత్పరుండు గాచుత నర్ధరాత్రమునఁ గల్వమున దురంతబలుఁడు
గాచుఁగాత నాల్గుకడలఁ బ్రలంబారి గాచుఁగాత నన్నుఁ గరుణతోడ. ౧౨౪

తే॥ నాల్గువిదిశలన్ రేవతీనాథుఁ డోముఁగాత యాదవేంద్రుఁడు క్రిందఁ గాచుఁగాత
నూర్ధ్వమున బలభద్రుండు నోముగాత నెల్లయెడలఁ బూర్ణుండు రక్షించుగాత.

క॥ కురుధరణీరమణా! యిది సురనరదైతేయభీతి శోకహారంబున్
దురితేంధనతతి వైశ్వానరమగు బలకవచమంచు నమ్ము మనంగన్. ౧౨౬

తే॥ గౌరవేశ్వరుఁ డిట్లనె ధీరవర్య! యట్టి పంచాంగమందున నైదవదిగ
దగుసహస్రనామంబుల దయను నాకుఁ జెప్పుమనఁ బ్రాడ్వివాకుండు సెప్పె నిట్లు

వ॥ ఈ సహస్రనామస్తోత్రమహామంత్రంబునకు గర్గాచార్యుండు ఋషిగను, ననుష్టుభంబు ఛందంబుగను, సంకర్షణపరమాత్మ దేవతగను, బలభద్రుండు బీజంబుగను, రేవతి శక్తిగను, ననంతుండు కీలకంబుగను నొప్పు. ఇది ముందుగా

"స్ఫురదమలకిరీట" మ్మను శ్లోకంబుతో ధ్యానించి "బలభద్రియను" నామంబు మొదలుకొని "శుభాస్పద" యను నామంబువఱకుం గల వెయ్యింటిని జపింపం దగు. ఈ స్తవంబు నూరుమాఱులు జదివినవాఁడు విద్యావంతుండగు. నిత్యంబును బఠించువాఁ డాయుశ్శ్రీయశోబలంబులను జక్కఁగాఁ బొందు. గంగాతీరంబుననో దేవాలయంబుననో వెయ్యిమాఱులిది పారాయణంబు గావించిన జగన్నుతబలిష్ఠుం డగు. పుత్రార్థి పుత్రవంతుండగు. రోగి నిరోగియగు. బద్ధుండు విముక్తుండగు. ధనార్థి ధనవంతుండగు. దీనిని యథావిధిగాఁ బురశ్చరణంబుఁ గావించి పదివేల మాఱులు జపించి స్వర్ణతర్పణగోదానంబులను సల్పి బ్రాహ్మణసంతర్పణంబులు గావించిన పుణ్యుం డఖండభూమండలవిభుండై మండలేశ్వరపూజలం బొందుచు నలంకృతంబగు మత్తేభంబు నధిరోహించి నలంకరింప సకలైశ్వర్యంబులతో నొప్పారుచుండు. నిష్కారణంబుగా కేవలదేవకీపతిప్రీతికొఱకు దీనిం బఠించినవాఁడు మేరుసమాననిజాఘౌఘంబుల దూరీకరించి సర్వసుఖంబుల ననుభవించి యంతిమంబున గోలోకంబు జేరంగలండని వచింప దుర్యోధనుండు పరమానందభరితుండై నిజగురువరునకు విధివిధానంబుగా నర్చింపఁ బ్రాడ్వివాకుం డాశీర్వదించి యతని వీడ్కొని నిజాశ్రమంబున కేగె. ౧౨౮

ఆ॥ ఇలను నెవ్వఁ డిట్టి బలభద్రఖండంబు వినునొ వాఁడు సర్వవృజినములను
దక్షణమున విడిచి ధర్మార్థకామమోక్షములఁ బొందఁగలఁడు జనకరాజ! ౧౨౯

ఉ॥ మేరుసమానధీర! మణిమిశ్రితకాంచనభూషణాంచితా
కార! సుపర్వవైరికులఖండనవీర! మహాసముద్రగం
భీర! యఘౌఘదూర! వనబృందవిహార! పరా! పయోఘృతా
హార! స్వభక్తదుఃఖపరిహార! రమారమణీమనోహరా! ౧౩౦

కాంతివృత్తము. దేవాదిజనావన దివ్యకరా! గోవర్ధననామక గోత్రధరా!
శ్రీవత్సమనోహర సిద్ధికరా! గోవిష్టపభాసుర గోపవరా! ౧౩౧

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవీ
సుబ్రహ్మణ్య దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతం బందలి
బలభద్రఖండము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓం తత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ గర్గ భాగవతము

## విజ్ఞాన ఖండము



స్వీకభక్తసౌఖ్యకర్తా!
సకలబ్రహ్మాండభర్త! సర్గోద్ధర్తా!
శకునిముఖాసురహర్తా!
ప్రకటీకృతవిశ్వమూర్తి! రాధాకృష్ణా! ౧

వ॥ అనవుడు బహులాశ్వుండు నారదమహర్షి కిట్లనియె. ౨

తే॥ అమరమునివర! యెట్టిమార్గమున నేను కృష్ణభక్తుఁడనగుదునో యెఱుఁగఁబలుక
వేఁడుచుంటిని నావుడు విబుధమౌని పార్థివేంద్రున కిట్లు చెప్పందొడంగె. ౩

క॥ జనకా! మును వ్యాసముఖంబున వినిన సుభక్తిమార్గమును జెప్పెద నా
ఘనపంథను శ్రీకృష్ణుఁడు గనుపడి కోరికలఁదీర్చు క్ష్మాతలనాథా! ౪

చ॥ సరసిజనేత్రుఁడైన హరి సంద్రమునందు భుజాబలంబునన్
బరసని శంఖునిన్ గెలిచి ద్వాదశయోజనవిస్తృతంబుతో
వఱలెడి ద్వారకాపుర మపారకళావిభవంబు లొప్ప ను
ద్ధరణ మొనర్చెఁగా యట సుధర్మమహాసభ యొందు రాజిలున్. ౫

### —♦ వ్యాసుం డుగ్రసేనుదరి కరుదెంచుట ♦—

సీ॥ వైడూర్యములతోడ భాసిలుకంబముల్ బద్మరాగంబుల వఱలు ధరణి
విద్రుమంబులచేత వెలుఁగు సోపానముల్ బచ్చలఁదగు బహిర్ద్వారములును
కాలమేఘతటిత్ప్రకాశభాసురములై కుదిరికగానున్న కుడ్యములును
ముక్తావితానముల్ మొనరు పొన్గద్దియల్ శ్రీకరానేకపద్మాకరములు

తే॥ నఖిలసుమఫలసహితంబులైన ధ్రౌవ్య సర్వతోభద్రనందన చైత్రరథవ
నములు గంధర్వవిద్యాధరమహిళాకదంబకం బా సుధర్మను దనరుచుండు. ౬

తే॥ అద్ది దశయోజనాయతం బైమయోజనములయెత్తును గల్గి చెక్కులఁ బొంది
తనుఁ బ్రవేశించువారి బృందారకేంద్రసమఘనతనొప్పనటుల నలుపుచుండు.

ఆ॥ అందుఁజేసినట్టి యనఘునకున్ మూఁడు జగములందునున్న చాతురిదగు
నెవ్వఁడందునుండు నెందాఁక నందాఁక నూర్మిషట్కమతిని నొందలేదు. ౯

తే॥ అందు నొక్కమూలకు నేఁబదాఱుకోట్ల యాదవులు పరిపోయి రత్యద్భుతముగ
సానుచరుఁడగు శ్రీకృష్ణుఁ డందు నొప్పె నతని వర్ణింప నేరికి నలవియగునె ?

చ॥ ఒకతఱి నామహాసభ యదూప్తవులందఱు సుట్టి కొల్వఁగా
సుకముగ వందిమాగధులు సూతుఁడు సన్నుతిసేయ యాదవ
ప్రకరపుఁ డుగ్రసేనుఁడు దివంబున వచ్చెడి వ్యాసుఁ గాంచి కౌ
తుకమున గద్దె డిగ్గి వినతుల్ బొనరించి సపర్య సల్పియున్. ౧౦

తే॥ మంచి సింహాసనంబు నర్పించి మానినర్య! మజ్జన్మమందిరవంశదాన
యజ్ఞపట్టణప్రాభవాద్యఖిలవిధులు సఫలమయ్యె మీరాక నీసమయమందు.

క॥ అనఘ! సదానందమయులయిన మీ క్షేమంబుఁగూర్చి పృచ్ఛించుటకున్
బనిగొనఁజాలని నాకీ రనుకంప వచించి యేదో హాయిని నిడుఁడీ! ౧౨

క॥ ఎచ్చట నెచ్చటఁ ద్వాదృశ సచ్చరితులు దిరుగుచుండ్రొ సకలమునీంద్రా!
యచ్చట నచ్చట నిహపర ముచ్చయసంసిద్ధి గలుగు భూజనములకున్. ౧౩

తే॥ మఱియు మీబోఁటివా రెందుఁ గరుణ నొక్క
క్షణము నిలుతురో యందు నా జలజనాభుఁ
డొప్పునని చెప్ప నితర సాక్షాత్కారంబు
జెలఁగితీరునటం చేను చెప్పవలెనె ? ౧౪

చ॥ పరమమునీంద్ర! సర్వవిభవంబులతోడ వెలుంగు ద్వారకా
పురమిపుడేలుభాగ్యమును బొందుట కాదని నే సవాదులన్
సరిగనొనర్చియుంటినొకో ? సత్యవతీసుత! త్వాదృశుల్ ధరా
మరులు మదాలయంబునకు మాటికి వత్తు రదేమిపుణ్యమో ! ౧౫

తే॥ ఇవ్వి నాకు లభించుట కేమహాసుకృతము లొనరించియుంటినో యెఱుఁగ నైతి
గావునన్ బరావరవిదగ్రణులు మీరు దెలియఁజేయ వేఁడితిని బృహ్మ్వసురేంద్ర!

వ॥ అనవుడు వేదవ్యాసుం డుగ్రసేనా! నీవు ధన్యుండవు. నీప్రశ్నంబు నాకభి మతంబయ్యె. పూర్వజన్మంబునం దీవు మరుతుండను క్షత్రియుండవై నిష్కారణంబుగా విష్ణుప్రీతికొఱకు విశ్వజిద్యాగంబు మహావైభవంబుగా నొనర్చితివి. అద్దానికి మెచ్చి శ్రీకృష్ణుం డప్పుడు నీకుఁ బ్రసన్నుండయ్యె. భక్తవత్సలుండగు భగవంతుండు భజించు భక్తులకు ముక్తి నొసంగునుగాదే, తత్సుకృతబలంబుననే యీ జన్మంబున

నసంఖ్యకోటిబ్రహ్మాండవిభుండును గోలోకేశ్వరుండును బరాత్పరుండును బరిపూర్ణ తమావతారుండు నగు శ్రీకృష్ణుండు ముక్తి యొసంగ వచ్చి నీకు వశుండై నీ యింట వెలుంగుచున్నవాఁడు. నీ భక్తియోగం బనితరసాధ్యంబని యెఱుంగుమన నాతండు మిక్కిలి సంతోషించి నమస్కరించి క్రమ్మఱ నమ్మహాముని నిట్లడిగె. ౧౭

## లోకకర్మగతి నిరూపణము.

తే॥ కారణంబులతోఁగూడు కర్మములకు నెట్టిగతిగల్గు? లక్షణం బేది వాని
కొప్పు? వాని భేదములెన్నియున్న? విప్రవరలికి నాసంశయంబును బాపు మార్య!

క॥ అనవుడు వ్యాసుం డిట్టుల ననె సత్వరజస్తమోగుణాచరితకృతుల్
సనిమిత్తంబులు మది ఫలమునుగోరక చేయు కృతులో మూలరహితముల్.

తే॥ అందు సనిమిత్తకర్మంబు లఖిలబంధనముల నిడు నిర్నిమిత్తకర్మములు మోక్ష
మిచ్చుఁ దత్త్రిగుణములు ప్రకృతిభవములు దన్మయం బీజగంబని తమి నెఱుఁగుమ.

తే॥ నీరజాక్షుఁ డీజగమందు నిండె దివికి సాత్వికులు బోవగలరు రాజసులు మనుజ
ధరకుఁ జనెదరు తామసుల్ నరకమునకుఁ జనఁగలరు నిర్గుణుల్ హరిఁ జనెద రాస్థ.

సీ॥ పంచాగ్నితప్తులౌ పరమమునీంద్రులు సప్తర్షిలోకంబుఁ జనుచునుండు్రి
దండత్రయంబును దాల్చిన సంయముల్ సత్యలోకంబును జనుచునుందు
రష్టాంగయోగంబు లాచరించినయతుల్ జనలోకమునకును జనుచునుండు్రి
యజ్ఞముల్ సల్పిన ప్రాజ్ఞవరేణ్యులు శక్రలోకంబును జనుచునుండు్రి

తే॥ దాత వోవును జంద్రమస్థానమునకు వ్రతియు నేగును భాస్కరపదమునకును
సత్యసంధుండు వారుణజగముఁబొందు క్షేత్రయాయి లగ్నిపదంబుఁ జెందు మఱియు

క॥ పితరుల సర్వవిధంబులఁ బ్రతిదినమును బూజసేయు ప్రజ యట్టి త్విషాం
పతిదక్షిణపంధను జని పితృలోకముఁ జేరఁగలదు విభవయుతంబై. ౨౩

ఆ॥ విష్ణుపూజకుండు విష్ణుపదంబొందు సాంబభక్తుఁడొందు శైవపదము
పరమభక్తితోడఁ బంచాయతనపూజ సలుపు స్మార్తుఁడరుగు స్వర్గమునకు.

తే॥ మఱియు బ్రహ్మను బూజించు మానవుండు
దక్షముఖపితామహుల పదంబుఁబొందు
యక్షరాడ్భక్తుఁ డొందును యక్షపదము
భూతపతిభక్తుఁ డొందును భూతపదము. ౨౫

క॥ మఱియెవఁ డేసురఁగొలుచునో కరముగ నాతండు తజ్జగంబును బొందున్
దురితనిరతులగు కుమతులు నరకమునన్ నొచ్చుచుండు్రి న్యాయవిచారా!

తే॥ ఎల్లవారలు బొందెడి నెల్లలోకములు ననిత్యంబులని నీవు దలఁపుమయ్య!
యిట్టి బ్రహ్మాదిలోకంబులేఁగుచుండు వచ్చుచుండును బలుమాఱుఁ బార్థివేంద్ర!

తే॥ శాశ్వతంబులుగాని యీ స్వర్ముఖజగములను వారలు స్వసుకృతములు నశించి
నత్రుటి గ్రమ్మఱఁ గిందికి నవయుచే గుదెంచగలరని నీవు గుర్తెఱుఁగు మధిప!

క॥ కావునఁ బ్రతికర్మంబును శ్రీవిష్ణుప్రీతికొఱకుఁ జేయఁగవలయుఁ గా
భూవర! తత్కృతిఫలమును భావమునను గోరవలదు ప్రతిమనుజుండుఁ. ౨౯

తే॥ ఫలరహితుఁడగు భక్తుఁడై పరమహంస
సేవితం బభయమునగు శ్రీహరిపద
ములను జ్ఞానవైరాగ్యసంకలితమతినిఁ
బ్రీతిలక్షణవాణితో వేఁడవలయు ౩౦

ఆ॥ అట్ల భక్తవర్యుఁ డెల్లలోకంబులఁ బ్రసభముగ క్షణమునఁ బాఱఁజేయు
మృత్యువేగి యెందు మిత్తినిబొందునో యట్టి గోజగమున కరుగఁగలఁడు ౩౧

క॥ అనవుడు యమవిభుఁ డిట్లనె మునివర! బ్రహ్మాదిలోకములు పునరావ
ర్తనముగలవంచు మీముఖమున వినుట విరక్తి నాకుఁ బుట్టెను స్వామీ! ౩౨

క॥ మఱియును గోలోకంబును బరమంబు ననశ్వరంబు బద్మాక్షునిమం
దిరమని యెఱిఁగితి నది యెటవఁజలునో? కరుణించి చెపుమ! యన నామునియుఁ

సీ॥ మా॥ ఏ మహావిష్టప మెల్లబ్రహ్మాండంబులకు బహిస్థలినిఁ జెలంగుచుండు
యే జగతిఁ రాధికేశ్వరుండైన శ్రీకృష్ణచంద్రుఁడు వసియించుచుండు
నే భువనంబునఁ గృష్ణతేజోభవపార్షదుల్ విరతులై పరగుచుండు
రేది కామమదకోపాదు లేమాత్రముఁ జొరనీక దీప్తితో నలరుచుండు
యేది జరామరణాదిశూన్యంబయి భక్తనిక్షేపమై ప్రబలుచుండు
నెందు నేదైనను నేగి మరలిరాక యానందమొప్పంగ నధివసించు
నేది వేదాదుల కిట్టి దట్టిదియని పలుకగా లవమేనిఁ దెలియఁబడదొ
నే జగమందున నినచంద్రవహ్నులు నెంతమాత్రము ప్రకాశింపలేరో

తే॥ నెద్ది శ్రీకర మెది నార దేష్టతమము నెందుఁ బ్రకృతిగుణంబులు నెఱుఁగఁబడవొ
యేది బ్రహ్మర్షి రాజర్షి కృష్ణభక్త లోకసన్నుత మద్ది గోలోక మనఘ! ౩౪

వ॥ అందుఁ బంచాశత్కోటియోజనవిస్తృతంబును, శతకోటియోజనవిలంబితంబునునై చరాచరంబులతోఁ గూడిన యీ బ్రహ్మాండంబు పరమాణువుగా గనుపడుచుండు. ఇట్టి యనేకబ్రహ్మాండంబు లొప్పారు. నిష్కారణంబగు భక్తినిఁ బ్రేమలక్షణవాక్యంబులతో నా పరాత్పరుం గొలుచు భక్తుండా మహాలోకంబుఁ బొంది మరలిరాక సుఖించుచుండునని చెప్ప నుగ్రసేనుండలరి బాదరాయణున కిట్లనియె.

## నిర్గుణభక్తియోగ వర్ణనము.

ఆ॥ భక్తియోగ మెన్నిభంగులనున్నదో దేనిచేత దేవదేవుఁడైన
కృష్ణుఁడలరి గోచరించునో కనులకు? నద్ది సెప్పుము నాకు ననఘచరిత! ౩౬

చ॥ అనవుడు వ్యాసుఁ డిట్లనియె హర్షము నాకుఘటిల్లె నిప్డు నీ
మనము ప్రశంసనీయమునుమా యది పాపహరంబు గావునన్
విను మలభక్తియోగము ద్విభేదములన్ సగుణంబు నిర్గుణం
బనియు వచింపఁగాఁ జెలఁగునంచు నెఱుంగుము! యాదవేశ్వరా! ౩౭

ఆ॥ అందు సగుణభక్తి నైకలక్షణముల వఱలు నిర్గుణమగు భక్తి యేక
లక్షణంబుతోఁ జెలంగును ద్వారకానగరతిలకపాలనప్రధాన! ౩౮

ఆ॥ బహువిధయుత సగుణభక్తి గుణంబులఁ ద్రివిధభక్తులగుదు రవిశదవిధ
నట్టి భక్తవరుల నానుపూర్వ్యగ నీకుఁ జెప్పుచుంటి వినుము! లప్పుకుండ ౩౯

సీ॥ ఘుద్దంభమత్సర క్రూరదృష్టుల హరిన్ దలఁచెడివారలు తామసులని
యాయురైశ్వర్యాదులభిలషించుచు హరిన్ బ్రార్థించువారలు రాజసులని
సమభావకృతినాశ సాయుజ్యముల్ గోరి శౌరి వేఁడెడువారు సాత్వికులని
తెలిసికొనుము! యింక దెలివిని జిజ్ఞాసఁ బీడను నర్థి నా విష్ణుమూర్తి

తే॥ వేఁడుదురనియు నెఱుఁగుమ! వెండి యీవు నిర్గుణంబగు భక్తిని నెగడు లక్ష
ణము వచించెద సావధానముగ వినుము ద్వారకాపాల! శ్రీకృష్ణ భక్తలోల!

చ॥ జలనిధిలోనఁ జేరి యనిశంబును బాఱెడి గంగకైవడిన్
ఫలరహితం బఖండము నపారము హేతువిహీనమౌచు ని
మ్నల నెది యీశ్వరుండు పరిపూర్ణతముండగు కృష్ణుఁజేరుచున్
నిలుచునో యా మనోగతియె నిర్గుణభక్తియటం చెఱుంగుమా! ౪౧

క॥ మఱియును నిర్గుణభక్తుల సరణిని వివరింతు వారు సర్వాత్మపదవిన్
సురవరవిభుతయు నణిమాద్యైరుభూతుల దేనిఁగోరరో యదువర్యా! ౪౨

తే॥ మెచ్చి శ్రీహరి సాలోక్యమిచ్చినప్పటికిని సత్సంగసమ్మదప్రకృతబుద్ధు
లైనవారలు గైకొన నభిలషింపరంచు నీవెఱుఁగుమ యాదవాధినాథ! ౪౩

క॥ ఆమాధవుఁ డాదృతితో సామీప్యంబిడినఁ "దాము సన్నిధినున్నన్
బ్రేముడి నిట్టులఁ గనఁడని యాముకొనరు దానిఁగొనఁగ నా భక్తవరుల్

క॥ శ్రీరమణుఁడు దివ్యంబగు సారూప్యంబిడినవారు సములమను నహం
కారమునఁ దాము హరిసేవారతి విడఁగలమ"టంచుఁ బట్టరు దానిన్ ౪౫

క॥ ఘనసాయుజ్యంబు లభించినఁ దద్భక్తాళి స్వామిసేవకభావం
బు నశింపఁగలదటంచది మనమునఁ గాంక్షింపఁబోరు మానవనాథా! ౪౬

క॥ ధీరులు నిరపేక్షులు నిర్వైరులు సమదర్శులైన భక్తులు ముక్తిన్
మీఱుచు లోకపవిత్రాకారంబులై చెలఁగఁగలరు కాంతిని భూపా! ౪౭

తే॥ నైరపేక్ష్యమహానంద సమ్పదము గాంక్షలేని తద్భక్తులు గాక యొరులు
గాంచఁగలరొక్కొ? సుమసమాకర్షి నాసగాక కర్ణోయి వాసన గాంచగలదె?

క॥ రసమును జేసెడి హస్తము రసరుచి నెఱుఁగనట్లు పరిశీలకాముల్
ససిగ నిరపేక్ష మనమును నిసుమంతయు నెఱుఁగలేరు పృథ్వీనాథా! ౪౯

ఆ॥ అల్లభక్తియోగ మాహాత్మ్యంబెకపదంబటంచుఁ దెలియుమింక నద్ది నవవి
ధంబులుగఁ జెలంగు దానిని నుడివెద శ్రద్ధతోడ వినుము! సత్యశీల! ౫౦

తే॥ స్మరణకీర్తనశ్రవణసచ్చరణసేవ
నార్చన వినతిస్నేహదాస్యాత్మదాన
ములన నవిసెల్లు నీ భక్తిఁ గలుగువాఁడు
ధాత్రిలో దుర్లభుఁడుగాఁడె? దలఁచిచూడ. ౫౧

## —♦ భక్తిమాహాత్మ్యము. ♦—

ఉ॥ యాదవనాథ! యీ నవవిధాత్మకభక్తిని గన్నవారు ప్ర
హ్లాద శుకుల్ పరీక్షితుఁడు నబ్ధిజయుక్ పృథునామధేయస
మ్మోదియు గాంధినీసుతుఁడమోఘబలానిలసూతి పార్థుఁడున్
యాదవవర్యుఁ డుద్ధవుఁడు నట్టిబలిప్రభుఁడా వ్రజాంగనల్. ౫౨

తే॥ అంచుఁదోఁచెడు నుగ్రసేనా! యెవండు
విబుధవరులచే సత్కథ వినెడికోర్కి
సములతో మైత్రి హీనులన్ సత్కరుణయు
గలిగిచెలఁగునో యవ్వాఁడె ఘనబుధుండు. ౫౩

మ॥ మఱి యెవ్వాఁడు చతుర్భుజాంఘ్రియుగపద్మభృంగమో యెవ్వఁడా
హరిసందర్శనలాలసుండో యెవఁడా యంభోజనేత్రున్ మనో
హరునిం బ్రోషితభర్తృకావిధముగా హాళిన్ నిరీక్షించు నా
నరుఁడే భాగవతాగ్రగణ్యుఁడగు భూనాథా! ప్రశంసార్హుఁడై. ౫౪

తే॥ ఎవఁడు "హరి! రామ! గోవింద! కృష్ణ యంచుఁ
బులకరింప దేహంబు గన్నులను సమ్మ
దాశ్రులొలుక మధురవాణి హరిని సతము
దలఁచు నతఁడు భక్తశ్రేష్ఠుఁ డలఘుచరిత! ౫౫

వ॥ అట్టి భక్తవరేణ్యులు భూనభస్సలానిలానలసలిలజ్యోతిర్గణంబులందు నా శ్రీకృష్ణదేవునిం గాంచుచుందురు. ఆ పరాత్పరుండు తన్నుఁ దలంచినపుడెల్ల యా భక్తులకుం బ్రసన్నుండగు. ఆ సదానందమయుం గాంచి వారొకపరి నానందంబుతో హసింతురు. ఒకమా ఱుగ్గడింతురు. మఱియొకతడవ నగ్గింతురు. ఒకసారిఁ బరుగిడుదురు. ఒకతరుణంబున నాడుదురు. మఱొకతఱిం బాడుదురు. వెండియు నొకసమయంబున మిన్నకుందురు. ఇట్లు నానావిధంబులుగా వార లభినందించుచుందురు. కాలయములు సైత మవ్వారిని దండింపలేరు. కౌమోదకీగద యెడమదెసను, సుదర్శనచక్రంబు గుడివైపునను ముందు శార్ఙ్గంబును వెనుకఁ బాంచజన్యంబును మఱియు నెల్లెడల నందకశతచంద్రాద్యాయుధంబు లొప్పి యా భక్తులం గాచు. హరి శిరంబున కాతపంబు దగులకుండఁ బైదెస మహాపద్మం బాచ్ఛాదించియుండు. గరుత్మంతుండు నిజపక్షానిలంబున, దచ్ఛ్రమస్వేదం బార్చు. ఈ భక్తులే యే ప్రదేశంబుల కరుగఁ దలంతురో గమనించి యా హరి ముందుగాఁ బోయి నిజపదపద్మరజంబులచే నా చోటులం బవిత్రీకరించు. వీరలున్న యెడ సమస్తతీర్థంబులును గలవు. ఆధివ్యాధు లీభక్తులను దౌదవ్వులం గాంచి పరుగిడఁదొడఁగు. వీరికి నదీనదవనధిపర్వతాదులు సుఖమార్గంబు లొసంగు. ఈ మహాత్ములు నివసించిన ప్రదేశంబున మృతుండైన వాఁడు పాపమూర్తియైనను విష్ణుపదంబు బొందు. ఈవిరక్తభక్తదర్శనంబు పుణ్యహీనులకు దుర్లభంబు. వీరు జనించినకులంబు కల్మషసంకులంబైనను విమలంబగు. ఈ మహామహులు తండ్రివైపునఁ బదుగురను, దల్లిదెసఁ బదుగురను, నాలివంకఁ బదుగురను నిరయంబునుండి యుద్ధరించి కృతార్థులం గావింతురు. వీరి పుణ్యవిశేషంబున వారికి సంబంధించిన దాసదాసీమిత్రశత్రుభారవాహగణంబును, గృహపక్షిపిపీలికమశకకీటపతంగంబులును, నబ్రహ్మణ్యంబులగు సౌవీరకీకటదేశంబులు నసంస్కృతంబులగు మ్లేచ్ఛాదిదేశంబులును ధన్యతం గాంచు. తీర్థయాత్రాయజ్ఞసాంఖ్యయోగాదులను గావింపకపోయినను నీభక్తసంగతిం గాంచినవారు ధన్యతములు గాఁగలరని యెఱుఁగుమన నుగ్రసేనుండు విని సంతోషించి క్రమ్మఱ నమ్మునీంద్రున కిట్లనియె.

## భక్త్యుత్కర్ష వర్ణనము.

తే॥ ఓ పరాశరపుత్రకా! యుత్తమహరిభక్తలభ్యసాయుజ్యంబు పరమశత్రు
వైన దంతవక్త్రున కేవిధానఁజిక్కెఁ? జెప్పుటకు మ్రొక్కుచుంటిని శిరముతోడ.

చ॥ అనఁగ వసిష్ఠనప్త యిటు లాడెను యాదవనాథ! నీది నా
దను విషమత్వ మారయ గుణాన్వితజీవున కౌనుగాని చి
ద్ఘనపరమాత్మ కంటదని గట్టిగ నమ్ముమ! యెట్టిరీతినై
నను మన మాపరాత్పరు మనంబునఁ గూర్పగనౌను బూర్తిగాఁ. ౧౮

క॥ భయమునఁ బ్రియముననో యప్రియముననో మనము హరినిఁ బెట్టినవారల్
బ్రియతులగుచుఁ దప్పగ తన్మయతను జెందంగగలరు మానవనాథా! ౧౯

ఉ॥ త్వన్మరమణా ! తలంప నరకప్రకరాన్వితకాలపట్టణో
ద్ధారిణి దుఃఖసుజ్జ్వలితగదావృతసంసృతిఘోరసాగరో
త్తారిణి యింద్రియార్జితకృతాంతవిహారిణి కృష్ణపాదస
త్కారిణి విశ్వరూపిణిగదా ! యల నిర్మలభక్తి యెల్లెడన్. ౨౦

చ॥ పరివినుతకృష్ణభక్తిలత ప్రాక్తనసత్కృతులన్ జనించి మా
ధవవరదర్శనాదిరసధారల వృద్ధినిఁ బొంది పుణ్యప
ల్లవఫలభారనమ్రిత సెలంగ వసంతుఁడు దివ్యపంచమీ
దివసముఖంబునన్ జగతిఁ దేజరిలున్ బరమోత్సవంబుతోన్. ౨౧

సీ॥ సమ్మోహకాలాభ్రజాలమధ్యస్ఫురద్జ్ఞానసౌదామినికరణిఁ దనరి
శాస్త్రార్థదర్శవాక్సంచయపదదీపికాప్రకారంబునఁ గ్రాలుచుండి
జయరూపకార్తికసంస్ఫురద్దీపావళులతోడ సొగసుగా వెలుఁగఁదొడఁగి
సత్వరజస్తమస్సంహారకార్యసమర్థత నాఖ్య నన్వర్థపఱచి

తే॥ యొప్పు విజయదశమి యట్టి యుత్తమహరి
భక్తి విజయంబుఁ జాటుచుఁ బరిజలకెపుడు
నుత్సవంబులఁ బొందుచు నుర్విమీఁద
వెలుచుండెను యాదవోర్వీనరేంద్ర ! ౨౨

తే॥ సాంఖ్యయోగదండములు పార్శ్వములఁదగ
గుణవిభేదకీలంబుల కోటు లొప్ప
భక్తి నవవిధానములు సోపానములుగ
జెలఁగ గోలోకనిశ్శ్రేణి వెలుఁగు నధిప ! ౨౩

వ॥ అంత నుగ్రసేనుం డానందంబు బొంది వ్యాసమునీంద్రున కిట్లనియె. ౨౪

క॥ కర్మరతవరుఁడగు గృహి యే ధర్మమునన్ జేయవలెనొ తద్ధరిసేవన్ ?
నిర్మలభక్తిరహితుఁ డా ధర్మాత్ముని హరిని నెట్లు దర్శించునొకో ? ౨౫

తే॥ వ్యాస ! నిజభక్తి యభివృద్ధిపడని యపుడు
మనుజుఁ డేమిసేయఁగవలె మాధవుఁ డల
వారి నెట్లు ప్రసన్నుఁడై వరము లిచ్చి
ధన్యులుగఁ జేయునో నాకు దయను జెపుమ ! ౨౬

## హరిమందిర ప్రతిష్ఠావర్ణనము.

చ॥ అనవుడు వ్యాసుఁ డిట్లనియె యాదవనాయక ! లోకమందునన్
జనులకు నెప్డు సత్పురుష సంగతి భక్తి జనించు దానిచే
తనె తన భక్తి వృద్ధియగుఁ దప్పదు నీకిఁకఁ గర్మ సేయఁగా
ననువగు కృష్ణసేవ పలుకాడెద శ్రద్ధగ నాలకింపుమా ! ౨౭

ఆ॥ మఱియు నెవ్వఁ డట్టిగురుని దర్శించునో వాఁడు కోటిజన్మపాపములను
విడిచి యంతమందు విష్ణుదూతానీతరథము నెక్కి చనుఁ బరమపదంబు. ౮౩

ఆ॥ పార్థివేంద్ర! నరుఁడు బ్రాహ్మముహూర్తంబునందు మేలుకాంచి హరినిఁ బొగడి
గురుని పేరుఁ దలఁచి కుంభినికి మ్రొక్కుచుఁ బుడమిపైని నడుగులిడి కడంగి.

తే॥ నీరుదాఁకి యాసనమునఁ గూరుచుండి కరములుత్సంగములయందుఁ గ్రాల శ్వాస
మడ్డి మఱి స్వస్తికాసనమందు నొప్పి జ్ఞానముద్రను వేసి యొజ్జను నుతించి.

చ॥ అమలుఁడు వంశివేత్రధరుఁ డభ్రనిభుండు కిశోరరూపుఁడుం
గమలదళాయతాక్షుఁడు జగత్త్రయమోహనుఁడైన కృష్ణునిం
విమలమతిం నతుల్ సలిపి వేఁడి యనంతరమందు బాహ్యదే
శమునకు నేగి శౌచమిటు సల్పఁదగుం గృహి యోగనేశ్వరా! ౮౬

సీ॥ మంత్రపూర్వకముగ మన్ను నుగైకొని యుదకంబుతో లింగ మొక్కతడవ
గుదమును ముమ్మాఱు బదిపరుల్ వామకరంబేడుపరులు కరములు రెండు
మూఁడేసిపర్యాయములఁ బ్రితిపాదముం క్షాళనంబుల శ్రద్ధసలుపవలయు
బ్రహ్మచారియు వనవాసియు దీనికి నినుమడిగా నాచరింపనగును

తే॥ నలుమడిగ యతివర్యుఁడు సలుపఁదగుఁ దదర్థమును సిశ రోగిపాంథవ్రతతి ద
దర్థమును, స్త్రీ పదజులు తదర్థమాచరింపవలయును యాదవోర్వీశ! యవల.

తే॥ ఆయురర్థసంపదలఁ గాంత్యాదుల నిడ
వృక్షరాజంబు వినుతించి విమలకాష్ఠ
మొండుఁ గొని దంతధావన ముత్తరమునో
ప్రాచిగనో గూరుచుండి సల్పంగవలయు. ౮౮

తే॥ అట్టి దంతధావనకార్యమందుఁ జనుఁడు క్షీరికావటకార్పాస సింధుకాండ
కంటకీ బ్రహ్మవృక్షదుర్గంధయుక్త తరువులను వీడవలెనని యెఱుఁగు మనఘ!

క॥ శౌచాచారరహితమనుజాచరితకృతులును వ్యర్థమగు మఱి ముఖసా
మీచీన్యవిహీనునకుఁ బ్రయోగాచారిమమంత్రఫలము లెనయవు సిదపం. ౯౦

ఆ॥ రవిని సన్నుతించి ప్రహ్లాదముఖులైన విష్ణుభక్తవరుల వినుతిసలిపి
తులసిమృత్స్నఁ గొని యొడలఁబూసి దివ్యమౌ వారియందుమునిఁగి భక్తితోడ.

సీ॥ యమునాదితీర్థాపగాష్టకపఠనంబు నాచరించి యల మాయాపురంబు
కాశి నవంతిక కాంచీపురము నయోధ్యా మధురాపురీ ద్వారకలను
శంబలగ్రామస్థ శౌరిమందిరము నఖండనందిగ్రామ కౌశలమును
నగ్రగణ్యమగు శాలిగ్రామగతమహాయోగ మర్బుదనైమిషోత్తమకురు

తే॥ బ్రాఁబలుకుసల్కులఁ జేఁబిలిపి వారికనుమ
నల్ల శ్రీకృష్ణు స్థాపించి యష్టపత్ర
ములను రాధాష్టసఖులను నిలిపి యష్ట
దళములఁ గృష్ణుచెలులను నిలిపి యవల ౯౭

ఆ॥ షోడశదళములను సుంచర శ్రీకృష్ణ షోడశయుగసఖుల సొరిది నిలిపి
యల్లతమ్మిరేరుల నబ్జగదాశంఖచక్ర శార్ఙ్ఖడ్గశరములను మఱి ౯౮

తే॥ హలము ముసలంబు వనమాల నలఘుకౌస్తు
భంబు వంశి వేత్రముల శ్రీవత్సనీల
వస్త్రపీతాంబరముల స్థాపనముఁజేయ
వలయుఁ బిమ్మట నవ్వాని పార్శ్వములను ౯౯

సీ॥ గరుడాంక తాలాంక గరుడ కుముద కుముదాక్ష సునంద రథదారుకులను
బల మహాబలులను బలుఁ జయునిఁ బ్రచండు స్థాపించి వెండియు సర్వదిశల
దిక్పాలకుల నిల్పి ద్వాపముఖ శివ విధి పార్వతీ భారతీ వార్ధిజను
షోడశమాతృకా సూర్యముఖగ్రహములను విష్వక్సేనమూర్తి దుర్గ

తే॥ వహ్నిఁ గమలాగ్రమందు స్థాపనమొనర్చి షోడశోపచారంబుల సొరిదినల్పి
యచలభక్తిని బ్రార్థించి యవని శిరముసోఁకఁ బ్రణమిల్లఁజెల్లునో సూరిగేయ!

సీ॥ ఆలింపుమా! హరి యావాహనమునఁ బుష్పములాసనమున దర్భద్వయంబు
పాద్యంబునం దాకు పచ్చనిగఱిక యర్ఘ్యమున విష్ణుక్రాంత పరిసనములును
స్నానమున నుశీర చందనాగరు ఘనసారకస్తూరికాసహితజలము
మధుపర్కమందు నామలకకమలములు ఘనధూపమందదష్టగంధములును

ఆ॥ దీపమునఁ గపురము దివ్యయజ్ఞోపవీతమును బచ్చనిది పటమునఁ బీత
వస్త్రములఁ దొడవుల బంగారుగంధంబునందుఁ గుంకుమహరిచందనములు

తే॥ అలరునఁ దులసీమంజరులును నక్షతలను దండులముల నివేదనమునందు
షడ్రసోపేతవివిధభోజనములు జలమునఁ గళిందజాజాహ్నవీపనముల మఱి ౧౦౦

తే॥ ఆచమనమందు జాతీఫలాదులు విడె మందుమిరియాలు దక్షిణఁ హాటకముఁబ్ర
దక్షిణాన వలగొనుట తన్మహోశు భార్తికంబున నుత్తమాజ్యంబు మఱియు

క॥ వినుతినిఁ బ్రియయుతభక్తియు వినతిని సాష్టాంగనమ విగ్రహమొప్పన్
వినుతద్వాదశవర్ణములను దగు మంత్రంబున శిఖ లలిఁగట్టితమిన్ ౧౦౧

క॥ హరిపూజా పరికరముల దరిసిడికొని కృష్ణునెదుటఁ దనరుచుఁ దత్త్
త్పరమమ్రశుత్యాదితోక్తుల వరుసగఁబఠియించు చి ట్లుపచితింపవలెనే ౧౦౨

తే॥ దీనవత్సల! గోవింద! దేవవంద్య! యాదవేశ! గోలోకేశ! యంబుజాక్ష!
రాధికేశ్వర! దామోదర! సుముఖమున నిట్టి సింహాపీఠిక నావహింపుమయ్య.

తే॥ రుచికరంబును షడ్రసరుచిరముత్త
మామృతమనోహరంబు యశోదసుతీకృ
తము ఘనముగ నీ కైనివేద్య మమితదయను
గొనుము ! నందనందన ! రమ్యకుందరదన ! ౧౧౯

ఆ॥ అధికకష్టముపడి యల్లగంగోత్తరి యమస్రుతకిరణశీతలామృతోప
మోదకంబు హాటకోరుపాత్రంబులోఁ దెచ్చియుంటిఁ గొనుము దేవదేవ !

క॥ జాతీఫలకంకోలసువాతతసురభీకృతామలాచమనం బో
భూతిదయాకర ! రాధాచేతశ్శ్వేతపత్రమిత్ర శ్రీహరి ! కొనుమా ! ౧౨౧

క॥ క్రముకైలా నరదేవకుసుమఖాదిరజాతికోశసుధ లాతులు రు
చ్యముగా భాసిల్లెడి నీ తములము గైకొనుము ! కృష్ణ ! ధైర్యసుమేరూ !

తే॥ సర్వజనములఁ గ్రుటిలో వశంబుజేసి
కొనెడి నీ స్వర్ణమయదక్షిణను గ్రహింపు
మష్టదిక్పాల పూజితా ! యఖిలలోక
పాల ! భక్తాలవాల ! గోపాలబాల ! ౧౨౩

తే॥ ఉత్తమాజ్యాక్తపంచవహోరువర్తి
భాసురము మంగళకరంబు బరమదీప్తి
యుతమునైన యీ మంగళారతినిఁ గొనుమ
కృష్ణ ! బ్రహ్మాండనాయకా ! కృష్ణమిత్ర ! ౧౨౪

క॥ కరకర్ణశీర్ష బాహాచరణేక్షణనామరూప సాహస్రములే
పరమున కుండునో యా యక్షరునకు యుగకోటిపతికి నత్పెద నతులన్. ౧౨౫

తే॥ సవనదానతపోవ్రత సత్యశౌచ
ధర్మతీర్థయాత్రాదికృత సుకృతంబు
నిడుప్రదక్షిణంబులను గావించుచుంటి
గనుమ ! కనులార కరుణ జగన్నివాస ! ౧౨౬

తే॥ దేవ ! నావంటిపాతకి త్రిజగములను లేఁడు నీవంటిపరముఁడు లేఁడుగాన
నిన్ను దీనతఁ జేరిన నన్ను నిపుడు బ్రోవ వేఁడితి ద్వారకాపురనివాస ! ౧౨౭

తే॥ సచ్చిదానందమూర్తివి శాశ్వతుఁడవ
గమ్యుఁడవు సర్వకారణకారణుఁడవు
శాంతుఁడవు విహారీకృతాసజ్జనుఁడవు
బ్రహ్మనుగు నీకు మ్రొక్కెదఁ బరమభక్తి ౧౨౮

## —♦ శ్రీకృష్ణ దండకము ♦—

శ్రీరాధికాలోల లీలావిలోలా త్రయీధర్మపాలా తొలిౝ ధారణీదేవి దుర్మార్గులైనట్టి భూపాలురౝ దైత్యులౝ లోకులౝ మోయఁగాలేక కన్నీరు మున్నీరుఁగా గాఱ జంతించి యోజించి రూపించి గోరూపముం దాల్చి యాసత్యలోకంబునం జేరి యజ్ఞాసనాసీనునిం గన్నులారంగ వీక్షించి ధ్యానించి కావించి జోతంబులౝ దేవ! నావిన్నపం బిద్ది యాలించి ప్రేమించి యెంచంగ వేల్గాని నాయార్తి మాయించి రక్షింపవే యంచుఁ బ్రార్థింప నాతండు నాతల్లి నూరార్చి రేజోతి రేకంటు వేకంటి ముక్కంటి జేజేలతోఁ గూడి వైకుంఠలోకంబునందుండు నాతమ్మికంటిౝ విలోకించి యాకాశ్యపీకష్టముల్ చెప్పి యాకేశవాలోచనౝ వించు నాదేవుఁ డగ్రింబునందుండి మార్గంబుఁ జూపించుచుౝ దోడుగా రాఁ బథంబందుఁ దైవారు లెక్కింపఁగారాని పెక్కైన బ్రహ్మాండముల్ చిత్రముల్ భూసభోగోళముల్ బల్లెలౝ వీడులౝ మేడలౝ వాడలౝ బీడులౝ బేఁటలౝ దోఁటలౝ గాసలౝ వాఁకలౝ గాంచు చారాధ్యమై యోగిసాధ్యంబునై సర్వకామప్రదంబై యఘుగ్రావవజ్రంబునై శ్రీనివాసంబునై నీకు వాసంబునై యొప్పు గోలోకముం జేరి యాలోని ఖర్జూర జంబీర మందార బృందార కాగాది రమ్యంబుగానున్న నీకుంజముౝ జొచ్చి తేజోవిరాజత్సహస్రోరుపత్రాంచితాబ్జోర్ధ్వభాగోజ్జ్వలత్షోడశోచ్ఛ్రాయపత్రాంచదంభోరుహోర్ధ్వాష్టపత్రోల్లసద్దివ్యపద్మంబునౝ స్వర్ణసింహాసనంబందు దేవాదిదేవుండవై పద్మనేత్రుండవై భూషణాలంకృతాంగుండవై చండమార్తాండకోటి ప్రభాభాసమానుండవై రాధికా భామినీరత్నయుక్తుండవై మేఘవర్ణుండవై యున్న నినుౝ విలోకించి యారా యటంచెంతొ హర్షించి దేవా! పరేశా! చిదానందరూపా! యుపేంద్రా! నమస్తే యటం చౌదలల్ మేదినిందాఁక జోబిళ్లుగావించి మాకుయ్యి నాలించి పాలింపువే దేవ! యీమేదినీదేవి దుఃఖంబుఁ ద్రోపాడి కాపాడుమో పీతచేలా! సుశీలా! యటంచుౝ నుతిౝ సల్పఁగా నీవునుౝ మెచ్చి యోవేల్పులారా! ధరన్ నాదు నేమంబునన్ మీరలందందు నారీతులన్ బుట్టుడంచంపి నీలోకమందుండి నీయున్న మన్నింప విన్నాణమైనట్టి బృందాటవిన్ భూమినిన్ దివ్యగోవర్ధనం బల్లకాళిందినిన్ బంపి భూభారమున్ బాప భూదేవులన్ బ్రోవఁ బుణ్యాత్ములన్ గావ దుష్టాళి శిక్షింప వేదాల రక్షింప శీతంబునం దెండలన్ వానలన్ బెక్కుకష్టంబులన్ జిక్కియున్ నిశ్చలాత్మన్ నినున్ గూర్చి ప్రార్థించి కైకొన్న సర్వేష్టముల్ దీర్పఁ గారుణ్యచిత్తంబుతోఁ గంసకారాగృహంబందు భీతిల్లుచున్నట్టి శ్రీదేవకీదేవికిన్ దివ్యరూపంబుతోఁ బుట్టి నీతండ్రికిన్ దల్లికిన్ జింతలన్ బాపు తంత్రింబులన్ జెప్పి గోగోపగోపీయుతంబైన శ్రీగోకులంబందునన్ జేరి యందున్న యాయోగమాయన్ వడిన్ దిర్గి తత్కారకుం బంచి నందాదులన్ శ్రీయశోదాదినారీలలామంబులన్ లీలలన్ ఖేలలన్ జూపులన్ మాటలన్ జేఁతలన్ బ్రీతినిం జోద్యమున్ గూర్చి నీయంశతో నొప్పు శ్రీరోహిణీపుత్రుఁడౌ రాముతో నాడుచున్ గూడుచున్ బాడుచున్ ద్రాగుచున్ మెక్కుచున్ గోవులన్ గాయు చో

ప్పరి యాగోష్ఠ బృందావనంబందు లీలా విహారంబుఁగావించి యారాధఁ బొల్లాడి
రాసంబులన్ దేల్చవే వంశి నీవూఁదవే గోపికల్ రా ననేకాకృతుల్ దాల్చి యవ్వా
రితోఁగూడి యారెంబులన్ వారులన్ జేరి క్రీడింపవే మోదముం గూర్పవే పుణ్యాతీ
ర్థంబులన్ వెల్గు గోవర్ధనం బెత్తి వేవేలనున్ వ్రేతలన్ గావవే దావమున్ మ్రింగవే
కాళియాహీంద్రు మర్దింపవే తత్సరోజాక్షు లర్థింప రక్షింపవే కోలకేశ్యాదిదైత్యేం
ద్రులన్ గూల్పవే వేగ నీకోఁజలన్ ధారణిన్ నిల్పవే వేదముల్ ధాతకీవిచ్చి సంప్రీతు
గా నల్పవే రాధికాగోపికాయూథనాథుండవై సద్విహారంబులన్ జేయవే పూర్వజ
న్మంబునం దెన్నొ మార్గంబులన్ గొల్చి నీయాజ్ఞచే వ్రేతలై పుట్టియున్నట్టి మానీంద్రు
లన్ భక్తులన్ జూచి రక్షింపవే దేవ! యస్వల్పుఁడౌ కంసునాహ్వానముంగొంచు
నీలాంబరాక్రూరయుక్తుండవై సాఁగి ప్రీతిన్ భవద్విశ్వరూపంబు మార్గస్థమౌ వాఁక
లో గాందినీసూతికిన్ జూపి తత్పట్టణంబొంది కుబాదులన్ గాంచి సంతోషమున్ గూర్చి
యీరేడులోకంబులన్ సాటిలేనట్టి తత్కార్ముకంబట్టె భంగంబుగావించి తన్మత్త
మాతంగముం ద్రుంచి చాణూరకూటాదులన్ గూల్చి లోకంబుఁ జీకాకుగాఁజేయు
నాకంసుఁబోకార్చి శోకంబుతోనున్న యీయాదవశ్రేణులన్ బ్రోచి తద్బంధనంబందు
దైవారు నాయుగ్రసేనున్ దయన్ జూచి మన్నించి మన్నీఁడుగాఁజేసి నీతల్లిదండ్రుల్
ముదంబొంద వీక్షించి తత్కార మాయించి నీక్షేమముం దెల్పి యాగోకులంబెల్ల
హర్షింపఁగా నుద్ధవుం బుచ్చవే నారదప్రేరితుండైన శ్రీమ్లేచ్ఛనాథుండు బాఱాడఁగాఁ
బాఱి భర్జింపవే తజ్జరాసంధు వేమాఱునోడించి యంతంబునందట్టి భూదేవవాక్యంబు
సత్యంబుగానల్పఁ దచ్ఛైలమందెక్కి యందుండి యబ్ధిస్థమౌ ద్వారకన్ జేరి తద్యాదవ
శ్రేణినిం జేర్చి కాపాడవే రుక్మిణీసత్యభామాదులన్ బ్రీతి బెండ్లాడవే భౌమునిం జంపి
యవ్వాని కారాగృహంబందు బల్ కుందు భూజానిపుత్రీలలామంబులన్ వీడి ప్రేమిం
పవే యుగ్రసేనుండు తద్విశ్వజిద్యాగముం జేయ బోధించి తంత్రంబువాచించి దిక్కుల్
లలిన్ గెల్వఁగా నీకుమారుండు వీరుండు భూమోహనాకారుఁడౌ మారు నీమారుగాఁ
బంపి యష్టప్రసాయంబులన్ జేయు నీవేగి మాత్సర్యభీమక్రియోత్సాహసంపన్నులౌ
నాశకున్యాదిదైతేయులన్ జంపి యాకంతు దిగ్జేతగానల్పి తద్యాగరాజంబు రాజేంద్ర
భోగీంద్ర దేవేంద్ర యోగీంద్ర పూజ్యంబుఁ బూర్ణంబునౌనట్లుగాఁజేసి తద్వాంఛలన్
దీర్పవే సచ్చిదానందరూపుండవై యప్రమేయుండవై యాదిమధ్యాంతశూన్యుండవై
సర్వమాన్యుండవై వేదశాస్త్రాద్యగమ్యుండవై భక్తగమ్యుండవై నిర్మలాత్ముండవై
నిర్వికారుండవై నిత్యశుద్ధుండవై నిత్యబుద్ధుండవై స్తుత్యవేదస్వరూపుండవై ధ్యా
తవై ధ్యేయమై ధ్యానమై భోక్తవై భోగ్యమై భోగమైయొప్పు నీచెయ్వులన్ జూచి
యాశ్చర్యముంబొంది సృష్టించు నాధాతవంచున్ దయన్ బెంచు విష్ణుండవం చెల్ల
దూలించు రుద్రుండవంచున్ మఱిన్ బెక్కుమార్గంబులన్ గాంచి యగ్గింతు రీలోకు
లోయీశ! లోకేశ! యాలోచనం జేయ నవ్వారలున్నీ వెకావా! సమస్తేంద్రియంబుల్
దగన్ నీవెకావా! మహారాజ! నీయందె యీలోకముల్ పుట్టు నీయందె చెన్నొందు

నీయందె డిందున్ సుమీ దేవరాజా! మహాత్మా! భవద్భీతి సూర్యుండుదీపించు నా
ముండునున్ వెల్గువాతెంబు వీచున్ కృశానుండు మండున్ కృతాంతుండు శిక్షించు
నా స్రష్ట సృష్టించు విష్ణుండు రక్షించు రుద్రుండు మాయించు నింద్రుండు నాకంబుఁ
బాలించు శేషుండు నేలన్ వహించున్ గదా శౌరి! నీమోమునన్ బ్రాహ్మణుల్
మూపులన్ క్షత్రియుల్ సక్థులన్ వైశ్యులున్ బాదయుగ్మంబునన్ శూద్రులున్
డెందమం దిందుఁడున్ గన్నులన్ సూర్యుఁడున్ వక్త్రమం దగ్ని సుత్రాములున్
బ్రాణమందున్ జగత్ప్రాణమున్ నాభి నభ్రంబు శీర్షంబునన్ స్వర్గమున్ వీనులన్
దిక్కులున్ గాళ్లనీభూమి నీరీతినే యన్నిలోకంబులన్ బుట్టి రాజిల్లవే యీ మహా
రూపుఁగన్నట్టి నిన్నల్ల బ్రహ్మాదులెన్నంగలేరన్న నాబోటిపిన్నల్ నుతింపంగ య
త్నింతురో కొక్కొ? పరంధామ! వందారుమందార! గోవింద! రామానుజా! శ్రీధరా!
మేశ్వరా! యీశ్వరాజేంద్ర రాజేంద్రసపూజావిరాజత్పదా! నీపదాంభోజముల్ గొల్చు
డెందంబు నిన్మ్రొక్కు శీర్షంబు నీగాథలాలించు కర్ణంబులున్ నీవరాకారముంజూచు
నేత్రంబులున్ నీప్రసాదంబులన్ గోరు వక్త్రంబును న్నిన్ను బూజించు హస్తంబులున్
నీమహామందిరంబుల్ బ్రవేశించు పాదంబులన్ నెమ్మి నాకిచ్చి కారుణ్యాచిత్తంబుతో
డన్ బ్రసన్నుఁడవై నన్ను మున్నల్ల ప్రహ్లాదవైరోచని ద్రౌపదీపార్థ దేవర్షి గాంగేయ
రుక్మాంగదాహీంద్రనందాంబరీషాదులన్ గాంచినట్టుల్ విలోకించి నాకామమున్
గోపమున్ లోభమున్ మోహమున్ గర్వమున్ మచ్చరంబున్ విడన్ జేసి మన్నించి
రక్షింపవే భక్తచింతామణీ! దీనరక్షామణీ! నిర్జరగ్రామణీ! లోకచూడామణీ!
యోయిక్కృపా నమస్తే నమస్తే నమః. ౧౨౯

వ॥ అట్లా హరిం బూజించి నమస్కరించి నుతించి యనంతరంబున నమో నారాయణాయ యని ప్రాణాయామం బొనరించి ప్రణవపూర్వక కేశవాదినామంబులతో నా పాదమస్తకంబు నర్చించి తద్విధంబుననే తదీయసఖీసఖశంఖచక్రగదాపద్మాసి ధనుర్బాణహల ముసలకౌస్తుభవనమాలా శ్రీవత్సపీతాంబర నీలాంబరవంశీవేత్ర తాలధ్వజ గరుడధ్వజ రథదారుక సుమతి గరుడ కుముదకుముదాక్షనందసునందచండ ప్రచండబలమహాబలాదులను, విష్వక్సేన వినాయక శివవిధి దుర్గాదిక్పాలవరుణ నవగ్రహమాతృకాదులను, దత్తన్మంత్రంబులతోఁ బూజించి నమోవాసుదేవాయ యను మంత్రంబుతో శతాహుతులను యగ్నియందు వేల్చి ప్రదక్షిణించి మహాభోగం బర్పించి నమస్కరించి ధ్యాయేత్సదాయను దానితో ధ్యానించి క్రమ్మఱఁ బ్రణమిల్లి నీరాజనంబిడి ఘటీఘటావీణా వేణుకాంస్యకరతలతాలమర్దలాదిజయధ్వానంబులొప్ప భక్తజనులతోఁ గూడి సత్కథాశ్రవణతత్పరుండై యనన్యప్రేమ లక్షణ భక్తితో నా హర్మ్యగ్రమందు నాట్యంబొనర్చి సాష్టాంగదండప్రణామంబులంగావించి తన్మందిరంబం దా సుందరనందనందనునకు దివ్యశయ్య వేయందగు. ఇట్లా శ్రీకృష్ణ సేవనొనర్చు పుణ్యాత్ముఁడు బృందారకులుసైత మర్చింపఁ దన్నాకపదంబుఁ బొంది క్రమంబుగా నత్యుత్కృష్టధామంబగు గోలోకంబున కేగి సుఖించు. యుక్తభుక్తి

భక్తిము క్తికరంబగు శ్రీకృష్ణసేవావిధానంబు క్రమంబుగాఁ జెప్పితి. మఱియు నేమి వినవలతువో తెలుపుమన నుగ్రసేనుం డా వ్యాసమహర్షి కిట్లనియె. ౧౩౦

మ॥ హరిరూపంబున నొప్పు మీవలన నా యభౌక్షపూజావిధిన్
గరమాలించితి లోక మెన్నఁగఁ గ్రుధాగర్వవ్యథా మోహమ
త్సరలోభాదిగుణప్రయుక్తమయి తద్వైరాగ్య మావంతయున్
సరిగాఁ బొందరు తద్రమావిభున కర్చల్ సేయ దెవ్వేళలోన్ ౧౩౧

తే॥ మోహ మెక్కారణమున నీభువనమందు బుట్టెనో? కొ? మఱి యెట్టుల గిట్టగలదొ
కరుణఁ జెప్పగ వేఁడితి దురితదూర! బాదరాయణీ! గుణమణీ! వ్యాసమౌని!

## —♦ పరబ్రహ్మ నిరూపణము. ♦—

చ॥ అనవుడు వ్యాసుఁ డిట్లనియె యాదవనాయక! యేవిధంబుగా
ఘనగగనాన నొప్పు నుడుకాంతునిబింబము క్రింది నీటిలోఁ
గనుపడి కంపమొందినటు కారణకారణుఁడైన యా పరా
త్మని ప్రతిబింబ మీజగతి మోహదమై జనియించి యొప్పెడిన్ ౧౩౩

క॥ మాయాకాల మనంబులఁ గాయజగుణములను మఱిఁ గుకర్మంబులచేఁ
బ్రాయముగ జనుఁడు బద్ధుండౌ యాదవనాథ! యిది నిరనుమానముసూ

ఆ॥ అట్లు బద్ధుఁడైన యాతఁడు కాచసై కతగుణములఁ గనులఁగాంచి బాల
వారిసర్పములని భ్రమియించి మోహించి సంచరించి యాద సంచరించు ౧౩౫

వ॥ ఇజ్జగంబు విశేషంబుగా రజస్తమోగుణమయంబును, గ్వాచిత్కంబుగా సత్వగుణమయంబును, మోహమయంబును, మనోవిలాసంబును, జంచలంబును, భ్రాంతికరంబును, నానావికారసంయుతంబునునై యలాతచక్రంబువలె నొప్పుచుండునని యెఱుంగుమన నుగ్రసేనుం డానందించి మునివరా! పండితులా శ్రీకృష్ణుని జపమార్గమం దెన్ని తెన్నుల నెన్ని ధ్యానింతురో తద్బ్రహ్మలక్షణం బెద్దియో తెలియఁజేయ వేఁడెదనని నమస్కరింప నా వ్యాసుండు ప్రసన్నవదనుండై యదువరున కిట్లనియె. ౧౩౬

చ॥ జననమృతిక్షుధాప్రభృతి షట్కవిరోధసఖిత్వ బాల్యయౌ
వనజరరత్వకష్టసుఖభావసమున్నతి తృట్క్షుధాదిరో
గనివహభీతు లెవ్వియు నఖండుఁ డనశ్వరుఁడైన యా పరా
త్మునకణువేని లేవనుచు బుద్ధి నెఱుంగుము! యాదవేశ్వరా! ౧౩౭

సీ॥ కాక శరీరంబు గాక ప్రాణంబులు గాక యింద్రియములు గాక మనము
గాక మనీషయు గాక చిత్తంబును గాక యహంకృతి గాక గుణము
గాక తన్మాత్రలు గాక శూన్యంబును గాక స్థూలమును సూక్ష్మమును గాక
గాక హ్రస్వంబును గాక దీర్ఘంబును గాక వర్ణంబులు గాక జడము

తే॥ కాదుకాదనునదికాక కాదుకాదు కాదనెడి దానియందునన్ గాంచఁబడుచు
శాశ్వతంబయి యెయ్యది చక్క వెలుఁగుచుండునో యద్దిపరమాత్మ యుర్వరేశ!

సీ॥ నిర్విశేషుండును నిష్కారణుండు నిర్వాణప్రదుండు నిరామయుండు
నిర్వికారుండును నిర్వికల్పుండ నిర్వాచ్యుండు పరుఁడు నిరంజనుండు
త్రిగుణాశ్రియుండును త్రిజగత్స్వరూపుండు నమలాత్ముఁడుఁ త్రిమూర్త్యాత్మకుండు
సంకల్పరహితుండు జగదేకదేవుండు సచ్చిదానందుండు శాస్త్రయోని

తే॥ యాదిమధ్యాంతరహితుండు నప్రమేయుఁ
డక్షరుండు నంతర్యామి యతులితుండు
సర్వకారణాతీతుండు సాధుహృన్ని
వాసుఁడునుగాదె బ్రహ్మంబు పార్థివేంద్ర! ౧౩౯

తే॥ ఇట్టి పరమాత్మ తనలోన నెల్లజనము చేష్టలుడుగుచు శయనంబుఁ జెందునపుడు
గోచరింపక యొరుల కకుంఠితముగ మేలుకొనిచూచుచుండునో మేరుధీర!

చ॥ స్ఫటికమునందు నెట్టితరవర్ణములేవియు సంక్రమింపవో
యెటు లనలానిలాంబరము లింధనధూళిఘటాళిఁ జిక్కవో
యటుల గుణత్రయంబునఁ బరేశుఁడు సిక్కక సంతతంబు ను
త్కటముగ వెల్గు నిర్మలవిధంబున సజ్జనవందనీయుఁడై ౧౪౧

తే॥ వ్యంగ్యశాస్త్రపదస్ఫోట వాదలక్షణాదులకు నట్టి పరమాత్మయందనపుడు
లౌకికోక్తులఁ దెలియునే? లలితచరిత! దేవకానుజ! ద్వారావతీపురీశ! ౧౪౨

## మానినీ వృత్తము.

కొందఱు వేళగఁ గొందఱునేతగ గొందఱు కర్తగఁ గొందఱు గో
విందుగఁ గొందఱు భీముగఁ గొందఱు వేధగఁ గొందఱు వృత్రహుగాఁ
గొందఱు శూన్యగఁ గొందఱు బ్రహ్మగ గొప్పకతంబని కుంభిని ని
ట్లందఱు నారసి యన్నివిధంబుల నాపరమాత్మను నందురుగా ౧౪౩

వ॥ వెండియు గుణంబులకుఁ జిక్కక మాయ నంటక యింద్రియాంతఃకరణ
చతుష్టయంబులకు గోచరింపక వేదములకునైత మెఱుంగఁబడక త్రైకాలికాబాధ్యం
బై యాపరమాత్మ ప్రకాశించు. అందు విస్ఫులింగంబు లగ్నియందు లీనంబైనట్లు

సర్వంబును లయంబు బొందుచుండు. జనుండు విద్వాంసులచే వాసుదేవుండని చెప్పంబడు హిరణ్యగర్భునిం బరమాత్మతత్త్వంబుగాఁ దెలిసికొని మోహంబు విడిచి యసంగుండై సంచరింపవలయు. చంద్రుం డేకుండయ్యు నుదకపాత్రిబృందంబునం బహుత్వంబు జెందుచందంబునను నీతిహాసంబుం డొక్కండయ్యు గాథాసముచ్చయంబునందు వివిధత్వంబు గాంచినకరణిని నాపరమాత్మ యొంటివాఁడయ్యు స్వకృతదేహాదిబాహ్యాభ్యంతరంబులం బ్రవేశించి యనేకత్వంబుగాంచు. సూర్యోదయంబున దమంబు నశించి గృహపరికరంబులు గనుపడినట్లు జ్ఞానోదయంబునం దమంబునశించి పరమపదంబు గోచరించుచుండు. ఏకపదార్థంబు భిన్నభిన్నవృత్తులుగల యింద్రియంబుల కనేకవిధంబులైనట్లు తేజస్స్వరూపుండగు నాకేవలుండును భిన్నశాస్త్రపారంగతులగు మహర్షులకు వివిధవిధంబులుగా వర్ణనాస్పదుండయ్యె. ఆ పరంధాముండే యీ శ్రీకృష్ణుం డగుట నమస్కరించుచుంటినని చెప్పి వ్యాసుం డా యుగ్రసేనుననుమతిం గొని యాదవులాలోకించుచుండ నంతర్హితుండయ్యె. ౧౪౪

## —♦ శ్రీ గర్గభాగవత పఠనాదిఫలము. ♦—

తే॥ జనక ! యిట్లిప్డు నీకు విజ్ఞానఖండ మేనుజెప్పితి శ్రీగర్గకృతము సర్వ
దోషహరము బుణ్యంబు జతుష్పదార్థదమగు దివ్యకోశంబిది ధరణినాథ!

సీ॥ నయనపర్వమొనర్చు నవఖండములతోడ దనరారుచుండెడి ధరణికరణి
సర్గముల్ సేయఁగాఁ జను నవబ్రహ్మలఁ బరగుచుండెడి పరబ్రహ్మమువలె
బ్రవిమలంబులయిన నవరత్నములతోడ నతిశయించెడి నిర్జరాంగుళివలె
నవ్యంబులైన తన్నవరసంబులతోడఁ బొల్పారు శ్రీకృష్ణమూర్తిమాడ్కి
తే॥ దివ్యనవఖండములతోడఁ దేజరిల్లెడి గర్గభాగవతంబిది కలుషహరము
పుణ్యాకరమును బురుషార్థ భూరిదంబు విశ్వవిజ్ఞానదమునయి వెలుఁగుఁగాదె

ఆ॥ ఇద్ది విన్నవార లిహలోకసౌఖ్యముల్ బొంది గోజగతినిఁ జెందఁగలరు
భీతుఁ డిద్దివినిన భీతిని విడుచును కామరుండువినినఁ బండితుఁడగు ౧౪౭

ఉ॥ ఇంబుగ వంధ్యయైన సతియేనియు స్నానముఁజేసి దివ్యపీ
తాంబరముం ధరించి పతియాజ్ఞనుగైకొని భక్తి నిట్టిగ్రం
థంబును విన్నచోఁ ద్వరను దజ్జలజేక్షణసామ్యపుత్రజా
లంబునుగాంచు శోభనవిలాసములొప్ప స్వధామమందునన్ ౧౪౮

తే॥ రోగి యిద్దివినినచో నిరోగియగును బేద యిద్దియాలించిన విత్తవంతుఁ
డగును బద్ధుండువిన్నచో నట్టిబంధనంబునుండి ముక్తుండగు నవ్యచరిత!

సీ॥ క్షత్రియుండీకృతిన్ గార్తికమాసంబునందు నాలించిన నధికభక్తి
బార్థివులందఱు బలులిడి మ్రొక్కఁగా సూతమాగధముఖుల్ స్తుతులొనర్ప
వారనారీమణుల్ పాడుచు నాడంగ సుందరపుత్రికల్ సౌరిదిమెలఁగ
వింధ్యాచలోద్భవ ద్వీపములు జెన్నార సింధుతురంగమ శ్రేణికొప్ప

తే॥ నిత్యకల్యాణములుగల్గ నిఖిలభూమి మండలంబు వర్ణాశ్రమ సహితధర్మ
ములను నిలుపుచుఁ బాలింపఁగలఁడు రాజచంద్ర! యీవిషయంబు నిస్సంశయంబు

తే॥ ఎవఁడు రౌప్యఖురంబులు హేమశృంగములును దామ్రపృష్ఠంబును భూషణములు
బరగవత్ససంయుక్త గోద్వయమును బ్రతిఖండమందిడునో వాఁడు గాంచుఁ గోర్కి

ఆ॥ కారణంబులేక గర్గభాగవతంబు వినిన సత్పురుషుని ఘన వ్యాసముక
మలమునందు సతము మాధవుఁ డొప్పుచు ధన్యతముగఁ జేయుఁ దథ్యమిద్ది

క॥ ఈరహి బహులాశ్వునకా నారదుఁ డుపదేశమును నొనర్చి యనుమతిం
గోరి నభోమార్గంబును జేరెఁగదా శౌనక! మునిశేఖర! మఱియున్ ౧౫౩

క॥ జనకమహారాజీకృతి విని ధన్యుఁడనై తినంచు వేమఱు స్వాంతం
బునఁ దలఁచుచుఁ జెలఁగెను శ్రీవనజేక్షణ భక్తిభరితభావముతోడన్ ౧౫౪

తే॥ నీదుకోర్కినిఁ జెప్పితి నేను దీని శౌనకా! యన్న నమ్మౌని త్మౌనసురేంద్ర!
నాకు హరిభక్తిగలె ధన్యతఘటిల్లె ననఁగ గర్గమహర్షియు ననియె నిట్లు

మ॥ ధరణీభార నివారకుండు మధురధ్యానప్రతీత్యుజ్జ్వల
న్మురళీలోలుఁడు శూరవంశజలధిప్రోద్యత్సుధాంశుండు స
చ్చరితుండున్ మునిశుద్ధమానససరశ్చక్రాంగభూతుండునౌ
హరి రక్షించుత మిమ్ము మమ్ము ననయం బానందమేపారఁగాన్ ౧౫౭

తే॥ ఇటు సర్గవిసర్గవిహిత హరికథ శౌనకాదులకున్ జెప్పి సర్వమునులు
భక్తి సాఁగనంపఁగ మునిపటలతిలకుఁడైన గర్గుఁడు గర్గాహ్వయాద్రి కరిగె

శా॥ శ్రీమద్ద్వాదశయోజనాయతమహాసింధూజ్జ్వలద్ద్వారకా
ధామా! యోగిమునీంద్రసన్నుతపరంధామా! శుభోత్సాహము
త్సీమా! యాదవవార్ధిసోమ! యభయ శ్రీకృష్ణనామా! మహో
ద్దామా! దుష్టవిరామ! కామసమ! రాధామానసాబ్జార్యమా! ౧౫౮

ఉపేంద్ర వజ్రము.

నిరంజనా! నిర్గుణ! నిర్వికల్పా! నిరీశ! నిర్వాణద! నిర్వికారా!
నిరీహా! నిష్కారణ! నిర్విశేషా! పరాత్పరా! వైదిక భాగధేయా!

గద్యము:- ఇది శ్రీమత్పరమపవిత్రాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, చివుకుల
కులజలధికళానిధి, కోటమాంబాకామయ తనయ, లక్ష్మీదేవి
సుబ్రహ్మణ్యా దత్తపుత్ర, శ్రీకృష్ణప్రసాదాసాదిత కవిత్వ
నిశ్చయ, సుజనవిధేయ, శ్రీనివాసాపరనామధే
యాప్పయశాస్త్రిచే నాంధ్రీకృతంబైన
శ్రీగర్గభాగవతం బందలి
విజ్ఞానఖండము
సంపూర్ణము.

---

శ్రీ శ్రీ శ్రీ
హరిః ఓం తత్సత్
శ్రీకృష్ణార్పణమస్తు.



శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# శ్రీ గర్గభాగవతము

## అశ్వమేధ ఖండము




తకాలజలద కృష్ణా!
స్మితపూర్వాత్మీయ వాక్య సిద్ధమధుర ని
ర్జిత కృష్ణా! రక్షిత భా
రతయుద్ధప్రముఖ కృష్ణ! రాధాకృష్ణా! ౧

### ఉగ్రశ్రవుండు నైమిశారణ్యంబున కేతెంచుట.

వ॥ నైమిశారణ్య పుణ్యక్షేత్రంబున నొక్క తరుణంబునం దష్టాశీతి సహస్ర శౌనకాదిమహర్షి మండనాయమానంబగు మహాసభకు రోమహర్షణనామకసూత సూతియును, సర్వశాస్త్ర విదగ్రిముండునగు నుగ్రశ్రవుండను పౌరాణికాగ్రగణ్యుం డేతెంచుట శౌనకుం డాలోకించి యానందించి ప్రత్యుత్థానాభివాదనార్ఘ్యాపురస్సరం బుగాఁ దోడ్కొనివచ్చి సింహాసనాసీనుం గావించి యిట్లు పృచ్ఛించె.

మ॥ ముని చూడామణి! మేము మీముఖమునన్ మున్నెల్ల శాస్త్రంబులన్
వనజాతాయతపత్రనేత్రకథలన్ బోధంబుగావింటి మిం
కను బుణ్యప్రద గర్గసంహితను నా గర్గాఖ్య చేవింటి మిం
కను శ్రీకృష్ణకథాసుధన్ జెవుల వేడ్కన్ గ్రోలఁగాఁ జేయవే ౨

చ॥ అనవుడు రౌమహర్షణియు నచ్యుతపాదసరోరుహంబులన్
మనమున నిల్పి యిట్లనియె మాధవపుణ్యకథాసుధారుచిన్
వనరుహపీఠశంకరులు స్వల్పమెఱుంగుదు రన్యులెవ్వరున్
మునికులవర్య! గుర్తెఱుఁగఁబోలరు తచ్చరితాంశసూక్ష్మమేన్ 3

చ॥ ఇఁక మఱేకప్రకారముగ నేమి యెఱుంగకయుండు మేము త
త్సకలపరేశపుణ్యచరితం బెటుబల్కఁగ నేర్తుమైన ని
ష్కపటిలమై రమావిభుపదాంబుజదివ్యమరందమాను కో
రికగలదాట నీయెడద ప్రీతిని జెప్పెద విన్న దానినిన్ ౪

తే॥ యదుగురుండగు గర్గుం డొక్క యవసరమున
నుగ్రసేనవిభుండు వేదోక్తరీతి
సల్పిన తురంగమేధంబు జక్కఁగాంచి
యప్పురముఁ బొంది యీరహి ననఁగడంగె ౫

ఆ॥ ఉర్వి ధన్యుఁడన్న నుగ్రసేనుఁడెసుమ్మి సత్తమస్తుతముగ క్రతూత్తమంబు
నైన యశ్వమేధ మాహరిపూజనఁబొంది భక్తిఁజేసినందువలన ౬

ఉ॥ శ్రీవిభుఁడైన యచ్యుతునిచేఁతల నెట్టులఁ గంటిఁ గంటినో
యేవిధి వీనులార హరినృత్తములన్ వినియుంటినో యవే
శోవిదనుత్యసంహితను గూర్చితి నీవటకం తెగాని నే
నీవరయజ్ఞమున్ గుఱిచి యేమిదియు వ్రాయకపోతి నక్కటా! ౭

తే॥ కాన నీసమయంబున దాని వ్రాసి ధన్యతముఁడ నయ్యెదనంచుఁ దలఁచి యలఘు
మేరుపర్వతమందునఁ జేరి యష్టదివసములలోన నదివ్రాసె దివ్యశక్తి ౮

— గర్గాచార్యుండు వజ్రనాభునికడకు వచ్చుట. —

ఉ॥ ఆరహిఁ బుణ్యతచ్చరిత మామునివర్యుఁడు వ్రాసి సర్వగో
పీరమణప్రధానపుటభేదనమా మధురాపురంబునన్
మీఱెడి వజ్రనాభుని సమీక్షణముం బొనరింప నెంచి బృం
దారకవర్త్మమూలమునఁ దత్సవిధంబును బొందె శౌనకా! ౯

ఉ॥ అంతట వజ్రనాభుఁ డతులాత్మసమీపము బొందు దాంతునిన్
శాంతుని బుద్ధిమంతు యదుసద్గురు భర్గసమాను గరు వే
దాంతవిదగ్రణిన్ గని మహాస్థ నెదుర్కొని బ్రాహ్మణాళితో
సంతసమొప్ప శాస్త్రవిధి సల్పి సపర్య నొసంగి గద్దియన్ ౧౦

క॥ అడుగులఁ గడిగినతీర్థము వడిఁ దన తలఁజల్లికొనియుఁ బ్రణమిల్లి రుచిం
చెడి ఫలములనిడి దండలు మెడలోనిడి దోసిలొగ్గి మెచ్చుచుఁ బలికెన్ ౧౧

ఆ॥ స్వాగతమగుగాత బ్రహ్మర్షి శార్దూల! జోతములను నీకుఁజేతు నేను
భావమందున భగవద్రూపునిగ నిన్నుఁ దలఁచుచుంటి సర్వధర్మనిరత! ౧౨

సీ॥ నిస్సార సంసార దుస్సహరోగముల్ గొట్టెడి వైద్యుఁడు గురుఁడుగాఁడె
యార్థిక నైతిక యౌగిక వైదికసరణిఁ దెల్పెడి పెద్ద గురుఁడుగాఁడె
యజ్ఞతాంధాంధునిన్ బ్రజ్ఞతాంజనమిడిఁ గొప్పఁ జేసెడి మేటి గురుఁడుగాఁడె
సర్వవిద్యాసారసాగరనిర్జరగురునిఁ బోలినవాఁడు గురుఁడుగాఁడె

తే॥ హరియు హరుఁడును బరమేష్ఠి గురుఁడుఁ గాఁడె
మీ దరిసెనంబు నరులకు మేకొనునొకో?
మఱియు విషయాసక్తులమగు మాకు మిగుల
దుర్లభముగద! గర్గ! మద్గురువరేణ్య! ౧౩

క॥ తొలఁగెను నా దురితంబులు జెలఁగెను తీర్థంబులెందు సిరిసంపదలున్
మొలఁగెను మీదయ ధన్యతఁ గలిగెఁ గుటుంబినగు నాకుఁ గర్గమహర్షీ! ౧౪

చ॥ అనవుఁడు షోడశాబ్దముల నందముఁ జెందినవాని నల్లవా
నిని శశిసింహతుల్యబలు నీరజలోచను భూపుసిన్ వరాం
గునిఁ బృథుబాహు సద్గుణుని గోవిదనుత్యుని వజ్రనాభనా
మునిఁ బ్రియశిష్యునిం గని పరిమోదముతో గురుఁడిట్లనెన్ ౧౫

మ॥ యదురాజా! యదువంశసాగరశశీ! యుక్తంబుగాఁ బ్రాజ్యవై
భవదీయంబగు రాజ్యమేలితివి సర్వశ్రౌతధర్మంబులన్
భువి స్థాపించితి వా పరీక్షితుఁడు నీ ముఖ్యాప్తపుత్రుఁడత్యస్థిరా
ధ్వరులన్ గప్పము లిచ్చుచుండిరి గదా! ధన్యుండవీవే సుమీ! ౧౬

క॥ నీ మథురాపురి ధన్యము నీమేదిని ధన్యమింక నీ మానవులున్
నీ మిత్రులుధన్యులు గొఱయేమాత్రం బెందులే దహీనయశస్వీ! ౧౭

ఆ॥ విదితరామకృష్ణ మదనానిరుద్ధుల శంక లేక కొలిచి సంతతంబు
సర్వసుఖములబ్బఁ జక్కఁగా రాజ్యంబు బాలసమ్ము సలుపు వజ్రనాభ! ౧౮

చ॥ అనవుఁడు భూపుఁడుం జనిన యచ్యుతు రాముని దండ్రిఁ దాతలన్
మనమున సంస్మరించి పలుమాఱులు తద్విరహప్రభూతబా
ధను సహియింపఁజాలక యధోముఖుఁడై కనులందు నశ్రుధా
ర నిగుడ రోదనంబును గరంబుగ సల్పె ననంతరంబునన్ ౧౯

చ॥ గురుఁడును గాంచి వింతపడి కూర్మిని నిట్లనె నన్నుఁ జూచి యి
త్తఱి వెఱపొందియుంటివె యథార్థము చెప్పుము లేనిచో నిటుల్
విఱుఁగడ లేక కంటఁదడి పెట్టుటకున్ గతమేమి? ధారుణీ
శ్వర! యని యడ్గినప్పటికిఁ బార్థివుఁ డేదివచింపకుండుటన్ ౨౦

చ॥ కని మఱి గర్గుఁడిట్లనియె క్ష్మాతలనాథ! యిదేమివింత! నీ
మనముననున్న సంగతిని మాదరి దాఁచెద వేల? చెప్పుమం
చనఁగ నతండు సాంత్వనము నందికనుంగవఁ గాఱు నశ్రుధా
ర నిలిపి గద్గదోక్తిని శిరంబునఁ జేతులమోడ్చి యిట్లనెన్ ౨౧

—♦ గర్గుండు వజ్రనాభునకు శ్రీకృష్ణ చరిత్రంబుఁ జెప్పుట. ♦—

శా॥ గర్గార్యా! నను నొంటిపిడి హలి మాకాంతాదులౌ మానవుల్
స్వర్గంబొందిరి దానవేడ్భ్రుతి భటస్వామ్యర్ధ మంత్రిస్థిరా
దుర్గస్నేహితవర్గ సద్బలము, సంతోషంబు నాకిప్డుఁజే
మార్గానక్ కలిగింపఁజాలదుగదా! మౌనీంద్ర! యేమందునే ౨౨

మ॥ సకలాశాస్ఫురితాదివాదభుజవిస్ఫారత్ప్రతాపోరు పా
వక శాంతిప్రథితాంబుసామ్యకమలాపాణీశవృత్తంబు నే
నౌకపర్యాయముగూడఁ గన్గొననిఁకన్ యుక్తిన్ వినన్ లేదుగా
ని కటా! కట్టు! యదూత్తమాంతమునె నా నేత్రంబులన్ గాంచితిన్ ౨౩

తే॥ ఏపురంబు చతుర్వ్యూహవృతమధురిపుపాలితంబయి తగెనో యాద్వారకాన
గరవరంబిప్డుమునిఁగె సాగరమునందు భక్తివశుఁడయి కృష్ణుఁడున్ బరఁగుచుండె

క॥ ఎందుల కిక్కారణమున నిందున జీవింపవలయు నిప్పుడె యడవిన్
బొందెద గురువర్యా! నాడెందము రాజ్యంబొనర్ప డిందుచునుండెన్ ౨౫

ఉ॥ ఆవల గర్గమౌని యల యాదవనాయకు వజ్రనాభు సం
భావనజేసి దుఃఖమును బాయఁగఁజేయుచు నిట్లుపల్కె నో
భూవర! సంతసించితిని బుణ్యాకరంబు వ్యథాహరంబునౌ
శ్రీవిభు జీవితంబిపుడు చెప్పెద శ్రద్ధగ నాలకింపుమా! ౨౬

క॥ అవితథవిధి నిటు బలుకుచు స్వవిరచితంబైన దివ్యసంహిత నా యా
దవపతి కోలిగఁజెప్పెను నవదినములలో సలక్షణముగ మునీంద్రా! ౨౭

తే॥ ఇట్లు చెప్ప వినిన యాదవేంద్రుఁడైన వజ్రనాభుండు మోదిల్లి స్వగురుమ్రొక్కి
శిష్యవత్సల! శ్రీకృష్ణజీవితంబు వినుట నాదుఃఖతాపముల్ వెడలిపోయె ౨౮

ఉ॥ కాని మనంబునం దనివిగల్గకపోయెను నాకు నింక మీ
రా నలినాక్షుసత్కథ దయన్ బలుకాడనుతింతుఁ బూర్వమం
దేను తురంగమేధకథ యించుకవింటిని దానినిప్డు డ
న్న్యూనముగా వచింపవలయున్ నిగమాగమశాస్త్రవిద్వరా! ౨౯

తే॥ సదయహృదయులౌ గురువులు ఛాత్రులకును
గొడుకులకు సేవకులకును గూఢవిషయ
మడిగినను దాము గినియక యాదరమున
దెల్పుచుండరె సతతం బనల్పచరిత! 30

ఉ॥ నావుఁడు భూసురేంద్రుఁడు మనంబున గొంకఁదలంచి భూప! ల
క్ష్మీవిభుపాదపద్మయుగమేదురభక్తివెలుంగుచుంట నీ
భావము శ్లాఘ్యమయ్యెడిని పాపహరంబు సుఖాకరంబునున్
భావుకదంబునైన హరిపావనవృత్తము విన్ము చెప్పెదన్ ౩౧

వ॥ అని పలికి క్రమ్మఱ సవిశేషంబుగా వ్యాసయోగంబునందుఁ జాపివార
మున్నరయగు రత్నగర్భ చని హిరణ్యగర్భునకు విన్నవించుకొనుట మొదలుకొని
యా పారిజాతాపహరణంబు వఱకుఁ జెప్ప నా నృపతిప్రవరుం డానందించి వ్యాసా!
యా యుపేంద్రుం డింద్రునిం జయించి తత్సురేంద్రునుంబు జెకల్పి కొనివచ్చి నెచ్చెలి
యగు సత్యభామ కేకారణంబున నిచ్చెనో సవిస్తరంబుగా వాక్రుచ్చుమని ప్రార్థింప
నాగర్గమహర్షి యా రాజేంద్రున కిట్లనియె. ౩౨

— పారిజాతాపహరణ కథ —

కం॥ నారదుఁ డొక్కతఱిని నొక సౌరభసౌరభ్యపారిజాతసుమంబున్
గోరికఁ గొని చని భీష్మకుమారికయగు రుక్మిణికిడె మానవనాథా! ౩౩

ఉ॥ ఆసుమమాసపత్నికటు లామునియిచ్చుట గన్నులార స
త్యాసతిగాంచి ఖేదమును దద్దయుఁబొంది విముక్తకేశయై
మాసినచీరఁ గట్టుకొని మంగళసూత్రముదప్ప దివ్యభూ
షాసమితిం ద్యజించి కసిఁ జట్టనఁజేరెఁ దమోగృహంబునన్ ౩౪

కం॥ అప్పుడు తత్పద్మాక్షుం డప్పడఁతిని గాంచి నీకు నల సురతరుపుష్
దప్పక తెచ్చెద నిచ్చెద మెప్పుగొనెద చింతమానుమిదె! వగలాక్షీ! ౩౫

చ॥ అని యనుచుండు కాలమున నా నరకాహ్వయదానవేంద్రబా
ధను సహియింపలేక విబుధప్రభువర్యుఁడువచ్చి మ్రొక్కి యో
వనరుహనాభ కావుమని ప్రార్థనజేయఁగ నా మహోత్కుఁడున్
విని తలయూఁచి యియ్యకొని వేడుకనిట్లనె నా మహేంద్రుతోన్ ౩౬

మ॥ కనుమిదె! నాప్రియ పారిజాతతరువున్ గాంక్షించి యేరీతిగాఁ
గనుఁదోయిన్ సలిలంబు సాగరముగాఁ గన్పట్ట రోదించుచుం
డెనొ కానన్ దమినట్టివృక్షమిడినన్ డీకొంచు సద్దానవేం
ద్రుని సేనారథరథ్యయుక్తముగ నిర్మూలింతు నిక్కంబుగాన్ ౩౭

ఉ॥ నావినివాసవుండు చిఱునవ్వొలయంగ మహానుభావ! నీ
వా విబుధారినిం దునిమి హర్షము మాకుఘటించి నందనా
ఖ్యావనభాసురంబులగు నాతరురత్నములెల్లఁ గొమ్ము నా
దేవిధమైన యడ్డు వసియింపదటంచెద విశ్వసింపుమా! ౩౮

## సత్యభామతోఁగూడి నరకాసురుని వధించుట.

క॥ అంతట వల్లెయనుచు శ్రీకాంతుఁడు సత్యాన్వితుఁడయి గరుడాంసమునన్
సంతసమున నెక్కి చనియెను బంతములన్ బలుకు నరకు ప్రాగ్జ్యోతిషమున్

ఉ॥ ఆవల నాకనాయకుఁడు నాత్మపదంబున కేగె నంత స
త్యావనితాలలామ హరి నాత్మమనోహరుఁగాంచి మ్రొక్కి యో
దేవర! తొల్లి దానిఁగొని దేవవిరోధినిజంపు లేనిచో
నావలఁ బత్సురద్రుమము నాతఁడొసంగకపోవుఁ గామియై ౪౦

మ॥ అన శ్రీకృష్ణుఁడు నాలకించి ప్రియకిట్లాడందొడంగెన్ జెలీ!
మన మా దేవవిరోధిఁజంపినపయిన్ మర్యాద వాఁడేను గో
రిన తద్వృక్షము నీయకుండిన గదాశ్లేషంబుతోడన్ శచీ
స్తనపాటీరవిలిప్తతత్పృథుల వక్షంబున్ గసిన్ గొట్టెదన్ ౪౧

ఉ॥ ఈరహిఁ బల్కి శ్రీహరి యహీనజలానలవాయుశస్త్రి సం
భార సుసప్తదుర్గ సురవైరి సమావృత భౌమగుప్త వి
స్తారపురంబు ఖడ్గశరచక్రగదాదులఁ బాడుచేసి బ
ల్మిఁబు మురాసురుందునిమి లీలవధించెఁ దదాత్మజాతులన్ ౪౨

ఉ॥ ఆ నరకుండు నప్పుడు మహోగ్రహావృత్తిని రేగి యేగి శ్రీ
జానిని శస్త్రివర్షములఁ జక్కఁగముంపఁగఁగాంచి తత్ఖగే
శానుఁడు వాని సేనలను సంహృతిచేయుచునుండఁ గృష్ణుఁడున్
బూని వధించెఁ జక్రమున భూమిజుఁ దన్నరకాఖ్యు రెండుగాన్ ౪౩

తే॥ అటులఁ జంపి శ్రీహరి తద్గృహమున వెలుఁగు
మణులఁగొని షోడశసహస్ర మనుజనాథ
దైత్య, సిద్ధ, కన్యకలను ద్వారకాన
గరవరమునకంపించి త్వరితగతిని ౪౪

క॥ సురమాతృకుండలములన్ సురవిభుధవళాతపత్ర సుందరమణులన్
గరముగఁ గైకొని తత్సురపురికరిగెన్ బారిజాతభూజార్థంబై ౪౫

చ॥ హరి యటులేగి కుండలము లట్టియమర్త్యలతల్లికిన్ మహో
దరమునవిచ్చి మ్రొక్కులిడి తద్వరరత్నసితాతపత్రమున్
హరికిడి పారిజాతము రయంబున నాకు నొసంగుమన్నఁ ద
త్సురపతి యెక్కుడంబుననొ తొడ్డనొసంగకపోయె దానినిన్ ౪౬

క॥ కని కనలుచు హరి దేవేంద్రునిఁ దత్సైన్యంబు గెల్చి తొరఁజనితన్నం
దన వనగత తద్వృక్షంబును గొని స్వప్రియకునిచ్చి మోదముగూర్చెన్ ౪౭

ఉ॥ నావుడు వజ్రినాభుఁడు ననర్ఘసమక్షమునిట్లు మునీశ! స
త్యావనజేక్షణోక్తలపితంబులు సత్యముగాఁగ వజ్రిమం
బావిభుఁడేంద్రుఁడీక హరియాదివిభుండని గుర్తెఱింగి యే
లా? వృథ యుద్ధమున్ గలిపి లంపటఁబొందెనొ చెప్పుఁ బ్రార్థితాన్ ౪౮

క॥ పదపడి గురుఁడిట్లనె హరి యదితిస్తుతి నిర్జరేశ్వరాంగీకృతులన్
స్వనయితె సత్యన్ గూడుచు ముదమున నందనవనంబు బొందెను క్షేడా! ౪౯

తే॥ అటులఁ గృష్ణుఁడు సుందరోద్యానవనములందు మేలుబంతిగనొప్పు నందనవన
మునకుఁజని యందు బహునవ్యపుష్పభరితపారిజాతములఁగనె నవ్వనమునడుమ

సీ॥ వేల్పుల కనిశంబు వేడుక నిడునది పస్మగంధముతోడఁ బరగునదియు
శోణపల్లవముల జొత్తిల్లునదియును బూలగుత్తులతోడ వ్రాలునదియు
బాలసంద్రమునందు భవము జెందినదియు దుర్గంధములనెల్ల ద్రోయునదియు
తోటకంతకుఁ బెద్దతోడవుగనైనది పైఁడిఁబోలెడి తాఁటభాసిలునది

తే॥ యనగు పారిజాతమహీజము నెగడుటను సత్యభామవీక్షించి యాశౌరితోడ
దీనిఁ గైకొందునని చెప్పఁగా నతండు నగుచు నదిదీసిపెట్టె నాఖగపతిపయి

క॥ అత్తఱిఁ గావలివారలు దత్తఱమున లేచి శస్త్రధరులయి కిన్కన్
దత్తామరసాక్షుని గని యిత్తెఱఁగునఁ బల్కిరోయి పృథ్వీనాథా! ౫౨

చ॥ నర! యిదియేమి? మమ్ములఁ దృణమ్ముగ లెక్కిడి యింద్రు రాణి సం
బరమునకై సురల్ జలధిఁ బట్టుదలన్ మథియించు వేళఁ బు
ట్టిరహినినున్న యీతరువు డెక్కొని పీకితివేల చెప్పుమా?
యరయ ధరన్ మనర్ దలఁచునట్టిజనుండిటు సేయఁ డెవ్వడున్ ౫౩

ఉ॥ వింటివొ? లేదొ? యీ వనముఁ బెట్టియుఁ బెంచిన పెద్దవాఁడు వే
కంటియసుమ్మి యీ దివిజభర్త ధరాధరపక్షముల్ ధరన్
గంటునఁ గూల్చినాఁడు మఱి తమ్మితలకంటకుఁడైన వృత్రునిన్
దంటను గెల్చినాఁడు, బహుదైత్యులఁ జీల్చినవాఁడు మానవా? ౫౪

ఉ॥ కావున మా నుడుల్ వినుము! గర్వముఁబొందకుమా! మహాప్రభుం
డీ విషయంబుఁగాంచనిరహిన్ ద్వరనిచ్చుట నిట్టిపారిజా
తావనిజంబువీడి విహగాధిపుపై సతితోడనెక్కి పో
మ్మా! వృథ యిందునిల్వకుమ! మార్కొనడి మానుమ! సౌఖ్యమొందుమా! ౫౫

తే॥ కానిచో మామహేంద్రునికడకుఁబోయి యడిగితీసికొనుము! యట్టియవసరమున
దోటకాఁపులమగు మేము లోటుమాటలాడి యడ్డగింపముకాదె సూడుకాడ!

క॥ ఆ నుడులను విని కృష్ణుఁడు మౌనముగానుంట సత్య మఱిమఱిఁగనుచున్
బూని మహాసాహసమును నీనెఱిఁ దద్రక్షకులకు నీసునఁబలికెన్ ౫౬

ఉ॥ చాలును జాలు మాటలిఁక సాహసవృత్తిని బల్కుచుంటిరే
మీరా! లగుడప్రహారములు మీకు ఘటించును నెల్లవారికిన్
పేలుగ సంద్రమందుఁ బ్రభవించి ముదంబిడు పారిజాతమున్
హేలను సంగ్రహింప శచియెవ్వతె? యింద్రుఁడెవండొ? చెప్పుఁడీ! ౫౮

చ॥ జలధి మథించుకాలమున జాతముఁజెందిన శ్రీ, సమస్తలో
కుల కనుభావ్యమయ్యె నెటుక్రొన్నెల సర్వుల కెట్లుభోగ్యుఁడై
మెలఁగెనొ? యేవిధిన్ సుధ యమేయముగా నుపభోగ్యమై దివిన్
జెలఁగెనొ యట్టులీద్రుమ మశేషజగజ్జనభోగ్యమయ్యెడిన్. ౫౯

ఉ॥ ఈరహినున్న దీనిపయి నేయధికారము లేక నాదియం
చూజక భర్తృబాహుబలయోగవిగర్వితయైన యాశచీ
నారి వితండవాదము ననంతముగానొనరించినంత నీ
భూరుహ మెట్టులాయమకుఁ బొందుపడున్ పరికించి పల్కుఁడీ! ౬౦

తే॥ కాన నీపారిజాతము గైకొనియెద సంశయము లేదు దీనికి క్షమను లవము
దాల్పవలదిప్డు వెంటనే తత్సచికడ కేగి నామాటగా మీర లిటులఁ జెప్పుఁడి!

ఆ॥ పతికి దయితవైన భర్త వశుండైనఁ బారిజాతవరముఁబట్టి పెఱికి
కొనెడి నాదుమగనిఁ గొంకక యెదిరించి దానిఁగొనుమ! శచిరో! దయనువీడి

చ॥ అని వచియించి తిర్గి యిటులాడెను రక్షకులార! మిమ్ము నా
కనులనుగంటి మీపతిని గాంచితి నింతకుమున్నె పూర్తిగా
మనుజులలోని నే నలద్రుమంబును మీ వనమందుఁజొచ్చి పోఁ
డినిగొనుచుంటి మీరు గనుఁడీ! యిఁకఁజేసెడిదేమొ చేయుఁడీ! ౬౩

తే॥ ఇటుల గర్వంబుతోఁబల్కి నెల్లతోటవారలల్లపులోమజచెరుఁబడికిఁ
జేరి సత్యభామోక్తులఁ జెప్పిరంత గనలి యాయమ తనపతికనియె నిట్లు.

సీ॥ దుర్గంబు నెంతుమా! దుష్టరాత్రించరపరదుర్గమంబగు స్వర్గముగద
భటులను నెంతుమా! ప్రథితజరామృతి విరహితబలయుత విబుధులుగద
వాహనం బెంతుమా! ప్రాచ్యాదిదిగ్గజ నన్యమా నైరావణంబుగాదె
యాచార్యు నెంతుమా! యఖిలప్రపంచభాసురగురుగురుఁడగు గురుఁడుగాఁడె
తే॥ యస్త్ర మెంతుమ దివ్యవజ్రాయుధంబు గాదె? యో మనోహర నీకు గండలంద
అధికముగ నెప్డు గడగడలాడుచుండ నెట్లువచ్చెనో? నిర్భీతిఁ గృష్ణుఁడిటకు

క॥ భార్యావశుఁడై యాతఁడు శౌర్యమున మదీయపారిజాతంబును గాం
భీర్యము ధైర్యము స్థైర్యము వీర్యముగల మిమ్ముఁగనక పెకలించి కొనెన్.

క॥ కావున నాథా! నీవును దేవతలనుగూడిపోయి దివ్యాశనితో
నా వెన్నుని రణమందునఁ జావఁగఁ బ్రహరించి పారిజాతముఁదెమ్మా! ౬౭

——♦ ఇంద్రుండు ఉపేంద్రునితోఁ బోరుట ♦——

క॥ పొగరున జగములఁ జెఱచెడి నగముల ఱెక్కలను నాశనముఁ జేయవొకో!
జగతీకంటకుఁడగు వృత్రుఁ గెలువవె! గాన దానిఁ దొఱఁగని తెపమ్మా! ౬౮

వ॥ అంత శతముఖుండు సతీవాక్యంబు లాకర్ణించి యా మహామహుతోఁ డీకొనవెఱచి కృష్ణుజ బహుభంగుల నిరాకరణాపేక్షితుండై కోపించి గోవిందుని నిందించి యా దంభోళితో నా పారిజాతచోరుని బరిమార్చెదనని యామె ననునయించి రణభేరి మ్రోగించి హిమాచలసన్నిభంబును, శుండాదండప్రేయమండితంబును, చతుర్దంతకాంతంబును, సర్వాలంకారాలంకృతంబును నగు నైరావతంబు నధిష్ఠించి, వజ్రాద్యాయుధంబులను ధరించి తనకు సహాయంబుగా దిక్పాలకులును, వసురుద్రవిపితృమరుత్కిన్నరకింపురుషసిద్ధసాధ్యచారణవిద్యాధరగంధర్వగణంబులును త్రయస్త్రింశత్కోట్యనుచరులును, సమాహూతులగు కొందఱు నిర్జరులును, నారదప్రేరితులగు కొందఱు బృందారకులును, బరివారశస్త్రసహితంబుగాఁ జనుదెంచుటం గని సంతోషించి యవ్వారలతోడం గూడి మేడంబాడఁ దత్సముఖంబున కేతెంచుటం గాంచి ౬౯

ఉ॥ మాన్యచరిత్రతోఁ జెలఁగు మాధవుఁడూఁడె విధూతదైత్యదా
ర్జన్యము వారితాత్మరథ రథ్యసమేతపతాకినీ స్ఫుర
ద్దైన్యము మిత్రసమ్మదవదాన్యము పోషితభక్తకోటి సౌ
జన్య మనన్యమున్ భువనసంతతిమాన్యముఁ బాంచజన్యమున్ ౭౦

తే॥ దిగ్దశకము తద్ధ్వనిని బ్రతిధ్వనించె నవలఁ గృష్ణుఁడు వజ్రతుల్యాంబకముల
లెక్కలేకుండ వైచె నా లేఖవిభుని బలముపై యాదవేశ్వర! వజ్రనాభ! ౭౧

ఆ॥ అంత విబుధులెల్ల రచ్యుతిబాణంబు లెల్ల కడలయందు నల్లికొనుటఁ
గాంచి యొక్కసారిఁ గమలాక్షుపైఁ దీవ్రసాయకముల వేసి రాయదనున ౭౨

క॥ అక్కంజాక్షుఁడు గినుకను నొక్కొక్కని తూపు నిజశరోత్కరమున వే
ముక్కలుగఁ జేసె ముక్కునఁ బక్కిపబువు వరుణనాగపాశము ద్రుంచెన్ ౭౩

క॥ వెండియు వైకుంఠుండా దండధరోద్దండచండదండము గదతోఁ
జెండి ప్రచండకిరణ మార్తాండుని పెనుగండుమాపి ప్రతిపక్షులతోన్ ౭౪

క॥ ధనదునిశిబికను జక్రంబునఁ దిలతుల్యముగసల్పి ముఖమున నేతెం
చిన యగ్నినిబట్టి మరుద్ఘనశూలములన్ నఱికి సుదర్శనహేతిన్ ౭౫

క॥ భుజమున రుద్రగణంబుల గిజగిజలాడంగఁ గూల్చి కేరఁగ నింద్ర
ధ్వజినులు నొక్కుమ్మడి నా విజయసఖునిమీఁద బాణవృష్టిని గురిసెన్ ౭౬

మ॥ మరి విద్యాధర సిద్ధచారణ మరున్మార్తాండ గంధర్వ కి
న్నరసాధ్యాదిగణంబులున్ గిసిసి నానాశస్త్రజాలంబులన్
హరిపై వేసిరి దాఁచే వెఱచు సత్యాత్మన్వీక్షించి శ్రీ
సరసీజాక్షుఁడు భీతిమాని కనుమీ! సైన్యంబు ఖండించెదన్ ౭౭

క॥ అనిపలికి మహాగ్రహమున ఘనశార్ఙ్గవిముక్త శరనికరములఁ బంచా
ననము నఖంబులఁ గ్రోష్టువులను జెండినమాడ్కిఁ ద్రుంచి లఘుగతితోడన్ ౭౮

చ॥ గరుడుని జూచి యిట్లనె నఖండసుపర్వచమూసమూహ మే
త్తెఱ నను నొంటిగాని నెటు డీకొనుచుండెనో వైనతేయ! యీ
తరుణమునందునన్ జని మృథంబును జేయవదేమి? యన్న నా
గరుడి సతీసమేతహరి స్కంధమునన్ బొలుపారుచుండఁగాన్ ౭౯

క॥ ఱివ్వున నెగయుచుఁ గిన్కను నవ్విబుధులమీఁదఁ దాకి యాత్మీయనసన్
గ్రొవ్వడఁగఁ బొడిచి మెక్కుచు నవ్విష్ణువు దన్నుమెచ్చ నాజిఁ జరించెన్ ౮౦

క॥ అంతట సురసంతతి ఖగకాంతహతిని వంతబొంది కాలికొలందిన్
వింతగఁ బాఱిరి నానాప్రాంతములకు వేల్పుతేఁడు వగవగ నవలన్ ౮౧

క॥ రుంద్రజలదములు ధారల సాంద్రంబుగఁ గురిసినట్లు శరనికరములా
యింద్రోపేంద్రులు బహునిస్తంద్రతవర్షించుకొనిరి త్వరనొండొరులున్ ౮౨

క॥ నాగాంతక నాగేంద్రులు నోఁగదెయనఁ బోరఁదొడఁగి రందునఁ గసితో
నాగేంద్రమాత్మరదముల నాగాంతకుఁగొట్టె స్వీయనాథుఁడు పొంగన్ ౮౩

చ॥ పదపడి విష్ణురథ్యమగు పక్షివిభుండు మహాగ్రహంబుతోఁ
గదిసి సురేశ్వరద్విరదకాంతుని స్వాయతపక్షనాసలన్
బదరక నుగ్గునూచమగుఫక్కిని గొట్టెను గృష్ణచంద్రుఁడా
త్రిదశపతాకినీతతిని దిట్టముగాఁ బ్రహరించె భూవరా! ౮౪

ఆ॥ అటుల గాసివడుట యావిధిసైన్యముల్ క్షోభపడుట నముచిసూదనుండు
గాంచి తనకునున్న కాండప్రకాండముల్ పద్మనాభుపైన వైచెఁ గిన్క ౮౫

ఉ॥ కాని యదూద్వహుం డవి సుఖంబుగ ఖండములం బొనర్చె న
ద్దానిని గన్న యింద్రుఁడల దైత్యధరాధరపక్ష నాశనో
త్థానకృతార్థవజ్రము గ్రుఘన్ గరమందుధరించి నిల్వ శ్రీ
జాని యమోఘహేతి వరచక్రముఁ దాలిచి నిల్చెఁ బెల్చనన్ ౮౬

క॥ విడిచిన విడిచెద నీవే విడువుము తరువాత నేను విడిచెదనని యా
గడుసరులాడుట విని వెఱఁగడు గడగడలాడె ముజ్జగంబులుగూడన్ ౮౭

తే॥ ఎట్టకేలకు నింద్రుఁడా కృష్ణుపైన వజ్రమూనువైవ నాతండు వామకరము
తోడఁబట్టి చక్రంబును వేసకుండ "తిష్ఠ, తిష్ఠ" యటంచాశి తివిరిమాపె ౭౮

చ॥ గరుడునిచేతనట్లు నిజగంధగజేంద్రము భిన్నమాటఁ ద
త్సరసిజనేత్రుచేతఁ గులిశంబును చక్కఁగఁజిక్కియుంటఁ ద
త్సురబలమెల్లపాఱుటయుఁ జూచి భయత్రపలొప్పఁబాఱు త
త్సురపతిసిన్ బురందరునిజూచెసీ సత్యయు నవ్వెఁ జిన్నలోన్ ౭౯

తే॥ ఇట్టు చావుదప్పఁగఁ గన్నులొట్టవోవఁ బాఱి యింటికిఁజేరిన స్వర్గనాథుఁ
డైన తనభర్తసున్ గన్నులారఁగాంచి శచి యిబులఁ బల్కెఁ గిన్కతో స్వకథపునకు

చ॥ కపటివి నీవుగావె సురకాంతవిభుండవటంచుఁ గీర్తిఁగాం
చి పలుగులేల తీసితివి? శ్రీహరిపైఁగల భక్తిచేతనా?
చెపుమ! జరాంతహీనసురసేనలతో ససహాయకృష్ణుఁ బ
ట్టి పరిభవింపలేక యెటులెంకికి లజ్జనుపిడి వచ్చితో ౮౦

ఉ॥ నందకుమారు నాసరుని నాశనముంబొనరింపలేనియ
ప్పెందుల కీసు ప్రభుత? యెందులకా కులిశాయుధంబు? నీ
కెందుల కిట్టి నందనము? నెందులకీ చతురంగవాహినీ
బృందము? నిర్జరాధమత యిప్డుఘటిల్లుటలేదె? వాసవా! ౮౨

తే॥ కాన నిప్పుడు నేఁబోయి కమలనేత్రు భండనమునందు గెలిచి తత్పారిజాత
తరువుఁదెచ్చెదఁ గనుమని సురలఁగూడి శిబికయందెక్కె శ్రీహరిచెంతకరిగె ౮౩

ఆ॥ కాని వెన్నుఁడట్టి కాంత సాహసమునుగాంచి వింతబొంది కలనుజేయ
నిచ్చగింపఁడయ్యె నింతలో నాసత్యభామసూచి పతికిఁబలికె నిట్లు ౮౪

ఉ॥ కంటివె తమ్మికంటి! సురకాంతసమన్వితయాచు నింద్రువా
ల్గంటి యెటుల్ మహారుషను గయ్యమొనర్పఁగఁ జేయవచ్చెనో
కంటున దీనిగెంటెదను గాంచుమనన్ హరినవ్వి చక్రముం
దంటతనాన నామెకిడి తత్తరువుం గొనియుండెఁ దార్క్ష్యుపై ౮౫

—♦ బృహస్పతి శచికి బుద్ధిగఱపుట ♦—

తే॥ చక్రసంయుక్తయయి సత్య సమితిఁజేయవచ్చుటనుగని హరవిధి ప్రముఖదివిజు
లాదఁబొందిరి వాసవచోదితుఁడయి జీవుఁడా శచివద్దకేగి చెప్పెనిట్లు ౮౬

ఉ॥ అమ్మ! మదుక్తియుక్తిని మహాదృతితో వినుమమ్మ! చక్రి బ్ర
హ్మామ్మని సత్యలక్ష్మియని మాటికి నెమ్మదినమ్ముమమ్మ! నీ
వెమ్మెయి సంగరమ్మొనరింపగఁజాలెదవమ్మ? పారిజా
తమ్మును వారికిచ్చి సురతండము నెమ్మిని బ్రోవుమమ్మరో! ౮౭

సీ॥ ఎవ్వనిభీతి లోకేశుఁడు సృష్టించు నెవ్వని భయమున మృతిచరించు
నెవ్వని వెఱపున మృడుఁడు హరించును నెవని సాధ్వసమున నినుఁడు వెలుఁగు
నెవని భీతంబున నింద్రుండు పాలించు నెవ్వని బెదరున నిందుఁ డొప్పు
నెవని యళుకునఁ గృష్ణవర్త్మయుమండు నెవ్వనియెదను బయ్యేరయుపీచు
తే॥ మఱియు నెవనికి నన్నియు వెఱచుచుండు నట్టిపరముఁడె యాకృష్ణుఁడా నరకునిఁ
ద్వత్ప్రార్థనంబున వధముజేసి యిటకు నేతెంచెనని శచీ! యెఱుఁగుమమ్మ!

క॥ అంతట నిర్జరకాంతుని కాంత రమాకాంతచరణకమలములకుఁ ద
త్కాంతయును మ్రొక్కి స్వీయనిశాంతమునకు నరిగె నిందసల్పికొని తనుఁ

ఉ॥ నిర్జరనాయకుండవల నీరజలోచను మ్రొక్కిసిబ్బితిన్
దుర్జయుఁడైన శార్ఙ్గిగని తుష్టి నిటుల్ బలుకాడె నాకు నీ
దుర్జన నాశయోగ్యపవి ద్రొటనుజిక్కుట సిగ్గుగలైనే?
నిర్జితవృత్ర! నేనరయ నీకనుజుండనుగానె మానుమా! ౧౦౦

తే॥ అంత శతమఖుఁడిట్లనె నఖిలలోకనాథ! యిపుడు తమ్ముఁడవని నాకుఁ జెప్ప
చుంటి వీవేడ? నేనేడ? యుల్లమందు బాగుగాఁజూడ నీవు తద్బ్రహ్మవుగద

సీ॥ ఎవనిచే జగము జనించునో యెవ్వనిచే నిది వృద్ధిని జెందుచుండు
నెవనిచే నిదిగిట్టు నెవనిలో నిదియుండు నెవ్వఁడీద్దానిలో నెసఁగుచుండు
నాదిమధ్యాలయంబులంటవో యెవనికి నెవనికిఁ గల్మషంబెదియు లేదొ
నామరూపగుణాదు లేమాత్రమెవనికి లేవొ యెవ్వఁ డఖిలదేవదేవుఁ
తే॥ డట్టి శాశ్వతుఁడవగు నీయగ్రమందు
నాకు నెట్టులసిబ్బితిసేకుఅగల
దయ్య! ముజ్జగములయొడయుఁడవగు నిను
గెలువఁగలఁడొక్కొ యన్యుఁడు కృష్ణఁగృష్ణ! ౧౦౨

క॥ తెలియఁదగిన వారలచేఁ దెలియఁగలవుగాని లాఁతి దిట్టలకిసుమేన్
దెలియవు గొప్పలగొప్పవు నలుసులలో నలుసువీ వనంతచరిత్రా ౧౦౩

క॥ అని నతులిడి యాసత్యను గనుఁగొనియెన్ మిన్నకుండెఁ గంజాక్షుం డం
త నగుచు గంభీరగళంబున నిట్టులఁబలికె నట్టి పురుహూతునితోన్ ౧౦౪

క॥ అప్పా! వేల్పులలోపల గొప్పవుగద! నేనొ నరులఁ గొండొకవాఁడన్
దప్పును జేసితి నీయెడఁ దప్పక మన్నింపవలయు దంభోళిధరా! ౧౦౫

మ॥ ఉచితస్థానమునుండి నీతరువు సత్కోర్తిన్ మహాప్రీతిచే
నుచితంబంచుఁ దలంచి వైరమున నుద్యోగించి కొంచండజ
ప్రచురేశాంసమందన్ ఘటించితి నిదే వజ్రంబు గొమ్మా! ద్విప
న్నిచయంబున్ దెగటార్చి సౌఖ్యములతో నీవెప్డు బొల్పారుమా! ౧౦౬

శా॥ ఆలీలన్ వచియింపగా వినిన యా సౌఖ్యం బిఁకేలుండదో ని
ష్ఠేలా! నన్ను భ్రమింపఁ జేసితి వొహో హా! కృష్ణా! జగత్పాలకా!
లీలామానుషవిగ్రహుండవయి హాళిన్ దుష్టనష్టంబులన్
గ్రాలన్ భక్తుల బ్రోవనుంటివి గదా! కారుణ్యపాథోనిధీ! ౧౦౭

ఉ॥ ఇత్తఱి ద్వారకాపురికి నీవిఁక నేఁగొనిపొమ్ము! మాధవా!
యెత్తఱి భూతలంబు త్యజియింతువొ యత్తఱి నుత్తరోత్తమం
బుత్తమమైన యాధరకె యోజ స్వయంబుఁ సేయఁ దెంచునో
సత్తమచిత్తవారిరుహషట్పద! ద్విట్పునఖండనప్రభా! ౧౦౮

ఆ॥ అనఁగఁ గృష్ణుఁడొప్పి యనుపుల గొనియూడ హరికి వజ్రమిచ్చి యాలితోడ
గరుడుపైని నెక్కి కదలి ద్వారావతీపట్టణంబుమొక్క పైనిఁ జేరి ౧౦౯

ఉ॥ పౌరులు సమ్మదమ్ముగన భార్యలు ప్రీతిని జూడ నేత్రకాం
ద్రారసిడాయ స్వీయము నవస్యము మాన్యము పాంచజన్యమున్
గేరుచు నూఁదుచున్ సౌరిడిఁ గ్రిందకివచ్చి సుపర్ణుడిగ్గి త
ద్భూరుహరాజ మల్ల సతిపుష్పవనంబున నుంచె నంతటన్ ౧౧౦

ఉ॥ ఆశ్రితపారిజాతమగు నాకమలాక్షుఁడు సత్యభామతో
విశ్రమ మేమి లేనటుఁ ద్రివిష్టపవాసిమిళిందపఙ్క్తిజా
లాశ్రయఘుంఘుమాఘుమఘుమాయితసుందరపారిజాత స
మ్మిశ్రవితర్దికాదులఁ దమిన్ సుఖమొందుచునుండె ధీనిధీ! ౧౧౧

తే॥ భూరమణ! మున్ను నరకుని కారనుండి చక్రి విడిన యష్టోత్తరశతసమధిక
షోడశసహస్రపార్థివకుమారకన్యక లలహరిఁ గాంచి కామించి చెలఁగుచుంట ౧౧౨

మ॥ వనజాతాయతలోచనుం డొకపరిన్ వైశాఖమాసంబునన్
గని దివ్యంబగు లగ్నమం దలసతీకాండంబుఁ జేపట్టి కో
ర్కిని జానందఱ కన్నిరూపముల వేర్వేరైన హర్మ్యంబులం
దున దైవారుచు నాడుఁ బాడు నగు సంతోషించు భోగించెడిన్ ౧౧౩

తే॥ ఈరహి నమోఘరీతుల శౌరి వారితోడ విహరించి యొక్కొక్క తోయజాక్షి
యందు నాత్మసములగు దశాత్మజులను గాంచె వజ్రనాభ యని పచించి మఱియు

వ॥ శ్రీకృష్ణుండు రుక్మిణితో హాస్యంబులాడుటయు, ననిరుద్ధవివాహంబును, బలదేవుండు రుక్మిని వధించుటయు, నుషాస్వప్నకథయుఁ, జిత్రలేఖ యనిరుద్ధుని శోణపురంబునకుఁ గొనిపోవుటయు, బాణాసురుం డనిరుద్ధుని నాగపాశబద్ధునిం జేయుటయు, బాణయాదవోమాపతి రమాపతి సంగ్రామంబును, శంకరునితోఁ బోరు శౌరిని జ్వరము సంస్తుతించుటయుఁ, జక్రపాణి, కృపాణంబున బాణాసురపాణిశ్రేణి నఱకుటయు, నిజభక్తులగు నా యసురుల సంరక్షణంబుకొఱకుఁ గపర్ది జనార్దనునిఁ

ప్రార్థించుటయు, నుపాప్రాప్తియు, నృగాఖ్యానంబును, బలరాముండు గోకులం బునకేతెంచుటయుఁ, దద్దర్శనం బొనరించిన గోపికలు మధురాలాపంబులాడుటయుఁ గాళిందీకర్షణంబును, గాశీరాజ పౌండ్రక పరిమార్పణంబును, గృతోద్ధిప్తియు, ద్వివిదవానరుని గాశిలోఁ జంపుటయు, హస్తినాపురంబందు బంధింపఁబడిన సాంబుని బలరాముండు పోరాడి విడిపించుకొనివచ్చుటయు, నారదుండు గృహస్థులకు హరి లీలలం జూపుటయు, వాసుదేవాహ్నికంబును, సభనున్న వెన్నుండు ధర్మరాజాహ్వానం బుద్ధవునకుం జెప్పి యాలోచించి తదభిప్రాయానుసారంబుగా యాదవోద్ధవ సహితుండై యింద్రప్రస్థపురంబునకుఁ జనుటయు, హరి గిరివ్రజపురంబునకేగి భీమసేనునిచే జరాసంధునిం బరిమార్పఁజేసి సకలరాజులు గొనియాడ సహదేవుసం బట్టాభిషిక్తుం గావించుటయు, మహాసభయం దగ్రపూజ గదాగ్రజునకుఁ దగవని చెప్పిన శిశుపాలుని గోపాలుండు దునుముటయు, ధర్మరాజాచరితకృష్ణార్చనంబును, దుర్యోధన గర్వభంగంబును, బ్రద్యుమ్న సాళ్వ లిపవదేడుదినంబులు మేడం బొనర్చుటయుఁ, బిమ్మట నమ్మధుసూదనుం డటకుఁ జని యవలీలగా నా సాళ్వదంతవక్త్రులం దెగటార్చుటయు, హస్తినాపురంబున యుధిష్ఠిరుండు కౌరవనిర్మిత దుర్ద్యూతంబున భార్యాభ్రాతృయుక్తంబుగా నోడుటయుఁ, బాండవులు కుంతిని విదురసదనంబున డించి గహనంబున కేగుటయు, ననంతరంబున దుర్యోధన రాజ్యపాలనానందానుభవంబులును, బాండుపుత్రవనవాసవార్తాశ్రవణోద్భూతపౌరదుఃఖంబును, శ్రీహరి యరణ్యసంచారపీడిత యుధిష్ఠిరాదుల నొకపరిఁ జని కని చింతించి, మధురోక్తులాడి యూఱడించి క్రమ్మఱ ద్వారకాపురంబున కేతెంచి యుగ్రసేన సుధర్మలోఁదద్వృత్తాంతంబంతయుఁ బ్రస్తావించుటయు నది విని యాదవు లాశ్చర్యదుఃఖంబులు గలుగ దురాశాపిశాచావేశులగు కౌరవులు దామొనరించిన యధర్మంబుననే నశింపఁగలరు. భగవంతుం డఖండపుణ్యాత్ములగు పాండవేయులకు దదధిక మహానందపదం బీయంగలండని యనుటయు, నటనుండి సాయంకాలంబునం దచ్యుతుం డాత్మమందిరంబున కేగుటయు, దేవకీదేవి, నమస్కరించిన నిజపుత్రుం గౌఁగిలించుకొని మజ్జనభోజనాశీర్వాదంబు లిడుటయు, నవ్వల నవ్వీరుడిలుతునయ్యతన మవ్వపుజవ్వనుల గృహంబులకేగి వారిచేఁ బూజితుండై శయనించుచు మహానందంబునం జెలంగుచుండుటయుఁ జెప్పి వెండియు నామునితల్లజుండు యదువల్లభున కిట్లనియె. ౧౧౫

—♦ నారదుండు ఉగ్రసేనునకు అశ్వమేధంబు జేయుమని చెప్పుట. ♦—

సీ॥ పింగసటాచ్ఛటా సంగుండు తుంబురుసహితుండు భాస్కరసన్నిభుండు
ధౌతపీతాంబరద్వయిశోభితుండును గాశ్మీరతిలకప్రకాశితుండు
పంచదశాబ్దభాస్వద్వయస్కుండు రంగవల్లీస్రగ్విరాజితుండు
వ్రజగోపికాగంధభాసుండు నిర్జరసంయమీయును లఘుశ్యాములుండు

తే॥ నైన నారదుఁడా రమారాజాని కథల పేరెత్తోడుతఁ బాడుచు పెక్కి సరాని
విష్టపంబులఁగని యొక్కవేళ నాచక్రకృష్ణలనుఁగాంచ ద్వారక కేఁగుదెంచె ౧౧౬

తే॥ అట్లు వచ్చెడి నారదు యాదవేశుఁడైన యుగ్రసేనుఁడు గని యాత్మ్రకర
పీఠమును డిగ్గి యెదురేగి వేడ్కఁ దోడితెచ్చి ఘనపీఠమిచ్చియు మెచ్చి పిదప

క॥ సదపద్మంబులఁగడిగిన యుదకముఁ దనతలను జల్లి కొంకరిచి ప్రాజల్
త్రిదశర్షి! మజ్జని ధనసదనామలు మీరు రాక సఫలంబయ్యెన్ ౧౧౮

క॥ నారద! విమలజ్ఞానవిశారద! కామాదిరహిత! సత్సేవ సఫలక్
మీరాక ముదావహ మీ రూజకరా రిటకుఁ బనియేదో సెలవిండీ! ౧౧౯

మ॥ అన నాలించి సురర్షి యిట్లనియె విఖ్యాతపక్షిధ్వజాసనమా!
వనజాతాయతపత్రనేత్రచరితవ్యాపారశుంభద్భవ
న్మనమాటన్ గృతిపంచు నేఁదలఁతు నా నారాయణుండున్ భవ
ఘ్నభక్తిన్ వశుఁడౌచు నిందు వసతిన్ గావించెఁ దాలాంకుతోన్. ౧౨౦

తే॥ నీ యశోలత పూర్తిగా నిఖిలజగము నకును బ్రాకఁగ నానుడి నలిననాభు
దయను రాజసూయంబు యథావిధి నొనరించితివి పూర్వ మీపురిన్ బృష్ణినాథ!

ఆ॥ పరమరాజసూయ వాజిమేధంబులు రెండుఁగూడ నట్టి శ్రీరమేశ
భక్తులకును జక్రవర్తులకుంనక్క లాతివారి కవి యలభ్యములుగ. ౧౨౨

క॥ ఈ రెంట రాజసూయము నీరలు గావించియుంటి రిట్టుల శ్రీమ
న్నారాయణోక్తిఁ బాండుకుమారాగ్రణి చేసె నది సమంజసఫక్కిన్. ౧౨౩

తే॥ కాని యీ ద్వాపరయుగాంతకాలమందు నశ్వమేధము భరతఖండాంతరమున
జనవిభుండొక్కఁడున్ గూడ సల్పఁడయ్యెఁ గారణంబేమొ తెలియదు క్ష్మాతలేంద్ర!

చ॥ నవమహిమం బనంత మది తన్మనురగోగురుబాలమాని నీ
భువనవినాశసంచరణభూతిమహాఘహరంబు దేవతా
భవన నదాదిపర్యటనభావితసత్ఫలదాయకంబు వే
దవిదధికస్తుతంబు శుభదంబును విష్ణుపదప్రదంబునున్ ౧౨౫

తే॥ అరయ నది సేయఁజాలని నరులకు హరి కరుణలేమియ కతముగాఁ గన్పడెడిని
గాన హరిముఖ్యభక్తుండవైననీవు సలుపుమా! యాదవేశ్వర! క్రతువరీతి.

ఉ॥ నావుడు సంతసించి యదునాథుఁడు తత్సవ మాచరింపఁగా
భావమునం దలంచుతఱిఁ బంకజనాభుఁడు రామయుక్తుఁడై
ఠీవిగ వచ్చుటం గని వడిన్ దనపీఠము డిగ్గి భక్తిఁ బూ
జావినుతుల్ బొనర్చి యొక చక్కనిగద్దె నొసంగి యిట్లనెన్. ౧౨౭

ఆ॥ దేవదేవ! వాసుదేవ! జగన్మయా! త్రిజగదీశ! కృష్ణ! దేవవంద్య!
యాదరమున నిపుడు నాదుపల్కులు వినఁ గోరుచుంటి నిన్ను శ్రీరమేశ! ౧౨౮

మ॥ కరుణాసాగర! నా కుమారుఁడగు తత్కంసుం డసంఖ్యాకబా
లుర నిర్హేతువుగా వధించెనుగదా లోభాత్ముఁడై పాపియై
మఱి యన్యాసురవర్యులన్ బనిపి డిమ్భశ్రేణిఁ జంపించె నీ
దురితంబే నరకంబునందు నతనిన్ ద్రోపాడెనో చెప్పవే! ౧౨౯

క॥ అంతకకింకరు లేయే గుంతలఁ బడ నెట్టి తిట్టి కొట్టిరొ యతనిన్
స్వాంతమునం దది దలఁచినయంతన బహుచింతగలుగు నరవిందాక్షా! ౧౩౦

క॥ తనయాచరితాంహస్సులు జనకుని వేధించుఁ దండ్రి సల్పిన యఘముల్
దనయుని బొందుచు నంతంబున నిరయమునందుఁ ద్రోసి పొగులఁగఁ జేయున్.

ఉ॥ కాన నుపాయ మేదియొ యొకండు మహోదయ నాకుఁ జెప్పుమా!
నే నిపు డీ సుధాశనమునిప్రభుఁ డర్భకవిప్రలోకయో
షానిధనప్రధానకలుషప్రశమప్రబలంబటంచు న
న్న్యనతురంగమేధమును నొత్తివచింపఁగ వింటి మాధవా! ౧౩౨

తే॥ అట్టి యశ్వమేధంబును నాచరింప భావమందుఁ బ్రస్తుతమున వాంఛగలిగె
గాని నీ యాజ్ఞయైనచో దాని జేతునని వచింపఁగవిని హరి యనుకొనె నిటు

—♦ కృష్ణుండు అశ్వమేధమును జేయ ఉగ్రసేనునిం బురికొల్పుట ♦—

మ॥ మును భూభారము నేనె చాలవఱకున్ బోకార్చితిన్ గాని యిం
కను నందందుననున్న భార మిపు డీ గంధర్వమేధంబుచే
త నశింపందగుఁ దద్విదూరధుని ఘూతంబందున న్నేనె నే
వ్వని నేతత్ప్రభృతిన్ వధింపనని బల్వగ్గించితిన్ గావునన్ ౧౩౪

క॥ భువనంబును గెలువగ యాదవులను మత్పుత్రపౌత్రతండమనిపి త
త్సవమును జేయించెదనని ప్రవిమలమతినెంచి నగుచుఁ బతి కిటుఁ బల్కెన్.

శా॥ ఆ కంసుండు బలుండు నీ సుతుఁడె నా హస్తంబునన్ జచ్చి యా
వైకుంఠంబున మత్స్వరూప మమరన్ భాసిల్లుచుండెన్ మదీ
యాకారంబును గాంచుచీవుసయితం బంహస్సుసర్వంబునున్
బోకాడన్ బొనరించియుంటివి బళీ! భూపాలచూడామణీ! ౧౩౬

తే॥ అట్టులైనను నీ వట్టి యశ్వమేధ మాచరింపుము! దానిచే యశము మిగుల
నుర్వరను గల్గునని చెప్ప నుగ్రసేనుఁ డలరి యీవిధంబున శౌరి నడుగఁదొడఁగె.

క॥ యజ్ఞస్వరూప! హరి! సర్వజ్ఞుండవగు నీవు కరుణం బ్రాపించుగ నా
యజ్ఞము గాంగల విధముఁ దద్విష్ణువిధులఁ దెలియఁజేయ నర్హింతుఁజుమీ! ౧౩౮

క॥ అనవుడు హరి నాపతితో డ్డనె నీ నారదమహర్షి నడుగుము! యాగం
బనుసమయవిధిఁ జెప్పును నన విని వేడ్కఁ దా మునిని తగను బ్రార్థించె నిటుల్.

ఆ॥ అందు నిష్ఠతోడ నడుపంగ వలయు నియమంబు లశ్వమేధమునకు దక్షిణయును
నెంత? యేవిధముగ నెట్లు చేయవలయు? మునివరేణ్య! పలుకుమయ్య! ౧౪౦

—* నారదుం డుగ్రసేనునకు యజ్ఞవిధానంబు దెల్పుట. *—

వ॥ అంత బృందారకమునీంద్రుం డానందమందహాసంబులతో నా నందనందన సుందరవదనారవిందం బాలోకించుచు భూపాలా! యెందేనిఁ జంద్రవర్ణంబును, శ్యామకర్ణంబును, రక్తాస్యంబును, సుశోభనముఖంబును, పీతపుచ్ఛంబును, సర్వాంగసుందరంబును గల యశ్వంబు యోగ్యంబు. తద్దివ్యాశ్వంబు బుద్ధిమంతులు సేవకులతోఁ గూడిన స్నానాద్యాదులను, యాగవేళ రుండగు సుగ్రసేనునిచే నిడువంబడిన యీ తురంగంబును బలుండగువాఁడు పట్టుకొనుఁగాక యని సర్వరాజులను సంబోధించి లిఖింపఁబడిన పైఁడిపతకంబును గట్టి యా వచనంబులే గంభీరంబుగాఁ బలికి చైత్రశుద్ధ పూర్ణిమాదినంబునం దా యశ్వంబు విడిపింపందగు. అద్దాని వెంటఁ గాపాడుచుఁ గొందఱు మహావీరులు లోక యుద్ధంబుదాఁక సంచరింపవలయు. అవ్వారలా యయువును బట్టుకొనిన మహాబలుని నిర్జించి యది విడిపించుకొని రావలయు. తదశ్వంబు జని దిగ్విజయం బొనర్చి క్రమ్మఱ నిజపురికిఁ జేరుఁజుఁడు యజమానుండు దీక్షాపరాయణుండై ధైర్యంబుతో నుండవలెను. తద్ఘోటకం బెంతేదు మాత్రప్రదేశంబులను విడుచునో యందందు ద్విజబృందముతోఁ గూడి విధిచోదితంబుగా హవనం బొనరించి సహస్ర గోదానంబులం జేయుందగు. తద్యజ్ఞారంభమందే వేదశాస్త్రపారంగతులను, తపస్వులును, కులీనులును నగు వింశతిసహస్రబ్రాహ్మణప్రవరులను నియమింపవలయు. సహస్రాశ్వంబులును, శతగజంబులును, ద్విశత శతాంగంబులును, గోసహస్రంబును, వింశతిభారస్వర్ణంబును, దశాష్టాంతరంబులందు నొక్కొక్క ద్విజునకు దక్షిణగా సమర్పింపవలెను. ఇంకఁ గర్త యసిపత్రనామకవ్రతం బవలంబించి బ్రహ్మచర్యంబు బూని పత్నీసహితంబుగా నేక శయ్యయందే పరుండందగు. ఇది యొక సంవత్సరపర్యంతం బొనర్పందగు. ఈ మఖంబునందు దీన పంగ్వంధులకు నందఱకు నన్నంబుఁ బుష్కలంబుగా నిడందగు. ఈ యసిపత్రవ్రతసహితంబగు క్రతువు, కులదీపక బహుపుత్రఫలం బొసఁగు. కాని యీ ప్రపంచంబునం బుష్పబాణుని జయించినవాఁ డాభీష్ముండు తప్ప నన్యుండు గానరాఁడు. కాన నట్టికాముని గెలుచు శక్తి నీకుఁ గలదేని వెంటనే మహర్షివరేణ్యుండగు నా గర్గుని సమాహ్వానించి యజ్ఞారంభం బొనర్పుమని వివేకరించి పలుక నా యిలావిభుం డాలించి సంతోషాశ్చర్యంబులు గలుగఁ బ్రసన్నవదనంబుతోఁ దిరిగి యా దేవముని కిట్లనియె. ౧౪౧

— శౌరినారదులు యజ్ఞాశ్వం బన్వేషించుట. —

తే॥ విబుధ మౌనివర్య! వేగ నామందుర కరిగి యందు సవసమర్వాహరిని
గాంచిరం డనంగఁ గమలాసనసుతుండు కృష్ణయుక్తుఁడగుచు నేగి యటకుఁ

సీ॥ శ్యామ ధూమ్రాసిత సరసిజరుచిమనోహర ఘోటకము లొక్కసరణియందు
గింశుక సుమజలక్షీరకుంకుమహరిద్రాభహయములొక్క యాళియందు
శుకహరిత్తామ్రస్ఫటికకుసుంభ విచిత్ర చిత్రవాహము లొక్కశ్రేణియందు
సిందూరవహ్ని పూర్ణేందు బాలేంద్ర గోపాభహరులొక్క కోణమందు
తే॥ నింకనీదృశ తురగంబులెన్నొ యెల్లదెసలనుండుటఁ జక్కఁగాఁ దిరిగిచూచి
యబ్బురముబొంది యుగ్రసేనాంతికమున కేగుదెంచి పల్కెడి నీవిధమున

ఉ॥ కంటినిగంటఁ బుష్టిజనకమ్రితురంగకదంబకంబు లే
దంటిని దత్సమాశ్వతతి యాదివిజావిజగంబులందు నేఁ
గంటిని జిత్రవర్ణములుగాని మఖార్హతురంగమంబు లే
దంటిని నీదు లాయమున యాదవనాయక! సత్కృతాత్మకా! ౧౪౪

క॥ అనవిని యదువిభుఁ డింక సవనమెటుకాగలదటంచుఁ బల్మఱు భావం
బున దుఃఖించుట గని హరి ఘనగంభీరోక్తిఁబలుకఁ గడగెను నిట్టుల్ ౧౪౫

క॥ అయ్యా! దీనత మానుమ! యియ్యెడ నాపలుకు వినుము! యీవు ముదముతోఁ
జయ్యన నామందురఁజని యయ్యశ్వము శ్యామకర్ణమరయుము! కొనుమా!

క॥ ఆరహి నారదసంయుత సారసనేత్రుండుచెప్పఁ జక్కఁగవిని యా
భూరమణుండును దద్ధరిచారుతర తురంగశాలఁజని యచ్చోటన్ ౧౪౭

తే॥ నారదేరిత శుభలక్షణపరికాశితాశ్వముల వేలకొలఁదిని నమరియుంటఁ
గాంచి సంతోషచిత్రముల్ గలుగుచుండ వచ్చి శ్రీహరికిన్ మ్రొక్కి పలికెనిట్లు

ఉ॥ ఓ దివిజేంద్రవంద్య! భవదుత్తమమందుర యజ్ఞవాజులన్
మోదముతోడఁగంటి నిను బుద్ధిని నమ్మినవారి కేదిగా
దీ దినమందు నీకరుణ నెల్లవెతల్విడి యాధ్రువుండు ప్ర
హ్లాదుఁ డెటుల్ మనోరథములందిరొ తద్విధిఁగోర్కిఁ బొందితిన్ ౧౪౯

తే॥ అవల హరి పలికిట్లనె నబ్జనిభము లసిత కర్ణాంచితములునైనట్టి హయము
లంచునుండి యొండశ్వముబొంది సవముసల్పుమా నాయనుమతితో జనవరేణ్య!

తే॥ అంతటన్ భూమికాంతుండు సంతసించి క్రతువొనర్తునని యన నారదునిగూడి
సభకు జనెనంతఁ దుంబురుసహిత నారదమునివర్యుఁ డా శౌరికద్దానిఁజెప్పి ౧౫౧

ఆ॥ ఉగ్రసేనపతిని నొయ్యన దీవించి స్వస్థలమగు బ్రహ్మసదనమునకు
సేగె నంతఁ బతియు నిరువురు దూతలఁ బంపె యదుకులసభ నన్నుఁ బిలువ ౧౫౨

—॰ గర్గుం డాహ్వానితుండై యుగ్రసేనునకుఁ జనుట. ॰—

మ॥ అనువక వారలువచ్చి నన్నుఁ గని సాష్టాంగంబుగా మ్రొక్కి యి
ట్లనిరో గర్గమునీంద్ర! విస్మయముతో నా ద్వారకాపట్టణం
బునఁ గృష్ణాజ్ఞను నుగ్రసేనుఁడు సవంబుల్ జేయఁగా నెంచి తో
డ్తె నినుఁ దోడ్కొనిరండటంచుఁ బనిపెన్ ధాత్రీసుకీర్తాసనా! ౧౫౩

తే॥ కాన మీరును శిష్యుండును ధీనిధియగు నుగ్రసేనుని యాహ్వానము నొప్పి యటకు
వచ్చి తత్సవోత్సవమును బళిర యనఁగ సల్పఁజేయుము గురువరా! జానుమాని

ఆ॥ అవల వారినుడుల నాలించి తాల్మిని సంతరంగమందు యజ్ఞకౌతు
కంబుగలుగ నేను గర్గాచలమునుండి వారితోడఁ గూడి బయలుదేరి ౧౫౪

వ॥ క్రమక్రమంబుగా శ్వేతపీతనీలరక్తకమలకల్హారాదిశోభితంబులును, హంసపారావతప్రభృతి నానాపక్షికూజితకృష్ణధ్వని మనోహరంబులును, మందార దేవదారుజంబీరాది వివిధతరువిభ్రాజమానంబులును, దివ్యజలసంపూర్ణవాపీకూపతటాకాది భాసురంబులును, మల్లికామాలతీలతాదిమనోజ్ఞంబులును నగు మహావనోపవనంబులతోడను, దేవవృక్షమయంబగు రైవతనగంబుతోడను, గోమతీనదీరత్నాకర పరిఖలతోడను, స్వర్ణరజతతామ్రదుర్గత్రయముతోడను, సంతోషజనకస్వర్ణమయరమ్యహర్మ్యంబులతోడను, దివ్యపతాకాకర్బుర కలశంబులతోడను, మహోన్నత శివాలయ కేశవాలయములతోడను, యాదవ మహాశూరులతోడను, రథ్యామందురా దంతిశాలా గోశాలాదిశాలలతోడను, హాటకాదిహట్టలతోడను, శృంగాటక శతకంబుతోడను, శ్రీకృష్ణపరమాత్ముని ధవళప్రాసాదంబులతోడను, షోడశసహస్ర దివ్యభవనంబులతోడను, సర్వశస్త్రాస్త్రధరులగు రక్షకభటులతోడను విరాజిల్లెడి యానర్తదేశాంతర్గత ద్వారకానగరంబున కానందంబుతోఁ జేరి యందలి చిత్రవిచిత్రవిషయంబులను, రామకృష్ణ నామకథా సంకీర్తనంబును నేత్రపర్వముగాఁ గర్ణపేయముగాఁ గనుచు వినుచు పాదుకారూఢుండనగు నేను తులసీమాలతోఁ గృష్ణుని జపించుచు సుధర్మయనెడి తన్మహాసభ కేగినంత ౧౫౫

తే॥ ఉగ్రసేనుండు గనుఁగొని యుల్లమందు నధికముద మొంది యేఁబదియారుకోట్ల
యాదవులఁగూడి శక్రసింహాసనంబు నుండి డిగ్గి యెదురువచ్చి దండమునిడి

తే॥ చిత్రసింహాసనమున నాసీను జేసి పాదములఁగడ్గి జలమును స్వశిరమువయిఁ
జల్లికొనియుఁ బూజించి హస్తములమోడ్చి యిట్టులన్ భక్తితో వచియింపఁగడఁగె

క॥ గురువర! గర్గమునీశ్వర! సురమునిచే నశ్వమేధ శుభకార్యం బి
త్తఱిని మహాపుణ్యదమని గరమరుదుగ వింటి దానిఁ గావింతుఁజుమీ! ౧౫౬

క॥ కావున నిఁక మీ యానతిగావలె బుధులెవరి పాదకమలస్సేవా సం
సేవను గోర్కులఁ బొందిరొ యా విశ్వవిభుండు కృష్ణుఁ డలరారె నిటల్ ౧౬౦

వ॥ అంత నేను సంతోషించి భూపా! నీవు లెస్సగా నాలోచించి చేయఁదల
చిన యశ్వమేధంబుచే నీకీర్తి ముజ్జగంబులందును వ్యాపింపఁగలదు. కాని యజ్ఞ
తురంగరక్షణార్థంబై యెవరిని నియోగించెదవు? ప్రపంచమున శత్రువు లనేకులుం
దురు. ఒక వత్సరముదనుక సిపత్రివ్రతం బవలంబించి నీవుండవలయు. అట్లయిన నా
యశ్వమేధంబు చక్కగా జరుగగలదు. మున్ను రాజసూయయాగంబున యజ్ఞ
హయ సంరక్షణార్థంబై నియోగింపఁబడిన ప్రద్యుమ్నునిచేఁ బ్రపంచము జయింపంబడె
తిరిగి యతని నియోగింపనెంచితివా? యని యడుగ నుగ్రసేనుండు చింతాక్రాంత
స్వాంతుండై యందున్న సకలదుఃఖహారుండగు హరిని గనుగొన భగవంతుం డాలో
కించి తాంబూల పీటికం గేలందాలిచి నగుమొగముతో సభామధ్యభాగంబున నిలిచి
యిట్లనియె.

## అనిరుద్ధుండు అశ్వపరిపాలనంబు నంగీకరించుట

ఉ॥ యాదవశూరులార! బలులార! రణాంగణ ధీరులార! యీ
యాదవనాథుమ్రోలఁ బలుకాడెడి నానుడు లాలకింపుఁడీ!
యేదశవాయియైన ధర నీహయమున్ గొనకుండఁజేయు వాఁ
డీ దెస కేగుఁదెంచి యిపుఁడీ ఘనవీటికఁగొంచు నిల్చుతన్ ౧౬౧

క॥ అనవుఁడు యాదవు లందఱువిని నిజపృథు పౌరుషంబు విడి యన్యోన్యా
ననములఁ గనుగొను చద్దానిని గొనకుండిరిగదా! యనింద్యచరిత్రా! ౧౬౨

తే॥ ఇటులఁ దాంబూలవీటిక ఘటికవఱకు శుకము తామరసమునఁ గూర్చుండినట్టు
లా రమేశుని సుందరహస్తమునందు గనులపండువఁజేయుచుఁ దనరె నవల ౧౬౩

ఉ॥ చాపధరాగ్రగణ్యుఁడును శంబరవైరిజుఁడైన సుందరో
షాపతివచ్చి తత్పతికి శౌరికిమ్రొక్కి విడెంబుగొంచు నో
శ్రీపతి! శ్యామకర్ణహయశేఖరపాలన మేనొనర్తు న
న్నాపనియందు నేర్పరచుమా యనుమానము మానుమా సుమా! ౧౬౪

చ॥ కమలదళాక్ష! యజ్ఞతురగంబును రక్షనుజేయకున్నచోఁ
దమి నృపవైశ్యపాపిజులు ధర్మపథంబునుదప్పి బ్రాహ్మణీ
గమనముజేసి పొందునరకంబులు, ముందొక విప్రునొజ్జగా
నమరిచి యంతఁగొల్వని నరాధము పాపము నాకుఁగలుతన్ ౧౬౫

చ॥ అని శపథంబు లాడ విని యాదవపుంగవు లెంతొ బొంది తా
వనరుహలోచనుండు నిజపౌత్రుని నెమ్మిని కౌఁగిలించి యో
మనుమఁడ! యొక్క హయము మాత్రమె నేర్పున నీవు వాని ర
క్షను నొనరించి యంతటఁ గ్రమ్మఱి యీపురి కేఁగుదెంచుమా! ౧౬౭

క॥ అని యాజ్ఞాపించెడి తఱి వనజాసనుఁ డంచనెక్కి భవనహితంబై
చనె మఱి దిక్పాలకులును జని రా హరి యజ్ఞసంబు సల్పఁగ నటుకన్ ౧౬౮

క॥ మఱి విశ్వేదేవులు భాస్కరవసురుద్రాశ్వినులు పితృపము కిం
న్నర గంధర్వాదిగణము లరిగెను దత్కృష్ణ దర్శనార్థం బటకున్ ౧౬౯

క॥ తదుపరి మునివర్యులు బహుముదమున నా దేవుఁ జూడఁ బోయి రవల వ
ద్యదువిభుయుతహరి, వచ్చిన త్రిదశేంద్రాదుల బహూకరించెను రివిన్ ౧౭౦

తే॥ అటుల బ్రహ్మాదినిర్జరు లబ్జనేత్రు డాదరంబున నొసఁగిన యాసనములఁ
గూరుచుండిరవల హరి ప్రేరితుఁడయి బ్రహ్మ హాలియుత శౌరికిఁ బలికె నిట్లు

ఉ॥ శ్రీలలనామనోహర! యశేషజగన్మయ! నీదు పౌత్రుఁడో
బాలుఁడు శ్యామకర్ణపరిపాలనమో బహుకష్టసాధ్యమై
క్రాలెడిఁ గానఁ దత్కృతినిఁ గామునినో బలినో ఘటింపఁగాఁ
బోలును నట్లుకాని యెడఁ బూని తదశ్వము నీవె ప్రోవుమా! ౧౭౨

తే॥ అంతియే కాని యాకుఱ్ఱ నంపవలదు నావుఁడు రమేశుఁ డిట్లనె నాదుమాట
వినక హఠముగా వాఁడేఁగుఁ గనుక నీవె వానివరిఁ జేరి మాన్పుమో బ్రహ్మదేవ!

ఉ॥ అంతట ధాత కార్ష్ణి జని నాపుటకై ద్విజరాజఁ గూడి త
త్ప్రాంతము జేరె నప్పు డల బ్రహ్మకళానిధు లిర్వురాయుషా
కాంతుని లోన లీనతనుఁ గాంచిరి దానిఁ జూచి తత్సభా
త్యంతలసచ్ఛివేంద్రముఖ యాదవమానులు నొంది రబ్రమున్ ౧౭౪

ఆ॥ అటుల వింతగన్న యవ్వారు నీజనకుండగు ననిరుద్ధు దండిగఁ బరి
పూర్ణతముగ నెంచి వర్ణనంబులఁ జేసి వందనంబు లిడిరి వజ్రనాభ! ౧౭౫

తే॥ అంత నుగ్రసేనుఁడు తత్సభాంగణంబునుండి లేచి మనంబుతో దండములను
హరికి నిడి యజ్ఞకౌతుకపరివృతుఁడయి ఘనమణీమనోజ్ఞశుద్ధాంతమునకుఁ జనియె

చ॥ చని యటు రాజసత్తముఁడు శక్రమహాసదనోపమావరో
ధనగతదివ్యతల్పమున దాసులు వెల్లని చామరంబులన్
గొని విసరన్ శచీవిధిగఁ గొప్పగ నొప్పుచునుండు స్వీయ సా
ధ్విని రుచిరాననన్ రుచిమతిన్ గనులారఁగఁ గాంచె భూవరా! ౧౭౭

తే॥ అవల నాయమ గనిలేచి యదువిభుఁడగు నాత్మవల్లభుఁ జక్కఁగా నాదరించి
యతఁడు తచ్ఛయ్యఁగూర్చుండి సతికి నగుచు సభ్రగంభీరగళమున ననియెనిట్లు

## ——♦ ఉగ్రసేనుండు తనభార్యతో నశ్వమేధమును గూర్చి చెప్పుట. ♦——

క॥ చెలిరో! నరునకు ముజ్జగముల నేకృతిచే యశంబుపొందునో యెది వాం
ఛలనిడు నల హరిమేధము నలఘువిధిని జేతు నిపుడు హరి యనుమతితో ౧౭౯

చ॥ అనవుఁడు పుత్రహీనయగు నా లలనామణి యొక్కసారిఁ ద
త్తనయుల నెల్లరం దలఁచి తద్వ్యసనవ్యధితాత్మయౌచు ని
ట్లనియెను ప్రాణనాయక! గతాత్మజనై నటువంటి నాకు నీ
ఘనసురనుత్యసంపద సుఖంబుగనుండుట లేదు కొంచెమేన్ ౧౮౦

క॥ ఈయశ్వమేధ మహిమంబా యాత్మజ దివ్యలాభమబ్బెడిచో! నా
రా! యన వే వేచేయుమ! హాయియు నాకప్పుడబ్బు నధిపా! యనఁగన్ ౧౮౧

ఉ॥ తద్దరిభక్తుఁ డాత్మవనితాగతి గన్గొని ఖిన్నబుద్ధియై
శ్రద్ధకు శ్రాద్ధదేవ మనుసత్తముఁ డాడినయట్టు లిట్లనెన్
వృద్ధుఁడ వృద్ధవీవు మనకెట్లిఁకఁ బుత్రుఁడు పుట్టుఁగావునన్
దద్ధరి శ్రద్ధతోఁ గొలిచి ధన్యతఁబొందుమ సుందరీమణీ! ౧౮౨

ఉ॥ సూనులు బంధనప్రదులు శోకదులౌదురు గాని సౌఖ్యమున్
బూని లవంబుఁగూడ నిడఁబోలరు నిక్కమునుమ్మి! యున్న సం
తానమె నాశమయ్యెనుగదా యికఁబుట్టుటయో హుళక్కి యో
మానిని! ముక్తిదుండయిన మాధవుగొల్వుమ! చింతమానుమా! ౧౮౩

మ॥ అని విజ్ఞానదవాక్యముల్ పలుక నా యజ్ఞాక్షియాలించి యి
ట్లనె నేతత్సవనప్రతాపమున సర్వాభీష్టముల్ వేగ నా
నని యిష్టీవు వచించియుంటివిగదా! యద్దాననేఁ బుత్రులన్
గని వాంఛించుచునుంటిఁగాన దయ నాకాంక్షన్ బతీ! తీర్పవే ౧౮౪

చ॥ మృతులయినట్టి పుత్రకుల నెట్టులఁగాంచెదవందు వేమొ వి
శ్రుతమగు నీ మదుక్తివిను శూరవరా! మును కృష్ణుఁడొజ్జకున్
మృతుఁడగు తత్సుతున్ గొని తమిన్ గురుదక్షిణ నీయఁడొక్కొ! యా
వితమునఁ జన్న నా సుతుల వెన్నుఁడు నూపఁడె నీవు గోరినన్ ౧౮౫

ఆ॥ అంత నుగ్రసేనుఁ డబ్జాక్షు నన్నను బిలిచి భార్యతోడ నలఘుపూజ
మాకుఁ జేసి తనదు మానసంబుననున్న భావమంత దెలిపె వజ్రనాభ! ౧౮౬

తే॥ అత్తరుణమున శౌరి నాయాశయంబు గొనుచు నింద్రుఁడు పేంద్రున కనిసమాద్రి
నుగ్రసేనున కిటుపల్కె నుర్వరేశ! చింతమానుమ! పొందుమా! సంతసంబు

ఉ॥ ఆజిని నీల్గినట్టి ఘనదాత్మజులందఱు మంచిరూపమున్
దేజము నొప్ప స్వర్గమునఁ దేజిలుచుండిరి దుఃఖమేలకో!
వాజిసవావసానమున వారలఁ జూపెద ముందు ధీరతన్
దేజున నీ మహాకృతిని దివ్యముగా నొనరింపుమో ప్రభూ! ౧౮౮

చ॥ పదపడి భూవరుండలరి భార్యఁ దమ్ముల నూఱడించి స
మ్మదమునఁ దన్మహాసభకు మక్కువ లేశయుతంబుగాఁ జనన్
ద్రిదశులు యాదవుల్ భటులు ధీరులు రాజులు మంత్రులందఱున్
ముదమున లేచి హస్తముల మోడ్చి రుపాహృదయేశ్వరాత్మజా! ౧౮౯

తే॥ ఆ బృహచ్ఛ్రీవుతపము నేమనఁగవచ్చు? నింతయని వర్ణనంబును నేను చేయఁ
గలనె! తత్ప్రతికజశేవక్రతు భుగింద్ర ముసలి కృష్ణాదులందఱు మ్రొక్కుచుండ్రు

ఉ॥ అంతట నుగ్రసేనవిభుఁ డా యమరాదులఁ జూచి మ్రొక్కి శ్రీ
క్రాంతమతిన్ సుధర్మఁగల గద్దియనెక్కఁగఁ గొంకె నంత శ్రీ
కాంతుఁడు గాంచి స్వీయకరకంజముతో నిజభక్తు వానిఁ ద
త్కాంతిమదింద్రపీఠమునఁ దాల్మి వసింపఁగ జేసెనో సుధీ! ౧౯౧

## ఉగ్రసేనుండు ఋత్విక్కులను వరించి యజ్ఞారంభమునకు గడంగుట.

వ॥ అనంతరంబునఁ దదచ్యుతప్రేరణంబున యదువిభుండు సభాస్థితమునివరులకు నమస్కరించి ప్రసన్నచిత్తంబుతోఁ బరాశరుని, వ్యాసుని, దేవలుని, చ్యవనుని, నసితునిని, శతానందుని, గాలవుని, యాజ్ఞవల్క్యుని, గురువును, నసురగురువును, నగస్త్యుని, వామదేవుని, మైత్రేయుని, నత్రిని, దత్తాత్రేయుని, విశ్వామిత్రుని, లోమశుని, నన్నుఁగ్రితువును, జైమినిని, వైశంపాయనుని, పైలుని, సుమంతుని, గణ్వుని, భృగువును, పరశురాముని, నకృతవ్రణుని, మధుచ్ఛందుని, వీతిహోత్రుని, గవవుని, ధౌమ్యుని, నాసురిని, జాబాలిని, వీరసేనుని, పులస్త్యుని, పులహుని, దుర్వాసుని, మరీచిని, నేకతుని, ద్వితుని, త్రితుని, నంగిరుని, నారదుని, పర్వతుని, గపిలుని, జాతూకర్ణిని, సుతథ్యుని, సంవర్తుని, ఋష్యశృంగుని, శాండిల్యుని, బాభ్రవ్యపాకుని, గహ్వాడుని, సుపతుని, మనుని, గచుని, స్థూలశిరుని, స్థూలాక్షుని, ప్రతిమర్దనుని, పకదాల్భ్యుని, కౌండిన్యుని, రైభ్యుని, ద్రోణునిఁ, గృపునిఁ, ప్రకటాక్షుని, నవక్రీతుని, వసుధన్వుని, మిత్రభువుని, నపాంతరతముని, మార్కండేయుని, జమదగ్నినిఁ, గశ్యపుని, భరద్వాజుని, గౌతముని, వసిష్ఠుని, పతంజలిని, పాణినిని, వాల్మీకుని, మఱియు నితర మహామునులను ఋత్విజులనుగా వరించి పూజించి తదాశీర్వాదంబు గైకొని సవనసంభారములను సిద్ధపరచుకొని యుండె. బ్రాహ్మణవర్యులను గనకలాంగలంబులతోఁ బిండారక క్షేత్రంబు దున్ని విధివిధానంబుగా నా రాజవర్యుని దీక్షాపరుం జేసి యందుఁ జతుర్యోజనపరిమితప్రదేశంబును, యజ్ఞార్థంబై

కైకొని చక్కఁబరచి దివ్యమండపంబులను యోనిమేఖలాయుక్తమధ్యకుండంబును నేర్పరచిరి. మఱియు నందు యదువిభుండు మనుపదిష్టమార్గంబున స్వర్ణమణిపతాకాదిశోభితంబగు సభామండపంబు నొండు నిర్మించె. ఆవల ఋత్విక్కు లాకుండంబున వైశ్వానరుని యథావిధిగా భూపతిచేఁ బ్రతిష్ఠింపఁజేసిరి. పిమ్మట శ్రీకృష్ణుండా కార్యక్రమంబు గాంచి యలరి యలరువిలుతుఁడగు తన కొమరునిం బిలిచి ప్రద్యుమ్నా! వేవేగ మన యశ్వశాలకు శస్త్రధరులతోఁడఁగూడి పోయి యజ్ఞార్హంబగు దివ్యాశ్వం బొండు తోడ్కొనిరమ్మని యాజ్ఞాపింప నతండు భాను, సాంబాది వీరసహితుండుగా లాయమున కేగి శ్యామకర్ణశోభితంబులును, సర్వాంగసుందరంబులును, స్వర్ణార్గళ నిబద్ధంబులును, నగు నశ్వంబులను వేలకొలఁదిగాఁ గాంచి సర్వోత్తమంబగు నొకదాని నిజహస్తంబున విడిచె. అంత ౧౯౨

సీ॥ రత్నప్రభాసమరక్తముఖంబుతోడ స్వర్ణాభపీతపుచ్ఛంబుతోడ
నతిశయ సుందరశ్యామకర్ణంబుతో మౌక్తికఫలమంజుమాలతోడ
నమృతాంశు సామ్యసితాతపత్రంబుతో రమ్యంబులగు చామరములతోడ
సౌరభయుత పుష్పహారసంచయముతో నవ్యసర్వాభరణములతోడ

తే॥ మఱియు దివ్యవర్ణనముతోఁ బరగి నాల్గు
ప్రక్కలను గృష్ణసుతు లితరప్రభువులు
సురలు హరిచుట్టుదగి కొల్చునరణిఁ గొలువ
యజ్ఞశాలకు నా హయం బరుగుదెంచె. ౧౯౩

తే॥ అటుల గిట్టల సవభూమినదుము చరుగుదెంచిన మనోజ్ఞతురగంబు గాంచి యాదవేశుఁడలరి యోగురువర్య! యీరు వేగ యజ్ఞకృతి మొదలిడుఁడంచు నంపె నన్ను

ఆ॥ అవల నేనుపోయి యట్టి పిండారకపుణ్యభూమిఁ జైత్రపూర్ణిమాది
నమునఁ బతిని దదుగ్రచిమతీయుతంబుగా గూరుచుండఁబెట్టి కొంకు లేక ౧౯౪

తే॥ దివ్యమృగచర్మనిడి యజ్ఞదీక్ష నిడితిఁ బదపడి నసిపత్రాహ్వయవ్రతము నాయనుమతి నా యుగ్రసేనుండు విమలబుద్ధిఁ బూని చక్కఁగాఁ జేసె నో భూవరేణ్యా!

క॥ గురుఁడఁబురోధసుఁడను దద్ధరణీంద్రుని కేనె యగుటఁ దద్ద్విజులకు నం
దఱ కాచార్యుఁడ నైతిని జరుగఁదొడఁగెఁ బనులు నాదు సమ్మతితోడన్.

క॥ ఆవల నచ్చటి విప్రులు శ్రీవిభు ననుమతిని శ్రుతులఁజెప్పుచు సరిగా
శ్రీవిఘ్నేశముఖాఖిల దేవతలకుఁ బూజఁజేసి తెచ్చె హయంబున్. ౧౯౮

క॥ వరచందనపుష్పాక్షత పరమసుధాకుండలాదివస్తుతతులతోఁ
గరముగఁ బూజించియుఁ గప్పురహారతి నొసఁగి రంత భూభుజవర్యా! ౧౯౯

తే॥ ఆ ప్రభువు దక్షిణగ నాకు నాదియందు నొక్కలక్ష తురంగంబు లొక్కవేయి
కరులు రెండువేలరథముల్ సురభిలక్ష నూరుబారువలైన బంగారొసంగె.

తే॥ మఱి నిమంత్రితబ్రాహ్మణులకు సురమహర్షి
యనిన యటు దక్షిణలనిచ్చి యవల నొక్క
యరద మొకకరి నొకయావు హాటక మొక
భారమిడి వచ్చిన యొకొక్క బ్రాహ్మణునకు　　౨౦౧

—♦ యజ్ఞాశ్వంబును బూజించి విడుచుట. ♦—

క॥ వినతులఁ బొనరిచి యొక కాంచనసుందరపత్ర మల్లన స్తిలలాటం
బునఁగట్టెను నిట్టుల నందునవ్రాసితి నేను సభయదువరులు గనగా॥　　౨౦౨

సీ॥ చంద్రవంశజ యదుసంతానసాగరపూర్ణచంద్రుండయి పొల్చు నెవ్వఁ
డింద్రాదిదేవతలెల్ల నేధీరుని యిచ్చను గనుచు జరించుచుండు
రెవ్వాని భక్తిచేఁ గృష్ణపరాత్మయు లొంగి వాసటగాఁ జెలఁగుచుండు
నెవ్వఁడు రాజరాజెవ్వఁడు దారుఁడో యెవఁడు స్మరాభుఁడో యెవఁడు గుణియొ
తే॥ యట్టి యుగ్రసేనుండిప్డు ఁడచ్యుతాజ్ఞ నశ్వమేధంబుఁ జేయఁగా నాత్మ నెంచి
స్వకయశంబును గోరి యీవాజివరము జగతివిడిచెను సర్వరాజన్యులార!

చ॥ వృకదనుజాంతకుండును ద్రివిక్రమపౌత్రుఁ డవక్రవిక్రమ
ప్రకటితకీర్తిభాసురుఁడు ప్రాజ్ఞుఁడునౌ ననిరుద్ధుఁడిప్డు ఘో
టకవరరక్షణార్థము గటాగులఁదూఁపుల విండ్లఁదాల్చి ర
థ్యకరిశతాంగయోధసహితంబుగ వచ్చుచునుండె వెంబడిన్　　౨౦౪

క॥ శూరమ్మన్యులు విభులిది పౌరుషమునఁ బట్టుకొనఁగవచ్చు నపుడు మా
వీరుఁడు నని యవ్వారినిఁ బోరునఁ బ్రహరించి దాసిఁబొందుర్ ద్రుటిలోన్

ఆ॥ అట్టి శక్తిలేనియధిపులు మా యనిరుద్ధు పాదములను రూఢి వ్రాలుఁ
డంచు వ్రాసియుంటి నదివిని శంఖముల్ యాదవప్రధాను లూఁదిరధిప!

చ॥ మఱి నరదేవదుందుభులు మర్దల గోముఖకాంస్యతాలముల్
మొరసెను మంగళధ్వనులు బూర్తిగనయ్యెను రామకృష్ణ స
చ్చరితముఁబాడు చచ్చరలు చక్కఁగ నాడిరి పిమ్మటన్ ధరే
శ్వరుఁ డనిరుద్ధుఁ దద్ధయము సాకఁగనంపఁదలంచి ప్రీతితోన్　　౨౦౭

ఆ॥ యదువరేణ్యులార! యరుగక యెచటికి రిద్దిసూడుఁడంచు హెచ్చరించి
యా హయంబువిధిని నర్చించి చామరములనుగట్టి విడిచెఁ దొలివలుకుల

క॥ ఆ యయురత్నంబావల హాయి సుధాఖండలకములన్నిటఁదిని యా
రా! యనఁ బోవఁగడంగెను నాయతసక్కుంకుమాక్షతాద్యన్వితమై　　౨౦౯

## ఉగ్రసేనాదులు అనిరుద్ధునకు యుద్ధనీతిని దెల్పి బహూకరించి యజాశ్వంబు వెంట పంపుట

తే॥ అంత భూపుండు తత్పాలనార్థమేగనుద్యమించిన యనిరుద్ధు నోజఁగాంచి
యిట్లుపలికె నో ప్రాద్యుమ్ని! కృష్ణపౌత్ర! యెట్టులంటివొ యశ్లేలుమీ హయంబుః

సీ॥ నా రాజసూయంబునఁ ధరఁ గెల్చిన ప్రద్యుమ్ను వీరునిపట్టి వీవు
లోకంబులన్నిటిఁ జీకాకుఁజేసిన శకునిసోదరవృకుఁ జంపితీవు
రథరథికరిహరిరాజపసంఖ్యాక రిపులనుబట్టి నిర్జించితీవు
దురమును బొనరించి కురువీరవరుఁడైన భీష్మునింగూడి మెప్పించితీవు

తే॥ విధివిధువులును నీలోన విస్మయముగ లీనమగుటనుగన్న యామహానివరులు
నిన్నుఁ బరిపూర్ణతమునిగా నెన్నిరిగద నీవె తద్రక్షుఁ దగెదవో నిర్మలాత్మ! ౨౧౧

తే॥ కాన ననిరుద్ధ! వైళమే సేనతోడఁ బోయి యీవాజిఁబట్టిన భూవరులను
నెట్టి విడిపించికొనిరమ్ము నట్టులేక యొక్క సంగతిఁజెప్పెద నొగిని వినుమ

చ॥ చిఱుతల దేబెలన్ నిదురఁజెందినవారల వెఱ్ఱివారలన్
సురఁగొన్నట్టివారి వెనుజూపి పఱుంగిడువారి నారులన్
విరథులఁ గావుమంచునిను వేఁడినవారిని సాధువర్యులన్
దురమున నీవు చంపకుము! దోషవిదూర! యుషామనోహరా! ౨౧౩

తే॥ ఈవు హరిశౌర్యశక్తిచేఁ బృథివినంత నడ్డులేకుండ గెలిచి మహాముదమునఁ
దురగసేనాయుతంబుగాఁ దిరిగి యిట్టి ద్వారకకు వచ్చెదవుగాక! ప్రథితవీర!

ఆ॥ అంతఁ గార్ష్ణితనయుఁ డడియొప్పి చననుండఁ గృష్ణునాజ్ఞ విప్రులేగి యతని
నైగమోక్తితతిని స్నానంబుజేయించి యర్చసలిపి రవల యదువిభుండు ౨౧౪

క॥ అనిరుద్ధునొసటఁ దిలకంబునునిడి పృథుబలినొసంగి పూని యతనికిన్
ఘన కరవాలంబును నిచ్చెను మరి మణిమాల శూరసేనుఁడొసంగెన్ ౨౧౫

సీ॥ ఆనక దుందుభి యద్భుతకుండలముల బలరాముండు బొందళమును
హరిచక్రమును గార్ష్ణి స్వాక్షయబాణతూణయుగంబు హరిదత్త నవ్యధనువు
నుగ్రుండు శూలంబు నుద్ధవుండు కిరీట మురగపాశంబును వరుణదేవుఁ
డగ్నిభువును శక్తి ననిలుండు వ్యజనముల్ దండధరుం డాత్మచండదండ

తే॥ మర్జునుఁడు పరిఘాయుధం బైలబిలుఁడు హీరహారము శంఖమక్రూరుఁడు రవి
కుంతమును భద్రకాళియు గొప్పగదను దేవకుఁడు పీతవస్త్రంబు దీవినిడిరి

సీ॥ వెండియు నింద్రుండు విశ్వకర్మవినిర్మితంబు ఘంటాదినాదరుచిరంబు
శాంతకుంభచ్ఛత్ర శతపతాకాన్వితం బఖ్రిసఘోష మహోద్ధృతంబు
వాయు మనోవేగ భాసురంబు సహస్రదివ్యాశ్వబద్ధం బుదీర్ణతరము
మణిఖచితంబు బ్రహ్మాండ బాహ్యాభ్యంతరప్రదేశగమనరాజితంబు

తే॥ స్వర్ణభూయిష్ఠము సహస్రచక్రయుతము
జైత్రమునగు శతాంగముఁ జిన్మరమణియు
యోగమయపాదుకలను లంబోదరుండు
వనరుహంబును దత్కార్ష్ణి జనకు నిచ్చె ౨౧౮

తే॥ అపుడు మంగళవాద్యంబు లన్ని మ్రోగె
సురలు సుమవృష్టి గురిసిరా స్మరసుతుపయి
జయజయేతిశబ్దంబులు సకలదిశలఁ
గలిగె వేదఘోషంబులు సెలఁగె నవల. ౨౧౯

చ॥ స్మరతనయుండు పెద్దలకు మాతలకున్ వసుదేవపత్నికిన్
హరిలలనాలలామలకు నా హరితల్లికిఁ జక్క మ్రొక్కి యి
త్తఱి నవవాజిఁ బ్రోచుటకుఁ దద్యదునాథుఁడు నన్ను బంచుటన్
గురుజనులార! పోయెదను గొంకక యాదవసేనతోడుతన్. ౨౨౦

చ॥ అన విని వారలాదఁట బలుకాడఁగఁజాలక కౌఁగిలించి దీ
వెనలొనరించి యంప నల వెన్నునిమన్మఁడు తిర్గి వారికిన్
వినతులఁజేసి వీడుకొని స్వీయసతీత్రయవిస్ఫురన్నికే
తనములకున్ బిరానఁ జని తత్కృతగౌరవమొంది వేడ్కతోన్. ౨౨౧

చ॥ స్వగమనసంగతిన్ దెలిపి వందుఱుబొందెడి వారి ముప్వురన్
వగవకుఁడీరు తొందరగ వచ్చెద నేనని యూఱడించి తా
మగుడ సభాలయంబున కమందగతిన్ జని రామకృష్ణరా
జగురురతీశ్వరాదులకుఁ జాఁగిలిమ్రొక్కి యనంతరంబునన్. ౨౨౨

తే॥ పౌరులిడు పూజఁగొని ధనుర్బాణ ఖడ్గ భర్మశక్త్యాయుధంగొని వర్మమకుట
కుండలాంగళిత్రాణాది మండితుఁడయి దివ్యపంచాస్యమో యనఁ దేజరిలుచు

ఆ॥ సకలవాద్యములును శబింప శ్రుతిఘోష సెలఁగ ఘనులు చామరలనువీవఁ
బౌరులుగన నగర బాహ్యస్థలంబున కరిగె శక్రుఁడిడిన యరదమెక్కి ౨౨౪

తే॥ అంత శ్రీరమేశుం డుద్ధవాది సచివసత్తముల వృష్టి భోజదశార్హ శూర
సేన మధ్వంధకులఁ దన చిన్నిమనుమనికి సహాయంబుగాఁ బంపె నెమ్మితోడ

క॥ పదపడి యదునాథుండో యదుసత్తములార! యుద్ధమందనిరుద్ధుఁ
గొదకొని ప్రోవఁగ నేగెడి పెదపోటరి యెవఁడొ చెప్పుఁడి వేవే మీలో ౨౨౬

—♦ అనిరుద్ధ సహాయార్థంబై సాంబాది యాదవవీరులు పోవుట. ♦—

ఉ॥ నావుఁడు వెంట జాంబవతినందనుఁడున్ బలియైన సాంబుఁడో
భూవర! నేను తన్మదనపుత్త్రు మహారణమందునన్ సప
త్నావళినుండి గాచెద సహర్నిశమట్టులఁ బ్రోవలేనిచో
నేవిధి నెప్డు గల్గవచియింపని నానుడు లాలకింపుమా! ౨౨౭

క॥ విశయంబు విడిచి త్యాజ్యము దశమీవిద్ధంబు దురితదమునగు నేకా
దశిని వ్రతంబును సల్పిన విశుఁడే గతిఁబొందునో యది వే నాకగుతన్ ౨౨౮

తే॥ మఱియు బ్రహ్మగోఘ్నులు పొందు దురితములును
నాకుఁ గల్గుత యాదవనాధ! యంచు
నందఱాలింప శపథంబులాడి మ్రొక్కి
యంతిపురమున కిదిదెల్ప నరిగె భూప! ౨౨౯

ఉ॥ సాంబుఁడుపోయి లోనికటు జాంబవతిన్ గని మ్రొక్కి స్వీయభా
వంబునుదెల్పఁ దజ్జనని వానిని గూర్మిని గౌఁగిలించి సౌ
ఖ్యంబుగ రమ్మటంచనిపె నంత నతండఖిలప్రసూపదా
బ్జంబుల భక్తిఁవ్రాలి తనభార్యగృహంబున కేగె వేడ్కతో ౨౩౦

ఆ॥ అంత నతని జాయయైన లక్ష్మణవచ్చి నట్టిపతినిగాంచి యాదరమున
గద్దెనిచ్చి బాష్పకంఠయై యేమియు బలుకకుండుటగని భర్త యపుడు ౨౩౧

క॥ తన యాశయంబునంతయు వినిచెను నిజసతికిఁ బిదప విరహవ్యథ నా
వనరుహలోచన గుందుచుఁ దనపెనిమిటి కిట్లుపలికె ధరణీనాథా! ౨౩౨

చ॥ సకలవిధంబులన్ గడఁగి సారసనేత్రుని పౌత్త్రు, వాని ఘో
టకతిలకంబు రక్షను దృఢంబుగఁజేయఁగనౌను సాంపరా
యికమున నీవు మారుమొగ మేసమయంబునఁ బెట్టఁగూడదో
యకలుషయాదవాన్వయమహాంబుధిపూర్ణకళానిధీ! సుధీ! ౨౩౩

చ॥ కలహమునందు నట్లు రిపుకాండము గెల్చుట లెస్సయానిఁకన్
వెలితిని నందుగన్నయెడ వేలకొలందిగనున్న నీదు భా
తలసతు లందఱిద్దివిని తప్పక నీప్రియునైన నన్ను బ
ల్చులుకనజేసి గర్వముగఁజూతురు నవ్వెదరో మనోహరా! ౨౩౪

తే॥ అపుడు గలుగు నావగపున కంతమున్నె? మరణ మద్దానికంటె బల్మంచిదంచు
నెంచినీల్గెద నోనాథ! యంచుఁ బలుక సాంబుఁ డాలించి నగి యిటు సతికిఁ బలికె.

మ॥ చెలియా! యెట్టెటు పల్కెయుంటి వహహా! చిత్రంబు నాకయ్యెడిన్
గలహాంబంమున ముజ్జగంబులు క్రుధాక్రాంతాంతరంగంబుతోఁ
దలపాటున్ బొనరించినప్పటికి నే ధైర్యంబుతోఁ బోరి వే
తొలఁగన్ జేసెద నిక్కువమ్ము సుమి యీ దుఃఖంబు వర్జింపుమా! ౨౩౬

ఆ॥ అటులఁ జేయలేనియదనున బ్రాహ్మణవేదనిందఁగలుగు వృజినసమితి
నాకుఁ గల్గ నీదు రాకాసుధాకరసమముఖంబు గనను జలజనేత్ర! ౨౩౭

క॥ అని యిటులామెను మరియొక తనభార్యను ననునయించి త్వరగతి నభిమ
న్యుని మఱి సుభద్రఁ గనుఁగొని చని తద్గేహంబునుండి సంతోషముతో

ఆ॥ మకుటకవచభూషణకలితుండై చాపబాణఖడ్గభిండిపాలపట్టి
సాదిహేతులఁగొని యనిరుద్ధుఁడుండిన నగరబాహ్యవరవనమునకరిగె ౨౩౮

వ॥ అంతఁ దత్సాంబానుజన్ములును, శ్రీకృష్ణాత్మజులు నగు భాను, గద, దీప్తిమదాదులు శ్రీహరిప్రేరితులై సకలశస్త్రాస్త్రంబులం దాల్చి సర్వాలంకారాలంకృతులై యంజనాచల కజ్జలాభ్రనిభంబులును, పుండరీకమూలనీకాశదంతకాంతంబులును, గోమూత్రసిందూరకస్తూరీపత్ర విచిత్రితమనోజ్ఞంబులును, గనకనీడవిరాజమానంబులును నగు మృగద్విపంబులును, నైరావతజాతి సంజాతంబులును, ద్రిశుండామండితంబులును, ధరాధరసన్నిభంబులు నగు గజంబులును, నరకాసురపురమునుండి హరిచే నానీతంబులైనవియుఁ జతుర్దంతసంయుతంబులు నగు కరివరంబులును బతాకాశోభితంబులగు లక్షమాతంగంబులును, దుందుభిసందోహసుందరంబులగు లక్షనాగేంద్రంబులును, స్వర్ణకంబళచారుతరంబులును మహామాత్యభాసురంబులు నగు ద్విరదంబులును, శూరాధిష్ఠితంబులగు కోటిహస్తివరంబులును, మదధారలతో ధారణి నార్ద్రీకరించుచుఁ, బాదంబులతో మేదినిని వణఁకించుచు శుండాదండంబులతోఁ దరుగుల్మాదులం బెకల్చి నభస్స్థలంబునన్ బారవేయుచు శిరంబులతో దుర్గశైలసౌధప్రదేశంబులం బడందోయుచు సువర్ణార్గళంబులు సెలంగుచుండ ఘంటాదిమంజుళనాదంబులొప్ప రిపుబలంబులను మర్దింప సమర్థంబులై ఘీంకృతులతో ముందు నడువ వీని వెంట నారదవిలోకితాశ్వంబులును, వైకుంఠ శ్వేతద్వీపసింధు మ్లేచ్ఛదేశాదిసమాగతహయంబులును, సర్వాంగసుందరంబులై కృష్ణవాజిశాలనొప్పు వాహంబులును, ఛత్రచామరాభరణాద్యలంకృతంబులైన తురగంబులును, బక్వాపక్వసూత్రంబులమీఁదను, బుద్బుదంబులను పౌరులయందును, భూనభఃప్రదేశములను గర్తసౌధదుర్గాదుల నుల్లంఘించి వాయుమనోవేగంబులతోఁ బోవంజాలి శుక్లారుణకృష్ణపీతధూమ్రచిత్ర నానావర్ణంబులతో భాసిల్లుచు హేషలం గావించుచుఁ గోట్లకొలఁదిగా వచ్చుచుండ, బిమ్మట ధనుర్బాణఖడ్గచర్మభిండిపాలశూలపట్టిసపరిఘాగదాముద్గరతోమరకుంతాద్యాయుధోపేతులును, రిపుభయంకరులును, విఖ్యాతబలులును, మకుటకవచగోధాంగుళిత్రాణాది విభాసురులునగు పదాతులు సురాసుర

నరవరనికరంబులచ్చేరువొందఁ దదనిరుద్ధసహాయార్థంబుగా మహా సంతోషంబుతో ద్వారకాపురినుండి నిర్గమించిరి. అనంతరంబున ౨౮౦

ఆ॥ యాదవేశు నాజ్ఞ నానకదుందుభి కామపాల కృష్ణకాములు మరిఁ
దదితరయదువరులు తదనిరుద్ధునిగనఁ దలఁచి మంచియరదములను నెక్కి

క॥ చని సేనాపరివృతుఁడౌ ననిరుద్ధునిఁ గాంచి రంత హరి, నృపసూయం
బున మును మనసిజునకుఁ జెప్పి నలీతిని గార్ష్ణి జాదివీరులకనియెన్ ౨౮౧

చ॥ వదపడిఁ గార్ష్ణి జాది యదువర్యులు తద్ధరియాజ్ఞకొప్పిరా
మదనసుతుండు రామ హరి మూరు మునీ డ్వ్యాసదేన వృద్ధ మ
త్పదములవ్రాలి దీవెనలఁ దద్దయుమావలనన్ గ్రహించి నా
యదనున మేము సాగియటసర్గితి మాత్మపురంబు భూమిపా ౨౮౩

తే॥ అంత ననిరుద్ధరక్షితంబైన దివ్యసవనతురగంబు దేశదేశములఁ దిరుగు
చుండినను హరివెఱచే నెవండుగూడఁ బట్టలేదని యెఱుఁగుమా! వజ్రనాభ!

— సేనాసహితుండగు ననిరుద్ధుండు నీలధ్వజుని గెల్చుట. —

మ॥ అటులాయశ్వము దిర్గి దుర్గయుతమున్ జ్వాజాళిదివ్యంబు శూ
ల్యటజోపేతము పంచయోజనయుతం బుర్వీసురాద్రిప్రజో
త్కటరమ్యంబును నభ్రచుంబిగృహయుక్తంబింద్ర నీలాహ్వయో
ద్భటసంపాలితమైన పీటఁగల యుద్యానంబుఁజేరెన్ జుమీ! ౨౮౪

తే॥ అత్తరుణమునఁ దత్పట్టణాధినాథ నందనుఁడగు నీలధ్వజనామకుండు
వీరదశశతకయుతుఁడై వేఁటలాడ నాత్మపురినుండి చనుచు నుద్యానమందు

ఆ॥ కనకపత్రబద్ధమును చామరయుతంబు గోపయఃపవిత్రంబు గోమలాంగి
కుంకుమకరయుత మకుంఠితమాక్తికహారరుచిరమునగు హయవరంబు ౨౮౬

ఆ॥ కడిమిచెట్టు క్రింద గ్రాలుట గనుఁగొని వాహనంబుడిగ్గి వచ్చిలీల
దానిఁబట్టికొంచుఁ దత్పత్రమునుగొని చదివి దానియశముఁ జక్కనెఱిఁగి

మ॥ అరరే! యాదవు లెంతవారయిరహో! యీ యుగ్రసేనుండె యీ
ధరలోఁ బోటరియంట! యన్యుఁడెవఁడుద్దండుండు లేడంట! య
జ్ఞరె! నాతండ్రిని నన్ను గాంచక యిటుల్ సాటించి గుఱ్ఱంబు పు
త్తురె! యవ్వారలగర్వ మీదినమునన్ ద్రోపాడెదన్ జూడుమీ! ౨౮౯

క॥ అని తలఁచి తన్నుమానము గినుకయుఁ బ్రేరేపదాని నేరుచుఁగొని నే
తన తండ్రిదరికిఁజని తద్ఘనవృత్తాంతము వచించె ధాత్రీనాథా! ౨౯౦

చ॥ అనవుఁడు మాని వీరుఁడను త్ర్యంబకసేవకుఁ డింద్రనీలుఁ డి
ట్లనె మును నేను బల్లిదుఁడ నయ్యుఁ గిరీటి సహస్రరాజసూయము౦
దున సుమధన్వికిన్ బలుల దుర్మతియై మన మంత్రిమాటలన్
విని యిడి గారవించితి వివేచనమేమియులేక పుత్రకా! ౨౪౧

తే॥ ఇదియు వాటంబటంచెంచి యిపుడు మరల గార్ష్ణి జంతశ్వమేలుచిక్కఁడకువచ్చె
నట్టియాదవు లెంతలో నధికులైరి దైవబలమున నెవిగాదొ? తనయ! చెపుమ!

ఉ॥ కావున వారినందఱను గంటున నేఁడు జయింతు గర్వియై
శ్రీవిభుపుత్రపుత్రునకుఁ జేరి యొసంగను శ్యామకర్ణమున్
శ్రీవృషవాహనుండును నసిన్ బ్రియభక్తుఁడనైన నన్ననిన్
గావఁగలండు ధీర! యని కయ్యమొనర్పఁదలంచి తేఁకువన్ ౨౪౩

తే॥ పైఁడి తాళ్ళటను దవ్యజవాజిఁ గట్టి సైన్యయుతుఁడయియుండె నీసమయమందు
గార్ష్ణి జుఁడుశతాక్షౌహిణీకలితుఁడగుచు హయముఁగనుచు నర్మదదరి కరుగుదెంచె

వ॥ అంత సాంబుండును, మధువు, బృహద్భానువు, చిత్రభానువు, వృకుఁడు, నరుణుండును, సంగ్రామజిత్తును, సుమిత్రుండును, దీప్తిమంతుండును, భానుండును, వేదబాహుండును, బుష్కరుండును, శ్రుతదేవుండును, సునందనుండును, విరూపుండును, జిత్రబాహుండును, న్యగ్రోధుండును, గవియు, గదుండును, సారణుండును, నక్రూరుండును, గృతవర్మయు, నుద్ధవుండును, యుయుధానుండును, సాత్యకియు మరియు సర్వయాదవులును తత్సహాయార్థంబుగా నర్మదానదీతీరంబున కేతెంచి యశ్వంబు నెల్లెడ నెమకి కానక వింతచింతలఁబొంది నవఖండంబులం జయించి రాజసూయంబొనర్చిన మన యాదవనాథుని ఘోటకంబును ముందువెనుకలు విచారింపక పట్టినదిట్ట యిప్పట్టున మనచే గిట్టకపోవునే యని రోసంబుతోఁ బలుకు పలుకుల నలరువిలుతునికొమరుండాలించి పురోభాగంబునం బొలుపారుపురంబు నాలోకించి మంత్రివర్యుం డగు నుద్ధవునింగాంచి యిట్లు పృచ్ఛించె ౨౪౫

తే॥ ఈనగరవరం బెవరిదో యెఱుకపడదు దీనిలోనికిప్పుడు మన దివ్యహయము
సనియెననియెంతు నావుఁడు శౌరిమిత్రుఁడైన యుద్ధవుం డిట్టుల నతనికనియె

క॥ ఇది శ్రీమాహిష్మతియను విదితపురం బిందు నీలవిభుఁడేలును భూ
త్రిదశ నృపోరుజ శూద్రులు గొదకొని తర్పరిని హరునిగొల్తురు సతమున్

చ॥ ఒకతఱి నాప్రభుండు శివునుల్లమునందున నమ్మి నర్మదాం
తికమున కేగుదెంచి వినుతించి తపంబును ద్వాదశాబ్దముల్
వికలతలేక చేసె నటుపిమ్మట భీముఁడు మెచ్చి వచ్చి కో
రిక లెవియున్నవో చెపుమ! ప్రీతినొసంగెద నన్న నాతఁడున్ ౨౪౮

తే॥ సంతసముఁబొంది యర్చించి చంద్రచూఁడు నరసురాసురభయములు నాకులేని
యటుల నెప్పుడుగాచుమయ్యా! మహాత్మ! యిదియె వరమని వేఁడ నాయీశ్వరుండు

చ॥ అటులగుఁగాక యంచుఁ బలుకాడి తిరోహితుఁడయ్యె నీ మహా
నటవరశక్తిహేతువున నన్యబలుండగు నాప్రభుండు మీ
చటులహయంబు భండనముసల్పక యీయఁదలంపఁడో సుధీ!
యెటులిఁకఁ జేసెదో యటుల నీవొనరింపుము! యో యుమాపతీ! ౨౬౦

చ॥ అనవిని కార్ష్ణిపుత్రకుఁడు త్ర్యంబకుఁ డాతని కాశ్రయంబుగాఁ
దనరినచోఁ జతుర్భుజుఁడు దైత్యరిపుండగు కృష్ణుఁడండయై
తనరుచునుండె నాకును బ్రధానివరా! యని వానితోననిన్
బొనరిచి యశ్వముం గొనుట పోలునటంచుఁ దలంచి వీఁకతోన్ ౨౬౧

తే॥ చాపనిస్త్రింశముద్గరశరగదాదిహేతి సంఘాతమును దాల్చి యెసఁగు యాద
వప్రకరములతోఁ గూడి భండనంబునలుప సన్నద్ధుఁడయ్యె నీసమయమందు

ఆ॥ అట్టి యింద్రనీలు నాత్మజాతుఁడు తన యయ్యపలుకువిని మహోగ్రహంబు
జెంది యాదవులనుజెండ నక్షౌహిణీత్రయముగొని వెడలెఁ బురంబునుండి

క॥ ఆలలినే తెంచిన యా నీలధ్వజుఁ గార్ష్ణిజుండు నెఱిఁగని ధనువున్
గేలనుఁగొని చనె వృత్రుని లీలఁ గెలువఁబోవు నింద్రులీలఁగ నొంటిన్ ౨౬౪

ఉ॥ ఆరహిఁబోయి మారసుతుఁ డంబకవర్షము వైరిపంక్తిపై
జోరున వెల్లిగాఁగురిసి క్షోభనువారలు గాల్కొలందిగాఁ
బాఱుటఁగాంచి శంఖమును బాగుగనూఁదెను దానిఁగన్న యా
త్మారమణాత్మజుండు దన చాపముగైకొని టంకరించుచున్ ౨౬౫

చ॥ పఱుగిడు స్వీయయోధులకు బాగుగలేదిటు మీరు పాఱుటల్
దురమున మార్తురన్ గెలిచి దుందుభిజాటుట లెన్నయోనటం
చఱిముఱి రోసముం గొలిపి యాతని డీకొనఁబంపె నంత నా
హరిసుతుఁడైన సాంబుఁడు రయంబునఁగాంచి మహాగ్రహంబుతో ౨౬౬

శా॥ ఏకాక్షౌహిణితోడ వచ్చి నిజచాపేంద్రంబు మోపెట్టి త
ద్భూకాంతాత్మజుపైన నిర్వదిశరంబుల్ వెండియున్ బంచసం
ఖ్యాకాజిహ్మగముల్ శతాంగములపై నౌరా! యనన్ వేసి యా
శాకుంభిప్రతిమానమత్తకరులన్ సప్తాళిఁగొట్టెన్ జుమీ! ౨౬౭

ఉ॥ అత్తఱి నీలకేతు బలమందు రథంబులఁ దేరు లేన్గులన్
మత్తకరుల్ తురంగములు మావులపైన నరుల్ నరాళిపై
నత్తమిలందొడంగఁగని యావిభుఁడున్ విలు నెక్కుపెట్టి త
చ్చిత్తజపుత్రసేనలను జెండుటకై పఱపెన్ శరంబులన్ ౨౬౮

క॥ మఱి యానృపపుత్రుఁడు దశశరములతో సాంబువిల్లు శరశతకముతో
నరదము రెంటను ధ్వజ మొకశరమున సూతు హరుల నలు శరములఁ ద్రుంచెన్

తే॥ ఇటుల సాంబునిఁ గొట్టిన యింద్రనీలతనయు యదుసేనపేక్షించి కినుకఁ గవిసి
కయ్యమాడంగ నాతండు గాంచి కసిని జక్కహింసించె నంతలో సరభసమున

క॥ నీలధ్వజ సైన్యములున్ జాలఁగ నేతెంచి సాంబచమువుల నెల్లన్
గూలఁగఁ గొట్టెను బదపడి నాలం బిరుతెగలకయ్యె నతిఘోరముగాన్ ౨౭౧

ఉ॥ పిమ్మట సాంబుఁ డుద్దవిడి వేఱురథంబున నెక్కి వేఱుచా
పమ్ముఁ గ్రహించి యెక్కిడుచు నంపిశరంబులఁ దచ్ఛతాంగ చా
పమ్ములఁ జెండ నాతఁడు నపాస్తశతాంగశరాసుఁడౌచుఁ గో
పమ్మునఁ బెన్గదన్ గొని జనంబున దూఁకెను సాంబుపై విభూ! ౨౭౨

ఉ॥ అప్పుడు సాహసంబునఁ దదచ్యుతపుత్రుఁడు తేరుడిగ్గి వే
గొప్పగదన్ గ్రహించి కసిగొల్దిసి డాసె ననంతరంబునం
దప్పతిసూనుఁ డప్పగిది నాస్థఁగురంగటనున్న సాంబునిన్
దెప్పునగాంచి కిన్కఁ దన దివ్యగదన్ బ్రహరించె నంతయున్ ౨౭౩

తే॥ కాని తత్ప్రహారమున నా కంజనేత్రపుత్రకుఁడు మాలికాహతపుష్కరివలెఁ
జలనమొందక చెలఁగుచు స్వగదతోడ వానిఁ గొట్టెను మూర్ఛతోఁ బడఁగఁ బుడమి

ఆ॥ అంత నతనిసేన హాహాకృతుల్ చేసి పాఱె నంత సాంబభక్తుఁడైన
యింద్రనీలుఁ డద్ది యీక్షించి కోపించి సాహసమున రణముసలుపఁ దలఁచి

క॥ అక్షౌహిణీద్వయంబును దక్షతఁ గొని యేగి యనికిఁ దదమిత్రతతుల్
శిక్షితమగు బాణంబులతో క్షీణింపంగఁ జేయఁదొడఁగెను బిదపన్ ౨౭౬

తే॥ కృష్ణసుతుఁడగు మధువాధరేశుఁ గాంచి శరములన్ వేసి విరథుగా సల్పె నవల
గ్రుధఁజనెడి యింద్రనీలుని గొప్పసేన నరసఖుఁడగు యుయుధానుఁ డెఱిఁగి చెండె

ఆ॥ అంత నింద్రనీలుఁ డాత్మబలంబెల్ల వ్యర్థమౌటఁ జూచి స్వగృహమునకుఁ
బోయి శివునుతింప నా యష్టమూర్తియు దయఁ బ్రసన్నుఁడయ్యెఁ దద్విభునకు

ఉ॥ అంతట నింద్రనీలుఁడు కృతాంజలియై యిటుపల్కె నోయుమా
కాంత! యనిన్ బరాభవముగాంచితి నిప్పుడు హేతువేమొకో
యింతకుఁ బూర్వమిడ్డ వరమెట్టులఁ బోయెనో చెప్పుమా! యనన్
జింతఁ ద్యజింపుమంచు శశిశేఖుఁడిట్లనె వానికోప్రభూ! ౨౭౯

ఉ॥ భూరమణీంద్ర! నావరము బొంకని యెంచకుమయ్య! నిన్ను బృం
దారక దైత్యమానవులు దాఁకి జయింపగలేరు వీరొ బృం
దారకులన్నఁ గారు మరి దైత్యులలాములు గారు మానవు
ల్గారిఁక నెవ్వరన్నఁ గమలాపకళాజనితుల్ గదా! బలా! ౨౮౦

తే॥ వారె నిన్ను నోడించి రా శ్రీరమేశ్వరునకు నపరాధ మొనరింప రూఢి నీవు
దగవుగాన నాహయముఁ బ్రద్యుమ్నునకు నిచ్చి మొ్రక్కుమ! యని చెప్పి యేగెనవల.

వ॥ అమ్మాహిష్మతీపురనాథుం డుమానాథముఖమ్మున నయ్యాదవు లసుర సురనరులను మించినవారనియు, రమారమణమాహాత్మ్యంబును దెలిసికొని సమర ప్రయత్నంబుమాని తద్హయమ్ముం గైకొని యనేకరత్నంబులను, శతభారస్వర్ణంబును సహస్రగజంబులను, నియుతహయంబులను, నియుతస్యందనంబులను, దివ్యాంబర పుష్పదామంబులంగొని నీలధ్వజసహితంబుగా ననిరుద్ధుని మ్రోలకేగి నమస్కరించి జరిగినవృత్తాంతంబంతయు వినిపించి యజ్ఞహయంబును, గానుకలనిడి, కొనియాడి మీకింకరుండను గొంకులేక నన్నాజ్ఞాపింపుఁడని ప్రార్థింప నా యదువీరుండు మెచ్చి భూవరా! త్వత్కృత గౌరవంబున కానందంబు బొందితిని. ఈ యశ్వంబును రక్షింప నీవును రావలయునని పలుక నతండు సంతోషముతో నంగీకరించి నిజకుమారునకు రాజ్యం బప్పగించి తదనుచరుండై సాగె. అంత ౨౮౨

## —♦ అనిరుద్ధుండు చంపావతీపురిని జయించుట. ♦—

తే॥ యదువిముక్తమైన సవాశ్వ మఖిలదేశములను గనుచు నుశీనర భూరిరాజ్య
పూజ్య చంపావతీపురమునకుఁ బోయె నా నగరచిత్రముల్ సెప్ప నలవియగునె!

క॥ శ్రీమంతుఁడు సర్వబలోద్దాముండును హంసకేతు తనయాన్వితుఁడున్
ధీమంతుఁడు విదితుఁడునగు హేమాంగదుఁ డాపురంబు నేలుచునుండున్

క॥ ఆతఁడు దనపట్టణమున కేతెంచిన యజ్ఞహయము నీక్షించి వడిన్
భీతినివిడి కైకొని కనకాతతదామమునఁ గట్టి యధికక్రుధతోన్ ౨౮౪

తే॥ యాదవపతాకినీనాశనార్థమై తుపాకులన్ రెండులక్షల వరుస దుర్గ
భిత్తులందుంచి ద్వారముల్ పృథుకవాటములను బంధించి ధీరతఁ జెలఁగె నంత

క॥ అనిరుద్ధుం డాయశ్వంబును వెదకుచువచ్చి యట్టి పురిబాహ్యావనం
బున శిబిరములిడి తనకది గనుపడమిని నొచ్చగవినిఁగని యిట్లడిగెన్ ౨౮౬

ఉ॥ ఎవ్వఁడు యజ్ఞవాహములు కేమియు లేక హరింపఁ జాలెనో
యెవ్వని దీపురంబొ? మరి యేనిపుడేమి యొనర్పనౌనొ? నా
కివ్విషయంబు లెల్ల వచియింపుము! యుద్ధవ! యంత నాబుధుం
డవ్విదితారివార్తల సమగ్రముగా నెఱుఁగంగ నిట్లనెన్ ౨౮౮

తే॥ ఇద్ది చంపావతీపురి కృష్ణపౌత్ర!
హంసకేతువన్ సుతుఁగూడి శంసఁ జేయు
నటుల హేమాంగదుండేలు నతఁడె మీ హ
యంబు హరియించెఁ గ్రమ్మఱ నద్దియిడఁడు ౨౮౯

క॥ వెండియు వాఁడు శతఘ్నుల గుండుల బల్ బాఱచేసి కొట్లాడుటకై
యుండెను దత్పురిలోపలనుండి బహిస్స్థలికి వెడలఁ డుద్ధురశక్తిన్ ౨౯౦

ఉ॥ కావున నీవెఱ్ఱ దలఁచు కార్యములన్నియుఁ జేయుమా యుపా
దేవ! యనంగ నాతఁడు సుధీవర! లోహసమానమైన బా
ణావళి వేసి దుర్గనిచయంబులతో నజజాములోన సే
నావృతుఁడైన యీవిభు నయారె! యనన్ వధియింతుఁ జూడుమీ! ౨౯౧

క॥ అని నిజయాదవవీరులఁ గనుచు వచింపంగ వారు గసిఁదత్పురమున్
ఘనసాయకముల నాశంబును జేయఁదొడంగిరంత భూపవరేణ్యా! ౨౯౨

క॥ ఆ రిపుపురమునఁ దద్యదుఘోరశరాఘాతములను గోలాహలముల్
భూరిగఁబుట్టెను వెండియుఁ బౌరులు హంసధ్వజాది బలులదరిరహో! ౨౯౩

తే॥ అంతఁ దద్వీరులట్టి హేమాంగదు నుడి
వినుచు దుర్గభిత్తులనెక్కి యనినొనర్పఁ
దలఁచి తమమీఁదఁ దూఁపులన్ దద్దఁబఱపు
యదువరులఁగాంచి వెఱగంది యాగ్రహమున ౨౯౪

తే॥ ఏము వీరినిజంపెద మీహయంబు నీయమంచు శతఘ్నుల నెల్లదెసలఁ
గాల్చిరద్దాన యాదవ ఘనబలంబు లందు హాహాకృతుల్ గల్గె నపుడు మఱియు

సీ॥ కొందఱు యాదవుల్ బొందళముల్ సెడ సమితి వీరనిబోరఁజాలమనిరి
కొందఱు నిర్ఘాత కోదండకరులైరి కొందఱు గాయముల్ పొంది పడిరి
కొందఱు సొమ్మతోఁ గూలిరి కొందఱు పదములకొలఁదిని బఱుగులిడిరి
కొందఱు నిధనంబుబొందిరి కొందఱు భగ్నహస్తశిరపాదులైరి

తే॥ కొందఱో రామ! యో కృష్ణ! కూర్మి మమ్ము
బ్రోవుమని వేఁడఁదొడఁగిరి మావులేన్గు
లరదములు డెక్కియంబులు మఱలెఁ దరలె
నొఱగె దఱిగెఁ దచ్ఛస్త్రాగ్ని మఱియు రేగె ౨౯౫

ఉ॥ అత్తఱిఁ జిత్తజాతతనయాగ్రణి స్వీయబలంబు లారహిన్
నెత్తుట దోఁగుటన్ జనుట నీల్గుట గన్గొని కుందియేమి నే
నిత్తఱిఁ జేయనౌననుచు నించుక యోజనసల్పి కృష్ణునిన్
జిత్తమునన్ దలంచి యల శ్రీహరి సత్కృపఁదోఁచు బుద్ధితోన్ ౨౯౬

తే॥ కడఁగి శార్ఙ్గంబుగొని నిషంగంబునుండి శరము పార్జన్యముంగొని పఱపనద్ది
వోయి తోయంబువర్షించి యాయనలమునార్పి యదుసేనలంగాచె నధిప! యవల

ఆ॥ యాదవోద్భటులు తదగ్నివిముక్తులు శీతలాంగులునయి శ్రీయుపేశుఁ
బొగడి పగలతోడ జగడంబుజేయఁగాఁ బూనిరంతఁ గార్ష్ణిపుత్రకుండు ౨౯౯

క॥ యదువరులారా! యొంటిగ నిదుగో తత్పురములోని కేగెద నే నా
యెదిరులయొడయని దాఁకెదఁ జదిపెద మనగెలుపుఁ బడమిఁజాటెదఁ గనుఁడీ!

ఆ॥ అంచుఁ దమినిఁబల్కి నష్టాదశ మహారథులును సాంబముఖులు నలఘుబలులు
నైన కృష్ణపుత్రులా బలికిట్టులఁ బలుకఁదొడఁగిరి పృథుపౌరుషమున ౩౦౧

చ॥ అరినగరోత్తమంబునకు నర్గట నీకుచితంబుగాదు మే
మరమున వారలంగెలువ నర్గుచునుంటిమిగాన నిల్వుమో
స్మరసుత!యంచుఁ బక్షవిలసద్ధరులెక్కి గ్రహించివిండ్లఁ ద
ద్వారణముదాటి విష్ణురధభాతిని వ్రాలిరి లోని కోవిభూ! ౩౦౨

తే॥ అట్లు పురిలోనఁజేరిన యా బలిష్ఠు లురగసన్నిభ శరపరంపరల వేసి
హంస కేత్వాదివీరుల హింసఁజేయ వారలొకకోటిధన్వులు శూరులు గని ౩౦౩

ఆ॥ కొంకు జంకులవిడి క్రుధఁజని తమవిభునాజ్ఞగొనుచు వీక యాదవప్ర
ముఖులతోడఁ బోవఁ బూనిరవ్వేళ సాంబాదులైన శ్రీధరాత్మభవులు ౩౦౪

చ॥ అని కరుదెంచువారిఁగని యాశుగకోటులనైవ నాపురం
బున నొకవైరిరక్తనది పుట్టి భయంకరమౌచు వాకిటన్
ఘనముగ బాఱగాఁదొడఁగె గార్ష్ణిజుఁడయ్యదిగాంచి శంకలన్
గని పరిశుష్యదాస్యమునఁ గంటున నిట్లనసాగె నోప్రభూ! ౩౦౫

శా॥ ఏమీ! మజ్జనకానుజుల్ రిపులచే నీహీయనన్ నీల్గిరే
యీమాడ్కిన్ బృథుశోణశైవలిని యిప్డీవాకిటన్ బాఱెడి
న్భీమంబై కనుపట్టుచుండె నిది గానీ కూల్తు నేతద్ద్విష
ద్ధామంబుల్ జ్వలనాభబాణముల గోత్రప్రాయనాగంబులన్ ౩౦౬

క॥ అంత మహామంత్రు లుషాకాంతాజ్ఞను లక్షకరులఁ గజ్జలభూ భృ
త్కాంతనిభంబుల బహుమదకాంతెంబులఁ బనుప నవ్వి ఘనఘీంకృతులన్

సీ॥ కరముల గుల్మముల్ బెఱికి యా యరిపురిన్ విసరుచు విపులకంపింపనడచి
లోనఁ బ్రవేశించి మానంబుతోఁ జేగి కుంభములఁ గవాటకోటిఁ గూల్చి
గొలుసులఁ దెగటార్చి కోటలఁబడవేసి తాలగోడలనెల్ల దూలఁజేసి
ద్వారవారంబులు పాడుగా నొనరించి వైరిహర్మ్యంబులన్ బడగనైచి

తే॥ జనుల నానావిధంబుల వనటబెట్ట నల్ల చంపావతీపురమందు నతిశ
యముగ హాహాకృతుల్ గల్గె నాధరాధినాధుఁడు భయచిత్రములొంది నమ్రుఁడగుచు

క॥ మాలాబద్ధకరుండై చాలఁగ ననుఁబ్రోచుచుండఁ జనఁగని సాంబుం
డాలము జేసెడి స్వబలుల లీల నిలిపి యతని కిట్లు పలికె నయవిదుఁడై ౩౦౯

క॥ హేమాంగద! మా యయునరవిరామెయిఁగొని కృష్ణపౌత్రు నిక్కముఁ జనుమా
క్షేమంబు నీకు గలుగును నామాటను వినుము! మదిని నమ్ముము! హెమ్మా!

ఉ॥ అనవుఁడు తద్విభుండు సరియంచు సవాశ్వముగొంచుఁ బుత్రుకున్
గొని హరిపుత్రయుక్తుఁడయి కోటలదాటి బహిస్స్థలంబునన్
దనరు సుహామనోహరుని దగ్గరకున్ జని మోహకీలకో
టినొసఁగి యా హయంబిడి కడించిగ మ్రొక్కె ననంతరంబునన్ ౩౧౦

ఆ॥ దీనవత్సలుండు మాని నీతివిదుండునైన కార్ష్ణిపుత్రుఁ డవి గ్రహించి
స్రజ్నిబద్ధ తద్ధరాపతికరముల విడిచి పల్కెనిట్టుల వేడ్కతోడ ౩౧౧

క॥ రమ్మా! నాతో నీ యశ్వమ్మరిబలహస్తములను బడనటు హరిమో
దమ్మునకై రక్షింపుము! సమ్మదమును గాంచఁగలవు శస్తచరిత్రా! ౩౧౨

క॥ అనవుఁడు తద్భావుం డావని కంగీకృతిని జూపి స్వకుమారునకున్
దనరాజ్య మొప్పగించియుఁ జనఁదొడఁగెను బుష్పబాణజాతుని వెంటన్

—♦ అనిరుద్ధుండు స్త్రీరాజ్యంబును గెల్చుట. ♦—

వ॥ అంత యదువీర ప్రయుక్తంబైన ఘోటకంబటనుండి బయలువెడలి ప్రతి రాష్ట్రంబును గనుంగొనుచు సంచరింపం గడంగె. మహాబలుం డగువాఁ డెవఁడేని వోలుత నద్దానిని మగటిమిం బట్టికొనినను దదనిరుద్ధకృతెంద్రనీల హేమాంగద పరాజయంబును విని యదరి బెదరి విడిపింపందొడంగె. ఇట్లివ యన్యహస్తంబులకుఁ జిక్కక తిరుగుచుఁ గ్రమంబుగా శుకపికశారికాపారావతాది విహగకలధ్వనిమంజుల వనోపవనవిభ్రాజమానంబును, నమృతోపమానోదక విభాసురవాపీకూపతటాకాది శోభాయమానంబును, జిత్రవిచిత్రభర్మమయరమ్యహర్మ్యవిరాజమానంబును, సర్వ సంపత్కరంబునగు స్త్రీరాజ్యంబున కేగి యందలి యొక సుందరారామంబులోనం బ్రవేశించుట నచ్చటి నారీమణులు గాంచి నిజస్వామినియును, ద్రిపురసుందరియు నగు సురూపకుఁ దద్వార్తఁదెల్ప నా లలన రథారూఢయై కోటి చాతుర్వర్ణ్య స్త్రీజనంబుతో గూడ నేతెంచి చామరచారుతరంబగు నా శ్యామకర్ణంబునాలోకించి తద్గళస్థితకాకల లిఖితవృత్తాంతంబుజదివిచెప్పి క్రోధసమన్వితయై యది నిజపురంబులో బంధింపఁజేసి తద్రక్షకులతో యుద్ధంబాడఁ దలంచి నిర్గమించె. ఆయమ వెంబడి కొందఱు సుందరీమణులు తురగంబులను, గొందఱు మత్తేభంబులను, గొందఱు రథంబులను నెక్కి శస్త్రాస్త్రంబులం దాల్చి రోషకషాయితేక్షణలై చని యమ్యాదవు

లపై శస్త్రవృష్టిం గురియందొడంగుట ననంగపుత్రుండు గని చెంగటం జెలంగు హేమాంగదునితో నిట్లనె. ౩౧౫

క॥ హేమాంగద! యీ సుందరభామిను లెవ రిచటమనకు భద్రంబెటులౌ
నీమెయి వీరలు బాణస్తోమము మనపైన వేయందొడంగిరి చెపుమా! ౩౧౬

క॥ అనవుడు హేమాంగదుఁ డిట్లనియెను సత మీస్థలంబు నంగనపాలిం
చును మగరాయం డిచ్చట మనఁజాలఁడు నిక్కువమ్ము మారకుమారా!

ఆ॥ దాన నిప్పుడిచటఁ దనరెడి స్త్రీలతోఁగూడిరాణి మనదుఘోటకంబు
బట్టికొని స్వకీయపట్టణంబందు బంధించి పోర నేగుదెంచె నిట్లు ౩౧౮

ఉ॥ ఈరహిఁజెప్పఁ గార్ష్ణిసుతుఁ డిట్టుల నడ్గఁదొడంగె వాని నీ
ధారుణి సుందరీమణి సతంబును బాలనసేయుచుంటకున్
గారణమేమి? యెక్కతన గండఁడిటన్ బ్రతుకంగలేఁడు వి
స్తారముగా వచింపు మది సర్వమెఱుంగుదు నీవు భూవరా! ౩౧౯

ఉ॥ నావుడు భూపుఁడున్ దన ఘనప్రతిభున్ గురుయాజ్ఞవల్క్యునిన్
భావమునన్ దలంచి స్మరుపట్టికి నిట్లనె యాజ్ఞవల్క్యుచే
నీ విషయంబు జంపకను నేను సమగ్రముగాను వింటి మున్
గావునఁ జెప్పెదన్ వినుమ కార్ష్ణిజ! వృష్ణికులప్రదీపకా! ౩౨౦

క॥ కృతయుగమందున నీ వసుమతి నారీపాలుఁ డనెడి మండలపతి వి
శ్రుతమతిమంతుఁడు సుందరుఁ డతిబలవంతుండు నగుచు హాయిగ నేలున్.

సీ॥ రాకాసుధాకరరమ్యాస్య పంచాస్యమధ్యమ మధ్యమామండలమణి
పద్మినీసమగాత్ర పద్మిని, పద్మినీకుంభపయోధర కుందరదన
సింహళభవనరసింహాసంహాననాస్త్ర, యమలగుణాంచిత హంసయాన
నీలవలాహకనిభవాల తిలపుష్పసమనస జలరుహసామ్యనయన

తే॥ యైన మోహిని యను నొక యతివ నతఁడు
భార్యగాఁగొని దాని లావణ్యమనెడి
సంద్రమున మున్గి నూరు వత్సరములు సను
దాఁకఁ బెఱపనుల్ విడి సతతము రమించె. ౩౨౨

క॥ అత్తఱిఁ బురజనులందఱు నుత్తలపాటులనుబొంది యొనరుపఁ గదనం
బత్తొయ్యలిఁ గని నేర్పునఁ దత్తాదృశయుద్ధములను దలఁగించె విభూ! ౩౨౩

క॥ ఈ రహి గడచెడి తఱిలో నారాజును జూచు కోర్కి నష్టావక్రా
ఖ్యారాజితమునివరుఁ డా నారీపాలు సముఖంబునకుఁ బోయెఁగదా! ౩౨౪

చ॥ పడపడి తద్ధరేశ్వరుఁడు వచ్చినతన్మనివచ్చి స్త్రీయవహా
సుదతికి జిక్కియుండియునుఁజూచి పకాపకనవ్వి యయ్యో! యీ
ముదుసలి యీ కురూపి యెటు మోహిలకు నెచ్చటనుండి వచ్చెనో
యదవదసెందె నా హృదయమంచుఁ బరాఙ్ముఖుఁడయ్యె నేవత్రో ౩౨౫

ఉ॥ అంతట మానికాంతుఁడు నహా! యరరే! సరి యో నపుంసకా!
కాంతకుఁ జిక్కి మార్ఖ్యమునఁ గాంచక నాకవమాన మిప్పు డిం
తింతనరానియట్టులుగ నీవొనరింతువె? యీ వసుంధరన్
గాంతలె పూని యేలుదురుగాక సమంజసభక్తి నెప్పుడున్ ౩౨౬

క॥ పురుషుండిట దొర యయినన్ ద్వరగా నశియించితీవుఁ దద్ధేతువుచే
నరమున లెమ్మా! పొమ్మా! యురుభీకరవిపినములకు నుచ్ఛిష్టపతీ! ౩౨౭

మ॥ మగవాఁడెవ్వఁడుగాని యీస్థలిసిఁ బ్రేమన్ యోషిదుద్ఘంబుతో
దగి సంభోగచమత్కృతుల్ సలుపునో తద్దక్షుఁడబ్దాంతమం
దు గతించున్ ధ్రువమిద్దియాతననుచున్ దూర్ణంబుగాఁ జేరె స్త్రీ
యగృహంబంతఁ దదుక్తి షండుఁడగు నాజ్యానాయకుండాదతోన్. ౩౨౮

మ॥ తను దా నిందనుసల్పికొంచుఁ దనకున్ దాపొన్న కష్టాళి కా
మునిశాపంబె నిదానమంచెఱిఁగి యీ పూఁబోణికిన్ జిక్కి మం
చిని జెడ్డన్ గనలేని దుర్మదముతో సీసీ యటం చా మహా
ముని కే నెంతటి తప్పుజేసితి నహా! మూర్ఖుండ నైతింగదా! ౩౨౯

ఉ॥ భ్రష్టుఁడ మందభాగ్యుఁడను వైతరణీతటినీసమర్హుఁడన్
దుష్టుఁడఁ బాపుఁడన్ శమనదూతనికాయవిలోకితుండ ను
చ్ఛిష్టుఁడనైన నన్నెవరు శీతలదృష్టినిగాంచి న్వాపభ్రన్
గష్టములన్ హరించి దయఁగాతురొ యంచుఁ దలంచి వెంటనే ౩౩౦

క॥ సదనము విడి వనవనముల
నదవదపడు మదినిదిరుగు చచ్యుతు ముక్తి
ప్రదుఁ గొనియాడుచు శ్రీహరి
పదమొందెను దుట్టతుదకు బ్రద్యుమ్నసుతా! ౩౩౧

క॥ అకారణమునఁ బురుషుం డొక్కఁడు నిటనుండి యేల నోపఁడుగాదే
యికారణినిఁ గాంతామణు లెక్కువగా నేలుచుందు రిది నిజ మధిపా! ౩౩౨

క॥ హేమాంగదానిరుద్ధులు నీమాదిరి జెప్పికొనుచు నెసఁగెడితఱి నా
భామలు స్వైరిణులు శరస్తోమమిడిరి వారిపైని దుష్క్రిధతోడన్ ౩౩౩

ఉ॥ పిమ్మటఁ గార్ష్ణిపుత్రకుఁడు వేఁకను వచ్చినసుందరీనికా
యమ్మనుజూచి వింతవెఱలంది సతీమణులైన వీరితో
నిమ్మెయి నెట్లుపోరెద నిఁకేమియొనర్తు ? నటంచు నెంచుకా
లమ్మన రాణియైన నవలా చని తద్యదునేతకిట్లనెన్. ౩౩౪

చ॥ నిలునిలుమయ్య శూరవర! నీవెటకేగెదవయ్య సైన్యముల్
గలిగియుఁ జింతచేసెదవె కంతుమహోజ్వరపీడితాత్మ నే
నలకన నిన్నుగెల్చి ముదమందుచు నిత్తఱిఁ గేలుబొమ్మగా
సలిపెదనన్న నాతఁడనసాగె నిటుల్ వెఱ దీనవాణితో ౩౩౫

చ॥ తరుణిరో! దేవదేవుఁడగు తద్ధరి దీహరి, తత్సవార్థమై
తరలెను స్త్రీలతో నెట మృధంబొనరింపనుగాన ద్వారకా
పురిఁజని శ్రీహరిం గనుమ బుద్ధిఁ దదాఖ్యఁ దలంచినంతనే
యరుగు నఘంబులెల్ల నిఁక నాతనిగన్న ఫలం బలంతియా ? ౩౩౬

క॥ అనవుడు విన్న సురూపయుఁ దన ప్రాక్తనవృత్తమెఱిఁగి తమితోఁ బూర్వం
బున మోహిని బ్రాహ్మీపతి కనినటు లీరహి నిబల్కె ననిరుద్ధునకున్ ౩౩౭

చ॥ మును హరిపౌత్ర! నేను దివి మోహినియంచు జనంబుఁ బిల్వఁగా
వనరుహపత్రనేత్రయుగఁ బంకజగాత్రను నౌచు లోకపం
క్తిని వలపించు వేశ్యనుగదే! యొకవేళ మరాళమెక్కి వే
చను నజుఁజేరి "నన్నుగొని చక్క రమించు"మటంచుఁ గోరితిన్. ౩౩౮

తే॥ దానికొప్పమి శాపమాతనికి నిచ్చి వెసఁ గకుద్మతి యనుగంగ విమలతటము
నందుఁజేరి దుష్కరతపం బాచరింప మెచ్చి విధి వచ్చి తెలుపుమీ యిచ్చననియె

ఉ॥ అప్పుడు నేను వేడ్కపడి యార్తియుతన్ శరణాగతన్ ననున్
దప్పక నీవు గైకొనక తర్లెదవేని నిటన్ క్షణంబులో
నిప్పగిదిన్ దపంబున గృశించిన నా మెయినిం ద్యజింతు నం
చిప్పుడెఱుంగుమంచు వచియింపఁగ నాతఁడు నాకు నిట్లనెన్. ౩౪౦

చ॥ తమకము మానుమీ వెత ద్రుతంబుగ వీడుమ చూడుమిట్లు మో
దము గనుమీ మనోరథము త్వత్పరజన్మమునన్ లభించు న
బ్రమునిడురూపుతో హరికిఁ బౌత్రుఁడనై యనిరుద్ధనామధే
యమున జనింతు ద్వారకను నట్టులె పుట్టెదవీవు స్త్రీధరన్. ౩౪౧

ఉ॥ అత్తఱి నిన్నుగైకొనెద హర్షముగూర్చెద నీకు మోహినీ!
రిత్తయటంచు నెంచకుమ ప్రీతిని జెప్పితినంచు నేగె నో
సత్తమ! నీవె యా విధివి సత్యము నే నలమోహినిన్ జుమీ
యిత్తఱి నన్గ్రహించుటకె యీ వరుదెంచితివంచు నెంచెదన్. ౩౪౨

ఉ॥ అంతఁ దదంగనోక్తులకు యాదవవర్యులు వింతపొందఁగా
గంతుసుతుండు మోహినిరో! కైకొనెదన్ నిను ద్వారకాపురిన్
సంతసమొప్ప నీవటకు సాగుమ! యీసవవాజిరత్న మ
త్యంతము గాచు చేగవలె దానఁ బదశ్వము నా కొసంగుమా ౩౪౩

చ॥ అనవుఁడు తత్స్వరూప ప్రమిలాహ్వయమంత్రిణి కెల్లరాజ్యమున్
ధనమును నప్పగించి తమిఁ దద్దయు మాస్మరసూతికిచ్చి వే
చనె నల ద్వారకాపురికి సప్తియు ముక్తిని బొంది సింహళం
బునఁ దిరుగంగ సాగెఁ దనబుద్ధికిఁ దోఁచినయట్లు భూమిపా! ౩౪౪

## అనిరుద్ధుండు సింహళదేశంబును గెల్చుట.

తే॥ అవల దద్వాజివరము తృషార్తయగుచు నొక్కవాపినిగనియందు నుదకమాను
చుండ భీషణ నామాసురుండుగాంచి చదివి తత్పత్రముంగొనె నవహయంబు

తే॥ అటుల బహువృక్షయుతవాపి యందు జలము
ద్రాగు తురగంబు గైకొన్న దనుజవరుని
యాదవులుసూచి కిన్కతో నరెరే! నిల్వు
మెవ్వఁడవు నీవు పోయెదవెటకుఁ జెపుము! ౩౪౫

శా॥ ఈయశ్వం బలయుగ్రసేనుని దిటుల్ బృందారకక్షీదిత
శ్రీయజ్ఞార్థము బైలుదేరె సుమి! యేశ్రేష్ఠుండు సిద్దానినిన్
దాయన్ రాఁడు గ్రహింపఁబోఁడు సరిపో! ధైర్యంబుతో నిన్ననిన్
మాయన్ జేతుము వాజినింగొనెదమో మాయావి! ముమ్మాటికిన్ ౩౪౬

చ॥ నరక కలంక బాణ దితినందనులన్ బలగర్వితానుజో
ద్ధురశకునిన్ మరెందరనొ దోర్బల దర్పితులన్ క్షణంబులో
నఱకితి మేమిఁకన్ నిను దృణంబుగఁగాంచి వధింతుమందునన్
సరగునవచ్చి మాకు నలసైంధవరత్నమొసంగి యేగుమా! ౩౪౭

చ॥ పిదప నమర్త్యభీషణుఁడు భీషణనామకుఁడైనవాఁడు త
ద్యదువర వాక్యముల్ విని మహాగ్రహమొంది గదాసిశూలముల్
గుదురుపడంగ నిట్లనియె గొంటెతనంబునుమాని పూర్తిగా
నెవఁదురగాళవీడి చనుఁడీ! యిటనిల్చినఁ జత్తురిత్తఱిన్ ౩౪౮

చ॥ ఎవఁడనటంచు నెంచితిరొ? యేను జగంబులగెల్చి కీర్తినె
క్కువగయికొన్న భీషణుఁడ గొప్ప బలిన్ నరులైన మీరు మా
నవకులభక్షకుండనగు నన్నెదిరింతురె? గెల్తురెట్లు? యా
దవభటులార! నాదు సవిధంబున నిట్టులఁ గూయుచుందురే! ౩౫౦

చ॥ గతసమయంబునందు నొక గర్వితయాదవుఁడాని విశ్వజి
త్క్రతువొనరింప నెంచి తురగం బనుపంగని లంకనున్న నా
దితిసుతసేనఁ దోడ్కొనుచుఁ దిగ్గియు నీడకువచ్చులోనఁ ద
త్క్రతువు సమాప్తమయ్యెనని కయ్యపుఁదిండి వచింప వింటిగా ౩౫౧

వ॥ అత్తరుణంబునం గర్తవ్యం బేమియుఁ దోఁచక మిన్నకుంటి. క్రిమ్మఱ ని త్తఱి నాతండే వ్యర్థంబుగా నశ్వమేధసంకల్పం బొనరించి యా ఘోటకంబును బంచె. ఇయ్యది మత్కరగతం బయ్యె. ఇద్దానిని మీరు విడిపించుకొనఁజాలరు. గానఁ బొండు. లేనిచో నాయనుచరులగు నాలుగులక్షలమంది రాక్షసులు మిమ్ము నిమిషమ్ములో హింసింపఁగలరు. ఇచటికి ద్వాదశయోజనంబులలో సముద్రంబునం గట్టంబడిన పట్టణం బొండు నాయది కలదు. అద్ది భుజగంబులతోఁ బొల్పారు భోగవతీపురంబు బోలెఁ బాలసుదిండులతోఁ జెన్నారు. దాని కుపలంక యని పేరిడితి. అద్ది శత్రువుల కభేద్యంబు. ఇదిగో మత్పురి కేగుచుంటినని చెప్పి తదశ్వంబుఁగొని యాకాశమార్గంబున నిజపట్టణంబునకుం బోవుటగని యదువరులు దుఃఖించిరి. కార్ష్ణి జుండు నది దెలిసికొని మన మెట్టు లీయసురనీతంబగు హయంబును గైకొనగలమో యని దైన్యంబుతోఁ బ్రశ్నింప సాంబాదులాలించి మహాప్రభూ! శోకంబు మానుము. మేముండగా జడియు టేల? పక్షసహితంబులగు గుఱ్ఱంబులును, నమోఘంబులగు శరంబులును, కామగంబులగు విమానంబులును, లోకద్వయవిజిగీషులగు వీరులును, నీ సైన్యంబునం గలరు. మేమా యశ్వంబుల నెక్కియో, శరంబులతో శరధికి నట్టెడ గట్టియో, విష్ణుదత్తవిమానం బధిరోహించియో, మరి యొకమార్గంబుననో మా రురపట్టణంబు బ్రవేశించి నిర్జింపఁగలమని వచింప ననిరుద్ధుం డాలించి యుద్ధవునిం గాంచి 'బుద్ధిమదగ్రణీ! మన తురగం బరికరగతం బయ్యె. ఇందు మన మేమి చేయవలయు? భవదాజ్ఞానుసారంబుగా నడచెదనని ప్రార్థింప, నాతండు లజ్జానతాననుండై దేవా! శ్రీకృష్ణునకు, దత్పుత్రపౌత్రులకును విశేషంబుగా దాసుండ. భవదాశయం బెద్దియో వ్యక్తీకరింపుమన నా యదునాయకుండు మంత్రివరా! యక్షౌహిణీ దశకంబుగొని సారణకృతవర్మయుయుధానసాత్యక్యక్రూరాదులను నిచటనుండెడి సైన్యంబును రక్షింప నియమించి విష్ణుదత్తవిమానంబున నెక్కి చనెదనని చెప్పి తదంగీకృతిం బడసి యుద్ధవహరిపుత్రసైన్యసహితంబుగాఁ దద్విమానం బధిష్ఠించి పైనం బొనరించె

తే॥ అపుడు సురనర్త్మ కెగసిన యా విమాన మర్కబింబవిధంబున నతిశయిల్లె
వానరాన్విత జానకీభర్తమాడ్కి యాదవోపేత కార్ష్ణిజుం డతిశయిల్లె ౩౫౩

తే। అంత రుక్మవతీపుత్రుఁ డటులఁ బృథులసేనతోఁ గూడి యుపలంకఁ జేరి పైన
నిలిచి యాశీవిషోపమ నిశితబాణములను గైకొని మిక్కిలి యలుకతోడ

సీ॥ ఉపవనవనముల నుత్తరించి మనోజ్ఞ భవ్యహర్మ్యంబులఁ బడగొట్టి చి
క్రీడాస్థలంబులఁ బాడుగా నొనరించి ద్వారంబులెల్ల బయిర్వలుగఁజేసి
గొప్ప గోపురములఁగూలిచి యెత్తైన కోటల నన్నిటిఁ గూల్చివేసి
చిత్రశాలల నెల్ల చీకాకుగాసల్పి కొలువుకూటంబులఁ గూలనేసి
తే॥ మరియు నానావిధంబులఁ బురిని ధ్వంసమును బొనర్పఁగ నాసురుల్ గనుచు సతిశ
యముగ హాహాకృతుల్ సేసిరట్టి భీషణాసురుం డాత్మపురిఁ గాంచి త్రాసవిడిచి

—♦ అనిరుద్ధుండు భీషణునితోఁ బోరుట. ♦—

చ॥ భయపడవల్దటంచుఁ బలుభంగులఁ జెప్పి సురారివారముల్
రయమునఁ దోడుకొంచు సమరంబొనరింపఁగ నేగెనంత నై
త్యయదువరేణ్యసేనలకు నాలము నిస్త్రితలంకలోన న
ల్లయమరవైరి వానర బలంబులకై నటులయ్యె వింతగాన్ ౩౫౭
ఉ॥ అందున యాదవాంబక చయంబున వాతహతాగరీతిగాఁ
గొందఱు రాక్షసోద్భటులు గూలిరి కొందఱు నీచవక్త్రులై
కొందఱు నూర్ధ్వవక్త్రులయి కొందఱు భీతిని భిన్నకంఠులై
కొందఱు భిన్నహస్తులయి కొందఱు వ్రాలిరి వార్ధిఁ బార్థివా! ౩౫౮
తే॥ తత్సమయమునఁ బృథులవై తరణికరణి వెలుగొందుచుండెడు రక్తనిర్ఝరణివాఱ
నసురపతి చూచి విస్మయంబంది యాదవులఁ దీక్ష్ణదృష్టితోఁ గలయఁగాంచి
చ॥ యదుభవులార! హీనబలులట్టుల నిత్తఱి సంగరంబునన్
చదలున నిల్చి చేతురొకో? సన్నుతిపాత్రమె యేరికైన మీ
కు దృఢబలంబె యున్న యెడఁ గుంభినికిన్ డిగిరండు దండి న
న్నెదిరిచి పొందు! గుజ్జము గ్రహింపుఁడు పెంచుఁడు కీర్తివల్లరిన్ ౩౫౯
ఉ॥ నావుఁడు కార్ష్ణి జుండు కరుణామయుఁడౌట విమానమున్ ధరన్
ఠీవిగ డించి యిట్లనియె డీకొనుమా! నను భీతివీడు మే
లావృథకుందుచుంటివి పలాశవరా! యన నా బలిష్ఠుఁడున్
వే విలుబూని వానిపయి వేసెను బంచశితాంబకంబులన్ ౩౬౦
తే॥ అప్పుడనిరుద్ధుఁడున్ గాంచి యాత్మసాయకములతో నాశరముల ద్విఖండములుగ
సల్పి మరిఁ దూఁపుతో వాని చాపవరము నఱికె యాదవులంద ఱానందమొంద
ఉ॥ ఆసమయంబునందు వసుధాధిపుఁ డన్యశరాసనంబు బల్
రోసముతో గ్రహించి పలువుర్వులఁ డంకృతి సల్పి సర్పరే
ఖాసమశాతబాణశతకంబిడెఁ దద్ధతి దద్రథాశ్వముల్
మాసెను సాదిసీల్గె మరి మన్మథపుత్త్రుఁడు మూర్ఛిలెన్ భువిన్ ౩౬౧

చ॥ పదపడి యాదవోద్భటులు వ్రాలిన స్వప్రభుఁ గాంచి కిన్కచే
నదరఁగ నోష్ఠముల్ మిగుల నాశుగపంక్తిని నా బలిష్ఠుపై
గొదకొని వేయ వాఁడుగని కోట్లకొలందిగ నున్నవారలన్
గదఁగొనికొట్టె సింగము మృగంబులఁ గోఱలఁగొట్టినట్టులన్ ౩౬౩

తే॥ తద్గదాప్రహారమున యాదవులు భువిని భిన్నసర్వాంగులై కూలి రెన్నఁదరమె?
యద్దిగనుగొన్న హలితమ్ముఁడై నగదుఁడు తనగదన్ గొని యాదైత్యుతలనుగొట్టె

ఆ॥ దానిదెబ్బ నతఁడు ధరవణకించుచు వజ్రనిహతనగము వలెను బడియె
నవల దైత్యులుజని యాదల పగులగా సొమ్మసిలిన స్వపతిఁజూచి కినుక ౩౬౫

చ॥ శరపరిఘాతఖడ్గవరచాపగదల్ ధరియించి తద్దుర్
నఱకగ నెంచి యాగ్రహమునన్ జని రయ్యదిగాంచి యాబలుం
డరమున వజ్రకల్పగద నంది మృగేంద్రము కుంభికుంభముల్
గఱకగు దంష్ట్రఁగొట్టినటుగాఁ బ్రహరించెను దత్క్షణంబునన్ ౩౬౬

తే॥ ఎచట భీషణుండేఁడి వాఁడెచట నా ప
గతుఁడునక్కనో యెచటి కాఖలుఁడుసనేనో
యంచుఁ గార్ష్ణిపుత్రుఁడు లేచె యాదవులది
గాంచి జయజయధ్వనులఁ గావించి రధిప! ౩౬౭

—♦ బకాసురుండు అనిరుద్ధునితో యుద్ధంబొనర్చుట. ♦—

వ॥ అంత నంజనాద్రినిభప్రభుండును, దశతాళకవృక్షాయతగాత్రుండును, దుర్నేత్రుండును, దుశ్చరిత్రుండును, లలజ్జిహ్వుండును, భీషణాసురజనకుండు నగు బకుండనురాక్షసుం డేతద్వృత్తాంతంబు నారదమహర్షిచే విని క్రుద్ధుండై త్రిశూలంబు దాలిచి గదం గైకొని వామహస్తంబుతో నొక్క మత్తమాతంగంబు బట్టికొని వదనగహ్వరంబున మెక్కుచు రుధిరంబు శరీరంబున ధారలుగట్టి పాఱుచుండఁ బిశాచంబుచందంబున భయంకరుండై తాళతరుపరిమితచరణంబులతో ధర యదరునట్లు నడచుచు మానవులు దండధరుండేమో యని యడలుచుండ నాకులకుసైతం బకంబు గల్పింపంజాలి యరణ్యంబునుండి నిర్గమించి నిజకుమారుండు మూర్ఛిల్లియున్న రణరంగంబున కేతెంచె. యాదవులా భీభత్సాకారంబున వచ్చినవానింగాంచి కోలాహలంబులం గావించిరి. ఆ బకాసురుండు తన్నుంజూచిన నిశాటోద్భటపటలంబు సంతసిల్లుచుండ మూర్ఛితుండగు సుతుని విలోకించి దుఃఖించె. తన్ముహూర్తంబుననే భయంబుతో గదుం డెటకుఁబోయెనని పలుకుచు సొమ్మనుండి భీషణుండు నుత్థితుండయ్యె. బకుండు తెల్విం గాంచిన తన తనయునింగని యలరి నా భాగ్యవశంబున బ్రతికితివే యని వచించి చక్కని మాటలచే నూఱడించి వాని నమస్కృతులం గైకొని సంతోషంబుతో సర్వరాక్షసమధ్యస్థితాత్మపుత్రున కిట్లనియె.

తే॥ తృణసమానయాదవులతో దిట్టలనుగు మనకు రణమెట్లుగలిగె నోతనయ? యెట్లు
నీవు గడఁబట్టితి విఁకెట్లు నిర్జరారు లంతమొందిరో? చెప్పుమ! సమగ్రశక్తి.

చ॥ అనవుడు వాఁడు తండ్రి కలయాదవనాయక వాజిమేధవా
ర్తను విశదంబుగాఁ బలికెఁ బద్మకుఁడున్ నిజపుత్రకోక్తులన్
విని కొని స్వీయఘోరగద, వే జ్వలనుండు వనంబునందుఁ జొ
చ్చినవిధి యాదవధ్వజినిఁజేరి మహోగ్రహజృంభితాత్ముఁడై. ౩౭౦

చ॥ పదముల బాణయుగ్మమున బాహువులన్ గదశస్త్రధారులై
యెదురుగవచ్చు వైరుల మృగేంద్రము గిక్క మృగోత్కరంబులన్
జదిపినయట్లు కొట్టి రథసైంధవనాగము లాకసంబునన్
మదమునఁ బాఱవైచి, తిని మానవులన్, బొనరించె బొబ్బలన్. ౩౭౧

తే॥ దాన విశ్వంబు లోకయుక్తముగ మారుమ్రోఁగె బధిరీకృతంబయ్యె భూజనంబు
యాదవులు ఖిన్నమానసులగుచు మిగుల నహాహా! హాహాకృతుల్ సేసి రవనినాథ!

క॥ పదపడి సాంబుఁడు తమబలము దనుజపతిచేత బాధఁబొందుటఁ గని నె
మ్మది బాగిలి పంచశరములఁ గుదిరిచి తన విలున నట్టి కుటిలుపయి నిడెన్.

ఆ॥ అవ్వి యేగి యతని యంగంబులందుండి దూసి భూమిలోన దూరి పోయి
సుతలలోకమొంది శుద్ధోదకంబును ద్రాగి శాంతిఁబొందెఁ దత్పరమున. ౩౭౪

చ॥ బకుఁ డల సాంబుబాణముల బాధల నొచ్చుచు వ్రాలి క్రమ్మఱన్
సుకముగలేచి పోరుటకు శూరత రాఁ గని యల్ల కృష్ణపు
త్రకవరుఁ డైదుతూపులఁ గుఱిన్ బఱపంగ నతండు వేగ లం
కకుఁ జని సొమ్మతోడఁబడి క్రమ్మఱ నుత్థితుఁడై మహోరుషన్. ౩౭౫

ఉ॥ హుమ్మని లంకనుండి యని కుద్ధతివచ్చి కృపీటయోనిసా
మ్యమ్ము శిఖాత్రయాన్వితము నైన త్రిశూలముఁ గొంచుఁబూవునా
గమ్మన వేసినట్లతని కంఠముపై నిడ నా బలుండు స
ర్పమ్మను ద్రుంచు పక్షివిభుభాతి శరంబునఁ జెండె దానినిన్. ౩౭౬

చ॥ పదపడి తద్బకాసురుఁ డపారరుషన్ జని వజ్రకల్పమా
గదఁ గొని తచ్ఛతాంగతురగధ్వజసూతుల నుగ్గునూచగా
జదిపి యిఁకన్ నశింతువరె! సాంబుఁడ! యన్యరథంబు నెక్కి రా!
కదనముఁ జేయరా! యటులగాని యెడన్ నయదూరమానురా! ౩౭౭

క॥ అని విడి మనుమని గటువుగ ననుమాటల నాలకించి యాతఁడు నగుచున్
దనుజా! సరె యను చురుగదఁగొని తత్పృథువక్షమందుఁ గొట్టెను గసితో.

చ॥ దానవ బకుండు నొచ్చియు నెదన్ గణియింపక సాంబువీడి పం
చాననమేణసంతతి వెసన్ జని ధ్వంసముఁజేయుమాడ్కిఁ ద
త్సేనలఁజేరి హస్తి, హయ, చిత్రరథ, ధ్వజ, సాది, యోధ, సం
తానముఁ జెండె యాదనవితానము క్షోభనుబొంది యార్వఁగాఁ. ౩౭౯

ఆ॥ అపుడు కృష్ణపౌత్రుఁ డాత్మబలంబుల వ్యథలఁబెట్టు బకునిఁ గ్రుధనుగాంచి
పిలిచి యొరఁడ ఏవు భీతి యింతయులేక యెట్లువచ్చితివి? వచింపు మధమ!

మ॥ అరరే! నీవు బకాసురుండవటరా యచ్చోట మా సాంబుతోఁ
దురముఁ జేయుచునుంటివే! యతఁడు నిన్నోడించెనా? కొట్టెనా?
వెఱచే నీసలికేగుదెంతువె! యిసీ! వీరార్హకృత్యంబె? రా
త్వర నాతో రణమాడు మల్పులపయిన్ వ్యర్థంబుగాఁ బోకుమా! ౩౮౧

తే॥ పౌరుషములేని బ్రతు కొకబ్రతుకె చెపుమ!
శక్తి నీకున్న నాతోడ సాహసించి
కయ్యమాడుమ! యని పలుకంగ బకుఁడు
దండితాడిత ఫణివలె దండి మండి ౩౮౨

క॥ అనిరుద్ధునితో యుద్ధము బొనరింపఁగ నేగె నంతఁ బుష్పాస్త్రసుతుం
డును గని దశనారాచములను దద్బకదనుజుఁ గొట్టె లయయమసముఁడై.

చ॥ అవి చని వాని దేహము రయంబున భిన్నమొనర్చి యందునుం
డి వెడలి తత్సుతాంగము గడిందిగ నొవ్వఁగజేసి భూమిలో
నవిత ధరిత్రిఁజేరెసుమి యంతట తద్దనుజుండు తద్ధరి
భువి నిజపుత్రుతోఁ బడియె మూర్ఛను వజ్రహతాద్రిమాద్రిగా. ౩౮౪

తే॥ అపుడు జయజయారావముల్ యాదవబల
మందుఁ బుట్టె దుందుభులు భేర్యానకములు
శంఖగోముఖముఖవాద్యసమితి మోగెసె
దనుజు లిలఁబడ్డ స్వప్రభుఘనులఁ గాంచి ౩౮౫

చ॥ కరకరితో ద్విశూల శరకార్ముకతోమర భిండిపాల ము
ద్గరకరవీరశక్తి పరిఘాతగదా ముసలాది హేతులఁ
దొరగొని యాదవోద్భటులతో రణమాడఁగ నేగి రంత నా
హరిసుతుఁడైన సాంబముఖులందఱు గన్గొని యాగ్రహంబునన్. ౩౮౬

క॥ ఆ రాక్షసయోధులపైఁ గ్రూరతరశరంబులేయఁ గొందఱు దనుజుల్
పాఱిరి గొందఱు యమపురిఁ జేరిరి గొందఱును మూర్ఛఁజెందిరి భూపా!

క॥ ఏతత్క్షణమందుసనే భూతాహితుఁడైన బకుఁడు బొంది తెలివినిఁ
భీతినిగొలుపుచుఁ జేతోజాతసుతుని మోలకేగి సరభసవృత్తిన్. ౩౮౮

చ॥ పెనగడఁబూని కార్ష్ణిసుత! వేచనుమా! యిది వేటు దీనిచే
బ్రదుకవు గాచికొమ్మనుచు వైచెను దచ్చిరమందు నంత నా
మదనసుతుండు చండధరమానితదండముతోఁ దదీయవకా
గదఁ దెగవేసె రోసమునఁ గాఱులఁ జెల్మ్రిని జెండీనట్టులన్. ౩౮౯

క॥ తరువాతఁ దప్పకుం డుద్ధురరుషఁ దన నోరఁ దెఱచి తోరగాఁ దమకే
శ్వరుఁడగు ననిరుద్ధునిఁ దిన నుఱికెఁ దమము శశిని గ్రసింగ నుఱికినకరణిన్.

వ॥ అంత ధన్వివరుండగు సుమధన్విపుత్రుండుగని క్రమ్మఱ నిజచండదండంబు గ్రహించి తద్దానవేంద్రునిం బ్రహరింప నాతండు భగ్నశిరుండై నోట రుధిరంబు గ్రక్కుచు మూర్ఛతో నేలఁగూలుట తత్పుత్రుండగు భీషణుం డాలోకించి రోషించి పరిఘాయుధంబుతో యాదవానీకంబును మొత్తె. అత్తఱి నచ్చైత్రజపుత్రుండు నాగపాశంబులతో నా పలాశునిం బంధించి నాగాంతకుండు నాగంబు నీడ్చినలాగున నీడువ నాతం డధోముఖుండై యుక్కడక్కి యెక్కువగాఁ గుందుచుండుట సాంబుండు విలోకించి దానవా! వేగమే యీ హయంబుఁగొని యనిరుద్ధునకిచ్చి శుభంబు బొందుము. ఈ యుషామనోహరుండు నరసురసురజ్యేష్ఠాది స్తుతిపాత్రుండును, పాపనాశకుండును, బరమాత్ముండు నని యెఱుంగుము. నీ వీ మహామహునిచే నిర్జింపఁబడుట యొక చిత్రంబులోనిదిగాదు. కానఁ జింతింపక కృష్ణసంతోషార్థంబై మాతోఁ గూడఁ జనుదెంచుమని యుపదేశించి తత్పాశంబులను విప్ప నా భీషణాసురుండు మోదిల్లి నిజపురికరిగి తత్తురగంబును ద్రవ్యసహితంబుగాఁ గొనివచ్చి యుప్పచ్చవిల్తుని పట్టికిచ్చి నమస్కరించె. అద్దానికి మెచ్చిన యీ యదువరుం డశ్వసంరక్షణార్థంబై మా వెంట రమ్మనికోర నా రక్కసుం డించుక యాలోచించి దేవరా! నా తండ్రి తెలివిం గాంచి లేచినమీఁదఁ దదాజ్ఞఁగొని నిస్సందేహంబుగా మీ వెంట రాఁగలనని వచింప నా యనిరుద్ధుండు వల్లెయని క్రతుతురగ హరిసుతపతాకినీయుతంబుగా విమానమునందెక్కి జయదుందుభులం జాటుచు నా యుపలంకనుండి వియత్తలంబున కెగసి క్రమంబుగా నకూరాది పరివృతస్థలంబున కేతెంచిరి. ౩౯౧

తే॥ అంత నక్రూరముఖవీరు లరుగుదెంచి నట్టి కార్ష్ణిజాదులఁ గాంచి యాతురతను
క్షేమమడుగగ దామటఁ జేసినట్టి పనులనన్నిటిఁ జెప్పిరి వారు భూప! ౩౯౨

ఆ॥ కార్ష్ణిజాశుగహతిఁ గాశ్యపిన్ మూర్ఛతోఁబడిన బకదనుజుఁడు పడిని లేచి
యాదవోద్భటులట నగుపడమిని నిజతనయు నడిగెఁ దెలుపుమనుచు నంత

క॥ భీషణ దైత్యుఁడు నిర్జరభీషణుఁడగు పితకు నలపవృత్తిని జెప్పన్
రోషమున రేగి యా బకదోషాచరుఁ డిట్టులనియె దుండటీకముతోన్. ౩౯౪

చ॥ అనుకొనినంత నయ్యెనొకొ ? యాదవయోధుల నేనెఱుంగనే
వని మృగరాజుభీతి మృగపంక్తులు పాఱినతీరునన్ ననుఁ
గని పరువెత్తరే వెఱను గావున ద్వారక కేగి వారిఁ జ
య్యనఁ బరిమార్చి భూమిని నయాదవిగా నొనరింతుఁ బుత్రకా ! ౩౯౫

ఉ॥ నావుడు భీషణాసురుఁ డనన్ సమకట్టె నిటుల్ మహాబలీ !
నీవు రుషన్ ద్యజింపు మిది నెమ్మినిగూర్చెడివేళగాదు త
ద్దైవముఁ జక్కఁగా మనకుఁ దారకమై యెపుడుండు నప్పుడ
క్కావరులన్ వధించెదముగాక గ్రహింతముగాక కీర్తినిన్. ౩౯౬

తే॥ ఇటులఁ దనపుత్రుఁ డాడిన యెల్లనుడుల విన్న యా బకదైత్యుండు మిన్నకుండి
జంతుసంతతి మెక్కుచు సాధ్వసప్రదాటవులఁ జరించుచునుండె నవనినాథ !

ఆ॥ అంతఁ గృష్ణపౌత్రుఁ డా యజ్ఞతురగంబు బహుళదానములను బ్రాహ్మణులకు
భక్తినిచ్చి శ్రుతులు పల్కునరీతిగా దిగ్జయంబుకొఱకుఁ దిరిగి విడిచె ౩౯౮

తే॥ పనుప నయ్యది ధైవతస్వర మొనర్చి సర్వదేశముల్ చూచుచు సకలకళల
కిక్కు వెండిమేడలకునిక్కు పృథువనముల కిరువునైన భద్రావతీపురికి నరిగి. ౩౯౯

—♦ యజ్ఞాశ్వంబు భద్రావతీపురికరుగుట. ♦—

ఆ॥ అద్ది యేలుచుండు యౌవనాశ్వనిమౌళిల కరుగుదెంచి నిలువ నాతఁడు గొని
తద్విషయ మెఱింగి తలఁచి కయ్యంబాడ సేనతోడఁ జని మానమెచ్చ ౪౦౦

తే॥ అటుల యుద్ధసన్నద్ధుఁడై యరుగుదెంచి
నట్టి యౌవనాశ్వునిఁ గార్ష్ణి పట్టి చూచి
స్వీయమంత్రిముఖ్యునిఁ బిల్చి యోయి ధీర !
యితఁడెవండొ యేతత్క్షితి యెఱుఁగఁజెపుమ ! ౪౦౧

చ॥ అనవుడు మంత్రి యిట్లనె సుమాస్త్రసుతా ! మరుధన్వదేశరా
జునకుఁ గుమారుఁ డీ విభుఁడు శూరవరిష్ఠుఁడు తండ్రి నీల్గినం
త నితఁడె రాజ్యమేలెడి యథావిధి వీనికి షోడశాబ్దము
ల్దనరు స్వదుష్టమంత్రి నుడులన్ రణమాడఁగ వచ్చె నిట్టులన్. ౪౦౨

తే॥ కాన నీతండు వధ్యుండుగాఁడె యదియుగాక మన హరిన్ గాఁజేసె గార్ష్ణి పుత్ర!
యనఁగ నతఁడు తద్విభునితో ననిఁబొనర్చె గరుడి ఫణితోడఁబోరిసకరణి నపుడు.

ఆ॥ యౌవనాశ్వుఁడు తన యక్షౌహిణీత్రయచమువు నాశమౌట స్యందనంబు
జెడుటగాంచి వనటఁబడుచుంటఁ గనుగొన్న యదువరేణ్యుఁ డిట్టు లతనికనియె.

క॥ లెమ్మా! భూవర! చయ్యనఁ బొమ్మా! నీ పురికి మంత్రపూతహయంబున్
దెమ్మా! నాకది యిమ్మా! రమ్మా! యటుకాని యెడల రణమాపుటకై

క॥ అని గంభీరంబుగఁ బలికిన విని యా ప్రభువు వెఱను గేల్మోడ్చి హయం
బునుగొని యనిరుద్ధున కిడి వినతుండై యిట్లు పలికె వినుతచరిత్రా! ౭౦౮

ఉ॥ ఎత్తఱి ద్వారకాపురి నహీనవిధంబున యజ్ఞమానో నే
నత్తఱి శ్రీరమేశ్వరపదాంబుజదర్శనమాచరింప నో
చిత్తజపుత్ర! వచ్చెదను జేసినతప్పులఁ బ్రీతితోడ మీ
రిత్తరుణంబునందు క్షమియింపవలెన్ గుణాపయోనిధీ! ౭౦౯

తే॥ అంత రుక్మవతీపుత్రుఁ డశ్వముఁగొని యావనాశ్వునిఁ జద్రాజ్యమందుఁ దిరిగి
నిలిపి తద్వందితుండయి నెమ్మరల హయము గ్రమముగ విడె దిగ్జయంబుకొరకు

ఆ॥ అటుల విడువఁబడిన యజ్ఞఘోటము పెక్కు రాజ్యములను గనుచు రాజపురికి
నరిగి స్రోవఁగల సఫరయను నిమ్నగఁ గని యవంతికోపవనముఁబొందె

ఉ॥ ఆ పెనుకాననంబునకు నత్తఱి వచ్చె మహానుభావుఁడున్
శ్రీపతి సద్గురుండు ద్విజశేఖరుఁడున్ శ్రుతిశాస్త్రవేత్త సాం
దీపని, తన్నదిన్ మునిఁగి దివ్యసితాంబరముల్ ధరించి బృం
దాపృథుమాలికల్ మెడనుదాల్చి జపించుచుఁ గృష్ణనామమున్. ౭౧౦

తే. ఆ బుధుండందునన్ జామరాన్వితమును బత్రరుచిరంబునగు శ్వేతవాహముఁగని
యిద్ది యాశ్వమేధీయమె యేప్రభుండు దీని విడిచెనో యని యెంచి మానసమున

—♦ బిందుండనురాజు పట్టిన యజ్ఞాశ్వంబు నొసంగి యనిరుద్ధుని గౌరవించుట ♦—

ఉ॥ ఆ నదియందునన్ జలకమాడుచునుండెడి బిందుఁడన్ ధరా
జానికుమారుఁ జేరి యల సప్తిఁగొనం బురికొల్ప నాతఁడున్
మానసమేతవీరవరమండలితోఁ జనుదెంచి కొంచు న
ద్దానినిఁ జూపి యెజ్జక నెఁ దద్గళభాసురపత్రవార్తలన్. ౭౧౧

తే॥ అంత సాందీపనియు భావమందు ముదముఁబొంది రాజాధిదేవీభవుఁడును బుద్ధి
మద్వరుండును నగు బిందుమానవాధినాథునకుఁ బల్కె నోవజ్రనాభ! యిట్లు

చ॥ ఇది యదుభూపనోచితము కృష్ణజపుత్రక బాధపాలితం
బిది యిటులన్ యదృచ్ఛమెయి నిచ్చటికిన్ జనుదెంచె నా యుషా
హృదయవిభుండు దీనిగనుచిప్డిట కచ్యుతపుత్రయోధులున్
గొదకొని వెంటనంటఁగ నకుంఠితకీర్తిని వచ్చు భూవరా! ౭౧౨

ఉ॥ కావున నా సుతుల్ విని యకారణ వైరముఁ బూనకుండ నా
భావజపుత్రకాది యదువర్యుల నందఱఁబూజచేసి యీ
మా విడుమా! యనన్ హాయ మమాంతముగాఁ గొననెంచు నా ధరి
త్రీవిభుఁడౌను గాదనక ధీరత తోఁ దగె నట్టిపట్టునన్. ౪౧౫

వ॥ లోకాహంకారహారంబులగు యాదవవీరహుంకారంబులును, బటహా భాంకారంబులును, శింజినీటంకారంబులును, మత్తేభఘీంకారంబులును, స్యందన నేమి పటపటాత్కారంబులును, ఘూమఘుమఘుమా త్కారంబులును, గింకిణీ కిణకిణాత్కారంబులును, లోకభీషణంబులగు హాయహేషణంబులును, శతఘ్ని నిస్వనంబులును మఱియు నానావిధంబులగు ధ్వను లొక్కపరి నుప్పతిల్లుట తద్బిందుమాన వేంద్రుండు విని భయాశ్చర్యంబులం బొందు తరుణంబున యాదవశూరులన్వేషించుచు వచ్చి క్రమంబుగా నయనపర్వంబగు తదుపవనంబునందు రాజకుమారగృహీతంబై యున్న తమ యయువును విలోకించి నిజప్రభునకుం దెలియం జెప్ప నప్పచ్చవిల్తునిపట్టి విస్మి తుండై నగుచు సచివవరుండగు నుద్ధవునిం దత్పార్శ్వంబునకుం బంపె. అంతఁ దత్పు రంబునందు మహాకోలాహలంబులు గలిగె. ఇట్లా పౌరులు యదుసేనలం గాంచి భీతినిం జెందుట యా విభునితమ్ముండగు అనుబిందువనువాఁడు వెఱపొంది వీరకోటి తో బయలువెడలి పురబాహ్యోద్యానమందున్న తద్ధయంబును గని తన యన్న సన్నిధి కేతెంచి నమస్కరించి యిట్లు వచించె. ౪౧౬

శా॥ అన్నా! యజ్ఞహయంబు నీవు విడుమా! యస్మత్పురంబందు ని
ష్పన్నన్ రాని మహావ్యథల్ గలిగె సుమ్మీ! దీని నెల్లప్పుడా
వెన్నుండేకను రాజసూయకృతినిన్ వీరెల్లలోకంబులన్
మున్నోడించి యశంబుబొందిరిగదా! పో! దానినిన్ బుచ్చుమా! ౪౧౭

తే॥ ఇద్ది విడిచిన శుభములు హెచ్చగలవు
మనకు భూవర!యన; నాతఁ డనుజునుడుల
విని తురంగంబు నెక్కివచ్చి నతఁడుద్ధ
వునకు నిట్టులఁబల్కె సమ్మోదమొదవ ౪౧౮

ఉ॥ మంత్రివరేణ్యా! నేనిదియమాంతముగాఁ గొనియుంటి నెట్టిదు
స్తంత్రము నాకు లేదిపుడు తాదృశమిత్రుల నిందుఁ జేర్ప నీ
మంత్రణమున్ బొనర్చితి నిమంత్రణచేసితి వారినెల్ల నే
తంత్రమొనర్తువో దయను దప్పకకూర్పుమ! వారినందఱన్ ౪౧౯

చ॥ అన విని యుద్ధవుండు ముదమందుచు నాతని మెచ్చి కృష్ణుసు
న్మని కడకేగి సర్వము సమంజసభక్తి వచించె నంత నా
మనసిజపుత్రుఁ డందులకు మంచిదటంచుఁ జమూసమేతుఁడై
చనియె నవంతికాపురికి శౌరికుమారులు వెంటనంటగా ౪౨౦

తే॥ అట్టులఁ జనిన యా యనిరుద్ధ పటుచమూప్రులు తన్నదీతీరమున వివిధవిధవర్ణ
కలశరుచిర శిబిరంబులఁ గొల్చుకంబునన్ వసించెను దశయోజనములఁ దాఁక

ఆ॥ అంత బిందుభూపుఁ డట్టులఁజేరిన యానపధ్వజునికి సర్వకీర్తి
భక్ష్యభోజ్యలేహ్యపానీయభోజనాదులను ఘనముఁ బసుప్రులకు నిచ్చి ౪౨౨

తే॥ యదువరేణ్యులనర్చించి హర్షమొందె హరిసుతులఁజూచి యాతనియువరజుండు
దల్లి తండ్రి యానందంబు నుల్లమందు దద్దబొందిరి భూవరా! తత్పరమున

—♦ సాందీపని యనిరుద్ధుని సంశయంబులం దీర్చుట. ♦—

క॥ అనిరుద్ధుఁడు నిశ సాందీపనినిన్ దనతాత గురుని భక్తిఁ బిలిచి వం
దనమిడి మా ముఖమున కీ రనుకంపను రండు పుత్రకాన్వితులగుచున్ ౪౨౪

క॥ నావుకు సాందీపని యా శ్రీవిభు సంసర్గ నేచ్ఛ చెలఁగుటచే నా
హా! వచ్చెదనని తదుపాదేవునకవ నాపరిభుం డుదీర్ణ గుణమునన్ ౪౨౫

చ॥ సురవిభుఁ డాత్మసద్గురునిఁజూచుచుఁ బల్కినమాడ్కి నిట్లనెన్
గురువర! సంశయంబొకటి కూర్కొనె నామది దీని బాపుమా!
ధరఁగల స్వప్నసామ్య సుఖతండముద్రోసి యథార్థసౌఖ్యముల్
బొరిబొరి బొందుమార్గమును బూని వచింపుము! మానిచంద్రమా! ౪౨౬

తే॥ అంతఁ దమ్ముని శ్రేష్ఠుండు సుంతనగుచు
మును సనత్కుమారుఁడు పృథుజనవిభునకు
జెప్పినట్టుల నిటు బ్రీతిఁ జెప్పఁదొడఁగె
భక్తివిను మదిపల్కెద వజ్రనాభ! ౪౨౭

మ॥ అనిరుద్ధా! హరినాభిపంకజమునం దాదిన్ సురేశుండవై
జననంబందినవాఁడ వీవెగద వా సారించి నీచెంత నె
ట్లనఁగాఁజాలెద నైన నెదొ దీనార్తి పరిణా శార్థమై
జనకళ్యాణ పరంపరార్థముగఁ ద్వ్యాఖ్యాస్తిన్ వచింతున్ జుమీ! ౪౨౮

ఆ॥ అంబరీష భూప! యదువర ప్రహ్లాద! గయ! సవిూర పుత్రక! ధ్రువాదు
లెవని కర్చలిడి గ్రహించిరో సుగతి నా కృష్ణమూర్తి సేవ యిలను లెస్స

మ॥ దానిఁ మించిన మంచిసేత యెచటన్ దైవార దెవ్వేళలో
గానన్ నీవును బుద్ధిపూర్వకముగాఁ గంజాక్షు నర్చింపుమా!
శ్రీనారాయణవంశ సంభవులు మీరా స్నేహంబునఁ జ్ఞాతితఁ
దీనత్వంబున బాంధవంబునను దద్దేవేశ్వరుఁ జేరరే! ౪౩౦

తే॥ ఆర్య! మీలోనఁ గొందఱా హరినిఁ దనయుఁ
డంచుఁ గొందఱు సోదరుఁడంచుఁ గొంద
ఱాప్తుఁడంచుఁ గొందఱు పితయంచు నమ్మి
చుంట మీరె! జీవన్ముక్తు లుర్విమీఁద ౪౩౧

చ॥ అనవుఁడు కార్ష్ణిజుం డిటులనడ్గెను మౌనివరేణ్య! యీ జగం
బున కెవఁడాదికర్త యిది ప్రోచెడివాఁ డెవఁ డిద్ది నాశనం
బును బొనరించువాఁ డెవఁడొ పూని పరాత్పరుఁ డెట్టిరూపు వే
డ్కను శ్రుతిధర్మముల్ యుగయుగంబున నిల్పునొ చక్కఁజెప్పుమా! ౪౩౨

క॥ అనవుఁడు సాందీపని యిట్లనె జగముల సృష్టిఁజేయ నణపఁగఁ బ్రోవం
గ నిదానమైనవాఁడా ఘనుఁడు పరబ్రహ్మ యొకఁడు గాదె యుపేశా! ౪౩౩

ఉ॥ యాదవనాయకా! ప్రతియుగాంతరమందుఁ బరాత్పరాజ్ఞ ద
క్షాదులు పుట్టుచుండ్రు మరి యంతము జెందుచునుందురీ నభో
మేదినులున్ జలానల సమీరము లెల్ల చరారంబులున్
వేదమయాత్మలోఁ గలిసి వేడ్కవసించు నటంచెఱుంగుమా! ౪౩౪

క॥ జగమే యాతం డతఁడీ జగమాతఁడె బ్రహ్మ వరము సద సత్పదమున్
జగతీహేతుప్రకృతికిఁ దగిన నిదానంబు సుమ్మి! దర్పకపుత్రా! ౪౩౫

తే॥ ఆ మహాత్ముఁడె యీ కృష్ణుఁడంచెఱుఁగుము!
యతఁడు నాకిప్పుడు ప్రసన్నుఁడగుత! అతఁడె
నాల్గుయుగములన్ నాల్గు జన్మముల నెత్తి
ధర్మముల నిల్పుఁ దద్రీతిఁ దద్ద వినుమ! ౪౩౬

సీ॥ కపిలాదిరూపముల్ గని కృతయుగమున జనహితరతుఁడౌచు జ్ఞానమొసఁగు
త్రేతను జక్రవర్తియయి దుర్జనశిక్ష సాధురక్షను జేసి జగము నేలు
ద్వాపరయుగమందు వ్యాసుఁడై యొకశ్రుతి నలుదెఱంగుల సల్పి యిలను వెల్గు
గలియుగాంతంబునన్ గల్కిరూపుండౌచు ఖలులను సాధువులుగా నొనర్చు
తే॥ ఇట్లు నానావిధంబుల నెల్లజగము లాపరేశుఁడు రక్షించు నంతమందు
నంత మొనరించు నాయనంతాత్ముఁడైన కృష్ణునకు భక్తితో సమర్పింతు నతులఁ

ఉ॥ ధ్యేయుఁడు ధ్యాత ధ్యానము నుదీర్ణగుణుండు ననంతుఁడున్ త్రయీ
గేయుఁడు గారణాధికుఁడు కేవల చిన్మయరూపుఁడున్ సుప
ర్వాయతవందితామల పదాబ్జుఁడు గారుణికుండునైన శ్రీ
తోయజపత్రనేత్రుని నుతుల్ బొనరించి నమస్కరించెదన్ ౪౩౭

చ॥ హరిసుతజా! మనోమయములైన జగత్త్రితకష్టసౌఖ్యముల్
సరగునవీడి నిశ్చలత సన్నుతిచేయుము! కృష్ణచంద్రునిన్
వరదుఁ గుశీవధిన్ దివిజవర్యు నవార్యుఁ గుధుర్యు ద్వారకా
పురవరనాథు సర్వదుని బుణ్యసుగణ్యుని భక్తిముక్తిదున్ ౪౩౯

క॥ ఈ కృష్ణ సూక్ష్మకథఁ జనుఁడేకతఁ జదివినను వినిన నెల్లయఘంబుల్
పోకడపెట్టగ విమల శ్రీకృష్ణపదాబ్జ భక్తిఁజెందు నుషేశా! ౪౪౦

ఉ॥ నావుఁడు కృష్ణపౌత్రుఁడు మనంబునఁజేరిచి శౌరిపాద రా
జీవము లాబుధున్ వినుతిఁజేసి నమస్కృతిసల్పి యో గురూ !
నీ విమలోక్తి నామదిని నెక్కొనియుండిన మోహశత్రు వి
ష్ఠా వడిజెందె నెక్కువగ హర్షముగల్గెను మౌనిరాణ్మణీ! ౪౪౧

చ॥ తనయునితోడఁ గూడి వెస ద్వారక కేగి రమేశు దర్శనం
బును నొనరించుఁడీ ? యనఁగ భూసురవర్యుఁడు మెచ్చి కృష్ణద
త్త నిజసుతాన్వితుం డయి రథంబున నెక్కి కుశస్థలీపురిన్
జని నృపరామకృష్ణ యదుసంతతి పూజితుఁడౌచు నుండెడిన్ ౪౪౨

తే॥ అంతఁ బ్రాద్యుమ్ని! తిరిగి జయంబుకొఱకు స్వర్ణశృంఖలాసంబద్ధ సవహయంబు
విడువ నదివడి యదుభూప విమలయశము జాటుచున్ రాజపురి కేగె సక్రమముగ

## అనిరుద్ధుండు అనుశాల్వుని జయించుట.

చ॥ అలపురి శాల్వసోదరుఁడు నాఢ్యుఁడునౌ ననుశాల్వుఁడేలుఁ ద
ద్బలి యరుదెంచు నాహయముబట్టి యదృచ్ఛ బఠించి పత్రిమం
దలి విషయంబులన్ గని క్రుధాస్ఫురితాధరతిర్యగీక్షణం
బులు దగ నాత్మయోధచయముఁ గని పల్కఁదొడంగె నిట్టులన్ ౪౪౩

చ॥ అమర విరోధులార ! సమయంబుకొలంది రిపుల్ మదీయ రా
జ్యమునకు వచ్చిరి త్తఱి నసాధ్యబలుండు మదగ్రజుండు శా
ల్వమనుజనాయకుండు మును భండనమందున వీరిచేత నా
శముగనెఁగాదె తెంపుమెయిఁ జంపెద వీరిని నేఁడు చూడుఁడీ! ౪౪౪

ఆ॥ అని వచించి తొర దశాక్షౌహిణీసేన గొని పురంబునుండి చని యదూత్త
ములఁ దృణీకరించి పలు తూపులను వేయఁ గనిన యాదవులును గినుక రేగి

క॥ ఘన నానా శస్త్రాస్త్రములను గొని యవ్వానిసేనలను విసరంగా
మనమున నొచ్చుచు వారలు మనునిచ్చను బరుగులిడిరి మానరహితులై

తే॥ అంత ననుశాల్వుఁ డతిభీతి నాత్మసేన పాఱుటనుగాంచి నిలువుఁడీ! పౌరుషంబు
జూపుఁడీ యంచుఁ బురికొల్పి సుందరమగునరద మెక్కి యాదవులఁ బోరాడవచ్చె

వ॥ అత్తఱిఁ దదభిముఖంబుగా నందనందననందనుండగు దీప్తిమంతుండు యుద్ధా
ర్థంబై చన నావిభుండు సూచికోపించి దశశరంబులతోఁ ద్వీపిద్వీపంబును నఖంబులతోఁ
బ్రహరించినట్లు బలిని హింసించె. తత్తాడితుండగు కృష్ణసూనుం డాగ్రహంబు గలుగఁ
గోదండంబుగైకొని దశబాణంబుల నవ్వానిపైఁ బ్రయోగింప నవి జవంబుతో బన్న
గాశనుండు తృణగృహంబును జొచ్చి బహిర్గతుండైన లీల నాయనుశాల్వుని శరీరంబు
భేదించి వెలుపలికేతెంచె. తచ్ఛరహతిచే నావిభుండు కడబట్టుటఁ దత్సైనికులాలోకించి
క్రుద్ధులై చిత్రశస్త్రంబులతో నా హరికొమరునిం బొడిచిరి. ఏతత్సమయంబున నే
సత్యభామా సూనుండగు భానుండరుదెంచి భానుసహస్రంబుతోఁ దుహినాభ్రంబు
లను యథాయథలు గావించి నట్లనేకబాణంబుల నాయోధనికాయంబులను ఛిన్న
భిన్నంబొనరించె. అందు శిష్టంబగు దైత్యసైన్యం బాగలేక పలాయితం బయ్యె.
అత్తఱుణంబున నాయనుశాల్వుని మంత్రివరుండగు ప్రచండుం డఖండకోపంబున
మండుచువచ్చి శక్తింగొని యబ్భానునిపైని వైవ నది తద్గాత్రంబు దూసి ధరణిం
దూరె. తద్ధతిచే నాతండును రణాంగణంబున సొమ్మసిల్లె. అంత సాంబుం డనుజ
న్మండు కడబట్టుట విలోకించి కినిసి ధనువుం గేలందాలిచి రథారూఢుండై చనుదెంచి
ధ్వజసారథియుక్తంబుగా నాతని శతాంగంబును జూర్ణీకరింప నా బలుండు రణ
దుర్మదుండై గదగొని యనలుని మ్రింగనుఱుకు శలభంబు సరణి నరుగ నాతండు
దివాకరనిశాకర తేజంబుతో జనుదెంచిన యా దనుజుం గని హాహాకారంబులు గలుగు
చుండ నవలీల నొక బాణంబుతోఁ దదుత్తమాంగంబును ఖండించె. అట్టి పట్టున
నా యనుశాల్వుండు ముహూర్తమాత్రంబులో మూర్ఛనుండి లేచి, ౪౪౯

చ॥ అనిఁ బడినట్టి మంత్రిని మహాబలిశాలిఁ బ్రచండుఁ గాంచి స్యం
దనమున నెక్కి విల్లుగొని తాల్చి యసిన్ గసినట్టి సాంబు నా
దినిఁ ద్రిశరంబులన్ హయతతిన్ నలుతూపుల ముప్పదింట దే
రును నయిదింట విల్ధ్వజము రోపయుగంబునఁ జెండె మెండుగన్ ౪౫౦

తే॥ అద్దిగని కిన్కతో సాంబుఁ డన్యరథము
నెక్కి యన్య చాపమును గ్రహించి గరుడి
పక్షముల నురగంబును బాదినటుల
దశశరంబుల నవ్వాని తలను బాదె ౪౫౧

ఆ॥ తద్ధతులకుఁ దద్రథ ధ్వజసూతాశ్వములును ఖండఖండములయి వ్రాలె
ద దనుశాల్వవిభుఁడు ధరఁగూలె మూర్ఛతో దానిఁగాంచి వానిసేన గిసిసి

తే॥ చిత్ర గృధ్రపక్షాన్వితాశీవిషసమతీక్ష్ణశరముల నావాసుదేవ పుత్రుఁ
గొట్టఁగడఁగె నత్తఱిసిముకుందసుతుఁడు యదువరుండునునగు మధువాహావమున

క॥ ఒంటిగ సాంబుండుండుట గంటఁగని కపోతరుచిర గంధర్వమునన్
దంటతనంబున నెక్కుచుఁ గంటునఁజని సాంబుఁగూడి ఖడ్గధరుండై ౪౫౨

క॥ అరిజాములోఁ బగలనంపజేనిన్ వధియించి మించెఁ బక్షిణపుఁ డా
ధరణీంద్రుఁ డుత్థితుండై పరగిన స్వపరాజయంబు పలుమఱుఁ గని తాన్ ౭౫౫

ఉ॥ స్నానమొనర్చి శుద్ధుఁడయి సాంబుజలంబు హతింబుసల్పగాఁ
బూని మహాసురేంద్రచితమున్ ఘనమైన పితామహాస్త్రముం
దాని మరిం హరించెడివిధంబు నెఱుంగనిలేకయయ్యు నా
న్న్యానరుమన్ స్వజీవితము నోముకొనన్ విసరెన్ రణస్థలిన్ ౭౫౬

తే॥ అట్టి బ్రహ్మాస్త్రముననుండి యక్కజముగ
ద్వాదశాదిత్యసన్నిభ ప్రభజనించి
ముజ్జగంబులఁ గాల్చుచుఁ బొలయుచుంట
యాదవులు బాధనోర్వక యతిరయమున ౭౫౭

మ॥ అనిరుద్ధాంతికమొంది యో యనఘ! బ్రహ్మాస్త్రవ్యథల్ మాకు హె
చ్చెను నీదుఃఖము బాపి యిష్ట సుఖముం జేకూర్పఁ బ్రార్థింతుమో
జననాథా! యన నా యుషేశుఁ డభయోత్సాహోత్తలం బల్కి నే
ర్పున బ్రహ్మాస్త్రము దిర్గివేసి యల యమ్మున్ సంహరించెన్ జుమీ! ౭౫౮

తే॥ అంత ననుశాల్వుఁ డాత్మమహాస్త్ర మటుల
శాంతిపడుట వీక్షించి వైశ్వానరాస్త్ర
మేయ నెల్లెడ నగ్నిజనించి మండు
చుండె జ్వాలలతో మండు ఖాండవమటు ౭౫౯

ఉ॥ అంతట ధన్వివర్యుఁడు మహాబలుఁడున్ యదునాథుడౌ నుషా
కాంతుఁడు వారుణాస్త్రములుకం వడివేసి తదస్త్రవహ్ని య
త్యంతము శాంతిబొందగ నవాంబుదముల్ గురియంగఁజేసె నా
వింతనుజూచి బర్హిపిక భేకముఖంబులు సెందె హర్షముం ౭౬౦

తే॥ అపుడు తద్దైత్యనాయకుం డాగ్రహంబు
గలుగఁ బవనాస్త్రమున్ వేయఁగా నతండు
పర్వతాస్త్రింబువైచెఁ దత్పరమున నను
శాల్వుఁడు సహస్రభారల సద్గఁగొని ౭౬౧

క॥ అనిరుద్ధు సమక్షమునకుఁ జని వీరమ్మన్య! నీదు చమువున గదతో
ననిచేయువాఁడు గలఁడే తనరినచో నట్టిదిట్ట తడయక చెపుమా! ౭౬౨

క॥ ఇటులనుచుండెడి తఱి నచ్చట గదగొనియున్న గదుఁడు శౌర్యనుజుండు
త్కటరుప స్మరజుఁడు గనుగొన నిటులనె నవ్వానితోడ నెదుటకుఁ జని వే

శా॥ ఓ రక్షఃకులనాయకా! యిట గదాయుద్ధప్రవీణుల్ మహా
శూరుల్ పెక్కురు సర్వశాస్త్రఘనులున్ శోభిల్లుచున్నారని
న్యాబఅన్ జూడగ నీవొకండవె గదా నామాటలాలించి పో
యారీతిన్ జనకున్నచో గదను గయ్యంబాడ నాతోడరా ౪౬౪

క॥ గరువము విడి గదతోఁ దాలి దురమాడు మవలఁ బెఱపనిదొడగుము యని త
ద్గురుహృచ్ఛిరములఁ గొట్టెను గరమునఁగొన లక్షభారకలితస్వగదన్ ౪౬౫

క॥ అంతట ననుశాల్వుండును బంతముతో గదను గదునిఁ బ్రహరించెనిటుల్
వంతుగ నిరువురు దురమును సొంత గదలతోడఁ జేసి సొమ్మసిలిరిలన్ ౪౬౬

తే॥ అవల గదుఁడుత్థితుండయి యతనిఁబట్టి చదలునన్ వేసి మరిగొని శతగుణముగఁ
ద్రిప్పికూల్ప నా దేవతారి వడిలేచి గదునిఁ బడవైచి వింతగాఁ జదిమెఁ బిదప

చ॥ గదుఁడు మదద్విపేంద్రమును గైకొని యా యనుశాల్వుపైన వై
వఁ దదద సురేశ్వరుం డటులవచ్చుకరిన్ గని వానిపై నిడెన్
బదపడి వారలొండొరులు వంతుగ జానువులన్ భుజంబులన్
బదములతోడఁ గొట్టుకొని వ్రాలిరి నేలను మూర్ఛతోడుతన్ ౪౬౮

తే॥ అప్పు డనుశాల్వు యదుయోధు లలబలిష్ఠు
లిద్దఱున్ వ్రాలుటన్ గాంచి యిలను వీరె
ధన్యులని యనుకొనుచుండఁ దద్గదుండు
లేచి నను గూల్చినట్టి యా లేకి యేఁడీ ౪౬౯

మ॥ అని కోపంబునఁ బల్కు చాయసురునిన్ హస్తంబుతోఁ గొంచు వే
యనిరుద్ధాంతికమందు మూర్ఛఁబడు నట్లారాయనన్ ద్రోయ నా
ననవిల్కానినుతుండుసూచి దయ నర్ణస్త్రాళవృంతాదులన్
గొని చైతన్యమువచ్చునట్టు సలిపెన్ గొంకుల్ మదిన్ మానుచున్ ౪౭౦

—♦ అనుశాల్వుం డనిరుద్ధున కశ్వంబొసంగి బహూకరించుట. ♦—

ఉ॥ పిమ్మట దైత్యనేత తెలివింగని కన్గవవిచ్చి యుగ్రభా
గమ్మున నొప్పు సుందరుని గార్ష్ణి జునిన్ ఘనసామ్యుఁగాంచి శీ
ర్షమ్మున మ్రొక్కి మీయెడల సల్పినతప్పు క్షమింపుఁ డీరు ప్రా
ణమ్మిడినట్టి దాతలుగ నమ్మితి మిమ్మొద నన్నుఁ బ్రోవుఁడీ! ౪౭౧

వ॥ ఇట్లనేకవిధంబులఁ బ్రణుతించి పునఃపునః ప్రణామంబులాచరించి స్వపు
రంబులోనికిం బోయి తదాశ్వమేధీయ హయంబుగొనివచ్చి యయుతగజంబులను,
నియుతహయంబులను, నర్ధలక్ష రథంబులను, శిబికాసహస్రంబును, సహస్రోష్ట్రం

బులను, సహస్రగవయ మృగంబులను, పంజరస్థిత సింహసహస్రంబును, సహస్ర మృగయాసారమేయంబులను, సహస్ర శిబిరంబులను, నియుత తూర్యంబులను, నయుతజవనికలను, లక్ష ధేనువులను, సహస్రభారస్వర్ణంబును, పదుసహస్రభార రజతంబును, నేకభారముక్తాఫలంబులను, భక్తిపూర్వకముగా నామహాత్మునకిచ్చి దేవా! యీ వాహంబువెంట నేనును రాఁగలనని పచించి నమస్కరింప నామునుకుంవ నందననందనుం డానందంబుబొంది దివ్యమణిహారం బొండు ప్రీతిపూర్వకంబుగా నిష నా యనుశాల్వుండు గ్రహించి తదాజ్ఞంగొని, నిజ రాజ్యపాలనార్థంబుగా నొక మంచి ప్రెగ్గడను నియమించి, యాదవులతోఁ గూడ నాగి తురగందొడంగె. అయ్యా యువు నయ్యనిరుద్ధవిముక్తంబై దేశదేశంబులం జరించుచుండె. ఇద్దాని సంచారం బున నాలు నెలలప్పటికి గచెతింనవియు, నింక నన్నియు మిగిలియుండెననియు నెఱుం గుము. అట్లడ్డులేక సంచరించెడి తురగంబును నభిమానంబుతోఁ బ్రథమంబున మణి పుర, రత్నపురాధిపతులు గ్రహించి, యావనాశ్వానుశాల్వభీషణాది పరాజయో దంతంబును, ననిరుద్ధబలంబును విని వెఱచి మరల విడిచిరి. అంత నది యటనుండి వెడలి శూరశూన్యరాజ్యంబులందునిలువక మహాబలుండగు వల్వలాసురుండువసించు ప్రాగ్దేశంబునకుం జేరి ప్రయాగతీర్థం బంకలి త్రివేణిలో నుదకంబు గ్రోలుచుండె. అత్తరుణంబున,　　౪౭౨

—♦ ప్రాగ్దేశమున కరిగిన యజ్ఞాశ్వంబు వల్వలాసురునిచే బట్టుపడుట. ♦—

తే॥ నారదునిచేత నీసవనప్రవృత్తి వినిన వల్వలదైత్యుండు కనలి నైమి
పాటవిని నుండి వచ్చుచు నచటనున్న సైంధవముగని కొనెఁ గృష్ణుఁ జౌకచేసి

సీ॥ అత్తఱిఁ గార్ష్ణిసుతాదులు దండకవనమును గని యందు బైలుదేరి
చర్మణ్వతిం దాటి శర్మదచిత్రకూటాచలమున నెక్కి యచట నున్న
రామతీర్థంబున హేమదానాదులఁ గావించి చిత్రముల్ గనుచు వరుస
నాత్మీయఘోటకం బన్వేషణంబును జేయుచు జాడలఁబోయి పోయి

తే॥ ఇంద్రతీర్థరాజమునకు నేగుదెంచి చామర స్వర్ణపత్రికా చారుతరము
సర్వలక్షణరుచిరంబు శ్యామకర్ణ భాసురమునగు తమ యజ్ఞవాహవరము

సీ॥ ఉగ్రవిగ్రహుఁడును యోజనద్వయమహోచ్చాంగుండు ఖలుఁడు దుస్సంగరతుఁడు
తప్తతామ్రశ్మశ్రుదంష్ట్రాశిఖుండు లలజ్జిహ్వుఁడుఁ గజ్జలగిరినిభుఁడు
బ్రహ్మఘ్నుఁడుఁ సురాపానరతుండును బృందారకోత్కరభీకరుండు
నయుతేభసమబలుం డసురవర్యుండును వహ్నినేత్రుండును భయదముఖుఁడు

తే॥ నైన వల్వలు హస్తంబునందుఁ జిక్కియుంటఁ గని కిస్క నెవ్వఁడవోరిదుష్ట!
యెటకు మాహయంబునుగొని యేగెదవుర! త్వరగవిడనిచో నిన్ననినజికెదమురా!

చ॥ అనవుఁడు దైత్యముఖ్యుఁ డిటు యాదవవీరులకుం వచించె నె
వ్వని సవిధంబునం దమరవం క్తి భయంబున నిల్వలేదొ యె
వ్వనికి మనుష్యసంచయము భక్ష్యముగా నగునో యెవండిలన్
ఘనముగ వల్వలుండనఁగఁ గ్రాలునొ యట్టిబలుండ నేనకా

చ॥ పదపడి యాదవోద్భటు లపారరుషన్ గొని బాణజాల మా
త్రిదశ విరోధిపై ద్రుతగతిం బఱపంగ నతండు సాశ్వుఁడై
కదనమునం దదృశ్యతనుగాంచెను బిమ్మట గార్ష్ణి జాదు లి
ట్టిదియొనరింప నౌననుచు నేమియుఁ దోఁచకయుండిరా రితిన్ ౪౭౮

—♦ అనిరుద్ధుండు వల్వలాసురుని జాడ దెల్పుమని నారదుని గోరుట. ♦—

తే॥ అపుడు భగవత్స్వరూపుఁడు నమరమునియునైన నారదుఁ డవ్వారి యంతికమున
కేగ నాతనిఁగని తదుపేశ్వరుండు యాదవులఁగూడి యర్చించి యనియె నిట్లు

మ॥ సురమానీశ్వర! వల్వలాసురుఁడు దుష్టుండౌచు మా యశ్వముం
హరియించెంగద! వాఁడెటుల్ చనెనొ మా కాజాడరాదాయె నీ
తురగంబున్ విడి ద్వారకాపురికెటుల్ దోతెంతు మెచ్చోటికి
న్దరుగంగాఁ దగు నేమిసేయనగునో యంతన్ దయన్ దెల్పుమా! ౪౭౯

చ॥ భువనములందునం రవినిబోలుచు నిత్యము దివ్యదర్శనుం
డవయి చరింతువెల్లయెడందలయందున నాత్మసాక్షివై
పవను విధిం జరించెదవు బ్రహ్మవిదుండవు నీవెఱుంగరా
నివిషయ మేదియుం గలుగనేరదు గావున నెమ్మిఁ జెప్పుమా! ౪౮౦

ఆ॥ అంత నారదుఁ డిటులనె వల్వలుఁడు మీదు హయవరంబుగొంచు నబ్ధిలోని
పాంచజన్యమను నుపద్వీపమున కేగె స్మరజ! మరియు వాని సరణి వినుమ!

చ॥ తనచెలి గండఁడౌ శకుని తద్యదువీరులచేతఁ బూర్వమం
దున మరణించె నంచతఁడు ధూర్జటిఁగొల్చి వరంబుబొంది కి
న్కను సుతలంబునందుఁ గల కర్బురులన్ బిలిపించి యిప్డు మి
మ్మును రణమందు దున్మి యశమున్ గొననెంచుచు రాజ్యమేలెడిన్ ౪౮౨

ఉ॥ మారకుమార! యాఖలుఁ డుమాపతినెట్లుఁగొల్చి యేవరం
బేరహిఁబొందె నన్న విను మీతఁడొకప్పుడు వెండికొండపైఁ
జేరియు ద్వాదశాబ్దములు చిత్తమునన్ శివునిల్పి నీరమా
హారము మాని భక్తిని మహాతపముం బొనరించె నత్తరిం ౪౮౩

తే॥ సర్వలోక శంకరుఁడగు శంకరుండు మెచ్చి యా దైత్యుచెంతకువచ్చి యసుర!
యేవరంబును గోరెద వీవు సెపుమ! యనఁగ వాఁడు నలర్చి మ్రొక్కి యడిగెనిట్లు

క॥ కరుణాభరణా! సతమేమఱక రణంబందు నన్ను మరిమరిఁ బ్రోవన్
బొరిఁ బొరి వేఁడెద ననవుఁడు పరముండు తథాస్తటంచు వచియించి చనెన్

తే॥ భవవరంబున వాఁడెచ్చి పాంచజన్యమను నుపద్వీపమును నేలు ఘనబలమున
మీహయంబును బూర్తిగా నాహవంబునలువ సిడి యిచ్చ్యకొనఁడయ్య శౌరిపౌత్ర!

మ॥ అన నాలించిన యా యదూద్వహుఁడు నత్యంతాగ్రహంబొప్ప నో
మునివర్యా! యల వల్వలాసురుఁ జమూ భాయిష్ఠుఁగాఁ జంపి మా
ఘనవాజిన్ విడిపింతు మెప్పటికి నా గంగాధరుండే జనా
ర్దను ద్వేషించు ఖలున్ సమీకమున సంరక్షింప రాఁబోఁడుగా ౪౮౯

క॥ ఈరహి నని తనవారి సురారివధార్థంబు బోవ నాజ్ఞాపించెన్
నారదుఁ డాజి కుతుకమున మారజుపడీ యచటి కభ్రమార్గమునఁ జనెన్

తే॥ అంత యాదవులందఱు నాగ్రహమున సర్వసన్నద్ధులై లేచి సత్వరగతి
నా మహాతీర్థమున మున్గి యఖిలదానములను గావించి సాగి రో భూప! యవల

మ॥ అల శ్రీకార్ష్ణిజు నాజ్ఞఁ గైకొనుచు బహ్వస్థన్ ద్విలక్షోద్ధ్వజా
రులు ముందా పగదీవిఁ జేర్చుపథముం గూపించి హాస్త్యశ్వయో
ధులు యానంబులు జక్కఁగా జనునటుల్ దోష్ఠోడ నిమ్నోన్నతం
బులు ముద్దుండనిమాడ్కిఁ బ్రత్యహమునన్ బొల్పారఁ గావింపఁగా ౪౯౦

చ॥ వెనుక వృకాసురారి గజవీతిశతాంగపదాతిసూతవీ
రనివహయుక్తుఁడై శరశరాసనశూలగదాసిముద్గరా
ది నిశితహేతులంగొని యుదీర్ణచమూతతిముందు నిల్చి త
ద్ఘనభరపీడఁబొందు ఫణికాంతుఁ డిదేమని యెంచసాగఁగా ౪౯౧

సీ॥ అనిరుద్ధుఁ డటుసాగి యశ్వరక్షామిషఁ బాపిష్ఠులన్ రూపుమాపఁదలఁచి
యెందెందు ఖలులు వసించుచునుందురో యచ్చటికచ్చటి కరిగి యరిగి
కృష్ణకథాది సంకీర్తనమాలించి సంపూర్ణముగ మదిన్ సంతసించి
తద్యశోగాయకతండంబునకు రత్నహార సువర్ణాంబరాదులొసఁగి

ఆ॥ కలుషహారములైన కాశీగయాక్షేత్రములకుఁ బోయి దానములను జేసి
యిచటినుండి కదలి యమరేంద్ర దిక్కునకరిగె వజ్రనాథ! యాయదనున

—♦ మార్గమధ్యమందు సహదేవుండనిరుద్ధుని సన్మానించుట. ♦—

తే॥ అతి భయంకర సేనతో నరుగుదెంచు పంచశరపుత్త్రుఁ గని గిరివ్రజపురవర
నాయకుండు జరాసంధ నందనుండునైన సహదేవుఁ డదరుచు నమితభక్తి

ఉ॥ అంబర హేమరత్నవలయాదులనిచ్చి తదీయ పాదప
ద్మంబుల వ్రాల నాస్మరకుమారుఁడు మెచ్చుచు నూత్నరత్నహా
రంబును వానికిచ్చి సని రాజ్యము నేలుమటంచుఁబల్కి సై
న్యంబులతోడుతన్ జని మహాస్థలమా కపిలాశ్రయంబునున్ ౯౪

క॥ అందలి గంగా సాగరమందున స్నానంబుజేసి యమల కపిల మా
నీందుని సిద్ధుని గనుగొని వందనముల నాచరించి నడిసాగి యటన్ ౯౫

క॥ దక్షిణ సింధు సవిధమున నక్షీణశిబిరములిడి తదసురకులద్వి
ట్పక్షోపాయము లెంచుచు దక్షుతవాసంబుజేసె ధాత్రీనాథా! ౯౬

క॥ మఱునటి ప్రొద్దున యాదవవరులు నిదురనుండిలేచి బాహ్యాదికృతుల్
వరుస నొనరించిరంతట స్మరజుం డుద్ధవునిఁజూచి మాటాడె నిటుల్ ౯౭

తే॥ మన తురంగంబు గైకొని చనినదైత్యునగర మిచ్చటికెంతదవ్వుగలదో మరి
యెటులఁ బోవలెనో సచివేంద్ర! చెపుమ! యనఁగ నుద్ధవుం డిట్లనె నాదరమున

ఆ॥ దేవ! నీవెఱుఁగని దేవిషయములేదె యైనఁజెప్పెద నిటకరయ వాని
పురము దక్షిణమున ముప్పదియామడల్ గలదు చనఁగవలయు జలధిమీఁద

—♦ యాదవులు సముద్రంబుపై అట్టెడగట్టి దాటి అసురిపురి కరుగుట. ♦—

చ॥ అనవుఁడు కార్ష్ణి జుండు సరియంచుఁ గ్రుధా ధృతులొప్ప నేడు త
ద్దనుజకులేంద్ర పట్టణము దప్పకచేరెదఁగాన సేతు వీ
వననిధిపైన బాణముల బాగుగఁగట్టుఁడి వీరులార! యం
చనుప సమిద్విశారదులు యాదవులట్టులె యంచు వెంటనే ౧౦౦

వ॥ ఉల్లాసంబునం బరస్పరంబు మాటాడుచుఁ, బాడుచు, నఱచుచు, నగుచు దుముకుచు నడుగంటునటుల నాకడలిలోనికి వడితో వాడితూపులం బెక్కింటిని విడిచిరి. తచ్ఛరంబులచే సంద్రంబులోని జంతుసంతానంబు క్షోభనుబొంది కోలాహలంబు గావించుచు నలుదెసలం బఱుగిడందొడంగె. తత్సమయంబున నంబర మార్గంబున సంచరించు నారదుం డవ్వీరల యుద్యమంబుగని యదువర్యులారా! మీలో నెవనిబాణంబులు నీ సముద్రాంతంబునకుఁ బోలేదని యెఱుంగుఁడని వచింప నక్రూర కృతవర్మ యుయుధానోద్ధవ హ్నాదీక సారణ సాత్యకి హేమాంగదేంద్రనీలానుశాల్వాది బలులాలించి గర్వంబుమాని మిన్నకుండిరి. ఈ స్థితిం గన్న వెన్నునిమనుమఁడు మనంబున మాధవపదపంకజంబులను స్మరించుచు శార్ఙ్గప్రతిమానంబగు చాపంబుగొని పదిబాణంబులను సంధించి యాకర్ణాంతంబునులాగి సాగరంబులోనికిం బ్రయోగించె. అప్పు డప్పరమ సురమునీంద్రుం డానందంబు బొంది దేవా! నీయాశుగంబులు కడలి కడవటికు ద్రుతగతితోఁ బోయి తత్తటంబునం జేరియుండెనని

యుచ్చైశ్శ్రవంబునం బలుక సాంబదీప్తిముదాదులు మొదల్లి యనేకకలంబంబులను, రత్నాకరపారంబుదాఁటునట్లు విడిచిరి. అంత యాదవోత్కటులే తెంచి కోట్లకొలందిగా శరంబులపై శరంబుల నమరిచి జలోపరిభాగంబునం దొక యామడవెడలుపును, ముప్పదియామడల పొడవును వెలంగునట్టుల నట్టెడఁగట్టి యాకేయినంతన్న తమ శిబిరంబులందు సుఖంబుగా నిద్రించిరి. జగద్విఖ్యాతచరిత్రులును, జగదేకశౌర్యపరాక్రమ ప్రతిమానులును, జగజ్జేయమానబలులును నగు తత్కృష్ణ మిత్రపుత్రపౌత్రులకును యాదవవీరులకు నీ సేతుబంధనంబు సామాన్యకార్యంబు గాదే యని చెప్పి వెండియు నిట్లనియె. ౫౦౧

ఆ॥ స్మరసుతాదులెల్ల రరుణోదయమున మేల్కాంచి చక్కఁజేసి కాల్యములను
జలధిపైన నడచి శతయోజనాయత దివ్యమైన యతని దీవికేగి ౫౦౨

సీ॥ తాలహింతాలతమాలతక్కోల రసాలనిర్జరసాల జాలయుతము
మల్లికామాలతీమాధవీగిరిమల్లికాజాతిముఖలతారాజితంబు
స్వర్ణరత్నస్ఫురత్ప్రాసాదసర్వతోభద్రశాలాది విభ్రాజితంబు
వింశతియోజన విస్తీర్ణయుక్తంబు బృందారకవిరోధి బృందసహిత

తే॥ మైన "యాసురి" యను పురి కరుగుదెంచి
రవల వల్వలాసురుఁడు నా యాదవాగ
మనము వినుచు మాయావియా నుయునిఁబంపె
యాదవుల లెక్కపెట్టుట కవనినాథ! ౫౦౩

—♦ మయాసురుండు యాదవబలంబు వర్ణించి చెప్పుట. ♦—

ఆ॥ అవల నామయుఁడు శుకాకృతిఁ దాలిచి యాదవులు వసించినట్టిచోటి
కరిగి చోద్యమొంది తిరిగి యచ్చటసాగి వల్వలుదరిజేరి పలికెనిట్లు ౫౦౪

ఉ॥ ఎవ్వఁడు నే బలుండనని యేగి మహాబలులైనవారితోఁ
జివ్వనొనర్చు? వారలనుజేరి యొకించుక గాంచినంతనే
నివ్వెర నాకు నివ్వటిలె నిక్కము వారు నరామరాసురుల్
నివ్వెఱబొందగా శరధినిన్ శరపంక్తినిఁ గట్టఁగట్టరే ౫౦౫

తే॥ ఎవ్వఁడవ్వారలన్ గణియింపఁగలఁడు నియుతకోటిసంఖ్యలతోడ నియుతకోటి
సంఖ్యల గుణింపవచ్చెడి సంఖ్యకుఁ దగినటుల వారలుండిరిగాదె యసురనాథ!

చ॥ ముదుసలినైన నేను మును భూతనయాపతి లంకకేగగా
నుదధికిఁ గట్టవేయుట నోహోయని వింటిని దిర్గి యిప్పుడి
య్యది గనుగొంటిఁగాని యది యశ్మధరారుహజాలబద్ధ మి
య్యది శితబాణబద్ధ మిదె యద్భుతమయ్యెడిఁ జూడఁజూడగా ౫౦౬

తే॥ తుట్టతుదకు మున్ మరియొకఁ డెట్టికట్ట
కట్టెనని వినలేదు లంకాపురీశుఁ
గీశసహితుఁడై రాముండు గెల్చినటుల
యదుయుతుఁడయి కార్ష్ణి జుఁడు నిన్న నిజయించు ౪౦౭

చ॥ ఇతని పితామహుండయిన కృష్ణుఁడు దుర్జనశిక్షణార్థమున్
గృతిజనరక్షణార్థము సురేంద్రపినాకి పితామహాదియా
చితుఁడయి రాధతోఁగలిసి శ్రీకర గోజగమందునుండి యీ
క్షితిఁ జని పుట్టినట్టి హరిచిన్మయుఁడున్ బరుఁడంచెఱుంగుమా! ౪౦౮

క॥ ఈతఁడు కంస శకునిముఖ దైతేయులఁ జంపినట్టి దక్షుఁడు మరి యీ
నేతయె ద్వారావతిలో ఖ్యాతచరితుఁడగుచు నిపుడు గ్రాలుచునుండెన్

క॥ ఈ యంగజాత సుతముఖులౌ యాదవముఖ్యులందఱమల శ్రీనా
రాయణకుల సంభవులును నాయతబలులం చెఱుంగుమా! దనుజేంద్రా! ౪౧౧

ఉ॥ వీరలు యావనాశ్వబకభీషణదైత్యుల నన్యవీరులన్
బోరి జయించి యిచ్చటికిఁ బూన్కిని వచ్చిరిగాదె వారిద
ద్వారము గెల్చు వీరలకు ధాత్రిజయించుట యొక్క లెక్కయే?
శూరసురారి! కాన స్మరసూతికి నా హయమిచ్చి మ్రొక్కుమా! ౪౧౨

క॥ ఇట్టుల నొసఁగిన మనకున్ నెట్టన క్షేమంబుగలుగు నీరజనాభున్
గట్టిగ నమ్మి భజింపుము! యిట్టి ప్రభుతనిల్పి సరిగ నేలుము! యసురా! ౪౧౩

క॥ అని తద్ధితమును గోరుచు ననెడి మయునిజూచి వల్వలాసురవర్యుం
డును బెడచెవి నవియిడి యిట్లనియెను రోషంబు హెచ్చ హరి విముఖుండై

—♦ వల్వలాసురుండు మయుని దూఱుట. ♦—

మ॥ పొలదిండీ! యిలు కేల శూరులునగన్ భూషింతువే యిట్లు వై
రుల నీ మాయలు నీ చమత్కృతులు నీరోషంబు నీనేర్పు నీ
బలమెట్టుల్ చనె? నీకు వార్ధకమునన్ భావంబు పాడౌట నీ
పలుకీ కాలమునందు నే వినను రావా! సాయమున్ జేయగాన్ ౪౧౪

చ॥ అరయగ నల్ల శౌరి పరమాత్మయయైనను యాదవాళి త
ద్ధరికులజాతమైనను మహానటభక్తవరుండనైన నా
దరిఁదగి యేమిచేయు! నెద ధైర్యము వీడెద వేల? భీతి నీ
వరమున వీడుమా! మయ! త్వదాశ్రియముంగొని వారిఁ జీరెదన్ ౪౧౬

చ॥ అనఁద స్మరాత్మజుం డీల మహాబలుఁడైన ప్రద్యుమ్నుఁడిట్లు నీ
మనమెటుగాము వీరులము మాటకీ వారిని నెట్టుచుంటగా
వినుతినొనర్తువే? యిది వివేకిసమర్థమొ? నా శరంగటన్
ఘనుఁడపటంచు నెన్నఁడును గర్వముబూనకు నిక్కముక్కికి! ౫౧౩

చ॥ ఒకఁడెవఁడేని గర్వమునునొంది చరించిన తత్ఫలంబు బొం
దక చనునే? మదాశుగవితానము లిప్తనిమానిమైన ద
ర్పకసుతు భిన్నవర్ష్మునిగ రక్తశరీరుఁగఁజేసితీరుఁ గిం
శుకము వసంతఘస్రములు శోణముగా నొనరించినట్టులన్ ౫౧౪

సీ॥ మచ్ఛితశరములు మదనజగజముల చెక్కిళ్ళఁ బూత్రిగాఁ జల్లునాత
నావేయు తూపు లుపావిభుహయములన్ నల్లదొగుఱుబులొనర్చునాత
మచ్ఛరహతనరమస్తకరుధిరంబు యోగినీగణములు త్రాగునాత
నాశాతహేతు లా నలినాక్షపౌత్రుని యురమంబులన్ హతమార్చునాత

తే॥ మరి యెడతెగక శరపరంపరలఁ బరపు నాబలంబును వీక్షణంబుజాచు
గాక యనఁగఁ గృష్ణపౌత్రశోకధాములను నెఱింగిన మయుఁ డిట్టులనె నతనికి

తే॥ ఎటో మహాబలులైన యీ కృష్ణపౌత్రు పౌత్రమిత్రభృత్యులను నీబాహుబలము
తోడఁ గెల్చితివేని నాతో యజాక్షుఁ డిటకుఁ ద్వరవచ్చి నిన్ను జయించుఁగాదె.

చ॥ పదపడి కాలపాశముల బంధముబొందిన వల్వలుండు స
మ్మదకరతన్మయోక్తులను మన్ననచేయక కిన్కమంచు నో
యి దనుజ! యీ యదూత్తములు కృష్ణబలుల్ చిరకాలముండి నా
కెదిరులుగారె నాచెలుల నెల్లవధింపరె! వీరు గావునన్ ౫౨౧

ఉ॥ వారల యాదవాధముల భండనమందునఁ జెండి పిమ్మటన్
గోరి మహోత్సవంబొకటి గొప్పగఁ జేసెదనయ్య తద్దరి
ద్వారిజయంబునందు నలతో యజనేత్రపురీ లలామమౌ
ద్వారకకేగి గెల్చెదను తథ్యమనంగ మయుండు నిట్లనెన్ ౫౨౨

—♦ మయుండు వల్వలునకు హితోపదేశం బొనర్చుట. ♦—

ఉ॥ ఇప్పుడు నీపురంబునకు నీ సవనాశ్వము కాలరూపమై
చెప్పకవచ్చె నిద్ది హతశేషుల వీరుల యుష్మదీయులన్
దెప్పునఁజంపుఁ దద్రతిపతిప్రియపుత్రప్రపౌత్రపంక్తి నీ
గొప్పపురిన్ వినాశముగ గొంకక చేయును వల్వలాసురా! ౫౨౩

తే॥ రావణ హిరణ్యనేత్ర హిరణ్యకశిపు ముఖదనుజులఁ జంపిన హరి భూమియందు
యదుకులంబును బ్రోవగా నవతరించెనంచు వింటిని నతనితో నాజి దగదు

క॥ పలుపలుకులేల వల్వల! యలరు విలుతుపట్టి కట్టి యజ్ఞాశ్వముఁ గా
న్కలతోఁ గూర్చి యొసంగుము! పొలదిండులఁ బ్రోచిమనుము! పొందుమశుభముల్

ఉ॥ పిమ్మట నాజ్యధారపడు వేళనుమండెడు నగ్నివోలె రో
షమ్మున నుండి వల్వలుఁడు చాలిఁక నోరు మెదల్పకుండు మా
లమ్మొనరించు భావము చెలంగినచో మరుమాటమాని వే
రమ్మటు లేనిచో స్మరజు రావణసోదరుమార్గదిఁ జేరుమా! ౨౭

చ॥ అన విని మాయలన్ సలుపునట్టి మయుండు మదుక్తి వ్యర్థమ
య్యెనుగద! యేమొనర్తు? దనుజేశ్వరులెందఱొ మున్ను వైరబు
ద్ధిని హరిఁ గొల్చి తద్వరగతిన్ గనియుండిరిగాదె యట్లులా
యనఘునిఁ గృష్ణునిం గొలిచి యాహరిలోకము నేను బొందెదన్ ౨౮

క॥ అని తనమనమున ననుకొని దనుజేంద్రా! గండు రేపఁ దద్విధినంటెన్
మొన యాదవులను గెలువుము! చనుదెంచెద నేను నీకు సాయముచేయన్

చ॥ అసురవరా! కుశిధ్వజ విడువుమంచు ముదంబును గూర్పఁ దత్ఫలా
శి సచివులూర్ధ్వ కేశ నద సింహాకుశాంబులు చూచి ముందుగా
గసిమెయి నీమయుండు వెనుకన్ దగఁ బోయి యదూద్భటావళి
నుసియగునట్లొనర్తుము దనుప్రభవేశ్వర! చింతమానుమా! ౨౯

చ॥ అనిఁ బొనరించి బహ్వాహములయ్యెను గావున చేతితీటవో
వునటుల వారితో నెదిరి మోదము బొందెదమయ్య! మాకు నా
జ్ఞనొసఁగుడంచు వేడగ నిశాచరనాథుఁడు మెచ్చి మంత్రులా
ర! నెఱిగ మార్తురన్ దునిమిరండిఁక పొండనిపంచె భూవరా! ౩౦

వ॥ అంత నా నలువురు ప్రెగ్గడ లత్యుత్సాహంబుతో విద్యాధరసములును, ఏకఘ్నిదశఘ్నిశతఘ్నిశరపరిఘాతగదాముద్గరముసలతోమరశూలభిండిపాలకుంతశక్తిచక్రాది శస్త్రాస్త్రధరులును, లోహకంచుకాంచితులును, రథితురగకరిఖరమకరసూకరగవయమహిషక్రోష్టూష్ట్రసింహశంఖభిల్లగృధ్రతిమింగిలాది వాహనారూఢులును, ధనుష్మంతులునునగు కోటిదైత్యవీరులతోడఁ గూడి శంఖదుందుభినాదంబులు మిన్నుముట్ట, వేల్పులుగని వెఱచుచుండ, యాదవశూరుల గుండెలు జల్లుమనఁ బురంబునుండి కదలి కదనరంగంబున కేతెంచిరి. అత్తఱి నా ప్రాద్యుమ్ని మహాభయంకరంబగు నా యసురసేనంగని శౌర్యస్థైర్యధైర్యంబులను గలిగించు నీతిమార్గంబు మున్ను చంద్రావతీపురంబున శకునిసేనతో రణంబాడంబోవు తఱిని బోధించిన రీతిని మరల యాదవుల కుపదేశించె తదనంతరంబున, ౩౧

—♦ అనిరుద్ధాదులు సుమాసురాదులతోఁ బోరుట. ♦—

చ॥ యదువరులున్ దదుక్తనయమంతయువించు జయంబొ చావొ యీ
కదనమునందె కల్గవలెఁగాని మఱొక్కటి సూకు నూడ సం
చెదలఁ దలంచి శస్త్రముల నేపునఁ గైకొనిపోయిరంతఁ బూ
ర్వదివిజ వానరోద్భటుల పద్ధతిఁ బోరిరి వార లాపురిన్ ౫౩౨

చ॥ హయములతో హయంబులును హస్తులు హస్తులతోడఁ బద్ధసం
చయములతోఁ బదాతికులు సారథిపంక్తులతోడ సారథుల్
భయమును వీడి యక్కసున బగ్గెలఁ దగ్గక యుగ్గడించు చ
ట్టి యమరు లబ్బురంబుగన డీకొనిరో మిథిలాధినాయకా! ౫౩౩

సీ॥ మత్తేభములు కొన్ని గర్తైరహత్తించు నడకతోఁ జని వైరులఁ గడంగఁ ద్రొక్క
నిభవరంబులు కొన్ని యెదిరుల యురదాల నెంతయు త్రిప్పుచు నెత్తివైచు
మదగజంబులు కొన్ని మార్తురగంపులు జంకవేయునటుల ఘీంకరించు
కరిరత్నములు కొన్ని పరవీరయుత హరివరముల వేల్మిడిన్ బడగనెట్టు

తే॥ గున్న యేన్గులు కొన్ని రానున్న పగల మావులన్ బంటులన్ జూచి మదముగారు
చుండఁ దుండములన్ బట్టి దండితోడఁ జెండి చెకపికలాడె నా రెండు మొనల

చ॥ మఱి యల యుద్ధరంగమున మావులు కొన్ని మృగేంద్రమట్టులన్
వఱలి మదేభసంతతులపైఁ బడి యందలి వీరవారమున్
బోరిఁబోరిఁ ద్రొక్కి చిక్కక యమోఘవిధంబున వచ్చి స్వీయులన్
మురిపెము జెందఁ జేసెడి నపూర్వబలంబని మెచ్చ నెల్లరున్ ౫౩౫

ఉ॥ వీరులు కొందఱందుఁ గరవీరములన్ గొని మావులెక్కి త
ద్వైరులఁ బెక్కురన్ జదిపి వైళమె తిర్గి నటాభులై రిఁకన్
శూరులు కొందఱుద్దవిడి శూల కృపాణములన్ ధరించి యా
రారయనంగ వేల్పులు హయంబులఁ జీల్చిరి వెల్చనన్ విభూ! ౫౩౬

ఉ॥ గండరగండ లుల్లముల గండు దురాగ్రహమెచ్చ కొల్ది స్వీ
యుండు పరుండటంచనక యూరక కన్గనఁ బడ్డవారినిన్
గండడగించి పిమ్మటను గాంచి స్వకీయుఁడటంచెఱింగి బ
ల్మెండుగఁ గుంది రాగ్రహము మేలులఁ గీడులఁ జూడఁ జేయునే ౫౩౭

తే॥ వీరవరులు కొందఱు ఖడ్గవేగములను బరుల పీచమడంచి యపాయరహిత
పద్ధతిన్ వచ్చి రనిలముల్ పద్మవనము దులిచి సుఖముగా వచ్చిన లలిని భూప!

సీ॥ ఇట్టు లొండొరులును నెల్లశస్త్రములతో ద్రాఘిష్ఠజయకాంక్షదాకఁ గడగి
రుభయసైన్యజరజం బుప్పరవీదియు నంధమయంబుగా నలముకొనియె
నెట్టన రథముల నేమిరవంబులు సర్వభీకరముగా సంభవించె
హస్తిబృంహితములు నాశ్వీయహేషలు నతిభయంకరముగా నతిశయించె

తే॥ స్వీయ పారక్యభేదంబు వీసమేని గనక రోషంబు జృంభింపఁగఁడగ భీక
రాభ్రగర్జలఁబోలుచు నఖిల భేరి శంఖరావము లొక్కుమ్మడి సందడించె

క॥ చిటపట దావములొక దెసఁ బటపట నాదంబు లొక్క ప్రక్కన్ గ్రాలెన్
దటతట గుండియ లదరఁగఁ గటకటబడువార లొక్కకడనుండి రటన్ ౫౮౦

ఉ॥ కొందఱు వీరు లత్తఱిని గూలి రధోముఖులై హతాంగులై
కొందఱు నేలపైఁబడిరి కొందఱు వ్రాలిరి స్యందనంబులన్
గొందఱు ముక్తకచ్ఛులయి కోల్పడి రశ్వములందుఁ గొందఱున్
డిందిరి రక్తసిక్తులయి డీల్పడి పాఱిరి కొందఱో విభూ! ౫౮౧

తే॥ వీరహతకుంభ మౌక్తికవితతు లాక
సంబునుండి తారలు వడుసరణి యుద్ధ
రంగమందున రాలె ఘోరముగఁ గరులు
కరులపై హరుల్ హరులపై నెఱిగఁబడియె. ౫౮౨

సీ॥ పదపడి నిర్భరపౌజుల నడుమను నల్లవో! యన రక్తనది జనించె
భూతభేతాళాది జాతంబులే తెంచి శివమాలికార్థమై శిరములఁగొనె
డాకినీసహిత మహాకాళి సింగంబునం దధిరోహించి యరుగుదెంచె
డాకినుల్ తనయ తండమునకుఁ బుఱ్ఱెలన్ ద్రాగించి రక్తంబు ద్రాగఁగడగె

తే॥ క్షత్రధర్మంబు విడువక కదనమాడి పడి సురాకృతిగన్నట్టి భటవరులను
బెండ్లియాడగ నచ్చరల్ వేడ్కతోడ వచ్చి నిలిచిరి కనుచు నంబరమునందు

ఆ॥ ఈ వరుండె నాకు నీసుందరుఁడె నాకుఁ దగినవరుఁడుగాని తగఁడు పరుఁడ
టంచు నొండొరులును నగ్గలికన్ గయ్యమాడఁదొడఁగి రద్ది యబ్బురంబు

తే॥ క్షత్రిధర్మంబు చక్కఁగా జరిపినట్టి వీరులెల్లరు భేదించి సూరమండ
లంబు బొందిరి శ్రీవైష్ణవంబు జగము మైథిలేశ్వర! బహులాశ్వ! మాననీయ!

తే॥ ఎవఁడు తద్ధర్మదూరులై మృధమునుండి పాఱిరో వారు సంతప్తవాలుకాధ్వ
ముఖమునన్ నిరయంబునుబొంది నుడువరాని వినరానిబాధ గరంబు గాంత్రు

చ॥ ఇటు యదువీరు లల్ల యమరారులఁ గోట్లకొలంది బోరునన్
బటు వివిధాస్త్రశస్త్రముల బట్టి వధించిరి రోషమూర్తులై
చటుల మదాతిరేక దనుజప్రధితుల్ యదుయోధవర్యులన్
గటకటబెట్టి నేలఁబడఁగా నొనరించిరి వేలకొల్దిగాన్ ౫౮౩

ఆ॥ బాణగాఢతమము పరిఢవిల్లఁగఁ గార్ష్ణిజుఁడల యూర్ధ్వకేశ శూరుతోడఁ
బోరఁగడఁగె మున్ను పురుహూతుఁ డావృత్రుతోడఁ గయ్యమాడఁదొడగినట్లు

చ॥ గదబలుఁడున్ సదుండ నెడి కర్బురుతోడ వృకుండు సింహప్రా
ర్వదివిజుతోఁ గుశాంబుఁడను రాత్రిసుతో నలనాంబషేసుఁడున్
గదనము చేయసాగిరి ప్రకామముగా గగనంబునందుఁ ద
త్రిదశగణంబు లౌర! బళిరే! యని మెచ్చ విదేహనాయకా! ౫౪౯

ఆ॥ అందు నూర్ధ్వకేశుఁ డందిచాపము బలుమాఱు టంకరించి మనసు దీఱ
మరుని పట్టిఁ బట్టి మర్దించె శతదశమార్గణములతోడ మానవేశ! ౫౫౦

క॥ అవల ధనుష్మంతుఁడు రుక్మవతీ సుదతీ సుతుఁడు భగవదంశభవుం
డవి గనుగొని మధ్యంబున నవితథగతితోడఁ ద్రుంచి యులఁతిగ నవ్వెన్ ౫౫౧

ఉ॥ అంతట దానవాగ్రణి దురాగ్రహస్ఫూర్తిని వాని వర్మము
న్నాంతము చించి దేహమున నాటెడిలాగు దశాశుగంబులన్
వంతున వేసి నాల్గిటను వాజుల నొంచియు నిర్వ్యదింట న
త్యంత గుణాంచితంబగు మహాధనువున్ దెగవేసె నావలన్ ౫౫౨

మ॥ అనిరుద్ధుఁ డల చెడ్డ తేరువిడి యన్యస్యందనం బెక్కి చ
య్యన వృద్ధశ్రవుఁడిచ్చినట్టి పవిత్రశార్ఙ్గాఖ్యోరుశార్ఙ్గంబు గై
కొని రాసాపతిదత్తచాపమును జేకొంచుండుఁ దూపౌక్కటిన్
దనరం జేయుచు దైత్యుపై విసరెఁ జిత్రంబొంద బృందారకుల్ ౫౫౩

చ॥ అది గడతివ్వనన్ జని హయంబుల నాల్గిటిఁ జంపి టెక్కెమున్
జిదిమి వంచి సారథిని జిత్రతరంబగు స్యందనంబునున్
జెదలునఁద్రిప్పి బాలుఁడు వెసన్ గొని కాచవుకుండఁ గొట్టి న
ట్లదటున గొట్టి రెండుగడియల్ కడఁబట్టనొనర్చెఁ దద్బలిన్ ౫౫౪

మ॥ తరువాతన్ సురవైరి తేటి యటు తద్ఘాతంబునన్ బొగ్గుమా
దిరి మార్పొందిన తేరుగాంచి వడి వేర్తె తెక్కి సర్వాస్త్రముల్
వరుసన్ గైకొని కార్ష్ణిపుత్రకునితోఁ బగ్గించి పోరాడఁగా
నరుగన్ దద్బలి శాతబాణములతో నద్దానిఁ జెండెన్ జుమీ! ౫౫౫

తే॥ మఱల నరవైరి మరియొక యరదమెక్కి
యరుగుదెంచఁ గార్ష్ణిజుఁడు శాతాంబకములఁ
ద్రుంచె నట్లనిరుద్ధుచేఁ దొమ్మిది రథ
ములు హతంబయ్యె వరుసగా భూవరేణ్య! ౫౫౬

ఆ॥ అంత నూర్ధ్వకేశుఁ డాగ్రహం బెగఁబొంగ శక్తి నొకటి స్మరజు సంహరింప
వైవ నడుగాంచి బాణములన్ బదిఖండములుగఁ జెండె దండితోడ ౫౫౭

క॥ అంత నసురకాంతుఁడు తదంతంబునుగాంచి దివ్యహాటకమయమై
వింతనుగొల్పెడి రథ మత్యంతామర్షమున నెక్కి యరుదెంచి యనిన్ ౫౫౮

చ॥ మరుని కుమారుపై నయిదు మంచిశరంబుల వేసి వాసి సం
బరమును బొందె నమ్మరుని పట్టియు నెట్టన నొచ్చి చేతినే
ర్పరుడుగఁ జిత్రవాజియుతమౌ పదితూపుల వాని బొమ్మనన్
గరముగ నాటవైచె నధికప్రతిఘానల మట్టె మండగాన్ ౫౫౯

తే॥ అవ్వి శితకలంబములొట నల్ల శాతభల్లములఁ ద్రుంచి యాతని నల్లద్రావి
సరగఁగుదిరెను భువిఁగూటసాక్ష్యమునకు నసురబృందము తిర్గినయట్లు భూప!

చ॥ పిదప నిశాటనాయకుఁడు బేలరి! పోయెద వేల? యుండరా
మదమెటఁబోయెరా! కనర మాకెనవత్తువురా? యరే! సరే
పదరెద వేలరా! యనుచుఁ బల్కుచుఁ బువ్విలుకానిపట్టిపైఁ
బడి కరవాడితూపులను వైచె యదూద్భటు లబ్రమొందగాన్ ౫౬౧

ఆ॥ అల్ల పదిశరంబు లరమున నరుదెంచి భావజాత్మజాతుపాగపైని
వెలుఁగుచుండె దివ్యవృక్షంబునన్ బదికొమ్మలొప్పినట్లు కువలయేశ! ౫౬౨

ఉ॥ కాని మనోజసూనుఁ డలకాండములన్ వెతలేక పుష్పసం
తాన మహేభరాజమువిధంబున నొప్పి శతాశుగంబు ల
న్నూన్యన విచిత్రవాజ కనకోద్ధుర పుంఖవిరాజితంబులన్
మానుగ వింటనెక్కిడి యమందరుషన్ బఱపెన్ సురారిపై ౫౬౩

వ॥ ఆ శరంబు లమితవేగంబునఁ జని యాపలాశు సర్వాంగంబును భంగం
బగునట్లు భేదించుకొని రక్తమయంబులై శ్రీకృష్ణభక్తివిముఖు లధోగులై నట్లధో
గతంబులయ్యె. అద్దానవాధిపుండు పంచత్వంబును బొందె. హాహాకారంబు లసుర
బలంబులం దుప్పతిల్లె. యాదవుల బలంబున జయజయారావంబు లయ్యె. అయ్యెడ
నయ్యనిరుద్ధుపైని నయ్యమరులు విరులంగురిసి యలరిరి. తదనిరుద్ధహతుఁడగు నూర్ధ్వ
కేశ పలాశవరుండును దివ్యదేహంబుదాల్చి మనోహరంబగు విమానంబెక్కి సుకృతి
స్థానంబగు స్వర్గలోకంబున కేగె. ౫౬౪

## —♦ గదుఁడు నందునితో బోరుట. ♦—

చ॥ పదపడి తన్నదుండు తనభ్రాత నశించుటగాంచి కుంది తా
మదకరినెక్కి రోషమున మత్తగజంబున నుండి ఘోరు త
ద్గదుని శితాంబకంబులను గట్టిగఁగొట్ట నతండు వానినిన్
జదియగమోదెఁ దూపున నుషాపతి గనొనఁ జాపధారియై ౫౬౫

చ॥ అవలఘదుండు బాణముల నాగ్రహమెచ్చుచునుండ రోహిణీ
భవుఁగజస్థునిన్ గమనపాస్త్రగదన్ బొనరించి యెల్ల సూ
దవుఁభయంపడన్ దనరెఁ దచ్ఛితబాణములన్ గదేభమున్
వివశఁబొంది శింబెగద శీరుఁడు వింతగ నేల మూర్ఛిలెన్ ౫౬౬

క॥ పదగ గదుఁడును జెప్పిటీ గదగొని కసి నదసురాదిఁ గారింపఁజనెన్
మదమున సింహము సింహము నదిరా యనఁ గొట్టవచ్చినట్టు లననిలోన్

తే॥ అంతదానవకాంతుని దంతివరము గదు గదాధరు యమపేరుఁ గరముతోడఁ
బట్టి యాకసమందున వందయామడలు సనన్ వైచె యూవవుల్ గలఁగునట్లు

మ॥ తరువాతన్ గదుఁడందునుండి పడి మాత్రన్ లేచి యాత్రంబుతోఁ
గరిహస్తంబును బట్టి త్రిప్పి మిగులన్ గారించి వైరించి యి
ద్ధరన్ నెట్టనఁగొట్టెఁ బిమ్మటను దద్దంతావళం బంతనన్
జరఁత్వంబును బొందె దానవుఁడు నాశ్చర్యంబు చెందెన్ జుమీ! ౫౬౯

చ॥ అన నదుండు రోషమున నాత్మగదన్ గని యుబ్బియార యం
గ మిధులన్ మనుష్యులను గండరగండల యాపుమాపి నా
పరిమల సన్నుతిన్ బడసి వర్తిలుచుండవె? నీవు గాన యా
దవులనామకున్ గదు గదాధరునొక్కనిఁ జంపఁజాలవే! ౫౭౦

చ॥ అనినుతించి కైకొనుచు నా గదునింగని యోరితుంటరీ!
యనొనరింప వచ్చితివె? యర్హుడవే? మనుజుండ వీవు నే
నాఖిలవీరవీరుఁడ దనుపరిభవుండ ఘనుండ నావయిన్
మను శరమొక్కటిన్ బఱపి పోరుము పిమ్మట పోరెదన్ జుమీ! ౫౭౧

తే॥ అటులఁ గానిచో నధికుండనైన నేను పనికిమాలిన నీతోడ భండనంబు
సల్పుటకు నాకు సిబ్బితిగలుగుచుండెఁ బిచ్చికపయి బ్రహ్మాస్త్రంబు వేయవలెనె

క॥ ఆతుసోక్తి విను గదుఁడేరా! కొఱగాని కాఱులిటువాగెదవే
నోరామానుజుఁడఁ జుమీ! మారాడక రార! పోర! ప్రమందించెదరా! ౫౭౩

క॥ శారదవారిదవార మవారిగ గర్జించుఁగాని వర్షించునొకో?
బీఱము చెలగని దేబెలు కాఱులఁ బ్రేలెదరుగాని కలనాడుదురే! ౫౭౪

చ॥ అనయెద నాటునట్లనఁగ నా నదుఁడున్ విని మండి దండి నో
యనద! నశింతు వింకఁగనుమా! చనుమా! పరికించు మట్టె కై
కొని గద వాని యక్కుపయిఁ గొట్టిన నబ్బలి బాలుచేతి మా
లప హతిఁబడ్డ మత్తకరిలాగున నొప్పి మహాసుఖంబుగాన్ ౫౭౫

తే॥ ఓరి పీటడి! పోరున నుత్తమాంగ మేల నేలకు వేసెద విట్టిగదలు
వేయివేసియు నన్నొవ్వఁజేయలేవు గాని వచ్చు నా గదదెబ్బఁగాచికొమ్ము

తే॥ అంచు వానిలలాటంబునందు వైవ నాతఁ "డిద్దియా" నను నొచ్చునని సలుపు
నది!యహో!యింతమాత్రకే యడలువాఁడగానటంచు నీవెఱుఁగవే హానహీన!

ఆ॥ కాని యిపుడు నీకు మానంబుగాని నేర్పునిగాని యున్న నీ మహో గ
దా ప్రహార మీవు దప్పించుకొనుమంచు నల్లగదుని స్కంధమందుఁ గొట్టె

ఉ॥ సారెకు సారె కీరహి రుషన్ శపథంబులనాడికొంచు న
వ్వారలు దాల్చి పెన్గదల బాధజిగీషఁ బరస్పరంబెదన్
గోరి వధంబు దిట్టముగఁ గొట్టుకొనన్ సమకట్టిరందు నె
వ్వీరుఁడు నోడలేదు సుమి! వేల్పులు వింతనుబొందిరోవిభూ! ౫౭౯

చ॥ అఱుతను మూపునన్ నుదుట నంగములందున నెల్లచోట్ల నె
త్తురులు గడిందిగాఁ బఱఁగ స్థూల సుపుష్పిత కింశుకద్వయం
బురహిని నొప్పి యా బలు లమూల్యగదల్ ధరియించి యుద్ధమా
డిరి నుసియయ్యె నా గదలు డీకొని చిమ్ముచు విస్ఫులింగముల్ ౫౮౦

ఉ॥ అంతట వారలిర్వురు మహోగ్రహావృత్తుల బాహుయుద్ధమున్
వంతునఁజేసిరందు నలపంకజనాభునితమ్ముఁ డానదున్
గొంతుకబట్టి భూమిపయిగూల్చెను సింహము బెట్టిదంబునన్
బంతము సంతరించి వడిబొటెలు లాయముఁ గూల్చినట్టులన్ ౫౮౧

క॥ అత్తటి నత్తెగుదారియుఁ దత్తరమున గదుని హృదినిఁ దన దృఢముష్టిన్
గత్తళము గత్తిరిల్లన్ మొత్తె వియత్తలము నసురపుంజము బెగడన్ ౫౮౨

క॥ అయ్యెడ నారామానుజుఁ డయ్యసురుని యుత్తమాంగమందున ముష్టిన్
బయ్యలుగని పరుగిడగా నయ్యారెయని శూరులు కొనియాడఁగఁ గొట్టె

క॥ పదపడి నదుఁడును గదుఁడును మదమునుబుకగ నెదురుకొనిరి మదకరులవలెన్
బదములతో భుజములతో వదనముతో నెదలతోడఁ బొణులతోడన్ ౫౮౪

వ॥ ఇట్లవ్వీరు లన్యోన్యంబు జయంబు నభిలషించుచు నన్నితెఱగులం బోరాడం దొడంగిరి. అందు నదుండు మదంబున గదుని పదంబునందుకొని దగిరఁ ద్రిప్పి ధరపై విసర సరసీజాక్షానుజుండు వెస నుత్థితుండై పనమిఱుఁ గసితో నా యసురుని చరణంబును గ్రహించి యుయ్యాల నూఁచినపగిది నూఁచివేఁచి యఁలపైఁ గొట్ట నా చెట్ట యా జగజెట్టిం బట్టికొని యుప్పరంబుపై నూఱామడలు దాటు

సటుల గిరాటువేయ నగ్గమం డంమనుండి పడి యించుకనొచ్చి పడిలేచి కచ్చఁగచ్చి
తంబుగా బిగించి యక్కచ్చపోటుతో మచ్చరంబెచ్చఁ గచ్చియం జేసి విసుచ్చరు
కౌరాయన నంబరంబునందు వేలయామడలుగ విసరివైవ నా యసురుం "డా"
యని పలితుండయ్యుఁ జింతింపక క్రిమ్మఱ హుంమ్మని యుమామఘవానుజునితోఁ
గయ్యమ్మునకుం జన నతండును గ్రుద్ధుండై పోరాడం బోడంగె, ఈరీతి నవ్వారలు
పరస్పరంబు ముఖాముఖి బాహాబాహి కేశాకేశి ముష్టాముష్టి నఖానఖి దండాదండి
పదాపదిగా నద్భుత ఘోరయుద్ధంబు జేయు తఱుణంబున ౫౮౫

చ॥ దనుజులు గాంచి యా మన నదప్రిభుఁడే ఘనుఁడయ్యె వాని గి
ఱ్ఱునఁగిరఁ ద్రిప్పి నెట్టి కసిఁగ్రుద్దుచుఁ బద్దునఁ బైకివేసి వెం
టనె కొని "నీదుబీర మెచటఁ జనెఁ జూపర! యోరి పిశాచి!
యని యెదనాటఁబల్కి యెటు లార్తినిగూర్చుచునుండెఁ గాంచుఁడీ! ౫౮౬

ఉ॥ వెంటనె యాదవుల్ గనుచు వీరుఁడెవండన నీ గదుం డటం
చంటిమి దాని నిత్తఱి యథార్థమొనర్చెఁ గృతార్థుఁ డిట్టి బల్
తుంటరు లెంచతేని గసితో నెదురాడఁగ నేగినన్ బ్రమటిన్
గొంటఁడె కంటుతో నితఁడు కృష్ణునితమ్ముఁడు గాఁడె చూడఁగన్. ౫౮౭

తే॥ అనుచు నుభయులు గొండాడ ననిని వారు సలిపిపడి రనిరుద్ధుండు సరగ గదునిఁ
జేరి శీతోపచారముల్ చేయ నా బలిష్ఠుఁ డొకనిముసంబులో లేచి చూచి

క॥ నరుఁడేఁడీ! సదుఁడేఁడీ! గదు వీరాకారకృతులఁ గాంచి భయముతోఁ
గననము విడి పాఱెనొకో? మననుణఁగన్ నక్కెనొకొ? మరణించెనొకో?

తే॥ అంచు నడుగుచు నెల్లెడననుచు నొక్క
యెడను గడఁబట్టి పడిన యా యుద్ధబలునిఁ
గాంచి జయజయధ్వనులఁ గావించె సురలు
దుందుభులను బ్రమోగించిరి తుష్టులగుచు ౫౯౦

ఉ॥ అంతట సింహనామక మహాసురుఁ డా నదరాక్షసాంతవ్ర
త్రాంతము సాంతముల్ గని వ్యథాక్రుధ లెచ్చగ నావరింప దై
త్యాంతకపుత్రుఁడౌ వృకుని స్యందనభాసుర వాడితూపులన్
మతున వైచి వేఁచె ఖరవాహనుఁడై మధురాపురీశ్వరా! ౫౯౧

చ॥ అనల వృకుండు వచ్చెడి పరాంబకముల్ దన వాడితూపులన్
ననయఁగఁ గొట్ట నయ్యసురనాథుఁడు క్రోధముతోడఁ గ్రమ్మఱన్
గనియుచు బాణముల్ విసరఁగా నతఁడున్ గసి వానినన్నిటిన్
స్వవిశిఖసంతతిన్ బఱపి పాడొనరించె ననంతరంబునన్. ౫౯౨

చ॥ ఎనిమిది వాడియమ్ముల సురేశుఁడు గైకొని యందు నాలుగిం
టను హరులన్ వధించి యొకటన్ బెనుటెక్కెముఁ గూల్చివైచి స్యా
దినిఁ బడవేసి యొక్కటను ద్రెంచి వృకోదరుధనుస్సు నొక్కటన్
ఘనవృకవత్సు నొక్కటను గాడ్పడఁజేసెను వీఁకఁ జోఁకలన్. ౫౯౩

శా॥ ఆ సింహాహవచర్యఁ గన్న భటు లాహాకారముల్ సల్పఁగా
నా సంకర్షణసోదరుండు వృకుఁ డత్యంత క్రుధావిష్టుఁడై
వాసింబొందిన శక్తి నా యసురుపై వైచెన్ జుమీ యోర! యో
రా! సింహా! తగుచర్యఁ జేసెఁ గనరా యంచుగ్గడింపన్ బలుల్. ౫౯౪

తే॥ అవల శక్తియుఁ జని వాని యుపఘనంబుఁ
గరము భేదించి బాధించి ఖరముఁ ద్రుంచి
ధరణిలో దూరె నురగంబుఁ దిరిగి తిరిగి
రంధ్రమున దూరినట్టుల రాజవర్య! ౫౯౫

క॥ పుడమిపయినిఁ బడిన సింహుఁడు వడి నుత్థితుఁడై మృగేంద్రు వడువున: గడు న
ల్గడలను వడవడ వడఁకుచు సుడివడఁ గర్జించి వేసె శూలమతనిపై ౫౯౬

తే॥ వృకుఁడు వచ్చు శూలంబును నెడమచేతఁ
బట్టికొని దానితోనె యా దిట్టఁ గొట్ట
నతఁడు నిర్భిన్నదేహుఁడై హా! హా! హా! హా!
యనుచు నవనిపై మూర్ఛిల్లె నవనిమీఁద. ౫౯౭

క॥ తురమున నసురులు హా! హా! యరరే! కటకట! యయో! యటంచార్చిరి ని
ర్జరులున్ విరులన్ గురిసిరి మురిసిరి యదువర్యులు జయపూర్తధ్వనులన్

—♦ కుశాంబుఁడు సాంబునితో యుద్ధం బొడుట. ♦—

ఉ॥ అంతఁ గుశాంబుఁడన్ దనుజుఁ డాత్మపరాజయమున్ గ్రహించి య
త్యంతరుషాత్మ సాంబముఖయాదవయోధులపైని దూఁపులన్
వంతునవేసె దద్దతుల వాజులు గూలెను రాలెఁ డెక్కెముల్
దంతులు నంతమొందె భటతండము చెల్లెను ద్రెళ్లె దేరులున్. ౫౯౯

తే॥ అవల జాంబవతీసుతుఁ డాహవవిదుఁ డధికబలుఁడైన సాంబుఁ డత్యంతరుషను
నసురనాయకుండు కుశాంబుఁ డాత్మసేనఁ జెండి చెకపికలాడెడి చేఁతఁగాంచి

ఉ॥ ఓరి కుశాంబవీర! భవదుద్ధృతతేజముఁ గాంచియుంటి నా
తో రణమాడ రమ్మిఁకను దూరముఁ బోయెదవేల? దేబెలున్
సారవిహీను లల్పులును సాధ్వసయుక్తులు కోటివీరు లే
లా? రుషఁ జాకచక్యముఁ జలంబు బలంబిటఁ జూపవేలకో? ౬౦౧

తే॥ అనుఘుఁ బౌరుషముప్పొంగననినమునుల నతఁడువిని కని కనలుచు నవహసించి
యష్టశరములం గైకొని యల్లసాంబు వక్షమందునఁ గ్రుచ్చె నాషట్టునందు

ఉ॥ సాంబుఁడు నేడుతూపులఁ గుశాంబునిపై విసరంగ వాఁడు శా
తాంబకసంచయంబునిచె నష్టము లిష్వసు వారలస్త్రశ
స్త్రంబులతో జయార్థులయి షణ్ముఖ తారక సామ్యుఁబొంచు స
ర్పంబులఁబోలి హుమ్మనుచు భంజనమాడిరి సూటిపోటులన్ ౬౦౩

చ॥ అసురవరిష్ఠుఁడ త్తఱి నహంకృతితో డుత నూర్లకొల్దిగాఁ
బసగలవాఁడితూపులను వైవగ సాంబుఁడు సజ్జచాపమున్
గసిబిసియయ్యె గుఱ్ఱములు గాడ్పడె సాదిపడెన్ బడెన్ రథం
బసురసురోందె సాంబుఁ డహాహా! యనసాగిరి యాదవోత్కటుల్ ౬౦౪

తే॥ అంత జాంబవతీసుతుఁ డాహవవిదు డలఘుఁడై నట్టి సాంబుఁ డన్యరథమెక్కి
చాపసంయుతుఁడై క్రుధాజ్వాలనుఁ దట్టిమంద వానితో నిట్టుల మాటలాడె

ఉ॥ ఎచ్చటి కేగుచుంటివిర! యించుక కాని పరాక్రమంబు నా
కిచ్చటజూపియుంటి విఁక నీవు మఱొక్కని మేషముండువిరా!
యెచ్చగు నా బలంబుగనుమిరా! యని బాణము మంత్రమంత్రితం
బచ్చుగ వింటనెక్కిడి రయంబునవైచెఁ గుశాంబు తేపపై ౬౦౫

ఉ॥ దాన నిలాతచక్రము విధంబున సూతతురంగయుక్తమై
వాని శతాంగ మాకసముపై నొక యామడదాఁకఁ దర్గగాఁ
బూనె నటుల్ దివంబుపయిఁ బూర్తిగఁ దిద్దు రథాన నున్న యా
దానవుఁగాంచి యిట్లనియెఁ దద్యదువీరుఁడు నవ్వుమోముతోన్ ౬౦౬

చ॥ ధర నివసింపఁగాఁ దగరు త్వాదృశులందఱు స్వర్గయోగ్యులై
నఱలెద రాదితేయగణవల్లభతుల్యపరాక్రముల్ గదా;
త్వరగతి మద్ద్వితీయ శరధార నదేహరథుండవౌచు ని
ర్జరపురికేగుమం చనిచె సాయక మంబరచోదకంబునున్ ౬౦౭

సీ॥ పనిచిన సాంబునిబాణముచే నసురేంద్రు తేరిలనుండి యెగిరియెగిరి
యెచ్చోటఁ జూచిన నచ్చోట గనుపడి నెఱివెఱయగునట్లు దిరిగి తిరిగి
చిత్రవిచిత్ర విశేషరమ్యంబులై తనరులోకములెన్నొ దాటి దాటి
రవిమండలముజేరి రశ్ములకుందాళ జాలక పూర్తిగాఁ గాలి కాలి

తే॥ తరణివేడికి దైత్యుండు దాహమొంది భ్రమంది హాహాకృతుల్ సేయ రాక్షసకుల
మంబరమునుండి తజ్జ్వాలాసురుండు సెలఁగు పురికేగి యాతని చెంతఁగూలె

క॥ సురలవుడు విరుల గురియుచు మురిసిరి మ్రోగించి దుందుభుల యాదవులన్
బొరిఁబొరిఁ బుట్టెను జయరుతు లఱిముఱిగాఁ గినుకగల్గె నసురవరులకున్

దంబెక్కి యుత్సాహం బినుమడింప ననిరుద్ధునితో యుద్ధంబాడ స్వయంబుగా నగరు నుండి వెడలె. సైన్యపాలకుని పుత్రకుండు బుభుక్షితుండై భుజించుచు సమయాతి క్రమణం బొనరించె. ఇది సైనికులు కనిపెట్టి ప్రభువునకు నివేదించి, యాతఁ డరు దెంచినతోడనే యావల్వాలుని సమ్ముఖమ్మున నిలునంబెట్ట, నా దానవేశ్వరుం డేల యాలసించితివని యతనిని భర్జించి మొగంబున నొక్క భుశుండిని బాది మృతుం గావించి, దానవలోకంబునకు భయంబుగల్గించె. అంత సైన్యపాలకుం డాత్మజవ ధోదంతం బాలించి, కరంబులతో శిరంబును మోదికొనుచు, దుఃఖావేశపరవశుండై రథంబునుండి పుడమిపైఁబడి, ౬౨౩

తే॥ ఏమిచెప్పుదు నీతల్లి కేనుపోయి తండ్రిబుుణ మేమిదీర్పక తరలఁదగునె?
నిను బిరంగిచంపినమాట నిక్కవమొకో? మోము కళ తప్పగాలేదె ముద్దుబిడ్డ

మ॥ తనయా! నాదెసఁ జూడరా పలుకరా తండ్రీ! యయో! యయ్యయో!
వినరా! నీ బలశౌర్యధైర్యగుణముల్ వీక్షింపగా నున్న యీ
నను వృద్ధుం విడనాడిపోయెదవురా! నాకింక దిక్కెవ్వరా!
యని కాలస్యమొనర్చినందులకు నీ కంతంబె సిద్ధించెరా! ౬౨౫

తే॥ అంచుఁ గన్నుల నశ్రువు లతిశయముగఁ గాఱ కాల్వలై పాఱ నాక్రందనంబు
సలుపునాతనిదరికి నా సచివసుతులు నలువురునుబోయి యిట్టులఁ బలికిరయ్య!

—♦ మంత్రిపుత్రులు దుఃఖితుండగు సైన్యపాలు నూఱడించుట ♦—

ఉ॥ ఏడువకయ్య! యెందులకునేడ్చెద వేడ్చిన లాభమున్నదే?
రాఁడు మృతాత్మజుండిఁక ధరాస్థలిఁ బుట్టినదెల్ల గిట్టదే?
చూడవె యిట్టివెన్నిటినో? శూరవరుండవు గావె? దీని నీ
సూడులుఁ గాంచి నవ్వరొకో? శోకముమానుము సైన్యపాలకా! ౬౨౭

ఉ॥ కొందఱు గర్భమందు మఱిఁ గొందఱు పుట్టుని మేషమందునన్
గొందఱు పుట్టినంత నిఁకఁ గొందఱు బాల్యమునన్ వయసునన్
గొందఱు వార్ధకంబునను గొందఱు రోగముతోడ గొందఱున్
గొందఱు శస్త్రధారలను గొందఱిలన్ బడి చావరే సుధీ! ౬౨౮

తే॥ కొందఱాధులతోడుతఁ గ్రుళ్ళి డిందుచుందు రిట్లన్నితెన్నుల నందఱు నిజ
కర్మవశ్యులై చత్తురుగాదె? బుధుఁడు చలనమొందునె దీనికో సైన్యపాల!

చ॥ ఎవఁడుసుతుండు తండ్రియెవఁ డెవ్వఁడు తమ్ముఁడు పెండ్లమెవ్వతో
యెవతయొ తల్లి యూరయఁగ నెవ్వనికెవ్వఁడు? దేనికేది సం
భవము వియోగమున్ బ్రజకుఁ బ్రాక్తనకర్మఫలానుసారిగా
దవులగఁజేసె నా నలువ దానికి నింతగ వంత యేలకో? ౬౩౦

తే॥ కర్మవశమునఁ గలిగెడి కష్టమునకుఁ గుందుచుందురు సౌఖ్యంబుఁ జెందునప్పుడు
సంతసింతు రలంతులు సైన్యపాల! యాత్మ కివి సోఁకియుండఁగాదె సంభవమ్ము!

తే॥ వ్యర్థముగఁ జీటిమాటికి వచ్చు పోవు
కష్టసుఖముల కెవ్వఁ డాక్రందనంబు
సలిపి యాత్మఘాతియగు నా యలఁతివాఁడు
నరకమున నొచ్చి జన్మంబుఁ దరిగి యెత్తు ౬౩౨

ఉ॥ లెమ్ము మనోవ్యథన్ విడి చలింపక యాయుధసంచయమ్ముఁ గై
కొమ్ము రథంబు నెక్కు మనుకూలురతోడుతఁ గూడికొమ్ము వై
రమ్మున నున్నవారలఁ దురమ్మునఁ జంపఁగఁబొమ్ము ధర్మమా
ర్గమ్మున స్వర్గమో ? జయమొ ? కాంచుము మించుము క్షత్రనీతితోన్. ౬౩౩

తే॥ అద్ది మంచిమార్గముగాని యన్యమెదియు గాదటంచు బోధింప నా గట్టివాఁడు
వంతవీడి వచ్చిన యాత్మబలము నంత గాంచి యిట్లనె నిప్పులు గనుల రాల

ఉ॥ వీరులు యుద్ధదుర్మదులు వేలకొలందిగ నీ రణస్థలిన్
జేరిరిగాని యా యసురశేఖరపుత్రకుఁ డేలరాఁడో ? స్వా
గారమునందు నేమిపనికై వసియించెనో ? బొందితీసిచేఁ
బౌరుషహీనుఁడై తగెనొ ? పాఱెనొ ? కాక యుపేక్ష చేసెనో ? ౬౩౫

ఉ॥ ఆఁకలిచేత బీడపడి యన్నమునుం దిని వచ్చునంతలో
నా కొడుకున్ బిరంగి విడి నాశమొనర్చునుగాదె ? యీ ప్రభుం
డేకరణిన్ సుఖించెననుచు నిందనుకన్ రణమాడరాని యా
పోకిరిఁ జంపకుండు ? నెటుఁ బూనఁడు పల్కినపల్కు నిల్పఁగాన్. ౬౩౬

ఆ॥ ఎట్టులైననేమి యేలికమాటను దాటినట్టిమాట తథ్య మందు
వలన భూపునెదుట వానిఁ జంపెదనంచు దురముఁ దొరఁగి పురికి నరుగఁ దరలె

చ॥ పదపడి నింట వల్లులనిపట్టి భుజించుచుఁ ద్రావి మద్యమున్
మదముబుకన్ మెయిన్ మరచి మాపటివేళ శయించి భాస్కరుం
డుదయముగన్న మేల్కొనకయుండుట దత్సతి యుద్ధభేరి వి
న్నదగులచేత భీతిపడి నాథుని లేపఁగడంగె నిట్టులన్ ౬౩౮

క॥ లెమ్మా ! లెమ్మా ! యాజికిఁ బొమ్మా ! ప్రొద్దెక్కె నని కిఁ బోనిసుతుని నం
తమ్మును సల్పెదనని పటహమ్మున ప్రమోగించె భూపుఁ డయ్యా ! లెండీ !

తే॥ అరిగి మీ యయ్యఁ గాంచుఁడీ ! యతిరయమునఁ
నని ప్రబోధింప నతఁడు మేల్కొనకయుండె
నంత నా యమ్మ గ్రమ్మఱఁ గాంతుఁడగు కు
నందనాఖ్యున కిట్టులనం గడంగె. ౬౪౦

క॥ అయ్యా! బలములతో మీ యయ్యయుఁ గయ్యంబుఁజేయ నరిగెనుజుమ్మీ
యియ్యెడ నీకుఁ దడవేలా? చయ్యనఁజని జగడమాడి జయమును గొమ్మా

మ॥ అని మేల్కొల్ప నతండు లేచి నిజశస్త్రాస్త్రాదులందాల్చి నె
మ్మనమం దా శివు విఘ్ననాయకుని బద్మానాథునిన్ నిల్పి భ
క్తిని ధ్యానించి రథంబునెక్కి వడి నేతెంచంగ సేనానియున్
గని యా వల్వలభూపుపట్టికిఁ గ్రుధాక్రాంతాత్ముఁడై యిట్లనెన్. ౬౮౨

మ॥ దనుజేశాత్మజ! యేలజా గనికి నే దర్పంబుతో నుంటి వే
మని నీ వెంచితివయ్య! యాజ్ఞవినవే యాలించి రా వేల? నీ
కెనయౌ నా సుతుఁ జంపలేదె? విభుఁ డిల్లే జాగుఁజేయన్ వడిన్
జన వే నీ పితచెంత కీవు నతఁడో సత్యప్రధానుండు సూ! ౬౮౩

## —♦ సైన్యపాలకుఁడు వల్వలపుత్రుని వధింప యత్నించుట ♦—

తే॥ నిన్ను దోడ్కొనిరమ్మని నన్నుబంపె రమ్మటంచుఁ గోసింప నా రాజపుత్రుఁ
డును సుధన్వుఁడు ఖిన్నుఁడై చనినయటుల సైన్యపాలుతోఁదగి తండ్రిసరసఁజేరె

చ॥ అటుల గునందనుండు సని స్యందనభాసురుఁ డాగ్రహోగ్రుఁడున్
భటయుతుఁడున్ బలిష్ఠుఁడును వైరిజయోత్సుకుఁడైన తండ్రినిన్
దటతట గుండె కొట్టుకొన దబ్బున గన్గొని మ్రొక్కి లజ్జ ను
త్కటముగ మోమువంచికొని ధాత్రిని గూర్చొనెఁ గృష్ణు నమ్మచున్.

తే॥ వల్వలుం డంతఁ దనసుతుపద్ధతిఁ గని
పండ్లు పటపటగీటుచుఁ బరమతుచ్ఛ
రాజు నాజ్ఞ మీఱితివౌరో! ప్రాణములను
బాయ నా యంతికమునకు వచ్చితివౌరా! ౬౮౬

క॥ మరచితివా? వెఱచితివా? విరిచితివా తండ్రిపైని విశ్వాసంబున్
దురమునకై తడవేలా? యఱచేతికిఁ బండ్లు వచ్చెనా? నరికింతున్. ౬౮౭

తే॥ చూడ నీవారి తేరిన చోరుఁడవని వంచకుఁడవని తోఁచె నా భావమందుఁ
దనయుఁడవుగాక వైరివై తనరితివిగ తులువ! చంపింతుననిపల్కి తలఁచె నిట్లు

మ॥ అరరే! యీదిన మెంతదుర్దినమురా! హాహా! మదిష్టాత్మజున్
నరుకన్ బూనితి నిర్నిమిత్తముగ సేనాపాలకాత్రోద్భవున్
కరుణన్ వీడి వధించియుంటి నివు డా కాలుష్యమే వచ్చి నా
వరపుత్రున్ నశియింపఁజేయు నఘముల్ వ్యర్థంబుగాఁ బోవునే? ౬౮౯

క॥ కొడుకని విడిచినచో నను బడఁదిట్టును దైత్యకోటి పరిహాసంబున్
బడుగులుగూడఁ నొనర్తురు వడిఁ జంపితినేని నాకు వరసుతుఁడేఁడీ! ౬౯౦

తే॥ ముందుఁజన నూయి వెనుకకుఁబోవ గోయి
యనిన కైవడి నాకయ్యె ననినమాట
తప్పువాఁడుగాఁడని యిప్పు దైవమిట్లు
చేసెనని తోఁచుచుండె నా చిత్తమందు ౬౫౧

తే॥ ఇటుల నేదిసేయుట కేమియిష్టపడక శోకమునుబొందు వల్లాలుఁ జూచి సైన్య
పాలకుండు మండఁగ గోపపావకుండు వికటముగ నవ్వి యిట్లు పలుకఁగడఁగె

ఉ॥ చంపవదేల నీ సుతుని ? జాగొనరించెదవేల ? నీవు శో
కింపక యీ కునందనుని గిట్టనొనర్పుము ముందు వైరులన్
జంపుటొ చచ్చుటో మనకు సంభవిలున్గద ! సత్యవాదివై
నింపుము వాసిలేనియెడ నింద్యుఁడవై నరకంబుఁ గాంతువే ? ౬౫౩

సీ॥ రాముననంతటి సుపుత్రకుని దశరథుండు సత్యంబునన్గదా సరగవిడుట
యా హరిశ్చంద్రుఁ డాత్మాంగనాపుత్రులన్ సత్యంబునన్గదా సరగవిడుట
బలిచక్రవర్తి సర్వంసహ నంతయు సత్యంబునన్గదా సరగ విడుట
యావిరేచనుఁ డాత్మజీవనంబెల్లను సత్యంబునన్గదా సరగ విడుట
తే॥ శిబి యకీర్తిని నలదధీచి నిజతనువు రంతిదేవుండు భోజనం బంత గుఱువు
ఘనపృషధ్రుఁ, సత్యంబునన్గాదె విడుట సత్యమున కేది సాటియో సత్యసంధ !

ఆ॥ కాన నాజ్ఞదాటి క్రాలెడి నీ పుత్రుఁ బల్కినటులఁ జంపవలయుఁ బూర్వ
మాడిన నుడి తప్పఁగూడదు మఱవంగఁ దగదు దానవేంద్ర! నగవవలదు

ఆ॥ సత్యమాడునట్టి జనపతి రాష్ట్రంబునందు నుండవలయు ననృతమాడు
ప్రభునిరాజ్యమందు వసియింపఁగాఁ గూడదంచుఁ బెద్దలందు రసురనాథ! ౬౫౬

చ॥ అనవుఁడు వల్లాలుండును వ్యథానలదగ్ధమనస్కుఁడౌచు నా
తనయునిఁ జంపుఁడీ యని దుఃఖితంబున నాతని కాజ్ఞనిచ్చె తాఁ
జనె యదు సమ్ముఖమ్మునకు తామ్రపతియాజ్ఞను సైన్యపాలుఁడా
తనయునకున్ వచింప విని తద్యువరాజును వానికిట్లనెన్ ౬౫౭

చ॥ పరశువుతోడఁ దల్లిమెడఁ బట్టి వధింపఁడె తండ్రియాజ్ఞ మున్
బరశుధరుండు రాముఁడటు పార్థివునానతి నన్నుఁజంపు మే
నఱగొఱజెంద దీనికయి యందఱికున్నదె నాకు వచ్చె; దు
ష్కరమగు నొక్క ధర్మకృతిసల్పి వెసన్ జనుదెంతు నోసుధీ! ౬౫౮

సీ॥ పలికి యటుల్ మాళి బాహుపురుల్ మణిదివ్యహారాదులఁ దీసివేసి
విప్రవరుల కిచ్చి వివిధసౌఖ్యంబుల గలుగఁజేసెడి దీవనలను బొంది
యమలజలంబున నవగాహనమొనర్చి యచ్ఛమృత్తిక దేహమంతనలఁది
తులసిపల్లవములన్ లలిఁగూర్చి మొగమునన్ గళమునఁ దొళసిపేరులను వేసి

క॥ కావున శ్రీహరికెనగా నే విబుధుఁడును నిల్వఁబట్టి కృష్ణునకార్థ్
వే వినతులఁ గావించెద మీా వేళ నటంచు దైత్యబృందం బలరెన్ ౬౭౯

సీ॥ ఆ సమయంబున హర్షంబుతోడుత వల్వల దానవవంశవిభుఁడు
స్యందనమందాత్మ నందను నెక్కించి వినుతసింహాసమాన విక్రములును
గజసమపుష్టులు గంచుకప్రాంచితుల్ బహుచిత్రవేష విభ్రాజితులును
బహువిధశస్త్రాస్త్ర భాసురుల్ బహువిధవాహనారోహకులాహవోగ్రు
తే॥ లైన దైత్యులతోఁగూడి యశ్వహస్తి యాప్యయాన రథాతి సమన్వితుఁడయి
ధరణికంపింప యాదవధ్వజినితోడఁ బోరుటకుఁబోయె నిర్జరు లార! యనఁగ

తే॥ అంత పంతముతోడుత నరుగుదెంచు వల్వలు బలంబు శ్రీకృష్ణపౌత్రుఁడుగని
శంకితుండయి నిజసేనఁ జక్కఁగ్రోవ జిత్రచక్రాకృతిగ నిట్లు చేసి వేసె ౬౮౦

వ॥ వివిధవిధమహాయుధంబులం దాలిచి కరితురగరథంబుల నధిరోహించిన యాదవయోధులను నలుగడలందు నిలిపి, వీరి నడుమ నింద్రనీలుఁడు మున్నగు రాజవరేణ్యుల నుంచి, వీరి మధ్యభాగంబున అక్రూరుఁడు, కృతవర్మ మున్నగు మహావీరులను, వీరి నడుమను గదుడు లోనగు కృష్ణునిసోదరులను, వీరి మధ్యభాగంబున సాంబుఁడు, దీప్తిమంతుఁడు మొదలగుమహాశూరులనునిల్పుచు జక్రవ్యూహంబు రచించి, దీని నడుమ దాను గవచధారియై కాలాగ్నిరుద్రసన్నిభుండై శత్రుదుర్నిరీక్ష్యుం డగుచు నిలిచియుండె. అప్పుడా సింధుతటంబున, ౬౮౧

క॥ శరధి శరధి డీకొనినటు శరతోమరముద్గరాది శస్త్రాస్త్రములన్
సుర వైరులు యదువులతో నురుతుములం బైన రణమూ నొనరించిరహో!

చ॥ అలరణమందు దానవులు, యాదవయోధుల చావుదెబ్బలన్
బలము జలంబు గోల్పడుచుఁ బాఱిరి కొందఱు రక్తసిక్తులై
లులితశరీరులున్ బదములున్ గరముల్ కనులున్ దెగంగ ని
శ్చలులును గొందఱైరటనె చచ్చిరి గొందఱు భీకరంబుగాన్. ౬౮౩

చ॥ సురరిపు యాదవధ్వజిని శూరగజాశ్వపదోత్థధూళి, భా
స్కరు దివిఁగప్పెఁ జీఁకటులుగ్రమ్మె సురారులు పోరుమాని యా
తురపడి వాపికూపముల దూకుట దొర్లుట సంభవించె నా
సురవరవల్వలుండుగని క్షోభిలి రోషిలి రూక్షవీక్షుఁడై ౬౮౪

[ వల్వలాసురుండు తనయ, మంత్రితనయ, సేనాసమన్వితంబుగా ]
—♦ యాదవబలంబుతోఁ బోరుట. ♦—

క॥ తనయుని నలువురు ప్రెగడల తనయులఁదోడ్కొంచు వివిధతైజసహేతుల్
గొని రణరంగంబునకున్ జనుదెంచెను బగఱగుండె ఝల్లనుచుండన్ ౬౮౫

వ॥ అంత ననిరుద్ధుండు వల్వలునితోడను, బృహద్బాహుండు దుర్నేత్రునితోడను, అరుణుండు దుర్ముఖునితోడను, న్యగ్రోధుండు దుస్స్వభావునితోడను, కవి దుర్మదునితోడను, కృష్ణనందనుండగు సునందనుండు వల్వలకుమారుండగు కునందనునితోడను దలపడి యుభయులచ్చెరువొందునట్లు హాహాకారిగాఁ బోరాడుచున్నంతలోఁ గార్తికమాసవాసరంబులు గడచిపోయినను యుద్ధంబు సమాప్తంబు గాకపోయె. అత్తఱి వల్వలాసురుండు క్రోధావేశపరవశుండై మాటిమాటికి ధనుష్టంకారంబు గావించి, మూఁడు తూఁపులతో నింద్రసేనుని, ఐదు బాణంబులతో హేమాంగదుని, ఐదుశరంబులతో ననుశాల్వుని, ఐదువిశిఖంబులతో నక్రూరుని, బండ్రెండు దమ్ములతో గదుని, నైదుశరంబులతో యుయుధానుని, నైదుబాణంబులతో నుద్ధవుని, నైదింటితోఁ గృతవర్మను, నూరు నారాచంబులతో ననిరుద్ధుని నానావిధముల బాధింప, యాదవయోధులు, ౬౮౬

చ॥ సరథగజాశ్వసూత శితనాయకముఖ్యసైన్యయుక్తులై
తిరిగిరి ఘంటసేపు దివిఁ దేరుహరుల్ దెగెఁ గార్ష్ణిజాదులా
సురకరలాఘవంబునకుఁ జోద్యముఁబొంది రణాంగణంబునన్
దిరిగి రథాధిరూఢులయి ధీరతఁ జేరిరి మెచ్చఁజూపకున్ ౬౮౭

తే॥ వల్వలుండును యాదవధ్వజినియందు జెలఁగువీరులఁ జెండాడఁదలఁచి వెదకు
చుండె నింతలో మారసూనుండు మండిపడుచు నరుణనేత్రుండయి పలికె నిట్లు

చ॥ నిలు! నిలు! మోరిదైత్య! యిఁక నీపయి వేయు మదీయసాయకం
బుల రుచిజూడు మెచ్చటకు బోయెదవీవు పరాక్రమక్రమం
బుల నిటఁజూపుమా! బలము బుద్ధియు బోయెనెయంచు బల్కు వ
ల్వలసుతుఁడౌ కునందనుఁ డపారరుషన్ విని యిట్లు పల్కెడిన్ ౬౮౯

క॥ దనుజవరేణ్యుండను నా జనకుని చరణములఁ జూడఁజాలవు నీవో
యనిరుద్ధా! ముందుగ నా సునిశిత బలపౌరుషములఁ జూడుము! రమ్మా! ౬౯౦

క॥ అన విని యనిరుద్ధుండో దనుజాత్మజ! తొలఁగుమా! మృథమునకుఁ దగవే
చని యింటికి బాలురతో మనసారగ నాడిపాడి మనుమా! చనుమా! ౬౯౧

## —♦ కునందనానిరుద్ధ యుద్ధము ♦—

మ॥ దనుజాత్మోద్భవుఁడౌ కునందనుఁడు కందర్పాత్మజుండైన యా
యనిరుద్ధుండు వచించినట్టి వచనంబాలించి రోషించి యో
యనఘా! యింటను గుజ్జులన్ గలిసి నా యాటల్ విలోకింపగాఁ
జనఁడేడున్ దమబోంట్లు చూడవలె నా శౌర్యోరువీర్యంబులన్ ౬౯౨

క॥ ఇటు పటుతరముగఁ బలుకుచుఁ జటులంబగు చాపమందు శతబాణములన్
ఘటియించి రథస్థుని యదుపటలాన్వితుఁ గార్ష్ణిసుతునిఁ బ్రహరించె నహా!

క॥ అనిరుద్ధుం డా దెబ్బకు వినువీధి న సూతతురగవివిధాస్త్రస్యం
దనుఁడయి గిరగిర దిరుగుచు మునివరకపిలాశ్రమంబు ముందలను బడియెన్

ఉ॥ అప్పుడు యుద్ధరంగమున నచ్యుతపౌత్రుఁడు లేమియాదవుల్
చప్పున గాంచి ఖేదపడి సాహసధైర్యనిబద్ధబుద్ధులై
యప్పలలాశనాత్మజుని నంత మొనర్పఁదలంచి పగ్గెలన్
జెప్పుచు దెప్పుచున్ సురలు చిత్రముఁ జెందగ జేరిరంతటన్ ౬౯౫

వ॥ యువరాజగు కునందనుండు తన్నుఁజంప ముందర కేతెంచు సాంబాది యాదవయోధనాథులంగాంచి యానందించి, పదిబాణంబులతో సాంబుని, నైదు తూపులతో మధువును, మూడమ్ములతో బృహద్భానువును, నైదు సాయకంబులతోఁ జిత్రభానువును, బదిశరంబులతో వృకుని, సప్తకామ్మకంబులతో వరుణుని, నైదింటితో సంగ్రామజిత్తును, మూడింట సుమిత్రుని, మూడింట దీప్తిమంతుని, బదింట భానుని, నైదింట వేదబాహుని, నెనిమిదింట శ్రుతదేవుని, నిరువదింట సునందనుని, బదింట విరూపుని, తొమ్మిదింట చిత్రబాహుని, బదింట న్యగ్రోధుని, దొమ్మిదింటఁ గవిని బ్రహరించి, శంఖంబు బూరింప, యాదవ బలంబులు క్షోభిల్లి కొందఱు యోజనదూరంబునను, మఱికొందఱు మరికొన్ని యోజనంబుల దూరంబునను నిట్లు నానావిధంబులఁ బాఱి పుడమిపైఁబడి దిక్కుతోఁచక, రామకృష్ణేతి నామంబులతో హాహాకారంబులం జేయుట గమండు మున్నగు యదువీరులు విని సర్వశస్త్రాస్త్రసంపన్నులై నిశాతహేతి సాయకంబులతో నా రాజపుత్రుండగు కునందనునిపై దెబ్బతీయ నతండు రోషోద్ధురుండై తీక్ష్ణంబులగు నారాచంబుల నెడనెడ నుపయోగించుచు, విచ్చలవిడి సంగరరంగంబున విహరింపదొడంగ, యాదవులు రథసారథితురగ సహితంబుగా వియత్తలంబున విబుధులు విభ్రమాశ్చర్యంబులం బొందుచుండఁ బరిభ్రమించి నేలం గూలిరి. యాదవరక్తస్రవంతి ప్రవహింపసాగె. వల్వలాసురసైన్యంబులు శత్రుపరాజయంబును, నిజవిజయంబును గాంచి యెుండొరులు తమతమ ప్రతాపాతిశయాదులఁ జెప్పుకొనుచు హర్షించుచుండిరి. అంత,

చ॥ అల కపిలుండు స్వాశ్రమమునందు క్షతాంగరథుండునొచ్చు మూ
ర్ఛిలిపడియున్న కార్ష్ణిసుతుశీర్షముఁ జేతనుదాఁకుచున్ దపో
బలమునఁ జేతనాన్వితుగ బాధముజేయ నతండులేచి తొ
లొలుత మునీంద్రమౌళికి నతుల్ బొనరించి యపారభక్తితోన్ ౬౯౬

మ॥ ప్రతిశార్ఙ్గాహ్వయచాపముం గొనుచు దుష్పారప్రతాపప్రభా
ప్రతిభానర్గళశక్తియుక్తుఁడయి తీవ్రాక్రాంచరాత్మోద్దృష్టవున్
శితబాణంబునఁగొట్ట వాని రథముల్ జిత్రాతిచిత్రంబుగా
దితిపుత్రుల్ వెఱగంద జామువఱకున్ దిర్గెన్ నభంబందునన్ ౧౯౮

వ॥ అంత సాంబానుశాల్వహేమాంగదారుణసారణాదియోధులు రథముల నధిరోహించి, శస్త్రాస్త్రంబులందాల్చి, రణరంగంబున కేతెంచి దుర్ముఖ,దుర్నేత్ర, దుర్మద, దుస్స్వభావాది దానవవీరులపై శరవృష్టిం గురిపింప, వారును యాదవులపై నిబ్బడిగా బాణంబులఁ బ్రయోగించి, నొప్పించిరి. ఇట్లు పరస్పరంబు మించుచుఁ బోరాడినపిదప యాదవులధాటికిఁదట్టుకొనఁజాలక దానవవీరులు యుద్ధపరాఙ్ముఖులై పారిపోవుటయు, గగనంబునుండి హతతురంగంబై యంగారమువలెఁ గాలిపోయి యున్న రథంబునందు మూర్ఛితుండై, నోటరక్తంబు వెడలుచుండఁ గుసంపనుండు పుడమిని బడిపోవుటయు, దానవయోధనాథుండగు వల్వలుండు గాంచి, రోషించి, కవచశిరస్త్రాణాదులనుధరించి, యుద్ధభూమికరుదెంచి, శకునిరాక్షసేంద్రుఁడు మాధవ ప్రద్యుమ్నులతోఁ బగ్గెలు పల్కినట్లనిరుద్ధునితో నిట్లనియె. ౧౯౯

—♦ వల్వలానిరుద్ధులు పరస్పరము పౌరుషోక్తులాడుకొనుట. ♦—

క॥ మొనగాఁడ ధనుర్ధారినినలి మాటికి వాగుచుందు వరరే! యీ నా
ఘనశరముచేతఁ జంపెద మనఁదలఁచితివేని తొలఁగుమా! యదువీరా! ౨౦౦

క॥ అనిరుద్ధుండును నది విని తన కోదండంబునందు దండిశరంబున్
బొనరుపడఁజేసి కసి మరి మును శకునికిఁజెప్పు మరునిబోలి వచించెన్. ౨౦౧

చ॥ ఎవఁడెవనిన్ వధింపఁగలఁ డేఘనుఁ డెవ్వనిఁ బ్రోవఁజాలు నిం
కెవఁడెఱుఁగున్ శుభాశుభములెల్లను గాలవశంబు కాల మే
భువనములన్ సృజించుఁ బరిపోషణఁజేయు హరించు నద్ది యే
యవితథమైన బ్రహ్మమని యంచుఁదలంపుము దానవాగ్రణీ! ౨౦౨

ఉ॥ నేనొనరింతుఁ గర్తగను నేను హరింతును హర్తగా మరిన్
నేనిటు లేలుచుందు నధినేతగనంచు దలంచు మానవుం
డజ్ఞానశియించుఁ గాలనుపటిష్ఠత, గావున నన్ను నీవుగా
నీ నిను నేనుగాని మరణించునటుల్ బొనరింపలేమురా! ౨౦౩

ఉ॥ కాలమె నీకు నాకును నఖండజయంబొ పరాజయంబొ యీ
జాలును కాలరూపుఁడును శాశ్వతుఁడైన పరాత్మకివ్వె జే
జేలు జయార్థినై యిడెద జెట్టులకున్ బెదజెట్టి కాల మీ
యాలమునసల్పి మఱత నహంకృతినిన్ విడి వల్వలాసురా! ౨౦౪

చ॥ అతనివచస్సు వించలరి యబ్బురమందిన దానవేంద్రుఁ డీ
వితమునఁజెప్పెఁ ద్వాష్ట్రిఁ డగభిత్తునకుఁ వచియించినట్టు లీ
క్షితిని బ్రధానముఁ గురువు శ్రేష్ఠము గర్తయటంచెఱుంగు ము
న్నతిని నథోగతిన్ జనగణంబునఁగూర్చ సమర్థమో బలీ! ౭౦౫

ఆ॥ వేలకొలఁదినున్న యాలలోఁ దల్లిని దెలిసికొనెడి దూడతీరునన్ శు
భాశుభములు కర్మబలముగాఁ జేసెడి వానినెఱిఁగి వెంట వఱలుచుండు ౭౦౬

ఉ॥ కావున నెల్లశక్తియిడి గట్టిప్రయత్నముఁజేసి యిప్పుడే
నీవును నీ బలంబులును నేలఁబడన్ బొనరించెదన్ జుమీ!
యీవఱకన్న నా ప్రతిన నే నెరవేర్చెదఁ జేతనైనచో
నీవును జాగుచేయక యనిం బ్రతికారముసల్పి చూడుమా! ౭౦౭

తే॥ అవలఁ గార్ష్ణిజుం డతనికి ననియె నిట్లు కర్మయే ప్రధానమటంచు గట్టిగాఁ ద
లంచితివిగాని కర్మకాలంబు, గర్త, సరిగనున్నపై పాకంబు చక్కనగును ౭౦౮

తే॥ అన్నిటికిఁగూడ గర్తయే యధికుఁ డతఁడె
బ్రహ్మ శివ విష్ణు సురనరప్రభృతి సర్వ
సృజనచతురుండు దక్షుండు కృష్ణచంద్రుఁ
డంచు నమ్మి ప్రార్థింపుమో యసురవర్య! ౭౦౯

వ॥ అంత బల్వలుం డనిరుద్ధునకిట్లనియె. ౭౧౦

చ॥ మునులనుమించి చెప్పితివి ముక్తినొసంగెడి నైకమార్గముల్
గొనముల మూటనింగలిగి శుంభినివర్తిలు నెల్లవారు పీ
నిని విడనాడనేరరిఁక నీవు రణంబునకేగుదెంచి యి
ట్లనియెదవేల? వేగ సమరాత్తమనస్కుఁడవై చరింపుమా! ౭౧౧

తే॥ ప్రాణహారమగు శరమిదె వచ్చుచుండెఁ గాన దీని జాగ్రత్తగాఁ గాచికొమ్మ
టంచు మయమాయతోఁగూడినట్టి తీక్ష్ణబాణమును బ్రయోగించె నాపట్టునందు

సీ॥ స్వీయపారక్యాదిభేదముల్ దెలియనిక్కైవడి జీఁకటుల్ గ్రమ్ముచుండెఁ
బర్వతంబులఁబోలి పాషాణరాశులు భటుల శిరములపైని బడుచునుండె
మూత్రపురీషముల్ మొండెముల్ పుఱ్ఱెలు నెత్తురుకుండలు నెఱయుచుండె
నుఱుములుఁ బిడుగులు మెఱపులుఁబెనగొనఁ గుంభధారగ వానగురియుచుండె.

తే॥ సేనలుఁ బరస్పరభీతిఁ జెలఁగుచుండె యాదవులు పరువెత్తి రాహవమువిడిచి
పంచబాణాత్మజుఁడు కృష్ణపాదపద్మములను నిశ్చలభక్తితో నిలిపి మదిని

చ॥ అనితరమోహనాస్త్రము భయంకరమాయను గూర్పమాప నై
చెను దెసలున్ బ్రసన్నతను జెందె ఘనంబులు వచ్చినట్లు నే
చనె మెరుపుల్ శమించె రవి చక్కఁగనెత్తె నభంబు భాసిలెన్
గనుపడెఁ దేటతెల్లముగఁ గయ్యమునందలి మంచిచెడ్డలున్ ౨౦౫

క॥ అనిరుద్ధుఁడు తనముంగల దనుజయుతుఁడు మాయకాఁడు ధానుష్కుండై
కనలుచు బ్రహ్మాస్త్రంబును గొని వల్గులుఁడుంటఁగాంచి కొంకక సురలన్

క॥ తానును బ్రహ్మాస్త్రముఁగొని దానవునస్త్రము శమింపఁ దద్దయు సలుపన్
మానవభక్షకుఁడున్ గని మానక గాంధర్వమోహమాయను బఱపెన్. ౨౦౬

సీ॥ గంధర్వనగరంబు గ్రాలెను రణరంగ మెట్టులఁబోయెనో మొఱకపడము
కోటులకొలఁదిని హాటకహర్మ్యముల్ గానవిశారదల్ కామినులును
దాలవీణావేణు తౌర్యత్రికాదితత్పరలును రతిరూపభాసురలును
హావభావానుభావాదికటాక్షసమ్మోహినుల్ గంధర్వభోగవతులు

తే॥ చెలఁగియుండుట యాదవబలులుచూచి మరునిబారి కధీనులై శరముల నిల
విడి పరస్పరంబును మనమెచటనుంటి మాజియేమయ్యె జయమెట్టులందగలము

చ॥ అనుకొనుచుండ నిట్లు దనుజాధిపుఁడున్ గని వేగవచ్చి క
త్తినిగొని యాదవోద్భటులఁ ద్రెళ్ళనటుల్ బొనరించుచుంట నా
మనసిజజుండు గన్గొనుచు మాని! విమోహితులైన వీరి సే
తినిగొని జంపులల్ దగునె? ధీరులు మెత్తురె? ధర్మమే మొకో! ౨౦౭

ఉ॥ చాలునుజాలు నీకు జవసత్వములుండిన రమ్ము! నన్ను నీ
యాలమునందు ఢీకొనుము! యద్ది సమంజసమోయి! యన్న నా
పాలసుఁడున్ బదాతివలె బాణకృపాణసమేతుఁడై చనన్
గ్రీలలనేశపౌత్రుఁడును జెంగునఁ దేరుననుండి దూకుచున్. ౨౦౮

చ॥ అమరవిభుండు వజ్రమున నద్రిని గొట్టినటుల్ కృతాంతదం
డమున నిశాచరేంద్రుని హుటాహుటిఁగొట్ట నతండు నాల్గు ఘ
స్రములును మూర్ఛతోఁబడుట సర్వముమాయ శమించె యాదవో
త్తములు విచిత్రమొందుచు యథాస్థితి యుద్ధముఁజూచిరో విభూ! ౨౧౦

చ॥ అపుడు కునందనుండు సమరాంగణమందున మూర్ఛఁదేరి యా
రిపులను యాదవోద్భటుల రేపి రథంబున నెక్కి బాణహే
తిపరికరంబులన్ గొనుచుఁ దీక్ష్ణతరంబుగ వేయ వారలున్
ద్రవవిడి కాల్కొలందిని పృథంబు ద్యజించుచుఁ బాఱిరెంతయున్. ౨౧౧

ఉ॥ ఈరహిఁ బౌఱు యాదవులనెల్లరఁ జేరిచి యొక్కచోటునన్
మారకుమారుఁ డిట్లనియె మంచిదె మీరొనరించు చర్య ? యీ
వీరుఁడెవండొ చెప్పఁ డిదె వే చని వానివధించి మిమ్ము న
వ్వారిగఁ బ్రోచితీరెద నవక్రపరాక్రమవిక్రమంబులన్. ౭౨౩

చ॥ అనఁగ సునందనుండనెడి యచ్యుతపుత్త్రుఁడు కార్ష్ణి సూత్రికి
ట్లనియె నితండు వల్వలుని యాత్మభవుండు కునందనాహ్వయుం
డును యువరాజు నల్పబలుఁడున్ రథియంచు నెఱుంగుమయ్య యీ
ఘనుఁ గడఁదేర్ప మేమి చటఁ గ్రాలమె ? నా శపథంబుఁ జూడుమా ! ౭౨౪

—♦ సునందన కునందనుల యుద్ధము ♦—

చ॥ యదువర ! మీ ప్రతాపము నె యండగఁ గైకొని యీ కునందనున్
సదమదమున్ బొనర్తు నిది సత్యముఁ దప్పితినేని కృష్ణస
త్పదయుగసేవలన్ విడుచువానికి, సద్గురుపూజవీడు దు
ర్మదునకుఁ గల్గు పాపము లమాంతముగాఁ బడుగాక నాపయిన్. ౭౨౫

క॥ అంతట ననిరుద్ధుండున్ సంతోషముఁబొంది యాజ్ఞ సరియని యిడ శ్రీ
కాంతజుఁడు సునందనుఁడున్ బంతముతో వెడలె యుద్ధపరికరయుతుఁడై

చ॥ అసురవిభూద్భవుం డెదుట కాలముఁజేయఁగ వచ్చియున్న కృ
ష్ణసుతు సునందనున్ గని రుషన్ రథమెక్కి ధనుశ్శరంబులన్
వెసఁగొని వర్మమున్ దొడిఁగి వేయ శరంబుల, నా సునందనుం
డసి శరసంతతిన్ బఱపె నట్టి కునందనవీరమౌళిపై ౭౨౬

క॥ అయ్యెడ నయ్యిరువు రనిన్ గయ్యము సరిసముగాను గావించిరిపో
కయ్యపుఁ దిండియు నమరులు నయ్యారె యన దమనపుష్కలాఖ్యులసరణిన్.

వ॥ ఇట్లు సర్వవిషయంబులందును సమానముగాఁ బోరాడుతరుణంబున శరాధానసంధానవిమోచనంబులందు వారు ప్రదర్శించిన కరలాఘవంబు చూపఱ కత్యాశ్చర్యకరంబై సన్నుతంబయ్యె. అంతఁ గొంతతడవునకుఁ గునందనుండు సునందనునిచే సప్తపర్యాయంబులు హతరథరథితురగశస్త్రాస్త్రుండైనను గొంకక జంకక విసుగక వేసారక ద్విగుణీకృతోత్సాహంబుతోఁ దిరిగి సర్వశస్త్రాస్త్రసంయుతంబై చిత్రంబుగానున్న యొక దివ్యయానంబెక్కి వచ్చి సునందనునిపైఁబడి బాణంబులఁ బ్రయోగించినంత ౭౨౭

ఉ॥ నొచ్చి సునందనుండును ధనుస్సునఁ గూర్చి దశాంశకంబులన్
గ్రచ్చఱ వాసిపై విసరఁగా నవి కృష్ణుఁడు ద్రొట్టి కత్తిమున్
గచ్చెనుదాప్రివి నేలఁబడెఁ గల్లకలా సరకంబుకంపునన్
హెచ్చుగ గ్రోలి నెత్తురి ధర నేడ్చెఁ జవచ్చినయట్లు శౌనకా! ౭౨౯

చ॥ అవల సువర్ణచాపఘటితార్థమృగాంకముఖాంచితాంబకం
బు వనజనేత్రిసూతిఁగొని హోటరి! నీతల కేసిచేత నీ
యవనిఁబడన్ బొనర్చెద రయంబునఁ జెల్వెసిఁ గాచికొమ్ము దా
నవపతి మెచ్చునట్లుగ వినందగు నిందుక నా ప్రతిజ్ఞనున్. ౭౩౦

చ॥ త్రికరణశుద్ధి నీలువును దివ్యవిధిన్ నెరవేర్చు సాక్షిగాన్
స్వకగురుపత్నినిన్ పరుషభాషణజేసెడి దుండగీఁడు నా
రకమున నెట్టిబాధల గరంబుగఁబొందుదు రట్టిబాధలున్
సకలము నాకు గల్గుతను సందియమొందకు మో సునందనా! ౭౩౧

చ॥ మరియును దల్లిదండ్రులను మాటలఁ జేతలఁ బోషణంబులన్
మురిపెము గూర్పఁజాలని కుపుత్రులు పూజ్యుల రాజ్యపాలురన్
గురువుల నత్తమామలను గోడిగమాడుచునుండువారికే
దురితములొందగాఁ గలవొ దోషములట్టివి నాకు గల్గుతన్ ౭౩౨

చ॥ ఇది విని యాకునందనుఁడు నేత్రజ నిట్లనె నో సునందనా!
మదముబుకంగ వాగెదవు మాటికి నోటికివచ్చినట్లుగాఁ
గదనము జేసి చూపుమది గండరగండలు మెత్తు రీవదా
వదత దురాశలున్ బడుగువారలకుండెడివంచెఱుంగుమా! ౭౩౩

చ॥ భయపడనయ్య! నామృతికిఁ బ్రాణులకున్ బరిపాటియద్ది నా
పయిని మహాశరంబిపుడు వైచితివేని మదంబకంబునన్
లయమొనరింతు లేనియెడలన్ గురుపత్ని సహోదరీ సతీ
శయనగతాఘశైలములు సర్వము నాతలమీఁదఁ గూలుతన్ ౭౩౪

చ॥ అటులఁ సునందనోక్తి విని యచ్యుతపుత్రుఁడు శంకితాత్ముఁడై
యిటులనెఁ దిర్గి నిర్మలతఁ గృష్ణపదాంబుజయుగ్మసేవ మి
క్కుటముగఁ జేసియున్నయెడ గోరిన నాప్రియఁ దప్ప నన్యఁ గూ
డుట యెఱుఁగంగ నేని నిట ద్రొల్లుత నీశిర మీశరంబునన్ ౭౩౫

చ॥ అని హరినిన్ స్మరించుచు మహాలయకాలకృశానుసామ్యమై
ఘనతరమంత్రయుక్తమయి క్రాలు శరంబును తత్సునందనున్
దునుముగ వైచె నట్టులది దూఁకుచుఁ తోఁ జనుదెంచ రెండుగా
దనుజనుతుండు చెండె నలతార్క్ష్యుడు సర్పము గొట్టినట్టులన్ ౭౩౬

తే॥ అద్ది రెండుతుండెముకొాట నఖిలజనము వెఱగుపడెఁ దత్ప్రార్థంబు ధరనుబడియె
దాని పూర్వార్థ మాదైత్యుతలనుద్రుంచెఁ గరి తరుస్కంధముఁ బట్టి విఱిచినట్లు

తే॥ మకుటకుండలయుత దైత్య మస్తకంబు దెగిపడుటఁగాంచి దానవుల్ వగచి రా క్షు
నందనుని కబంధము లేచి పొందియసినిఁ గాళ్లఁజేతుల వైరులఁ గాయపరచె

ఉ॥ యాదవు లా కునందనుని యంగము శీర్షము వేఱువేఱుగా
మేదినిదొర్లుటం గని యమేయముదంబునుబొంది భేరికా
నాదముఁ జేటిమాటికి బొనర్చిరి వేల్పులు పూలవానలా
శ్రీసయితాత్మజాతుపయిఁ జేసిరి హెచ్చుగ నిచ్చమెచ్చుచున్ ౭౩౭

చ॥ మునివర! యాజి వల్వలుఁడు మూర్ఛిలె నట్టి కునందనుండు డ
మ్మనెఁ దదుపాస్య దేవుఁడు దయాళుఁడు రుద్రుఁడు వచ్చి సాయమున్
బొనరుపకుండె నెందులకు? బూ ర్తి సవం బెటులయ్యె నెట్లు? మో
చనమును బొందె యజ్ఞహరి సంగతిఁ జెప్పుమ సక్రమంబుగా ౭౩౮

తే॥ అద్ది విని గర్గుఁడిట్లనె నాలమందు వల్వలుఁడు సొమ్మసిల వానిపట్టిగిట్ట
సురముని ప్రేరితుండయి శూలి భక్తవత్సలతగల్గి యత్యంత పౌరుషమున

## శివుండు నారదప్రేరితుండై యుద్ధరంగమున కేతెంచుట

సీ॥ కపిల జటాజూటఘటితబాలద్విజరాజువిద్యుదులతో రాజిలంగ
బంచాగ్నులనుబోలి పంచవక్త్రంబులు పంచదశాక్షులఁ బరగుచుండ
సమయోచితక్రియా చతురతాభ్రాజిత దశదివ్యబాహువుల్ దనరుచుండ
పట్టిసపరిఘోరు బాణకృపాణమారణపరికరములు భ్రాజిలంగ
తే॥ ముండ సర్పహారంబులు మొనసియాడ సింహచర్మాంబరంబును జెలఁగుచుండఁ
బ్రమధగణములు రా శూలి భస్మలిప్తగాత్రుఁడై నంది నెక్కుచుఁగదలె ననికి

శా॥ కైలాసంబుననుండి కోటిరవి సంకాశుండు కోలాహలుం
డాలమ్మున్ బొనరింపవచ్చుటను రక్షోయాదవామర్త్యులున్
వ్యాలోలాత్ముఁగనందొడంగిరిల యల్లాడె గోలాహలం
బాకీర్ణంబుగనయ్యె వల్వలబలం బానందమొందెన్ జుమీ! ౭౪౦

క॥ ఏఁడీ! యా యనిరుద్ధుం డేఁడీ! యల సునందనుండు నేరీ! రారే!
జాడించెద నోడించెదఁ బీడించెద భక్తుల కభివృద్ధినిగూర్పన్ ౭౪౧

తే॥ బ్రహ్మ, విష్ణు, వేనును మాకు భక్తులైనవారి వైరులదునుమాడి వగపుమాన్పి
సౌఖ్యములఁగూర్చి రక్షింప సంతతంబు గంకణముగట్టికొంటిమి గాన నిపుడు

మ॥ అనిరుద్ధుఁ డెగటార్చి కృష్ణసుతు నిర్వాణంబు పొందించి త
ద్ఘనసేనానులఁ గూల్చి తద్విశిఖశస్త్రాస్త్రంబ ప్రాక్ప్రకారం
బును మాయించి మదీయ వల్లులనకే ప్రాప్తిన్ జయశ్రీని సా
ర్తును వైరివ్రజకంతలుంతనకృతిప్రోస్ఫూర్తిప్రకారాలుండనై ౨౪౮

తే॥ భైరవాఖ్యుఁడు మారకుమారుతోడ, నంబియు సనందనునితోడ, స్కందబలియు
సాంబుతో, వీరభద్రుఁడు సాహసుఁడగు గదునితో, భృంగి భానుతోఁ గదనమాడె

శా॥ భూతప్రేతపిశాచరాక్షసగణప్రోద్దామకూష్మాండక
వ్రాతంబుల్ యదువీరసైన్యబలసంపత్తిన్ హరింపంగ ద
ద్భూతేశాజ్ఞను హేతులన్ గొనుచుఁ దోడ్తోఁ బోయి తద్వీరవా
రాతిశ్రేణిశిరంబులన్ నఱుకఁ బ్రారంభించె జృంభించుచున్. ౨౪౯

ఉ॥ పుత్తెలతోడ నెత్తురును బొజ్జలునిండఁగఁ గొన్ని ఘాతముల్
జుట్టునఁ ద్రావెఁ గొన్ని పెడచూపులతో వికటాట్టహాసముల్
వెట్టిగఁ జేసెఁ గొన్ని పలవించె హసించెను బాడె నాడె వే
యట్టుల ముండమాలలిడె యాదవులన్ బసకత్తిరాల్చుచున్. ౨౫౦

మ॥ హరిపుత్రుండగు దీప్తిమంతుఁడు స్వకీయంబైన సైన్యంబుల్
పరసైన్యంబున ధ్వంసమౌటఁ గని దుర్వారప్రతాపంబుతో
ఖరబాణంబుల భూతదైత్యబలమున్ గారించి ఖండించె సం
బరమున్ జెందఁగ యాదవధ్వజినియున్ వైవుల్ వసన్ బొందఁగాన్. ౨౫౧

వ॥ కాలాంతకునితనయుండగు భైరవుండు పోరాడుట మాని భీరుత్వంబున బాఱిపోయెడి తమ భూతప్రేతపిశాచ కూష్మాండవినాయక బ్రహ్మరాక్షస ప్రమథ గణాదులనుగాంచి మండిపడి వివిధతీక్ష్ణాయుధంబులను ధరించి శ్వానారూఢుండై దండధరుని మాడ్కి రణరంగంబునకేతెంచి నిలువ యాదవవీరు లా భయంకర భైరవ మూర్తిని గాంచి యెదిరింపఁజాలమని యెంచి మిన్నకుండుట ననిరుద్ధుండు చూచి క్రూరనారాచంబుల నతనిపైఁ బఱపె. అంత నతండును నానాస్త్రశస్త్రంబుల పైఁ బ్రయోగించినను నిష్ఫలంబగుట తన ముఖంబునుండి మాయానలంబు సృజించె. అద్దాన నలక్షలందున్న యరిహరితురగరథరథపదాతివర్గంబు దగులఁబడదొడంగుటచే నయ్యాదవులు శ్రీకృష్ణుని స్మరించుచుఁ బాఱిపోవుట మారకుమారుండు గని మండిపడి పర్జన్యాస్త్రంబు వేసి మాయానలంబును జల్లార్చి సుఖంబు గూర్చె. భైరవుండును రోషరూషితరక్తాయతనేత్రుండై సబిలసప్తలోకంబులు ప్రతిధ్వనింప దిక్కరి ధరణీ మండలంబు సంచలింప నొక బొబ్బరింత పెట్టి సర్పాస్త్రంబును విడిచె. రణకోవిదుండగు శంబరారిపుత్రుండును ప్రతిగా జృంభకాస్త్రంబుఁ బ్రయోగించి భైరవుని మూర్ఛితుంజేయ మృత్యుంజయుండు గని కినలి నిజవృషభంబును మదనతనయుని మీదకుం ద్రోలె. అదియు మదోన్మత్తంబై ముందువెనుకలు విచారింపక సూది

మొనలవలెఁ దేలిన శృంగంబులతో నభంగురంబుగా శృంగంబులతోఁ గ్రుమ్ముచుఁ బదమ్ములతోఁ ద్రొక్కుచు దంతంబులతోఁ గొఱుకుచు విచ్చలవిడిగా విహరింపం దొడంగె. ఆ వృషభశృంగదారుణఘాతంబున శ్రీకృష్ణనందనుండగు సునందనుండు పంచత్వముఁ బొందె. దర్పకసుతుం డతిదర్పంబున వచ్చి ప్రతిఘటింపఁబోవుతఱి ముందున్న మృతుండగు సునందునిం గాంచి శోకపరీతమనస్కుఁడౌట గాలాంతకుండు గాంచి ౭౫౨

—♦ రుద్రుండు అనిరుద్ధాదులను యుద్ధమునకుఁ బురికొల్పుట ♦—

ఉ॥ పోటరి! వీరయోగ్యకృతిఁ బూర్తిగఁ జేసి రణాంగణంబునం
దోటమిఁ జెంది స్వర్గమును నొందు సునందనుగూర్చి కుందుటల్
చాటమె? సాటివారి నగుబాటుకు లోకువగావె? యింక ని
చ్చోటనె చావఁబోవు యదుశూరులఁ బ్రోవుము! చేవ యున్నచో ౭౫౩

తే॥ కడకు నీ ప్రాణమైనను గాచికొమ్మ! యిద్ది దగుఁగాని యన్యథా యెంచవలద
టంచు వచియింప ననిరుద్ధుఁ డాద విడిచి పంచబాణంబులన్ వేసె భవునిపైన

తే॥ అంత ముక్కంటి కంటున నంగజసుతు చాపమును ద్రుంప నాతండు శౌర్యమెచ్చ
గఱకుశరములఁ బఱపె నీ కరణిఁ ద్రిదినములు పరస్పరమున్ వారు పోరిరార్య!

చ॥ తిరిగి శివుండు రౌద్రమునఁ దీక్ష్ణతరత్రిశిఖాత్రిశూలమున్
మరునికుమారుపై విసరె మండుచు నయ్యది వాని యేనుఁగున్
నరికి తదీయవక్షమును నాటుచు మూర్ఛితుఁ జేసె యాదవుల్
పరుగిడి రార్చిరేడ్చి రలపంకజనాభు స్మరించి రంతటన్. ౭౫౪

చ॥ క్రమముగ నీ రొదన్ వినిన కంజదళాక్షుతనూజసాంబుఁ డా
లము నొనరించు స్కందు విడి లాఁచి శివున్ మును మూర్ఛితానిరు
ద్ధు మొగముఁ జూచి ఖేదపడి ధూర్జటి! పాడియె దైత్యరక్షణం
బమితముగా నొనర్చుట? యహో! హరిభక్తుఁడవైన నీకునున్. ౭౫౫

చ॥ వరపరమప్రమాణవిధివర్ధిత వేదపురాణశాస్త్రిసూ
త్రరమణసార్థకార్థ బహుధర్మసుకర్మఫలగ్రహీత శ్రీ
హరియె శరణ్యుఁ డంచనెడి యక్షరసూక్తి యబద్ధమయ్యె నో
హర! భవదీయచర్యఁ దగునా? హరిభక్తుఁడవైన నీకునున్. ౭౫౬

వ॥ అనఁగ మృడుండు సాంబ! చరితార్థుఁడవయ్య! సురాసురాభివ
న్దననుతిపాత్రమాధవుఁడె నా ప్రభువైన ద్వదుక్తి యుక్తమై
న నిటఁ గునందనుండు మరణంబును జెందుట వల్వాలుండు మూ
ర్ఛనుబడియుంట భక్తతతిరక్షకుఁ దోడ్పడవచ్చితిన్ జుమీ! ౭౫౭

తే॥ సత్యమియ్యది కయ్యంబు సలుపుమనిన సాంబుఁ డాగ్రహోదగ్రుఁడై శాతబాణ
ములను వేయంగ శంభుండు పుష్పనిహత మత్తకరివోలెఁ గలఁగక మరలఁ గినుక

ఉ॥ సాంబునిమీఁద నంబుల వెసన్ విసరెన్ హరిపుత్రకుండు త
త్సాంబునిపైని నంబకవితానము వేసెను దేవతల్ విచి
త్రంబుగఁ జూచుచుండ నిటు తచ్ఛ్వసనాంబుల కాహవంబు ఘో
రంబుగ నయ్యె నంబర ధరాస్థలు లాకులమొందుచుండఁగా ౨౬౧

తే॥ మరియు యాదవుల్ తోఁచక మాటలేక “అన్యథా శరణం నాస్తి ఆర్తరక్ష
కా! త్వమేవ శరణ”మని కమలనాథుఁ గృష్ణు నిర్మలభక్తి స్మరించిరంత ౨౬౨

—♦ [illegible] ♦—

సీ॥ వనజసులోచన ఘనకనకాంబర శ్రీవత్సచిహ్న సంశోభితుండు
మకుటకుండలహార మాణవకాంగుళీయక కౌస్తుభాదిభూషాంచితుండు
నవనీరదశ్యామ నవరవికోటిభాస్కరకోటి సౌందర్యసంయుతుండు
కౌమోదకీనందకరథాంగశంఖకోదండ ప్రభృతివస్తుమండితుండు

తే॥ నైన శ్రీకృష్ణుఁ డాత్మీయయాదవబల నీచదశఁ గాంచి జవసత్త్వనిభృతతురగ
కలితరథమును నూఁకుండు గాలిగతిని ద్రోల నాలంబునకుఁ జేరెఁ దోడ్పడంగ

ఉ॥ యాదవులందఱారహిని నాదుకొనం జనుదెంచినట్టి యా
శ్రీదయితున్ గనుంగొనుచుఁ జెంది రమందముదంబు నాఁడుఁడున్
మోదముతో ధనుస్సు విడి మ్రొక్కెను రుద్రుఁడు భీతినిన్ ద్రిశూ
లాదుల వీడి కృష్ణచరణాబ్జములన్ బడి పల్కె నిట్టులన్. ౨౬౪

—♦ శివుఁడు కేశవుని స్తుతించుట ♦—

క॥ తొలగింపుము! దురహంకృతి కలిగింపుము! భూతదయను గరుణాభరణా!
వెలిగింపుము! వైరాగ్యము తలఁగింపుము! భవసముద్రతటినుండి హరీ! ౨౬౫

క॥ గంగామరందపరిమళ సంగత నారాయణాంఘ్రిజలజములకు నే
భంగతఁగూర్చెదు భవరుజభంగము జేయంగఁ జేతు బహువందనముల్. ౨౬౬

తే॥ చటులభేదము పోయినప్పటికిఁ గూడ నేను నీవాఁడ నావాఁడ వీవుగావె
యరల వీచి సాముద్రమె యగునుగాని యద్ది సంద్రము గానేర దబ్జనాభ!

ఉ॥ లేదు ధనప్రసక్తియును లేదిసుమంతయు ధర్మబుద్ధియున్
లేదలకామభోగముల లిప్సయుఁ బ్రాక్తనకర్మరీతిగాఁ
గాఁదగునేదొ గాఁగలదు గావున గల్గుత సంతతంబు నీ
పాదసరోజయుగ్మగతభక్తి; యిదేగద ప్రార్థ్య మో ప్రభూ! ౨౬౭

చ॥ ఎది నీపూజ్యపదారవిందయుగళంబేఁ గొల్చు భాగ్యంబొ? యు
య్యదియే చక్కనిమూర్త మాదినమె భవ్యంబైన వారంబు న
య్యదె తారాబల శీతభానుబల విద్యాదైవసంపన్నమం
చెదలో నమ్మితిఁ గావవే కరుణతోఁ గృష్ణా! జగద్రక్షణా! ౨౬౮

చ॥ శరణు నొనర్తు నీ చరణసారసయుగ్మము దివ్యమున్ జరా
చరనిచయోపజీవ్య మురుసంసృతి దుఃఖహరంబు దోషకో
ద్ధరకరుణాకటాక్షములతో నను దీనుని జేరఁదీయుచున్
సరగున మోక్షమొందుటకు సల్పుమ! నాథమునీంద్రకల్పమా! ౭౭౦

క॥ నగభిదనుజ! దనుజాంతక! నగతిలకోద్ధరణ దక్ష! నగరిపువాహా!
నగయుగశాపవిమోచన! నగజాపతిపూజ్యపాద! నతితతు లివిగో! ౭౭౧

తే॥ ఇట్లు నుతియించు శంకరుఁ గృష్ణుఁడు గని నాసుతుం డేమిచేసె రణస్థలమున
కేల వచ్చితి నా సుతుం డేలచచ్చె నేల మూర్ఛిల్లె ననిరుద్ధుఁ డెఱుఁగఁజెపుము!

క॥ అంత శివుఁడు త్రిప లక్ష్మీకాంతా! భక్తులను గావఁగా వచ్చి యిటుల్
పంతముతో మునువెనుకలు సుంతయుఁ గనకుండఁజేసి క్షోభనుగంటిన్. ౭౭౩

చ॥ అనఁగఁ గృపాళుఁడైన హరి యట్లయినన్ సరి; నీకు నాకు నే
మనుజుఁడు తారతమ్యమును మార్ఖ్యమునన్ రచియించునో యతం
డు నరకమొందుఁ గావున నిటుల్ వగఁగూడదు నీ జనుండె నా
జనుఁడగు నీకుఁగూడ నగు శంకర! మానుమ! జంకుకొంకులన్. ౭౭౪

చ॥ అని యిటులన్ వృషధ్వజుని నాశ్వసితున్ బచరించి మూర్ఛితున్
మనుమని లేపి, చచ్చినకుమారు సునందను దిర్గి జీవితున్
బొనరిచి యాదవధ్వజిని బ్రోచిన శ్రీహరిమీఁదఁ బూలవా
నను గురియంగ వేల్పులు; ప్రణామశతంబులు సల్పి రందఱున్. ౭౭౫

తే॥ అంతె సొమ్మసిలిన వల్వలాసురుండు
శివునిచే నుతితుండయి శ్రీరమేశు
మహిమ విని కిక్కురనిడి తిర్గి మఖహయంబు
కరదయుతముగ నిడె భక్తిఁ గార్ష్ణి జనకు ౭౭౬

చ॥ అల హరి పుత్రపౌత్రయుతుఁడై హయముంగొని సేతుమార్గపు
న్వలనునఁ బశ్చిమాశఁజనెఁ భర్గుఁడు రాజ్యమునందుఁ దిర్గి వ
ల్వలదనుజేంద్రు నిల్పి గణభైరవభూతవినాయకాదులన్
గలియుచు స్వీయరాజత నగంబున కేగె ననంతరంబునన్. ౭౭౭

## —♦ శ్రీకృష్ణుఁడు అనిరుద్ధాది సహితంబుగా గోకులంబునకరుగుట ♦—

వ॥ యాదవయోధబలంబు పరిచ్ఛత్రచామరాదివిభూషితంబగు యజ్ఞహయంబు శ్రీకృష్ణునిచే విడువంబడి నానారాష్ట్రములలోఁ బ్రవేశించి సంచరించె. కాని తత్రత్యు లగు వీరులెవ్వరుఁగూడ తురంగంబునుబట్టి యోడిసట్టి వల్వలాసురుని గతి విని బంధింప సాహసింపఁజాలకుండిరి. ఇట్లొక నెలవర కా హయంబు యథేచ్ఛగా విహ రించి వ్రజమండలమున కరుదెంచి యమునానదిని దాఁటి బృందావనంబందలి యొక తమాలవృక్షముక్రింద ఘాసంబును మెసవుచు హాయిగా నుండె. అచట గోవుల

మేపుచున్న గోపబాలకు లా హయంబుకడకు వచ్చి కరతాడనంబులఁ జేయు చుండుట శ్రీదాముం డనెడి గోపబాలకుండు గని గోపాలకంబును మెడకుఁ గట్టి త్రోలు కొనుచు నందుని సమీపమున కేగుదెంచె. నందుండును దాని ముఖపత్రమందలి విషయంబును నందజేకి వినిపించి యమితానందంబుఁ బొంది యుగ్రసేనకృతసేతంబును నిద్రానివెంట నా మునివరునుమునిఁ దక్కుంగల మిత్రులనుఁగాంచి కలసికొను భాగ్యాం బబ్బఁగలదని యెంచి గోపకులతోఁగూడి పోయి యశోదనుఁగూడ నీ శుభవార్త విని పించి యత్యుత్సాహంబుతో నూరివెలుపలికిఁ బోయి నిరీక్షించుచుండె. ఇంతలో హయము వెంట వచ్చు భోజవృష్ణ్యంధకాది యాదవవీరులు మార్గమధ్యమందుఁ గల మిథిలాయోధ్యా బర్హిష్మతీ కాన్యకుబ్జా గోకులాదులమీఁదుగా యమునానదిదరికిఁ జనుదెంచి కేశవనివాసంబైన మధురాపురిని గని బృందావనంబునకు శ్రీకృష్ణసమేతం బుగా నేతెంచె. సమస్తాలంకారంబులతో నలంకరింపఁబడిన గజేంద్రమును బురస్క రించుకొని గోపాలకులు వెంబడింప సర్వమంగళవాద్యంబులు మ్రోగుచుండ జయ జయధ్వనులు మిన్నుముట్ట నెదురువచ్చెడి నందరాజును, నుద్ధవాది యాదవులందఱు వీక్షించి హర్షించి నమస్కరించిరి. ఇట్టిపట్టున నే నందుండు తన దక్షిణాంగంబదరుట నెఱింగి, ఆహా! యీ దినమున నా ప్రియపుత్రుని శ్రీకృష్ణుని గనుఁగొనఁ గాంచు నదృష్టం బబ్బునా? అబ్బినచో నలంకృత లక్షగోవులను బ్రాహ్మణుల కొసంగెదను. ఈ యుత్తమశకునంబు రిత్తవోవునే యనుకొనునంతలో వ్రజవాసులకు గోపాలకుల వలన శ్రీకృష్ణుని రాక నాలించి విరహవిప్లుతుండై ౨౨౮

ఉ॥ ఏమిర! కృష్ణ! వచ్చితివె? యేడ్చెడి నన్ననకుంట పాడియే?
యేమెయి నెందుఁజేరితివొ? యిచ్చట కీవొకసారి రమ్మురా!
నా మనసారఁ గౌఁగిలిడెఁ బ్రీతినిఁగూర్పఁగ వచ్చితయ్య! యో
తామరసాక్ష! యో తనయ! తాళఁగలేనిఁక ముద్దుఁ బెట్టుమా! ౨౨౯

చ॥ అనఁ బితృవత్సలుండయిన యంబుజనేత్రుఁడు తేరు డిగ్గి వే
తనకయి యిట్టటుల్ తిరుగు తండ్రిపదంబుల వ్రాలి తప్పులన్
నెనరునఁ ద్రోసిచూడుమని నిర్మలభక్తిని వేఁడ నాతఁడున్
గనుఁగవ మోదబాష్పములఁ గార్చె ననంతరమందుఁ గృష్ణుఁడున్. ౨౩౦

సీ॥ శ్రీదామముఖులైన చెలుల యోగక్షేమ కథలను బృచ్ఛించి కౌఁగిలించి
తనకై నిరీక్షించు తల్లి యశోదను గని భక్తిమొ్రక్కి దీవనలఁబొంది
నందసన్నందోపనంద వృషభానుగోపగోపీస్థితిఁగూడ నరసి
తను జూడవచ్చిన జనసమూహంబును నతిశయప్రీతితో నాదరించి

తే॥ ప్రణయవిప్లుతరాధికా ప్రార్థితుఁడయి సకలసుమలతాఫలతరు సంభరితము
శీతలము నేత్రపర్వమ్ము జిత్రతరమ్మునైన మేఘసుందిరమున కరుగుదెంచె.

## — శ్రీ రాధాకృష్ణుల సమ్మేళనము —

చ॥ హరి చనుదెంచుటల్ విని నిజాళిముఖంబున నర్ఘ్యపాద్యముల్
త్వరగతినిచ్చి దివ్యమణిభాసురపీఠమొసంగి భక్తితోఁ
గరములమోడ్చి యీ మధుర కాదినమం జటుపోతివే! యిటుల్
మరతువె మమ్ము? నీపనులు మంచివె యెంచవె విశ్వమోహనా! ౭౮౬

తే॥ అంతఁ గృష్ణుఁడు రాధరో! వంతవిడువు మెచట నీవుందు వచటనే యేవసింతు
నెచట నేనుందు నచటనే యీవుగలవు నాకు నీకు భేదము లేదు నలుసుగూడ

తే॥ కొలఁది దినములలోపల గోజగము నకరిగి సుఖములఁ బూర్తిగా నందఁగలము
మనకుఁ దనువులు వేర్వేరు దనరుఁగాని తేజమొక్కటియే సుమ్మి! దివ్యచరిత!

క॥ ఆవల రాధిక యలరుచు శ్రీవిభుతోఁ జెలులఁగూడి శ్రేష్ఠంబగు బృం
దావని రాసములొనరుప నే వేఁడుచునుంటిననఁగఁ గృష్ణుఁడు తమితోన్

సీ॥ ఉత్తమాంగమునన్ మహోజ్జ్వలమణిమయమకుటపింఛంబులు మలయుచుండ
సుందరాస్యంబున సురభీకృతంబైన కస్తూరిచేర్చుక్క గాంతులుచుండ
కమనీయగళమునఁ గౌస్తుభమణిదివ్యతార హారాదులు దనరుచుండ
శ్రోత్రంబులందున సూర్యకోటిప్రభాభరితకుండలములు బరగుచుండ

తే॥ నురమునందున శ్రీవత్సమొప్పుచుండ గరములన్ గంకణాదులు వఱలుచుండ
గటినిఁ గనకాంబరంబులు గప్పియుండ బదములన్ నూపురాదులు భాసిలంగ

చ॥ సురభులు మేఁతమాని వినుచున్ గనుచుండఁగ వ్రేతలెల్ల ద
గ్గరకరుదెంచి చుట్టగఁ బికప్రముఖాండజసుస్వనంబు వి
స్మరణము జేయునైకవిధ మంగళగీతులఁ గుంచితాంఘ్రియై
మురళినిబాడి రాసము లమోఘముగా నొనరించె రాధతో ౭౮౭

చ॥ హరి యటు మార్గశీర్షమున నా యమునాతటమందు రాధికా
తరుణిని వ్రేతలన్ గలిసి తన్విఘటింపగజేసె రాసముల్
మరి యట అష్టఘుస్రములు మారకుమారముఖాదియాదవుల్
హరుప్రగ నుండి రాపివప నంపఱు పైనమొనర్ప నెంచుటన్ ౭౮౮

చ॥ వినిన యశోదపుత్రికుని వీడుటకోర్వక ముద్దుకృష్ణ! యీ
నను విడిపోవనెంచితివె? నా బ్రతుకెట్లిఁకఁ దెల్లవారునో?
నను విడనాడఁగూడదన నందజుఁడున్ నతిసల్పి యమ్మరో!
వనటను మానుమా! త్వరగ వచ్చెద నిత్యము జూతుపీ ననున్. ౭౮౯

చ॥ తను విడలేక చింతిలెడి తండ్రికి మ్రొక్కుచు నూఱడించి రా
ధ నఖిలగోపగోపికలఁ దప్పక క్రమ్మఱి వత్తునంచు సాం
త్వనమొనరించి చైత్రమున ద్వారకలో నగు రాజసూయమున్
గనఁ జనుదెంచ మిమ్మును వినమ్రతఁ బిల్చెద నందుఁ జూచెదన్. ౭౯౦

ఉ॥ ఈరహిఁ జెప్పి యాజ్ఞఁ గొని కృష్ణుఁడు యజ్ఞహయంబు గొంచు నా
మారసుతాదియుక్తుఁడయి మంగళవాద్యములొప్పఁ బైనమై
సూరసుతావనిన్ గడచి సోదరసమేతము నుంపిరంబు సౌ
కౌరవరాజధానికరుగన్ సనుకమ్మై యమస్రహూత్తమా! ౭౯౧

—♦ దుర్యోధనుండు యజ్ఞాశ్వంబును బట్టుకొనుట. ♦—

చ॥ అపుడె సుయోధనుండు మృగయార్థము పోవ్రచుఁ ద్రోవలోన య
జ్ఞపు హయరాజముం గని వెసం గొని దాని మొగంబునందునన్
రెపరెపలాడు గమ్మఁగల వృత్తమెఱుంగుచుఁ బౌరుషంబుతో
స్వపురికిఁ జేర్చి కట్టుమని చారులతోడుతఁ బంపి యిట్లనెన్. ౭౯౨

తే॥ ఔర! యాదవు లెంతటివారలైరి రాజసూయంబునందుఁ బరాజితులయి
చనుట మరచిరె? యెట్టియాసనముతోడ నిచట కేటువచ్చుచుండిరో హ్రీడవిడిచి

క॥ కానీ యెట్లులవత్తురో రానీ! హతమార్చి విడుతు రణరంగమునన్
నే నీ యాదవసంగతి పోనీ యని యూరకుంట పౌరుపాటమ్యోన్. ౭౯౪

తే॥ అని దశాక్షౌహిణీసేన నమరఁ జేసి ద్రోణ భీష్మ కర్ణాదివీరులను ధృతిని
రక్షకులుగ నొసర్చుచు రణమునల్ప సర్వసన్నద్ధుఁడై యుండె జనకరాజ!

తే॥ యజ్ఞతురగంబు వెంబడి నరుగుదెంచు సాంబముఖ యదువీరులు సరిగఁ జూచి
కరిపురంబునఁ గౌరవుల్ కట్టుటఁ గని తోఁకఁద్రొక్కిన నల్త్రాచు వీఁక లేచి

చ॥ నరసురవందితాచ్యుతుఁ బ్రణామములందెడి యుగ్రసేనభూ
వరు నొక రాజరాజుగ లవంబు గణింపము పన్నుగట్ట మట్టి య
ధ్వరహరి వీడ మాజి మిము బాణసుమంబుల గౌరవింతుమం
చటిమటి వాగు కౌరవచయంబు జయించుచు మించఁగావలెన్. ౭౯౭

క॥ అని తమవారిని రేపుచు ననికిన్ జనుదెంచి కౌరవారణ్యమునన్
ఘనదావమువలెఁ జొరఁబడి మునువెనుకలు గనక నాశమును జేసి రిటుల్.

క॥ వారికి వీరికి హాహారాహాహాకారిగఁ బోరయ్యె యాదవోద్భటశిఖులన్
రారాజు సైన్యమోడుటఁ జేరిపురికిఁ గాలినడకఁ జెందుచు భీతిన్. ౭౯౯

—♦ { ధృతరాష్ట్రునాదేశంబున దుర్యోధనాదులు సబహుమానముగా యజ్ఞాశ్వంబు సమర్పించి, శ్రీకృష్ణునిఁ బ్రార్థించుట. } ♦—

చ॥ గురు కృప కర్ణ భీష్ములును గొంకక తద్ధృతరాష్ట్రుపాలి కే
డ్తెఱఁ జని యాదవధ్వజినిదిగ్విజయాత్మవరాజయంబులన్
హరి, సుతపౌత్రసంయుతుఁడునై చనుదెంచుటఁ జెప్పి చక్కఁగా
నారిగలోనర్చెఁ బిమ్మట సుయోధనుతండ్రి వచించె నిట్టులన్. ౮౦౦

తే॥ హరి, శతాక్షౌహిణీయుక్తుఁడగుచువచ్చె యాదవులకు జయంబబ్బె నాత్మసైన్య
మోడెనిత్తఱి నేనేమియొనరుపవలె శాంతి యోజించి చెప్పుఁడీ! సభ్యులార!

తే॥ పిదప ధర్మనీతిజ్ఞుఁడు విదురవిబుధుఁ
డగ్రజా! దేవదేవుఁడౌ హరియె వచ్చె
నపుడు మాఱుమాటాడక హయమొసంగి
మ్రొక్కుమా! పోరుఁ గూడదు ముప్పుఁదెచ్చు. ౮౦౨

తే॥ వెనుక మన హస్తినాపురిం ఘనహలమున
లాగి యొకసారి గంగఁగల్పంగఁబూని
నట్టి బలరాముతమ్ముఁ డీ యచ్యుతుఁడని
తెలిసికొని సంచరింపుమా! ధీరవర్య! ౮౦౩

మ॥ ధృతరాష్ట్రుం డనుజోక్తి దేశకాలవిహితంబే యంచు యోజించి స
న్మతితోఁ గౌరవులార! యజ్ఞహయముం మార్మాటలేకుండ శ్రీ
పతికిం భక్తినొసంగి మ్రొక్కుఁడనుచుం బల్కంగఁ గౌరవ్యసం
తతి రాజాజ్ఞను నౌఁదలం గొని ప్రశాంతింబొంది నిర్వైరులై ౮౦౪

చ॥ సుమఫలచందనాక్షత సుశోభితనైకవిధాంబరంబులన్
విమలవిభూషణంబులను బెక్కిటిఁ గైకొని రామకృష్ణనా
మములను జీటిమాటికి సమంజసభక్తి వచించుచుం సవా
శ్వమిళితులై తదచ్యుతునిపాలికిఁ బోయిరి పాదచారులై ౮౦౫

ఉ॥ కాని యదూద్భటుల్ గనలి కౌరవులన్ దెగటార్ప హేతిసం
తానముఁగొంచెదుర్కొన ద్రుతంబుగ వారలు వీరులార! యీ
శ్రీనలినాక్షుదర్శనముఁ జేయఁగవచ్చితి మంతెగాని మీ
తో ననిజేయుమానసముతో నరుదెంచఁగలేదు నమ్ముఁడీ! ౮౦౬

ఉ॥ యాదవులందఱా కురుజనావళివాక్యము లాలకించి స
మ్మోదముతో ధృతాయుధసమూహము భూమినిబెట్టి వేగ దా
మోదరు నాజ్ఞఁ గైకొనుచుఁ బొందనిచెప్ప సరేయటంచు వా
రా దనుజాంతకుం గనుచు నౌఁదలమ్రొక్కుచుఁ బల్కిరిట్టులన్. ౮౦౭

క॥ తెలిసెను మీ ప్రతిభాదులు తొలఁగెను మా యెదలనున్న దోషచయంబుల్
కలిగెను జ్ఞానోదయమును నలుగక యీ హయముఁగొనుమ యాదృతిఁగనుమా!

తే॥ కలశభవుఁడును బ్రణమిల్లి కమలనేత్ర! తెలిసి తెలియక చేసిన కలుషములను
గరుణ మన్నించి బ్రోవుమా! కౌరవులను శరణుఁబొందిన నన్నును సాకుమయ్య!

ఉ॥ దాసజనావనాభిరత తామరసాక్ష! త్వదీయదాస త
ద్దాస తదీయదాస పదదాసులకున్ నను దాసుఁజేసి నీ
వాసముఁజేర్చి నిన్ను గను భాగ్యము నాకు ఘటించి నీదు నా
వాసముఁగూర్పు మెల్లపు డపారకృపన్ జగదేకమోహనా! ౮౧౦

తే॥ అవలఁ గర్ణుండు మ్రొక్కి యిట్లభినుతించె
భక్తరక్షణకొఱకు దివ్యంబు స్వసతి
కొఱకు యావనంబును స్వామికొలువుకొఱకు
ననువులు గతింపఁ దుది నీవె యమరవలయు ౮౧౧

తే॥ అంత భూరిశ్రవుండును ననియె నిట్లు
లభయవరద! యనన్యదుర్లభము దుఃఖ
హరము భవతరణంబును నఘహరమగు
భక్తి నొసఁగి రక్షింపుమా! పరమకరుణ ౮౧౨

వ॥ పిమ్మట సుయోధనుం డిట్లనియె. ౮౧౩

చ॥ ఎఱుఁగుదు ధర్మమార్గము ప్రవృత్తిఁజరించుట వేదధర్మ మే
నెఱుఁగుదుగాని యయ్యది నివృత్తి నసంభవమయ్యెఁ బూర్తిగా
నరయఁగ యంత్రమేను మరి యంత్రివి నీ వటుగాన నీవెటుల్
తిరిమిన నట్లుపోయెదను దప్పుసుమంతయు లేదు నాయెడన్. ౮౧౪

వ॥ భీష్మాచార్యుం డిట్లు ప్రస్తుతించె. ౮౧౫

తే॥ నరసమూహాదైత్యాదిత్యశరణములకు నఖిలవిధ భవదుఃఖసంహరణములకు
నరుణకోమల శ్రీకృష్ణ చరణములకు నలఘుతరభక్తితోడ నంజలి ఘటింతు

వ॥ విదురుం డిట్లు స్తుతించె. ౮౧౬

తే॥ వేదరాశ్యగమ్యుండును విశ్వమయుఁడు సచ్చిదానందరూపుఁడు సర్వసాక్షి
యార్తరక్షకుండును నగు నచ్యుతుండు జన్మరహితుగఁజేసి నన్ సాకుఁగాత!

తే॥ ఈ రహిన్ సంస్తుతించెడి కౌరవులను
హరియుఁ గని కృతార్థులు మీర లెఱుఁగలేక
మీయెడన్ దప్పుఁజేసిన మా యదువులఁ
గరుణ మన్నింపవలయును సరసులార! ౮౧౮

క॥ కలహంబు నాప నిచ్చట కలఘుగతిని వచ్చియుంటి యజ్ఞాశ్వంబున్
గలఁగక యొసఁగుఁడి! సుకృతిఁ దిలకింపఁగ రండు! సహాసతీసుతహితులై

ఉ॥ అంతట జాహ్నవీతనయుఁ డాత్మబలంబునుగూడి హస్తినా
ప్రాంతముఁ జేరెఁ గృష్ణుఁడు సపర్యలఁబొందుచు మావు న
త్యంతము జైత్రయాత్రికయి యంపుచు ద్వారక కేగె వెంట శ్రీ
కాంతసుతానిరుద్ధయదుకౌరవవీరులు సాగిరో ప్రభూ! ౮_౨౧

—♦ యజ్ఞాశ్వంబు పాండవుల ద్వైతవనంబున కేగుట. ♦—

చ॥ అతుల విముక్తమైన సవనాశ్వము పెక్కుస్థలంబులందుఁ బ
ర్యటన మొనర్చినప్పటికి నా ధృతరాష్ట్రనిపుత్రు నోటమిం
దిటముగ వించు నెట్టి రణధీరుఁడుగూడ స్పృశింపకుండె నం
తట నది యట్టి పాండవుల ద్వైతవనంబును జేరె నందునన్. ౮_౨౨

ఉ॥ భీముఁడు భీమవిక్రముఁడు భీకరఘోరకురూపయుక్త నా
నామృగపాళితోఁ గలిసి నవ్వుచు నాడెడి బాలుపోలె ఖే
లామృతపానమత్తుఁడయి హర్షముఁబొంది సమకుసంస్థిత
శ్యామమయశ్రివాంచిత సవాశ్వముఁ గన్గొని యబ్బురంబుతో. ౮_౨౩

ఉ॥ ఎవ్వఁడు దీని పాలకుఁ డెఁకెవ్వఁడు దీనిని వీడె నేలకో
యివ్వని కేగుదెంచె నిది యేమి యెఱుంగగరాదు కొంచెమే
నవ్వల నేవిపత్తయిన హత్తుత నిత్తఱిఁదప్పకుండ నీ
మన్యపుమావు నొండొకసమంజసగహ్వరమందుఁ గట్టెదన్ ౮_౨౪

ఆ॥ అంచు నిశ్చయించి హయమును గైకొనిపోవు భీమసేనుఁ బువ్వసాయ
కాది యాదవులును నాలోకనము జేసి యెవఁడవీవు నిలువు మేగవలదు ౮_౨౫

తే॥ అనిన వెంటనె వడముడి యాగ్రహించి చేతఁగదఁబట్టి యాదవసేననంత
చితుకఁగొట్టగడంగ నా రతిపతిసుతుఁ డతని బలరూపశక్తుల కబ్రమంది

క॥ అయ్యా! మీరెవ రెందుల కియ్యెడఁ జనుదెంచియుంటి రీసవనాశ్వం
బెయ్యెడకుం గొంపోదురొ చయ్యన వచియింపుఁ డేను శౌరిమనుమఁడన్

—♦ { అనిరుద్ధుండు ధర్మరాజుచే సమ్మానితుండై
వివిధదేశంబులు దిరిగి ఉద్ధవునితోఁ యోజించుట. } ♦—

వ॥ అంత భీముండును శాంతించి, దుర్యోధనుని దుష్టత్వంబున మాకు సం
భవించిన ద్వాదశవర్షారణ్యవాసంబునం దెనిమిదేండ్లు గతించె. మరి నాలుగేండ్లు
శేషించె. ఇదిగాక యొకయే డజ్ఞాతవాసంబు జేయవలె. ఎప్పుడు మేము తిరిగి నలు
గురిలోనికి వచ్చి బ్రతుకగలవారమో తెలియరాదు. మాయన్న ధర్మజుండు సోదర
సహితంబుగా నిచటికి యోజనదూరంబున నివసించె. అర్జునుం డింద్రునిచే నాహూ

తుండై స్వర్గంబున కేగెనని తన వృత్తాంతం బంతయుం జెప్పి, మాకష్టనష్టంబులను మాధవునకుం దెల్పుమని కోర, నాయుషాకాంతుండు చింతించుచు భీముని నాశ్వాసించి, తన జైత్రయాత్రోదంతం బంతయు నతనికిం దెల్పు, భీమసేనుండు సంతసించి, యనిరుద్ధాదులను నగరిజనసన్నిధికిం దోడ్కొనిపోవ; ధర్మరాజు వారల హర్షించి, కుశల ప్రశ్నాదుల నడిగి, యింద్రనీలహేమాంగదవస్త్రాల సహితంబుగా సన్మానసత్కృలను మజ్జన భోజనాద్యుపచారములం జేసి తృప్తిపరచె. అనిరుద్ధుం డచట నొక రాత్రిమాత్రముండి, మరునాటి ప్రభాతంబున హయమును సమర్పించగా నొని రాజసూయంబున కవ్వారినిం బిలిచి యట వీడ్కొని సారస్వతాది దేశములనుం జూచికొని, శ్రీకృష్ణపదారవింద మరందపానమత్తులును, గోపీచందనతులసీమాలోర్ధ్వపుండ్రాదిధరులు నగు పౌరులచే వర్ధిల్లుచున్న కౌంతిలపురంబున కరిగి తత్పతియగు చంద్రహాసునిచే గరిమింగంధరత్నాంబరములతో విశేషముగా సత్కృతుండై యతని పూర్వచరిత్రం బుద్ధవుని వలన నాలించి, యానందించి, యా చంద్రహాసునకు రత్నహారంబు బహూకరించె. అతం డమిత సంతోషముతో రాజ్యనిర్వహణాధికారంబు మంత్రివర్యున కప్పగించి, యనిరుద్ధనహాయార్థంబుగా సబలంబుగా బయలుదేరె. అట్లొక రాత్రి యట గడిపిన మరునికొమరుం డుదయముననే లేచి సవహయయాదవసహితంబుగాఁ బ్రయాణించి వందలకొలది సుడిగుండములతోడను, నుత్తుంగతరంగములతోడను, పెదపెద్దనావల తోడను, మిక్కిలి వడిగాబాఱు ప్రవాహంబులతోడను, గూడి దాటశక్యంబుగాని సప్తవతీనదిని గాంచి గజారూఢులై వినోదంబుగాదాటి యజ్ఞహయంబు సింధుసముద్రమధ్యమందున్న నారాయణసరస్సునం దుదకంబు ద్రావి, విశ్రమించియుండుట గని యచటి కందఱతో నరుదెంచి, ధర్మద్వేషులగు నందలి మ్లేచ్ఛులను దునుమాడి, జయించి, యందు జలకంబాడి యుద్ధవున కిట్లనియె. ౨౨౮

ఆ॥ చైత్రమాసంబందు రాజసూయంబౌను ఫాల్గుణంబు ముగియవచ్చె నిపుడు
వ్యవధిలేదు మరియు వాజిగ్రహీతలు చెలఁగరేని సరగఁ జెప్పుమయ్య! ౨౨౯

ఉ॥ ఈరహింబల్కు నుద్ధవుఁడు కృష్ణసుతాత్మజ! యట్టివారు లీ
భారతవర్షమందు మరి స్వర్గమునందున గూడ నెవ్వరున్
లేరని నమ్ముమయ్య! యవలీలగ యాదవవాసమైన శృం
గారపు ద్వారకాపురికిఁ గాంక్షమెయిన్ జనవచ్చునంచనెన్ ౨౩౦

చ॥ అనిరుద్ధుండు తదుద్ధవోక్తి విని యజ్ఞాశ్వాగ్రమం దద్దియే
వినిపింపన్ సకలార్థవిద్ధయము బల్వేగంబుతో ద్వారకన్
ఘన కిష్కింధనుజేరు వాయుసుతు వీక్షన్ బోవసాగెన్ మరిన్
వెనుకన్ సాంబముఖాదులేగుచు మనోవేగంబుతో దానినిన్ ౨౩౧

చ॥ పలుపులఁగట్టి త్రోలుకొని వాహినిమధ్యను నిల్పి యారివె
ల్పుల నిలుచుండి నైకవిధ వాద్యములున్ జయభేరినిస్వనం
బులు చెలరేగ లాస్యము లమోఘముగా జరుగంగ భూమి సం
చలనము జెంద శత్రువులు సాధ్వస మొందగ సాగిరంతటన్ ౮౩౨

—♦ నారదుండు యజ్ఞాశ్వంబు బట్టుకొనుమని యింద్రుని బురికొల్పుట. ♦—

తే॥ కయ్యపుందిండి యను పేరుగాంచియున్న నారదుం డట్టి యుత్సవగౌరవములఁ
గని హుటాహుటి నాకలోకమునకరిగి జిష్ణునకు యజ్ఞవార్తలఁ జెప్పి తమిని

సీ॥ విహితహితాహిత వివరణశాలి బృహస్పతి యుపదేష్టయయ్యె మీకు
నడ్డుపాటులులేక యరిశూరులనుగొట్టు నశనియె యాయుధమయ్యె మీకు
జరయుమృతియులేక శత్రువులను గెల్చు నమరులె యోధులునయ్యె మీకు
రిపువర్గమునకు దుర్భేద్యమై వెలిగెడి యట్టి స్వర్గమె దుర్గమయ్యె మీకు
తే॥ నసురహరకృష్ణుఁడే తమ్ముఁడయ్యె మీకు
నట్టి యైరావణమె వాహమయ్యె మీకు
దేనియందెట్టి లోపమున్ గానరాదు
యజ్ఞహయమేల పట్టవో యమరనాథ! ౮౩౪

తే॥ అంత శక్రుఁ డాసవహయ మపహరింప నెంచుచున్ భూతలంబున కేగుదెంచి
కని యదృశ్యుఁడై మనచేతగాదు గాన వ్యర్థకృషియేల?కృష్ణుతో స్పర్ధయేల?

తే॥ అల మహాసముద్రింబుల వలెను జెలగు యాదవుల మహాసేనల కాగజాల
నంచు నాత్మీయులను గూడి యాత్మపురికి తిరిగిచూడక కదువడి నరిగెనంత

—♦ { అనిరుద్ధుండు తనరాకను ఉగ్రసేనాదులకుఁ దెల్ప ముందుగా నుద్ధవుని బంపుట. } ♦—

సీ॥ ఆభరణధ్వజశోభితకలభంబు నందచందములతో ముందునడువ
జయజయనాదముల్ జయభేరులున్ మ్రోయ బ్రాహ్మణాశీస్సులుఁ బ్రబలుచుండ
దివ్యతురంగముల్ భవ్యమాతంగముల్ నవ్యరథంబులు నడుచుచుండ
నరికోటిభీకరశరచాపపరిఘాదిసహిత పదాతులు సాగుచుండ
తే॥ చంద్రహాసేంద్రనీలాదిసహచరయుతుఁడైన కార్ష్ణి జ సాంబాది యాదవేంద్రు
లరుస మొందుచు నధ్వరహయము వెంటఁ జనుచు నుద్ధవున్ బిలిచి యిట్లనియె భూప!

తే॥ ఉద్ధవా! యిచ్చటకు రెండుయోజనములె ద్వారకాపురి యున్నది దాన నీవు
ముందుగా మన రాకను భూరిసభను జెలఁగు నుగ్రసేనపతికిఁ జెప్పుమయ్య!

చ॥ అని యనురాగ ముద్ధవుఁడు యాదవభూవరుఁ డైన యుగ్రసే
నునకు మహాసభాస్థలిఁ గనుంగొని మ్రొక్కుచుఁ జైత్రయాత్రియం
దునగల సర్వవార్తలను “తూ, చ” లుఁ దప్పక చెప్పి కృష్ణునిన్
మనసిజు దేవకీపతిని మాన్యులనందఱఁ గొల్చి సాగెనన్. ౧౩౯

చ॥ కమలదళాక్ష! నీ కరుణఁ గౌరవ పాండవ వల్లభానుశా
ల్వమగధరాజబాణముఖ బాహుబలిష్ఠులఁ గెంచుఁ గాన్కలన్
దమకడ కేగుదెంచిరిగదా! యిఁక నధ్వరకార్యసారతా
సములయి చేయఁగావలయు సర్వజగంబులు సన్నుతింపఁగాన్. ౧౪౦

ఉ॥ ఆవల నుగ్రసేనుఁడు ముదబ్ధిని మున్గుచు మాటలేక ర
త్నావృతహారముద్ధవున కాదృతినిచ్చి ననంతరంబునన్
శ్రీవిభుఁడున్ తదుద్ధవుని చెంతకుఁ జేరుచుఁ గౌఁగిలించె నా
భూవరుఁ డాజ్ఞచేసె స్మరపుత్రుని దోడ్కొనిరాగ శౌరికిన్ ౧౪౧

## —♦ శ్రీకృష్ణుండు అనిరుద్ధుని సగౌరవంబుగా ద్వారకకు తోడ్కొనివచ్చుట. ♦—

ఉ॥ పిమ్మట రాజునాజ్ఞఁ బురిపేటలు గోటలు తోటలున్ నిశాం
తమ్ములు సందుగొందులు పతాకలఁ బచ్చనితోరణంబులన్
సొమ్ముల రంగవల్లుల వినూత్నచిరత్నమణిప్రదీప దీ
పమ్ముల వాసితప్రసవవారుల శోభిలె నేత్రపర్వమై ౧౪౨

ఉ॥ మంగళవాద్యముల్ మొఱయ మానినులారతులెత్తుచుండఁ బ
ణ్యాంగనలాడఁ బాడ వసుధామరులున్ శుభవాణిఁబల్క మా
తంగము ముంగలన్ వెలుఁగ దర్పకపుత్రు నెదుర్కొనంగ శ్రీ
సంగుడు సాగె స్వీయ గురు సైన్య సతీహితబంధుయుక్తుఁడై ౧౪౩

ఉ॥ వచ్చెడివారలం గనిన పంచశరాత్మభవుండు తేరునన్
గ్రచ్చఱడిగ్గి యజ్ఞతురగంబును ముందిడుకొంచు ముందుగా
నచ్చపుభక్తితో గురులకొఁదలమ్రొక్కి స్వబంధుబృందమున్
నెచ్చెలులన్ దమిన్ గనియె నెమ్మిని వారలొసర్ప దీవనల్ ౧౪౪

చ॥ హరి, జనకాగ్రజానుజసుతానుచరప్రియపౌత్రపాళితో
ధరగల ఱేఁడులన్ గెలిచి ధైర్యముతోఁ బొలుపారు కార్ష్ణి జన్
గరివయి నెక్కఁజేసి తమకంబునఁ దోడ్కొనివచ్చుచుండ శం
బర రిపుసూతి, నిర్జితులు వైరి నృపాలురుగూడ వెంటరాన్ ౧౪౫

## అనిరుద్ధుండు ఉగ్రసేనుని సందర్శించి, తన వెంట వచ్చిన రాజులను పరిచయము జేయుట.

తే॥ సర్వవిధ సమలంకృత సౌఖ్యదాయకాక్షిపర్వాచ్యుతావాసమైన ద్వార
కాపురంబును వీక్షించి కాంచె ముదము మిగతవారాత్మపురగతిఁ దెగడుకొనిరి

తే॥ అట్టి యమరావతీతుల్యమైన ద్వారకాపురిఁ బ్రాహ్మణామ్నాయ ఘననినాద
భాసురము ధృతగంధ ధూమ్రామాసిత మసిపత్రసువ్రితయుతయజ్ఞవాటమందు

సీ॥ యదువృష్ణిభోజాంధకాది భూపేంద్రుని బురుహూతతుల్యుని బుణ్యపురుషు
దర్భాసనాసీను దాంతుని శాంతుని మృగచర్మ మృగశృంగ మిళితదేహు
వైశ్వానరార్చనబద్ధసుబుద్ధిని ధూమాక్షిరుణేక్షణు ధూతపాపు
యోగిమునీశ్వరయుక్తుని శక్తుని భార్యాసమేతుని బాహుబలుని

తే॥ నుగ్రసేనుఁ గాంచిన మన్మథోద్భవుండు గజము డిగ్గనఁ డిగ్గుచుఁ గరయుగంబు
మోడ్చెఁ దక్కినవారలు బుడమిసోఁక వేరువేరుగ మ్రొక్కిరో వినుతచరిత!

ఉ॥ ఆవల నుగ్రసేనవిభు డంపజుఁ గాంచుచు గారవంబులన్
జేవమిఁ దీవి తేవలకుఁ జేతలకున్ దగినట్లుచేసె నా
శ్రీవిభుపౌత్రుఁ డట్టి యదుశేఖరునిన్ గని కేలుమోడ్చి యా
తావునున్నవారు విషఁ దానిటుచెప్పె విధేయతావిధిన్ ౧౮౯

సీ॥ నీ పదాబ్జములపై నెఱిగ వ్రాలిన యట్టి యింద్రనీలుని లేవనెత్తుమయ్య!
శరణుగోరిన యనుశాల్వ, హేమాంగద, చంద్రహాసవిభుల సాకుమయ్య!
నీకడ కరుదెంచి నిన్ను గొండాడెడి గాంగేయబిందులన్ గాంచుమయ్య!
సతము నన్ రక్షించు జాంబవతీపుత్రుఁ డైనట్టి సాంబుఁ గాపాడుమయ్య!

తే॥ శివ హతులమయి హరి పునర్జీవితులమునైన నను, సునందను, నిటకచ్యుతకృప
నాగతులగు యాదవులను నన్యవిభుల నందఱను బ్రీతిగాంచి కాపాడుమయ్య!

తే॥ ఇదుగో నిర్విఘ్నముగ నెల్ల యెడలఁ దిరిగి
తిరిగివచ్చిన యజ్ఞాశ్వ మఱుమఱవిడి
కొనుము! మీరిచ్చినట్టి యీ ఘనకృపాణ
మును గ్రహింపుము! గరుణతో గనుమ మమ్ము! ౧౯౦

ఉ॥ జాంబవతీసుతధ్వజినిసంయుతుఁడై వెలుగొందుచున్న యా
శంబరవైరిజున్ గని యుషావసుదేవసతీముఖాంగనల్
సంబరమొందిరా నగరసౌధములెల్ల దిదృక్షుపంక్తిన
బ్రింబుగ నిండిపోయె మరి బల్కగలాడనె తద్వినోదముల్ ౧౯౧

—♦ ఉగ్రసేనుం డశ్వమేధయాగ మారంభించుట. ♦—

వ॥ అష్టద్వారవిరాజమానంబును, కుంకుమచిహ్నితపతాకాధ్వజమానంబును, వేదపారాయణపరాయణ యాజ్ఞిక బ్రాహ్మణాష్టక భాసురాయమానంబును, సుశిక్షితకుశమునలోలూఖలాది నానావిధ యజ్ఞసంభారవిభ్రాజమానంబును, సర్వాలంకారాలంకృతంబును, నయనపర్వంబును నగు యజ్ఞమంటపమునం దమరావతీపురంబందు వెలుంగు శక్రునివలె నుగ్రసేనరాజర్షి నప్పుడు వెలుంగుచుండెను. శ్రీకృష్ణునిచే నాహూతులైన నందోపనందవృషభానుప్రభృతి గోపకబృందంబును, శ్రీదామాదిమిత్రవ్రాతంబును, యశోదాదిగోపికాగణంబును, గోకులంబునుండి యరుదెంచిరి. ఇట్లే హస్తినాపురమునుండి కౌరవయుక్తుండగు ధృతరాష్ట్రుండును, సోదరసహితంబుగా ధర్మరాజును సకుటుంబముగా నేతెంచిరి. శ్రీకృష్ణప్రేషితుండగు నారదునిచే బిలువంబడిన శక్రుండు, నింద్రాదిదేవతలు, ద్వాదశాదిత్యులు, మరుద్గణములు, కిన్నరకింపురుషవిద్యాధరగంధర్వాదులు, విశ్వేదేవులు, సిద్ధసాధ్యాది దేవతలు, దేవపత్నులు యజ్ఞంబును దర్శింప మహోత్సవంబుతో ద్వారకకు వచ్చిరి. కైలాసమునుండి సర్వమంగళాకుటుంబసహితముగా శంకరుండును, సుతలంబు నుండి మయవిభీషణప్రహ్లాదాదిదైత్య దానవవర్యులును, ధేనుసహితంబుగా ధేనురూపధారిణియగు ధరాదేవియు, శైలసహితంబుగా మేరు హిమగిరులును, సర్వతీర్థసంయుతంబుగా బుష్కరతీర్థరాజంబును, రత్నయుతంబుగా రత్నాకరంబులును, వ్రజభూమియు, స్వసయగు యమునతో యమధర్మరాజును, వివిధవిధంబులగు తమతమ వాహనంబులపై నెక్కి రాజసూయయాగంబును సందర్శింపవచ్చినవారిని నుగ్రసేనుం డాలోకించి, యత్యంతముగా సంతోషించి, యందఱకుఁ దగినట్లు శిబిరమందిరారామాదులందు మజ్జనభోజనవసతిసౌకర్యంబు లంగావించి, వేదవ్యాసుని, బ్రహ్మను, బకదాల్భ్యమహాముని నాచార్యునిగా, పూర్వనిమంత్రితు లగు మహర్షులను, ఋత్విజులనుగా వరించి, యజ్ఞక్రియారంభ తత్పరుండై యుండె. ఇట్టిపట్టున, ౮౫౩

తే॥ కృష్ణుకోర్కెని ననిరుద్ధుఁ డిందు ధాత్రి నిజసురూపముల్ మూటినిఁ ధరించి
వెలుగ యాదవాదులు బహువిస్మయంబునంది యొండొరుల్ గుసగుసలాడుకొనిరి

తే॥ యజ్ఞశాలను బ్రాహ్మణు లవనివిభులు వేరువేరుగ దగినట్లు కూరుచుండి
రంత వ్యాసుఁడు గోమతియంబువులను గొనఁ జతుష్షష్టిదంపతుల్ చనగవలయు

వ॥ అని యుగ్రసేనవిభు ప్రభృతులంగూర్చి యాదేశించినదే తడవుగాఁ గశ్యపుండదితితో, నత్రియనసూయతో, వశిష్ఠుండరుంధతితో, ద్రోణాచార్యుండు కృపితో గృష్ణుండు రుక్మిణితో, బలరాముండు రేవతితో, బ్రద్యుమ్నుండు మాయావతితో, ననిరుద్ధుం డుషతో, నర్జునుండు సుభద్రతో, సాంబుండు లక్ష్మణతో, మరియు హేమాంగదాదులు స్వస్వభార్యాసాకంబుగా బంచపల్లవంబులఁగొని దేవకీ,రోహిణీ,

కుంతీ, గాంధారీ, యశోదాది పుణ్యాంగనలను బురస్కరించుకొని సుమశోభితకలశం
బులను గైకొని గోమతీ పవిత్రజలంబులను బూరించుకొనివచ్చుట కేగసాగిరి. జగ
న్మోహనంబుగా రుక్మిణితో శ్రీకృష్ణుం డగ్రభాగంబున జనుచుండుటఁ గలహప్రియుం
డగు నారదుండు వీక్షించి, చక్కని తరుణంబు సంప్రాప్తించినదని సంతసించి, సత్యా
భామా సదనంబునకు శరవేగంబున జని, యామెచే నభ్యర్చితుండై యభ్యర్థితుండై
యిట్లనె. ౨౫౬

♦ నారదుండు సత్యభామాదుల సతులదరిఁజేరి శ్రీకృష్ణునిమీద గొండెములఁజెప్పుట ♦

శా॥ అమ్మా! కృష్ణుఁడు రుక్మిణీతరుణితో నాశ్చర్యకృద్రాజసూ
యమ్మం దీదినమందు గోమతిజలం బాదంపతుల్ వెంట మో
దమ్మున్ బొందుచు నేగుదెంచ శుభవాద్యమ్ముల్ నినాదింప, లో
కమ్మానందము జెంద వచ్చుటలు నా కండ్లారగాఁ గాంచితిన్ ౨౫౭

ఉ॥ కాని తదుత్సవంబున జగత్ప్రియమోహిని? కృష్ణు స్వా
ధీనమునందు నుంచుకొని దివ్యసుమంబును గొన్న నీవటన్
నా నయనంబులన్ బడవు న్యాయమె? నీ కవమాన మిట్లు ల
న్న్యానముగా ఘటిల్లుటకు నున్నదె హేతువు? దాని దెల్పుమా! ౨౫౮

చ॥ అని యనునంతలోనె హరి యచ్చటకున్ జనుదెంచి యో ప్రియా!
నినువిడి రుక్మిణిన్ గలిసి యేనటకున్ జనలేదు భోజనం
బును బొనరింపవచ్చితిని బోయెను రాముఁడు భార్యతోననన్
విని ముదమందె సత్య; యటుపిమ్మట మానియు లేచి భీతితో ౨౫౯

ఉ॥ జాంబవతీ గృహంబుజని సత్యకుఁ జెప్పినయట్లు సర్వవృ
త్తంబు వచింప, నాసతియుఁ దత్తఱజెందక నవ్వి లోనిగే
హంబున నంబుజేక్షణుఁడు హాయిగ నిద్దురబోవుచుండె స
త్యంబును దాచిపెట్టి కలహం బిటుపెట్టకుమయ్య! నారదా! ౨౬౦

చ॥ అది విని మౌనివర్యుఁ డెదురాడక తృప్తియులేక మిత్రవిం
ద దరికిఁబోయి గోమతియుదంబును గైకొనిరాగ సత్య, భీ
ష్మదుహిత, యల్ల జాంబవతి సారసలోచనతోడఁ గూడి స
మ్మదమునఁబోయి రీవు గృహమున్ విడ వెందుల కేగవో సతీ! ౨౬౧

ఉ॥ అంతట మిత్రవింద పరిహాసమొనర్చుచు మౌనినాథ! యే
కాంత, జగన్మనోహరుని, కంజదళాయతపత్రనేత్రు శ్రీ
కాంతు హరిన్ ద్యజించి బ్రతుకన్ గలదే క్షణమేని యాతఁ డే
కాంతమునందు బౌత్రు నయగారముగా లలిబుజ్జగించెడిన్ ౨౬౨

తే॥ అంత మునికాంతుఁ డటలేచి యజ్ఞనాథు సతుల యిండ్లకన్నిటికేగి కౌతుకసహిత
లగుచు వారలుండుటఁగాంచి వగచి యేమిచేయుదునని కన్నియ్యెడఁ జింతజేసి

తే॥ వడిని గోపికాగృహములకడకుఁబోయి ముందె యుండుని గనుఁగొని యుండి రాధ
యింటికేగఁగ నటఁగూడఁ గృష్ణుఁడుంట గాంచి తిప్పించుకొనుచుఁబోవ నెంచులోన

## —♦ శ్రీకృష్ణుండు నారదుని బట్టికొని హితము చెప్పుట. ♦—

చ॥ హరి త్వరలేచి నారదుని హస్తముఁజేకొని యుండెనిల్పి శా
స్త్రరుచిరరీతిఁ బూజలనుసల్పి ధరామరవర్య! నీవె యి
త్తఱి నెదిచేయనుంటివి? వృథాగ చరించుచు మోహితుండవై
వరుసగ గేహగేహముల బాయుచుఁ జూచితి నిన్ను నీగతిన్ ౮౬౫

ఉ॥ నేనొ యనేకరూపముల నిచ్చలుఁ జెంద ధరింతు నారదా!
నేనె సమస్తదేవతలనేతను విప్రులు నాకు దేవతల్
గానఁ బరాభవింపను నఖండనుతిం బొనరింతు నే జనుల్
క్షోణిసుపర్వధిక్కృతికిఁ గొంకిరొ వారలె నాకు శత్రువుల్ ౮౬౬

ఉ॥ ఎవ్వరు నాదురూపముగ నెంచుచు బాపల కర్చఁజేతురో
యవ్విధు లైహికంబులగు నన్నిసుఖంబులఁబొంది యంతమం
దవ్విమలోత్తమస్థితిని నందుదు రీవు నమేయమాయతో
నొవ్వుచు మత్పురిన్ దిరిగియుంటివి దీనికిఁ గుందకుందుమా! ౮౬౭

తే॥ బ్రహ్మశివముఖుల్ నామాయపారమెఱుగ రనగ వినినట్టి నారదుఁ డచటనుండి
వెడలి ఋత్విక్సమేతతద్వేదిక దరి కరుగుదెంచి కూర్చుండె మాటాడకుండ

## —♦ శ్రీకృష్ణాదిసతులు గోమతీజలంబులను దీసికొనివచ్చుట ♦—

తే॥ అవలఁగృష్ణాదివిభులు భైష్మ్యాదిసతులు నరుగుదెంచిరి నట్గూడివ్యాసమునియు
గోమతీతీరమును జేరి కుంభములను సలిలదేవతార్చల సల్పి జలమునింపి

తే॥ అల్ల యనసూయకిచ్చె ననంతరమున రేవతీముఖసతులు వహించు చవ్వి
గొంచు లేవనెత్తగ భూరికుసుమ,నారి భరితమాటను లేవమిసరణిఁగాంచి

క॥ దొరసానులు దొరలు బరస్పరమున్ నగ నివ్వి యెట్లు సవనస్థలికిన్
శిరములనిడి చేర్తుమొ? యెటుజరుగునొ? యేమగునొ? యెఱుగఁజాలము లవమేన్

చ॥ అని చింతింపగ రుక్మిణీముఖసరోజాక్షుల్ దమిన్ వారలన్
గని మీరందఱు శ్రీహరిన్ దలఁపుఁడీ! కష్టంబునష్టంబులున్
జనిపోవున్ గద! యన్న నా సుదతు లాశౌరిన్ మనంబారగా
వినుతుల్ జేసిరి చేర్చిరట్టి సవనోర్విన్ దద్ఘటశ్రేణులన్ ౮౭౩

**బంధు మిత్రుల నాయా కార్యములందు నిర్వాహకులుగా నిర్ణయించి, భార్యాసహితంబుగా యాగంబొనరించుట.**

వ॥ అంత నుగ్రసేనుండు తన యజ్ఞకార్య నిర్వహణమునందుఁ బూర్తిగాఁ దోడ్పడ సంసిద్ధులైయున్న బంధుమిత్రులను గాంచి, సంతసించి, ధర్మరాజును ధర్మ పాలనమందును, భీమునిఁ బాకశాలానిర్వహణమునందును, నర్జునుని నతిధిశుశ్రూషణమందును, నకులుని ద్రవ్యసాధనమందును, సహదేవునిఁ దత్పూజనమందును, సుయోధనుని దానాధ్యక్షునిగను, గర్ణుని దాతగను, ద్రౌపదిని బరివేషణమందును, మహారథులగు శ్రీకృష్ణపుత్రుల నెనమండుగురిని రక్షణమందును, యుయుధానవికర్ణ హ్రాదీకవిదురాక్రూరోద్ధవాదులను దత్తదుచిత వివిధవిధకర్మలయందును నియోగించి శ్రీకృష్ణా! నీవేమి జేయఁదలంచితివని పృచ్ఛింప, నతండు పూర్వంబునం దింద్రప్రస్థ పట్టణంబున జరిగిన రాజసూయమందు జరిపినట్లిప్పుడు గూడ బ్రాహ్మణపాదప్రక్షాళనకృత్యంబు నిర్వర్తింపఁగలనని చెప్పుచుండ, బ్రహ్మాదులును, ప్రేక్షకులును హసించుకొనిరి. శ్రీకృష్ణుం డనినచొప్పున బ్రాహ్మణులకుఁ బాదప్రక్షాళనంబుఁ జేసి, దివ్యాంబరంబులఁ గట్టబెట్టి, యాసనంబుల నాసీనులం జేసి, నానావిధ పుష్పమాలాలంకృతులం గావించి, సువర్ణాభరణంబులను ధరింపఁజేయ, నా భూసురులు సురలఁ బోలి విరాజిల్లఁదొడంగిరి. బహుదూరప్రదేశంబులనుండి చనుదెంచిన యాచకులు, భిక్షుకులు, విరక్తులు, బుభుక్షితులు కోరినట్లు సువర్ణరజతవస్త్రచ్ఛత్రగజరథతురగ శిబికాద్యన్నదానంబులతో సంతుష్టిపరచి, యుగ్రసేనుండు రుచిమతీసతీ సహితంబుగాఁ గృతస్నానుండై యసిపత్రనామకవ్రత మవలంబించి క్రతుదీక్షితుం డయ్యె. వేదశాస్త్రపారంగతులగు నిరువదివేలమంది బ్రాహ్మణులును వ్యాస గర్గాదేశానుసారంబుగా నశ్వమేధయాగంబు యథావిధిగా జేయింప మొదలిడిరి. అగ్నిహోత్రుం డేనుగు తుండంబుతో సమమగు నాజ్యధార వేల్చుటచేఁ బ్రసన్నుండై, యజ్ఞకుండమునుండి బయలువెడలి, సభాసదులు వినుచుండ, "తృప్తోస్మి" యని యిఁకఁ బశువు సమర్పింపవచ్చునని యాదేశించె. ౭౨౩

తే॥ పార్థివుండును హేమయూపంబునందు స్వర్ణదామంబుతోఁ గట్టఁబడిన శ్యామ
కర్ణభాసుర సవతురగంబుకడకు నేగి వినుమని యిటు వచియింపఁగడఁగె ౭౨౪

క॥ తురగమ! వింటివె యజ్ఞేశ్వరుఁ డాడిననుడుల నతఁడు సంశుద్ధము న
ధ్వరపశువును నగు నిను నేఁడ్తెఱఁదిను నాజ్యాధిధారఁ దృప్తుండయ్యెన్ ౭౨౫

క॥ భూపోక్తివినినసవహరి గోపాలకు మొగముఁజూచి కొంకక శీర్షం
బూపుచు సమ్మతిఁజూపఁగ నీపగిదిన్ హాలికి వ్యాసుఁ డెఱిగించె సుమీ! ౭౨౬

—♦ వ్యాసుఁడు బహువిశేషనంబు గావింపుమని బలరామునకుఁ జెప్పుట. ♦—

క॥ లెమ్మా! బలభద్రా! యింకేఁ గొమ్మా! ఖడ్గమ్ము నీవు గొంకక మదిలో
నిమ్మావు తలనుఁ గొట్టుము! యమ్మానపతి హర్షమొందు నట్లయ్యె సలఘా ౨౭౭

ఉ॥ అంచు వచింప సీరి యసిహస్తముఁ గాని తచ్ఛిరంబు ఖం
డించెఁ దదుత్తమాంగమును జేరి దివిన్ కవిగ్రోన మాపటన్
గాంచిన దేవదైత్యనరకాండము విస్మయమొందె జక్షిఘా
పాంచితశౌరి దాని హృదయంబున శూలము గ్రుచ్చె నవ్వుచున్ ౨౭౮

ఉ॥ అంతటఁ దత్కళేబరమునందు మత్తుదారసమానధార ల
త్యంతము బుట్టె జ్యోతి యుదయంబయి కృష్ణునిలో లయించె ని
భ్రాంతిని జెందఁ గర్పూరపురాణ శరీరము మారి సౌరభం
బంతటఁ బ్రాఁకఁ జేసె నల వ్యాసబుధాదులు పల్కి రిట్టులన్ ౨౭౯

ఉ॥ యాదవనాథ! నీవు చరితార్థుఁడవైతివి నీసవంబు నా
హ్లాదము గూర్చె నెల్లరకు లక్షణయుక్తసితాశ్వహోమ మీ
వేదవిదగ్రగణ్య సమవేతుఁడవై యొనరింపు మింక నీ
మేదిని నీప్రతిష్ఠయు నమేయముగాఁ బొలుపారు నిత్యమై ౨౮౦

చ॥ అని తదనుజ్ఞఁ గైకొనుచు వ్యాసుఁడు గర్గబుధాదియుక్తుఁడై
ఘనఘనసారహోమము నఖండముగా మును యజ్ఞమందునన్
బొనరిచినట్లు చేసె నట వ్యూహచతుష్టయపుత్రపౌత్రులో
కనివృతకృష్ణుఁడుండు నటఁ గానిపనుల్ గనరావు భూవరా! ౨౮౧

వ॥ అంతఁ గృష్ణద్వైపాయనుం డామ్నాయోదితంబుగా నమరేంద్రాది దేవతల నిట్లాహ్వానించె ౨౮౨

చ॥ హరిహయ! యాదవేశ్వర సమర్పితమౌ హిమవాలుకాహుతిన్
సరగున రమ్ము! కైకొన నసంభవ మీ కలికాలమందునన్
సురపతివచ్చి ధర్మనృపసూయమునందిది మున్నుబొంది యి
త్తఱిని గ్రహించుచుంటిమనఁ దక్రతుయాజ్ఞికు లెల్ల రంతటన్ ౨౮౩

తే॥ పేరుపేరున వేల్పులఁ బిలిచి యాహుతుల నొసంగిరి సర్వులు దృష్టిగాంచి
యన్నదానాదులం జేసి రంత యుగ్రసేనుఁ డలవారి వ్యాసోక్తిఁ జనవరనాథు

తే॥ బ్రాహ్మణక్షత్రియార్యాంఘ్రిభవులు పార్థివులు నుగ్రకృష్ణాదియాదవులు జెలఁగ విధిని
బుణ్యపిండారకక్షేత్రమునకు బోయి యవబృథస్నానమొనరించి యాలితోడ

తే॥ దివ్యవస్త్రంబులం గట్టి నవ్యపీఠమందు దక్షిణతో యజ్ఞుఁ డధివసించి
నటుల రాజిల్లె నరసుర చటులపటహ భేరిముఖవాద్యముల్ మ్రోసె వేడ్కమీఱ

క॥ సురలును బూలను గురిసిరి చరువు పురోడాశములను స్వధపానం బం
దఱు గ్రోలిరి దేవకీముఖ తరుణులునిడి రారతుల ముదంబొందిరహా! ౮౮౭

తే॥ అంబరాభరణాదుల నట్టి యుగ్రసేనునకు నిచ్చి మర్యాదఁ జేసిరెల్ల
రంత కృష్ణవృకోదర పార్థితులయి ద్విజులు మృష్టాన్నముల్ మెక్కి తృప్తిపడిరి

తే॥ కృష్ణ భీములు ద్విజులార! యీరు దినిన నైకవిధభోజనంబుల యాహ్వాయములఁ
జెప్పుఁడీ! యన వారేమి చెప్పలేక యొకరిమొగ మొకరును గను చూచుకొనిరి

—♦ ఉగ్రసేనుండు యజ్ఞాంతమున వచ్చినవారినందఱను దగినట్లు గౌరవించుట ♦—

వ॥ పిమ్మట నుగ్రసేనుండు సంతసించి, త్రైలింగ కర్ణాటక ఘూర్జర సౌరాష్ట్ర వంగాది నానాప్రదేశముల నుండి యాగతులైన యగ్రజన్ములకు హేమాంబరాభరణ రత్నాదులతో సత్కరించి, నమస్కరించి, యొకలక్ష హయంబులను, వేయి యేనుగులను, రెండువేల యరదంబులను, లక్ష గోవులను, నూరుబారువుల బంగారంబును, బ్రపృథమంబున నాకు సమర్పించి, గౌరవించె. మఱియు నా భూపుండా దక్షిణలో సగము చొప్పునఁ బారాశర్యునకు, జకదాల్భ్యునకు నొసంగి సన్మానించె. నిమంత్రితులగు బ్రాహ్మణులకు వేయి గుఱ్ఱంబులను, నూరేనుగులను, రెండు వందల రథంబులును, వేయి మాహేయులను, నిరువదిబారువుల బంగారంబు నొసంగి, తదితరులగు బ్రాహ్మణుల కొక్కొక్కరి కొకగుఱ్ఱము, నొకయేనుగు, నొకరథంబు, నొక గోవును, నొకబారువ సువర్ణంబును, రెండుబారువుల వెండిని దక్షిణగా నిడి, నమస్కరించె. అట్టి పట్టున రాజద్వారంబు కడకు వందిమాగధసూతకవిగాయక వేశ్యాదిజనంబులు జేరి స్తోత్ర కవితా గాన తాల గీత నృత్యాదులను, మధుర గంభీర గళంబులతో, మనోహరభంగిమంబులతో గావింప, యాదవప్రభుం డాలోకించి, యాలించి, యానందించి, యవ్వారలకుఁ దగినట్లు మేఘుండు వర్షంబు వర్షించినట్లు, కనక వృష్టిం గురియించి బహూకరించె వెండియు నతండు పదివేలగుఱ్ఱంబులను, సహస్ర గజంబులను, శతశిబికలును, ముప్పదిబారువుల బంగారును, నొక్కొక్కరాజునకు విన మ్రుఁడై యిచ్చి, యంతకు రెండింతలుగా యదుభూపతుల కొసంగి, దేవకీ రోహిణీ రుక్మిణీ యశోదా రాధికాది సతీమణులను, నందోపనందాది గోపరాజులను రత్నాం బరాభరణహీరహారాదులను సగౌరవంబుగా నొసంగి, హర్షోత్కర్ష మనస్కుఁడై తిరిగి తన దేశికుండగు గర్గునకు నూరుగ్రామంబుల నర్పింప, నాతండు దీనులగు బ్రాహ్మణాదిజనుల కిడి సంతృప్తిపరచె. బలరామసహితుండగు శ్రీకృష్ణుఁడు వస్త్రాలంకార తిలక నీరాజనంబులతోఁ బూజితుండై యాదవేంద్రునితో నిట్లనియె.

ఉ॥ ఎంచితి వశ్వమేధ మిల నెల్లనృపాలుర నెల్లఁ గార్ష్ణి జిన్
బంచితి వగ్రజన్ములను వ్యాసుఁ బురోధసుఁ జేసి గన్న దా
వించితి వాగతాశ్రితులు వేడ్కపడన్ బహుమానపంబు దా
వించితి వాచరించితివి విస్తృతనైకవిధాన్నదానముల్ ౮౯౧

—♦ శ్రీకృష్ణుండు తృప్తుండై యుగ్రసేనుని బ్రశంసించుట. ♦—

ఉ॥ అంతియకాని నాకేదియు నాస్మృతితో నెడలేదుగాదె భూ
కాంతశిరోమణిప్రకరకాంతివిరాజితపాదపద్మ! య
త్యంతము సంతసంబొదవె నద్దియె చాలును నంగ జేయు శ్రీ
కాంత! యనుగ్రహించి యెది గావలెనో? కొనుమయ్య! దానికిన్ ౮౯౨

ఉ॥ అంతయు నీవె నీకృపయె యశ్వసవం బొనరింపఁ జేసె నా
స్వాంతము శాంతిజెందెను ప్రపంచము దృప్తినిగాంచెఁ బుణ్యకృ
త్స్వాంతపనాశ్వమేధముఖ సర్వమఖంబుల కీవె నేతవై
సంతన జేయుచుంట నవసంభవపుణ్యము నీకొసంగెదన్ ౮౯౩

తే॥ అనుచు రాజసూయాశ్వమేధాధ్వరఫలములను శ్రీకృష్ణునకు ధారవోసె సురలు
పూలవానలు గురిసిరి భూనభముల నుగ్రసేనుఁ గీర్తించి రహాహా యటంచు

తే॥ అధ్వరమున కేతెంచిన యగ్రజన్మపవైశ్యశూద్రాదు లమరులు పర్వతవన
వనధినదనదు లాత్మీయ వాహనముల నెక్కి స్వస్థలంబులకు సంతృప్తిఁ జనిరి

—♦ శ్రీకృష్ణుఁడు మృతులైన కంసాదిసుతులను ఉగ్రసేనునకుఁ జూపుట. ♦—

ఉ॥ అమ్మెయిఁ గృష్ణునాజ్ఞఁ గమలాక్షుపురిన్ విడి కంసుఁడాదిగాఁ
దొమ్మిదిమంది సోదరులు దోడ్తనె యేతెఁజతోడఁ దత్సభా
సమ్ముఖమొందుటన్ గనుచు సర్వులు విభ్రమముజెందిరంత శం
ఖమ్ము గదాబ్జచక్రములు గ్రాల జనార్దనుబోలు వారలున్ ౮౯౪

ఉ॥ ముందుగఁ గృష్ణచంద్రునకు మ్రొక్కి యనంతరమందు సీరికిన్
వందనమాచరించి సుమబాణున కంగజసూతికిన్ నతుల్
దందడిగా నొనర్చి హరి దగ్గరగా వసియింప దేవకీ
నందనుఁ డట్టివారల కనన్ దొడగెన్ మునులార యీరహిన్ ౮౯౫

తే॥ అల సుధర్మను శక్రసింహాసనమున రుచిమతీసతితోడఁ గూర్చుండియున్న
యుగ్రసేనుఁడు మిముఁ బిల్చుచుండినప్పటికిని మీ రేల చనరు చెంతకు బిజాన

క॥ జననీ జనకుల మీరిటు గనకుండుట పాడిగాదు కావునఁ గంసా!
యనుజయుతంబుగఁ బొమ్మా! కనుమా! తదపేక్షదీర్చి క్రాలుట సరియౌ

—♦ కంసాదులు శ్రీకృష్ణుని బ్రశంసించి, తిరిగి వైకుంఠమున కేగుట. ♦—

చ॥ అవలను గంససోదరు లహో! జగదీశ్వర! నీదుమాయ నాఁ
గ వనధి మున్గి తిర్గుదుము కన్పడ వేమియు నంతుపొంతు లీ
యవధిని నిట్టి యమ్మలును నబ్బలు నెందఱొ యైరిపోయిరే!
యెవని కెవండు చుట్టమగు నేము గ్రహింపగలేము కొంచెమేన్ ౯౦౦

తే॥ జీవునకుఁ దండ్రి హరియని చెప్పె శ్రుతులు గాన మీదరిగలవారిఁ గనము మున్ను
సబలు నిన్గంటి మిప్పుడు స్మరుఁడు స్మరజుఁ డిచట గలరని వచ్చితి మేము వినుచు

చ॥ హరి, హలి, కార్ష్ణి, కార్ష్ణిసుతులందఱు నొక్కట జేరుచుండున
త్తఱిఁ బరిపూర్ణుఁ డంచు విబుధప్రకరంబు వచించు నిన్ బరే
శ్వరు గనుటల్ సుదుర్లభము ప్రాక్తనపుణ్యము చేత మాకుఁ జే
కురెనని యెంతొ మీపురమె గొప్పది ధన్యులు పౌరులెల్లరున్ ౯౦౨

క॥ కృష్ణా! కృష్ణాంబరధర! కృష్ణాత్మజ! కృష్ణపౌత్ర! కృష్ణారక్షా
తృష్ణా! రక్షితభారత కృష్ణా! యల్పులను మమ్ము నెలమిని గనరే! ౯౦౩

క॥ కొమ్మా! యీ మానవులను లెమ్మా! ద్వారకను వీడి లేఖస్తుత్యా!
మమ్మాదరించి దయతో రమ్మా! వైకుంఠమునకు రాధాకృష్ణా! ౯౦౪

చ॥ అని కొనియాడి కంసముఖు లచ్యుతలోకము జేరి రందఱున్
గనుచు విచిత్రమొంది రల గద్దియపై సతితోడనున్న యా
జనపతియున్ సుతాశవిడి సర్వజగంబు మనోమయం బటం
చనుకొని సందియంబుజన వ్యాసమునీశ్వరు నడ్గె నిట్టులన్ ౯౦౫

క॥ అయ్యా! వ్యాసమునీంద్రా! యియ్యెడ నిహలోకసుఖము లేవిధిజనునో
యయ్యది వివరించుచు నాకయ్యచ్యుతపాదసేవ యమరునొ చెపుమా! ౯౦౬

తే॥ వ్యాసుఁ డిట్లనె భూపతి కవనినాథ! రాధికాకృష్ణ సాహస్ర రమ్యనామ
వినుతులన్ జెప్పెదన్ వీని విధిమహేశ్వరులును మాదృశుల్ కొందఱెఱుంగగలరు

తే॥ అంతెకాని యందఱు దెలియంగలేరు రాధికాకృష్ణ సేవ నిరంతరంబు
సల్పుమా! సహస్రాహ్వాయ సన్నుతులును నిత్యపారాయణంబున నెసఁగవలయు

—♦ వ్యాసుండు ఉగ్రసేనునకు శ్రీకృష్ణసహస్రనామస్తోత్రంబు చెప్పుట. ♦—

వ॥ అని యుపదేశింప, నుగ్రసేనుండు విని, మునీంద్రా! మున్ను కురుక్షేత్ర
మండలి యొక దివ్యశిబిరంబులో సూర్యగ్రహణంబునం దేకాంతంబుగా నారదమహా

మునిచే నైహికాముష్మికసుఖప్రదంబు దుర్లభంబునగు రాధాసహస్రనామస్తోత్రంబు సక్రమంబుగా నాలించితి. ఇప్పుడీ యనన్యదుర్లభ శ్రీకృష్ణసహస్రనామస్తోత్రంబు వినవలతును. కరుణించి చెప్పవే యన వ్యాసముసీంద్రుఁడా శ్రీకృష్ణుని విలోకించి, మోక్షప్రదంబు ననన్యసామాన్యంబునైన యీ సహస్రనామస్తోత్రంబు హరిగురుభక్తితత్పరుండును, కామక్రోధాది విసర్జితుండును, శాంతుండు నగువానికిం దప్పఁ దక్కినవారికిది చెప్పందగినది గాదని యిద్దానికి నారాయణుండు మహర్షియు, భుజంగప్రయాతంబు ఛందంబును, శ్రీకృష్ణచంద్రుండు దేవతయును, వాసుదేవుండు బీజంబును, రాధ శక్తియును, మన్మథుండు కీలకంబును ననుసంధించి, పూర్ణబ్రహ్మ శ్రీకృష్ణచంద్రభక్తిజన్మఫలప్రాప్తికొఱకు జపము వాడిగించుటకు ముందు శిఖిమకుట యనుదానితో ధ్యానించి, "హరిర్దైవకీనందన" యను నామము మొదలు "స్థావరోజంగమోల్పం మహాచ్ఛ" యను నామము తుదిగాఁ గు నియమబద్ధుండై పఠింపఁదగు. శ్రీకృష్ణజన్మాష్టమీ ప్రభృతి పర్వకాలములం దిది జపించినవారలు సకలపాపవిముక్తులై గోలోకంబునకుఁ బోయి విష్ణుసదృశులై మహానందంబుతో నుందురు. ఈ సహస్రనామపుస్తకంబులను బూజించిన గృహములలో శ్రీ రాధాకృష్ణుండు నివసించుచుండు. మరియు సద్గుణంబులును, ధ్యానశసిద్ధులును, త్రిలోకలక్షణంబులును విరాజిల్లుచుండునని చెప్ప వినిన యుగ్రసేనుండు విని వ్యాసవరాననిని భక్తిప్రపత్తులతోఁ బూజించి శ్రీకృష్ణుని మనంబునందు సంస్మరించుచుండె. ౯౧౯

తే॥ అంత శ్రీకృష్ణుఁడచటఁ బ్రయాణమై మిథిలను బహుళాశ్వునకు శ్రుతదేవునకును
దర్శనంబిచ్చి క్రమ్మఱ ద్వారకాపురమ్మునకు నేగుదెంచె వార్ధమ్ముతోడ

తే॥ పంచపాండవుల్ ద్రౌపదీభార్యతోడ ద్వారకాపట్టణమునుండి బయలుదేరి
వనవనంబునఁదిరుగుచు వననివాసకాలమును ముగించిరిగాదె కాశ్యపేంద్ర!

ఆ॥ ఆవిధమున వార లజ్ఞాతవాసంబు నా విరాటుపురమునందె యుండి
గడపిరంతఁ గృష్ణుఁడడిగినన్ గౌరవు లడుగుపుడమిమీద నిడగలేరు. ౯౧౨

క॥ శౌరి యనంతరమందునఁ గౌరవులకుఁ బాండవుల కఖండస్థితిలోఁ
బోరగుట ధ్రువం బనుకొని యేరీతిఁ బట్టకుండె నే యాయుధమున్. ౯౧౩

క॥ బలరాముండును వెంటనె ఫలదాయకపుణ్యతీర్థపర్యటనంబుల్
సలుపఁగఁజని మధ్యను వల్వలసూతులఁబట్టి చంపె బహురోషముతో ౯౧౪

క॥ ఇల ధర్మక్షేత్రంబనఁ జెలఁగు కురుక్షేత్రమందుఁ జేరుచు వారల్
గలహము హోరాహోరిగ సలుపఁగఁ బాండవులకయ్యె జయము హరికృపన్

చ॥ పదపడి ధర్మరాజు నవవర్షములేలి యిలాతలంబుఁ గృ
ష్ణదయఁ ద్రివాజిమేధముల సల్పి పవిత్రతఁ జెందె నంత నొ
క్కదినమునందు ద్వారకను గాశ్యపిదేవులు శౌరి కోర్కెఁ ద
ద్యదుకులమున్ శపించిరి తదంబుజనేత్రుఁ డనంతరంబునన్. ౯౧౬

—♦ శ్రీకృష్ణ బలభద్రాదులు గోలోకాములకేగుట ♦—

తే॥ ఒక్క రావిచెట్టు దిగువనొప్పి యా ప్రపన్నుఁడగు నుద్ధవునకు శ్రీ భాగవతము బలికె మానుషదేహంబు వదలి సీరి యాత్మధామంబునకు నేగె హరియు నవల

చ॥ పిలువగ వచ్చినట్టి సురబృందముఁగాంచి యదృశ్యుఁడౌచు గో
కులమున కేగి నందముఖగోపకులన్ వ్రజమానినీతతిఁ
జెలుల, యశోద, రాధను ముదంబునఁ జీరుచుఁ గౌగిలించి యీ
లలిఁ బలుకాడె; ఘోరకలి లంపటబెట్టుచు వచ్చుఁ గావునన్. ౯౧౭

ఉ॥ నంద! యశోద! మీర లిఁక నందనదృష్టిని మానుచున్ మహా
నందదగోజగంబునకు నైకటికప్రియబంధుయుక్తులై
తొందరతోడ రండు కలి దుష్టులు మెండు భయంబు భక్తి స్త్రీ
బృందమునందు బూరుషుల వృత్తమునందు వసింపదించుకేన్. ౯౧౮

క॥ స్వేచ్ఛాచారనిరతులై యచ్ఛామ్నాయాదివిధుల నవహేళనదు
ష్టచ్ఛలయుక్తులఁ జేయుచుఁ దుచ్ఛులగుచునుండ్రు జనులు; ధూధూ యనఁగన్

వ॥ శ్రీకృష్ణుం డిట్లు చెప్పుచుండ గోలోకమునుండి యైదామడలయెత్తు పొడవులును, రెండువేల చక్రంబులను, రెండువేల గుఱ్ఱంబులును, గోటిసఖులును గలిగి వజ్రనిర్మలనిభంబును, క్షౌమవస్త్రాచ్ఛాదితంబును నగు నొక రథంబు సమీపమునకు వచ్చి వెలుంగుచుండె. ఇంతలో శ్రీకృష్ణదేహంబునుండి యొక వ్యక్తి చతుర్భుజుండును శంఖచక్రగదాధరుండును నై లక్ష్మితోడ నిర్గమించి దివ్యరథంబు నెక్కి క్షీరసముద్రమునందుఁ బ్రవేశించె. ఇట్లే మరియొకమూర్తి విష్ణురూపంబుతో లక్ష్మీసహితుండై బయలువెడలి గరుడునిపై నెక్కి వైకుంఠంబునకుఁ జనె. మరియు మరియొకమూర్తి నరనారాయణమహర్షిరూపంబుతో జనించి లోకకల్యాణంబుకొఱకు బదరికాశ్రమంబుఁ జేరె. అంత శ్రీకృష్ణుండు రాధాసహితుండై సకలబ్రహ్మాండాతీతంబును, శతశృంగవిరాజమానంబును, విరజానదీపరివృతంబును, నయనపర్వంబును నగు గోలోకంబునకు గోగోపికా గోపవ్రజసహితంబుగాఁ జేరె. రేవతీ దేవకీ ప్రభృతి సతీమణులందఱు స్వస్వపతిలోకంబులకుఁ జనిరి. అర్జునుండును నష్టగోత్రులగు నవ్వారలకందఱకుఁ బారలౌకికక్రియలొనర్చి గీతాజ్ఞానంబు నలవరించుకొని శాంతించి స్వపురంబునకుఁబోయి యన్నయగు ధర్మరాజునకు యావద్వృత్తాంతంబు నివేదించె. అంత ధర్ముండును స్వర్గంబునకేగె. రైవతునిచే శ్రీకృష్ణుని రమ్యహర్మ్యంబు విడువంబడి ద్వారకాపట్టణంబు సముద్రంబునందు ముంచఁబడియె. ఇప్పటికి నా యర్ణవంబందు శ్రీకృష్ణగేహంబు విరాజిలుచున్నదని యెఱుంగుము. కలి తొలిభాగమునందు విష్ణునియంశము ద్వారకాపురిలోని శ్రీకృష్ణవిగ్రహమందొప్పుచుండు. కృష్ణుండు- పిష్మటబాహ్మణుండు విద్యాధికుండుగాని, విద్యావిహీనుండుగాని యెట్టివాఁడైనను

సతండు నా దేహంబుగాఁ బరిగణింపుమని యుగ్రసేనునకుఁ జెప్పినట్లు గర్గుండు చెప్ప సంతసించి యా వజ్రనాభుండు తిరిగి యిట్లు పృచ్ఛించె. ౯-౨౧

—♦ వజ్రనాభుండు శ్రీకృష్ణుని శ్యామవర్ణమునకు గారణం బడుగుట. ♦—

క॥ ధరణీ సురవర! ప్రకృతికిఁ బరుఁడను భగవానుఁడైన పద్మాక్షున కే
కరణిని శ్యామశరీరం బరుదుగ సంభవించె నయ్యది చెపుమా! ౯-౨౨

తే॥ మాదృశులగువారలు కర్మమాత్రముగలవారగుట గృష్ణచరితంబు స్వల్పమేని
నెఱుఁగలేరికఁ ద్వాదృశ పరమమునులు దెలియఁగలరని నమ్మెదఁ బలుకుమయ్య

తే॥ అనఁగ సూతుండు నా శౌనకాదిమునుల కిట్లు చెప్పెను గర్గముని శ్వరుండు
వజ్రనాభున కిట్టులఁబలికె శౌరి శ్యామవర్ణధారణమునకైన కతము ౯-౨౪

తే॥ అయ్య! శృంగారరసరూప మసితమగుట నలరసమునకు దేవత యచ్యుతుండె
యగుట శ్యామవర్ణంబు శ్రీహరికివచ్చె కోటి మదనలావణ్యంబు కూడికొనగ

తే॥ ఘటము దవ్వునుండిచూచిన కాలవర్ణమగుట, నది జలమునుగాంచ నసితవర్ణ
మౌట, నంతరిక్షంబును శ్యామమగుట హరికి నుజ్జ్వలశ్యామంబు నమరెఁగాదె

తే॥ అంత వజ్రనాభుఁ డాలించి మునివర్య! సంశయములు దీరె సంతసంబు
గలిగెఁ గాని ముందు కలి ఘోరకీతిగా వచ్చునంద్రు దాని వార్త జెపుము!

—♦ గర్గుండు కలికాలస్థితి దెలుపుట. ♦—

చ॥ కలిఁ బదివేలయేండ్లు దనుకన్ జగతీపతి యొప్పునంత నం
దలి సగపాలు గంగదగుఁ దత్పరమందున దానిలో సగం
బెలయును గ్రామదేవతయు నీపయినుండెడి లోకులెల్లరున్
కలిదృఢమోహితాత్ములయి కల్మషదూషితులౌదురో విభూ! ౯-౨౮

క॥ దేవుఁడు గీవుఁడు లేడని కావరమునఁ బల్కుచుంద్రు కాంతాకనక
ప్రావీణ్యంబును జూపఁగ నేవర్ణాశ్రమసుధర్మ మీక్షింపరుగా ౯-౨౯

తే॥ అర్థకామములే పురుషార్థములని తలఁచి జాతినీతులుగాని తనది పెఱది
యనియుగాని ధర్మాధర్మఫణితిగాని కనక హింసించుచుంద్రనుకొనినయట్లు

తే॥ బ్రాహ్మణుల్ శాస్త్రహీనులు బాహుజనులు
రాజ్యహీనులు వైశ్యులు ద్రవ్యహీను
లంఘ్రిజులు విభుద్రోహులునగుచు నరక
మందుఁ గూలుచు హింసలఁ బొందుచుంద్రు ౯-౩౧

